# జవాహర్లాలు నెహ్రూ

## ఆత్మకథ

అనువాదకుడు:

ముదిగంటి జగ్గన్నశాస్త్రి.

ప్రకాశకులు:

పల్లెటూరు గ్రంథమండలి,

తెనాలి.

౧౯౩౭

రూ. 3-0-0

# తొలిపలుకు.



1925 లగాయతు 1931 వరకు 'పల్లెటూరు గ్రంథమండలి' పేరిట సుమారు 15 పుస్తకములనువ్రాసి ఆంధ్రభాషామతల్లిని సేవించితిని. కొన్ని రాజకీయ అవాంతరములచే తదాది నేటివరకునసమర్థుడనై భాషాసేవచేయజాలకపోతిని.

నేను నాకీయవకాశమునుకల్పించి తమ 'యాత్మకథను' తెనిగింప ననుజ్ఞయిచ్చిన పండితజవాహర్లాలునెహ్రూగారి కెంతయు కృతజ్ఞుడను. నాకీయనుజ్ఞకు శిఫారసుచేసిన డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య గారికిని పైమండలి నింతవరకును పోషించిన యాంధ్రలోకమునకును కృతజ్ఞుడను.

ఇందులో కొన్ని యచ్చుతప్పులును, ఇతర లోపములునుగలవు. ఆంధ్రపాఠకుల ప్రోత్సాహముచే వీనిని రెండవముద్రణములో సవరించు కొందును.

అనువాదకుడు :

—ముదిగంటి జగ్గన్నశాస్త్రి.

# అభిప్రాయములు.



శ్రీ జగన్నశాస్త్రిగారు ఆంధ్రులకు చిరకాల పరిచితులు. వారిపల్లెటూరి గ్రంథమాలవల్ల వారిపేరు ఎల్లరకును పరిచయమే. ఇప్పుడు జవాహర్లాలునెహ్రూగారి 'ఆత్మకథను' తెనిగించుటవలన మనల కృతజ్ఞతకు మరింత పాత్రులైనారు.

ఇంకవీరి శైలినిగూర్చి మనము చెప్పవలసిన దేమున్నది? ఆంగ్ల గ్రంథములను తెనిగించునపుడు- తెలుగు తర్జుమావలె నుండక, మూలమే తెలుగా అనిపించవలెను.

మనము అట్టి ప్రమాణమును బట్టిచూడ వీరిగ్రంథములలో నెవ్వియు వ్యతిరేక విమర్శనకు పాత్రము కాకపోవుటయే కాక, మన యొక్క పొగడ్త పొందవలసినవై యున్నవి.

బందరు,
24—4—37.

భోగరాజు పట్టాభి సీతారామయ్య.

# పీఠిక.

ఈపుస్తకము 1934 జూన్ మొదలు 1935 ఫిబ్రవరివరకు (పోస్టుస్క్రిప్టు, మరికొన్ని స్వల్పమార్పులుతప్ప) పూర్తిగజయిలులోనే వ్రాయబడెను. జయిలులోని దీర్ఘమేకాంతవాసములలో నొకనిశ్చితమయినపనిని కల్పించుకొనుటయు హిందూదేశములోని గతచరిత్రను (నాకుసంబంధించినంతవరకు) సింహావలోకనముచేయుటయు యీపుస్తకమునువ్రాయుటకు గలప్రధానోద్దేశ్యము. నేనీపనిని స్వీయముగనన్ను ప్రశ్నించుకొను భావముతోప్రారంభించి చివరవరకునట్లేపడపితిని. నేను దీనినిబుద్ధిపూర్వకముగ పాఠకులకొరకువ్రాయలేదు. అట్లుచేసినను నా దృష్టిలోనా దేశస్త్రీపురుషులు మాత్రమేయుండిరి. విదేశీయులకైనచో నేనుమరొకవిధముగ వ్రాసియుండెడివాడను. తేలికగవిడిచివేసిన కొన్ని భావములను వివరించుచు కొన్నిటిని క్లుప్తపరచుచు వ్రాసెడివాడను.

ఈపుస్తకము నాజీవితములోని విచారకలుషిత కాలములో వ్రాయబడెనని పాఠకుడు గుర్తించునుగాక! ఇందులో దాని చిహ్నములు కాన్పించుచునేయుండును. ఇది ప్రశాంతకాలములో వ్రాయబడినచో మరియొకవిధముగ నుండెడిది; ఎక్కువ నిరోధము చూపబడెడిది. అయినను నేను దీనినిట్లే యుంచుటకు నిశ్చయించితిని. నేను దీనిని వ్రాసినకాలములో నెట్లుభావించితినో యిది తెలుపును కనుక కొంతమందికి దీనియందు రుచియుండవచ్చును.

నావూనసికాభివృద్ధిని, తెలుపుటకే (నేను చేయగలిగినంతవరకు) [illegible] నవీన భారత దేశ చరిత్రను [illegible] ఇది

యట్టిచరిత్రవలె పయికి కాన్పించును. కనుక పాఠకుని పెడమార్గమున బెట్టి దీనికీయగూడని ప్రాముఖ్యతను యిచ్చునట్లు చేయవచ్చును. కనుక నిది కేవలము పాక్షికమైనదనియు, విధాయకముగ సహంకారపూరితమైన దనియు పాఠకుని హెచ్చరింపగోరుచున్నాను; అనేక ప్రధాన విషయములు నిర్లక్ష్యము చేయబడెను. విషయములను సృష్టించిన యనేక మంది ప్రధానపురుషులను యుదహరింపలేను. నిజమైన చరిత్రయే మైనచో నిది క్షమార్హ్యముగాదు; కాని స్వీయచరిత్రలో దీనిని మన్నింపవచ్చును. మన నవీనచరిత్రను చదువగోరువారు యితర పుస్తకములను చూచుకొనవలెను. అయినను యీ పుస్తకమును మరికొన్ని వ్యక్తుల చరిత్రలును మధ్యనున్న ఖాళీలను పూర్తిచేసి యధార్థములను గ్రహించుటకొక యుపస్కారముగ నుండవచ్చును.

అనేక సంవత్సరములు కలిసి పనిచేసినట్టియు, నా కమితగౌరవమును, ప్రేమయుగలట్టియు కొంతమంది సహచరులను, నేను నిర్మొగమాటముగ విమర్శించితిని. నేను వర్గములను, వ్యక్తులను (ఒక్కొక్కప్పుడతికఠినముగ గూడ) విమర్శించితిని. ఆవిమర్శవలన నాకు వారియెడల గల గౌరవమెంతమాత్రమును తగ్గలేదు. ప్రజావ్యవహారములలో పని చేయువారు పరస్పరముగను, వారు సేవించు ప్రజలయెడలను నిర్మొగమాటముగ నుండవలెనని నేను భావించితిని. బాహ్యమర్యాదయు, క్లిష్టమును, ఒక్కొక్కప్పుడు బాధను కలిగించునట్టియు సమస్యలను చర్చింపక విడిచివేయుట పరస్పర సమాధానమునకు తోడ్పడజాలదు. మనలనెదుర్కొనుసమస్యయట్లు పరిష్కరింపబడజాలదు. భేదములను, సమానాంగీకారములనుగ్రహించుటమీదనే యధార్థమైన సహకారమాధారపడవలెను. ఆవిధముగ యధార్థములను (కష్టమైనవేమైనను) యెదుర్కొనవలెను. అయినను నేనువ్రాసిన దానిలో నేవ్యక్తిపయినను ద్వేషముగాని, క్రౌర్యముగాని లేదనినేను విశ్వసింతును.

నేడు హిందూదేశములోనున్న సారాంశములను నేను బుద్ధిపూర్వకముగ చర్చింపమానివేసితిని. జయిలులో వానినిగురించి నేను పూర్తిగ తెలిసికొనుట కవకాశము లేకపోయెను. ఏమిచేయవలెను? అను విషయమునుగూడ నేనచ్చట నిశ్చయింపలేకపోతిని. నా విడుదలయైన తరువాతగూడ నీవిషయమునకు యేమిజేర్చుటయు ప్రయోజనకరము కాదని భావించితిని. అది నేనిదివరకు వ్రాసిన దానితో సరిపడునట్లు కాన్పించలేదు. కనుక 'నాఆత్మకథ' భూతచరిత్రయొక్క యసంపూర్ణమైన వ్యక్తిగతపటముగనేయుండును. ఇదివర్తమానముకు దరచేయునుగాని, దాని సంపర్కమును జాగ్రతగ విడిచిపెట్టును.

బేడెన్‌వీలరు,
జనవరి ౨-౧౯౩౬

జవాహర్లాలు నెహ్రూ.

I

# విషయసూచిక.

# చిత్రములు.











# జవాహర్లాలు నెహ్రూ

## ఆత్మకథ



మోతీలాల్ నెహ్రూ.

# జవాహర్లాలు నెహ్రూ.

## ౧
## కాశ్మీరావతరణము.

"తన కథను తాను వ్రాసికొనుట చక్కని విషయమే యైనను అంత సుగమముకాదు. తనను గురించి దూషణ చేసికొనినచో హృదయమును రాచిపెట్టును; స్తుతిచేసికొనిన పాఠకుల చెవులకు ములుకుల వలె నుండును."

—అబ్రహాము కౌలీ.

శ్రీమంతుల కడుపున (ముఖ్యముగా హిందూదేశమున) ఏపు మోహముగాపుట్టు యేకైక పుత్రుడు పదిపాళ్ళు చెడిపోవును; [illegible] యగును. పుట్టిన పదకొండేండ్లవరకు తా నొక్కడే బిడ్డయైయున్న దిక యాశయే యుండదు. నా యిద్దరు చెల్లెండ్రు నాకంటె చాల చిన్నలు. మాలో నొక్కొక్కరిమధ్య చాలసంవత్సరములు యెడముండుటచే బాల్యమున సవయస్కులు లేక నేనొంటరిగా పెరిగి గొంటరిగానే కాలము గడిపితిని. నన్ను మామూలుపాఠశాలలకు పంపక ప్రైవేటుగా ఉపాధ్యాయులచే చదువు చెప్పించుటచే, సహపాఠుల సావాసముకూడ నాకు కఱవయ్యెను. హిందూ కుటుంబములవలె మాయింట పెద్ద బంధువులు, అన్నదమ్ముల బిడ్డలు మొదలగువారనేకులుండి సందడిగనే యుండెను, వారందరును నాకంటె చాల పెద్దలగుటచే నాటపాటలలో నాకు చాలని వాడనని వారు నన్ను విడిచివేసెడివారు. ఆ పెద్దయింట నేనొక్కడనే నాయాటపాటలలో నుండెడివాడను.

మేము మొదట కాశ్మీర నివాసులము. ఔరంగజేబు తరువాత మొగలు సామ్రాజ్య మంతరించు కాలమున, [illegible]

క్రిందట, మా పూర్వులు ధన, యశస్సుల నార్జించుట కా పర్వత లోయలనుండి సస్యసమృద్ధమైన మైదానములకు దిగి వచ్చిరి. అప్పుడు ఫరక్ షైర్ చక్రవర్తి. మా పూర్వీకుడు రాజకౌలు, కాశ్మీరదేశమున పారశ్యను, సంస్కృత భాషలలో గొప్ప పండితుడగుటచే, చక్రవర్తి యతని పాండిత్యమునకు మెచ్చి, 1716 ప్రాంతమున నతనిని తన రాజధానియైన ఢిల్లీకి రావించి యొక జాగీరును నొక కాలవయొడ్డున నొక భవనమును సమర్పించెను. ఈ భవనమును బట్టి నెహ్రూ (నహార్ కాలవ) పదము అతని పేరుకు చేర్చిరి. కౌలు మాకుటుంబ నామము. ఇది కౌలు నెహ్రూక్రింద మారెను. తరువాత కౌలు పదము నశించిపోయి మేము నెహ్రూలమైతిమి. తరువాత సంభవించిన దుర్దినము లలో నీకుటుంబ మనేక కష్టములకు పాలై, చివర కాజాగీరును కోల్పోయెను. మా ముత్తాత లక్ష్మీనారాయణ నెహ్రూ ఢిల్లీ చక్రవర్తి నామ మాత్రావశిష్టమైన న్యాయస్థానములో 'సర్కారు కంపెనీ' మొదటి వకీలుగా నుండెను. మాతాత గంగాధర నెహ్రూ 1857 నాటి తిరుగుబాటుకు పూర్వము కొంతకాలము ఢిల్లీ కొత్వాలుగానుండి 1861 లో, ముప్పది నాల్గవ యేట చనిపోయెను.

1857 నాటి తిరుగు బాటుచే, ఢిల్లీతో మాకుటుంబ సంబంధ మంతయు తెగిపోయెను. అపుడు మాకుటుంబమునకు చెందిన పత్రములు, దస్తావేజులు నశించిపోయి యున్నదంతయు పోవుటచే మాకుటుంబము ఢిల్లీవీడి ఆగ్రాచేరెను. అప్పటికి మా తండ్రి పుట్టలేదు; కాని మాపెత్తండ్రులిరువురును పెద్దలై కొంత యింగ్లీషు భాషను నేర్చుకొనిరి. ఈ భాషా పరిచయమే మారెండవ పెత్తండ్రిని, మాకుటుంబములోని మరికొంతమందిని యొక ఆకస్మిక దుర్మరణమునుండి రక్షించెను. అతనితో మామేనత్త (యొక చక్కని యుండకత్తె) యు, మరికొందరును ఢిల్లీనుండి పోవుచుండిరి. దారిలో వారిని కొంద రాంగ్లయోధులు

తారసించి మామేనత్త యొకఆంగ్లయువతియని, మాపెత్తండ్రి యామె నెత్తుకొని పోవుచున్నాడని యనుమానపడి నిందింప నారంభించిరి. ఆరోజులలో నిందలు; నిందలనుండి విచారణ లేకుండ న్యాయము చెప్పుట; శిక్షించుట; నిమిషములమీద పని; మాపెత్తండ్రికిని తదితర కుటుంబ మంతకును సమీపముననున్న యేచెట్టునుండియో వ్రేలుదుర్గతి పట్టియుండెడిది. కాని మా పెత్తండ్రియొక్క యింగ్లీషు భాషా జ్ఞానము కొంత కాలయాపనకు తావిచ్చుటచే నతని పరిచయస్తు డొకడచటకు వచ్చి వారినందరిని రక్షించెను. ఆకుటుంబము కొన్ని యేండ్లు ఆగ్రాలో నివసించెను. 1861 సంవత్సరము మే, ఆరవతేదీని (మాతాతపోయిన మూడు నెలలకు) ఆగ్రాలోనే, మాతండ్రి జన్మించెను. సరిగా ఆసంవత్సరమే, ఆనెలలోనే, ఆదినముందే కవిచంద్రుడు రవీంద్రనాథటాగూరు జన్మించెను. కుటుంబభారమంతయు మాతండ్రి కంటె చాలపెద్దలైన మాయిద్దరు పెత్తండ్రులపైనను బడెను. మాపెద పెత్తండ్రి బ్రిటిషు ప్రభుత్వన్యాయశాఖలోజేరి, యనేకప్రదేశములలో నుద్యోగముచేయుచు కొంతవరకు కుటుంబమునకు దూరమైపోయెను. రెండవవాయన రాజపుత్రస్థానములో ఖేత్రి సంస్థానములో పదిసంవత్సరములు దివానుగా పనిచేసినతరువాత న్యాయపరీక్షలో నుత్తీర్ణుడై ఆగ్రాలో న్యాయవాదిగా పనిచేసెను.

మాతండ్రి యీాయన యొద్దపెరిగి పెద్దవాడయ్యెను. వారిద్దరి వాత్సల్యము చిత్రమై, పితృ, భ్రాతృవాత్సల్య మిళితమై యుండెను. మాతండ్రి కడసారివాడగుటచే మాముత్తవతల్లికి గారాబుబిడ్డడయ్యెను. మాపెత్తండ్రి క్రొత్తగాస్థాపింపబడిన హైకోర్టులో ప్లీడరు. హైకోర్టు ఆగ్రానుండి అలహాబాదుకు మారుటచే మాకుటుంబమును అలహాబాదుకు మారెను. నాటినుండి అలహాబాదు మా నివాసమయ్యెను. చాలసంవత్సరముల పిదప నేనచ్చటనేపుట్టితిని. మాపెత్తండ్రి క్రమముగా

పెద్ద ప్రాక్టీసు సంపాదించి హైకోర్టు ప్లీడరులలో నొక నాయకు డయ్యెను. ఇంతలో మాతండ్రి కాన్పూరు, అలహాబాదులలో నున్నత పాఠశాల, కళాశాలలలో క్రమముగా నుత్తీర్ణుడగుచుండెను. అతడు బాల్యమున కేవలము పరిష్యను అరబ్బీభాషలనే నేర్చి, వయసువచ్చిన తరువాతనే ఆంగ్లము నభ్యసించెను. ఆవయసున పరిష్యను భాషలో మంచి పాండిత్యమును గడించుటచే నతనికంటె చాలపెద్దలుకూడ నతనిని గౌరవించెడివారు. ఈపాండిత్యమటుండ నతడు పాఠశాల, కళాశాలలలో నల్లరిచిల్లరి పనులలో నారితేరి, చదువుమీఁదకంటె నాటపాటలలోనే యెక్కువ ధ్యాస ముంచుటచే, కళాశాలలోని పోకిరీ నాయకులలో నొకడుగా చూడబడుచుండెడివాడు. పాశ్చాత్యదుస్తులు, పాశ్చాత్యపోకడలు అతని నాకర్షించెను. అతడు కొంత మోటుప్రవర్తనమును చూపినను, ఆంగ్లపండితు లతనిని ప్రేమించి, చెడుపద్ధతులనుండి తప్పించెడివారు. అతనియుత్సాహమును వారు మెచ్చికొనెడివారు. తెలివితేటలకు లోటులేదు! అప్పుడప్పుడు యెగురుచుండినను, తరగతిలో కూడ బాగుగనే యుండెడివాడు.

అతడు విశ్వవిద్యాలయ పరీక్షలలో క్రమముగ (సామాన్యుడుగనే) నుత్తీర్ణుడగుచు బి. యె. పరీక్షకు వెళ్లెను. అతడు దానికై గట్టికృషి చేయలేదు సరికదా మొదటి పరీక్ష పత్రమును పాడుచేసెనని తలంచి తక్కిన పరీక్షలకు వెళ్లకుండుటకై నిశ్చయించి, తాజమహాలులో (పరీక్షలు అపుడు ఆగ్రాలో జరుగుచుండెడివి) కాలక్షేపముచేయుచుండగా, కాలేజీపండితు డతనిని పట్టుకొని మొదటి పరీక్షపత్రమును బాగుగనే వ్రాసెనని హెచ్చరించి, తక్కిన పరీక్షలకు హాజరు కాకపోవుట మూర్ఖత్వమని, చివాట్లువేసెను. ఇంతటితో నతని చదువు పూర్తియయ్యెను. అతడు పట్టభద్రబిరుదాంకితుడు కాలేదు. అతడు మంచివృత్తిలో స్థిరపడి జీవితమును గౌరవ ప్రపత్తులతో గడుప

నుంకించుచు, శక్తి సామర్థ్యములను చూపుటకును, సమర్థులకు ఫలప్రద
మును నగునది (హిందూదేశమున నప్పటిలో) ప్లీడరీవృత్తి యొక్కటియే
యని నిశ్చయించెను. అంతేకాక తనయన్నగారి సాదృశ్యముకూడ
నతనికి గాన్పించుచునే యుండెను. అతడు హైకోర్టు వకీలు పరీక్షకు
వెళ్ళి ప్రప్రథముడుగా నుత్తీర్ణుడై బంగరు పతకమునుగూడ బడసెను.
అతనికి హృద్యమైన వృత్తి లభించెను.

అతడు కాన్పూరు జిల్లాకోర్టులో ప్రాక్టీసు ప్రారంభించి జయము
గాంచవలెనని యతిశ్రద్ధతో పనిచేసి త్వరలోనే పైకివచ్చెను. ఆటపాట
లలోను, యితర వినోదములలోను నతనికిగల సరదా కొంతకాలమును
మ్రింగివేసెను. కుస్తీయనిన నతడు చెవికోసికొనెడివాడు. ఆరోజులలో
కాన్పూరు కుస్తీ పందెములకు ప్రసిద్ధి.

కాన్పూరులో మూడుసంవత్సరములు పనినేర్చుకొనిన పిమ్మట
తండ్రిగారు అలహాబాదు హైకోర్టులో చేరిరి. చేరిన కొద్దికాలము
లోనే ఆయన సోదరుడు నందలాల్ నెహ్రూ హఠాత్తుగ చనిపోయెను.
ఇది మాతండ్రికి తీరని కష్టమాయెను. అతడు ప్రియుడగు సోద
రుడే గాక తండ్రివలె కూడ నుండెను. కుటుంబ ప్రధానపోషకుడు చని
పోవుటచే నా పెద్ద కుటుంబ భారమంతయు మా తండ్రిమీదనే పడెను.
అతడు తనవృత్తిలో నిమగ్నుడయి కొన్ని మాసములన్ని యితరపనులను
కట్టిపెట్టెను. మా పెత్తండ్రిగారియొద్ద నుండెడి కేసులన్నియు మాతండ్రికే
వచ్చి పడుచుండెను. ఆయన కష్టించి పనిచేయుట వలన, నవన్నియు
నెగ్గుచుండుటచే నితర కేసులు, విపరీతధనము రాసాగెను. అతడు
చిన్నవయస్సులోనే గొప్పవకీలు అయ్యెను. కాని యిదంతయు నూరక
చేకూరలేదు. అతడు న్యాయదేవతకు దాసుడయ్యెను. స్వంతపనులను
గాని, ప్రజాసేవనుగాని చక్కబెట్టుట కతనికి తీరికయే లేకుండెను.
శలవులు, కాళీదినములు కూడ దానికే చాలకుండెను. కాంగ్రెసు

ఇంగ్లీషు చదువుకొనిన మధ్యతరగతుల వారి నప్పుడప్పుడే యాకర్షింప నారంభించెను. అతడు కూడ కొన్ని కాంగ్రెసులకు వెళ్ళి నామ మాత్రపు సమ్మతుల నొసంగెను. చేతినిండ పనియుండుటచే నత డప్పటిలో కాంగ్రెసుపట్ల శ్రద్ధవహించలేదు. ఇంతేకాక రాచకీయముల లోను, ప్రజాసేవలోను నతడేమిచేయవలెనో తెలియకుండెను. అతడు దానిని గురించి యోచింపనులేదు. ఏయుద్యమములోగాని, యేసంస్థలో గాని ఏమూలనో యుండి తలయూచు టతని చేతగాదు. అతని బాల్యంపు టుత్సాహశక్తి తరిగినట్లు కాన్పించినను నది యతని వృత్తిలో బ్రవేశించి యతనికి జయమును చేకూర్చి, యాత్మవిశ్వాస మును, యభిమానమును పెంపొందించెను. పోరాట మనిన యతనికి సరదా! ఐనను నతడు రాజకీయ రంగములోనికి దుముకలేదు. నిజమున కప్పటి జాతీయ కాంగ్రెసులో పోరాట మేమియును లేనేలేదు. మొత్త ముమీద నతని కది యపరిచిత విషయము; అతని మనస్సు తన వృత్తి మీదనే యుండెను. ఇతరుల ప్రసాదముచేగాక, నితరుల సాయ మెంత మాత్రమును లేక తన మనోబల, బుద్ధిబలములచేతనే యతడు జయ లక్ష్మిని చేపట్టెను.

నిజమున కతడు యాథార్థ్యములేని జాతీయవాది; కాని యతడు యింగ్లీషువారిని, వారి పద్ధతులను మెచ్చుకొనుచుండెను. తన దేశస్థులు చాల పతితులైరనియు, వారి దుస్థితికి వారర్హులేయనియు నతడు భావిం చెడివాడు. ఏమియు పనిచేయకుండ శుష్కవాచాలత్వముతో ప్రొద్దు బుచ్చు రాజకీయవేత్తలపట్ల (వారికచేయగలిగినదేమున్నదో తానెంత మాత్రము సూచింప లేకపోయినను) నతని మనస్సులో కొంత తిరస్కార భావముండెను. రాజకీయములలో పనిచేసెడివారిలో చాలమంది (అందరును కాదు) జీవితములో వ్యర్థులనెడి భావము (తనకు చేకూరిన జయముచే కలిగిన యహంకార జనితము) కూడ అతని కుండెడిది.

మా యాదాయము హెచ్చిన కొలది మాఖర్చులుకూడ నిరంతరము హెచ్చుచుండెను. తనకెప్పుడెంత ధనము కావలె ననిన నంత ధనమును సంపాదించగల శక్తియున్నపుడు మాటగట్టుట మాతండ్రి శక్తిసామర్థ్యములకొక మచ్చగా దోచెను. మంచి రసికుడును, భోగలాలసుడును అగు మాతండ్రి సంపాదించిన దంతయు హాయిగా ఖర్చుపెట్టుచుండెను. క్రమముగా మాపద్ధతులు పాశ్చాత్యము లైపోయెను.

నా శైశవము నాటి మాయింటి కథ యిట్లుండెను. నేను అలహాబాదులో 1889 నవంబరు పదునాల్గవ తేదీని జన్మించితిని.

---

## ౨

## శైశవము.



నా శైశవ మీవిధముగా పెద్దలచాటున విశేషాంశము లేవియు లేకయుండెను. నేను మా పెత్తండ్రి బిడ్డల సంభాషణలను వినుచుండెడి వాఁడను. కాని యవన్నియు నాకర్థమయ్యెడివికావు. తఱచుగా నీసంభాషణ భారతీయులపట్ల నాంగ్లేయులును, యురేషియనులును చేయు అవమానములకును, ఘాతుకకృత్యములకును సంబంధించి యుండెడిది. వీనిని సహింపక నెదిరించుట ప్రతి భారతీయుని ధర్మమని వారు చెప్పుకొనెడివారు. పాలక పాలితుల మధ్య గలిగెడి ముష్టామష్టి సోదాహరణముగ చర్చింపబడుచుండెడిది. ఆంగ్లేయుఁడొక భారతీయుని చంపినను వానిని తెల్లదొరలే విచారించి విడిచివేసెడివారు. రైలుబండ్లలో తెల్లవారికి ప్రత్యేకముగ పెట్టెలుండెడివి. బండి యెంత క్రిక్కిరిసి యున్నను, యీపెట్టెలలో నేభారతీయుని యెక్కనివ్వరు. ప్రత్యేకింపబడని పెట్టెలలోకూడ, నేయింగ్లీషువాఁడో సాచుకొని కూర్చొని యే భారతీయుని లోపలకు రానీయఁడు. బహిరంగమైన పార్కులలో బల్లలు కుర్చీలు తెల్లవారికి ప్రత్యేకింపఁబడియుండును. నా దేశమును పాలించు పరిపాలకుల యీ దుశ్చేష్టితములకు నాకెంతయో కోపము కలిగెడిది. భారతీయ దేశభక్తు లీ దురంతముల నెదుర్కొనిన నాఁడు నేను సంతోషముతో గంతులిడెడివాఁడను. తఱచుగా మా కుటుంబములోని వారో లేక మా స్నేహితులో యిట్టిపోరాటములను కల్పించుకొనెడి వారు. అప్పుడు మేమందరము చొక్కాలు పైకి తీసెడివారము. మా పెత్తండ్రి కుమారుఁ డొకఁడు మంచి బలిష్ఠుఁడు. అతఁడు తఱచు యే యింగ్లీషువానితోనో ఢీకొనెడివాఁడు. యురేషియనులు తాముకూడ పాలకజాతి వారమే యనిపించుకొనవలెనని యింగ్లీషు యుద్యోగి

కంటెను,నర్తకుని కంటెను కూడ మరింత యమర్యాదగా సంచరించుటచే మా పెత్తండ్రి కుమారుడు వారి మీదకు మరింత జోరుగా వెళ్లెడి వాడు. రైలుప్రయాణములలోనే యీ పోరాటములు తఱచు జరుగు చుండెడివి.

పరప్రభుత్వము, వారి ప్రవర్తనము నాకెంత యేవగింపుగా నుండినను, నేనెప్పుడును యే ఆంగ్లవ్యక్తిపైనను ద్వేషము చూపయెరుగను. ఆంగ్లయుపాధ్యాయిను లెందరో నాకు బోధకురాండ్రుగ నుండిరి. మాతండ్రిగారి యాంగ్లస్నేహితులెందరో మాయింటికి వచ్చెడివారు. నేను వారిని నాహృదయములో మెచ్చుకొనెడివాడను.

సాయంకాలము తండ్రిగారి స్నేహితు లెందరో అతనిని చూడ వచ్చెడివారు. అతడు పగటి కష్టమంతయు తీరునట్లు వారిందరితోను పెద్ద నవ్వు నవ్వెడివాడు. చివర కతని నవ్వు అలహాబాదులో పేరు వడసెను. ఈ పెద్దలందరు యేమి మాట్లాడు కొనుచుందురో, విన వలెనని నేనొక్కొక్కప్పుడు తెరచాటున నుండి వినెడివాడను. అప్పుడు నేను దొరికితినా నన్ను పట్టుకొని, భయపెట్టి కొంతసేపు తండ్రిగారి తొడ మీద కూర్చుండబెట్టెడి వారు. తండ్రిగారు యెర్రటి మద్యమును త్రాగుచుండ నేనొకనాడు చూచితిని. విస్కీ నేనెరుగుదును. అతని స్నేహితులును, అతడును దానిని త్రాగుచుండ నేననేకసార్లు చూచితిని. కాని యీ యెర్రటి క్రొత్తవస్తువేదియో నాకు భయంకరముగా కాన్పించెను. తండ్రిగారు రక్తమును త్రాగుచున్నారని చెప్పుటకు నేను మా తల్లియొద్దకు పరుగిడితిని.

తండ్రిగారియెడల నాకపరిమిత గౌరవము. నేను చూచిన వారందరికంటె నతనిలో ధైర్యసాహసములు, శక్తిసంపదలు, బుద్ధివిశేషములు మూర్తీభవించినట్లు నాకు గోచరించెను. నేను పెద్దవాడనైన తరువాత నతనివలె నుండ వలెనని యువ్విళ్ళూరు చుంటిని. నేనతనినెంత

గౌరవించి, ప్రేమించెడి వాడనో యతడనిన యంత భయపడెడివాడను. అతడు నౌకర్లమీదను, యితరులమీదను మండిపడునపుడు నేను వణకుచుండెడివాడను. అతని ముక్కోపితనమునకు నాకింతవరకును సాటి కాన్పించలేదు. కాని యదృష్టవశమున, నతనిలో కొంత హాస్యరసము, అపరిమితమైన నిరోధశక్తి యుండుటచే పెద్దయైనకొలది యతడు కోపమును తగ్గించుకొనగలిగెను. నా బాల్యములో నే నొకసారి యతనికోపమునకు గురియైతిని. ఒకరోజున నతనిగదిలో రెండు ఊట కలములనుచూచి యతని కారెండును అవసరముండవని తలంచి నేనొక దానిని తీసికొంటిని. మాతండ్రి దానికొరకు కెంతయో వెతికించెను. నేను నిజమును చెప్పనైతిని. చివరకు కలము దొరకుటచే నానేరము బయట పడెను. మాతండ్రి నన్ను చావగొట్టెను. నేను శరీరబాధచేతను, అవమానముచే పొర్లిపొర్లివచ్చు దుఃఖముచేతను మాతల్లియొద్దకు పరుగిడితిని. తరువాత చాలరోజులవరకు నాశరీరమున కనేక తైలములు, మందులు వ్రాయబడెను.

ఈశిక్షకు నాకాయనపయి నెట్టిద్వేషమును కలుగలేదు. కొంచెము మోతాదు హెచ్చయినను అది యుక్తమైన శిక్షయేయని నేను భావించితిని. అతనియెడల నాకు గౌరవప్రేమ లెప్పటివలెనే యున్నను భయము మాత్రము నిలిచి పోయెను. మాతల్లియెడల నాకట్టిభయము లేదు. నేనేమి చేసినను సరే యామె కప్పిపెట్టును. ఆమె నన్ను మెక్కువగా ప్రేమించుటచే నేనామెపై కొంచె మధికారమును చలా యించెడి వాడను. తండ్రికంటె నామె నాకెక్కువ చేరిక యగుటచే నే నామెతో నన్నియు చెప్పికొనెడివాడను. ఆమె పొట్టిగా నుండుటచే నేను త్వరలోనే యామెయంతటి పొడగరినైతిని. ఆమె యందము మెచ్చదగి యుండెను. అతి చిన్నిపాదములు, కోమలములైన హస్తములు ఆమె యందమును పెంచుచుండెను. కాశ్మీరము నుండి యామె

పూర్వులు రెండు తరముల క్రిందనే దిగివచ్చుటచే మాకంటె యర్వా చీనులు. మా తండ్రిగారి మున్షీ, ముబారక్ ఆలీ, నా విశ్వాసమును చూఱగొనెను. అతడు బదానులోని యొక గొప్ప కుటుంబమునకు జెందినవాడు. 1857 నాటి పితూరీలో యతని వంశము యింగ్లీషు శిపాయిలచే నాశము గావింపబడెను. ఈ కష్టముల వలన నతడందరియెడలను, ముఖ్యముగా పిల్లలయెడల మృదుమధుర భావములను కలిగి యుండుటచే నా కేదేని కష్టము వాటిల్లిన నేతనియొద్దకు వెళ్ళెడివాడను. అతడు పురాణగాథలను, 'అరేబియనురాత్రుల' లోని కథలను, 1857-58 లలో జరిగిన వింతచర్యలను అసంఖ్యాకముగా చెప్పుచుండ నేను నిశ్చేష్టుడనై గంటలకొలది వినుచుండెడివాడను. నేను పెద్దవాడనైన చాలకాలమునకు "మున్షీజీ" చనిపోయెను. అతడు నా కిప్పటికిని జ్ఞప్తియందుండును.

నా తల్లియు, పెత్తల్లియు హిందూపురాణములనుండి చెప్పుచుండెడి రామాయణ భారతగాథలనుగూడ నేను వినుచుండెడివాడను. మా పెత్తల్లి, నందలాల్ భార్య పురాణ భారత గ్రంథములను బాగుగా చదివెను. ఆమె కథలకు తఱుగులేదు. కనుక భారతపురాణములలోను, గాథలలోను నాకు మంచి పరిచయము కలిగెను.

మతమన, నాకు సరియైన భావములు లేకుండెను. అది ఆడంగుల వ్యవహారముగా కాన్పించెను. మా తండ్రి పెత్తండ్రులు దానిని వేళాకోళముగా చూచి, దానియందు శ్రద్ధలేకయుండిరి. ఇంటనున్న స్త్రీలనేక పూజలు, వ్రతములు చేయుచుండెడివారు. తక్కినవారివలె చూచీ చూడనట్లూఱకొనవలెనని యనుకొనినను నేను వాటిని కొంత యానందించెడివాడను. మాతల్లియో, పెత్తల్లియో, గంగాస్నానమునకు పోయినప్పుడొక్కొక్కప్పుడు నేనుకూడ వెళ్ళుచుండెడివాడను. ఒక్కొక్కపుడు అలహాబాదులోనో, కాశీలోనో దేవాలయములకు బోవు

చుండెడివారము; లేదా చాల పవిత్రుడని పేరు వడసిన యే సన్యాసి నైనను చూడబోయెడివారము. కాని యిదేదియు నాభావమును మార్పజాలదయ్యెను. ఇక ననేక గొప్ప పర్వదినములుండెడివి. హోలీ పండుగ పట్టణమంతయు కోలాహలము. ఒకరిపయి నొకరు రంగునీరును చల్లుకొందురు: దీపావళి; దీపముల పండుగ వేలకొలది మట్టిప్రమిదెలలో చమురుపోసి ప్రతియింటిముందర జ్యోతులను వెలిగింతురు; జన్మాష్టమి; అర్ధరాత్రివేళ ఖయిదులో పుట్టిన కృష్ణుని జననోత్సవమును సల్పెదరు. దసరా; రామలీలలు, రామచంద్రుని కథలోను లంకావిజయములోను కొన్నిరంగములను ప్రదర్శించుచు జరుపు యుత్సవము; జనులు గుంపులు గుంపులుగా దీనిని చూడవత్తురు. పిల్లలందరును మొహరం పండుగను (హసన్‌హుసేనుల విషాదచరిత్రను సలుపు యుత్సవమును) చూడవెళ్లెడివారు. రెండుయీదు (పండుగల) రోజులలోను మున్షీజీ మంచి దుస్తులను ధరించి పెద్దమసీదుకు దైవప్రార్థనలకు వెళ్లెడివాడు. నే నతనియింటికిబోయి సేమ్యాపాయసము, యితర మధుర పదార్థములు తినెడివాడను. రక్షాబంధనము మొదలగు చిన్నపండుగ లింక నెన్నియో కలవు.

కాశ్మీర దేశస్థులమగు మాకు, యితర హిందువులు చాల మంది చేయని, ప్రత్యేకపండుగలు కలవు. ఇందులో 'నౌరోజు' (మాపంచాంగము ప్రకారము సంవత్సరాది) పండుగ ముఖ్యము. ఆనాడు మేమందరమును క్రొత్తదుస్తులను కట్టుకొనెదము. మిఠాయిలు కొనుక్కొనుటకు పిల్లలకు డబ్బులిచ్చెదరు.

కాని వీ టన్నిటికంటెను నేను నా పుట్టినరోజున జరిగెడి యుత్సవము నెక్కుడుగా చూచుకొనెడివాడను. ఆనాడు ప్రాతఃకాలముననే నన్ను పెద్దత్రాసులో కూర్చుండబెట్టి, గోధుమలు మొదలగు ధాన్యాదులతో తులతూచి, బీదలకు పంచిపెట్టెడివారు. నేనప్పుడు క్రొత్త

దుస్తులను ధరించెడివాడను. నాకందరును బహుమానముల నిచ్చెడి వారు. మధ్యాహ్నము గొప్ప విందు జరిగెడిది. దీనికంతకును నేనే కథానాయకుడనని నాకుండెడిది. నాపుట్టిన దినమంత యరుదుగా రానేల యని నేను చింతించి యెక్కువ జన్మదినము లుండ వలెనను యాందోళనను లేవదీయవలెనని నేను ప్రయత్నించి తిని. ముదిమివచ్చి మీదపడుచున్నదని జ్ఞప్తికి తెచ్చు జన్మ దినములు వచ్చునని నేనప్పుడెఱుగనైతిని. మాబంధువుల యింటనో స్నేహితులయింటనో పెండ్లివచ్చునపుడు మాకుటుంబ మంతయు దూరప్రయాణము చేసెడిది. అవి మాకు, పిల్లలకు, మంచిసరదా దినములు. పెండ్లిదినములలో నిర్బంధములన్నియు సడలుచుండుటచే మేము మాయిష్టము వచ్చినట్లు రాజ్యము చేసెడివారము. పెండ్లి వారి విడిదెలో ననేక కుటుంబములుచేరి పిల్లల పటాలము కావలిసినంతయుండుటచే నా కప్పుడొంటరితన ముండెడిదికాదు. మేము మాయిష్టమువచ్చినట్లల్లరి చేయుచుండ మధ్యమధ్య పెద్దలు చివాట్లు పెట్టెడివారు. హిందూవివాహ ములు బీదసాదలందరి యిండ్లలోను, చాలవ్యయకరములని, దూబరా తోగూడిన యాడంబరములని పూర్తిగా గ్రహింపఁబడెను. ఇవెంతయు సత్యము. దూబరామాట యటుండ కళాహీనమైన నిరర్థక తంతు (కొన్ని మినహాయింపులు లేకపోలేదు.) చూచుటకు చాలబాధకరము గనే యుండును. దీనికంతకును మధ్యతరగతులవారే దోషులు. బీదలు కూడ (యెక్కువ ఋణములు చేసి) చాలఖర్చు చేసెదరు. కాని వారి దారిద్ర్యముకు వారి సాంఘికాచారములే కారణమనుట (కొందరిట్లే శలవిచ్చుచుందురు.) కంటెహాస్యాస్పదము వేరొకటి యుండబోదు. బీదల బ్రతుకు సంతోషమనునది లేక చాలనిస్సారముగను, భార భూయిష్టముగను నుండుననుసంగతి మనముతఱచు మఱచిపోదుము. కొద్దిపాటి సంగీతమును, విందులను ప్రసాదించు వివాహపుటుత్సవ ములు నిర్జీవమైన వారి జీవితయెడారులలో నచ్చటచ్చట నొకపచ్చిక

బయలువలె తోచుచు వారి నిరర్థక నిత్యజీవితమునకు కొంతవిశ్రాంతి నొసగును. నవ్వుకొనుట కెట్టి యవకాశములును లేని వారి జీవితముల కీపాటి కూడ నుండకూడదను క్రూరులెవరుందురు? వ్యర్థములైన ఖర్చులనరికట్టవలసినదే! దుబారాతగ్గవలసినదే! కానివారి జీవితము లలో సంతోషమునకు కొంతతావుండవలెను.

మధ్యతరగతులవార సంగతియు నింతే. వ్యర్థమైన ఖర్చులను, దుబారాను తీసివేసినచో చాలాకాలమున కొకసారి దూరబంధువు లును, ప్రాతస్నేహితులును కలుసుకొనుట కివిమంచితరుణములు. భారత దేశ మతివిశాలమైన దగుటచే ననేక మంది స్నేహితులొకేసారి యొకచోట సమావేశమగుట చాలకష్టము. కనుకనే మన పెండ్లిండ్ల కింతటి ప్రాముఖ్యత కలిగెను. కాన్ఫరెన్సులు, రాజకీయసభలు, కాంగ్రెసు మొదలైన విపుడు వీనిస్థానమును తీసికొనుటయేగాక చాల విధముల వీనిని మించినవి.

కాశ్మీర దేశస్థులలో (ఉత్తరాది వారిలోవలె) ఘోషాపద్ధతి లేదు. ఏకాశ్మీర దేశస్థుడైనను మరియొక కాశ్మీరుని యింటికి నిరా టంకముగ పోవచ్చును. పర్వములలోను యుత్సవములలోను స్త్రీపురు షులు కలసికొందురు. ఒకచోట కలసి కూర్చొనెదరు. కానిస్త్రీలు తఱచు ప్రత్యేకపంక్తిలో కూర్చొనెదరు. బాలబాలిక లింతకంటె సమానహోదాలో నుందురు. కాని యిప్పటి పాశ్చాత్యుల స్వేచ్ఛ వంటిదిమాత్రము వారికుండదు.

నాబాల్యమిట్లుగడిచెను. ఒక్కొక్కపుడు (పెద్దకుటుంబములలో తప్పవు.) కుటుంబకలహములు జరుగుచుండెడివి. ఇవిపెచ్చుపెరిగి మా తండ్రిచెవుల పడినపు డతనికి కోపము కలిగెడిది. ఆడవారి తెలివితక్కువ వలన నివి వచ్చుచుండునని యతడు భావించెడివాడు. నిజమేమి జరిగె డిదో నాకు తెలిసెడిదికాదు. ఎడముఖము, పెడముఖములను బట్టి

ఎక్కడనో దోషముండగలదని నేననుకొనెడివాడను. నాకు చాల విచారము కలిగెడిది. తండ్రిగారిందులో కలుగజేసికొనినా మేము వణకిపోయెడివారము.

నాకొక చిన్న సంగతి యింకను జ్ఞాపకమున్నది. నా కప్పుడు యేడెనిమిది సంవత్సరములు. నేను ప్రతి సాయంకాలము గుఱ్ఱపు స్వారీ చేసెడివాడను. ఒక సాయంకాలము నాగుఱ్ఱము నన్నుపడద్రోసి యింటికి పారిపోయెను. తండ్రిగారప్పుడు టెన్నిసువిందు చేయుచుండిరి. అందరును భయపడి బండ్లమీద సైకిళ్ళ మీద కాలినడకను గుంపులు గుంపులుగా బయలుదేరి నాకొఱకు వెతుక నారంభించిరి. నన్ను వారు త్రోవలో కలుసుకొనిరి. నేనొక వీరకార్యము చేసినట్లు వారు నన్ను గౌరవించిరి.

# ౩

## దివ్యజ్ఞానము.



నా పదియవ యేట మేము 'ఆనందభవనము' కు మారితిమి. ఈ భవనముకు చేరి పెద్దతోట, యీదుటకొక కొలనుకలవు. ఇందులో మరికొన్ని భవనములు కట్టబడెను. పనివాండ్రు త్రవ్వుట కట్టుట మొదలగు పనులు చేయునపుడు నేనువారిని ప్రేమతో నిరీక్షించి చూచుచుండెడి వాడను.

నేనాకొలనులో బాగుగా యీదుటను నేర్చుకొని దీర్ఘకాలపు మండువేసవి దినములలో సమయము దొరికినపుడెల్ల రోజునకనేకసార్లు దానిలోమునుగు చుండెడివాడను. సాయంకాలము నాతండ్రి స్నేహితులనేకమంది కొలనుకు వచ్చెడివారు. అప్పుడది యొక వింతగా నుండెను. ఆకొలనువద్దను మాయింటను నెలకొల్పబడిన విద్యుద్దీపము లారోజులలో అలహాబాదులో వింతగా నుండెను. స్నానముల వేళ నాకుమంచి హుషారుగా నుండెడిది. ఈతరానివానిని ముందుకు వెనుకకు గెంటి కొలనులోనికి త్రోయునట్లు భయపెట్టుట నాకొక సరదాగా నుండెడిది.

డాక్టరుసప్రూగారప్పుడు అలహాబాదులో చిన్నవకీలు. అతనికి ఈతరాదు, నేర్వవలెనను తలంపునులేదు. అతడు పదిహేను అంగుళముల లోతులో మొదటిమెట్టుమీద కూర్చుని ముందుకుదిగక యెవరైనను ముందుకు త్రోయ ప్రయత్నించుచో లబలబ లాడెడివాడు. మాతండ్రికిని యీతరాదు. కాని పళ్ళుబిగించి చేతులు తపతప కొట్టుకొనుచు కష్టముమీద నతడు గట్టుకు చేరెడివాడు. అప్పుడు బోయరు యుద్ధము జరుగుచుండెను. నాసానుభూతి బోయరులవైపున నుండెను. యుద్ధవిశేషములు తెలిసికొనుటకు నేను వార్తాపత్రికలు చదివెడివాడను.

అప్పుడే మాచెల్లెలు పుట్టెను. ప్రతివారికిని తమ్ముడో చెల్లెలో పుట్టుచుండ నాకాభాగ్యము కలుగక పోయెనని నేను రహస్యముగా విచారించుచుండెడి వాడను. చివరకు నాకట్టి భాగ్యము లభించనున్నదని పరమానందభరితుడనైతిని. తండ్రిగారప్పుడు యూరపులోనుండిరి.

తండ్రిగారు యూరపు వెళ్ళుటచే హిందూదేశములో నున్న కాశ్మీర బ్రాహ్మణులలో కలకలము బయలుదేరెను. తిరిగి వచ్చిన తరువాత ఆయన ప్రాయశ్చిత్తముచేసికొనలేదు. కొంతకాలము క్రిందట పండిత బిషన్ నారాయణధర్ (ఇతడు తరువాత కాంగ్రెసు అధ్యక్షుడయ్యెను.) వెళ్ళివచ్చి ప్రాయశ్చిత్తము చేసికొనినను కూడ పూర్వాచార బ్రాహ్మణబృంద మతనిని వెలివేసిరి. దీనివలన సంఘములో రెండు బలీయమైన చీలిక లేర్పడెను. తరువాత చాలమంది కాశ్మీర యువకులు చదువుకొరకు యూరపువెళ్ళి తిరిగివచ్చి (కొద్ది ప్రాయశ్చిత్తము చేయించుకొని) సంఘసంస్కారశాఖలో జేరుచుండిరి. ఆప్రాయశ్చిత్తము కేవలము బూటకము. అందులో మతమేమియులేదు.

అది సంఘతత్త్వముకు బాహ్యముగా తలయూచుట; అట్లు చేసి, ప్రతివాడును బ్రాహ్మణేతరులతోను, హిందువులు కానివారితోను కలసిమెలసి భోజన భాజనములు చేసెడివాడు. మాతండ్రిగారింకొక యడుగు ముందుకు వేసిరి. ఈబూటకపు ప్రాయశ్చిత్తమున కాయన అంగీకరించలేదు. సంఘములో గగ్గోలు బయలుదేరి ఆయనతో మూడవపక్ష మేర్పడెను. కొద్దిసంవత్సరములలో యీపక్షములు కలిసిపోయెను. భావములు మారిపోయి ప్రాతనిర్బంధములు దొలగిపోయెను. తరువాత చాలమంది కాశ్మీర బాల బాలికలు చదువులకొరకు యూరపు లేక అమెరికాలకు వెళ్లి తిరిగివచ్చినప్పుడు ప్రాయశ్చిత్తము సంగతి యెత్తినవారే లేరు. భోజనముల నిర్బంధము (ముసలమ్మలకుతప్ప) పూర్తిగా పోయెను. కాశ్మీరేతరులు భారతేతరులు,

ముసల్మానులుకలసితినుట సామాన్యమయ్యెను. ఘోషా (కాశ్మీరులుకాని వారియెడల నుండెడిది) పోయెను. 1930 నాటి రాజకీయసంరంభముతో నిది పూర్తిగా పోయెను. ఇతర సంఘములతో సంతర్వివాహము లంత సామాన్యము (అప్పటప్పట జరుగుచున్నను) కాలేదు. నా చెల్లెండ్రిరువురును కాశ్మీరేతరులనే వివాహమాడిరి. మా కుటుంబములో నొకడు హంగరీదేశపుకన్యను వివాహమాడెను. అంతర్వివాహములపట్ల మత నిర్బంధములేదు. కాని జాతిభేదమే యెక్కువగా పట్టిచ్చెడిది. మా ప్రత్యేకసంఘమును మా ప్రత్యేక ఆర్యముఖ లక్షణములను నిలుపుకొనవలెననెడి కోరిక చాలమంది కాశ్మీరులలో గలదు; మేము యీ భారత, భారతేతర మానవసముద్రములో మునిగిపోదుమేమో యను భయము; ఈ విశాలభారతములో మే మత్యల్ప సంఖ్యాకులము.

నాపదకొండవయేట బ్రూక్సుదొరయొద్ద గురుకులవిద్య ప్రారంభమయ్యెను. అతడు నిశితమైన దివ్యజ్ఞాన సమాజకుడు. అనిబిసెంటు దొరసాని యతనిని మా తండ్రికి శిఫార్సుచేసెను. సుమారు మూడు సంవత్సరము లతడు మాతో నుండెను. అతనియొద్ద నేననేకవిషయములు నేర్చుకొంటిని. హిందీ, సంస్కృతములను బోధించుటకు మరియొక వృద్ధపండితు డుండెను. ఎన్నియేండ్లతనివద్ద నేను చదివినను ఆ చదువు నాకు వంటపట్టలేదు. నేను తరువాత హారోలో సంపాదించిన ల్యాటినుభాషాజ్ఞానముతో పోల్చిన నా సంస్కృతజ్ఞాన మతిస్వల్పము. కాని యాతప్పు నాది. నాకు భాషలుత్వరగా వచ్చెడివికావు. వ్యాకరణమనిన తలనొప్పి. బ్రూక్సుదొర గ్రంథపఠనమందు నాకు మంచియాసక్తిని కలుగచేసెను. నే ననేక యింగ్లీషు పుస్తకములను చదివితిని. గద్యమునందేకాక పద్యమందును నా కభిరుచి మెండయ్యెను. నాలో ననేకమార్పులు కలిగినను యీ యభిరుచి నేటికిని నిలిచియుండెను.

అతడు శాస్త్రములోగూడ నాకభినివేశమును కలిగించెను. మే మొక చిన్నరసాయనశాలను సృష్టించితిమి. నేననేకగంటల కాలమందులో

పరిశోధనలను చేయుచు గడిపెడివాఁడను. ఈచదువే కాకబ్రూక్సుదొర వలన నాకుకొంత దివ్యజ్ఞానసంపర్కము కలిగెను. అతఁడు ప్రతివారము తనమందిరములో దివ్యజ్ఞానసభలను జరపినపుడు నేను హాజరగుచుంటిని. క్రమముగా కొన్ని దివ్యజ్ఞానభావములును, పదజాలమును నాకుపట్టుబడెను. ఆత్మానాత్మవాదము, అవతారవాదము, దివ్యపురుషులు, ముక్తపురుషులు, సిద్ధపురుషులు, యితరలోకములు కర్మసిద్ధాంతవాదములు; బ్లావట్స్కీ మొదలగు దివ్యజ్ఞానసమాజికుల గ్రంథములేగాక హిందూమత గ్రంథములు, బుద్ధధమ్మపదము; పైథాగొరసు, అపోలోనియసు మొదలగు నితర వేదాంతులు, ఆత్మద్రష్టలు:—అన్నియును, అందరును చర్చింప బడుచుండెను, చర్చింప బడుచుండిరి. నాకాచర్చ యంతయు అర్థమయ్యెడిది కాదు; కాని యిది వినుట కద్భుతముగను మనోజ్ఞముగను నుండెడిది. విశ్వరహస్య కీలకమిందులో నున్నట్లు నేను భావించితిని. నేను మతమునుగురించి, యితరలోకములనుగురించి మొట్టమొదటిసారి బుద్ధి పూర్వకముగ యోజింప నారంభించితిని. ముఖ్యముగా హిందూమతము పట్ల, (కర్మకాండలు చిల్లరశాంతులపట్లగాక) భగవద్గీత, ఉపనిషత్తులు మొదలగువానిపై నాకుగౌరవము హెచ్చజొచ్చెను. అవి నాకర్థము కాలేదు కాని యవి గొప్పయద్భుత గ్రంథములుగా కాన్పించెను. దివ్యశరీరములనుగూర్చి నేను కలలు గనుచుంటిని. ఆకాశమున నందలకొలది మైళ్లు యెగురుచున్నట్లు నాజీవితమంతటను చాలసారులు కలలు వచ్చుచుండెను. క్రిందప్రపంచమంతయు గిఱ్ఱున తిరుగు వనవాటికవలె తోచుచుండెడిది. ఫ్రాడ్ మొదలగు ఆధునికు లీకలల కేమి యర్థము చెప్పెదరో నాకు తెలియదు.

ఆరోజులలో అనిబిసెంటుదొరసాని అలహాబాదు వచ్చి దివ్యజ్ఞానమునుగురించి యనేకోపన్యాసముల నిచ్చెడిది. ఆమె వక్తృత్వము నన్ను మొదలంట కదల్చివేసి, ఖిరిఖిట్లు కప్పినట్లు కలలోనున్నట్టు

చేసెడిది. నేను దివ్యజ్ఞాన సమాజములో చేరుటకు నిశ్చయించుకొని తండ్రిగారియనుజ్ఞ నడిగితిని. ఆయన రొుక్క నవ్వునవ్వి సరేయనెను.

ఆయన దానికంత ప్రాముఖ్యత నీయకపోవుట నాకు కొంచెము కష్టముగాదోచెను. నాదృష్టిలో నతడనేకవిధముల గొప్పవాడే యైనను ఆధ్యాత్మికదృష్టిలేనివాడని యనుకొంటిని. ఒకప్పుడతడును దివ్యజ్ఞాన సమాజకుడే. ఒహుశః మతముకొరకుగాక వినోదము కొఱకతడందులో చేరెను. కనుకనే వెంటనే తగ్గిపోయెను.

నాపదమూడవయేట నేను దివ్యజ్ఞాన సమాజికుడ నైతిని. బిసెంటుసతియే మంచిసలహా యిచ్చి కొన్నియద్భుత చిహ్నములను గురించి బోధచేసి నాకు స్వయముగా నుపదేశము చేసెను. నేను పుల కితగాత్రుడ నైతిని. ముప్పదియేండ్ల క్రిందట బాల్యమున మనమెట్లు కాన్పించెడివారమో, యెట్లు భావించెడివారమో చెప్పుటకష్టమే కాని యీ నాదివ్యజ్ఞాన రోజులలో (ఒక్కొక్కపుడు పవిత్రతను సూచించు) నిర్జీవదృష్టిని కలిగియుండెడి వాడనని నాకుజ్ఞాపకము. ఇది యిప్పటికిని తఱచు యీసమాజ స్త్రీపురుషులలో కానసగును. దేవతాగణములో నొకడనని బిర్రబిగియుటచే నాయీడు బాల బాలికలకు నేను వెలియైతిని.

బ్రిక్కుసదొర వెళ్లుటతోడనే నాకు దివ్యజ్ఞాన సమాజముతో సంపర్కము పోయెను. అనతికాలములోనే (కొంత నేను యింగ్లండుకు చదువుకు పోవుటచే) దివ్యజ్ఞానము నాజీవితమునుండి పూర్తిగా తొలగి పోయెను. కాని నాటినుండి నాకుదివ్యజ్ఞాన సమాజికులయెడ గౌరవము నశించెను. వారునెత్తిమీద దేవతలవలెగాక సామాన్యులవలె కాన్పించిరి. వారికి సాహసములేని, కడుపులోనీళ్లుకదలని వేషము కావలెను; దేశభక్తుని శిలువకాక సుకుమార జీవితము కావలెను. కాని బిసెంటుసతియందు మాత్రము నాకపరిమిత గౌరవముండెడిది.

తరువాత రష్యాజపాను యుద్ధమువచ్చెను. జపానుయొక్క విజయ వార్తలు నాకత్యుత్సాహమును కలిగింప ప్రతిదినము వార్తాపత్రికల కొఱకెదురు చూచెడివాడను.

చాలసొమ్ము ఖర్చుపెట్టి నేనెన్నియో జపానుపుస్తకములను తెప్పించి చదివితిని. జపానుచరిత్రలో నేను మైమఱచి సక్తుడయ్యెను.

నామనస్సులో జాతీయభావములు నాటుకొనెను. యూరపుయొక్క దాస్యశృంఖలమునుండి ఆసియా, భారత దేశముల మోక్షమును గురించి నేను తలపోసెడివాడను. చేత కత్తిబూని భారతదేశము కొఱకును, దాని స్వేచ్ఛను సంపాదించుటకును వీరపురుషోచితకార్యముల నొనర్చినట్లు నేను కలలను గనుచుండెడి వాడను.

నాపదునాల్గవయేట మాయింట చాలమార్పులు గలుగుచుండెను. మాపెత్తండ్రులు పెద్దలై వారివారిగృహములను ప్రత్యేకముగా నేర్పరచుకొనిరి. నామనస్సులో క్రొత్తభావములు, అనిశ్చితములైన యూహలు మొలకలెత్త నారంభించెను. కన్యలయెడ నాకుమఱికొంత శ్రద్ధకలిగెను. నేనికను బాలబృందముతో నుండుటకే యెక్కువ యిష్టపడెడి వాడను. బాలికలతో కలియుట నాకు తగదనుకొంటిని. కాని మాకాశ్మీరస్థుల విందుల సందర్భములో (మాలో చక్కనిపిల్లలకు కొదువలేదు) చూపులు లేక స్పర్శ పులకాంకితముగ నుండెడిది.

నాపదిహేనవయేట, 1905 మే నెలలో మేము సకుటుంబముగా యింగ్లండు ప్రయాణమైతిమి.

---

## ౪

## హారో — కేంబ్రిడ్జి.



మే నెలాఖరుకు మేము లండను చేరితిమి. త్రోవలో ఓడరేవువద్ద నైలెక్కుచు జపానుయొక్క సముద్రజయమును గురించి చదివి నేను పొంగిపోతిని. మరునాడు డెర్బీపందెములు చూడబోతిమి. మేము లండనులో దిగుటతోడనే అన్సారీగారిని కలుసుకొంటిమి. ఆయన గొప్ప పరీక్షలలో పేరుప్రఖ్యాతులతో నుత్తీర్ణుడై లండను ఆస్పత్రిలో డాక్టరుగా నుండెను.

నాకు పదిహేను వత్సరములుండుటచే బడిలో చేర్చుకొను వయస్సు కొంచెము మించినను అదృష్టవశమున నొక కాళీ దొరికెను. మా కుటుంబము యూరపువెళ్ళి కొన్ని నెలలు తిరిగి భారతదేశము చేరుకొనెను.

ఇదివరకెన్నడును నేను క్రొత్తవారిమధ్య నొంటరిగా నుండక పోవుటచే కొంత యింటిబెంగ కలిగెను. కాని యది యెంతకాలమో యుండలేదు. బడి జీవితము కొంతవరకు నాకు సరిపడెను. పనితోను ఆటలతోను నాకు తీరికలేక యుండెడిది. కాని నేను కేవలము వారితో నైక్యము కాజాలక కొంత యొంటరితనము తప్పెడిదికాదు. మొత్తము మీద నాటలలో (పెద్దపేరు ప్రఖ్యాతులు లేకపోయినను) పూర్తిగా జోక్యము కలిగించుకొనెడి వాడను. నాకు ల్యాటినుభాష రాకపోవుటచే నన్ను మొట్టమొదట తక్కువ తరగతిలో పడవేసిరి. కాని త్వరలోనే నేను చఱచఱ పైకివచ్చితిని. చాల విషయములలో ముఖ్యముగా విషయ జ్ఞానములో నేను నా యీడు వారిని మించి యుంటిని. పుస్తకములు, వార్తాపత్రికలు నేను చాల చదివెడి వాడను. ఆంగ్ల

బాలురకు ఆటలుతప్ప మరేమియు తెలియవని, వారు మొద్దులని మాతండ్రికి నేను వ్రాసినట్లు జ్ఞాపకము. కాని నేను పై తరగతులలోనికి పోయినకొలది కొంతమంది తెలివైన వారుండెడివారు. అక్కడి యెన్నికలలో నేను శ్రద్ధతీసికొనెడివాడను. అవి 1905 చివర జరిగి లిబరలు పక్షము జయించెను. మాతరగతి యుపాధ్యాయుడు 1906 లో మమ్ము క్రొత్త ప్రభుత్వమును గురించి ప్రశ్నించెను. తరగతిలో నే నొక్కడనే దానికి సమాధానము చెప్పగలిగితిని. ప్రభుత్వ కార్యనిర్వాహక వర్గము వారిపేర్లను కూడ పూర్తిగా నేకరువు పెట్టితిని. నా యుపాధ్యాయు డాశ్చర్య చకితుడయ్యెను.

రాజకీయములేగాక వాయు యానము కూడ నన్నాకర్షించెను. రైట్ సోదరులును, డ్యుమాంటు అను వారలును సఫలులలో ప్రముఖులు. త్వరలోనే నేను నావారపు శెలవులలో భారత దేశమునకు వాయు విమానములో రాగలుగుదునని మాతండ్రికి వ్రాసితిని.

హారోలో నాతో నలుగురైదుగురు భారతవిద్యార్థులుండెడివారు. నేను వారిని మాయింటనే-ప్రధానోపాధ్యాయుని యింట-కలుసుకొనెడివాడను. బరోడా గయిక్వారుగారి కుమారుడొకడు మాతోనుండెడివాడు. అతడు నాకంటె చాలపెద్ద; క్రికెటులో విఖ్యాతుడు. నేను వచ్చిన కొద్ది రోజులకే యతడు వెళ్ళిపోయెను. తరువాత కపుర్థలమహారాజు పెద్ద కుమారుడు, పరమజిత్ సింగు, (యిప్పుడుటిక్కా-సాహేబు) వచ్చెను. అతని కచ్చటి పరిస్థితు లెంతమాత్రము సరిపడలేదు. అతడు యితరులతో కలియకపోవుటచే వారతనిని వేళాకోళము చేసెడివారు. అతనికి కోపము వచ్చి "కపుర్థలవచ్చినచో మిమ్మేమి చేసెదనో చూడుడు" అనెడివాడు. కాని దీనివలన నతనిస్థితి బాగుపడలేదు.

నేను హారోలో బాగుగనే యుంటిని. కానియదినాకు చాలనట్లు తోచుచుండెను. విశ్వవిద్యాలయము నన్నాకర్షించెను. 1906, 1907 ల

లోని భారతదేశవార్తలు సన్నాందోళన పరుపసాగెను. ఇంగ్లీషు పత్రికలద్వారా వార్తలతిస్వల్పముగా వచ్చినను ఆకొద్దివార్తలే వంగదేశము, పంజాబు, మహారాష్ట్రములలో గొప్పగొప్పవిషయములు జరుగుచున్నట్లు తెలుపుచుండెను. లజపతిరాయి, అజితసింగులు ప్రవాసమున కంపబడిరి. వంగదేశము గందరగోళముగా నుండెను. పూనాలో తిలకుగారి పేరు మారుమోగుచుండెను. స్వదేశీ, బహిష్కారములు ప్రారంభమయ్యెను. ఇదంతయు సన్నదృశ్యముగా కదల్చివేసెను. వీనిని గురించి మాట్లాడుకొనుటకు హారోలో నాకొక్క పట్టుయైనను లేకపోయెను. శెలవులలో నాస్నేహితులను, బంధుగులను కలుసుకొని నామనసులోనున్న భావములను వెలిబుచ్చితిని.

నేను బడిలో బాగుగా చదివినందున నాకు గారిబాల్డీ జీవితము బహుమతి ఈయబడెను. ఈపుస్తకము చాలబాగుండుటచే తదితరపుస్తకములను కూడ తెప్పించి గారిబాల్డీ కథను పూర్తిగాచదివితిని. హిందూదేశములో కూడ నిట్టివీరకలాప దృశ్యములు, స్వాతంత్ర్య కదనములు నాకట్టెదుట కాన్పించెను. నామనస్సులో ఇటలీ హిందూదేశములు రెండును చిత్రముగా కలిసిపోయెను. ఈభావములకును నాచదువుకునుగూడ హారో చాలచిన్నదిగా కాన్పించుటచే మాతండ్రిగారినొప్పించి నేను హారోవిడిచితిని.

కేంబ్రిడ్జి, ట్రినిటి కళాశాల, 1907 అక్టోబరు ప్రారంభము; నా వయసు పదిహేడు లేకపదునెనిమిది సమీపము. నాయిష్టము వచ్చినట్లు చేయుటకు బడిలోకంటె నెక్కుడు స్వేచ్ఛ! నాచిన్నతనముపోయినట్లును పెద్దవాడనయినట్లును నేనుగర్వించితిని. నేను కేంబ్రిడ్జి యిరుకు వీధులలోను, పెద్దభవనములలోను సగర్వముగా నడిచెడివాడను. మూడుసంవత్సరములు ప్రశాంతముగా నేను కేంబ్రిడ్జిలోనుంటిని. స్నేహితులతోను, ఆటలతోను, పనితోను ఆమూడువత్సరములు సుఖముగా గడిచెను. నాబుద్ధి క్రమముగా

వికసించుచుండెను. నేను ప్రకృతిశాస్త్రమును అనగా రసాయన, వృక్ష, భూగర్భ శాస్త్రములను తీసికొంటిని. అచ్చటి నాతోడివారు చాలమంది పుస్తకములనుగురించి సాహిత్యమును గురించి, చరిత్రనుగురించి, అర్థిక, రాజకీయములను గురించి పండితులవలె మాట్లాడుచుండిరి. మొదట వీరి యర్థ కృషిపాండిత్యము నన్నుకొంచెము కంగారుపెట్టెను. నేను కొన్ని పుస్తకములు చదివినతోడనే దీనిపస తెలిసిపోయెను. మామూలు విష యములు నాకవగతమయ్యెను. నీట్షే, బెర్నార్డుషా, డికిన్సను మొదలగు వారి గ్రంథములను గురించి మేము చర్చించెడివారము. మేము నీతిని గురించి, స్త్రీపురుష సంబంధమును గురించి గొప్పవారివలె మాట్లాడెడి వారము. మధ్యమధ్య గొప్పవారి గ్రంథములనుండి యుదహరించెడివా రము. పెద్దపెద్ద కబురులేగాని స్త్రీ పురుష సంబంధములో మాలో చాలమంది పిరికివారు. అందులో నేనొకడను. కేంబ్రిడ్జి విడిచిన చాల సంవత్సరములవరకు నాకున్నది పుస్తకజ్ఞానమే. దీనికి కారణము నేనే మియు చెప్పజాలను. అది పాపమని మే మెవరమును తలంచలేదు. నే నెప్పుడును తలంచలేదు. దానిని మతము నిషేధించుటలేదు. అందులో నీతిగాని యవినీతిగాని లేదు. అయినను నాకు కొంచెము సిగ్గుండెడిది; అవలంబింపబడెడి పద్ధతులుకూడ నాకునచ్చలేదు.

కొంత నావయస్సుచేతను, కొంత ఆస్కార్ వైల్డు, వాల్టరుపేటరుల రచనలవలనను జీవితముభోగయోగ్యమని నేనపుడు తలంచితిని. కాని కేవలభోగములేక సుకుమారితనము నన్నాకర్షింపలేదు. మతస్వభావము లేక మతనిర్బంధముల యెడల రోతగలిగిన నేను మరియొక ప్రమాణము చూచుకొంటిని. నేను ప్రతి దానిని లోతుగా చూడక బాహ్యముగనే చూచితిని. జీవితములోని యందచందములు, శృంగారము, భోగభాగ్య ములు నైచ్యములేని సరసజీవనము నన్నాకర్షించెను. అట్టి జీవితమును నే ననుభవించితిని. నా కందులో పాపమెంతమాత్రమును కాన్పించ

లేదు. అయినను త్యాగ, సాహసములు మాకు కొత్తలుకావు. నా తండ్రివలెనే, నేనును మొదట డబ్బుతోను (తరువాత పెద్ద సమస్యల కొఱకు) జీవితముతోను చెలాటమాడుదు జూదరిని. 1907, 1908 లలో భారతరాజకీయములు గందరగోళముగనుండ నేను వాటిలో పాల్గొన వలెననుకొంటిని. ఇది సుకుమారజీవనము కాజాలదు. ఇట్టి మిశ్రమములు విరుద్ధములుగు భావములు నా మనస్సును కలవరపరచెను. అనిశ్చయము, కంగారు నన్ను పీడించెను. చివరకు నే నెట్టి నిశ్చయమునకును రాజాలకపోతిని. ఈ లోపల జీవితము సుఖముగా సాగిపోవుచుండెను. దీర్ఘశీతవాసరనిశలందు మేము వెచ్చనిపొగసెగను కూర్చొని చలి మమ్ము కమ్మివేయువరకును సావకాశముగను తీవ్రముగను (ఒక్కొక్కప్పుడు కొట్టుకొనునట్లును) చర్చించుకొను చుండెడివారము. జీవితసమస్యలు మాకింకను యథార్థములు కాలేదు. అవి యుద్ధముకు పూర్వపుర్రోజులు. 20 వ శతాబ్ద ప్రారంభము. త్వరలో నీ ప్రపంచము నశించి మృత్యువు, వినాశము ప్రపంచయువకుల కొఱకు హృత్సంతాపము, బాధ మొదలగువానితో నిండిన మఱియొక ప్రపంచము రానుండెను. కాని భావి తెర మఱుగున నివి దాగియుండి యంతయు నిశ్చితమైన సక్రమాభివృద్ధిగనే కాన్పించెను.

సాగుబడికలవారికిది యానందముగనే యుండెను. 1907 మొదలు చాలసంవత్సరములవఱకు హిందూదేశ మాందోళనతో నుడికిపోవుచుండెను. 1857 తరువాత హిందూదేశము పరప్రభుత్వమునకు పిల్లివలె లొంగిపోకుండ పోరాడుటకిదియే ప్రథమము. తిలకుగారి కార్యకలాపములు అనినిశిక, అరవిందఘోషు, బెంగాలుల స్వదేశీ, బహిష్కారోద్యమములు యింగ్లండులోని భారతీయులను కదల్చెను. మాలో విశేషముగ నొక్కడును లేకుండ మేమందరమును 'తిలకీయులము' లేక అతివాదులమయితిమి.

కేంబ్రిడ్జిలో భారతీయులకు 'మజ్లిసు' అనుసంఘమొకటి యుండెడిది. మేమక్కడ తఱచు రాజకీయములను చర్చించెడివారము. కాని యదంతయు మాకొకవినోదము. పార్లమెంటుపైకడలను, విశ్వవిద్యాలయవాగ్వివాదములను శషభిషలను అనుకరించుటే మాపనిగాని యథార్థవిషయములతో డీకొనుట మాపనిగాదు. నేను 'మజ్లిసు'కు తఱచు వెళ్లెడివాడను. కాని నేనెప్పుడును మాట్లాడియెరుగను. నాకు బిడియము మెండు; ఆత్మవిశ్వాసము తక్కువ. నా కళాశాల వివాదసంఘములలో కూడ నా యీ కష్టము తొలగిపోలేదు. అచ్చటటరముకొక్కసారియు మాట్లాడనివానికి జుల్మానా వేయుదురు. తఱచు నే నాజుల్మానాను చెల్లించుకొంటిని.

'మజ్లిసు' లోను యిండ్లవద్ద సంభాషణలలోను భారతవిద్యార్థులు భారతరాజకీయములను గురించి చర్చించునపు డతిఘాటుగా మాట్లాడెడివారు. వారప్పుడు బంగాళములో ప్రారంభమగుచుండిన దౌర్జన్యకృత్యములను మెచ్చుకొనుచుండినట్లు కూడ మాట్లాడెడివారు. తరువాత నీయోధులే కలెక్టర్లు, హైకోర్టుజడ్జీలు, చలనములేని లాయర్లుగ సిద్ధమయిరి. తరువాతజరిగిన భారతరాజకీయ సంరంభములలో నీఁడకగది అగ్గిరాములెవరును కానరారైరి! అప్పటి రాజకీయవేత్తలలో పెద్దలు కొందరు మమ్ము కేంబ్రిడ్జిలో కలుసుకొనిరి. మేము వారిని గౌరవించితిమి. కాని మా విజ్ఞానము గొప్పది యని, మేము విషయములను విశాలదృష్టితో చూడగలమని, వారికంటె నధికులమని విర్రవీగెడివారము. వారిలో బిపిన చంద్రపాల్, లజపతిరాయి, గోక్లే మొదలగువారు కలరు. పాలుగారిని మాయతిథి గృహములో కలుసుకొంటిమి. మేము పన్నెండుమంది మాత్రమే యున్నను పదివేలమందికి యుపన్యసించుచున్నట్లతడురుముచుండెను. ఆ రణగొణధ్వనిలో నతడు చెప్పినది నాకు తెలియలేదు. లాలాజీ సహేతుకముగ మాట్లాడెను. పాలుగారి

యుపన్యాసముకంటె లాలాజీగారిది బాగుండెనని నేను తండ్రిగారికి వ్రాయగా మాతండ్రి చాలసంతసించెను. గోఖ్లేగారు కేంబ్రిడ్జిలో బహిరంగోపన్యాసమిచ్చెను. ఈసభలో చివర ఖ్వాజాగారులేచి యంతు పొంతులేని యొక పెద్ద ప్రశ్న వేసెను. ప్రశ్న సమాప్తమగు సరికది యెట్లు ప్రారంభమయ్యెనో, విషయమేదియో మేము మరచి పోతిమి. హర్దయాలు భారతీయులలో మంచికీర్తిని సంపాదించెను. నేను కేంబ్రిడ్జిలో నుండుటకు కొద్దిపూర్వ మతడు ఆక్సుఫర్డులో నుండెను. నేను హారోలో నున్నరోజులలో రెండుసారులతనిని లండనులో కలుసు కొంటిని. కేంబ్రిడ్జిలోని నా సహపాఠులలో చాలమంది కాంగ్రెసు రాజకీయములలో తరువాత చాల ముఖ్యపాత్రలను ధరించిరి. సేనుగుప్త నేను వెళ్ళిన కొద్దికాలములోనే కేంబ్రిడ్జి వీడెను. కిచులు, షెర్వానీ గారలు కొంచె మించు మించు నా సమకాలీకులు. సులైమనుగారు (ప్రస్తుత అలహాబాదు హైకోర్టు న్యాయమూర్తి) నా కాలములోనే కేంబ్రిడ్జిలో నుండెను. మరికొంత మంది సమకాలీకులు మంత్రులుగను కలెక్టర్లుగను తేలిరి. లండనులో మేము శ్యామ్‌జీ క్రిష్ణవర్మను గురించి అతని భారతగృహమును గురించి వినుచుండెడివారము. కాని నే నెన్నడు నతనిని కలియలేదు. ఆ యింటిని చూడలేదు. ఒక్కొక్కప్పుడతని (ఇండియన్ సోషియాలజిష్టు) అను పత్రికను చూచెడివారము. 1926 లో నే నతనిని జినీవాలో కలుసుకొంటిని. అతని జేబు లెప్పుడును తన పురాతన పత్రికలతో నిండియుండెడివి. అతనివద్దకువచ్చిన ప్రతి భార తీయుడును బ్రిటిషుప్రభుత్వముచే పంపబడిన గూఢచారియే యని యత డనుకొనెడివాడు. లండనులోకూడ భారతకార్యాలయముచే తెరువ బడిన విద్యార్థి కేంద్రమొకటి యుండెడిది. భారత విద్యార్థులను పొంచుండుటకిది యేర్పడెనని భారతీయులచే (యిందులో చాల సబబు కలదు) భావింపబడుచుండెడిది. చాలమంది భారతీయులు తమకిష్ట

మున్నను లేకున్నను దీనిని సహింపకతప్పదయ్యెను. దీనికి సౌకుసులేని దే
యే విశ్వవిద్యాలయములోను జేరుట యసాధ్యము.

హిందూదేశములోని రాజకీయములు మాతండ్రిని రంగము లోనికిదింపెను. నేనతని రాజకీయములతో నేకీభవింపకపోయినను దీనికి సంతోషించితిని. అతడు తనస్నేహితులును, చాలమంది తోడివకీళ్లును అయిన మితవాదులలోజేరెను. అతడు తనరాష్ట్రములో నొకరాజకీయ సభకధ్యక్షుడై మహారాష్ట్ర, బంగాళముల యతివాదులను ఖండించెను. అతడు రాష్ట్రకాంగ్రెసుకమిటీ అధ్యక్షుడుగకూడ నుండెను. అతడు 1907లో సూరతుకాంగ్రెసు విచ్ఛిన్నమై కేవలము మితవాద సంఘముగా తేలిన నాడచ్చటనే యుండెను. ఇదిజరిగిన వెంటనే నేనిస్సను అలహాబాదువచ్చి మాతండ్రికతిథిగానుండెను. అతడు తనయిండియా పుస్తకములో మాతండ్రి "ఉదారతలోతప్ప యన్నింటిలోను మితవాది" యని వ్రాసెను. ఇదిచాలపొరపాటు. మాతండ్రి తనరాజకీయములలో తప్ప మరెందులోను మితవాదికాడు; క్రమముగా నతని స్వభావమీ కొద్దిపాటు మితవాదమునుకూడ త్రోసివేసెను. తీవ్రమైనభావములు, తీవ్రమైనయనురాగ విరాగములు, అమితమైనయభిమానము, గొప్ప బుద్ధిబలము— ఇన్నికలవాడు మితవాది యెట్లగును? కాని 1907, 1908 లలోను తరువాత కొంతకాలము నతడు మితవాదులలో మితవాదిగ నుండి యతివాదులపై కారములు మిరియములు నూరుచుండెను. దీనికి కారణమేమి? అతడు న్యాయచట్టనిబంధనల మధ్య పెరిగిన వాడగుటచే రాజకీయముల నాదృష్టితో చూచుట సహజము. ఎట్టి కార్యకలాపము లేని శుష్కమైన ఘాటుమాటలవలన లాభములేదని యతడు స్పష్టముగా చూడగలిగెను. స్వదేశీ, బహిష్కారములందాయనకంత శక్తి కాన్పించలేదు. ఈ యుద్యమముల వెనుకనున్న మతముతో మిళితమైన జాతీయత యతనికి గిట్టదు. హిందూదేశములో, పూర్వ కాలపు

రోజులు తిరిగి వచ్చుట కతని కెంతమాత్రమును యిష్టములేదు. తాతల నాటి సాంఘికాచారములు, కులతత్వములు మొదలగునవి మన యభివృద్ధి నరికట్టునవియని యతడు తలచెను. అతడు పాశ్చాత్త్యుల యభివృద్ధిచే మోహితుడయి యింగ్లండుతో కలిసియుండినగాని యిది చేకూర నేరదని భావించెను.

సాంఘికముగా చూచినచో 1907 నాటి జాతీయత హానికరముగనే యుండెను. ప్రాచ్యదేశములలో నితరచోట్లవలెనే యిచ్చటను క్రొత్త జాతీయత మతముతో కూడియుండెను. సాంఘికదృష్టిలో మితవాదుల దేముం దంజయయ్యెను. కాని వారు ప్రజాసామాన్యముతో సంబంధము లేక యెచ్చటనో పైనుండెడివారు. ఆర్థికదృష్టితో వారంతగా చూడక పోయియున్న మధ్యతరగతులవారి దృక్పథముతో చూచెడివారు. వారు అభివృద్ధికి భంగకరములైన ప్రాచీన కులాచారములను త్రోసివేయు చిన్నచిన్న సాంఘిక సంస్కరణములనుకూడ సమర్థించెడివారు. మితవాదులతో జేరి తండ్రిగారు తీవ్రరూపమును దాల్చిరి. బంగాళము, పంజాబులలో కొద్దిమంది నాయకులతప్ప తక్కిన యతివాదులందరును యువకులు. యువకులిట్లు వారిష్టము వచ్చినట్లు బరితెగించు టతనిని రెచ్చగొట్టును. వ్యతిరేకమునతడు సహింపజాలక తాను మూర్ఖులనుకొనినవారిపై ధ్వజమెత్తకుండ నూరకొనక సమయము దొరకినప్పుడు వారిపై దుముకుచుండెను. అతని వ్యాసమొకటి నన్ను కలతబెట్టెను. తనరాజకీయములతో బ్రిటిషుప్రభుత్వము తృప్తిపడగలదని సూచించునట్లు నేనాయనకు వ్రాసితిని. యీనాసూచన కాయన మండిపడి నన్ను తక్షణమే యింగ్లండునుండి రమ్మని వ్రాయవలెననుకొనెను. నేను కేంబ్రిడ్జిలోనుండగా నావృత్తివిషయమై చర్చవచ్చెను. కలెక్టరు పరీక్షకు చదువవలెనని యూగిసలాడితిమి. దానియెడల నారోజులలో నింకను మోహముకలదు. కాని మాతండ్రికిగాని నాకుగాని దానియందంత

శ్రద్ధలేకపోయెను. నేను కేంబ్రిడ్జిలో డిగ్రీతీసుకొనుసరికి నాకు 20 వత్సరములు. అప్పుడు 22 మొదలు 24 వరకు కలెక్టరు పరీక్షకు పోవలెను. పరీక్షలో నుత్తీర్ణుడనైనచో మరియొకసంవత్సరమచ్చట నుండవలెను. మొత్తము మరినాలుగేండ్లు. నేను యింగ్లండులో చాలకాలముంటినని మాకుటుంబమువారికి విసుగుజనించెను. నేను కలెక్టరునైనచో హిందూదేశములో సన్నెమూలకో విసరివేసెదరు. నేను తమయొద్దనే యుండవలెనని మాతలిదండ్రులు కోరుచుండిరి. ఇట్టి యనేక కారణములచే మాతండ్రివృత్తినే (బారిష్టరు) ఖాయముచేసుకొంటిమి. 1910 లో డిగ్రీతీసుకొని నేను కేంబ్రిడ్జివిడిచితిని. నేను నాపరీక్షలో రెండవతరగతి (సామాన్యవిజయము) లో నుత్తీర్ణుడనై తరువాతరెండు సంవత్సరములు లండనుచుట్టుపట్ల తిరుగుచుంటిని. నాబారిష్టరుచదువున కంతకాలముపట్టెడిదికాదు. నేనంతపేరుప్రఖ్యాతులుగాని, యపఖ్యాతిగాని లేకుండనాపరీక్షలలో క్రమముగా నుత్తీర్ణుడనైతిని. పుస్తకములను చదువుచు సామ్యవాదభావములచేనాకర్షింపబడుచు నప్పటి రాజకీయములయందు శ్రద్ధతీసికొనుచు నేనుతక్కినకాలము నెట్లోగడపెడివాడను. ఐర్లండును, స్త్రీలస్వాతంత్ర్యోద్యమమును నేను ప్రత్యేకముగా నభిమానించెడివాడను. 1910 లో నేను ఐర్లండుచూడబోతిని. అప్పుడే ప్రారంభమగుచుండిన సిన్‌ఫీన్ యుద్యమము నన్నాకర్షించెను. నేను కొంతమంది హారో స్నేహితులతో కలసి దూబరాఖర్చు మొదలుపెట్టుటచే మా తండ్రి మస్తుగా పంపెడిసొమ్ము నాకు చాలెడిదికాదు. నేను పాడైపోవుచుంటినని మా తండ్రి ఖేదపడసాగెను. కాని నేనట్టి పనులేమియు చేయుటలేదు. నేను 'నగర త్రిపాది' యని పిలువబడు ధనికుడైన బుర్రలేని యింగ్లీషువాని ననుకరింప యత్నించుచుంటిని. అర్థములేని యీ సుకుమారజీవనము వలన నాకేమియు ప్రయోజనము లేకపోయెను. నా సెలవులలో నేను యూరపు వెళ్ళుచుండెడివాడను. 1909 వేసవిలో మా తండ్రియు నేనును బెర్లినులో నుంటిమి. అప్పుడే

జెప్లిను ప్రభువు తన క్రొత్త విమానములో కాన్‌స్టన్సు కాసారమునుండి యెగిరివచ్చెను. అతని దూరప్రయాణముల కదియే ప్రథమమగుటచే పెద్దయుత్సవము జరిగెను. కైజరు స్వాగతమిచ్చెను. 20 లక్షలమంది జనము విమానాశ్రయమునొద్ద గుమిగూడగా నది యాకాశమున ద్రువ్వ ద్రువ్వన తిరుగుచు సకాలమునకువచ్చి వ్రాలెను. అక్‌లాన్ హోటలు వారార్జున జెప్లిను ప్రభువు పటములను పంచిపెట్టిరి. ఆ పటమింకను నాయొద్ద కలదు. తరువాత రెండు నెలలకు పారిసుపట్టణమందేయు తిరిగిన మొదటి విమానమును మేము చూచితిమి. లామ్‌బర్టు అను నతడు దానిని నడిపెను. 18 సంవత్సరముల తరువాత నేను తిరిగి పారిసు వచ్చినప్పుడు లిండ్‌బర్గు అట్లాంటిక్కునుండి తళతళ మెరయు బాణమువలె వచ్చిపడెను. నేను 1910లో డిగ్రీ తీసికొని యొక చిన్న నావలో నార్వే వెళ్ళినప్పుడొక ప్రమాదము తప్పెను. మేమొక పర్వత సీమలో తిరుగుచు నలసి, సొలసి, యెండదెబ్బతిని యొకచిన్నహోటలు జేరి స్నానము చేయవలె నంటిమి. స్నానమనునది అచ్చటివారికి క్రొత్త. అచ్చట నట్టి యేర్పాటు లేమియును లేవు. కాని సమీపమున నున్న నదిలో స్నానము చేయవచ్చుననిరి. ఒక యింగ్లీషు యువకుడును నేనును రెండు చిన్న తుండుగుడ్డలను తీసుకొని గర్జించుచున్న యా నదిలో దుమికితిమి. అది యంత లోతులేదు. కాని చాల జారుగానుండెను. చలిచే గడ్డకట్టుచుండెను. నేను జారిపడితిని. నాయవయవములు కొంకరలు వోయి శరీర స్మృతి తప్పిపోయి నేను నీటిలో కొట్టుకొని పోవుచుండ నాస్నేహితుడు గట్టునుండి పరుగెత్తుకొనివచ్చి నాకాలుపట్టుకొని నన్ను పైకి లాగివేసెను. ఇంగ్లండులో నేను సంవత్సరము లున్న తరువాత 1912 శరత్కాలములో నేను హిందూదేశముకు తిరిగివచ్చితిని. ఈ మధ్య కాలము సెలవులలో రెండుసార్లు మాత్రమే నేను యింటికి వచ్చితిని.

---

## ౫

## భారత దేశములో యుద్ధకాలపు రాజకీయములు.



1912 అంతమున హిందూదేశములో రాజకీయములు నిశ్చేష్టముగ నుండెను. తిలకు జయిలులోనుండెను. తగిననాయకత్వములేక యతివాదులు చెదిరిలబడిరి. రాష్ట్రవిభజన రద్దగుటతోడనే వంగదేశము చల్లబడెను. మితవాదులు మింటోమార్లే శాసనసభా పథకముచుట్టు మూగిరి. సముద్రాంతరములందు ముఖ్యముగా దక్షిణాఫ్రికాలోనున్న భారతీయులపట్ల కొంతశ్రద్ధచూపబడుచుండెను. కాంగ్రెసు కొన్నితుక్కు-తీర్మానములను చేయుచు నెవరినియాకర్షింపక నేటేటకూడు మితవాద కూటమాయెను. నేను 1912లో బంకిపురపు కాంగ్రెసునకు వెళ్ళితిని. అది యింగ్లీషు తెలిసిన పైతరగతివారివ్యాపారము. ప్రతిచోట ప్రాకుకాల కోటులు, బాగుగా యిస్త్రీచేయబడిన సూటులు కాన్పించెను. అది రాజకీయోద్రేకము లేని పెద్దలసమావేశము. గోక్లే (దక్షిణాఫ్రికానుండి యప్పుడేవచ్చెను.) హాజరయినవారిలోముఖ్యుడు. మంచిశక్తి, యతిశ్రద్ధ, నిశితమైన యభిమానము గలిగి యతడు రాజకీయములందును, ప్రజాసేవయందును, మంచిశ్రద్ధవహించుచుండెను. అతనియెడల నాకు మంచియభిప్రాయముకలిగెను.

గోక్లే బంకిపురమును వీడునప్పుడొకచిత్రము జరిగెను. అప్పుడతడు పబ్లికుసర్వీసెసు కమీషనుసభ్యుడగుటచే ప్రత్యేక మొదటితరగతి రైలు పెట్టెలో ప్రయాణముచేయుటకర్హుడై యుండెను.

అతనికప్పు డస్వస్థతగా కూడ నుండెను. జనులు గుంపులు, గుంపులుగవచ్చి యతనిని వేధించుచుండ పరిశాంతముగా ప్రయాణము చేయవలెనని యతడు తనపెట్టెలో నెక్కెను. ప్రక్కనపెట్టెలు కలకత్తాకు

త్రిప్పోవుచుండిన కాంగ్రెసు ప్రతినిధులతో నిండియుండెను. భూపేంద్రనాథబాసు (తరువాత కౌన్సిలు సభ్యుడయ్యెను) మెల్లగావచ్చి తనపెట్టెలో నెక్కవచ్చునాయని గోఖ్లేగారినడిగెను. గోఖ్లే చాలమొగమాటము గలవాడగుటచే నొప్పుకొనెను. కొంచెముసేపయిన తరువాత బాసుగారు మరలవచ్చి తనస్నేహితుడుగూడ రావచ్చునా యని ప్రశ్నించెను. అతడు దానికిని యొప్పుకొనెను. స్నేహితులిరువురు పైనున్న స్థలములో కూర్చొనుట కష్టముగానుండుననియు, క్రింది రెండుస్థానములను తమకిచ్చి గోఖ్లే పయనపడుండవచ్చుననియు బాసుగారు బండికదలుటకు సిద్ధముగానున్నప్పుడు వచ్చి మెల్లగా సలవిచ్చిరి. పాపము గోఖ్లేగారట్లే చేసిరి.

నేను హైకోర్టులో చేరితిని. దానియందు నాకు కొంత యభిరుచి కలిగెను. నేను యింగ్లండునుండి తిరిగివచ్చిన మొదటిరోజులు బాగుగానే యుండెను. వృత్తిసంబంధములను కల్పుకొనుచుంటిని. కాని నాతోడి వారితో కలిసి నేను గడుపుచుండిన జీవితము (క్రొత్తదనముపోయి) నిస్సారమైన వ్యర్థజీవితముగా కాన్పించెను. నాపరిసరములతో సంతుష్టి చెందకుండుటకు నాసంకరవిద్యయే కారణము. ఇంగ్లండులోనున్న ఏడుసంవత్సరములలో నా యభిప్రాయములును భావములును వేరు. ఇచ్చటి పరిస్థితులు వేరు. అదృష్టవశాత్తు నా యింటి పరిస్థితులు బాగుగనే యుండెను. కాని అంతమాత్రముతో నేమగును? కొంతకాలము వకీళ్ళ లైబ్రరీలోను క్లబ్బులోను చెల్లెడిది. రెంటిలోను ఒకే మనుష్యు లొకే విషయములను గురించి (అదియు మావృత్తికి సంబంధించి) పదేపదే చర్చించుచుంటచే బుద్ధి వికాసమేమియులేక జీవితము నిరర్థకముగా కాన్పించెను. మంచి వినోదములు గాని కాలక్షేపములు గాని లేవయ్యెను.

"రెండుజాతులును ఏల కలుసుకొనవు? భారతీయులు యింగ్లీషువారిని విసిగింతురుగనుక. అభేద్యమైన కారణమిదియే." అని

రొక యాంగ్లేయుఁడు వ్రాసెను. చాలమంది యాంగ్లేయులిట్లే భావింప వచ్చును. ఇందులో నాశ్చర్యములేదు. పై గ్రంథకర్తయే భారతదేశములోని ప్రతియాంగ్లేయుఁడును దేశము నాక్రమించుకొనిన సైన్యములో తానొకసభ్యుఁడనని భావించి యట్లే ప్రవర్తించుననియు (అది యుక్తమేయనియు) నీపరిస్థితులలో రెండుజాతులమధ్యను యెట్టి నిర్బంధములులేని సహజ బాంధవ్యముంచుట యసంభవమనియు మరియొక గ్రంథములో వ్రాసెను. ఆంగ్లేయుఁడును భారతీయుఁడును ఒకరినొకరు యెప్పుడును మోసపుచ్చుచున్నారు. కనుక వారికి సహజస్నేహ మెట్లు సంభవించును ?

మామూలుగా ఆంగ్లేయుడెప్పుడు నొకేతరహా మనుష్యులను (తనఆఫీసుప్రపంచమునకు సంబంధించినవారిని) కలుసుకొనును. అసలైన వారి నతడెప్పుడును కలియఁడు. కలియునో పలకరించఁడు. భారతదేశములో బ్రిటిషుపరిపాలనవలన ఉద్యోగజాతికి (ఆంగ్ల భారతోద్యోగులకు) ప్రాధాన్యత వచ్చెను. వారు సంఘములోగూడ పెద్దలైరి. ఈ జాతి యత్యంతనిర్జీవమైనది; సంకుచితబుద్ధిగలది. మంచిసారగబుద్ధిగల యింగ్లీషుయువకుడైనను భారతదేశములో కాలిడినతోడనే వాని బుద్ధియు, విజ్ఞానమును మందగించును; సజీవభావములకును యుద్యమములకును దూరుడగును. ఒకరోజు ఆఫీసులో అంతుపొంతులేని కాగితపు కట్టలను తిరుగవేసిన తరువాత నతడు కొంతకసరతుచేసి క్లబ్బుకుపోయి తనవారితో గలిసి విస్కీత్రాగి యింగ్లండునుంచివచ్చు సచిత్రవారపత్రికలను చదువును. అతడు పుస్తకములను చదువనేచదువడు. చదివినను ఏపాతగ్రంథమునో సైకితీయును. ఈక్రమాగతమైన బుద్ధిమాంద్యమునకతడు భారతదేశమును నిందించును. శీతోష్ణస్థితులను శపించును. తనకష్టములను పెంచుచున్నారని యాందోళనపరుల నాడిపోయునే కాని సంకుచితబుద్ధిగల నిరంకుశ ప్రభుత్వవిధానమే దీనికంతకును

కారణమనియు దానిలో తానొక చిన్నభాగమనియు నతఁడు గ్రహింప డాయెను! సెలవులు, ఫర్లోలు అనుభవింపగల యింగ్లీషు యుద్యోగి గతియే యిదియైనచో నతనిక్రిందపనిచేయు భారతయుద్యోగిగతి వేరె చెప్పవలెనా? ఇంగ్లీషుమాదిరి ననుకరించుటకే యతఁడు ప్రయత్నించును. ఆంగ్లసామ్రాజ్యమున కాస్పదమైన యానాఁటి ఢిల్లీలో గొప్పగొప్ప ఆంగ్ల, భారతీయోద్యోగులవద్ద కూర్చుని ప్రమోషన్లు, ఫర్లోలు, బదిలీలు, సెలవుగొడవలు, ఉద్యోగస్తులలో జరుగుయవినీతి కథాకాల క్షేపములు మొదలగు వానితోఁగూడిన వారి యనంత సంభాషణలను వినుటకంటె విషాదము వేరొండు యుండబోదు.

ఈయుద్యోగ వాతావరణమే, నౌఖరీసాంప్రదాయమే హిందూ దేశములోని మధ్యతరగతుల వారందరికిని, ముఖ్యముగా యింగ్లీషు చదువుకొన్న విద్యాధికబృందముకు (కలకత్తా, బొంబాయిలలో కొంత వరకు తప్ప) పరమపావనమయ్యెను. ఇతర వృత్తులలోనివారు, డాక్టర్లు లాయర్లు మొదలగువారుగూడ దీనికే జోహారులైరి. అధ్యపభుత్వ విశ్వవిద్యాలయ పరిషత్సభలకును నిదియేజబ్బు. వీరందరు నొకప్రత్యేక ప్రపంచములో (ప్రజాసామాన్యముతోను మధ్యతరగతులలోని క్రింద వారితోను గూడ సంబంధమేమియులేకుండ) జీవించుచుండిరి. రాజ కీయము లీసైతరగతి వారికే సంబంధించెను. 1906 నాటి జాతీయోద్య మము మొట్టమొదటిసారి యీమాంద్యమును తొలగించి మధ్యతరగతి వారిలోని క్రిందవారికిని, కొంతవరకు ప్రజాసామాన్యమునకును నూతన జీవము నిచ్చెను. గాంధీజీ నాయకత్వముక్రింద నిది మరింత త్వరిత గతిని చెందెను. కాని జాతీయపోరాటము సచేతనమైనను సంకుచిత మైనది. అది యితరకార్యములకు తావీయకుండ మనశక్తిని, కాలము నంతను మ్రింగివేయును.

కనుక నేను ఇంగ్లండునుంచి తిరిగి వచ్చిన కొన్నిరోజులలో జీవి తముతో విసుగుజెందితిని. నావృత్తితో నేను తృప్తిచెందలేదు. రాజ

కీయములు (పరప్రభుత్వము నెదుర్చు శక్తిగల జాతీయకలాపమని నాయభిప్రాయము) దీనికి తగియుండలేదు. నేను కాంగ్రెసులో జేరి సభలలో పాల్గొనుచుంటిని. ఫిజీకిపోవు భారతనిర్బంధ కూలీలకును, దక్షిణాఫ్రికా భారతీయులకును సంబంధించిన ప్రత్యేకవిషయములు వచ్చినప్పుడు నేను నాశక్తి సామర్థ్యములనన్నిటిని వినియోగించి పనిచేసెడివాడను. కాని యివి తాత్కాలికములు. నేను అప్పుడప్పుడు వేటకు బోయెడివాడను.

నాకు దానియందు ప్రత్యేక వ్యసనములేదు. కాని, అరణ్యమనినను, విహారము లనినను ప్రీతి. జంతువులను చంపుటయందు నాకు ప్రావీణ్యతలేదు. నేను దానికొరకు యత్నించెడి వాడనుకాను. కాశ్మీరములో నేనొకసారి యొక యెలుగును చంపితిని. మరియొకసారి నేనొక లేడిని కొట్టితిని. నిరపరాధియైన యాచిరుతప్రాయపులేడి నాకాళ్ళముందరపడి జొటజొట కన్నీరుకారు తన విశాలనేత్రములతో నన్నాపాదమస్తకముచూచి ప్రాణములు విడిచెను. దానితో నాకున్న కొద్దిపాటి వేట తమకము నశించెను.

ఆనేత్రములప్పటినుండియు నన్ను తరచు పీడించుచునేయుండెను. గోఖ్లేగారి 'భారతసేవకసంఘము' నన్నారోజులలో నాకర్షించెను. నావృత్తిని వీడుటకు నాకప్పుడిష్టము లేకపోవుటచేతను, దాని రాజకీయము లతిమితవాదముగ నుండుటచేతను నేనందులో చేరవలెనని యెన్నడు ననుకొనలేదు. కాని దేశసేవకొరకతి స్వల్పవేతనములతో తృప్తిపడిన యాసంఘసభ్యులయెడల నాకెక్కుడు గౌరవముండెడిది. ఇదిపూర్తిగా సరియైన పద్ధతులలో లేకపోయినను తదేకదీక్షతో గూడిన యెడతెగని పనికిచ్చుట నవకాశమున్నదని నేను భావించితిని. కాని రాజకీయములతో సంబంధమెంతమాత్రమును లేని యొకచిన్న విషయములో శ్రీనివాస శాస్త్రిగారు నాకాశ్చర్యమును కలిగించిరి.

ఆయన అలహాబాదులో విద్యార్థుల కుపన్యసించుచు వారుమర్యాదగ మెలగవలెననియు నుపాధ్యాయులయెడలను, పండితులయెడలను వినయ విధేయతగ నుండవలెననియు, చట్టబద్ధమైన ప్రభుత్వముచే తయారు చేయబడిన నియమ, నిబంధనల నన్నింటిని జాగ్రత్తగ పాటింపవలె ననియు బోధించెను. ఈధర్మపస్నములను చదువుట నాకెంతమాత్ర మును నచ్చలేదు. అధికారతత్త్వమునకే ప్రాశస్త్యమునిచ్చు యీతత్త్వ బోధ యనవసరముగ కాన్పించెను. హిందూదేశములో ప్రబలిన నౌకరీతత్త్వమే దీనికి కారణమని నేననుకొంటిని. శాస్త్రిగారింకను చెప్పుము విద్యార్థులు తాముచేసెడిదోషముల నన్నింటిని వెంటనే యధికారులకు తెలియపర్చవలెననిరి. అనగా నౌకరిపై నౌకరు గూఢ చారిగ నుండవలెను. శాస్త్రిగారి కఠినపదముల నుపయోగించలేదు. కాని వాటిభావము స్పష్టముగనేయుండెను. ఒకగొప్పనాయకుని యిట్టి మిత్రవాక్యములకు నేనచ్చెరువందితిని. ఇంగ్లండునుండి నేను క్రొత్తగా వచ్చితిని. అచ్చట పాఠశాలలలోను, కళాశాలలలోనుగూడ సహపాఠి నెన్నడును మోసపుచ్చరాదనియే నాకుబోధింపబడెను. కొండెములను చెప్పి, మాటలుమోసి తోడివానిని కష్టములలోత్రోయుటకంటె వేరు పాపములేదు. ఈసూత్రముకు కేవలము భిన్నమైన శాస్త్రిగారి నీతికిని నాకు నేర్పబడిన నీతికిని చాలభేదము కలదు.

ప్రపంచయుద్ధము మాదృష్టినాకర్షించెను. అదిదూరమున జరుగు చుండుటచే మొదట మన జీవితముల నంతగా బాధించలేదు. దాని భయంకరరూపమును హిందూదేశమెన్నడును జూడలేదు. రాజకీయము లంతరించెను. భారతరక్షణచట్టము దేశమును నులిమివేయుచుండెను. రెండవయేడు దాటినతర్వాత కుట్రలు, కాల్పులు మొదలగువార్తలు వినవచ్చెను. పంజాబులో సైనికులనుజేర్చు విపరీతవిధానము బయట బడెను.

రాజభక్తి ప్రమాణము లెంత గట్టిగా వినవచ్చినను బ్రిటిషు వారియెడల నభిమానము లేకుండెను. మితవాదులును అతివాదులును గూడ జర్మను విజయములను కుతూహలముతో వినుచుండిరి. జర్మనుల యెడల ప్రేమలేదు. కాని మన ప్రభుత్వ పరాజయమును చూడవలె ననియే మాకోరిక. దుర్బలుడు, అసహాయుడు నగువాడిట్లే యితరులు పగ దీర్చుటను జూచి యువ్విళ్ళూరును. యుద్ధముచేయుచున్న దేశము లన్నిటిలోను ఫ్రాన్సుమీద నాకెక్కుడు అభిమానముండెను. మిత్రమండలి వారి యెడ తెగని నిరంతర ప్రచారము (మేము దానిలో చాల వరకు తీసివేసెడివారము) కొంతపనిచేసెను.

క్రమముగా రాజకీయ జీవితము మరల హెచ్చజొచ్చెను. లోకమాన్యతిలకు జైలునుండివచ్చి బిసెంటుసతితో హోము రూలు సంఘములను స్థాపించుచుండెను. నేను వారిద్దరను కలుసుకొంటిని; కాని ప్రత్యేకము బిసెంటు సంఘమునకే పనిచేసితిని. బిసెంటు భారత రాజకీయరంగములో ముఖ్యపాత్రను ధరింపసాగెను. కాంగ్రెసు సభ లలో తీవ్రత హెచ్చెను. ముస్లిము సంఘము కాంగ్రెసుతో సమ ముగా నడువసాగెను. వాతావరణ ముత్సాహ పూరిత మగుచుండెను. చాలమంది యువకులము త్వరలో గొప్ప విషయములు జరుగగలవని యాసించుచుంటిమి; బిసెంటు ప్రవాసము విద్యాథికులను రెచ్చగొట్టి హోముహూలు సంఘములను దేశమందంతటను విజృంభింప జేసెను. 1907 లగాయతు కాంగ్రెసును వీడిపోయిన యతివాదులేగాక చాల మంది మధ్య తరగతి వారుగూడ వీనిలో చేరిరి. కాని యివి ప్రజలను ముట్టలేదు. బిసెంటు ప్రవాసము మితవాదనాయకులను వృద్ధసంతతి వారినికూడ కదల్చెను. ప్రవాసముకు కొంచెము ముందు శ్రీనివాస శాస్త్రిగారి గంభీరోపన్యాసములను పత్రికలలో చదివి మేమానందించెడివారము. కాని ప్రవాసముకు కొంచెముముందో లేక వెనుకనో

శాస్త్రిగారేలకో హఠాత్తుగా మూకీభావము వహించిరి. కార్యాచరణకు గడంగవలసిన సమయము వచ్చినపుడాయన మమ్ము పూర్తిగా విడిచివేసెను. నాటనుండి శాస్త్రిగారు కార్యదక్షుడు కాడనియు నుపద్రవముల నెదుర్కొనుట కాయన బుద్ధివిశేషము పనికిరాదనియు నేను విశ్వసించితిని. ఇతర మితవాద నాయకులు ముందంజవేసిరి. కాని కొందరు తరువాత వెనుకాడిరి. కొందరు నిల్చిపోయిరి. భారతదేశ రక్షక సైన్యములో భారతీయులను చేర్చు సందర్భమున పెద్ద చర్చ జరిగెను. భారతీయులకును యూరపియనులకును అనేక విషయములలో నవమానకరములైన విభేదములు గల్పింపబడెను. యువకులకు కొద్దిపాటి సైనిక శిక్షణమైనను అబ్బునను కారణముతో చివరకు తోడ్పడుటకే మేమంగీకరించితిమి. యీపనిని సాగించుటకు అలహాబాదులో నొకకమిటీని కూడ యేర్పరచితిమి. నేను నాదరఖాస్తును పంపితిని. ఇంతలో బిసెంటుగారి ప్రవాసమువచ్చెను. ఆవేడిలో కమిటీ సభ్యులను, మాతండ్రి, చింతామణి మొదలగువారిని, ప్రభుత్వచర్యను గర్హించుటకుగాను యీపనినంతను రద్దుచేయునట్లొప్పించితిని. దీనిని బహిరంగముగా తెలియపరచితిమి. ఈదుడుకు కార్యమునకు తరువాత కొంతమంది విచారించిరట.

బిసెంటుప్రవాసముతో మాతండ్రియు మరికొంతమంది మితవాదనాయకులును హోమురూలుసంఘములో చేరిరి. కొన్ని నెలలైన తరువాత మితవాదబృందము జారిపోయెను. మాతండ్రి నిలచియుండి అలహాబాదుశాఖకు అధ్యక్షుడయ్యెను. క్రమముగా మాతండ్రిసనాతన మితవాదమతమును బోగొట్టుకొనుచుండెను. మనలను లక్ష్యము చేయక నీచముగా చూచుచున్న ప్రభుత్వముకు దోసిలొగ్గుట, సాగిలబడుట యతనిస్వభావమునకు విరుద్ధము. కాని పాత్రియతివాదనాయకు లతని నాకర్షింపలేదు. వారిభాష వారిపద్ధతి యతనికి నచ్చలేదు. బిసెంటు

ప్రవాసమును, తరువాతజరిగిన సంగతులును నతనిని ముందుకు త్రోయుచుండెను. కాని యతడు సందేహించుచుండెను. మితవాద రాజకీయములు లాభములేదనియు, హిందూమహమ్మదీయసమస్య తేలినగాని సరియైనపని జరుగుట కవకాశములేదనియు నతడారోజులలో చెప్పుచుండెడివాడు.

ఈకీలకముదొరకినచో మాలోనలిచిన్నవానితోకూడ ముందుకు దుమికెదనని యతడు మాటయిచ్చెను. అఖిలభారత కాంగ్రెసు కమిటీ వారు మాయింటకూడి తయారుచేసిన సంయుక్త కాంగ్రెసు-లీగుపద్ధతి 1916 లక్నో కాంగ్రెసులో నామోదింపబడెను. దీనితో నతడు తృప్తిపడి తోడె మితవాదబృందముతో తెగ్గించుకనియైన వచ్చుటకిచ్చగించెను. మాంటేగుగారు భారత కార్యదర్శిగా భారతదేశమును చూచుటకువచ్చువరకు వారు కలసియేయుండిరి. మాంటెగుచెమ్సుఫర్డు ప్రణాళిక ప్రచురమగుటతోడనే యభిప్రాయభేదము లంకురించెను. 1918 లో ప్రత్యేక సంయుక్తరాష్ట్రసభ మాతండ్రి యాధిపత్యమున లక్నోలో జరిగెను. మాంటేగుచెమ్సుఫర్డు ప్రణాళికను ఖండించునని మితవాదులీ సభను బహిష్కరించిరి. తరువాత నీతీర్మానములను చర్చించుటకు సమకూడిన ప్రత్యేక కాంగ్రెసునుగూడ వారు బహిష్కరించిరి. అప్పటినుండి మితవాదులు కాంగ్రెసునుండి శలవుతీసికొనిరి. మెజారిటీ తమకు వ్యతిరేకమైనను తమయభిప్రాయములను వెల్లడించి వాటికొరకు పోట్లాడకుండ కాంగ్రెసునుండియు తదితర బహిరంగ సభలనుండియు మెల్లగా జారిపోవు యీమితవాద యాచారము ప్రజాపక్షమున పనిచేయు వారల కెంతమాత్రమును తగదని నాకుదట్టెను. దేశములోని చాలమంది ప్రజల యభిప్రాయముకూడ నిదియనియే నాయుద్దేశ్యము. భారత రాజకీయములలో మితవాదులు కొంచెమించు పూర్తిగా సంక్షరించిపోవుట కీపిరికిపద్ధతియే కొంతకారణమని నానిశ్చయము. మితవాదులు మొత్తముగా బహిష్క-

రెంచిన తరువాత శ్రీనివాసశాస్త్రిగారొక్కరే తొలిదినములలో కొన్ని కాంగ్రెసులకువచ్చి తమయొక్కరి యభిప్రాయమును వెలిబుచ్చెడివారు. దీనిచే ప్రజలలో నాయనకు గౌరవముకలిగెను. యుద్ధమారంభమైన తొలి వత్సరములలో నారాజకీయక్రియాకలాపమతిస్వల్పము. నేను బహిరంగ సభలలో నెన్నడు నుపన్యసించలేదు. యుపన్యసించుటయనిన నాకతి భయము. ఇంగ్లీషులో మాట్లాడగూడదని నాయభిప్రాయము. హిందూ స్తానీలో చాలకాలము మాట్లాడలేనని సందేహము. అలహాబాదులో నేను మొట్టమొదట 1915 లో నుపన్యసించితిని. నేను యింగ్లీషులోనే మాట్లాడితిని. సప్రూగారు సభముగియుటతోడనే నన్ను కౌగిలించుకొని బహిరంగముగా ముద్దుపెట్టుకొనిరి. నేనుబహిరంగముగా నుపన్యసింప గల్గినందులకాయన యుబ్బిపోయెను. ప్రజాసేవకులలో మరియొకక్రొత్త వాడు కలిసెనని యాయనసంతోషము. ఆరోజులలో మాట్లాడుటయే ప్రజాసేవ.

అలహాబాదులోని చాలమందియువకులము సప్రూగారు రాజ కీయములలో ముందుకువత్తురని యనుకొనెడివారము. పట్టణములోనున్న మితవాదులలో నుత్సాహము, భావోద్రేకము కలవాడతడే. అతనితో పోల్చిచూచో మాతండ్రి (అంతర్గతముగా నగ్నికణములు దాగియున్నను) యతిచల్లనివాడు. కాని ధృఢబుద్ధి గలవాడుగనుక మాకాశలేదను కొంటిమి. సప్రూగారే మమ్ముద్ధరింతురని కొంతకాల మూహించితిమి. పండిత మదనమోహన మాలవ్యా, యతని చిరకాలప్రజాసేవ, మమ్మాకర్షించెను. అతనితో మేము దీర్ఘసంభాషణలను సలుపుచు దేశ మును నడుపుమని యతనిని బలవంత పరచెడివారము.

మాయింట తొలి సంవత్సరములలో రాజకీయ సమస్యలను చర్చించుటంత శాంతమైన వ్యాపారముకాదు. వానిని తలపెట్టినప్పుడు (తరచుగా నిది జరుగుచుండెను) ఉద్రేకము హెచ్చెడిది. కాన్ఫ్రెన్సు

యుండవలెననియు, మాటలు పనికిరావనియు నేనుచేయు విమర్శలను తండ్రిగారు వినుచు నేను యతివాదినగుచుంటినని కనిపెట్టిరి. చేయవలసినపని నిర్ధారణకాలేదు. వంగదేశములో జరుగుచుండిన దౌర్జన్య కార్యములవైపు మరలుదునేమోయని యాయన బాధపడెడివాడు. యథార్థముకు సన్నది మాకస్పష్టముగలేదు. కాని ప్రస్తుతపరిస్థితులకు చేతకానివారివలె లొంగిపోరాదనియు, నేదో కొంతపని చేయవలెననియు నేనాదుర్దాపడెడి వాడను. జయప్రదముగా పనిజరుగుటయనిన (జాతీయ దృష్టిలో) నెంతమాత్రమును తేలికయైన విషయముకాదు. తండ్రిగారు కూడ మితవాద వేదాంతముతో తృప్తిపడలేదు. ఆయనలో నాంతరంగిక సంఘర్షణ జరుగుచుండెను. ఇంకొకగతిలేదని పూర్తిగా విశ్వసించినపుడుగాని యాయన యొకస్థితినుండి మరియొక స్థితికి మారెడువాడుకాడు. ఒకసారి యొక యడుగు వేసినచో (ఆతడు చాల యభిమానధనుడు కనుక) నిక వెనుకకుమరలడు.

బిసెంటుప్రవాసముతో నతని రాజకీయములలో బహిరంగమైన మార్పు కలిగెను. నాటిలగాయతు క్రమముగా నతడు ముందుకు సాగి తనమితవాదబృందమును చాలవెనుకకు దిగద్రొక్కి 1919 పంజాబు దురంతములతో తన పూర్వజీవితమును తనవృత్తిని యొక్కసారిగా విడనాడి, గాంధీజీప్రారంభించిన నూతనోద్యమములో నైక్యమయ్యెను. కాని యాదిన మింకనురాలేదు. 1915 మొదలు 1917 వరకు నతడు డోలాయమానముగనుండి నన్నుగురించి యాందోళన పడుచుండుటచే రాజకీయములనుగురించి శాంతముగా మాట్లాడెడివాడుకాడు. అతనికి మాపై కోపమువచ్చుచుండుటచే మాసంభాషణలు తరచు హఠాత్తుగా నాగిపోవుచుండెడివి.

నేనుగాంధీజీని మొట్టమొదట 1916 క్రిస్టమసులో లక్నో కాంగ్రెసురోజులలో కలుసుకొంటిని. దక్షిణాఫ్రికాలో నతడు సలిపిన

పోరాటమునకు మేమతనిని మెచ్చుకొంటిమి. కానియతను రాజకీయ వేత్తకానట్లు మాకు దూరస్థుడైనట్లు, మాకంటెవేరైనట్లు మాలో చాలమంది యువకులము భావించెడివారము. కాంగ్రెసులోను, జాతీయ రాజకీయములలోనుపాల్గొనుటకతడప్పుడుయిచ్ఛగింపకదక్షిణాఫ్రికాలోని భారతీయుల సమస్యనుగురించియే మాట్లాడుచుండెను. తరువాత కొద్ది కాలమునకే యతడు చాంపరానులో కైతులతరపున తేయాకుతోట యజమానులమీద ధ్వజమెత్తి విజయమును బడయుటతోడనే మేము సంతోషముతో పొంగితిమి. అతడు తనపద్ధతులను హిందూదేశములో గూడ ప్రయోగింపనున్నాడని మేము గ్రహించితిమి. అవి విజయ వంతములగునట్లు కాన్పించెను.

లక్నో కాంగ్రెసుముగిసిన తరువాత సరోజనీదేవి అలహా బాదులోనిచ్చిన గంభీరోపన్యాసములు మమ్ముకదల్చివేసెను. అవి జాతీయతతోను దేశభక్తితోను నిండియుండెను. నాకళాశాలరోజుల నాటి యనిర్ధారితములైన సామ్యవాదభావము లంతరించుటచే నేను జాతీయవాదినైతిని. కాని క్రొత్తపుస్తకములను చదివినకొలదినాలో పూర్తిగా సామ్య వాదభావములు మరల మొలకెత్త నారంభించెను. అవి శాస్త్రసంబంధములుగాక కేవలము లయూహలు, గాలి కోటలు, మానవదయాళుత్వమునకు సంబంధించినవిగా నుండెను. బెర్ట్రిండురస్సెలు గారిగ్రంథములను నేను యుద్ధకాలములోను తరు వాతనుకూడ చదువుచుంటిని. ఈభావములును, కోరికలును, నాలో సంఘర్షణను లేవదీసెను.న్యాయవాదవృత్తియందసంతృప్తిని కలిగించెను. మరొకటి చేయునదియులేక నేను దానిని వీడకుంటిని కాని ప్రజాసేవ కును నావృత్తికిని ఎంతమాత్రమును సరిపడదనుభావము నాలో నానాటి కభివృద్ధియగుచుండెను. అదిదోషమనికాదుకాని కాలము, శక్తి యీ రెంటికిని చాలవు. కలకత్తాలోని విఖ్యాతలాయరైన సర్ రేషబిహారీ

ఘోషుగారు నాయందు హేతుక ప్రేమకలవాఁడై నావృత్తిలో పైకి వచ్చుటకు తగిన సలహాల నొసంగెను. ముఖ్యముగా న్యాయశాస్త్రమునకు సంబంధించిన విషయము నొకదానిని (నా యిష్టము వచ్చిన దానిని) తీసికొని యొక పుస్తకమును వ్రాయుమనెను. పిల్లలాయరు పెద్దవాఁడగుటకిది మంచిమార్గ మని యతని యభిప్రాయము. దానిని వ్రాయుటలో నాకతఁడు సాయము చేసెదననెను. కాని యతఁడు నా న్యాయవాదవృత్తియందు చూపిన శ్రద్ధయంతయు వ్యర్థమయ్యెను. నా కాలమును, శక్తిని న్యాయపుస్తకములను వ్రాయుటలో వినియోగించుటకంటె బుద్ధితక్కువేదియును నాకుకాన్పించలేదు. సర్ రేష్‌బిహారీతన వృద్ధాప్యములో చాల ముక్కోపిగను చిరుబురుగను తన క్రిందనుండు వకీళ్ళకు పెద్దపులివలెను నుండెడివాఁడు. నాకతఁడనిన యిష్టము. అతని దోషములలోను లోటులలోను కొంత సొంపులేక పోలేదు. సిమ్లాలో నొకసారి తండ్రిగారును నేనును అతనికతిథులముగ నుంటిమి. అపుడే 1918 మాంటేగు చెమ్సుఫర్డు నివేదిక బయలుపడెను. ఒక సాయంకాలమతఁడు కొందరు స్నేహితులను విందుకు పిలిచెను. అందులో వృద్ధులైన కపార్డీగారొకరు భోజనానంతరము వారిరువురును తీవ్రవాదముకు గడంగిరి. ఘోషుగారు మితవాది కపార్డీగారపుడు (తరువాత సంవత్సరములలో నితఁడు కేవలము మేకవలె సాధువై మితవాదులలో మితవాదియైనను) ప్రధాన తిలకేయుఁడుగా భావింపఁబడెను. గోఖ్లేగారు బ్రిటిషు యేజెంటు అనియు తాను లండనులోనుండగా తనపై గూఢచారిగా నుండెననియు కపార్డీగారు గోఖ్లేగారిని విమర్శింప నారంభించిరి. సర్ రేషబిహారీ దీనిని సహించలేక గోఖ్లే మానవులలో నుత్తముడనియు, తనకు ముఖ్యస్నేహితుడననియు, నతనికి వ్యతిరేకముగా నెవ్వనిని యొక్కమాటయైనను జెప్పనీయననియు గర్జించెను. కపార్డీగారపుడు శ్రీనివాసశాస్త్రిగారిమీద పడిరి. సర్. రేషబిహారీ కిదియు నిష్టములేకపోయెను. కాని దీనినంతగా నెదుర్కొనలేదు. గోఖ్లేగారి

యెడల నున్నంత గౌరవమతనికి శాస్త్రిగారియందులేదు. గోఖ్లేగా రున్నంతకాలము నతడాసంఘమునకు ధనసహాయము చేసెననియు నతడు మృతినొందినతరువాత మానివేసెననియుకూడ చెప్పెను.

కపర్డీగారు తరువాత తిలకుగారిని మెచ్చుకొననారంభించెను. ఇతడు నిజముగా చాలగొప్పవాడు. "అద్భుతమైనమనిషి," "ఋషి" యని యతడనెను. "ఋషియా" నాకు ఋషులనినమంట, ఋషులతో "నాకేదియుపనిలేదు," అని సర్ తేజబహాదూర్ ముదలకించెను.

---

౬

## నా వివాహము, హిమాలయారోహణము.

నావివాహము 1916 లో ఢిల్లీపట్టణమున వసంతకాలములో జరిగెను. నేను వేసవికాలము కొన్ని నెలలు కాశ్మీరములో గడిపి నాకుటుంబమును కాశ్మీరములో విడిచి నాపెత్తండ్రి కుమారునితో పర్వతములలో ననేక వారములు విహరించి లడక్ రోడ్డు నెక్కితిని. టిబెట్టు మైదానమునకు పోవు (ప్రపంచములో నెత్తైన) బిక్కు బిక్కుమను నీసన్నని పర్వత లోయలు గుండ పోవుటకు నాకిదియే ప్రథమము. జోజీలాకనుమనుండి పచ్చని రత్న కంబళములనుబోలు పర్వత సానువులు నొకవంకను, చెట్టుచేమలులేని కొండలనొకవంకను మేముచూచితిమి. మంచుచే కప్పబడి తళతళ మెఱయు శిఖరములొకవంకను, మందగమనము చేయుచు మమ్ము కలుసుకొన దిగివచ్చు నదులతోగూడిన శిఖరములొకవంకను, పైకి పోవుచుండ మేమాసన్ననిలోయ నెక్కుచుంటిమి. గాలి యతిచలిగను సహింప నశక్యముగను నుండెను. కాని పగలు సూర్యభగవానుడు వెచ్చదనము నిచ్చుచుండెను. గాలి పొగలేక నిష్కల్మషముగ నుండుటచే నొక్కొకప్పుడు దూరవస్తువులు దగ్గఱగనున్నట్లు తోచెడివి. కాని యొంటరితన మంతకంతకు హెచ్చుచుండెను. చివరకొక చెట్టుకాని, పుట్టకాని మాకుసావాసము లేకుండెను. కొండమంచు, ఒక్కొకప్పుడు మంచి పువ్వులు—అయినను ఈ ప్రకృతి విహారస్థలములలో నాకొక యపరిమితోత్సాహము, శక్తి, సామర్థ్యములు కలిగెను.

ఇచట మాకొక మంచి యనుభవము కలిగెను. మేము జోజీలా కనుము దాటినతరువాత (మాతాయనయనుచోట) అమరనాథ్ గుహ యచ్చటికెనిమిదిమైళ్లలో కలదని వింటిమి. అంతయు మంచుతో కప్ప

బడిన గొప్పకొండనొకదానిని మేము దాటవలెను. అదియొకలెక్క-కాదనుకొని మాయుత్సాహములో (ననుభవములేకపోవుటచే) మేమా ప్రయత్నముకు గడంగితిమి. ఒకగొల్లవాడు మార్గముచూపుచుండ మేము మా మకామును (అది 11,500 అడుగుల యెత్తునందుండెను) వీడి పర్వతముపైకి పోతిమి; ఒకరినొకరము తాళ్లతో కట్టుకొని పర్వతమునుదాటుచు, మంచుదిబ్బలనెక్కుచు, పోవుచుండ మాకష్టము లంతకంతకు హెచ్చుచుండెను. గాలిపీల్చుకొనుట కష్టమగుచుండెను. మంచుకురియుచు భయంకరముగజారుచుండ మేమలసిపోతిమి. ఒక్కయడుగైననుముందుకు పడుట గగనముగనుండెను. కాని మేము మాముఖ్యప్రయత్నమును మానలేము. ప్రాతఃకాలము నాలుగుగంటలకు మా మకామునువీడి మేము కొంచమించుమించు పన్నెండుగంటలు విరామములేకుండ నెక్కుచుచివరకొక గొప్పమంచుభూమికిచేరగలిగితిమి.ఆదృశ్యమత్యద్భుతముగనుండెను. చుట్టును మంచుశిఖరములచే నలంకరింపబడి యది దేవతావిహారస్థలమువలెనుండెను. ఇంతలోనే క్రొత్తమంచు, పొగపట్టుటచే మాకాదృశ్యము మాయమయ్యెను. మేమెంత యెత్తున నుంటిమో నేనెరుగనుకాని యది 15000 మొదలు 16000 అడుగులవఱకునుండి యుండవలెను. అమరనాథ గుహకంటె మేము చాల యెత్తుననుంటిమి. మేమీమంచుభూమిని దాటి (సుమారు అరమైలుదూరము) యవతల ప్రక్కనున్న యమరనాథ గుహకు పోవలెను. ఎక్కవలసినదంతయు నెక్కితిమి.కనుక మాకష్టములన్నియు గట్టెక్కినవని యనుకొని యలసియున్నను, ఉత్సాహముతో మేమిందుకు బూనుకొంటిమి. అచ్చటచ్చట బొరియలుండి క్రొత్తమంచు వానిని కప్పివేయుచుండెను. ఈక్రొత్తమంచే యొకసారి కొంచెమించుమించు నాకొంపతీసెను. దానిమీద కాలిడితినో లేదో నేనొక యగాధములోనికి పోవుచుంటిని. ఈయగాధములో నుండిపోవు వస్తువేదియైనను చెక్కుచెదరకుండ నెన్నియుగములయిన భద్రముగ నుండి భూగర్భశాస్త్రజ్ఞులకు పనికివచ్చెడిది కాని త్రాడు నన్నుపట్టె

యుండెను. నేనా బోరియయొక్క యంచును పట్టుకొంటిని. నన్ను పైకి లాగివేసిరి. దీనిచే మా యుత్సాహము సన్నగిలెను. మేము మాప్రయాణమును మానలేదు. ఈబోరియ లంతకంతకు సంఖ్యలోను వెడల్పులోను హెచ్చనారంభించెను. వీనిని దాటుటకు మాకెట్టిసాధన గాని, యుపకరణములుగాని, లేక విసిగి, నిరాశచెంది అమరనాథ గుహను చూడకుండగనే మేము వెనుకకు మరలితిమి. ఎత్తైన కాశ్మీర లోయలు, పర్వతములు నాకమితానందము నొసగూర్చుటచే నేను త్వరలోనే వానిని తిరిగి చూడవలెనని నిశ్చయించుకొంటిని. నేననేక స్థలములను చూడవలెనని తిరుగవలెనని యూహించుచుంటిని. టిబెట్టు దేశములో నత్యద్భుత కాసారమైన మానసరోవరమును, దానిప్రక్కనే యున్న కైలాసపర్వతమును చూడవలెననుకోరిక నాకానందము నిచ్చెడిది. ఇది పదునెనిమిది వత్సరములక్రిందటిమాట. కాని నేటికిని నేను కైలాస మానసరోవరములను చూడజాలనైతిని; చివరకు కాశ్మీరమును చూచుటకైనను పోజాలకపోతిని. అంతకంతకు నన్ను రాజకీయములును, ప్రజాసేవయు బంధించుటచే పర్వతముల నధిరోహించుటకును, సముద్రములను లంఘించుటకును బదులు జైళ్ళకు పోవుట సంభవించెను. కాని నేనింకను హిమాలయములను, మానసరోవరమును, నాయభీష్టమగు కైలాసగిరిని చూడవలెనను కలలను గనుచుండును. ఈలోపల జీవితము పరుగెత్తుచు, యౌవనము నడివయస్సులోనికిని, నడివయసు, అంతకంతకు నధ్వాన్నమగు మరియొక యవస్థకును దాటితీయుచున్నది. కైలాస, మానసరోవరములకు పోకుండగనే వృద్ధాప్యమువచ్చి మీదపడునని యొకొక్కప్పుడు నేననుకొనుచుందును.

---

## ౭

## గాంధీజీ రాక, సత్యాగ్రహము, అమృతసరము.

ప్రపంచయుద్ధము ముగిసెను. హిందూదేశములో నుద్రేక మణచి వేయబడెను. యంత్రపరిశ్రమ లభివృద్ధిచెంది పెట్టుబడిదారుల ధన, అధికారములు హెచ్చెను. కొద్దిమంది యైశ్వర్యవంతులయి యింకను అధికారమును, ధనమును కూడబెట్టవలెననెడి దురాశా పరవశులయి యుండిరి. కాని జన సామాన్యస్థితి యదృష్టమునకు నోచికొనలేదు. తమ్ము ముంచివేయు ఋణభారము లెట్లుతగ్గునాయని వారు పరితపించుచుండిరి. చట్టములలో గొప్పమార్పులు కలుగుననియు, స్వరాజ్యము చాలవరకు రాగలదనియు, క్రొత్త యుద్యోగము లనేకముల కాస్పదముండుటచే తమస్థితి బాగుపడగలదనియు మధ్య తరగతి వారాశించుచుండిరి. రాజకీయాందోళన చట్టసమ్మతము, శాంతియుతముగ నుండెను. స్వయంనిర్ణయ, స్వపరిపాలనములనుగురించి ప్రజలు సమ్మకముగా చెప్పుకొనుచుండిరి. ఈయసంతృప్తి కొంత జన సామాన్యములో, ముఖ్యముగా రైతులలోకూడ నుండెను. సైన్యములోనికి ప్రజలను బలవంతముగా చేర్చుపద్ధతిని పంజాబు గ్రామాదులలోని ప్రజలింకను మఱచిపోలేదు. 'కొమగిటమారు' లోనివారిని, తదితరులను కుట్రచేసిరను నేరముల నారోపించి యణచివేయుట యగ్నిహోత్రములో నాజ్యము పోసినట్లయ్యెను. అనేక యుద్ధరంగములలో పనిచేసివచ్చిన యుద్ధభటులు వెనుకటివలె మేథకులుగనుండక బుద్ధి వికాసము కలిగియుండుటచే నసంతృప్తినుండిరి.

టర్కీ, ఖిలాఫతు సమస్యల సందర్భములో మహమ్మదీయులకు కోపముకలిగి యాందోళన హెచ్చుచుండెను. టర్కీతో నింకను సంధి జరుగలేదు. కాని స్థితిగతులు చెడుచున్నవి.

ఒకప్రక్క యాశ మఱియొకవంక ఆదుర్దా, భయము ముప్పిరి గొనియుండ భారతదేశమంతయు పరిస్థితులను నిరీక్షించుచుండెను. ఇట్టి స్థితిలో చట్టప్రకారము జరుపవలసిన తతంగములు, నిరోధములు నక్కరలేకుండగనే అరెస్టుచేసి శిక్షించుట కన్ని జబర్దస్తీయవకాశము లునుగల రౌలటుబిల్లులు తయారయ్యెను. భారతదేశమంతయు నొక్కపెట్టున వీటినెదిర్చెను; మితవాదులు కూడ తమ యావచ్ఛక్తిని వీని యోగించిరి. హిందూదేశములో నీ యాపక్షమును భేదములేకుండ నందరును సముదులు గట్టిరి. అయినను ప్రభుత్వసభ్యుల యామోదముతో నివి చట్టముగా చేయబడెను. ఇవి మూడేండ్లవఱకు మాత్రమే వర్తించునని బుజ్జగించిరి. ఇవి చట్టములయ్యెను. కాని, నాకు తెలిసినంతవఱకు, నీమూడేండ్లలో నొక్కసారియైనను వీని నుపయోగించలేదు. ఈమూడేండ్లు నెంతమాత్రము చల్లనివత్సరములుకావు. 1857 తరువాత హిందూదేశ మెపుడును యిట్టి సంకటదినములను చూచియెరుగదు.

మఱియొక ముఖ్యవిషయము. నేను, పదిహేనుసంవత్సరములైన తరువాత, రౌలటుబిల్లులకంటెను కఠినతరములైన క్రొత్తచట్టము లెన్నియో మనకు ప్రసాదింపబడినవి. ఏక్రొత్తచట్టముల క్రిందను ఆర్డినెన్సులక్రిందను బ్రిటిషుప్రభుత్వ సంపదలను, ఆశీర్వాదములను మన మింతగా ననుభవించుచుంటిమో యట్టివీటితో పోల్చిచూచినచో నాటి రౌలటుబిల్లులను మనము స్వాతంత్ర్యపట్టాగా భావింపవచ్చును. కాని యీభేదము మాత్రమున్నది. 1919 లగాయితు మాంటేగుచెమ్సుఫర్డు ప్రణాళికయను, స్వపరిపాలనయని పిలువబడు, గొప్పమోతాదు మనకు ప్రసాదింపబడెను! ఇప్పుడు మనకు మఱియొక మోతాదు రానున్నదట! ఇట్లు మన మభివృద్ధి పొందుచున్నాము.

1919 ప్రారంభమున గాంధీజీ చాలా జబ్బుపడి క్రొంచె మించుమించు మంచముమీదనుండియే రౌలటుబిల్లుకు తనయంగీకారమునీయు

వలదని రాజప్రతినిధిని వేడుకొనెను. తక్కిన విన్నపములను త్రోసివేసి నట్లే దీనినికూడ త్రోసివేయుటచే, తనకిష్టములేకున్నను, గాంధీజీ యఖిలభారత యాందోళనమును లేవదీసెను. అతడు సత్యాగ్రహ సభను స్థాపించెను. దానిలోనిసభ్యులు రౌలటుచట్టములను, (వారిమీద ప్రయోగింపబడినపుడు) అప్పుడపుడు నిర్ణయింపబడు యితరయన్యాయ చట్టములను నుల్లంఘించుటకు ప్రమాణము చేతురు. అనగా వారు బుద్ధిపూర్వకముగను, బహిరంగముగను జయిలును వరించవలెను. వార్తాపత్రికలలో నేనీతీర్మానమును మొదటచదివినపు డుత్సాహ భరితుడ నైతిని; చిట్టచివర కంధకారముతొలగి కార్యకారియగుమార్గము, బహిరంగమైన ప్రత్యక్షపద్ధతియొకటి దొరికెను కదాయని యుప్పొంగితిని. నేను వెంటనే సత్యాగ్రహసభలో జేరకోరితిని. చట్టములను ధిక్కరించుట జయిళ్లకు పోవుట మొదలగు తత్ఫలితములు నాబుర్రలోనికి రాలేదు. వచ్చెనో నేనువాటిని లెక్కచేయలేదు. కాని యింతలో హఠాత్తుగా నాయుత్సాహమంతయు నొక్కసారి చల్లబడెను. మాతండ్రి దీనికి కేవలము వ్యతిరేకి. అతడొక క్రొత్తపద్ధతిని త్రొక్కునపుడు తత్ఫలితముల నన్నింటిని పూర్తిగా యోజించికాని చేయడు. సత్యాగ్రహ సభనుగురించి యోజించినకొలది దానికతడు మరింత విముఖుడగుచుండెను. కొంతమందివ్యక్తులు జయిళ్ళకు పోయినంతమాత్రమున లాభమేమి? అది ప్రభుత్వముపై నెట్టివత్తిడిని కలిగించగలదు? ఈసందేహములిట్లుండ ముఖ్యముగా స్వవిషయమే యతనినెక్కువగా బాధించెను. నేను జయిలుకుపోవుట బుద్ధితక్కువ పనియని యతడనుకొనెను. అప్పటికి జయిలుయాత్రలింకను ప్రారంభముకాలేదు. తండ్రిగారికి తన బిడ్డలయెడల నత్యంత ప్రేమ. ఆప్రేమ పైకికాన్పించక నిగూఢముగ నుండును.

చాలకాల మీమానసిక పోరాటము మాలో జరుగుచుండెను. ఇది సామాన్యవిషయముకాదు. సమస్తమును తారుమారుచేయు విష

యము కనుక మేమొకరికొకరము నొప్పికలిగించకుండ జాగ్రత్తగనే సంచరించుచుంటిమి. తండ్రిగారిబాధను తగ్గింపవలెనని నాకుండెను. కాని నేను సత్యాగ్రహమును విడువజాల నయ్యెను. మేమిరువురమును బాధ పడుచునేయుంటిమి. నిశీథములందు నేనొంటరిగా మనఃఖేదము నొందుచు తెన్నుగానక తచ్చాడుచుండెడివాడను. తండ్రిగారు (తరువాత తెలిసి కొంటిని.) నేను జయిలుకు పోవుచో నాగతి యెట్లుండునో చూచుటకని స్వాయముగా కటికినేలమీద పడుకొని చూచెను.

తండ్రిగారి యాహ్వానముపై గాంధిజీ అలహాబాదు వచ్చెను. వారిరువురు నేను లేకుండ చాల దీర్ఘసంభాషణలను జరుపుకొనుచుండెడి వారు. చివరకు తండ్రిగారికి మనోవ్యాకులతను కలిగింపవలదనియు, తొందరపడవలదనియు, గాంధిజీ నాకు సలహా యిచ్చెను. ఇది నాకు విచారకరముగ నుండెను. ఇంతలో దేశములో నూతన సమస్య యేర్పడు టచే పరిస్థితులన్నియు మారి సత్యాగ్రహము విరమింపబడెను.

సత్యాగ్రహదినము; యావద్భారత హర్తాళములు; వ్యాపార మంతయు పూర్తిగా కట్టివేయుబడుట. ఢిల్లీ, అమృతసరములలో పోలీసు లును, మిలిటరీయును తుపాకులను కాల్చుట. చాలమంది హతులగుట- అమృతసరము, అలహాబాదులో మూకలు దౌర్జన్యము చేయుట. జలియను వాలాభాగులో మానవహననకర్మ. పంజాబులో సైనిక శాసన భయంకర ప్రదర్శనము. పంజాబు యావద్భారతేమునుండియు వేరుచేయబడుట; కోసివేయబడుట; ఇతర కన్నులు చూడకుండ నొక గొప్పతెర దానిని కప్పివేయుట, దాచిచేయుట; వార్తలన్నియు నరికట్ట బడుట-ప్రజలచ్చటకు పోకూడదు; అచ్చటనుండి రాకూడదు. ఇట్టినరకము తయారయ్యెను. ఆనరకమును తప్పించుకొనివచ్చిన కొందరు వ్యక్తులు భయభ్రాంతులై నోట మాటరాక, యథార్థములను చెప్పజాలకుండిరి. అసహాయులమై యశక్తులమై బయటనున్న మేము వార్తలకెదురు చూచు

చుంటిమి. మాహృదయములు ఖేదభరితములై యుండెను. సైనిక శాసనములను ధిక్కరించి పంజాబులో బాధపడుచున్న ప్రాంతములకు బహిరంగముగా పోవలెనని మాలో కొందరమనుకొంటిమి. కాని మేము వారింపబడితిమి. ఇంతలో బాధితులకు సహాయము చేయుటకును పరిస్థితులను తెలిసికొనుటకును కాంగ్రెసువారపు పని ప్రారంభింపబడెను.

సైనికశాసనములను తగ్గించుటతోడనే కాంగ్రెసు ప్రముఖులును, తదితరులును పంజాబులోనికురికిరి. సహాయకశాఖను పండిత మదనమోహనమాలవ్య, స్వామి శ్రద్ధానందగార్లు నడిపిరి. గాంధీజీ సలహా, సంప్రతింపులతో మాతండ్రిగారును, చిత్తరంజనదాసుగారును పరిశోధనశాఖను నడిపిరి. దేశబంధుదాసు ముఖ్యముగా అమృతసర ప్రాంతమును తీసికొనెను. అతనిసహాయార్థము నేనచటకు పంపబడితిని. అతనితోను, అతనిక్రిందను పనిచేయుటకు నాకదియే ప్రథమము. ఇది నాకమూల్యమైన యనుభవమునిచ్చెను. నాకతనియెడల గౌరవము హెచ్చెను. జలియను వాలాభాగుకును, మానవులను పొట్టలమీద ప్రాకించిన యాభయంకరమైన సందుకును సంబంధించిన (కాంగ్రెసు పరిశోధనా నివేదికలో కాన్పించు) సాక్ష్యమంతయు మాయెదుటనే తీసికొనబడెను. మేము స్వయముగా ననేకసారులాతోటకు పోయి ప్రతిచిన్న విషయమును కూలంకషముగా పరిశోధించితిమి.

ఆతోటకింకను మరికొన్ని మార్గము లున్నవను యుద్దేశ్యముతో డయరుసేనాని యంతసేపు కాల్చెనని యెడ్వర్డుథామ్సన్‌గారు సూచించిరి. అదియే డయరుయుద్దేశ్యమైనను (కొన్ని మార్గములున్నమాట నిజమే) నతని బాధ్యత యంతమాత్రముచే తొలగిపోలేదు. అట్టి యుద్దేశ్య మతని కుండుట కేవలము హాస్యాస్పదము. అతడు నిలచి యున్న యెత్తైన చోటునుండి చూచినచో నెవరికైననాప్రదేశమంతయు చక్కగా కాన్పించి యనేక యంతస్తులు గల మేడలచే నదియెట్లు

మూయబడియున్నదో తెలియగలదు. ఒకప్రక్కమాత్రము నూరు గజములవఱకు నయిదడుగుల యెత్తుగల గోడయుండెను. జాజ్వల్యమాన మైనదవానలము తెమ్ముదహించి వేయుచుండ, తెన్నుగానక వేలకొలది జనులీగోడవైపు కుఱుకు లెత్తుకొనుచు వచ్చి గోడనెక్కి పారిపోవుటకు ప్రయత్నించుచుండ పారిపోకుండ జ్వాలలప్పుడీ గోడమీదకు (ప్రమాణ సాక్ష్యముల వలనను గోడమీదనున్న యసంఖ్యాకములైన గుండ్లచి హ్నముల వలనను కాన్పించుచునే యున్నది.) పంపబడెను. అంతయు ముగిసిన తరువాత దెబ్బలు తగిలినవారియొక్కయు శవములయొక్కయు పెద్దగుట్ట లీగోడల కిరుప్రక్కలను పడియుండెను.

1919 అంతమున నొకరాత్రి బండిలో నే నమృతసరమునుండి ఢిల్లీకిపోవుచుంటిని. నే నెక్కినపెట్టెలో పైన నొక్కస్థానము తప్ప తక్కినవన్నియు నిద్రించుచున్న బాటసారులతో నిండియుండుటచే నేనాస్థానము నాక్రమించితిని. నాతోడి బాటసారులందరును సైనికో ద్యోగులని నేను ప్రాతఃకాలమున తెలిసికొంటిని. వారు పెద్దగొంతు కలతో సంభాషించుకొనుచుండ నవి నా చెవులబడుచుండెను. వారిలో నొకడు విజయస్వనముతో గంభీరముగా మాట్లాడుచుండెను. అతడే డయరు. జలియనువాలాభాగు వీరుడు. అతడు తనయమృతసరపుటనుభవ మును వర్ణించుచుండెను. పట్టణమంతయు నితనిదయకు పాత్రమైయుండె ననియు తిరుగబడినయాపట్టణమును బూడిదపాలుచేయ సమకట్టితినిగాని దానిమీదదయతలచివిడిచివేసితిననియు నతడుచెప్పుచుండెను. హంటరు కమిటీయెదుట సాక్ష్యమిచ్చి యతడు తిరిగి వచ్చుచుండెను. అతని సంభాషణయు, నిర్లక్ష్యమును నాకాశ్చర్యమును కలిగించెను. గోధుమ వన్నె చాఱలుగలిగిన పయిజామాలతోను, వదులుగానుండిన గౌను తోను నతడు ఠీవిగా ఢిల్లీస్టేషనులో దిగెను.

పంజాబుపరిశోధనా కాలములో నేనుగాంధీజీని యెక్కుడుగా చూచితిని. అతనిసలహాలు మాకమిటీకి వింతగా కాన్పించుటచే

మేమూమోదించెడివారము కాము. కాని యతడెల్లప్పుడును తనవాదమును సహేతుకముగా నిలుపుకొని నమ్మొప్పించెడివాడు.తరువాత జరిగిన హాంశము లతని సలహాలలోనున్న బుద్ధివివేకములను చాటెను. అతని రాజకీయ పరిజ్ఞానములో నాకు విశ్వాస మంతకంతకు హెచ్చజొచ్చెను.

పంజాబుదురంతములును, పరిశోధనలును తండ్రిగారిని మార్చివేసెను. అతని న్యాయ, చట్టసంబంధమైన పునాదులు మొదలంట కూలిపోయి మరియొక సంవత్సరములో రానున్న మార్పు కతనిమనసు తయారగుచుండెను. అతడు తనమితవాదస్థితినుండి చాలదూరము నడచెను. మితవాదపత్రికయైన 'లీడరు' పత్రికతో నసంతృప్తిచెంది అతడు 1919 లో 'ఇండిపెండెంటు' పత్రికను స్థాపించెను. ఇది చాల జయప్రదముగ నడిచెను. కాని మొదటినుండియు పెత్తనములో చాలకొఱవడియుండెను. పెత్తందారు లందరును డైరెక్టర్లు, పత్రికాధిపతులు, మేనేజర్లు దీనికిబాధ్యులు. నేనుకూడ (ఎట్టియనుభవమును లేనివాడను) నొక డైరెక్టరును. పత్రిక తగాదాలును, పేచీలును నన్ను చికాకుపరచెను. నేనును మాతండ్రియు పంజాబుకు పోయినపుడు మా చిరకాలాభావమువలన నదిపసచెడి ధనలోపముచే కొట్టుకొనుచుండెను. అది మరెప్పుడును కోలుకొనలేదు. మేము జయిలుకు వెళ్లుటతోడనే యది ఛిన్నభిన్నమై చివరకు 1923 లో నంతరించెను. 1919 క్రిస్టమసులో తండ్రిగారు అమృతసరు కాంగ్రెసు కధ్యక్షుడయ్యెను. సైనిక శాసన భీభత్సమువలన నూతనపరిస్థితు లేర్పడుటచే తామీ మహాసభలో జేరవలెనని యతడు మితవాద శిఖామణులను (ఇప్పుడు లిబరలు పక్షమయ్యెను.) హెచ్చరించెను. "విదళిత పంజాబు హృదయము" మిమ్మాహ్వానించుచున్నది. అని యతడువారికి వ్రాసెను. వారా యాహ్వానము నాదరింపలేదు. వారికన్నులు మాంటేగుఛేమ్సుఫర్డుసంస్క-

రణముల మీద పడెను. ఈ తిరస్కారమువలన తండ్రిగారికిని వారికిని మరింత దూరమయ్యెను.

అమృతసరు కాంగ్రెసు మొట్టమొదటి గాంధికాంగ్రెసు. లోకమాన్య తిలకు కూడ చర్చలలో ముఖ్యపాత్రను ధరించెను. కాని హెచ్చుమంది ప్రతినిధులును బయటనున్న జనసమూహములును గాంధి నాయకత్వము కొఱకే చూచుచుండిరి. 'మహాత్మాగాంధీకిజై' యను శంఖారావము భారతరాజకీయాకాశమున మారుమ్రోగ నారంభించెను. ప్రవాసమునుండి క్రొత్తగా విడుదలబడిన అలీసోదరులు కాంగ్రెసులో జేరిరి. జాతీయోద్యమమున కొక క్రొత్తరూపము క్రొత్తవికాసము కలిగెను.

మహమ్మదాలీ ఖిలాఫతుకొరకై యూరప్పువెళ్లెను. హిందూదేశములో ఖిలాఫతుకమిటీ యంతకంతకు గాంధీజీ పలుకుబడిక్రిందకు వచ్చి యతని ఉద్యోగరహిత సహాయనిరాకరణభావములతో విస్తృతము నొంద నారంభించెను. ఖిలాఫతునాయకులు మౌల్వీలు, ఉలేమాలు 1920 జనవరిలో ఢిల్లీలో జరిపిన మొట్టమొదటిసభలలో నొకటి నాకింకను జ్ఞాపకమున్నది. ఒకఖిలాఫతు రాయబారము వైస్రాయిగారివద్దకు పోవుచుండెను. గాంధిజీ దానితోపోవలసియుండెను. అతడుఢిల్లీకి వెళ్లులోపల వైస్రాయికి రాయబారముయొక్క చిత్తుమసాయిదా ముందుగా (ఆచారముప్రకారము) పంపబడెను.

గాంధిజీవెళ్లి యామసాయిదాచదివి దానినంతమాత్రము సంగీకరింపక దానిలో ముఖ్యమైనమార్పులను చేసినగాని తానుదానితో సంబంధము పెట్టుకొనజాలనని చెప్పెను. అందులో నేమియునిర్ధారణ చేయబడలేదనియు, నదిపదజాలముతో నిండియున్నదనియు, మహమ్మదీయులకు కావలసిన కనీసమేదియో స్పష్టముగా, నిస్సందేహముగా నుదహరింపబడవలెననియు, దాని కొఱకు ప్రాణములనైన సర్పింప

సిద్ధముగా నుండవలెననియు నతడు చెప్పెను. ఈచిత్తు తమకుగాని, ప్రజలకుగాని, వైస్రాయికిగాని బ్రిటిషుప్రభుత్వముకుగాని తగియుండలేదని యతడు స్పష్టపరచెను. వారికి దానియందు పట్టుదలయే యున్నచో నది యొక్కటే సరియైన గౌరవమార్గము.

హిందూదేశములో నిష్టవాద మనవారికి రాజకీయములలో గాని, మరేశాఖలోగాని క్రొత్త; కనినిని మొలుగనిది. మనము తీక్ష్ణమైన యుత్ప్రేక్షలకు నలవాటుపడితిమి. బేరము చేయుట యనునది మనకు సహజమైపోయెను. చివరకు గాంధిజీవాద మంగీకరింప బడెను.

ముసాయిదాలోనున్న లోపములను, నిర్ధారణ లేకపోవుటను సూచించుచు దానికి చేర్చుకొనవలసినవని కొన్ని పేరాలను వ్రాసి యతడు వైస్రాయిగారి యాంతరంగిక కార్యదర్శికి పంపెను. ఈ చివర పేరాలలో కనీసపుకోర్కెలు వివరింపబడెను. వైస్రాయిగారి జవాబు చిత్రముగా నుండెను. అతడీచివరి పేరాలను తోసివేసి మొదటి ముసాయిదాయే తన యభిప్రాయములో, చాల యుక్తముగనున్నదని సెలవిచ్చెను. ఈ వ్రాత ప్రతివ్రాతలవలన నసలు స్థితియు, ఖిలాఫతుకమిటీ స్థితియు స్పష్టమయినదని గాంధిజీ చివరకీరాయబారములో చేరెను.

ప్రభుత్వము ఖిలాఫతుకోర్కెలను తీర్చునది కాదనియు, పోరాటము తప్పదనియు కాన్పించుచునే యుండెను. మాల్వీలతోను ఉత్రేషూలతోను దీర్ఘసంభాషణలు జరిగెను. సహాయ నిరాకరణమును గురించి ముఖ్యముగా దౌర్జన్యరాహిత్యమును గురించి చర్చలు జరుగుచుండెను. దౌర్జన్య రాహిత్యమును సంపూర్ణముగా నొప్పుకొనినచో నాకు యాజ్ఞలకు ఒడ్డుగుదునని గాంధీజీ స్పష్టపరచెను. ఈ విషయములో నేనుపూర్వమును చెప్పనక్కరలేదు; మాత్రదనముకనను, దాపరికము (మానసికమైన) నకును తావులేదు. మాల్వీలు యీభా

వము నర్థము చేసుకొనుట తేలికయైన విషయముకాదు. దాని నొక మతము (న్యాయమైన విషయములో వారిమతము దౌర్జన్యమును నిషేధించదు) క్రిందగాక రాజకీయ యెత్తుగా నంగీకరించెదమని స్పష్టపరచి వ్రాయుదాని కొప్పుకొనిరి.

1920 లో ఖిలాఫతు రాజకీయోద్యమములు రెండును సమముగా నభివృద్ధియై కాంగ్రెసు గాంధిజీయొక్క దౌర్జన్యరహిత సహాయ నిరాకరణము నవలంబించుటతో నవి రెండును చేతులు కలిపెను. ఖిలాఫతు కమిటీ మొట్టమొదట నీపద్ధతి కంగీకరించెను. ఉద్యమమును ప్రారంభించుటకు ఆగష్టు మొదటి తేదీ స్థిరపరుపబడెను.

దీనినిగూర్చి యోచించుట కింతకుపూర్వమే అలహాబాదులో నొకసభ సయ్యదురజాఆలీ గారియింట జరిగెను. మహమ్మదాలీగారింకను యూరపులోనే యుండిరి. కాని షౌకతాలీగారు సభలోనే యుండిరి. ఈసభ పూర్తిగా నాకాశాభంగమును కలిగించెను కనుక నాకు జ్ఞాపకము. షౌకతాలీ యుత్సాహముగనే యుండెను. కాని కొంచెమించుమించు తక్కినవారందరును సుఖులుగాలేరు. వ్యతిరేకాభిప్రాయమును చెప్పుటకు వారికి ధైర్యములేదు. కాని సాహసమైన పనిచేయుటకు వారికుద్దేశ్యమునులేదు. వీరా విప్లవోద్యమమును నడిపించు మొనగాండ్రు? బ్రిటిషుసామ్రాజ్యమును ధిక్కరించు జగజెట్టీలు? అని నేననుకొంటిని. గాంధిజీ యుపన్యసించిన తరువాత వారు మరింతవణక నారంభించిరి. అతడు తన యుక్తము శాసకధోరణిలో మాట్లాడెను. అతనిలో వినయముట్టిపడుచుండెను. కాని యతడు స్పష్టముగను వజ్రకాఠిన్యముగను మాట్లాడుచుండెను; భాషమృదువుగను, మెత్తగనునుండెను. కాని వంచుటకును, విరుచుటకును వీలులేకుండగను ఆవేశభరితముగను నుండెను. అతని నేత్రములు సాధువుగను గంభీరముగనునుండెను, కాని వాటినుండి భయంకర నిశ్చయ శక్తులు రాజు

చుండెను. అత్యంత శక్తివంతుడైన శత్రువుతో నిదియొక గొప్ప పోరాటము కానున్నది. మీరు దీనికి పూనుకొనదలచుచో సమస్తమును పోగొట్టుకొనుటకు సిద్ధముకావలెను. సంపూర్ణమైన దౌర్జన్యరాహిత్యమును, శిక్షను పూనవలెను. యుద్ధము ప్రకటింపబడినతోడనే సైనిక శాసన మమలులోనికి వచ్చును. మన దౌర్జన్యరహిత పోరాటములో మనకుజయము చేకూరవలెనన్న మన ప్రక్కకూడ డిక్టేటరులును సైనికాధికారులును నుండవలెను. కాని యాడిక్టేటరుపదవి మీయభీష్టము మీదను మీయంగీకారము మీదను, మీసహాయసంపత్తుల మీదను నాధారపడియుండును. మీకు నాయెడల వెగటుకలిగినచో మీరు నన్ను త్రోసివేయవచ్చును. త్రొక్కివేయవచ్చును. నేనందులకెంతమాత్రమును మిమ్ము నిందించెడివాడకాను. ఈయర్థము వచ్చునట్లతడు మాట్లాడెను. ఈసైనికోదాహరణములును నతనియప్రతిహతశ్రద్ధయు చాలమంది శ్రోతల గుండెలలో రాయి పడినట్లయ్యెను. కాని షౌకతాలీగారచ్చటనే యుండి సందేహమనస్కులను హుషారుపరచెను. వోటింగు సమయము వచ్చినప్పుడత్యధికసంఖ్యాకులు మెల్లగా, సిగ్గుపడుచు తీర్మానమున కంగీకారముగా, ననగా యుద్ధమునకే వోటుచేసిరి.

మహాసంగ్రామమును ప్రారంభించుటకు మార్గమిదియేనా? యని (మేము సభనుండి యింటికి తిరిగివచ్చునపుడు) నేను గాంధిజీ నడిగితిని. సభలో నపరిమితోత్సాహము, నిప్పులను కురిపించుభాష కన్నుల నెఱ్ఱజేయుట మొదలగునవి యుండునని నేననుకొంటిని. దీనికిబదులు నడివయసు పిరికిసమూహమచ్చట నాకుప్రత్యక్షమయ్యెను. అయిననువీరు (ప్రజాభిప్రాయ మంతబలముగ నుండెను.) పోరాటమునకే వోటు చేసిరి. ముస్లీములీగులోని యీ సభ్యులలో చాలాకొద్దిమంది మాత్రమే తరువాత జరిగిన పోరాటములో జేరిరి. ఈ వీరులలో చాలమంది ప్రభుత్వపదవులలో సురక్షితముగా జేరుకొనిరి. అప్పుడుగాని తరువాతగాని

యీ ముస్లింలీగు హెచ్చుమంది మహమ్మదీయుల యభిప్రాయముకు ప్రాతినిధ్యమును వహించలేదు. 1920 లోని ఖిలాఫతుకమిటీయే వీరి యథార్థమైన ప్రతినిధి. ఇది యుత్సాహముతో పోరాటములోని కురికెను.

కాంగ్రెసులో తీర్మానమింకను కాకపోయినను గాంధిజీ అగస్టు 1 వ తేదీని సహాయనిరాకరణమును ప్రారంభింప తలపెట్టెను. ఆ రోజుననే బొంబాయిలో లోకమాన్యతిలకు చనిపోయెను. ఆ యుదయముననే గాంధిజీ సింధుదేశము తిరిగి బొంబాయి చేరెను. నేనతనితో నుంటిని.

బొంబాయిలో తామెంతయో ప్రేమించిన మహానాయకుని గౌరవింప పదిలక్షలమంది జనము పాల్గొనిన యీ మహోత్సవములో మేముకూడ నుంటిమి.

---

౮

# నా బహిష్కార ప్రవాసము.



నా రాజకీయములు నా జాతికి, భూస్వామ్యజాతికి, చెంది యుండెను. అప్పుడు మధ్యతరగతులవారివే (చాలవరకిప్పుడును) నోరుగల రాజకీయములు. మితవాదులును, అతివాదులును కూడ వారిప్రతినిధులే. వీరు హెచ్చుతగ్గు స్థాయిలలో వారియభివృద్ధినే కోరిరి. మొత్తముమీద బ్రిటిషుపరిపాలనక్రింద బాగుపడి యేమార్పుకలిగిన తమప్రస్తుత స్థితియు, ప్రయోజనములును చెడిపోవునోయని భయపడు చున్న కొద్దిమంది మధ్యతరగతి వారికి మాత్రమే యీమితవాది ప్రతినిధి యగుచున్నాడు. బ్రిటిషుప్రభుత్వముతోను పెద్దజమీందారీ తరగతులతోను వీనికి సన్నిహిత సంబంధము కలదు. అతివాది మధ్యతరగతులలో క్రిందితరహావారి ప్రతినిధి. యంత్రపరిశ్రామిక కూలీలు (యుద్ధములో వీరిసంఖ్య హెచ్చెను.) కొద్దికోట్లమాత్రమే స్థానికముగానుండిరి. వీరికి పలుకుబడి తక్కువ. రయితాంగము దారి తెన్నుకానక దారిద్ర్యముచే పీడింపబడుచు, ననేకవెతలనొందుచు, దుఃఖభాజకమైన తమవిధికి విడువబడి ప్రభుత్వము, జమీందార్లు వడ్డీవ్యాపారస్తులు చిన్నప్రభుత్వోద్యోగులు, పోలీసులు, లాయర్లు పురోహితులు, వీరువారననేల వారిదగ్గరకు చేరు అడ్డమైనవారిచేతను, త్రొక్కబడి, దోచుకొనబడు అంధప్రజ. వార్తాపత్రికలను చదువు చదువరి హిందూదేశములో కోట్లకొలది కర్షకులు లక్షలకొలది కార్మికులు నున్నసంగతికాని, వారికెట్టి ప్రాధాన్యతయు నున్నసంగతిగాని యూహింపజాలడు. బ్రిటిషు వారి యాధిపత్యముననున్న ఆంగ్లోయిండియను పత్రికలు పెద్దయుద్యోగస్తుల కేళీవిలాసములతో నిండియుండును; పెద్ద పట్టణములలోను పర్వత సీమలలోను నుండు యింగ్లీషువారి సాంఘిక జీవితము, వారి

విందులు, వారిభోగవిలాసములు సుకుమారదుస్తులు, నాటకాదులు, సవిస్తరముగా వర్ణించబడును. భారతరాజకీయములు (భారతీయులదృక్పథమునుంచి) పూర్తిగా విడచివేయబడెను; కాంగ్రెస సభలను గురించికూడ నేకొద్దిపంక్తులనో, యేవెనుక పేజిలోనో గిలకరింతురు. ఏభారతీయుడో (ఊరుపేరుగలవాడుకాని లేనివాడుకాని) కాంగ్రెసును తిట్టుటయు విమర్శించుటయు బ్రహ్మాండమైన వార్తయగును; అప్పుడప్పు డేసమ్మెకట్టును గురించియో పెద్దగా పడును. దొమ్మిజరిగినప్పుడే దే పత్రికేమహాసో తత్వాలున ప్రాముఖ్యాన వహించును. భారతపత్రికలును ఆంగ్లోయిండియను పత్రికలనే యనుకరింప ప్రయత్నించెను. కాని యవి జాతీయోద్యమము కెక్కువ ప్రాధాన్యత నిచ్చెను. తక్కినదంతేయు భారతీయులకు వచ్చు పెద్ద యుద్యోగములతోను చిన్న యుద్యోగములతోను వారిప్రమోషనులతోను బదిలీలతోను (ముఖ్యముగా వెళ్ళిపోవుచున్న) యుద్యోగస్థుని కొరకు చేయబడు విందులతోను, అప్పుడు "గొప్పయుత్సాహము వెల్లువ యగుట" తోను నిండి యుండును. ప్రభుత్వము వారేదైనాయొక ప్రాంతమునకో క్రొత్తతరముకట్టునప్పుడు (అట్టితరమెప్పుడును ప్రభుత్వాదాయమును పెంచును) భూస్వామందుకది నష్టముగనుక పెద్ద గోలచేయబడును. ఈ పటములో బీదరయితు యెచ్చటను మనకు కాన్పించడు. ఈ పత్రికలన్నియు భూస్వాములచేతను పెట్టుబడిదారులచేతను నడుపబడును. "జాతీయ ప్రెస్సు" అనునది యీవిధముగానుండెను. భూస్వాములహక్కును సంరక్షించుటకు (శాశ్వతతరము కట్టనిచోట) శాశ్వతతరమును కట్టవలెనని కాంగ్రెసు తనమొదటిసంవత్సరములలో నిరంతరము తీర్మానించుచుండెను. కాని రయితుసంగతి నెవరును తలపెట్టలేదు. జాతీయోద్యమమువలన నీయిరువదై సంవత్సరములలోను స్థితిగతులద్భుతముగా మారిపోయెను. ఇప్పుడు బ్రిటిషువారి యధీనములో నున్న పత్రికలుకూడ (తమభారత చదువరులను నిలుపు

కొనసవలెననిన) భారతరాజకీయ సమస్యలకు చోటిచ్చితీరవలెను. కాని వారు వాటిని తమయిచ్చవచ్చినట్లు వ్రాయుదురు. భారత పత్రికలు మరికొంత విశాలదృష్టిని చూపుచు కార్మికునిగురించి, రయితును గురించి మెహర్బానీగా (అదియొక ఫ్యాషనుకనుక) వ్రాయును. గ్రామ సీమలందును, పరిశ్రమలయందును కొద్దిశ్రద్ధ హెచ్చుచున్నను (వెనుకటి వలెనే యిప్పుడును) భారత పెట్టుబడిదారులయొక్కయు భూఖామందుల యొక్కయు ప్రయోజనములనే ముఖ్యముగా సమర్థించును. భారత జమీందారు లెందరో యీపత్రికలమీద పెట్టుబడిని పెట్టి తాము పెట్టిన దానికి తగిన లబ్ధిని పొందుచున్నారు. ఈపత్రికలను నడుపువారిలో చాలమంది కాంగ్రెసు సభ్యులుకూడ కాకపోయినను చాలపత్రికలు కాంగ్రెసు పత్రికలని పిలువబడుచున్నవి. ప్రజలలో కాంగ్రెసుకు చాల పలుకుబడి కలదు. కనుక వ్యక్తులును, సంఘములును దానిని తమ స్వార్థముకొరకుపయోగించుకొనుచున్నారు. కొంచెము హెచ్చు స్థాయిలో నడుపబడు పత్రికలెప్పుడును పెద్దపెద్ద జుల్మానాలకు భయపడుచుండ వలెను లేదా కఠినమైన ముద్రణ చట్టముక్రింద నణచివేయబడుననుభీతి.

1920 లో ఫ్యాక్టరీలలోగాని పొలములలోగాని యుండు కూలీల పరిస్థితులు నాకెంతమాత్రమును తెలియవు. కాని దేశములో విపరీతమైనదారిద్ర్య దుఃఖము లున్నవనియు, స్వాతంత్ర్యము వచ్చుటతోడనే మొట్టమొదట నీసమస్య నెదుర్కొనవలయుననియు నేనెరుగుదును. కాని మధ్యతరగతులవారి యధికారముతోగూడిన స్వేచ్ఛయే తరువాత సోపానమని నేననుకొంటిని. గాంధీజీ ఛాంపరాను కైరాలలో నడపిన కర్షకోద్యమముల తరువాత నేను రయితాంగ సమస్యలయందు మరికొంత శ్రద్ధవహించుచుంటిని. కాని 1920 లో నామనస్సు రాజకీయములందును రానున్న సహాయ నిరాకరణము నందును లగ్నమయ్యెను. అప్పుడే చిత్రముగా నా ప్రయత్నము యేమియు లేకుండ

రయితాంగముతో నాకు సంబంధము కలిగెను. నాతల్లియు నా భార్య కమలయు జబ్బుగా నుండుటచే నేను వారిని ముస్సోరి తీసుకొని వెళ్ళితిని. మాతండ్రి పెద్దకేసులో దాసుగారితో పోరుచుండెను. మేము ముస్సోరిలోని సెవాయి హోటలులోనుంటిమి. అప్పుడు అఫ్గను బ్రిటిషురాయబారుల మధ్య సంధి ప్రయత్నములు (అమానుల్లా రాజ్యమునకు వచ్చిన తరువాత 1919లో అఫ్గను యుద్ధముజరిగెను.) జరుగుచుండెను. ఆఫ్గనురాయబారులు ఆహోటలులోనే యుండిరి. కాని వారెవరితోను కలియకుండ ప్రత్యేకముగ భోజనాభాజనములను చేయుచుండిరి. వారి సంగతియే నాకేమియు తెలియదు. హఠాత్తుగా నొక సాయంకాలము పోలీసుసూపరింటెండెంటు వచ్చి నేనారాయబారి వర్గముతో నెట్టి సంభాషణలుగాని సంబంధములుగాని పెట్టుకొనకుండ వాగ్దానమియ్యవలసినదిగా ప్రభుత్వమానతి యిచ్చెనని హుకుమును నాకు జారీచేసెను. నేనాశ్చర్యపడితిని. నేనచ్చట నెలరోజులనుండి యున్నను వారినెవరిని చూచి యెరుగను. అట్లు చూచుట కవకాశములును లేవు. ఆ యధికారి రాయబారుల నెప్పుడును కాచియే యుండుటచే నతనికీసంగతి బాగుగా తెలియును. పైగా వందలకొలది గూఢచారులు విరామములేకుండ తిరుగుచునే యుండిరి. నేనేమియు వ్రాసి యిచ్చువాడను కానని యతనికి చెప్పితిని. చివరకు డేరాడూను జిల్లానుండి 24 గంటలలో వెళ్ళిపోవలెనని నన్నాజ్ఞాపించిరి. బాధపడుచున్న నా తల్లిని భార్యను వీడుటకు నాకిష్టములేకపోయెను. కాని యప్పుడు శాసనోల్లంఘనము లేకపోవుటచే నేను ముస్సోరి వీడితిని.

మాతండ్రి సర్ హార్ కోర్టు బట్లరు (గవర్నరు) గారిని బాగుగా నెరుగును. అతడాయన కొకజాబు వ్రాయుచు నిట్టి తెలివి తక్కువ యుత్తర్వు నతడిచ్చియుండడనియు, సిమ్లాలోని యేతెలివైన వ్యక్తియో యూహించి చేసియుండవచ్చుననియు వ్రాసెను. గవర్నరుగారు అది చాల

నిరుపద్రవకరమైనదనియు, నెట్టి గౌరవ భంగమును లేకుండ జవాహర్లాలు అట్లు చేయవచ్చుననియు బదులు వ్రాసెను. తండ్రిగారు దీని కంగీకరింపక (ఆజ్ఞను బుద్ధిపూర్వకముగా నుల్లంఘింపవలెనను నుద్దేశ్యము లేకపోయినను) నాతల్లికిగాని భార్యకుగాని వ్యాధి హెచ్చినచో నాజ్ఞయుండుగాక! లేకపోవుగాక! నేనచ్చటకు వెళ్ళి తీరెదనని తిరుగ జాబు వ్రాసెను. అట్లే మాతల్లి వ్యాధి హెచ్చుటచే మేమిరువురమును బయలుదేరితిమి. మేము ప్రయాణమగుటకు కొద్ది పూర్వము ఆజ్ఞరద్దయి నట్లు మాకుతంతివచ్చెను. మేము ముస్సోరీచేరినతోడనే హోటలువద్ద నాచిన్నబిడ్డ నెత్తుకొనిన యొకఆఫ్గనుని చూచితిని. అతడు ఆఫ్గను రాయబారులలో నొకడనియు, ఆఫ్గను మంత్రియనియు తెలిసికొంటిని. నేను బహిష్కరింపబడిన వార్తను ఆఫ్గనులు పత్రికలలో చదువుకొనిరి. నాటినుండి వారి ప్రధాని మాతల్లికి ప్రతిదినమొక గంపెడుపండ్లను, పువ్వులను పంపనారంభించెను.

తరువాత తండ్రిగారును నేనును నొకరిద్దరు రాయబారులను కలుసుకొంటిమి. వారుమమ్ము ఆఫ్గనిస్థానము రావలసినదని హృదయపూర్వకముగా నాహ్వానించిరి. కాని మేము పోజాలకపోతిమి. ఆదేశములో క్రొత్తప్రభుత్వముక్రింద నాయాహ్వానమింకను నిలిచియుండునో లేదో నాకు తెలియదు.

నాబహిష్కరణకాలములో నేను రెండువారములు అలహాబాదులో నుంటిని. ఈకాలములోనే నాకు కిసాను (రయితు) యుద్యమముతో జోక్యముకలిగెను. ఈసంబంధమే తరువాత పెద్ద దిట్టు నామానసిక దృష్టినెక్కువగా మార్చివేసెను.

అలహాబాదులోనున్న ప్రధాన రాజకీయవేత్తల దృష్టిని తమ దుష్కరదారిద్ర్యస్థితికాకర్షింపవలెనని ప్రతాపగరుజిల్లానుండి 200 మంది రైతులు 1920 జూన్ మండువేసవిలో 50 మైళ్ళదూరము నడచి

అలహాబాదువచ్చిరి. రామచంద్ర యనెడునతడు వారికి నాయకత్వము వహించెను. ఈకిసానులొక యమునానది ఘాటులో, నదియొడ్డున యెండలోకూర్చుని యున్నారని తెలిసి కొందరు స్నేహితులతో నేనచ్చటకు పోతిని. తాలూకుదారులు తమ్ముపెట్టు హింసలను, అవమానములను వివరించి, తమస్థితి యసహ్యముగానున్నదని వారు మొరపెట్టిరి. ఈపనిమీద వారు అలహాబాదువచ్చినందుకు వారిపై పగదీర్చుకొననుండిపడుచున్న తాలూకుదార్లనుండి రక్షించుటకును, తగిన పరిశోధన చేయుటకును మమ్ము రావలసినదని వారు వేడుకొనిరి. వారెట్టి యభ్యంతరములను వినరైరి! చివరకు రెండురోజులలో వత్తునని నేనువారికభయహస్తమిచ్చితిని. నేను మరికొంతమంది స్నేహితులను తీసికొని రైలుగాని, పక్కారోడ్లుగాని లేని యా మారుమూలగ్రామములలో మూడురోజులు వారితో గడిపితిని. అది నాకన్నులను తెరచెను. గ్రామసీమలన్నియు నుత్సాహముతోను, నుద్రేకముతోను పొంగుచుంటను మేముచూచితిమి. కాకిచే కబురంపుచో వేలకొలదిజనులు సమావేశమగుచుండిరి. ఒకగ్రామము మరియొకగ్రామముతో నంచెలమీదకబురులంపుచు గ్రామములు గ్రామములే కాళీయగుచు, పొలములు చేలగట్లు పుంతలు, సందుగొందులు జనాకీర్ణమై పెద్దలు పిన్నలు స్త్రీలు పురుషులు నేలయీనినట్లు సభాప్రదేశమునకు రాదొడంగిరి. వారికంటె ముందు సీతారామ్, సీతారామ్, రామ్‌రామ్‌యను రావములాకాశమునునింపుచు దశదిశల మారు మ్రోగుచుండ నామ్రోతలనువిని, చుట్టుపట్ల గ్రామములవారందరును పరుగుపరుగున వచ్చెడివారు. వారు, స్త్రీపురుషులు, చినుగుగుడ్డలను ధరించియుండిరి. వారు తమప్రేమను మాపై కురిపించి, మేమేదియో శుభవార్తలను తెచ్చితిమనియు, వారిని గట్టెక్కింపగల నాయకులమనియు గంపెడాశతో ప్రేమపురస్సరముగా మమ్మాదరించిరి. వారిని, వారిదుఃఖములను, వారియపారకృతజ్ఞతను చూచినపుడు లజ్జా, దుఃఖములు నన్నావరించెను. స్వాభోగభూయిష్ఠమైన సుఖజీవనమునకును

అర్ధనగ్నశరీరులై యనేకయిడుమలుపడుచున్న వేలకొలది భారతపుత్రి, పుత్రికామతల్లులను నిర్లక్ష్యముచేసిన పట్టణవాసపురాజకీయములకును సిగ్గిలితిని. హిందూదేశముయొక్క యధఃపతనమునకును, గర్భదారిద్ర్యమునకును విచారపడితిని. నాకండ్లయెదుట కట్టబట్టలేక, తినతిండిలేక నలిపివేయబడి దుఃఖాన్వితమైయున్న యొకనూతనభారతము కాన్పించెను. దూరస్థమైన పట్టణమునుండి తీరుబడిగాచూడవచ్చిన, మాయందు వారికిగలవిశ్వాసము నన్ను మరింత కలవరపరచెను. ఈ క్రొత్తబాధ్యతను వహించుట భయావహముగనుండెను. వారిని నలిపివేయుచు దినదినాభివృద్ధియగుచున్న పన్నులభారము, పొలములనుండి, మట్టిగుడిసెనుండి పారద్రోలుట, కొట్టుట, వారినన్నిప్రక్కలనుండియు భక్షించురాబందులు - జమీందారుయేజెంటులు, వడ్డీవ్యాపారస్థులు, పోలీసులు - పగలంతయు చెమటూడ్చికష్టించుట, చివరకువారపాటంతయు వారిదికాక వారికిమిగులునది తన్నులు, తిట్లు, కడుపుమంటలు- యిట్టి యసంఖ్యాకమగు . విషాదగాథలనెన్నింటినో వింటిని. అచ్చటకువచ్చినవారలో చాలమందికి సెంటుభూమియైననులేదు. వారిభూములు జమీందారులచే లాగివేయబడివారు కొంపలనుండి తరుమగొట్టబడిరి. భూమి సారవంతమైనది. కాని పన్నులభారమమితము. వారికున్న భూపరిమితులు తక్కువ. వాటికొరకు ప్రాకులాడువారెక్కువ. ఈ యవకాశమునుతీసికొని భూఖామందులు (లాప్రకారము పన్నులను హెచ్చించుటకువీలులేక) పెద్దపెద్ద యన్యాయ కప్పములను గుంజుదురు. రయితుకు మరొకమార్గములేక వడ్డీవ్యాపారస్థునియొద్ద ఋణముచేసి కప్పమును చెల్లించును. తరువాతఋణము కాని పన్నుకాని యిచ్చుకొనలేకపోవుటచే పొలము నుండి యింటినుండి లేవగొట్టబడును.

ఇట్లు చాల కాలము నుండియు జరుగుచు రయితు దరిద్రుడగుచుండెను. ఇట్టిస్థితిలో రామచంద్రబాబాయను నొక మహారాష్ట్రుడు ప్రజలను మేల్కొలిపెను. ఇతడు ఫిజీద్వీపులకు నిర్బంధకూలీగా వెళ్ళి

తిరిగి వచ్చి యీ ప్రాంతములలో తిరుగుచు తులసీదాసు రామాయణ కీర్తనలను పాడుచు రయితుల యిబ్బందులను వినుచుండెను. అతని కంత విద్యలేదు; కొంతవరకు తన స్వార్థముకొరకు వారి నుపయోగించు కొనెను. కాని యతడు ప్రజలను కూడ గట్టగల మంచి సమర్థుడు. తఱచు సభలలో కూడి తమ కష్టనిష్ఠూరములను చర్చించుకొనవలయునని యతడు రయితులకు బోధించి వారిలో సంఘీభావమును కలిగించెను. తఱచు పెద్దసభలు జరుగుచుండెడివి. ఇవి వారికి కొంత శక్తి నిచ్చెను. 'సీతారామ్' పురాతనము నుండి వచ్చుచున్న మామూలు కేకయే! కాని యతడు దానికొక యుద్ధ సాంప్రదాయమును కల్పించి యవసర సమయముల నుపయోగించు చిహ్నముగను వివిధగ్రామసీమలవారి నైక్యపరచు సంధానకరణిగను దాని నుపయోగించెను. ఫైజాబాదు ప్రతాపగరు రయిబెరిల్లీ జిల్లాలు (అయోధ్యరాజ్యములో నొక భాగము) సీతారాముల పురాణగాథలతో నిండియుండెను. తులసీదాసు హిందూ రామాయణము ప్రజల కభిమానగ్రంథము. చాలమంది ప్రజలకు దీనిలోని నందలకొలది పద్యములు కంఠోపాఠములు. రామచంద్ర బాబా సమయానుకూలముగా దీనిలోని పద్యములనుతీసి యుదహరించెడివాడు. అతడు రయితులను కొంతవరకు దిట్టపరచి వారికనేక లేనిపోని యాశలను కల్పించెను. అతనికొక ప్రణాళికలేదు. వారిలో మంచి యుద్రేకమును కలిగించి యతడుబాధ్యత నితరులకు విడిచివేసెడివాడు. అలహాబాదులో నున్నవారికీ యుద్యమముపట్ల శ్రద్ధకలిగించుటకతడంతమంది రయితులను తీసుకొనివచ్చెను.

మరి రెండుమూడు సంవత్సరము లతడీ యుద్యమములో ప్రధాన పాత్రను తీసుకొని రెండుమూడుసార్లు జయిలుకుకూడ పోయెను.

కాని తరువాత నతడు బాధ్యతలేనివాడై యపనమ్మకస్థుడయ్యెను. అయోధ్య వ్యవసాయి కాందోళన కన్నివిధముల తగి

యుండెను. అది "అయోధ్యప్రభువులము" అని తమంత తామేపిలుచు కొను తాలూకుదారులపుట్ట. ఇచ్చట అథమాధమమైన జమీందారీ పద్ధతి యుండెను. జమీందారులు పెట్టు బాధ లసహ్యములయ్యెను. భూమిలేని కూలిజనము హెచ్చజొచ్చెను. ఒక్కతరగతి రయితు మాత్రమే యుండుటచే వారికి సంఘీభావము కుదిరెను.

హిందూదేశమును రెండుభాగములుగా విభజింపవచ్చును. పెద్ద పెద్ద భూఖామందులున్న జమీందారీ ప్రాంతము. రయితువారీ ప్రాంతము. కాని యిందులో కొంత మిశ్రమము కూడ కలదు. బంగా ళము, బీహారు, సంయుక్తరాష్ట్రములు - యీ మూడును జమీందారీ ప్రాంతములు. రైతువారీ పద్ధతిలోని రైతు స్థితి (వారిస్థితి కూడ చాల విచారకరమేయైనను) యింతకంటె కొంచెము మెరుగు. పంజాబు, గుజ రాతులలో రైతు జమీందారీ ప్రాంతములలోని రైతుకంటె మంచి స్థితిలో నున్నాడు.

జమీందారీలలో ననేకరకముల రయితులున్నారు. ఆక్రమణ రైతు, అనాక్రమణరైతు, రైతుక్రిందరైతు. వీరిలో నొకరిప్రయోజ నములు మరియొకరి ప్రయోజనములతో భేదించుచుండుటచే కలయిక కుదరదు. 1920 లో అయోధ్యలో ఆక్రమణరైతులుకాని, యావజ్జీవ రైతులుకాని లేరు. కొద్దికాలపరిమితిగల రైతులే యుండుటచే నెక్కువశిస్తు కట్టుకొనువాడువచ్చినపుడెల్ల పాతవాడు గెంటివేయబడును. అయోధ్యలో నాచరణలో నీకొద్ది కాలపరిమితికూడ గడచువరకు నమ్మకములేదు. భూఖామందు తానుతీసికొను సొమ్ముకెప్పుడును రసీదు యివ్వడు. పన్నుయివ్వలేదను నెపముతో నతడు రైతును తొలగింప వచ్చును. రైతు రుజువుపరచుకొనుట కాస్కారముండదు. యీపన్ను కాక ననేకయన్యాయ 'తోడపాశము' లున్నవి. ఒకతాలూకాలో నిట్టివి 50 రకములున్నవని నేనువింటిని. ఇది యుత్ప్రేక్షకావచ్చును. కాని

తాలూకాదార్లు తమయిండ్లలోని పెండ్లిండ్లకు, విదేశములో కుమారుని చదువుకు, గవర్నరుగారికి లేక మరొక పెద్దదొరగారికి విందు, మోటారు లేక యేనుగును కొనుటకు యీయన్నింటికి డబ్బు గుంజుచుందురు. వీటికి ప్రత్యేక పేరులు మోట్రౌనా (మోటారు కొనుటకుపన్ను) హాథౌనా (ఏనుగును కొనుటకుపన్ను) కూడగలవు. కనుక నయోధ్యలో వ్యవసాయికాందోళన బయలు దేరుటలో నాశ్చర్యమేమియులేదు. నగరవాసులు రాజకీయ వేత్తలు మొదలగు వారి సహాయమెంతమాత్రమవసరములేకుండనిది దానంతటదియే ప్రబలుట నాకాశ్చర్యముగదోచెను. దీనికి కాంగ్రెసుతోగాని సహాయనిరాకరణముతోగాని సంబంధమేమియులేదు. ఈరెండు గొప్ప యుద్యమములకును మూలకారణ మొక్కటియే.

ఇట్టి బ్రహ్మాండమైన వ్యవసాయకోద్యమమును గురించి పట్టణవాసులకు కించిత్తైనను తెలియకపోవుటే నాకాశ్చర్యమును కలిగించెను. ఒక్క పత్రికలోగూడ దీనినిగురించి యొక్క పంక్తియైనను కానరాదయ్యెను. మన ప్రజలతో నెట్టిసంబంధమునులేక మనమొక చిన్న ప్రత్యేక ప్రపంచములో జీవించుచున్నట్లిదివరకెన్నడును గుర్తించనట్లు నేనిపుడు గుర్తింప గలిగితిని.

## ౯

## కిసానులమధ్య సంచారము.

నేను గ్రామములలో మూడురోజులుగడిపి అలహాబాదువెళ్ళి తిరిగివచ్చితిని. ఈమాసంచారములలో మేముగ్రామగ్రామమువెళ్ళి వారి మట్టిగుడిసెలలో నివసించుచు వారితో గంటలకొలది మాట్లాడుచు సభలను జరుపుచు చాలగ్రామసీమలను జూచితిమి. మామోటారు చిన్నపల్లెలకుపోవుటకు తగినబాటలులేకపోవుటచే ననేకమందిరైతులు రాత్రింబవళ్ళుపనిచేసి తాత్కాలికముగా మట్టిరోడ్లను తయారుచేసిరి. తఱచు మామోటారు అచ్చటచ్చట దిగిపోవుచుండెను. అప్పుడు వారత్యుత్సాహముతో దానిని భుజములమీదనెత్తికొని మోసెడివారు. అప్పటికిని చాలభాగము మేముకాలినడకనే వెళ్ళవలసివచ్చెను. ప్రతి చోటను మాకుపోలీసులు, గూఢచారులు, ఒకడిప్యూటీకలెక్టరు సిద్ధమగుచుండెడివారు. మేము పొలములను, చెలకలను, అడ్డపడిపోవుటచే వారుమాతో రాజాలక కటకటపడుచుండిరి. పాపమాడిప్యూటీకలెక్టరు లక్నోనుండివచ్చిన యొకసుకుమారబిడ్డ. అతడొక్కొక్కప్పుడు మావేగమును తగ్గించుమని ప్రార్థించుచుండెడివాడు. చివరకతడు మాతో రాజాలక మెల్లగాజారిపోయెను. అది జూన్ నెలయగుటచే సూర్యభగవానుడు ప్రచండకిరణములతో వెలుగొంచుచుండెను. నేనెప్పుడును అట్టి యెండలలోతిరుగకపోవుటయేగాక, యింగ్లండునుంచివచ్చినదిలగాయితు వేసవిలో నేపర్వతసీమలకో పోవుచుండెడివాడను. నేనిప్పుడు తలకొక చిన్నరుమాలుచుట్టి పగలంతయు తీవ్రమైనయెండలోతిరిగినను నాయావేశములో నాకట్టివేడియు తెలియకుండెను. నేనట్టియెండనైనను భరింపగలనని నాకెంతయోసంతోషము కలిగెను. ఎట్టిశీతోష్ణములనైనను భరింపగలుగుటచే నాకుజయిలులలోను, బయట పనిచేయునప్పుడును కూడ

కష్టమనునదిలేక నిర్విచారముగ సాగిపోవుచుండెడిది. నాశరీర మారోగ్య వంతముగ నుండుటయు, నేనెప్పుడును కసరతు చేయుచుండుటయు (మాతండ్రిగారినుండి నేను దీనిని నేర్చుకొంటిని.) దీనికిగారణములు. మా తండ్రితల నెరిసినను ఆలోచనలచే ముఖమున ముదిమియు, ముడుతలును కాన్పించినను తక్కినశరీర మంతయు (చనిపోవుట కొక సంవత్సరము వరకు) నంతకంటె నిరువది వత్సరములు చిన్నదిగనే యుండెను. నేను 1920 జూనులో ప్రతాపగరు వెళ్లుటకు పూర్వమునేకసారులు గ్రామములకువెళ్ళి అచ్చటనుండి రయితులతో మాట్లాడితిని; కుంభమేలములలో వేలకొలదిమందని గంగాతీరమునచూచితిని; గ్రామములలో హోమురూలు ప్రచారమును సలిపితిమి. కాని వారిస్థితినిగాని, భారతదేశమున వారికున్న ప్రాధాన్యతనుగాని నేనెన్నడును పూర్తిగా గుర్తించనైతిని. మనలో చాలమందివలె నేనును వారిని ఆషామాషీగా చూచితిని. ఈప్రతాపగరు సంచారములో నేను కండ్లను తెఱచితిని. నాటినుండి నాకెట్టెదుట కట్టగుడ్డలేక తినతిండిలేక కడుపుమంటతో మలమల మాడు భారతదేశమే కాన్పించును.

ఆరైతులు నాకున్న సిగ్గును పోగొట్టి బహిరంగ సభలలో మాట్లాడ నేర్పిరి. అంతకుమునుపు నేను బహిరంగ సభలలో నుపన్యసించలేదు; అందులో హిందూస్థానీ యనిన మరింత భయము. కాని నా కిప్పుడది తప్పినదికాదు. నేను వక్తను కాకపోవుటచే నెదుట మనిషితో మాట్లాడు సరళిలో ప్రసంగములుగా మాట్లాడుచు నామనస్సులోను, హృదయములోను నున్న దానిని చెప్పివేసెడివాడను. సభలో పదిమంది యున్నను, పదివేలమంది యున్నను, నాకేమాదిరిగా ప్రసంగ సాంప్రదాయములోనే మాట్లాడెడివాడను. నా భాషలో ప్రవాహముండెడిది. చాలమందికి నేను చెప్పినదంతయు తెలియక పోవచ్చును; నాభాష కాని, భావము కాని వారికి సరళముగా నుండక

పోవచ్చును. పెద్ద సభలలో కొంతమందికి నేను చెప్పినది వినబడక పోవచ్చును. కాని వారు వీనిని లెక్కచేయక నాయందు సంపూర్ణ విశ్వాసము నుంచిరి.

నే నొకసారి ముస్సోరి వెళ్ళి నాతల్లిని భార్యను చూచి తిరిగి వచ్చి మరల నా సంచారమును ప్రారంభించితిని. ఉద్యమ మంతే కంతకు హెచ్చుచుండెను. అణగ ద్రొక్క బడిన కిసాను జాతి కెక్కడ లేని యాత్మవిశ్వాసము కలిగి నాభిమానముతో తలయెత్తుకొని నడువ నారంభించెను. జమీందారుయేజెంటులు, పోలీసులు మొదలగు వారి భయము బొత్తిగాతగ్గిపోయెను. ఒకనిని పొలమునుండి తొలగించినపుడు మరియొకడెవడును దానిదరికి పోడయ్యెను. జమీందారు నౌకర్లదౌర్జన్య ములు, అన్యాయతొడపాశములు తగ్గనారంభించెను. ఎచ్చటనైన నట్టివి జరిగినా వెంటనే రిపోర్టుచేయబడుచు తగిన పరిశోధనలు జరుగుచుండెను. తాలూకుదార్లు భయపడి తమ్ముకాపాడుకొనుటకే చూచుకొనిరి. రాష్ట్ర ప్రభుత్వమువారు అయోధ్యవ్యావసాయక చట్టమును సవరణచేసెద మని వాగ్దత్తముచేసిరి.

"ప్రజల సహజ నాయకులము" అని తమ్ముతామే పిలుచుకొను తాలూకుదార్లు, జమీందార్లు, భూమికంతకు ప్రభువులైనవారు బ్రిటిషు ప్రభుత్వలాలనచే తయారయిన చెడ్డపిల్లలు. ఆప్రభుత్వముచే ప్రసా దింపబడిన, లేకప్రసాదింప బడని ప్రత్యేకవిద్యచేతను, శిక్షణముచేతను వారు పూర్తిగా బుద్ధిమాంద్యులైరి. వారు తమ రైతుల కావగింజంత యైనను పనిచేయక ప్రజలమీదను, భూమిమీదను బ్రతుకు పరా న్నభొక్కులైరి. వారు స్థానికముగానున్న ప్రభుత్వోద్యోగులను సంతోషపెట్టి (వారిప్రసాదములేనిదే వారుచాలకాలము బ్రతుకజాలరు.) తమప్రత్యేక హక్కులను, ప్రయోజనములను కాపాడమని వేఢించు చుండుటయే వారిప్రధానకార్యము. బ్రిటిషుప్రభుత్వమునంటి ప్రభుత్వ

మున్నంతకాలమే వారుజీవింతురు. నేను 1921 సంవత్సరమంతయు గ్రామములలో తిరుగుచుంటిని. అసహాయోద్యమము తీవ్రస్వభావమును దాల్చి దానిసందేశము మూలమూలలనున్న కుగ్రామములకు చేరుచుండెను.

వందలకొలది కాంగ్రెసు సేవకులు గ్రామములలోపడి తమ సందేశము నిచ్చుటయేగాక కిసానుల కష్టములును (నిర్ధారణచేయబడిన) తొలగింపబడునని చెప్పుచుండెడివారు. స్వరాజ్యపద మన్నింటిని నిముడ్చుకొనుచుండెను. అయినను అసహాయోద్యమమును, వ్యావసాయికోద్యమమును (అవి మా రాష్ట్రములో కలియుచు పరస్పరబలమును చేకూర్చుకొనుచున్నను) రెండు ప్రత్యేకోద్యమములు. కాంగ్రెసు బోధచే లావాదేవీలు హఠాత్తుగాతగ్గి గ్రామములలో పంచాయతులు ప్రబలెను. కాంగ్రెసు సేవకుడు వెళ్ళినప్రతిచోట దౌర్జన్యరాహిత్యమును గురించియే బోధించుచుండుటచే సద్భుతమైన శాంతియుత వాతావరణ మేర్పడెను. దీనిని పూర్తిగా ప్రజలర్థముచేసికొనక పోవచ్చును. అయినను యిది రైతునట్టి దౌర్జన్యమును చేయకుండ చేసెను. ఇది తక్కువ ఫలిత మెట్లగును? వ్యావసాయికోద్యమము దౌర్జన్యమునకు పెపుపొందెను. అయోధ్యలో కొన్ని ప్రాంతముల రయితులు నిరాశచెందుటచే పరాభవలేశమయినను దవానలమును దరికొల్పు నంతటి తీవ్రతలోనుండిరి. అట్టి వారద్భుతమైన శాంతిని చూపిరి. నేనెరిగినంతవరకు దౌర్జన్య మొక్కసారియే జరిగెను. ఒకనాడొక తాలూకుదారు తనయింట కొందఱు మిత్రులతోకూడి తన భార్యయెడల యవినీతిగను యమర్యాదగను సంచరించుచున్నాడని యొకరైతు వానినొక్క లెంపకాయ కొట్టెను. మరియొకవిధమైన దౌర్జన్యము ప్రభుత్వముతో సంఘర్షణకు కారణమయ్యెను. అపుడు పెక్కువేలమంది కిసానులొక్కొక్కపుడు వారి సభలకు పోవునప్పుడు టిక్కెట్లులేకుండ రైలుబండ్లమీద ప్రయాణ

ములు చేయుచు రైల్వేయధికారు లడిగినచో పాతరోజులు పోయిన వనియు, క్రొత్తరోజులు వచ్చినవనియు చెప్పుచుండెడివారు. వారిట్లు చేయ ప్రోత్సహించిన వారెవరో మేమెరుంగము. మేమెప్పుడు నట్లు సూచించి యుండలేదు. రైల్వేయధికారు లతికఠిన నిర్బంధములను చూపుటచే నిది తరువాత తగ్గిపోయెను.

1920 లో (నేను కలకత్తా కాంగ్రెసుకు వెళ్ళినపుడు) చిన్న నేరములను చేసిరను కారణమున కొందరు రైతునాయకులు నిర్బంధింప బడిరి. ప్రతాపగరులో విచారణ జరుగవలసి యుండెను. వేలకొలది జనులు కోర్టు ఆవరణ లగాయితు ఖయిదీలున్న జయిలువరకును యిసుక వేసినను రాలనట్లు మూగిపోయిరి. మేజస్ట్రీటు చేయాడక విచారణ మరునాటికి వాయిదా వేసెను. మరునాడు ప్రజలు ద్విగుణమై జయిలును కూడ కప్పివేసిరి. చివరకు జయిలులోనే విచారణ సలిపి ఖయిదీలను విడిచివేసిరి. కిసానులు దీని నొక గొప్ప విజయముగా నెంచి ప్రభుత్వము నెప్పుడును యిట్లు సంఖ్యాబలముచే జయింపగల మనుకొనిరి.

1921 జనవరిలో కొంతమంది రైతునాయకులు రై బెరిల్లీ జయిలులో నిర్బంధింపబడిరి. వెనుకటివలెనే వేలకొలది జను లచ్చటకు వెళ్ళిరి. కాని యీసారి ప్రభుత్వమువారు చాల కట్టుదిట్టములను చేసి పోలీసు, మిలిటరీ పద్ధతులతో ప్రజల నాపివేసిరి. పట్టణము వెలుపల నొక చిన్ననది కవతల ప్రక్క జనప్రవాహ మాపివేయబడెను. చాలమంది యెట్లో యితర దిశల నుండి పట్టణములోనికి వచ్చుచుండిరి. ఇట్టిస్థితిలో నేనచ్చటకువెళ్ళితిని. నే నికముందుకు పోరాదని జిల్లామేజస్ట్రీటుగారి, హడావుడిగావ్రాసిన, యొకహుకుము నాకందచేయ బడెను. నే నాహుకుము వెనుక భాగమున నన్నే చట్టము క్రింద యేన్యాయము ప్రకారము ముందుకు పోరాదని నిషేధించిరో తెలుప వలసినదనియు, నంతవరకు నేను వెళ్ళుచునే యుందుననియు వ్రాసి పంపితిని. నేను నదదగ్గరకుపోవుసరికి అవతలప్రక్కనుండి తుపాకి

కాల్పులు వినవచ్చెను. నన్ను వంతెనయొద్ద మిలిటరీ ఆపివేసెను. ఆచుట్టుపట్ల పొలములలో దాగియున్న భయభ్రాంతులైన కిసానులు నాచుట్టును మూగసాగిరి. ఒకప్రక్క నొకచిన్ననది కనతలనైపున తోడిసోదరులపై బారెడు దూరములో కాల్పులు జరుగుచుండ, సైనికు లంతటను విజృంభించియుండ ప్రజ లావేశ పడుచుండిరి. నేనప్పుడచట రెండుమూడు వేలమంది సభలో నుపన్యసించి భయభ్రాంతులైన ప్రజల యుద్రేక, భయములను తగ్గించితిని. సభ జయప్రదముగాజరిగి, కిసానులు శాంతిపడినమీదట కలెక్టరుగారు కాల్పులు జరుగుచోటునుండి వచ్చిరి. అతడు వేషుటచే నేనాయనయింటికి పోగా నన్నతడచ్చట నేదో యొక మిషపెట్టి (పట్టణములోనున్న తదితరస్నేహితులతోను కిసానులతోను కలియకుండ చేయవలెననియే) రెండు గంటలవరకు ఆపివేసెను.

ఆకాల్పులలో చాలమంది చనిపోయిరి. కిసానులెంత శాంతముగ నున్నను అధికారులు పొమ్మనియాజ్ఞాపించినపుడు కదలకుండుటే వారు చేసిన పాపము. నేనుగాని వారివిశ్వాసమును చూఱగొనిన మరియొకరు గాని చెప్పినచో వారు తప్పకవెళ్ళిపోయెడివారు. నాకొఱకు కొంచె మాగవలసినదని యెవరో మేజస్ట్రేటుతో చెప్పినను ఆయన వినలేదు. తాను విఫలుడైనచోట నొకయాందోళన పరుడు జయించుట నాయన యెట్లుచూడగలడు ? అధికారగర్వముతో కూడిన పరప్రభుత్వము లట్లొప్పు కొనజాలవు.

రైబరెల్లీ జిల్లాలో నాకాలమున రెండుసార్లు కాల్పులుజరగెను. తరువాత ప్రతిపంచాయితీ సభ్యునకును, ప్రధానరైతునాయకునకును నంతకంటె నధ్వాన్నమగు భయంకరపరిపాలన ప్రారంభమయ్యెను. ప్రభుత్వమెట్లైనను ఆయుద్యమము నణచివేయ సంకల్పించెను. ఆరోజు లలోనే కాంగ్రెసుసందేశము ననుసరించి రాటము వడకుట గ్రామగ్రామ మునకును ప్రాకుచుండెను. కనుక రాటము రాజద్రోహమయ్యెను. రాటము తగులపెట్టబడెను. వడుకువాని కేబాధయో కల్పింపబడు

చుండెను. వందలకొలది నిర్బంధింపబడిరి. ఇంకను అనేకవిధములచే వ్యావసాయిక, కాంగ్రెసు యుద్యమములను రెంటిని ఫైజుబాదు, ప్రతాపగరు జిల్లాలలోని గ్రామసీమలలో లేకుండచేయ ప్రభుత్వము సంకల్పించెను. రెండు ఉద్యమములకును చాలవరకు ప్రధాన నాయకులొక్కరే.

మరి కొద్దికాలమునకు ఫైజుబాదు జిల్లాలోకూడ నిర్బంధ ప్రయోగము లారంభమయ్యెను. కొన్ని గ్రామములలోని రైతులొక జమీందారు ప్రోద్బలముచే (వారిద్దరకును విరోధము) నొక తాలూకుదారు ఆస్తిని దోచుకొనిరి. అట్లు దోచుకొనమని మహాత్మా గాంధీగారి యాజ్ఞయైయున్నదని మాయమాయిక ప్రజలనునమ్మించుటచే వారది నిజమని నమ్మి "మహాత్మగాంధికిజై" అని యరచుచు నట్లుచేసిరి. నాకిది తెలిసినప్పుడు చాలాకోపమువచ్చి నేనొకటి రెండుదినములలో నాచోటుకు వెళ్ళితిని. వెళ్ళుటతోడనే నేనొకసభను జరుపగా చుట్టుపట్ల పదిగ్రామములనుండి యైదారువేలమందిజనము హాజరైరి. వారు తమకును ఉద్యమమునకును తెచ్చిన యపకీర్తిని గురించి నేనతికఠినముగా మాట్లాడితిని. దోషులైనవారు బహిరంగముగా తమతప్పిదము నొప్పుకొనవలెనని (గాంధిజీ సత్యాగ్రహము నన్నపుడు పూర్తిగానావేశించెను) చెప్పి సభలో నట్టివారున్నచో చేతులనెత్తవలెనని నేనంటినోలేదో వెంటనే రెండు డజనులమంది (అనేకమంది పోలీసు ఉద్యోగుల సమక్షమున) చేతుల నెత్తిరి.

తరువాత వారితో నేను ముఖస్తముగా మాట్లాడినపుడు వారు తాము మోసపోయిన విధమునంతను పూసగుచ్చినట్లు చెప్పగా విని యీ యమాయిక యవివేక ప్రజలను చిరకాల నిర్బంధములపాలు చేసితిని గదాయని నేనెంతయు ఖేదపడితిని. కాని చిత్రమేమన యీ రెండు మూడు డజనులమంది మాత్రమే బాధపడలేదు. ప్రభుత్వమీ సదవకాశము నెట్లు పోగొట్టుకొనగలదు! ఒక వేయిమంది నిర్బంధింపబడిరి. జిల్లా జయిలంతయు క్రిక్కిరిసిపోయెను. విచారణ సుమారొక్క

సంవత్సరమువరకును సాగింపబడెను. విచారణ ముగియులోపల చాల మంది జయిలులోనే చనిపోయిరి. చాలమందికి దీర్ఘకాల శిక్షలు ప్రాప్తించుటచే తరువాత సంవత్సరములలో నేను జయిలుకు పోయి నప్పుడు చాలమందిని (వీరిలో ననేకమంది యువకులును పిల్లలును తమ యౌవనమును జయిళ్ళలో వెళ్ళబోయుచుండిరి.) జయిళ్ళలో చూడ గలిగితిని. హిందూదేశములోని కిసానులకంతె శరీరపటిమ చాలకాల మాగగల శక్తిసామర్థ్యములు లేవు. కఱవులు జాడ్యములు మొదలగు నవి యొక్కొక్కప్పుడు లక్షలకొలది రైతులను తుడిచివేయుచుండును. ప్రభుత్వమును జమీందారులును కలిసి యొకసంవత్సర మస్వాశమగా కరపించిన నిర్బంధాగ్ని తాళగలుగుట కేవలమాశ్చర్యమైన విషయము. చివరకు ప్రభుత్వమునకు వారు తాత్కాలికముగా లొంగక తప్పినది కాదు. అయినను యుద్యమము సన్నసన్నగా (వెనుకటి తీవ్రవహాసమున గాక) సాగుచునేయుండెను. ఒక్కవిషయము మాత్రము మనము జ్ఞప్తి యందుంచుకొనవలెను. ఇదంతయు 1921 యంతమున కాంగ్రెసు ప్రారంభించిన జయిలు యాత్రలకు పూర్వమేయని మనము మరువ రాదు. ఈ రెండవయుద్యమములోకూడ (వెనుకటిబాధలకు వెనుదీయక) వారు ముఖ్యపాత్రను ధరించిరి. వ్యావసాయికోద్యమమువలన భయపడి ప్రభుత్వము క్రొత్తవ్యావసాయిక చట్టములను చేయ త్వరపడిరి. వీనివలన కిసానులకు కొంతలాభము కలుగునని యెంచబడెను. ఇంతలో ఉద్య మము తగ్గినట్లుండుటచే పైచట్టము సడలింపబడెను. దానివలన నయో ధ్యలోని కిసానులకు జీవితకాలహక్కు స్థిరపరుపబడెను. ఇది బాగు గనే కాన్పించెను. కాని యిది విశేషలాభదాయకము కాదని తరువాత తెలిసికొనబడెను.

అయోధ్యలోనింకను అప్పుడప్పుడు వ్యావసాయిక బాధలు (స్వల్పముగా) కలుగుచునే యుండెను. 1929 లో ప్రారంభమైన ప్రపంచ ఆర్థికమాంద్యముచే ధరలు విపరీతముగా పడిపోవుటవలన నురల నొక విషమపరిస్థితి యేర్పడెను.

# ౧౦

## అసహాయోద్యమము.



పంజాబు, ఖిలాఫతు అన్యాయములు భారతదేశమంతటను చర్చనీయాంశములయ్యెను. వీనిని సవరించుటకు ప్రారంభింపబడిన యసహాయోద్యమమంత్రమును ప్రతివాఁడును జపించుచుండెను. జాతీయస్వాతంత్ర్యము స్వరాజ్యము అను పెద్దసమస్యకు తాత్కాలికముగ సంతప్తిధాన్యత యివ్వబడలేదు. గాంధీజీకి నిర్ధారణలేని పెద్దపెద్ద యాశయములనిన యిష్టముండదు. అతఁడెప్పుడు నిదమిద్ధమను నిర్వచనము నిర్ధారణగల విషయముకే ప్రాముఖ్యతనిచ్చును. అయినను స్వరాజ్యశబ్దము ప్రజలకు తారకనామ మగుచుండెను. పెద్దపెద్దసభలలో ననేకవేలమందిలో నిది యుదహరింప బడుచుండెను.

అసహాయోద్యమమును గురించియు ముందుచేయవలసిన కర్తవ్యమును గురించియు చర్చించుటకు 1920 వ సంవత్సర శరత్కాలమున కలకత్తాలో ప్రత్యేకకాంగ్రెసు జరిగెను. చిరకాల మమెరికాలోనుండి యింటికి తిరిగివచ్చిన లాలా లజపతిరాయి దానికధ్యక్షత వహించెను. అతఁడు అసహాయోద్యమము నెదిర్చెను. భారత రాజకీయములలో నతనికతివాది యనిపేరు; కాని యతని సామాన్యదృష్టి, శాస్త్రబద్ధమై, మితవాదసరళిలో నుండును. కేవలపరిస్థితుల బలవంతముచేతనే యతఁడు తిలకు మొదలగు నితరయతివాదులతో చేరెను. అతనికి మంచిసాంఘికయార్థిక పరిజ్ఞానము (విదేశములలో నుండుటచే నిది మరింతబలపడెను) ఉండుటచే చాలమంది భారతనాయకులకంటె విశాలదృష్టియే యుండెను.

1909 ప్రాంతమున బ్లంటుగారు గోక్లే, లజపతిరాయిగార్లను సందర్శించి తన "డయిరీలు"లో వారి నతికఠినముగా విమర్శించుచు,

వారు యథార్థముల నెదుర్కొనుటకు పిరికిపడుచుండిరనియు, భయపడుచుండిరనియు వ్రాసెను. కాని లాలాజీ చాలమంది భారతనాయకులకంటె వానిని బాగుగనే యెదుర్కొనెను. బ్లంటుగారి యభిప్రాయము లాకాలపు రాజకీయములును, నాయకులును, నెంతటి తక్కువ స్థాయిలో నున్నదియు సూచించును. కాని పది సంవత్సరములలో నిది యంతయు తారుమారయ్యెను.

ఒక్క లాలాలజపతిరాయియే గాక, నతనితో చాలమంది బుద్ధిమంతులే యసహాయోద్యమము నెదిరించిరి. కొంచెమించుమించు కాంగ్రెసుయొక్క పాతసంరక్షకు లందరును దీని నెదిర్చిరి. చిత్తరంజనదాసుగారే వ్యతిరేకవాదులకు నాయకుడయ్యెను. అతడీ తీర్మానమునకు వెనుకనున్న తత్త్వమునకు వ్యతిరేకి కాడు. (అతడెంతవరకైనను పోవుటకు సిద్ధముగనేయుండెను.) కాని శాసనసభా బహిష్కారమతనికి గిట్టలేదు.

వృద్ధసంతతి నాయకులలో గాంధిజీ ప్రక్కనప్పుడు మా తండ్రియొక్కడే యుండెను. అంతకు పూర్వమతడు దానినిగురించి యెంతయో తర్జనభర్జన చేసెను. దానికివచ్చిన యభ్యంతరముల నన్నింటిని యతడును చూచి పునరాలోచనచేసెను. ఇతర మిత్రులవలెనే యితనికిని యీ యపూర్వమార్గ మెచటకు గొంపోవునో యను సందేహములు తోచి జంకుచుండెను. జయప్రదమగు కార్యమునతడు కాంక్షించుచుండెను. ఈ తీర్మానము (అతడనుకొనినట్లు కాకపోయినను) అట్టి కార్యమును నిర్వచించెను. అప్పటికిని యతడు గాంధిజీ చిత్తరంజనదాసులతో దీర్ఘసంభాషణలు జరుపుచునేయుండెను. దాసుగారును మా తండ్రియు నప్పుడొక పెద్దకేసులో నెదిరిపక్షములను వహించి పనిచేయుచుండుటచే తఱచు కలసికొనుచుండిరి. వారిద్దరు నీ సమస్యను కొంచెమించుమించుగ నొకదృష్టితోనే చూచిరి. కొద్దిభేదముతో వారొక పర్యవసానముకేవచ్చిరి. కాని నాకొద్దిభేదముచేతనే వారియువురును

ప్రత్యేకకాంగ్రెసులో ప్రధానతీర్మానమున కిరుప్రక్కలనుండిరి. మూడు నెలల తరువాత వారుతిరిగి నాగపుర కాంగ్రెసులో కలిసిరి. అప్పటి నుంచి వారంతకంతకు కలిసియే పనిచేయుచుండిరి.

కలకత్తా ప్రత్యేకకాంగ్రెసుకు పూర్వము తండ్రిగారితో నేనంతగా కలియుటలేదు. కాని నేనాయనను కలిసినప్పుడెల్ల నతడీ సమస్యను నిరంతర మెట్లెదుర్కొనెడివాడో చూచుచుండెడి వాడను. జాతీయదృష్టి నటుంచి, యతడుదీనిని వ్యక్తిగతముగా కూడచూచెను. అసహాయోద్యమమనగా ముందర నతడు తనవృత్తిని వీడవలెను. అనగా నతడు తనపూర్వజీవితమునంతను త్రోసిపుచ్చి క్రొత్తదానిని సృష్టించు కొనవలెను. షష్టిపూర్తి యైనవాని కిది యెంతటికష్టమో వేరుగ చెప్ప నక్కరలేదు. తనవృత్తిని, తనపూర్వపు రాజకీయమిత్రులను, తనకింత వరకు నలవడిన సాంఘికజీవితమును, తనభాగ్యభోగ్యములకు తగినట్లు హెచ్చుగాచేయుచుండిన యనేకఖర్చులను-ఇన్నింటిని వీడవలెను. ఆర్థిక విషయమంత తేలికయైనదికాదు. తనవృత్తివలన వచ్చుఆదాయము పోయినప్పుడు జీవితవ్యయ ప్రమాణము పూర్తిగా తగ్గింప బడవలెను.

అయినను, ఆతనియాత్మగౌరవము, హేతుజ్ఞానము, మాన ధనము నతనిని క్రమముగా నుద్యమములోనికి దింపెను. అనేకవిషయ పరంపరలచే కలిగిన క్రోధానలము పంజాబు దురంతములతో పూర్తి యయ్యెను; కేవలద్రోహము చేసిరి; దానికన్యాయమును జతచేర్చిరి; జాతీయపరాభవమును కలిగించిరి - యను క్రోధపూరిత భావముల కేదియో యొక మార్గముండవలెను. కాని యతడు కేవల యుత్సాహ తరంగములచే కొట్టుకొనిపోవు వాడుకాదు. సుశిక్షణకలిగిన న్యాయవాద బుద్ధితో మంచిచెడుగుల నన్నింటిని మథనము చేసినమీదటనే యతడు తుదినిర్ణయమును గావించుకొని యీయుద్యమములో గాంధీజీతో కలిసెను.

గాంధీజీ, వ్యక్తిగతముగా నతనినాకర్షించెను. అతనిని మార్చుటకే యాకర్షణమే కొంతకారణమయ్యెను. అతని ప్రేమాప్రేమలు రెండును తీవ్రముగనేయుండుటచే నతడు ద్వేషించువానితో నెన్నటికిని కలియడు. కాని వీరిద్దరి కలయికయు నతిచిత్రమైనది. ఒకడు ఋషి, తపస్వి, మతాభిమాని; జీవితము మనకు ప్రసాదించు భాగ్య భోగ్యములను, సుఖాదికములను త్యజించినవాడు. రెండవవాడు భోగి, జీవితము ప్రసాదింపగల సమస్తైశ్వర్యములను, భోగములను అనుభవించినవాడు; ముందు రానున్న దానికొరకు (పరముకొరకు) లెక్క-చేయనివాడు. వేదాంతపరిభాషలో నది భోగి యోగుల కలయిక. కాని వారిరువురను బంధించి, వారి కత్యంత మైత్రిని (ఒక్కొకప్పుడు, తరువాత సంవత్సరములలోవలె, వారి రాజకీయములు భేదించినను) చేకూర్చు సామాన్య పాశములును, ప్రయోజనములును కలవు.

యోగియు, భోగియు, వ్యతిరేక దృక్పథములనుండి బయలుదేరి, వివిధ మార్గముల త్రొక్కుచు, (ఒకడు మతాభిమానియై, మరియొకడు దానికి వ్యతిరేకియై) నీచస్వభావము లేని దృష్టికలవారై (యిరువురును యథాతథా జీవితమును గడపుచు రోజుల నెట్లో గడుపుకొనిపోవు కేవలమానిసి నర్థము చేసికొనలేరుగాని) తమ్మొకరి నొకరర్థము చేసికొనగలరు- ఒక్కొక్కప్పుడు వారు కేవలము కలసికొనెదరని వాల్టరుపేటరు తన పుస్తకములలో నొకచోట వ్రాసెను.

కలకత్తాలోని ప్రత్యేక కాంగ్రెసుతో రాజకీయములలో గాంధీ యుగమారంభమై (గాంధీజీ వెనుకకు తగ్గి, మోతీలాల్జీయు, చిత్తరంజన దాసుగారును స్వరాజ్యపార్టీని నడిపిన కాలములో తప్ప) నేటి వరకు సాగుచుండెను. కాంగ్రెసు రూపమే మారిపోయెను. యూరపియను దుస్తులు పలాయనమయి కొద్దికాలములో ఖద్దరు వస్త్రమే కానవచ్చెను. క్రొత్తతరగతి ప్రతినిధి, ముఖ్యముగా, మధ్యతరగతు

లలో క్రిందితరహాకు చెందినవాడు, కాంగ్రెసు ప్రతినిధి యయ్యెను. హిందూస్థానీ భాష యంతకంత కెక్కువగా వాడబడుచుండెను. ఒక్కొక్కప్పుడు కాంగ్రెసు సభ జరుగు రాష్ట్రములోని భాషయే (ఇంగ్లీషు చాలమంది ప్రతినిధులకర్థముకాదు) యుపయోగింప బడు చుండెను. జాతీయసేవలో విదేశభాష నుపయోగింపరాదను భావము కూడ పెరుగుచుండెను. కాంగ్రెసుసభలలో నూతన జీవితము, నూతనో త్సాహము, నూతనశక్తి, శ్రద్ధాభక్తులు తాండవ మాడుచుండెను.

కాంగ్రెసుసభ ముగిసినతరువాత గాంధీజీ అమృతబజారు పత్రి కాధిపతియైన శ్రీయుత మోతీలాలు ఘోషుగారిని సందర్శింప బోయెను. అతడు మృత్యుశయ్యాస్థుడై యుండెను. నేనుగాంధీజీతో నుంటిని. ఘోషుగారు గాంధీజీని యతనియుద్యమమును ఆశీర్వదించి తనమట్టుకు తాను యితరులతో కలిసిపోవుచుండుటయు యవి యేలోకముల్లైనను, బ్రిటిషుప్రభుత్వము మాత్రముకాని లోకములని తనకొక్క గొప్ప సంతోషము కలదనియు చెప్పెను. చివరకతడు యీ సామ్రాజ్యము పోవాలని వోట నుండును! కాంగ్రెసునుండి తిరిగివచ్చునపుడు గాంధీజీతో నేను రవీంద్రనాథ్ టాగూరును, అతనియన్నగారు, 'బరోదాదా'ను చూచుటకువెళ్ళితిని. మేమచ్చట కొన్నిదినము లుంటిమి. అచ్చట సి. యఫ్. ఆండ్రూసుగారు నాకుకొన్ని పుస్తకములనిచ్చిరి. నేనువానిని శ్రద్ధతో చదివితిని. అవి ఆఫ్రికాలోని సామ్రాజ్యతత్వముయొక్క ఆర్థిక విధానమును తెలుపుచుండెను. మోరెల్ గారి 'నల్లవానిభారము' అనుపుస్తకము నన్నెక్కువగా కదల్చివేసెను.

కొంచెమించుమించు యీసమయముననే సి. యఫ్. ఆండ్రూసు గారు 'స్వాతంత్ర్యము —సత్వరావసరము' అనునొక కరపత్రములో భారతదేశమునకు స్వాతంత్ర్యముకావలెనని సమర్థించెను. సీలీగారు హిందూదేశమునుగురించి వ్రాసిన వ్రాతలననుసరించి యీవ్యాసము

వ్రాయబడెను. అది భారతదేశస్వాతంత్ర్యము సప్రమాణముగా సమర్థించుటయేగాక మహాహృదంతరాళములలోనున్న భావములను వ్యక్తము చేయుచుండెను. మనలో కలిగిన తీవ్ర ప్రబోధమును, మన యసంపూర్తి కోర్కెలను నతని నిష్కపటమైన సరళభాష మరింత స్పష్టపరచెను. అతడు వ్రాసిన దానిలో నార్థిక ప్రవాదులు కాని, సామ్య వాదముగాని లేవు. అది జాతీయతతో నిట్టిపడుచుండెను. భారత పరాభవాగ్ని, దానిని నిర్మూలించవలెననెడి దృఢ సంకల్పము, మనమింకను పొందుచున్న యధఃపతనము — ఇవన్నియు వివరింపబడెను. ఆండ్రూసువంటి విదేశీయుడు, భారతదేశములోని పాలక జాతికి చెందినవాడు, మనయాంతరంగికాక్రోశమును వెలిబుచ్చగలుగుట మహాద్భుత విషయము. సిలీగారు చాలకాలముక్రిందనే చెప్పినట్లు అసహాయోద్యమమన "మనపై తనయధికారమును చెలాయించుచున్న పరపరిపాలనకు తోడ్పడుటకంటె వేరులజ్జాస్పదమగు విషయములేదు" అనుభావము. "ఆంతరంగికమైన గొప్ప సాంఘిక పరివర్తన మొక్కటియే యాత్మాభివృద్ధికి మార్గము. అట్టి పరివర్తనమునకు తగిన యుత్సాహశక్తి భారతాంతరాత్మనుండియే ప్రభవింపవలెను. అది పైనుండి ప్రసాదింపబడు ఋణములవలనను, దానధర్మముల వలనను, దయాధర్మ బిచ్చముల వలనను, ప్రకటనల వలనను వచ్చునదికాదు. అది అంతరాత్మ జనితము...'ముక్తులుకండు! దానిసత్వమును వారదోలుడు! అను మంత్రమును గాంధీమహాత్ముడు భారతాత్మకు ఉద్బోధించినప్పుడు అట్టి యాంతరంగికోత్సాహము వియన్నదీ తోయములవలె వెల్లువయై పారుచుండ నేనా దుర్భర భారవిమోచనము నాధ్యాత్మికానందముతో ననుభవించితిని. భారతాత్మ యుప్పొంగెను. ఒకక్షణకాలములో దాస్య శృంఖలములు సడలనారంభించి, స్వాతంత్ర్య కవాటము తెఱువబడెను" అని ఆండ్రూసువ్రాసెను.

తరువాత మూడుమాసములలో భారతదేశమంతయు నసహాయోద్యమ తరంగములలో మునిగిపోయెను. శాసనసభా బహిష్కార మద్వితీయముగా జరిగెను. అది శాసన సభల కొక్కడును పోకుండచేసి స్థానములను ఖాళీచేయలేదు; చేయజాలక పోయెను. ఏ పదిమంది వోటరులైనను యెన్నుకొన వచ్చును! లేదా పోటీలేకుండ గనే యెన్నుకొన బడవచ్చును! అత్యధిక సంఖ్యాకులు వోటుచేయ లేదు. భారతసందేశమును గౌరవించిన వారెవరును అభ్యర్థులుగా నిలువ లేదు. ఎన్నికదినమున సర్. వెలంటైన్ షిరాలుగారు అలహాబాదులో నుండిరి. ఆయన అన్ని పోలింగులకును పోయి చూచెను. బహిష్కార విజయమున కతడు నిర్ఘాంతపడెను. అలహాబాదుకు పదిహేనుమైళ్ళ దూరములోనున్న యొకపోలింగు కొక్కవోటరుకూడ పోలేదు. అతడు భారతదేశమును గురించి వ్రాసిన యొకపుస్తకములో తన యనుభవములను వర్ణించెను.

చిత్తరంజనదాసు మొదలగువారు కలకత్తా కాంగ్రెసులో బహిష్కరణోద్యమముకు ప్రతికూలురైనను కాంగ్రెసుతీర్మానమునకు కట్టుపడిరి. ఎన్నికలగుటతోడనే, యీభేదాభిప్రాయము పోవుటచే, 1920 డిసెంబరు నాగపుర కాంగ్రెసు నిండుసభలో రెండు పక్షముల వారును కలసికొనిరి. ఉద్యమముయొక్క విజయమువలన సందేహ మనస్కుల సందేహములన్నియు పటాపంచలయ్యెను.

కలకత్తా కాంగ్రెసు తరువాత కొంతమంది పాతనాయకులు కాంగ్రెసునుండి జారిపోయిరి. వారిలో జిన్నాగారొకరు. సరోజనీదేవి యీయనను "హిందూ మహమ్మదీయైక్యతా సంధానకర్త" యని పిలిచెను. వెనుక ముస్లింలీగును, కాంగ్రెసు సమీపముకు తెచ్చుటలో నితడు చాల బాధ్యత వహించెను. కాని కాంగ్రెసులో కలిగిన క్రొత్త మార్పులు- అసహాయోద్యమము, ప్రజాసామాన్యము పాల్గొనుటకు

వీలగునట్లు చేయబడిన నూతన మార్పులు (చట్టసంబంధమైనవి) యతని కెంతమాత్రము నిష్టములేదు. అతనికి రాజకీయముగా కొంత భేదాభిప్రాయమున్నను, కాంగ్రెసును వీడుట కిదియే ముఖ్యకారణము కాదు. రాజకీయముగా నతనికంటె చాల వెనుకనున్నవారెందరో యిప్పుడును కాంగ్రెసులో నున్నారు. స్వభావముచే నతడు క్రొత్త కాంగ్రెసుతో నెంతమాత్రమును సరిపెట్టుకొనజాలడయ్యెను. ఖద్దరు కట్టుకొని హిందూస్థానీ భాషలో నుపన్యసించమని కోరు మూకతో నుండుట యతనికి కంపరముగా నుండును. బయటనుండు ప్రజల యుత్సాహమతనికి ప్రజారోగమువలె కాన్పించును. అతనికిని భారత ప్రజలకును (హస్తి మశకాంతరము కలదు.) సవిలేరో, బాండుస్ట్రీటులకును, మట్టి గుడిసెలతో కూడిన భారత గ్రామమునకును గలంత యంతరువు గలదు. అత డొకసారి మెట్రిక్యులేషను పరీక్షలో నుత్తీర్ణులైనవారినే కాంగ్రెసులో చేర్చుకొనవలెనని యిష్టాగోష్టిలో సూచించెను. దీని నతడు బుద్ధిపూర్వకముగ సూచించెనో లేదో నేనెరుగను. కాని యతని భావములకది తగియే యుండెను. కనుక నతడు కాంగ్రెసునుండి జారిపోయి భారత రాజకీయములలో నేకాకిగ నుండెను. తరువాత నైక్యతను చేకూర్చిన యీ పాతరాయబారి అభివృద్ధిని భంగముచేయు ముస్లిం కులతత్త్వవాదులతో చేరెను.

మితవాదులు లేక లిబరలు పక్షమువారు కాంగ్రెసుతో నెట్టి సంబంధమును లేకయుండిరి. వారు దానిని వీడుటయేగాక ప్రభుత్వముతో కలిసిపోయి మంత్రులుగను, పెద్దపెద్ద యుద్యోగులుగనునుండి కాంగ్రెసుతోను, అసహాయోద్యమముతోను పోరాడుటలో ప్రభుత్వమునకు సాయపడిరి. కొంచెమించుమించు వారికి కావలసినవి (కొన్ని సంస్కరణలు ప్రసాదింపబడినవి) చేకూరినవి. కనుక వారిక నాందోళన చేయు నవసరములేదు. ఒకవంక దేశముద్రేకముతో నుడికిపోవుచు నంతకంతకు

విప్లవ యుతమగుచుండ వారు బహిరంగముగ విప్లవ వ్యతిరేకులై ప్రభుత్వములో నొక భాగమయిరి. వారు ప్రజలనుండి పూర్తిగా విడిపోయి ప్రతివిషయమును ప్రభుత్వదృష్టితో చూడనారంభించిరి. నిజమునకు వారొకపక్షముగాక కొద్దిపెద్దపట్టణములలో నచ్చటచ్చట చెల్లాచెదరుగానుండు కొద్దిమంది వ్యక్తులు. శ్రీనివాసశాస్త్రిగారు సామ్రాజ్యారాయబారియై బ్రిటిషుప్రభుత్వము తరపున ననేకబ్రిటిషు డొమినియనులను, అమెరికానుకూడ సందర్శించి బ్రిటిషుప్రభుత్వముతో పోరుసల్పుచున్నందులకు కాంగ్రెసును తన దేశప్రజలను తనివిదీర విమర్శించుచుండెను.

అయినను అంతమాత్రముచే లిబరలుపక్షమువారికి సుఖములేదు. తన ప్రజలనుండి విడిపోవుట తన ప్రజలచే శత్రువుగా పరిగణింపబడుట సంతోషమైన విషయము కాజాలదు. గాంధీజీ మందలింపులవలన (అవి లేనిచో నుండుదానికంటె) నసహాయోద్యమము తద్వ్యతిరేకులయెడల నెంతశాంతముగను, సాధువుగను, నున్నను ప్రజోద్రేకము వ్యతిరేకుల యెడల దయాదాక్షిణ్యము లుంచనేరదు. ఆవాతావరణమే వ్యతిరేకుల నణచివేసి దానిని సమర్థించువారికుత్సాహశక్తులను, నూతనోత్తేజమును ఒసంగును. విప్లవోద్యమములకును ప్రజోద్రేకములకును నెప్పుడును యిట్టి రెండువిధములైన శక్తులుండును. అవి ప్రజాపక్షముననున్న వ్యక్తులను ప్రోత్సహించి, వారిశక్తులను బహిర్గత మొనరించి వ్యతిరేకుల శక్తి సామర్థ్యముల నణచివేయును.

ఈకారణముచేతనే కొందరు అసహాయోద్యమములో సహనము లేదనియు, స్వతంత్రాభిప్రాయములకును, కార్యములకును, అది తావీయక నిర్జీవమైనసమానతను తెచ్చిపెట్టెననియు గోలచేసిరి. ఇందులో సత్యమున్నది. కాని ఆసత్యమెట్టిదనిన అసహాయోద్యమము ప్రజల యుద్యమము. అది కోట్లకొలది భారతీయులలో నద్భుతమైన భక్తి విశ్వాసములను పురిగొల్పిన యద్వితీయవ్యక్తిచే నడుపబడెను. కాని దానివలన ప్రజలలో గలిగినమార్పులో నెక్కుడు సత్యముగలదు,

వారు ముక్తులైనట్లు, గొప్పభారము నొక్కసారిగా తొలగించివేసినట్లు, క్రొత్తస్వేచ్ఛాభావముల ననుభవింపసాగిరి. వారిని నణచివేసిన భయమొక్కసారిగా పలాయనమయ్యెను; వారు తలయెత్తి నిర్భయముగా నడువసాగిరి. మూలమూలలనున్న బజారులలోను, సంతలలోను, ప్రజలు కాంగ్రెసును గురించియు, స్వరాజ్యమును గురించియు, (నాగపుర కాంగ్రెసు స్వరాజ్యము గమ్యస్థానమని నిర్వచించెను) పంజాబు హత్యలను గురించియు, ఖిలాఫతును గురించియు, చర్చించుకొనుచుండిరి. కొన్ని గ్రామసీమలలో 'ఖిలాఫతు' కు క్రొత్తయర్థము కల్పింపబడెను. 'ఖిలాఫ్' అను ఉర్దూశబ్దమునకు 'వ్యతిరేక'మని యర్థము. వారీయర్థమును తీసికొని ప్రభుత్వమునకు వ్యతిరేకము అని దానికర్థముచేసికొనిరి. వారు తమప్రత్యేక ఆర్థికబాధల నన్నింటిని ముఖ్యముగా చర్చించుకొనుచునే యుండిరి. అసంఖ్యమైనసభలు, ఉపన్యాసములు, కాన్ఫరెన్సులు వారి రాజకీయపరిజ్ఞానము నధికము చేయుచుండెను.

మేము 1921 లో నొక యుచ్ఛ్రితావేశములో తేలియాడెడి వారము. ఉద్రేకము, పొంగిపొంగివచ్చు యుత్సాహము, ఒకవిధమైన హుషారు మాలో మూర్తీభవించెను. ధర్మయుద్ధములో నొసగూడు యానందము మమ్మావరించెను. సందేహము, జంకుగొంకులు మమ్ము బాధించలేదు. మామార్గము మాముందర కంటికి కట్టినట్లు కాన్పించుచునేయుండ మేము ముందుకు పోవుచుంటిమి. ప్రభుత్వముతో సంఘర్షణ తప్పదని తెలియుటచే మమ్ము తీసికొనిపోవులోపల నెంతపనినైనను చేయవలెనని మే మదివరకెన్నడును చేయనట్లు చాలకష్టపడి పని చేసితిమి.

మేము స్వేచ్ఛ యిచ్చిన స్ఫూర్తి ననుభవించి స్వాతంత్ర్యగర్వము ననుభవించెడి వారము. నణుగుట గొణుగుట మాయమయ్యెను. అధికారులతో

సంఘర్షణను తప్పించుకొనుట కపసవ్యమైన న్యాయపదజాలము నాశ్రయించుటను మానివేసితిమి. మేము భావించినదానిని దాపులేకుండ, యిండ్లకప్పులనుండికూడ చాటితిమి. ఫలితములకు మేమేమిలెక్కచేసితిమి? జయిలా? మేము దానికొఱకే చూచుచుంటిమి. అది మా యుద్యమమునకు మరింత దోహదమునిచ్చును. పాపము మాచుట్టును తిరుగుచు, మేమెచ్చటికి పోయినచ్చటికి దేవుడాయని వచ్చుచుండు నసంఖ్యాకమగు గూఢచారిగణమును చూచినపుడు (వారుకనుగొనగల రహస్యములేవియుమాలోలేవు కనుక) మాకు చాల విచారము వేసెడిది. మామార్గము లెప్పుడును బహిరంగముగనే యుండెను. మాకట్టెదుట భారతదేశమునంతను అద్భుతముగా మార్చివేయుచున్న రాజకీయ ప్రచారమును జరుపుచున్నారమనియు, భారతస్వాతంత్ర్యము సతిసమీపమునకు తెచ్చితిమనియు సంతోషమేకాక, మాపద్ధతులలోను, మాయాశయములలోనుకూడ మేము శత్రువుకంటె నైతికముగా ననేకరెట్లధికులమను భావముతో నుప్పొంగెడివారము. మానాయకుని గురించియు నతడుకనిపెట్టిన యపూర్వమైన యుద్యమమును గురించియు గర్వించెడివారము. తఱచు మేము మాయాత్మపవిత్రతనుగురించి మురిసిపోవుచుండెడివారము. తీవ్రమైన యుద్ధరంగమధ్యమున (ఆయుద్ధమును పురికొల్పినది మేమేయైనను) మేమాంతరంగిక ప్రశాంతి ననుభవించెడివారము.

మానీతి హెచ్చినకొలది ప్రభుత్వనీతి తగ్గుచుండెను. ఏమిజరుగుచున్నదియు వారికర్థము కాదయ్యెను. భారతదేశములో తమకు తెలిసిన పాతప్రపంచ మంతయు ముక్కలైపోవుచున్నట్లు వారికి తోచెను. ప్రతిచోటను ఒకక్రొత్త సంగ్రామోత్సాహము, ఆత్మవిశ్వాసము, నిర్భయము ప్రస్ఫుటమగుచుండెను. భారతదేశములో బ్రిటిషుపాలనమునకు గొప్పయండయైన- అధికృత- చూచుచుండగా నశించుచుండెను.

కొద్దిమాత్రపు నిరోధములు ఉద్యమమునే బలపర్చుచుండెను. పెద్ద నాయకులపై చర్యతీసికొనుటకు ప్రభుత్వము చాలకాలము సందేహించెను. దానివలన నెట్టిఫలితము సిద్ధించునో వారికి తెలియకుండెను. భారతసైన్యమును విశ్వసింపదగునా? పోలీసులు ఆజ్ఞలను శిరసావహింతురా? 1921 డిసెంబరులో రీడింగుప్రభువు, వైస్రాయి, చెప్పినట్లు వారు "విభ్రాంతాత్ములైరి. మతిహీనులైరి."

1921 వేసవిలో సంయుక్తపరగణాల ప్రభుత్వమువారు తమ జిల్లా యధికారులకొక చిత్రమైన రహస్యయుత్తరువును పంపించిరి. ఈ యుత్తరువు తరువాత నొకవార్తాపత్రికలో ప్రకటింపబడెను. "శత్రువే," అనగా కాంగ్రెసు, యెప్పుడును ముందు "కాలుదువ్వు"చున్నదనియు నిదిచాలవిషాదకరమైన విషయమనియు నీయుత్తరువు సవిచారముగా వెలిబుచ్చెను. ఈపరిస్థితిని మార్చి తామే ముందుకాలుదువ్వుటకనేక పద్ధతులు సూచింపబడెను. వాటిలో "అమానుసభ" లనెడి హాస్యాస్పదములైన సభలనుస్థాపించుట యొకటి. అసహాయోద్యమము నీయమోఘ విధమున డీకొనవలెనని లిబరలుపక్ష మంత్రివర్గమువారు సూచించుటచే దీని నవలంబించిరని విశ్వసింపబడెను.

చాలమంది బ్రిటిషు యధికారుల నాడులు స్తంభింప నారంభించెను; వారియారాట మధికమయ్యెను. అంతకంత కభివృద్ధి చెందుచున్న వ్యతిరేకభావము, ప్రభుత్వాధికారతత్త్వము భారతోద్యోగులను నడివర్షాకాలపు మేఘములవలె కప్పివేయుచుండెను. కాని పద్ధతులన్నియు సాత్త్వికములగుటచే బలవంతముగా సణచివేయుట కెట్టిమిష గాని, యవకాశముగాని, యదనుగాని దొరకదయ్యెను! సామాన్య యాంగ్లేయుడెవ్వడును దౌర్జన్యరాహిత్యసంధతను నమ్మజాలకుండెను. ఇది రహస్యముగా జరుగుచున్న దౌర్జన్యప్రణాళికములను కప్పిపుచ్చు తంత్రము, మోసము అనియు, నిదియెప్పుడో యొకనాడు ఉపద్రవ్యముగా

దౌర్జన్యముతో వేర్పడుననియు నతడు భావించెను. ప్రాచ్యము చిత్రమైన దనియు, నచ్చటి బజారులలోను, సందు గొందులలోను నిరంతరము రహస్య కుటలను పన్నుచుందురనియు చిన్ననాటనుండియు కలుపబడిన విశ్వాసములతోనుండు ఆంగ్లేయుడీరహస్య యుతము లనుకొనబడిన దేశవిషయములనుగురించి సరళముగా భావింపజాలడు. ఏరహస్యములును లేని నిరాడంబరుడైన యాప్రాచ్యుని గ్రహించుట కతడెట్టి ప్రయత్నము చేయడు. వందలకొలది మైళ్ళ దూరములోనుండి గూఢచారులును, రహస్యసంఘములును, తెచ్చు గాథలనుండి ప్రాచ్యుని గురించి భావములనేర్పరచుకొని యతడొక యూహాప్రపంచమును నిర్మించుకొనును. 1919 ఏప్రిల్ నెలలో పంజాబులో నిట్లే జరిగెను. ప్రభుత్వము వారిని, యింగ్లీషు ప్రజలను హఠాద్భయ మావహించెను. వారికి ప్రతి చోటను ఉపద్రవము ప్రజలందరు నొక్కసారి లేచుట, భయంకర హత్యలతో గూడిన రెండవ మ్యూటినీ (తిరుగుబాటు) కాన్పించెను. ఎట్లైనను ఆత్మరక్షణ మొనర్చుకొనవలెననెడి యంధప్రయత్నమే జలియనువాలా శ్రీభత్సమునకును, పొట్టలమీద ప్రాకించిన యమృశ్యసరభు సందుకును కారణమయ్యెను.

1921 వ సంవత్సర మతి బింకమైన సంవత్సరము; ఉద్యోగస్థుల నుడికించుటకు, రెచ్చగొట్టుటకు, నిరుత్సాహపరచుటకు తగిన దెంతయో యుండెడిది. ప్రత్యక్షముగా జరుగుచుండిన విషయములే, కన్నెఱ్ఱగా నుండ నిక నూహింపబడిన విషయములను గురించి వేరుగ చెప్పనక్కర లేదు. ఈ పిచ్చియూహాలకు చెందిన యుదాహరణ మొకటి నాకింకను జ్ఞాపకమున్నది. మాసోదరి, స్వరూప, వివాహముహూర్తము 1921 మే 10 వ తేదీని (ఆచారము ప్రకారము తిథి వార నక్షత్రములను చూచి మంచిరోజున) అలహాబాదులో జరుపుటకు పెద్దలచే నిశ్చయింపబడెను. అనేకమంది ప్రధాన కాంగ్రెసు నాయకులును, గాంధీజీ ఆలీ

సోదరులు మొదలగు వారును దీని కాహ్వానింపబడిరి. ఇంతమందికి ననుకూలముగ నుండుటకై యాసమయమందే అలహాబాదులో కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గసమావేశము కూడ నేర్పాటు చేయబడెను. స్థానిక కాంగ్రెసు సంఘమువారు బయటనుండి వచ్చు మహానాయకుల సందర్శన లాభమును పొందవలెనని, జిల్లా కాన్ఫరెన్సు నేర్పాటుచేసి, చుట్టుప్రక్కల గ్రామముల నుండి వేలకొలది రైతులు వత్తురని బ్రహ్మాండమైన ప్రయత్నములను చేసిరి.

ఈరాజకీయ సభలవలన అలహాబాదు పట్టణమంతయు మహో ద్రేకముతోను కోలాహలముతోను నిండియుండెను. కొంతమందికది కలవరమునకు కారణమయ్యెను. ఒకనాడు నాబారిష్టరు స్నేహితుడొకడు చాలమంది ఇంగ్లీషువారు దీనివలన భయభ్రాంతులైరనియు పట్టణములో గొప్ప తిరుగుబాటు జరుగునని భావించిరనియు చెప్పెను. వారు తమభారత నౌకరులను విశ్వసింపక తమ జేబులలో నెప్పుడును రివాల్వరులను తీసికొని వెళ్లెడివారు. అవసరమైనచో ఇంగ్లీషు ప్రజలను దాచుటకు అలహాబాదుకోట తయారుగానుంచబడెనని యిష్టాగోష్ఠిగా చెప్పుకొనుచుండెడివారు. సుఖముగా నిద్రించుచు ప్రశాంతముగానున్న అలహాబాదు పట్టణమును కేవల శాంతిదూతలే సందర్శింప వచ్చు సమయమున తిరుగుబాటు జరుగునని యూహింపగలుగుట నా కాశ్చర్యమును కలిగించెను. అది నాకర్థముకాలేదు. అయ్యో! పదవ మే! (నాచెల్లెలి వివాహదినము) 1857 లో మీరటులో జరిగిన విప్లవోద్యమ వార్షికదినము. దానినే జరుపబోవుచున్నారు. అని చెప్పబడుచుండెడిది. 1921 లో ఖిలాఫతు యుద్యమమునకు చాల ప్రాముఖ్యత నిచ్చుటచే చాలమంది మౌల్వీలు, మహమ్మదీయ మతనాయకులు రాజకీయ పోరాటములో ప్రధానపాత్రను ధరించిరి. వారు ఉద్యమమునకు మత స్వభావమును కల్పించుటచే చాలమంది మహమ్మదీయులనది యాకర్షించెను. మతస్వభావ మెంతమాత్రమునులేని పాశ్చాత్య సంపర్కము

గల మహమ్మదీయులు చాలమంది గెడ్డములనుపెంచుట మొదలగు క్రియలచే సనాతన సూత్రములను పాటించెడివారు. పాశ్చాత్యసంపర్కాభివృద్ధిమైనకొలదితగ్గిపోవుచున్న మౌల్వీలపలుకుబడి, గౌరవము మరల హెచ్చనారంభించి ముస్లింజాతిపై యధికారము చేయనారంభించెను. ఆలీసోదరులు (సహజముగా మతస్వభావముకలవారు) యీవిధానమును బలపర్చిరి. గాంధిజీకి, మౌల్వీలనినను, మౌలానాలనినను అఖండ గౌరవము. అతడు కూడ దీనికి తోడ్పడెను.

ఉద్యమముయొక్క మత, ఆధ్యాత్మిక ప్రాశస్త్యమునుగురించి గాంధిజీ యెప్పుడును వక్కాణించుచునేయుండెను. అతనిమతము అధికారపూరితముకాదు. కాని జీవితమునది నిశ్చితమైన మతదృష్టితోనే చూచెను. ఉద్యమమంతయు నీదృష్టితో నిండియుండి ప్రజలకు సంబంధించి నంతవరకిది యొకమత ప్రబోధముగా పరిణమించెను. కాంగ్రెసు సేవకులు చాలమంది సహజముగా తమనాయకునియే యనుకరించ ప్రయత్నించి యతనిభాషనే వర్ణింప నారంభించిరి. కానికార్యనిర్వాహక వర్గములోని గాంధిజీ ప్రధానసహచరులైన మోతిలాల్జీ, దేశబంధుదాసు, లాలాలజపతిరాయి మొదలగువారు (మామూలుభాషలో) మతప్రసక్తి లేనివారు. వారు రాజకీయసమస్యలను రాజకీయదృష్టితోనే తర్కించెడివారు. వారు బహిరంగోపన్యాసములలో మతమునంగతి యెత్తెడివారు కారు. కాని వారు చెప్పెడి విషయములకంటె వారివ్యక్తిగత సాదృశ్యమే- వారు సమస్తైశ్వర్యములను భోగభాగ్యములను, భవ్యహర్మ్యములను విడిచిపుచ్చి, సన్యాసజీవితము నాలింగనమొనర్చలేదా?- ప్రజలనెక్కుడుగ నాకర్షించెను. ఇదియే మతచిహ్నముగా తీసికొనబడి మత ప్రబోధ ప్రచారమునకు తోడ్పడెను.

మనరాజకీయములలో నీమతవిజృంభణ (హిందువులలోను మహమ్మదీయులలోనుకూడ) మేమి? యని నేనొక్కొక్కప్పుడు బాధపడెడి

వాఁడను. నాకది యెంతమాత్రము నిష్టములేదు. మాలవ్యాలు మౌలానాలు స్వాముల వార్లు మొదలగువారు సభలలో నుపన్యసించెడి విషయములు నాకు చాలవరకు దౌర్భాగ్యములుగా దోఁచెను. వారు చెప్పెడి చరిత్ర, సాంఘికశాస్త్రము, ఆర్థికశాస్త్రము లన్నియు నాకు చాలతప్పులుగా కన్పించెను. ప్రతిదానిని మతముతో ముడిపెట్టు చుండుటచే నిర్మలమైన యాలోచనల కెంతమాత్రమును వీలులేకుండెను. గాంధిజీ పదప్రయోగములుకూడ -'రామరాజ్యము' 'కృతయుగము తిరిగిరానున్నది'- యనునట్టివి యొక్కొక్కప్పుడు నాకుచాలకంటకముగ నుండెడివి. కాని దీనితో జోక్యము కల్పించుకొనఁగలశక్తి నాకు లేక పోయెను. ప్రజల కాపదములు బాగుగ తెలియుననియు, నర్థమగుననియు కనుక గాంధీజీవానినుపయోగించుకొను చున్నాఁడనియు నేను సంతృప్తి పడుచుండెడివాఁడను. ప్రజల హృదంతరాళములను చూఱగొనుటలో నతని కద్భుతశక్తి కలదు.

ఇంతకు నేనీవిషయములను గురించి యంతగా బాధపడలేదు. ఉద్యమాభివృద్ధిలోను, యెడతెగని పనిలోను మునిగియుండుటచే నాకిట్టి స్వల్పము (నాకప్పుడవి యట్లేతోఁచెను) లనుగూర్చి యోజించుటకు తీరికలేకయుండెను. ఒకమహోద్యమములో నన్నిరకముల మనుష్యులు నుందురు. ప్రధానప్రవాహము సక్రమముగా నున్నంతవరకు, పిల్లకెరటములను, చిన్నగుంటలను మనములెక్కచేయనక్కరలేదు. ఇక గాంధీజీ యసామాన్యుఁడు. అతనినర్థముచేసికొనుట చాలకష్టము. ఒక్కొక్కప్పుడతని భాష సామాన్య ఆధునికున కర్థముకాదు. అతఁడు చాలగొప్పవాఁడనియు, ననన్యుఁడనియు, మహోత్తమ నాయకుఁడనియు మేమర్థము చేసికొని యతనియందు సంపూర్ణవిశ్వాసముంచి సమస్తము నతనికే బాహాటముగ (తాత్కాలికముగనైనను) విడిచివేసితిమి. తఱచు మేమతని వెఱ్ఱులనుగురించి, చిత్రమైన భావములనుగురించి మాలో

మేము చర్చించుకొనుచు స్వరాజ్యమువచ్చినతరువాత నీవిట్టివిలను (క్రాంత వేళాకోళముతో) ప్రోత్సహింపకూడదనుకొనెడివారము.

మాలో చాలమంది రాజకీయములలోను యితరవిషయముల లోను సతసిపలుకుబడి కెక్కువగాలోబడియుండుటచే మతసాంప్రదాయ ములో కూడ మేమతనినుండి పూర్తిగా తప్పించుకొనజాలకపోతిమి. ప్రత్యక్షముగా కాకపోయినను పరోక్షముగానైనను వచ్చుదాడుల నుండి మమ్ము మేము రక్షించుకొనజాలక పోతిమి. మతముయొక్క బాహ్యాడంబరములు నన్నాకర్షింపలేదు. మతముపేరిట సంచరించు మతనామధారులు ప్రజలను కొల్లగొనుటను నేను సహింపజాలనైతిని. అయినను నేనుదానికి తలయొగ్గితిని. నా బాల్యములగాయతు నేనెన్నడు నెరుగని మతాభిమానము నాకు 1921 లో కలిగెను. అప్పటికిని నేను దానినెక్కువగా దరికి చేరనీయలేదు.

మనయుద్యమము యొక్కయు, సత్యాగ్రహము యొక్కయు, నైతిక, ధార్మిక బలమునే నేనెక్కువగా మెచ్చుకొనెడివాడను. దౌర్జన్య రాహిత్యసూత్రము శాశ్వతమనిగాని, శిలాశాసనమనిగాని, నేను భావింపలేదు. నేను దానిని పరమపదముగా శిరసావహింపలేదు. కాని యదినన్నంతకంతకెక్కుడుగ నాకర్షించెను. భారతదేశ పరిస్థితులను బట్టియు, మనసాంప్రదాయములను, చరిత్రనుబట్టియు నదియేమనమవలం బింపదగిన సరియైన నీతియనువిశ్వాసము నాలో నానాటికి ప్రబలెను. రాజకీయముల నాధ్యాత్మిక (సంకుచితమైన మతదృష్టిలో నీపదము నుపయోగింపక) మొనర్చుట నాకొక చక్కనిభావముగా తోచెను. యోగ్యమైన పరమావధికి యోగ్యమైన సాధనములే యుండవలెను. అది కేవలమొక మంచినైతికసిద్ధాంతమేకాక యథార్థమైన యనుభవ రాజకీయములుగకూడ తోచెను. అయోగ్యములైన సాధనములు లేక చుగా పరమావధికి తీసికొనకపోవుటయేగాక క్రొత్తసమస్యలను, క్రొత్త

కష్టములను తెచ్చిపెట్టును. అట్టిసాధనములను బూనుట పంకిలాలిప్తులగుట, వ్యక్తి, జాతియాత్మగౌరవములకు తగదనియు, వినాశకరమనియు తోచెను. అపవిత్రులము కాకుండ దానినుండి మన మెట్లుతప్పించుకొనగలము? ప్రాకుటవలనను వంగివంగి నడచుటవలనను మన మెట్లు గౌరవముగను, వేగముగను ముందుకుపోగలము?

అప్పుడు నా భావము లిట్లుండెను. అసహాయోద్యమము నాకోరకను— జాతీయస్వాతంత్ర్యమును, (నేనుకొంటిని)పోరుతేని యుద్యమాయికి ప్రజాదోపిడి నంతముచేయుటయు, నానైతిక భావములను సంతృప్తిపరచి నాకాత్మస్వేచ్ఛ నొసంగుసాధనమును— యీడేర్చును. ఈయాత్మతృప్తిముందర నపజయమునైనను నేను లెక్కచేయకపోతిని; అట్టి యపజయము కేవలము తాత్కాలికమేయగును. ప్రతిసాయంకాలము గాంధీజీ ఆశ్రమప్రార్థనలలో భగవద్గీతాశ్లోకములు చదువబడుచుండెను. నాకందులోని వేదాంతమర్థము కాలేదు. కాని నేనాశ్లోకములను ప్రీతితో చదివెడివాడను. అవి మానవు డెట్లుండవలెనో సూచించెను :— కార్యములందు తొట్రుపాటులేక శాంతమును, స్థిరత్వమును పొందుము. కర్మయందే నీకధికారము కలదు. ఫలముకొరకు వృథాజ్ఞాన పడకుము. అంతశ్శాంతిలేక ఉదాసీనతలేనివాడనగుటచే (బహుశః) నిరాశయము నాకు మరింత యాదరణీయమయ్యెను.

---

## ౧౧

# 1921 మొదటి నిర్బంధము.



1921 చాలయసాహాస్యమైన సంవత్సరము. జాతీయత, రాజకీయములు, మతము, కుమతము, విమతము— ఇవన్నియు కలగాపులగమయ్యెను. ఈయన్నింటివెనుక వ్యవసాయికాందోళనము పెద్దపెద్ద పట్టణములలో పారిశ్రామికకూలీ యుద్యమములు నుండెను. జాతీయతయు, (అనిర్ణయమైనను) బ్రహ్మాండముగా దేశమునంతను యావరించిన యొక మహాశయమును (ఒక్కొక్కప్పుడు) పరస్పరవిరుద్ధములైన యీయాయసంతృప్తిని సమన్వయపరచుటకు ప్రయత్నించి చాలవరకు విజయమునొందెను. కాని యీజాతీయత మిశ్రమశక్తిగనుండెను. దీని వెనుక హిందూజాతీయత, భారతసరిహద్దులనుదాటి (కొంతవరకు) చూచు ముస్లింజాతీయత, కాలతత్వమునకెక్కువగా సరిపడిన భారత జాతీయత స్పష్టముగా కాన్పించుచుండెను. అప్పటిమట్టు కవియన్నియు కలిసి పనిచేసెను. "హిందూముసల్మానుకి జై" యను కేకలే ప్రతి చోటను ప్రతిధ్వనించెను. గాంధిజీ యిట్టి నానాకులములవారిని, నానా గోత్రములవారిని సమన్వయపరచి, యేకత్రాటిని నడిపింపగలుగుటే మహాద్భుతవిషయము. అతడు (మరియొక నాయకునిగురించి యుపయోగింపబడినపదము) "ప్రజల యసంబద్ధకోరికలను వ్యక్తీకరించుటకేర్పడిన మూర్తి"

ఈకోరికలచేతను, రాగిములచేతను, తామెదుర్చుచున్న ప్రభుత్వముపై, నిసుమంతయైనను ద్వేషములేకపోవుటయే మరింత యద్భుత విషయము. జాతీయత ముఖ్యముగా వ్యతిరేకభావభూయిష్టము. అది యితర జాతులపైగల క్రోధ ద్వేషములమీదనే పెరిగిపెద్దదియగును. ముఖ్యముగా బానిస దేశములలో పరప్రభుత్వము దీనికి గురియగును. 1921 లో భారత

దేశమున, బ్రిటిషువారిపయి నిట్టి క్రోధ ద్వేషములుగలవు. కాని యిదేశస్థితిలో నున్న యితర దేశములతో పోల్చి చూచినచో నిది యత్యల్పము. గాంధిజీ దౌర్జన్యరాహిత్యము కెక్కువ ప్రాధాన్యత నిచ్చుటయే దీనికి కారణమని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఉద్యమ మారంభమగుటతోడనే సేతుసీత నగమధ్యస్థప్రదేశమంతయు నొక్కసారిగా ననుభవించిన యధికార, స్వేచ్ఛాభావములును, త్వరలోనే జయము చేకూరనున్నదను భావమును కూడ దీనికి కొంత కారణము. ఇంత జయప్రదముగా పని జరుగుచున్నప్పుడును జయము చేతిలో నున్నప్పుడును క్రోధమేల? ద్వేషమెందులకు? మే ముదారతను చూపగలమని, చూపవచ్చునని భావించితిమి.

జాతీయోద్యమము నెదిర్చి మాకు వ్యతిరేకముగ పనిచేసిన కొద్దిమంది భారతీయులపట్ల (మాకార్యములు యుక్తముగను జాగరూకత నుండినను) మాత్రము మేమట్టి యుదారతను చూపియుండలేదు. అట్లని మాకు వారియెడల ద్వేషముగాని క్రోధముగాని లేదు. వారి కెట్టి పలుకుబడియు లేకపోవుటచే మేము వారిని లెక్కసేయ నవసరమే లేదు. కాని వారి దుర్బలత్వమునకును సమయానుకూలకత్వమునకును, జాతీయ గౌరవభంగ ప్రవర్తనమునకును వారియెడల మాకాంతర్యమున ద్వేషముండెడిది.

ఈవిధముగా మేము, కార్యతత్పరత మమ్మావేశించియుండ, మాకొక నిర్ణయము లేకపోయినను, జోరుగా పోవుచుంటిమి. కాని మాపరమావధిని గురించి మాకు నిర్మలమైన యాలోచన యెంత మాత్రమును లేకుండెను. మన యుద్యమముయొక్క తత్త్వభాగమును, నిశ్చలమైన లక్ష్యమును, మేమెంత నిర్లక్ష్యము చేసితిమో తలచుకొనిన నిప్పు డాశ్చర్యమగుచున్నది. మేమందరమును స్వారాజ్యమును గురించి గంభీరముగ నుపన్యసించెడివారము, కాని దానికి మొనగికి యోచన

యర్థము వారు చెప్పెడివారము. యువకులకు చాలమంది కది రాజకీయ స్వాతంత్ర్యమనియు లేక దానిని పోలినదనియు ప్రజాస్వామికమనియు నర్థమయ్యెను. మేము మా యుపన్యాసములలో నట్లే చెప్పెడివారము. రైతులను కూలీలను నలిపివేయుచున్న యనేకబాధలు విధాయికముగా తగ్గుననికూడ మాలోచాలమంది భావించితిమి. కాని మా నాయకులకు చాలమందికి స్వరాజ్యము స్వాతంత్ర్యముకంటె చాలతక్కువది యనుభావములున్నట్లు స్పష్టమయ్యెను. గాంధిజీ యీ విషయమై నిర్ధారణలేక యుండుటయేగాక దీనినిగురించి స్పష్టమైన యాలోచనను ప్రోత్సహింపకుండెను. కాని యతడెప్పుడును క్రింది తరగతివారిగతినిగురించి (నిర్ణయములేకపోయినను) వివరముగ మాట్లాడుచుండుటచే మేము శాంతపడెడివారము. కాని యతడు పైవారికిగూడ నభయహస్తము నిచ్చుచుండెడివాడు. గాంధిజీ యెప్పుడును యే సమస్యకైనను హేతువాదప్రాశస్త్యమునుగాక గుణ, శీల, పవిత్రతల ప్రాశస్త్యమునే యిచ్చుచుండెడివాడు. అతడు భారతప్రజలకు నిర్భయత్వమును గుణ, శీల, శక్తులను ప్రసాదించుటలో నద్భుతవిజయమును గాంచెను. నిర్భయత్వమును గుణశీలములను నెంతమాత్రము నభివృద్ధి చేయక కునిష్టిశరిరము, నిర్జీవదృష్టియే పవిత్రతకు బాహ్యచిహ్నములని భావించినవారెందరో లేకపోలేదు.

ప్రజల యీ యసామాన్య ధైర్యస్థైర్యములే మా కెక్కడలేని విశ్వాసమును కలుగజేసెను. ఛిన్నభిన్నమై చెల్లాచెదరై భ్రష్టులై వెనుకపడియున్న ప్రజలొక్కసారి నడుములు బిగించి తలయెత్తి దేశమంతటను సమిష్టికార్యములో సుశిక్షితపాత్రను ధరించిరి. ఈ కార్యమొక్కటియే ప్రజలకప్రతిహతమైన శక్తినిచ్చునని మేము భావించితిమి. ఈ కార్యము వెనుక నుండవలసినభావమును మేము నిర్లక్ష్యము చేసితిమి, బుద్ధిపూర్వకమైన యొకలక్ష్యము ప్రయోజనము లేనిదే

ప్రజల యుత్సాహశక్తులు చాలవరకు నిరర్థకమగునను సంగతిని మేము మరచిపోతిమి. కొంత వరకు ఉద్యమములో నున్న మత ప్రబోధము మమ్ము ముందుకు నడపుచుండెను. రాజకీయ ఆర్థిక సమస్యలను బాగుచేయుటకును లేక దుర్మార్గమును పోగొట్టుటకును దౌర్జన్య రాహిత్యమను నూతన సందేశమును మనప్రజలు ప్రపంచమునకు ప్రసాదింప నుద్దేశింపబడిరను భావముండెడిది. అన్నిజాతులకును అందరుప్రజలకును యెవరికివారు తామే నెత్తిమీది దేవతలమని యుండెడి పిచ్చిభ్రమయే మమ్మావహించెను. యుద్ధములకును, దౌర్జన్యయుతమగు నన్నిపోరాటములకును దౌర్జన్యరాహిత్యము నైతిక సామ్యమయ్యెను. అది కేవలమొక నైతిక ప్రతిపద్ధతియేకాక శక్తియుతమైయుండెను. యంత్రములను గురించియు, ఆధునిక నాగరకతను గురించియు గాంధిజీకున్న తాతలనాటి భావములను మేమెవరము (నాయుద్దేశ్యము) అంగీకరింపలేదు. అవి యాధునికపరిస్థితులకు వర్తింపవనియు, కేవల గగనకుసుమము వంటివనియు వారును తలంచెడివాడని మేమనుకొంటిమి. భారతపరిస్థితులకు తగినట్లు కొన్ని మార్పులను చేసికొనుట కవకాశమున్నను ఆధునికనాగరికత సాధించినసిద్ధులను మాలో చాలమంది తిరస్కరింప సంసిద్ధులముకాము. పెద్దయంత్రములును హుటాహుటి ప్రయాణములును వ్యక్తిగతముగ నన్నెపుడును యాకర్షించెను. అయినను నిస్సందేహముగ గాంధిజీయొక్కతత్వము చాలమందికి పట్టుటచేవారు యంత్రములను తత్ఫలితములను విమర్శించుచుండెడివారు. కనుక కొంతమంది ముందుకు భవిష్యత్తుకుచూచుచుండ మరికొంతమంది వెనుకకు గతముకుచూచుచుండిరి. ఉభయులును, చిత్రముగా తామొనర్చు సమిష్టికార్యాచరణము భావ్యమేయని తలంచిరి, దీనివలన త్యాగసన్నాహ మెక్కువ సుకరమయ్యెను.

నేనుపూర్తిగా నీయుద్యమములో నైక్యమైపోతిని. అనేకవేల మంది ప్రజలును నావలెనేయుండిరి. నేను నాయితరసంబంధములను పాతస్నేహితులు, పుస్తకములు, చివరకువార్తాపత్రికలు (మాపనికి సంబంధించినంతవరకుతప్ప)— అన్నింటిని కట్టిపెట్టితిని. అంతవరకును నేను కొన్నివర్తమానగ్రంథములను చదువుచు ప్రపంచవ్యవహారాభివృద్ధిని గమనించుచుంటిని. దీనికి నాకిప్పుడు తీరికలేకయుండెను. కుటుంబబంధనములు నన్నెంతగాబాధించినను, నేను నాకుటుంబమును, భార్యను, కుమార్తెను కొంచెమించుమించుమరచిపోతిని. నేనారోజులలో వారికెంత భారముగను, కష్టముగనునుండెడివాడనో, నాభార్యనాయెడల నెంతటియద్భుతమైన యోర్పును, సహనమును చూపెనో చాలకాలము గతించినతరువాతనే నేను గ్రహింపగలిగితిని. నేను ఆఫీసులలోను, కమిటీసభలలోను ప్రజాసమూహముల లోను జీవించు చుండెడివాడను. "పొండు! గ్రామములకు పొండు!" అను యుద్ధనాదము వినిపించుట తోడనే మేమనేకమైళ్లు పొలములను, చెలకలను, అడ్డము త్రొక్కుకొని పోవుచు, మూలమూలలనున్న గ్రామములను దర్శించుచు రైతు సభలలో నుపన్యసించెడివారము. ప్రజోత్సాహమును ప్రజావశీకరణశక్తిని, నేననుభవించితిని. ప్రజల చిత్తవృత్తిని, పట్టణ ప్రజలకును, రైతులకును గల భేదమును, నేనర్థము చేసికొన నారంభించితిని. దుమ్ములోను, ధూళిలోను, అసుఖములోను, పెద్ద పెద్ద సభలలోని త్రోపుడులలోను, త్రొక్కులాటలలోను (వారిలో శిక్షణ లేకపోవుట తఱచు నాకు కోపము కలిగించుచుండినను) నేను మంచి హుషారుగనే యుండెడివాడను. అప్పటినుండి నేనొక్కొకప్పుడు క్రోధపూరితులును, వ్యతిరేకులును అగు ప్రజను (ఏయగ్నికణమో వీరిని రగుల్కొల్పునంతటి యుద్రేకస్థితిలో నుండెడివారు.) తార్కొనవలసి వచ్చెడిది. నావెనుకటి యనుభవమును, దానివలన నాకుకలిగిన విశ్వాసమును నాకిప్పుడు మంచియుపకారములయ్యెను. నేనెప్పుడును తిన్నగా

నైయ్యిమని ప్రజలమధ్యకు పోయెడివాడను; వారిని విశ్వసించెడివాడను. అభిప్రాయభేదమున్నను వారెల్లప్పుడును యింతవరకు నాయెడల నాదరణమును మెచ్చుకోలును చూపించిరి. కాని ప్రజలెప్పుడును అస్థిరులు భవిష్యత్తులో నాకువిపరీతానుభవములే సంభవింపవచ్చును.

నేను ప్రజనువిశ్వశించితిని; ప్రజ నన్నువిశ్వశించెను. కాని వారి మధ్య నేనెన్నడును నన్ను మరచిపోలేదు. నేనెప్పుడును వారికిదూరముగ నున్నట్లేభావించి నాప్రత్యేకమానసికాస్థానమునుండియే నేను వారిని సవిమర్శగాచూచెడివాడను. ఆచారములలోను, కోరికలలోను, మానసికాధ్యాత్మికదృష్టిలోను ప్రతివిషయములోను నన్ను చుట్టియుండెడి వేలకొలదిప్రజలతో భిన్నుడనైననేను వారిప్రేమను, విశ్వాసమును నెట్లు చూఱగొంటినాయని యెప్పుడును ఆశ్చర్యపడెడివాడను. వారు నన్ను సరిగానర్థముచేసికొనకపోవుటచే నిదిసంభవించెనా ? నన్ను బాగుగనెరిగినతరువాత వారునన్నుసహించెదరా ? అసత్యపటపలచే నేను వారిప్రేమనార్జించితినా ? నేను వారియెడ నిష్కపటముగను, నిర్మోగమాటముగను నుండుటకే ప్రయత్నించితిని. నేనొక్కొక్కప్పుడు కఠినముగా మాట్లాడుచు వారిమూఢవిశ్వాసములను ఆచారములను విమర్శించుచుండినను వారు నన్నెంతయోసహించుచుండెడివారు. అయినను వారు నానిజస్వరూపమునుగాక నన్నుగురించి వారూహించుకొనిన యూహాస్వరూపమునే ప్రేమించిరనుభావమునన్నుపీడకుండెను. ఈయూహకల్పిత స్వరూపమెంతకాలమునిలువగలదు ? దీనినేల నిలువనీయవలెను ? అది నశించి, యథార్థము వారికి గోచరించినపు డేమిజరుగును ?

నేననేకవిధముల గర్విష్టిని. కాని యీ నిరాడంబరప్రజలలో గర్వమనునది మందునకైనను కానరాదు. వారికంటె చాలఘనులమని యనుకొను మధ్యతరగతులవారమైన మనవలె వారిలో విఱ్ఱవీగుటగాని, యసంస్కారప్రవర్తనముగాని లేదు. వారంతబుద్ధిమంతులుగారు;

వ్యక్తిగతముగ నాకర్షణశక్తి గలవారునుకారు. కాని బాహుళ్యము మీద వారపార విచారమునుపుట్టించుచు విషాదభావాలలతిసమీపములో రగుల్కొనుననుభావమును కలిగించెడివారు.

పేరెన్నికగనిన నేతలమైనమనము, నాతోసహా, మహాసభలలో వేదికలమీద ప్రవర్తించువిధము విపరీతముగానుండెను. అక్కడ కావలసినంత బుద్ధితిరుగుచుండెడిది. మావాగాడంబరమైన యుపన్యాసములలో సంస్కారమున కెంతమాత్రమును లోపముండెడిదికాదు. మాకిందరకు కొంతవరకు నీదోషమేపట్టెను. కాని కొంతమంది ఖిలాఫతుపెల్లనాయకులిందులో మమ్మందరను 'చిత్తుచేసిరి'. వేలకొలది గలసభలో సహజముగప్రవర్తించుట చాలకష్టము. మాకెవరికిని యంతకు మునుపెట్టి బహిరంగసభల యనుభవములేదు. మేము నాయకులవలె కనపడవలెనని గాఢాలోచనపరులవలెను, శ్రద్ధాసమన్వితులవలెను నుండుటకు ప్రయత్నించెడివారము. మేము నడచునప్పుడు, మాట్లాడునప్పుడు, నవ్వునప్పుడు మమ్ము వేలకొలదికన్నులెదురుచూచున్నవని మేమెరిగియుండుటచే మేముదానికితగినట్లు ప్రవర్తించుచుండెడినారము. తరుచు మాయుపన్యాసము లతిగంభీరముగనుండెడివి. అవి యెంతగంభీరముగనుండెడివో యంతవిచిత్రముగా విషయశూన్యముగ నుండెడివి. ఇతరులు మనలనుచూచునట్లు మనముమనలనుచూచుకొనుట చాల కష్టము. కనుక నన్ను నేను విమర్శించుకొనజాలక నితరులప్రవర్తనము నతిజాగ్రత్తగ పరీక్షించుచుండెడివాడను. ఈవృత్తి నాకు చాలవినోదమును కలిగించుచుండెడిది. ఇంతలో, నేనుకూడ నితరులదృష్టిలో నింత హాస్యాస్పదముగనే కాన్పించవచ్చుననుభీతి కలుగుచుండెడిది.

1921 సంవత్సరమంతలను కాంగ్రెసు వ్యక్తులుమాత్రమే నిర్బంధింపబడి శిక్షింపబడిరి. అప్పుడు ప్రజానిర్బంధములులేవు. భారతసైన్యములో ద్వేషమునుపురికొల్పిరని ఆలీసోదరులకు దీర్ఘశిక్షలనువిధించిరి.

హారేపదములకొరకు శిక్షింపబడిరో ఆపదములే నూరులకొలది వేదికల మీద వేలకొలది ప్రజలచే నుచ్చరింపబడెను. నేనిచ్చిన యుపన్యాసము లకు నాపై రాజద్రోహము మోపబడునని వేసవిలో వదంతులు చెల రేగెను. కాని యప్పుడట్టిచర్యయేదియు తీసికొనబడలేదు. సంవత్స రాంతముకు పరిస్థితులు విషమించెను. వేల్సుయువరాజు భారత దేశము రానుండుటచే కాంగ్రెసు వాని రాక సందర్భమునజరుగు నన్ని యుత్సవము లను బహిష్కరించెను. నవంబరు మాసాంతమున బంగాళములోని కాంగ్రెసువాలంటీరుదళము అక్రమసంఘముగా ప్రకటింపబడెను. తరువాత నే యీయస్త్రము సంయుక్తపరగణాలమీదగూడ ప్రయోగింపబడెను. "నామణిబంధములపై యినుపబేడీలను నాశరీరముపై యయోమయ శృంఖలాభారమును నేననుభవించుచున్నాను. అది దాస్యబంధజనితా వేదన. భారత దేశమంతయు నొక పెద్ద కారాగారము. కాంగ్రెసురథ మెంత మాత్రమాగునదికాదు. నన్ను తీసికొనిపోయిననేమి ? హానిననేమి ? నేను మృతిచెందిననేమి ? జీవించిననేమి ?" అను సందేశమును దేశబంధు దాసు బంగాళమునకొసంగెను. మహారాష్ట్రములో మేమిూసవాలును తీసి కొని మావాలంటీరుదళము విరమింపబడదని ప్రకటించుటయేగాక దిన పత్రికలలో వాలంటీర్ల పేర్లనుకూడ ప్రకటించితిమి. మొదటిజాబితాలో మొదటిపేరు మాతండ్రిగారిదై యుండెను. అతడు వాలంటీరుకాకపోయి నను, ప్రభుత్వయాజ్ఞలను ధిక్కరించుట కేచేరి, తన పేరునిచ్చెను. డిసెం బరు ప్రారంభములో యువరాజు మహారాష్ట్రముకువచ్చుటకు కొద్ది రోజులుపూర్వము ప్రజానిర్బంధములు ప్రారంభమయ్యెను.

చివరకు పరిస్థితులు విషమించెనని మేము గుర్తించితిమి. కాంగ్రెసుకును ప్రభుత్వముకును సంఘర్షణ ప్రారంభము కానుండెను. జయిలు యింకను క్రొత్తప్రదేశము; జయిలుకు పోవుట యనుభవ మింకను నూతనము. అలహాబాదు కాంగ్రెసు కార్యాలయములో నొకనాడు నేను వెనుక పడియున్న పనిసంతను పూర్తిచేసికొనవలెనని

చాలసేపటివరకు పనిచేయుచుంటిని. పోలీసులు సర్చివారంటు తీసికొని వచ్చిరనియు, ఆఫీసును చుట్టుముట్టిరనియు నుద్రేకపూరితుడైన యొక గుమాస్తా నాతో చెప్పెను. అదియే నాకు మొదటిసారి కనుక నేనును కొంచెము ద్రేకపడితిని. కాని పోలీసుల రాకపోకలవలన నిసుమంతయు చలింపనివానివలె నుండవలెనను కోరిక హెచ్చుగా నుండుటచే, నేనొక గుమాస్తాను పోలీసు యుద్యోగితో కూడ నుండమని యాజ్ఞాపించి తక్కినవారిని పోలీసులను లెక్కచేయక తమ తమ పనులలో నుండ నియమించితిని. కొంచెముసేపయిన తరువాత ఆఫీసు వెలుపల నిర్బంధింపబడిన యొక స్నేహితుడు నాయొద్ద సెలవు తీసికొనుట కొకపోలీసు వానితో కూడ వచ్చెను. ఈవింత సంభవములను నిత్యకర్మలవలె చూడవలెనను గర్వముతో నేను, కటికివానివలె నా స్నేహితుని చూచితిని. నేను వ్రాసికొనుచున్న యుత్తరము పూర్తియగువరకు నుండవలసినదని యతనిని, పోలీసువారిని నిర్లక్ష్యముగా చూచితిని. పట్టణములో నింకను నిర్బంధములు జరుగుచున్నవను వార్త తెలియుటచే. నేనింటికి పోయి యచ్చట నేమిజరుగుచున్నదో చూడవలెనని చివరకు నిశ్చయించుకొంటిని. పోలీసులు మాయింటి నప్పుడే వెతుకుచుండిరి. వారు తండ్రిగారిని నన్ను నిర్బంధించుటకు వచ్చిరని తెలిసికొంటిని.

యువరాజు జహిష్కారవిధానమత్యద్భుతముగ పనిచేసెను. అతని నెచ్చటకు గొంపోయిన నచ్చటనే హర్తాళములు, శూన్యవీధులు సిద్ధమయ్యెను. అతడు వచ్చినపు డలహాబాదు మృతనగరమువలె, శ్మశానవాటికవలె కాన్పించెను. బ్రహ్మాండమైన కలకత్తా పట్టణ మొక్కసారిగా తన కార్యకలాపముల నన్నింటిని కట్టివేసెను. అది యువరాజు యెడల కాఠిన్యతయే యగును. కాని దోషమతనిది కాదు. అతనియెడల నెట్టి ద్వేషమును చూపింపబడలేదు. కాని ధ్వంసము కావింపబడు చున్న తమ గౌరవాధిక్యతలను నిలుపబెట్టుకొనుటకు యువరాజు వ్యక్తిను పయోగించుకొనవలెనని భారత ప్రభుత్వమువారు ప్రయత్నించిరి.

నిర్బంధ పరంపరలు, శిక్షలు, ముఖ్యముగా బంగాళములోను సంయుక్త పరగణాలలోను చెలరేగెను. ఈ రాష్ట్రములలోని ముఖ్య కాంగ్రెసు నాయకులందరును నిర్బంధింపబడిరి. మామూలు వాలంటీర్లు వేనకువేలు జయిళ్ళను నింపిరి. వారు మొట్టమొదట చాలమంది పట్టణ వాసులు. వీరు నేల యీనినట్లు వచ్చుచుండిరి. సంయుక్త పరగణాల రాష్ట్ర కాంగ్రెసు కమిటీ సభ్యులందరును (55 మంది) కమిటీ సభ జరుపుచుండగా నిర్బంధింపబడిరి. ఇంతవరకు కాంగ్రెసులో కాని రాజకీయములలో గాని పాల్గొనని వారు చాలమంది కూడ నీప్రవాహములో వచ్చిపడి నిర్బంధింపవలసినదని, బలవంతపెట్టుచుండిరి. ప్రభుత్వ గుమాస్తా లెందరో సాయంకాల మాఫీసునుండి తమ యిండ్లకు తిరిగి పోవుచుండ నీ ప్రవాహములో కొట్టుకొనిపోయి తమ యిండ్లకు బదులు జయిళ్ళలో తేలుచుండెడివారు. యువకులును బాలురును పోలీసు లారీలలో నెక్కి కూర్చుని పొమ్మనినను, పోవ నిరాకరించుచుండిరి. ప్రతిసాయంకాలము స్వరాజ్య నినాదములు మిన్నుముట్టుచుండ, లారీ తరువాత లారీ జయిలు యావరణలోనికి వచ్చి పడుచుండ, జయిలు అధికారు లేమిచేయుటకును తోచక బాధపడుచుండిరి. అప్పుడప్పుడొక పోలీసులారీ, వారంటుప్రకారము, కొంతమందిమనుష్యులను, మొట్టి పేరులునులేకుండ తీసికొనివచ్చెడిది. మరియొక చిత్రమేమన లెక్కింపబడిన సంఖ్యకంటె నెక్కువమంది లారీనుండి దిగెడివారు. ఈ విపరీత పరిస్థితులలో తామెట్లు నడచుకొనవలెనో జయిలు అధికారులకు తెలిసెడిది కాదు. జయిలుస్మృతిలో దీనికెట్టి యాస్కారమును కాన్పించదు.

క్రమముగా ప్రభుత్వమువారు వివక్షతలేని, నిర్బంధములను చేయుట మానివేసి పేరుకలవారినే పట్టుకొనుచుండెడివారు. ప్రజలలో కూడ క్రమముగా నామొట్టమొదటి వీరావేశము తగ్గనారంభించెను. విశ్వాసార్హులైన నాయకులందరును జయిలులలోనుండుటచే నసహాయత అనిశ్చయము ప్రబలెను. కాని యీమార్పు కేవలము బాహ్యము,

రాజకీయాకాశమింకను మేఘావృతమైయుండి విప్లవసంఘటనల సీను చుండెను. మొత్తము ముప్పదివేలమంది నిర్బంధింపబడినట్లు 1921 డిసెంబరు 1922 జనవరులలో అంచనావేయబడెను. కొంచెమించుమించు నాయకులందరును జయిలులోనేయున్నను ప్రధాననాయకుడైన గాంధిమహాత్ముడింకను బయటనుండి యక్రమకార్యముల నిరోధించుచు సందేశములనిచ్చుచు, కర్తవ్యమును తెలుపుచు, ప్రజల నుద్బోధించుచుండెను. భారతసైన్యమేమగునో, పోలీసు లేమిచేయుదురో యను భీతాంగముచే ప్రభుత్వమువారతని నింతవరకును ముట్టలేదు.

హఠాత్తుగా 1922 ఫిబ్రవరిలో రంగమంతయు మారిపోయెను. గాంధీజీ సాత్వికనిరోధమును నిలిపివేసెననియు, పోరాటములోని యుద్ధసంరంభమునంతను నాపివేసెననియు జయిలులోనున్న మేమత్యాశ్చర్యముతో విని నిర్ఘాంతపోతిమి. చౌరీచౌరా దగ్గిర కొంతమంది పల్లెటూరిప్రజలు పోలీసుదౌర్జన్యమునెదిర్చి పోలీసు స్టేషనును పదిపన్నెండుమంది పోలీసులతోసహా తగులపెట్టుటచే నిట్లుచేయబడెనని వింటిమి.

ప్రతిరంగములోను మనదే ముందంజయై మనబలమప్రతిహతముగా కాన్పించుచున్న సమయమున పోరాటమునిట్లు నిలిపివేయుట మాకెంతయో ఆగ్రహమును కలిగించెను. కాని జయిలులోని మాఆశాభంగమువలనను, ఆగ్రహములవలనను లాభమెవరికిని చేకూరనేరదు. సాత్వికనిరోధ మాపివేయబడెను. అసహాయోద్యమ మంతరించెను. ప్రభుత్వమనేకనెలలనుండి పొందుచున్న భయవిహ్వాలతలు తగ్గెను. అది యూపిరిపీల్చుకొన నారంభించి, మొదటిసారి మనమీద దుముకుట కవకాశములభించెను. కొద్దివారములైన తరువాత వారు గాంధిజీని నిర్బంధించి దీర్ఘకాలశిక్ష విధించిరి.

౧౨

## దౌర్జన్యరాహిత్యము-క్షత్రితత్త్వము.

చౌరీచౌరా నైనతరువాత హఠాత్తుగా యుద్యమము నాపి వేయుట నొక్క-గాంధిజీతప్ప తక్కిన వారందరు నైక్యకంఠముతో గర్హించిరి. నాతండ్రి (అప్పుడు జయిలులోనుండెను.) ఈ వార్తవిని నిర్విణ్ణుడయ్యెను. యువకులు సహజముగ మరింత యాందోళనపడిరి. మాకొండలవంటి యాశలన్నియు నేలగూలుటచే నీమానసికవిపర్యయము సహజము. దీనిని నిలిపివేయుటకు చెప్పబడిన కారణములును వాటివలనకలిగిన ఫలితములును, మాకు మరింతబాధను కలిగించెను. చౌరీచౌరావిషయము చాలవిచారకరమైనదే కావచ్చును; అది ముమ్మాటికి విచారమైనదే! దౌర్జన్యరాహిత్యతత్త్వముకు కేవలమువ్యతిరేకము! కాని మారుమూలనున్న యొకగ్రామమును, దారితెన్నులేని గ్రామములోని యుద్రేకపూరితులైన రైతుమూకయు, స్వాతంత్ర్యము కొరకు చేయు జాతీయపోరాటమును (తాత్కాలికముగనైనను) ఆపివేయవలసినదేనా? అచ్చటచ్చట క్వచిత్తుగా జరుగు దౌర్జన్యమునకిదియే విధాయికమైన ఫలితమగుచో, దౌర్జన్యరాహిత్య సంగ్రామతత్త్వములోను, యీశాస్త్రములోను నేదోయొక లోపముండి తీరవలయును. ఏలనన నట్టి దురదృష్టసంభవమేదియు జరుగకుండ పూచీపడుట యసంభవము. మనము ముందుకు పోవుటకు పూర్వము మూడువందల యఖైలక్షల చిల్లర భారతీయులకును, దౌర్జన్యరాహిత్యవేదాంత, ఆచరణములందు మనము శిక్షనొసంగవలసినదేనా? అట్లయిన భరింపరాని దౌర్జన్యముచే పోలీసులు మనలనుద్రేకపరచినచో మనలో నెంతమంది సంపూర్ణశాంతిని ప్రదర్శింపగలరు? మనమొకవేళ నట్లే చేయవచ్చుననుకొనినను దౌర్జన్యముచేయుటకును, నితరులచే చేయించుటకును, మనయుద్యమము

లోనికి దూరిన లెక్కలేని యేజెంటుల నెవరేమిచేయగలరు? దౌర్జన్య రాహిత్యపద్ధతి పనిచేయుటకిదియే ప్రధానపరతుయైనచో నదియెప్పుడును విఫలమగును.

జయప్రదముకాగలదను విశ్వాసముచేతనే మనమీపద్ధతి కంగీకరించితిమి; కాంగ్రెసు దీని సీకారణముచేతనే తనస్వంతము చేసికొనెను. ఇది సరియైన మార్గమనియేకాక మన ప్రయోజనము నొనగూర్చునది యనియే గాంధీజీ దీనిని దేశముకుప్రసాదించెను. పేరుకిది 'న'కారముతో ప్రారంభమైనను, మంచిశక్తివంతమైనపద్ధతి; నిరంకుశాధికారముకు వినమ్రులమై దోసిలొగ్గుటకు కేవలవ్యతిరేకము. ఇది కార్యమునుండి పారిపోవు పిరికిపంద కార్యముకాక, దౌష్ట్యమును, జాతీయదాస్యమును ధిక్కరించు వీరకార్యము. కాని యేకొద్దిమందియో-శతృవే మిత్రకారణములోరానచ్చును—తమసాహస కార్యములచే మనయుద్యమమును తారుమారుచేయగలిగినచో, నంతమొందింపగలిగినచో, నెంతటిధైర్యవంతులైన, నెంతటిబలవంతులైన నేమిప్రయోజనము? గాంధిజీ శాంతియుతమైన అసహాయోద్యమమును, దౌర్జన్యరాహిత్యమును తనవక్తృత్వముచేతను, మెప్పింపగల యద్భుతశక్తిచేతను సమర్థించెను. అతని భాషనిరాడంబరముగను సరళముగనునుండెను. అతని కంఠధ్వని, హావము ఉద్రేకమెంతమాత్రమునులేక ప్రశాంతముగను స్పష్టముగనునుండెను. కాని యాబాహ్య హిమాకారము వెనుక రాజుచుండు యగ్నికణముల వేడిమియు, ప్రబలమైన యుత్సాహశక్తియు నుండెను. అతడుపలుకు పలుకులు మామనస్సులను, హృదయకుహరములను చొచ్చుకొని తీవ్రసంక్షోభమును కలుగచేసెడివి. అతడుచూపిన మార్గమతికఠినముగను, కష్టముగను నుండెను. కాని యది ధైర్యమైనదిగను, స్వాతంత్ర్యభూమికి గొంపోవునదిగను కాన్పించెను. ఆవాగ్దానము వలననే మనము మనవిశ్వాసమును హామీయిచ్చి ముందుకురికితిమి. 1920 లో "కత్తియొక్క సిద్ధాంతము" అనువ్యాసములో నతడిట్లు వ్రాసెను.

"దౌర్జన్యమా లేక పిరికితనమా యేదియుక్తమను నొకే ప్రశ్న యుదయించినపుడు నేను దౌర్జన్యమునే శిఫార్సు చేసెదనని ముమ్మాటికిని విశ్వసించుచున్నాను......అసహాయులై, తన పరాభవాగ్నిని చల్లార్చుకొనలేని పిరికిపందయై పడియుండుటకంటె భారత దేశము తన మానసంరక్షణార్థ మస్త్రములను బూనవలెననియే నా కోరిక. కాని దౌర్జన్యరాహిత్యము దౌర్జన్యముకంటె ననేకమడుంగులు గొప్పదని నేను విశ్వసించుచున్నాను. శిక్షించుటకంటె క్షమించుటే వీరలక్షణము. క్షమావీరస్యభూషణం.

క్షమ యోధునకలంకారము. కాని శిక్షింపగలశక్తి యుండి యాపనిచేయకుండుటే క్షమయగును. అసహాయుడగువాడు క్షమింతు నని నటించుట యర్థశూన్యము. పిల్లిచే చీల్చిచెండాడబడు యెలుక ఆపిల్లిని క్షమించుట యనజనదు......

కాని భారతదేశమట్టి యసహాయస్థితిలో నున్నదని నేను విశ్వసింపజాలను. నామట్టుకునేను అసహాయుడనని విశ్వసింపజాలను...

"నన్ను సరిగా నర్థముచేసికొనన గోరుచున్నాను. శక్తి శరీర పుష్టిచే కలుగిజాలదు. అది యప్రతిహతమైన యిచ్ఛ లేకబుద్ధిబలము చేత కలుగును... "నేను గాలిమేడలను నిర్మించుకొనువాడను గాను. నేను అనుభవసహితమైన యాదర్శపురుషుడను. దౌర్జన్యరాహిత్యమతము ఋషులకొఱకును యతీశ్వరులకొరకును మాత్రమే యుద్దేశింపబడలేదు. అది మామూలు ప్రజలకుకూడ నుద్దేశింపబడెను. దౌర్జన్యము పశుధర్మమైనట్లు దౌర్జన్యరాహిత్యము మనజాతి ధర్మము. పశువులలో నాత్మ నిద్రాణమైయుండును. కనుక నది పశుబలధర్మమునుతప్ప మరిదేనిని యెరుగదు. మానవుని యుత్తమస్థితి యుత్తమధర్మమునకు, ఆత్మబలముకు, విధేయులము కావలెననియే శాసించుచున్నది.

"కనుక ప్రాచీనధర్మమైన యాత్మత్యాగమునే నేను భారత దేశముకు సూచింపసాహసించితిని. సత్యాగ్రహమును తజ్జనితములును అసహాయోద్యమము సాత్వికనిరోధము ఇవన్నియు నాధర్మమునకు క్రొత్తపేరులేకాని వేరుకావు. దౌర్జన్యమధ్యమున దౌర్జన్యరాహిత్య తత్త్వమును కనిపెట్టిన ఋషిపుంగవులు న్యూటనుకంటె గొప్పబుద్ధి మంతులు. వారు స్వయముగా వెల్లింగ్టనుకంటెమహాయోధాగ్రేసరులు. అస్త్ర, శస్త్ర, ప్రయోగములందు ప్రావీణ్యులయ్యు వాని నిష్ప్రయో జకతను గుర్తించి దుఃఖభాజకమైన ప్రపంచముకు దౌర్జన్యముకాక దౌర్జన్యరాహిత్యమే మోక్షప్రదమని వారుబోధించిరి.

"బుద్ధిపూర్వకముగ బాధనొందుటయే సచేతనమైన దౌర్జన్య రాహిత్యము. అది దుర్మార్గుని యిచ్ఛకు చవటపెద్దమ్మలవలె లొంగి పోవుటకాక నిరంకుశుని నిరంకుశత్వమును ప్రతిఘటించుటకు తన యాత్మ బలముసంతను వినియోగించుటేయగును. ఈ మన నిజధర్మముక్రింద పనిచేయు నొక్కవ్యక్తి యధర్మసామ్రాజ్యమునంతను నెదిర్చి ధిక్కరించి తన మానమును తన మతమును తన యాత్మను రక్షించుకొని యా సామ్రాజ్యపతనముసకు గాని, పునరుద్ధరణకుగాని పునాదులను నిర్మింప వచ్చును. "భారత దేశము దుర్బలమైనదిగనుక దౌర్జన్యరాహిత్యము నవలంబింపవలసినదని నేను వాదించుట లేదు. తనశక్తిని, తనబలమును గుర్తెరింగియే బుద్ధిపూర్వకముగ నది దౌర్జన్యరాహిత్యమును చేపట్ట వలెనని నేనుకోరుచుంటిని...భారత దేశ మవినాశమైన యాత్మనుకలిగి యున్నదనియు నదిమొత్తముశరీరదుర్బలత్వమునైన నవలీలగా జయించిప్రపం చమంతయు నేకమై యెక్కువమ్మడిగా వచ్చినను, ధిక్కరింపగలదనియు గుర్తించవలెననియే నాకోరిక. "ఈ యసహాయోద్యమమును, సిన్ ఫిని జమునుండి నేను వేరుపరచితిని; ఏలనన దౌర్జన్యమొకవంక నిదియొక వంక పనిచేయజాలవు; కాని యీశాంతియుత పోరాటమును సోదా

చేయవలసినదని నేను దౌర్జన్యవాదులను కూడ కోరుచున్నాను. దీని సహజ దుర్బలత్వమువలన నిది విఫలము కాజాలదు. తగినంత ప్రోత్సాహము లేకపోవుటచే నిది విఫలము కావచ్చును. నిజమైన యపాయ మప్పుడే కలుగును. జాతీయ పరాభవము నిక నెంతకాలమును సహింప జాలని యుత్తమ పురుషులు తమక్రోధమును వెలిబుచ్చజూతురు. వారు దౌర్జన్యమును పూనెదరు. నాకు తెలిసినంతవరకు వారు తమ్ముకాని, తమ దేశమునుకాని, దుర్మార్గమునుండి రక్షించుకొనజాలక నశింపకతప్పదు. భారతదేశము కత్తినిచేబట్టినచో తాత్కాలికముగ జయించిన జయింప వచ్చును. నాహృదయములో నేనట్టి భారతదేశమును చూచి గర్వింప జాలను. నాసర్వస్వమును నాకు భారతదేశమే ప్రసాదించెను. కనుక నేనామెను వరించితిని. ఆమె ప్రపంచముకొక సందేశము నీయగలదని నాపరమ విశ్వాసము."

ఈవాదము మమ్ముకదల్చివేసెను. కాని మాకుగాని, జాతీయ కాంగ్రెసు అంతకునుగాని దౌర్జన్యరాహిత్య మొకమతము లేక వేద వాక్కు కాలేదు. కాజాలదు. అది కొన్ని ఫలితముల నీయగల యొక పద్ధతి, యొకనీతి. ఆఫలితములవలననే దాని మంచిచెడుగులను మనము చివరవరకు గుర్తింపవలసియుండును. వ్యక్తులు దానిని మతముగను, నిర్వివాదమైన సిద్ధాంతముగను భావించుకొనవచ్చును. కాని యేరాజ కీయసంస్థయు, అది రాజకీయముగనే యుండునంతవరకు, అట్లు చేయ జాలదు.

చౌరీ చౌరాయును తత్ఫలితములును దౌర్జన్యరాహిత్య పద్ధతిని గురించి పరీక్షింప నవకాశమిచ్చెను. గాంధీజీ సాత్వికనిరోధము నాపి వేయుట కిచ్చినకారణములే సరియైనవైనచో మనశత్రువు లెప్పుడును పోరాటమును నిలిపివేయుటకు తగిన పరిస్థితులను సృష్టింప శక్తిగలిగి యుందురనియే మేముభావించితిమి. ఇది యసహాయోద్యమములోని దోషమా? లేక గాంధీజీ దానికిచ్చు నర్థములోనున్న దోషమా?

ఇంతకును, అతడే యీయుద్యమప్రదాత, నిర్మాత కనుక నేది దాని స్వరూపమో, యేది కాదో నిర్ణయింపగల యుత్తమ న్యాయాధికారి మరెవరుకలరు? అతడుతప్పనిదే మనయుద్యమమెక్కడ? చాల వత్సరము లైన తరువాత 1930 శాసనోల్లంఘనోద్యమముకు కొంచెము ముందు గాంధీజీ (మాకు తృప్తినిచ్చునట్లు) యీవిషయమును స్పష్టపరచెను. అచ్చటచ్చట క్వాచితుగా బయలుదేరు దౌర్జన్యమువలన నుద్యమమునాపివేయ కూడదని యతడుచెప్పెను. అట్టివిధాయికసంభవములవలన సదినిచేయ జాలనిచే నది యన్నిపరిస్థితులకును తగిన యాదర్శమైన పద్ధతికాజాలదు. గాంధిజీ దీనినంగీకరింపడు. అతనిదృష్టిలో నీపద్ధతి సరియైన దగుటచే నన్నిపరిస్థితులకును తగియుండి, వ్యతిరేక వాతావరణములోకూడ, తగ్గుస్థాయిలోనైన, పనిచేయగలిగి యుండవలెను. దౌర్జన్యరాహిత్యకలాపము కెక్కువ యవకాశమునిచ్చిన యీయర్థము గాంధిజీ మనఃపరిపాక జనితమో కాదో నేను చెప్పజాలను.

యథార్థముకు, చాలమంది యట్లూహించినను, 1922 ఫిబ్రవరిలో సాత్వికనిరోధము నాపివేయుటకు చౌరీచౌరాసంఘటనయే కారణము కాదు. దానితో కుండ నిండెను. గాంధిజీ తఱచు అంతరంగిక ప్రబోధమునుబట్టియే పనిచేయుచుండును. ప్రజలతో కలిగిన సన్నిహిత, చిరపరిచయముచే (గొప్ప ప్రజానాయకులందరి వలెనే) నతడు ప్రజలెట్లు భావింతురో, యేమిచేతురో, యేమిచేయగలరో గ్రహింపగల యొక నూతన శక్తి నార్జించెను. అతడీ యాంతరంగిక ప్రబోధానుసారము తన కర్తవ్యమును నిర్ణయించుకొని తన నిర్ణయమున కాశ్చర్యచకితులును, క్రోధపూరితులును నగు తనతోడి నాయకుల సంతృప్తికొరకు కారణములను చూప యత్నించును. ఇవి, చౌరీచౌరాసందర్భములోవలె, యంత తృప్తికరముగా నుండవు. మనయుద్యమ మాసమయమందు (పైకి యుత్సాహాశక్తులు దేశమంతటను వెల్లివిరియుచున్నను) ముక్కముక్క

లగుచుండెను. శిక్షణము, క్రమము నశించుచుండెను. నాయకులంద రును జయిలులోనుండిరి, తమంతతాము నడుపుకొని పోగలశక్తి, శిక్షణ ములను, ప్రజలింకను పొందియుండలేదు. ఊరుపేరు లేనివాడెవడైనను సరే కాంగ్రెసుకమిటీని వశపరచుకొనవచ్చును- యథార్థము కనేక మంది దుర్మార్గులు, ప్రభుత్వ యేజెంటులతోసహా, ముందుకువచ్చి కొన్నిస్థానిక కాంగ్రెసు, ఖిలాఫతు సంఘములను వశపరచుకొనిరి. వారిని నిరోధించుటకు మార్గమేమియులేదు.

అట్టిపోరాటములో నిట్టికథలు కొంతవరకు జరుగకతప్పవు. జయిలుకుపోవుటలో నాయకులు ముందునాయకత్వమువహించి తక్కిన వారికి యుద్యమమును విడువకతప్పదు. ఈపనులను చేయవలెననియు, వీనిని చేయరాదనియు, ప్రజలకు శిక్షించుటయే మనముచేయతగినపని. 1930 వచ్చుసరికి మనము ప్రజల కనేకసంవత్సరము లట్టిశిక్షనొసంగి తిమి. కనుకనే 1930,32 లలోని శాసనోల్లంఘనోద్యమము లెక్కుడు క్రమసిద్ధిగను, శక్తివంతములుగను నుండెను. 1921,22 లలో నదిలేకుండెను. ప్రజల యుద్రేకోత్సాహములవెనుక నిదియేమియు లేకుండెను. ఉద్యమ మాపివేయబడనిచో నచ్చటచ్చట ననేకచోట్ల దౌర్జన్యములు జరగియుండు ననుటకు సందేహములేదు. ప్రభుత్వము దీనిని రక్తపాతముతో నణచివేసి భయంకర పరిపాలనను స్థాపించెడి వారు. దానితో ప్రజలలో భీతావహముకలిగి యవినీతి సంభవించెడిది.

బహుశః యీకారణములే గాంధిజీమనస్సులో పనిచేసెను. ఈవిషయములను, దౌర్జన్యరాహిత్య శాస్త్రావశ్యకతను గుర్తించినచో గాంధిజీ నిశ్చయమే సరియైనది. మాలిన్యము నాపివేసి యతడు పున ర్నిర్మాణము చేయవలసివచ్చెను. కనుక 1921 లో సాత్వికనిరోధము నాపివేయుట (ఆపివేయు విధములో లోటులుండి కొంత యవినీతికి కారణమైనను, యుక్తమే కానచ్చును.

కాని యొకమహోద్యమము నీవిధముగా హఠాత్తుగా కట్టి పెట్టుట దేశములో మరియొక విషాదముకు సాయపడి యుండవచ్చును. రాజకీయపోరాటములో నచ్చటచ్చట జరుగువ్యర్థ దౌర్జన్యమాపివేయ బడెను. కాని యణచివేయబడిన దౌర్జన్యముకు మరియొక మార్గముండ వలెను. తరువాత సంవత్సరములలో నిది కులకక్షలకు దోహదము నిచ్చెను. వివిధసంఘములలోని కులకక్షప్రేరకులు (రాజకీయముగా వెనుకకు పీకువారు) అసహాయోద్యమముకును, శాసనోల్లంఘనముకును కలిగిన ప్రజామోదముచే శవాకారములవలె పడియుండిరి. ఇప్పుడు వారు పైకిలేచిరి. గూఢచారి యేజెంటులును, కులకక్షలనుపెంచి ప్రభుత్వ మెప్పును బడయదలచినవారును దీనికి పూనిరి. మాప్లా విప్లవము, అసామాన్య క్రూరపద్ధతులచే దాని నణచివేయుట (గాలియెంతమాత్రము చొరని రైలుపెట్టెలలో మాప్లా ఖయిదీలను చంపుట యెంత ఘోరము!) కులకక్షప్రేరక పిశాచము లకవకాశము నిచ్చెను. శాసనోల్లంఘన మాపివేయబడక యీయుద్యమము ప్రభుత్వముచే నణచివేయబడినచో కులద్వేషములును కులపోరాటములును అంతచెలరేగకుండెడివి.

శాసనోల్లంఘన మాపివేయబడక పూర్వము మరియొకవిధమగు ఫలితము నిచ్చిననుయిచ్చునట్టి విశేషమొకటి తటస్థించెను. శాసనోల్లంఘనముయొక్క మొదటిధాక ప్రభుత్వమును గజగజలాడించెను. అప్పుడే రీడింగు ప్రభువు, వైస్రాయి, తాను విభ్రాంతినొందినట్లు బహిరంగ సభలోచెప్పెను. వేల్సుయువరాజు హిందూదేశములో నుండుటచే ప్రభుత్వబాధ్యత మరింత హెచ్చెను. 1921 డిసెంబరులో ప్రజానిర్బంధములు ప్రారంభమైనవెంటనే, కాంగ్రెసుతో రాజీచేసికొనుటకు, ముఖ్యముగా యువరాజు కలకత్తాకు పోవనున్నసందర్భమున, ప్రభుత్వము ప్రయత్నించెను. జయిలులోనున్న దేశబంధుదాసుకును, బంగాళప్రభుత ప్రతినిధులకును మధ్య కొంతరహస్యసంభాషణ జరిగెను. చిన్న రౌండు టేబిలు సమావేశము కాంగ్రెసు ప్రభుత్వములమధ్య జరుగవలెనని

సూచింపబడెను. కరాచీ జయిలులోనున్న మౌలానా మహమ్మదాలీ యీ కాన్ఫరెన్సులోనుండవలెనని గాంధీజీ పట్టుబట్టుటచే నిది వీగి పోయెను. ప్రభుత్వమందుల కొప్పుకొనలేదు.

చిత్తరంజనదాసు గాంధీజీ యభిప్రాయముతో నీ విషయములో నేకీభవింపక తాను జయిలునుండి వచ్చిన తరువాత గాంధీజీని బహిరంగముగ విమర్శించి యతడుతప్పుచేసెననెను. మాకు, జయిలులోనుండుటచే, యథార్థములు తెలియకపోవుటచే మేమెట్టి నిర్ణయమును చేయజాలక పోతిమి. కాని యాస్థితిలో నట్టి కాన్ఫరెన్సువలన నెట్టిలాభమును కలుగనట్లే కాన్పించెను. యువరాజు కలకత్తాను సందర్శించు కాలము నెట్లో గడపుకొనుటకే ప్రభుత్వమీయెత్తు యెత్తెను. ప్రధానసమస్యలట్లే యుండెడివి. తొమ్మిదేండ్లు గడచిన తరువాత మనజాతియు, కాంగ్రెసును అనేకరెట్లు బలపడినను, యెట్టి ఫలితమును లేనియట్టి కాన్ఫరెన్సు జరిగెను. దీనిసంగతియటుండ మహమ్మదాలీ యుండవలెనని గాంధీజీ పట్టుబట్టుట కేవలము సమంజసమనియే నాయభిప్రాయము. కాంగ్రెసు నాయకుడుగనేకాక ఖిలాపతునాయకుడుగ కూడ (అప్పుడు ఖిలాఫతుసమస్య కాంగ్రెసులో నొక ప్రధానవిషయము) నతనిరాక చాలయవసరము. సహచరుని విడిచివేసెడి యేపద్ధతియు, నీతియు నెప్పుడును క్రమమైనది కానేరదు. అతనిని ప్రభుత్వము జయిలునుండియే విడిచిపెట్టనపుడింక కాన్ఫరెన్సువలన నెట్టిలాభమును కలుగ జాలదని స్పష్టమగుచునే యుండెను.

మాతండ్రియు నేనును చెరియారు నెలలు వేరువేరు కోర్టులచే శిక్షింపబడితిమి. ఆ విచారణలు కేవలము నాటకములు. అయినను (అప్పటి యాచారము ప్రకారము) మేమందులో పాల్గొనలేదు. మా యుపన్యాసములలోను యితరచర్యలలోను మమ్ము శిక్షించుటకు తగినంత సరకులేకపోలేదు. కాని మాపై ప్రయోగింపబడిన నేరములు మాత్రము నవ్వును పుట్టింపకమానవు. తండ్రిగారు కాంగ్రెసువాలంటీరు దళము(అక్రమసంఘము)లో సభ్యుడని, దానినిరుజువుచేయుటకు హిందీ

సంతకముతో నున్న యొక ఫారము దాఖలు చేయబడెను. సంతకము మా తండ్రిదేయైనను, అత డంతకు పూర్వ మెన్నడును హిందీలో సంతకము చేయక పోవుటచే, నతని హిందీసంతకమునేకొద్దిమంది మాత్రమో యాన వాలు పట్టగలరు. ఒక చింకిగుడ్డలవాడు సంతకమును రుజువుచేయుటకు వచ్చి (యితనికి పొట్టకోసినను అక్షరము ముక్కరాదు.) కాగితమును చేతపుచ్చుకుని పరీక్షించువానివలె నటించి సంతకమును తిరుగవేసి చూచుచుండెను. నాకుమాత్ర (అప్పటికి నాలుగేండ్లు) విచారణ కాల మందు తండ్రిగారియొద్దనే యుండి యీ వినోదమును చూచుచుండెను.

హర్తాళము చేయవలసినదని నోటీసులు పంచిపెట్టినట్లు నామీద కేసు తేబడెను. లాప్రకారమిది యప్పట్లో నేరము కాదు. ఇప్పుడు, మనకు డొమినియను పరిపాలన కరతలామలకము చేయబడినది. కనుక నిది నేరమే కావచ్చును. ఎట్లైనను నేను శిక్షింపబడితిని. మూడు నెల లయిన తరువాత నేను నాతండ్రితోను తదితర మిత్రులతోను జయిలు లోనుండగా నొకపు వచ్చి, శిక్షలను తనిఖీచేయు అధికారి నే నక్రమ ముగా శిక్షింపబడితినని కనిపెట్టెననియు నాశిక్ష రద్దుచేయబడుటచే నేను వెళ్ళిపోవలసి యుండుననియు చెప్పెను. నాతరఫున నెవరును పని చేయకపోయినను, యిది యెట్లు జరిగెనా యని నే నాశ్చర్యపడితిని. శాసనోల్లంఘన మాపివేయబడుటచే తనిఖీచేయు జడ్జీలకు చురుకు పుట్టెను. నాతండ్రిని విడిచి వెళ్లుట నాకు విచారకరముగనే యుండెను. వెంటనే నేను అహమ్మదాబాదు వెళ్ళి గాంధిజీని చూడవలెనను కొంటిని. నే నచ్చటకు వెళ్లు లోపల గాంధిజీ నిర్బంధింపబడుటచే, నేనతనిని సబర్మతి జయిలులో చూచితిని. అతని విచారణకాలమందు నేను దగ్గరనే యుంటిని. ఆ విచారణ మాజన్మలో మాకు మఱపుకు రమ్మనినను మఱపురాదు. న్యాయమూర్తి, ఒక ఆంగ్లేయుడు, అతి మర్యాదగను, సవిచారముగను ప్రవర్తించెను, కోర్టులో గాంధిజీ యిచ్చిన

స్టేటుమెంటు అద్భుతముగ నుండెను. మేము భావోద్రేకపూరితులమై తిరిగి వచ్చితిమి.

నేను అలహాబాదు తిరిగివచ్చితిని. కాని స్నేహితులును, సహచరులును, జయిలులోనుండుటచే నొంటరినైతిని. కాంగ్రెసువ్యవహారములు సక్రమముగానుండకపోవుటచే నేను దానికి పూనుకొని ముఖ్యముగా విదేశవస్త్రబహిష్కారమును సాగించితిని! శాసనోల్లంఘనమాగినను యిదిమాత్ర మాచరణలోనే యుండెను. అలహాబాదులోని విదేశవస్త్ర వ్యాపారులందరును విదేశబట్టల నిక దిగుమతి చేయమనియు కొనమనియు, ప్రమాణపత్రములను వ్రాసి యిచ్చి దీనికొక సంఘము నేర్పరచిరి. సంఘ కట్టుబాటులకు వ్యతిరేకముగ నడచినచో జుల్మానా విధింపబడునను సూత్రమున్నను పెద్దపెద్ద వర్తకులు దీనికిభిన్నముగా విదేశబట్టలను దిగుమతి చేయసాగిరి. ప్రమాణమును పాటించువారికిది కష్టముగనుండినను వారెట్టి చర్యను తీసికొనజాలకుండుటచే మేము పికెటింగు చేయనిశ్చయించితిమి. పికెటింగు పేరుచెప్పినతోడనే జుల్మానాలు చెల్లింపబడి క్రొత్త ప్రమాణపత్రములు తీసికొనబడెను. జుల్మానాలన్నియు బట్టలవర్తకసంఘముకు జమకట్టబడెను.

రెండుమూడు రోజులయినతరువాత మరికొంతమంది సహచరులతో నేను మరలఅరెస్టుకాబడితిని. అక్రమముగా భయపెట్టితిమనియు నిర్బంధించి డబ్బు తీసికొంటిమనియు మాపై నేరముమోపబడెను. నాపై మరికొన్ని నేరములను, రాజద్రోహమునుకూడ మోపిరి. నేను వాదించక కోర్టులో నొకపెద్ద స్టేటుమెంటు యిచ్చితిని. చివరకు మూడునేరములకు (అవిచాలునని రాజద్రోహమును విడిచిపెట్టిరి.) మొత్తమువీద యిరువదియొకమాసములు శిక్షించిరి. ఇది నా రెండవ శిక్ష. ఆరువారములు బయటనుండితినో లేదో నేను తిరుగ నాజయిలు ఆశ్రమమునకు పోతిని.

## ౧౩

# లక్నో జిల్లా జయిలు.



1921 వ భారతదేశములో రాజకీయనేరములకు ఖయిదు సంభవించుట క్రొత్తవిషయము కాదు. ముఖ్యముగా బంగాళా విభజనమయిన తరువాత నిరంతర జనప్రవాహమెప్పుడును జయిలుకు పోవుచునే యుండెను. విచారణలేకుండగనే ప్రవాసశిక్షలు కూడనుండెను. అప్పటి భారతనాయకశిఖామణియగు లోకమాన్యతిలకుకు వృద్ధాప్యములో నారుసంవత్సరములు శిక్షవిధింపబడెను. ఈప్రవాస, జయిలు శిక్షా విధానము యుద్ధమువలన మరింతవృద్ధియై యావజ్జీవశిక్షలకును, ఉరిశిక్షలకును కారణమైన కుట్రనేరములు మరింత తరుచయ్యెను. ఆలీసోదరులును, అబ్దుల్ కలమ్ అజదుగారలును యుద్ధకాలపు ప్రవాసితులలో నుండిరి. యుద్ధము ముగియుటతోడనే పంజాబులోని సైనికశాసనము చాలమందిని తనపొట్టబెట్టుకొనెను. కాని రాజకీయనేరములకు ఖైదు చేయబడుటతి తరుచయినను యింతవరకు బుద్ధిపూర్వకముగ వరింపబడలేదు. అదియొకరుపని చేయుచుండ నాపనిసందర్భములోనో లేక ఏగూఢచారి యతనిపై కన్నువేయుటచేతనో సంభవించుచుండెడిది. దానిని తప్పించుకొనుటకు కోర్టులలో వాదించుకొనెడివారు. దక్షిణాఫ్రికా సత్యాగ్రహోద్యమములో గాంధిజీయు, నతని వేలకొలది యనుచరులును మరియొక మార్గమును చూపించిరి.

అయినను 1921లో కారాగార మగమ్య ప్రదేశముగ నుండెను. క్రొత్తకయి దీని కబళించిన యాయినుపద్వారముల వెనుక నేమిజరిగెడినో యెవరికెఱుక! అందలి నివాసులందరును మ్రుచ్చులనియు, నుపద్రవకరులైన నేరస్థులనియు, సాహసికులనియు మేమూహించితిమి. జయిలు

అనిన ఒంటరితనము, అవమానము, బాధ, కష్టములు— ఈయన్నింటిని మించిముందేమిరానున్నదోయను భయము; అనుభావములుమామనస్సులలోనుండెను. 1920 లగాయితు వేలకువేలు జయిలుకు పోవుచుండుటచే మేముక్రమముగా దానికలవడుటచే జయిలుఅనిన సప్రయత్నముగా కలుగుచుండు ససహ్యతా, ద్వేషములు తగ్గుచుండెను. కాని ముందుగా నెంతటి మానసికసిద్ధి కలిగియున్నవానికైనను యినుపద్వారములను దాటుటతోడనే మొట్టమొదట కలుగు నుద్రేకము మానదయ్యెను. నాటిలగాయితు నేటివరకు మూడువందలవేలమంది స్త్రీ పురుషులు రాజకీయ నేరముల కా యినుప కవాటములను దాటిరి. ఇందులో వేల కొలది యనేకసారులు వచ్చుచు పోవుచుండుటచే లోపల నేమిజరుగు నదియు బాగుగ గ్రహించియే యుందురు. వారచ్చటి విపరీత జీవితముకు, తిండిలోను పనిలోను,మార్పుఅనునదెంతమాత్రమునులేని నిర్జీవజీవితముకు, వారికి సాధ్యమగునంతవరకలవాటు పడిపోవుటకే ప్రయత్నించిరి. అలవాటుపడిరి. అయినను మేమచ్చటకు క్రొత్తగా పోయినపుడెల్ల కొంచె మాపాత్రిత యుద్రేకము, పటపటాంగము, నాడీవేగము నుండకతప్పదు. విశాల ప్రపంచమును పచ్చికబయళ్ళను జనసంఘములను, బండ్లవేగము లను బంధుజనులను మిత్రబృందమును కడసారి చూడవలెనని మా నేత్రము లప్రయత్నముగావెనుకకు తిరిగి చూచును.

నేను మొదటిసారి జయిలులోనున్నకాలము నాకును జయిలు అధికారులకునుకూడ నుద్రేకభరితముగ నుండెను. ఈక్రొత్తరకపు ఖైదీని చూచుటతోడనే జయిలు అధికారులు సగము స్తంభించిపోయిరి. దినదినాధికమగుచున్న వారి సంఖ్యాబల మపరిమితముగానుండి పాత జయిలు సాంప్రదాయముల నన్నింటిని తుడిచివేయు మహాప్రవాహము వలె కాన్పించెను. ఈక్రొత్త యతిథి మరింత కోరకరాని క్రొయ్య

యయ్యెను. ఇతడన్ని తరగతులనుండియు వచ్చుచు మధ్య తరగతినుండి హెచ్చుగా వచ్చుచుండెను. వీరందరును మామూలు ఖయిదీలకంటె కేవలము భిన్నమైనవారగుటచే వారిని చూచినట్లు వీరినిచూచుటకు వీలులేదు. దీని నధికారులు గ్రహించిరి గాని వారికేమి చేయుటకును తోచకుండెను. ఇతడుసామాన్య ఖయిదీ యంతసాధువు కాడు; వినయ విధేయతలు కలవాడుకాడు. జయిలులోనున్నను సంఖ్యాబలమతనికి పెట్టనికోటవలెనుండెను. బయట జరుగుచున్న యాందోళనమును, లోపలజరుగుచున్నదానిని పరీక్షించుచున్న ప్రజలశ్రద్ధయు వీనికి మరింత దోహదము నిచ్చెను. మాకిట్టి క్రొత్తయహంభావ దృష్టియున్నను మేము సామాన్యముగా జయిలు అధికారులకు తోడ్పడుచునే యుంటిమి. మా సహాయమే లేనిచో జయిలు అధికారుల కష్టములు పెక్కుమార్లకే ఘనముకా యయ్యెడివి. జయిలరు తరచు మాదగ్గరకువచ్చి వాలంటీరులున్న చోటుకు వెళ్ళి వారిని శాంతపరచుమని కోరెడివాడు.

మాయంతట మేము జయిలుకు వెళ్ళితిమి; చాలమంది వాలంటీర్లు అనాయాసముగా జయిలులోనికి చొరబడిరి; కనుక తప్పించుకొని పారిపోదురనుభయ మెంతమాత్రమును లేకుండెను. ఎవనికైనను వెళ్ళిపోవలెనని కోరికయున్నచో క్షమార్పణచెప్పిన చాలును. లేదా ముందట్టి పనిచేయనని వ్రాతమూలముగా యిచ్చినను చాలును. పారిపోవుటకు ప్రయత్నించుటకంటె వేరుయపకీర్తిలేదు. అది రాజకీయముల నుండి తొలగుటయే యగును. లక్నో జయిలు సూపరింటెండెంటు దీనిని బాగుగ గ్రహించి జయిలరుతో (ఖాన్ సాహెబు) కాంగ్రెసు ఖయిదీలను బయటకు పోవునట్లు చేయకలిగినచో నతనికి ఖాను బహదరు బిరుదము నీయవలసినదని తాను ప్రభుత్వమునకు సెఫార్సు చేసెదనని చెప్పెడివాడు.

జయిలులో, లోపలగానున్న వేరొక ప్రాకారములో, పెద్ద కొటాయిలలో నాసహచర ఖయిదీలు చాలమంది యుండెడివారు. మా లో

పదునెనిమిదిమంది (ప్రత్యేకాదరణాభిమానములతో చూడబడుటకు) బట్టలనేత నేసెడి యొక పాతపాకలో నుంచబడితిమి. దాని ముందొక విశాలమైన స్థలము కలదు. మాతండ్రి, నేను, నాపెత్తండ్రి బిడ్డ లిరువురము-మానలుగురకును 20 యడుగుల పొడుగును, 16 అడుగుల వెడల్పును గల యొక చిన్నపాకను ప్రత్యేకముగ నిచ్చిరి. ఒక కొటారు నుండి మరియొక కొటారునకు పోవుటకు మాకు తగినంత స్వేచ్ఛ నిచ్చిరి. బయటనుండి మమ్ముచూచుటకు వచ్చు బంధువులతో తరుచు మాట్లాడుట కవకాశ మిచ్చిరి. వార్తాపత్రికలు వచ్చుచుండుటచే, క్రొత్తనిర్బంధములను, ఉద్యమాభివృద్ధిని చదువుచు నుత్సాహభరితుల మగుచుండెడివారము. వాదోపవాదములు, సంభాషణలు చాలకాలము పట్టుచుండుటచే నాకు చదువుకొనుటకు గాని, మరేప్రయోజనమైన పనిచేయుటకు గాని తీరిక యుండెడిదికాదు. నేను ప్రాతఃకాలములందు మాపాక నతిశుభ్రముగ తుడిచి కడిగివేసెడివాడను; తండ్రిగారి బట్టలను నాబట్టలను శుభ్రముగా నుతికెడివాడను; తరువాత నూలు వడికెడివాడను. అది శీతకాలము. మొదటి కొలది వారములు మావాలంటీర్లకును, వారిలో చదువురానివారికిని పాఠములను చెప్పనిచ్చిరి. హిందీ, ఉరుదు మొదలగు ప్రాథమిక విషయములను బోధించెడివారము. సాయంకాలము చేతి బంతియాట యాడెడివారము.

కాని క్రమముగా నిరోధములు హెచ్చజొచ్చెను. మాయావరణదాటి వాలంటీర్లను చూచుటకు బయటకు పోనిచ్చెడి వారుకారు. పాఠశాలయు తరగతులును నిలిచిపోయెను. అప్పుడే నన్ను విడిచిపెట్టిరి.

నేను మార్చి మొదటి వారములో వెళ్ళి తిరిగి ఏప్రిలులో వచ్చితిని. నేను వచ్చుసరికి పరిస్థితులన్నియు పూర్తిగా మారిపోయెను. తండ్రిగారిని నైనిటాలు జయిలుకు మార్చిరి. అతను వెళ్ళుటతోడనే క్రొత్త నియమముల నమలుపరచిరి. నేతశాలలో నుంచబడిన ఖయిదీ

లందరును కొటారుల (విడిహాలు) లోనికి మార్చబడిరి. ప్రతి కొటారును జయిలో నొక జయిలు వంటిది. కొటారునకును కొటారునకును నెట్టెసంబంధమును లేకుండచేసిరి. బంధుదర్శనము ఉత్తరములు నెలకొక్కసారియే జరుగవలెననిరి. భోజన మతి ముక్తసరి చేయబడెను. (బయట నుండి తెప్పించుకొనుట కభ్యంతరము లేదనిరి.)

నేనున్న కొటారులో సుమా రేబదిమంది యుండిరి. మేము కిక్కిరిసి యుంటిమి. మాబిచానాలకు మూడు నాలుగడుగుల దూరము మాత్రమే యుండెను. నాకొటారులో నున్నవారందరును నాకు పరిచయులు; చాలమంది స్నేహితులు. కాని రాత్రింబవళ్లు 'మరుగు'అను నది లేకయుండుట యసహ్యముగ నుండెను. అస్తమానము చూచినవారినే చూచుట ఒకేమాదిరి చిన్న పేచీలు, గిల్లికజ్జాలు- వీనిని తప్పించుకొనుట కెట్టి ప్రశాంతాగారమును లేకపోవుట. మేము బహిరంగముగనే బట్టలనుతికికొనెడి వారము; కసరత్తుకొరకు కొటారు చుట్టును పరుగెత్తెడి వారము. సహేతుకముగా మాట్లాడుశక్తి తగ్గువరకును మేముసంభాషించుచు, వాదించుకొనుచుండెడివారము. నిత్య నిర్జీవ సంసారజీవితమే (అందులోని యందచందములును, సుఖాదికములును వినా) నూరురెట్లు పెంచబడినట్లుండెను. అన్నితరహాల మనుష్యులము, అన్నియభిరుచులు కలవారము నచ్చటజేరితిమి. అది మాయందరకును బాధకరముగనేయుండెను. నేను యేకాంతవాసము కొఱకు వాచిపోతిని. తరువాత సంవత్సరములలో జయిళ్ళలో (నెలల కొలదియే జయిలు యుద్యోగియో తప్ప మరెవ్వరును కాన్పించు వారుకారు) నేకాంతవాసమెక్కువయ్యె బాధపడి మంచిసావాసముకావలెనని కోరెడి వాడను. అప్పుడు 1922 నాటి లక్నోజిల్లాజయిలు జీవితము జ్ఞాపకము వచ్చెడిది. మొత్తముమీద వ్రాసుకొనుటకును, చదువుకొనుటకును నవకాశమున్నచో నేకాంతవాసమునే నేను కోరెడివాడను.

నా సావాసకాండ్రందరును అసాధారణ బుద్ధిమంతులగుటచే
నానందముగనే యుండెడిది. కాని యస్తమానము నొకే జీవితమువిసుగు
దలగానుండి మేమేకాంతమును కోరుచుండెడివారము. నేను నాకొటారును
విడిచిపెట్టి బయట యావరణలో నొంటరిగా కూర్చొని మేఘా
వృతమైన యాకాసమువంక తదేకదృష్టితో చూచుచుండెడివాడను.
నేనెండకును వర్షముకును యోర్చి వీలైనంతవరకు చాలకాల మక్కడనే
గడపెడి వాడను.

నే నాప్రశాంతప్రదేశమున పవళించి, గగనవీధులను, నీల
నీరదశ్యామమును పరీక్షించుచు, మున్నెన్నడు నెరుంగనట్టి యద్భుత
చిత్రవిచిత్ర వర్ణవర్ణాంతర సౌందర్యము నాస్వాదించితిని.

మాకు కాల మప్పుడు భోగముకాక భారముగ నుండెడిది. కాని
చలిచలి ముందుకు పోవుచుండు నాయమృత రసభరిత మేఘపంక్తిని
చూచి యానందించుటలో గడుపు కాలమతి సంతోషావహముగను
స్వేచ్ఛాప్రదముగను నుండెడిది. ఒకక్రొత్తవిషయమును కనుగొనుటలో
కలిగెడి యానందము, నిర్బంధమునుండి తప్పించుకొంటినను భావము
నాకుకలిగెను. ఆ ప్రత్యేకవర్షాకాల మట్లు నన్నేల నాకర్షించెనో
నేను చెప్పజాలను. దానికి ముందును తరువాతను కూడ నట్టియనుభవము
నాకుకలుగలేదు. పర్వతాగ్రములనుండియు, సముద్రతీర ములనుండియు
నేననేకసార్లు సూర్యోదయ సూర్యాస్తమయములను వీక్షించి, యాబం
గరుతోయముల జలకమాడి, జగత్ప్రాణుని మాహాత్మ్యమున కచ్చెరు
వందితిని. కాని యంతటితో యితరకార్యములలో మగ్నుడనగుచుంటిని.
కాని జయిలులో సూర్యోదయ సూర్యాస్తమయములను చూచుటకు
మేమునోచుకొనలేదు; ఉదయమున నెప్పుడో ప్రచండభానుడు మాకు సంర
క్షకులైన జయిలుగోడలను దాటివచ్చును. మాకంటికెట్టి వర్ణములును
కానరావు. అస్తమానము నెట్టి యందచందములును లేని యామట్టిగోడ

లను, ఆచారకీచులను చూచుచుండుటచే మాకంఠస్థ కాయలుకాచి నిస్తేజములయ్యెను. అవి రంగులకొఱకును, వెలుతురు, నీడల కొరకును తపించుచుండ ప్రావృట్కాల మేఘరాజి చిత్రవిచిత్రాకారములతోను, నర్తములతోను నాట్యమాడుచురాగా నేనత్యాశ్చర్యానందమగ్నమానసుడనై సమాధిస్థునివలె దానిని వీక్షించు చుంటిని. ఒక్కొక్కప్పుడా మేఘములు విచ్ఛిన్నమగుచుండ వానిమధ్య వసంతభాగమో యనునట్లు లగాధ నీలద్యుతి మెఱయుచుండెను.

క్రమముగా మామీద నిర్బంధసంఖ్య హెచ్చెను. కఠినచట్టములమలుజరుపబడెను. మనయుద్యమముయొక్క లోతుపాతులు తెలియుటచే ప్రభుత్వమువారు తమ్మెదిరింప సాహసించినందులకు వారిశిక్షననుభవింప వలెననిరి. క్రొత్తచట్టముల నమలు పరచుటలో రాజకీయ ఖైదీలకును జయిలు అధికారులకును సంఘర్షణమేర్పడెను. చాలనెలల వరకు (మేమప్పుడు కొన్నివందలమంది యుంటిమి) మేము బంధు సందర్శనము చేయ నిరాకరించితిమి. మాలో నేడుగురను (పేచీలకు కారకులమని) నన్ను, పురుషోత్తముదాసు టాండను, మహాదేవదేశాయి జార్జి జోసెఫ్, బాలకృష్ణశర్మ, దేవదాసుగాంధి మొదలగువార్లను, తక్కినజయిలుతో సంబంధములేకుండ నొకమారుమూలకు త్రోసివేసిరి.

మమ్మొక చిన్నయావరణలో నుంచిరి. అచ్చట కొన్నికష్టములున్నను మొత్తముమీద నాకు బాగుగనేయుండెను. అంత క్రిక్కిరిసి యుండకపోవుటచే నాకు కొంతశాంతి, మరుగు యుండెను. చదువుకొనుటకును, యితరపనులు చేసికొనుటకును నవకాశముండెను. మాకితర ఖయిదీలతోగాని, యితర ప్రపంచముతోగాని నెట్టిసంబంధమును లేక యుండెను. రాజకీయ ఖయిదీలందరకును వార్తాపత్రికల నాపివేసిరి.

కాని బయటనుండి యేవోకొన్నివార్తలు (అవి జయిలులో నెప్పుడు నట్లువచ్చుచునే యుండును) వచ్చుచునే యుండెడివి, నెలనెలకు

వచ్చుయుత్తరములును, బంధుసందర్శనములును కూడ క్రొత్తవార్తలను తెచ్చెడివి. బయట యుద్యమము సన్నగిలినట్లు కాన్పించెను. ఆ సంధి సమయము దాటిపోవుట తోడనే విజయ మంతకంతకు వెనుకకు పోయెను. కాంగ్రెసులో రెండు చీలికలేర్పడెను. మార్పు కావలెనను పక్షమొకటి; మార్పు కూడదను పక్షమొకటి. మొదటి పక్షమునకు చిత్తరంజన దాసుగారును మోతీలాలుగారును నాయకులై కాంగ్రెసు నూతనరాష్ట్ర, కేంద్ర శాసనసభా యెన్నికలకు నిలిచి, సాధ్యమైనచో వానిని పట్టుకొనవలెననిరి. రెండవదానికి సి. రాజగోపాలాచారిగారు నాయకులై కాంగ్రెసువిధానములో నెట్టిమార్పును యుండరాదనిరి. అప్పుడు గాంధీజీ జయిలులోనుండెను. అధికారము కొంచెము ప్రాకులాడుటచే వచ్చు తగాదాలచేతను, కుట్రల చేతను, మనల నెంతయో ముందుకు గొంపోయిన మహోన్నతాశయములు తుడిచి వేయబడుచుండెను. ఉత్సాహోద్రేకములు వెల్లివిరియు కాలములోనే ఘనకార్యములును, సాహస కార్యములును జరుగగలవు. కాని వేడి తగ్గినతరువాత సావకాశముగా జరుగనేరవని మేముగ్రహించితిమి. భవిష్యత్తు అంధకారముగ నుండెను. అది యెట్లు జరుగనున్నను మాజీవితములలో చాలభాగము జయిళ్లలోనే గడుపవలసి యుండునని మాలో చాలమంది యనుకొంటిమి. ఈవిధముగ మేము మాట్లాడుకొనెడి వారము. జార్జిజోసెఫ్‌గారితో జరిగినసంభాషణలో మేమీయవసానముకే వచ్చితిమి. అప్పటినుండి జోసెఫ్ మనకు చాలదూరమగుటయే కాక మనకార్యములనుకూడ తీవ్రముగ విమర్శింపనారంభించెను. లక్నో జిల్లాజయిలులో సివిలువార్డులో, నొక శరత్కాల సంధ్యాసమయమున జరగిన యీసంభాషణ మతనికి జ్ఞాపకమున్నదో లేదో నేనుచెప్పజాలను. మేముకసరత్తు, దినచర్య మొదలగువాటి కభ్యాసపడితిమి. కసరత్తుకు మేము మా యావరణచుట్టును పరుగెత్తెడివారము. లేదా మాలోనిద్దరము మాదొడ్డిలోనున్న నూతిలోనుండి యొకపెద్దతోటబాల్చీతో

యెద్దులవలె నీరు లాగెడివారము. ఈవిధముగా మాయావరణలోనున్న యొక చిన్నకూరగాయలతోటకు నీరుపెట్టెడివారము. మాలో చాల మంది ప్రతిదినము కొద్దిగా వడికెడివారు. కాని యధ్యయనమును నేను ప్రధానవృత్తిగాపరిగణించి యెప్పుడును చదువుచుండెడివాడను. సూప రింటెండెంటు యెప్పుడు మమ్ము చూడవచ్చినను నేను చదువుచునే యుండెడివాడను. ఆదొరగారి కీవిద్యావ్యాసంగము భర్జించలేదు. దానిని విమర్శించుచు నతడొకసారి తనవిద్య పన్నెండవయేటితోనే సమాప్త మయ్యెనని సెలవిచ్చెను. నిశ్చయముగా నీవిద్యాభావమే యా యాంగ్ల సైనికధైర్యరాశి కట్టికష్టమైన యాలోచనలను రాకుండ చేసెను! బహుశః (తరువాత) మారాష్ట్రములోని జయిళ్ళయిన స్వేచ్ఛరుజనరలు హాదాకుగూడ నితనినదియే తీసికొనిపోయి యుండవచ్చును. శీతకాల దీర్ఘనిశలును, వినీలభారతాకాశమును మమ్ము నక్షత్ర పంక్తి కాకర్షిం చెను. కొన్నిపటములసహాయముతో మేము వాటిప్రదేశములను కను గొంటిమి. ప్రతిరాత్రియు మేము వాటికొరకు వేచియుండి చిరమిత్రులను చూచునట్లె యానందముతో వాటికి స్వాగతమిచ్చెడివారము.

మేమిట్లు కాలమును గడుపుచుండ దినములు వారములును, వారములు మాసములును అయ్యెను. మా నిత్యజీవితముకు మేమలవడి తిమి. కాని బయట ప్రపంచములో భారమంతయు మనతల్లుల పయినను, భార్యలపయినను, సోదరీమణులపయినను పడెను. చిరవియోగమువలన వారు విసుగుచెందిరి. వారిప్రియులందరును జయిళ్లలోనుండ, వారిస్వేచ్ఛ యే వారికొక కళంకముగతోచెను. మా మొదటినిర్బంధమయినతోడనే పోలీసులు అలహాబాదులోని మాయింటిని ఆనందభవనమును తఱచు సందర్శింపనారంభించిరి. తండ్రిగారికిని, నాకును విధింపబడినజుల్మానాలను వసూలు చేయుటకు వారువచ్చెడివారు. జుల్మానాలను చెల్లింపరాదని కాంగ్రెసు విధించెను. కనుక పోలీసులు ప్రతిదినమువచ్చి చిన్నచిన్న

కరగ్రిసామగ్రిని తీసికొనిపోయెడివారు. ఇందిర, నా నాలుగేండ్ల కూతురు, పోలీసుల యీనిరంతరదాడిని సహింపక తనయసహాయతను వారికెఱిగించెను.

జయిలులో రాజకీయ ఖయిదీలు మామూలు ఖైదీలతో కలియ కుండుటకు సర్వవిధముల తంటాలుపడెడివారు; రాజకీయ ఖయిదీలకు ప్రత్యేకజయిళ్ళ నేర్పాటుచేసెడివారు. కాని పూర్తిగా విడదీయుట యసంభవ మయ్యెను. మేము వారితో తఱచు కలిసెడివారము. వారి ద్వారమునను, ప్రత్యక్షముగను కూడ జయిలులోని, నిజపరిస్థితులు తెలిసి కొనెడివారము. అవినీతి, సాంకర్యము దౌర్జన్యము— ఇదియే జయిలుకథ. భోజన మతిహేయ్యాముగనుండెడిది. నేననేకసారులు దానిని తినవలెనని చూచితిని. కాని యది తినసర్హ్వముగా లేకుండెను. సాధారణముగా జయిలు ఉద్యోగులు పూర్తిగా నసమర్థులు: వారికి తక్కువ జీతముల నిచ్చెడివారు. కాని ఖయిదీలనుండిగాని, వారిబంధువులనుండిగాని డబ్బు గుంజుకొనుటకు వారికనేకావకాశములుకలవు. జయిలరుకును, అతని సహ కారులకును, వార్డరులకును, అనేకబాధ్యతలును, ధర్మములునునుండు టచే వానినెవ్వడైనను సమర్థతతోను, ఆత్మశుద్ధిగను నెరవేర్చుట యసంభ వమే. మారాష్ట్రములలోని జయిళ్లలో (అన్ని రాష్ట్రములలోను) జయిలు పరిపాలనా విధానమునకును ఖయిదీలను సంస్కరించుట, వారికి మంచి వృత్తులను నేర్పుట యనుదానికిని నెట్టిసంబంధమునులేదు. ఖైయిదులో పనిచేయించుట ఖయిదీని బాధించుటకే! అతడు భయభ్రాంతుడై యడుగులకు మడుగులొత్తుచుండవలెను. అతడు జయిలు పేరు వినిన భయ భ్రాంతుడై నేరముచేసి తిరిగి జయిలుకు రాకుండ నుండవలెననియే దానియుద్దేశ్యము.

ఈమధ్య కొద్దిమార్పులు, రాజకీయ ఖయిదీలుచేసిన యాందో ళనవలన, జరిగెను. ఆహారము, దుస్తులు కొంచెము నయమయ్యెను. అసహాయోద్యమము వలన వార్డరుల జీతములుకూడ (సర్కారుకు

వారు భక్తితత్పరులుగ నుండుటకు) హెచ్చింపబడెను. పిల్లలకును, చిన్న వయసు ఖయిదీలకును వ్రాత, వాచకము నేర్పుటకు కొద్దిపాటి యేర్పాటులుగావింపబడెను. కాని యీ మార్పులు మంచివేయైనను అసలు సమస్య యథాప్రకారముగనే యున్నది. వెనుకటి జయిలుతత్వము మాత్ర మట్లే నిలిచియుండెను.

మామూలు ఖయిదీలకొరకేర్పడిన యీ చట్టములను నియమములను కొంచెమించుమించు రాజకీయ ఖయిదీలందరును సహింపవలసివచ్చెను. వారికి ప్రత్యేక సౌకర్యములుగాని, ఆదరణకాని లేవు. కాని వారు తెలివి గలవారగుటచే వారి బస్తాములనుండి (కొట్టివేయుట) గాని వారివద్ద డబ్బులాగుటగాని యంతసుళువుగా జరుగుటకు వీలులేకుండెను. ఈ కారణముచే జయిలు అధికారులకు వీరనిన సహజముగా కన్నెఱ్ఱగానుండెడిది. ఏకారణముచేతనైన నెవరైనను జయిలు నియమముల నుల్లంఘింపవలసి వచ్చెనా వాని చావుమూడినదన్న మాటే! అట్టి నియమభంగమునకే అజాదు అను పదిహేను పదహారేండ్ల కుఱ్ఱవానికి కొరడా దెబ్బల శిక్ష విధింపబడెను. అతని యొంటిమీద బట్టలన్నియు తీసివేయబడి యతడొక ముక్కోణమునకు కట్టివేయబడెను. ఒక్కొక్క దెబ్బ యతని యొడలు మీదపడి యెఱ్ఱటి తట్టుతేలుచుండ నతడు " మహాత్మా గాంధీకిజై " అని యరచుచుండెను. అతడు స్పృహ తప్పి పడిపోవువరకు నతనియొంటిమీద పడిన ప్రతిదెబ్బయు " మహాత్మా గాంధీకిజై " తో మేళవించుచుండెను. తరువాత కొంతకాలమున కాపిల్లవాడే ఉత్తరహిందూదేశములోని టెర్రరిస్టు సంఘములకొక నాయకుడయ్యెను.

---

## ౧౪
## తిరిగి బయటపడితిని.



జయిలులో ననేకవస్తువులను మనము చూడజాలము; ముఖ్యముగా స్త్రీలకంఠధ్వని, పిల్లల నవ్వులు వినరావు. మనకక్కడ వినబడు ధ్వనులు చాలకటువుగనుండును. కంఠధ్వనులు పరుషముగను భయజనకముగను నుండును. ఇక భాష కేవలముపశుప్రాయముగను, చాలవరకు బూతులతోను నిండియుండును. ఒకసారి నాకొక క్రొత్తకొఱత హఠాత్తుగాజ్ఞప్తికివచ్చెను. నేను లక్నోజయిలులో నేడెనిమిదిమాసములుండినను నాకు కుక్క అఱుపు యెప్పుడును వినిపించలేదు.

1923 జనవరి నెలాఖరున లక్నోజయిలులో నున్న రాజకీయ ఖయిదీలనందరిని విడిచివేసిరి. రాజకీయ ఖయిదీల విడుదలను గురించి ముందుగా పుకారులేమియు లేకపోవుటచే మేమాశ్చర్యపడితిమి. స్థానిక శాసనసభలో రాజకీయఖయిదీలను విడుదలచేయవలెనను తీర్మానము గావింపబడెను. కాని ప్రభుత్వకార్యనిర్వాహకవర్గమువారట్టి శాసన తీర్మానములను సాధారణముగ పెడచెవినిబెట్టుదురు. కాని ప్రభుత్వమువారి దినములు బాగుండెను. కాంగ్రెసు ప్రభుత్వముకు వ్యతిరేకముగా నేమియుచేయుటలేదు. కాంగ్రెసువారు తమలోతాము కొట్లాడుకొనుచుండిరి. జయిలులో పెద్దనాయకులెవరునులేరు. కనుక మంచిదే యని వారుమమ్ము విడిచివేసిరి.

జయిలుద్వారములను దాటుటవలననే కొంతయుల్లాసము స్వేచ్ఛ యెప్పుడునుకలుగుచుండును. మంచిగాలి, విశాలమైన మైదానములు రహదారితోగూడుకొనిన వీధులు, పాతస్నేహితులను కలుసుకొనుట

ఇవన్నియు బుఱ్ఱకెక్కికొంతయుల్లాసమును పుట్టించును. మేముత్సాహ ముతోఁ పొంగిపోతిమి. కాని యిదియెంతకాలమో నిలువలేదు. కాంగ్రెసు పరిస్థితులేమియు బాగుండలేదు. అదర్శములు పోయి పన్నుగడలు వచ్చెను. ఏమాత్రమాత్మవిచారము కలవారికైనను రాజకీయములనిస హ్యేవగింపు కలిగించు మాామూలుపద్ధతులచే, కాంగ్రెసును వశపరచు కొనుట కనేక బృందములు ప్రయత్నించు చుండెను.

నేను శాసనసభాప్రవేశమునకు వ్యతిరేకిని. ఇది చివరకు రాజీల కును, మన లక్ష్యమును తుడిచివేయుటకును దిగునట్లు నాకు కాన్పిం చెను. కాని దేశములో మరియొక రాజకీయ విధాన మేదియును లేదు. మార్పుకూడదనువారు 'నిర్మాణ కార్యక్రమము'ను సమర్థించిరి. అనగా సంఘ సంస్కారము- దీనిలోనున్న సుగుణమేమన నిది కాంగ్రెసు సేవకులకు ప్రజలతో సంబంధమును కలిగించును. కాని రాజకీయములు, రాజకీయ కర్మ కావలెననువారిని యిదెట్లు తృప్తి పరుపగలదు? ప్రత్యక్ష పద్ధతి యొకసారి విఫలమైన తరువాత కొంత శాశనసభాట్టహాస ముండక తప్పదు. ప్రభుత్వ తోడ్పాటుకును, నిర్మాణము నకును గాక ప్రభుత్వమును ప్రతిఘటించుటకును, ధిక్కరించుటకును, దీనిని మా తండ్రియు, చిత్తరంజనదాసుగారును నడిపిరి.

అచ్చట గూడ జాతీయ పోరాటమును సాగింప వలెననియే శాసనసభా ప్రవేశము నెప్పుడును చిత్తరంజనదాసు సమర్థించుచుండెను. మాతండ్రికి గూడ కొంచెమించు మించుగ నట్టిభావమే యుండెను. కాని 1920 లో నతడు తనదృక్పథమును గాంధీజీకి లోఁబరచెను. అతడు యావచ్ఛక్తిని పోరాటములో వినియోగింప నెంచెను. అప్పుడు గాంధీజీ సిద్ధాంతమును పూర్తిగ నంగీకరించు టొక్కటియే దానికి మార్గ మయ్యెను. సిన్ఫీనులవలె, పార్లమెంటులో ప్రవేశించి కామన్సు సభకు హాజరుకాకుండ నుండునట్లు, ఉండవలెనని చాలమంది యువకుల కుండెను.

నేను 1920 వేసవిలో గాంధిజీని యీ పద్ధతి కంగీకరింప మంటిని. కాని యట్టి విషయములలో నతడచలుడు. మహమ్మదాలీ (అప్పుడు యూరపులో నుండెను) కూడ బహిష్కారపద్ధతి కిష్టపడలేదు. ఇతరు లెట్లు భావించిననేమి? చివరకు గాంధిజీవాక్యమే వేదవాక్యము కాగలదు. అతడు ఉద్యమ జనకుడు. కనుక చిన్నవివరముల కతనికి తగినంత స్వేచ్ఛ నీయవలెనని మేమనుకొంటిమి. ఓట్లు నీయకుడు, పోలింగులకే వెళ్ళకుడు అను దాని నర్థము చేసికొనునట్లు నిష్క్రియపద్ధతిని ప్రజలర్థముచేసికొనజాలరని యతనివాదన. ఎన్నికొనబడి సభలకు పోకుండుట ప్రజలలో గందరగోళముకు కారణమగును. ఒకసారి కౌన్సిలు లోనికి పోయినతరువాత నదివారినాకర్షించుననియు, వారిక బయటకు రారనియు, వారిని బయటకు రప్పించుటకు మనయుద్యమములో తగి నంతశిక్షణగాని, బలముకానిలేదనియు, శాసనసభలద్వారమును, ననేక ప్రత్యక్షా ప్రత్యక్షమార్గముల ప్రభుత్వమెప్పులకును, హోదాలకును దాసులగుట సంభవింప వచ్చుననియు నతడు చెప్పెను.

ఈవాదములలో బలమెంతయో కలదు. స్వరాజ్యపార్టీ శాసన సభలకు వెళ్ళినపు డిందులో చాలముచ్చట్లుజరిగెను. అయినను 1920లో కాంగ్రెసు, శాసనసభలను వశపరచుకొనుటకు పూనుకొనినచో నేమ య్యెడిదో చెప్పజాలము. ఖిలాఫతుకమిటీ బలముకూడ నుండుటచే రాష్ట్రసభలలోను, కేంద్ర అసెంబ్లీలలోను కూడ నన్ని యెన్నుకొన బడు సీట్లును కాంగ్రెసుకే చేకూరెడివనుటలో నెట్టి సందేహమునులేదు. నేడు (ఆగష్టు 1934) అసెంబ్లీకి కాంగ్రెసుసభ్యులను నిలపుటకొక పార్లమెంటరీబోర్డు స్థాపింపబడెను. కాని 1920 లగాయితు నేటివరకు మనసాంఘిక, రాజకీయ చీలికలను పెంచుట కనేక కారణము లేర్ప డెను. కనుక రాబోవు యెన్నికలలో కాంగ్రెసు కెట్టివిజయము కలిగి నను అది 1920 నాటి విజయముతో సరిపోలజాలదు.

నేను జయిలునుండి వచ్చుటతోడనే, రెండుపక్షములవారి మధ్యను రాజీకుదుర్చుటకు ప్రయత్నించుచున్నవారికి తోడ్పడితిని. కాని లాభములేకపోయెను. చివరకీరెండుపక్షముల రాజకీయములతోను నేను విసుగుచెందితిని. రాష్ట్రకాంగ్రెసుకమిటీ సెక్రెటరీనగుటచే నేను కాంగ్రెసుసంస్థను చక్కబెట్ట పూనుకొంటిని. గతవత్సరమంతయు తల క్రిందులగుటచే, చేయవలసినదెంతయో యుండెను. నేనెంత కష్టపడినను లాభములేకపోయెను. నాకేమియుతోచకుండెను. ఇంతలోనే మరియొక క్రొత్తరంగమునాకు తయారయ్యెను. నేనువిడుదలయైన కొద్దివారములకే నన్ను అలహాబాదు మున్సిపలు ఛైరుమను పదవిలోనికి గెంటిరి. ఈయెన్నిక చాలహఠాత్తుగా జరుగుటచే నిదిజరుగుటకు 45 నిమిషములకు పూర్వ మెవరును నాపేరు సూచించి యుండలేదు.

చిత్రముగా నాసంవత్సరమున దేశమంతటను ప్రధానకాంగ్రెసు నాయకులు మున్సిపాలిటీల కధ్యక్షులైరి. చిత్తరంజనదాసు కలకత్తాకు మొదటిమేయరుఅయ్యెను; విఠల్‌భాయి పటేలు బొంబాయికార్పరేషను కధ్యక్షుడయ్యెను; సర్దారు వల్లభాయిపటేలు అహమ్మదాబాదు కధ్యక్షుడయ్యెను. మారాష్ట్రములో పెద్దపట్టణములకు చాలవరకు కాంగ్రెసు అధ్యక్షులేవచ్చిరి.

మున్సిపలుపనిలో నేను నిమగ్నుడనైతిని. కొన్నిసమస్యలు నన్నెక్కువగానాకర్షించెను. నేను మున్సిపలు విషయములను బాగుగ చదివి మున్సిపలు సంస్కరణమునుగురించి గంపెడాశలతో నుంటిని. కాని పెద్దయాశలకుగాని, యెన్నదగిన యభివృద్ధికిగాని భారతదేశ మున్సిపాలిటీలలో (చట్టనిర్మాణమునుబట్టి) నెంతమాత్రము నవకాశములేదని నేను తరువాతగ్రహించితిని. అయినను కొంతపనికవకాశముండుటచే నేనీయంత్రమును శుభ్రపరచుటకును, పరిపాలనను త్వరితము చేయుటకును కష్టించిపనిచేసితిని. అప్పుడే నాకాంగ్రెసుపనిగూడ

హెచ్చుచుండెను. నారాష్ట్రకాంగ్రెసు సెక్రటరీపదవికితోడు నేను యావద్భారతకార్యదర్శినైతిని; ఇన్ని పనులుండుటచే నేను తఱచు రోజుకు పదిహేనుగంటలు పనిచేసెడివాడను.

నేను జయిలునుండి యింటికి తిరిగివచ్చినతరువాత మొట్టమొదట అలహాబాదు ప్రధాన న్యాయమూర్తియైన సర్ గ్రింవుడ్ మియర్సు గారి యుత్తరువును చూచితిని. నేను జయిలునుండి రాకపూర్వమే నాకాయుత్తరమువచ్చెను. అతనిభాషలోని మార్దవమునకును, తనను తఱచు కలుసుకొనవలసినదను నాహ్వానమునకును నేనాశ్చర్యపడితిని. నేనతనిని కొంచెమేయెరుగుదును. 1919 లో నేను ప్రాక్టీసును విడిచి పెట్టుచున్నకాలములో నతడు అలహాబాదువచ్చెను. నేనతని ముందర నొక్క కేసుమాత్రమే వాదించితిని. అదియే హైకోర్టులో నా ఆఖరి కేసు. నాసంగతి తెలియకుండగనే, యేకారణముననో యతడు నాయెడల కొంత పక్షపాతమును వహించెను. నేను చాలాముందుకు పోవుచుంటి ననియు, బ్రిటిషువారిదృక్పథమును నాకు తెల్పి నన్నొప్పించునుద్దేశ్యము తనకుండెననియు నతడు నాతోనొకసారిచెప్పెను. ఇంగ్లీషువారు తమ సాంఘికాచారవ్యవహారములలో తన నవమానపరచుటచే భారత దేశములోని సామాన్య 'యతివాది' బ్రిటిషువారికి వ్యతిరేకి యగుచున్నాడని యతడు (అట్లుభావించు యింగ్లీషువారింకను చాలమంది కలరు) భావించెను. ఇదికోపమునకు, ద్వేషమునకు, 'అతివాదిత్వము' నకు కారణమయ్యెను. మాతండ్రి కొకయింగ్లీషుక్లబ్బులో స్థానమీయ లేదనియు, నిదియే యతనిని బ్రిటిషువారికి వ్యతిరేకిగను, అతివాది గను చేసెననుకథ యొకటిగలదు. ఇది కేవల మభూతకల్పన. కాని చాలమంది యింగ్లీషువారికిట్టి విషయములు (నిజమైనను అబద్ధమైనను) జాతీయోద్యమారంభములకు తగినకారణములు. యథార్థముకునాకుగాని మాతండ్రికిగాని యిట్టిదెన్నడును సంభవించలేదు. వ్యక్తిగతముగా

మమ్ము ఆంగ్లేయులు సాధారణముగ మర్యాదగనే చూచెడివారు. మేము వారితో బాగుగనే యుండెడివారము. కాని భారతీయులందరివలెనే, మేమును జాతీయదాస్యమును గుర్తించి దానిని తీవ్రముగా నెదిర్చెడి వారము. నేటికిని నేను యింగ్లీషువానితో (అతడేయుద్యోగియో యై నాపై తనయుద్యోగ హోదాను వెలిగింప జూచినతప్ప, అప్పటికిని మాసంపర్కములలో హాస్యముకు కొఱతయుండదు) బాగుగనే వ్యవహరింపగలను. భారతదేశములో రాజకీయముగ నతనికి తోడ్పడు లిబరలు యిత్యాదులకంటె నాకతనితో నెక్కువ సామ్యమున్నది.

ఈద్వేష మూలకారణమును మిశ్రసమ్మేళనముల చేతను, అదిరాభిమానప్రవృత్తసచేతను, నిర్మూలింప నలెనని సర్ గ్రిఫ్ఫిన్ గారి యుద్దేశ్యము. నేనతనిని చాలసారులు చూచితిని. ఏదోయొక మున్సిపలు పన్నుకు అభ్యంతరము చెప్పువానివలె వచ్చి యత డితరవిషయములను చర్చించును. ఒకసారి యతడు భారతదేశములోని లిబరలుపక్షము వారిపై దాడివెడలి వారిని పిరికిపందలు శీలముగాని, వెన్నెముకగాని లేని స్వార్థపరులు అనెను. అతనిభాష యింకను కఠినముగను ద్వేష పూరితముగను నుండెను. "వారియెడల మాకెట్టి గౌరవమైన నున్నదనియే మీరు భావింతురా!" అని యతడనెను. అతడు నాతో నీవిధముగ నేల మాట్లాడెనో నాకర్థముకాలేదు. బహుశః యిట్టిసంభాషణ నాకిష్టముగనుండునని యతడనుకొనియుండవచ్చును. తరువాత నతడు సంభాషణనంతయు క్రొత్తశాసనసభలమీదకు, క్రొత్త మంత్రుల మీదకు, దేశసేవచేయుటకు వారికున్న యవకాశములమీదకు పోనిచ్చెను. దేశములో విద్యాసమస్య యత్యంతప్రధానమైనది. తనయిష్టము వచ్చినట్లు నడచుటకు స్వేచ్ఛగల విద్యామంత్రి లక్షలకొలది ప్రజల యదృష్టమును మార్చివేయుట కెట్టియద్భుతావకాశమును కలిగియుండును! బుద్ధివిశేషము, శక్తిశీలములు, ఆశయములు, వాని నమలుపరుపగల

శక్తిసామర్థ్యములుకల నీవంటివాడే రాష్ట్రవిద్యా విధాతయగునను కొనుము! నీవద్భుతకార్యములు చేయజాలవా? తాను యీమధ్యనే గవర్నరును చూచెననియు, నావిధానమును అమలుజరుపుటకు నాకు సంపూర్ణ స్వేచ్ఛయివ్వబడుననియు చెప్పెను. అప్పుడతడు చాలదూరము పోవుచున్నట్లుగ్రహించి తానధికారరీత్యాగాక, తనంతతానేయాసూచన చేసినట్లు చెప్పెను.

సర్.గింవుడ్డుగారి రాజకీయ, ద్రావిడ ప్రాణాయామసూచన నాకు నవ్వుపుట్టించెను. నేను ప్రభుత్వముతో మంత్రిత్వరీత్యా సంపర్కము కలిగించుకొనుట యనూహ్యమే కాక, నాకేహ్యముగ కూడనుండెను. కాని నేను అప్పుడును, తరువాతనుకూడ కొంతయథార్థమైన, కార్యరూపమైన, నిర్మాణకార్యక్రమమును చేయవలెననియే పరితపించు చుంటిని. నాశముచేయుట, ఆందోళన చేయుట, సహాయము చేయకుండుట మానవుల సామాన్యధర్మములుకావు. కాని యట్టినిర్మాణ భూమికిచేరుటకుముందు పోరాట వినాశయెడారులను దాటవలెననియే మాకు బ్రహ్మవిధించెను. మనలో చాలమంది మన జీవితములను, శక్తి సామర్థ్యములను, మనసమస్తమును, యీ యిసుకయెడారులలో పోరి పోరి, యలసియలసి పోగొట్టుకొనవచ్చును; నిర్మాణమును మనబిడ్డలో, మనబిడ్డలబిడ్డలో చేయవలసియుండవచ్చును.

ఆరోజులలో, సథమపక్షము సంయుక్తరాష్ట్రములలో, మంత్రులతిచౌకగనుండిరి. అసహాయోద్యమకాలములో పనిచేసిన లిబరలు మంత్రులిరువురును రాజీనామాయిచ్చిరి. కాంగ్రెసు యుద్యమ మతి తీవ్రముగా నున్నరోజులలో ప్రభుత్వమువారు లిబరలుమంత్రులను కాంగ్రెసుపై ధ్వజమెత్తుట కుపయోగించుకొనిరి. వారప్పుడు ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గముచే గౌరవింపబడిరి; పూజింపబడిరి. ప్రభుత్వమును కాంగ్రెసు ఒక్కుమ్మడిగా నెదుర్కొనుటచే నాగండమును కాచుకొను

టకు ప్రభుత్వము తమకిచ్చిన గౌరవమే యనియనుకొనక, పాపమా మంత్రులది తమదే యనుకొనిరి; తమహక్కే యనుకొనిరి. ఆపోరాటము తగ్గుటతోడనే ప్రభుత్వదృష్టిలో మంత్రుల విలువకూడ పడిపోయెను. ప్రభుత్వము మునుపటిగౌరవ, మర్యాదలనుచూపించుటమాని వేసెను. దీని వలన మంత్రులకుకోపమువచ్చెను. వారికోపతాపముల నెవరును లెక్కపెట్టకపోవుటచే వారురాజీనామాయివ్వవలసివచ్చెను. అప్పుడుక్రొత్తమంత్రులకొరకు వలవేయ నారంభించిరి. ఇది వెంటనే జయప్రదముకాలేదు. శాసనసభలోనున్న కొద్దిమంది లిబరలుసభ్యులును, తమతోడివారి పట్ల మానుషముగాత్రోసి వేసిరనుసానుభూతిచే నూరకొనిరి. తక్కినవారిలో, చాలమందిజమీందారులు, సామాన్యచదువు చదివినవారు కూడ లేరు. కాంగ్రెసు శాసనసభలను బహిష్కరించుటచే, నానాగోత్రములవారును నందులోచేరిరి.

ఈ సమయముననో లేక కొంచెము తరువాతనో జరిగిన యొక చిత్రకథకలదు. ఒకనికి యీ మంత్రిపదవిని ప్రసాదించెద మనిరి. దానికతడు తా నసాధారణబుద్ధి బలముకలవాడను గర్వము లేనివాడనియు సామాన్య తెలివితేటలు కలవాడనిమాత్రము తనకు తెలియుననియు (కొంచెముసామాన్యముకంటె హెచ్చినను హెచ్చువచ్చుననియు) తన కట్టిపేరుప్రతిష్ఠలున్నట్లు తానాశించుచున్నాననియు చెప్పెనట. మంత్రిపదవిని స్వీకరించి తాను శుద్ధమూర్ఖుడనని ప్రపంచమునకు చాటుకొనమని ప్రభుత్వ యుద్దేశ్యమా ?

ఈపరిస్థితిఘటనలో కొంత న్యాయమున్నది. రాజకీయములను గురించికాని, సాంఘిక విషయములనుగురించికాని యెట్టివిశాలదృష్టియు లేక లిబరలుమంత్రులు చాలసంకుచితబుద్ధితో నుండిరి. కాని యది వారి పంథాసిద్ధాంతముయొక్క దోషము. కాని వారు వృత్తులలో నుండువారికిగలశక్తిగలిగి తమనిత్యకార్యముల నాత్మశుద్ధితో నెరవేర్చెడి

వారు. వారితరువాత నుద్యోగములోనికివచ్చినవారిలో కొందరుజమీందారులు. వారివిద్య అత్యల్పము. వారిని అక్షరజ్ఞులనదగును. భారతీయులు కేవలమసమర్థులని చాటుటకే గవర్నరు వీరినిపట్టుకొని యీ యున్నత పదవులలోపెట్టినట్లు కాన్పించును. "లక్ష్మికసాధ్యమేదియునులేదని ప్రజలుచెప్పుకొనుటకే యదినిన్ను పైకి తీసికొనివచ్చెను" అను వాక్యము వీరికిబాగుగ వర్తించును.

చదువున్న నేమి, లేకున్న నేమి! యీమంత్రులకు జమీందారీ వోటుకలదు. వారు పెద్దపెద్ద యుద్యోగస్తులకు బ్రహ్మాండమైన విందులు చేయగలరు.మలమల మాడుచున్న రైతులనుండి పిండబడిన ధనము కింతకంటె యోగ్యమైన ప్రయోజనమేదికలదు?

---

౧౫

# సందేహము-సంఘర్షణ.



నన్ను బాధించుచుండిన సమస్యలకు దూరముగనుండుటకై నే ననేక కార్యములలో నిమగ్నుడనైతిని. కాని నన్నవి వీడకుండెను. అవి యెప్పుడును నన్ను బాధించుచుండ నాకువాటికి తగిన సమాధానములు వచ్చెడివికావు. నాసందేహములనుండి పారిపోవ ప్రయత్నించుటకే నే నిప్పుడు కార్యాచరణకు గడంగితిని. కాని 1920-21 లలో నిది సంపూర్ణముగ నాయాత్మనే వ్యక్తముచేసెను. నేను నన్ను రక్షించుచుండెడి యావరణలోనుండి బయటకువచ్చి, భారత రంగమును, బయట ప్రపంచమును చూచితిని. అంతకుమునుపు నేనుగుర్తించని యనేకమార్పులు, క్రొత్తభావములు, క్రొత్తసంఘర్షణలు తలయెత్తెను. నాకు వెలుతురు కన్న అంధకార మెక్కువయయ్యెను. గాంధీజీ నాయకత్వము యెడల నావిశ్వాస మెప్పటివలెనుండెను. కాని నేనతని విధానములోని కొన్ని భాగములను యెక్కువవిమర్శగా పరీక్షింప నారంభించితిని. అతడు జయిలులోనుండుటచే నేనతని సలహా తీసికొనజాలకపోతిని. కాంగ్రెసు పక్షములు రెంటిలో నేదియు నన్నాకర్షింపక పోయెను. కౌన్సిలు పక్షము వారు సంస్కరణ మంత్రిము, చట్టవిధానమంత్రమునకు తిరిగిరి. ఇవి అంధకార వీధులలోనికే తీసికొనిపోవు చున్నట్లు నాకు కాన్పించెను. మార్పుకూడదను వారు మహాత్ముని ప్రియశిష్యులను కొనబడిరి. కాని చాలమంది గొప్పవారి శిష్యులవలెనే వీరును యుపదేశములోని పదములనే తీసికొనిరి కాని వాటిసారమునకు ప్రాధాన్యత నీయలేదు. వారిలో చైతన్యతలేదు. కొంచెమించుమించు వారాచరణలో నుపద్రవములేని సంఘసంస్కర్తలైరి. కాని స్వరాజ్యపార్టీ, పార్లమెంటరీ యెత్తులలో మునిగియుండ వీరికిప్రజలతో సంబంధ ముండెడిది,

నేను జయిలునుండి వచ్చుటతోడనే దేశబంధుదాసు నన్ను స్వరాజ్యపార్టీ మతములోనికి మార్చవలెనని ప్రయత్నించెను. నేనేమి చేయవలెనో నాకు తెలియకపోయినను నేనతని వాదమునకు లొంగలేదు. నాతండ్రి స్వరాజ్యపార్టీ నాయకుడైనను నన్నెప్పుడును, తన మతము లోనికి త్రిప్పుకొనవలెనని ప్రయత్నింపలేదు. నేనందులోచేరిన యతడు చాల సంతసించెడివాడు, కాని యతడావిషయమును పూర్తిగా నాకే వదలివేసెను.

ఈకాలములో మాతండ్రికిని దాసుగారికిని చాలమైత్రికలిగెను. అది రాజకీయసహచర్యముకంటె చాలగొప్పదియయ్యెను. వారి యన్యోన్యతను స్నేహభావమును చూచినపుడు నాకు కొంచెమాశ్చర్యము వేసెడిది. ఏలనన వయసు ముదిరిన తరువాత పెద్దస్నేహము కుదురుట చాల యరుదు. మా తండ్రికి చాలమంది పరిచయు లుండిరి. వారితో కులాసాగా నవ్వుచు సరససల్లాపములు చేయుచుండెడివాడు. కాని స్నేహవిషయమై యతడు జాగ్రతగ నుండుటయేకాక వయసు మీరిన తరువాత నతడు స్తనశల్య పరీక్షచేయు చుండెడివాడు. కాని వీరిరువుర మధ్యను యీయడ్డంకులన్నియు నశించి యొకరినొకరు హృదయపూర్వకముగా ప్రేమించుకొనిరి. నాతండ్రి యతనికంటె తొమ్మిదేండ్లు పెద్దవాడైననుయతనికంటెబలిష్టుడు,ఆరోగ్యవంతుడు. ఇద్దరునుగొప్పలాయర్లు చాల పేరు ప్రఖ్యాతులను బడసినవారైనను వారిలో చాలభేదము లుండెను. దాసుగారు లాయరేకాక కవి; అతనిలో కవి కుండెడి భావోద్రేకముకలదు. అతడు తనభాషలో చక్కని కవిత్వమును వ్రాసెనని నావిశ్వాసము. అతడు మంచివక్త; మతస్వభావము కలవాడు. మాతండ్రి యెక్కువ యనుభవజ్ఞుడు, ఉద్రేకములేనివాడు. అతడు మంచి వ్యవహారత, మతవాసన లేనివాడు. అతడెప్పుడును యోధుడు, కొట్టుటకును, తినుటకును సిద్ధము. అతడెవరిని మూర్ఖులనియనుకొనునో వారిని విడిచి

పెట్టడు. వ్యతిరేకమును సహింపడు. అది తనకొరక సవాలని భావించి చీపురుకట్ట ప్రయోగము కావలెననుకొనును. ఇట్లుమాతండ్రియు దాసు గారును, కొన్నివిషయములలో భేదించినను, ఒకపార్టీని నడుపుటకు చక్కగా కుదిరిరి. ఒకరిలోటుల నొకరు తీర్చివేసిరి. వారి పరస్పర విశ్వాసము అద్భుతము. కనుక వారొకరితో నొకరు ముందుగ నాలోచింప నక్కరలేకుండగనే యొకరిపేరు నొకరు యెట్టి స్టేటుమెంటు, లేక ప్రకటన కైనను యివ్వవచ్చు ననుకొనిరి.

ఈ వ్యక్తిగత సంబంధమే స్వరాజ్యపార్టీకి దేశములోబలమును, పేరుప్రతిష్టలను చిరస్థాయిత్వమును కలుగచేయుటకు చాలవరకు పని చేసెను. శాసనసభలద్వారా వ్యక్తిగతముగా ముందుకు పోవచ్చునని దూరిన స్వలాభపరు లిందులోనుండుటచే మొట్టమొదట నుండియు చీలుట కిందుకో నవకాశములుండెను. ప్రభుత్వముతో సహకారము చేయనిలేనను నిజమైన మితవాదులును కొందరుండిరి. ఎన్నికలగుట తోడనే యీస్వభావములు పైకుబుకుటచే వెంటనే నాయకులు వీటిని గ్రహించిరి. మాతండ్రి 'దుష్టాంగమును ఖండించివేసెదను' అనిచెప్పి యత్నించేసెను.

1923 లగాయతు (నేను దానికంత సావకాశము నీయకపోయినను) నాకుటుంబములో నాకెక్కుడుశాంతియు, సంతోషమును కాన్పించెను. నాకుటుంబ సంబంధములలో, నే నదృష్టవంతుడనగుటచే, వారు చిక్కులలోను కష్టకాలములోను, నన్ను శాంతపరచి నాకాశ్రయము నిచ్చెడివారు. నాభార్య యద్భుత ప్రవర్తనకు 1920 లగాయతు నే నామెకెంత ఋణపడి యుంటినో (నేనుదానికెంతయు నర్హుడనను సిగ్గుతో) నేను గ్రహించితిని. ఆమె యభిమానరాశి; చురుకుపాలు కలది; అయినను నాచేష్టల నన్నింటిని సహించుటయేగాక నాకామె సంతోషమును, ఆత్మశాంతిని చేకూర్చుచుండెడిది. 1920 లగాయితు

మాజీవిత పద్ధతిలో కొంతమార్పుకలిగెను. అది చాలనిరాడంబరముగ నుండెను. చాలమంది నౌకరులు తగ్గించబడిరి. అప్పటికిని ప్రధాన సుఖములకేమియు కొఱతలేకుండెను. కొంతయనవసరమైనవాటిని వదలుచుకొనుటకును, కొంత ప్రస్తుత ఖర్చులకు డబ్బుకొరకును, గుఱ్ఱములు, బండ్లు, మాక్రొత్తజీవిత విధానమునకనవసరమైన గృహసామగ్రి మొదలగునవి యెన్నియో అమ్మివేయబడెను. కొంతసామగ్రిని పోలీసులు తీసికొనిపోయి యమ్మివేసిరి. తోటమాలీలు, కర్రసామగ్రి లేకపోవుటచే మాతోట పాడైపోయెను; యింటి యందచందములు తగ్గిపోయెను. మూడేండ్లవరకు యింటినిగాని తోటనుగాని మేముశ్రద్ధగా చూడలేదు. చాల హెచ్చుగా డబ్బుఖర్చుపెట్టుకొను నలవాటు కలవాడగుటచే తండ్రిగారికి ఖర్చులను తగ్గించుట కష్టములేకుండెను. కనుక నతడు తనతీరిక కాలములో కొంతడబ్బు సంపాదింపవలెనని యింటివద్దనే ప్లీడరుసలహా యిచ్చుచుండెడివాడు. అతనికంత తీరికయుండెడికాదు. అయినను అతడు బాగుగనే సంపాదించెడివాడు. ఆర్థికముగా తండ్రిగారిమీద నాధారపడుట నాకుకష్టముగను, అసంతుష్టిగనునుండెను. నేను ప్రాక్టీసు మానివేసినదిలగాయితు స్వంతసొమ్ము (కొద్దివాటాలమీద వచ్చు ప్రతిఫలముతప్ప)నాకేమియులేకుండెను. నాభార్యయు, నేనును చాల స్వల్పమే ఖర్చుపెట్టెడివారము. మేమంతకొద్దితో కాలక్షేపము చేయగలుగుట నాకే యాశ్చర్యమయ్యెను. 1921 లో నేనీవిషయమును కనుగొని చాలతృప్తినొందితిని. ఖద్దరుబట్టలకును, మూడవతరగతి రైలు ప్రయాణమునకును నంతసొమ్ము అవసరములేదు. అప్పుడు మేము మాతండ్రిగారి యొద్దనే యుండుటచే ననేక యితర గృహఖర్చులున్న సంగతి నేనెరుగనైతిని. ఎట్లైనను డబ్బు ఉండదనుభయము నన్నెప్పుడును బాధించలేదు. అవసరమున్నచో నేను కావలసినంత సంపాదింపగలిగెడి వాడను. మేము స్వల్పముతోనే కాలముగడుపగలము.

మేము మాతండ్రికి కంత భారముగ నుండెడి వారము కాము. అట్టి సూచన వినినచో నతని కెంతయో బాధ కలిగెడిది. అయినను నేను నాస్థితితో తృప్తిపొందక మూడేండ్లు యీసమస్యనుగురించి యాలోచించి విఫలుడనైతిని. కావలెనన్న నాకుమంచి లబ్ధిగలకృషి దొరకక పోదు. కాని నేనట్టి కృషికి బూనినచో నేను చేయుచుండిన దేశసేవను మానివేయవలెను. లేదా కొంతకాలమునైనను అందుకు వినియోగింపవలెను. ఇంతవరకు నేను నాకాలమునంతను కాంగ్రెసు, మున్సిపలు సేవలకే వినియోగించుచుంటిని. డబ్బుచేసికొనుటకు నేనీపనులను మానివేయుట నాకయిష్టముగనుండెను. పెద్దపెద్ద వర్తక కంపెనీలనుండి వచ్చిన చాల లాభదాయకములగు యనేకావకాశములను త్రోసివేసితిని; బహుశః వారు నాసమర్థతకుగాక నా పేరును తమస్వార్థముకొరకుపయోగించుకొనుటకే యంత పెద్దజీతముల నిచ్చెదమనిరి. పెద్దపరిశ్రమలతో నేనీవిధముగా సంబంధముపెట్టుకొనుట కిచ్ఛగింపలేదు. ఇకన్యాయవాదవృత్తికి బోవుట యసహ్యాము. దానినిగురించి తలచినకొలదియునది నాకయిష్టమయ్యెను.

1924 లో కాంగ్రెసుకార్యదర్శులకు జీతముల నీయవలెనను సూచన వచ్చెను. నేనొక కార్యదర్శిగనుంటిని. ఇది నాకుబాగుగనే కాన్పించెను. పొట్టగడచుటకైనను, యేమియు నివ్వకుండ యెవనినైనను తనకాలమునంతను సేవచేయవలసినదనుట తప్పిదమని నాకు తోచెను. లేకపోయినచో నితర మార్గములద్వారా డబ్బువచ్చువానిని చూడవలెను. అంత తీరుబడికలవాని నెల్లప్పుడును రాజకీయముగా విశ్వసించుటకు వీలులేదు; పనికి వారిని బాధ్యులనుచేయుటకును వలనుపడదు. కాంగ్రెసు హెచ్చుజీతముల నీయజాలదు; మన జీతములు చాలతక్కువ. పబ్లికు నిధులనుండి జీతమును తీసికొనరాదను కేవల అక్రమమును, అసాధారణమును నగు దురభిప్రాయమొకటి భారత

దేశములో కలదు. నేనట్లుచేయరాదని మాతండ్రియే తీవ్రముగా ప్రతిఘటించెను. నాతోడికార్యదర్శి చాల డబ్బునిక్కచ్చిలోనుండి కూడ జీతము తీసికొనుట గౌరవభంగమనితలంచుచుండెను. కాని యెట్టి గౌరవభంగమునులేక జీతమునుతీసికొనసిద్ధముగానున్న నేనుకూడ జీతము లేకుండగనే పనిచేయవలసివచ్చెను. ఒక్కసారియే నేను తండ్రిగారితో నీవిషయమునుగురించి చెప్పి డబ్బుకొరకతనిమీద నాధారపడుట నాకిష్టములేదంటిని. ప్రజాసేవ చేయుచుండ నేను నాకాలమునంతను స్వల్పధనార్జనకొరకు వినియోగించుట కేవలము మూర్ఖత్వమని యతడనెను. నాకును నాభార్యకును నొక్క సంవత్సరమునకు కావలసిన దానినతడు కొద్దిరోజులలో సంపాదింపగలననెను. ఈవాదము బలీయముగనేయున్నను నాకంతతృప్తిగలేకుండెను. అయినను నేనుదానిప్రకారమే నడచితిని.

1923 ప్రారంభమునుండి 1925 చివరవరకు నీ కుటుంబ వ్యవహారములతోను, డబ్బుచిక్కులతోను మాకుసరిపడెను. ఈలోపల రాజకీయములు మారుచు నాకిష్టములేకపోయినను . నేనఖిలభారతకాంగ్రెసులో బాధ్యతగల పదవిని వహింప నిర్బంధింపబడితిని. 1923 లో నొక చిత్రమైన స్థితియేర్పడెను. గత వత్సరములోని గయా కాంగ్రెసునకు చిత్తరంజనదాసు అధ్యక్షుడయ్యెను. కనుక నతడే 1923 లో అఖిల భారతకాంగ్రెసు కమిటీ చైరుమనుగ నుండును. కాని యీ కమిటీలో స్వరాజ్యపార్టీ నీతికిని, యతనికినివ్యతిరేకమైనవారికి మెజారిటీయుండెను. 1923 లో బొంబాయిలో జరిగిన కమిటీమీటింగులో పరిస్థితులు విషమించెను. దాసుగారు చైరుమను పదవికి రాజీనామా యిచ్చెను. రెండు పక్షములకును మధ్యనున్న యొకచిన్న మధ్యపక్షము కార్యనిర్వాహకవర్గమయ్యెను. ఈ కార్యనిర్వాహకవర్గమునకు కమిటీలో సరియైన బలములేదు. ముఖ్య రెండుపక్షములలో నేదో యొకదానిపై నిది

యాధారపడెను. ఒకదానితో కలసినచో నిది మరియొకదాని నోడింప గలదు. డాక్టరు అన్సారీ క్రొత్త యధ్యక్షుడయ్యెను. నేనొక కార్యదర్శిని.

మా కిరుప్రక్కలనుండియు కష్టములే సంభవించెను. నోఛేంజర్లకు కోటయైన గుజరాతు కేంద్రకార్యాలయమువారి యాజ్ఞలను కొన్నింటిని తిరస్కరించెను. ఆ సంవత్సరమే వేసవిలో జాతీయజెండా సత్యాగ్రహము జరుగుచున్న నాగపురములో మరియొక కమిటీమీటింగు జరిగెను. ఆ దురదృష్టమధ్యపక్షముకు చెందిన మా కార్యనిర్వాహక వర్గమంతటితో సంతెరించెను. అది యెవరికిని ప్రాతినిధ్యము వహింపక కాంగ్రెసులో నిజమైన పలుకుబడి కలవారిపై నధికారము చెలాయింప వచ్చెను. కనుక నదియంతయు కావలసినదే. గుజరాతు చూపిన యవిధేయతకు దానిమీద విశ్వాసరాహిత్యముకు ప్రయత్నింపగా నది విఫలమగుటచె మేము రాజీనామాయిచ్చితిమి. నేనతిసంతోషముతో రాజీనామాయిచ్చి పీడవదలినట్లు భావించితిని. పార్టీయెత్తుల, జిత్తుల కొద్ది కాలపు టనుభవమే నాకు బాధకలిగించెను. కొంతమంది ప్రధాన కాంగ్రెసు నాయకుల పన్నుగడలకు నే నాశ్చర్యపడితిని.

ఈసభలో చిత్తరంజనదాసుగారు నన్ను 'ఉద్రేకశూన్యుడవు' అని నిందించెను. అది యుక్తమేకావచ్చును; అది మనముపోల్చు దాని ప్రమాణమునుబట్టి యుండును. నాస్నేహితులలోను సహచరులలోను చాలమందితో నన్ను పోల్చినచో నేను ఉద్రేకములేనివాడనే. అయినను భావము, ఉద్రేకము, కోపము మొదలగునవి నన్నుముంచునేమో లేక నేను వానిచే నీడ్వబడుదునేమో యని నే నెప్పుడును భయపడుచునే యుందును. ఉద్రేకములేకుండుటకే నే ననేక సంవత్సరములు సాధన చేసితిని. నే నిందులో పొందిన జయము కేవలము బాహ్యమనియే నాభయము.

---

## ౧౬

## నా భార్య లో నొకకథ.

స్వరాజ్యపక్షమువారికిని, నోఛేంజర్లకును ద్వంద్వయుద్ధము జరుగుచు క్రమముగా స్వరాజ్యపక్షము గెలుపొందుచుండెను. 1923 శరత్కాలములో ఢిల్లీలోజరిగిన ప్రత్యేకకాంగ్రెసులో స్వరాజ్యవాదులకు మరికొంత జయముకలిగెను. ఈకాంగ్రెసు అయినవెంటనే నాకొక యపూర్వ యనుభవము సంఘటించెను.

సిక్కులకు, ముఖ్యముగా అకాలీలకు, పంజాబుప్రభుత్వముతో తఱచు సంఘర్షణ జరుగుచుండెను. గురుద్వారములలో మహంతుల యవినీతి హెచ్చుగానుండుటచే మత సంస్కారోద్యమ మొకటి బయలు దేరి, యవినీతిపరులగు మహంతులను తీసివేసి గురుద్వారములను పవిత్ర పరచి, వాటి యాస్తులను జాగ్రతపెట్టుటకు సంకల్పించెను. ఇందులో ప్రభుత్వము జోక్యము కల్పించుకొనుటచే సంఘర్షణమేర్పడెను. గురుద్వారోద్యమము కొంతవరకు అసహాయోద్యమపరిబోధముచలననే కలిగెను. అకాలీలపద్ధతులుకూడ దౌర్జన్యరాహిత్య తత్త్వమునే యనుకరించెను; చాల సంఘటనలు సంభవించెను. కాని వాటిలో గురుకాభాగు పోరాటము ముఖ్యమైనది. అందులో వందలకొలది సిక్కులు, వారిలో చాలమంది సైనికులుగాపనిచేసినవారు, ప్రత్యుత్తరమీయకుండ, చేయియెత్తకుండ, తమస్థానమునుండి, తమధర్మమునుండి యొక్కయడుగైననుకదపకుండ పోలీసులువారిని పశువులను మోదునట్లుమోదుచుండ, నగ్నిపరీక్షనిచ్చిరి. ఈధైర్యస్థైర్యములను, ఈసాహసమును, పట్టుదలను చూచి భారతదేశము నిర్ఘాంతపోయెను. ప్రభుత్వమువారు గురుద్వారకమిటీని యక్రమసంఘమని ప్రకటించిరి. ఈపోరాటము

కొన్ని సంవత్సరములు జరిగి చివరకు సిక్కులకే జయము చేకూరెను. సహజముగా కాంగ్రెసుకు దీనియందు సానుభూతికలిగి కొంతకాలమీ యుద్యమమును పరీక్షించుట కమృతసరములో నొక ప్రత్యేకోద్యోగిని కూడ నుంచెను.

ఇప్పుడు నేను చెప్పబోవుకథకును యీసిక్కుల ఉద్యమముకును సంబంధము లేకపోయినను యీయుద్యమ ప్రోత్సాహమువలననే యిది సంభవించెననుటకు సందేహములేదు. పంజాబులోని నాభా, పాటియాలా మహారాజు లిరువురకును (రెండును సిక్కుసంస్థానములే) పరస్పర బద్ధ విరోధముండి పోరాడుకొనుచుండ భారత ప్రభుత్వమువారు నాభా మహారాజును సింహాసనమునుండి తొలగించిరి. నాభా సంస్థానమును పరిపాలించుటకొక బ్రిటిషుయేజెంటును నియమించిరి. సిక్కులు యీకార్యమును గర్హించి నాభాలోను, బయటను ఆందోళనచేయుచుండిరి. ఈ సందర్భములో నాభాలోనే 'జయితో' యనుచోట జరుగుచున్న యొక మతయుత్సవమును క్రొత్త పరిపాలకుడాపివేసెను. ఇది న్యాయముకాదని చెప్పుటకును, ఆపివేయబడిన యుత్సవమును సాగించుటకును, సిక్కులు జయితోకు, జాతాలను (తండాల) పంపనారంభించిరి. పోలీసులు ఈజాతాలనాపి, చావబాది, నిర్బంధించి మారుమూలనున్న దోవతెన్నులేని యేయడవిలోనో విడిచిపెట్టి వచ్చెడివారు. ఈదెబ్బల కథనంతను నేను మొదట నుండియు వినుచుంటిని. ఢిల్లీ ప్రత్యేకకాంగ్రెసు అయినతోడనే మరియొక జాతా పోవుచున్నదనియు అచ్చటకువచ్చి జరుగుచున్న దంతయు చూడవలసినదనియు నన్నాహ్వానించిరి. నే నతిసంతోషముతో దీని కంగీకరించి, గిద్వానీ, సంతానము గార్లతో బయలు దేరితిని. జాతా కాలినడకనే బయలుదేరెను. మేమొక బండిలో బయలుదేరి జాతా జయితోకు జేరుసమయముకే చేరుకొంటిమి. మేము దూరముగ నుండి జాతాను పరీక్షించుచుంటిమి. జాతాను పోలీసులు ఆపివేసిరి.

నాభా సంస్థానములో కాలుపెట్టరాదనియు కాలుపెట్టినచో వెనుకకు తిరిగి పోవలసినదనియు ఇంగ్లీషుపరిపాలకుని సంతకముతో వెంటనే నాకొక హుకుము జారీచేయబడెను. గిద్వానీ, సంతానముగార్ల మీద కూడ నిట్టి నోటీసు జారీచేయబడెను. నాభా ప్రభుత్వమునకు వారి పేర్లు తెలియకపోవుటచే పేర్లుఉదహరింపకుండగనే నోటీసులనిచ్చిరి. మేము జాతాలో పాల్గొనుటకు రాలేదనియు, ప్రేక్షకులముగా వచ్చితిమనియు నాభాచట్టములను వేటిని మేము భంగముచేయ దలచుకొనలేదనియు చెప్పితిమి. మేమిదివరకే నాభారాష్ట్రములోనికి ప్రవేశించుటచే, ప్రవేశింపకూడదను సమస్యకవకాశమేలేదు. మేమకస్మాత్తుగా మాయమైపోగలశక్తి మాకులేదు. జయిత్తోనుండి బయలుదేరుబండి చాల గంటలకుగాని బయలుదేరదు. కనుక నంతవరకైనను మేముండెదమంటిమి. మమ్ము వెంటనే అరెస్టుచేసి తీసికొనిపోయిరి. మమ్ము తీసికొనిపోయినతరువాత జాతాను మామూలుప్రకారము సన్మానించిరి!

పగలంతయు నిర్బంధించి సాయంకాలము మమ్ము స్టేషనుకు నడిపించి తీసుకొనివెళ్ళిరి. సంతానముగారి యెడమ చేతికిని, నాకుడిచేతికిని కలిపి యినుపబేడీలను తగిలించి వానికొకగొలుసుకట్టి పోలీసు గొలుసును చేతపుచ్చుకొని మమ్మునడిపించుచుండెను. గిద్వానీగారినట్లే ప్రత్యేకముగా నడిపించిరి. జయితోవీధులలో నమ్మావిధముగా నడిపించుట గొలుసుకట్టి కుక్కను తీసికొనివెళ్లువిధమును నాకు జ్ఞప్తికి తెచ్చెను. మొట్టమొదట మేము కొంచెము దోషికపడితిమి. కాని వెంటనే యా హాస్యమును మేమును ఆనందించితిమి. మందగమనముతో పోవు క్రిక్కిరిసియున్న యొక మూడవతరగతి రైలుబండిలో నెక్కి మధ్య నొకసారిమారుచు, కొంతసేపు నాభా జయిలులో గడుపుచు, మేమా రాత్రి నెట్లోగడిపితిమి. ఇంతకాలమును, మరునాడు మధ్యాహ్నము నాభాజయిలుకు మమ్ము వప్పగించువరకును ఆజంటబేడీలును, బండ

గొలుసును, మాకు సహచారిగనుండెను. రెండవవాడు తోడ్పడనిదే మేము కదలుటకు వీలులేదు.

నాభాజయిలులో మాముగ్గురిని యనారోగ్యమై, యపరిశుద్ధమై యున్న యొకచిన్నగదిలో క్కిరి. అది చిన్నదిగను, తేమగను నుండి పైకప్పు మాచేతికందుచుండెను. రాత్రిమేము నేలమీదనే పడుకొనగా నొక యెలుక నాముఖముమీదనుండి పరుగెత్తుటచే నేను లిక్కిపడి లేచితిని. రెండుమూడు రోజులయినతరువాత మమ్ము కోర్టుకు తీసికొనివెళ్ళిరి. అక్కడ మహాద్భుతమైన తల్లకిందులు విచారణతంతు దినదినము జరుగుచుండెను! ఆమేజస్ట్రీటు లేక జడ్జి యెంతమాత్రమును చదువు రానివాడువలె కాన్పించెను. అతనికి యింగ్లీషురాదు సరికదా ఆకోర్టు భాషయైన ఉర్దుకూడ వ్రాయజాలడని నాకుసందేహముతోచెను. మే మతని నొకవారము రోజులు పరీక్షించి చూచినను అతడొక పంక్తియైనను వ్రాయడయ్యెను. అతడు వ్రాయవలసినచ్చినచో కోర్టు రీడరును వ్రాయమనెడివాడు. మేము చిన్నచిన్న దరఖాస్తులను పెట్టితిమి. అతడు మేము చూచుచుండగా వాటమీద నెట్టి యాగ్డరులను వేయలేదు. అతడు వాటినట్లేయుంచి మరునాడు వాటిమీద మరి యొకరిచే సముజాయిషీవ్రాయించి పట్టుకొని వచ్చెడివాడు. మేమిది వరలో వాదించు కొనెడివారముకాము. అసహాయోద్యమరోజులలో వాదనను మానివేయుటచే (వాదించుకొనుట అంగీకరింపబడినను) వాదించుకొనుట తప్పుగాకాన్పించెను. కానినేనుజరిగినసంగతులను తెలుపుచు నొకపెద్దస్టేటుమెంటును, నాభాషపద్ధతులనుగురించి (ముఖ్యముగా బ్రిటిషుపరిపాలనక్రింద) నాస్వంతయభిప్రాయములను వ్రాసియిచ్చితిని.

మాకేసు చాలచిన్నవిషయమైనను రోజులు గతించి పోవుచుండెను. అకస్మాత్తుగా నొకమార్పుగలిగెను. ఒకమధ్యాహ్నము కోర్టు ముగిసినతరువాత మమ్మచ్చటనేయుంచి సాయంకాలము యేడుగంట

లకు మమ్మొకగదిలోనికి తీసికొనిపోయిరి. అచ్చటనొక బల్లదగ్గర నొకమనిషి కూర్చొనెను; మరికొందరు సమీపములో నుండిరి. మమ్ము జయితోలో అరెస్టుచేసిన పోలీసు ఉద్యోగిలేచి యొకస్టేటు మెంటు యిచ్చుచుండెను. మేమెచ్చటనుంటిమి? ఏమి జరుగుచున్నది? అని నేనడిగితిని. అది కోర్టుగదియనియు కుట్రనేరముకు మేము విచారింప బడుచున్నామనియు నాకు బదులుచెప్పిరి. ఇంతవరకు నాభా సరిహద్దు లనుదాటి ఆజ్ఞోల్లంఘనముచేసినందుకు విచారింపబడితిమి. ఇది వేరు కేసు. మొదటికేసులో నారుమాసములకంటె నెక్కువశిక్షకు వీలులేక పోవుటచే నదిచాలదని మరియొక నేరమును కనిపెట్టుచుండిరి. కుట్రనేర మునకు ముగ్గురు చాలరు. కనుక మాతో నెట్టి సంబంధములేని మరి యొకనిని అరెస్టుచేసి మాతో విచారణకు తెచ్చిరి. ఈ దురదృష్టవంతు డొక సిక్కుమతస్థుడు. ఇతనిని మేమెరుగము. కాని మేము జయితోకు వెళ్ళినపు డితనిని పొలములలో చూచితిమి.

కుట్రనేరము నింత నిర్లక్ష్యముగ విచారణచేయ ప్రారంభించుట లాయరునైన నాకాశ్చర్యమును కలిగించెను. కేసు పూర్తిగా నబద్ధపు కేసు. ఏమయినను మర్యాదకైనను కొంత తతంగ ముండవలెను. జడ్జితో మేము మాకేవిధమైన నోటీసుగాని లేదనియు, మేము వాదించుట కేర్పాట్లు చేసికొని యుందుమనియు చెప్పితిమి. ఇట్లు చెప్పినను యతనికి చీమకుట్టినట్లయిన లేకుండెను. అది నాభాపద్ధతి! మాకొక లాయరు కావలెనని నేను సూచించితిని; నాభాచట్టముల ప్రకారము దీనికి వీలులేదని యతడనెను. నాభాపద్ధతులు మాకు మరింత యర్థ మగుచుండెను. కొంత విసుగుదలతో మేము విచారణలో పాల్గొన మనియు తన యిష్టము వచ్చినట్లు చేయ వచ్చుననియు జడ్జితో చెప్పితిమి. కాని నేను వీనిని పూర్తిగా పాలింపజాలకపోతిని. మమ్ము గురించి చెప్పు పచ్చికల్లలనువిని యూరకొనలేక నప్పుడప్పుడు సాక్షు

లనుగురించి మాయభిప్రాయమును క్లుప్తముగను, విషయముకు సంబంధించినదిగను, వెలిబుచ్చెడివాడను. జరిగిన విషయములను గురించి వ్రాతమూలకముగా మేమొక స్టేటుమెంటు కూడ యిచ్చితిమి. ఈ రెండవజడ్జి మొదటివానికంటె చదువుకొన్నవాడుగను, తెలివియైనవాడుగను కాన్పించెను.

ఈ రెండుకేసులును యీవిధముగా సాగుచుండెను. మేము ప్రతిదినము కోర్టులోనికెప్పుడు వెడుదుమాయని, జయిలులోనున్న దుర్గంధమైనను తప్పుననని, చూచుచుండెడివారము. ఈలోగా నాపరిపాలకునితరఫున జైలు సూపరింటెండెంటుగారు వచ్చి మేము నాభా వీడి వెళ్ళిపోయెదమని వ్రాతమూలముగా క్షమార్పణ యిచ్చినచో మాపై కేసులు తగ్గింపబడునని చెప్పెను. మేము క్షమార్పణ చెప్పుకొనవలసినదేదియు లేదనియు మాకాయనయే క్షమార్పణ సేయవలసియున్నదనియు మే మేమియు వ్రాసి యిచ్చువారము కామనియు చెప్పితిమి. మా అరెస్టుజరిగిన పదిహేనురోజులకు రెండువిచారణలును పూర్తియయ్యెను. ఈకాలమంతయు మేము వాదింపనేలేదు. కనుక నిది ప్రాసిక్యూషను సాక్ష్యముకే పట్టెను. చాలకాలము, మధ్య మధ్య ఆపివేయుటతో సరిపోయెను. ఏమాత్రము సందేహమువచ్చినను వాయిదావేయుట లేదా, ఈ రంగమువెనుకనున్న యధికారితో బహుశః - ఇంగ్లీషు పరిపాలకునితో— సంప్రతింపులతో సరిపోయెను. ప్రాసిక్యూషను పూర్తియైనతరువాత చివరరోజున మేము మా స్టేటుమెంటులను వ్రాసియిచ్చితిమి. మొదటికోర్టులేచి(మాకాశ్చర్యమయ్యెను) కొద్దికాలములో నే తిరిగివచ్చి ఉర్దులో వ్రాయబడిన పెద్ద జడ్జిమెంటు కట్టను తీసికొనివచ్చెను. ఈపెద్ద జడ్జిమెంటు అస్వల్పకాలములో వ్రాయబడజాలదు. మా స్టేటుమెంటుల నీయకపూర్వమే యది తయారుచేయబడెను; జడ్జిమెంటును చదువలేదు. నాభారాష్ట్రమును వీడ నిరాకరించి

నందుకు హెచ్చుశిక్షయైన ఆరునెలలు వర్ధింపబడెనని ముక్తసరిగా చెప్పిరి.

కుట్రకేసులోకూడ ఆరోజుననే పదునెనిమిదిమాసములో లేక రెండేండ్లో (నాకంతజ్ఞాపకములేదు) విధించిరి. మొత్తముమీద మాకు రెండేండ్లో లేక రెండున్నరయేండ్లో విధింపబడెను.

మా విచారణకాలమంతటను భారతసంస్థాన పరిపాలన లేక భారత సంస్థానములోని బ్రిటీషుపరిపాలన లోని యథార్థములనుగురించి కొంతవరకు ప్రకటించు ననేక చిత్రవిచిత్ర సంగతులు జరిగెను. ఆ విధాన మంతయు నొకనాటకము కనుకనే కోర్టులోనికి పత్రికాప్రతినిధులను గాని యితరులనుగాని రానీయలేదు. పోలీసులు వారియిష్టము వచ్చినట్లు చరించెడివారు. వారు తఱచు మేజస్ట్రీటును లేకజడ్జిని నిర్లక్ష్యము చేయుటేగాక నతనియాజ్ఞల నుల్లంఘించెడివారు. పాపమామేజస్ట్రీటు దీనిని నోరెత్తకుండ సహించెను. కాని మే మేల సహింపవలెను? చాల సార్లు నేనులేచి పోలీసులు ఉచితముగా ప్రవర్తింపవలెననియు, మేజస్ట్రీటు ఆజ్ఞలను శిరసావహింపవలసియుండుననియు గట్టిగా చెప్పవలసి వచ్చెను. ఒక్కొక్కప్పుడు పోలీసులు అమర్యాదగా కాగితములను లాగివేయు చుండగా మేజస్ట్రీటు యేమియుచేయలేక తెల్లబోయి చూచుచుండ, తనకోర్టులో తానే క్రమమును నిలుపుకొనలేకపోవుటచే, నతనిపనిని మేము చేయవలసివచ్చెడిది! పాపమా మేజస్ట్రీటుస్థితి చాల విచారకర ముగనుండెను. అతడొకవంక పోలీసులకు భయపడుచుండెను. మరియొక వంక మమ్ముచూచి భయపడుచుండెను. ఏలనన మాఅరెస్టులనుగురించి వార్తాపత్రికలు గగ్గోలుచేసెను. కొంచెమించుమించు ప్రధానకాంగ్రెసు నాయకులలో నెన్నబడు మాబోంట్లగతియే యిట్లున్నప్పుడిక సామాన్యులగతి యెట్లుండును?

ఈ స్వదేశసంస్థానములసంగతి కొంత మాతండ్రికి తెలియును; కనుక నత డీయనకొనని నిర్బంధమునకు దొరికపడెను. మేమునిర్బంధింపబడిన సంగతిమాత్రమే తెలిసెను కాని తక్కిన వివరములేవియు పత్రికలలో పడలేదు. అతడా వేడిలో నైసార్యికి నన్నుగురించి వార్తలు తెలియుటలేదని తంతియిచ్చెను. నాభాలో నన్నతడు చూచుటకు వీలులేదనిరి. చివరకు జయిలులో చూడవచ్చుననిరి. నేను వాదించుకొనుటలేదు. కనుక నతడు మాకు చేయునదేమియు లేకపోవుటచే నే నతనిని వెళ్ళిపోవలసినదని బ్రతిమాలితిని. అతడు కపిలదేవమాలవ్యాను, ఒకమంచివకీలును, స్థితిగతులను పరీక్షించుచుండవలసినదని నియమించి వెడలిపోయెను. నాభా కోర్టుల కొద్దియనుభవమువలన కపిలదేవుని న్యాయజ్ఞానమెంతయో అభివృద్ధియై యుండవలెను. పోలీసులు అతనిచేతిలోనున్న కొన్ని కాగితములను బహిరంగముగా కోర్టులో లాగికొనుటకు ప్రయత్నించిరి.

కొంచెమించుమించు భారతీయసంస్థానములన్నియు వెనుకపడి యున్నట్లు జగద్విఖ్యాతమే. అతిసమర్థతకాని, ఉదారతకాని లేని వ్యక్తిగతనిరంకుశత్వములు. ప్రపంచమునకెప్పుడును తెలియరాని వింతలన్నియో యచ్చట జరుగుచుండును. అయినను వారియసమర్థతయే కొన్నివిధముల దుర్మార్గమును తగ్గించి ప్రజల దుఃఖభారమును కొంతవరకు తేలికపరచును. ఏలనన ఈయసమర్థతయే కార్యనిర్వహణములోగూడనుండుటచే నిరంకుశత్వమును, అన్యాయమునుకూడ నంతశక్తివంతములుగా నుండవు. అంతమాత్రముచే నిరంకుశత్వము సహ్యముకానేరదు. కాని యదియంత ప్రబలపు; విస్తరింపదు. భారతసంస్థానము ప్రత్యక్ష బ్రిటిషు ప్రభుత్వాధికారముక్రిందకే వచ్చినయెడల నీ కాస్తలాభమునుకూడ పోవును. ప్రభుత్వాధికారము ఎప్పటివలెనే యుండును. నిరంకుశత్వము చెక్కుచెదరదు. పాతచట్టములు పాతవిధానములు యింకను పనిచేయుచునే

యుండును. వ్యక్తిస్వేచ్ఛ, సభలను జరుపుకొనుస్వేచ్ఛ, అభిప్రాయములను వెలిబుచ్చు స్వేచ్ఛ-ఈయన్నింటిమీదను గల నిర్బంధములన్నియు మామూలుగ నేయుండును. ఒక్కమార్పుమాత్రమే చేయబడును. ఈ మార్పుతోనే రంగమంతయు మారిపోవుచున్నది. కార్యనిర్వాహము బలీయమై పటుత్వముగా పనిచేయుటచే దుర్బలత్వముచే సడలియున్న పై పాశములన్నియు నొక్కసారి బిగియును. కొంతకాలమయిన తరువాత బ్రిటిషుపాలన కొన్ని పాతయాచారములను, పద్ధతులను మార్చవచ్చును; మార్చెదరు. ఏలనన యిట్టివి పటుత్వమైన పరిపాలనకును, వర్తకప్రాబల్యముకును నడ్డంకులు. కాని మొట్టమొదటమాత్రము వారు ప్రజలను లొంగదీసికొనుటకు వాటి నుపయోగించుకొనెదరు. ప్రజలిప్పుడు సామంత రాజ్యములకును, నిరంకుశత్వమునకునుతోడు వాటి నతికఠినముగా నమలుపరుపగల కార్యనిర్వాహక వర్గమునుగూడ సహింపవలెను.

నాభాలో నేను కొంతవరకు దీనిని చూడగలిగితిని. ఈసంస్థానమొక బ్రిటిషు పరిపాలకునిక్రింద నుండెను. ఒక్క భారతప్రభుత్వమును తప్ప నతడెవరికిని జవాబు చెప్పనక్కరలేని నిరంకుశుడు. అయినను మాకతిసామాన్య హక్కులనుకూడ తిరస్కరించుచు, మాటమాటికి నాభాచట్టములక్రిందను విధానముక్రిందను నదియుక్తమేయని చెప్పుచుండిరి. మేమీవిధముగ నాధునిక నిరంకుశ యంత్రముయొక్కయు సంస్థాన ప్రభుత్వము యొక్కయు ధాటి నెదుర్కొనవలసి వచ్చెను. మాకారెంటివలన కలుగవలసిన లాభములు శూన్యమగుచు నష్టములు మాత్రమే సంక్రమించెను.

ఈవిధముగా మావిచారణ పూర్తియయి మేము శిక్షింపబడితిమి. తీర్పులలో నేమున్నదో మాకు తెలియదు కాని దీర్ఘశిక్షయను గట్టివిషయము మాకుకొంత శాంతినిచ్చెను. మేము జడ్జిమెంటు నకళ్ళ నడుగగా దరఖాస్తుపెట్టుకొనవలెననిరి,

ఆసాయంకాలమే సూపరింటెండెంటు జయిలుకువచ్చి నాభాపరిపాలకుడు క్రిమినలు ప్రొసీజరుకోడ్డుకిరింద మాశిక్షలను ఆపివేసినట్లొక ఆర్డరు చూపించెను. ఎట్టిషరతులును కోరబడలేదు. కనుక ఆర్డరు ప్రకారము మాశిక్షలు ఆఖరయ్యెను. ఆపరిపాలకుడే యిచ్చిన మరియొక ఆర్డరుప్రకారముమేము నాభాను విడిచిపోయి ప్రత్యేక యనుజ్ఞలేనిదే తిరిగి రాకూడదనిరి. నేను ఈరెండు ఆర్డర్ల నకళ్ళను అడుగగా నిచ్చుటకువీలు లేదనిరి. మమ్మప్పుడు స్టేషనుకు తీసికొనివెళ్ళి యచ్చట విడిచిపెట్టిరి. మేము నాభాలో నెవరినియెరుగము. రాత్రియగుటచే పట్టణద్వారము లన్నియు బంధింపబడెను. అంబాలా కొకబండి పోవుచుండగా మేము దానినెక్కితిమి. అచ్చటనుండి నేను ఢిల్లీకిని, అలహాబాదుకును పోతిని.

ఆరెండు ఆర్డరులను, రెండు జడ్జిమెంటులను పంపించవలసినదని అలహాబాదునుండి నేనాపరిపాలకునకు వ్రాసితిని. అతడు వీటినిపంపుటకు వీలులేదనెను. నేను అపీలుచేయవలసియుండునని చెప్పినను కూడ నతడు పెడచెవినిబెట్టెను. ఈశిక్షలింకను నామీద నల్లేయుండి నాభా ప్రభుత్వముకాని బ్రిటిషుప్రభుత్వముకాని తలచుకొనినపుడు పైకివచ్చినను రావచ్చును.

"ఆపివేయుబడిన పైవిధముగా" మేముముగ్గురము విడువబడితిమి. కుట్రకేసులో మాతో గుదిగుచ్చబడిన యానాల్గవ సిక్కుముద్దాయి గతి యేమయ్యెనో నాకిప్పటికిని తెలియలేదు. బహుశః అతనిని విడిచి యుండరు. అతనికి పలుకుబడిగల స్నేహితులుగాని, ప్రజాందోళన గాని లేకపోవుటచే సామాన్యులందరివలెనే యతడును సంస్థానకారాగారవిస్మృతిలో మునిగిపోయెను. మేమతనిని మరచిపోలేదు. మేము చేయగలిగినది చేసితిమి; కాని యదియెంతయో లేదు. గురుద్వార కమిటీవారు అతనికేసులోకూడ శ్రద్ధతీసికొనిరనియే నావిశ్వాసము. అతడు 'కొమ్ముగట్టుషూరు' లోని వారిలో నొకడనియు చాలకాలము

జయిలులోనుండి యంత్రక్రితమే వచ్చెననియు మేమువింటిమి. అట్టి వారిని పోలీసు లెట్లువిడిచిపెట్టి లయూరుకొనగలరు? కనుక వారన నిని మాపై జమాయించబడిన కేసులో కుక్కిరి. మేము ముగ్గురము నాభాజయిలునుండి మాతో నొకయసహ్య సహచారిని తీసకొనివచ్చి తిమి. ఇదియే పైఫసుక్రిమి; దీనితో మాముగ్గురకును పైఫాయిడు జ్వరము వచ్చెను. నేను మూడునాలుగు వారములు మంచము పట్టితిని. తక్కిన వారిద్దరును చాలకాలమువరకు తీవ్రజ్వర బాధితులైరి.

ఈ నాభా కథకు మరియొక పిల్లకథకూడ కలదు. గిద్వాని కాంగ్రెసు ప్రతినిధిగా అమృతసరములోనుండిన సిక్కుగురుద్వార కమిటీతో సంబంధము కలిగియుండెను. కమిటీవారు 500 మందిగల యొక ప్రత్యేక జాతాను జయితోకు పంపిరి. వారితో గిద్వానీగారు కూడ నొక ప్రేక్షకుడుగా వెళ్ళెను. అతడు నాభారాష్ట్రములోనికి ప్రవేశించు నుద్దేశ్యముతో వెళ్ళలేదు. నాభాసరిహద్దు పోలీసులు జాతాపై తుపాకులను పేల్చుటచే ననేకమంది గాయపడిరి. కొంతమంది చనిపోయిరి. దెబ్బలు తినినవారికి సహాయము చేయుటకు గిద్వాని వెళ్ళగా పోలీసులతనిపైబడి యతనినితీసికొనిపోయిరి. అతనిపై కోర్టులోనెట్టిచర్యయుతీసికొనబడలేదు. అతనినొక సంవత్సరమువరకు జయిలులోనుంచి యారోగ్యమంతయు పూర్తిగా చెడిపోయిన తరువాత విడిచిపెట్టిరి.

గిద్వానీని అరెస్టుచేసి యంతకాలముంచుట కార్యనిర్వాహకాధికారమును కేవలము దుర్వినియోగపరచుటగా నాకుదోచెను. నేను పరిపాలకునికి (నెనుకటి యింగ్లీషు సివిలుసర్వీసు సభ్యునికి) వ్రాసి గిద్వానీని యట్లేల నిరోధించిరని యడిగితిని. అనుజ్ఞలేనిదే నాభారాష్ట్రమును ప్రవేశింపరాదను ఆర్డరునుఉల్లంఘించుటచే నతడు నిర్బంధింపబడెనని యతడు వ్రాసెను. నేను యిది న్యాయవిరుద్ధమని సవాలుచేసి, దెబ్బలుతినిన వారికి సహాయము చేయువానిని నిర్బధించుట యుచితము గాదనియు,

వారిఆర్డరును నాకు పంపుటగాని ప్రకటించుటగాని చేయవలెననియు కోరితిని. అతడందులకు నిరాకరించెను. నేను నాభావెళ్ళి నన్నుకూడ గిద్వానీని చూచినట్లే చూడనీయవలెనని కోరితిని. సహచారియెడల గల ధర్మమిదియేయని నే ననుకొంటిని కాని చాలమంది స్నేహితులట్లు తలంపక నన్ను వారించిరి. స్నేహితుల సలహావెనుక నేను శరణుగొని నాదుర్బలత్వమును దాచుకొనుటకు దానినొక వ్యాజముగా నుపయోగించితిని. నాభాజయిలుకు తిరిగి పోవుటకిష్టము లేకపోవుటచేతను, దుర్బలత్వముచేతను నేనాగిపోతిని. స్నేహితుని యీవిధముగావిడుచుట నాకెప్పుడును లజ్జాస్పదముగా నుండెను. తఱచు మనమందరమును పరాక్రమముకంటె వివేకమునే యెక్కువగ గణింతుము.

---

## ౧౭

## కాకినాడ — మహమ్మదాలీ.



1923 డిసెంబరులో కాంగ్రెసు దక్షిణమున కాకినాడలో జరిగెను. దానికి మహమ్మదాలీ యధ్యక్షుడు. అతడు దీర్ఘోపన్యాసము నిచ్చెను. కాని యది చదువతగినది. అతడు మహమ్మదీయులలోని రాజకీయ భావాభివృద్ధిని, కులతత్త్వభావాభివృద్ధిని వివరించి, 1908 లో ఆగాఖానుగారి యాధిపత్యమున వైస్రాయివద్దకు వెళ్ళిన ముస్లిం రాయబారము (ప్రత్యేకనియోజకవర్గమును ప్రభుత్వమామోదించునట్లు చేసిన మొదటిప్రకటన కిదియే కారణము) ప్రభుత్వముచేతనే నడుపబడెనని చూపించెను.

నా కిష్టము లేకపోయినను, అతని యధ్యక్షసంవత్సరములో కార్యదర్శిగా నుండవలసినదని మహమ్మదాలీ నన్ను ప్రోత్సహించెను. భవిష్యద్విధానము నాకు స్పష్టముగా లేనపుడు కార్యనిర్వాహక బాధ్యతను వహించుట నాకిష్టము లేకుండెను. కాని నేనతనిని నిరాకరింపజాలకపోతిని. మరియొక కార్యదర్శి క్రొత్త యధ్యక్షునితో నావలె సామరస్యముగ పనిచేయజాలక పోవచ్చునని మేమిరువురమును అనుకొంటిమి. అతనికి గాఢమైన 'యిష్టములు' 'అనిష్టములు' కలవు. అదృష్టవశాత్తు అతని 'యిష్టములును' నావియు నొక్కటియే యయ్యెను. మమ్ము ప్రేమపాశమును, పరస్పర గౌరవాతిశయమును బంధించెను. అతడు గాఢమతాభినివేశము (హేతువిరుద్ధముగ గూడ యని నేననుకొంటిని) కలవాడు. నేను కాను. కాని యతని శ్రద్ధయు, అపరిమిత శక్తియు, కుశాగ్రబుద్ధియు నన్నాకర్షించెను. అతనిలో మంచి హాస్యమున్నది; కాని యొక్కొక్కప్పు డతని నేహాకోశము

బాధ కలిగించు చుండుటచే చాలమంది స్నేహితుల నతడు పోగొట్టు కొనెను. ఫలిత మెట్టిదియైనను అతడు తెలివియైన యాక్షేపణను దాచుకొనజాలడు.

మాకు స్వల్ప భేదాభిప్రాయములున్నను మేమా సంవత్సర మును బాగుగనే గడపితిమి. అఖిలభారత కాంగ్రెసు కమిటీ ఆఫీసులో నేనొక మార్పు తెచ్చితిని. అందులోని సభ్యుల పేర్లకు చివరనో మొదటనో మహాత్మా, మౌలానా, పండిట్, షేక్, సయ్యద్, మున్షీ, మౌల్వీ, శ్రీయుత, శ్రీ, మిష్టర్, ఎస్క్వైర్ అను బిరుదులు లేక గౌరవపదము లెన్నియో యుండెడివి. వీటిని నేను తీసివేసితిని. మహమ్మదాలీ నాకొక క్రోధపూరితమగు తంతిని పంపి నేను మామూలు పద్ధతిని మార్చరాదనియు ముఖ్యముగా గాంధీజీ నెప్పుడును మహాత్మా యనియే పిలువవలెననియు 'ప్రెసిడెంటు' హోదాతో నాజ్ఞాపించెను.

'సర్వశక్తివంతుడు' అను మరియొకవిషయమునుగురించి తఱచు మాకు వాదము పడుచుండెడిది. కాంగ్రెసు తీర్మానములలో కూడ ప్రార్థన పేరిటనో కృతజ్ఞతను తెలుపుటకో మహమ్మదాలీ భగవంతుని పేరు తెచ్చుచుండెడివాడు. నేను అదికూడదనెడివాడను. నేను మతహీనుడనని యతడనెడివాడు. కాని నేనుపైకట్లు ప్రవర్తించుచున్నను (నేను కాదని ఘోషించుచున్నను,) నేను యథార్థ మతస్వభావము కలవాడనని యతడు తరువాత చెప్పుచుండెడివాడు. అతని స్టేటుమెంటులో నెంతయో సత్యముకలదని నేనాశ్చర్యపడెడివాడను. అది బహుశః మతము, మతవిషయము అనువాటియర్థముపై నాధార పడియుండును.

మతచర్చ మమ్మిద్దరను కేవలము రెచ్చగొట్టుననియు, నేనతనికి కష్టము కలిగింపవచ్చుననియు నతనితో వాదించెడి వాడను కాను. ఏసిద్ధాంతమునైనను గట్టిగా నమ్మినవారితో వాదించుట చాల కష్టమైన విషయము. చాలమంది మహమ్మదీయులతో దీనిని వాదించుట (అధి

కారరీత్యా వారు స్వేచ్ఛగా నాలోచింపరాదు) మరింత కష్టము. వారి మార్గము (లక్ష్యశాస్త్రప్రకారము) ముక్కుకు సూటియైన సూచీముఖ మార్గము. విశ్వాసి కుడియెడమలకు తప్పరాదు. హిందువులలో (ఎల్లప్పుడును కాకపోయినను) నట్లుకాదు. ఆచరణలో వారు చాల సనాతనులుగ నుండవచ్చును; కాలవిరుద్ధములైన, ఉపద్రవకరమైన, వినాశకరమైన యాచారముల ననుష్ఠింపవచ్చును; అనుష్ఠించుచున్నారు. అయినను సాధారణముగా వారు మనమును గురించి యెట్టి నూతన భావములనైన చర్చించుటకు సంసిద్ధులు. ఆధునిక ఆర్యసమాజికులలో (సాధారణముగా) నీ విశాలబుద్ధి ప్రయోగము లేదని నాయభిప్రాయము. మహమ్మదీయుల వలెనే వారును, ముక్కుకు సూటియైన తమ స్వంత సూచీముఖ మార్గమునే యవలంబింతురు. బుద్ధిమంతులైన హిందువులలో కొంత వేదాంత సాంప్రదాయ ముండుటచే (ఆచరణకును దానికిని సంబంధములేకపోయినను) నది మతసమస్యను శాస్త్రరీత్యా చర్చించుట కవకాశము నిచ్చుచున్నది. హిందూ సంఘము లోనికి వచ్చు పరస్పర ఆచార, అభిప్రాయ భేదములే కొంత దీనికి కారణమని నాయభిప్రాయము. హిందూమతము (మామూలు అర్థములో) మతమే కాదని కూడ తఱచు చెప్పబడు చుండెను. అయినను దానిలో నెంతటి యద్భుతమైన పట్టుదల, జిగి కలదు! ఎన్నియవాంతరములనైన దాటి జీవింపగల యెంతటి యద్భుతశక్తి కలదు! చార్వాకునివలె నిరీశ్వర వాదియైన వానినికూడ హిందువుకాదని యనుట కెవరును సాహసింపరు. హిందూమతము తన బిడ్డలను (వారు వలదనినను) ఆశ్లేషించి యుండును. నేను బ్రాహ్మణుడనుగ జన్మించితిని. కనుక మతమును గురించికాని, సాంఘికాచారములను గురించి కాని నేనేమి చెప్పినను, ఏమి యాచరించినను కూడ బ్రాహ్మణుడనుగనే యుందును. భారత ప్రపంచమునకు (నేనెడికాని మరెట్టి గౌరవనీయుడు కాని వలదనినను) నేను 'పండిత' యిత్యాదినే యగుదును. ఒక

సారి స్విడ్జర్లండులో నేనొక తురుష్క పండితుని కలుసుకొంటిని. నన్నతనికి ముందుగ పరిచయపరచు నుత్తరములో 'పండిత జవాహర్లాలు నెహ్ర్యూ' అని యుండెను. నన్ను చూచుటతోడనే యతనికి కొంత యాశ్చర్యమును, ఆశాభంగమును కలిగెను. 'పండిత' యను శబ్దము వలన నతడొక వయసుమీరిన వృద్ధ పండిత శ్రేష్ఠుని చూడబోవు చున్నట్లు భావించెనని నాతో చెప్పెను.

కనుక నేనును మహమ్మదాలీయును మతమును గురించి చర్చింప లేదు. కాని యతడూరకొను స్వభావముకలవాడుకాడు. నే నతనిని ఢిల్లీలో చూడబోయినపుడు (1925 లేక 1926 ప్రారంభములో) నన్ను మతమును గురించి చర్చింప నిర్బంధించెను. "నేను మతపిచ్చ కలవా డనని నీవనుకొందువు. నేనట్టి వాడను కానని రుజువు చేసెదను" అని యతడనెను. మతమును గురించి యతడు చాలాపుస్తకముల నతిశ్రద్ధతో చదివినట్లు చెప్పి యనేక మతములను గురించిన పుస్తకముల బీరువాలను చూపించెను. తనయధ్యయన ఫలితముగా కొరానులో నున్నదంతయు నూటికి తొంబదియేడు వంతులుపూర్తిగా హేతుబద్ధమైనదని కనుగొనె ననియు కొరానుతో సంబంధము లేకుండగనే దీనిని రుజువుచేయవచ్చు ననియు నతడు నాతో చెప్పెను. తక్కిన మూడువంతులును అతని హేతువు కంగీకృతము కాకపోయెను. కాని తొంబదియేడుపాళ్లు హేతుబద్ధముగనే యున్న కొరాను తక్కినమూడుపాళ్లును కూడ యుక్తముగనే యుండి యతని హేతుజ్ఞానమే తప్పుకాగూడదా ? చివరకతడా తీర్మానమునకే వచ్చి కొరానును నూటికి నూరుపాళ్లు అంగీకరించెను.

ఇందులోనున్న తర్కమంత తేలికయైనది కాదు. అయినను నేను వాదింప దలచకొనలేదు. కాని తరువాత కథ నిజముగా నాకాశ్చర్య మును కలిగించెను. తెలిసికొన వలెననెడి విశాలబుద్ధితో నెవరైనను కొరానును చదివినచో దానిసత్యము నతడొప్పుకొనక తప్పదనితాను

యూఢిగా చెప్పగలనని యతడనెను. బాపు (గాంధిజీ) దానిని శ్రద్ధగా చదివెననియు, ఇస్లాంయొక్క సత్యమునతడు గ్రహించి యుండక తప్ప దనియు నభిమానముచేతనే దానినతడు ప్రకటించుట లేదనియు నతడు నాతో చెప్పెను. ఈసంవత్సర మైత్రి గడచిన తరువాత మహమ్మదాలీ కాంగ్రెసునుండి మెల్లగా జారిపోవ నారంభించెను; లేక నతడనునట్లు కాంగ్రెసే అతనినుండి జారిపోయెను. ఈవిధానము కొంత నెమ్మదిగనే జరుగుటచే నతడు చాలసంవత్సరములు కాంగ్రెసుకు హాజరయి దాని కమిటీ మీటింగులలో ప్రధానపాత్రనే ధరించుచుండెను. కాని, నానాటికి చీలిక పెద్దదగుచు మార్గములు భేదించుచుండెను. దీనికే ప్రత్యేకవ్యక్తిగాని, వ్యక్తులుగాని బాధ్యులుకారు. దేశములోనున్న కొన్నిపరిస్థితులే దీనికి కారణము. కాని యీఫలితము చాల దురదృష్టమైనది. అది మాకందరకును బాధగనే యుండెను. ఏలనన, సాంఘిక సమస్యలను గురించి యెట్టి యభిప్రాయ భేదములున్నను, రాజకీయములలో నెట్టి భేదాభిప్రాయమును లేదు. భారత స్వాతంత్ర్యమున కతడు దోసి లొగ్గెను. ఈ సమాన రాజకీయ దృష్టియుండుటచే సాంఘికముగ కూడ మా కిరువురకు పరస్పరాంగీకృత సమాధానము కుదిరెడిది. సాంఘిక ప్రయోజన సాధకులమని నటించు యభివృద్ధి పరికట్టువారికిని యితనికిని రాజకీయ సామ్యమేమియును లేదు.

1928 వేసవిలో నతడు యూరపు వెళ్లుట హిందూదేశ దురదృష్టము. సాంఘికసమస్యను పరిష్కరించుట కప్పుడు గొప్పప్రయత్నము జరిగి కొంచెమించుమించు విజయవంత మగుచుండెను. అప్పుడిచ్చట మహమ్మదాలీ యున్నచో పరిస్థితులు మఱియొక విధముగ నుండిన యుండెడివి. అతడు తిరిగి వచ్చునసరి కంతయు భిన్నమగుటచే నతడు రెండవ పక్షమునకే పోయెను. 1930 లో శాసనోల్లంఘన మతితీవ్రముగానున్న సమయమున వేలకొలది జనులు జయిలులలో నుండగా మహ

మ్మదాలీ కాంగ్రెసు తీర్మానమును నిర్లక్ష్యముచేసి రౌండు టేబిలు సభకు హాజరయ్యెను. అతడు వెళ్ళుట నాకు బాధకలిగించెను. అది యతని హృదయములో నతనికే యసుఖముగా నున్నట్లు లండనులోని యతని చర్యలవలన ద్యోతక మగుచుండెను. తన యథార్థ స్థానము హిందూదేశ పోరాటములో నున్నట్లతడు భావించెను. హిందూదేశము తిరిగి వచ్చియుండిన-నో నతడు పోరాటములో కుఱికెడి వాడని నానమ్మకము. చాల సంవత్సరములనుండి వ్యాధి యతనిని బాధించుచుండెను. తగినంత విశ్రాంతి ఔషధసేవ చేయవలసియుండగా నమోఘమైన దానిని దేనినో సాధించవలెననెడి విచారమే యతనికి లండనులో మృత్యువును త్వరితము చేసెను. నైనీ జయిలులో నాకతని మృత్యువార్త యశని పాతమువలె వినవచ్చెను.

1929 లాహోరు కాంగ్రెసులో నేనతనిని కడసారి కలుసుకొంటిని. అతడు నాయధ్యక్షోపన్యాసములో కొన్ని భాగములతో తృప్తిచెందక తీవ్రముగా విమర్శించెను. కాంగ్రెసు చాలముందుకు పోవుచున్నట్లును, రాజకీయముగా ముందంజవేయు చున్నట్లును అతడు కనుగొనెను. అతడు స్వయముగా ముందంజవేయు స్వభావము కలవాడగుటచే తాను వెనుకపడి యితరులు ముందుకుపోవుట కిష్టపడడయ్యెను. “జవాహర్, నాభరతవాక్యమునువినుము; నీప్రస్తుత సహకారులు నిన్ను విడిచిపెట్టుదురు. మంచి విషమ సమయమున వారు నీవిధికి నిన్ను విడిచి వేతురు. నీ కాంగ్రెసు మనుష్యులే నిన్ను ఉరికంబముల కెక్కింతురు” అని యతడు నన్ను గట్టిగా మందలించెను. ఎంతటి నీళ్లుకారెడి జ్యోతిషము !

కాకినాడ కాంగ్రెసులో అఖిలభారత సేవాదళ పునాదులు వేయబడెను. అందుకు పూర్వము జయిలుకు పోవుటకుగాని, పనిచేయుటకు గాని యట్టి సంస్థలు లేకపోలేదు. కాని మంచిశిక్షకాని సంఘీభావము

కాని లేకయుండెను. కాంగ్రెసుయొక్క సామాన్యాధిపత్యము క్రింద జాతీయ సేవచేయు నొక యావద్భారత సుశిక్షితసైన్యమును తయారు చేయవలెనని డాక్టరు హార్డికరు భావించెను. అతడు నాతోడ్పాటును కోరుటచే నతిసంతోషముతో నేనందుల కొప్పుకొంటిని. కాకినాడలోనిది ప్రారంభింపబడెను. ఈసేవాదళమున కేకాంగ్రెసునాయకులనుండి వచ్చిన వ్యతిరేక భావములు మాకాశ్చర్యమును గొల్పెను. ఇది కాంగ్రెసులో మిలిటరీశాఖను స్థాపించుట యనియు, నుపద్రవకరమైన తప్పుడుత్రోవ యనియు కొందరనిరి. మిలిటరీశాఖ, నాగరికాధికారమును తలక్రిందులు చేయునేమొ! పైనుండి వచ్చు యాజ్ఞలను శిరసావహించుట యొక్కటే వాలంటీర్లకు కావలసిన శిక్షయని మరికొంతమంది యనిరి. అంతకు మినహా యిక వాలంటీర్లు అడుగులో నడుగైనను వేయనక్కరలేదు. సుశిక్షితులైన వాలంటీర్లను తయారు చేయవలెననెడి భావము కాంగ్రెసు సిద్ధాంతమైన దౌర్జన్య రాహిత్యమునకు వ్యతిరేకమని కొందరి మనస్సులలో నుండెను. ఎట్లైనను హార్డికరు యీపనికి బూనుకొని యనేక వత్సరముల కృషివలన మన సుశిక్షితులైన వాలంటీర్లు యెక్కువ పటుత్వమును, దౌర్జన్య రాహిత్యమును చూపగలరని ప్రదర్శించెను.

నేను కాకినాడనుంచి తిరిగి వచ్చుటతోడనే 1924 జనవరిలో నాకు మరియొక చిత్రమైన యనుభవము కలిగెను. నేను కేవలము జ్ఞాపకమునుబట్టి వ్రాయుచుండుటచే తేదీలు కలగాపులగము కావచ్చును. అది యలహాబాదులో గంగాతీరమున కుంభమేళ లేక అర్ధ కుంభమేళ జరుగు సంవత్సరము. లక్షలకొలది జనులు త్రివేణి-గంగా, యమునా, సరస్వతి (చివరది అంతర్వాహిని) కలియుచోటులో స్నానముచేయుటకు వత్తురు. గంగానది గర్భము సుమారొక మైలు కలదు; కాని శీతకాలములో నది లోపలికి పోవుటచే పెద్దపెద్ద యిసుకతిప్పలు బయటపడి యాత్రికులకు పాకలు, పందిళ్లు వేయుటకు చాలవీలుగా

నుండును. ఈగర్భములోనే గంగ తఱచు తనమార్గమును మార్చుకొను చుండును. 1924 లో గంగాప్రవాహము, త్రివేణిలో యాత్రికులు స్నానముచేయుట కుపద్రవకరముగనే యుండెను. కొన్ని యేర్పాటుల తోను, ఒకేసారి స్నానముచేయు వారిని నియమించుటలోను నుపద్రవ మును చాలవరకు తగ్గించవచ్చును.

శుభదినములలో గంగలో స్నానముచేసి పుణ్యమును మూట గట్టికొనవలెనను నుద్దేశ్యము నాకెప్పుడును లేకపోవుటచే నేనీసమస్యలో నెంతమాత్రమును శ్రద్ధతీసికొనలేదు. త్రివేణిలో స్నానముచేయరాదని స్థానిక ప్రభుత్వమువారు నిషేధించుటచే పండిత మదనమోహన మాలవ్యాకును ప్రభుత్వముకును చర్చ జరుగుచున్నట్లు పత్రికలలో చూచితిని. మతప్రకారము త్రివేణిలో స్నానముచేయవలసి యున్నదని మాలవ్యాజీ దీనికభ్యంతరపెట్టెను. ఉపద్రవములును, జననష్టమును లేకుండ చేయుటలో ప్రభుత్వము పూర్తిగా న్యాయముగనే యుండెను. కాని యది తన సహజ ధోరణిలో నాపనిని చాలకర్రపెడివాటముగను, ఉద్రేక జనకముగను ప్రారంభించెను.

కుంభదినమున నేను ప్రాతఃకాలముననే, స్నానము చేయుటకు గాక, మేలాను చూచుటకు, నదికి వెళ్ళి యచట మాలవ్యాజీ స్నానము చేయుట కనుజ్ఞ నీయవలసినదని జిల్లామేజిస్ట్రేటుకు మర్యాదగా వ్రాసి పంపెనని తెలిసికొంటిని. మేజిస్ట్రేటు అనుజ్ఞను నిరాకరించెను. దానిమీద మాలవ్యాజీ సత్యాగ్రహము చేయుటకు నిశ్చయించి రెండువందల మందితో త్రివేణికి బయలుదేరెను. దీని నంతను నేను చూచుచు ఆవేడిలో సత్యాగ్రహజట్టులో చేరితిని. ప్రజలు త్రివేణికి పోకుండ మైదానములో నొక పెద్ద యడ్డంకి కల్పింపబడెను. మేమీ యడ్డంకి దగ్గరకు పోవుసరికి పోలీసులు మమ్ము ఆపివేసి మాదగ్గరనున్న నిచ్చెనను లాగికొనిరి. దాక్షిణ్య రహిత

సత్యాగ్రహులము కనుక మేమచ్చట యిసుకలో శాంతముగా కూర్చుంటిమి. ఇట్లు గంట తరువాత గంట గడిచిపోవు చుండెను. భాస్కరుడాకసమున ప్రచండ కిరణములతో వెలుగొందుచుండెను; ఇసక తిన్నెలు చుర్రున మండుచుండెను. మాకడుపులు మాడుచుండెను. ఒకవంక పదాతులును, మరియొకవంక గుఱ్ఱపుదళమును మమ్ము కాచియుండెను. చివరకు మేమందరమును చాల విసిగి యేదోయొకటి చేయవలెననుకొంటిమి. అధికారులుకూడ చాల విసిగి దానిని త్వరితము చేసిరి. గుఱ్ఱపుదళము కాజ్ఞయిచ్చుట తోడనే వారు గుఱ్ఱముల నెక్కిరి. వారు మాపై కుఱికి మమ్ము తరిమివేయ వచ్చుచున్నట్లు (అది నిజమగునో కాదో నాకు తెలియదు) నాకు తట్టెను. గుఱ్ఱపు దళముచే తరుమగొట్టబడుటకు నాకిష్టము లేకుండెను; అంతేకాక నచ్చట కూర్చుండుటతో కూడ మేము విసుగుచెందితిమి. కనుక నేను దగ్గరనున్న వారితో గోడలను దాటిపోవుదమని సూచించి నేను పైకెక్కితిని. వెంటనే పదులు యిరువదులు చొప్పున పైకెక్కిరి. కొంతమంది కట్టినగోడల నూడబెరికి దోవచేసిరి. ఎవరో నాకొక జాతీయజెండా యిచ్చిరి. దానిని నేను కూర్చున్నచోట నొక గెడకు కట్టితిని. నేను కొంచెముద్రేకపడి ప్రజలు పైకెక్కుచుండుటను, త్రోసుకొని ముందుకు వచ్చుటను, పోలీసులు వారిని త్రోసివేయుచుండుటను చూచి యానందించుచుంటిని. గుఱ్ఱపు దళము నిరపాయకరముగనే పనిచేసెను. వారు కఱ్ఱలను విసరుచు ప్రజలను వాటితో గెంటుచుండిరి. కాని యెవరికిని హానికలుగచేయలేదు.

చివరకు నేనవతల ప్రక్కకు దిగి చాల వేడిగా నుండుటచే స్నానముచేయ నిశ్చయించితిని. నేను తిరిగి వచ్చుసరికి మాలవ్యాజీ మొదలగు వారెప్పటివలె యచ్చటనే కూర్చొనియుండిరి. కాని గుఱ్ఱపు దళమును, పదాతులును కలసి సత్యాగ్రహులకును గోడకును మధ్య నిలచిరి. నేను (చుట్టుతిరిగి) మరల మాలవ్యాజీ వద్దకువచ్చి కూర్చుంటిని.

మరికొంతసేపు మేమట్లు కూర్చుంటిమి. వ్యవహారము స్తంభించెను. మాలవ్యాజీ యాందోళన పడసాగెను. అతడు భావోద్రేకము నణచుకొనుచున్నట్లు కాన్పించెను. హఠాత్తుగా (నెవరికిని యెట్టి సూచనయు చేయకుండగనే) నతడాశ్చర్యముగ పోలీసుల మధ్యనుంచియు, గుఱ్ఱముల మధ్యనుంచియు దూరివెళ్లెను. ఎవరైనను నట్లు చేయగలుగుట యాశ్చర్యమే! కాని వృద్ధుడై, శరీరదుర్బలుడైన మాలవ్యాజీ యట్లుచేయుట మహాద్భుత విషయము. మేముకూడ నతని ననుకరించితిమి. మమ్ము వెనుకకు నెట్టివేయుటకు కొంతసేపు ప్రయత్నించి పోలీసు లూరకొనిరి. మరికొంతసేపటికి వారు వెళ్ళిపోయిరి.

ప్రభుత్వము మాపై చర్య తీసికొనెదరని మేమూహించితిమి. కాని యట్టిదేదియును జరుగలేదు. బహుశః ప్రభుత్వము మాలవ్యాజీ మీద నెట్టి చర్యను తీసికొన నిచ్ఛగించలేదు. కనుక నీచిన్న చేపకూడ దాటిపోయెను.

---



## మాతండ్రి - గాంధీజీ.

1924 లో గాంధీజీకి జయిలులో చాల జబ్బుచేసినట్లును, ఆస్పత్రిలోనికి మార్చి యచ్చట శస్త్రము చేసినట్లును హఠాత్తుగా వార్త లేతెంచెను. భారతదేశమంతయు నొక్కసారి విచార సాగరమున మునిగిపోయెను. భయభ్రాంతులమై మేము ఊపిరి పీల్చుట మాని ముందేమి జరుగునోయని నిరీక్షించుచుంటిమి. గండము దాటెను. తోడనే దేశమంతటనుంచియు జనప్రవాహ మతనిని చూచుటకు పూనా బయలుదేరెను. అతడింకను ఆస్పత్రిలో ఖయిదీగ నుండెను. కాని కొంతమంది స్నేహితుల నతడు చూడవచ్చుననిరి. తండ్రిగారును, నేనును అతనిని ఆస్పత్రిలో చూచితిమి.

అప్పటి కతడు తన యారువత్సరముల శిక్షలోను రెండు సంవత్సరముల శిక్షననుభవించెను. అతడు వ్యాధినుండి కోలుకొను చుండుటచే ప్రభుత్వమతని మిగత శిక్షాకాలమును రద్దుచేసి విడిచివేసెను. అతడు బొంబాయి తీరమున నున్న జుహూలో విశ్రాంతి తీసికొనుటకు వెళ్లెను.

మాకుటుంబముకూడ జుహూవెళ్ళి యచ్చట సముద్రతీరమున నొకచిన్న కుటీరములో బసచేసెను. మేము కొన్ని వారము లచ్చట గడిపితిమి. చాలకాలముకు నేను మరల నా కత్యంత ప్రీతికరమైన యీత, పరుగెత్తుట, స్వారిచేయుట మొదలగు వినోదములతో సముద్ర తీరమున వినోదించితిని. కాని మేము వినోదము కొఱకచ్చటకు పోలేదు. తండ్రిగారు గాంధీజీకి స్వరాజ్యపార్టీ వారి స్థితిని తెలిపి, ప్రత్యక్షసహాయమును కాకపోయినను, అతని యాశీర్వాదమునైనను పొందకోరెను.

నన్ను బాధించుచున్న కొన్ని సందేహములను తీర్చుకొనవలెనని నే నాతురతతో నుంటిని. అతని భవిష్య ద్విధాన మెట్లుండునో నేను తెలిసి కొనగోరితిని.

జుహూ సంభాషణలు, స్వరాజ్య పక్షమువారికి సంబంధించి నంతవరకు గాంధీజీని జయించుటలోగాని, కొంచమైన నతనికి నచ్చ చెప్పుటలోగాని యెట్టి ఫలితమును పొందలేదు. ఎంతమిత్రసంభాషణము యెంతటి మర్యాద ప్రవర్తనము యున్నను చివరకు రాజీ మాత్రము కుదరలేదు. అట్లు భేదించుటకే యొప్పుకొని వారట్లె ప్రెస్సులకు స్టేటుమెంటుల నిచ్చిరి.

నేనుగూడ కొంచె మాశాభంగిమును పొంది, జుహూనుండి తిరిగివచ్చితిని. గాంధీజీ నాసందేహములలో నొక్కదానినైనను తీర్చ లేదు. అతడు (అతని మామూలువిధముగా) భవిష్యత్తులోనికి చూడ నిరాకరించెను. దూరస్థవ్యాప్తిగల ప్రోగ్రాము నతడు వేయకుండెను. మేము ఓర్పుతో ప్రజా 'సేవ' చేయవలెను; కాంగ్రెసుయొక్క నిర్మాణ కార్యక్రమమును, సంఘసంస్కార విధానమును ఆచరించి తీవ్రమైన కార్యక్రమముకొరకు వేచియుండవలెను. అట్టి సమయ మేతెంచినను చౌరీచౌరా వంటి మరియొక యవాంతర మేర్పడినను వచ్చి మన యుద్యమ మాగిపోదా? అనునదే యథార్థమైన సమస్య. దానికి గాంధీజీ యప్పుడేమియు సమాధానము చెప్పలేదు. మన గమ్యస్థానమును గురించి కూడ నతడెంత మాత్రమును నిశ్చితముగ నుండలేదు. కాంగ్రెసు యథావిధిగా దానినప్పట్లో ప్రకటింప నవసరము లేకపోయినను, మనమనస్సులలో నైన మనము దేనిని సాధింప గోరుచున్నామో స్పష్టముగ నుండవలెనని మేముకోరితిమి. మనము స్వాతంత్ర్యమును, కొంత సాంఘిక మార్పును కోరుచున్నామా లేక మననాయకు లంతకంటె చాలతక్కువకే రాజీ పడెదరా? కొద్దినెలలకు పూర్వమే నేను

మహారాష్ట్ర సభాధ్యక్షోపన్యాసములో స్వాతంత్ర్యమును గురించి నొక్కి చెప్పితిని. నేను నాభానుంచి వచ్చినతరువాత 1923 శరత్కాలములో నీసభజరిగెను. నేను నాభాజయిలునుండి సంపాదించి తెచ్చిన జ్వరముతో మంచముమీదనుండియే నాయుపన్యాసమును వ్రాసి పంపితిని.

కాంగ్రెసులో స్వాతంత్ర్య సమస్యను గురించి స్పష్టపరుపవలెనని మాలో కొందరాశించుచుండ, మన లిబరలు మిత్రులు మనలనుండి జారిపోయి (సామ్రాజ్యము మనప్రజలను, మనము తలుపువద్ద కాళ్ళు తుడుచుకొను గోదెనీల వలెనుపయోగించు కొను చున్నను, దానిలోని వలసప్రభుత్వములు మనప్రజలను బానిసలవలె నుంచినను, లేక వారి నసలే రానీయ తిరస్కరించినను) సామ్రాజ్యాధికార ప్రతిభావిశేష ములలో బహిరంగముగ నోలలాడుచుండిరి. శాస్త్రిగారు సామ్రాజ్య రాయభారి యయ్యెను. సర్ తేజబహదూర్ సప్రూ 1923 లో లండ నులో జరిగిన సామ్రాజ్యసభలో "సామ్రాజ్యమునకు సామ్రాజ్య హోదాను కల్పించినది నాదేశమేయని నేను సగర్వముగా నుడువు చున్నాను" అని బ్రువ్వెను.

ఈలిబరలు నాయకులకును మనకును మహోదధి యడ్డమున్న ట్లుండెను. వారి ప్రపంచము వేరు. మన ప్రపంచము వేరు. వారి భాష వేరు. మన భాష వేరు. మన కలలకును (వారికి కలలే యున్నచో) వారి కలలకును సామ్యమేలేదు. ఇట్టి స్థితిలో మనగమ్యస్థానమును గురించి మనము స్పష్టముగను నిర్వివాదముగను నుండనక్కరలేదా ?

కాని యిట్టియాలోచన లప్పుడు కొద్దిమందికే గలవు. చాల మందికి నిశ్చయమనిన యిష్టములేకుండెను. ముఖ్యముగా జాతీయోద్య మములో కొంత యస్పష్టత, రహస్యములుండును. 1924 మొదటి నెల లలో ప్రజాదృష్టి యంతయు శాసనసభలలోను అసెంబ్లీలోనుగల స్వరాజ్యపార్టీ వారిపై బడెను, "లోపలనుండి ప్రతిఘటించెదము"

శాసనసభలను బ్రద్దలుచేసెదము అని బడాయికొట్టిన యీ బృందము లేమిచేయనున్నవి ? కొన్ని శుభచిహ్నములు కాన్పించెను. అసెంబ్లీలో సాంవత్సరిక బడ్జెటు త్రోసివేయబడెను. భారత స్వాతంత్ర్య షరతులను గురించి నిర్ణయించుటకు రౌండుటేబిలు చర్చకావలెనను తీర్మాన మొకటి చేయబడెను. దేశబంధుదాసు నాయకత్వము క్రింద బెంగాలు శాసనసభలో సప్లయిల తీర్మాన మోడింపబడెను. వైసాా్రియి, గవర్న రులు రెండు బడ్జెటులను ధృవపరచుటచే నవిచట్టములయ్యెను. శాసన సభలలో కొన్ని యుపన్యాసములు, కొంత యుద్రేకము, స్వరాజ్యవా దులలో తాత్కాలిక విజయోత్సాహము, పత్రికలలో పెద్దపెద్దశీర్షికలు ఇంతకు మినహా మరేమియులేదు. వారిక నేమిచేయగలరు? వారి యెత్తులనే తిరిగి తిరిగి వేయగలరు. కాని వానిలోని వింత తగ్గిపోయెను. ఉద్రేకము మాయమయ్యెను. బడ్జెటులను వైసాా్రియి లేక గవర్నరులు ధృవపరచుచుండ ప్రజాహృదయము దాని కలవాటు పడిపోయెను. తరు వాత మెట్టు శాసనసభలలోనున్న స్వరాజ్యవాదుల కతీతమైనది. అది శాసనసభల బయటనే జరుగవలెను.

1924 సంవత్సరము మధ్య అహమ్మదాబాదులో అఖిల భారత కాంగ్రెసు కమిటీమీటింగు జరిగెను. ఈసభలో గాంధీజీకిని స్వరాజ్య వాదులకును అకస్మాత్తుగా నొక సంఘర్షణ జరిగెను. దీనిని గాంధీ జీయే ప్రారంభించెను. అతడు కాంగ్రెసు సభ్యత్వపు రూల్సును మార్చి వేసి, వోటుఅర్హతను మార్చి కాంగ్రెసు చట్టములోనే ప్రధాన మార్పు చేసెను. ఇంతవరకు కాంగ్రెసు చట్టముయొక్క ప్రధాన సూత్రము నంగీకరించి (అనగా శాంతియుతపద్ధతులమీద స్వరాజ్యమును సంపా దించుటే నాయాశయము) నాలుగణాలు చెల్లించినవాడు సభ్యుడు కావచ్చును. నాలుగణాల బదులు తాను స్వంతముగా వడికిన వడుకు నూలు నీయవలెనను షరతును పెట్టవలెనని యతఁడు చూచెను. వోటు

హక్కు నిది చాల సంకుచిత పరచుచున్నది కనుక అ. భా. కా. కమిటీ దీనిని చేయజాలదు. తన కభ్యంతరముగా కాన్పించినపుడు గాంధీజీ యెప్పుడును చట్టములలోనుండు శబ్దములను లెక్కచేయడు. మన చట్టము నిది భంగపరచుచున్నదని నేననుకొని నాకార్యదర్శి పద వికి రాజీనామా యిచ్చితిని. కాని మరికొన్ని కారణములచే నేను దాని నుపసంహరించుకొంటిని. అ. భా. కా. కమిటీలో నీ తీర్మాన మును మాతంగ్రీయు, దాసుగారును తీవ్రముగా నెదిరించి తమ యసమ్మతిని తెలుపుటకు వోటింగుకుముందు వారు తమయనుచరు లతో సభనుండి బయటకు వెళ్ళిపోయిరి. అప్పుడుకూడ తీర్మానము నెదిరించువారు కొందరు, సభలోనే యుండిరి. తీర్మానము సధిక సంఖ్యాకులామోదించిరి కాని చివరకది తగ్గించుకొనబడెను. స్వరాజ్య వాదులు వెళ్ళిపోవుటచేతను మాతంగ్రీ దాసుగార్లు, యీవిషయములో నెంతమాత్రము సడలక పోవుటచేతను గాంధీజీ చాల బాధపడెను.

ఆతీర్మానము తీవ్రముగా నెదిరింపబడునని తెలిసియు నతడు వడుకు నూలువోటింగు అర్హతనే యంతగా నేలసమర్థించెనో నాక ర్థముకాలేదు. బహుశః కాంగ్రెసులో తనఖాదీ నిర్మాణ కార్యక్రమము నందు నమ్మకము కలవారిని మాత్రమేయుంచి తక్కిన వారిని తరిమి వేయవలెనని, లేదా దానికంగీకరించునట్లు వారిని చేయవలెనని యత డనుకొనెను. అధిక సంఖ్యాకులతనిపక్షముననే యున్నను తన పట్టు దలను తగ్గించుకొని యతడితరులతో రాజీపడెను. ఈసమస్య సందర్భ ములో నతడు తరువాత మూడునాలుగు మాసములలో (నాకాశ్చర్య మగునట్లు) ననేకసార్లు మారెను. అతడు నేనెక్కడనుంటిని? నేనెచ్చటకు పోవలెను? అనునట్టి స్థితిలోనుండెను. అతనికట్టి స్థితియెన్నడు నుండదని నేనను కొనుట చేతనే నాకది యాశ్చర్యమును కలిగించెను. ఆసమస్య యంతగొప్పదికాదు. (నాకట్లుకాన్పించెను.) పనిచేయుట వోటింగు

అప్రమత్తగ నుండవలెనను భావము చాలయవసరమే. కాని దానికా సంకు చిత రూపమునిచ్చుటచే దాని యర్థము కొంత తగ్గెను.

అపరిచిత విషయములలో నడుచుటచే గాంధీజీకి కష్టములు కలిగెననినేను నిశ్చయించుకొంటిని. అతడు తన ప్రత్యేక సత్యాగ్రహ రంగములో నసమానుడు; అతని బుద్ధివైశద్య మతనిని ధర్మమార్గము ననే నడుపుచుండెను. స్వయముగ తాను పనిచేయుచు నితరులచే ప్రశాంతముగ పనిచేయించునతడు ప్రజలలో సంఘసంస్కారమును కలుగచేయగలడు. అతడు యుద్ధముచేయగలడు. లేదా ప్రశాంతముగ నుండగలడు. కాని మధ్యరకపు వ్యవహార మతనికి పనికిరాదు. శాసన సభలలోనుండి పోరాడెదము ప్రతిఘటించెదము అను స్వరాజ్యపార్టీ విధానమతనికి చప్పగ నుండెను. శాసనసభలలోనికి వెళ్లదలచినచో ప్రతిఘటించుటకు గాక మంచి శాసనములను గావించుటకు ప్రభుత్వ ముకు తోడ్పడుటకే వెళ్ళవలెను. అట్లు చేయుట కిష్టములేనిచో బయటనుండవలెను. స్వరాజ్యవాదు లీరెండింటిలో దేనిని చేయరైరి. అట్టివారితో నతడేమి చేయవలెను?

చివరకతడు వారితో సమాధానపడెను. వెనుకటి పావలా సభ్యత్వమును తీసివేయలేదు. దానికి ప్రత్యామ్నాయముగా వడుకు నూలు యివ్వవచ్చుననిరి. తనమట్టుకుతాను దూరముగనుండి శాసన సభలలో స్వరాజ్యవాదుల కృషి నతడాశీర్వదించెను. అతడు రాజకీయ ములనుండి విరమించెననిరి. అధికారులును ప్రభుత్వమువారును అతని పలుకుబడి నశించుచున్నదనియు, నతడు తనశక్తినంతను కోల్పోయె ననియు విశ్వసించిరి. దాసు, నెహ్రూలు, గాంధీజీని వెనుకకు తరిమి వేసిరనిరి. రాజకీయరంగమును వారాక్రమించినట్లు కాన్పించెను. ఈ పదిహేను సంవత్సరములలో నిట్టి విమర్శ లనేకసార్లు చేయబడుటయు

భారత ప్రజాహృదయ మెంతమాత్రమును, మన ప్రభుత్వమునకు తెలియదని ప్రతిసారియు జగద్విదిత మగుటయు మనమెరిగిన విషయమే! భారత రాజకీయ రంగమునకు వచ్చినది లగాయితు ప్రజలకు సంబంధించినంత వరకు, గాంధీజీ పలుకుబడి యప్రతిహతముగనే యుండెను. ఇంతేకాదు! అతని పలుకుబడి యంతకంతకు హెచ్చుచుండెను; అది యింకను హెచ్చుచున్నది. మానవస్వభావము దుర్బలమగుటచే వారతని యాశయములను నెరవేర్పజాలక పోవచ్చును. కాని వారి హృదయము లెప్పుడు నతనిని ప్రేమించుచుండెను. తగిన పరిస్థితులు, కారణములు సహాయపడినపుడు వారొక్కసారిగా పైకిలేచెదరు; లేనపుడు వారెచ్చటనో పడియుండెదరు. నాయకుడు ప్రజోద్యమమును, గారడివానివలె, శూన్యమునుండి సృష్టింపడు. పరిస్థితు లేర్పడినపు డతడు వాటి నుపయోగించుకొనును. అట్టి పరిస్థితులకతడు తయారు చేయవచ్చును. కాని వాటిని సృష్టింపజాలడు.

కాని విద్యార్థికులలో గాంధీజీ పలుకుబడి తగ్గినమాట నిజము. ముందుకు పోవు వీరావేశములో వారతని ననుసరింతురు. కాని యుద్యమము వెనుకకు తగ్గినపుడు వారతనిపై కాంతములు మిరియములు నూరుదురు. అయినను వారిలో నధికసంఖ్యాకు లతనికి జోహారుల నర్పింతురు. మరియొక పటుత్వ కార్యవిధాన మేదియు లేకపోవుటయే దీనికి కొంతకారణము. లిబరలు పక్షము, (అట్టి యగ్రస్వభావితలు) రెస్పాన్సివిస్టులు, మొదలగువారిని మనము లెక్కింప నక్కరలేదు. ప్రభుత్వమును భయపెట్టుటకు దౌర్జన్యమును చేయవలెనని విశ్వసించెడి వారాధునిక ప్రపంచములో హద్దులను మీరినవారు; వారి పద్ధతులు నిష్ప్రయోజనములు, ప్రాచీనములు. సామ్యవాదపద్ధతి యింకను తెలియరాదు; కాంగ్రెసులోని పైతరగతుల వారికది భయజనకముగ నుండెను.

1924 లో కొద్దికాలము మాతండ్రికిని గాంధీజీకిని రాజకీయ ముగ దూరమైనను, త్వరలోనే వారిమైత్రి మరింత యధికమయ్యెను. వారిలో వారికెట్టి భేదాభిప్రాయమున్నను వారొండొరుల నెక్కువగా ప్రేమించి గౌరవించుకొనెడివారు. వారంతగా దేనిని గౌరవించిరి? గాంధీజీ వ్రాతలనుంచి తీయబడిన 'భావతరంగములు' అను చిన్నపుస్తకముకు పీఠిక వ్రాయుచు తండ్రిగారు కొంతసూచన నిచ్చిరి.

"ఋషులను గురించియు మానవాతీతులను గురించియు నేను వింటిని; కాని నేనెన్నడు నట్టివారిని కలుసుకొనలేదు; అట్టివారు నిజముగా నుందురని కూడ నేను విశ్వసింపకపోతిని. నేను మానవులను, మానవవిషయములను విశ్వసింతును. ఈప్రతిలో కూర్పబడిన 'భావతరంగ ములు' మానవసంభవములు మానవవిషయములు. అవి విశ్వాసము, శక్తియను మానవుని రెండుప్రధాన లక్షణములను తెలుపుచున్నవి... "ఇదంతయు మనల నెచ్చటకు గొంపోవుచున్నది" అని విశ్వాసము గాని శక్తిగాని లేనివారు ప్రశ్నింతురు. 'జయలక్ష్మికి లేక మృత్యుసదనముకు' అను సమాధానము వారికర్థముకాదు... ఈలోపల నొక నిరాడంబరమూర్తి యప్రతిహతమైన విశ్వాసశక్తులమీద... సవక్ర ముగా నిలచి దేశమాతృ పాదారవిందములకడ నాత్మార్పణ మొనర్పుడు చిత్రవధల ననుభవింపుడు అను మహత్తర సందేశమును తన ప్రజలకిచ్చు చుండెను. ఆ సందేశము లక్షలకొలది ప్రజల హృదయము లలో ప్రతిధ్వనించుచుండెను..." "మనలో చక్రవర్తులెందరులేరు? విషయములను జయించిన విషయాధిపతు లెందరులేరు" అను స్విన్బరను వాక్యములతో నతడు దానిని ముగించెను.

గాంధీజీని మహాత్మునివలెను ఋషివలెనుగాక నతడు మానవుని వలెనే యభినందించెను. స్వయముగ శక్తిమంతుడు, ఇతరులకు మొక్కరించనివాడు నగుటచే నతడు. గాంధీజీలోని యాత్మశక్తిని మెచ్చు

కోనెను. ఏలనన యీయైదడుగుల మనిషిలో, యీదుర్బల శరీరమునలో నెంతటి మహాబలవంతులకైన లొంగని వజ్రశక్తికలదు. గొప్ప ముఖ లక్షణములా లేవు! మొలగుడ్డ, న్యగ్నశరీరము! అట్టి యితనిలో ననేకమందిచే హృదయపూర్వకముగ జోహారు లొనరింప చేయునట్టి రాజార్హశక్తికలదు. అతడు బుద్ధిపూర్వకముగ వినమ్రుడైనను అత్యంత శక్తివంతుడు, ప్రతిభాశాలి; అది యతనికి తెలియును. ఒక్కొక్కప్పు డతడాజ్ఞల నిచ్చును; అధికారమును చెలాయించును. అవి శిరసావహింప బడును. అతని గంభీర, ప్రశాంత నేత్రము లెవనినైనను కదలనీయక నెమ్మదిగా నంతరంగ పరిశోధనచేయును. స్పష్టము, నిర్మలము నగు యతని కంఠధ్వని హృదయాంతరాళముల బ్రవేశించి భావోద్రేక మును కలిగించును. సభామంటపమున నొకడున్నను, వేలున్నను, అతని మోహనశక్తి వారిలో ప్రవేశించి ప్రతివాడు నతనితో నైక్య భావము నొందును. బుద్ధిని పూర్తిగా నిర్లక్ష్యము చేయకపోయినను ఈభావముకు బుద్ధితో సంబంధములేదు. బుద్ధి హేతువులకు నిశ్చయ ముగా రెండవస్థాన మీయబడును. ఈ యద్భుత 'మంత్రశక్తి' వక్తృ త్వముచేతగాని, లలిత పదప్రయోగముచేతగాని సంభవించినది కాదు. భాష యెప్పుడును నిరాడంబరముగను, విషయ బద్ధముగను నుండి, పొల్లుపద మొక్కటియు మచ్చునకైనను కానరాదు. అతని యనన్య నిష్కాపట్యత, వ్యక్తిత్వము మనలను వశపరచు కొనును. అతనిలో నద్భుత యంతశ్శక్తు లున్నట్లు కాన్పించును. అతనిని గురించి యట్టి సాంప్రదాయముకూడ బయలు దేరుటచే నది మంచి వాతావరణమును కలిగించుటకు తోడ్పడుచుండెను. ఈసాంప్రదాయము నొసగనట్టియు, తన పరిసరములతో సామరస్యము లేనట్టియు, క్రొత్త వాడీ మంత్రముకు కట్టుబడక పోవచ్చును; లేదా అంతగా కట్టుబడక పోవచ్చును. అయి నను తనను ప్రతిఘటించువారి నోడించుట లేదా నిరాయుధులను చేయుట గాంధీజీయొక్క గొప్ప శక్తులలో నొకటి.

గాంధీజీ ప్రకృతిసౌందర్యము నానందించినను మానవకృత వస్తువులలో నతనికి సౌందర్యము కానరాదు. తాజమహాలు అతనికి నిర్బంధ పరిశ్రమావతారముకాని యంతకంటె వేరుకాదు. అతని యాఘ్రాణశక్తి చాలతక్కువ. అయినను తన స్వంతవిధమున నతడొక జీవితకళను కనుగొని తన జీవితము నంతను నొక కళగాచేసెను. అతని హావ, భావములన్నియు, తళుకు బెళుకులు లేక, యర్థవంతములు, శోభాసమన్వితములు. అతనిలో చిరుబురులు, చికాకు, చిందర వందరలు మొదలగున వేవియులేవు. ఆత్మశాంతిని పొందినవాడై దాని నితరులకు వెదజల్లుచు జీవిత దుస్సహమార్గముల నత డవలీలగా నడచి పోవుచుండును. మాంత్రికిని యతనికిని నెంత భేదముకలదు! అతనిలో కూడ నాత్మశక్తి, రాజార్హశక్తి లేకపోలేదు. పై స్విస్బరను వాక్యము లతనికిని వర్తించును. అతడున్న యేసభలోనైనను విధాయికముగా కేంద్ర మతడేయగును. పంక్తిలో నతడేమూల కూర్చొనినను (తరువాత నొక గొప్ప ఆంగ్లజడ్జి చెప్పినట్లు) చివరకదియే శీర్షమగును. అతనిలో నమ్రత, వినయము లేవు. అతనితో భేదించువాని నతడెంతమాత్రము విడిచిపెట్టడు. బుద్ధిపూర్వకముగా నధికారగర్వము గలిగిన యతడు గొప్పభక్తిని, తీవ్రవ్యతిరేకమును కూడ సృష్టించుకొనును. అతనివద్ద తటస్థభావమనునది పనికిరాదు. అతనిని ప్రేమింపనైనను ప్రేమింపవలె లేదా ద్వేషింపవలెను. విశాలమైన నుదురు, బిగింపబడిన పెదవులు, భల్లూకపుపట్టును సూచించుగడ్డము, ఇటలీ వస్తుప్రదర్శనశాలలలోని రోమను చక్రవర్తుల విగ్రహములను మఱపించును. మాదగ్గరనున్న యతని చిత్రమునుచూచి యిటలీలోని చాలమంది స్నేహితులీ పోలికను గురించియే శ్లాఘించిరి. చివరసంవత్సరములలో ముఖ్యముగా నతని తల లంత నెరసిన శోభల సనుసప్పు దేహములో (నాక్స్ఫర్డ్ ప్రపంచములో నెచ్చటను కానరాని) యొకవిలాసశోభ, యొక గొప్పదనము కాన్పించెను. నేనతనియెడల పక్షపాతముగ నుండవచ్చును. కాని దుర్బలత్వము,

అల్పత్వములతో నిండియుండిన యీప్రపంచములో నాకతని యుదార విగ్రహము కానరాలేదు. అతనికున్న యీ గొప్పదనము కొరకు, ఆ యద్భుతశక్తికొరకు నాచుట్టుప్రక్కల వెతకి వ్యర్థుడ నైతిని.

గాంధీజీ 1924 లో స్వరాజ్యపార్టీతో కుస్తీపట్టు సమయమున మాతండ్రి ఫోటో యొకటి నేనతని కిచ్చితిని. అందులో మాతండ్రికి మీసములులేవు. అదివరకు గాంధీజీ మాతండ్రి నెప్పుడును మీసకట్టుతోనే చూచెను. ఈఫోటోను చూచుటతోడనే యతడు తటాలున లేచి దానిని చాలసేపు చూచెను. మీసములు లేకపోవుటచే ముఖము యొక్కయు, గడ్డముయొక్కయు కాఠిన్యత బయటపడెను. అతడు చిరునవ్వుతో తాను దేనితో పోరుచున్నదియు నిప్పుడు తెలిసికొనెనని చెప్పెను; అయినను ముఖము నేత్రయుగ్మముచేతను, నిరంతర మందస్మిత జనిత రేఖా లావణ్యము చేతను మార్దవము నొందెను. అప్పుడప్పుడు కండ్లు ప్రకాశించు చుండెను. తండ్రిగారు అసెంబ్లీ కార్యక్రమముకు తీపినీటి కెదురెక్కు చేపవలె పూనుకొనిరి. అతని న్యాయ, చట్ట సంబంధమైన శిక్షణ కిది (సత్యాగ్రహము, దాని సంతతివలె గాక) యెంతయు తగియుండెను. సత్యాగ్రహమును దాని సంతతిని వలెను గాక నతడీ క్రీడా సూత్రముల నెరుంగును. అతడు తన పార్టీనికఠిన శిక్షలో నుంచుటయే గాక నితర వ్యక్తులను, బృందములను కూడ తనకు తోడ్పడ పురికొల్పెను. కాని యతడు తనతోడి వారితోనే బాధలు పడవలసి వచ్చెను. స్వరాజ్యపార్టీ మొదటిరోజులలో కాంగ్రెసులో నోఛేంజర్లతో పోరాడవలసి వచ్చి బలమును చేకూర్చుకొనుటకనేకమంది యనేకతవరకు మనుష్యులను జేర్చుకొనెను. తరువాత యెన్నికలు వచ్చెను. వీటికి ధనము కావలసి వచ్చెను. అది ధనవంతుల నుండి రావలెను. కనుక నీధనవంతులను జోకొట్టవలెను. కొంతమందిని స్వరాజ్యపార్టీఅభ్యర్థులనుగా గూడ నుండగోరిరి. "ఒకరినుండి యొకరిని కాపాడెదమని వాగ్దానముచేయుచు బీదలనుండి వోటులను, ధనవంతులనుండి ధనమును

సంపాదించు సాధ్యమైన కళయే రాజకీయములు" అని యొక యమెరికా సామ్యవాది చెప్పుచున్నాడు.

మొదటినుంచియు నీకూటములన్నియు పార్టీని దుర్బలపరచెను. అసెంబ్లీలోను శాసనసభలలోను పనిచేయుట కితర మితవాద పక్షములతో రాజీలు నిత్యావసరములయ్యెను. కనుక నితరులపై ధ్వజమెత్తుట కాని యట్టి సూత్రములుకాని పనికిరావయ్యెను. క్రమముగా పార్టీ శిక్షణలోను, పార్టీపటిమలోను బలము తగ్గెను. అందులోని దుర్బలురను సమయానుకూల స్వాహాపరులును చిక్కులను కల్పింప నారంభించిరి. "లోపలనుండి ప్రతిఘటించెదము" అను నాశయముతో స్వరాజ్యవాదులు శాసనసభలపై దాడివెడలిరి. కాని యీక్రీడ కిద్దరుండవలెను. ప్రభుత్వము స్వరాజ్యవాదులలోనే చీలికలను, వ్యతిరేక భావములను కల్పించి తానిందులో పాల్గొన నిశ్చయించెను. గొప్ప యుద్యోగములను, అనేకవిధములైన మోహములను, ప్రభుత్వ మెప్పులను దుర్బల సోదరుల ముందర పడవేసిరి. వారు వాటి నెత్తుకొనుటయే చేయవలసినపని. వారిశక్తి సామర్థ్యములు, వారి రాజకార్య ధురంధరత్వము పొగడ బడుచుండెడివి.

కనుక స్వరాజ్యవాదుల సామాన్యనీతి తగ్గెను. అచ్చటచ్చట వ్యక్తులు వ్యతిరేక పక్షమునకు జార నారంభించిరి. మోతిలాల్జీ 'దుష్టాంగమును ఖండించెదను' అని యురుముచు, గర్జించుచు నుండెడివాడు. కాని దీనివలన లాభము లేకపోయెను. కొంతమంది స్వరాజ్యవాదులు మంత్రులైరి; కొంతమంది రాష్ట్రములలో (తరువాత) యెగ్జిక్యూటివు కౌన్సిలర్లు అయిరి. కొంతమంది 'రెస్పాన్సివిష్టులు' లేక 'రెస్పాన్సివు కోఆపరేటర్లు' అను ప్రత్యేక బృందముగ నేర్పడిరి. మొట్టమొదట లోకమాన్య తిలక్ యీపదమును, మరియొక ప్రత్యేక పరిస్థితులలో నుపయోగించెను. ఇప్పుడు దీనిభావము 'ఒడుపు దొరికినా నీవొక పద

విని స్వీకరించి హాయిగా ననుభవింపుము' అయ్యెను. ఇట్టివారున్నను స్వరాజ్యపక్షము సాగెను. కాని మాతండ్రియు దాసుగారును దీనితో విసిగిరి. దీనికితోడు ఉత్తరహిందూదేశములో హిందూ ముస్లిము తగాదాలు రేచ్చి తఱచు కొట్లాటలలోనికి దిగెను.

1924 డిసెంబరులో కాంగ్రెసు బెల్గాములో జరిగెను. గాంధీజీ యధ్యక్షత నహించెను. చాలకాలమునుండి శాశ్వతముగ నధ్యక్షాతీతుడైన యతడధ్యక్షుడుగ నుండుట తలక్రిందులు వ్యాపారముగ నుండెను. అతని యధ్యక్షోపన్యాసము నాకు రుచింపలేదు. అది యెంత మాత్రము నుత్తేజకరముగ లేదు. గాంధీజీ ప్రోత్సాహముచే నన్ను తిరిగి అ. భా. కా. వర్కింగు కార్యదర్శిగా నెన్నుకొనిరి. నాయిష్టము లేక పోయినను నేను క్రమముగా నొక అర్థశాశ్వత కార్యదర్శి నగుచుంటిని.

1925 వేసవిలో మాతండ్రి వ్యాధిగ్రస్తుడై యుబ్బసముతో బాధపడెను. అతడు హిమాలయములలోని డాల్హౌసీకి కుటుంబముతో వెళ్లెను. నేనచ్చట కొంతకాలముంటిని. మేము డాల్హౌసీనుండి హిమాలయములలోనున్న చాంబాకు వెళ్లితిమి. అక్కడనుండగా నొకనాడు చిత్తరంజనదాసు చనిపోయినట్లు తంతివార్త వినవచ్చెను. ఆవార్త వినుటతోడనే దుఃఖాక్రాంతుడై మాతండ్రి చాలసేపునోట మాట రాక కూర్చొనియుండెను. అది యతనికొక పెద్ద గొడ్డలిపెట్టువలె నుండెను. అతని నట్టిస్థితిలో నేనెన్నడును చూడలేదు. అతని కత్యంత మిత్రుడును సహచరుడునునైనవాడు భారమునంతను నతనిపై విడిచి వెళ్లిపోయెను. ఆభారమంతకంతకు పెరుగుచుండుటయే గాక వారిరువురకును విసుగుదల కలిగించెను. దాసుగారి ఫరిద్పూరు కాంగ్రెసు విసుగుదల కలిగినవాని యుపన్యాసమును బోలియుండెను. మరునాడే మేము చాంబాను దాటి తిరిగి డాల్హౌసీకిని, యచ్చటనుండి అలహాబాదు కలకత్తాలకును ప్రయాణమైతిమి.

## ౧౮

## కులతత్త్వ ప్రాబల్యము.



నా భాజయిలు నుంచివచ్చిన తరువాత నేను మంచము పట్టితిని. నాకది యొక క్రొత్తయనుభవము. దుర్బలత్వముచేగాని జ్వరముచేగాని నేనెప్పుడును మంచము పట్టియుండలేదు. నేనారోగ్యవంతుడ నని నాకు కొద్ది గర్వముకూడ కలదు. హిందూదేశములో సాధారణముగా నభిన యింపబడు రోగిష్టితనము, రోగిష్టిపద్ధతి యనిన నాకుమంట. నాయౌవ నము, శరీర పాటవము నాకనుభవ యోగ్యమయ్యెను. కాని యీ వ్యాధి తగ్గినతరువాత నేను కొంతకాలము మంచముమీదనే యుండ వలసి వచ్చెను. ఈకాలములో నేను నాపరిసరములకును నా నిత్య కార్యములకును ఉదాసీనుడనై యుంటిని. నేను చెట్లను వేరుచేసి కట్టెను మాత్రమే చూడగలిగినట్లు భావించెడివాడను. నా మనస్సు వెనుకటికంటె నిర్మలముగను ప్రశాంతముగను నున్నట్లు కాన్పించెను. గొప్పవ్యాధిచే బాధపడిన వారందరికి నిది సామాన్యమే యని నా యుద్దేశ్యము. కాని నాకిది యొక యాధ్యాత్మికానుభవము వలెనుండి నాకెంతయో మంచిచేసెను. నే నుద్రేక పూరితములగు మన రాజ కీయములనుండి యుత్థితుడనై నన్ను కార్యాచరణకు పురిగొల్పిన లక్ష్యమును ఆశయములను మరింత స్పష్టముగా చూడగలిగితిని. కాని యిట్లు స్పష్టమయినకొలది మరికొన్ని ప్రశ్నలుదయించుచు నేనువాటికి సరియగు సమాధానముల నీయజాలక పోవుచుంటిని. అప్పటి నాయను భవమును గురించి నేనంతగా వ్రాయజాలను. ఆభావమును నేను చుల కనగా వ్యక్తము చేయజాలను.

హిందూ ముస్లిము తగాదాలు ముఖ్యముగా ఉత్తరహిందూ దేశమున నధిక మగుచుండెను. పెద్దపట్టణములలో చాలచోట్ల నిర్దా

క్షిణ్యమగు కొట్లాటలు జరిగెను. క్రోధము అవిశ్వాసము ప్రబలిన కొలది పోట్లాటలకు మనము మున్నెన్నడును కనివిని యెరుగని నూతన కారణములు బయలు దేరుచుండెను. పూర్వము ఆవులను చంపుట (ముఖ్యముగా బక్రీదురోజున) తగాదాలకు కారణమగుచుండెను. మొహరము రామలీలల వంటిపండుగు లొకేసారి వచ్చినపు డట్టి తగాదాలు వచ్చుచుండెడివి.

మసీదులవద్ద సంగీతము, వాయిద్యములు యిప్పుడు క్రొత్త తగాదాకు కారణమయ్యెను. తమ ప్రార్థనలకివి యడ్డంకులని ముస్లిములు వీటికభ్యంతర పెట్టిరి. ప్రతిపట్టణములోను చాల మసీదులున్నవి. వారు రోజు కయిదుసార్లు ప్రార్థింతురు. కనుక నుత్సవములకును (శ్రాద్ధ, వివాహాదిక) ధ్వనులకును లోటులేకుండుటచే పోట్లాటల కవకాశము లెప్పుడును గలవు; ముఖ్యముగా సాయంకాల ప్రార్థన కాలమున నివి పనికిరావనిరి. ఈ కాలముననే హిందూ దేవాలయములలో పూజలు చేయుచు జేగంటలు వాయించుచుందురు. దీనిని ఆర్తియందురు. కనుక ఆర్తీ నమాజు యుద్ధములిప్పుడు ప్రాముఖ్యత వహించెను.

పరస్పర భావములపట్ల గౌరవమును కొద్దిపాటి సర్దుపాటును చేసికొనిన సమసి పోవలసిన సమస్య నిరంతర ద్వేషమునకును కొట్లాటలకును కారణమగుట ఆశ్చర్యకరముగ నుండును. కాని మత ద్వేషములకు ఆలోచనగాని, హేతువుగాని, సర్దుపాటుగాని యవసరములేదు. ఇక నొకరిపై నొకరిని పురిగొల్పు అధికారములోనున్న మూడవ పక్షమున్నపు డిది రాజుట యతి సులభము.

కాని యీకొట్లాటల కనవసర ప్రాముఖ్యత యివ్వబడుచున్నది. చాల పట్టణములు, పల్లెలు యిట్టి కొట్లాటలు లేకుండ సుఖజీవనము చేయుచున్నవి. వార్తాపత్రికలు ప్రతిచిన్న పోట్లాటను గోరంతలు కొండంతలు చేయును. దీనిని పైనున్న కులనాయకులు పెంచుచు తమ

కులము కెక్కువ రాజకీయ హక్కులు కావలెనని బిగియు చుందురు. ఈ కులద్వేషములచే, నింతవరకును వెనుకనున్న ముస్లిము రాజకీయాభివృద్ధి భంగకారులు, (ప్రభుత్వ సహాయముతో) తటాలున ప్రాముఖ్యత వహించి భారత స్వాతంత్ర్యముకును, జాతీయ యైక్యత కును భంగకరములైన రాజకీయ హక్కులను కావలెననిరి. హిందువు లలోకూడ రాజకీయాభివృద్ధి సరికట్టువారే ముఖ్యమైన కులనాయకులు. హిందూ ప్రయోజనములను రక్షించుట యనుపేర వారు ప్రభుత్వ హస్తములలో పడుచుండిరి. చివరకు వారు దేనిని సాధించలేదు సరి కదా దేశములో కులకక్షలను మాత్రము పెంచివేసిరి.

కాంగ్రెసుకు దీనివలన కష్టము తటస్థించెను. చాలమంది కాంగ్రెసువారు జాతీయ బురఖాలోనున్న కులనాయకులు. కాని కాంగ్రెసు యీకులనాయకుల కెంతమాత్రమును స్థానమీయలేదు. కనుక నిరు తెగల యతివాదులును కాంగ్రెసును దూషింప నారంభించిరి. గాంధీజీ చిరకాలము క్రిందటనే (అసహాయోద్యమముకు పూర్వమే) కుల సమ స్యలను పరిష్కరించుటకొక ప్రణాళిక నేర్పరచెను. అవి యధిక సంఖ్యాకుల యుదారత వలనను, సాదర భావమువలనను తీరగలవని యతని యభిప్రాయము. ముస్లిములు దేని నడిగినను యిచ్చివేయ వలెననియే యతడనెను. వారితో బేరములు వలదనియు వారిని పైవిధ మున పూర్తిగా జయింప వలెననియు నతడనెను. తక్కినవారు దేని నిజప్రయోజన మెంత కలదో యావంతయు నెరుగక పోయినను ప్రతి దాని కొనుగోలు ధరను తెలిసినవారివలె సంతబేరమే కావలెనని పట్టు బట్టిరి. వస్తువుధర వారికి తెలియును. కాని కొనబడిన వస్తువెట్టిదో వారెరుగరైరి!

ఇతరులను చులకనగా విమర్శింప వచ్చును; నిందింప వచ్చును. మన యభీష్టము లీడేరక పోవుటకేదియో కారణము దొరకవచ్చును.

మనము ప్రభుత్వముమీదను కులనాయకులమీదను నిందవేసెదము. వారు కాంగ్రెసును నిందింతురు. బ్రిటిషు ప్రభుత్వము పూర్వమును, యిప్పుడును, యెప్పుడును మనలో చీలికల నేర్పరచియే పాలించెను, పాలించుచున్నది; పాలించును. సామ్రాజ్యము లెప్పుడు నట్లేచేయును. మనము దీనిని నిందించిన లాభములేదు. దానిని నిర్లక్ష్యముచేసి, దానికి తగిన కట్టుదిట్టములను చేసికొనలేకపోవుట మనలోపము కాని మరియొకరిది కాదు.

మన మీలోపము నెట్లు తీర్చుకొనగలము? ఇది బేరములచేత నెంతమాత్రమును కుదురునది కాదు. మనమెంత బేరమాడినను మన కంటె నెక్కువకు బేరమాడి బేరమాడుటయేకాక దానిని కార్యరూపమున బెట్టగల ప్రభుత్వములేదా? ఒక సామాన్య జాతీయదృష్టి లేక సాంఘికదృష్టి లేనిచో సామాన్య శత్రువుపై సమిష్టి పోరాట మెట్లు జరుగగలదు? మనము ప్రస్తుతమున్న రాజకీయ, ఆర్థిక పునాదుల నట్లేయుంచి యచ్చటచ్చట నతుకులను మెత్తులను పెట్టుట సంస్కరించుట లేక 'భారతీయులను ప్రవేశపెట్టుట' వలన లాభమేమి? మన లక్ష్య మప్పుడు పంపకములలోనికి దిగును. అధికారములోనున్న మూడవ పక్షమప్పుడు విధాయికముగా ప్రధానపాత్రను ధరించి తన దత్తపుత్రులకే వరముల నిచ్చును. ప్రస్తుత రాజకీయ, సాంఘిక పునాదులకు కేవల భిన్నమగు నూతన పునాదులమీదనే మనము స్థిరమైన సమిష్టి పోరాటమును నడుపగలము.

కాని క్రొంచె మించుమించు మన నాయకులందరును ప్రస్తుత సంకుచిత రాజకీయ సాంఘిక పునాదులలోనే గుడి గుడి గుండారాగము తిరుగుచుందురు. వారిదృష్టి యెంతసేపు సంస్కరణయుతముగాని విప్లవ యుతముగాదు. కాని హిందూదేశములో రాజకీయ, సాంఘిక, ఆర్థిక సమస్య లేవియైనను సంస్కరణ పద్ధతులచే తృప్తికరముగా పరిష్కరింపబడు కాలము గతించెను. అవి విప్లవము చేతనే సాధింప బడవలెను.

మన స్వాతంత్ర్య పోరాటములో స్పష్టమైన లక్ష్యములు, ఆశయములు లేకపోవుట చేతనే కుల తత్త్వములు పెచ్చుపెరిగెను. ప్రజలకు స్వరాజ్య పోరాటముకును తమ నిత్యజీవితములోని బాధలకును స్పష్టమైన సంబంధమేమియు కానరాదు! తాత్కాలికోత్సాహములో వారొక్కొక్కప్పుడు బాగుగనే పోరాడెడివారు. కాని దానివెనుక తగినంత హేతుబలము లేకపోవుటచే యుద్యమము వెనుకకు తగ్గిన కాలములో కుల నాయకులు వారిని మతముపేరట తమ ప్రయోజనముల కొరకుపయోగించుకొనెడివారు. హిందువులలోను మహమ్మదీయులలోనుకూడ బూర్జువాతరగతులవారు ప్రజాసామాన్యముకును, చివరకు మధ్యతరగతులలోని క్రింది తరహావారికినికూడ నెంతమాత్రమును సంబంధము లేని కోరికలకొరకును హక్కుల కొరకును పవిత్రమైన మతము పేరిట ప్రజాసానుభూతిని బడయుట చోద్యముగ నుండును. ఏకులము తరపున గాని తీసికొనిరాబడు ప్రతికుల హక్కును, కోరికను మనము పరిశీలించి చూచినచో చివరకది యుద్యోగవాంఛ తప్ప మరియొకటి కాదు. ఈ యుద్యోగము లతిస్వల్పముగ నుండి మధ్య తరగతులలోని పై తరహావారిక పోవును. శాసన సభలలో నెక్కువ స్థానములు, ప్రత్యేక స్థానములు కావలెనను కోరికకూడ నిట్టిదే. ఇది పెద్ద రాజకీయాధికారము నిచ్చునది యని చెప్పబడును. ఇట్టివి జాతీయాభివృద్ధికిని, జాతీయ యైక్యతకును భంగకరములు. ఇవి యాయా కులములలోని యేకొద్దిమంది పై తరగతుల వారికో యుపకరించును గాని కులము కంతకును, ప్రజలకందరకును నుపకరించు ననుట వట్టికల్ల. ఈ గొడ్డుపోతుకోరికలను మతోద్రేకముతో లంకెపెట్టి యథార్థమును మరుగు పరచుచున్నారు.

ఈవిధముగా రాజకీయాభివృద్ధికి భంగకరులైనవారు కుల నాయకుల మనుపేరట రాజకీయ రంగములో తిరిగి ప్రవేశించిరి. కులాభిమానము కంటె రాజకీయాభివృద్ధిని ధ్వంసము చేయుటయే వారిసం

కల్పమని వారినడకలే విశదము చేయగలవు. ఒక్క రాజకీయముగనే వారు మనకడ్డము తగులవచ్చునని మనమను కొనవచ్చును. కాని యీసందర్భములో వారెంత దూరమైనను పోవుచుండుట కడు విచారకరము. ముస్లిము కులనాయకులు భారత జాతీయతను, భారత స్వాతంత్ర్యమును యెంతమాత్రమును లెక్కచేయనట్లే కాన్పింతురు. హిందూ కులనాయకులెప్పుడును పైకిజాతీయత పేరిటనే మాట్లాడినను ఆచరణలో దాని వంకపోరు. వారెట్టి ప్రయోజన కరమగు కార్యమును చేయుట కసమర్థు లగుటచే ప్రభుత్వముకు సాగిలబడి చివరకు దానినికూడ వ్యర్థముగనే చేసిరి. ఉభయులును 'సామ్యవాదమును' అట్టి 'యుపద్రవ' యుద్యమములను ఖండింతురు. పెట్టుబడిదారుల ప్రయోజనములకు సంబంధించి నంతవర కుభయులు నేకగ్రీవముగనే యుందురు. ముస్లిము కులనాయకులు రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యముల నరికట్టుట కనేకములను చెప్పిరి; చేసిరి. కాని వారు మొత్తముమీదను, వ్యక్తిగతముగను ప్రభుత్వము దగ్గరను, ప్రజల దగ్గరనుకూడ కొంత యాత్మగౌరవముతో మెలగిరి. హిందూ కులనాయకులను గురించి మనమిట్లు చెప్పుటకు వీలులేదు.

కాంగ్రెసులో చాలమంది ముస్లిములు కలరు. భారత దేశమంతటను పేరెన్నిక పొందిన వారు, సమర్థులు చాలమంది కాంగ్రెసు ముస్లిములు కల్లసి 'జాతీయ ముస్లిము పక్షమును' స్థాపించి ముస్లిము కులనాయకుల నెదిర్చిరి. మొదట వారికి కొంత జయము చేకూరెను చదువుకొనిన ముస్లిములలో చాలమంది వారి తరఫున యున్నట్లే కాన్పించిరి. కాని వారందరును మధ్యతరగతులలో పైతరహాకు చెందినవారగుటచే వారి వారి యుద్యోగములను వ్యాపారములను చూచుకొని ప్రజా సామాన్యముతో సంబంధమును పోగొట్టుకొనిరి. నిజముగా వారు తమ ప్రజలవద్దకు పోనేలేదు. వారే సభలలోనో కూర్చుని ఖారిలో వారు కొన్ని యేర్పాటులను రాజీలను కుదుర్చుకొను చుండెడి

వారు. ఈ యాటలో వారికంటె కులనాయకు లెక్కువ దిట్టలగుటచే వారి నొకచోటునుండి మరియొకచోటుకు తరుముచు చివరకు వారెట్టి సూత్రములతో బయలుదేరిరో యట్టిసూత్రముల నన్నింటిని విడిచి పెట్టులాగున చేసిరి. చివరకు వారొక్క సమిష్టి యెన్నికలను సూత్రముకు దిగివచ్చి దానినైనను కాపాడుకొన జాలకపోయిరి.

ముస్లిము జాతీయవాదుల పతనము (వ్యక్తులు కొందరు ముఖ్య కాంగ్రెసునాయకులే గలరు) విచారకరమైన కథనము. దానికి చాల వత్సరములుపట్టెను. ఈవత్సరము (1934) తో దాని చివర యధ్యాయము ముగిసెను. 1923 వత్సరములోను తరువాతను వారు చాల బలముగ నుండి కులనాయకులను తీవ్రముగ నెదిర్చిరి. చాలసారులు గాంధీజీ (తనకిష్టము లేకపోయినను) ముస్లిము కులనాయకుల కోరికల నంగీకరించుటకు తయారయ్యెను. కాని ముస్లిము జాతీయవాదులే దీనిని వల్లకాదనిరి.

కుల సమస్యలను పరస్పర సంభాషణల వలనను చర్చలవలనను కుదుర్చుకొనుట కనేక ప్రయత్నములు జరుపబడెను. ఈ 'యైకమత్య సభల' లో ముఖ్యమైనదానిని మహమ్మదాలీ 1924 లో ఢిల్లీలో గాంధీజీ 21 దినము లుపవాసమున్న కాలములో జరిపెను. ఈ సభలకు చాలమంది సదభిప్రాయములతోను, శ్రద్ధాభక్తులతోను వచ్చి సమన్వయముకు వచ్చుటకు చాల పాటుపడిరి. కొన్ని పవిత్రమైన తీర్మానములు గావింపబడెను. కాని ముఖ్యసమస్య పరిష్కరింప బడలేదు. గొప్పసమస్యల నధికసంఖ్యాకుల వోటులతో గాక పవిత్రమైన నైక్య బుద్ధితోనే సమన్వయ పరచవలెను. కాని యన్నిసంఘములలోను అతివాదులు కలరు. వారిప్రకారము పరిష్కారమనగా నందరును తమ యభిప్రాయములకు లొంగిపోవుటయే. నిజముగా కొంతమంది ముఖ్య కులనాయకుల కెట్టి పరిష్కారము నవసరము లేనట్లేతోచును. వారిల్లో

చాలమంది రాజకీయాభివృద్ధికి విముఖులు. కనుక రాజకీయ పరివర్తనమును కోరువారికిని వీరికిని సమన్వయ మెట్లు సంభవించును?

వ్యక్తులు జారిపోవుట కంటెను గంభీరమైన కష్టములింకను అనేకములు కలవు. సిక్కులు తమకులహక్కులను కోరుచుండిరి. పంజాబులో నీ విధముగా త్రివిధ సంగ్రామ మేర్పడెను. ఒకసంఘము మరియొకసంఘమును చూచి భయపడు చుండుటచే ద్వేషములు పెరుగుచుండెను. కొన్ని రాష్ట్రములలో వ్యావసాయిక తగాయిదాలు-వంగదేశములో హిందూ జమీందారులు ముస్లిము రయితాంగము - కుల సంబంధమైన బురఖాలో కాన్పించెను. పంజాబు సింధులలో ధనవంతులు వడ్డీవ్యాపారస్తులు సాధారణముగ హిందువులు. ముస్లిము వ్యవసాయ దారులు ఋణగ్రస్తులు. దారిద్ర్యముచే పీడింపబడు యీ ఋణగ్రస్తులకు రక్తమును పీల్చెడి ఋణదాతలమీద గల ద్వేషమంతయు కులద్వేషముకు దోహదము నిచ్చుచుండెను. సాధారణముగా ముస్లిములు బీదవారగుటచే కులనాయకులు వారి బీదతనముచే ధనవంతులపై కలిగిన ద్వేషమును కుల ప్రయోజనములకు (వారి బీదతనమును పోగొట్టుటకును వీనికిని యెంతమాత్రమును సంబంధము లేకపోయినను) వినియోగించు కొనెడివారు. దీనిచేతనే ముస్లిము కులనాయకులు కొంత ప్రజాప్రతినిధ్యము కలవారై కొంతబలమును సంపాదింపగలిగిరి. హిందూకులనాయకులు (ఆర్థికదృష్టిలో) ధనవంతులైన వడ్డీవ్యాపారస్తులకును ఉద్యోగస్తులకును ప్రతినిధులైరి. వీరివెనుక హిందూప్రజల బలమంతగాలేదు. కనుక నీ సమస్య ఆర్థిక సమస్యతో (అది గ్రహింపబడకపోయినను) మిళితమగుచుండెను. ఇది రాను రాను అర్థవంతులకును అనర్థవంతులకును పోరాటముగామారవచ్చును. కానియాకాలమువచ్చుసరికిఅన్నికులములకును చెందిన ప్రస్తుత కులనాయకులందరు నేకమయి తమ భేదభావములను సమన్వయపరచుకొని యనర్థవంతుల పైకొక్క

మ్మడిగా నురుకుదురు. ప్రస్తుత పరిస్థితులలో కూడ మూడవపక్షము లేకపోయినచో (ఇదియే యసంభవము) రాజకీయపరిష్కారము కుదురుటంత ఘనకార్యముకాదు.

1924 లో ఢిల్లీయైకమత్యసభ యైనదోలేదో యప్పుడే అలహాబాదులో హిందూముస్లిము పోరాటములు చెలరేగెను. మేము వెంటనే అలహాబాదు వెళ్లితిమి. అదియంత తీవ్రముగా పరిణమింపక పోయినను దానితరువాత కలిగిన ద్వేషములు కోర్టువ్యాపారములు చాలకాల ముండెను. ఆ సంవత్సరమే రామలీల యుత్సవ సందర్భములో నచ్చట మరియొక సంఘర్షణ జరిగెను. మసీదులవద్ద నాయిద్యాదులను నిషేధించుటచే నిప్పటికెనిమిది వత్సరములనుండి అలహాబాదులో రామలీలోత్సవములను జరుపుటయే మానివేసిరి. నాచిన్నతనములో నేను వాటినెంతయో యానందముతో ననుభవించెడివాడను! అది హిందూ యుత్సవ మైనను బహిరంగమున జరుగుటచే ననేకమంది ముస్లిములు కూడ నందులో పాల్గొనుచుండిరి. ప్రతిచోట సంతోషము, స్వేచ్ఛాచారము తాండవ మాడుచుండెడిది. నర్తకము విజృంభించెడిది. నేను పెద్దవాడ నైన తరువాత దీనిని చూచితిని. అప్పటికి నాయభిరుచులన్నియు మారుటచే నాకంత యుత్సాహములేకపోయెను. కాని ప్రజలీ యుత్సవములను, తమాషాలనుచూచి తమ దుఃఖములను, కష్టములను, శ్రమలనుమరచిపోయెడివారు. ఇప్పటి కెనిమిదిసంవత్సరములనుండి అలహాబాదులోని బాలబాలికలీ (పెద్దవారిమాటయటుంచి) సంతోషమునకు, యీమాత్రపు నిత్యశ్రమ జనిత దుఃఖోపశమనమునకు నోచికొనరైరి. ఇదంతయు స్వల్ప పేచీలకొఱకు! మతము మతతత్త్వము దీనికుత్తరవాది యగుచున్నది. ఆహా! వారెంత సంతోష రహితులు. ఎంత సంతోష సంహారకులు.

## ౧౦

## మున్సిపలు కార్యనిర్వహణము.

నేను అలహాబాదు మున్సిపలుపనిని రెండేండ్లు నిర్వహించితిని. నా ఛైర్మనుపదవియొక్క పరిమితి మూడేండ్లు. రెండవయేడు ప్రారంభమగుటతోడనే నాబాధ్యతను తొలగించుకొనజూచుచుంటిని. నాకా పనియందు శ్రద్ధకలిగి చాలకాలమును, బుద్ధిని, దానికి వినియోగించితిని. నేను దానిని జయప్రదముగ నెరవేర్చి నా సహచరులందరి యామోదమునుగూడ బడసితిని. రాష్ట్ర ప్రభుత్వమువారు గూడ నాపైనున్న రాజకీయద్వేషమును తగ్గించుకొని, నామున్సిపలు కార్యములను కొన్నింటిని మెచ్చుకొనిరి. అయినను యథార్థ ప్రయోజనముల నిచ్చెడివాటిని వేటిని చేయకుండ నాచేతులు బంధింపబడెను; అభ్యంతరములును, అడ్డంకులును కల్పింపబడెను.

అదియొకరు బుద్ధిపూర్వకముగ కల్పించు యభ్యంతరముకాదు. అందరును నాకు మనఃపూర్వకముగ సహకారమునే చేసిరి. కాని యొక ప్రక్క ప్రభుత్వయంత్రముకలదు. మరియొకవంక ప్రజలయొక్కయు, మున్సిపలు సభ్యులయొక్కయు నుదాసీనత కలదు. ప్రభుత్వముచే తయారు చేయబడిన మున్సిపలు పరిపాలన యను యుక్క చట్టము గొప్ప యభివృద్ధినిగాని, నూతన మార్పులనుగాని చేయ నీయదు. మున్సిపాలిటీ యెప్పుడును ప్రభుత్వముమీద నాధారపడియుండునట్టి యార్థికనీతియే దానికి ప్రసాదింపబడెను. మున్సిపలు చట్టముల ప్రకారము నూతన పన్నువిధానములుగాని, సాంఘికాభివృద్ధిగాని పనికిరావు. చట్టము ప్రకారము చేయదగినవాటికి గూడ ప్రభుత్వముయొక్క యామోదముండవలెను. మార్కండేయునాయుర్దాయముండి, యెడతెగని యోర్పుగలవాడున్నచో నీ యామోదమును సవిశ్వాసముగ ప్రార్థించి

దానికొరకెదురుచూచు చుండవచ్చును. జాతీయసాంఘికనిర్మాణము లకు సంబంధించిన వ్యవహారము వచ్చినపుడు ప్రభుత్వయంత్ర మెంత నెమ్మదిగ, నెంతకష్టముగ, నెంతయసమర్థముగ నడిచెడిదో చూచిన నాకాశ్చర్యము వేసెడిది. కాని రాజకీయ శత్రువు నణచవలసివచ్చినప్పుడు మాత్రము వారిలో నామందగమనము, అసమర్థత మాయమగును.

రాష్ట్రప్రభుత్వములలోని స్థానిక స్వపరిపాలనశాఖకొక మంత్రి యధిష్టాన దేవతగానుండును. కాని సాధారణముగా నీమంత్రిశేఖరునకు మున్సిపలు వ్యవహారములుగాని మఱేయితర ప్రజా వ్యవహారములుగాని తెలియవు. నిజమున కతని లెక్కయేలేదు. శాశ్వతమైన ఐ. సి. యస్. యుద్యోగులచే నడుపబడు యతనిశాఖయే యతనిని నిర్లక్ష్యముచేయును. ప్రభుత్వమనగా ముఖ్యముగా పోలీసుధర్మమే, శిక్షించుటే యనుగొప్ప భారతోద్యోగుల భావములే వీరికినిపట్టుబడును. అధికారగర్వము, అధికార సంబంధమైన పెత్తనము వెలిగింప వలెనను భావమే వీరికి కాన్పించును. కాని ప్రజాబాహుళ్యమునకు చెందు సాంఘికసేవ చేయవలెననెడి యవసర మెంతమాత్రము వీరికి కాన్పించదు. ప్రభుత్వ మెప్పుడును మున్సిపాలిటీలకు ఋణదాతలు. కనుక పోలీసు ధర్మమైన తరువాత వారికి ఋణదాత ధర్మమే ముఖ్యము. ఋణ వాయిదాలు సరిగా చెల్లింప బడుచున్నవా? మున్సిపాలిటీలో తగినంత ధనమున్నదా లేదా? అది దివాలా తీయుటకదా! ఈప్రశ్నలు అవసరమైనవే యైనను మున్సిపాలిటీలు విద్య, పారిశుధ్యము అనుప్రయోజన కరములగు ధర్మములను కొన్నింటిని నెరవేర్చవలసి యున్నదనుసంగతి సామాన్యముగా మరచి పోబడుచున్నది. అది రొక్కము బదులుతీసి కొని తిరిగి వాయిదాలప్రకార మిచ్చివేయుట కేర్పడిన సంస్థకాదు. భారత మున్సిపాలిటీలలో సాంఘికసేవ కవకాశములే చాలతక్కువ; డబ్బునిక్కచ్చి యున్నచోట దీనికిని నాస్తిచెప్పుదురు. అందులో

మొదట సాధారణముగా విద్యకే యెక్కువదెబ్బతగులును. పాలక తర గతులకు మున్సిపలు పాఠశాలలతో సంబంధములేదు. వారిబాలురు మంచిస్థితిలోనుండు ప్రయివేటుబడులకు (ప్రభుత్వమునుండి గ్రాంటు లనుపొందువాటికి) పోదురు.

భారతదేశములోని పట్టణముల నన్నింటిని మనము రెండు భాగములుగా విభజింపవచ్చును. సందులతోను గొందులతోనుకూడి క్రిక్కిరిసియుండు ప్రధాన నగరము; రెండవది విశాలమైన భవన ములు, సుందరమైన కుటీరములు, తోటలు ప్రాకారములు గల యుద్యోగస్థులశ్రేణులు. ఈయుద్యోగస్థుల శ్రేణులలోనే ఇంగ్లీషు వ్యాపారస్థులు యింగ్లీషు యుద్యోగులు, మధ్య తరగతులలోని పైతరహాకు చెందిన భారతీయులు, యితర వృత్తులవారు, యుద్యో గస్థులు మొదలగు వారుందురు. మున్సిపాలిటీకి వచ్చురాబడిలో హెచ్చుమొత్తము ఉద్యోగస్థుల శ్రేణులనుండిగాక ప్రధాననగరము నుండియే వచ్చును. కాని ప్రధాన నగరముకంటె నీశ్రేణులకే యెక్కువ మొత్తము వెచ్చింపబడును. విశాలమైన యీశ్రేణులకు యెక్కువ రోడ్డులుకావలెను. దానితో నెక్కువ మరమ్మతులు, తుడుచుట, నీళ్లు చల్లుట దీపములు వెలిగించుట మురుగుకాలవలు నీటసప్లయి పారి శుధ్యము ఇట్టి వనేకములు కావలెను. నగర భాగమెప్పుడును నిర్ల క్ష్యము చేయబడును; ఇక పట్టణములోని బీదప్రాంతముల సంగతి చెప్పనక్కరనేలేదు. వాటికి మంచిరోడ్డులుండవు. ఇరుకు సందులలోను గొందులలోను దీపములుండవు. సరియైన మురుగుకాలువలుగాని పారి శుధ్యముగాని యుండవు. వారీబాధల నన్నింటిని యనుభవింతురు. వారికష్టములను చెప్పుకొననైనను చెప్పుకొనరు. చెప్పుకొనిరో విను వారెవరు? పెద్దనోరు చిన్ననోరు గలవారందరును యుద్యోగి శ్రేణుల లోనే యుందురు.

ఈ భారమును కొంత సమము చేయుటకును కొన్ని యభివృద్ధులను కలిగించుటకును భూముల విలువమీద నేనొక పన్ను వేయనెంచితిని. నేనీసూచన చేయుటతోడనే జిల్లా మేజిస్ట్రేటు యిదిభూమిశిస్తు పద్ధతికిని చట్టములకును వ్యతిరేకమనెను. అట్టిపన్ను శ్రేణులలోని భవనముల యజమానులపైననే యెక్కువగా పడియుండెడిది. కాని ప్రభుత్వము బీదలమీదపడు అప్రత్యక్షపన్నులను, వస్తువులపై సుంకములను జంకుగొంకులు లేకుండ నామోదించును. అవి ధరలను పెంచును; వర్తకము నణచును; బీదలపై నెక్కువ భారముగా బడును.

ఈ విధముగా మున్సిపలు వ్యవహారమునగా నేనొకవంక కదలబడకుండు పెత్తనమును కలిగించు ప్రభుత్వ యంత్రముతోను (ఇది యజగరమువలె కదలదు. నూతనమార్గములను త్రొక్కదు) తత్తుల్యముగనే కదలని నా సహచరులైన సభ్యులతోను మెలగవలసివచ్చెను. ఇందులో కొంతమంది యుత్సాహవంతులున్నను మొత్తముమీద వారు మార్పుకుగాని మంచికిగాని యంత సుముఖులుకారు. పాతమార్గములు మంచివే కదా సంశయాస్పదమగు క్రొత్తయనుభవములేల? చివరకీ యుత్సాహవంతులును నిర్వీర్యమగు దినచర్య కలవాటుపడి క్రమముగా నల్లమందు భాయిలైపోయిరి.

ప్రతివత్సరము వార్తాపత్రికలును ప్రభుత్వోద్యోగులును ప్రభుత్వ తీర్మానములును మున్సిపాలిటీలను స్థానికసంస్థలను విమర్శించుచు వాటి లోటుపాటుల నెత్తిచూపుచును. దీనినుండి భారతదేశముకు ప్రజాస్వామిక సంస్థలు పనికిరావను సారాంశము తీయబడుచున్నది. వాటిలోపములు స్పష్టములే యైనను వారెట్టిసంకుచిత యిరుకు చట్టములలో పని చేయవలసి యున్నారో గమనించు వారెవరునులేరు. ఇది నిరంకుశత్వమును కాదు. ప్రజాస్వామికమునుకాదు. ఇది యీ రెంటియొక్కయు సంకర సంభవము. దీనికా రెంటియొక్కయు లోపములు మాత్రమే కలవు.

కేంద్రప్రభుత్వమునకు కొంతయధికారమును పెత్తనమును యుండవచ్చును. కాని యీ కేంద్రప్రభుత్వముకూడ ప్రజాస్వామికమును, ప్రజల యవసరములను గుర్తించునదియు నైనప్పుడే స్థానిక ప్రజాసంస్థకు సరిపడును. ఇట్లుకానినాడు రెంటికిని సంఘర్షణ తప్పదు. లేదా కేంద్రాధికారమునకు లొంగకతప్పదు. ఈవిధముగా కేంద్రాధికారము బాహ్యతలనుండి యధికారమును చలాయించును. ఇది చాల యసంతృప్తికరమైన విషయము. దీనివలన నిజమైన ప్రజాధికారము నశించును. మున్సిపలుబోర్డు సభ్యులుకూడ తమరి నెన్నుకొను ప్రజలవైపుగాక నెక్కువగా కేంద్ర ప్రభుత్వ ప్రసాదముకొరకే చూచుచుందురు: ప్రజలు కూడ బోర్డును మరచిపోవుదురు. నిజమైన సాంఘికసమస్యలెన్నటును బోర్డుముందరకు రాజాలవు. అవి దానికర్మముక్రిందకు రాకుండుటయే దీనికి కారణము. పన్ను వసూలుచేయుటయే దానిప్రధాన కర్మము.

స్థానిక సంస్థల వోటింగు అర్హత కూడ చాల సంకుచితముగనే యున్నది; దానిని చాలవరకు పెంచి యెక్కువ మందికి వోటింగు హక్కును కలుగచేయవలెను. బొంబాయి కార్పొరేషనువంటి మహా పట్టణ కార్పొరేషను కూడ చాల సంకుచితమైన వోటింగు స్థితిచేతనే యెన్నుకొనబడినదని నేను భావించెదను. కొంతకాలము క్రిందట వోటింగు అర్హత నెక్కువమందికి కలుగ చేయువలె ననుతీర్మానము కార్పొరేషనులోనే యోడింపబడెను. చాలమంది సభ్యులు ప్రస్తుతస్థితితో తృప్తిపడి దానిని మార్చుటకుగాని పోగొట్టుకొనుటకుగాని యిష్టపడరైరి.

కారణము లేవియైనను మనస్థానిక సంస్థలంత జయప్రదమైనవియు సమర్థమైనవియు కావు. అట్లున్నను వానిని ప్రజాస్వామిక పరిపాలన యభివృద్ధిలోనున్న దేశములలోని కొన్ని మునిసిపాలిటీలతో పోల్చవచ్చును. సాధారణముగా నవి నీతిబాహ్యములుకావు; అసమర్థతయే వాటికున్న లోపము; బంధువులకుద్యోగముల నిచ్చుటయే వాటికున్న

దుర్బలత్వము. వాటిలక్ష్యము లన్నియు సరియైనవికావు. ఇవియన్నియు సహజములు; ఏలనన ప్రజాస్వామికము జయప్రదముగ నుండవలెననిన దానివెనుక వివేకముగల ప్రజాభిప్రాయమును బాధ్యతయు నుండవలెను. దానిబదులు మనకెక్కడ చూచినను అధికారప్రాబల్యమును ప్రజాస్వామికముకు కావలసిన సమగ్రత లేకపోవుటయు కానవగును. ప్రజాసామాన్యముకు విద్య నిచ్చు పద్ధతిలేదు. జ్ఞానయుతమగు ప్రజాభిప్రాయమును నిర్మించుటకు ప్రయత్నములులేవు. కనుక విధాయకముగా ప్రజాదృష్టి వ్యక్తులమీదను కులతత్వముల మీదను తదితర స్వల్ప సమస్యలమీదను పడును.

మున్సిపలు పరిపాలనలో 'రాజకీయములు' లేకుండ చేయుటకే ప్రభుత్వమందులో ముఖ్యముగా శ్రద్ధతీసికొనును. జాతీయోద్యమముతో సానుభూతి చూపు తీర్మానమును చేసినచో ప్రభుత్వము గుడ్లెఱ్ఱచేయును. జాతీయ వాసనగల పాఠ్యపుస్తకములను మున్సిపలు పాఠశాలలలో పెట్టనీయరు. జాతీయనాయకుల పటములనుకూడ నచ్చట పెట్టనీయరు. జాతీయ పతాకము నచ్చటనుండి పీకివేయవలెను. లేదా మున్సిపాలిటీని రద్దుచేసెదరు. చాల రాష్ట్రప్రభుత్వములు మున్సిపలు సంస్థలనుండియు స్థానిక సంస్థలనుండియు కాంగ్రెసువారిని తరిమివేయుటకు తీవ్రప్రయత్నములు చేసినట్లు కాన్పించును. మున్సిపలువిద్య మొదలగు శాఖలకు ప్రభుత్వ గ్రాంటుల నీయమని బెదిరించి యొకవిధమగు వత్తిడినికలుగ చేసిన చాలును. వారి పనియీడేర కలదు. కొన్నిచోట్ల ముఖ్యముగా కలకత్తా కార్పొరేషనులో శాసనోల్లంఘనములోగాని ప్రభుత్వ వ్యతిరేకమైన మరేయితర రాజకీయోద్యమములలోగాని జయిలుకు పోయినవారు పనికిరారను శాసనములు కూడ చేయబడెను. దీని యుద్దేశ్యము కేవలము రాజకీయమే; అసమర్థత కాని యనర్హత కాని దీనికి కారణములుకావు.

మన మున్నిపాలిటీలును స్థానిక సంస్థలును నెంతటి స్వాతంత్ర్యము ననుభవించుచున్నవో యవియెంత ప్రజాస్వామికములో తెలుపుటకీ కొద్ది యుదాహరణములే చాలును. అన్ని మున్సిపలు, స్థానిక సంస్థల సేవ లలోను రాజకీయ ప్రతికక్షులను లేకుండ చేయు ప్రియత్నమున కర్థ మేమియో మనము కొంచెము గ్రహింప వలసి యున్నది. గత పదు నాలుగు సంవత్సరములలోను దఫదఫాలుగా మూడునందల వేలమంది జయిలుకు పోయినట్లు అంచనా వేయబడెను. రాజకీయముల నటుంచి, యీమూడువందల వేలమందిలోను భారత దేశములోని యత్యంత శక్తివంతులు, ఆదర్శ పురుషులు, సాంఘిక శ్రేయస్సు నభిలపించువారు స్వార్థరహితులు కొందరు కలరనుట నిర్వివాదాంశము. వారు చొరవ కల వారు. శక్తివంతులు. ధర్మతత్పరులు. సేవచేయవలె ననెడి యాశయము కలవారు. కనుక ప్రజాసంస్థలలోను నితర యుపయుక్తమగు సేవలలోను పనిచేయుట కిట్టివారే సర్వవిధముల సమర్థు లగుటచే వీరినే సేవకులుగ తీసికొనవలెను. అయినను వీరు వీటిలో ప్రవేశించకుండ ప్రభుత్వము సర్వప్రయత్నములను చేయుటయేగాక శాసనమును కూడ చేసి వారిని వారియెడల సానుభూతి చూపిన వారిని శిక్షించెను; అది పెంపుడు కుక్కజాతికి ప్రాధాన్యత నిచ్చుచు, దానినే ముందుకు త్రోయుచు మనస్థానిక సంస్థలు సమర్థతతో పనిచేయుట లేదని ఫిర్యాదుచేయును. రాజకీయములకు స్థానిక సంస్థలతో సంబంధము లేదని ప్రభుత్వము వారెంత యెలుగెత్తి చాటినను, తమ్ము బలపరచు కొనుటకు రాజ కీయములలో జోక్యము కల్పించు కొనుటకు ప్రభుత్వము కెట్టి యభ్యం తరమును లేదు. గ్రామములలో ప్రభుత్వము తరఫున ప్రచారము చేయ వలెనని స్థానిక బోర్డులలోని యుపాధ్యాయులు నిర్బంధింపబడిరి. లేదా వారి యుద్యోగములకు తర్పణముల నిచ్చుకొనవలెను !

గత పదిహేను వత్సరముల నుండియు కాంగ్రెసు సేవకులనేక క్లిష్టపరిస్థితుల నెదుర్కొన వలసివచ్చెను; వారు గొప్ప బాధ్యతలను

వహించిరి. శక్తివంతమై యన్ని బలములను చేకూర్చుకొనిన ప్రభుత్వ
మును కొంత జయప్రదముగ వారెదిర్చిరి. ఈ కఠిన శిక్షావిధానము
వారి కాత్మవిశ్వాసమును, సమర్థతను, చిరకాలము తాళగల శక్తిని
ప్రసాదించెను. చాల కాలమునుండి పెత్తనమును వెలిగించుచు నిర్వీర్య
మొనర్చుచుండిన ప్రభుత్వ విధానము భారత ప్రజలకే గుణ
గణములు, శక్తి సంపదలు లేకుండచేసెనో వాటినిది ప్రసాదించెను.
(ఈ కాంగ్రెసు యుద్యమములోకూడ నన్ని ప్రజాసంబంధ యుద్యమము
లలోవలె చాలమంది మూర్ఖులు, అసమర్థులు, అయోగ్యులు, యింకను
అధములు లేకపోలేదు. అట్టివారింకను ఉన్నారు. కానియొకే యర్హ
తలు గలిగిన మరయొకనికంటె సామాన్య కాంగ్రెసు సేవకుడు
యెక్కువ సమర్థుడు శక్తివంతుడు యనిచెప్పుటకు నాకెట్టి సందేహ
మునులేదు.) ఈసందర్భములో ప్రభుత్వము వారును వారిసలహా దారు
లును గుర్తించని మరియొక విషయము కలదు. కాంగ్రెసు సేవకుల
కెట్టి యుద్యోగములుకాని యెట్టినౌకరీ యవకాశములుగాని లేకుండ
చేయు ప్రయత్నమును యధార్థమైన విప్లవకారుడాహ్వానము
చేయును. సామాన్య కాంగ్రెసువాడి యెంతమాత్రమును విప్లవకారుడు
కాడు. అతడు కొంతకాల మర్ధ-విప్లవ ప్రయత్నము చేసిన తరువాత
తననిత్య జీవిత కలాపము లోనికి దిగిపోవును. అతడు తన వర్తకము
లోనో వృత్తిలోనో స్థానిక రాజకీయ గజబిజిలలోనో జిక్కుకొని
పోవును. అతని దృష్టిలో పెద్దసమస్య లన్నియు మాసిపోవును; అతని
కుండిన విప్లవతృష్ణ నశించును. కండరములు క్రొవ్వెక్కును. ఉత్సా
హము సన్నగిలి కడుపులోనీళ్లు కదలని పద్ధతిని వాంఛించును. కను
కనే విప్లవ తత్త్వముగల కాంగ్రెసువాదులు తమతోడి వారెన్నడును
శాసన సభలలోనికిని స్థానిక బోర్డులలోనికిని పోకుండగను నౌకరీలను
వాంఛింపకుండగను చేయ ప్రయత్నించెదరు. ప్రభుత్వము వారిప్పు
డిట్లు చేసివారి ప్రయత్నములకు కొంత సాయపడు చున్నారు. ఏలనన

నౌకరీ దొరకక పోయినచో కాంగ్రెసు సేవకుని విప్లవతృష్ణ కొంత యైనను నిలుచును లేదా మరింత యభివృద్ధిచెందును.

ఒక సంవత్సరము మున్సిపలు పనితో నేను విసిగితిని. అచ్చట నేను నాశక్తినంతను చక్కగా వినియోగించనట్లు భావించితిని. నేను పనిని చురుకు చేయగలిగితిని. కొంత సమర్థతయు హెచ్చెను. నేను యోగ్యమైన మార్పును దేనిని చేయజాలక పోతిని. చివరకునేను రెండేండ్లు పూర్తియగుట తోడనే 1925 లో రాజీనామా యిచ్చితిని. ఈసంవత్సరమే శరత్కాలములో నాభార్యకు చాలజబ్బుచేసెను. ఆమె యనేక మాసములు లక్నో ఆస్పత్రిలో నుండెను. ఆసంవత్సరము కాంగ్రెసు కాన్పూరులో జరిగెను. నేను అలహాబాదు కాన్పూరు లక్నోల మధ్య (నేనింకను కాంగ్రెసు కార్యదర్శిగనే యుంటిని) తఱచు పరుగిడ వలసి వచ్చెను. నాభార్యకు స్విట్జరులండులో మరికొంత వైద్యము చేయించ వలెననిరి. నేను సంతోషించితిని. భారతదేశమును వీడిపోవుటకేదైనను వీలు దొరుకునా యనినేను చూచుచుంటిని. నామనసు చాల చికాకుగా నుండెను. నాకేదియు స్పష్టమైన మార్గము కాన్పించ కుండెను; నేను భారత దేశమునకు చాలదూరములో నున్నచో నచ్చటనుండి విషయములను నిస్పష్టముగా చూడ గలుగుదునని యనుకొంటిని. 1926 మార్చి మొదటి వారములో నేనును నాభార్యయు కుమార్తెయు బొంబాయినుండి వెనీసు పయన మైతిమి.

## ౨౧

### యూరపులో.



పదమూడు సంవత్సరము లైనతరువాత నేను తిరిగి యూరపు వెళ్ళితిని. ఈపదమూడేండ్లు యుద్ధము, విప్లవము, అద్భుతమైన మార్పు- వీటితో నిండియుండెను. నాకు తెలిసిన పాతప్రపంచ మంతయు యుద్ధము వలన కలిగిన రక్తస్రావములోను, భీతాంగములోను నశించెను. ఒక క్రొత్త ప్రపంచము తయారయ్యెను. మేమచ్చట సంవత్సరము తొమ్మిది మాసము లుంటిమి.

నాకచ్చట శరీర మనశ్శాంతులు కుదిరెను. నాచెల్లెండ్రిద్దరును కూడ మాతోనుండిరి. నేనప్పుడప్పుడితర ప్రాంతములకు పోవుచుండెడివాడను. పర్వత శిఖరములమీద నున్నపుడు నాకును హిందూదేశముకును ఐరోపా ప్రపంచమునకునుకూడ సంబంధములేక యుండెను.

కాని మొత్తముమీద జీవితము నిస్సారముగ నుండెను. నాభార్య యారోగ్య బలములు వృద్ధియయ్యెను. మాకు భారతీయులంతగా కాన్పించెడి వారుకారు. అచ్చటచ్చట భారత దేశమునుండి బహిష్కరింప బడినవారును, పాత విప్లవ కారులును కాన్పించెడివారు.

జనీవాలో శ్యామజీ క్రిష్ణవర్మ వ్యాధిగ్రస్తురాలైన తనభార్యతో నొక మేడమీద నుండెడివాడు. ఆవృద్ధ దంపతులు నౌకరు లెవరును లేకుండ తమంత తామే కాలక్షేపము చేసెడివారు. అతనియొద్ద చాల ధనమున్నను ఖర్చుచేయక పైసమిగిలినను చాలునని ట్రాముబండి నెక్కుటకు బదులు నడిచి పోయెడి వాడు. అతని యింట నేల, గదులు, బీరువాలు, పుస్తకములు సమస్తము దుమ్ముతోను ధూళితోను నిండియుండెడివి. పుస్తకములు కాగితములు నేలమీద చిమ్మివేయబడి యుండును.



స్వరూపరాణి నెహ్రూ.

200A

శ్యామజీ విదేశములలో చదువుకొను భారతీయుల కొరకు తన ధనమును వినియోగింప నెంచి దానికి నన్నొక ధర్మకర్తగ నుండవలె ననెను. నేనట్టి బాధ్యతను పెట్టుకొనుట కిష్టపడలేదు. నేనొకవేళ శ్రద్ధ చూపినచో నేనతని ధనము నాశించుచున్నానని యతడనుమాన పడునని నాభయము. అతనివద్ద నేమున్నదియు నెవరికిని తెలియదు. భారతదేశమునుండి యప్పుడప్పుడు ప్రధాన భారతీయులే జనీవా వచ్చుచుండిరి. శ్యామజీ యధికార వాసన కలవారినెవరిని సమీపించడు. అధికారులు వచ్చినప్పుడతడు వారితో చర్చించుచుండును. కాని వారతనితో బహిరంగముగా కలియుటకును మాట్లాడుటకును యిష్టపడక రహస్యముగా క్షమార్పణ చెప్పుకొనెడివారు. అతనితోడి సంపర్కము ప్రమాదకరమని తలంపబడుచుండెడిది.

కనుక శ్యామజీయు, నతనిభార్యయు బిడ్డలుకాని, బంధువులు కాని, స్నేహితులుకాని, పరిచయులుకాని, తుదకెట్టిమానవ సంపర్కము కాని లేకుండ నొంటరిగనే జీవించెడివారు. అతడు పూర్వ సాంప్రదాయముకు చెందిన వాడగుటచే నతని రోజులు గతించెను. కాని యతని నేత్రములలో నింకను పాత యగ్నికణములు కొన్ని లేకపోలేదు. మా యిరువురకును సామ్య మెంతమాత్రము లేకపోయినను నాకతనియెడల సానుభూతియు, గౌరవమును కలవు. ఈ వృద్ధదంపతులిరువురు నొకరి తరువాత నొకరు యీ మధ్యనే చనిపోయిరని వార్తాపత్రికలు తెలుపుచున్నవి. భారతనారీమణులకు విదేశములలో శిక్షనొసగుట కతని భార్య చాలధనము నిచ్చెనట.

స్విట్జరు లండులో నేను రాజా మహేంద్రప్రతాపును చూచితిని. ఇతడు మంచియుత్సాహ పరుడు. ఇతడెప్పుడును యధార్థ విషయములను గమనింపక గాలిమేడలలో నివసించును. ఇతడొక చిత్రమైన మనిషి. ఇతని దుస్తులు, మిలిటరీ వేషము, రష్యనుజోళ్లు, పెద్దపెద్ద జేబులు;

ఆజేబులనిండ కాగితములు, బొమ్మలు, ఉత్తరములు, డాక్యుమెంటులు- అన్నియు వింతగా నుండును. ఒకసారి చీనా దేశములో నతని విలువ యైన కాగితములపెట్టె పోయెనట. కనుక నప్పటినుంచియు నతడా పెద్ద జేబులలోనే సమస్తమును తీసికొనిపోవునట! అతడు చీనా జపాను టిబెట్టు ఆఫ్గనిస్థానము మొదలగు దేశములలో సంచారమొనర్చెను. అతని సంచారములను గురించి సాహసకృత్యములను గురించి యనేక చిత్ర విచిత్ర కథల నతడు చెప్పెడివాడు. అతడు 'ఆనందసంఘము' అను నొక సంఘమును స్థాపించెను. 'ఆనందములో నోలలాడుము' అనునదియే దానిలక్ష్యము. ఈ సంఘముకు లట్వియా (లేక లిథుయానియా?) లో నఖండ విజయము చేకూరెను.

ప్యారిసునగరములో మేము వృద్ధ కామాదొరసానిని చూచితిమి. ఆమె చఱచఱమీదకువచ్చి వ్రేలుచూపుచు, నతితీక్షణముగా చూచుచు హఠాత్తుగా నీవెవ్వరవని యడుగునపు డతి భయంకరముగ నుండును.

తరువాత ఇటలీలో నేను మహాల్వీ ఒబేదుల్లాను కలుసుకొంటిని. అతడు తెలివైనవాడేకాని, పాతరకపు రాజకీయ యెత్తులలో నారి తేరినవాడు. ఆధునిక భావములతో నతనికెట్టి సంపర్కమును లేదు. అతడు 'భారత సంయుక్త ప్రజాస్వామికములు' అనునొక ప్రణాళికను వ్రాసెను. అది కులసమస్యలను పరిష్కరించుట కొక యోగ్యమైన ప్రయత్నము. బర్కతుల్లా మరియొక మహాల్వీ. అతనిని నేను మొదట బెర్లినులో కలుసుకొంటిని. అతడత్యుత్సాహవంతుడు; ప్రసన్నవదనుడు; వృద్ధుడైనను సంతోషముతో నుప్పొంగుచుండెడివాడు. అతడు నిరాడంబరుడు; అంత తెలివియైనవాడు కాకపోయినను నూతన భావముల నలవఱచుకొనుటకును, ఆధునిక ప్రపంచము నర్థము చేసికొనుటకును ప్రయత్నించెడివాడు. అతడు 1927 లో స్యాన్‌ఫ్రాన్సిస్కోలో చనిపోయెనని విని నేను చాల విచారించితిని.

బెర్లినులో యుద్ధసమయములో భారతీయులందరు కలసి యొక సంఘముగా నేర్పడిరి; వీరికథ వినదగినది. వీరిలో చాలమంది వివిధ జర్మను విశ్వవిద్యాలయములలో 1914 వ సంవత్సరములో విద్యార్థులుగా నుండెడివారు. వీరు జర్మను విద్యార్థులతో సమానముగా నాడుకొనుచు, పాడుకొనుచు వారి విజ్ఞానముపట్ల గౌరవ, మర్యాదలను చూపెడివారు. యుద్ధముతో వీరికెట్టి సంబంధమును లేకపోయినను జర్మనీలో బయలుదేరిన జాతీయావేశము వీరినికూడ కొంతవరకు కదల్చెను. వారు బ్రిటనుకు వ్యతిరేకులే కాని జర్మనీకి సుముఖులుకారు. వారి భారత జాతీయతచే బ్రిటిషువారి శత్రువులు వారి కాప్తులైరి. బుద్ధిపూర్వకముగా విప్లవకారులైన భారతీయులు కొందరు యుద్ధసమయములో స్విట్జర్లండు ద్వారా జర్మనీ వచ్చిరి. వీరొక సంఘముగా నేర్పడి యమెరికాలోనున్న హరదయాలును రప్పించిరి. ఇంతలో బ్రిటిషువారికి వ్యతిరేకముగా నున్నవారి నందరిని తమవైపునకు త్రిప్పుకొనవలెనను నుద్దేశ్యముతో జర్మను ప్రభుత్వము యీసంఘమునకు ప్రాధాన్యత నిచ్చెను. భారతీయు లీయంతర్జాతీయ పరిస్థితులను తమ జాతీయ ప్రయోజనములకు వినియోగింపనెంచి జర్మను ప్రభుత్వముతో బేరములు చేయనారంభించిరి; భారతదేశమునకు స్వాతంత్ర్యము నిచ్చెదమను నభయహస్తమును ప్రమాణపత్రములను కోరిరి. జయముచేకూరినచో భారతదేశమునకు స్వాతంత్ర్యము నిచ్చెదమను షరతుతో జర్మను విదేశరాజ్యాంగ శాఖవారు వీరితో క్రమమైన సంధి చేసికొనినట్లు కాన్పించును. ఈ షరతుతోను మరికొన్ని చిల్లర షరతులతోను భారత సంఘమువారు యుద్ధములో జర్మనీకి సహాయము చేయుట కొప్పుకొనిరి. ఈసంఘముపట్ల నన్నివిధములైన యధికారమర్యాదలును చూపబడెను; దీని ప్రతినిధులను విదేశ రాయబారులవలెనే గౌరవించిరి.

అప్రయత్నముగా మీదపడిన యీ యాకస్మిక ప్రాముఖ్యత వలన వీరిలో (అనుభవములేని యువకు లెందరో యీ సంఘములో నుండిరి.) కొందరి బుఱ్ఱలు తిరిగిపోయెను. చరిత్రాత్మకమైన పాత్రలను ధరించుచున్నట్లును, నూతనశక నిర్మాణ కృత్యములలో మగ్నులయి పోయినట్లును వీరు భావించెడివారు. వీరిలో చాలమంది యద్భుత సాహస కార్యములను చేసిరి; కొంతమంది మృత్యువాతనుండి బయట పడిరి. యుద్ధావసాన కాలమున వీరి ప్రాముఖ్యత తగ్గిపోయెను. హారదయాలును యీ సంఘమువారును, జర్మను ప్రభుత్వమునుకూడ విశ్వసింపలేదు.

యుద్ధము ముగిసెను. దానితో బెర్లినులోని భారత సంఘము కూడ నంతమొందెను. వారి యాశలన్నియు నడియాస లగుటచే వారి జీవితములు దుర్భరముగ నుండెను. వారు పెద్దయెత్తులనెత్తి విఫల మనోరథు లయిరి. యుద్ధకాలములోని యాసాహసము, ఆ ప్రాముఖ్యత ముందర జీవిత మిపుడు పేలవ మయ్యెను. కాని, యీ పేలవ జీవిత ముకు కూడ వారు నోచికొన్నవారైరి! వారు భారత దేశమునకా తిరిగి రాలేరు! యుద్ధములో దెబ్బతినిన జర్మనీలో జీవించుటంత చులకని విష యముకాదు. తరువాత కొద్దిమందిని భారత దేశముకు రానిచ్చిరి; కాని చాలమంది జర్మనీలోనే యుండవలసివచ్చెను. వారిస్థితి కడు శోచనీ యము. వారేరాజ్యముకును చెందని ప్రజలైరి; వారికి క్రమమైన ప్రయాణ టికెట్లు లేవు; వారు జర్మనీదాటి బయటకు పోజాలగు; జర్మ నీలో జీవించుట యమలోకములో జీవించుటవలె నుండెను; వారు స్థానికపోలీసుల దయాధర్మ బిచ్చములకు పాత్రులైరి! ఒకప్రక్క కష్టములు, రక్షణ లేకపోవుట. మరియొక వంక నన్నమో రామచంద్రా యనిపొట్ట చేత బట్టుకొని పోవుట! ఇది వారి స్థితి.

1933 లో నాజీ ప్రభుత్వము వచ్చినతరువాత, నాజీ సిద్ధాంత మును పూర్తిగా నంగీకరించిననే తప్ప, వారికష్టములు ద్విగుణమగు

చుండెను. జర్మనీలో నాసియా దేశపు విదేశస్థులయెడల నేనగింపుకలదు. బుద్ధిమంతులుగా నున్నంతసేపు వారినచ్చట నుండనిత్తురు. హిట్లరు హిందూదేశములో బ్రిటిషు సామ్రాజ్య పరిపాలన యుండవలె ననియే యనేకసార్లు వచించెను. కనుక బ్రిటిషు ప్రభుత్వమువారి యాగ్రహము నకు గురియైన భారతీయులను హిట్లరు ప్రోత్సహింప నొల్లడు.

చంపాకరామణ పిళ్ళయను నతనిని నేను బెర్లినులో కలుసు కొంటిని. ఇతడు మరియొక ప్రవాసి; ఆడంబరుడు. కనుక భారత విద్యార్థు లితని కమర్యాదయైన బిరుదు నిచ్చిరి. ఇతనికి జాతీయత యొక్కటియే యర్థమగును. ఇత డే సమస్యను సాంఘికముగను ఆర్థిక ముగను గ్రహింపజాలడు. జర్మను జాతీయ వాదులతో నితడెంత మాత్రము నెరమరిక లేక యుండెడివాడు. ఇతడు బెర్లినులో చని పోయెనని కొద్దినెలలక్రిందట నేను జయిలులో నుండగా వింటిని.

వీరేంద్రనాథ చటోపాధ్యాయుడు కేవలము భిన్నమైన తరగతికి చెందిన పురుషుడు. ఇతడు భారతదేశములో ప్రసిద్ధికెక్కిన వంశము లోనివాడు. ఇతని నందరును చటో యనిపిలిచెడివారు. ఇతడు మంచి సమర్థుడు; నిత్యసంతోషి; ఇతడెప్పుడును డబ్బుకు బాధపడెడి వాడు; బట్టలుచినిగి యుండెడివి; తిండి కెప్పుడును తడవు కొనవలసి వచ్చెడిది. అయినను నతని హాస్యము, హుషారు అతని నెన్నడును విడువ కుండెను. నేను యింగ్లండులో చదువుకొను రోజులలో నాకంటె నతడు కొన్నియేండ్లు పెద్ద. నేను హారో వెళ్ళినపు డతడు ఆక్సుఫర్డులో నుండెను. నాటినుండి యతడెప్పుడును భారతదేశము రాలేదు. ఒక్కొక్కప్పుడు స్వదేశమునకు పోవలెననెడి బెంగ యతనిని బాధించెడిది; చిరకాలము క్రిందటనే యతడు తన గృహ పాశముల నన్నింటిని తెంపివేసెను; హిందూదేశము వచ్చినను అతనికి సంతోష ముండనేరదనుట నిశ్చ యము, ఆహా! చాల సంవత్సరములు గతించినను, చాల దేశములు

తిరిగినను స్వదేశ గమనోత్కంఠ యెంతటి బలీయమైనది. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ'. ఈవ్యాధి ఈ యాత్మదాహము (మేజనీ యనినట్లు) యేప్రవాసికి తప్పెను ?

నేను విదేశములలో కలుసుకొనిన భారతరాజకీయ ప్రవాసుల త్యాగ, సాహసములను, దుర్భర బాధలను ప్రస్తుత యధార్థకష్టములను పూర్తిగా గ్రహించితిని. అయినను వారిలో చాలమంది నాకంతగా నచ్చలేదు. నేను వారి నెందరినో కలుసుకొనలేదు. వారు ప్రపంచ మంతటను వెదజల్లబడి యున్నారు. పేరు ప్రతిష్ఠలున్నవారి నేకొద్దిమందినో మన మెరుగుదుము. తక్కినవారు భారత ప్రపంచము నుండి మృగ్యమై వారు సేవింప నెంచిన భారతీయుల చేతనే విస్మరింపబడిరి. నేను కలుసుకొనిన కొద్దిమందిలోను చటోపాధ్యాయ, యం. యన్. రాయి లిరువురే తమ బుద్ధిబలముచే నన్ను మెప్పించిరి. రాయిని నేను మాస్కోపట్టణములో నొక్క యరగంటసేపు కలుసు కొంటిని. అప్పుడతడు కమ్యూనిష్టు నాయకుడు. ఇప్పుడతని కమ్యూనిజము సనాతన కామింటరన్ జాతినుండి దిగిపోయెను. చటో, కొంచెము వాసనయున్నను, క్రమమైన కమ్యూనిస్టు కాడు; రాయి యిప్పటికి మూడువత్సరములకుపైగా భారతదేశ జయిలులో నున్నాడు. మేము చాలమంది యూరపియనులను అమెరికనులను కలుసు కొంటిమి.

విఖ్యాత పురుషుడైన రోమారోలాను చూచుటకు మే మనేకసార్లు జనీవానుండి ప్రశాంతమైన ఆల్గాసీమకు యాత్రలు చేసితిమి. మొదటి సారి గాంధీజీ దగ్గిరనుండి పరిచయ లేఖను తీసికొని వెళ్లితిని. జర్మనీదేశపు యువకకవి, నాటక రచయిత యగు అర్నస్టు టోలరును మరువ జాలను. నాజీప్రభుత్వములో నిప్పుడతడు జర్మను కాడు. న్యూయార్కు యొక్క నాగరిక స్వాతంత్ర్య సంఘముకు చెందిన రోజరు

బాల్డ్విను కూడ స్మరణీయుడు. అమెరికాలో స్థిరపడిన, గ్రంథకర్త, ధన గోపాల ముఖర్జీతో జనీవాలో స్నేహము చేసికొంటిమి.

యూరపు వెళ్ళుటకు ముందు హిందూదేశములో ఆక్స్‌ఫర్డు-గ్రూపు-మూవ్మెంటుకు చెందిన, ఫ్రాంకు బుక్మనును కలుసు కొంటిని. అతడు తన యుద్యమమును గురించిన సాహిత్యమును కొంత నాకిచ్చెను. నేను దాని నాశ్చర్యముతో చదివితిని. అకస్మాత్తుగా మతమును మార్చుట, తప్పిదముల నొప్పుకొనుట, తిరగి యుద్ధరింప బడిరనుట; బుద్ధి బల సంపల్లక్షణము కానట్లు నాకుతోచెను. బుద్ధిమంతులుగా కాన్పించు కొందరు వ్యక్తులవింత యుద్రేకముల నెట్లనుభవింప గలరో నాకర్థము కాలేదు. నా కుతూహలము హెచ్చెను. జనీవాలో నేను బుక్మనును తిరిగి కలుసు కొంటిని. అతడు నన్ను తన అంతర్జాతీయ గృహవిందులలో నొకదానికి రమ్మనెను. ఇది రోమేనియాలో నెచ్చటనో యుండెను. ఈ నూతన భావోద్రేకమును నేను దగ్గిరనుండి చూడజాలక పోయినందులకు విచారించితిని. నా కుతూహలము శాంతింప దయ్యెను. ఈ ఆక్స్‌ఫర్డు గ్రూపు మూవ్మెంటు యొక్క యభివృద్ధిని గురించి నేను చదివిన కొలది నా యాశ్చర్య మధిక మగుచుండెను.

౨౨

## భారతదేశములో వివాదములు.



మేము స్విట్జరులండు జేరుట తోడనే యింగ్లండులో పనివాండ్రిందరును సమ్మెకట్టు కట్టిరి. నాకు చాల యుద్రేకము కలిగెను. నా యభిమాన మంతయు సమ్మెకట్టుదారుల పయిననే యుండెను. కొద్ది రోజులలోనే యీసమ్మె యంతరించె ననువార్త వ్యక్తిగతముగా నాకొక దెబ్బవలె నుండెను. కొన్ని నెలలయిన తరువాత నేను యింగ్లండులో కొద్దిరోజులుంటిని. గనులలో పనిచేయు వారింకను పోరుచుండిరి. రాత్రిలందు లండను అంధకార బంధురమయ్యెను. గనులు త్రివ్వు ప్రాంతముకు నేను వెళ్ళితిని. బక్క పేగులు, లోతుకళ్ళు, బిక్క మొగములు కల స్త్రీలను, పురుషులను, బిడ్డలను నేను చూచితిని.

ఇంకొక యాశ్చర్య మేమనగా నీ సమ్మెకట్టు దారులను, వారి భార్యలను స్థానిక కౌంటీ కోర్టులలో విచారణ చేయుచుండిరి. విచారణచేయు మేజస్ట్రేటులు యీబొగ్గు గనులకు డైరెక్టర్లుగనో లేక మేనేజర్లుగనో యుండిరి. వారు విచారణసలిపి యత్యవసర శాసనముల క్రింద వీరిని చిన్నచిన్న నేరములకు శిక్షించుచుండిరి. ఒక కేసు, ముఖ్యముగా, నాకమిత కోపమును కలిగించెను. తమతో సమ్మెకట్టని వారిని వెక్కిరించిరని, యొడిలో బిడ్డలుగల ముగ్గురు నలుగురు స్త్రీలను ముద్దాయిబోనులోనికి రప్పించి విచారణచేయ నారంభించిరి. ఆ యువ తీమతల్లులును, (వారిశిశువులును) దుఃఖ భాజనులై, తగిన పోషణ లేకయుండిరి. దీర్ఘపోరాటము వారి యారోగ్యమును నాశముచేసెను. వారుకృశించి, శల్యములవలెనుండిరి. తమ నోటిదగ్గర యన్నమును పడగొట్టు చున్నారని సమ్మెకట్టని వారిపై వారికి ద్వేషము హెచ్చు

చుండెను. పై తరగతుల వారు క్రింది తరగతుల వారికెట్టి న్యాయమును కలిగింతురో మనము తెలుచు వినుచునే యుందుము. హిందూదేశములో నింతకంటె సామాన్యమైనది వేరొకటి యుండబోదు. కాని యింగ్లండులో నిట్టి దారుణ సాదృశ్యము లుండునని నేనను కొనలేదు. అది నాకొక యశని పాతము వలెనుండెను. ఈసమ్మెకట్టు దారులలో కలిగిన భీతి నా కాశ్చర్యమును కలిగించెను. పోలీసులు, అధికారులు వారి నమితముగా భయపెట్టిరి. వారనేక నైచ్యములను నోరెత్తకుండ సహించిరి. చిర పోరాటము వలన వారలసి పోయిరనుటలో సందేహములేదు. వారియుత్సాహము వెన్నువిరిగి యుండెను. వారితో సమ్మెకట్టిన యితర సంఘములవారు చాలకాలము క్రిందటనే వారిని విడిచిపెట్టిరి. అయినను భారత దేశములోని దరిద్ర కార్మికులకును వీరికిని హస్తిమశకాంతరము కలదు. బ్రిటిషు బొగ్గు గనుల పనివారల కొక కట్టుదిట్టమైన సంఘము కలదు; జాతినంతను, లేక ప్రపంచమునంతను యావరించిన కార్మిక సంఘ యుద్యమాభిమానము కలదు; వారికి కష్టముల వార్తలను ప్రకటించు సమవాయములు కలవు; ఇతరవిధములైన సౌకర్యము లెన్నియో కలవు. భారత కార్మికున కివి యేవియును లేవు. కాని, వారిద్దరిలోను కాన్పించు ఆబిక్కచూపులో, నా భయవిహ్వలతలో నెంతయో సాదృశ్యము కలదు.

ఆ సంవత్సరము శాసనసభలకును అసెంబ్లీసభకును భారత దేశములో నెన్నికలు జరుగుచుండెను. వాటియందు నాకంత శ్రద్ధ లేదు కాని, నేను స్విట్జరులండులో నుండగా వాటిని గురించి జరుగుచుండిన కొన్ని భయంకరవివాదములు నాకు వినవచ్చెడివి. శాసనసభలలోనున్న స్వరాజ్యపార్టీలేక క్రమమైన కాంగ్రెసు పార్టీని యెదిరించుటకు పండిత మదనమోహన మాలవ్య, లాలాలజపతిరాయిగార్లు, యొకానొకవిధమున జాతీయ పక్షమను నొక నూతన పక్ష మేర్పడెను. పాత పార్టీకిని యీపార్టీకిని

గల సూత్ర భేదములేవియో నాకప్పుడును, యిప్పటికిని తెలియకున్నవి. నిశ్చయముగా శాసన సభలలోని ప్రస్తుత భారతపార్టీ లన్నియును అల్లిబిల్లి పార్టీలేకాని మరియొకటి కాదు; వాటిని భేదించు నిజమైన సూత్రము లేవియు లేవు. మొట్ట మొదటసారి స్వరాజ్యపార్టీ శాసన సభలలోని కొక నూతనమైన తీవ్రోత్సాహమును ప్రవేశపెట్టెను. అది యితర పార్టీలకంటె నెక్కువ తీవ్ర రాజనీతి నవలంబించెను. కాని, యిది కేవల మోతాదు భేదముకాని జాతిభేదముకాదు.

ఈ నూతన జాతీయ పార్టీ మరికొంత మితవాదదృష్టి కలిగి, స్వరాజ్య పార్టీకంటె నిశ్చయముగా ప్రభుత్వమువైపు మొగ్గెను. అది హిందూ మహాసభతో నెక్కువగా కలిసి పనిచేయుచున్న పద హారణాల హిందూపార్టీగ కూడ నుండెను. మాలవ్య పండితుడు దానికి నాయకు డగుట యర్థమగుచునే యున్నది. ఏలనన అది కొంచె మించుమించు అతని ప్రజాదృష్టినే వ్యక్తము చేయుచుండెను. అతడు తనపాత స్నేహములచేతనే కాంగ్రెసులో నుండెను. కాని యతనికిని లిబరలు లేక మితవాదులకును బుద్ధిభేద మేమియును లేదు. అతడు సహాయ నిరాకరణోద్యమమును చేబట్టలేదు. కాంగ్రెసుయొక్క ప్రత్యక్ష కార్యవిధానమును అంగీకరింపలేదు. కాంగ్రెసు నీతిని నిరూ పించుటలో నతనికెట్టి సంబంధమును లేదు. నూతన కాంగ్రెసు అతని నెప్పుడును గౌరవించును. ఆహ్వానముచేయును; కాని, యతడు నిజ ముగా నందులోని వాడుకాడు. అతడు వర్కింగు కమిటీ సభ్యుడుకాడు. అతడు కాంగ్రెసు ఆజ్ఞలను, ముఖ్యముగా శాసన సభలకు చెందిన వాటిని, శిరసా వహింపలేదు. అతడు హిందూ మహాసభయొక్క సుప్ర సిద్ధ నాయకుడు. కుల సమస్యలలో నతని నీతికిని కాంగ్రెసు నీతికిని భేదము కలదు. అతనికి మొట్టమొదటి నుంచియు కాంగ్రెసుతో సంబంధ ముండుటచే నా సంస్థయందుకల మమకారము వీడకుండెను;

స్వాతంత్ర్య యుద్ధ సమయమున కాంగ్రెసు ఒక్కటే దీనికొరకే కొద్ది ప్రయోజన కరకార్యమునైన చేయుచున్నట్లతడు గ్రహించెను. భావో ద్రేక మతనిని కొంత కాంగ్రెసువైపు లాగును. ఈవిధముగా నతని హృదయము తఱచు కాంగ్రెసు డేరాలలో (ముఖ్యముగా యుద్ధ సమ యములలో) నుండును; అతని శిరము యితర చోట్లనుండును. విధాయి కముగా నీస్థితి యతనిలో నిరంతర సంఘర్షణను తెచ్చిపెట్టుచుండెను; అప్పుడప్పుడొకేసారి రెండు వైపులకును పోవు ప్రయత్నముండెడిది. ఇది ప్రజలను కలవర పరచుచుండెను; కాని జాతీయత యొక కలగూర గంప. మాలవ్యాజీ కేవలజాతీయవాది; అతనికి సాంఘిక, ఆర్థిక మార్పులతో నెంతమాత్రము సంబంధములేదు. అతడు ఆర్థిక, సాంఘిక వైజ్ఞానికములన్నింటిలోను పాతసనాతనక్రమమునేసమర్థించెను; ఇంకను సమర్థించును. భారత రాకుమారులు, తాలూకుదార్లు, పెద్దజమిందార్లు అతనిని తమ హితముకోరు మిత్రునివలెచూతురు. ఇదియుక్తమే! భారత దేశములో విదేశీయుల యధికార మెంతమాత్రమును లేకపోవు టొక్కటియే యతనికి కావలసినమార్పు. అతడెప్పుడో తనచిన్న తనములో చదువుకొన్నట్టియు, పొందినట్టియు రాజకీయచదువు రాజ కీయ శిక్షణము నతని బుద్ధినింకను పట్టియుండెను. విప్లవయుతము, శక్తి వంతము నగునీయుద్ధానంతర యిరువదవ శతాబ్దము నతడు టి. హెచ్. గ్రీన్, జాన్ స్టుయర్టుమిల్లు, గ్లాడ్ స్టను, మోర్లే మొదలగువారి పందొమ్మిదవ శతాబ్దపు టర్థస్థావర దృష్టితోను, మూడు, నాలుగువేల యేండ్లనాటి పాతహిందూ విజ్ఞాన సాంఘిక శాస్త్రదృష్టితోను చూచును. ఇది పర స్పర విరుద్ధభరితమగు అద్భుతమైన కలయిక; కాని యీ పరస్పర విరుద్ధముల నన్నింటిని సమన్వయ పరచగల తనశక్తి యందతని కద్భు తమైన విశ్వాసము కలదు. చిన్న వయసు నుండియు ననేకరంగములలో నతడు గావించుచు వచ్చిన చిరకాల ప్రజాసేవక చరిత్రయు, కాశీ హిందూ విశ్వవిద్యాలయము వంటి మహాసంస్థను జయప్రదముగ

స్థాపించుటయు, అతని నిష్కళంకమైన శ్రద్ధ, నిష్కాపట్యత, మనోజ్ఞమగు నకృత్రిమత్వము, సాధుస్వభావము, ప్రసన్నమగు రూపరేఖాదులు- ఈ యన్నింటిచే నతడు భారతప్రజలచే, ముఖ్యముగా హిందువులచే ప్రేమింపబడుచున్నాడు. రాజకీయములలో నతనితో నేకీభవింపక పోయినను, లేక ననుసరింపక పోయినను వారతనిని గౌరవింతురు, ప్రేమింతురు. వయసుచేతను, చిరప్రజాసేవ చేతను, అతడు భారత రాజకీయ భీష్ముడు; (నెస్టరు) కాని, యీ భీష్ముడు కొంచెము పూర్వకాలపు మనిషివలె కాన్పించును; ఇతని కాధునిక ప్రపంచముతో నెంతమాత్రమును సంబంధములేదు. అతని కంఠధ్వని శ్రావ్యముగనుండును; కాని, చాలమంది కతనిభాష యర్థముకాదు, లేదా వారు దానిని పెడ చెవిని బెట్టుదురు.

మాలవ్యాజీ రాజకీయముగ తనకంటె చాల యభివృద్ధిచెంది కాంగ్రెసు నీతికి కట్టుపడవలసిన శిక్షను కోరెడి స్వరాజ్య పార్టీలో చేరజాలక పోవుట సహజము. అతనికి కొంత తక్కువ తీవ్రత గలిగినట్టిదియు, వ్యక్తిగతముగ నెక్కువ స్వేచ్ఛనిచ్చునట్టిదియు నగు పార్టీ కావలెను. నూతన పార్టీలో నతని కివి దొరికెను. దానికతడే విధాత, యతడే నాయకుడు.

లాలా లజపతిరాయికిని కొంత మితవాద దృష్టియు, కుల సమస్యలలో కొంతభేద భావము నున్నను అతడీ నూతన పార్టీలో నెట్లు చేరెనో తెలిసికొను టంత తేలికకాదు. ఆ వేసవిలో నేను లాలాజీని జినీవాలో కలుసు కొంటిని; మా సంభాషణల వలన నతనికి కాంగ్రెసు పార్టీపై నెదురు తిరుగు నుద్దేశమున్నట్లు నేను కనుగొననైతిని. ఇది యెట్లు సంభవించెనో నాకిప్పటికిని తెలియదు. కాని యెన్నికలు జరుగుచున్న కాలములో నతడు కొన్ని యవ్యక్తమైన నిందల నారోపించెను. వీటిద్వారా యతనిమనసు యెట్లు పనిచేయుచున్నదియు మనకు తెలియ

గలదు. కాంగ్రెసునాయకులు భారతేతరులతో కుట్రలు పన్నుచున్నా రనియు, కాబూలులో కాంగ్రెసుశాఖను నిర్మించు టిట్టిదేయనియు నతడు నిందించెను. అనేకసారులు కోరినను అతడు తననిందల నెప్పుడును నిరూపించలేదు; వివరములను తెలుపనులేదు.

లాలాజీ చేసిన నిందలను నేను స్విట్జరులండులో పత్రికలద్వారా తెలిసికొని యాశ్చర్యపడితిని. కాంగ్రెసు కార్యదర్శిని కనుక నాకు మాసంస్థసంగతి యంతయు తెలియును. కాబూలుకమిటీని కాంగ్రెసు క్రింద తీసికొనుటకు నేనే కారకుడను. (ఈ విషయములో దేశబంధు దాసు జోక్యము కలిగించుకొనెను.) అప్పుడు నాకా నిందలలోని వివరములు తెలియకపోయినను, వాటి స్వభావమునుబట్టి కాంగ్రెసుకు సంబంధించినంతవరకు వాటి కాధారములేవియు లేవని నేను చెప్పంగలను. ఇందులో లాలాజీ యెట్లు మభ్యపడెనో నాకు తెలియదు. అతడనేక వదంతులపై నాధారపడి యుండవలెను. ఈమధ్య నతడు మౌల్వీ ఒబేదుల్లాతో చేసిన సంభాషణ దీనికి కారణమగునేమొ! కాని యీసంభాషణలో నా కసామాన్యమైన దేదియు గోచరించలేదు. కాని యెన్నికలు అసాధారణ విషయములు. అవి సామాన్య ప్రమాణములను తారుమారు చేయును; బుద్ధులను చెడగొట్టును. నేను వాటిని చూచినకొలది నాకాశ్చర్యము హెచ్చుచున్నది; ఏవగింపు మెండగుచున్నది.

కాని, వ్యక్తులసంగతియటుండ, దేశములో కలకక్షలు హెచ్చుచుండుటచే జాతీయపక్షమో, లేక నట్టి మరియొక పక్షమో తప్పనిసరియయ్యెను. ఒకవంక హిందువుల జనసంఖ్యనుచూచి ముస్లిములు భయపడుచుండిరి. మరియొకవంక ముస్లిములు బెదిరించుచున్నారని (అట్లు అనుకొనిరి.) హిందువులకోపము హెచ్చుచుండెను. 'ప్రత్యేక హక్కులనిచ్చెదరా? లేక అవతలప్రక్కకు లేచిపోమా?' 'నిలుచున్నవారు

నిలుచున్న పరిహారముగనే జవాబు చెప్పవలెను.' అను విధమున ముస్లిములు దండనచేసి యడుగుచున్నట్లు చాలమంది హిందువులు భావించిరి. ఈకారణముచేతనే హిందూమహాసభకు కొంత ప్రాముఖ్యత వచ్చెను. ఇది హిందూజాతీయతకు, ముస్లిము కులతత్త్వము నెదిరించు హిందూ కులతత్త్వముకు ప్రాతినిధ్యము వహించెను. హిందూమహాసభవారి తీవ్ర కార్యక్రమము ముస్లిము కులతత్త్వమును మరింత రెచ్చగొట్టెను; ఈవిధముగా క్రియ, ప్రతిక్రియల కంతులేకుండెను. ఈమధనములో దేశములో కులజ్వరము హెచ్చిపోయెను. ముఖ్యముగా నిది దేశములోని యధికసంఖ్యాకులైన వర్గము వారికిని అల్ప సంఖ్యాకులలో నెక్కువమందిగల వర్గమువారికిని మధ్యగల సమస్య. కాని, చిత్రముగా దేశములోని కొన్ని భాగములలో నిది తారుమారయ్యెను. పంజాబులోను, సింధులోను హిందువులును, సిక్కులును అల్పసంఖ్యాకులు. ముస్లిములు అధికసంఖ్యాకులు. ముస్లిములు భారతదేశ మంతటిలోను అల్పసంఖ్యాకులమని భయపడుచున్నట్లే యీరాష్ట్రములలోని యల్పసంఖ్యాకు లధికసంఖ్యాకులచే నలిపివేయ బడుదురని భయపడుచుండిరి. నిజము చెప్పవలెననిన నీరెండు తెగలలో నుద్యోగములను వాంఛించెడి మధ్యతరగతుల వారొకరి నొకరు త్రోసివేయుదురని భయపడుచుండిరి. గొప్ప మార్పులు కలిగిన తమ ప్రయోజనము లెచ్చట చెడిపోవునో యని పెట్టబడిదారులు కొంతవరకు భయపడు చుండిరి.

ఈ కులకక్షాభివృద్ధిచేత స్వరాజ్యపార్టీ చెడిపోయెను. దీనిలోని ముస్లిముసభ్యులు కొందరు జారిపోయి కులసంఘములలో జేరిరి; హిందూసభ్యులు కొందరు జాతీయపక్షములో జేరిరి. హిందూ యెన్నికవర్గముకు సంబంధించినంత వరకు మాలవ్యాజీ, లాలాజీల కలయిక చాలబలీయమైనది; కుల కక్షల కాకరమైన పంజాబులో లాలాజీ పలుకుబడి యత్యద్భుతమైనది. స్వరాజ్య పార్టీ తరఫున యెన్నికలలో

పోరాడ వలసిన భారమంతయు మోతీలాలుపై బడెను. అతనితో నా భారమును పంచుకొనుటకు చిత్తరంజనదాసు అచ్చట లేడయ్యెను. అతనికి పోరాట మనిన సరదా! అతడు దాని నెప్పుడును విడిచి యెరుగడు. ఎదిరి బలము వృద్ధియగుచుండుటచే నతడు తనయావచ్ఛక్తిని యెన్నిక సంగ్రామములో చొప్పించెను. అతడు చావ దెబ్బలు కొట్టెను; తానుతినెను. ఉభయ పక్షముల వారు నొకరిపై నొకరు దయా దాక్షిణ్యములను చూపలేదు. ఈ యెన్నిక వెనుక ద్వేషకథనములే మిగిలెను.

జాతీయ పక్షముకు మంచి విజయము చేకూరెను. కాని యీవిజయము అసెంబ్లీయొక్క రాజకీయ పటుత్వమును నిశ్చయముగా న్యూనపరచెను. రాజకీయ కేంద్రాకర్షణశక్తి మరింత దక్షిణ ముఖము పట్టెను. స్వరాజ్యపార్టీయే కాంగ్రెసు యొక్క దక్షిణపక్షము. అది బలము చేకూర్చుకొను ప్రయత్నములో ననేకమంది సమ్మిక స్వామి ద్రోహుల నందులోనికి దూరనిచ్చెను. కనుక దాని పటుత్వము చెడిపోయెను. జాతీయపక్షము కూడ ఆ నీతినే యవలంబించెను. కనుక నిబలగములోనికి (రాజకీయములతో నెట్టి సంబంధములేని) బిరుదావళులను ధరించినవారు, పెద్దభూఖామందులు, పరిశ్రమ యజమానులు యిత్యాదు లెందరో గల చిత్రవిచిత్ర రంగుల కూటమొకటి తయారయ్యెను.

ఒక ఘోర విషాదసంభవము 1926 సంవత్సరాంతము సంధకారములో ముంచివేసెను; అది సేతు సీతనగ మధ్యస్థ భారతదేశమునంతను భయోత్పాతముచే నిర్విణ్ణముచేసెను. కులద్వేషములు మన ప్రజల నెంతటి నైచ్యముకు దింపునో యిది విదితము చేయుచున్నది. జ్వరముతో పడియున్న స్వామిశ్రద్ధానందు నెవడో యొక మతోన్మాదుడు కత్తితో పొడిచి చంపెను. ఆహా! ఘూర్ఖా సన్నిల కెదురొమ్ము

నిచ్చుచు, నా దందహ్యమాన మగు నగ్నికీలల నాశ్లేషింప చటచట ముందుకుపోయిన శ్రద్ధానందున కెట్టి మృత్యువు! సుమారు యెనిమిదేండ్ల క్రిత మతడు, (ఆర్యసమాజ నాయకుడు) ఢిల్లీలోని జేముమసీదు సభా మంటపమునెక్కి వేలకొలది హిందువులును ముస్లిములును గల సభలో నైకమత్యమును గురించియు భారత స్వాతంత్ర్యమునుగురించియు బోధించెను. ఆ మహాసభలోని వారందరు హిందూ ముసల్మానుకి జై యను జయజయ ధ్వానములు నింగిముట్టునట్లుగా నతనిని యభినందించిరి. సభల వెలుపల వీధులలో వారుభయులు నాధ్వనిని తమర క్తముతో మేళవింప జేసిరి. నిశ్చయముగా తనను స్వర్గముకు గొంపోవు పుణ్యకార్యమునుచేయు చున్నట్లు భావించిన శోడిదేశీయునిచే నతడిపుడు చంపబడెను. ధర్మ కార్యముకొరకు చావుకైనను తెగించి చూపెడి భౌతిక ధైర్యమును నేనెప్పుడును అభినందించితిని. మనలో చాలమంది య ట్లభినందించెద రనియే నాయుద్దేశ్యము. స్వామిశ్రద్ధానందున కట్టి యద్భుతమైన నిర్భయత్వ ముండెను. కాషాయాంబరములలో నుండిన ఆజానుబాహువు; ఆదర్శమైన విగ్రహము; వయో వృద్ధుడైనను నిసుమంతయు వంగని యాశరీరయష్టి; మెఱయుచుండు నేత్రములు; ఇతరుల దుర్బలత్వముకు నొకొక్కప్పుడు ముఖ మండలము మీద కాన్పించు విసుగుదలలేక కోపముయొక్క ఛాయ- జీవముతో నుట్టిపడు నావిగ్రహము నాస్మృతి పథమున నెట్లున్నదో! అది మరల మరల నెట్లు తిరిగి ద్యోతకమగు చున్నది!

---

## ౨౩

## బ్రస్సెల్సులో పీడితజాతులసభ.

1926 సంవత్సరాంతమున నేను బెర్లినులో నుండగా పీడిత జాతుల సభ యొకటి బ్రస్సెల్సులో జరుగ నున్నదనివింటిని. ఆ భావము నాకు నచ్చుటచే భారతజాతీయ కాంగ్రెసుకూడ బ్రిస్సెల్సు కాంగ్రెసులో నధికారరీత్యా పాల్గొనుట మంచిదని నేను స్వదేశముకు వ్రాసితిని. నా సూచన యంగీకరింపబడి, నేనే భారత కాంగ్రెసు ప్రతినిధిగ దీని కొరకు నియోగింపబడితిని.

బ్రస్సెల్సు సభ 1927 ఫిబ్రవరి మొదటి వారములో జరిగెను. దీనికి కారకు లెవరో నేనెరుగను. అప్పుడు బెర్లిను నగరము రాజకీయ ప్రవాసులను విప్లవకారులను ప్రపంచమంతటినుండియు నాకర్షించు కేంద్రమయ్యెను. అది క్రమముగ నీ సందర్భములో ప్యారిసు నగరమును మించుచుండెను. కమ్యూనిస్టు బృందముకూడ నచ్చట బలముగనుండెను. పీడింపబడు జాతులన్నియు కలసి అంతర్జాతీయముగ నేదో యొక సమష్టికార్యమును జరుపవలె ననియు, వారును కూలి సంఘము యొక్క యెడమ పక్షము వారును కలిసి యొక సమిష్టి కార్యమును చేయవలెననియు సూచన లాకాశమును నింపుచుండెను. స్వాతంత్ర్య సంగ్రామమనిన సామ్రాజ్యతత్త్వమను పిశాచముపై కందరును కలిసి యురుకుటయే యనుభావ మంతకంతకు హెచ్చుచుండెను. కనుక సమష్టి యాలోచనలును, వీలైనచోట సమష్టికార్యాచరణయు కావలెనను కొనిరి. వలస రాజ్యములు గల యింగ్లండు, ఫ్రాన్సు,ఇటలీ, మొదలగునవి సహజముగానిట్టిప్రయత్నములకు వ్యతిరేకముగానుండెను. కాని జర్మనీ, యుద్ధానంతరము, వలస రాజ్యములు గలది కాదు. కనుక జర్మనుప్రభుత్వ మితర ప్రభుత్వములలోని వలసలలోను, కాలనీలలోను

జరుగు నిట్టి యాందోళనాభివృద్ధిని యుదారమగు తటస్థభావముతో చూచుచుండెను. బెర్లిను నగరము ప్రపంచములోని యసంతుష్టులకును, విప్లవవాభిమానులకును కేంద్రమగుట కిదియొక కారణము. వీరిలో చీనాలోని క్యూ-మిం-టాంగుకు చెందిన యెడమ పక్షమువారు ప్రధానులుగ నుండిరి. ఈపక్ష మప్పుడు చీనాదేశము నంతను తుడిచి వేయుచుండ, నిజగన్నాథ రథముక్రింద పాత సామంత సంస్థానము లన్నియు మగ్గుచున్నట్లుండెను. ఈనూతన మార్పుల ముందర సామ్రాజ్య ప్రభుత్వములుకూడ తమ దుడుకు చేష్టలను, అధికార పూరితస్వనమును కోల్పోయిరి. చీనా దేశపు నైక్యమత్య, స్వాతంత్ర్యసమస్యల పరిష్కార మరిచేతిలో నున్నట్లు కాన్పించెను. క్యూమింటాంగు జయభేరీ మ్రోగించెను. కాని వారురానున్న కష్టములను గుర్తించి యంతర్జాతీయ ప్రచారముచే మరింత బలమును చేకూర్చుకొన నెంచిరి. విదేశములలోనున్న కమ్యూనిష్టులతోను, కమ్యూనిష్టులకు చేరికనైన వారితోను కలిసి పనిజేయుచున్న పైపార్టీయొక్క యెడమ పక్షమువారే, దేశము వెలుపల, చీనా జాతీయస్థితిని బలపర్చుటకును దేశములో తమస్వంతపార్టీని బలపర్చుటకును యీప్రచార మవసరమని పట్టు పట్టిరి. అప్పుడీపక్షము బలవద్విరోధములుగల రెండుమూడు చీలికలుగా చీలిపోక, పైకి, యేకముఖమునే ప్రదర్శించెను. కనుక క్యూమింటాంగు యొక్క యూరపియను ప్రతినిధులు పీడిత జాతుల సభ జరుగ వలెననెడి భావమును ఆహ్వానము చేసిరి; బహుశః మరికొంత మందితో కలిసి వారే యీభావముకు కారకులై యుండ వచ్చును. మొదట నుంచియు, కొంతమంది కమ్యూనిస్టులును, వారికి చేరికనైన వారును వెనుకనుండి దీనికి దోహదము నిచ్చుచునే యుండిరి. కాని మొత్తము మీద కమ్యూనిస్టులు దూరముగనే యుండిరి. ల్యాటిను అమెరికానుండి మంచిసహాయము, బలము చేకూరెను; అది యప్పుడు అమెరికా సంయుక్తరాష్ట్రముల ఆర్థిక సామ్రాజ్యముపట్ల గుఱ్ఱగా

నుండెను. విప్లవనీతిని, అట్టియధ్యక్షునిగల మెక్సికో నగరము అమెరికా సంయుక్తరాష్ట్రములకు వ్యతిరేకముగా ల్యాటిను అమెరికను బ్లాకులో నాయకత్వమునువహింప నుత్సుకతతో నుండెను. కనుక మెక్సికో బ్రస్సెల్సు కాంగ్రెసు యెడల మంచిశ్రద్ధ వహించెను. అధికారరీత్యా ప్రభుత్వము పాల్గొనజాలదు. కనుక నదియొక రాజకీయవేత్త నుదాః సాక్షిగా చూచుచుండవలెనని పంపించెను.

జావా, ఇండోచీనా, పాలస్తీను, సిరియా, ఈజిప్టు, ఉత్తరఆఫ్రికా యరబ్బులు, ఆఫ్రికా దేశపు నీగ్రోలు - ఈ జాతుల ప్రతినిధులందరును బ్రస్సెల్సు సభకు వచ్చిరి. కూలి సంస్థల యెడమపక్ష ప్రతినిధు లెంద రోవచ్చిరి. ఐరోపా దేశపు లేబరు సంగ్రామములలో నొకపురుషాంత రము నుండియు ప్రధానపాత్రను ధరించుచుండిన విఖ్యాతపురుషులును అచ్చటనుండిరి. కమ్యూనిస్టులును అచ్చటనుండి కార్యక్రమములో నెక్కు వగా పాల్గొనిరి. వారు కమ్యూనిస్టులుగా గాక ట్రేడుయూనియను ప్రతినిధులుగా వచ్చిరి.

జార్జిల్యాన్సుబరీ అధ్యక్షుడుగా నెన్నుకొనబడెను. అతడు గంభీర మైన యుపన్యాసము నిచ్చెను. ఆసభ యంత పిచ్చసభ కాదనుట కదియే తార్కాణము; దానికి కమ్యూనిజముతో నెట్టి సంబంధమును లేదు. కాని యాసభ కమ్యూనిస్టులపట్ల మిత్రభావమును వహించెనను టలో సందేహములేదు; కొన్ని విషయములలో వారికి సమాధానము కుదరక పోయినను కలిసి పనిచేయుటకు వారికనేక సమాన కారణ ములు కలవు.

'సామ్రాజ్య వ్యతిరేకసభ' యనుశాశ్వత సంస్థకుకూడ నధ్య క్షుడుగా నుండుటకు ల్యాన్సుబరీగారొప్పుకొనిరి. కాని, తరువాత నతడు తొందర పడినందులకు విచారించెను; లేదా బహుశః బ్రిటిషు లేబరుపార్టీలోని యతని సహచరు లతని ప్రవర్తన నంగీకరించలేదు.

అప్పుడు లేబరు పక్షము 'చక్రవర్తికి ప్రతిపక్షము'. ఇది వెంటనే 'చక్రవర్తి ప్రభుత్వము'గ వికసించెను. భవిష్యత్కార్యవర్గ మంత్రిశేఖరులు సాహస పూరితమైన విప్లవ రాజకీయములలో నెట్లు తగుల్కొనగలరు! ల్యాన్సుబరీగారు తీరికలేదను నెపముతో తన యధ్యక్ష పదవికి రాజీనామా యిచ్చెను; అతడు లీగుసభ్యత్వమునకు గూడ రాజీనామా యిచ్చెను. రెండుమూడు నెలలక్రిందటనే యతని యుపన్యాసమును విని మురిసి పోయిన నాకిది మనోవ్యథనుకలిగించెను.

అయినను సామ్రాజ్యవ్యతిరేకసభాప్రోత్సాహకులలోచాలమంది విఖ్యాత పురుషులు కలరు. ఈన్స్టీను, సన్యాటుసేనుభార్య, రోమారోలా మొదలగు వారు కలరు. పాలస్తీనులో వచ్చిన అరబ్బీ, యూదుల పోరాటములలో లీగువారు అరబ్బీలకు సుముఖమైన నీతిని పాటించిరి. దీనినంగీకరింపక యీన్స్టీను చాలమాసము లైనతరువాత రాజీనామా యిచ్చెను. బ్రిస్సెల్సు కాంగ్రెసు, దానితరువాత నప్పు డప్పుడనేక చోట్లజరుప బడిన లీగుయొక్క కమిటీ సభలును కాలనీలలోను, పరాధీన దేశములలోను గల కొన్నికొన్ని సమస్యల నర్థము చేసికొనుటకు నాకెంతయో తోడ్పడెను. పాశ్చాత్య లేబరు ప్రపంచములోని యంతఃకలహములను కూడ నేను వాటిద్వారా చూడగలిగితిని. వాటిని గురించి నాకదివరకే కొంత తెలియును. నేను వాటిని గురించి చదివియుంటిని, కాని స్వయముగ చూచి యెరుగను. నాకిప్పుడట్టి యనుభవము కలిగెను. ఈ యంతఃకలహములకు సంబంధించిన సమస్యలను నేనొక్కొక్కపుడు యెదుర్కొనవలసి యుండెను. లేబరు ప్రపంచములోని రెండవ యింటర్నేషనలు కంటె మూడవదాని యెడల నాకు సానుభూతి కలదు. యుద్ధమయిన తరువాత రెండవ యింటర్నేషనలు చరిత్ర యంతయు నాకేవగింపునుకలిగించెను. ఆసభలో నుద్దండపిండములుగా పనిచేసిన బ్రిటిషు లేబరు పార్టీవారి పద్ధతులు హిందూ

దేశములోనున్న మాకందరకును తగినంత స్వానుభవములయ్యెను. కనుక నేను విధిలేక కమ్యూనిజమువైపు తిరిగితిని. దానిదోషము లేవి యైనను అది మోసము నెరుగదు. నమ్మిక స్వామిద్రోహము నెరుగదు. సామ్రాజ్య వాసన యెంతమాత్రమును దానికిలేదు. కమ్యూనిజములోని విశేషాంశము లేవియు నాకు తెలియక పోవుటచే నాసంబంధము సిద్ధాంత బద్ధముకాదు. అప్పుడు దాని విశాల లక్షణములతో మాత్రమే నాకు పరిచయ ముండెను. ఇవి నన్నాకర్షించెను. రష్యాలో జరుగుచున్న యద్భుత మార్పులుకూడ నన్నాకర్షించెను. కాని కమ్యూనిస్టులు, తఱచు వారి నిరంకుశ మార్గముల చేతను, తీవ్రమగును, నీచమును నగుపద్ధతుల చేతను, తమతో నంగీకరింపని ప్రతివానిని నిందించు స్వభావము చేతను నాకాగ్రహమును కలిగించుచుండిరి. వారు చెప్పునట్లు నిస్సందేహముగా యీ కోపముకు నా బూర్జువా విద్యయు, శిక్షణయు కారణములు.

సామ్రాజ్య వ్యతిరేక లీగుయొక్క కమిటీ మీటింగులలో చిన్నచిన్న విషయములను గురించి వాదించుటలో నేను సాధారణముగా ఆంగ్లో అమెరికను సభ్యుల వైపుననే యుండుట చిత్రముగా నుండెడిది. అథమము పద్ధతిలోనైనను మాకొక సాదృశ్య ముండెడిది. ప్రకటనలవలె కాన్పించు, శబ్ద భూయిష్టమగు, కొండవీటి చేంతాటి తీర్మానములకు మే ముభయులము నభ్యంతర పెట్టెడి వారము. మేమవి నిరాడంబరముగను సూత్రప్రాయముగను నుండవలె నందుము. కాని, యూరపులోని సాంప్రదాయము దీనికి విరుద్ధముగ నుండెను. కమ్యూనిస్టులకును, కమ్యూనిస్టులు కానివారికిని తఱచు యభిప్రాయభేద ముండెడిది. సామాన్యముగా మేమొక రాజీకి వచ్చెడి వారము. తరువాత మాలోకొంతమంది యిండ్లకు తిరిగి వచ్చుటచే మరెట్టి కమిటీ మీటింగులకును పోజాలకపోతిమి.

సామ్రాజ్య ప్రభుత్వములయొక్క కలోనియలు శాఖవారును, విదేశ రాజ్యాంగ శాఖవారును బ్రస్సెల్సు కాంగ్రెసును కొంత భయముతో చూచిరి. బ్రిటిషు విదేశ రాజ్యాంగ శాఖకు చెందిన 'ఆంగరు' అను విఖ్యాత రచయిత దానినిగురించి కొంచెముద్రేక పూరితమును, అచ్చటచ్చట పరిహాసాస్పదమునునగు చరిత్రను వ్రాసెను. ఆకాంగ్రెసులోనే అంతర్జాతీయ గూఢచారులు కుప్పలుగ నుండిరి. ప్రతినిధులలోనే చాలమంది గూఢచారులుండిరి. ఒక చిన్న తమాషాకథ జరిగెను. ప్యారిసు నగరములోనున్న నా యమెరికను స్నేహితుని యొకనాడొక ఫ్రెంచిగూఢచారి నౌకరీలోనున్న ఫ్రెంచిస్నేహితుడు చూడవచ్చెను. కొన్నివిషయములను గురించి అతడు కేవలము తనమిత్రుని సందర్శించుటకేవచ్చెను. అతడు తనపనిని పూర్తిచేసిన తరువాత నాయమెరికనును 'మనమీమధ్యనే కలుసు కొంటిమికదా! నీవునన్ను గుర్తించలేదా' అని యడిగెను. ఆ యమెరికను యెంత గట్టిగా నాలోచించినను యేమియు జ్ఞప్తిరాక తానతనిని గుర్తించలేదని చెప్పెను. అప్పుడా గూఢచారి యేజెంటు తానతనిని బ్రస్సెల్సు కాంగ్రెసులో కలుసుకొనెననియు, నతడు చేతులు, కాళ్ళు, ముఖము సమస్తము నల్లని మసి పూసుకొని నీగ్రోప్రతినిధిగా వచ్చెననియు చెప్పెను!

సామ్రాజ్య వ్యతిరేక లీగుయొక్క యొకకమిటీ మీటింగు కొలోనులో జరిగెను. దానికి నేను వెళ్ళితిని. మీటింగు ముగిసిన తరువాత సాకో-వాన్జెటీ సభకు దగ్గర నున్న డస్సెల్డార్ఫుకు పోవలెననిరి. మేము వెళ్ళితిమి. ఆ మీటింగు నుండి మేము తిరిగి వచ్చుచుండగా పోలీసులు మమ్ము ప్యాసుపోర్టులను చూపించమనిరి. చాలమంది దగ్గర నవియుండెను. నేను దానిని కొలోను హోటలులోనే విడిచి పెట్టితిని. వెంటనే నన్నొక పోలీసు స్టేషనుకు తీసికొనిపోయిరి. అదృష్ట వశాత్తు నావలెనే యొక ఆంగ్లమిథునము యీకష్టములోపడిరి; ఒకగంట గడ

చిన తరువాత, (యీలోపున టెలిఫోనుద్వారా పరిశోధన జరిగియుండవలెను) పోలీసు ప్రముఖుడు మమ్ము విడిచి వేసెను.

తరువాత సంవత్సరములలో సామ్రాజ్య వ్యతిరేక లీగు కమ్యునిజము వైపు యెక్కువగా మొగ్గెను; కాని, నాకు తెలిసినంత వరకు నది యెప్పుడును తన వ్యక్తి లక్షణములను పోగొట్టుకొనలేదు. ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా నాకు దానితో కొంత దూరపు సంబంధము మాత్రమే యుండెను. 1931 లో, భారత ప్రభుత్వమునకును కాంగ్రెసుకును జరిగిన ఢిల్లీ సంధిలో, నేను భాగస్వామినని దానికి నామీద నమితమైన కోపము కలిగి నన్నొక్క కలము పోటుతో బహిష్కరించెను. మరికొంత నిజము చెప్పవలెననిన నదియొక విధమగు తీర్మానమును చేసి నన్ను బహిష్కరించెను. దానికి తీవ్రమైన కోపము కలిగిన మాట వాస్తవమే కాని, నాస్థితిని తెలుపుటకు నాకది కొంత యవకాశమునిచ్చి యుండ వలసినది.

1927 వేసవిలో మాతండ్రి యూరపు వచ్చెను. నేనతనిని వెనీసు పట్టణములో కలిసితిని. తరువాత కొద్దిమాసములును మేము తరుచు కలిసియే యుంటిమి. మేమందరమును సోవియటు రష్యాయొక్క పదవ సాంవత్సరికోత్సవ సందర్భములో నవంబరు నెలలో మాస్కో వెళ్ళితిమి. మేము మాస్కోలో మూడునాలుగు రోజులు మాత్రమే యుండుట కాఖరు నిమిషములో నిశ్చయించుకొంటిమి. మేమచ్చటకు వెళ్ళినందులకు చాల సంతసించితిమి. ఆ కొద్దిపాటి వీక్షణముకూడ ఫలప్రదముగ నుండెను. అది నూతన రష్యాను గురించి మాకంతగా బోధించలేదు; బోధించ జాలకుండెను. కాని యది మేము చదువుకొనగలుగుటకు తగిన పునాదులను వేసెను. మాతండ్రి కట్టి సోవియటు, సామాజిక భావములు కేవలము క్రొత్తలు. అతనికున్న శిక్షయంతయు న్యాయబద్ధము, చట్టబద్ధము. అతడా గుడిదాటి చులకనగా

పైకిపోజాలడు. కాని, యతడు మాస్కోలోచూచిన దానితో చాల సంతృప్తిచెందెను.

సైమను కమిషనును గురించి మొట్టమొదట ప్రకటించినపుడు మేము మాస్కోలోనుంటిమి. మాస్కో పత్రికలో మేము దానిని గురించి మొట్టమొదట చదివితిమి. తండ్రిగారు కొద్దిరోజులలోనే ఒక భారతదేశపుఅప్పీలులో సర్. జాన్. సైమనుతో తోడివకీలుగా లండను ప్రీవీకౌన్సిలుకు వెళ్ళవలసియుండెను. అదియొక పాత జమీందారీ కేసు. అనేకసంవత్సరముల క్రిందట మొట్టమొదటి స్థితిలో నేనును దానిలో పనిచేసితిని. నేనందులో నిక నెట్టి శ్రద్ధయు తీసికొనలేదు.

1927 వ సంవత్సరము గతించుచుండెను. యూరపులో మా యునికి యంతకంతకు పొడిగింపబడుచుండెను. తండ్రిగారు యూరపు చూచుటకు రాకపోయినచో బహుశః మేము అంతకాల ముండెడి వారముకాము. మా త్రోవలో మేము కొంతకాలము యూరపు యొక్క ఆగ్నేయభాగములోను, టర్కీ, యీజిప్టులలోను నుండవలె ననుకొంటిమి. నేను క్రిస్టమసులో మద్రాసులో జరుగనున్న కాంగ్రెసుకు పోవలెనను యాతురతతో నుండుటచే తగిన వ్యవధి లేకుండెను. మేము- నాభార్య, చెల్లెలు, కుమార్తె, నేను-డిసెంబరు మొదటి వారములో మార్సెల్సునుండి కొలంబోకు పయనమైతిమి. మాతండ్రి మరియొక మూడుమాసములు యూరపులో నుండెను.

---

## ౨౮

## భారతదేశమునకు తిరిగివచ్చుట—రాజకీయములలో తిరిగి మునుగుట.



నేను యూరపునుండి మంచిశరీర మానసికారోగ్యములతో తిరిగి వచ్చితిని. నాభార్యకు పూర్తియైన యారోగ్యము కలుగలేదు. కాని చాలవరకు నయమయ్యెను. కనుక నాకామెను గురించిన యాందోళన తగ్గెను. నే నినుమడించిన శక్తి, సామర్థ్యములతో నుండుటచే పూర్వము నన్ను తొలుచు కుళ్ళింగదీయుచుండెడి ఆంతరంగిక సంఘర్షణయు, ఓటమియు నిప్పుడు పలాయనమయ్యెను. నాదృక్పథము విశాలమయ్యెను. కేవల జాతీయత నిశ్చితముగా నాకొక సంకుచితము, నసంపూర్ణము నగు సిద్ధాంతముగా కాన్పించెను. రాజకీయ స్వేచ్ఛ, స్వాతంత్రత ముఖ్యముగా కావలసినవే! కాని యవి సరియగు మార్గమునకు గొంపోవు సోపానములు మాత్రమేయగును. సాంఘిక స్వేచ్ఛయు సంఘముయొక్కయు, ప్రభుత్వము యొక్కయు, సామ్యవాద పరమగు నిర్మాణమును లేనిదే దేశముకాని, వ్యక్తులుకాని యభివృద్ధి నొందజాలరు. ప్రపంచ వ్యవహారములు నాకు కళ్ళకు కట్టినట్లు కాన్పించుచున్నట్లు నేను భావించితిని. ఎప్పుడును మారుచుండినను, అధునిక ప్రపంచముపై నాకెక్కువ పట్టుదొరకెను. వర్తమాన వ్యవహారములను, రాజకీయములను గురించియేకాక శాస్త్రము, విజ్ఞానము మొదలగు నాకభిరుచిగల యనేక విషయములను గురించి నే నెంతయో చదివితిని. యూరపు, అమెరికాలలో జరుగుచుండిన బ్రహ్మాండమైన రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక పరివర్తనములే యొక మనోజ్ఞమైన యాత్రయపమని నేను కనుగొంటిని. కొన్ని యసంతృప్తికరములగు విషయములున్నను సోవియటురష్యా నన్నెక్కుడుగా నాకర్షించెను. అదియే

ప్రపంచమున కాశను పురిగొల్పు సందేశము నిచ్చుచున్నట్లు కాన్పించెను. యూరపు 1920 ప్రాంతములలో నొకవిధముగా స్థిరపడుటకు ప్రయత్నించుచుండెను. ఆర్థికదుస్థితి యింకను రావలసియుండెను. ఈ స్థైర్యము కేవలము బాహ్యామే! యూరపులోను, ప్రపంచములోను అచిర కాలములోనే పెద్దరాజకీయ భూకంపములును, గొప్ప పరివర్తనములును రానున్నవి అను విశ్వాసముతో నేను తిరిగి వచ్చితిని.

ఈపరిపంచమున సంప్రాప్తించు విషయముల నెదుర్కొనుటకు మన ప్రజలను, దేశమును మనశక్తివంచన లేకుండ తయారు చేయుటయే, తగిన శిక్షను కలుపుటయే మనము చేయవలసిన ధర్మముగా నాకు కాన్పించెను. మనము చేయవలసిన సంసిద్ధతయంతయు చాలవరకు లక్ష్యములకు సంబంధించినది. మొట్టమొదట మన రాజకీయ స్వాతంత్ర్య లక్ష్యమునుగురించి యెట్టి సంశయములు నుండరాదు. ఇదియే మన రాజకీయ లక్ష్యమనియు డొమినియను ప్రభుత్వమని యర్థములేకుండ చేయబడు గజబిజి సంభాషణకంటె యిది కేవలము భిన్నమైనదనియు స్పష్టముగా నెఱుగవలెను. తరువాత సాంఘిక లక్ష్యము కలదు. కాంగ్రెసు యిప్పుడు యీవిషయములో యెక్కువగా పనిచేయవలెనను కొనుట మితిమీరిన కోరికయని నేను భావించితిని. కాంగ్రెసు కేవల మొకజాతీయ రాజకీయసంస్థ. దాని కితర విధముగ చింతించు సలవాటులేదు. అయినను 'శ్రీరామ' చుట్టవచ్చు నను కొంటిని. కాంగ్రెసు వెలుపల లేబరు సంఘములోను యువకులలోను యీ భావము నెక్కువగా వ్యాప్తిచేయ వచ్చును. దీనికొరకు నేను కాంగ్రెసు ఆఫీసుకు దూరముగా నుండ గోరితిని. మూలమూలలనున్న గ్రామసీమలలో కొన్ని నెలలుండి వారి పరిస్థితులను గుర్తింపవలెనను కోరిక కూడ నుండెడిది. కాని యిది జరుగ దయ్యెను! పరిస్థితులు నన్ను తిరుగ కాంగ్రెసు రాజకీయ కుహరము లోనికీడ్చెను.

నేను చెన్నపట్టణము చేరుట తోడనే నన్ని సుడిగుండము పట్టు కొనెను. నేను స్వాతంత్ర్యము, యుద్ధభయము, సామ్రాజ్య వ్యతిరేక లీగు మొదలగు విషయములను గురించి వర్కింగు కమిటీకొక తీర్మాన గుచ్ఛమును పంపితిని. కొంచె మించుమించు అవన్నియు నంగీకరింపబడి వర్కింగు కమిటీ తీర్మానములుగా పరిగణింప బడెను. నేను వాటిని కాంగ్రెసు బహిరంగ సభలో నుపపాదించితిని. అవి యన్నియు నేక గ్రీవముగ నంగీకరింప బడుట నాకాశ్చర్యమును గొల్పెను. స్వాతంత్ర్య తీర్మానమును అనిబిసెంటు సతి కూడ బలపర్చెను. ఈ సర్వాంగీ కారము తృప్తికరముగనే యుండెను. కాని యీతీర్మానములు సరిగా నర్థము చేసికొన బడలేదు, లేదా మరియొక యర్థము నచ్చులాగున నవి వికలము చేయబడెను; అనువిషాద భావము నన్నలవరించెను. నాభావము నిజమే యనుసంగతి కాంగ్రెసు ముగియుట తోడనే విదిత మయ్యెను. స్వాతంత్ర్య తీర్మానమును గురించి చర్చలు బయలుదేరెను.

ఈ నాతీర్మానములు మామూలు కాంగ్రెసు తీర్మానముల కంటె కొంత భిన్నముగ నుండెను. ఇవి యొక నూతన దృక్పథమును చూపుచుండెను. నిస్సందేహముగ చాలమంది కాంగ్రెసు వారికివి రుచించెను. కొంతమంది కివి యంత రుచింపక పోయినను ప్రతిఘటించు టకు కావలసినంత యసంతృప్తి లేకుండెను. బహుశః వారు వీటిని (ఎట్లయినను బాధకరములుగాని మెట్ట తీర్మానములుగా భావించి) వదు ల్చుకొని ముందుకు మరింత ముఖ్య తీర్మానములకు పోవుటకై వీటి నామోదించుటయే మంచి మార్గమని తలంచి యుందురు. కనుక స్వాతంత్ర్య తీర్మాన మప్పుడు, ఒకటి రెండు వత్సరముల తరువాతవలె, కాంగ్రెసు యొక్క ప్రాణప్రదము, అప్రతిహతమునగు సూత్రము కాదు. అది వ్యాప్తిచెందుచు నంతకంతకు వృద్ధి చెందుచున్న యొక భావము; వాసన.

గాంధీజీ మద్రాసులోనుండెను. అతడు కాంగ్రెసు సభలకు హాజరయ్యెను. కాని కాంగ్రెసు నీతిని నిరూపించుటలో నతడెట్టి జోక్యమును కల్పించుకొనలేదు. వర్కింగు కమిటీలో సభ్యుడైనను నతడామీటింగులకు హాజరు కాలేదు. స్వరాజ్య పార్టీ ప్రాబల్యము వచ్చినప్పటి నుండియు నతడు కాంగ్రెసు పట్ల సాధారణముగా నట్టి రాజకీయ దృక్పథమునే కలిగి యుండెను. కాని తఱచు యతని సలహా తీసికొన బడుచుండెను. అతనికి తెలియకుండ ముఖ్యమైన వేవియు చేయబడలేదు. నాతీర్మానముల నతడెంతగా నామోదించెనో నాకు తెలియదు. అతనికవి రుచింపనట్లే నేను భావించెదను. అవి చెప్పునట్టి విషయములు గాక వాటి సాధారణ ధోరణి, దృక్పథము లతనికి నచ్చియుండవు. అయినను అతడు వాటినెప్పుడును విమర్శించలేదు. మాతండ్రి యప్పుడు దూరమున యూరపులో నుండెను.

సైమను కమిషనును నిరసించుచు దానిని బహిష్కరింపవలెనను మఱియొక తీర్మానము వచ్చినపుడు ఆ కాంగ్రెసు సభలోనే స్వతంత్ర తీర్మానముయొక్క యదార్థత బయలుపడెను. ఈ తీర్మాన ఫలితముగా భారతదేశమున నొక రాజ్యాంగప్రణాలికను తయారుచేయుట కొక యఖిల పక్ష సభను పిలువ వలెననిరి. మితవాద బృందముల తోడ్పాటు వాంఛింపబడినది. వారు స్వాతంత్ర్యమును గురించి యెన్నడును ఊహింప జాలరు. వారంతగా వెళ్లిన నేదోయొకవిధమగు డొమినియను పరిపాలన వరకు పోగలరు.

నేను మరల కాంగ్రెసు కార్యదర్శి నైతిని. దానికి వ్యక్తిగతమైన కారణములు కలవు. ఆ సంవత్సరము కాంగ్రెసు అధ్యక్షుడు డాక్టరు అన్సారీ నాకు ప్రియమైన చిరమిత్రుడు. నా తీర్మానములు చాలవరకు నామోదింప బడుటచే నేను వాటి నాచరణకు బెట్టవలసియుండెను. అఖిలపక్షమహాసభా తీర్మానము కొంతవరకు నాతీర్మానముల

సారమునులాగివేసెను. అయినను చేయవలసిన దెంతయో యుండెను. అఖిలపక్షమహాసభా యంత్రద్వారమునగాని, మరేయితరకారణముల చేత గాని కాంగ్రెసు మరింతరాజీకి మరింత మితవాద స్థితికి దిగిపోవు నేమో యనుభయమే నేను తిరిగి వుద్యోగము స్వీకరించుటకు యథార్థమైన కారణ మయ్యెను. అది యొకసారి యీపక్కకును మరియొక సారి మరియొక పక్కకును ఊగిసలాడు చున్నట్లుండెను. అది మితవాదము వైపు దిగకుండ స్వాతంత్రలక్ష్యము నంటిపెట్టుకొని యుండునట్లు నాశక్తికొలది చేయనెంచితిని.

జాతీయ కాంగ్రెసు ప్రతివత్సరము జరుపబడు రోజులలో నెప్పుడును అనేక ప్రక్క ప్రదర్శనములు జరుపబడుచుండును. మద్రాసులో జరిగిన ప్రక్క ప్రదర్శనములలో రిపబ్లికను కాన్ఫరెన్సు ప్రదర్శన మొకటి జరిగెను. అదియే మొదటి సభ. (అదియే ఆఖరుసభయయ్యెను.) నన్ను అధ్యక్షునిగా నుండ మనిరి. నేను రిపబ్లికనును కనుక నాకాభావము నచ్చెను. దీనిని ప్రోత్సహించిన వారెవరో నాకు తెలియక పోవుటచే నేను సందేహించు చుంటిని. కుక్కగొడుగుల వలె లేచు సంస్థలలో నేను సంబంధము పెట్టుకొన నొల్లను. చివరకు నేను అధ్యక్షతను వహించి తరువాత విచారించితిని. ఈరిపబ్లికను కాన్ఫరెన్సుకు (అనేక యితర కాన్ఫరెన్సుల వలెనే) పురిటిలోనే సంధి సంభవించెను. దానిచే గావింపబడిన తీర్మానముల మూలమును సంపాదించుటకు నేననేక మాసములు ప్రయత్నించి చివరకు విఫలుడ నైతిని. మనలో చాల మంది క్రొత్తక్రొత్త విషయములకు పూనుకొనివచ్చి, తోడనే వాటిని వాటికర్మముకు విడిచి వేయుచుండుట చాల యాశ్చర్యముగ నుండును. మనము పట్టుదల లేనివారమని కావింపబడు విమర్శలో సత్యమెంతయో కలదు.

కాంగ్రెసు సభజరిగిన తరువాత, మద్రాసును వీడులోపల ఢిల్లీలో హాకీము అజ్మల్ఖాను చనిపోయె ననువార్త వచ్చెను. అతడు

వెనుక కాంగ్రెసు అధ్యక్షుడగుటచే కాంగ్రెసు రాజకీయ పెద్దలలో నొకడు. అతడంతకంటె నెక్కువ వాడు. కాంగ్రెసు నాయకత్వములో నతనికొక ప్రత్యేక స్థానము కలదు. ఆధునిక సంపర్కమేమాత్రమును లేని శుద్ధ సనాతన పద్ధతిలో పెరిగి మొగలులనాటి ఢిల్లీ సామ్రాజ్య విజ్ఞానములో మునిగినను అతని లలిత మర్యాద ప్రవర్తనము, మృదు మధుర కంఠధ్వని, యనాగ్ర హాస్యము సంతోష దాయకముగ నుండును. అతడు, తన తీరులలో, తన రీతులలో చూపులలో, ఠీవిలో పురాతన సాంప్రదాయముకు చెందు రాజదర్బా లోనివాడు. అతని ముఖమున మొగల చక్రవర్తుల యొక్క చిత్రముల సాదృశ్యము కాన్పించును. అట్టివాడు సాధారణముగా రాజకీయ ఝుంఝూమారు తములలోనికి రాడు. ఆందోళన పరులైన నూతన జాతి వారు తమ్ము బాధించినపుడు భారత దేశములోని బ్రిటిషు వారట్టి పురాతన తెగవారకు తఱచు పరితాప పడుచుండెడి వారు. హకీము సాహేబు తన చిన్నతనములో రాజకీయముల వంక పోలేదు. ప్రఖ్యాతి చెందిన వైద్యకుటుంబ యాజమాన్యమును వహించుచు నతడు గొప్ప ప్రాక్టీసు కలిగి యుండెను. యుద్ధపరిస్థితులును, చిరస్నేహితుడును, సహచరుడును నగు డాక్టరు అన్సారీయొక్క పలుకుబడియు నతనిని కాంగ్రెసువైపు త్రిప్పెను. తరువాత సంభవించిన పంజాబులోని సైనిక శాసనములు, ఖిలాఫతు సమస్య మొదలగునవి యతనిని తీవ్రముగా సంచలింప చేసెను. అతడు అసహాయోద్యమము నామోదించెను. అతడు కాంగ్రెసు కొక వరప్రదాత యయ్యెను. అతడు పాత సాంప్రదాయము వారికిని క్రొత్త సాంప్రదాయము వారికిని సఖ్యమును కుదుర్చు సంధానకరణిగ నుండి, పాత సాంప్రదాయమువారి బలమును కాంగ్రెసుకు కలుగ చేసెను. అతడు హిందువులను ముస్లిములను చాల దగ్గరకు తెచ్చెను. ఉభయులును అతనిని గౌరవించి, యతని సాదృశ్యముకు సుముఖులగుచుండిరి. గాంధీజీ కతడు విశ్వాస పాత్రుడగు మిత్రు

డయ్యెను. హిందూ మహమ్మదీయ విషయములలో గాంధీజీ కతని మాటయే శాసనమయ్యెను. మా తండ్రియు నతడును సహజముగా నొండొరులను ప్రేమించు కొనిరి.

గత వత్సరము హిందూ మహాసభా నాయకులు కొందరు లోప భూయిష్టమగు నావిద్య చేతను, 'పరిష్యను' విజ్ఞానము నాకు సామాన్య పునాదియగుట చేతను నేను హిందూసాంప్రదాయములను, వాసనలను యెరుగని వాడనని నిందించిరి. నాకెట్టివిజ్ఞానము కలదో, అసలు విజ్ఞానము కలదో లేదో చెప్పుట నాకు కష్టసాధ్యమైన పని. పరిష్యను భాష (దురదృష్టవశాత్తు) నాకు రానేరాదు. కాని, మాతండ్రి హిందూ-పరిష్యను విజ్ఞాన వాతావరణములో పెరిగిన మాట సత్యము. అది యుత్తర హిందూదేశమునకు పురాతన ఢిల్లీకోర్టు ప్రసాదించిన పైతృకము. దానికి, యీపతిత దినములలోకూడ ఢిల్లీ, లక్నోలు రెండును ప్రధాన కేంద్రములు. కాశ్మీర బ్రాహ్మణులలో పరిస్థితులకు తగినట్లు మారు గొప్పశక్తి కలదు. వారు భారత మైదానభూములకు దిగివచ్చి, యప్పుడీ హిందూ-పరిష్యను విజ్ఞాన మచ్చుట ప్రబలముగ నుండుటను గాంచి, దీనిని స్వీకరించి, పరిష్యను,ఉర్దులలో చాలమంది విఖ్యాత పండితుల నుద్భవింపజేసిరి. తరువాత మారిపోవుచున్న సాంప్రదాయములను గుర్తించి వారట్టివేగముతోనే యాంగ్లభాష, ఆంగ్ల విజ్ఞానములను సాధించిరి. ఇప్పటికిని హిందూదేశములో పరిష్యను భాషలో విఖ్యాత పండితులైన కాశ్మీరు లెందరో కలరు. సర్ తేజ బహదరు సప్రూ, రాజా నరేంద్రనాథులట్టివారే!

కనుక హాకీము సాహెబుకును, మా తండ్రికిని సామ్య మెంత యోయుండెను. వారు పాత కుటుంబ సంబంధములను కూడ గుర్తించిరి. వారిరువురును చాల మిత్రులై యొకరి నొకరు భాయి సాహబు అని పిలుచు కొనుచుండెడివారు. వారికి గల యనేక బంధ

ములలో రాజకీయము లాఖరున వచ్చును. ఇంటివద్ద యాచారము లలో హాకీముజీ చాల సనాతనుడు. అతడును నతని కుటుంబమువారును పాత యాచారములను వీడజాలక పోయిరి. అతని కుటుంబములో నున్నటువంటి యాశ్చర్యకరమైన కఠిన ఘోషాపద్ధతిని నేనెచ్చటను చూచియుండలేదు. అయినను దేశములోని స్త్రీలు స్వేచ్ఛను పడసిన గాని యేదేశమును, యేజాతియు వృద్ధిపొందజాలదని హాకీముజీ పూర్తిగా విశ్వసించెను! దీనిని గురించి యతడు నాకు నచ్చచెప్పుచు తుర్కీదేశపుస్త్రీలు తమ స్వాతంత్ర్య పోరాటములో తీసికొనిన పాత్రను తా నెంతయో మెచ్చుకొంటి నని నాకు చెప్పుచుండెడి వాడు. కెమల్ పాషా ముఖ్యముగా నీతుర్కీదేశపు స్త్రీల వలననే స్వాతంత్ర్యమును బడసెనని యతడు చెప్పెను.

హాకీము అజ్మాల్‌ఖాను యొక్క మృత్యువు కాంగ్రెసుకు గొప్ప నష్టము. దాని గొప్పయండ యొకటి కూలిపోయినట్లయ్యెను. నాటి నుండి మా కందరకును ఢిల్లీని సందర్శించి నపుడెల్ల నొక లోపము కాన్పించుచుండును. ఏలనన ఢిల్లీ యన హాకీముజీయును బిల్లిమరనులో నున్న యతని భవనమును అయ్యెను. 1928 వ సంవత్సరము రాజకీయ ముగా చేతినిండ పని కలిగిన సంవత్సరము. దేశమంతయు సంచలన ముతో నిండియుండెను. ప్రజల నొక క్రొత్తయావేశము ముందుకు పోపుచున్నట్లుండెను. ఈనూతన సంచలన మన్నివర్గములలోను సమా నముగ నున్నట్లు కాన్పించెను. బహుశః యీమార్పు నేను దేశమును వీడినప్పటి నుండియు క్రమముగ జరుగుచుండెను. నేను తిరిగి వచ్చునరి కిది నాకు గొప్పదిగ కాన్పించెను. 1926లో హిందూదేశ మింకను నెమ్మ దిగను, స్తబ్ధముగను ఉండెను. బహుశః అది 1919-1922 నాటి ప్రయ త్నమునుండి యింకను పూర్తిగా కోలుకొనలేదు. 1928 లో నది నూతనముగను, చురుకుగను, హుషారుగను, నిగూఢమైన శక్తితో

నిండియుండెను. పారిశ్రామిక కార్మికులలోను, రయితులలోను, మధ్య తరగతి యువకులలోను, సాధారణముగా విద్యార్థికులలోను అన్ని చోట్లను యిది ప్రత్యక్ష మగుచునే యుండెను.

ట్రేడు యూనియను ఉద్యమము చాల యభివృద్ధి యయ్యెను. పడెనిమిది యేండ్లక్రితము స్థాపింపబడిన అఖిలభారత ట్రేడుయూనియను కాంగ్రెసు మంచి ప్రాతినిధ్యము గల బలీయమైన సంస్థ యయ్యెను. అది సంఖ్యాబలము చేతను చక్కని కట్టుబాట్లచేతను వృద్ధియగుటయే కాక దాని భావములు, యాశయములు శక్తివంతము లుగను, అతివాదధోరణిలోను యుండెను. సమ్మెకట్టులు తఱచయ్యెను. తరగతులలో నాత్మవిశ్వాసము వృద్ధి యగుచుండెను. వస్త్ర పారిశ్రామికులును, రైల్వేలవారును మంచి వ్యవస్థలను కలిగి యుండిరి. వీటిలో బొంబాయిలోని గిర్నీకార్మికసంఘమును, జి. ఐ. పి. రైల్వే సంఘమును చాల బలీయమై, మంచియభివృద్ధిలో నుండెను. లేబరు వ్యవస్థలు అభివృద్ధి చెందుట తోడనే అంతఃకలహ బీజములు, చీలికలు పశ్చిమము నుండి దిగుమతి యయ్యెను. ఇండియను ట్రేడుయూనియను మూవ్మెంటు స్థాపింపబడినతోడనే పరస్పర విరుద్ధ పక్షము లేర్పడెను. కొంతమంది రెండవ యింటర్నేషలును బలపరచిరి. మరికొంత మంది మూడవ యింటర్నేషనలును అభిమానించిరి. కొంతమంది వారిదృక్పథములో సంస్కరణ వాదులు. కొంతమంది గొప్పమార్పులు కలుగ వలెనను విప్లవవాదులు. ఈ యుభయులమధ్యను అనేక రంగుల, అనేకడిగ్రీల యభిప్రాయముల వారున్నారు. సమయానుకూల తత్పరులును (అన్ని ప్రజా యుద్యమములలోను యిది తప్పదు) కలరు.

రయితాంగములో కూడ కలకలము బయలుదేరెను. ఇది సంయుక్త పరగణాలలో, ముఖ్యముగ, అయోధ్యలో కానవచ్చుచుండెను. అచ్చట నన్యాయములను ప్రతిఘటించు పెద్దపెద్ద రయితు సభలు

సామాన్య మయ్యెను. యావజ్జీవ హక్కు నిచ్చుచు, నింకను యేమేమియో వాగ్దానము చేసిన నూతన అయోధ్య టెనెన్సీ చట్టము బీదరైతు దుస్థితి నెంతమాత్రమును మార్చలేదు. ప్రభుత్వమువారు పన్నులను హెచ్చించుటకు ప్రయత్నించుటచే గుజరాతులో రైతులకును, ప్రభుత్వముకును పెద్ద పోరాటము సంభవించెను. గుజరాతులో ప్రభుత్వముకు (రయితువారీ ప్రాంతముకనుక) రయితులతో ప్రత్యక్ష సంబంధము కలదు. ఈపోరాటమే సర్దారువల్లభాయిపటేలునడిపినబార్డోలీ సత్యాగ్రహము. భారత దేశమంతయు జయజయ ధ్వానములను ప్రయోగించుచుండ నీపోరాటము తుములమయ్యెను. బార్డోలీ రయితులకు ఘనమగు విజయము చేకూరెను. కాని యది యావద్భారత దేశములోనున్న రయితాంగములో కలిగించిన సంచలనమే నిజమైన విజయము. ఆశకు, శక్తికి, విజయమునకు భారతరయితుకు బార్డోలీయొక చిహ్నము. ఒక గుర్తు; ఒకయుదాహరణము.

1928 నాటి భారతము యొక్క మరియొక ప్రధాన లక్షణము యువజనోద్యమము. ప్రతిచోటను యువజనసంఘములు స్థాపింపబడెను. యువజన సభలు జరుపబడుచుండెను. ఇందులో ననేక రకములుండెను. మతసంఘములు లగాయితు విప్లవ భావములను, విప్లవ శాస్త్రమును చర్చించు సంఘముల వరకు నుండెను. వాటికి కారణము లేవియైనను, నవి వేటివేర జరుపబడినను, అట్టి యువజన సభలలో నెప్పుడును దేశము నావరించియున్న ప్రధాన సాంఘిక, ఆర్థిక సమస్యలు కూలంకషముగ చర్చింపబడుచుండెడివి. సాధారణముగా సమూలమైన మార్పులనే యవి సమర్థించుచుండెను.

కేవల రాజకీయ దృష్టితో చూచినచో నీవత్సరము సైమను కమిషను బహిష్కరణముకును (బహిష్కరణముకుసంబంధించిన నిర్మాణదక్షత యట) అఖిల పక్ష సభకును ప్రసిద్ధిచెందెను. ఈ బహిష్కరణాలో మితవాదులు కాంగ్రెసుకు తోడ్పడిరి. అది యఖండ విజయము నొందెను.

సైమను కమిషను యెచ్చటకు వెళ్ళినను 'సైమన్‌గోబాక్' యను శాత్రవ నినాదములే ప్రతిధ్వనించెను. ఈవిధముగా భారతప్రజల కొక్క సైమనుగారి పేరుమాత్రమే కాక ఇంగ్లీషుభాషలోని మరిరెండు పదములుకూడ వచ్చెను. ఇవిరెండే వారికి తెలిసిన పదములు. సైమను కమిషను సభ్యుల నీపదములు దయ్యములవలె వెంటాడించెను. క్రొత్త ఢిల్లీలోని వెస్టరను హాస్టలులో నొక నాటిరాత్రి యీ సభ్యులు నివసించియుండగా నిశీథమందు చీకటిని చొరుచుకొని యీ సంగీతమే వారికి వినవచ్చెనని యొక కథ చెప్పబడుచున్నది. యథార్థమేమనగా వారిని మేల్కొలిపిన యీ యవినయ ధ్వని సామ్రాజ్య రాజధాని యొక్క శిథిలసీమల నావహించి యుండు శృగాలగానము.

రాజ్యాంగ ప్రణాళికయొక్క ప్రధాన సూత్రములను స్థిరపరచుటలో నఖిలపక్ష సభ కెట్టి కష్టమునులేదు. అవి ప్రజాస్వామిక పార్లమెంటరీజాతికి చెందినవిగ నుండవలెను. వాటి నెవ్వడైనను వ్రాయవచ్చును. కులసమస్య లేక మైనారిటీ సమస్యలోనే నిజమైన కష్టము, ఒక్కటే కష్టము వచ్చెను. ఆ కాన్ఫరెన్సులో నన్నికులములలోని యతివాదులును నుండుటచే నంగీకారము కుదురుట యసంభవమయ్యెను. అది వెనుకటి యైకమత్య సభలవలెనే నిష్ఫలమయ్యెను. యూరపునుండి వసంతకాలములో తిరిగివచ్చిన మాతండ్రి యీ కాన్ఫరెన్సులో నెక్కువశ్రద్ధ తీసికొనెను. చివరకు కడసారి ప్రయత్నముగా మాతండ్రి యాధిపత్యమున ప్రణాళికను తయారుచేయుటకును కుల సమస్యను గురించి పూర్తియైన నివేదికను ప్రకటించుటకును నొకచిన్న కమిటీని యేర్పరచిరి. ఈ కమిటీ నెహ్రూకమిటీ యని పిలువ బడెను. తరువాత నీ నివేదిక నెహ్రూనివేదికయయ్యెను. సర్ తేజబహాదరు సప్రూకూడ నిందులో నొక సభ్యుడు. నివేదికలోని కొంతభాగమున కతడు బాధ్యుడు.

నేను యీకమిటీ సభ్యుడను కాను. కాని కాంగ్రెసు కార్యదర్శి నగుటచే నాకు దానితో నెక్కువ జోక్యముండెను. నాస్థితి యకటవికటముగనుండెను. ఏలనన అధికారమును సంపాదించుకొనుట యధార్థమైన సమస్యయైయుండగా వివరములతో సహా కాగితచట్టములను తయారుచేయుట కేవలము వృథయని నేను భావించితిని. మనలక్ష్యమని చెప్పబడిన డొమినియను పరిపాలన (నిజమునకిది మరింత తక్కువగనేయుండెను) కీ మిశ్రమకమిటీవలన విధాయకముగా నేర్పడు యడ్డంకులు నన్ను మరింత బాంధించెను. నా కీ కమిటీయొక్క నిజమైన ప్రాముఖ్యత కుల ప్రతిష్టంభనలనుండి బయట పడుటకది యేదైన మార్గమును కనుగొనవచ్చునను నదియే! ఏదోయొక యంగీకారమువలన లేక సంధివలన నీ సమస్యకు తుది పరిష్కార మేర్పడునని నేనను కొనలేదు. మన శ్రద్ధను సాంఘిక ఆర్థిక సమస్యలమీాదకు మఱలించినపుడే మనకది సాధ్యమగును. కాని తగినంతమంది యొప్పుకొనినచో తాత్కాలిక సంధియైనను కొంతకష్టమును తొలగించి తద్వారా దృష్టిని యితర సమస్యలమీాదకు మఱలింపవచ్చుననుకొంటిని. కనుక నేను కమిటీ యొక్కపని కభ్యంతరమును కలిగింపక నేను చేయగలిగిన సహాయమును చేసితిని.

జయము కరతలామలకమైనట్లే కాన్పించెను. ఒకటి రెండు విషయములు మాత్రమే మిగిలెను. ఇందులో నిజముగా ముఖ్యమైనది పంజాబు. ఇచ్చట హిందూ, ముస్లిము, సిక్కు సమస్య కలదు. కమిటీవారు పంజాబు సమస్యను తమనివేదికలో నొక నూతన దృక్పథమునుండి వీక్షించి తమ సూచనను కులములకు సంబంధించిన లెక్కలద్వారా సమర్థించిరి. కాని యిది యంతయు వృథయయ్యెను. భయము అవిశ్వాసము యుభయ పక్షముల వారిని యావరించెను. ఆస్వల్పదూరమును తరించుటకు కావలసిన యాచిన్ని యడుగే పడదయ్యెను.

అఖిలపక్షసభ తమ కమిటీయొక్క నివేదికను చర్చించుటకు లక్నోలో సమావేశమయ్యెను. తిరిగి మాలో కొంతమందికి సందిగ్ధావస్థ వచ్చెను. కుల పరిష్కారమునకు, అదిసాధ్యమైనచో, మే మడ్డము తగులువారము కాము. కాని స్వాతంత్ర్య సమస్యమీద మేమెంత మాత్రమును లొంగదలచు కొనలేదు. ఈ సమస్యను విడిచివేయవలసిన దని మేము కోరితిమి. దీనివలన కాంగ్రెసు తన స్వాతంత్ర్య తీర్మానమును విడనాడ నక్కరలేదు; మితవాదులు తమ డొమినియను పరిపాలననే ప్రేమించు కొనవచ్చును. కాని మాతండ్రి నివేదికను పూర్తిచేయవలెనని కూర్చొనెను. అతడు లొంగలేదు. బహుశః ఆపరిస్థితులలో నతడింకొక లాగున చేయజాలడు. అప్పుడు కాన్ఫరెన్సులోని స్వాతంత్ర్యపక్షమువారు దానితరఫున నన్ను స్వాతంత్ర్య లక్ష్యమును తగ్గించు దేనితోనైనను మాకెట్టి సంబంధమును లేదను స్టేటుమెంటు నీయమనిరి. కాని మేమువారి కాటంకము నచ్చువారము కామని స్పష్ట పరచితిమి. మేము కులతత్త్వములకు సంబంధించిన స్టేటుమెంటుకు అడ్డము పోదలచు కొనలేదు.

అంత పెద్దసమస్య సందర్భమున మే మవలంబించిన మార్గమంత పటుత్వ మైనది కాదు; అది వ్యతిరేక భావసూచకము. ఆరోజుననే మేము భారత స్వాతంత్ర్యమును స్థాపించి మాదృక్పథమును కొక కార్యరూపము నిచ్చితిమి.

అఖిలపక్ష సమావేశము నాకు మరియొక యాశ్చర్యమును కలిగించెను. అది, అయోధ్య తాలూకుదార్ల ప్రోత్సాహమువలన, నూతనచట్టములోని ప్రధాన హక్కులకు మరియొక షరతును జేర్చెను. దానిప్రకారము తాలూకుదారుల తాలూకాలలో వారికున్న సంపూర్ణాధికారములకు పూచీ యివ్వబడెను. ఆ చట్టమంతయు స్వంత ఆస్తుల పునాదుల మీదనే నిలుపబడెననుమాట వాస్తవమే! కాని పెద్దపెద్ద

సంస్థానములకు సంబంధించిన యీ స్తిహక్కులలో చట్టములోనుండి యెన్నటికిని తీసివేయ కూడని రాజ్యాంగపు చట్టపునాదులు చేయుట నాకు దౌర్జన్యముగా కాన్పించెను. కాంగ్రెసు నాయకులును, అంత కంటె నెక్కువగా కాంగ్రెసువారు కానివారును, తమ స్వజనములోని వారైన సామ్యవాదులకుగాక, జమీందారుల 'కంపెనీ' నే ప్రోత్సహించుచున్నట్లు యిది విదితము చేయుచున్నది. చాలమంది నాయకులకును మాకునుమధ్య చాలదూరమున్నట్లు స్పష్టమయ్యెను. ఇట్టిపరిస్థితులలో నేను కాంగ్రెసు కార్యదర్శిగానుండుట చాల విక్రృతముగా నుండెను. భారత స్వాతంత్ర్య సంఘమును స్థాపించిన వారిలో నొకడనను మిషతో నేను రాజీనామా యిచ్చితిని. వర్కింగుకమిటీ దీనికొప్పుకొనక కాంగ్రెసు నీతితో నెట్టిసంఘర్షణము లేకుండ మాసంఘము కార్యములను నెరవేర్చుకొన వచ్చునని నాకును సుభాసుచంద్రబోసుకును (ఆతడు కూడ రాజీదాఖలుచేసెను) చెప్పిరి. కాంగ్రెసు యిదివరకే స్వాతంత్ర్యము కొరకు ప్రకటించెననుట వాస్తవము. తిరిగి నేను దీనికంగీకరించితిని. నా రాజీనామా నుపసంహరించుకొనుటకు నన్నుబుట్టలో వేయుటెంత సులభమో యాశ్చర్యమగును! ఇది చాలసార్లుజరిగెను. ఉభయులలో నెవరును తెంచివేసికొనుటకు నిజముగా నిష్టపడక పోవుటచే, నట్లు జరుగకుండ ప్రతిసాకును మేమాశ్లేషించుచుంటిమి.

గాంధీజీ యీ అఖిలపక్ష సభలోగాని, కమిటీ మీటింగులలో గాని పాల్గొన లేదు. అతడు లక్నో కాన్ఫరెన్సుకు రానైనను రాలేదు.

ఈలోపల "తిరిగిపొండు" అను కేకలతో గూడిన గుంపులును నల్లజెండాలును వెంటతరుముచుండ సైమనుకమిషను సంచారము సాగించుచుండెను. అచ్చటచ్చట పోలీసులకును గుంపులకును చిన్నచిన్న కలహములు కలుగుచుండెను. లాహోరులో పరిస్థితులు విషమించెను. అకస్మాత్తుగా దేశమంతటను క్రోధానలమలముకొనెను. లాలా

లజపతిరాయి యచ్చట సైమను కమిషను ప్రతికూల ప్రదర్శనములో నాయకత్వము వహించెను. వేలకొలది ప్రజలముందర నతడు రోడ్డు ప్రక్క నిలచియుండగా నొక యాంగ్లయువక పోలీసుయుద్యోగి వాని పైబడి, వాని వక్షస్థలముమీద కమిచీతో మోదెను. ప్రజలుకాని, లాలాజీకాని యెట్టిదౌర్జన్య పద్ధతులను అవలంబించుట కెట్టిప్రయత్నమును చేయలేదు. అట్లు ప్రశాంతముగ నతడచ్చట నిలిచియుండగా నతనిని, యతని సహచరుల ననేకమందిని పోలీసువారు చావబాదిరి. ఈ వీధులలోని ప్రదర్శనములలో పాల్గొనువారెవరైనను పోలీసులతో సంఘర్షణ వచ్చునను సంగతి గుర్తెరుగవలెను. మన ప్రదర్శనము లెప్పుడును ప్రశాంతములైనవేయైనను, లాలాజీకీసంగతి తెలిసి యతడు మనఃపూర్వకముగనే దీనిని యనుభవించెను. అయినను, ఆనిర్హేతుకమైన దాడియు, నందులో చూపబడిన యనవసర పశుత్వమును భారత ప్రజలకొక యశనిపాతమువలె నుండెను. అవిమేము పోలీసు లాఠీ ప్రయోగముల కలవడనిరోజులు. అనవరత పశుత్వమువలన మాయభిమానము మొద్దుబారిపోయి యుండలేదు. మా నాయకరత్నమును, పంజాబు కేసరియు నట్లు చూడబడుట ఘోరముగా కాన్పించెను. దేశమంతటను, ముఖ్యముగా, నుత్తర హిందూదేశములో నిర్వీర్యమగు క్రోధము ప్రబలెను. ఆహా! మేమెంత యసహాయులము! మానాయకశిఖామణులయభిమానధనమును రక్షింపనైనను రక్షింపజాలని మేమెట్టి నీచులము !

వక్షస్థలముమీద తగులుటచే లాలాజీకి తగిలిన శరీర గాయములు తీవ్రముగనే యుండెను. అతడు చాల కాలమునుండి హృద్రోగముచే బాధపడుచుండెను. బహుశః మంచి యారోగ్యముగల యువకునికివి యంత గొప్పవి కాకపోవచ్చును. లాలాజీ యువకుడును కాడు. ఆరోగ్యవంతుడును కాడు. కొద్ది వారములకే సంభవించిన యతనిమృత్యువుపై నీశరీర గాయముల కెట్టిసంబంధము కలదో నిశ్చితముగా చెప్పుట

కష్టమే. అతని డాక్టర్లు మృత్యువు నీ గాయములు త్వరితము చేసెనను నభిప్రాయ మిచ్చిరి. కాని యీ శరీర గాయముల వెనుకనున్న మానసి కాందోళనమే లాలాజీని యెక్కువగా బాధించె ననుటలో నాకెట్టి సందేహమును కాన్పించదు. అతడు తనకు కలిగిన పరాభవముకు గాక తనను కొట్టుటలో భారతజాతికంతకును కలిగినపరాభవాగ్నికే కుమిలిపోయెను.

ఈ జాతీయ పరాభవాగ్నియే భారత హృదయమును దహించుచుండెను. లాలాజీ యొక్క మృత్యువు వెంటనే సంభవించుటచే దానికి విధాయికముగా పోలీసు దౌర్జన్యమే కారణమనిరి. విచారము, కోపమునకును క్రోధమునకును తావిచ్చెను. ఈవిషయమును మనము బాగుగా గుర్తించవలెను. తరువాత జరిగిన సంభవములను కొంతవరకైనను మన మప్పుడే యర్థము చేసికొనగలము. భగత్సింగు కథయును, ఉత్తర హిందూదేశములో నతని కకస్మాత్తుగా వచ్చిన యద్భుతమైన పేరు ప్రఖ్యాతులును మనకు దీనివలననే యర్థము కాగలవు. వ్యక్తులను, కార్యములను కార్యముల నుద్భవింప చేసిన మహోహ్రదములను గాని, ఆకార్యముల వెనుకనున్న కారణములను గాని యర్థము చేసికొనకుండ గర్హించుట సులభము, మౌర్ఖ్యము. ఇంతకు పూర్వము భగత్సింగు పేరుప్రఖ్యాతులు కలవాడు కాడు. దౌర్జన్యము చేసినందు వలనగాని, భయపెట్టుటవలనగాని యతనికా పేరు కలుగలేదు. హిందూదేశములో టెర్రరిస్టులు అప్పుడప్పుడు గత ముప్పది సంవత్సరముల నుండియు, కాన్పించుచునే యుండిరి. వంగదేశములో, నెప్పుడో మొట్ట మొదటి రోజులలో తప్ప, వారిలో నొక్కనికిని భగత్సింగుకు కలిగిన పేరు ప్రఖ్యాతులలో నొక్క శతాంశమైనను అబ్బలేదు. ఈ యథార్థము నెవరును కాదనజాలరు. దీనిని యొప్పుకొని తీరవలెను. మరయొక విషయమేమన టెర్రరిజము అప్పుడప్పుడుబుకు చుండినను భారత యువకులకు దానియందు యథార్థమైన ప్రేమలేదు. పదిహేను సంవ

త్సరముల నిరంతర దౌర్జన్య రాహిత్య ప్రచారము భారతదేశపు నాడు లను మార్చివేసెను. ప్రజలనది టెర్రరిజము పట్ల మరింత యుదాసీను లను, విముఖులనుచేసెను. టెర్రరిస్టులు సాధారణముగా వచ్చుచుండు మధ్యతరగతులలోని క్రిందితరహా వారును విద్యాధికులును దౌర్జన్య పద్ధతులకు వ్యతిరేకమైన కాంగ్రెసు ప్రచారమువలన పూర్తిగా మారి పోయిరి. విప్లవము కావలెనని కోరువారిలోని యుత్సాహవంతులు, ఆలస్యము నొల్లనివారు విప్లవము టెర్రరిజము వలన రాదనియు, నది పాతగిలిన వ్యర్థప్రయత్నమనియు, నది యథార్థమైన విప్లవకార్య ముల కడ్డుతగులు ననియు గ్రహించిరి. భారత దేశములోను యితర చోట్లను టెర్రరిజము నశించుచున్నది. అది ప్రభుత్వ వత్తిడిచేత గాక (అది దానిని యణచ వచ్చును, బిరడా వేయవచ్చును కాని, నశింప చేయజాలదు) దానిలోనున్న మూలకారణములచేతను, ప్రపంచ పరి స్థితుల చేతను నశించును. టెర్రరిజము సాధారణముగా దేశములోని విప్లవోద్వేగ శైశవ సూచకము. ఆ యంతరువు దాటును. దానితో టెర్రరిజము కూడ నొక ప్రధాన విధానముగ నంతరించును. స్థానిక కారణముల చేతగాని వ్యక్తుల నణచుట చేతగాని యది యప్పుడప్పుడు పొక్కవచ్చును. నిశ్చయముగా భారత దేశమీయంతరువును దాటును. ఈ మధ్యమధ్య సంభవములు కూడ క్రమముగా నశించును. భారత దేశములోని ప్రజలందరును దౌర్జన్యపద్ధతులను విశ్వసించుట మానివేసి రని దీనియర్థము కాదు. వారు చాలవరకు వ్యక్తిగత దౌర్జన్యమును, టెర్రరిజమును విశ్వసించుట మానివేసిరి. ఇతర దేశములన్నింటిలో నవసర మైనట్లే యిచ్చటను స్వాతంత్ర్యసంపాదన కొరకు సక్రమమైన దౌర్జన్య పద్ధతు లవసరమగు కాలము వచ్చునని విశ్వసించు వారు చాలమంది లేకపోలేదు. అది యిప్పుడు ప్రస్తుత సమస్య. కాలమే దానిని పరిష్కరింప గలదు. దానికి టెర్రరిస్టు పద్ధతులతో సంబంధము లేదు.

కనుక భగత్సింగుకు టెర్రరిస్టు కార్యముచే పేరు కలుగలేదు. అతడు, తాత్కాలికముగ, లాలాలజపతిరాయి యొక్కయు తద్వారా జాతియొక్కయు గౌరవమును రక్షింప వచ్చినట్లుండెను. అతడొక చిహ్న మయ్యెను; కార్యము మరువబడెను. చిహ్నము మాత్రమే మిగిలెను. కొద్ది నెలలలో పంజాబులోని ప్రతిగ్రామమును, తక్కువ స్థాయిలో ఉత్తర హిందూస్థానమంతయును నతని నామముతో మారుమోగెను. అతనిని గురించి యసంఖ్యాకమగు గీతములు బయలుదేరెను. అతడు సాధించిన పేరుప్రఖ్యాతు లద్భుతములు.

సైమను కమిషను పరిహారణమయిన కొద్దికాలములో లజపతి రాయి ఢిల్లీలో జరిగిన అ. భా. కా. కమిటీకి హాజరయ్యెను. అతని యొంటిమీద గాయములింకను కాన్పించుచుండెను. అతడింకను దెబ్బల ఫలితముగా బాధపడుచుండెను. ఆసభ లక్నో అఖిల పక్షసభ యైన తరువాత నయ్యెను. స్వాతంత్ర్య సమస్య యెదోయొక రూపమున చర్చకు వచ్చెను. సందర్భ మెట్టిదో నాకు జ్ఞప్తిలేదు. కాని కాంగ్రెసు రాజకీయ సాంఘిక నిర్మాణములలో తీవ్రమైన మార్పులను తెచ్చెడి విప్లవ దృక్పథమునో లేక సంస్కరణ విధానమను లక్ష్యమునో - రెంటిలో దేనినో యొకదానిని నిశ్చయించుకొనవలసిన సమయము వచ్చినదని నేను విపులముగ మాట్లాడితిని. ఆ నా యుపన్యాసమునకు ప్రాముఖ్యతలేదు. లాలాజీ కమిటీలో దానికి ప్రత్యుత్తరమిచ్చుచు దానిలో కొంతభాగమును విమర్శింపక పోయినచో నేను దానిని మరచియుండెడి వాడను. బ్రిటిషులేబరుపార్టీనుండి మనమేమియు నాశింపరాదని యతడు మందలించెను. నాకు సంబంధించినంతవరకు నామందలింపు యనవసరము. ఏలనన నేను బ్రిటిషు అనేకార లేబరు నాయకత్వమును చూచి పొంగువాడను కాను.

లాహోరు తిరిగి వెళ్లుటతోడనే లాలాజీ అ. భా. కా. కమిటీలో నేనిచ్చిన యుపన్యాసమునకు మరలి దానికి సంబంధించిన యనేక సమస్యలను గురించి తన వారపత్రికయైన 'ప్రజ' లో వ్రాయ దొడగెను. మొదటి వ్యాసము మాత్రమే వచ్చెను. రెండవ వ్యాసము తరువాత వారములో వచ్చులోపల నతడు చనిపోయెను. అసంపూర్తియైన యతని యీ మొదటి వ్యాసము (బహుశః అదియే యతడు ప్రచురణ కిచ్చిన కడసారి వ్రాత) నన్ను విచారమున ముంచెను.



## ౨౫

## లాఠీ ఛార్జీల యనుభవము.

—◊)O(◊—

లాలా లజపతిరాయి నావిధముగా కొట్టుటయు, తరువాత నతడు చనిపోవుటయు సైమను కమిషను బహిష్కరణమునకు మరింత తీవ్రత నిచ్చెను. కమిషను లక్నోకు రావలసి యుండెను. స్థానిక కాంగ్రెసు కమిటీవారు దాని 'సాహ్వానించుటకు' గొప్ప ప్రయత్నములను చేసిరి. చాలరోజులు ముందుగనే ప్రచారముకొరకును, అసలు ప్రదర్శనముకు సంసిద్ధము చేయుటకును బ్రహ్మాండమైన యుత్సవములు, సభలు, ప్రదర్శనములు చేయబడుచుండెను. నేను లక్నో వెళ్ళి వీటిలో కొన్నింటిని చూచితిని. చాల సక్రమముగను, ప్రశాంతముగను నుండి జయప్రదముగ జరుగుచున్న యీప్రదర్శనములచే ప్రభుత్వముకు కళ్ళు కుట్టి వారు వీటికభ్యంతరములను కల్పింప నారంభించి, కొన్ని ప్రాంతములలో నుత్సవములను జరుప గూడదని నిషేధించిరి. ఈసంధర్భములోనే నాకొక క్రొత్త యనుభవముకలిగెను. నాశరీరము పోలీసుల కమిచీ దెబ్బలను, లాఠీ ప్రహారణములను చవి జూచెను.

రహదారీ కడ్డము వచ్చుచున్నవనునెపమున యుత్సవములను నిషేధించిరి. అట్టిదోషము కలుగకుండుటకు మేము పదునారు మంది చొప్పున విడివిడిగా విజనముగానుండు వీధులనుండి సభాప్రదేశమునకు పోవ నిశ్చయించితిమి. శాస్త్రరీత్యా యిది యాజ్ఞోల్లంఘనమే యగును. ఏలనన జెండాయును, పదునారుమంది జనమును యొకయుత్సవమగును. నేనిట్టి పదునారుమందిగల యొకయుత్సవమును నడిపితిని. తరువాత గోవిందవల్లభపంతు యాధిపత్యమున మరి పదునారుమంది వచ్చిరి. మాయుభయులకును చాల యెడముండెను, మేము రెండువందల

This is the most important chapter to all the human beings.



The Natural treatment is in this_

గజములు దూరము వెళ్ళితిమో లేదో మావెనుక గుఱ్ఱపు డెక్కల మోతవినిపించెను. ఆరోడ్డున జనములేరు. మేము వెనుకకు తిరిగి చూచుసరికి కొంతమంది యశ్వారూఢులైన పోలీసులు (బహుశః రెండుమూడు డజనులుండురు) వాయువేగమున మాపైకురుక వచ్చుచుండిరి. వారు క్షణికములో మాపైకి వచ్చుటచే నాదాడికి పదునారుమందిగల మాచిన్నదళము విడిపోయెను. వెంటనే పోలీసులు పెద్ద కమిచీలతో మా వాలంటీర్లను మోదనారంభించిరి. సహజముగా వారు ప్రక్కతోవల శరణు జొచ్చిరి. కొందరు చిన్నచిన్న దుకాణములలో ప్రవేశించిరి. పోలీసులు వారిని వెంబడించి చావమోదిరి. గుఱ్ఱములు మాపైబడవచ్చినపుడు నాబుద్ధి గూడ సహజముగా రక్షణ నన్వేషించెను. ఆ దృశ్యము కడు దీనమైనది. కాని, మరియొక యూహా నన్నుచోటనుండి కదలనీయలేదు. నే నా మొదటి దాడికి (వాలంటీర్లు నన్ను వెనుకనుండి కాపాడుటచే) నిలువగలిగితిని. రోడ్డుమధ్య నే నొక్కడనే యున్నట్లు నేనకస్మాత్తుగా తెలిసికొంటిని. నాకు కొద్ది గజముల దూరములో నన్నివైపులను పోలీసులు వాలంటీర్లను కొట్టుచుండిరి. పోలీసుల కంతగా కాన్పించకుండుటకు నే నప్రయత్నముగా రోడ్డుప్రక్కకు మెల్లగా జారనారంభించితిని. కాని తిరిగి నేనాగి, నాలోనేను తర్కించుకొని, యీవిధముగా జారిపోవుట నాకు తగదని నిశ్చయించుకొంటిని. ఈతర్కముకంతకును కొద్దిసెకనులుపట్టెను. కాని నాలోజరిగిన ఆయాంతరంగిక పోరాటమును, అనిశ్చయమును కళ్లకుకట్టినట్లు నా స్మృతిపథమున నిలిచియుండెను. నేను భీరువువలె ప్రవర్తించుటను సహింపజాలని నాయభిమానధనముచేతనే యానిశ్చయము కలిగెనని నేననుకొందును. అయినను భీరధీరత్వములమధ్య నెంతయోయెడము లేకపోవుటచే నేనటు వాలినను వాలియుండెడివాడను. నేనట్లు నిశ్చయించితినో లేదో యప్పుడే యొక యశ్వారూఢుడైన పోలీసు తనవాడు

గైన కొర్రతకమిచీని విసురుకొనుచు చఱచఱ నామీదకు వచ్చెను. నేనతనిని ముందుకు పొమ్మని నాతలను తప్పించుకొంటిని. తలను ముఖమునురక్షించుకొనుటకిదిమరియొకయప్రియత్న ప్రయత్నము.అతడు నావీపుమీద 'ఛెళ్ళుమను' రెండు దెబ్బలను తగిలించెను. నాకురిమ్మె త్తెను. శరీరమంతయు కంపించెను. కాని నేనింకను నాకాశ్చర్యము, తృప్తియు కలుగునట్లు నిలిచియేయుంటిని. తరువాత పోలీసు దళమును మామార్గమున కడ్డముగా నిలబెట్టిరి. మావాలంటీర్లు తిరిగి కలుసు కొనిరి. వారి శరీరము రక్తసిక్తమయ్యెను. కొంతమంది బుర్రలు పగి లెను. గోవింద వల్లభపంతు తన పరివారముతో మమ్ముకలుసుకొనెను. వారికి కూడ ప్రహారణములు తగిలెను. మేమందరమును పోలీసుల యెదుట నేలమీద కూర్చుంటిమి. మేమట్లు చీకటిపడునరకును కూర్చుం టిమి. ఒకప్రక్క గొప్ప గొప్ప ప్రభుత్వోద్యోగులు కూడిరి. మరియొక వంక వార్తలు ప్రబలిన కొలది ప్రజలు గుంపులుగూడ నారంభించిరి. చివరకు అధికారులు మమ్ము మామూలు మార్గమున పోవుట కంగీక రించిరి. మాపై దాడి వెడలి మమ్ము బాదిన పోలీసులు ముందు అంగర క్షకుల క్రింద నడుచుచుండ, మేమామార్గముననే వెళ్ళితిమి.

దీనివలన నెక్కుడు ఫలితము కలుగుటచే నేనీ చిన్నవిషయ మును గురించి యింత వివరముగా వ్రాసితిని. లాఠీదెబ్బలకాగ గలి గితి నను యుత్సాహములో, నేన్నూనా శరీరబాధను పూర్తిగా మరచి పోతిని. ఈ కథ యంతయు జరుగుచుండగా, (నేను దెబ్బలు తిను చున్నపుడు కూడ) నామనస్సు అతి నిర్మలముగానుండుటయు, నాభావ ములను నేను బుద్ధిపూర్వకముగ పరీక్షించుకొను చుండుటయు, నా కాశ్చర్యకరముగ నుండెను. మరునాటి యగ్ని పరీక్ష కీనాందీ యుత్స వము నాకెంతయో తోడ్పడెను. మరునాడే సైమను కమిషను రావల సిన దినము. మా ప్రదర్శనము జరుగుదినము.

అప్పుడు మాతండ్రి అలహాబాదులో నుండెను. నాపై పోలీసులు దాడివెడలిరనువార్త వినినచో నతడును మాకుటుంబమును చికాకు పడుదురను భయము నాకుండెను. కనుక నేను, అంతయు బాగుగనే యున్నదనియు, నతడు విచార పడనవసరము లేదనియు రాత్రి టెలిఫోనులో చెప్పితిని. కాని యతడు చికాకుపడి, నిద్రపట్టక, రాత్రి పన్నెండు గంటలకు లక్నో వచ్చుటకు నిశ్చయించుకొనెను. ఆఖరు రైలు దాటిపోవుటచే నతడు మోటారులో పయనమయ్యెను. త్రోవలో నతని కొక యవాంతరము కూడ తటస్థించెను. చివరకతడు యలసి సొలసి నూటనలుబది యారుమైళ్ళు ప్రయాణముచేసి లక్నో ప్రాంతఃకాల మయిదు గంటలకు చేరుకొనెను. మేమప్పుడే యుత్సవములో పాల్గొనుటకు స్టేషనుకు బయలుదేరుచుంటిమి. మేము చేసిన ప్రయత్నములకంటె గత సాయంకాలపు సంభవములే లక్నో నంతను మేల్కొలిపెను. సూర్యోదయము కాకపూర్వమే వేలకొలది జనము స్టేషనుకు చేరిరి. పట్టణములోని వివిధభాగములనుండి యసంఖ్యాకమగు చిన్నచిన్న యుత్సవములు బయలుదేరెను. కాంగ్రెసు ఆఫీసునుండి యనేకవేలమంది నలుగురుచొప్పున బారులు తీరిపోవు ప్రధాన యుత్సవము బయలుదేరెను. మేమీప్రధాన యుత్సవములో నుంటిమి. మేము స్టేషనుకు వెళ్లుటతోడనే పోలీసులు మమ్మాపివేసిరి. స్టేషను ముందు అర్థ చతురపు మైలు దూరము విశాలమైన బహిరంగ ప్రదేశముండెను. మేమీ మైదానమున కొకవైపున బారులుతీరి నిలిచి యుంటిమి. ముందుకు త్రోసికొనిపోవు ప్రయత్నమేమియు లేక నచ్చటనే మాయుత్సవ మాగిపోయెను. ఆప్రదేశము మామూలు పోలీసులతోను, గుఱ్ఱపు పోలీసులతోను, మిలిటరీతోను నిండియుండెను. యుత్సవమును చూడవచ్చిన యభిమానులసంఖ్య యంతకంతకు హెచ్చెను. వీరిలో చాలమంది యిద్దరు ముగ్గురు చొప్పున మైదానములో సర్దుకొనిరి. దూరములో నడుచుచున్న సమూహ మొకటి మా

కకస్మాత్తుగా కాన్పించెను. అది యాపరిదేశము. నంతను కప్పివేయు చుండిన రెండుమూడు శ్రేణుల యాశ్వికదళము. వారు మాపై బడు టకు దౌడుమీద వచ్చుచు మైదానములో నచ్చటచ్చట చెల్లాచెద రుగానున్న వారిని మోదుచు, గుఱ్ఱములతో త్రొక్కుకొనుచు వచ్చు చుండిరి. స్వారిచేయుచువచ్చిన యాశ్వికుల దాడి చూచుట కందముగనే యుండెను. కాని త్రోవలో నిరపరాధులును, యుత్సవమును చూచు టకు వచ్చినవారును గుఱ్ఱపు డెక్కలక్రిందబడి నలుగుచుండిరి. దాడి తీసిన యీదళముల వెనుక నీప్రజలు నేలమీద పడియుండిరి. కొందరు లేచలేని స్థితిలోను, కొందరు బాధచే మూల్గుచునుండి యీ మైదాన మంతయు నొక యుద్ధరంగమువలె నుండెను. కాని యా దృశ్యమును చూచుటకును, యోచించుటకును సావకాశము లేకుండెను. ఆశ్వికులు క్షణికములో మాపైకివచ్చిరి. మొదటి దళమప్పుడే యుత్సవములో పాల్గొను జనసమూహముపై బడెను. మేము కదలలేదు. మాస్థలము లను వీడలేదు. కనుక గుఱ్ఱములు చివర నిముసమున తటాలున ఆగి వెనుక కాళ్ళపై నిలిచి ముందరి డెక్కల నెత్తి గాలిలో మాశిరములపై తాండవమాడుచుండెను. తరువాత నాశ్వికులును మామూలు పోలీసు లునుకూడ మమ్ము లాఠీలతోను, పొడుగుపాటి కమిచీలతోను మోద నారంభించిరి. అదిశివతాండవమువలె నుండెను. గతసాయంకాలముండిన యానిర్మలదృష్టినాకు లేకపోయెను. నేనెక్కడ నుంటినో యచ్చటనుండి యొక్క యంగుళమైనను ముందుకుగాని వెనుకకుగాని పోరాదని మాత్రమే గ్రహించితిని. ఆదెబ్బలచే నేను సగము గుడ్డివాడనైతిని. ఒక్కొక్కప్పుడు కొద్దికోపమును దెబ్బకుదెబ్బ తీయవలెనను కోరికయు నన్నావహించుచుండెను. నా యెదుటనున్న పోలీసు యుద్యోగినిగుర్రము మీదనుండి పీకివేసి నే నాగుర్రము నెక్కుట యొక ఘనకార్యము కాదనుకొంటిని. కాని యొకన్యాయమునకు కట్టుబడుటయు, చిరశిక్షయు నన్ను మందలించెను. ముఖముమీద దెబ్బపడకుండ తప్పించుకొనుటకు

తప్ప నేను చేయియైనను యెత్తలేదు. ఇంతేకాక మే మేమాత్రము దౌర్జన్యమునకు గడంగినను మాలో నసంఖ్యాకులను కాల్చుటయు పేల్చుటయు జరుగునని నే నెరుగుదును.

యుగములవలె కాన్పించిన యీకొద్ది నిమిషములైన తరువాత మాపంక్తినెమ్మదిగా నడుగడుగుచొప్పున విడిపోకుండగనే తొ్రిరయిచ్చు చుండెను. దీనిమూలమున నేను కొంత యొంటరినైతిని. మరింత దెబ్బల వర్షము కురియ నారంభించెను. అకస్మాత్తుగా వెనుకనుండి నన్నెవరో పట్టుకొని మోసికొనిపోయిరి. నాసహచరులలో కొందరు యువకులు నాపై గొప్పదాడి రానున్నదని భావించి నన్ని సూక్ష్మమార్గమున రక్షింప నిశ్చయించిరి.

యుత్సవములలో పాల్గొనుచున్నవారు తిరిగి మా మొదటి పంక్తికి నూరడుగుల దూరములో నిలువబడిరి. పోలీసులు కూడ నెను కకు తగ్గి మాకు యేబదియడుగుల దూరములో నుండిరి. ఈకష్టము నంతకును కారణమైన సైమనుకమిషను అరమైలు పైగానున్న స్టేషను నుండి రహస్యముగా జారిపోవు సమయమున మేమీవిధముగా నుంటిమి. అయినను వారికి నల్లజెండాలు తప్పవయ్యెను. తరువాత మేము పెద్ద యుత్సవముతో కాంగ్రెసు ఆఫీసుకు వచ్చి యచ్చటనుంచి విడిపోతిమి. నేను నాకొరకాతురతతోనున్న తండ్రిగారి యొద్దకు వెళ్ళితిని.

అప్పుడా తాత్కాలికావేశము తగ్గిపోవుటచే నాశరీర మంతయు బాధింప నారంభించి యలసట హెచ్చుచుండెను. నాశరీరములో నొప్పిపెట్టని భాగమేదియు కాన్పించ దయ్యెను. ఒడలునిండ గాయములు, కవుకు దెబ్బలు మొదలగు వాని చిహ్నములుండెను. అదృష్టవశాత్తు నాకు మర్మస్థానములలో మాత్రము దెబ్బలు తగుల లేదు. నా స్నేహితులు చాలమంది కంతటి యదృష్టము పట్టలేదు. వారికి చాల గాయములుతగిలెను. నాప్రక్కనిలిచిన గోవిందవల్లభపంతు అరడు

గుల చిల్లరమనిపియగుటచే దెబ్బలకు మరింతగురియయ్యెను. అప్పుడు తగిలిన గాయములచే నతడు చాలకాలమువరకు నడుము మెత్తలేక, నేపనియు చేయజాలక యుండెను. నాశరీర స్థితియు, సహనశక్తియు బాగుండెనను మరింత గర్వముతో నేను బయటపడితిని. కాని దెబ్బలకంటె మాపై దాడివెడలిన యాపోలీసులయొక్క, ముఖ్యముగా, నుద్యోగస్థులయొక్క ముఖములను నేనెన్నటికిని మరువజాలను. నిజమైన దెబ్బలను చాలవరకు యూరపియను సార్జంటులే కొట్టిరి. భారత పోలీసులును, ఉద్యోగస్థులును కొంచెము తేలిక పద్ధతుల నవలంబించిరి. ఆహా! ఆముఖములు ద్వేషముతోను, రక్తపిపాసతోను నిండి, యావంతయైనను సానుభూతిగాని, మానవ లక్షణములుగాని లేక కొంచె మించుమించు పిచ్చియెత్తినట్లుండెను. బహుశః ఆసమయమున మాముఖములును చూచుట కంత ద్వేషపూరితముగనే యుండవచ్చును. తటస్థముగా నుండినంత మాత్రమున మేము మాశత్రువులపట్ల ప్రేమపూరితులమై యుండలేదు. మాతాటస్థ్యము మాముఖముల యందచందములను వృద్ధిచేయలేదు. అయినను మాకు పరస్పర క్రోధములేదు; వ్యక్తిగతమైన పోరాటము కాని ద్వేషముకానిలేదు. రెండు బలీయమైన వింతశక్తులకు మే మాసమయమున ప్రతినిధులమైతిమి. అవి మాబుద్ధులను, మాహృదయములను జయించి, మాకోరికలను, రాగములను ఉద్రేకపరచి మమ్ము తమ గ్రుడ్డి యుపకరణములుగా చేసికొనెను. మే మెందుకు పోరాడుచుంటిమో, మేమెచ్చటకు పోవుచుంటిమో తెలియకుండగనే గ్రుడ్డిగా పోరితిమి. కార్యోద్రేకము మమ్ము బంధించెను. కాని, యది గతించుట తోడనే యిది యంతయు దేని కొరకు? దేనికొరకు? యను ప్రశ్నయుదయించెను.

---

## ౨౬

## ట్రేడుయూనియను కాంగ్రెసు.

ఆసంవత్సరము సైమను కమిషను బహిష్కారణమును, అఖిల పక్ష సభయు దేశములో రాజకీయముగ ప్రసిద్ధిచెందెను. కాని నాప్రత్యేక శ్రద్ధయు, కార్యాసక్తియు నితరత్ర యుండెను. కాంగ్రెసు కార్యదర్శి నగుటచే నే నాసంస్థను పరీక్షించుచు దానిని బలపరచుట కెక్కువుగా పనిచేయుచుంటిని. ప్రజల దృష్టిని సాంఘిక, ఆర్థిక మార్పులవైపు మరలించుటయే నాప్రధానాశయము. స్వాతంత్ర్యమును గురించి మదార్సులో మేమార్జించిన స్థానము కట్టుదిట్టము చేసికొనవలసి యుండెను. ముఖ్యముగా నఖిలపక్షసభ మమ్ము వెనుకకు లాగుచుండుటచే నిది మరింత యవసరమయ్యెను. ఈలక్ష్యముతో నేను చాలవరకు తిరిగి యనేక ప్రధాన సభలలో నుపన్యసించితిని. 1928 లో నేను నాలుగు రాష్ట్రసభలలో-పంజాబు, దక్షిణమున మలబారు, ఢిల్లీ, సంయుక్త పరగణాలలో-నధ్యక్షతనువహించితిని. వంగదేశము,బొంబాయిలలో ననేక యువజనసభలకును, విద్యార్థుల సభలకునుకూడ నధ్యక్షత వహించితిని. అప్పుడప్పుడు సంయుక్త పరగణా లలో నేనుగ్రామసీమలకు వెళ్లితిని. తఱచుపారిశ్రామిక కూలీలకు కూడ నుపన్యసించు చుంటిని.స్థానిక పరిస్థితులను బట్టి రూపము భేదించు చుండినను, సభలలోనున్న సభ్యులను బట్టిప్రాముఖ్యత హెచ్చింపబడుచున్నను మొత్తముమీద నాయుపన్యాసముల సారాంశమొక్కటిగనే యుండెను. ప్రతిచోటను నేను రాజకీయ స్వాతంత్ర్యమును గురించియు, సాంఘిక స్వాతంత్ర్యమును గురించియు చెప్పుచు మొదటిది రెండవదానిని సాధించుటకొక సోపానమని చెప్పుచుంటిని. నేను సామ్యవాద భావములను వ్యాప్తిచేయ కోరితిని. జాతికి వెన్నెముకవంటి వారైన కాంగ్రెసు సేవకులును, విద్యాధికులును

అతి సంకుచితమైన జాతీయ భావములనే కలిగియుండుటచే ముఖ్యముగా వారిలోనేయీభావములను వ్యాప్తిచేయ కోరితిని. వారియుపన్యాసములు ప్రాచీన యౌన్నత్యమును పొగడుచుండెను; పరప్రభుత్వముచే మనకు దాపరించిన ఆర్థిక, యాధ్యాత్మిక కష్టములను, మన ప్రజలయొక్క యనేకబాధలను, పరప్రభుత్వము వలస కలుగుచున్న యమర్యాదలను, జాతీయ గౌరవము స్వాతంత్ర్యము నెట్లువాంఛించు చున్నదియు, మాతృ పాదారవిందములకడ నాత్మార్పణ మొనర్ంప వలసినయావశ్యకత మొద లగు విషయములను గురించి చెప్పుచుండెను. ఆవిషయము లందరకును సుబోధకములై ప్రతిభారత హృదయము నట్టిభావములతోనే స్పందించు చుండెను. నాలోనున్న జాతీయ భావముకూడ (నేను హిందూదేశ ములోగాని మరెచ్చటగాని ప్రాచీన యౌన్నత్యమును గుడ్డిగా పొగడు వాడను కాకపోయినను) నుద్దీపిత మయ్యెను. కాని వాటిలోని సత్యమునకెట్టిభంగమును కలుగక పోయినను నిరంతరము ఆపాటనే పాడుచుండుటచే నవి పేలవ మగుచు నితర సమస్యలను గురించియు మన పోరాటములోని ప్రధానాంశములను గురించియు యోచించుట కడ్డు తగులుచుండెను. అవి కేవలము ఉద్రేకమును పెంచుచుండెనే కాని యాలోచనను వృద్ధిచేయుచుండుటలేదు.

భారత దేశమునకు సామ్యవాదమును తెచ్చుటలో నేను ప్రథ ముడనుకాను. నిజముగా నేను వెనుకపడి యుండి, యనేకమంది యీ సందేశమును నాకంటెముందు ఘోషించియుండ, నెమ్మదిగా యడు గడుగుచొప్పుననే బాధతో ముందుకు నడిచితిని. పనివాండ్ర ట్రేడు యూనియను ఉద్యమము, యాశయములలో నిశ్చయముగా సామ్యవాద పరముగనే యుండెను. యువజన సంఘములును చాలవరకు నట్లే యుండెను. నేను యూరపునుండి 1927 డిసెంబరులో తిరిగివచ్చునరికి యస్పష్టముగను కంగారుగను నుండిన సామ్యవాదము భారతదేశ

వాతావరణములో నొకభాగమైపోయెను. అంతకుముందుకూడ చాల మంది సామ్యవాదులు వ్యక్తిగతముగ నుండిరి. వారుచాలవరకు గాలి మేడలను కట్టుచుండిరి. కాని మార్క్సుగారి సిద్ధాంతము వారి నంత కంత కాకర్షించుచుండెను. కొద్దిమంది నూటికి నూరువంతులు మార్క్సుగారి శిష్యులమనుకొనిరి. అమెరికా, యూరపులలో వలెనే యిచ్చటను సోవియటు యూనియనులో జరిగిన యభివృద్ధులవలన, ముఖ్యముగా నయిదు సంవత్సరముల ప్లానువలన, నీభావము బలీయ మయ్యెను.

ప్రధాన కాంగ్రెసు ఆఫీసులు చేతిలోనున్న కాంగ్రెసు ముఖ్యులలో నొకడనగుటయే నేను సామ్యవాది నగుటలో నున్న ప్రాధాన్యత. ఈవిధముగనే యోచింప నారంభించిన కాంగ్రెసు ముఖ్యులింకను కలరు. సంయుక్తపరగణాల రాష్ట్ర కాంగ్రెసు కమిటీలో నిది బాగుగ విదితమయ్యెను. ఈ కమిటీలో మేము 1926లోనే తేలికయైన సామ్యవాద ప్రోగ్రాము నొకదానిని వేయుటకు ప్రయత్నించితిమి. మారా ష్ట్రము జమీందారులయొక్కయు తాలూకుదారులయొక్కయు రా ష్ట్రము. మేము మొట్టమొదట భూమిసమస్య నెదుర్కొన వలసి యుండెను. వర్తమాన భూమిపద్ధతి పోవలెననియు ప్రభుత్వమునకును వ్యవసాయదారులకును మధ్య నెవరును ఉండరాదనియు మేము ప్రక టించితిమి. వాతావరణమింకను నట్టి భావముల కలవడక పోవుటచే మేము కొంత జాగ్రతగనే పోవలసియుండెను.

మరుసంవత్సరము, 1929, మా కాంగ్రెసు కమిటీ మరియొక యడుగు ముందుకుపోయి సామ్యవాదపద్ధతిమీద అ. భా. కా. కమిటీకొక సూచనచేసెను. ఈ రెండవ కమిటీ ఆసంవత్సర వేసవిలో, బొంబాయిలో కలుసుకొని మా రాష్ట్రకమిటీ తీర్మానముయొక్క ప్రియాంబులు నవలంబించి మొత్తము తీర్మాన

మంతకును వెనుకనున్న సామ్యవాద సూత్రము నంగీకరించెను. మా రాష్ట్రతీర్మానములోని వివరమైన ప్రణాళిక నాలోచించుటకు మరి యొక తేదీకి వాయిదా వేసిరి. చాలమంది అ. భా. కా. కమిటీలోను మా రాష్ట్రకమిటీలోను అంగీకరింపబడిన యీ తీర్మానములను మరచి పోయి సామ్యవాద విషయము గత సంవత్సర కాంగ్రెసులో నకస్మాత్తు గావచ్చినట్లూహించుచుందురు. కాని అ. భా. కా. కమిటీ ఆ తీర్మానమును బాగుగ యోచించకుండ నామోదించిరనుట సత్యము. బహుశః చాలమంది సభ్యులు వాకేమిచేయుచుండిరో గుర్తింపలేదు. భారత స్వాతంత్ర్య లీగుయొక్క మా రాష్ట్రశాఖ (అందరును రాష్ట్రములోని ముఖ్యకాంగ్రెసు సేవకులే) స్పష్టముగా సామ్యవాద పరముగనుండి మిశ్రమ సంస్థయైన కాంగ్రెసు కమిటీకంటె మరికొద్ది ముందుకు వెళ్లెను. స్వాతంత్ర్య సంఘముయొక్క లక్ష్యములలో నొకటి సాంఘిక స్వేచ్ఛ యనుటసత్యము. మేము భారత దేశమంతటను యీలీగును బలీయమైన సంస్థగాచేసి తద్వారా స్వాతంత్ర్య, సామ్యవాద ప్రచారములనుచేయ నెంచితిమి. దురదృష్టవశాత్తు, నాకాశాభంగము కలుగునట్లు, యీలీగు మారాష్ట్రములో కొంతవరకు తప్ప యెప్పుడును వృద్ధిచెందలేదు. దేశ ములో దీనికి తగిన బలము లేకపోవుటచే నిట్లు జరుగలేదు. మాలో చాలమంది కాంగ్రెసులోకూడ చాల ప్రధానులగుట చేతను, కాంగ్రెసు సిద్ధాంతములో నైనను, స్వాతంత్ర్య తీర్మానము నవలం బించుట చేతను, వారెల్లపుడును కాంగ్రెసు సంస్థ ద్వారముననే పని చేయగలరు. లీగును మొట్టమొదట స్థాపించిన వారిలో కొందరికి దాని నొక గొప్ప సంస్థగా చేయవలెనను శ్రద్ధలేదు. వారు దానిని కాంగ్రెసుకార్యనిర్వాహక వర్గముమీద నొత్తిడిని కలుగజేయు నొక పరికరముగనులేక కాంగ్రెసు వర్కింగు కమిటీ యెన్నికలలో నుపయో గించుకొను పరికరముగను చూచిరి, కనుక స్వాతంత్ర్య లీగు కృశించెను.

కాంగ్రెసు తీవ్రరూపమును దాల్చినకొలది యది శక్తివంతుల నందరను తనలోనికి లాగుకొనుటచే లీగు దుర్బలమయ్యెను. 1930 లో శాస నోల్లంఘనము వచ్చుట తోడనే లీగు కాంగ్రెసులో కలిసిపోయి యంతరించెను.

1928, 1929 లలో నా అరెస్టును గురించి తఱచు వదంతులు బయలుదేరెను. పత్రికలలోని సూచనలకు గాని, తెలిసికొనుట కవకా శములున్న వారివలె కాన్పించిన స్నేహితుల రహస్య మందలింపులలో గాని యెంత సత్యమున్నదో నాకు తెలియదు. కాని యీమందలింపుల వలన నాలో కొంత యనిశ్చయము బయలుదేరి నాకది సమీపించు చున్నట్లే తోచెడిది. నేను దీనిని లెక్కచేయలేదు. ఏలనన భవిష్యత్తు యెట్లు జరిగినను, నాకు ముందు స్థిరజీవిత ముండనేరదని నేనెఱుగుదును. ఈయనిశ్చయమునకు, ఆకస్మిక మార్పులకు, జయిలు సందర్శనములకు నెంత త్వరగ యలవడిన నంత మంచిది. మొత్తము మీఁద నేనీ భావ మునకు బాగుగనే యలవడితి ననుకొనెదను. ఎప్పుడు అరెస్టు వచ్చినను నేను దానిని సామాన్య విషయము వలెనే చూచితిని. కనుక అరెస్టు వదంతుల వలన లాభములు లేకపోలేదు. అవి నానిత్య జీవితమునకు కొంత యుద్రేకమును, పట్టును సమకూర్చెను. స్వేచ్ఛయున్న ప్రతి దినము యమూల్యము, సంపాదింపబడిన యొకదినము. యథార్థమునకు 1928-1929 లలోనే నాకు చాల సావకాశము దొరికెను. 1930 ఎప్రిల్ వరకు నాఅరెస్టు రాలేదు. తరువాత ఖయిదు వెలుపలనున్న నాస్వల్ప కాలములలో స్థిరత్వము లేకపోయెను. నేను మాయింట కొద్దికాలము చూచిపోవుటకు వచ్చిన యొక క్రొత్తవానివలె మెలగెడి వాఁడను; లేదా రేపేమి రానున్నదో యను సందేహముతో ననిశ్చ యముగా తిరుగుచుండెడి వాఁడను. జయిలుకు తిరిగి రమ్మను పిలుపు కొరకెప్పుడును యెదురు చూచు చుండెడి వాఁడను.

1928 అంత మగుచుండు సరికి కలకత్తా కాంగ్రెసు సమీపించు చుండెను. మాతండ్రి దాని కధ్యక్షత వహింపవలెను. అతడు అఖిల పక్షసభా వ్యవహారములలో నిమగ్నుడై దానికొరకు తసనివేదికను తయారుచేసి దానిని కాంగ్రెసుచే నామోదింప జేయగోరెను. ఇది నాకిష్టములేదని యతడెరుగును. స్వాతంత్ర్య సమస్యమీద రాజీపడుటకు నే నంగీకరించు వాడనుకాను. ఇది యతనికి కోపమును బుట్టించుచుండెను. మేమీ విషయమును గురించి యంతగా చర్చించుకొనెడి వారముకాము. కాని మాలో మానసిక పోరాటము నిశ్చయముగా నుండి చెరియొకవైపు లాగవలెనను ప్రయత్నముండెడిది. అభిప్రాయ భేదములు మాకింతకు పూర్వమును తఱచు కలుగుచుండెను; అవి ప్రధానమైనవే యగుటచే మేము వేరువేరు రాజకీయ కక్షలలో నుండెడివారము. కాని యింతకు ముందుగాని తరువాతగాని యింతటి తీవ్రత యెన్నడును కలుగలేదు. ఇది మాయిద్దరకును విచారకరముగనే యుండెను. కలకత్తాలో పరిస్థితులు విషమించెను. కాంగ్రెసులో తన మాట నెగ్గనిచో, నసగా అఖిలపక్ష నివేదికయొక్క తీర్మానమునకు మెజారిటీ లేకపోయినచో తాను కాంగ్రెసు అధ్యక్షతను వహింపనని మాతండ్రి తెలిపెను. అది చాల సహేతుక మైనట్టియు, చట్టబద్ధమైనట్టియు పద్ధతి. అయినను అతని యెదిరి పక్షములో చాలమందికిది విషాదజనకముగ నుండెను. ఈవిషయము నింత తీవ్రస్థితికి తెచ్చుటకు వారి కిష్టములేదు. కాంగ్రెసులోను, యితరచోట్లను విమర్శించుట, గర్హించుటయేగాని బాధ్యతను వహించుటకు వెనుకకు తగ్గుట తఱచుగా నొకయభ్యాసమయ్యెను. నావను నడుపవలసిన భారమును మనపై వేసికొనకుండ విమర్శవలన నెదుటి పక్షము మనకు లాభకరమగు విధమున తన పద్ధతిని మార్చుకొను నను యాశ యెప్పుడును నుండును. ప్రస్తుత భారత ప్రభుత్వమువలె మనకు బాధ్యులు కాకుండ, కదల్చుటకు వీలులేని బాధ్యతా రహితమైన కార్యనిర్వాహక వర్గమున్నపుడు మనము

చేయగలిగినది యొక్క (కార్యముకాక) విమర్శయే! ఆవిమర్శ ఖండన రూపముననే యుండితీరును. అయినప్పటికిని యాన్యతిరేక విమర్శయే పటుతరముగ నుండవలెననిన దానివెనుక నవకాశము వచ్చుచో సంపూర్ణాధికారమును, బాధ్యతను వహింపగల మానసిక ప్రయత్నమును, సంసిద్ధతయు నుండవలెను. ఆయధికారము ప్రభుత్వముకు సంబంధించిన నాగరిక, సైనిక, అంతరంగిక, వైదేశిక శాఖలు-అన్ని ప్రభుత్వ శాఖల మీదను నుండవలెను. లిబరలు పక్షము వారివలె సైన్యములో కొంత బాధ్యతయే కావలెనని కోరుట యీప్రదర్శనమును జరుపుటలో మనకు గల యసామర్థ్యము నొప్పుకొనుటయే యగును; విమర్శలోని సారమును తీసివేసినట్లే యగును.

ఇట్టివిమర్శలును, గర్హించుటలును, వానివలన సహజముగా సంభవించు ఫలితములకు వెనుకకు తగ్గుటయు గాంధీజీయొక్క విమర్శకులలో తఱచు జరుగుచుండెను. అతని యనేక చర్యలయందు హితవు లేనివారు కాంగ్రెసులో ననేకులు గలరు. వారు వానిని తీవ్రముగ ఖండింతురు. కాని వారతనిని కాంగ్రెసునుండి తరిమివేయ సంసిద్ధులుకారు. దీని నర్థము చేసికొనుట సులభమే కాని యిది యేపక్షమునకును యోగ్యము కాదు.

కలకత్తా కాంగ్రెసులో నిట్టికష్టములే సంభవించెను. ఉభయ పక్షముల మధ్యను రాయబారములు జరిగెను. ఒక రాజీసూత్రము కుదిరెనని ప్రకటించిరి. కాని చివరకిది హుళక్కియయ్యెను. అదంతయు గందరగోళముగను, యవినీతి కరముగను నుండెను. చివరకు కాంగ్రెసు యొక్క ప్రధానతీర్మానము అఖిలపక్ష సభయొక్క నివేదికను ఆమోదించుచు, బ్రిటిషుప్రభుత్వము సంవత్సరములోగా నాచట్టము కంగీకరింపని చో స్వాతంత్ర్య తీర్మానమునకు మరలుదునని తెలియచేసెను. ఈతీర్మానము స్వాతంత్ర్య ఆదర్శమునుండి క్రిందకు దిగినమాట సత్యము. ఏలనన

అఖిల పక్ష నివేదిక పూర్తియైన డొమినియను పరిపాలననైనను కోర లేదు. అయినను అది యోగ్యమైన తీర్మానము. ఏలనన నదిచీలికను, దీని కెవరును తయారుగా నుండని సమయమున, లేకుండచేసి 1930 లో ప్రారంభమైన పోరాటమునకు కాంగ్రెసు నేకముఖమున నుంచెను. బ్రిటిషు ప్రభుత్వమొక సంవత్సరములో అఖిలపక్ష సభా చట్టము నామోదించరనుమాట నిశ్చయము. పోరాటము విధాయకము. దేశ ములోనున్న పరిస్థితులను బట్టి గాంధీజీ నాయకత్వము లేనిదే యెట్టి పోరాటము సఫలము కాజాలదు.

నేను బహిరంగ కాంగ్రెసులో, నిండుహృదయముతో కాక పోయినను, తీర్మానము నెదిరించితిని. అయినను నన్నే తిరిగి కార్య దర్శిగా నెన్నుకొనిరి. ఏమిజరిగినను సరే నేను కార్యదర్శి పదవి నంటి పెట్టుకొని యుంటిని. కాంగ్రెసు ప్రపంచములో నేను సుప్రసిద్ధ జెర్రి పట్టణ బిషప్పువలె నుంటిని. కాంగ్రెసు సింహాసనముపై నేయధ్యక్షుడు కూర్చొనినను కాంగ్రెసు సంస్థ కంతకును నేనే కార్యదర్శిగా నుంటిని.

కలకత్తా కాంగ్రెసుకు కొద్దిరోజులు పూర్వము బొగ్గుగనుల ప్రాంతములకు కేంద్రమయిన జారియాలో అఖిలభారత ట్రేడు యూనియను కాంగ్రెసు జరిగెను. నేను మొదటి రెండురోజులు దానిలో పాల్గొని తరువాత కలకత్తా వెళ్లిపోతిని. అదియే నా మొదటి ట్రేడుయూనియను కాంగ్రెసు. వ్యవసాయికులలోను, పనివాండ్రలోను నేను కల్పించుకొనిన జోక్యములే నాకు ప్రజలలో కొంత పలుకుబడి కలిగించినను నేను కేవలము పయివాడను. సంస్కరణ వాదులకును అతివాదులకును గల పాత పోరాటము జరుగుచునే యుండెను. తేలవల సిన సారాంశములో ప్రధాన మాంశములేవియన నేదోయొక యింటరు నేషనలుకును సామ్రాజ్య వ్యతిరేక లీగుకును అఖిలపసిఫికుయూనియను కును దీని నొక యంగముగా జేర్పించుట; జనీవాలో జరుగు ఇంటరు

నేషనలు లేబరు ఆఫీసు కాన్ఫరెన్సుకు ప్రతినిధులను పంపుట. ఈసమస్యల కంటెను ముఖ్యమైనది యీకాంగ్రెసులోని రెండు పక్షములవారికిని దృక్పథములోగల గొప్పభేదము. పాతట్రేడు యూనియను గ్రూపువారు రాజకీయములలో మితవాదులు. పారిశ్రామికవిషయములలో రాజకీయముల జోక్యమును వారు విశ్వసింపరు. వారు పారిశ్రామిక కార్యములనే విశ్వసింతురు. అవికూడ జాగ్రత్తగ జరుగవలె నందురు. పనివాండ్ర పరిస్థితులు క్రమముగ మెల్లగ బాగుపడుటయే వారిలక్ష్యము. ఈ గ్రూపు నాయకుడు యన్. యమ్. జోషి. ఇతడే తఱచు జినీవా భారతలేబరు ప్రతినిధిగా వెళ్ళెడివాడు. రెండవ గ్రూపు యింతకంటె నతివాదులు. రాజకీయ కార్యములను వారు విశ్వసింతురు. వారు బహిరంగముగ తమ విప్లవ దృక్పథమును తెలిపిరి. ఎట్టి యధికారము లేకపోయినను దానిపై కొందరు కమ్యూనిష్టులకును, కమ్యూనిజమును చేరికమైనవారికిని పలుకుబడి కలదు. ఈ గ్రూపువారు బొంబాయిలోని నేతపారిశ్రామిక పనివాండ్రను పట్టుకొనిరి. వీరి నాయకత్వము క్రిందనే బొంబాయిలో నేతపనివాండ్ర గొప్పసమ్మెకట్టు కొంతవరకు జయప్రదముగ జరిగెను. బొంబాయిలో గిర్నీకాంఘర్ యూనియను అనునొక శక్తివంతమైన నేతపనివాండ్ర క్రొత్తయూనియను బయలుదేరి బొంబాయిలోని లేబరు పరిస్థితుల కాధిపత్యము వహించెను. ఈ విప్లవ గ్రూపువారి పలుకుబడిక్రిందనున్న మరియొక బలీయమైన యూనియను జి. ఐ. పి. రైల్వే యూనియను. ట్రేడు యూనియను కాంగ్రెసు పుట్టినది లగాయతు దాని కార్యనిర్వాహకత్వమును, ఆఫీసుయును జోషీచేతిలోను అతని దగ్గిర సహచరుల చేతులలోను నుండెను. ఈ యుద్యమమును లేవదీయుటకు జోషీయే బాధ్యుడు. విప్లవ పక్షమువారికి సామాన్యులందరి మీదను యెక్కువ పలుకుబడియున్నను పయినుండి నీతిని మార్చుటకు తగిన సావకాశము లేవియును లేవు. ఈస్థితి యసంతృప్తిగ నుండెను. ఇది నిజ పరిస్థితులను

తెలుపకుండెను. అసంతృప్తియు, సంఘర్షణయు బయలుదేరెను. టి. యు. కాంగ్రెసులో నధికారమును లాగుకొనవలెనను కోరిక విప్లవ పక్షము వారికి కలిగెను; చీలిక కలుగునేమో యనుభయముచే విష యములను విషమస్థితికి తీసికొనిపోవుటకును యిష్టము లేకుండెను. హిందూదేశములో ట్రేడు యూనియను యుద్యమ మింకను బాల్యా వస్థలో నుండెను. అది దుర్బలముగనుండి చాలవరకు పనివాండ్రుకాని నాయకులచే నడుపబడుచుండెను. అట్టి పరిస్థితులలో నెప్పుడును పయి వారికి పనివాండ్రను కొల్లగొట్టు స్వభావముండును. ఇది భారత టి. యు. కాంగ్రెసులో విదితమయ్యెను. కాని జోషీ సంవత్సరముల తరబడి పనిచేసి మంచిశ్రద్ధగలిగిన యోగ్యమగు ట్రేడుయూనియనిస్టు అనిరుజు వయ్యెను. అతనిని రాజకీయముగ మితవాది, వెనుకబడినవాడు అనియను వారుకూడ భారతలేబరు యుద్యమము కతడు చేసిన సేవను గుర్తించె దరు. మితవాదులలోగాని, యతివాదులలోగాని యెవరిని గురించియు మన మిట్లు చెప్పుటకు వీలులేదు.

జారియాలో నావ్యక్తిగత సానుభూతి విప్లవ పక్షము వైపుననే యుండెను. కాని క్రొత్తవాడ నగుటచే టి. యు. కాం. యొక్క యీ గృహ కల్లోలములకు దూరముగనుండవలెనని నిశ్చయించుకొంటిని. నేను జారియా వీడిన తరువాత టి. యు. కాం. యొక్క సాంవత్సరిక యెన్నికలు జరిగెను. మరుసంవత్సరముకు నన్ను అధ్యక్షునిగా నెన్ను కొనిరను సంగతి నేను కలకత్తాలో నుండగా తెలిసికొంటిని. విప్లవ పక్షమువారు పెట్టిన పనివాండ్రలో నొకడైన యభ్యర్థి నోడించుటకు బహుశః నా కెక్కువ సావకాశము లున్నవని యనుకొని మితవాద పక్షమువారు నన్ను పెట్టియుందురు. ఎన్నిక తేదీని నేను జారియా లోనేయుండినచో విధాయకముగా పనివాండ్రలో నొకడైన యభ్యర్థి కనుకూలముగా నా పేరు నుపసంహరించుకొనెడివాడను. క్రొత్తవానిని,

పనివాండ్ర తెగకుచెందనివానిని అకస్మాత్తుగా నధ్యక్షపదవి లోనికి త్రోయుట నాకయుక్తముగా కాన్పించెను. భారత దేశములో ట్రేడు యూనియను యుద్యమము శైశవావస్థలో నున్నదనుట కిదియే చాలును.

1928 లేబరు తగాదాలతోను సమ్మెకట్టులతోను నిండియుండెను. 1929 కూడ నట్లేవెళ్ళెను. ఈసమ్మెకట్టులలో తీవ్రవాదులు, దుఃఖభాజనులునగు బొంబాయి నేతపనివాండ్రు నాయకత్వము వహించిరి. వంగదేశపు నారమిల్లులలో పెద్ద సమ్మెకట్టు జరిగెను. జెమ్షెదుపురపు యినుప పనులలోను, రైల్వేలలోను కూడ సమ్మెకట్టులు జరిగెను. జమ్షెదుపురపు తగరపు పనులలో ననేకమాసములాక స్థైర్యమైన దీర్ఘపోరాటము జరిగెను. గొప్ప ప్రజాసానుభూతి యున్నను శక్తివంతమైన యాకంపెనీ (బర్మాఆయిలుకంపెనీకి సంబంధించినది) పనివాండ్రను నలిపివేసెను.

మొత్తముమీద రెండు సంవత్సరములును పారిశ్రామిక యసంతృప్తితో నిండియుండి లేబరు పరిస్థితులు యధ్వాన్న మగుచుండెను. యుద్ధానంతర సంవత్సరములు హిందూదేశములో పరిశ్రమలకు పర్వదినములు. అమితమగు లాభములు సంపాదింప బడెను. అయిదారు సంవత్సరములవరకు నారమిల్లులు లేక ప్రత్తి మిల్లులలో సాంవత్సరిక డివిడెండులు నూటికినూరు, నూటయేబదికూడ మించిపోయెను. గొప్ప లాభములన్నియు యజమానులకును, వాటాదారులకును వెళ్ళెను. పనివాండ్రు యథాప్రకారముగనే యుండిరి. సాధారణముగ కూలి యేమాత్రము హెచ్చినను ధరవరలలోను ఆ హెచ్చుయుండుటచే వారికది యథాప్రకారమే యయ్యెను. తృటికాలములో లక్షలకు లక్షలు లాభములు చేసికొన బడుచుండు యీరోజులలోకూడ చాలమంది పనివాండ్రు అతిదరిద్రమగు గుడిసెలలోనే

నివసించుచుండిరి. వారిస్త్రీలకు కట్టుకొనుటకు వస్త్రములైనను లేక యుండెను. బొంబాయిలోని పరిస్థితులు దీనముగ నుండెను. కాని కలకత్తాలోని మహాసౌధాంతర సీమల కొక గంట ప్రయాణములోనున్న నారపనివాండ్ర స్థితి మరింత యధ్వాన్నముగ నుండెను. అర్ధనగ్న శరీరులైన స్త్రీలు, యెట్టి సంస్కారమును లేనివారు, గ్లాస్గో, డండీలకును భారత దేశములోని కొద్ది జేబులలోనికిని నిరంతర ధనప్రవాహమును పంపుట కాసాయంత్రము కేతృషితముతో పనిచేయుచుండిరి.

పనివాండ్రు యధాప్రకారముగనే యుండి లాభమేమియు ననుభవింపకయున్నను మంచిసంవత్సరములలో పరిశ్రమల కెంత మాత్రము లోటులేకుండ నుండెను. కాని యామంచిదినములు పోయి పెద్దలాభములను చేసికొనుట కంతసులభము కానపుడు భారమంతయు పనివాండ్రమీదనే పడెను. వెనుకటి లాభములను మరచి పోయిరి. అవి తినివేయబడెను. ఇప్పుడు లాభములు తగినంత రాకపోయినచో పరిశ్రమ లెట్లుసాగగలవు? కనుక పారిశ్రామిక యసంతృప్తి, లేబరు కష్టములు, ప్రభుత్వమును, యజమానులను కూడభయపెట్టిన బొంబాయిలోని యఖండ సమ్మెకట్టులు. లక్ష్యములలోను, సంఘటనములోను లేబరు యుద్యమము స్వశక్తిని గ్రహించుచు, తీవ్రము, యుపద్రవకరము నగు రూపమునుదాల్చుచుండెను. రాజకీయోద్యమముకూడ తీవ్రముగా నభివృద్ధి చెందుచుండెను. ఈ రెండును సంబంధములేక ప్రత్యేకములే యైనను యివికొంతవరకు జోడింపబడుచుండును. ప్రభుత్వముకు భవిష్యత్తు తృప్తికరముగ కాన్పించలేదు.

1929 మార్చిమాసములో ప్రభుత్వము విప్లవపక్షముకు చెందిన వారిలో నతిప్రధానులైనవారిని నిర్బంధించి సక్రియమైన లేబరు సంస్థపై నకస్మాత్తుగా పడెను. బొంబాయి గిర్నికామ్ఘురు యూనియను నాయకులను, వంగదేశము, పంజాబు, సంయుక్త పరగణాలలోని

నాయకులను నిర్బంధించిరి. వీరిలో కొందరు కమ్యూనిస్టులు, కొందరు వారికిచేరికయైనవారు, కొందరు కేవలము ట్రేడుయూనియనిస్టులు. నాలుగున్నర సంవత్సరముల వరకు సాగింపబడిన ప్రఖ్యాత మీరటు కుట్రకేసుకిదియే ప్రారంభము.

మీరటుకేసు ముద్దాయిల తరఫున మోతీలాల్జీ యాధిపత్యమున నొక డిఫెన్సు కమిటీ యేర్పడెను. డాక్టరు అన్సారీ మొదలగు కొంత మంది నాతోసహా సభ్యులముగ నుంటిమి. మాపై కఠినమైన భారము పడెను. డబ్బుపోగుచేయు టంతసులభమైన పనికాదు. ధనవంతులకు సామ్యవాదుల యెడలను, కమ్యూనిస్టుల యెడలను, లేబరు ఆందోళన పరులందును యెక్కువ సానుభూతిలేదు. లాయర్లు తమ సేవకొరకవరి రక్తమునో యొకరి రక్తమును పిండకతప్పదు. మాకమిటీలో కొందరు గొప్పలాయర్లు, మోతీలాల్జీ మొదలగువారు, కలరు. సలహా చెప్పుట కును, మామూలుగా మార్గమును చూపుటకును వారెప్పుడును సిద్ధము గనే యుండిరి. దానివలన మాకంత ఖర్చులేదు. కాని, వారు మీరట టులో నెలలకొలది యొకేసారి కూర్చొనజాలరు. మేముకలిసి కొనినయితరలాయర్లు యీ కేసును, వీలున్నంత వరకు, డబ్బుసంపా దించుటకొక సాధనగా చూచుకొనిరి.

మీరటు కేసుకాక యం. యన్. రాయి మొదలగువారి డిఫెన్సు కమిటీలతోకూడ నాకు సంబంధ ముండెను. ప్రతి సందర్భము లోను నేను నాస్వంతవృత్తికి చెందినవారి ధనపిపాస కాశ్చర్య పడితిని. 1919 లోని మార్షలులా రోజులలో మొట్టమొదట నాకట్టి యాశ్చ ర్యము కలిగెను. తనవృత్తిలో గొప్పపేరు పొందిన లాయరొకడు సైనికశాసనమున కాహుతియైనవారియొద్ద తనపూర్తిఫీజుకావలెనని రొక్కించెను. అదిచాల హెచ్చుమొత్తము. వారిలో నొకతోడి లాయరు కూడ నుండెను. అతనికి ఫీజుచెల్లించుటకు వీరిలోచాలమంది

యప్పుచేయవలసివచ్చెను. లేదా ఆస్తినమ్మివేయవలెను. నాతరువాత యనుభవములు మరింత బాధకరముగనుండెను. మేము అతిదరిద్రులైన పనివాండ్రనుండి డబ్బుడబ్బు చొప్పున వసూలుచేసి లాయర్లకు పెద్దపెద్ద చెక్కులను చెల్లించితిమి. అది నాకయిష్టముగనుండెను. ఇంతకును చేసిన పనియంతయు వ్యర్థముగ కాన్పించెను. రాజకీయ నేరమునుగాని, లేబరు నేరమునుగాని మనమువాదించినను వాదింపకున్నను ఫలిత మొక్కటియే. మీరటు కేసు వంటి కేసులో ననేక సందర్భములను బట్టి వాదము కావలెననుటలో సందేహములేదు.

మీరటు డిఫెన్సుకమిటీకి ముద్దాయిలతో ననేక చిక్కులు తటస్థించెను. వీరిలో ననేక రకముల మనుష్యులుండిరి; డిఫెన్సువిధానములో ననేక ఏకములుండెను. వీరిలో సామరస్య మనునది యెంతమాత్రమును లేకయుండెను. కొన్ని నెలలయిన తరువాత మేము క్రమమైన కమిటీని కట్టిపెట్టి వ్యక్తిగతముగా సహాయము చేయుచుండెడివారము; రాజకీయ పరిస్థితులు మాదృష్టి నెక్కుడుగా నాకర్షించుచుండెను. 1930 లో మేమందరమును జయిలులో నుంటిమి.

# ౨౪

## ఆకాశములో నుఱుములు.



1929 కాంగ్రెసు లాహోరులో జరుగ నుండెను. పదివత్సరము లయిన తరువాత నది తిరిగి పంజాబునకు వచ్చెను. ప్రజలమనస్సులు పది వత్సరముల పూర్వపు 1919 నాటి సంభవములవైపు తిరిగెను- జలియను వాలాభాగు, అవమాన భరితమైన సైనిక శాసనము, అమృత సరపు కాంగ్రెసు, అసహాయోద్యమ ప్రారంభము- ఈ పది వత్సరములలోను యనేకములు జరిగి, భారత దేశముఖము మారిపోయెను. రాజకీయ తీవ్రత హెచ్చుచుండెను. సంగ్రామ వాతావరణము త్వరితముగా నభి వృద్ధి గాంచుచుండెను. రాబోవు సంగ్రామముయొక్క దీర్ఘఛాయలు దేశముపై బడెను.

ఆపవిత్రమండలములో తిరుగుచుండిన యేకొద్దిమందికో తప్ప అసెంబ్లీసభయు, రాష్ట్రసభలును చాలాకాలమునుండి యెవరికివిరుచింప కుండెను. నిరంకుశము, అధికారపురస్కారమునగు ప్రభుత్వమున కొక వేషము (అదైననూ పాడైనది చెడినది) వలెనుండి, యవి 'నిష్ప్రయోజకుల' ను జరుపుచుండెను. కొంతమందికిది భారత దేశపు "పార్లమెంటు," సభ్యుల అలవెన్సులు అనిచెప్పుకొనుటకొక సాకుగ నుండెను. 1928 లో సైమను కమిషను బహిష్కరణ తీర్మానమును చేయుటతో నసెంబ్లీసభ తుది సారి ప్రజల నాకర్షించెను.

తరువాతకూడ ప్రభుత్వమునకును అధ్యక్షునకును ఒకపోరాటము జరిగెను. అసెంబ్లీయొక్క స్వరాజ్యపార్టీ యధ్యక్షుడైన విఠల్భాయి పటేలు స్వతంత్రుడగుటచే సుకుమారి, ప్రభుత్వగాత్రమునకొక ముల్లు వలె నుండెను. అతని రెక్కలను ఛేదించుటకు ప్రయత్నములు జరిగెను.

ఇట్టిసంభవము లప్పుడప్పు డాకర్షించు చుండినను ప్రజాహృదయము బయట జరుగుచున్న విషయములపై కేంద్రీకరింపబడెను. మాతండ్రికి కౌన్సిలు పనితో పూర్తిగా ముఖము మొత్తెను. శాసనసభలవలన నాస్థితిలో నంతకంటె నెక్కువేమియును లభింప జాలదను తనయభిప్రాయము నతడనేక సారులు వెల్లడించెను. అవకాశము దొరకినచో వాటినుండి బయట పడవలెనని యతడనుకొనుచుండెను. అతని బుద్ధి చట్టబద్ధము; అతడు న్యాయ పద్ధతులకును, విధానమునకును అలవడెను. కాని భారతదేశములో చట్టబద్ధమగు పద్ధతులనబడు నట్టివి వ్యర్థములనియు నిరుపయోగము లనియు నతడు పరిస్థితుల ప్రాబల్యముచే కనుగొనెను. భారతదేశములో చట్టమే లేదనియు, ఆర్డినెన్సులు మొదలగు వాని రూపములో నొక వ్యక్తి యిచ్ఛానుసారముగనో లేక నొక నిరంకుశ వర్గమువారి యిచ్ఛ ననుసరించియో, న్యాయముల కస్మాత్తుగా గారడి వాని టోపీలోనుండి యూడిపడు యెలుకలవలె పుట్టుచుండునప్పుడు న్యాయపరిపాలనయే లేదనియు నతడు తన న్యాయ బుద్ధికి నచ్చచెప్పు కొనుచుండును. ఆచారములచేతను, స్వభావముచేతను అతడు విప్లవ కారుడెంత మాత్రమును కాడు. మధ్యతరగతి ప్రజాస్వామిక మనునది యొకటి యుండి యున్నచో నతడు విధాయికముగా నట్టి చట్టమునకు మూలవిరాట్టువలె నుండెడివాడు. కాని యున్న పరిస్థితులనుబట్టి భారతదేశములో బూటకపు పార్లమెంటు నాటకముతో చట్టబద్ధమగు నాందోళన జరిపెదమను భాషయతని కంతకంతకు కోపమును కలిగించుచుండెను.

కలకత్తా కాంగ్రెసులో నతడు వహించిన పాత్రకుమినహా గాంధీజి యింకను రాజకీయములకు దూరముగనే యుండెను. కాని పరిస్థితు లతని కెప్పటి కప్పుడు ద్యోతక మగుచునే యుండెను. కాంగ్రెసు నాయకు లతని సలహా తఱచు తీసికొనుచునే యుండిరి. కొన్ని వత్సర

ములనుండి యతని ప్రధాన కార్యక్రమము ఖాదీప్రచారము. ఈలక్ష్య ముతో నతడు యావద్భారతములోను విశేషసంచారము గావించెను. అతడు వరుసగా ప్రతిరాష్ట్రమునకును పోయి ప్రతిజిల్లాను, యేమాత్ర మైనను పేరుగల ప్రతిపట్టణమును, మారుమూలలనున్న గ్రామసీమలను చూచెను. ప్రతిచోటను వేలకొలదియు, లక్షలకొలదియు జనము నతడా కర్షించెను. అతని ప్రణాళికను నడుపుటకు ముందుగా ననేకమంది పని చేయవలసి వచ్చెను. ఈవిధముగా నతడనేకసారులు భారత దేశమును తిరిగి దక్షిణమున కన్యాకుమారి మొదలు యుత్తరమున హిమాచల ములవరకును, తూర్పుకనుమలు మొదలు పశ్చిమ సముద్రము వరకును గల విశాల భారతములోని ప్రతి చిన్నప్రాంతమును చూచెను. అతని వలె భారత దేశమును మరియొక మానవ మాత్రుడెవడును తిరిగి యుండ లేదని నాయభిప్రాయము.

పూర్వకాలమున దిమ్మరీడులగు యాత్రికులు నిరంతరము ప్రయాణము చేయుచుండెడివారు. కాని వారి ప్రయాణ సాధనము లతిమందము లగుటచే యావజ్జీవమును చేసిన యట్టి ప్రయాణములు రైలుమీదను, మోటారుమీదను చేయునొకసంవత్సరప్రయాణముకుసరి కావు. గాంధీజీ రైలుమీదను, మోటారుమీదనువెళ్ళుటయేకాక కాలినడ కనుగూడ సాగించెను. ఈవిధముగా నతడు భారతదేశము యొక్కయు, నందలి ప్రజల యొక్కయు, నసమాన జ్ఞానమును సంపాదించెను. కోట్ల కొలది ప్రజ లతనిని చూచి యతనితో స్వాయముగా సంపర్కమును కలిగించు కొనిరి.

1929 లో మండువేసవిలో నతడు సంయుక్త పరగణాలకు ఖాదీ ప్రచారముకువచ్చి యనేక వారము లచ్చట సంచారము చేసెను. నేన తనితో నప్పుడప్పుడు కొద్దిరోజులు వెళ్ళెడివాడను. ఇదివరకు నాకనుభవ మున్నను నే నతడాకర్షించు మానవ సముద్రమునుచూచి యాశ్చర్య

పడెడివాడను. గోరఖ్పూరునంటి తూర్పుజిల్లాలలో నిది మరింత యద్భుతమయ్యెను. ఆజనసమూహము మిడుతల దండువలెనుండును. మేము గ్రామసీమలలో తిరుగు నప్పుడు ప్రతి కొద్దిమైళ్ళకును పదివేలు, పాతికవేలు జేరుచుండెడి వారు. ఆరోజులలోని ప్రధానసభకు లక్ష మంది పైగా వచ్చెడివారు. ఏకొద్ది పెద్ద పట్టణములలోనో తప్ప దూర శ్రవణ యంత్రములులేవు. ఇంతమందికి వినిపించుటయసాధ్యము. బహుళః వారేమియు వినుటకురాలేదు. 'మహాత్ముని' చూచుటతో వారు సంతో పించెదరు. గాంధీజీ సాధారణముగ అనవసర శ్రమలేకుండ కొద్దిగనే మాట్లాడెడివాడు. లేనిచో గంటలకొలదియు రోజులకొలదియు నీపద్ధతిని నడుపుట దుస్సాధ్యము.

యు. పి. ప్రచారమంతటను నే నతనితో నుండలేదు. నావలన నతనికి ప్రత్యేక ప్రయోజన మేమియునులేదు. నేను ప్రయాణము చేయు పార్టీసంఖ్యను పెంచుటలో నర్థములేదు. సమూహములలో నుండుటకు నాకభ్యంతరములేదు, కాని త్రోపులను పడుటకును రాపును ననుభవించుటకును, కాళ్లునలుగ గొట్టించుకొనుటకును, (గాంధీజీ కూడ నుండువారి గతి యిదియే) తగినంత యుత్సాహము కాన్పించదు. నాకు చేయవలసిన యితర పనియెంతయో యుండెను. •అది రాజకీయ పరి స్థితులు విషమించుచున్న సమయము. వానితో పోల్చిన నాకు స్వల్పవిషయముగా కాన్పించిన ఖాదీకి బంధింప బడియుండుటకు నాకిష్టములేదు. కొంతవరకు నేను గాంధీజీయొక్క, రాజకీయములకు సంబంధించని మధ్యమధ్య వ్యాపారములకు, కోపమును వెలిబుచ్చెడి వాడను. అతని యాలోచన వెనుకనున్న పునాది నా కెన్నటికి నర్థము కాలేదు. ఆరోజులలో నతడు ఖాదీపనికొరకు ధనము వసూలు చేయు చుండెను. 'దరిద్ర నారాయణుల కొరకు' 'దరిద్రులయొక్క నారాయ ణుడని' లేక 'దరిద్రులలో నివసించెడి నారాయణుని' కొరకు డబ్బు

కావలెనని యతడు తరుచు చెప్పుచుండెడివాడు. దానిని గృహ పరిశ్రమలకు వినియోగించి బీదలకు పనికల్పించుట కతడుద్దేశించెను. కాని యాపదము వెనుక దారిద్ర్యమును కీర్తించు నర్థము కాన్పించును. భగవంతుడు ప్రత్యేకముగ దరిద్రులకు ప్రభువు. వారతని ముద్దుబిడ్డలు. ప్రతిచోటను సాధారణముగ నుండు మతదృష్టి యిదియే యని నేను భావించెదను. నేను దీనిని మెచ్చుకొనజాలను. నాదృష్టిలో దారిద్ర్యము అసహ్యమైనది. దానితో పోరి దానిని చీల్చి చెండాడ వలసినదే కాని దాని నెంతమాత్రమును ప్రోత్సహింపరాదు. ఈదృష్టి విధాయికముగ దారిద్ర్యమును సహించి దాని నుత్పత్తిచేసిన పద్ధతిపై దాడితీయును. దీనికి సిద్ధపడని వారేదోవిధముగ దానిని సమర్థించ జూతురు. వారు లేమిని, దారిద్ర్యమును చూడ గలుగుదురు. కాని జీవితావసరములతో పుష్కలముగా నిండియుండు ప్రపంచ చిత్రమును చూడజాలరు. బహుశః వారి ప్రకారము బీదసాద లెప్పుడును మనతోనుందురు.

గాంధీజీతో దీనిని గురించి నేనెప్పుడు చర్చించినను అతడు ధనవంతులు తమ ధనమును ప్రజల ధర్మనిధిగా భావింపవలె ననును. ఇది యెప్పుడో తాతల నాటి దృష్టి. దీనిని మనము తరుచుగా హిందూదేశములోను మధ్యయుగపు యూరపులోను చూచెదము. ఇట్లు జరుగుట సంభవమనికాని, సాంఘిక సమస్యను పరిష్కరించుట కిదియే విధమని కాని సహేతుకముగా మనమెట్లు భావింపగలమో నాకెంతమాత్రము నర్థము కాలేదు.

అసెంబ్లి సభ నేను పైన చెప్పినట్లు నిద్రమత్తు వ్యాపార మగుచుండెను. దాని నిప్పచ్చర వ్యాపారములో నెవరును శ్రద్ధవహించుట లేదు. భగత్సింగు బి. కె. దత్తులు ప్రేక్షకుల గేలరీనుండి రెండు బాంబులను అసెంబ్లీహాలు నేలమీదకు విసరినపు డదియొకనాడు దద్దరిలెను. ఎవరికిని గట్టిదెబ్బలు తగులలేదు. బహుశః ముద్దాయిలు

తరువాత చెప్పినట్లు, ఆబాంబులు చప్పుడు చేయుటకును, కదలిక కలి గించుటకును నుద్దేశింప బడెను. కాని బాధించుట కుద్దేశింపబడలేదు.

అస్లే యసెంబ్లీలోను బయటను కూడ వారు కదలికను కలి గించిరి. టెర్రిస్టుల యితర చర్యలింత నిరుపద్రవ కరముగలేవు. లాలా లజపతిరాయిని కొట్టినట్లు చెప్పబడిన యొక యువక యింగ్లీషు పోలీసు ఆఫీసరును లాహోరులో పేల్చి చంపివేసిరి. వంగదేశములోను, యితర చోట్లను టెర్రిస్టు చర్యలు తిరిగి తలయెత్తినట్లు కాన్పించెను. కుట్ర నేరము లనేకులపై మోపబడెను. డిటెన్యూల సంఖ్య (ఖయిదులలో గాని, యితరత్రగాని విచారణగాని, శిక్షగాని లేకుండ నిర్బంధింపబడిన వారు) త్వరలో హెచ్చిపోయెను. లాహోరు కుట్ర కేసులో కోర్టులో పోలీసులచే నసాధారణ రంగములు ప్రదర్శింపబడెను. దీనివలన నీకేసు ప్రజాహృదయమును చాలవరకాకర్షించెను. కోర్టులోను, ఖయిదులోను తమయెడల చూపబడిన యవమానములను నిరసించుటకు చాలమంది ఖయిదీలు నిరశన దీక్షను బూనిరి. అది యెట్లు ప్రారంభమయ్యెనో కారణము నాకు జ్ఞప్తిలేదు; కాని చివరకీ సమస్య ఖయిదీలపట్ల ముఖ్య ముగా, రాజకీయ ఖయిదీలపట్ల చూపబడు యవమానప సమస్యగా తేలెను. ఈనిరశన దీక్ష వారముల కొలది సాగుచు దేశములో నుద్రేక మును కలిగించెను. ముద్దాయిల శరీర దుర్బలతచే వారిని కోర్టుకు తీసి కొని పోవుటకు వీలులేకుండెను. విచారణలకు తఱుచు వాయిదాలు పడు చుండెను. అందుచే భారత ప్రభుత్వమువారు ముద్దాయిలుగాని, వారి తరఫు ప్లీడర్లుగాని యక్కర లేకుండగనే కోర్టువిచారణ జరుపవచ్చు నను శాసనమును ప్రవేశ పెట్టిరి. ఖయిదులో చూపబడవలసిన విధాన మును కూడవారే యోచించవలెను.

నిరశన దీక్షకొక మాసపుప్రాయము నిండగనే నేను లాహో రులో నుండుట సంభవించెను. ఖయిదులోనున్న కొంతమంది ఖయిదీలను

చూచుటకు నా కనుజ్ఞ యీయబడుటచే నేనాయవకాశమును వినియోగించు కొంటిని. నేను భగత్సింగును చూచుట కదియే మొదటి పర్యాయము. జతీందాసు మొదలగు వారిని చూచితిని. వారందరును చాల దుర్బలముగనుండి మంచము పట్టిరి. వారితో నెక్కువగా మాట్లాడుటకు వీలులేకుండెను. భగత్సింగు ముఖకమల మతిప్రసన్నముగను, బుద్ధివైశద్యమును ప్రకటించునదిగను, యతినిర్మలముగను, ప్రశాంతముగను, నుండెను. అందులో క్రోధమెంతమాత్రమును కాన్పించుటలేదు. అతడతి సాధువుగ కాన్పించెను; అతి సాధువుగ మాట్లాడెను. కాని నెలరోజులనుండి యుపవసించువాడెవ్వడైనను ఆధ్యాత్మికముగను, శాంతముగను కాన్పించు ననుకొనెదను. జతీందాసు యింకను శాంతముగను, సుకుమార బాలికవలె మార్దవముగను, సాధువుగను కాన్పించెను. నేను చూచినప్పు డతడమిత బాధపడుచుండెను. తరువాత నతడు యుపవాస ఫలితముగ నరువది యొకటవ దినమున దివంగతుడయ్యెను. 1907 లో లాలా లజపతిరాయితో ప్రవాసమున కంపబడిన తన పినతండ్రియగు సర్దారు అజిత్సింగును చూడవలెనని లేదా యతని వార్తనైనను వినవలెనని భగత్సింగు తపించుచున్నట్లు కాన్పించును. అనేక వత్సరము లతడు విదేశములలో ప్రవాసిగా నుండెను. అతడు దక్షిణ అమెరికాలో స్థిరవాసర మేర్పరచు కొనినట్లు స్పష్టముగు రిపోర్టులుకలవు. కాని యతనిని గురించి నిశ్చయ మేదియు తెలియదని నేననుకొనను. అతడు జీవించి యున్నాడో చనిపోయెనో కూడ తెలియదు.

జతీందాసు మృత్యువు దేశమంతట నుద్రేకమును కలుగచేసెను. అది రాజకీయ ఖయిదీల నెట్లుచూడవలెననుసమస్యను ముందుకు తీసికొని వచ్చెను. ఈవిషయమును గురించి యోచించుట కొకకమిటీ ప్రభుత్వముచే నియమింపబడెను. ఈ కమిటీ చర్చల ఫలితముగా ఖయిదీలను మూడు తరగతులుగా విభజించుచు క్రొత్తసూత్రములు సృజంప

బడెను. స్థితిగతులను చక్కబరచుట కేర్పడిన యీ క్రొత్తసూత్రముల వలన లాభ మేమియు లేకపోయెను. స్థితిగతు లెప్పటివలెనే యత్యంత యసంతృప్తిగ నుండెను; యింకను యుండును.

గ్రీష్మ, వర్ష ఋతువులు క్రమముగ నాకురాలు కాలములోనికి దొరబడినతోడనే రాష్ట్రకాంగ్రెసు కమిటీలు లాహోరుకాంగ్రెసు ప్రెసిడెంటు నెన్నుకొను సన్నాహాలో నుండెను. ఈ యెన్నిక దీర్ఘ కాలము పట్టుచు అగష్టులగాయతు అక్టోబరు వరకు జరుగుచుండెను. 1929 లో గాంధీజీ ఐక్యకంఠముతో నధ్యక్షుడుగా నెన్నుకొనబడెను. రెండవసార యతనిని కాంగ్రెసు అధ్యక్షునిగా నుంచుటలో కాంగ్రెసు యధికార పరంపరలలో నతనికి మరింత యౌన్నత్యమేదియును కలుగదు. చాలవత్సరములనుండి యతడు అధ్యక్షాతీతుడుగ నుండెను. పోరాటము సన్నిహితముగా నుండుటచే దాని నతడు నడిపింపక తప్పదు. కనుక యీ సమయమున కాంగ్రెసుకును అతడే అధ్యక్షుడుగా నుండుటమంచిదని సాధారణముగా భావింపబడెను. ఇంతేగాక నధ్యక్షతకు తగినంత పేరుప్రఖ్యాతులు కలవాడు మరియొకడు లేడు.

కనుక రాష్ట్రకమిటీలు గాంధీజీని యధ్యక్షునిగా సూచించెను. కాని యతడు దానిని తిరస్కరించెను. అతడు గట్టిగా వలదని చెప్పినను అతనితో వాదించి యొప్పించ వచ్చునను యాశ కాన్పించెను. తుదిపరష్కారము చేయుటకు లక్నోలో అ. భా. కా. కమిటీ సభ జరిగెను. చివర నిమిషము వరకు నతడొప్పుకొనునని యే మేమందరమును భావించితిమి. అతడెంతమాత్రము నిచ్చగింపక చివర నిమిషములో నా పేరు సూచించెను. అతని తుదితిరస్కారమునకు అ.భా.కా. కమిటీ తెల్లబోయి యిట్టిచిక్కు స్థితికి తేబడినందుకు కొంత యాగ్రహమును పొందెను. ఎవరును దొరకనందున నైరాగ్యము చెంది చివరకు నన్ను యెన్నుకొనిరి.

ఆయెన్నికచే నాకు కలిగిన చికాకు, హైన్యభావము నాకెన్న డును కలుగలేదు. నాకు గలిగిన గౌరవమును నేను గుర్తింపక పోలేదు. అది యసామాన్య గౌరవము. మామూలు పద్ధతిగా నెన్నుకొనబడి నచో నే నానందించెడివాడను. నేను సింహద్వారమున రాలేదు. ప్రక్కగుమ్మమున నైననురాలేదు. అకస్మాత్తుగా నేనొక దిడ్డివాకిలి నుండి యూడిపడి సభ్యులు నివ్వెరపడి యొప్పుకొనునట్లు చేసితిని. వారు గంభీర వదనముతో దానిని కప్పిపుచ్చి తప్పనిసరియగు మాత్రవలె నన్ను దిగమ్రింగిరి. నా యభిమానమునకిదియొక చురకవలెనుండి నే నీ గౌరవమును తిరిగి యిచ్చివేయవలె ననుకొంటిని. అదృష్టవశాత్తునేనట్లు వెలితికాకుండ నిరోధించుకొని విచార హృదయముతో మెల్లగాజారితిని.

బహుశః యీనిశ్చయమునకు మాతండ్రి పరమానంద భరితు డయ్యెను. నా రాజకీయము లతనికి పూర్తిగాగిట్టవు. కాని యతడు నన్నెక్కుడుగ ప్రేమించుటచే నాకేమంచి సంభవించినను అతడానంద పడుచుండెను. తఱచుగా నతడు నన్ను విమర్శించుచు నాతో కొంచెము కటువుగా మాట్లాడును. కాని మర్యాదను దక్కించుకొన దలచువా డెవడును అతని సమక్షమున నన్ను దూషింపజాలడు.

నాయెన్నిక నాకొక గొప్ప గౌరవమును గొప్పబాధ్యతను తెచ్చిపెట్టెను. తండ్రివెనుక నే కుమారుడు అధ్యక్షపీఠమునకు వచ్చుట యసామాన్య విషయము. కాంగ్రెసు అధ్యక్షులలో నేనందరికంటెను పిన్నవయస్కుడనని తఱచు చెప్పబడు చుండును. (నాకప్పుడు సరిగా నలుబది వత్సరములుండెను.) ఇది నిజముకాదు. గోక్లేకును నదియే వయస్సని నే ననుకొనెదను. మౌలానా అబుల్‌కలాం అజదు (నాకంటె కొద్ది పెద్దయైనను) నలుబది వత్సరముల లోపుననే యధ్యక్షుడయ్యెను. గోక్లేకు ముప్పది వత్సరములు నిండినతోడనే పెద్ద రాజకీయ వేత్తలలో నొకడుగా పరిగణింపబడెను. అబుల్‌కలాం అజదు తన విశేష పాండి

త్యము నుగ్గడించుటకు తగిన పూజ్యవయోదృష్టిని సాధించెను. రాజకీయ విశారదత్వము నాగుణములలో నొకటిగా నెప్పుడును పరిగణింపబడలేదు. విశేషపాండిత్యము కలదని నన్నెవరును దూషింపలేదు. కనుక నాతల నెరసినను, దృష్టిదోషమబ్బినను వయసుమీరిన వాడనను నింద నాకు తప్పిపోయెను.

లాహోరుకాంగ్రెసు సమీపించెను. ఈలోపున పరిస్థితులు వానిలోనున్న యంతశ్శక్తులచే ప్రచలితమగుచు క్రమముగా ముందుకు పరుగిడు చుండెను. వ్యక్తులు తామెంత పటాటోపమును బూనినను చాల యల్పమైన పాత్రనే వహింపగలరు. నిర్దాక్షిణ్యముగ చఱచఱ ముందుకుబోవు మహాయంత్రములో మనమొక యల్పభాగ మనుభావము తోచుచుండెను. విధిప్రేరితమగు నిట్టి ప్రవాహాభివృద్ధి నరికట్ట తలంచి ప్రభుత్వమువా రొకయడుగు ముందుకు వేసిరి. వైస్రాయియైన ఇర్విను ప్రభువు, రౌండుటేబిలు సమావేశము జరుగనున్నదను నొక ప్రకటన గావించెను. ఆ ప్రకటన వలలోబడవేయుటకు దగిన పదజాలముతో నిండియుండెను. దానికెంతె యర్థమునైనను చెప్పుకొనవచ్చును, లేదా యదినిరర్థమునుగావచ్చును. రెండవ యర్థమే న్యాయమని మాలోచాలమంది యనుకొంటిమి. ఒకవేళ దానిలో నేదియైన యున్నను అది మనము కోరుదానికెంత మాత్రమును సమీపములో నుండదు. వైస్రాయి ప్రకటన జరిగినదో లేదో యప్పుడే 'కొంపమునిగిపోయినట్లు' ఢిల్లీలో "నాయకులసభ" యొకటి యేర్పాటు గావింపబడెను. అన్నివర్గముల మనుష్యులకును ఆహ్వానము లంపబడెను. గాంధీజీ, మాతండ్రి, విఠల్‌భాయి పటేలు (ఇంకను అసెంబ్లీ యధ్యక్షుడు) గార్లును, తేజబహదరు సప్రూవంటి మితవాద నాయకులు మొదలగు నితరులును అచ్చట నుండిరి. కొన్ని షరతులకు లోబడి వైస్రాయి ప్రకటన నంగీకరించుట కొకసమిష్టి తీర్మానము గావించు

కొనబడెను. ఇవి చాలప్రధానమైన వనియు ముఖ్యముగా నెరవేరబడ వలయు ననియు జెప్పబడెను. ప్రభుత్వమీ షరతుల కొప్పుకొనినచో తోడ్పాటు గావింపబడు ననిరి. ఈ షరతులు * చాలగట్టివి. వీటివలన నెంతయో భేదము కలిగెడిది.

మితవాద, యతివాద పక్ష ప్రతినిధు లందరు నిట్టి తీర్మానమున కంగీకరించుట యొకవిజయము. కాంగ్రెసు కిదియొక పతనము. సామాన్యాంగీకార ప్రమాణ దృష్టిలో నిది ఘనమైనది. కాని యిందులో నొకయుచ్చు అమర్పబడినది. ఈ షరతులు అధమము రెండు దృక్పథములతో చూడబడెను. కాంగ్రెసువారు వీనిని ప్రధానముగా నెంచిరి. ఇవి నెరవేరనిచో తోడ్పాటు యసంభవమనిరి. వారికవి కనీసపు కోరికలు. తరువాత జరిగిన కాంగ్రెసు వర్కింగు కమిటీ మీటింగులోనిది స్పష్టము చేయబడెను. అందులో నిదియైనను ముందు జరుగబోవు కాంగ్రెసు తేదీలోపల జరుగవలెననిరి. మితవాదుల కవిగరిష్ఠకోరికలు. వారు వాటినట్లు ప్రకటించెదరేకాని యవి ప్రసాదింపబడనిచో తోడ్పాటును నిరాకరింతుమనుపట్టుదల లేదు. ప్రధానములని చెప్పబడుచున్నను వారిషరతులు నిజముగా షరతులుకావు.

కనుకనే తరువాత మేమందరమును జయిళ్ళలో నుండగా, నీషరతులలో నేదియు నెరవేర్చకపోయినను, మమ్ముల ననేకవేలమందిని జయిళ్లలోనింపియుంచినను మాజయిలరుకు మనమితవాద, రెస్పాన్సివిస్టు

* ఈ సరతు లేవియనిన:

1. జరుగబోవు కాన్ఫరెన్సులో జరుపబడు చర్చలన్నియు భారతదేశమునకు సంపూర్ణడొమినియను పరిపాలన పునాదిమీదనే యుండవలెను.

2. కాన్ఫరెన్సులో కాంగ్రెసువారి ప్రాతినిధ్య మెక్కువగా నుండవలెను.

3. రాజకీయ ఖయిదీల నందరిని విడిచిపెట్టవలెను.

4. ప్రస్తుత పరిస్థితులలో సాధ్యమగు నంతవరకు నిప్పటి నుండియు భారత ప్రభుత్వము డొమినియను ప్రభుత్వ పద్ధతులమీదనే నిర్వహింపబడవలెను.

మిత్రులు (ఆప్రకటనలో మాతోపాటు సంతకములు పెట్టినవారు) సంపూర్ణ సహకారమును గావించిరి.

ఇట్లు జరుగునని మాలోచాలమంది యనుకొంటిమి కాని (అంత అన్యాయముగా జరుగుననుకొనలేదు.) ఈ సమష్టి కార్యము వలన కాంగ్రెసువారెట్లు కొంతవరకు నిరోధమునుచూపగలిగిరో యట్లే లిబరలు పక్షమువారును తదితరులును యెట్టి పరిస్థితులలోనైనను విచక్షణరహితముగ ప్రభుత్వముకుచేయు సహకారతత్త్వమును కొంతవరకు మార్చుకొనెదరను నాశకొంతయుండెడిది. ఈ రాజీ తీర్మానమున కెంత మాత్రమును యిష్టపడని మాలోకొందరము మా కాంగ్రెసులో నెట్టి చీలికలును కలుగకుండుటకే దీని కంగీకరించితిమి. మహాసంగ్రామము రానున్న తరుణమున కాంగ్రెసులో చీలికలను ప్రోత్సహింపజాలము. ప్రభుత్వమువారు మనపరతుల కొప్పుకొనరనుసంగతి సువిదితము. కనుక నిది మనస్థితిని బలపరచి మనలోని కుడిపక్షమువారిని మనవైపు త్రిప్పుకొనుట కతిసులభమైన పద్ధతి. కొద్దివారములలో సంతయు తేలిపోవనున్నది. డిసెంబరు మాసము. లాహోరు కాంగ్రెసు సమీపించెను.

అయినను మాలోకొంతమంది కా సమష్టిప్రకటన చేదుమాత్రవలెనుండెను. స్వాతంత్ర్యవాంఛను భావములోనైనను కొంచెము సేపయినను విరమించుట పొరపాటు; యుపద్రవకరము. అనగానిది యుక్తికి సంబంధించినది. అది బేరమాడదగినదిగా తలంపబడెనుగాని, ప్రధానమైనది యనియు, నదిలేనిదే మనమెప్పుడును తృప్తినొంద జాలమనియు తలంపబడలేదు. కనుక నేను సందేహించి ప్రకటనమీద సంతకము చేయలేదు. (సుభాసుబోసు చేయనని ఖండితముగా చెప్పెను.) కాని నేను (నా మామూలు ప్రకారము) మెత్తపడితిని. అయినను నేను చాలబాధతోవచ్చి మరునాడే నాకాంగ్రెసు యధ్యక్షతకు రాజీనామా యివ్వ సంకల్పించితిని. నేనీసంగతిని గాంధీజీకి తెల్పితిని. గాంధీజీనుండి

యొక్క యౌదార్య ప్రత్యుత్తరమును, మూడుదినముల తీవ్రయోచనయు నన్ను శాంతపరచెను.

లాహోరు కాంగ్రెసుకు కొంచెముముందు ప్రభుత్వముకును కాంగ్రెసుకును మధ్య సమాధానము కొఱకు కడపటి ప్రయత్నము జరిగెను. వైస్రాయియైన ఇర్విను ప్రభువుతో సమావేశ మేర్పాటు చేయబడెను. ఈ సమావేశము నేర్పాటు చేయుటకు కారకులెవరో నాకు తెలియదు. కాని విఠల్‌భాయి పటేలు ప్రధాన కారకుడని నేనూహించెదను. కాంగ్రెసు దృక్పథము చెప్పుటకు గాంధీజీయును మాతండ్రియునుండిరి. జిన్నా, సర్. తేజబహద్దరు సప్రూ, విఠల్‌బాయి పటేలుగార్లుకూడనుండిరి. చివరకు సమావేశము వలన నేమియుజరుగలేదు. వారికి సామ్య మెచ్చటనులేకుండెను. ప్రధాన పక్షములైన కాంగ్రెసు ప్రభుత్వములమధ్య నెంతయో దూరముండెను. కనుక కాంగ్రెసుకిక ముందుకు పోవుట యొక్కటె మార్గము. కలకత్తాలో నిచ్చిన సంవత్సర గడవు గతించుచుండెను. కాంగ్రెసు లక్ష్యము స్వాతంత్ర్యమని శాశ్వతముగా ప్రకటింపవలెను. దానిని సాధించుటకు తగుపోరాట ప్రయత్నములను గావింపవలెను.

లాహోరు కాంగ్రెసుకుముందు తుదివారములో మరియొక రంగములో నేనొక ముఖ్యమైన విధిని నెరవేర్చవలసియుండెను. అఖిల భారత ట్రేడుయూనియను కాంగ్రెసు నాగపురములో జరుగుచుండెను. నేను దానికధ్యక్షత వహింపవలసియుండెను. ఒకేవ్యక్తి కొద్దివారముల గడవులో జాతీయకాంగ్రెసుకును, ట్రేడుయూనియను కాంగ్రెసుకును అధ్యక్షత వహించుట యసాధారణ విషయము. నేనీరెండు సంస్థలకును మధ్యసంధానకర్తగనుండి యొకరి నొకరి దరిజేర్చవలెనని యాశించితిని. జాతీయ కాంగ్రెసును మరింత సామ్యవాద పరముగను, మరింత బీదల పరముగను, సక్రమమైన కట్టుదిట్టములుగలలేబరును జాతీయ

పోరాటములో జేరునట్లుగను చేయవలెనని యాశించితిని. బహుశః యీయాస యడియాస. జాతీయత జాతీయతగా నుండుట మానినప్పుడే సామ్యవాద పరముగను, బీదలపరముగను నుండగలదు. కాని జాతీయ కాంగ్రెసుయొక్క దృక్పథమెంత ధనాఢ్యుల పరముగనున్నను దేశములో విప్లవశక్తిని చూపగల పటుత్వమైన పక్షమదియొకటియే యని నేను గ్రహించితిని. కనుక లేబరు దానికి తోడ్పడ వలెను. అదితన వ్యక్తిత్వమును, యాశయములను స్పష్టముగను, కట్టుదిట్టముగను నుంచుకొని, కాంగ్రెసుతో సహకారమొసగ్చి దానిపై పలుకుబడి సంపాదించవలెను. పరిస్థితులును, ప్రత్యక్షకార్యములో పాల్గొనుటయు విధాయికముగ కాంగ్రెసునే మరింత విప్లవకరమగు యాశయములకును, సాంఘిక ఆర్థిక సమస్యలకును తరుమునని నేనాశించితిని. ఈమధ్య కొద్ది వత్సరములనుండి కాంగ్రెసు రైతునకును గ్రామమునకును సుముఖముగావృద్ధి చెందుచుండెను. ఈ యభివృద్ధియే సాగుచుండిన మెడల నదికొంతకాలములో గొప్పరైతుసంస్థ కాగలదు. లేదా రైతుల ప్రాబల్యముగల యొక సంస్థకాగలదు. మా యు. పి. జిల్లాకాంగ్రెసు కమిటీలలో నాయకత్వము మధ్యతరగతి విద్యాధికుల చేతులలో నున్నను నిదివరకే రైతుప్రాతినిధ్యము బలీయముగ నుండెను.

ఈవిధముగా గ్రామమునకును పట్టణమునకును, నిరంతర పోరాటమున కవకాశముండెను. జాతీయ కాంగ్రెసుకును టి. యు. కాంగ్రెసుకును గల సంబంధ మీ పోరాటముపై నాధారపడియుండును. కాని యిది యిప్పటి సంగతి కాదు. ప్రస్తుతము జాతీయకాంగ్రెసు మధ్యతరగతులవారిచే నడుపబడుచు పట్టణముల వశములో నుండెను. భారత స్వాతంత్ర్యసమస్య తేలనంతవరకునుదానిజాతీయతయేరాజ్యముచేయును; జాతీయభావమే దేశములో నత్యంత శక్తివంతమైనది కాగలదు. అయినను కాంగ్రెసును క్రమశిక్షగల లేబరు సమీపముకు తెచ్చుటయావశ్య

కముగా నాకు తోచెను. యు. పి. లోమేము రాష్ట్ర ట్రే. యూ. కాం శాఖనుండి రాష్ట్రకాంగ్రెసు కమిటీకి ప్రతినిధులనుగూడనాహ్వానించి తిమి. చాలమంది కాంగ్రెసు నాయకులు లేబరువ్యవహారములలో ముఖ్యపాత్రను వహించిరి.

కానిలేబరులోని యతివాదులు జాతీయ కాంగ్రెసుపట్ల విముఖ ముగ నుండిరి. వారు దానినాయకులను నమ్మకుండిరి. దానియాశయ ములు ధనాఢ్యులవనియు, యభివృద్ధి నరికట్టునవనియు (లేబరు దృష్టిలో చూచిన నిదినిశ్చయము) వారుభావించిరి. కాంగ్రెసు (దాని పేరులోనే యాయర్థము స్ఫురించును) జాతీయసంస్థ.

1929లో భారత దేశములోని ట్రేడుయూనియనులు విట్లీకమి షనుయనులేబరురాయలుకమిషను సమస్యమీద నాందోళన పడ సాగెను. ఎడమ పక్షమువారుదానిని బహిష్కరింపవలెననిరి. కుడిపక్షము వారు సహకారము చేయవలె ననిరి. కుడిపక్షములోని నాయకులకు కొందర కందులో సభ్యత్వము నిచ్చుటచే స్వార్థము పనిచేసెను. ఈ విషయములో, అనేకయితర విషయములలోవలె, నాసానుభూతి యెడమ పక్షము నైపున (ముఖ్యముగా జాతీయ కాంగ్రెసు నీతికూడ నిదియే కనుక) యుండెను. మనము ప్రత్యక్ష పోరాటమును జరుపుచున్న సమయమున లేక జరుపనున్న సమయమున ప్రభుత్వ కమీషనులతో సహ కారము చేయుట విరుద్ధముగ కాన్పించెను.

నాగపుర ట్రే. యూ. కాంగ్రెసులో విట్లీకమిషను బహిష్క రణ సమస్యయే ప్రధానసమస్య యయ్యెను. దీనిలోను, వివాదములో నున్న యితర విషయములలోను యెడమ పక్షమువారికే విజయము కలిగెను. ఈ కాంగ్రెసులో నేను చాల యప్రధానుడనుగ నుంటిని. లేబరు రంగములోనికి క్రొత్తగా వచ్చినవాడనగుటచే నేను తడవు కొనుచు సందేహించుచు నుంటిని. సాధారణముగా నేను యతివాదు

లకు సుముఖముగనే నాయభిప్రాయములను ప్రకటించితిని. కాని నేనెవరితోను కలిసిపోకుండ నిష్పక్షపాతమైన యుపన్యాసకుని వలె నుంటిని కాని యాదేశించు యధ్యక్షునివలె నుండలేదు. టి. యు. సి. విభజనమును, క్రొత్తమితవాద సంస్థను నిర్మించుటను నేనొక ప్రేక్షకునివలె చూచుచుంటిని. కుడిపక్షములవారు విడిపోవుట యుక్తము కాదని నేను, వ్యక్తిగతముగ, భావించితిని. కాని, యెడమపక్ష నాయకులు కొందరు వారిని త్వరపరచి వారు విడిపోవుట కన్నిసాకులకు నాస్కారమిచ్చిరి. ఈ రెండు పక్షములకును మధ్య నొకపెద్ద మధ్య పక్ష మసహాయముగ నుండెను. బహుశః సరియైన నాయకత్వ మున్నచో వారీ యిరుపక్షముల వారిని నిరోధించి టి. యు. సి. విడిపోకుండ చేయగలిగెడివారు. ఒకవేళ విడిపోవుటయే తటస్థించినను యంతటి దుష్ఫలితము లుండెడివి కావు.

కనుక భారత దేశములో ట్రేడు యూనియను యుద్యమమునకు గొప్ప నష్టము సంభవించి యది యిప్పటికిని కోల్కొనలేదు. ప్రభుత్వ మిదివరకే లేబరు యుద్యమములోని యతివాద పక్షముల మీదకు ధ్వజమెత్తెను. దాని ప్రథమ ఫలితమే మీరటుకేసు. ఇది సాగుచునే యుండెను. యజమానులు కూడ తమ లాభములకొరకు పోరుట కిదియే సమయ మనుకొనిరి. 1929-30 శీతకాలములో ప్రపంచ ఆర్థిక మాంద్యము ప్రవేశించెను. ఒక వంక దీనిచే బాధపడుచు, నన్ని వైపుల నుండియు పోట్లుపడుచు, తమ ట్రేడు యూనియను అతిదీన స్థితిలో నుండ, భారత పనివాండ్ర స్థితి చాల దుర్భరముగ నుండెను. వారి స్థితి నానాటికి దిగనారుచుండ, చేయునదిలేక వా రసహాయులై చూచుచుండిరి. టి. యు. సి లో మరి యొకటిరెండు వత్సరములలో మరియొక చీలిక బయలుదేరెను. ఈవిధముగా హిందూదేశములో సిద్ధాంతరీత్యా మితవాదబృందము, ప్రధాన టి. యు. సి., కమ్యూనిస్టు

పక్షము అను మూడు ట్రేడుయూనియను ఫెడరేషను లేర్పడెను. ఆచరణలో నివియన్నియు దుర్బలముగను, నిర్వీర్యముగను నుండెను. వాటి పరస్పర పోరాటములు పనివాండ్ర కందరకును కంటకముగ నుండెను. 1930 లగాయితు నేను తరుచు జయిలులో నుండుటచే నాకు దీనితో సంబంధము లేకపోయెను. నేనప్పుడప్పుడు కొద్దికాలము వెలుపల నున్నపుడు సంఘీభావ ప్రయత్నములు జరుగుచుండెనని వినుచుంటిని. అవి జయప్రదము కాలేదు. రైల్వేపనివాండ్రు తమ వైపున నుండుటచే మితవాదవర్గముకు బలము చేకూరెను. ప్రభుత్వము వారిని గుర్తించి, జనీవాలోని లేబరు కాన్ఫరెన్సుకు వారుచేసిన సూచనల నామోదించుటచే వారి కితర గూప్రులవారికంటె సౌకర్యమొకటి చేకూరెను. జనీవాను సందర్శించ వలెననెడి యుబలాటము కొంతమంది లేబరు నాయకుల నటు లాగివేసెను. వారు తమతో తమ యూనియనులను తీసికొనివెళ్ళిరి.

# ౨౮

## స్వాతంత్ర్యము—తరువాత.

—◆)O(◆—

లాహోరు కాంగ్రెసు నాస్మృతి పథమున నెప్పుడును నూతనముగ పచ్చని పచ్చికసీమవలె నుండును. నేనందులో ప్రధానపాత్రను వహించుటచే నది సహజము. కొంచెమునేపు నే నారంగస్థల కేంద్రము నాక్రమించితిని. ఆ యవిరళ దినములలో నాలోనుత్పన్నమైన యుత్తుంగ భావముల నొక్కొక్కప్పుడు నేను తలచుకొన నుత్సహింతును. లాహోరు ప్రజలు నాకొసగిన బ్రహ్మాండమైన యాహ్వానమును నే నెన్నడును మరువజాలను. ఈయపార పారావారమగు నుత్సాహము నావ్యక్తికొరకుగాక నొక యాశయము, ఒక చిహ్నముకొరకని నేనెరుగుదును. అయినను, అనేకవేల మంది దృష్టిలోను, హృదయములలోను కొద్దికాలమైనను, నొకడట్టి చిహ్నమగుట స్వల్పవిషయముకాదు. నే నపరిమితానంద భరితుడనై, నాశరీరమును మరచినట్లయ్యెను. కాని నా స్వవిషయము లంత ముఖ్యములుకావు. గొప్పసమస్యలు పరిష్కరింప బడనున్నవి. ఆవాతావరణమంతయు నుత్సాహ పూరితముగ నుండి యాసమయమున కవసరమగు శ్రద్ధాభరితముగ నుండెను. మానిశ్చయములు కేవల విమర్శలుగాని వ్యతిరేకాభిప్రాయ ప్రకటనలుగాని, యభిప్రాయ ప్రకటనలుగాని గాక దేశమునంతను నొక్కసారిగా కదల్చివేసి యనేక లక్షలమంది జీవితములను మార్చివేయు కార్యాచరణ కాహ్వానములగుచుండెను.

మనకుగాని, మన దేశమునకుగాని దూరమున నున్న భవిష్యత్తులో నేమిరానున్నదో యెవరును జోస్యము చెప్పజాలరు. కాని సమీప భవిష్యత్తు మాత్రము స్పష్టముగనే యుండెను. అది మనకును

మనప్రియజనులకును పోరాటమును, బాధను సమర్పింపనున్నది. ఈ భానము మాయుత్సాహములను శాంతపరచి, మాబాధ్యతల నెక్కు-వగా గుర్తుకు దెచ్చెను. మేమిచ్చు ప్రతివోటు సుఖమునకు, భోగములకు, గృహసౌఖ్యములకు, స్నేహితులకు తుదిసందేశము. అది యొంటరి దినములకు, రాత్రులకు, శరీర, మానసిక బాధలకు నాహ్వానము.

స్వాతంత్ర్యమును గురించిన ప్రధాన తీర్మానమును, స్వాతంత్ర్య పోరాటముకొరకు చేయవలసిన కార్యక్రమములును యేకగ్రీవముగ (అనేక వేల మందిలో నిరువది మంది వ్యతిరేకముగ వోటుచేసిరి) నామోదింప బడెను. సవరణ రూపమున వచ్చిన యొకచిన్న సమస్యమీద నిజమైన వోటింగుజరిగెను. ఈసవరణ యోడింపబడెను. వోటింగు లెక్కలు ప్రకటింపబడెను. ప్రధాన తీర్మాన మామోదింప బడెనని (ఒకవిచిత్ర సంఘటనవలన) డిసంబరు 31 వ తేదీ రాత్రి 12 వ గంట మ్రోగుచుండ, పాతసంవత్సరముపోయి క్రొత్తసంవత్సర ముదయించువేళ ప్రకటింపబడెను. ఈవిధముగా కలకత్తా కాంగ్రెసులో నియుజడిన సంవత్సర గడువు గడిచిన తోడనే క్రొత్తనిశ్చయము గావింపబడి, సంగ్రామ సన్నాహములు ప్రారంభ మయ్యెను. చక్రములు చలనములో పెట్ట బడెను. కాని మేమెట్లు ప్రారంభింప వలెనో, యెప్పుడు ప్రారంభింప వలెనో తెలియక నింకను అంధకారములో పడియుంటిమి. వ్యూహమును పన్నుటకును, నిర్వహించుటకును అ. భా. కా. కమిటీ వారి కధికార మిచ్చిరి. కాని నిజ నిశ్చయము గాంధీజీలోనే యుండెనని యందరకును తెలియును.

లాహోరు కాంగ్రెసుకు సమీపముననున్న సరిహద్దు రాష్ట్రముల నుండి యనేకమంది ప్రజలు వచ్చిరి. ఈరాష్ట్రమునుండి కాంగ్రెసు సభలకు వ్యక్తిగతముగా ప్రతినిధులెప్పుడును వచ్చుచునే యుండిరి. కొన్నిసంవత్సరములనుండి ఖానుఅబ్దుల్‌గఫర్‌ఖాను హాజరగుచు ఫూ

చర్చలలో పాల్గొనుచుండెను. శ్రద్ధాసమన్వితులగు యువకులనేకమంది మొట్టమొదటిసారి లాహోరులో నఖిలభారత రాజకీయతరంగ సంపర్కమున ననుభవించుటకు సరహద్దులనుండి వచ్చిరి; వారి నవీన యకల్మష హృదయములాకర్షింపబడెను; వారు స్వాతంత్ర్య పోరాటములో భారత దేశమంతటితోను నైక్యముయితిమను భావముతో మరలివెళ్లి దాని కొఱకుత్సాహ ప్రపూరితులయి యుండిరి. వారునిరాడంబరులు; కాని కార్యశూరులు; భారతదేశములోని యితరరాష్ట్రముల వారందరికంటెను తక్కువజల్పమతులు; వృథావాగ్వాదము చేయువారుకారు. వారుతమ ప్రజల నైక్యముచేయనారంభించి నూతనభావములను వెదజల్లుచుండిరి. వారికిజయము చేకూరెను. భారతపోరాటములో చిట్టచివరచేరిన సరిహద్దురాష్ట్ర స్త్రీపురుషులు 1930 లగాయతు ప్రధానపాత్రను ధరించిరి.

లాహోరుకాంగ్రెసు జరిగిన తక్షణమే దానియాజ్ఞలప్రకారము మాతంత్రిఅసెంబ్లీలోను శాసనసభలలోనుగలకాంగ్రెసు సభ్యులను తమస్థానములకు రాజీనామా యీయవలసినదని తెలిపెను. వారిలో చాలమంది మొత్తముగా లేచివచ్చిరి. కొద్దిమంది యట్లుచేయుటకు (అది వారు చేసిన ఎన్నికవాగ్దానములకు భంగమే యైనను) తిరస్కరించిరి. ఇంకను భవిష్యత్తు మాకస్పష్టముగనే యుండెను. కాంగ్రెసు సభలలో జూపబడిన యుత్సాహమెంతయున్నను కార్యక్రమము లోనికి దిగినపుడు దేశమెంతవరకు తోడ్పడునో యెవరికెరుక? మేమొక నిశ్చయమునకు వచ్చితిమి. వెనుకకు మరలుట యసంభవము. దేశము యొక్క నాడి మాకింకను తెలియకుండెను. మాయుద్యమము నారంభించుటకును, కొంతవరకు దేశముయొక్క యుత్సాహమును పరీక్షించుటకును జనవరి 26 వ తేది స్వాతంత్ర్య దినముగా ప్రకటింపబడెను. ఆదినమున నాసేతు హిమాచల పర్యంతమును స్వాతంత్ర్య ప్రమాణములను తీసికొన నిశ్చయింపబడెను.

కనుక, మావిధానమును గురించి సందేహములు బాధించు చుండ యుత్సాహము చేతను, జయప్రదమగు నేదోయొక కార్యము నాచరింపవలెనను కోరిక చేతను మేము పరిస్థితులకొరకు వేచియుంటిమి. జనవరి మొదటి వారములో నేను అలహాబాదులో నుంటిని. మాతండ్రి చాలవరకు నితరప్రాంతములలోనే యుండెను. అవి సాంవత్సరికోత్సవ మైన మాఘమేలా దినములు. బహుశః అది ప్రత్యేక కుంభసంవత్సర మయియుండుటచే లక్షలకొలది యాత్రికులు అలహాబాదు, లేక పవిత్ర ప్రయాగ తీర్థమునకు నిరంతర ప్రవాహమువలె వచ్చుచుండిరి. వారిలో రయితులు, కూలివాండ్రు, దుకాణదారులు, చేతిపనివాండ్రు, వర్తకులు, వ్యాపారస్థులు, యితరవృత్తులలోనివారు- వీరువారననేల యన్ని బాపతులవారునుండిరి. నిజముగా నది హిందూదేశముయొక్క యొక ప్రధానపక్షము. నదికి పోవుచు వచ్చుచుండు యీనిరంతర జనప్రవాహమును, గుంపులను పరీక్షించునప్పుడు సత్యాగ్రహమునకును, ప్రశాంతమగు ప్రత్యక్షకార్యాచరణకును పిలుపు వచ్చినప్పుడు వీరెట్లు ప్రవర్తింతురాయని నేనాశ్చర్య పడుచుండెడివాడను. వీరిలో నెంతమందికి లాహోరు నిశ్చయములు తెలియును? ఎంతమందివానిని లక్ష్యముచేతురు? భారతదేశములోని మూల మూలల నుండియు ననేక వేలసంవత్సరముల నుండి వారిని, వారివారిని పవిత్ర గంగాతోయములలో స్నానముచేయ తీసికొనివచ్చిన యావిశ్వాస మెంత యద్భుత శక్తివంతముగ నుండెను! ఈయద్భుత శక్తిలో కొంత నైనను వారు తమదుస్థితిని పోగొట్టుకొనుటకు రాజకీయ, ఆర్థిక కార్యాచరణవైపు త్రిప్పజాలరా? లేకవారి మనస్సులు మతసాంప్రదాయములతోను, మతసింగారములతోను నిండి యితర యాలోచనలను చొరనీయవా? ఈయితర యాలోచన లిదివరకే యచ్చటనుండి యుగ యుగములనాటి ప్రశాంతమగు స్తబ్ధత్వమును కదల్చుచుండెనని నేనెరుగుదును. ప్రజలయస్పష్ట కోరికలలోనియు, ధూశయములలోనియు నీచలనమే గత పది పన్నెండు వత్సరముల

ప్రబోధములకు కారణమై భారతదేశముఖము నంతను మార్చివేసెను. ఆకోరికలచ్చటనున్న సంగతియు, వాటివెనుక బ్రహ్మాండమైన శక్తి యున్నసంగతియు నిస్సంశయము. అయినను సందేహము వచ్చుచుండెను. ప్రశ్న లుదయించు చుండెను. వీటికి సమాధానము వెంటనే రాకుండెను. ఈ భావము లెంతవరకును వ్యాపించెను? వాటివెనుక నెంతబలము కలదు? సక్రియమైన పని జరుగుటకును, చిరసహనమునకును శక్తియెంత కలదు?

మా యింటికి యాత్రీకులెందరో గుంపులు గుంపులుగా వచ్చుచుండిరి. అది యొక యాత్రాస్థలమగు భారద్వాజమను చోటనుండెను. అచ్చట పూర్వకాలమున నొకప్రాచీన విశ్వవిద్యాలయ ముండెడిది. పర్వదినములలో ప్రాతఃకాలము మొదలు సాయంత్రమువరకు నెడ తెరపి లేకుండ ప్రేక్షకులు మమ్ము చూడవత్తురు. వారిలో చాలమంది వేడుక కొరకువత్తురనుకొనెదను. వారువినిన ప్రఖ్యాత పురుషులను ముఖ్యముగా, మాతండ్రిని చూడవలెనను కోరిక యొకటియుండెను. కాని వచ్చిన వారిలో చాలమందికి రాజకీయ పరిజ్ఞానము కలదు. కాంగ్రెసు యేమి చేయుచున్నది? యేమి నిశ్చయించినది? ముందేమి జరుగనున్నది? యను ప్రశ్నలను వారడుగ జొచ్చిరి. తమనిజ యార్థిక కష్టములు వారిని వేధించుచునే యుండుటచే వాటిని గురించి తామేమి చేయవలెనో వారు తెలిసికొనగోరిరి. మనరాజకీయ కేకలు. వారికి బాగుగా తెలియును. కనుక దినమంతయు మాయిల్లు వారికేకలతో ప్రతిధ్వనించు చుండెను. నేను యిరవైమంది, యేబదిమంది, నూరుమంది యొక్కొక గుంపుగా వచ్చినపుడు వారి కేదియోచెప్పి పంపనారంభించితిని. కాని చివరకిది యసాధ్యమగుటచే నొక్క నమస్కారము చేసి పంపుచుంటిని. దీనికిని యొకయంత ముండవలెను. నేను దాగుటకు ప్రయత్నించితిని. అది నిష్ఫలమయ్యెను. కేకలు అంతకంత కధికమై మిన్నుముట్టుచుండెను.

ఇంటి వరండాలన్నియు మమ్ము చూడవచ్చిన ప్రేక్షకులతో నిండి పోయెను. ప్రతితలుపుదగ్గర ప్రతికిటికీదగ్గర మమ్మన్వేషించు నేత్రపుంజములు గుమిగూడెను; పనిచేసికొనుటకుగాని, మాట్లాడుటకుగాని, తినుటకుగాని, మరేమి చేయుటకుగాని యసాధ్య మయ్యెను. ఏమిచేయుటకును తోచకుండెను; చికాకు, కోపమువచ్చుచుండెను. కాని తరతరములనుండి గర్భదారిద్ర్యమును, బాధలను అనుభవించుచు, సహాచరభావమును, సానుభూతిని తప్పమరేమియును కోరకకృతజ్ఞతను, ప్రేమను మనపై ప్రవహింపచేయ వచ్చినవారిని తిరస్కరించుటెట్లు? వారుచూపు యపరిమితభక్తి, ప్రేమలముందర వినమ్రులము, భయకంపితులము గాకుండ నుండుట యసాధ్యమయ్యెను.

అప్పుడు మాయింట మాతోనొక ప్రియమైన స్నేహితురాలుండెను. ఆమెతో నెట్టిసంభాషణ యైనను జరుపుట తఱుచుకష్టమగుచుండెను. బయటజేరు గుంపుల కేకోద్ధియో చెప్పివచ్చుటకు నేను ప్రతియైదు నిమిషములకును యింకను తక్కువ కాలములోను వయికి రావలసి వచ్చుచుండెను. ఈమధ్య కేకలును, చప్పట్లును విసవచ్చుచుండెను. నాదుస్థితి యామెకు వినోదమును కలిగించెను. ఆమె ప్రజలలో నాకుగల పలుకుబడికి (అని యామెయనుకొనెను.) కొంచెమాశ్చర్యపడెను. (యథార్థమునకు వారు మాతండ్రికొరకే వచ్చిరి. కాని యతడు లేకపోవుటచే నేనా సంగీతమునకు గురికావలసి వచ్చెను.) ఆమె యకస్మాత్తుగా నావైపుతిరిగి నేనీ వీరపూజనెట్లు భావించెద నని ప్రశ్నించెను. నేను దానికి గర్వింపలేదా? నేను బదులు చెప్పుటకు ముందు కొంచెము సందేహించితిని. నన్ను చాలవ్యక్తిగతమైన ప్రశ్నవేశి కంగారుపెట్టి నట్లామె దీనివలన గ్రహించి క్షమార్పణ కోరెను. ఆమె నన్నెంత మాత్రమును కంగారు పెట్టలేదు. కాని నాకది కఠినమైన ప్రశ్నగా కాన్పించెను. నామనస్సు చెదరిపోయి నాభావములను చేష్టలను విమర్శించు కొనసారంభించితిని. అవిచాల మిశ్రమములై యుండెను.

నాకు ప్రజలలో నసామాన్యమైన పలుకుబడి (అప్రియత్నము గా) కలిగినమాట సత్యము. విద్యార్థులు నన్ను మెచ్చుకొనెదరు. యువకులకును, యువతులకును నేనొక చిన్నవీరుడను. వారిదృష్టిలో పూర్వగాథల నాటి కీర్తిపుంజములు నాచుట్టు నలముకొనెను. నన్ను గురించి యనేక గీతములు వ్రాయబడెను. అసంభవములు, పరిహాసాస్పదములునగు ననేక కథలు బయలు దేరెను. నాశత్రువులుకూడ నన్నుగురించి మంచివాక్యములను చెప్పుచు సమర్థతలోగాని, విశ్వాసములోగాని నేను కొఱవడనని మెహార్బానీగా యొప్పుకొనుచుండిరి.

ఎట్టిచలనమును, నెట్టివికారమును పొందకుండ పైపొగడ్తల నన్నింటిని దాటగలవాడొక ఋషియైనను కావలెను; లేదా ఘూనవాధముడైన రాక్షసుడైనను కావలెను. నే నీరెండు జాతులకును చెందనివాడను. అవి నాతలకెక్కి కొంచెము మత్తుకలుగచేసి నాకు శక్తిని, విశ్వాసమును కలుగచేసెను. నాపద్ధతులలో (నేనట్లూహించెదను. ఏలనన పయినుండి తన్నుతాను చూచుకొనుట యసాధ్యము) నేనుకొంచెము నిరంకుశుడనైతిని. ఒక ఛాయడిక్టేటరునైతిని. అయినను నాయహంకారమంత మితిమీరనదని నేననుకొనను. నాశక్తిసామర్థ్యములను గురించి యుక్తమగు జ్ఞానమును కలిగియుండి (నేననుకొంటిని) నేను వాటిని గురించి వినమ్రుడను గానుండలేదు. కాని వాటిలో నద్భుత మేమియు లేదని నేను బాగుగ నెరుగుదును. నాలోటుపాటులు నాకు బాగుగ తెలియును. ఆత్మపరీక్షచేసికొను నాయభ్యాసము నేనెట్టి తొట్రుపాటును పడకుండ కాపాడి నాకు సంబంధించిన సంభవముల నుదాసీనతతో చూడగలుగుటకు తోడ్పడెను. పేరుప్రఖ్యాతులు తఱుచుగా యవినీతి పరుల చెలికత్తెలని పబ్లికు జీవితానుభవమువలన నాకు తెలిసెను. అవి సుగుణ సంపత్తికిగాని బుద్ధి విశేషముకుగాని విధాయికమైన చిహ్నములు కావు. కనుక నాకు కలిగిన ప్రఖ్యాతి నా తప్పిదములకా? లేక నా శక్తి

సంపదలకా ? నేనెందుకు ప్రఖ్యాతి కెక్కితిని? బుద్ధివిశేషమునకు గాదు. ఏలనన నది యసాధారణమైనదికాదు. అథవా కీర్తిని సాధించునంత టిదికాదు. త్యాగములని పిలువబడు వానికినిగాదు. ఏలనన భారత దేశములో మనయెదుటనే వందలును, వేలును యింతకంటె ననంతమగు బాధలననుభవించి చివరకు తుదిత్యాగమును కూడచేసిరి. నేను వీరుడ ననుకీర్తి కేవలము కల్పితము. వీరుడనను భావము నాకెంతమాత్రమును లేదు. సాధారణముగా వీరదృక్పథము లేక జీవితములోని నాటకాభి నయనము నాకు మూర్ఖముగా కాన్పించును. ఆశ్చర్యగాథల సందర్భ ములో నేసందరికంటెను ఆశ్చర్య శూన్యుడనగు మానవుడను. నాకు కొంత శరీర మానసిక ధైర్యస్థైర్యము లున్నమాట వాస్తవము. బహుశః అభిమానమే, గర్వమే దానికి పునాది. అదినాకును, నాగూర్చిపు కును, నా జాతికిని చెంది దేనికిని లొంగనిచ్చగింపని యభిమానము.

నా ప్రశ్నకు తృప్తికరమగు సమాధానములేదు. నేనప్పుడు మరి యొక విధమగు పరిశోధన నారంభించితిని. మాతండ్రియు నేనును భారత దేశమునుండి ప్రతివారము మాదుస్తులను ప్యారిసు పట్టణములోని యొకలాండ్రికి పంపి యిస్త్రీ చేయించుకొందుమను నొక యభూత గాథ కల్పింపబడెను. మేమనేకసార్లు దీనిని ఖండించినను యీగాథ పెరుగుచునే యుండెను. ఇంతకంటె వికృతము మూర్ఖమునగు దానిని నేనూహింపజాలను. ఇట్టి వ్యర్థమగు వేషభాషలలో మునియు మిూర్ఖ మున్నచో మూర్ఖశిరోమణి బహుమతి కతనినామాచే ప్రత్యేకముగ నుదహరింప దగియుండును.

వేల్సు యువరాజుతో నేను పాఠశాలలో చదివితినను మరి యొక చిత్రగాథ, యెన్నిసారులు కాదనినను, చెప్పబడుచుండును. యువ రాజు 1921 లో హిందూదేశము వచ్చినపుడు నన్నుగురించి యడిగెనని యాకథ చెప్పును. నేనప్పుడు జయిలులో నుంటిని. యథార్థమునకు,

నేనతనితో పాఠశాలలో చదివియుండలేదు సరికదా, నే నింతవర కెప్పుడు నతనిని కలిసికొనలేదు, అతనితో సంభాషించి యుండలేదు.

ఈగాథల మీదగాని, యిటువంటి గాథల మీదగాని నాపలుకు బడి లేక పేరు ప్రఖ్యాతులు ఆధార పడియుండెనని నాయభిప్రాయము కాదు. వాటి కింతకంటె గట్టిపునాదులే యుండవచ్చును. కాని, యీ కథలవలన విశదమైనట్లు పై కట్టడము మాత్ర మిట్టిదట్టమగు నాడంబ రపు పూతలతో నలంకరింపబడె ననుటకు సందేహములేదు. అథమము గొప్ప గొప్ప వారితో తిరుగుచు, భాగ్యభోగ్యముల ననుభవించుచు తరువాత దానినంతను సన్యసించి రనుభావము కలదు. సన్యాసమెప్పు డును భారత హృదయము నాకర్షించెను. కీర్తి కిదయొక పునాదియగుట నాకెంతమాత్రమును నచ్చదు.

నేను చేష్టలులేని సుగుణ సంపత్తికంటె కార్యాచరణతో గూడిన సుగుణ సంపత్తినే యభినందించెదను. త్యాగముకొరకే చేయబడు త్యాగ, సన్యాసములను నేనంగీకరింపజాలను. మరియొక దృష్టిలో-మానసిక, ఆధ్యాత్మిక శిక్షణయనుదృష్టిలో - నేను వాటిని గౌరవించెదను. యోగ్యమైన శరీరారోగ్యములను కలిగియుండ వలెననిన క్రమజీవితము, నిరాడంబర జీవితము ముఖ్యావసరములు. గొప్పగొప్ప సాహస కార్య ములను నిర్వహింప బూనినవారికి కష్టసహిష్ణుత, పట్టుదల యుండు టత్యవసరము. కాని సన్యాస జీవితము పట్ల (భయపడి జీవిత సౌఖ్యము లను, ఆనందములను పోగొట్టుకొనుపట్ల) జీవితమునే తిరస్కరించు పట్టున నాకు ప్రీతిగాని, మోహముగాని లేదు. నేను నిజముగా గౌరవించిన దానిని దేనిని బుద్ధిపూర్వకముగ విడిచిపెట్టలేదు. కాని గౌరవములు మారుచుండును. నాస్నేహితురాలు నన్నడిగిన ప్రశ్నకింకను ప్రత్యుత్త రము కానేలేదు. ప్రజల యీవీరపూజ వలన నేను గర్వముచెందలేదా? నాకది యెంత మాత్రము నిష్టములేక దానినినుండి పారిపోగోరితిని.

కాని నేను దాని కలవాటు పడవలసి వచ్చెను. అది యెంతమాత్రమును లేనప్పుడు నాకు కొఱతగనే యుండెడిది. రెండును యసంతృప్తి కరముగనే యుండెను. కాని, మొత్తముమీద ప్రజలు నాయాంతరంగిక కోరికను దేనినో తీర్చెడివారు. నేను వారి నొప్పించి కార్యరంగములోనికి దింపగలనను భావము నాకు వారి మనోహృదయములపై నొక యధికార భావమును కలిగించెను. ఇది కొంతవరకు నాయధికారేచ్ఛను తృప్తిపరచెను. వారిమట్టుకు వారు నాపై, కనపడని నిరంకుశత్వమును, చెలాయించెడివారు. ఏలనన వారి విశ్వాస, ప్రేమలు నాయంతరంగమును కదల్చి భావతరంగముల నుద్రేకింపచేసెడివి. నేనెంత వ్యక్తిత్వమును నమ్మువాడనైనను యొక్కొక్కప్పుడు వ్యక్తిత్వపుహద్దులు నశించినట్లు కాన్పించి, యొంటరిగా నన్ను నేను రక్షించుకొనుటకంటె నీదుఃఖభాజినులగు ప్రజలతో నిడుమల గుడుచుచుండుటయే మంచిదని భావించెడివాడను. కాని, యీహద్దులంత చులకనగా నశించునవి కావు. నేను వాటిపైనెక్కి నాకర్థముకాని యీస్థితి నాశ్చర్యచకిత నేత్రములతో తొంగి చూచెడివాడను.

గర్వము, శరీరముమీది క్రొవ్వువలెనే, కాన్పించకుండ పొర మీద పొర పెరుగుచుండును. కాని, యీనిత్యాభివృద్ధిని దీనినిపొందు వ్యక్తి గుర్తించ నేరదు. అదృష్టవశాత్తు యీపిచ్చిప్రపంచములో సంభవించు కఠిన సంఘర్షణలు దానియుద్ధృతమును తగ్గించును లేక దానిని పూర్తిగా నాశనమొనరించును. గత కొద్దివత్సరములనుండి హిందూదేశములో మనకిట్టి కఠిన సంఘర్షణలకు లోటులేకుండెను. మనకు జీవితమను పాఠశాల కష్టసముద్రమయ్యెను. బాధలవంటి కఠినపాఠము వేరొకటి యుండజాలదు.

మరియొకవిధముగ గూడ నేనదృష్టవంతుడను. నాకుటుంబము, నాబంధువులు, స్నేహితులు, సహచరులు - అందరును మానసికముగ

నేనెట్టి తొట్రుపాటును పొందకుండ, యౌచిత్యమును వీడకుండచేసి నాకెంతయో తోడ్పడిరి. మున్సిపాలిటీలు, స్థానికసంస్థలు యిచ్చువినతి పత్రములు, యుత్సవములు, యూరేగింపులు మొదలగునవియు నానర ముల కలసటను కలిగించి నాలోని హాస్యరసమును, సత్యసంధతను పరీక్షించుచుండెను. ఉత్ప్రేక్షపూరితమును, అలంకారపదభూయిష్టమును నగు భాషయుపయోగింప బడుచుండెను. వారి వినయ విధేయతలను, భయభక్తులను చూచునపుడు నేనామహాసభలోనివారిని కంగారుపరచి వారిముఖలక్షణములలోని మార్పులను వీక్షింపవలెననెడి కుతూహల ముతో నవ్వవలెననియో, నాలుక చాపి వెక్కిరింపవలెననియో, లేక తల్లక్రిందులుగా నిలువవలెననియో యవశముగా నొకబుద్ధి పుట్టుచుండె డిది. అదృష్టవశాత్తు నాకీర్తికిభంగము కలుగకుండ, భారతదేశములో ప్రజాసేవ యెడలగల యుచితమర్యాద చెడకుండ, నేనిట్టి పిచ్చికోరికనుఅణచివేసి, సాధారణముగ నుచిత మర్యాదతోనే మెలగెడివాడను. కాని, యెల్లపుడు నిట్లు జరుగలేదు. అసాధారణముగ విసిగించిన యుత్సవములలోనో, లేక జనసమూహముగల సభలలోనో కొంత ప్రదర్శనము చేసెడివాడను. మమ్మాహ్వానించుటకు చేయబడిన యుత్స వమునునేనకస్మాత్తుగా వీడి, నాభార్యనో లేక మరియొకరినో యుత్స వములో నేమోటారుమీదనో గుఱ్ఱపుబండిమీదనో, కూర్చుండ బెట్టి,గుంపులో కలిసి పోయెడి వాడను.

ఈవిధముగా భావముల నణచుకొని బహిరంగములో యుక్త ముగా ప్రవర్తించుటకు చేయు నిరంతర ప్రయత్నము విసుగుకలిగింపక మానదు. దీని సామాన్య ఫలిత మేమనిన బహిరంగ యుత్సవముల లోనిది మూతిబిగింపుకును, విచారకలుషితమగు దృష్టికిని కారణమగును. బహుశః యీకారణముచేతనే యొక హిందూ మాసపత్రికలోని యొక వ్యాసములో నేను హిందూవింతతువువలె నుందునని వర్ణింపబడితిని,

నాకు పూర్వపక్షక్కీ హిందూవితంతువు లనిన యెంతో యభిమాన మున్నను యిదియొక వజ్రపాతమువలె నుండెను. నిశ్చయముగా వ్యాస కర్త నాకున్నవని యతడనుకొనిన సాధుసంపత్తితోగూడిన వైరాగ్య తత్త్వము, సన్యాసము, ముఖమున చిరునవ్వైనను యెరుగని కార్య తత్పరత సుగుణములను పొగడ నెంచెను. నాకు కార్యహాసమును తీవ్ర మును నగు సుగుణసంపత్తియు, మందహాస, హాస్యరసములును (హిందూ వితంతువులుకూడ వీని నెక్కువగా కలిగియుండవలెనని నాయాశయము) కలవని నేనాశించితిని. గాంధీజీ యొకసారి తనలో హాస్యరసమే లేనిచో నాత్మహత్య చేసికొనెడివాడనని యొకపత్రికాప్రతినిధితో చెప్పియుండెను. నేనంతదూరము పోజాలనుగాని హాస్యము, వినోద స్పర్శలు లేనిచో జీవితము నాకుదుర్భరముగా నుండెడిది.

నాకీర్తియు, లలితపద భూయిష్టమును, ఉత్ప్రేక్ష సమన్వితమును నగు ధీర వినతి పత్రములును మాబంధుజనులలోను, మా మిత్రగణము లోను నిందలకు కారణమగుచుండెను. జాతీయోద్యమములో ప్రధాను లైనవారి యెడల సాధారణముగ నుపయోగింపబడు బిరుదులు, పెద్ద పెద్ద సమాసపదములు, యుత్ప్రేక్షలు మొదలగువానిని నాభార్యయు, నాచెల్లెండ్రును, తదితరులును యేరి యగౌరవముగా నాపై విసురు చుండెడివారు. నన్ను 'భారతభూషణ' అనగా 'భారతరత్నము' 'త్యాగ మూర్తి' అనగా 'మూర్తీభవించిన యోత్యాగదేవతా' యని సంబో ధించెడివారు. వారి యీవేళాకోళము నాకుకొంత శాంతినిచ్చెడిది. నేనెచ్చట నతియోగ్యముగా మెలగవలెనో యట్టి బహిరంగ సభలలోని జిగి క్రమముగా సడల నారంభించెను. నా చిన్నకూతురుకూడ నీవినో దములో జేరెడిది. మా తల్లిమాత్రమే నాయెడల నిష్కపటముగా నుండి తన ప్రియపుత్రునిపై నెవరెట్టి వేళాకోళమును, నిందలను మోపి నను యొప్పుకొనెడిదికాదు. తండ్రిగారికిది వినోదముగ నుండెను. అతను

తన సానుభూతిని యధార్థజ్ఞానమును అతిశాంతముగ వ్యక్తము చేసెడి వాడు. కాని, యీమూకల కేకలును, నిర్వీర్యమును, విసుగు జనింప చేసెడిబహిరంగతంతులును, అంతములేనితర్కములును, రాజకీయధుమారమును, నన్ను బాహ్యముననే స్పృశించుచుండెను, నా నిజసంఘర్షణ నాయంతరంగముననే యుండెను. నాలో నంతర్గర్భితముగానున్న యాశయములు, కోరికలు, భక్తితాత్పర్యములు వెలుపలి పరిస్థితులతో తల పడుచుండెను. నాయాంతరంగికతృష్ణ చల్లారలేదు. నేను వివిధశక్తులు తమతమ యాధిపత్యములకొరకు పోరాడు రంగస్థలమునైతిని. నేను దీనినుండి తప్పించుకొన జూచితిని. నేను సామరస్యమును, సమన్వయమును పొందప్రియత్నించితిని. ఈప్రియత్నములోనే నేను కార్యోన్ముఖుడ నగుచుంటిని. అదినాకు కొంతశాంతిని సమకూర్చెడిది. బాహ్య సంగ్రామము ఆంతరంగికసంగ్రామజనిత శ్రమను పోగొట్టెడిది.

నేనిచ్చట జయిలులో కూర్చొని దీనినంతను యెందులకు వ్రాయుచున్నాను? జయిలులోనున్నను బయటనున్నను యిదియే పరిశోధన. నాకు కొంతశాంతిని, యాత్మతృప్తిని ప్రసాదించునను యుద్దేశ్యముతో నేను నాభూతభావములను అనుభవములను వ్రాయుచుందును.

---

శ్రీ

# శాసనోల్లంఘన ప్రారంభము.



1930; జనవరి 26; స్వాతంత్ర్యదినమువచ్చెను. అది తటిల్లతవలె దేశముయొక్క యపరిమితోత్సాహమును శ్రద్ధను మనకువెలిబుచ్చెను. ఎట్టి యుపన్యాసములుగాని, యెట్టి ప్రోత్సాహములుగాని లేకుండగనే ప్రతిచోటను వేనకువేలు సభలుజరిగి శాంతముగను, పవిత్రభావపరిపూరితముగను స్వాతంత్ర్య ప్రమాణములు గైకొనబడెను. ఆమహాసభలలో నొకవిధమగు భావప్రకోపము ద్యోతక మగుచుండెను. ఈయుత్సవము గాంధీజీకి తగిన ప్రోత్సాహమునిచ్చెను. ప్రజానాడిని గుర్తెరింగిన యతడు కార్యాచరణకు కాలము పండెనని గ్రహించెను.

తరువాత నొకటితరువాత నొకటిగ ననేక సంఘటనలు, తుది యంకమునకు గొనిపోవు నాటకమువలె సంభవించెను. శాసనోల్లంఘనము సమీపించి వాతావరణ మంతయు నుత్సాహ పూరిత మగుచుండ మాభావములు 1921-22 నాటియుద్యమమునైపు వెనుకకు తిరిగెను. చౌరీచౌరా మైనతరువాత నది యకస్మాత్తుగా నాపివేయబడిన విధానము జ్ఞప్తికి వచ్చెను. దేశమిప్పుడు యెక్కువ శిక్షణము నొందెను. సంగ్రామముయొక్క స్వభావమతి స్పష్టముగ గుర్తింప బడెను. యుద్ధశాస్త్రము కొంతవరకు తెలిసిపోయెను. గాంధీజీ దౌర్జన్యరాహిత్యము విషయమై యతిశ్రద్ధగ నున్నట్లందరకును విదితమయ్యెను. బహుశః పది సంవత్సరముల క్రితము కొంతమంది మనస్సులలో నున్నట్లిప్పుడు దీనిని గురించి యెట్టిసందేహమునులేదు. ఇదియంతయు నిజమేయైనను దౌర్జన్యమెచ్చటను (అప్రయత్నముగగాని, యొకపన్నుగడవలనగాని,) జరుగకుండ నుండునని మనమెట్లు నిశ్చయముగ చెప్పగలము? అట్టిదేదియైన

సంభవించినచో మనశాసనోల్లంఘనోద్యమముపై దానికెట్టిసంబంధముండును? వెనుకటివలె నది యకస్మాత్తుగా నిలిపివేయబడునా? ఈ ప్రశ్న చాల బాధకరముగనుండెను.

గాంధీజీకూడ యీప్రశ్నను గురించి తన నిజధోరణిలో యోజించుచునే యుండెను. అతనిని బాధించుచుండిన సమస్య మరియొక విధముగనుండెనని నేను మాపరస్పర సంభాషణలవలన తెలిసికొంటిని.

మంచిమార్పును, శ్రేయస్సును కలుగచేయుటకు దౌర్జన్య రాహిత్యపద్ధతి యొక్కటే యతనికి మంచిపద్ధతి. దానిని యుచితముగా నడిపినచో నది యెన్నటికిని వ్యర్థముకానేరదు. అది పనిచేయుటకును, జయించుటకును ప్రత్యేక ప్రసన్న పరిస్థితులుండవలెననియు, బాహ్యపరిస్థితులు దానికి సరిపడనిచో దాని నుపయోగింప కూడదనియు వేరుగ చెప్పవలెనా? అనగా దౌర్జన్య రాహిత్యపద్ధతి యన్నిపరిస్థితులకును పనికిరాదనియు కనుక సర్వకాల సర్వావస్థలయందు నుపయోగించునదియు, ప్రమాదరహితమైనదియు కాదని సారాంశము. గాంధీజీ యీసారాంశమును సహింపజాలడు. అది ప్రమాదరహితమనియు, విశ్వమున కంతకును వర్తించు పద్ధతియనియు గాంధీజీయొక్క దృఢ విశ్వాసము. కనుక బాహ్యపరిస్థితులు ప్రసన్నముగ నుండకపోయినను దౌర్జన్యమధ్యముననను అది విధాయికముగ పనిచేసి తీరవలెను. పరిస్థితులు మారుచుండిన యెడల దానికనుగుణముగ పనిచేయు విధానమును మార్చుకొనవచ్చును. కాని దానినాపివేయుట యీపద్ధతియే వ్యర్థమని యొప్పుకొనిన సట్లగును.

బహుశః యతని మనస్సు యీవిధమున యోచించెను. కాని యతని భావములను నేను చెప్పజాలను. అతని దృష్టిలో నేదియో కొంత మార్పుకలిగినట్లును, శాసనోల్లంఘనము (ప్రారంభమయినచో) అచ్చటచ్చట బయలుదేరు దౌర్జన్యములచే నాపివేయబడ నక్కర

లేదనియు నతడు మాకుకొంతసూచన చేసెను. దౌర్జన్యము యేవిధము ననైన యుద్యమములో నొకభాగమేయైనచో నది శాంతియుత శాస నోల్లంఘనము కాజాలదు. అప్పుడు దానిని విరమింపవలసియుండును లేదా దానిని మార్చివేయ వలసియుండును. ఈ సందేహ విచ్ఛేదము మాలోచాలమందికి తృప్తికరముగ నుండెను. దీనినెట్లు ప్రారంభించ వలెను? అను పెద్దసమస్య మమ్మిపుడు బాధింపతొడగెను. జయప్రద ముగ నుండుటకు మేమెట్టివిధమగు శాసనోల్లంఘనమును ప్రారంభింప వలెను? పరిస్థితులకేదితగియుండును? ప్రజలకేది యంగీకారముగ నుండును? అప్పుడు 'మహాత్ముడు' మార్గమును చూపెను.

ఉప్పు అకస్మాత్తుగా మహామంత్రమయ్యెను. దాని కద్భుతశక్తి కలిగెను. ఉప్పుపన్నుపై ధ్వజమెత్తవలెననిరి. ఉప్పుచట్టములను ముక్కలు చేయవలెను. మేమాశ్చర్యపడితిమి! ఎక్కడి జాతీయసంగ్రామము! ఎక్కడిమామూలు ఉప్పు! ఈ రెంటికిని యెక్కడి సంబంధము! మరి యొక యాశ్చర్యకరమగు విషయమేమన గాంధీజీ తన 'పదకొండు షర తులను' ప్రకటించెను. మనము స్వాతంత్ర్యమును గురించి మాట్లాడు చుండ నొకరాజకీయ సాంఘిక సంస్కరణల జాబితాను (అవిమంచివే యైనను) తయారు చేయుటలో నర్థమేమున్నది! గాంధీజీ యీపదము నుపయోగించినపుడు మనము దీని నుపయోగించిన యర్థములోనే యుపయోగించెనా? లేక మేము వేరువేరు భాషమాట్లాడుచుంటిమా? పరిస్థితులు ముంచుకొని వచ్చుచుండుటచే మాకువాదించుకొనుటకు కాలములేకపోయెను. భారతదేశములో నవిరోజురోజు మాకందఱముం దర రాజకీయముగ పరుగెత్తుచుండెను. అవి (మేమప్పుడు గుర్తించలేదు) ప్రపంచములో మరింతవేగముగ పరుగెత్తుచు భయంకరమగు నార్థిక మాంద్యము దానినలముకొనెను; ధరలుపడిపోవుచుండెను. నగర వాసులు (వారికిది యైశ్వర్యప్రదమగుటచే) దీనికి సంతసించిరి. కాని వ్యవ

సాయుదారు, కవులుదారు యీదృశ్యమును భయోత్పాతముతో గమ నించు చుండిరి.

తరువాత గాంధిజీ వైస్రాయితో నుత్తరప్రత్యుత్తరములను జరుపుటయు సబర్మతి యాశ్రమమునుండి దండియాత్రను ప్రారంభించు టయు సంభవించెను. ప్రజలీ యాత్రచేయు యాత్రికుల యదృష్టము లను దినదినము వినుచుండినకొలది దేశములో నుద్రేకము హెచ్చు చుండెను. మామీదకు వచ్చుచున్న సంగ్రామమునకు తుదిసన్నాహ ములు చేయుటకు అహమ్మదాబాదులో అ. భా. కా. కమిటీ మీటింగు జరుపబడెను. సంగ్రామములోని నాయకుడచ్చటలేడు. అతడప్పుడే తనయాత్రికుల దండుతో సముద్రతీరమునకు చలచల నడచిపోవుచుం డెను. వెనుకముఖము పెట్టుటకతడు తిరస్కరించెను. నిర్బంధములు వచ్చుచో నేమిచేయవలెనను విషయమై అ. భా. కా. కమిటీవారు నిశ్చయించిరి. కమిటీ సమావేశమగుటకు వీలులేనిచో దాని తరఫున పనిచేయుట కధ్యక్షున కొక్కడు యధికారమునిచ్చిరి. అతడు నిర్బం ధింపబడిన కమిటీసభ్యుల స్థానములకు క్రొత్తవారిని చేర్కొనవచ్చును. తనతెరువాత తనస్థానమునకు అతడే యొకనిని నియమింపవచ్చును. ఇట్టి యధికారములనే స్థానిక రాష్ట్రకాంగ్రెసు కమిటీలును తమయధ్యక్షుల కిచ్చెను.

ఈ విధముగ 'డిక్టేటరు' లనబడువారువెలిసి, కాంగ్రెసు పక్షు మున సంగ్రామమును నడపిన పరిపాలన యారంభమయ్యెను. భారత దేశ శక్రెటరీలు, వైస్రాయిలు, గవర్నరులు మొదలగువారాశ్చర్య ముతో చేతులుచాచుచు "అయ్యో యికనేమున్నది! కాంగ్రెసుకు చేటుకాలము దాపురించినది! ఎంత క్రూరమైనపని!" అని చాట నారంభించిరి. ఏలనన కాంగ్రెసు డిక్టేటరు పదవులను విశ్వసించెనట. పాపము నిజముగావారు పాతుకొనిన విశ్వాసముగల ప్రజాస్వామిక

పరిపాలనా ధురంధరులు. అప్పుడప్పుడు భారత దేశములోని మితవాద పత్రికారాజములుకూడ మాకు ప్రజాస్వామిక సుగుణ సంపత్తులను గురించి యుపదేశించుచుండెను. మేము దీనినంతను మౌనముగను (మేము జయిలులోనుండుటచేత) ఆశ్చర్యముగను వినుచుంటిమి. ఇంత కంటెను మొండికెత్తిన మోసము వేరొండు యుండబోదు. ఆర్డినెన్సు చట్టములచేతను ప్రతినాగరిక ధర్మమును అణచివేయుటచేతను భారత దేశమును బలవంతముగ నిరంకుశత్వముతో తాము పరిపాలించుచు మనప్రభుత్వమువారిట్లు ప్రజాస్వామికమునుగురించి కపట భక్తితో బ్రువ్వుచుందురు. మామూలు పరిస్థితులలోనైనను హిందూ దేశములో ప్రజాస్వామిక ఛాయ యెచ్చటనున్నది? బ్రిటిషుప్రభుత్వము తన యధి కారమును, భారత దేశములో తమకున్న ప్రయోజనములను రక్షించు కొనజూచుట సహజమేయనుటకు సందేహములేదు. తనయధికారమును ధిక్కరించినవారిని యణచివేయవచ్చును. కాని యిదియంతయు ప్రజా స్వామిక పద్ధతియని యదిచేయుసమర్థనము చరిత్రాత్మకమై భవిష్య త్సంతతిచే పరీక్షింపబడునుగాక!

తనధర్మములను మామూలుగ నెరవేర్చుకొనుట కసాధ్యమగు స్థితిని కాంగ్రెసు యెదుర్కొనవలసి యుండెను. దాని సక్రమసంఘ ముగ ప్రకటించి సలహాలకుగాని, కార్యాచరణకుగాని దానికమిటీలు (రహస్యముగ తప్ప) కలుసుకొనుటకు వీలులేకుండ చేయబడెను. మాపోరాటమును సుతరాము బహిరంగముగనుంచ దలచితిమి. మేము రహస్యమును ప్రోత్సహింపలేదు. కేంద్రములోను, రాష్ట్రములలోను, స్థానికముగను నున్ననాయకులు (స్త్రీలును, పురుషులును) నిర్బంధింప బడుట నిశ్చయము. అప్పుడు నడుపు వారెవరు? మాకొక్కటే మార్గ ముండెను. యుద్ధము చేయుచున్న సైన్యములో, దెబ్బలుతినిన సేనాధి పతులకు బదులు క్రొత్తవారి నేర్పరచునట్లు, మేమును క్రొత్తసేనాధి

పతుల నేర్పరచుట సన్నాహము చేసితిమి. యుద్ధరంగ మధ్యమున కూర్చొని మేము కమిటీ సభలను జరుపజాలము. నిశ్చయముగా మేమెుక్కొక్కప్పుడట్లు చేసితిమి. కాని దానియుద్దేశ్యమును, విధాయిక ఫలితమును, కమిటీయంతయును నిర్బంధింప బడుటచేనైయుండెను. యుద్ధరంగము వెనుక భద్రముగా కూర్చొను సామాన్య యుద్యోగు లెవరును మాకులేరు. ఇంకను దూరమున మరింతభద్రముగ కూర్చొను నాగరిక మంత్రివర్గమునులేదు. మాసామాన్యయుద్యోగులును మంత్రివర్గములును మాసంగ్రామ తత్త్వమునుబట్టి గుండుదెబ్బల కెదురుగనే నిలువవలెను. వారందరును మొట్టమొదటనే నిర్బంధింపబడిరి. ఇంతకును మేముమా'డిక్టేటరు'లకిచ్చినయధికారమెట్టిది? సంగ్రామమును నిర్వహించు జాతీయ చిహ్నములుగా నియమింపబడుట వారికొక గౌరవము. కాని, వారికిగల యదార్థాధికారము తమ్ముతాము జయిలుకు 'శాసించుకొనుటయే' తాము ప్రాతినిధ్యమును వహించు కమిటీ బలవంత శాసనములచే పనిచేయుటకు వీలులేనపుడు మాత్రమే వారుపని చేయగలరు. ఎప్పుడు, యెచ్చట నీకమిటీ సమావేశము కలిగినను దానితో 'డిక్టేటరు' తనకున్న వ్యక్తిగత యధికారమును కోల్పోవును. అతడు లేక నామె యే ప్రధానసమస్యనుగాని, సూత్రములనుగాని స్పృశింపజాలదు. ఉద్యమములోని చిన్నచిన్నవియు బాహ్యములునగు హాంశములనే 'డిక్టేటరు' మార్చగలడు. కాంగ్రెసు 'డిక్టేటరు పదవులు' నిజముగా జయిలుకే సోపానములు. దినదినము యీవిధానము సాగుచుండెను. క్రొత్తవారు దెబ్బలుతినినవారి స్థానము నలంకరించెడివారు.

కనుక మేము, మాతుది సన్నాహములను గావించుకొని; అహమ్మదాబాదులో అ. భా. కా. కమిటీ సభ్యులవద్ద సెలవుతీసికొంటిమి. ఏలనన మేమెప్పుడు కలుసుకొనెదమో, యెట్లుకలుసుకొనెదమో, అసలు కలుసుకొనెదమో లేదో యెవరికిని తెలియదు. అ. భా. కా. కమిటీ యొక్క క్రొత్త యాదేశముల ప్రకారము స్థానిక యేర్పాటులకు తుది

సంస్కారముల నిచ్చుటకు మేము మామాతాపులకు పోతిమి; సరోజినీ దేవి చెప్పినట్లు జయిలుయాత్రకు దంతధావన సామగ్రి వగైరాలను మూటగట్టితిమి.

మాత్రోవలో మేము-మాతండ్రియు నేనును, గాంధీజీని చూడ బోతిమి. అతడు తన యాత్రికుల దండుతో జంబుసరములో నుండెను. మేమతనితో కొద్దిగంటలకాలము గడిపితిమి. తరువాతనతడు తనలవణ సముద్రయాత్రలోని ముందుమజిలీకి తన సైన్యముతో చఱచఱ బయలు దేరెను. చేత దండమునుబూని, తన యనుచరుల కగ్రేసరుడై, నిశ్చ యమగు నడకతో, ప్రశాంతమును, నిర్భయమునగు దృష్టితో నడచు చుండ నతనిని నేను కడసారిచూచితిని. ఆదృశ్యమద్భుతము. భావోద్రేక పూరితము.

జంబుసరములో గాంధీజీ సలహాతో మాతండ్రి అలహాబాదులో నున్న తన భవనమును దేశమునకిచ్చివేయుటకు నిశ్చయించి దానికి "స్వరాజ్యభవనము" అను నూతన నామకరణము చేసెను. అతడు అలహాబాదు చేరుటతోడనే యీప్రకటన గావించి వెంటనే దానిని కాంగ్రెసువారికిచ్చివేసెను. ఆపెద్దభవనములో నొకభాగము ఆస్పత్రిగా మార్చబడెను. అప్పుడు న్యాయవిధానములను జరుపుటకు తగిన సావ కాశము లేకపోవుటచే సంవత్సరము ఆరుమాసము లైనతరువాత నతని యిష్టానుసారము నేనాయాస్తికొక ధర్మకర్తృత్వము నేర్పాటు చేసితిని.

ఏప్రిల్ మాసమువచ్చెను. గాంధీజీ సముద్రతీరముకు జేరెను. ఉప్పుచట్టములపై దాడివెడలి శాసనోల్లంఘనమును ప్రారంభించుట కాజ్ఞలకొరకు మేము వేచియుంటిమి. కొన్ని నెలలనుండి మేము మా వాలంటీర్లకు శిక్ష కఱపుచుంటిమి. కమలయు, కృష్ణయు (నాభార్యయు చెల్లెలు) వారిలోజేరి, దీనికొరకు పురుషవేషమును వేసికొనిరి. వాలంటీ ర్లకు ఆయుధములుగాని, చివరకు కఱ్ఱలుగానిలేవు వారుతమపని నెక్కువ

సమర్థతతో నెరవేర్చుటకును, జనసమూహమును నియమించుటకును తగి యుండుటకే శిక్షింపబడు చుండిరి. ఆరవయేప్రిల్ జాతీయవారములో మొదటిదినము. అది ప్రతిసంవత్సరము 1919లో జరిగిన సంభవముల జ్ఞాపకార్థము సత్యాగ్రహ దినములగాయతు జలియనువాలాభాగు దినము వరకు, జరుపబడుచుండెను. ఆదినమున గాంధీజీ దండీసముద్రతీరమున ఉప్పుచట్టములనుభంగముచేయ నారభించెను. మూడునాలుగు రోజులైన తరువాతనన్ని కాంగ్రెసు సంఘములును అట్లు చేసి తమప్రాంతములలో శాసనోల్లంఘన మారంభింప వచ్చునని యనుజ్ఞ యీయబడెను.

అకస్మాత్తుగా నొకజలాశయము వెల్లువ యైనట్లు కాన్పించెను. దేశమంతటను, పట్టణములోను, పల్లెలోను ఉప్పుపంటయే ప్రధాన విషయమయ్యెను. ఉప్పును తయారుచేయుట కనేకవింతపద్ధతు లవలంబింపబడెను. మాకు దానిని గురించి యేమియు తెలియదు. కనుక మాకవకాశము కలిగినంతవరకు మేముదానినిగురించి చదివితిమి. దానిని తయారుచేయు విధమును గురించి కరపత్రములనువేసితిమి. మేము కొన్నికుండలను, మూకుళ్ళను పోగుచేసి చివరకు కొంతయుప్పనెడిపదార్థమును తయారుచేసితిమి. గొప్పవిజయమును బడసినట్లు మేము దీనితో నూరేగి తఱుచుచాలవిపరీతమగు ధరల కమ్మివేసెడివారము. పదార్థము మంచిదా చెడ్డదా యనుప్రశ్నయేలేదు. దుష్టమగు నుప్పుచట్టమును భంగపరచుటె ప్రధానవిషయము. మేమిందులో తయారుచేసిన యుప్పు గుణములో నతినికృష్టమైనదే యైనను విజయమును బడసితిమి. ప్రజల యపరిమితోత్సాహమును చూచినపుడును దవానలము వలె విజృంభించుచున్న యుప్పుచేయు విధమును చూచినను గాంధీజీ మొదట సూచించినపుడు దీని సమర్థతను గురించి సందేహించిన మేము చాలసిగ్గుపడితిమి. ప్రజలనుద్రేకపరచి వారినిసక్రమముగ ప్రవర్తింపచేయగల యతని యద్భుతశక్తికి మేమాశ్చర్యపడితిమి.

నేను మధ్యపరగణాలలోని రాయిపూరులో నొక కాన్ఫరెన్సుకు బయలుదేరి వెళ్ళుచుండగా ఏప్రిల్ 14 వ తేదీని నిర్బంధింపబడితిని. ఆరోజుననే నా కేసు విచారించి ఉప్పుచట్టముక్రింద నాకారుమాసములు విధించిరి. నేను నిర్బంధింపబడవచ్చునని ముందుగనే నాస్థానే గాంధీజీని కాంగ్రెసుప్రెసిడెంటుగ (అ. భా. కా. కమిటీ నాకిచ్చినక్రొత్తయధికారముక్రింద) పేర్కొంటిని. కాని యతడుదానిని తిరస్కరించునేమో యనుభయముచే రెండవపేరు, మాతండ్రిది, సూచించితిని. నేననుకొనినట్లే గాంధీజీ యంగీకరింపలేదు. కనుక తండ్రిగారే తాత్కాలికాధ్యక్షులైరి. అతడు చాల యనారోగ్యముగ నుండెను. అయినను అతడత్యుత్సాహముతో నుద్యమములోనికురికెను. ఆ మొదటి మాసములలో నతని పటుతరమగు నేతృత్వమును, క్రమశిక్షను పాలించుట యుద్యమమున కెంతయో లాభదాయక మయ్యెను. ఉద్యమము చాల లబ్ధిపొందెను. కానియతనికున్న యారోగ్యము శరీరదార్ఢ్యము క్షీణించిపోయెను.

ఆరోజులు మంచియుద్రేకమును పుట్టించు వార్తలతో నిండియుండెను. ఉత్సవములు,లాఠీఛార్జీలు, కాల్పులు నిరంతర హర్తాళములు (గొప్పగొప్పవారిని నిర్బంధించినపుడు) పెషావరు దినము, గఢవాలీ దినము మొదలగుప్రత్యేకయుత్సవములు - ప్రళయముగ నుండెడివి. తాత్కాలికముగ విదేశవస్త్ర బహిష్కరణమును, సమస్త బ్రిటిషువస్తువుల బహిష్కరణమును పూర్తియయ్యెను. వృద్ధురాలగు నామాతాజీయు, విధాయికముగ నాచెల్లెండ్రును, యుద్యమములోనికురికి ప్రచండ మార్తాండ మధ్యందినమున తీవ్రకరోష్ణములో,విదేశవస్త్ర దుకాణముల వద్ద నిలిచి పికిటింగు చేయుచున్నారనువార్త నన్నుకలంచివేసెను. కమలకూడ నట్లేచేసెను. కాని యామె యంతటితో నూరుకొనలేదు. అనేక వత్సరములనుండి యామెను బాగుగ నెరుగుదు ననుకొనిన నాకు

మహదాశ్చర్యము కలుగునట్టి యుత్సాహముతోను కృతనిశ్చయముతోను ఆమె అలహాబాదు పట్టణములోను జిల్లాలోను, పనిచేయనారంభించెను. ఆమె తనయనారోగ్యమును మరచిపోయి పగలంతయు సూర్యరశ్మిలో పనిచేయుచు నద్భుతమగు కార్య శూరత్వమును చూపెను. నేను దీనిని గురించి జయిలులో ముభావముగ వింటిని. తరువాత మాతండ్రి నన్నచ్చట కలుసుకొనినపుడు, కమల కృషిని గురించి యతడెంత మెచ్చుకొనినదియు, ముఖ్యముగ నామెయొక్క కార్యశూరత్వమునుగురించియు నాకు స్వయముగ తెలిపెను.నాతల్లియు చిన్నపిల్లలును యెండలో పనిచేయుట కతడెంతమాత్రమును యిష్టపడెడివాడుకాడు. కాని యెప్పుడైనను కొంచెము మందలించుటతప్ప యతడువారితో నెట్టిజోక్యమును కల్పించుకొనలేదు. ఆమొదటి రోజులలో మాకుచేరిన వార్తలన్నిటికంటెనుగొప్పవార్త పిషావరులో యేప్రిల్ 23 వ తేదీని జరిగినసంభవములు. తరువాత నిట్టివే సరిహద్దు రాష్ట్రమంతటను జరిగెను. భారతదేశములో మరెచ్చటనైనను మరఫిరంగుల జాజ్వల్యమానమగు దవానలముముందర నత్యద్భుతముగా ప్రదర్శింపబడిన యాపరిశాంతమును, శిక్షాయుతమునునగు ధైర్యసాహసములు దేశమునంతను కంపించియుండెడివి. సరిహద్దు రాష్ట్రములలో దానికి మరియొక పాముఖ్యత కలదు. ఏలనన ధైర్యసాహసములకు పేరెన్నికపొందిన పఠానులు శాంతస్వభావులుకారు. వారికట్టిపేరులేదు. ఈపఠానులు భారతదేశములో ననమానమగు యుదాహరణమును చూపిరి. సరిహద్దురాష్ట్రములలోనే గఢ్వాలుసైనికులు నాగరిక ప్రజలపై తుపాకులను కాల్చవలసినదను యాజ్ఞలను తిరస్కరించిరి. నిరాయుధులగు ప్రజలపై కాల్చుటకు సైనికునికుండు సహజమగు నయిష్టతచేతను, నిస్సందేహముగ ప్రజలయెడలగల సానుభూతిచేతను వారుకాల్చుటకు తిరస్కరించిరి. కాని తనయధికారుల యాజ్ఞల నుల్లంఘించునట్టి తీవ్రమగుపద్ధతి నవలంబించుటకు సైనికున కొక్కసానుభూతి మాత్రమే చాలదు.

దానిఫలితము ఆతనికి తెలియును. బహుశః గఘార్వాలీలు (ఇతర చోట్ల మరికొన్ని పటాలములును యిట్లుచేసెను. కాని వాటి యవిధేయత ప్రకటింపబడలేదు.) బ్రిటిషుప్రభుత్వము కూలిపోవుచున్నదను దుర్భ్రమచేత నిట్లుచేసియుందురు. అట్టిభావ ముత్పన్నమైనప్పుడు మాత్రమే సైనికుడు తన సానుభూతి ప్రకారమును, యభిరుచుల ప్రకారమును చేయసాహసించును. బహుశః కొద్దిరోజులు లేక కొద్దివారములు దేశములోబయిలుదేరిన విశేషగగ్గోలు, శాసనోల్లంఘనములవలన బ్రిటిషుప్రభుత్వముయొక్క యవసానదినములువచ్చినవని కొంతమంది యను కొనిరి.ఇదియేభారతసైన్యములో కొంతభాగముపై పని చేసెను.ఇట్టిదేదియు నింతత్వరలో జరుగనేరదని తరువాత విదితమయ్యెను. అప్పటినుండియు సైన్యములో నెట్టియవిధేయతయుజరుగలేదు. సందేహస్థితిలో నుండకుండుటకు తగు యేర్పాటులుకూడ గావింపబడెను.

ఆరోజులలో ననేక వింతవిషయములు జరుగుచుండెను. కాని, జాతీయోద్యమములలో స్త్రీలుతీసికొనిన భాగము నిస్సందేహముగ నద్భుతముగనుండెను. వారు తమగృహాంతర సీమలనుండి యసంఖ్యాకముగ తరలివచ్చి, (బహిరంగములో నిదివరకు పనిచేయుట కలవడక పోయినను) సంగ్రామరంగ మధ్యమున కురికిరి. విదేశవస్త్ర దుకాణములవద్దను, కల్లుదుకాణములవద్దను పికెటింగుచేయుట వారిప్రత్యేక హక్కు. అన్నిపట్టణములలోను కేవలము స్త్రీలుమాత్రమేగల బ్రహ్మాండమగు యుత్సవములు బరుపబడెను. సాధారణముగ పురుషులపట్టుదలకంటె స్త్రీలపట్టుదలయే నిర్వక్రముగనుండెను. రాష్ట్రములలోను స్థానికప్రాంతములలోను తఱుచు వారే 'డిక్టేటరులు' అగుచుండిరి.

ఉప్పుచట్టమును పగులగొట్టుట యొక్క కార్యము మాత్రమే యయ్యెను. శాసనోల్లంఘన మితర రంగములకు ప్రాకెను. నైరాయి

వివిధములగు ఆర్డినెన్సులను జమాయించి, యనేక కార్యములను నిషేధించుటచే నిదిమరింత సుకరమయ్యెను. ఈఆర్డినెన్సులు, నిషేధములు పెరిగినకొలది వాటిని భంగపరుచుట కవకాశములును వృద్ధియగుచుండెను. ఆర్డినెన్సులు వేటిని ఆపివేయుటకు తలపెట్టెనో వాటిని చేయుటయే సాత్త్వికనిరోధరూపముగ పరిణమించెను. ప్రజలును కాంగ్రెసువారును ఆరంభము చేయుటయే తడవు. ప్రభుత్వ దృష్టిలో నొక ఆర్డినెన్సుపనిచేయనిచో వైస్రాయిగారు క్రొత్తఆర్డినెన్సులను తయారుచేయును. కాంగ్రెసువర్కింగుకమిటీ సభ్యులు చాలమంది నిర్బంధింపబడిరి. కానిక్రొత్తసభ్యులను జేర్చుకొనుచు నది నిరంతరాయముగా పనిచేయుచునే యుండెను. ప్రతిప్రభుత్వ ఆర్డినెన్సుకును వర్కింగుకమిటీ యొక్క బదిలీతీర్మానము, దానినెదుర్కొనుటకు తగిన యాదేశములతో, చేయబడుచుండెను. ఒక్కమినహాయింపుతో తప్ప యీయాదేశములన్నియు భారతభూమి యందంతటను యద్భుతమగు నైక్యబుద్ధితో నిర్వహింపబడెను. ఆమినహాయింపు పత్రికాప్రచురణముకు సంబంధించినదై యుండెను. ముద్రణము నింకను నియమించుట కొక ఆర్డినెన్సును జారీచేసి, పత్రికలయొద్ద జామీను కోరినపుడు వర్కింగుకమిటీవారు జాతీయపత్రికల నట్టిజామీను యీయ్యలవదనియు దానికి బదులు పత్రికల నాపివేయవలసినదనియు నాదేశించిరి. పత్రికాధికారుల కిది యొక గుటకదిగని మాత్రయయ్యెను. ఏలనన యప్పుడే ప్రజలలో వార్తల కెక్కువ తృష్ణబయలుదేరెను. అయినను పత్రికలలో నత్యధికసంఖ్య-కొన్ని మితవాదపత్రికలుతప్ప-ప్రచురణము నాపివేసెను. దీనివలన ననేకరకములగు వదంతులు బయలుదేరెను. కాని వారట్లు చాలకాలముండజాలక పోయిరి. మోహము హెచ్చుగనుండెను. మితవాద వైరిపత్రికలు తమవ్యాపారమునంత లాగివేయుటను చూడ వారికి కోపము కలుగుచుండెను. కనుక చాలమంది తిరిగి ప్రచురణ నారంభించిరి.

గాంధీజీ మే 5 వ తేదీని నిర్బంధింప బడెను. అతని నిర్బంధమైన తరువాత పశ్చిమతీరమునందున్న యుప్పుకొఠారములపై గొప్పగొప్ప దాడులు బయలుదేరెను. ఈదాడుల సందర్భములో పోలీసులు యత్యాచరములు హృదయవిదారకముగ నుండెను. అద్భుతమగుహర్తాళములు, ఉత్సవములు, లాఠీచార్జీలు - వీటితోగూడిన బొంబాయి నగరమప్పుడు యీచిత్రములో రంగస్థలమయ్యెను. లాఠిఛార్జీలలో దెబ్బలు తినినవారికి సేవచేయుట కత్యవసరమగు ఆస్పత్రులు స్థాపింపబడెను. అద్భుతమగు విశేషములనేకములు బొంబాయిలో సంభవించెను. అది మహాపట్టణ మగుటచే ప్రచురణ కనేక సౌకర్యములచ్చట నుండెను. అట్టి ప్రాముఖ్యతయేగల సంభవము లనేకములు చిన్న పట్టణముల లోను పల్లెలలోను జరిగెను. వాటికట్టిప్రచురణయు లేదయ్యెను.

జూను మాసాంతమున మాతండ్రి బొంబాయివెళ్ళెను. అతనితో మాతల్లియు, కమలయు వెల్లిరి. వారి కద్భుతమగు నాహ్వానము లొసంగబడెను. వారచ్చట నుండగా భయంకరములగు లాఠీచార్జీలు జరిగెను. బొంబాయిలో నివి యతిసామాన్యములగుచుండెను. పదిహేనురోజులయినతరువాత నచ్చట నొక యసామాన్యమగు నగ్ని పరీక్ష భళ్లున తెల్లవారువరకు జరిగెను. వేలకొలది జనసమూహము, వర్కింగుకమిటీసభ్యులు, మాలవ్యాజీ మొదలగువారు మార్గము కడ్డముగానిలిచిన పోలీసులకెదుట రాత్రియంతయు గడపిరి.

బొంబాయినుండి తిరిగివచ్చునపుడు తండ్రిగారిని జూను 30 వ తేదీని నిర్బంధించిరి. అతనితో సయ్యదు మహమ్మదుకూడ నుండెను. వారు వర్కింగు కమిటీయొక్క తాత్కాలికాధ్యక్షుడు, శక్రటరీ లగుటచే (నది యక్రమసంఘముగ ప్రకటింపబడెను) నిర్బంధింపబడి చెరి యారుమాసములు శిక్షింపబడిరి. నాగరికజనులను కాల్చవలసినదని పోలీసులును, సైనికులును యాజ్ఞాపింపబడినపుడు వారు చేయవలసిన

ధర్మములనుగురించి మాతండ్రి జారీచేసిన స్టేటుమెంటుకే, బహుశ యతడు నిర్బంధింపబడెను. స్టేటుమెంటు నిక్కచ్చిగా న్యాయశాస్త్రమునకు సంబంధించిన విషయము. ఈహంశమునుగురించి ప్రస్తుత బ్రిటిషు యిండియను లా యెట్లున్నదో యదివివరించెను. అయినప్పటికిని యది యుద్రేకకరమైనదనియు నుపద్రవ కరమైనదనియు తలంపబడెను.

బొంబాయిని దర్శించుటవలన తండ్రిగారికి చాల శ్రమగలిగెను. ప్రాతఃకాలము మొదలు రాత్రి చాల ప్రొద్దుపోవువరకు నతడు పని చేయుచునేయుండెను. ప్రతి ముఖ్యనిశ్చయమునకును అతడు బాధ్యత వహించవలసి యుండెను. అతడు చాలకాలమునుండి యస్వస్థతగ నుండెను. కాని యిప్పుడతడు శ్రమచెంది తనడాక్టర్ల ప్రత్యేకసలహా వలన తక్షణమే సంపూర్ణవిశ్రాంతిని తీసికొనవలెనని నిశ్చయించెను. అతడు ముసోరివెళ్లుట కేర్పాటులుచేసికొని ప్రయాణ సన్నాహములు గావించెను. కాని, ముసోరీ వెళ్ళవలెననుకొనిన తేదీకొక రోజుముందర నతడు నైనీ సెంట్రలుజయిలులో మాకొకారము ముందర ప్రత్యక్షమయ్యెను.

---

## 30

## నైనీ జయిలులో.



నేను సుమారు యేడుసంవత్సరము లైనతరువాత తిరిగి జయిలుకు వెళ్ళుటచే జయిలు జీవితానుభవములను కొంతవరకు మఱచిపోతిని. నేను రాష్ట్రములోని పెద్దజయిళ్లలో నొకటియగు నైనీ సెంట్రలు జయిలులో నుంటిని. ఒంటరిగా నన్నొక్కనినే యుంచుట నాకు క్రొత్త యనుభవము. 2200 లేక 2300 మంది ఖయిదీలుగల పెద్ద యావరణకు సంబంధములేకుండ నేనొక 100 అడుగుల కైవారముగల యావరణలో నుంచబడితిని. దానిచుట్టుయెత్తుగల గుండ్రగోడ యుండెను. దానిమధ్య నాలుగుగదులుగల యందచందములేని కొంపయొకటి యుండెను. అందులో నాకు రెండు వరుసగదులనిచ్చిరి. ఒకటిస్నానమునకును, పాకీదొడ్డికిని. రెండవది నాయునికికి. తక్కిన రెండును కొంతకాలము కాళీగనే యుంచబడెను.

బయట నేనతియుద్రేకపూరితమును విరామములేనట్టియు జీవితమును నడిపినతరువాత నిపుడు కొంత యొంటరితనమును, మాంద్యమును అనుభవించితిని. నేను బాగుగ నలసిపోవుటచే రెండు మూడు రోజులు మస్తుగ నిద్రించితిని. వేడిగాడ్పు లప్పుడే ప్రారంభ మగుటచే నాగదికిని పెద్దయావరణకును మధ్యగల చిన్నసందులో రాత్రిలందు నన్ను ఆరుబయట పరుండనిచ్చిరి. నేను దాని నెత్తుకొనిపోదుననియో లేక బహుశః దానినొక నిచ్చెన క్రింద నుపయోగించి గోడనెక్కిపోవుదుననియో నాపరుపును గట్టిగా గొలుసులతో కట్టివేసిరి. రాత్రి యంతయు వింతధ్వనులతో మ్రోగుచుండెడిది. ఖయిదీ ఓవరుశీర్లు ప్రధానగోడలను కాపాడుచు తరుచు నొకరికొకరు వివిధస్థాయిలలో

నజిఫ్పుల నందించుచు నొక్కొక్కప్పుడు దూరమున నుండివచ్చు గాలి హూంకారవంటి ప్రతిధ్వనిని కలుగచేసెడివారు. రాత్రి కాపలదార్లు కొఠారములలో తమయొద్దిలోనున్న ఖయిదీలను పైకి బిగ్గరగా లెక్కించుచు నంతయు బాగుగనేయున్నది యను కేకలను వేయుచుండెడివారు. రాత్రియనేకసారులే జయిలుయధికారియో గస్తీ తిరుగుచు మాయావరణకువచ్చి డ్యూటీలోనున్న వార్డరును కేకలువేయుచు పరిశోధించుచుండెడివాడు. నాయావరణ తక్కినవాటికి కొంత దూరములో నుండుటచే నీ ధ్వనులస్పష్టముగనుండి మొట్టమొదట నాకాగోల యర్థమయ్యెడిదికాదు. ఒక్కొక్కప్పుడు నేనొక యరణ్యా సమీపమున నున్నట్లును, మృగములు తమపొలములలోనికి రాకుండ రయితులఱచుచున్నట్లును భావించెడివాడను. ఒక్కొక్కప్పుడు అరణ్యమును, నక్తంచరమృగజాలమును తమ నిశీథతాండవము చేయుచున్నట్లు తోచెడిది.

చతురస్రమగుగోడకంటె వక్రమగుగోడ నిర్బంధము నెక్కుడుగ జ్ఞప్తికి తెచ్చుట యధార్థమా లేక నాయూహాయా? యను నాశ్చర్యము కలిగెడిది. మూలలు కోణములు లేకపోవుట నిర్బంధభావము నధికముచేయుచుండెను. పగలు ఆగోడ గగనసీమనుగూడ నాక్రమించి దానిలోనొక చిన్నతునుకను మాకు ప్రదర్శించుచుండెను. "ఖయిదీలు గగనమని పిలుచునట్టి యాచిన్నివినీలసీమను రజితకాంతులనీను తెఱచాపలతో పరుగులెత్తు మేఘపంక్తిని" నేను కాయలుకాచిన నేత్రములతో చూచుచుండెడివాడను. రాత్రులందు ఆగోడనన్ను మరింత యావరించుటచే నేనొక నూతియడుగున పడిపోయినట్లుండెడిది. లేదా నేనుచూచిన నక్షత్రకాంతిచే రాజిల్లెడి యాయాకాశభాగము యథార్థమయిక కృత్రిమ|గహ సందోహములోని యొకభాగమువలె కాన్పించెడిది

నాకొఠారుకును, యావరణముకును జయిలులో (కుత్తాఘర్) కుక్కయిల్లు అనుప్రసిద్ధనామము కలదు. ఇది దానికిగల పాతపేరేకాని

నాకు సంబంధించినదికాదు. ఈచిన్నకొఠారము మొట్టమొదట, తక్కిన వాటితో జోక్యములేకుండ, ప్రత్యేకముగ నుప్రదవకరులైన ఖయిదీల నితరులతో నెట్టి సంబంధములేకుండ నుంచుటకై నిర్మింపబడెను. తరువాత నిది రాజకీయ ఖయిదీలకొరకును, డిటెన్యూలకొరకును ప్రత్యేకింపబడెను. ఈయావరణముకు ముందర కొంతదూరములో, నొకకట్టడముండెను. నాకొట్టులోనుండి నేనుదానిని మొట్టమొదట చూచినపుడు నాకాశ్చర్యముకలిగెను. అది యొక పెద్దపంజరమువలె నుండెను. దానిలో జనము గిరగిర తిరుగుచుండిరి. అది మనుష్యులచే నడుపబడు నీటికుళ్ళాయియని నేను తరువాత తెలిసికొంటిని. ఒక్కొక్కసారి పదునారుమంది దానిని పనిచేయవలెను. మనము ప్రతిదానికిని యవలడునట్లే నేను దానికలడితిని. కాని మానవ పరిశ్రమశక్తి నీవిధముగ నుపయోగించుట యతిమూర్ఖ్యమును, ననాగరికమును నగు పద్ధతిగ నాకెప్పుడును కాన్పించుచుండెను. నేను దానిని సమీపించినపుడెల్లను నాకు జంతుప్రదర్శనశాల జ్ఞప్తికి వచ్చును.

కొన్నిరోజులవరకు నన్ను కసరతుకొరకుగాని మరేపనికిగాని నాయావరణదాటి పైకి పోనిచ్చెడివారుకారు. తరువాత నింకను చీకటియుండగనే ప్రాతఃకాలమున నొక యరగంటసేపు ప్రధానగోడక్రింద నడచుటకుగాని, పరుగెత్తుటకుగాని నాకనుమతినిచ్చిరి. తక్కిన ఖయిదీలెవరును నన్ను కలుసుకొనుటకుగాని, చూచుటకుగాని వీలులేకుండుటకే నాకాప్రాతఃకాల సమయము నిర్ణయింపబడెను. నాకా విహారము ప్రీతికరముగనుండి నాశ్రమను పోగొట్టుచుండెడిది. నాకుదొరికిన యాకొద్ది కాలములో సాధ్యమైనంత యెక్కువ బహిరంగ వ్యాయామమును పొందవలెనని పరుగెత్త నారంభించి క్రమముగ రోజుకు రెండు మైళ్ళవరకు పరుగెత్తెడివాడను.

నేను ప్రతిదినము ప్రాతఃకాలమున నాలుగుగంటలకు, మూడు న్నరగంటలకుకూడ లేచుచుండెడివాడను. రాత్రి చాలసేపు చదువు కొనుటకు తగినదీపము లేకుండుటచే నేను పెందలకడనే నిద్రించుచుండు టయే దీనికి కొంతకారణము. నేను నక్షత్రములను ప్రీతితో పరీక్షించు చుండెడివాడను. బాగుగా తెలిసిన యొక్కొక్క నక్షత్రస్థానమునుబట్టి నాకు సరిగాప్రొద్దు తెలియుచుండెడిది. నేను బరుండిన చోటునుండి గోడమీదనుండి తొంగిచూచు ధృవనక్షత్రమును చూడగలిగెడివాడను. అది యెప్పుడునచ్చటనే యుండుటచే నాకమితానందదాయకముగ నుండెడిది.

ఒకనెలవరకు నాకితరస్నేహితు లెవరును లేకుండిరి. కాని నే నొంటరిగలేను. నాతోనొకవార్డరు, ఖయిదీఓవరుసీర్లు, వంటచేసిపెట్టు ఖయిదీ, తుడుచువాడును నాయావరణలోనుండిరి. అప్పుడప్పుడు యెదో పనిమీద నితరఖయిదీలు, చాలమంది ఖయిదీఓవరుసీర్లు-సి.ఓ.లు-దీర్ఘ శిక్షల ననుభవించువారు-వచ్చెడివారు. యావజ్జీవ ఖయిదీలు సామా న్యముగ నుండెడివారు. సాధారణముగా యావజ్జీవశిక్ష యిరువదిసంవ త్సరములతో లేక నింకనుతక్కువకాలముతో నంతమయ్యేడిది. కాని యిరువదిసంవత్సరములుపైగా జయిలులోనున్నవా రనేకులు గలరు. నైనీలోనే నొక యద్భుతమైన వాంశమును చూచితిని. ఖయిదీల దుస్తులమీద భుజములసమీపమున చిన్నకర్రబిళ్ళలు తగిలించబడి యుండును. అవి వారి శిక్షలనుగురించియు విడుదలతేదీని గురించియు తెలుపును. ఒకఖయిదీయొక్క బిళ్ళమీద నతడు 1996 లో విడుదల యగునని నేను చదివితిని. అతడు 1930 నాటికప్పుడే యనేక సంవత్సర ములు జయిలులో గడిపెను. అతడప్పుడు నడివయస్సులో నుండెను. బహుశః యతని కనేకశిక్షలు విధింపబడి యవియన్నియు కూడబడెను. మొత్తము డెబ్బదియైదు సంవత్సరము లయ్యెను.

ఈ 'యావజ్జీవఖయిదీల' లో చాలమంది సంవత్సరముల కొలది యొక్క శిశువునుగాని, స్త్రీనిగాని, చివరకు మృగములనుగాని చూడరు. బాహ్యప్రపంచముతో వారికెట్టిసంపర్కము నుండక మానవ సంబంధము లన్నియు నశించును. భయము పగదీర్చుకొనుట ద్వేషము మొదలగు క్రోధపూరితములగు భావములు వారినావరించియుండును. వారు ప్రపంచములోని మంచిని, దయను, సంతోషమును మరచిపోదురు; చెడుగులోనే మునిగి తేలుచు క్రమముగ ద్వేషముయొక్క తీవ్రతగూడ నశించి జీవితము నిర్వీర్యమయి, యంత్రమువంటి గాడిద మోత మాత్రమే వారికిమిగులును. యంత్రములవలెనే వారుదినములను (దినముకు దిన ముకు భేదమెంతమాత్రమునులేకుండ) యీడ్చుచు నెట్టిభావములును లేక (భయముతప్ప) నుండెదరు. అప్పుడప్పుడు ఖయిదీల శరీరములను తూచుచు లెక్కవేయుచుందురు. కాని భయంకరమగు యీ నిర్బంధ వాతావరణములోపడి శుష్కించి యెదుగుబొదుగులులేక కృశించిపోవు మనస్సును, ఆత్మను తూచుటెట్లు? మరణదండనము పనికిరాదని ప్రజలు వాదించుచుందురు. వారి వాదములు నాకెంతయు సమ్మతమేకాని జయి లుల్లో నాజీవాంతము దుర్భరబాధ ననుభవించుటను నేను చూచు నపుడు వ్యక్తిని నెమ్మదిగా ముక్కముక్కలుగా చంపుటకంటె మరణ శిక్షవిధించుటయే మంచిదని నేనుభావింతును. ఈ 'యావజ్జీవఖయిదీ' లలోనొకడు నాయొద్దకువచ్చి "యావజ్జీవఖయిదీలమైన మాగతియే మగును? స్వరాజ్యము మమ్మానరకమునుండి తప్పించునా ?" యని ప్రశ్నించెను.

ఈ యావజ్జీవ ఖయిదీలెవరు? వీరిలో చాలమంది మూకయు మ్మడి కేసులలో యేబదిమంది నూరుమంది చొప్పున శిక్షింపబడి యుందురు. వీరిలో కొంతమంది బహుశః దోషులుందురు. కాని శిక్షిం పబడినవారిలో నెక్కువమంది నిజముగా దోషులని నేను తలంపను. ఇట్టి

కేసులలో ప్రజల నిరీక్షించుట చాలసులభము. క్రొత్తతరపున సాక్ష్యము చెప్పువాడును, కొద్దియానవాలు పట్టుటయు నుండిన చాలును. ఈ రోజులలో దోపిడీలు హెచ్చుచుండుటచే ఖయిదీలు సాలీనా వృద్ధియగుచున్నారు. ప్రజలు కడుపుమంటచే మాడునప్పుడు వారికనేమిచేయగలరు? జడ్జీలును, మేజిస్ట్రీటులును నేరములు వృద్ధియగుచున్నవని గ్రహింపవచ్చును. కానివాటికి మూలములగు నార్థిక కారణముల యెడల వారంధప్రాయులుగనున్నారు.

ఏభూమి తగాదామూలముననో గ్రామములోని రయితాంగములో నొకకొట్లాట బయలుదేరును. లాఠీలు గిరగిరతిరుగును. ఎవడో యొకడు చనిపోవును. ఫలితము, చాలమంది జీవితపర్యంతము లేక చాలకాలము జయిలులోనుండును. తఱచు యీవిధముగా నొకకుటుంబములోని పురుషులందరును జయిలులోనుండుట తటస్థించి స్త్రీలువారికర్మముకు విడిచిపెట్టబడుదురు. ఇందులో నొక్కటియు నేరముచేయు జాతి కాదు. సాధారణముగవారు శారీరముగను, మానసికముగను సామాన్య గ్రామవాసికంటె నుత్తములైన మంచియువకులు. కొద్దిశిక్షయు, యితర విషయములమీదకును, వృత్తులమీదకును కొంత శ్రద్ధయునున్న-చో. వీరు దేశమునకు విలువయైన యలంకారములుగ నుండెడివారు.

భారతఖయిదులలో సంఘమునకు చేటుతెచ్చెడివారును, జాతికి యుపద్రవకారులునునైన మూర్ఖులగు నేరస్తులు లేకపోలేరు. కాని జయిలులో నిస్సందేహముగ విశ్వసింపదగిన యనేకమంది పిల్లలను, యువకులను నేను చూచి యాశ్చర్యపడితిని. నిజమైన నేరస్తులు నూటికెందరు కలరో నేరములుచేయు జాతికి చెందని వారెందరుకలరో నాకు తెలియదు. జయిలుశాఖలోని వారెవరును, బహుశః, యీభేదమును గురించి యూహించనైన యూహించియుండరు. ఈవిషయమును గురించి న్యూయార్కులోని సింగుసింగుజయిలు వార్డెను అయిన

లూయియా యి. లాస్ అనునతడు కొన్ని చక్కనియంకెలను తెలియ జేసెను. అతడు తనజయిలు జనాంభాలో తానెరిగినంతవరకు నూటికి యే బదిమంది యెంతమాత్రమును నేరముచేయవలెనను చింతలేనివారనియు పాతికమంది పరిస్థితులవలనను, వాతావరణమువలనను యీడ్వబడిన వారనియు, మిగత పాతికమందిలోను సగముమంది మాత్రమే తీవ్రమగు సాంఘిక యాతతాయులనియు లెక్క తేల్చెను. యథార్థమైన నేరస్వభావము యెట్టి యభివృద్ధియులేని పల్లెలందుగాక నాధునిక నాగరిక రంగస్థలములగు పట్టణములయందే యెక్కువ విజృంభించుచున్న సంగతి మనకందరకును తెలిసినవిషయమే. అమెరికనుదేశపు దోపిడీలు జగద్విఖ్యాతిగాంచెను. సింగు సింగుజయిలుకు అధమాధములగు నేరస్తులు వత్తురని ప్రసిద్ధి. అయినను, దాని వార్డెనుయొక్క లెక్కప్రకారము ఖయిదీలలో నూటికి 12½ మంది మాత్రమే నిజముగ చెడ్డవారు. హిందూదేశపు జయిళ్ళలో నీసంఖ్య యింతకంటె చాలతక్కువగ నుండునని నిరాక్షేపణగ చెప్పవచ్చును. మరింత యర్థజ్ఞానముగల ఆర్థికనీతియు, నెక్కువవిద్య, యెక్కువవృత్తులు త్వరలో మన జయిళ్ళను ఖాళీచేయగలవు. కాని, దీనిని జయప్రదముగ చేయవలెసనిన మన సాంఘిక నిర్మాణమునకంతకును చెందిన ప్రధానమార్పు లెన్నియో కావలెను. అదిజరుగనపుడు బ్రిటిషు ప్రభుత్వ మిపుడుచేయునది యొక్కటియే జరుగుచుండును. పోలీసుబలమును వృద్ధిచేయుచుండుట, భారతదేశములోని జయిళ్లను పెద్దవిచేయుచుండుట. భారతదేశములో జయిళ్లకు పంపబడువారి సంఖ్య భయంకరముగ నుండును. అఖిలభారత ఖయిదీలసహాయకసంఘ కార్యదర్శి యీమధ్యప్రకటించిన రిపోర్టులో నొక్క బొంబాయిరాష్ట్రములోనే 1933 లో 1,28,000 మంది జయిళ్లకు పంపబడిరని వ్రాసెను. వంగరాష్ట్రములో నాసంవత్సరములోనే 1,24,000 మంది పంపబడిరి. అన్నిరాష్ట్రిలములోని యంకెలును నాకు తెలియవుకాని రెండురాష్ట్రములలోనే 2,50,000 మించినపుడు

మొత్తము అఖిలభారతసంఖ్య పదిలక్షలగుటలో నాశ్చర్యముండదు. ఇది శాశ్వత జయిలుజనాభా కాదు. చాలమందికి కొద్దికొద్దిశిక్షలే యుండును. శాశ్వతజనాభా యింతకంటె చాలతక్కువగనే యుండినను నది చాల గొప్పసంఖ్యయే యగును. భారతదేశములోని కొన్ని పెద్ద రాష్ట్రములు ప్రపంచములోనికెల్ల పెద్దజయిలు పరిపాలనకు ప్రసిద్ధి చెందెను. ఈసందేహాస్పద గౌరవమునుపొందు వాటిలో యు. పి కూడ కలదు. ఇది వెనుకబడిన లేక నభివృద్ధి భంగకరమగు ప్రభుత్వములలో నొకటిగనున్నది; లేకనుండెను. ఖయిదీ యొక వ్యక్తియని, మానవుడని భావించుటకుగాని, యతనిమనస్సు నభివృద్ధిచేయుటకుగాని, కాపాడు టకుగాని యీషణ్మాత్రమైన ప్రయత్నమును గావింపబడదు. యు. పి. ప్రభుత్వము తమ ఖయిదీలను భద్రపరచుటకు మాత్రమే ప్రసిద్ధికెక్కెను. పారిపోవు ప్రయత్నములే చాలస్వల్పము. వేయిమంది కొక్కడయినను పారిపోగలుగు చున్నాడని నేననుకొనను.

జయిళ్లలోనున్న మరియొక విచారకరమగు విషయమేమనిన వాటిలో పదిహేనుసంవత్సరములు దాటినపిల్ల లనేకమంది కలరు. వారిలో చాలమంది బుద్ధిమంతులు. వారి కవకాశమే యున్నచో సుల భముగ యోగ్యులయ్యెడివారు. వారికి చదువను, వ్రాయను నేర్పుటకు కొంతప్రారంభము, చాల కాలముగడచిన తరువాత, చేయబడెను. కాని, మామూలుగనే, యిది యెంతమాత్రమును, చాలదు; మరియు నిందులో పటుత్వములేదు. ఆటలకుగాని పాటలకుగాని యవకాశములు లేవు. ఏవిధమగు వార్తాపత్రికలను యివ్వరు. పుస్తకములను చదువ నీయరు. పన్నెండుగంటలకు పయిగా ఖయిదీలందరును తమ కొఠార ములలోనో లేక గదులలోనో తీరికగల దీర్ఘసాయంసమయములందు ద్వేషిచేయుటకును లేకుండ, నిర్బంధింపబడుదురు.

మూడునెలలకొకసారిమాత్రమే బంధువులు దర్శింపవచ్చును. అట్లేయుత్తరములను వ్రాయవచ్చును. ఎంతవికృతమగువ్యవధి! అయినను చాలమందికీలాభముకూడ చేకూరదు. వారికిచదువురానిచో (చాల మందిచదువురానివారే) వారేజయిలుయధికారి దయాధర్మము మీదనో యాధారపడవలెను. అతడు తనకదివరకేయున్న పనినిపెంచుకొనుట కిష్టములేక సాధారణముగ దీనినెగురగొట్టును. ఒకవేళయుత్తరమును వ్రాయుచో, చిరునామా సరిగనీయబడకపోవుటచే నది చావుయుత్తర ముల ఆఫీసుకుచేరును. బంధుదర్శనములు మరింతకష్టతరమగును. తప్పని సరిగ నేజయిలుఅధికారినో తృప్తిపరచినగాని, సాధారణముగ, నివి సంభవింపవు. తఱుచుఖయిదీలను వివిధజయిళ్ళకు బదిలీచేయుచుందురు. అప్పుడు బంధువులు వారినానవాలు పట్టజాలరు. తమబంధువులతో సంవత్సరములకొలది యెట్టిసంబంధమునులేని ఖయిదీల ననేకమందిని నేనుచూచితిని. మూడునెలలు దాటినతరువాత జరిగెడిబంధుదర్శన ములు చాలయసాధారణముగ నుండెడివి. కొంతమంది ఖయిదీలును వారి బంధువులును నొకగోడకిరువంకల నుందురు. వారంతయు నొక్కసారిగ మాట్లాడప్రయత్నించెదరు. బంధుదర్శనమువలన కలగవలసిన కొద్దిపాటి మానవస్పర్శ, కేకలచేతను, అఱుపులచేతనుపూర్తిగా నశించిపోవును.

చాలకొద్దిమంది ఖయిదీలకు, వేయింటికి యేయొక్కనికో, (యూరపియనులకుగాక)మంచియాహారములనుయెక్కువయుత్తరములను యెక్కువబంధుదర్శనములరూపమున నెక్కువసౌకర్యములను కలుగ చేసెడివారు. గొప్పరాజకీయ సాత్త్వికనిరోధ యుద్యమసమయమున వేలకొలదిజనులు జయిళ్ళనునింపినపుడు ప్రత్యేకతరగతి ఖయిదీల సంఖ్య కొద్దిగపెరిగెడిది. అప్పటికిని యిదిచాలతక్కువ. రాజకీయ ఖయి దీలలో నూటికి 95 మంది, స్త్రీపురుషులు, మామూలువిధముననే చూడబడుదురు. వారికీసౌకర్యములుకూడ నుండవు.

కొందరువ్యక్తులు, విప్లవకార్యములకు యావజ్జీవము లేక దీర్ఘ కాలము శిక్షింపబడినవారు తఱచుచాలకాలమువరకు నొంటరిగా నుంచబడుదురు. యు. పి. లో నిట్టివారినందరిని ఆచారవతుగా నొంటరి కొట్టులలో పారవేయుచుందురు. మామూలుగా నీయొంటరికొట్టులు జయిలులోచేసిన నేరములకు ప్రత్యేకశిక్షకొఱకు నియమింపబడును. కానియీవ్యక్తులసందర్భములో-సాధారణముగా చిన్నపిల్లలు - జయిలు లోవారినడక మార్గదర్శకముగనుండినను - యొంటరిగ నుంచబడుదురు. కోర్టువారిశిక్షకుతోడు జయిలుశాఖవారు యెట్టికారణములను లేకుండ గనే మరియొకభయంకరమగు శిక్షనువేతురు. ఇదిచాలయసాధారణము గను, న్యాయవిరుద్ధముగను కాన్పించును. కొద్దికాలమైనను యొంటరి నిర్బంధము ననుభవించుట దుర్భరము. దానిని సంవత్సరములకొలది పెంచుట భయంకరమైన విషయము. మనస్సును నెమ్మదిగ, నిరంత రాయముగ పిచ్చిపట్టువరకును పాడుచేయుటయే దీనికర్థము. వెఱ్ఱి చూపు, భయపెట్టబడిన జంతువువాలకము తయారగును. అదియాత్మను డిగ్రీడిగ్రీగాపున్న చంపుట; దానినినెమ్మదిగా చెక్కచెక్కలుగా కోయుట. ఒకవేళ నట్టిమనిషి జీవించియున్నను, వికృతమానవుడై యీ ప్రపంచములో నుండతగనివాడగును. ఈమనిషి యేనేరమునైనను, యేదోషకార్యమునైననుచేసెనా ? యను ప్రశ్న యెప్పుడును కలుగు చునే యుండెను. హిందూదేశములోని పోలీసుపద్ధతులు చిరకాలము నుండి సందేహాస్పదములు. రాజకీయవిషయములలో నివిమరింత యధి కము; ద్విగుణము. యూరపియను లేక యురేషియను ఖయిదీలు వారి దోషములెట్టివైనను, వారిబ్రతుకు యెట్టిదైనను, సరాసరి పెద్దతర గతులలో నుంచబడుదురు. వారికిమృష్టాన్నము, తేలికపని, యెక్కువ యుత్తరములు, బంధుమిత్ర సందర్శనములు మొదలగునవి చేకూ రును. వారమువారము పాదిరీవచ్చుచుండుటచే నతనికి బాహ్య ప్రపం చముతో సంపర్కముండును. అతడు మంచిమంచిచిత్రములుగల విదేశ

పత్రికలను, నప్పుడప్పుడు పత్రికలను యిచ్చుచు నవసరమైనపుడు వారికుటుంబములతో నుత్తరప్రత్యుత్తరములను జరుపును.

ఈలయూరపియను ఖయిదీలకిట్టి సౌకర్యములున్నందుల కెనరును దుఃఖించుటలేదు. ఏలనన నవితక్కువగనేయున్నవి. కానియితరుల సంద ర్భములో-స్త్రీలేమి, పురుషులేమి-నెట్టిమానవ ప్రమాణము నెంతమాత్ర మును పరిగణింపకపోవుట కొంచము బాధకరముగనే యుండును. ఖయిదీ యొకమానవుడుగ భావింపబడకపోవుటచే నతనికిలేశమైనమె కెన్నడు నట్టి మర్యాద చూపింపబడదు. ప్రభుత్వనిర్బంధవిధానముయొక్క యమానుష ప్రదర్శనముజయిలులో మనకు కాన్పించును. అది యనాలోచితముగను, నిర్లక్ష్యముగను పనిచేయుచు దానిచేతికిచిక్కు ప్రతిదానిని నలిపివేయు నట్టియొక దయాశూన్యమగు యంత్రము. ఈయంత్రమును ప్రస్ఫుటము చేయుటకే జయిలుచట్టములు యుద్దేశపూర్వకముగ నిర్మింపబడెను. అభిమానమున్న స్త్రీకిగాని, పురుషునకుగాని ప్రాప్తమైనపుడు, యీ యాత్మశూన్యమగు పరిపాలన బుద్ధిజాడ్యమును, మనోవ్యధను కలిగించును. దీర్ఘకాలశిక్షననుభవించువారొక్కొక్కప్పుడు తమవ్యర్థజీవితమునకు భగ్నహృదయులై, చిన్నపిల్లలవలె వెక్కివెక్కి యేడ్చుటను నేను కండ్లారజూచితిని. ఆవాతావరణములో మచ్చునకైనను కానరాని యొక్క సానుభూతివాక్యము ఒక్క ధైర్యవచనము, వారి ముఖమండ లము నకస్మాత్తుగా సంతోష కృతజ్ఞతలతో నింపివేసెడిది.

అయినను ఖయిదీలలోనే భూతదయాళుత్వమునకును, సౌహార్ద్ర మునకును సంబంధించిన గుండెను కరగించునట్టి కధనములు సంభవ ములు నెన్ని యోకలవు. ఒకసారి జయిలుకలవాటుపడిన యొక ముసిలి ఖయిదీ పదమూడుసంవత్సరము లైనతరువాత విడువబడెను. ఇంత దీర్ఘ కాలము గతించినతరువాత నతడు యెట్టియాస్కారమును లేకుండ నపరి చితమగు ప్రపంచములోనికి బోవుచుండెను. అతనితోడి ఖయదీలతనికి

కొంత సహాయము చేయగోరిరి. కాని వారంతగా చేయజాలకపోయిరి. జయిలు ఆఫీసులో దాచుకొనబడిన తనపట్టునొకడు యిచ్చెను. మరి యొక డింకొక వస్త్రమునిచ్చెను. మూడవఖయిదీ కొకనికి యొక క్రొత్త చెప్పులజోడు ఆయుదయమునే వచ్చెను. అతడు సగౌరవముగా దానిని నాకు చూపించెను. జయిలులో నదియొక గొప్ప సొత్తుగా భావింప బడును. కాని చాలకాలమతని సహచరుడుగానున్న యీగుర్తిఖయిదీ కాలికి జోడులేకుండ వెళ్లుట నతడుచూచి తన సరిక్రొత్త జోడునతనికి హృదయ పూర్వకముగ నిచ్చివేసెను. బయటకంటె జయిలులోనే యెక్కువదయ కలదని నేనప్పుడనుకొంటిని.

ఆవత్సరము 1930, అద్భుతమగు రంగిములతోను ఉత్తేజకరము లగు సంభవములతోను నిండియుండెను. జాతినంతను మేల్కొలిపి యుత్సాహపూరితులను చేయగలుగు గాంధీజీ యద్భుతశక్తి యాశ్చర్య జనకముగనుండెను. దానిలో నేదో కొంతమంత్రశక్తి యున్నట్లుండెను. 'అతడు మట్టిముద్దలనుండి వీరాగ్రేసరుల నుద్భవింపచేయగల శక్తికల వాడు' అని గాంధీజీనిగురించి గోక్లే యుపయోగించిన పదములు మా కందరకును జ్ఞప్తికివచ్చెను. శాంతియుత శాసనోల్లంఘనము జాతీయ పరమావధిని సాధింపగల కార్యక్రమమేయని రుజువగుచున్నట్లు కాన్పిం చెను. మనముజయమునుపొందబోవుచున్నారమనుయచంచలవిశ్వాసము దేశములో బయలుదేరెను. మనమిత్రులును శత్రువులునుకూడ నిట్లే తలంచిరి. ఉద్యమములో నుత్సాహముతో పనిచేయుచున్నవారిలో నొకనూతనోద్రేకము బయలుదేరి, యిదికొంత జయిలులోనికిగూడ ప్రాకెను. మామూలుఖయిదీలు 'స్వరాజ్యము వచ్చుచున్నది' అని చెప్పుచు దానిచే తమకు కొంతలాభము చేకూరగలదను స్వార్థచింతతో దానికొరకాతురతతో నెదురుచూచుచుండిరి. జయిలువార్డర్లు, బజారుల లోని సంభాషణలనన్నింటిని వినుచు స్వరాజ్యము సమీపస్థమయినట్లే

భావించుచుండిరి. చిన్నచిన్న జయిలుఉద్యోగులు కొంచెము భయపడ సాగిరి. జయిలులో మాకు దినపత్రికలులేవు. ఒక హిందీవారపత్రిక మాకు కొన్నివార్తల నిచ్చుచుండెడిది. ఈవార్తలే తెలుపు మాయూ హలను రగుల్కొల్పుచుండెడివి. నిత్యలాఠీచార్జీలు, అప్పుడప్పుడు కాల్పులు, షోలాపూరులోని సైనికశాసనము, జాతీయజెండాను తీసి కొనివెళ్ళినందులకు పదేసవత్సరములు శిక్షలు. మనప్రజలను ముఖ్య ముగా స్త్రీలనుచూచి మేము గర్వించెడివారము. మాతల్లి, భార్య, చెల్లెండ్రు, బంధువర్గములోనివారు, స్నేహితురాండ్రు మొదలగు వార కార్యోత్సాహముచే నాకు ప్రత్యేకానందము కలుగుచుండెడిది. నేను జయిలులోనుండి వారికిదూరముగనున్నను ఒకమహోద్యమములో సహచరులమైతిమను నూతనభావముచే మేము మరింత సన్నిహితుల మైతిమి. మాకుటుంబము మరింత పెద్దబృందములో కలిసిపోయినట్లు కాన్పించెను. అయినను దాని ప్రాతవాసనలు స్నేహము, బాంధవ్యము చెక్కుచెదరక నిలిచియుండెను. కమలయొక్క శక్తి, యుత్సాహము, శరీరదుర్బలత్వమును జయింపగలుగుట నాకాశ్చర్యముగనుండెను. నిరంత రము పనిచేయుచుండినను కొంతకాలమైన యామె స్వస్థముగనుండెను.

బయట ననేకమంది యుపద్రవములను బాధలను పొందుచుండ జయిలులోవారికంటె నేనెక్కువ సుఖముగ కాలక్షేపము చేయుచున్నా నను భావమునన్ను బాధింపదొడగెను. నేనుబయటకు పో గోరితిని. కాని యది యసంభవమగుటచే నేనెప్పుడును పనిచేయుచు నాజయిలు జీవిత మును కఠినమొనర్చుకొంటిని. నాస్వంత రాట్నముమీద నేనురోజుకు మూడునాలుగుగంటలు వడికెడివాడను. మరి రెండు మూడు గంటలు జయిలుఅధికారులను ప్రత్యేకముగ నడిగి నేను నవారునేత నేసెడి వాడను. నాకీపనులు చాలప్రీతిగ నుండెడివి. ఎక్కువశ్రద్ధ యక్కర లేకుండ నెక్కువశ్రమనీయకుండ నవినాకు పనికల్పించెడివి. అవినామనో

జ్వరమును చల్లార్చుచుండెడివి. నేనుయెక్కువగా చదువుచుండెడివాడను. తక్కిన కాలములో యిల్లుశుభ్రపరచుకొనుట బట్టలుతుకుకొనుట మొదలగు పనులలో నుండెడివాడను. 'నాకు విడిఖయిదు' అగుటచే నేను పై పనులను స్వంతముగా కోరుకొని చేయుచుండెడి వాడను.

జయిలులోని నానిత్యకృత్యములతోను, పై నజరుగుచున్న సంభవములనుగురించిన యోచనలతోను నై నీజయిలులో నేను నారోజులను వెళ్ళబుచ్చుచుంటిని. భారత దేశములోని జయిలు నిర్వాహణ విధానమును పరిశీలించునపుడు నాకదిభారత దేశములోని బ్రిటిషుప్రభుత్వముకు తగియున్నట్లే కాన్పించెను; ప్రభుత్వపరికరములలో గొప్ప పటుత్వమున్నది. ఇది దేశములోని మానవసంపదకెంతమాత్రమును లక్ష్యము చేయక దేశముమీద ప్రభుత్వాధికారమునుమాత్రము వృద్ధిచేయును. బయటకు జయిలి సమర్థతతో పరిపాలింపబడుచున్నట్లు కాన్పించవలెను. కొంతవరకును యిది సత్యమే! కాని యచ్చటకువచ్చిన దురదృష్టవంతులైన మానవుల నభివృద్ధిపరచి వారికి సహాయముచేయుటయే జయిలు యొక్క ప్రధానోద్దేశ్యమయి యుండవలెనను సంగతి నెవరును గుర్తించునట్లు కాన్పించదు. వారిని ఛేదించుడు ! వేధించుడు ! ఇదియే యాశయము. వారుజయిలును విడిచివెళ్లునరకి వారిలోనావంతయు నుత్సాహములేకుండ నుండవలెను. జయిలు యెట్లునియమింపబడుచున్నది? ఖయిదీలు యెట్లుఅదుపులోనుంచబడి శిక్షింపబడుచున్నారు. చాలవరకు ఖయిదీల సహాయముతోడనే యిదిజరుగుచున్నది. వారిలోకొంతమంది ఖయిదీవార్డర్లు (సి. డబ్ల్యూలు) లేక ఖయిదీఓవరుసీయర్లు ( సి. ఒ. లు.) గ చేయబడుదురు. భయము చేతను బహుమతులును, ప్రత్యేకతగ్గింపులును (వారిశిక్షలో) దొరుకునను నాశతో వీరిట్లు చేయుదురు. జీతములు తీసకొని పనిచేయు ఖయిదీలుకాని వార్డర్లుతక్కువగనుందురు. జయిలులో జరుగుకాపలా చాలవరకు ఖయిదీవార్డర్లచేతను, సి. ఒ. ల చేతను, జరుపబడును. ఖయిదులో గూఢచారితనము ప్రబలముగ

నుండును. ఖయిదీలే గూఢచారులుగ నుండ ప్రోత్సహింపబడుదురు. ఖయిదీలలో నెట్టికలయికను సమష్టికార్యమును జరుగనీయరు. ఇది సుల భగాహ్యము. ఏలనన వారిని చీల్చియుంచుటచేతనే వారదుపులో నుంచబడగలుగుచున్నారు.

బయట, మన దేశ పరిపాలనలోగూడ నీపద్ధతియే పయికంతగా కాన్పించకపోయినను, మరింత పెద్దయెత్తుమీద నడచుచున్నది. కాని యచ్చటనున్న సి. డబ్ల్యూలేక సి. ఒ. లు. వేరువిధముననుందురు. వారికి గొప్పగొప్పబిరుదులుండును. వారియుద్యోగదుస్తులు మెక్కువ పటా టోపముగ నుండును. వారివెనుక జయిలులోవలెనే, రక్షకభటులు విచ్చుకత్తులతో నెప్పుడును సిద్ధముగనేయుందురు.

ఆధునికప్రభుత్వముకు జయిలు యెంతముఖ్యమైనది, యెంత యవసరమైనది! అధమము ఖయిదీ యిట్లుభావింప మొదలిడును. జయి లులోని ప్రధానధర్మములు, పోలీసు, సైన్యములమందర ప్రభుత్వము యొక్క వివిధపరిపాలనా ధర్మములు నిమిత్తమాత్రములుగ కాన్పిం చును. ప్రభుత్వమును గుప్పిటలో నుంచుకొను వర్గమువారియిచ్ఛను చలా యించునిర్బంధపరికరమే నిజముగ ప్రభుత్వమగుచున్నది యను మార్క్సు యను సిద్ధాంతము జయిలులోనున్నవారికి బాగుగ నర్థముకాగలదు.

ఒక నెలవరకు నేను నాకొఠారములో నొంటరిగనుంటిని. తరువాత నర్మదప్రసాదసింగు వచ్చెను. అతనిరాక నాకు ముదావహముగ నుం డెను. తరువాత రెండున్నరనెలలకు 1930 జూను ఆఖరురోజున మా చిన్నయావరణ మసాధారణమగు నుద్రేకమున కాకరమయ్యెను. తల వని తలంపుగా మాతండ్రియు డాక్టరు సయ్యదుమహమ్మదుగార్లు నచ్చుటకు ప్రాతఃకాలముననే వచ్చిరి. వారాయుదయముననే యింకను నిద్రించుచుండగ నానందభవనములో నిర్బంధింపబడిరి.

# ౩౧

## ఎఱవాడలో రాయబారములు.



మా తండ్రిని నిర్బంధించుటతోడనే లేక కొంచెము ముందుగనే కాంగ్రెసు వర్కింగుకమిటీ యక్రమసంఘముగ ప్రకటింపబడెను. దీని వలన బయటనొక నూతనపరిస్థితి యేర్పడెను. సభ జరుగుచుండగనే నీకమిటీయంతయు నొక్కసారిగ నిర్బంధింపబడును. తాత్కాలి కాధ్యక్షుల కిచ్చిన యధికారముక్రింద వెంటనే క్రొత్త సభ్యులు జేర్చబడు చుండురు. ఈవిధముగ ననేకమంది స్త్రీలు తాత్కాలిక సభ్యురాం డ్రయిరి. కమల వారిలోనొకతె.

తండ్రిగారు జయిలుకు వచ్చుసరికి చాలా యనారోగ్యముగ నుండిరి. అచ్చటనున్న పరిస్థితు లతని కెంతమాత్రమును సరిపడలేదు. ప్రభుత్వమువారు వీనిని బుద్ధిపూర్వకముగ కల్పించలేదు. అతనికికలుగు నసౌఖ్యములను తగ్గించుటకు వారుచేయగలిగిన దంతయు చేయుటకు సిద్ధముగనేయుండిరి. కాని నైనీజయిలులో వారంతగా చేయజాలక పోయిరి. నాకొటారులోని నాలుగు చిన్నగదులలోను యిప్పుడు మమ్ము నలుగురను కుక్కిరి. తండ్రిగారిని వేరొకచోట మరింత విశాలమైన ప్రదేశములో నుంచెదనని జయిలుసూపరింటెండెంటు సూచించెను. కాని మాలోకొంతమంది యతనికి స్వయముగ సేవచేయుటకు వీలుగ నుండుటకు మేమొకచోటనే యుండగోరితిమి.

వర్షకాలమప్పుడే ప్రారంభమగుచుండెను. కప్పులోనుండి వర్ష మచ్చటచ్చట కురియుచుండుటచే గదులలోకూడ పూర్తిగ పొడిగనుం డుట యసంభవముగనుండెను. రాత్రివేళ నతనిపక్క నెచ్చటవేయుట యనునది యొక నిరంతరసమస్య యగుచుండెను. ఒక్కొక్కప్పు డతనికి

జ్వరము వచ్చెడిది. చివరకు మాగదిదగ్గర మరియొక విశాలమగు వరండా నిర్మింపబడెను. ఈవరండా బాగుగనే యుండెను. కాని యిది తయారయిన వెంటనే మాతండ్రి విడిచివేయబడెను. మిగిలియున్న మేము దీనిలాభమును బాగుగపొందితిమి.

జూలై మాసాంతమున ప్రభుత్వముకును, కాంగ్రెసుకును మధ్య సర్ తేజబహదర్ సప్రూ యం. ఆర్. జయకరుగార్లు రాయబారములను నడుపుచున్నట్లు వదంతులు బయలుదేరెను. తరిడిగారికి ప్రత్యేక ప్రసాదముగా పంపబడుచుండెడి యొక వార్తాపత్రికలో మేమీ విషయములను గురించి చదివితిమి. వైస్రాయిద్వైన యిర్విను ప్రభువుకును, సప్రూ, జయకరులకును మధ్యజరిగిన యుత్తరప్రత్యుత్తర ములను కూడ నీపత్రికలో చదివితిమి. తరువాత నీ 'సంధిచేయు వారు' అనబడెడివారు గాంధీజీని సందర్శించిరని వింటిమి. ఇట్లు పూనుకొని వచ్చుటకు వారినేది ప్రోత్సహించెనో, లేక వారు దేనికొరకు ప్రయ త్నించుచుంటిరో మాకిసుమంతయు తెలియదు. తండ్రిగారు తమనిర్బం ధమునకు కొద్దిరోజులుపూర్వము బొంబాయిలో నిచ్చిన యొక చిన్న స్టేటుమెంటు తమకిట్టి ప్రోత్సాహము నిచ్చెనని తరువాత వారుమాకు చెప్పిరి. మాతండ్రిగారితో సంప్రదించినమీదట స్లోకోంబుగారు (అప్పుడు హిందూదేశములోనున్న లండను డైలీహెరాల్డు పత్రికారచ యిత) దీనిని వ్రాసిరి. మాతండ్రి దీనినామోదించెను. ప్రభుత్వముకొన్ని షరతుల కంగీకరించినచో కాంగ్రెసు శాసనోల్లంఘనమును ఆపివేయుట కవకాశము లుండునని యీస్టేటుమెంటు భావించెను. అది నిర్దిష్టములేని తాత్కాలిక వ్యవహారము. తండ్రిగారు గాంధీజని, నన్ను సంప్రదించుట కవకాశమున్నగాని యీనిర్దిష్టములేని షరతునైనను యోచింపబడనేర వని యది స్పష్టపరచెను. ఆవత్సరము నేను కాంగ్రెసుప్రెసిడెంటు నగు టచే నాపేరుకూడ జేరెను. తండ్రిగారు నిర్బంధింపబడిన తరువాత,

నైనీజయిలులో నాకీసంగతినిచెప్పిరి. తొందరలో తానట్టి యనిర్దిష్ట స్టేటుమెంటు నిచ్చితిననియు, దాని కపార్థములు కల్పింపబడవచ్చుననియు నతడు సవిచారముగ తెల్పినసంగతి నాకు జ్ఞప్తియుండెను. దీనికి నిజముగా నపార్థము కల్పింపబడెను.

గాంధీజీయొద్ద నొక చీటీతీసికొని సప్రూ, జయకరుగార్లు జూలై యిరువదియేడవ తేదీని హఠాత్తుగా మాజయిలులో వ్రాలిరి. ఆదినమునను మరునాడును మేము వారితో దీర్ఘసంభాషణలను జరిపితిమి. తండ్రిగారప్పుడు జ్వరముతో నుండుటచే నివి చాల యలసటను కలిగించెను. మాసంభాషణలు, వాగ్వాదములు తిలఘాతకురాలి చక్రభ్రమణమువలె తలయు తోకయులేకుండ నొకరికొకర కర్థముకాని భావములోను, భాషలోను జరిగెను. రాజకీయదృష్టిలో మాకంత గొప్ప భేదముండెను. ప్రభుత్వముకును, కాంగ్రెసుకును మధ్య నెట్టి సంధియు జరుగుట కానంతయు నవకాశములేదని మాకు విశదమయ్యెను. వర్కింగుకమిటీ సహచరులతో ముఖ్యముగా గాంధీజీతో, మొదట సంప్రదించకుండ మే మెట్టిసూచనను చేయనిరాకరించితిమి. గాంధీజీకికూడ నీయర్థమునచ్చునట్లె వ్రాసిపంపితిమి.

పదకొండురోజులయిన తరువాత ఆగస్టు యెనిమిదవ తేదీని డాక్టరు సప్రూగారు వైస్రాయిగారి ప్రత్యుత్తరముతో మమ్ముచూచుటకు తిరిగివచ్చిరి. మేము యరవాడజయిలుకు (గాంధీజీయున్న జయిలు) వెళ్లుటకు వైస్రాయి కభ్యంతరములేదు. కాని బయటనుండి ప్రభుత్వముతోనింకను తీవ్రముగ పోరుసల్పుచున్న వల్లభాయిపటేలు, అబ్దుల్ కలాం అజదు మొదలగు వర్కింగుకమిటీ సభ్యులను కలుసుకొనుటకు వైస్రాయియు, నతని కౌన్సిలు సభ్యులును అంగీకరింపజాలరని చెప్పి, యీపరిస్థితులలో యరవాడ వెళ్లుట కిచ్చగింతురాయని సప్రూగారు మమ్మడిగిరి. గాంధీజీ నెప్పుడైనను చూడబోవుటకు మాకెట్టి యభ్యంత

రములేదనియు, నుండజాలదనియు కాని, మేమితరసహచరులను కలుసుకొనుటకు వీలులేకపోవుటచే మేమెట్టి తుదినిర్ణయమును చేయజాలమనియు నతనితో చెప్పితిమి.

ఆనాటిపత్రికయే (లేక పూర్వపురోజుపత్రిక) బొంబాయిలో భయంకరమగు లాఠీఛార్జి జరిగెననియు, వల్లభాయిపటేలు, మాలవ్యాజీ, సదక్ షెర్వానీ మొదలగువారు వర్కింగుకమిటీయొక్క తాత్కాలిక సభ్యులుగనో, శాశ్వత సభ్యులుగనో నిర్బంధింపబడిరనియు తెలిపెను. దీనివలన పరిస్థితులేమియు చక్కబడలేదనియు నీస్థితిని నైనాయికి స్పష్టముగ నెరింగింప వలసినదనియు మేము సప్రూగారితో చెప్పితిమి. ఏదియెట్లున్నను గాంధీజీని సాధ్యమైనంత త్వరలో కలుసుకొనుటలో నుపద్రవమేమియు లేదని సప్రూగారనిరి. మేము యరవాడవెళ్ళవలసి వచ్చినచో మాతో నైనీజయిలులోనున్న డాక్టరు సయ్యదు మహమ్మదు, కాంగ్రెసు శక్రెటరీ యగుటచే మాతోకూడ రావలసియుండునని మేమదివరకే సప్రూగారితో చెప్పియుంటిమి.

రెండురోజు లయినతరువాత మేము ముగ్గురము అగష్టుపదియవ తేదీని ప్రత్యేకరైలుబండిలో నైనీనుండి పూనా తీసికొనిపోబడితిమి. మారైలు పెద్దస్టేషనులవద్ద ఆగక ప్రక్కనున్న చిన్నచిన్న స్టేషనులవద్ద ఆగుచుండెను. అయినను ఈవార్త వాయువేగమున ప్రసరించి జనులు గుంపులుగుంపులుగ ప్రతిస్టేషనుకు మాబండి యాగినను, ఆగకపోయినను రాదొడగిరి. పదకొండవ తేదీ రాత్రి ప్రొద్దుపోయినతరువాత పూనాసమీపముననున్న కిర్కీచేరితిమి.

గాంధీజీయున్న కొఠారములోనే మమ్ముంచెదరనియు లేదా యతనిని వెంటనే చూతుమనియు మేమనుకొంటిమి. యరవాడ జయిలు సూపరింటెండెంటు యిట్టియేర్పాటేచేసెను. కాని నైనీనుండి మాతో వచ్చిన పోలీసుయుద్యోగి తెచ్చిన సందేశము ప్రకారమతడు చివర

నిమిషములో తన యేర్పాటులను మార్చుకొనెను. సూపరింటెండెంటు కలనల్ మార్టినుగారు రహస్యమును దాచిపెట్టిరి. కాని తండ్రిగారు వేసిన యుక్తి ప్రశ్నవలన మేము మొట్టమొదట సప్రూజయకరుల సమక్షముననే గాంధీజీని కలుసుకొనవలెనను భావము స్పష్టమయ్యెను. మేము ముందుగా కలుసుకొనినచో మాదృష్టి మరింత బిరబిగియు ననియు లేదా మేమంతమునుపటికంటె గట్టిపడుదుమనియు వారు భయపడిరి. కనుక నారాత్రియు మరునటి రాత్రింబవళ్లును మమ్ము వేరొక ప్రత్యేక కొట్టులోనుంచిరి. తండ్రిగారికిది చాల కంపరముగనుండెను. నైనీనుండి యింతదూరము సతడెవరిని కలుసుకొనుటకు వచ్చెనో యట్టిగాంధీజీని, కలుసుకొననీక యాశాభంగ మొనరించుట మనోవ్యథగ నుండెను. పదమూడవతేదీ యుదయము సప్రూ, జయకరుగార్లు వచ్చిరనియు, గాంధీజీ జయిలు ఆఫీసులో వారిని కలుసుకొనెననియు మమ్మచ్చటకు రాగోరిరనియు వర్తమానము వచ్చెను. తండ్రిగారు వెళ్లుటకు నిరాకరించి, యనేకసమాధానములును, క్షమార్పణలును చెప్పినమీదట మొదటగాంధీజీ నొక్కనినే చూచుషరతుమీద దీనికంగీకరించెను. తరువాత మాయందరి కోరికపయినను యరవాడకు తీసికొనిరాబడిన వల్లభాయిపటేలు, జయరామదాసు దౌలతురాముగార్లను, యెదుట స్త్రీలజయిలులో నుంచబడిన సరోజినీదేవిని, మాకాన్ఫరెన్సులో కలియనిచ్చిరి. ఆసాయంత్రము మాతండ్రిని, నన్ను, సయ్యదుమహమ్మదును గాంధీజీయావరణలోనికి మార్చిరి. తరువాత మేము యరవాడలో నున్నంతకాలము అచ్చటనేయుంటిమి. వల్లభాయిపటేలు జయరామదాసు దౌలతురాముగార్లుకూడ నచ్చటనే, యాకొద్దిరోజుల సలహా సంప్రదింపులకొరకు, నుంచబడిరి.

సప్రూజయకరులతో మాకాన్ఫరెన్సులు మూడురోజులు జరిగెను. మాయభిప్రాయములను వెల్లడించుచు శాసనోల్లంఘన మాపి

వేసి, ప్రభుత్వముతో సహకారమొనర్చుటకు మాకనీసపుషరతులను తెలుపునట్టి యుత్తరములను మార్చుకొంటిమి. ఈయుత్తరములు తరువాత పత్రికలలో ప్రకటింపబడెను.*

ఈకాన్ఫరెన్సుల పరిశ్రమవలన తండ్రిగారికి హఠాత్తుగా 16 వ తేదీని చాల హెచ్చుజ్వరము తగిలెను. దీనిచే మాప్రయాణ మాలస్యమయ్యెను. మేము 19 వ తేదీ రాత్రి తిరిగి ప్రత్యేకరైలులో నైనీ పయనమైతిమి. బొంబాయి ప్రభుత్వమువారు తండ్రిగారి సుఖప్రయాణమున కన్నియేర్పాటులను గావించిరి. యరవాడలోనున్న కొద్దిరోజులలోకూడ నతని సౌఖ్యములను గురించి ప్రత్యేకశ్రద్ధ తీసికొనబడెను. యరవాడలో మేము దిగిననాటిరాత్రి జరిగిన యొకచిన్న వినోద విషయము నాకు జ్ఞాపకమున్నది. సూపరింటెండెంటు అగు కలనల్ మార్టిను గారు మాతండ్రిగారి కెట్టియాహారము ప్రీతిగనుండునో ప్రశ్నించెను. తండ్రిగారు తనకుచాల నిరాడంబరమును, తేలికదియునగు నాహారము కావలెనని చెప్పుచు ప్రాతఃకాలము ప్రక్కనుండి లేచుటతోడనే తీసికొను తేనీరులగాయితు రాత్రిభోజనమువరకు నతనికి కావలసిన వివిధోపహారములను వివరించిచెప్పెను. (నైనీలో నతని యాహారము ప్రతిదినము స్వగృహమునుండి వచ్చుచుండెను.) తండ్రిగారతి నిరాడంబరముగను, అమాయికముగను ఇచ్చిన జాపితాలో తేలికయైన యాహారములేయున్నమాట నిశ్చయము. కాని యదిదర్పముగ నుండెను. తండ్రిగారు విశ్వసించినట్లే సెవాయిహోటలులోగాని, రిట్జులోగాని యది నిరాడంబరమును, సామాన్యమునునైన యాహారముగనే భావింపబడును. కాని యరవాడ జయిలులో నదివింతగను, యనుచితముగను, దూరవిషయముగను కాన్పించెను. తండ్రిగారు తనయాహారముకొరకు కావలసిన విలువయైన వివిధవస్తువులను వివరించుచుండ కలనల్ మార్టినుగారి

* కనీసపుషరతులను తెల్పుయుత్తరము రెండవ అనుబంధములో కలదు.

ముఖలక్షణములను నేనును, మహమ్మదును వినోదముగ పరిశీలించు చుంటిమి. అతడు భారతనాయకులలో నత్యుత్తముడు, కీర్తివంతుడు నగువానిని చాలకాలమునుండి తనరక్షణలో నుంచుకొనెను. అతనికి కావలసిన యాహారమంతయు మేకపాలు, ఖర్జూరపుకాయలు, బహుశః అప్పుడప్పుడు నారింజకాయలు. ఇప్పు డతనియొద్దకు వచ్చిన క్రొత్తజాతి నాయకుడు విస్తారమైనవాడు.

మేము పూనానుండి నైనీతిరిగి వెళ్లునపుడు మరల పెద్దస్టేషను లలో నాగకుండ మూలమూలలనున్న ప్రదేశములలో నాగుచుంటిమి. గుంపులు వెనుకటికంటెను నధికమయి ప్లాటుఫారములను నింపుచు, రైల్వేలైను పొడుగునను, ముఖ్యముగా హార్దా, ఇటార్సీ, సొహాగ్పూరు లలో, తేనెపట్టులవలె మూగుచుండిరి. అపాయములు కొంచెములో దాటిపోవుచుండెను. తండ్రిగారిస్థితి యంతకంతకు త్వరితముగ నధ్వాన్న మగుచుండెను. అతని స్వంతడాక్టర్లును, రాష్ట్రప్రభుత్వముచే నియమింప బడిన డాక్టర్లును అనేకమంది యతనిని పరీక్షించిరి. అతనికి జయిలు అధమాధమమగుప్రదేశమని స్పష్టమయ్యెను. అచ్చట నతనికి యుచిత మగు వైద్యసహాయములభింపదు. అయినను పత్రికలో నొకస్నేహితుడు అనారోగ్యకారణముచే నతనిని విడిచిపెట్టవలెనని సూచించినపుడతనికి కోపముకలిగెను. తాను చేసినట్లే ప్రజలు భావింతురని యతనిభయము. ప్రత్యేక ప్రసాదదృష్టితో తననువిడిచిపెట్టవలదనికూడ నతడు ఇర్విను ప్రభువుకు తంతిపంపెను. కాని, యతని స్థితిదినదినము పాడగుచుండెను. అతిత్వరితముగ నతనిబరువు తగ్గుచుండెను. శారీరకముగ నతని యా కారము మిగిలెను. సెప్టెంబరు 8 వ తేదీని సరిగా పదివారములు జయిలు జీవిత మయినతరువాత నతనిని విడిచిపెట్టిరి.

అతడు వెళ్ళిపోవుటతోడనే మాకొఠారము నిస్తేజము, నిర్జీవము నగు ప్రదేశమయ్యెను. అతడు మాతోనుండినపుడు మాకెంతయో పని

యుండెడిది. అతని సౌఖ్యమును పెంచుటకు మేమందరము- నర్మదా ప్రసాదు, మహమ్మదు, నేను-చిన్న చిన్న సేవలను చేయుచు మాదిన ముల నీసంతోషావహమగు సేవతో నింపెడివారము. నేను నవారు నేత మానివేసితిని. కొద్దిగా నూలు వడికెడివాడను. పుస్తకములను చదువుటకు నాకంతతీరిక యుండెడిదికాదు. ఇప్పుడతడు వెళ్ళిపోవుటతోడనే మేము తిరిగి అయిష్టముగను, సంతోషశూన్యముగను మామూలు నిత్యకృత్యములకు దిగితిమి. తండ్రిగారి విడుదలతో దినపత్రిక కూడ నాపివేయబడెను. నాలుగైదు రోజులయిన తరువాత మాంభావమఱది రంజిత యస్. పండిట్ నిర్బంధింపబడి మాకారాగారముకే పంపబడెను.

ఒక నెలయయిన తరువాత, అక్టోబరు 11 వ తేదీని, నాయారు మాసముల శిక్షాకాలము పూర్తియగుటచే నన్నువిడిచిపెట్టిరి. సంగ్రామమింకను జరుగుచుండుటచేతను, తీవ్రతరమగుచుండుటచేతను నాకంత స్వేచ్ఛయుండదని నేనెరుగుదును. 'సంధికారకుల' ప్రయత్నములు వ్యర్థమయ్యెను. నన్నువిడిచిపెట్టిన రోజుననే మరియొకటి రెండు ఆర్డినెన్సులను విడిచిపెట్టిరి. నేను బయటపడుటకు సంతోషించి నాకు దొరుకు కొద్దిగడువులోనే గట్టికృషిచేయుట కాతురపడుచుంటిని.

కమల యప్పుడు అలహాబాదులో కాంగ్రెసు సేవలో మగ్నురాలై యుండెను. తండ్రిగారు ముస్సోరీలోనే ఔషధసేవ చేయుచుండిరి. నాతల్లియు చెల్లెండ్రును ఆయనతో నుండిరి. నేను అలహాబాదులో నొకటిన్నర రోజులు చకచకపనిచేసి కమలతో ముస్సోరి వెళ్ళితిని. గ్రామసీమలలో పన్నుల నిరాకరణోద్యమమును ప్రారంభింపవచ్చునా కూడదాయను గొప్పసమస్య మమ్మెదుర్కొనెను. శిస్తులను పన్నులను చెల్లింపవలసిన సమయమాసన్నమయ్యెను. వ్యవసాయదినుసుల ధరలన్నియు విపరీతముగ పడిపోవుటచే నెట్లైనను పన్నులు చెల్లుట చాలకష్టతరముగనుండెను. ప్రపంచ ఆర్థికమాంద్యమిప్పుడు హిందూదేశములో స్పష్టముగ కాన్పించుచుండెను.

శాసనోల్లంఘనములో నొకభాగముగను, స్వతంత్రముగ దాని నిజఅవసరమును బట్టియు పన్నుల నిరాకరణమును ప్రారంభించుటకది దివ్యమైన సుభముహూర్తముగ కాన్పించెను. భూఖామందులును, సేద్యముచేయు వ్యావసాయికులును గూడ నాసంవత్సరాదాయములో నుండి పూర్తిపన్నులను చెల్లించుట యసాధ్యముగ నుండెను. దాచుకొనిన దేమైననున్నచో వారు దానిని కక్కవలెను, లేదా ఋణము చేయవలెను. జమీందారులకు సాధారణముగ వెనుక నేదో కొంత యుండును. లేదా వారెక్కువ సులభముగా నప్పుచేయగలరు. ఎప్పుడును దరిద్రముచేతను కఱవుచేతను బాధపడు సామాన్య వ్యవసాయదారుకు వెనుక నేమియునులేదు. అట్టి పరిస్థితులలో నేప్రజాస్వామిక మున్న దేశములోగాని, లేక వ్యవసాయదారులకు క్రమమైన సంస్థలుండి మంచిపలుకుబడి యున్నచోటగాని వారిదగ్గర నెక్కువగా వసూలు చేయగలుగుట కేవల మసాధ్యము. హిందూదేశములో వారిపలుకుబడి, దేశములో కొన్నిచోట్ల కాంగ్రెసు వారికండగా నున్నచోట్ల తప్ప, యత్యల్పము. పరిస్థితులు దుర్భరమగుచో వ్యావసాయిక తిరుగుబాటు కలుగునను నిరంతరభయము మాత్రము కలదు. కాని వారనేకపురుషాంతరములనుండి యెక్కువ సణుగుగొణుగులును లేకుండ నెట్టి దుస్థితినైనను దిగమ్రింగుచుండుట కలవాటుపడిరి. ఆసమయములో గుజరాతులోను, మరికొన్ని ప్రాంతములలోను పన్నుల నిరాకరణోద్యమములభివృద్ధిలోనుండెను. కాని యవియన్నియు శాసనోల్లంఘనములోని భాగములుగ ప్రారంభింపబడిన కేవలరాజకీయోద్యమములు. ఇవి రైతువారీ పద్ధతిగల ప్రాంతములు; రైతులే ప్రత్యక్షముగ ప్రభుత్వముతో సంబంధము కలిగియుందురు. వారిపన్నుల నిరాకరణము ప్రభుత్వముకు వెంటనే నష్టమును కలిగించెను. సంయుక్తపరగణాల సంగతివేరు. మాది జమీందారీ, తాలూకుదారీ ప్రాంతము. వ్యవసాయదారుకును, ప్రభుత్వముకును మధ్య నిచ్చుట మధ్యమనిషి మరియొక

డుండును. వ్యవసాయదారులు శిస్తులను చెల్లించుట మానివేసినచో వెంటనే జమీందారుకు దెబ్బతగులును. ఈవిధముగ తరగతులకు చెందిన సమస్యకూడ ఒయలుదేరెను. కాంగ్రెసు మొత్తముమీద, కేవలము జాతీయసంస్థ. ఇందులో చాలమంది మధ్యకము జమీందారులును, కొద్దిమంది పెద్దజమీందారులును కలరు. తరగతుల మధ్య పోరాటమును కలిగించునట్టియు, లేక జమీందారులకు కోపమును కలిగించునట్టియు విషయమును దేనినైనను పురస్కరించుకొని వచ్చుటకు దాని నాయకు లత్యంత భయపడుచుండిరి. కనుక వారు శాసనోల్లంఘన మారంభమైన మొదటి యారుమాసములలోను, పరిస్థితులు దీనికెంతయు ననుకూలముగనున్నట్లు నాకు కాన్పించినను, గ్రామములలో పన్నుల నిరాకరణోద్యమమును ప్రోత్సహింపరైరి. ఈవిధముగ గాని మరేవిధముగ గాని తరగతులలోని సమస్యను లేవదీయుటకు నేను వెరువలేదు. కాని కాంగ్రెసు, దానిస్థితినిబట్టి, తరగతులమధ్య పోరాటమును ప్రోత్సహింపజాలదని నేను గుర్తించితిని. అయినప్పటికిని, యది జమీందారులను, రయితులను గూడ పన్నులనీయవలదని ప్రోత్సహింపవచ్చును. సామాన్య జమీందారు ప్రభుత్వమువారి కీయవలసిన కట్టుబడిని బహుశః చెల్లింపవచ్చును. కాని యది యతని దోషమే యగును.

అక్టోబరులో నేను జయిలునుండి బయటకువచ్చునరికి రాజకీయ ఆర్థికపరిస్థితులు రెండును గ్రామములలో పన్నుల నిరాకరణమును వాంఛించుచున్నట్లే నాకుకాన్పించెను. వ్యవసాయదారుల ఆర్థిక కష్టములు తేటతెల్లముగనే యుండెను. రాజకీయముగ, మనశాసనోల్లంఘనకార్యక్రమమింకను ప్రతిచోటను విజృంభించుచున్నను, కొంచెము చప్పబడుచుండెను. జనులు కొద్దికొద్దిగ, నొక్కొక్కప్పుడు గుంపులుగను, జయిలుకు వెళ్లుచునేయుండిరి. కానివాతావరణములోని వేడి

చల్లారెను. హర్తాళములతోను, యుత్సవములతోను పట్టణములును, మధ్యతరగతులవారును కొద్దిపాటి విసిగిరి. ఉత్తేజమును కలిగించునట్టి దేదియో యొకటియుండవలెను. కొత్తరక్తమును యెక్కించవలెను. రయితులనుండికాక నిదియెచ్చటనుండి రాగలదు? అచ్చటమనకు కావలసినంత జనస్తోమతు కలదు. మరియు నది ప్రజాసామాన్య ప్రయోజనములకు చెందిన ప్రజలయుద్యమమగును. నాదృష్టిలో నతిముఖ్యమైన సాంఘికసమస్యలను లేవగొట్టును.

నేను అలహాబాదులోనున్న రోజున్నరలోను నాసహచరులును, నేనును వీనినిగురించి చర్చించితిమి. స్వల్పకాలపు గడువులో మేమచ్చట మారాష్ట్రకాంగ్రెసువర్కింగుకమిటీ సభనుజరిపి చాలకాలము తర్జనభర్జనచేసినతరువాత శాసనోల్లంఘనమున కనుజ్ఞయిచ్చుటకు నిశ్చయించి యేజిల్లాయయినను దానినినడిపించుకొనుటకధికార మిచ్చితిమి. రాష్ట్రములో నెచ్చటనుకూడ మేమేదానిని ప్రకటింపలేదు. తరగతుల మధ్య పోరాటమును, సాధ్యమగుచో, లేకుండచేయుటకు కార్యనిర్వాహకవర్గమువారు దీనిని జమీందారులకును, రయితులకునుగూడ వర్తింపచేసిరి. ప్రధానమగు సమాధానము రయితులనుండియే వచ్చునని మే మెరుగుదుము.

ముందడుగు వేయుటకిట్టియనుజ్ఞనుబడసినతరువాత మాఅలహాబాదు జిల్లాయే మొట్టమొదటియడుగు వేయగోరెను. ఈనూతనోద్యమమున కొకవికాసమును కలుగజేయుటకు వారమురోజులయిన తరువాత బాధ్యతగల రయితుమహాసభ నొకదానిని జరుపుటకు మేము నిశ్చయించితిమి. జయిలునుంచి వచ్చినప్రథమదినముననే నేను తృప్తికరమగు పనినిచేసితినని భావించితిని. దీనికితోడు అలహాబాదు పట్టణములో నేనొకపెద్ద బహిరంగ సభలో దీర్ఘముగ నుపన్యసించితిని. ఈయుపన్యాసముకే తరువాత నేనుతిరిగి శిక్షింపబడితిని.

తరువాత అక్టోబరుపదమూడవ తేదీని కమలయు నేనును తండ్రి గారితో మూడురోజులు గడుపుటకు ముస్సోరీ వెళ్ళితిమి. అతడు కొంచె మారోగ్యముగ నున్నట్లు కాన్పించెను. సుగుణముగ నుండెననియు, వ్యాధితగ్గుచున్నదనియు భావించి నేనందుకుసంతసించితిని. ప్రశాంత మును, సంతోషప్రదమునగు ఆమూడుదినములును నాకెప్పుడును జ్ఞప్తియందుండును. స్వగృహమెంత సౌఖ్యదాయకము! నాకుమార్తె ఇందిరయు, నాచెల్లెండ్రు- ముగ్గురుఆడుబిడ్డలును యచ్చటనేయుండిరి. నేనుపిల్లలతో నాడుకొనెడివాడను. ఒక్కొక్కప్పుడు మేమందరమును ఆయింటిచుట్టు నతిదర్పముగా నొకపెద్దయుత్సవమును జరిపెడివారము. అందరిలోను చిన్నదియగు మూడునాలుగేండ్లబిడ్డచేత జెండాపట్టుకొని మాజెండాకీర్తనయగు, 'జెండా ఊంచా రహే హమారా' (మాజెండా గగనమార్గమున నెగురునుగాక) యనుకీర్తనమును పాడుకొనుచు యుత్సవమును నడుపుచుండెడిది. మృత్యుదంష్ట్రికరాళములను తెఱచుకొని వచ్చిన యావ్యాధి మాతండ్రిని నాయొద్దనుండి యపహరించుటకు ముందు నేనతనితో నామూడుదినములనే గడిపితిని.

నేనువెంటనే నిర్బంధింపబడుదునని పసిగట్టి, బహుశః నన్నింకను మరికొంచెము చూడనెంచి, మాతండ్రి యలహాబాదు తిరిగివచ్చుటకు హఠాత్తుగ నిశ్చయించుకొనెను. 19 వ తేదీని అలహాబాదులో జరుగనున్న రయితుమహాజనసభ కందుకొనుటకు కమలయు నేనును పదిహేడవ తేదీని ముస్సోరీనుండి దిగితిమి. తండ్రిగారు, తక్కినవారితో, మరునాడు వచ్చుటకేర్పాటు గావించుకొనెను.

మాగృహోన్ముఖ ప్రయాణము కొంత యుద్రేకజనకముగ నుండెను. నేను డేరాడూను విడుచుచుండగా 144 వ శెక్షను నాపై నమలుజరుపబడెను. లక్నోలోకూడ నాపయిమరియొక ఆర్డరు 144 వ శెక్షనుక్రింద బనాయింపబడెననివింటిని. వేలకొలదిజనము మూగుటచే

పోలీసుఆఫీసరుదానిని నాకందచేయజాలకపోయెను. మునిసిపాలిటీవారు నాకొక వినతిపత్రమును సమర్పించిరి. తరువాత మోటారులలో మేము అలహాబాదు వెళ్ళితిమి. త్రోవలో ననేకమంది రయితు మహాజనుల కుపన్యసించుటకు అనేకచోట్ల నాగుచు 18 వ తేదిరాత్రికి అలహాబాదు చేరుకొంటిమి.

19 వ తేదీయుదయము నాపైమరియొకఆర్డరు (144 వ సెక్షను క్రింద) సిద్ధమయ్యెను. ప్రభుత్వమువారు నన్ను వెంటాడించు చున్నారను సంగతి విదితమగుచునే యుండెను. నేనికకొన్నిగంటలలో నుంటిని. నేనుతిరిగి నిర్బంధింపబడు లోపల కిసానుసభకు హాజరు కావలెనను నుత్కంఠతో నుంటిని. మేము దీనిని ప్రతినిధులరహస్య సమావేశమే యని ప్రకటించి యుల్లిపయివారినెవరిని దానిలోనికి రానియలేదు. అది యలహాబాదుజిల్లాకు కూలంకషమైన ప్రాతినిధ్యమును వహించెను. నాకుజ్ఞప్తియున్నంతవర కందులో 1600 మంది ప్రతినిధులుండిరి. జిల్లాలో పన్నుల నిరాకరణమును ప్రారంభించుట కత్యుత్సాహముతో సభలోతీర్మానింపబడెను. మాప్రధాన నాయకులలో మాత్రము కొంత సందేహముండెను ఇట్టిసాహసకార్యము జయప్రదమగునా యను సందేహము. ఏలనన పెద్దజమీందారుల పలుకుబడియు, నధికారమును ప్రజలను భయోత్పాతములో ముంచివేయునంత యధికముగా నుండెను. ప్రభుత్వమువారు వారి కండగ నుండిరి. రయితులు యీధాటి కాగగలరాయని వారాశ్చర్యపడుచుండిరి. కానిహాజరయిన పదునారు వందలమంది రైతుప్రతినిధులలోను సందేహముకాని, సంశయము కాని యేమంతయునులేదు. అధమము అదిపయికి కాన్పించలేదు. ఆసభలో మాట్లాడినవారిలో నేనొకడను. దీనివలన, బహిరంగసభలో మాట్లాడకూడదని నాపైజారీచేయబడిన 144 వ సెక్షనును ధిక్కరించితినో లేదో నాకు తెలియదు.

తరువాత నేనునాతండ్రిని తక్కినకుటుంబమును తీసికొనివచ్చుటకు స్టేషనుకు వెళ్లితిని. ఆనాడుబండియాలస్యమయ్యెను. వారువచ్చుటతోడనే రయితులకును పట్టణవాసులకును సంబంధించిన యొకసభలో నుపన్యసించుటకు నేనువారినివిడచి వెళ్లితిని. కమలయు నేనును చాల డస్సిపోయి యీసభనుండి రాత్రియెనిమిదిగంటలకు తిరిగివచ్చుచుంటిమి. నేనుతండ్రిగారితో మాట్లాడవలెనని కుతూహలపడుచుంటిని. అతడు తిరిగివచ్చినతరువాత మేముతిన్నగా మాట్లాడుకొనక పోవుటచే నతడు నాకొరకెదురు చూచుచుండుననని నేనెరుగుదును. త్రోవలో మా మోటారు మాయింటికి కనుచూపుమేరలో నాపివేయబడెను. నన్ను నిర్బంధించి యమునాతరంగిణిని దాటించి నైనీలో నామామూలుబసకు తీసికొనిపోయిరి. మాకొరకెదురు చూచుచున్న కుటుంబమున కీక్రొత్త సమాచారమును తెల్పుటకు కమలయొక్కతెయే ఆనందభవనముకు వెళ్లెను. సరిగా 9గంటలు కొట్టునరికి నేనునైనీజయిలు సింహద్వారమున తిరిగి ప్రవేశించితిని.

## ౩౨

# సంయుక్త రాష్ట్రములలో నన్నులనిరాకరణము.

ఎనిమిదిరోజులు నైరుహాజరయినతరువాత నేనుతిరిగి నైనీజయి లులో నాయొక్కప్పటిపాతకొత్తారులో సయ్యదుమహమ్మదు, నర్మదా ప్రసాదు, రంజిత పండిట్‌గార్లను కలుసుకొంటిని. కొన్నిరోజులయిన తరువాత నేనువిడువబడిన మరునాడు అలహాబాదులో నేనిచ్చిన యుపన్యాసములోని యనేకభాగములకనేక చార్జీలనుతయారుచేసి జయి లులోనే నన్నువిచారణచేసిరి. మామూలు ననుసరించి నేనువాదించు కొనక కోర్టులోనొక చిన్నస్టేటుమెంటు నిచ్చితిని. 124 ఎ శెక్షనుక్రింద రాజద్రోహమునకు నాకు18మాసములు కఠినశిక్షను 500రూపాయిలు జుల్మానాయును విధించిరి. 1882 లోని యుప్పుచట్టముక్రింద నారుమాస ములును 100 రూపాయిలను విధించిరి. 1930లోని యారవఆర్డినెన్సు చక్రాయుధముక్రింద (ఈఆర్డినెన్సు దేనికి సంబంధించినదో నేనుమరచి పోతిని) కూడనారుమాసములును, 100రూపాయిలునువిధించిరి. చివర రెంటిని యేకకాలమందే యనుభవింపవలెను. కనుక మొత్తము రెండు సంవత్సరములు కఠినశిక్షను, జుల్మానాలుచెల్లింపనందుకు మరియైదు మాసములును అనుభవింపవలెను. ఇదినాకయిదవపర్యాయము; అయిదవ శిక్ష.

నన్నుతిరిగి నిర్బంధించుటయు, శిక్షించుటయు శాసనోల్లంఘ నోద్యమస్వభావమును తాత్కాలికముగా కొంతమార్చగలిగెను. అది మరికొంత యుత్సాహమును, శక్తిని ప్రదర్శించెను. దీనికిచాలవరకు తండ్రిగారే కారకులు. నానిర్బంధమునుగురించి కమలచెప్పినపుడు ఆతనికి కొంచెము విచారముకలిగెను. వెంటనే యతడు కోలుకొని తనముందర నున్న బల్లనుగుద్ది తానికవ్యాధిగ్రస్తుడుగ నుండజాలడని గర్జించెను

అతడారోగ్యవంతుడుగనుండి వ్యాధికి (దుర్బలునివలె) లొంగక వీరపురుషోచితకార్యమును చేయబోవుచుండెను. అది స్థైర్యమైన నిశ్చయమే, కాని లోపలనుండి యతనిని తినివేయుచున్న యావిషవ్యాధిని జయించి, నశింపు చేయుట కిట్టియిచ్ఛాశక్తియు చాలదయ్యెను. కాని యతనిని చూచిన వారాశ్చర్యపడునట్లు కొద్దిరోజులతనిలో గొప్పమార్పుకలిగెను. అతడు యరవాడలో నున్నదిలగాయితు, కొన్నిమాసములనుండి యుమ్మిలో రక్తమును కక్కుచుండెను. అతడిట్లు నిశ్చయించిన వెంటనే యకస్మాత్తుగా రక్తముపడుటమాని వేసెను. కొన్ని రోజులవఱకునది మరల కాన్పించలేదు. దానికతడు చాలసంతసించి నన్నుచూచుటకు జయిలుకు వచ్చినప్పుడీవిషయమును సగర్వముగా నాకెరిగించెను. కాని దురదృష్టవశాత్తు అదికొద్దికాలమేయట్లుండి తరువాత రక్తముమరింత జోరుగా పడనారంభించెను. వ్యాధి తిరిగితలయెత్తెను. ఈమధ్యకాలములో నతడు తన వెనుకటి శక్తితో పనిచేసి దేశమంతటను శాసనోల్లంఘనమునకు కొంతవికాసమును కలిగించెను. వివిధప్రాంతములనుండి వచ్చినవారితో నతడు సంప్రతించి వారికి వివరములగు నాదేశములనిచ్చి పంపించెను. దేశమంతటను జరుపగలందుల కతడొక యుత్సవదినమును (అది నవంబరులో నేను పుట్టినదినము) నిశ్చయించెను. ఆరోజున నా సేతుహిమాచల పర్యంతము బహిరంగ సభలలో నేనిచ్చిన యుపన్యాసములోని నేరములని యెంచబడిన (వీటికే నేను శిక్షింపబడితిని) భాగములు చదువబడెను. ఆదినమున నేకలాఠీఛార్జీలు, యుత్సవములను సభలను బలవంతముగా తెరిచివేయుట మొదలగునవి జరిగెను. ఆయొక్కరోజున దేశమంతటను అయిదువేలమంది నిర్బంధింపబడినట్లు మదింపువేయబడెను. అది యెంత యసామాన్యమగు జన్మదినోత్సవము!

వ్యాధిగ్రస్తుడై యుండి యతడీబాధ్యతను వహించుటయు, తన శక్తిని ధారపోయుటయు తండ్రిగారికసర్ధదాయకముగనుండెను, పరిపూర్ణ

విశ్రాంతిని తీసికొనవలసినదని నే నాయనను ప్రార్థించితిని. అతనికట్టి విశ్రాంతి హిందూదేశములోకలుగుట యసంభవమనియు, నతనిమనస్సు యెప్పుడును, సంగ్రామముయొక్క బాగోగులమీాద నే లగ్నమయియుండు ననియు, విధాయికముగ ప్రజలు సలహాకొరకతనియొద్దకువెళ్లుచుండు రనియు నేను గుర్తించితిని. కనుక రంగూను, సింగపూరు, డచ్చియిండీసువైపు కొద్దికాలము సముద్రయానము చేయవలసినదని నేను సూచించితిని. అతనికదిబాగుగనే కాన్పించెను. ప్రయాణములో నతనితో నొక డాక్టరు స్నేహితుడుకూడ నుండుటకేర్పాటు గావింపబడెను. ఈయుద్దేశ్యముతోనే యతడు కలకత్తావెళ్ళెను. కాని యతనిస్థితి నెమ్మదిగ దిగనారుచుండుటచే నతడిక ముందుకుపోజాలక పోయెను. కలకత్తా సమీాపమున నతడు యేడువారములుండెను. కమలతప్ప తక్కిన కుటుంబము యావత్తు అతనిని కలుసుకొనెను. కమల చాలకాల మలహాబాదులోనే యుండికాంగ్రెసు సేవచేయుచుండెను.

పన్నుల నిరాకరణోద్యమములో నాకుగలసంబంధమును బట్టియే బహుశః నాపునర్నిర్బంధ మంతత్వరితము చేయబడెను. నిజమునకు, రైతు ప్రతినిధులింకను అలహాబాదులో నుండగనే, కాన్ఫరెన్సు అయినవెంటనే; నన్ను ఆరోజుననే నిర్బధించుటకంటె మరేదియు నాయుద్యమమున కంతటిశుభమును చేకూర్పజాలకపోయెడిది. దీనివలన వారి యుత్సాహ మినుమడించెను. వారు కాన్ఫరెన్సులోని తీర్మానములను జిల్లాలోని గ్రామగ్రామమునకు తీసికొనిపోయిరి. పన్నులనిరాకరణముప్రారంభింపబడినట్లు రెండురోజులలో జిల్లాజిల్లాయంతయు ప్రాకిపోయెను. ప్రతిచోటను ప్రజలు దీనియెడల నుత్సాహపూరితులై యుండిరి.

ఆరోజులలో వార్తలనందచేయుట మాకున్న కష్టములలో ప్రధానకష్టమయ్యెను, ఏమేమిచేయుచుంటిమో, ప్రజలేమిచేయుగోరు

చుంటిమో వారికి తెలుపుట కష్టముగనుండెను. జుల్మానాలను వేయుదురనియు, ప్రభుత్వము వారణచి వేయదురనియు భయపడి వార్తాపత్రికలు మావార్తలను ప్రకటింపకుండెను. అచ్చుఆఫీసులు మాకరపత్రములను, నోటీసులను ముద్రింపవు. ఉత్తరములును, టెలిగ్రాములును పరీక్షింపబడుచు తరుచు ఆపివేయబడుచుండెను. స్వయముగ వార్తలనందచేయువారికి కట్టలనిచ్చి పంపించుటయొక్కటే నమ్మకమైన పద్ధతిగా కాన్పించెను. వీరినప్పుడప్పుడు నిర్బంధించు చుండెడివారు. ఇది చాల ప్రియకరము; దీనికెక్కువ క్రమశిక్ష కావలసియుండెను. మొత్తముమీద నిదికొంత జయప్రదముగనే సాగింపబడెను. రాష్ట్ర కేంద్రములతోనే నిరంతర సంబంధముండెడిది. పట్టణములలో నెట్టి వార్తలనైనను వ్యాపింపజేయుట యంతకష్టమైనపనికాదు. ఈయక్రమపత్రాపత్రికలు (సాధారణముగ సైక్లోస్టైలుచేయబడి) వారపత్రికలుగను, దినపత్రికలుగను, వచ్చుచుండెడివి. ప్రజలు వాటికొరకెప్పుడును యెదురుచూచుచుండెడివారు. పట్టణములలో ప్రకటనచేయు విధములలో టముకువేయుట యొకవిధము. సాధారణముగా దీనివలన టముకువేయువాడు నిర్బంధింపబడుచుండెను. ప్రతివాడును అరెస్టు అగుటకు సంసిద్ధముగనుండుటచే దీనినెవరును లక్ష్యముచేయలేదు. ఈపద్ధతులన్నియు పట్టణములకు సరిపడెను. కాని గ్రామములలోనివి యంతసులభముగా పనిచేయవు. వార్తల నందించువారి మూలమునను, సైక్లోస్టైలు నోటీసులమూలమునను ముఖ్యమైన గ్రామకేంద్రములతో కొంతసంబంధముండెను. కాని యది తృప్తికరముగలేదు. దూరస్థమైన గ్రామములకు మాసందేశములు చేరుటకు చాలకాలము పట్టెడిది.

అలహాబాదులోని కిసానుకాన్ఫరెన్సు కీకష్టముతొలగిపోయెను. జిల్లాలోని ప్రతిముఖ్య గ్రామమునుండియు దానికి ప్రతినిధులు వచ్చిరి. వారు తమతమ గ్రామములకు తిరిగివెళ్లినపుడు నానిర్బంధమును

గురించియు, కాన్ఫరెన్సులోని క్రొత్తతీర్మానములను గురించియు వార్తలను ప్రజలకందజేసిరి. ఆ పదునారువందల మందియు పన్నులనిరాకరణమును బోధించు యుత్సాహపూరితులగు ప్రచారకులయిరి. కనుక నీవిధముగ నుద్యమముయొక్క ప్రారంభవిజయము నిశ్చయమయ్యెను. ఆప్రాంతములోని రయితులందరును మొత్తమీద ప్రారంభములో పన్నులను చెల్లింపరనుట కెట్టి సందేహమునులేదు. తగినంత భయమును కలిగించినగాని వారసలే చెల్లింపరు. ప్రభుత్వము యొక్కయు లేక జమీందారుల యొక్కయు దౌర్జన్య, భయోత్పాతములముందర వారెంతవరకు నిలువగలరో యెవరును చెప్పజాలరు.

మేము జమీందారులను, రయితులనుకూడ చెల్లింపవలదంటిమి. సిద్ధాంతరీత్యా యిదియొక తరగతికి సంబంధించిన సందేశముకాదు. ఆచరణవచ్చుసరికి చాలమంది జమీందార్లు తమరెవిన్యూ చెల్లించిరి. జాతీయపోరాటము యెడల సానుభూతికలవారుకూడ కొందరుచెల్లించిరి. వారిమీంద నెక్కువ వత్తిడిచేయబడెను. వారెక్కువ నష్టమును పొందుదురు. అయినను వ్యవసాయదారులు చెలింపక పన్నులనీయలేదు. కనుక మాయుద్యమము ఆచరణలో శిస్తుల నిరాకరణోద్యమ మయ్యెను. అది యలహాబాదు జిల్లానుండి రాష్ట్రములోని మరికొన్ని జిల్లాలకు వ్యాకిపోయెను. చాలజిల్లాలలో దానిని శాస్త్రీయముగ నమలుపరుపలేదు, లేక ప్రకటింపలేదు. కాని రయితులు శిస్తులను చెల్లింపలేదు; లేక చాలమంది ధరలనుతముగా పడిపోవుటచే . యెంతమాత్రమును చెల్లింపజాలకుండిరి. ప్రభుత్వమువారుగాని, పెద్దజమీందారులుగాని చాల నెలలవరకు తిరుగుబాటుచేసిన రయితాంగమును భయపెట్టుటకెట్టి తీవ్రచర్యను తీసికొనలేదు. శాసనోల్లంఘనముతో గూడిన రాజకీయ సంగ్రామ మొకవంకను, వ్యావసాయక దుర్భిక్షమును తెచ్చిపెట్టిన యార్థిక మాంద్య మొకవంకను నుండుటచే వారికి మన స్థైర్యము చిక్కలేదు.

ఈ రెండును నొకదానిలోనొకటి కలిసిపోయెను. ప్రభుత్వమెప్పుడును రయితాంగ తిరుగుబాటుకు భయపడుచుండెను. లండనులో రౌండు టేబిలు కాన్ఫరెన్సు జరుగుసమయమున హిందూదేశములో తమ కష్టములను పెంచుకొనుటకుగాని, మరింత యద్భుతప్రభుత్వ 'బల' ప్రదర్శనము చేయుటకుగాని ప్రభుత్వము పూనుకొనలేదు.

యు. పి. లోని పన్నుల నిరాకరణోద్యమమువలన యు. పి. కి సంబంధించి యంతవరకొక సుగుణము కలిగెను. అది మన సంగ్రామరంగమును పట్టణములనుండి పల్లెలకు మార్చెను. దీనివలన యుద్యమమునకు నూతనోత్తేజము చేకూరుటయేగాక దానికి మరింత విశాలమును, శాశ్వతమునగు పునాదియేర్పడెను. మన పట్టణప్రజల కలసటయు, విసుగుదలయు జనించినను, మధ్యతరగతి ప్రచారకులు చప్పబడినను యు. పి. లో నీయుద్యమ మెప్పటివలె బలముగనుండెను. దానికి మున్నెన్నడును కలగనిబలముకూడ కలిగెనని చెప్పవచ్చును. ఇతరరాష్ట్రములలో నిచ్చటజరిగినంతమార్పు (రాజకీయములనుండి యార్థికసమస్యలకును, పట్టణములనుండి పల్లెలకును) జరుగకపోవుటచే, పట్టణములే వీనిని నడుపుచు మధ్యతరగతులవారి యలసటచే నుద్యమమంతకంతకు క్షీణించుచుండెను. ఉద్యమములో మొదటనుండియు ప్రధానపాత్రను వహించిన బొంబాయివంటి మహానగరముకూడ కొంచెము చప్పబడుచుండెను. అచ్చటను, మరియితరచోట్లను అధికారధిక్కారమును, నిర్బంధములును సాగుచునేయుండెను. కాని యిదియంతయు కొంతకృత్రిమముగ కాన్పించెను. ఉత్సాహశక్తి నశించెను; ఇదియెంతయు సహజము. ఏలనన నొక విశిష్టస్థాయిలో ప్రజలను చిరకాలముంచుట యసాధ్యము. సాధారణముగా నిదికొన్ని రోజులు మాత్రమే సాధ్యమగును. కాని, శాసనోల్లంఘనములో దీనిని నెలల వరకును సాగించునట్టి యద్భుతశక్తి కలదు. తరువాతకూడ కొంచెము తక్కువ స్థాయిలో నది దీనినెంతకాలమయినను నడుపగలదు.

ప్రభుత్వ నిర్బంధము లధికమయ్యెను. ఇంతవరకును ఆశ్చర్య ముగా పనిచేసిన స్థానిక కాంగ్రెసు కమిటీలును, యువజనసంఘము లును అక్రమసంఘములుగ ప్రకటింపబడి యణచివేయబడెను. జయిళ్ళ లోని రాజకీయ ఖయిదీల సాదరణ మధ్యాహ్నముగనుండెను. జయిలు నుండి విడుదల యగుటతోడనే ప్రజలుతిరిగి రెండవశిక్ష ననుభవించు టకు జయిలుకు సిద్ధమగుచుండుట ప్రభుత్వమునకు మరింత కన్నెఱ్ఱగా నుండెను. శిక్షింపబడినను మోకరింపని యీధిక్కారము పరిపాలకుల నైతికాధిక్యతకు భంగముకలిగించెను. జయిలు నియమముల నుల్లం ఘించిరను కారణమున నవంబరు లేక డిసెంబరు ప్రథమవారములో (1930) యు. పి. జయిళ్ళలో కొందరిని కొరడాలతో మోదిరి. ఈవార్త నైనీజయిలులో మాకుచేరి మమ్ముకొంత కలతపెట్టెను. అప్పటినుం డియు (హిందూదేశములో జరుగుచుండు మరింత యధమములగు సంభ వములకువలెనే) దీనికిని మేమలవడి పోతిమి. అథమాథముడగు మొండికెత్తిన నేరస్తుని విషయములోగూడ కొరడాదెబ్బలు అనవసర శిక్షయనియే నాయభిప్రాయము. యువకులును, అభిమానధనులును అగువారికిని, నియమముల నుల్లంఘించిరను సాంకేతిక నేరములకును యిది కేవలము క్రౌర్యము. మాబార్కసులోనున్న నలుగురమును దీనిని గురించి ప్రభుత్వముకు వ్రాసితిమి. రెండువారములవరకు మాకెట్టి సమాధానమును రాకపోవుటచే నీక్రౌర్యమునకు గురియైన వారియెడల సానుభూతి చూపుటకును, కొరడాదెబ్బలశిక్షను నిరసించుటకును మే మొకమార్గమును తొక్క నిశ్చయించి మూడుశుష్కోపవాసములను 72 గంటలు చేయ సంకల్పించితిమి. ఉపవాసములు చేయుటకిదియొక లెక్కకాదు. కాని మాలోనెవరమును ఉపవాసముల కలవాటు పడ లేదు. మేము యీపరీక్ష కాగగలమో లేదో మాకే తెలియదు. నేనుయిరువదినాలుగు గంటలకుమించి యుపవాసము చేసి యెరుగను.

ఎట్టికష్టమును లేకుండగనే మేమాయుపవ్యాసమును నిర్వహించితిమి. అది నేనుభయపడినంతటి యగ్నిపరీక్ష కాదని తెలిసికొనుట నాకు సంతోష దాయకముగనుండెను. ఆయుపవాసకాలములో పరుగెత్తుట, గంతులిడుట మొదలగు నాకఠినపరిశ్రమను నేనతిమూర్ఖముగ నడిపితిని. అది నాకంతమంచిచేసినట్లు తోచదు. ఆమూడు రోజులలోను మేమందరమును యేడెనిమిది పౌనులబరువు తగ్గిపోతిమి. ఇదే, నైనీజయిలులో గతమాసములో మేమందరమును కోల్పోయిన పదిహేనులగాయితు యిరువదియారు పౌనులమీద కొసరు.

మాయుపవ్యాసములతో సంబంధములేకుండ కొరడాశిక్షలకు తీవ్రమగు వ్యతిరేకాందోళన బయట జరుగుచుండెను. తరువాత యు. పి. ప్రభుత్వము జయిలుశాఖవారికికముందెన్నడును అట్టికొరడా శిక్షల నీయవలదని యాజ్ఞాపించిరని విశ్వసించెదను. కాని యీ యాజ్ఞలు మారకుండ చిరస్థాయిగా నట్లుండునవికావు, అట్లుండలేదు. ఒకసంవత్సరముకాలము జరిగినతరువాత యు. పి. జయిళ్లలోను, యితర రాష్ట్రములలోను కొరడాశిక్షలకెట్టి కొదువయు లేకుండెను.

అప్పుడప్పుడు కలుగుచుండిన యీభయములుతప్ప మేము జయిలులో ప్రశాంత జీవితమును గడపితిమి. వాతావరణము మనోజ్ఞముగ నుండెను. ఏలనన అలహాబాదులో శీతకాలమతి సుఖదాయికముగ నుండును. రంజితపండిట్ మాబార్కునకొక మేరువువంటివాడు. అతడుతోటలను పెంచుటలో నారితేరెను. ఆ మాబోడి యావరణమంతయు వెంటనే పుష్పభరితమై రంగులతో నేత్రపర్వమొనర్చుచుండెను. అతడు ఆచిన్న పీలికలోనే కొద్దిలోనొకగోల్ఫుబంతి త్రోవను కూడ నేర్పాటుచేసెను.

మేము నైనీజయిలులోనుండగా మానెత్తిమీదనుండి పోవుచుండెడి వాయువిమానములు మాకొక వినోదముగ నుండెను. ప్రాక్ప

శ్చిమములకుపోవు మహావాయు మార్గములన్నింటికిని అలహాబాదు ఒక రేవుస్థలము. ఆస్ట్రేలియా, జావా, ఫ్రెంచియిండోచైనా మొదలగుచోట్లకుపోవు పెద్దపెద్ద విమానములన్నియు నైనీయొద్ద సరిగా మాతలలపై నుండి పోవుచుండును. బహువిమానములు వచ్చిపోవుచుండెడి డచ్చిదేశపు లైనరులన్నిటికంటెను గొప్పవి. ఒక్కొక్కప్పుడు, మేము దృష్టవంతుల మైనచో, నింకను చీకటియుండి నక్షత్రములుకాన్పించుచుండగనే యాశీతకాల ప్రభాతసమయములయందు యేవిమానమో మాకుకాన్పించుచుండెడిది. అది దీపములతో దేదీప్యమానముగ ప్రకాశించుచుండెడిది; రెండుకొనలను రెండు రక్తారుణ దీపములుండెడివి. ఉషఃకాల విసీలాంకాశవీధి నదిపయన మగునప్పు డాదృశ్య మతి మనోహరముగ నుండెడిది.

మరియొక జయిలునుండి పండిత మదనమోహన మాలవ్యకూడ నైనీజయిలుకు మార్చబడెను. అతనిని ప్రత్యేకముగ మరియొకచోట నుంచిరి. కాని మేమతనిని నిత్యముచూచుచుండెడివారము. బహుశః నేనుబయట నున్నప్పుడుకంటె జయిలులోనే యతని నెక్కువగచూచితిని. అతడతి యుత్సాహవంతుడైన చెలికాడు. చైతన్యభరితుడు; యౌవనోత్సాహముతో ప్రతివిషయమందును శ్రద్ధతీసికొనువాడు. రంజితు యొక్క సహాయముతో నతడు జర్మనుభాషను నేర్చుకొన నారంభించెను. అతడద్భుతమగు జ్ఞాపకశక్తిని చూపెను. కొరడాదెబ్బలవార్త వచ్చినప్పుడతడు నైనీలోనేయుండెను. అతనియొడలు జలదరించెను. అతడు వెంటనే రాష్ట్రముయొక్క తాత్కాలిక గవర్నరుకు వ్రాసెను. తరువాత నతనికి జబ్బుచేసెను. జయిలులోనున్న పరిస్థితులలో నతడు చలిని భరింపలేక పోయెను. అతనివ్యాధి ముదిరెను. అతనినిపట్టణములో నున్న ఆస్పత్రికిమార్చి, తరువాత శిక్షపూర్తికాకమునుపే విడిచిపెట్టిరి. అదృష్టవశమున నతనికి ఆస్పత్రిలో స్వస్థతచేకూరెను.

†

1931 జనవరి యొకటవ తేదీ, ఇంగ్లీషు సంవత్సరాదిపండుగ, మాకు కమలనిర్బంధవార్తను ప్రసాదించెను. నేనుసంతోషించితిని. ఏలనన యామె తనచెలికత్తె లనేకమందితో జయిలుకు పోవలెనని తహతహ లాడుచుండెను. సాధారణముగ నామెయు, నాచెల్లెలును, మరియనేకమంది స్త్రీలును పురుషులే యైనచో చిరకాలముక్రిందటనే నిర్బంధింపబడి యుండెడివారు. కాని యాసమయమున ప్రభుత్వము వారు సాధ్యమైనంతవరకు స్త్రీలను నిర్బంధించుట కిష్టపడకపోవుటచే వారింతకాలము పయిన మిగిలియుండిరి. ఇప్పటికి యామెకోర్కె నెరవేరెను! దీనికామె యెంతయో యానందించి యుండవలెను అని నేననుకొంటిని. కాని యామెయనారోగ్యస్థితికి నేనుభయపడుచుంటిని. జయిలు పరిస్థితులు ఆమెకుమరింత బాధనుకలిగింపవచ్చుననినాభయము. ఆమె నిర్బంధింప బడినపుడొక పత్రికాప్రతినిధి యామెనేదేని సందేశమీయ గోరెను. ఆవేడిలో నామె యనాలోచితముగ తననిజస్వభావమును తెలుపునొకచిన్న సందేశమునిచ్చెను. "నాకిపుడపారమగుసంతోషము కలుగుచున్నది. నాభర్తపదకమలముల ననుసరించినందులకు నేనెంతయు గర్వించుచున్నాను. ప్రజలు మనజెండా నెగురవేసి యుంచెదరని నేనాశించెదను." బహుశః ఆమెకొంచెము యోచించినచో నావిధముగ చెప్పియుండెడిదికాదు. ఏలనన నామె స్త్రీలహక్కులకొరకు పురుషుని నిరంకుశత్వమునెదుర్చు యోద్ధగా తనను భావించుకొనుచుండెడిది. కానియానిమిషమందు యామెలోనున్న భారతసతీత్వము పైకుబుకుటచే పురుషుని నిరంకుశత్వముకూడ మఱచిపోబడెను.

మాతండ్రి కలకత్తాలోనుండెను. అతనికెంతమాత్రమును స్వస్థత చేకూరలేదు. కాని కమలనిర్బంధింపబడెననియు, శిక్షింపబడెననియు వినుటతోడనే మాకేమకంపించి యలహాబాదు తిరిగివచ్చుటకు నిశ్చయించెను. మాచెల్లెలు, కృష్ణను, వెంటనే అలహాబాదుపంపించి కొద్దిరోజు

లయిన తరువాత నతడు తక్కిన కుటుంబముతో వచ్చెను. జనవరి 12 వ తేదీని యతడు నన్ను చూచుటకు వచ్చెను. రెండు నెలలయిన తరువాత నేనతనిని చూచితిని. నాకుకలిగిన దుఃఖమును నేనతికష్టముమీద నాపు కొనగలిగితిని: అతని రూపమువలన నాకు కలిగిన విచారమతనికి తెలియనట్లే కాన్పించెను. కలకత్తాలో నున్నప్పటికంటె తానిపుడు చాలయారోగ్యముగ నున్నట్లతడు నాతో చెప్పెను. అతనిముఖముఉబ్బి యుండెను. ఇది యొక తాత్కాలిక కారణముచే వచ్చినట్లతడు భావించు చున్నట్లు కాన్పించెను.

అతని యాముఖము నన్ను విడిచి పెట్టలేదు. అందు అతని పోలికయే లేకుండెను. సమీపములో నతనికి అపాయము రానున్నదను భయము నాలో తొలిసారి ప్రవేశించెను. ఆరోగ్య, బలములతని సొత్తులని నేనెప్పుడును భావించు చుండెడివాడను. అతనికి మృత్యువు వచ్చునని నేను చింతింపజాలకుంటిని. అతడెప్పుడును మృత్యుభావమును నిర్లక్ష్యముచేయుచు, దానిని పరిహాసము చేయుచు తాను చిరకాలము జీవింపదలచుకొంటినని చెప్పుచుండెడివాడు. తరువాత తరువాత నతని బాల్య స్నేహితు డెన్నడెనను చనిపోయినచో నతడొంటరిగనున్నట్లును, తానొక్కడే క్రొత్తవారిమధ్య విడువబడినట్లును భావించు చుండినట్లు, నేనుకనిపెట్టితిని. మృత్యువాసన్నమయ్యెనను సూచన కూడ కాన్పించెడిది. కాని సాధారణముగ నీకలుషభావము మాయమయి పొంగిపొరలుచుండు నతని చైతన్యసంపద విజృంభించుచుండెడిది. అతని కుటుంబములోని మేమందరమును మూర్తీభవించిన యతని గుణగణములచేతను, విశాలప్రేమచేతను, బంధింపబడితిమి. అతడు లేని ప్రపంచమును భావించుటమాకు దుష్కటముగ నుండెను.

అతని యాదృష్టి నన్ను బాధింప దొడగెను. నామనస్సు దుష్టుల పూరిత మగుచుండెను. అయినను సమీపములో నతనికెట్టి యుపద్రవ

మును కలుగ దనుకొంటిని. నామట్టుకు నేను (అప్పుడే) యేకారణము ననో అనారోగ్యముగ నుంటిని.

అవి మొదటి రౌండు టేబిలు కాన్ఫరెన్సుయొక్క అవసానదినములు. చివరచేసిన సూచనలు, ప్రగల్భములు మాకుకొంచెము వినోదముగనే (మావినోదములో కొంతనిరసన లేకపోలేదు.) యుండెను. ఆయుపన్యాసములు, ఆశ్రీరంగనీతులు, ఆచర్చలు అసత్యములుగను, వ్యర్థములుగను కాన్పించెను. కాని, యొక్క సత్యముమాత్రము ఆచంద్రార్కము నిలబడెను! మనభరతమాత దుర్భరమగు నగ్నిపరీక్షకాహుతియగుచున్న సమయమునను, మనపురుషులును, నారీరత్నములును అత్యద్భుతముగ ప్రవర్తించినపుడునుకూడ మనపోరాటమును నిర్లక్ష్యముచేసి, తమనైతికబలమును యెదిరిపక్షమున కర్పించు మనదేశస్థులు కొందరున్నారను సంగతి విదితమయ్యెను. జాతీయతయను మోసభూయిష్టమగు నాచ్ఛాదనక్రింద పరస్పర విరుద్ధములగు నార్థికప్రయోజనము లెట్లు పనిచేయుచున్నదియు, నీజాతీయత పేరనే పెట్టుబడిదారులైనవారు వీటిని భవిష్యత్తుకుగూడ దాచియుంచుకొనుట కెట్లు ప్రయత్నించుచున్నదియు మునుపెన్నడును విశదముకానట్లు యిప్పుడు స్పష్టమయ్యెను! రౌండు టేబిలుసభ యీపెట్టుబడిదారులయొక్క సమూహము. వారిలో చాలమంది పోరాటము నెదిర్చిరి. కొంతమంది కిక్కురుమనకుండ చూచుచుండిరి. అయినప్పటికిని వారు అప్పుడప్పుడు "కళ్ళు వప్పగించి కనిపెట్టిచూచువారుకూడ శ్రీరకలే" యను సామెతను జ్ఞప్తికి తెప్పుచుండిరి. కాని లండను కనుసైగ చేయుటతోడనే యీ కనిపెట్టియుండుకాలము హఠాత్తుగా పలాయనమయ్యెను. వారు తమ ప్రత్యేక ప్రయోజనములను భీమాచేయించుకొనుటకును, యింకను లభ్యమగు దొళ్ళదోపుడు బేరముండిన దానిలో పంచుకొనుటకును గుభాలున బయలుదేరిరి. కాంగ్రెసు అంతకంతకు యెడము

ప్రక్కకు పోవుచున్నదనియు, ప్రజలకు దాని పైపలుకుబడి యంతకం తకు హెచ్చుచున్నదనియు గుర్తించుటచే మరింతత్వరితముగ నీపటాల మంతయు లండనులో బారులు తీరెను. హిందూదేశములో కూలంకషమైన రాజకీయమార్పు కలిగినచో ననేకవిధములగు ప్రజలు అధికారమునకు వత్తురనియు లేదా వారికి ప్రాధాన్యత కలుగుననియు, వారు విధాయకముగ విప్లవకరములగు సాంఘికమార్పులను ప్రోత్సహించెదరనియు, కనుక తమప్రయోజనముల కదియరిష్టమనియు సహజముగ భావింపబడెను. హిందూదేశములోని స్వలాభపరులుకూడ నీయవకాశమునుండి (వారికి భయంకరమైనది) వెనుకకుజారిరి. ప్రస్తుత సాంఘిక నిర్మాణమును, ప్రస్తుతమున్న పెట్టుబడి దారులను రక్షించుటకును బ్రిటిషువారిచ్చట నుండవలెననియే వారికోరిక. డొమినియను పరిపాలన కావలెనని పట్టుబట్టుటలోనున్న భావార్థమిదియే. గ్రేటు బ్రిటనుతో రాజీకి ప్రధానభాగముగా హిందూదేశమునుండి వెంటనే యాంగ్లసైన్యము వెడలిపోవలెననియు, భారతసైన్యము భారతప్రజా స్వామిక వశములో నుండవలెననియు నేను నొక్కిచెప్పినప్పుడు ఒక సుప్రసిద్ధ భారతలిబరలు నాయకుడు నాపైమండిపడి, బ్రిటిషుప్రభుత్వమువారు దీనికొప్పుకొనిననుకూడ తాను తనశక్తికొలది దీనినెదిర్చెదనని సెల విచ్చెను! ఎట్టిజాతీయ స్వాతంత్ర్యమున కైనను ప్రధానమగు నీప్రాతిపదిక (అది ప్రస్తుత పరిస్థితులలో దుస్సాధ్యమను కారణముకుగాక) యనవసరమని తాను తలంచెనుగనుక నతడు దాని నెదిర్చెను. విదేశీయులు దాడివత్తురను భయము దీనికి కొంతకారణమనియు, బ్రిటిషు సైన్యము మనలనట్టి దాడినుండి కాపాడవలెనని యతడు కోరుచున్నాడనియు ననుకొనవచ్చును. దాడివచ్చుగాక! రాకపోవుగాక! మగతనమున్న యేభారతీయునికైనను బయటవాని రక్షణకోరుట! అనుభావము హేయముగనుండును. కాని భారతదేశములో బ్రిటిషువారుండవలెనని కోరుటకు యథార్థమైన కారణమిదియని నేను తలంపను. భారతీయు

లకు వ్యతిరేకముగా నిష్కళంకమైన భారత ప్రజాస్వామికమునకు వ్యతిరేకముగా, ప్రజలయభివృద్ధికి వ్యతిరేకముగా భారతపెట్టుబడిదారుల ప్రయోజనములను కాపాడుటకే బ్రిటిషువారు కోరబడుచుండిరి. కనుక రౌండుటేబిలు సభలోని భారతప్రతినిధులలో అభివృద్ధి నిరోధకులును, కులతత్వవాదులును మాత్రమేగాక నభివృద్ధివాదులును, జాతీయవాదులును అని పిలుచుకొనువారుకూడ తమకును బ్రిటిషు ప్రభుత్వమునకును మధ్య చాలసామ్యమున్నదని కనుగొనిరి. స్వాతంత్ర్య పోరాటములో జయిలుకు వెళ్ళినవారిని, మాజయిలర్లతో చేతులుకలిపి బారులుతీరి, సమాననీతిని గురించి చర్చించుకొనువారినికూడ జాతీయత యిమిడ్చుకొనునెడల నట్టిజాతీయ స్వర్గముక్రిందకు రానిదేముండును! ఇంకొకవిధమగు ధైర్యమైన జాతీయవాదులున్నారు. వీరిపలుకు గంగాప్రవాహము వలె ప్రవహించును. వీరు అన్నివిధముల స్వదేశీని ప్రోత్సహింతురు; స్వరాజ్యసారమిచ్చుటనే యున్నదని బోధింతురు; త్యాగముచేసియైనను దీనిని సాధించవలెనని వీరుతమదేశస్థులను హెచ్చరింతురు. అదృష్టవశాత్తు యీ యుద్యమములో వారికెట్టి త్యాగమునులేదు. అదివారివ్యాపారములను వృద్ధిచేసెను. వేలకొలదిమంది జయిళ్లకుపోయినప్పుడులేక లాఠీకి గురియగుచున్నప్పుడు వీరు తమఖజానా పెట్టెలయొద్దకూర్చుని తాపీగా సొమ్ములెక్కించుకొనుచుండిరి. తరువాత, తీవ్రజాతీయత కొంచెము సాహసముగా కాన్పించినప్పుడు వీరు తమయుపన్యాసములలోని జోరునుతగ్గించి యతివాదులను నిరసింపనారంభించి, యెదిరిపక్షము వారితో నొడంబడికలు, సంధులు చేసికొనిరి.

రౌండుటేబిలు కాన్ఫరెన్సు యేమిచేసెనో మేమునిజముగా గుర్తింపలేదు; లక్ష్యముచేయలేదు. అదితీరములను దాటినయసత్య విషయము; కేవల ఛాయాస్వరూపము, పోరాటమంతయు నిచ్చటనే

మనపట్టణములందును, పల్లెలందును కలదు. మాపోరాటము త్వరలోనే యంతమగుననుభ్రమకుండ మాకులేదు; ముందురానున్న యుపద్రవముల భీతియునులేదు. 1930నాటిసంభవములు మాజాతీయశక్తిసంపదలందును, ధైర్యస్థైర్యములందును మాకుతగిన విశ్వాసమును కలిగించెను. ఆవిశ్వాసముతోనే మేముభవిష్యత్తు నెదుర్కొంటిమి.

డిసెంబరు లేకజనవరి ప్రథమములో జరిగిన యొకవిషయము మాకుచాలబాధను కలిగించెను. శ్రీనివాసశాస్త్రిగారు ఎడింబరోలో నుపన్యసించుచు భారతదేశములోని శాసనోల్లంఘనములో జయిలుకు పోవుచున్నవారిని గురించి దూషణగా మాట్లాడెను. ఆయుపన్యాసమును, ముఖ్యముగా నాసమయమును మమ్ముచాలబాధించెను. మాకును శ్రీనివాసశాస్త్రిగారికిని రాజకీయములలో చాలవ్యత్యాసమున్నను మేమాయనను గౌరవించితిమి.

రామ్సేమాక్డొనాల్డుగారు తనమామూలు సౌభ్రాత్రృత్వపు పలుకులతో కొండు టేబిలుసభనుముగించెను. తనదుష్టపద్ధతులను మానుకొని యీయానందకూటములో జేరవలెనని కాంగ్రెసును హెచ్చరించునట్టి భావమందులో ద్యోతకమగుచుండెను. సరిగా నాసమయముననే 1931 జనవరి 15 వ తేదీ ప్రాంతమున—అలహాబాదులో కాంగ్రెసువర్కింగు కమిటీ సమావేశమయ్యెను. ఇతర విషయములతోపాటు యీయుపన్యాసమును, హెచ్చరికయుచర్చింపబడెను. నేనప్పుడు నైనీజయిలులోనుంటిని. నేను విడుదలయైనతరువాత నీ విషయమును తెలుసుకొంటిని. తండ్రిగారు కలకత్తానుండి యప్పుడే తిరిగివచ్చిరి. అతనికిచాల సుస్తిగానున్నను సభ్యులందరును తనప్రక్కచుట్టునుచేరి యీవిషయమునచ్చటనే చర్చింపవలెనని యతడు పట్టుపట్టెను. శాసనోల్లంఘనమునుతగ్గించి మాక్డొనాల్డుగారికొక సూచనయీయవలసినదని యెవరో యొకసూచనచేసిరి. తండ్రిగారికి దీనివలన చాలయుద్రేకముకలిగెను. అతడ్డుతట్లాలున లేచి

ప్రక్కమీద కూర్చుని జాతీయలక్ష్యము చేకూరువరకు తానురాజీపడ జాలననియు, తానొక్కడేమిగిలియున్నను పోరాటమును నడిపెదననియు గర్జించెను. ఈయుద్రేక మతనికి చాలహానికరమయ్యెను. జ్వరమువెంటనే పొంగుటచే డాక్టర్లు అచ్చటనున్నవారినందరిని పంపించివేసి యతని నొక్కనిని విడిచిపెట్టిరి.

చాలవరకు అతనిపట్టుదలచేతనే వర్కింగుకమిటీవారు యెట్టి రాజీ లేని యొకతీర్మానమును చేసిరి. ఇదిప్రకటింపబడకపూర్వము సర్ తేజబహదరుసప్రూ, శ్రీనివాస శాస్త్రిగార్లయొద్దనుండి తండ్రిగారికొక కేబిలువచ్చెను. వారిరువురును వచ్చిచర్చించువరకును యెట్టినిశ్చయమును చేయవలదని తండ్రిగారిద్వారావారు కాంగ్రెసునుకోరిరి. వారప్పుడే మార్గములోనుండిరి. వర్కింగుకమిటీతీర్మాన మొకటి యదివరకే చేయ బడెననియు, కానిసప్రూ శాస్త్రిగార్లువచ్చి చర్చించువరకు నదిప్రకటింప బడదనియు జవాబు యివ్వబడెను.

జయిలులోనున్న మాకుయీవిషయము లేవియు తెలియవు. కాని యేదోకొంత కుంభకోణము జరుగుచున్నదని తెలిసి మేముబాధపడితిమి! జనవరి26వ తేదీ! స్వాతంత్ర్యప్రథమవార్షికదినము! ఈయుత్సవ మెట్లు జరుపబడును! అనుభావములే మమ్మాక్రమించెను. ఈయుత్సవముజరుప బడెననియు, దేశమంతటను బహిరంగసభలు జరుపబడెననియు, నాసభ లలో స్వాతంత్ర్యతీర్మాన మామోదింపబడెననియు, “జ్ఞాపకముచేయు తీర్మానము” * అనబడు నట్టితీర్మానమే మరియొకటి చేయబడె ననియు మేముతరువాతవింటిమి. ఈయుత్సవ మతిచమత్కారముగ జరుపబడెను. వార్తాపత్రికలుకాని, అచ్చుఆఫీసులుకాని లభ్యము కావయ్యెను. ఇక టెలిగ్రాములుగాని, పోస్టుఉత్తరములుగాని చేరకుం డెను. అయినను దేశమంతటను అన్నిరాష్ట్రభాషలలోను నొకేయర్థ

* ఈతీర్మానము 3 వ అనుబంధములో కలదు.

నిచ్చుతీర్మానము పట్టణములలోను, పల్లెలలోను, ఒకేకాలమందు చేయబడెను. ఈసభలన్నియు చాలవరకు శాసనమును ధిక్కరించియే జరుపబడి పోలీసులచే బలవంతముగా తరిమివేయబడెను.

గతించిన సంవత్సరమును గురించియు రానున్న సంవత్సరమును గురించియు చింతించుచు నైనీజయిలులోనుండగా జనవరి 26 వచ్చెను. మాతండ్రిగారిస్థితి చాలకష్టముగా నున్నదనియు నేనుయింటికి వెళ్ల వలెననియు నకస్మాత్తుగా నాకాప్రాతఃకాలమున నెవరోచెప్పిరి. పరిశోధనచేయగా నన్నువిడిచిపెట్ట నున్నట్లు తెలిసికొంటిని. నాతోరంజితుకూడ వచ్చెను.

ఆసాయంత్రమే భారతదేశమంతటను వివిధజయిళ్లనుండి యనేక మంది విడుదలయైరి. వీరందరును కాంగ్రెసు వర్కింగు కమిటీయొక్క అసలుసభ్యులును, వారిస్థానీయులును. మేమందరమును కలుసుకొని పరిస్థితులను యోచించుటకు ప్రభుత్వముమాకొక యవకాశము నిచ్చుచున్నది. ఆసాయంకాలమెట్లయినను నన్నువిడిచెడివారే. తండ్రిగారిస్థితి వలన నేనుమరికొన్ని గంటలు ముందువిడువబడితిని! 26 రోజులు జయిలు జీవితము ననుభవించినతరువాత కమలకూడ నాదినమందే లక్నో జయిలునుండి విడువబడెను. ఆమెకూడ వర్కింగుకమిటీయొక్క (స్థానీయముగా వచ్చిన) సభ్యురాలు.

---

# 33

## మాతండ్రిగారి నిర్యాణము.

—⟡)O(⟡—

నేనుతండ్రిగారిని రెండువారములైన తరువాత కలుసుకొంటిని. జనవరి 12 వ తేదీని ఆయననన్ను నైనీలో కలుసుకొనినపుడు అతని రూపము నాకు భయంకరముగ నుండెను. ఇప్పుడది మరింత చెడి పోయెను. ముఖము మరింత యుబ్బిపోయెను. మాటాడుటకూడ కొంత కష్టముగనేయుండెను. అతడుమనసులోనున్నది చెప్పలేకపోవుచుండెను. కాని యతని వెనుకటియిచ్ఛాశక్తిమాత్రము కొరవడలేదు. ఇదియే మనశ్శరీరములను రెంటిని పట్టియుంచి పనిచేయించుచుండెను.

అతడురంజితును, నన్ను చూచి సంతోషించెను. ఒకటిరెండు రోజులయిన తరువాత రంజితును (అతడువర్కింగుకమిటీ సభ్యుడుకాడు) నైనీజయిలుకు తీసికొనిపోయిరి. ఇదితండ్రిగారికి కష్టముగ నుండెను. అతడు నిరంతరము రంజితుకొరకు ప్రశ్నించుచుండెను. భారతదేశము లోని యనేకచోట్లనుండి తన్ను చూచుట కనేకులుందివచ్చుచుండగా తనయల్లుని నేలదూరము చేయవలెనని యతడనుచుండెడివాడు. ఈ పలవరింతలవలన డాక్టర్లకు విసుగుకలుగుచుండెను; దానివలన నతని కేసుగుణమును కలుగుటయునులేదు. డాక్టర్లసూచనలచే మూడు నాలుగు రోజులయినతరువాత యు. పి. ప్రభుత్వమువారు రంజితును విడిచిపెట్టిరి.

జనవరి 26 వ తేదీనే, నన్నువిడిచిపెట్టిన రోజుననే, గాంధీజీని కూడవిడిచిపెట్టిరి. అతనిని అలహాబాదులో నుంచవలెనని నేనాతురపడు చుంటిని. అతనివిడుదలనుగురించి నేనుతండ్రిగారికి చెప్పినపుడతడుకూడ గాంధీజీని చూడగోరుచున్నట్లు తెలిసికొంటిని. మరునాడే గాంధీజీ

బొంబాయినుండి (మున్నెన్నడునుయెరుగనట్టి బ్రిహ్మాండమగు నాహ్వాన సభయైనతరువాత) బయలుదేరి రాత్రిపొద్దుపోయినతరువాత అలహాబాదు చేరెను. తండ్రిగారతనికొరకు యెదురుచూచుచు మేల్కొనియే యుండిరి. అతనియునికియు, నతడుమాట్లాడిన కొద్దిమాటలును తండ్రిగారి కద్భుతమగు మనశ్శాంతిని కలిగించెను. అతనిరాకవలన మాతల్లికి కూడ నూరటయు, శాంతియు చేకూరెను.

విడిచిపెట్టబడిన వర్కింగుకమిటీ సభ్యులందరును, అసలువారును, స్థానీయులునుకూడ, మీటింగుకు సంబంధించిన యాదేశములకొరకెదురు చూచుచుండిరి. వారిలో చాలమంది తండ్రిగారికొరకావేదన పడుచు అలహాబాదు రావలెననుకొనుచుండిరి. కనుక అలహాబాదులోనే వెంటనే సభకావింప నిశ్చయింపబడెను. రెండురోజులయినతరువాత ముప్పది, నలుబదిమందివచ్చిరి. వారిసభలు స్వరాజ్యభవనములో (మాయింటిప్రక్క) జరిగెను. ఆసభలకు నేనప్పుడప్పుడు వెళ్లుచుంటిని. కానినేనువాటిలో నెట్టిముఖ్యభాగమును తీసికొన జాలకపోతిని. అచ్చట జరిగిన తీర్మానములుకూడ నాకిప్పుడెంతమాత్రమును జ్ఞాపకములేవు. అవి శాసనోల్లంఘనమును విరమింపరాదనియే తీర్మానించెనని నేసను కొనెదను.

వచ్చిన పాతస్నేహితులును, సహచరులును చాలమంది క్రొత్తగా జయిలునుంచివచ్చి మరలవెంటనే పోవుటకు సిద్ధపడుచున్న వారును తండ్రిగారినిచూడగోరిరి. వారుబహుశః ఆఖరిచూపుచూచి, కడసారిసెలవుగైకొనవచ్చిరి. వారిద్దరు ముగ్గురు చొప్పున యుదయ, సాయంకాలములయందు వచ్చుచుండిరి. తనపాత సహచరులను గౌరవించుటకు పడకకుర్చీలో కూర్చొనెదనని తండ్రిగారు పట్టుబట్టిరి. అతడందులో నొకముద్దవలె, నోటమాటలేకుండ కూర్చొనెను; ముఖము మీదకాన్పించినయుబ్బువలన నెక్కువ మాట్లాడుట కవకాశములేకుం

డెను. కానిగొంక పాతస్నేహితునితరువాత మరియొకండును, నొకనితరువాత మరియొకడుమువచ్చి వెళ్లుచుండ నతనినేత్రములు ప్రకాశించుచు వారినిగుర్తించుచుండెను. అతనిశిరము కొంచెమువంగెడిది. చేతులు నమస్కారపూర్వకముగ కలుసుకొనెడివి. అతడంతగా మాట్లాడలేకపోయినను అప్పుడప్పుడు కొద్దిమాటలు చెప్పెడివాడు. అప్పుడుకూడ నతని పూర్వపుహాస్యము ద్యోతకమగుచుండెను. అతడెక్కడ మృత్యుఘాతమునొంది, శరీరబలమంతయు నుడిగిన యొక వృద్ధమృగరాజమువలె కూర్చొనెను. కానియతనిరాజకీవి, రాజదర్పము తగ్గలేదు. నే నతని పరీక్షించి చూచునపుడతని తలలోనేమిభావములు కలుగుచున్నవో కదా! యని యాశ్చర్యపడెడివాడను.

అతనికి మన కార్యక్రమములలో నుత్సాహము సడలెనా? అతడు తఱుచు తనలో తానే పోరుచుండెను; అతనివశమునుండి పారిపోవ నుంకించుచున్న విషయములను జయింప యత్నించుచుండెను. చివరవరకు నీపోరాటము జరుగుచునేయుండెను. అతడు తనసృష్టినుపీడలేదు. అప్పుడప్పుడు మాతోనతడతిస్పష్టముగ మాట్లాడుచుండెడివాడు. గొంతుగుబాధచే నతడుచెప్పునది మనకర్థము కాకుండినప్పుడుకూడ కాగితపుముక్కలమీదవ్రాసి తనభావములను వెల్లడించెడివాడు.

అతడు తన యింటిప్రక్కనే జరుగుచుండిన వర్కింగుకమిటీ సభలలో నెట్టిశ్రద్ధను తీసికొనలేదు. పదిహేను రోజులక్రితము అవియతనికుతూహలమును కలిగించెను. ఇప్పుడు తానువాటన్నిటికిని చాలదూరములో నున్నట్లు భావించుచుండెను. "మహాత్మాజీ నేను త్వరలో వెళ్ళిపోవుచున్నాను. స్వరాజ్యమును చూచుటకు నేనిచ్చట నుండజాలను. కాని నీవుదానిని జయింతువని నేనెరుగుదును. త్వరలోనే నీకదిహస్తగతమగును." అని యతడు గాంధీజీతోననెను.

ఇతర పట్టణములనుంచియు, రాష్ట్రముల నుంచియు వచ్చిన వారిలో చాలమంది వెడలిపోయిరి; గాంధీజీయుండెను. దగ్గరబంధువులును, కొద్దిమంది ప్రియమిత్రులును, అతనిచిర మిత్రులును, సుప్రసిద్ధ డాక్టర్లును నైనడాక్టరు అన్సారీ, బిధానుచంద్రరాయి, జీవరాజ మెహతగార్లును ఉండిరి. ఫిబ్రవరి నాల్గవతేదీ యుదయము అతనికి కొంచెము సుఖువుగనున్నట్లు కాన్పించెను. ఈయవకాశమును గైకొని యతనిని లక్నోతీసికొని వెళ్ళుటకు నిశ్చయించిరి. అలహాబాదులోలేని యెక్కుడు చికిత్స కక్కడ అవకాశములుండెను. ఆరోజుననే మోటారులో నతనిని తీసికొనివెళ్ళితిమి. గాంధీజీ మొదలగువారు చాలమంది మాతో కూడ వచ్చిరి. మేము చాలనెమ్మదిగనే వెళ్ళినను అతనికియలసట కలిగెను; మరునాడు అలసట తగ్గుచున్నట్లు కాన్పించెను. అయినను కొన్ని యశుభలక్షణములుండెను. మరునాడు ప్రాతఃకాలమున, ఫిబ్రవరి యారవతేదీని, నేనతని ప్రక్కయొద్దనుండి పరిశీలించు చుంటిని. రాత్రి యతడు చాలబాధపడి విశ్రాంతిలేకయుండెను. అతనిముఖము శాంతి నొందినట్లును, పోరాట చిహ్నము లేవియులేనట్లును నేనకస్మాత్తుగా కనుగొంటిని. అతడు నిద్రించెనని నేననుకొని దానికి సంతసించితిని. కాని మాతల్లిచూపులు నిశితములగుటచే నామెకెవ్వన కేకవేసెను. నేనామెవైపు తిరిగియతడు నిద్రించెను, కనుక నిశ్శబ్దముగ నుండమని యామెను బ్రతిమాలుకొంటిని. కాని యానిద్రయతని చివరనిద్ర; చిరనిద్ర. దానినుండి లేచుటయనునది యికనుండజాలదు.

ఆరోజుననే మేమతని శరీరమును మోటారులో అలహాబాదు తీసికొనివచ్చితిమి; నేనందులో కూర్చుంటిని. రంజితుదానిని నడిపించెను. తండ్రిగారి కిష్టుడగు హరియను స్వంతనౌకరుకూడ నుండెను. మావెనుక మాతల్లియు, గాంధీజీయునుకల మరియొక మోటారువచ్చెను. తరువాత తక్కినకారులు వచ్చెను. ఆరోజంతయు తలదిమ్ముగానుండి యేమి

జరుగుచుండెనో నాకు తెలియకుండెను. వరుసగా జరుగుచుండిన సంభవములును; పెద్దపెద్ద గుంపులును నేను ఆలోచించుకొనుటకు వీలులేకుండ చేసెను. కొద్దికాలములో లక్నోలో వేలకొలది జేరిరి. శవము ప్రక్కన కూర్చుని అలహాబాదు పరుగులో జేరుకొంటిమి. శవము మనజాతీయ పతాకముతో చుట్టపెట్టబడెను. పైనయొక పెద్ద జాతీయపతాకము యెగురుచుండెను. అలహాబాదు జేరితిమి. మైళ్ళకొలది బారులు తీరి జనులు అతనిని స్మరింపవచ్చిరి. ఇంటియొద్ద కొన్ని శ్రాద్ధవిధులుండెను. తరువాత పెద్దజనప్రవాహముతో గంగానదికి ప్రయాణమైతిమి. నది యొడ్డున ఆశీతకాలదినమున, సాయంత్రమగుచుండ నగ్నిజ్వాలలు పైకెగయుచు నతనిదగ్గర బంధువులమైన మాకును, హిందూదేశములోని కోట్లకును ప్రియతమమైన యాశరీరమును దహించివేసెను. గాంధీజి జనసమూహమునకు కంటతడిపెట్టునట్టి కొద్దివాక్యములను చెప్పెను. తరువాత మేమందరమును యిండ్లకుపోతిమి. మేమొంటరిగా విచారగ్రస్తులమై తిరిగివచ్చునరికి నక్షత్రములు గగనవీధికెగబ్రాకి ప్రకాశమానముగ వెలుగొందుచుండెను.

మాతల్లికిని, నాకును వేలకొలది సానుభూతి యుత్తరములు వచ్చెను. ఇర్విన్ప్రభుదంపతులుకూడ మాతల్లికి యుదారమగు సందేశమునంపిరి. ఈయద్భుతమగు సానుభూతియు ప్రేమయు మావిచారములోని బాధనుకొంత తగ్గించెను. కానియత్యద్భుతముగా, దుఃఖములను, విచారములను పోగొట్టగల గాంధీజీయొక్క యునికియే యన్నిటికంటె నెక్కువగా మాతల్లిని, మాకుటుంబమును మాజీవితములలోని యా విషమావస్థ నుండి తరింపజేసెను. అతడు గతించెనని గుర్తించుట నాకు కష్టముగనే యుండెను. మూడు మాసము లైనతరువాత నేను నాభార్యతోను, కుమార్తెతోను సింహళములో నుంటిని. మేమునువరా ఎలియా యనుచోటప్రశాంతమును, విశ్రాంతియుతమును నగు కొద్ది

రోజులు గడుపుచుంటిమి. ఆ ప్రదేశము నాకెంతయు నాహ్లాదకరముగ నుండెను. అది తండ్రిగారికి చాల బాగుగనుండునని నాకకస్మాత్తుగా తట్టెను. అతనికొరకెందుకు పంపకూడదు? అతడు చాల యలసి యుండును. కనుక విశ్రాంతి యతనికి శ్రేయస్కరముగ నుండును. నేనతనికి అలహాబాదు టెలిగ్రాము యిచ్చుటకు కూడ సిద్ధమైతిని.

మేము సింహళమునుండి అలహాబాదు తిరిగి వెళ్లిన తరువాత నొకనాడు పోస్టులో నొక చిత్రమగు యుత్తరము వచ్చెను. పైకవరు మీద తండ్రిగారి వ్రాతలో నాచిరునామా వ్రాయబడి యుండెను. దాని మీద ననేక పోస్టుఆఫీసుల ముద్రలును, లెక్కలేనన్ని యితర చిహ్నములును యుండెను. ఆశ్చర్యముతో నేను దానిని విప్పితిని. అది నిశ్చయముగా మాతండ్రిగారి యొద్దనుండి వచ్చిన యుత్తరమే! కాని యది ఫిబ్రవరి 28/1926 సంవత్సరములో వ్రాయబడెను. అది నాకు 1931 సంవత్సర వేసవికాలములో నంద చేయబడెను. కనుక నది యయిదున్నర సంవత్సరములు ప్రయాణము చేసెను. 1926 లో నేను కమలతో యూరపు వెళ్లునపుడు మాతండ్రిగారు అహమ్మదాబాదునుండి నాకాయుత్తరమును వ్రాసిరి. మేము ప్రయాణము చేయుచున్న ఇటాలియను లాయడు స్టీమరు చిరునామాకు అది వ్రాయబడెను. అది యచ్చటనే మాకు చేరకుండ తప్పిపోయెను. తరువాత నది చాల చోట్లను దర్శించి, బహుశః చాల యుత్తరముల గూళ్ళలో స్థావరముండి చివరకే సాహసునిచేతనో నాకు పంపబడెను. చిత్రముగా నాయుత్తరము నాకు వ్రాయబడిన వీడ్కోలు యుత్తరము.

K. Srinibasa Reddy

## ౩౮

## ఢిల్లీ సంధి.



మా తండ్రి పోయిన రోజున సరిగా నాగంటలోనే రౌండు టేబిలు కాన్ఫరెన్సుయొక్క భారత సభ్యుల పెద్దగుంపొకటి బొంబాయి రేవులో కాలుపెట్టెను. శ్రీనివాస శాస్త్రిగారును, సప్రూగారును, మరికొందరును సరాసరి అలహాబాదు వచ్చిరి. గాంధీజీయు కొంతమంది వర్కింగు కమిటీ సభ్యులును అదివరకే యచ్చట నుండిరి. మాయింటి వద్ద కొన్ని ప్రయివేటు సభలు జరిగెను. వాటిలో ఆర్. టి. సి. చేసిన పనిని గురించి కొంత చరిత్ర వినిపింపబడెను. ప్రారంభములోనే యొక చిన్నవిషయము జరిగెను. శాస్త్రిగారు, అయాచితముగ తనంతట తానే, యెడింబరోలో తాను చెప్పిన దానికి విచారమును వెలిబుచ్చుచు నతడెప్పుడును తన పరిసరములకు లోబడి పోవునని కూడ చెప్పెను. అతనితో నతని యత్యధికపదగుంభనము కూడ పరుగెత్తుచుండును.

రౌండు టేబిలు ప్రతినిధులు ఆర్. టి. సి. ని గురించి మేమెరిగిన దానికంటె నెక్కువేమియును మాకు తెలుపలేదు. తెరచాటున జరిగిన యనేక కుట్రలను గురించి వారేమేమియో వెళ్ళబుచ్చిరి. ఫలాని ప్రభువుగారిట్లు చెప్పిరి. లేక యొక సర్ గారు రహస్యముగా నట్లుచేసిరి. భారత దేశములోని మన లిబరలు మిత్రులు సిద్ధాంతములకుగాని, భారత దేశ స్థితిలోని యథార్థములకుగాని ప్రాముఖ్యత నీయక పెద్దయుద్యోగస్థుల విషయములకును వారితో సల్పునట్టి రహస్యసంభాషణలకును, గుసగుసలకును యెక్కువ ప్రాధాన్యత నిచ్చుచుండునట్లు యెప్పుడును కాన్పించెదరు. లిబరలు నాయకులతోడి మాయిష్టాగోష్ఠివలన నెట్టి

ఫలితమును కలుగలేదు. ఆర్. టి. సి. తీర్మానముల కావంతయు విలువలేదను మావెనుకటి యభిప్రాయములే స్థిరపడిపోయెను. గాంధీజీ వైస్రాయికి వ్రాసి యతనిని దర్శనమీయ కోరవలెననియు నతనితో నిర్మోగమాటముగ మాట్లాడవలెననియు నెవరోయొకరు (అతడెవరో నేను మరచిపోతిని) సూచించెను. అతడు దాని కంగీకరించెను. దానివలన ఫలితము నతడపేక్షించెనని నేననుకొనను. అయినను, సిద్ధాంతము ననుసరించి, యతడు తన మార్గమును వీడి శత్రువును కలుసుకొని యతనితో దేనినైనను చర్చించుట కెల్లప్పుడును యిష్టపడును. తనస్థితియొక్క సత్యమునుగురించి పరిపూర్ణవిశ్వాసముకలవాడై యతడు యెదరపార్టీవానిని యొప్పింపకోరును. కాని యతడు బహుశః కేవలమానసిక విశ్వాసముకంటె నెక్కువ దానికే గురిపెట్టుచుండెను. అతడెప్పుడును ఆధ్యాత్మిక పరిణామమునే కోరుచు క్రోధము, అవిశ్వాసము మొదలగు నడ్డంకులను నాశనముచేసి యెదరవాని ప్రేమను, మృదుభావములను చూఱకొనజూచును. ఈమార్పు కలిగినచో విశ్వాసము కుదురుట సులభమని యతడెరుగును. లేక విశ్వాసము కలుగక పోయినను శత్రుత్వములోనున్న తీవ్రత మణగిపోవును; పోరాటములోని ద్వేషము నశించును. అతనికి శత్రువులైన వ్యక్తులతో తన స్వంత వ్యాపారములలో నతడనేక విజయములను బడసెను. కేవలము తన యాకర్షణశక్తిచేతనే యతడు తన శత్రువును జయించుచుండుట యాశ్చర్యముగ నుండును. అనేకమంది విమర్శకులును, దూషకులును అతని యాకర్షణశక్తిచే మోహితులయి యతనిని భూషించువారుగ మారుచుండిరి. ఒకవేళ విమర్శ విరమింప బడకపోయినను అందులో నపహాస్యము మచ్చునకైనను కాన్పించెడిదికాదు.

ఈశక్తి నెరిగిన వాడగుటచే గాంధీజీ యెప్పుడును తనతో భేదించువారిని కలుసుకొన నుత్సహించును. కాని స్వవిషయముల లోను లేక చిన్నవిషయములలోను వ్యక్తులతో వ్యవహరించుట

వేరు. జయభేరి మ్రోగించు సామ్రాజ్యతత్త్వ ప్రతినిధి యగు బ్రిటిషు ప్రభుత్వము వంటి యవ్యక్తస్వరూపముతో వ్యవహరించుటవేరు. దీనినిగుఱించి గాంధీజీ ఇర్విను ప్రభువును దర్శించుటకు, పెద్దయాశలను పెట్టుకొనకుండగనే, వెళ్లెను. శాసనోల్లంఘనోద్యమ మింకను జరుగుచునే యుండెను. ప్రభుత్వముతో సంభాషణలు జరుగుచున్నవను కారణముచే దానితీవ్రత మాత్రము తగ్గెను. ఆలస్యము లేకుండగనే దర్శనమున కేర్పాటులుగావింపబడెను. గాంధీజీ ఢిల్లీవెళ్లుచు తాత్కాలికసమాధానమునకు వైస్రాయితో తీవ్రసంభాషణలు జరపవలసి వచ్చునెడల వర్కింగు కమిటీసభ్యులకు కబురు పంపెదనని చెప్పెను. కొద్దిరోజులయిన తరువాత మమ్మందరను ఢిల్లీరమ్మనిరి. మే మచ్చట మూడువారములుండి ప్రతిరోజున కలుసుకొనుచు నలసట వచ్చువరకు చర్చించుచుంటిమి. గాంధీజీ ఇర్విను ప్రభువుతో తఱచు మాట్లాడుచుండెను; కానియొక్కొక్కప్పుడు మూడునాలుగు రోజులు యెడముండెడిది. బహుశః భారతప్రభుత్వమువారు లండనులోనున్న యిండియాఆఫీసువారితో సంప్రదించు చుండుటచే నీయాలస్యము జరిగెడిది. ఒక్కొక్కప్పుడు చిన్నవిషయములులేక కొన్నిమాటలుకూడ వ్యవహారమున కడ్డము వచ్చుచుండెడివి. శాసనోల్లంఘనమును 'నిలుపుజేయుట' అను పదమువాటిలోనొకటి. గాంధీజీ మొదటినుండి చివరవరకు శాసనోల్లంఘనము శాశ్వతముగా నాపివేయబడ జాలదనియు, నదియొక్కటే ప్రజలకున్న యాయుధమనియు స్పష్టపరచుచుండెను. అయినను అదికొంతకాలము నిలుపుచేయ బడవచ్చును. ఇర్వినుప్రభువు యీపదము కభ్యంతరము చెప్పి యిదిశాశ్వతము కావలెననెను. గాంధీజీ దీనికొప్పుకొనలేదు. చివరకు 'విరమింపబడెను' అనుపదము ప్రయోగింపబడెను. కల్లుదుకాణములవద్దను, విదేశవస్త్రదుకాణముల వద్దను పికెటింగును గురించి చాలరాద్ధాంత సిద్ధాంతములు జరిగెను. మాకాలము చాలవరకు సంధికొఱకు కావలసిన తాత్కాలిక యేర్పా

టులను చర్చించుటకే వినియోగింపబడెను. ప్రధానవిషయములను మూలకుతోసిరి. బహుశః తాత్కాలికసంధిచేకూరి, యనుదినము జరుగుచుండిన పోరాటము విరమింపబడిన తరువాత, ప్రసన్న పరిస్థితులలో నీప్రధాన విషయములను గురించి యోచింప వచ్చుననుకొనిరి. ఈసంభాషణలు శాంతినిచేకూర్చుననియు, దానితరువాత ప్రధానవిషయములను గురించి సంప్రదింపులు జరుగుననియు మేమనుకొంటిమి.

ఆరోజులలో ఢిల్లీ అన్నిరకముల మనుష్యులను ఆకర్షించుచుండెను. విదేశపత్రికారచయితలు, ముఖ్యముగాఅమెరికావారు, చాలమంది యుండిరి. మేమేమియు చెప్పకుండుటచేత వారికి మాపయి విసుగుజనించెను. గాంధీజీఇర్విను సంభాషణలనుగురించి మాయొద్దకంటె క్రొత్తఢిల్లీశక్రటేరియటు ఆఫీసునుంచియే వారికెక్కువవార్తలు వచ్చెడివని వారుమాతో చెప్పుచుండెడివారు. ఇదిసత్యము. గొప్పగొప్ప హోదాలలోనివారెందరో గాంధీజీకి సమస్కరింప త్వరపడుచుండిరి. ఏలననగాంధీజీ నక్షత్రమిప్పు డత్యుచ్ఛదశలోలేదా ? గాంధీజీనుండియు, కాంగ్రెసునుండియు నింతవరకును చాలదూరములోనుండి తరుచువానిని నిందించినవారిపుడు క్షమార్పణలకొరకు త్వరపడుచుండిరి. కాంగ్రెసు రోజులు బాగున్నట్లుకాన్పించుచుండెను. ఏమో!ముందేమిరానున్నదో! ఏమయినను కాంగ్రెసుతోను దానినాయకులతోను చెలిమి చేసికొనుటయే మంచిది. ఒకసంవత్సర మయినతరువాత వారిలో మరియొక మార్పుకలిగెను. వారుకాంగ్రెసును దానిపనులను నోటినిండ తిట్ట నారంభించి దానితోతమకెట్టి సంబంధమును లేదనిరి.

కులతత్త్వ వాదులుకూడ పరిస్థితులవలన గడబడ పడసాగిరి; రాబోవుపరిపాలనలో తాము వెనుక పడిపోవుదురేమోయని గుంజాటన పడసాగిరి. కనుకచాలమంది 'మహాత్మ' దగ్గరకువచ్చి, కులసమస్య మీద రాజీపడుటకు తమకెట్టి యభ్యంతరమును లేదనియు, సతము

పూనుకొనువో సమాధానమునకెట్టి కష్టము నుండజాలదనియు సెల విచ్చిరి. గాంధీజీయు, మాలోచాలమందియు నివసించుచున్న డాక్టరు అన్సారీగారియింటికి నిరంతర జనప్రవాహము, పెద్దపెద్దహోదాల వారును, క్రొద్దిహోదాలవారును, రాదొడంగిరి. మాతీరికకాలములో మేమువారిని శ్రద్ధతో పరీక్షించుచుంటిమి. కొన్నిసంవత్సరములనుండి గ్రామములలోను, పట్టణములలోను నున్నబీదలతోను, జయిళ్లలోను, బయటను గలవారితోను మాకుముఖ్యమైన సంబంధములేర్పడెను. గాంధీజీని చూడవచ్చిన శ్రీమంతులు మానవస్వభావముయొక్క రెండవపక్షమును మాకుచూపిరి. ఇది చులకనగా మారిపోవు పక్షము. అధికారమును, విజయమును వారెచ్చటనైనను పసిగట్టుదురా! తటాలునవారచ్చటకువచ్చి వ్రాలితీరెదరు. వారు తమమందస్మితముల తో దానినాహ్వానము చేతురు. వారిలోచాలమంది భారతదేశము లోనున్న బ్రిటిషుప్రభుత్వముకు ప్రధానస్తంభములు. భారతదేశములో నేప్రభుత్వము రాజ్యముకువచ్చినను వీరు వారికికూడ తత్తుల్యముగనే ప్రధానస్తంభములుగ నుందురు.

ఆరోజులలో క్రొత్తఢిల్లీలో గాంధీజీతో నేనుతరుచు ప్రాతః కాలనడకలలో జేరుచుండెడివాడను. సాధారణముగ నతనితో మాట్లాడుటకదియే సమయము. తక్కినపగటిభాగమంతయు విభజింప బడి ప్రతినిమిషము నొక్కొక్కవ్యక్తికో, లేక పనికో వినియోగింప బడును. ఒక్కొక్కప్పుడు యీప్రాతఃకాల నడకకూడ దూరమునుండి వచ్చిన యెదర్శనాభిలాషికో, లేక స్వవిషయములో నాలోచింప వచ్చిన యేస్నేహితునికో యిచ్చివేయబడును. మేము చాల విషయము లనుగురించి భూత, వర్తమాన, భవిష్యత్తులనుగురించి మాట్లాడితిమి. కాంగ్రెసుయొక్క భవిష్యత్తును గురించిన యతని యభిప్రాయ మొకటి నాకాశ్చర్యమును కలిగించెను. స్వాతంత్ర్యము లభించుట తోడనే కాంగ్రెసు దానంతటది యూగిపోవునని నేనూహించితిని.

అతడు ఒకపరతుతో కాంగ్రెసు సాగవలెనని భావించెను. దానిసభ్యులు ప్రభుత్వముక్రింద నట్టి జీతభత్యములను తీసికొను నుద్యోగమును చేయరాదను స్వార్థత్యాగచట్టమునది యామోదింపవలెనని యతడనెను. ఎవడైనను ప్రభుత్వముక్రింద నట్టి యధికారమునుకోరుచో నతడు కాంగ్రెసునుండి వెడలిపోవలెను. అతడు దీనినెట్లు సాధించెనో నాకిపుడు జ్ఞాపకములేదు. కాని దానివెనుక నున్న భావమేమనగా కాంగ్రెసు తన యుదాసీనతవలన కార్యనిర్వాహకవర్గము మీదను, యితరప్రభుత్వ శాఖలమీదను అద్భుతమగు నైతిక యొత్తిడిని కలిగించి, వానిని సక్రమమార్గములో నుంచవచ్చును.

ఇది చాలయసాధారణమైన భావము. దీనిని నే నర్థము చేసికొనుటకష్టసాధ్యము. దీనవలన నసంఖ్యాకములగు కష్టములు సంభవించును. అట్టిసభను (అట్టిది యూహింపసాధ్యమగుచో) యేపెట్టుబడిదారులో తమస్వార్థములకొరకు కొల్లగొ నెదరు. సంభవా సంభవముల సంగతి యటుంచినచో దీనివలన గాంధీజీభావముల వెనుకనున్న యాంతర్యము మనకర్థము కాగలదు. కొన్నియుద్దేశ్యములను పురస్కరించుకొని రాజకీయ, ఆర్థికనిర్మాణములను పునస్సృష్టిచేయవలెనను భావములతో రాజకీయాధికారమును తీసికొనవలెననెడి యాధునిక పార్టీ సిద్ధాంతముల కిది కేవలము వ్యతిరేకము.

గాంధీజీయొక్క ప్రజాస్వామిక భావము నిస్సంశయముగ నాధ్యాత్మికమైనది. దానికి మామూలు అర్థములో వాడబడు సంఖ్యతోను, మెజారిటీతోను, ప్రాతినిధ్యముతోను సంబంధమ్మువదు. అది త్యాగముమీదను, సేవమీదను నిర్మింపబడెను. అదినైతిక యొత్తిడినే యుపయోగించును. ఈమధ్య నొక స్టేటుమెంటులో * ప్రజాస్వామ్యవాది నతడు నిర్వచించెను. 'పుట్టుకచేత నేను ప్రజాస్వామ్యవాదిని' అని

* 1934 సెప్టెంబరు 17 వ తేదీ

యతడనును. "మానవజాతిలోని గర్భదరిద్రులతో పూర్తిగ నైక్యమగుట, వారికంటె నెక్కువగా జీవింపవలెనను కోరిక లేకపోవుట, దానికి తగినట్లు బుద్ధిపూర్వకముగ నాస్థితిని పొందుటకు శక్తికొలది పనిచేయుట ఇవి ప్రజాస్వామ్య వాదికి లక్షణములైనచో నేనట్టివాడనే" ప్రజాస్వామ్యమును గురించి యతడింకను యిట్లుచర్చించును.

"కాంగ్రెసుకు కలిగిన ప్రజాస్వామ్యలక్షణమును, పలుకబడియు ప్రతిసంవత్సరము కాంగ్రెసుసభలకు వచ్చు ప్రతినిధుల సంఖ్యచేతను ప్రేక్షకుల సంఖ్యచేతను యేర్పడలేదనియు, నదినిరంతరాభివృద్ధిగా చేసిన సేవచేతనే యది యేర్పడెననియు మనము గుర్తించెదముగాక! పాశ్చాత్య ప్రజాస్వామికము, యిదివరకే వ్యర్థమయ్యెనని రుజువు కానిచో, నిప్పుడు పంచాగ్నిహోత్రములమధ్య నున్నది. భారతపుణ్యభూమియే, ప్రత్యక్ష యుదాహరణ పూర్వకముగ దాని విజయమును చూపి, యథార్థ ప్రజాస్వామ్యశాస్త్రమును వెలుగొందచేయుగాక! "అవినీతియు, మోసమును ప్రజాస్వామికముయొక్క విధాయక ఫలితములు కాగూడదు. నేడవి నిస్సందేహముగ ప్రస్ఫుట మగుచున్నవి. సంఖ్యయే ప్రజాస్వామికమునకు నిజమైన పరీక్షకాదు. ఏకొద్దిమందియో తాముప్రాతినిధ్యము వహించు ప్రజయొక్క యాంతర్యమును, కోరికను, యాశయములను ప్రతిబింబింపచేయుట యథార్థ ప్రజాస్వామికముకు వ్యతిరేకముకాదు. దౌర్జన్యపద్ధతులచే ప్రజాస్వామ్యము పరిణామమును పొందజాలదని నేను చెప్పగలను. ప్రజాస్వామ్యతత్త్వమును బాహ్యమునుండి యెక్కించుటకు వీలులేదు; అది యంతరంగము నుండియే రావలెను."

అతడు చెప్పునట్లు నిశ్చయముగా నిదిపాశ్చాత్య ప్రజాస్వామికముకాదు. కాని, చిత్రముగా, దీనికిని కమ్యూనిష్టుల ప్రజాస్వామిక భావములకును కొంతపోలిక కలదు. ఏలనన అందులోకూడ కొంతయాధ్యా

త్మిక వాసనకలదు. కొద్దిమంది కమ్యూనిష్టులు ప్రజలయొక్క యధార్థము లైనయవసరములకును, కోరికలకును (అవి ప్రజలకు తెలియకపోయినను) ప్రతినిధులమని చెప్పెదరు. ప్రజవారిదృష్టిలో నొకయాధ్యాత్మిక భావమగును. దీనికే ప్రతినిధులమని వారు చెప్పరు. అయినను యీపోలిక చాల స్వల్పము. ఇది చాలదూరముపోజాలదు. దృష్టిలోను, విషయమును చేబట్టుటలోను, ముఖ్యముగా పద్ధతులలోను, దార్ఢ్యములోను, వారికి చాలగొప్ప భేదములుకలవు.

గాంధీజీ ప్రజాస్వామ్యవాది యైననుకాకపోయినను అతడు భారత వ్యావసాయిక ప్రజకుప్రతినిధియగుట నిస్సంశయము. ఆకోట్లకొలది ప్రజలయొక్క వ్యక్త, అవ్యక్తకోరికలతనిలో మూర్తీభవించెను. బహుశః అదిప్రాతినిధ్యముకంటెను కొంచెముఅధికమే యగును. ఏలనన నతడు సామాన్య వ్యవసాయకుడుకాడు. అతినిశితమైన కుశాగ్రబుద్ధి, మృదులములైన భావములు, పరిపక్వ సంస్కారము, విశాలదృష్టి, అతిదయాళుత్వముకలవాడు. అయిననుముఖ్యముగా సన్యాసి. అతడుతన రాగములను, ఉద్రేకములను అణచివేసి, వానిని పునీతమొనర్చి యాధ్యాత్మిక వీధులకుత్రిప్పెను. సూదంటురాయివలె నతడుమనుష్యుల నాకర్షించు యద్భుతమూర్తి. అతడుభయంకరమగు వినయవిధేయత లను స్నేహములను పురిగొల్పును. ఇదియంతయు వ్యవసాయకునకతీత మైనది; అతనితోపోలికలేనిది. అయినను అతడుపెద్దరయితు. రయితు వలెనే యతడువిషయములను చూచును; రయితువలెనే జీవితములోని కొన్ని యంశములపట్ల నంధుడుగనుండును. కాని భారతదేశము రయితు దేశము. కనుకనతడు తనభారతదేశమును బాగుగనెరుగును. దానియెంత చిన్న కదలికనైనను అతడుబాగుగ పసికట్టును. అతడుయెట్టిస్థితినైనను అతిసూటిగను, స్వభావసిద్ధముగనుగ్రహించి మంచియదనుదొరికిన సమ యములో పనిచేయును.

ఆహా! అతడు బ్రిటిషు ప్రభుత్వమునకేగాక తన ప్రజలకును, అతి సన్నిహిత సహచరులకునుగూడ నెంతటియగ్రాహ్యుడు! బహుశః ప్రతి యితర దేశమునందును అతడీరోజులలో నప్రస్తుతవస్తువగును. కాని భారతదేశమింకను అతనిని గ్రహించినట్లు కాన్పించును. లేదా పాపమును, మోక్షమును, దౌర్జన్యరాహిత్యమునుగురించి మాట్లాడు మతప్రవక్తను అధమము అదియభినందించును. అపారత్యాగములచేతను, కఠిన తపస్సుచేతను 'పుణ్యపర్వతమును' సృజించి, కొంతమంది చిన్న దేవతల రాజ్యములను భయపెట్టి, స్థాపితమైన పరిపాలనను కూలద్రోసిన సన్యాసులను గురించిన కథలనేకములు భారతపురాణములలో కలవు. ఒకయనంత యాధ్యాత్మిక హ్రదమునుండి వెల్లివిరియునట్టి గాంధీజీయొక్క యాత్మశక్తిని నేనువీక్షించునపుడు యీపురాణకథలు తఱచునామనస్సులోనికి వచ్చుచుండెడివి. నిశ్చయముగా నతడు ప్రపంచము యొక్క సామాన్య టంకసాలలో తయారైన వాడుకాడు; అతడు వేరొక యసాధారణ జాతిలో ముద్రింపబడెను. తఱచు అతనికన్నుల నుండి మమ్ము అగ్రాహ్యహ్యమైనది తేరిపారి చూచుచుండెడిది.

హిందూదేశము, పట్టణ హిందూదేశముకూడ, నూతన పారిశ్రామిక హిందూదేశముకూడ వ్యవసాయక లక్షణమునుకలిగియుండెను. కనుకనది తనయీకుమారుని, తనవలెనేయుండి మరియు తనవలెనేయుండనివానిని, విగ్రహముగను, ప్రేమింపబడు నాయకునిగను చేయుటయెంతయుసహజము. అతడుపురాణ స్మరణములను సగము మరచిపోబడినవాటిని త్రవ్విపైకితీసి యామెకు తననిజాత్మ యొక్క తళుకులను కనపరచెను. వర్తమాన యంధకార బంధురమగు దుఃఖములో నలిగిపోయియామె భూత, భవిష్యత్తులనిరర్థకమైన గొణుగుటలు, అస్పష్ట కలలుమొదలగువాటితో శాంతినొందుటకు ప్రయత్నించెను. కానియతడువచ్చియామెమనస్సుకు ఆశను, పూర్తిగాచితుకకొట్ట

బడిన శరీరముకు బలమును, శక్తిని ప్రసాదించెను. భవిష్యత్తు మోహ జనకముగ కాన్పించెను. జానస్ వలె నది రెండుముఖములతో వెనుక భూత కాలమును, ముందుభవిష్యత్తును చూడనారంభించి రెంటెనిమిళితము చేయజూచెను; జోడింపజూచెను.

మాలో చాలమంది యీవ్యవసాయికదృష్టితో సంబంధమును త్రెంచుకొంటిమి. పూర్వకాలపు భావములు, ఆచారములు, మతములు మాకు విదేశీయములయ్యెను. మేముఆధునికులము అనునామకరణమును పెట్టుకొంటిమి; అభివృద్ధి, పరిశ్రామికమయముచేయుట, జీవితప్రమాణ మునున్నతిచేయుట, సంఘీకృతముచేయుట మొదలగు భావములతో మేముభావించుచుంటిమి. వ్యవసాయకుని దృష్టి యరిష్టదాయకమని మేముభావించితిమి. కొంతమంది, వృద్ధియగుచున్న సంఖ్య, సామ్యవాద మును, కమ్యునిజమును అభిమానించితిమి. రాజకీయముగ మేము గాంధీ జీతో నెట్లు సంపర్కమును పెట్టుకొనగలిగితిమి? చాలమంది యతని ప్రియ శిష్యుల మెట్లయితిమి? ఈప్రశ్నకు సమాధానమిచ్చుట చాలకష్టము. గాంధీజీని యెరుగని వానికి యేసమాధానమును తృప్తికరముగ నుండ జాలదు. వ్యక్తిత్వము యనిర్వచనీయమైనది; అది మనుష్యుల యాత్మల నాకర్షించు నొకవింతయైనశక్తి. అతనిలో నిది యపారముగకలదు. అతని దగ్గరకుపోవు ప్రతివానికిని తఱచుగా నతడు వివిధదృష్టులలో కాన్పిం చును. అతడు ప్రజల నాకర్షించెను; కాని తుదకు మానసికవిశ్వాసమే వారినతని యొద్దకు తెచ్చి యిచ్చుటనుంచును. అతని జీవిత వేదాంత ముతో వారేకీభవింపరు. అతని యనేకాదర్శములతో కూడ వారేకీభ వింపరు; తఱచు అతడు వారికగ్రాహ్యుడు. కానియతడు సూచించిన కార్యము నేత్రగోచరమైనది. దానిని బుద్ధిచేగ్రహింపవచ్చును, గుర్తింప వచ్చును. నిర్వీర్యములైన మనరాజకీయములు ద్రోహదముచేసిన కార్య శూన్యమైన చిరసాంప్రదాయానంతరము యేకార్యముకయినను స్వాగత

ముండెడిది. ధైర్యోపేతము, జయప్రదము, నైతికకాంతి విరాజితము నగుకార్యమును త్రోసివేయుట కెవరితరము? బుద్ధిని, భావప్రపంచమును కూడనది ముంచివేసెను. క్రమక్రమముగా నతడు తనకార్యములోని యోగ్యతనుగురించి మమ్మొప్పించెను. అతనివేదాంతమునకు మేమంగీకరింపక పోయినను మేమతనితో వెళ్ళితిమి. కార్యమును, దానివెనుక నున్నభావమును విడదీయుట బహుశః సరియైనపద్ధతికాదు. ఇదితరువాత మానసిక పోరాటమును చిక్కులను తెచ్చిపెట్టును. గాంధీజీ, ప్రధానముగా కర్మవీరుడును, మార్పుచెందుపరిస్థితుల నతిసూక్ష్మముగా గ్రహించువాడును కనుక మాకు యుక్తమని లోచినమార్గమున నడచునని మేమవ్యక్తముగ నాశించితిమి. ఏమయినను అతడు నడచుచున్న బాటయింతవరకు సక్రమముగనుండెను. ముందెప్పుడో విడిపోవలసివచ్చునని దాని నిప్పుడే తలపెట్టుట అయుక్తము; అవ్యక్తము.

ఇదంతయు మాకుమనోనిశ్చయమును, అకలంకతయు నేర్పడలేదని తెలుపును. మేమెక్కువ తార్కికులము కావచ్చును. కాని గాంధీజీ మాకంటె భారతదేశము నెక్కువగ నెరుగునని మేమెప్పుడును భావించెడివారము. అట్టియద్భుత భక్తి, విశ్వాసములను చూఱగొనినవానిలో ప్రజల యభీష్టములను, యాశయములను నెరవేర్చునదేదియో యుండవలెను. మేమతనిని యొప్పింపగలిగినచో నీప్రజలనందరనుకూడ త్రిప్పివేయవచ్చునని భావించితిమి. అతనిని యొప్పించుట సాధ్యముగనే కనిపించెను; ఏలనన అతనిదృష్టి వ్యవసాయిక దృష్టియేయైనను అతడుజన్మతః తిరుగుబాటుదారు. గొప్పమార్పులను తెచ్చిపెట్టు విప్లవకారుడు. ఎట్టిఫలితములు సంభవించునో యనుభయమున కతడెంతమాత్రమును లక్ష్యముచేయడు.

స్తబ్ధులును, అవినీతిపరులును అయినమనప్రజల నతడెంతయాశ్చర్యముగ శిక్షించెను. దౌర్జన్యముచేతగాని, ద్రవ్యముచే నాశపెట్టిగాని

యతడట్లు చేయలేదు. అతనిసాధుదృష్టి, మృదువచనము, అన్నిటికంటె నతని నిజోదాహరణము-యివియే యతని నద్దనున్న పరుసువేది! 1918 నాటి సత్యాగ్రహ దినములలో బొంబాయి నివాసియగు ఉమరసోభాని యతనికి 'ప్రియమైన బానిసబోధకుడు'అని పేరిడుట నాకుజ్ఞాపకమున్నది. తరువాత గడచిన పన్నెండు సంవత్సరములలోను నెంతయోజరిగెను. ఈమార్పుల నన్నింటిని చూచువరకు ఉమరు జీవించలేదు. కాని యెక్కువ యదృష్టవంతుల మయినమేము 1931 వ సంవత్సరములోని మొదటి నెలలనుంచి సంతోషోత్సాహ తరంగములతో వెనుకకు చూచితిమి. నిశ్చయముగా 1930 మాకొక వింత సంవత్సరము. గాంధీజీ తనమోహనాస్త్రముచే మన దేశముఖమునంతను ఒక్కసారిగా మార్చి వేసినట్లు కాన్పించెను. బ్రిటిషుప్రభుత్వమును మనముపూర్తిగాజయించి తిమని యనుకొనిన మూర్ఖులెవరును లేరు. మన యుత్సాహ భావము నకు ప్రభుత్వముతో నెట్టి సంబంధమును లేదు. మనము మనప్రజలను గురించియు, మన నారీమణులను గురించియు, మనయువకులను గురించియు, మనబాలురను గురించియు నుద్యమములో వారుచూపిన ధైర్యసాహసములకు గర్వించితిమి. అదియొక యాధ్యాత్మిక విజయము. అది యేప్రజకుగాని, యెట్టి సమయమందుగాని యమూల్యమైనది. కాని పరాధీనులము, అణగద్రొక్క బడినవారము నగుమనకది మరింత యమూల్యమైనది. దీనిని పోగొట్టునదేదియు జరుగకూడదని మేమాతురముగ నుంటిమి.

స్వయముగా నాయెడల గాంధీజీ యెప్పుడును అసాధారణమగు దయను, గౌరవమును చూపెను. మాతండ్రిగారి నిర్యాణమతనిని నాకు మరింత సామీప్యమునకు తెచ్చెను. నేను చెప్పినదంతయు నతడెప్పుడును అతిఓర్పుతోవిని నాకోర్కెలను తీర్చుటకన్ని ప్రయత్నములనుచేసెను. నేనును మరికొంతమంది సహచరులమునుకలసి యతనిని

సామ్యవాద మార్గములోనికి బహుశః మార్చగలుగుదుమని నేననుకొంటిని. అతనికదినచ్చినచో క్రమముగా మారెదనని యతడేయనెను. ప్రస్తుత పరిపాలన క్రమములోని దౌర్జన్యము, అన్యాయము, వ్రయము, దుఃఖము మొదలగు వాటినుండి తప్పించుకొనుటకు నాకు వేరుమార్గము కాన్పించకపోవుటచే నతడు విధాయకముగ సామ్యవాదములోని మూలసూత్రము నంగీకరించునట్లు నాకు కాన్పించెను. అతడు పద్ధతులతో భేదింపవచ్చును. కాని యాదర్శముతో భేదింపడని నేనప్పుడనుకొంటిని. కాని గాంధీజీ యాదర్శములకును సామ్యవాద లక్ష్యమునకును ప్రధానభేదములే యున్నట్లు నేనిప్పుడు గ్రహించితిని.

1931 ఫిబ్రవరిలోని ఢిల్లీకథకు వత్తము. గాంధీయిర్విన సంభాషణలు కొంతవరకు నడిచి, నడిచి హఠాత్తుగా నాగిపోయెను. చాలరోజుల వరకు వైస్రాయిగారు గాంధీజీకొరకు కబురుపంపలేదు. మాకులంకయు భగ్నమయినట్లేతోచెను. వర్కింగుకమిటీ మెంబర్లు తమ తమ రాష్ట్రములకు వెళ్లుటకుసిద్ధమయిరి. విడిపోవుటకు పూర్వము ముందుకార్యక్రమము గురించియు, శాసనోల్లంఘనము గురించియు (ఇదివేరుకు యింకను జరుగుచుండెను.) మేము సంప్రదించితిమి. భగ్నమయినసంగతి నిశ్చయముగ ప్రకటింపబడినతోడనే తిరిగి కలుసుకొనుటకును, సంప్రతించుటకును అవకాశముండదని మేము నిశ్చయముగ భావించితిమి. మేము నిర్బంధములు చెలరేగుననియూహించితిమి. ప్రభుత్వమువారు కాంగ్రెసుపై తీవ్రముగ దాడి వెడలుదురని చెప్పిరి. అది యట్లే కాన్పించెను. మేమింత వరకును చవిచూచిన దానికంటె భయంకరమయినదనిరి. ఆఖరు సభ యని మేమనుకొనిన సభలో మేము కలుసుకొంటిమి; ఉద్యమమును ముందు నడుపుట కనేక తీర్మానములను మేము చేసితిమి. ఒకతీర్మానమును కొంత ప్రాధాన్యత కలదు. ఇంతవరకు ప్రతి తాత్కాలిక అధ్యక్షుడును తాను నిర్బంధింపబడినచో తన స్థానమున నొకనిని పేర్కొను

చుండెను. కాళీయయిన స్థానములలో వర్కింగు కమిటీ సభ్యులను
పేర్కొనుచుండెను. స్థానీయముగ వచ్చిన వర్కింగుకమిటీలు పనిచేయ
కుండెను. అవి యేవిషయములోను క్రొత్తగా జోక్యమును తీసికొన
జాలవు. వారు జయిలుకు మాత్రమే పోగలరు. ఇట్లు నిరంతరము స్థానీ
యులను పెట్టుచుండు పద్ధతి సాహసమైనది; ఇది కాంగ్రెసును తప్పు
మార్గములో పెట్టవచ్చును. దానివలన కొన్ని యుపద్రవములున్నవి.
కనుక ఢిల్లీలోని వర్కింగు కమిటీలో తాత్కాలిక అధ్యక్షులను
పేర్కొనుటకాని, స్థానీయసభ్యులను పేర్కొనుటకాని పనికిరాదని తీర్మా
నింపబడెను. మొదటి కమిటీలోని మెంబరు కాని, మెంబర్లు కాని పయి
నున్నంతవసేపు వారేపూర్తి కమిటీవలె పనిచేతురు. వారందరు జయి
లులో నుండుచో పనిచేయు కమిటీయేయుండదు. కాని మేమప్పుడు
వర్కింగు కమిటీ యధికారములు దేశములోని ప్రతి మనిషిలోను స్త్రీ
లోను నిలిచి యుండునని గంభీరముగా చెప్పి పోరాటమును అప్రతిహత
ముగ సాగింపవలసినదని వారిని హెచ్చరించితిమి.

ఈ తీర్మానము యుద్ధమును సాగించుటకొక ధైర్యమైన త్రోవను
చూపెను. ఇందులో రాజీకెంతమాత్రమును చోటులేదు. కాంగ్రెసు
యొక్క ముఖ్యస్థానములో కూర్చొని దేశమంతటితోను సంపర్కము
కలిగియుండుట కాని, నిరంతర సందేశములను పంపించుటగాని దుర్ఘట
మగుచున్నదను సంగతిని కూడ యిది గుర్తించెను. ఇది తప్పనిసరి. మన
సేవకులలో చాలమంది పేరుప్రఖ్యాతులు గల స్త్రీలును, పురుషులును
గలరు. వారు బహిరంగముగనే పనిచేతురు. వారెల్లప్పుడును నిర్బంధింప
బడవచ్చును. 1930 వ సంవత్సరములో సందేశములను తీసికొనివెళ్ళుట
కును, నివేదికలను పట్టుకొనివచ్చుటకును, తనిఖీపనిచేయుటకును రహస్య
వార్తాప్రచార సేవ యొకటి నిర్మింపబడెను. ఇదిబాగుగనే పనిచేసెను.
ఇదిమనము రహస్యవార్తలను తెచ్చుశాఖను జయప్రదముగ నడిపింప

గలమని రుజువుచేసెను. కానికొంతవరకు నిది మనబహిరంగమైన యుద్యమమునకు సరిపడలేదు. గాంధీజీ దీనికి వ్యతిరేకముగ నుండెను. ప్రధాన స్థానమునుండి సందేశములు రానప్పుడు పనిని నిర్వహించు బాధ్యతను స్థానిక ప్రజలమీద పెట్టకతప్పదు. లేనిచో వారు పైనుండి యాదేశములు వచ్చునని యసహాయులై చూచుచు నిరాకరించెదరు. సాధ్యమైనప్పుడు ఆదేశములు పంపబడుచుండెను.

కనుక మేమీతీర్మానమును, యితరతీర్మానములను (ఇవేవియు తరువాత జరిగిన సంభవములచే ప్రకటింపబడలేదు) ఆమోదించి వెళ్ళిపోవుటకు మూటలుకట్టితిమి. అప్పుడే యిర్వినుప్రభువునద్దనుంచి మరియొక పిలుపువచ్చెను. సంభాషణలు తిరిగి ప్రారంభమయ్యెను. మార్చి నాల్గవతేదీని రాత్రి రెండుఝాములవరకు మేము శాస్త్రియింటివద్దనుంచి రావలసిన గాంధిజీకొరకు వేచియుంటిమి. అతడు రెండుగంటలకు తిరిగివచ్చెను. మమ్ము నిద్రనుండిలేపి సమాధానము కుదిరెననిచెప్పిరి. మేము ముసాయిదాను చూచితిమి. నేను చాలవరకు షరతుల నెరుగుదును. అవి యనేకసారులు చర్చింపబడెను. కాని మొట్టమొదటనే యున్న రెండవషరతు, రక్షణలు మొదలగు వాటికిసంబంధించినది, నాకాశ్చర్యమును కలిగించెను. నేను దానికెంతమాత్రమును సంసిద్ధముగలేను. నేనప్పుడేమియును చెప్పలేదు. మేమందరమును నిద్రించితిమి. చెప్పవలసినది యేమియులేదు. జరగవలసినపని జరిగిపోయెను; మననాయకుడు మాటయిచ్చెను. మనమతనితో నేకీభవింపకపోయినను మనమేమిచేయగలము? అతనిని త్రోసివేయవలెనా? అతనితో తెగించుకొనవలయునా? మనయభిప్రాయ భేదమును ప్రకటింపవలెనా! అదియొకవ్యక్తికి కొంత మాత్రమే తృప్తినీయవచ్చును. కాని తుదినిశ్చయము నదియేమియుచేయజాలదు. తాత్కాలికముగనైనను శాసనోల్లంఘనము సమాప్తమయ్యెను. ప్రభుత్వమువారు గాంధీజీయొక్క సమాధానమున కిది

వరకే యంగీకరించెనని ప్రకటింప గలిగినపుడు వర్కింగుకమిటీకుండ నిప్పుడు దానిని నడిపింపజాలదు. మాయితర సహచరులవలెనే నేనును శాసనోల్లంఘనము నాపివేసి ప్రభుత్వముతో తాత్కాలిక సంధిచేసి కొనుటకు సంపూర్ణముగా నిచ్ఛించుచుంటిని. మాసహచరులను తిరిగి జయిలుకు పంపించుట మాకెవరికిని సులభమైన విషయముకాదు. ఇదివరకే జయిలులోనున్న యనేకవేలమంది నచ్చటనే యుంచుటకును మేము కారకులము కాజాలము. మాలోచాలమంది జయిలులో నుండుటకు తగుశిక్షనుపొంది, యచ్చట జరుపవలసిన) మనుష్యులను చూర్ణము చేయు)నిర్దయవిధులనుగురించి పరిహాసముగా మాట్లాడినను జయిలు మా రాత్రిందివములను గడుపుటకు సంతోషప్రదమైన ప్రదేశముకాదు. ఇదిగాక మూడువారముల గాంధీజీ యిర్విను సంభాషణలవలన సమాధానము చేకూరునని దేశము భావించుచుండెను. చివరకది భగ్నమగుట ప్రజల కాశాభంగమగును. కనుక వర్కింగుకమిటీలోని మేమందరమును మా ప్రధానస్థితికి భంగము కలుగకుండుపద్ధతిని, తాత్కాలిక సమాధానముకు ప్రసన్నముగనే యుంటిమి.

నాకు సంబంధించి సంతవరకు గొప్పవాదముకు తావిచ్చిన యనేక యంశములతో నాకంత ప్రసక్తిలేదు. అన్నింటికంటెను రెండు విషయములలో నాకెక్కువ శ్రద్ధయుండెను. ఒకటి మన స్వాతంత్ర్య లక్ష్యమెప్పుడును యేవిధముగను చెక్కుచెదరక యుండవలెను. రెండవది యు. పి. లో నున్న వ్యవసాయదారుల స్థితిని ఈ సమాధానము బాధించకూడదు. మాపన్నుల నిరాకరణము లేక శిస్తుల నిరాకరణము యింతవరకు చాల జయప్రదముగ నుండెను. కొన్నిప్రాంతములలో చిల్లిగవ్వయైనను టింగున బోణీకాలేదు. రయితులందరును యుత్సాహభరితులై యుండిరి. ప్రపంచ వ్యవసాయపరిస్థితులును ధరలును మునుపటికంటె నధ్వాన్నముగ నుండెను. మాపన్నుల నిరాకరణము రాజ

కీయమును, ఆర్థికమును కూడ నైయుండెను. ప్రభుత్వముతో
తాత్కాలిక సమాధానము కుదురుచో శాసనోల్లంఘనము విర
మింపబడును. పన్నుల నిరాకరణమునకు రాజకీయకారణము తగ్గిపోవును.
కాని యార్థికసమస్య యేమగును? విపరీతమగు ధరల వ్యత్యాస
మేమగును? ప్రభుత్వ డిమాండును చాలమంది రయితులు చెల్లింప
జాలరు. గాంధీజీ యీ విషయమును యిర్విను ప్రభువుకు
స్పష్టపరచెను. పన్నుల నిరాకరణము విరమింపబడును. కాని వారి
శక్తినిమించి చెల్లింపవలసినదని మేము రయితులకు చెప్పజాలమని
యతడు నిష్కర్షగా చెప్పెను. ఈ విషయము రాష్ట్రమునకు చెందినది
కనుక భారత ప్రభుత్వముతో వివరముగా చర్చించుటకు వీలులేక
పోయెను. రాష్ట్రప్రభుత్వమువారు యీ విషయమును గురించి మాతో
సంప్రదించెదరనియు, రయితుల దుఃఖములను బాపుటకు వారి యధి
కారములో నున్నదంతయు చేసెదరనియు మాకభయహస్తమిచ్చిరి.
అది యస్పష్టమైన బాస. కాని మాపరిస్థితులలో నంతకంటె నిశ్చయ
మైన వాగ్దానము పొందుట కష్టము. కనుక నీవిషయమిట్లు తాత్కాలి
కముగ పరిష్కారమయ్యెను. ఇక మనలక్ష్యమునకు చెందిన ప్రధాన
సమస్య, స్వాతంత్ర్య సమస్యమిగిలెను. సమాధానములోని రెండవషర
తులో నిదికూడ భగ్నముగావింపబడినట్లు నాకు కాన్పించెను. దీని
కొరకేనా మనప్రజలొక సంవత్సరమంత ధైర్యస్థైర్యములతో పోరాడిరి?
మనధైర్యవచనములును, క్రియలును దీనితో సమాప్తము చెందవలెనా?
కాంగ్రెసుయొక్క స్వాతంత్ర్య తీర్మానము అనేకసారులు పునశ్చరణ
గావింపబడు జనవరి 26 వ తేదీనాటి ప్రతిజ్ఞ! ఈ విధముగ నాటిమార్చి
రాత్రియంతయు దీర్ఘాలోచనా నిమగ్నుడ నయియుంటిని. అమూల్య
మైన దేదియో పోయినట్లును, అది యిక పునర్లభ్యముకానట్లును నాహృ
దయములోనొక గొప్పశూన్యత యేర్పడెను.

---

## ౩౫

## కరాచీ కాంగ్రెసు.

—⊰)O(⊱—

నావిచారమునుగురించి గాంధీజీ యుప్రత్యక్షముగా తెలిసికొనెను. మరునాడు ప్రాతఃకాలమున నన్నతడు తనతో పికారు రమ్మనెను. మేము చాలసేపు మాట్లాడితిమి. ప్రధానమైన దేదియు పోలేదనియు, నెట్టిసిద్ధాంతమును జారవిడువలేదనియు నన్నతడు యొప్పింప ప్రయత్నించెను. సమాధానములోని రెండవషరతు కనడు మనస్వాతంత్ర్య కోరికకు సరిపడునట్లుగా నొకచిత్రమైన యర్థమును తీసెను. అందులోని "భారతప్రియోజనములకొరకు" అను మాటలమీద నతడెక్కువగా నాధారపడెను. ఆయర్థము నాకుచాల బలవంత బ్రాహ్మణార్థముగా కాన్పించెను. అదినాకు నచ్చలేదు. కాని యతని సంభాషణ నాకు కొంత యుపశాంతిగ నుండెను. అగ్రిమెంటుయొక్క గుణావగుణములటుండ మమ్మాశ్చర్య చకితులను చేయుచుండుపతని విధానమునాకు భయంకరముగనున్నదని నేనతనితో చెప్పితిని; అతనిలో నగ్రాహ్యామైన దేదియోయుండెను. పదునాలుగు సంవత్సరము లతని కత్యంత సన్నిహితుడ నైయుండినను నాకది యిసుమంతయు నర్థముకాలేదు. అదియే నాకుభయమును కొల్పుచుండెను. తనలో నగ్రాహ్యామైన దేదియో యున్నదని యతడే యొప్పుకొని దానిక తానేమియు చెప్పజాలననియు లేకనది యెచ్చటకు తీసికొనిపోవునో జోస్యము చెప్పజాలననియు చెప్పెను.

ఒకటి రెండురోజులు యేమిచేయుటకును తోచక నేను మన శ్శాంతిలేక యిటునటు తిరిగితిని. అప్పుడు ఆ యగ్రిమెంటును యెదిరించవలెననిగాని, అడ్డుపెట్టవలెనని గాని నాకులేదు. ఆస్థితి దాటిపోయెను.

†

నేను చేయగలిగిన దంతయు వ్యవహారములో దాని నంగీకరించుచు నామకఃదానితో సంబంధములేదని యనుకొనుటయే! అది నావ్యక్తిగత యహంకారమునే తృప్తిపరచును గాని పెద్ద సమస్య నెట్లు చక్కబరచ గలదు? చేసినదానిని సంతోషపూర్వకముగ నంగీకరించి గాంధీజీవలెనే దానికత్యంత ప్రసన్నమగు యర్థమునే యేలచెప్పకొనకూడదు? అగ్రిమెంటు జరిగిన వెంటనే పత్రికాప్రతినిధుల కతడీయర్థమునే స్పష్ట పరచి మేముపూర్తిగా స్వాతంత్ర్యమునే సమర్థించు చున్నామని చెప్పెను. అతడు యిర్విను ప్రభువు దగ్గరకువెళ్లి యప్పుడుగాని, భవిష్యత్తులోగాని యెట్టి దురభిప్రాయములును కలుగకుండ నీహంశమును స్పష్టపరచెను. కాంగ్రెసుతరఫున ఆర్. టి. సి. కి ప్రతినిధిని పంపవలసి యున్నచో నీషరతుమీదమాత్రమే పంపెదమనియు, నీహక్కుకొరకు వాదించెదమనియు నతడతనితో చెప్పెను. ఇర్వినుప్రభువు యీహక్కును అంగీకరింపడు; కాని కాంగ్రెసుకు దానినిగురించి వాదించుటకు హక్కు కలదని గుర్తించెను.

కనుక నేను గొప్పమానసిక పోరాటముతోను, శరీరబాధతోను అగ్రిమెంటు కంగీకరించుటకును, హృదయపూర్వకముగ దానికొరకు పనిచేయుటకును నిశ్చయించితిని. నాకు మరియొక మధ్యమార్గమేమి యును కాన్పించలేదు.

గాంధీజీ యిర్వినుప్రభువుతో చేసినసందర్శనములలో అగ్రిమెంటుకుముందును తరువాతనుకూడ, శాసనోల్లంఘన ఖయిదీలనేగాక తదితర రాజకీయఖయిదీలనుకూడ విడుదలచేయవలసినదని కోరెను. మొదటివారు అగ్రిమెంటులోని యొకషరతుప్రకారము విడుదల యగుదురు. కానివిచారణ చేసినతరువాత శిక్షింపబడినవారును, విచారణగాని, ఛార్జిగాని, శిక్షగానిలేకుండగనే యుంచబడినవారును యితరులు వేలకొలదికలరు. ఈడిటెన్యూలలో చాలమంది యనేకసంవత్సరము

లీవిధముగనే యుంచఁబడుటచే భారతదేశ మంతటను, ముఖ్యముగా దీనిచే నెక్కువగా బాధపడుచున్న వంగదేశములోను, విచారణలేకుండ ఖయిదుచేయు పద్ధతిపై ప్రజలలో నెప్పుడును కల్లోలము హెచ్చుచుండెను. ఇంగ్లీషుద్వీపములోని ప్రధానివలె భారత ప్రభుత్వము వారు రుజువులేవియు నుత్తమరుజువులు కాజాలవని విశ్వసించిరి. డిటిన్యూలు బౌల్షివ్యమునకు సంబంధించిన తిరుగుబాటు దారులు; లేదా దాని కుద్యుక్తులైనవారుఅని ప్రభుత్వము వారు చెప్పుచుండిరి. గాంధీజీ, అగ్రిమెంటులోని యొకహాంశముగా గాక, వంగదేశములోని రాజకీయ యుద్రేకమునుతగ్గించి యెక్కువ సుముఖమైన వాతావరణమును కలిగించుటకు వారిని విడుదల చేయవలసినదని కోరెను. కాని ప్రభుత్వము వారు దీనికొప్పుకొనలేదు.

భగత్సింగుయొక్క మరణశిక్షను మార్చవలసినదని గాంధీజీ చేసిన గట్టివాదనకూడ ప్రభుత్వము వారంగీకరింపలేదు. దీనికిని అగ్రిమెంటుకును సంబంధ మేమియులేదు. భారతదేశ మంతయు నీ విషయమై గగ్గోలుగా నుండుటచే నతఁడు దీనిని ప్రత్యేకముగా కోరెను. అతనికోరిక వ్యర్థమయ్యెను.

భారతదేశములోని టెర్రరిస్టు సంఘముయొక్క చిత్రస్వభావమును తెలుపు హాంశమొకటి, యీసమయములోనే జరిగినది, నాకుజ్ఞాపకమున్నది. ఇది నావిడుదలయైనవెంటనే తండ్రిగారిమరణమునకు కొద్ది పూర్వముననో వెనుకనో జరిగెను. ఒకకొ్రత్తవ్యక్తి నన్నుచూచుటకు మాయింటికి వచ్చెను. అతడు తనపేరు చంద్రశేఖర అజదు అని చెప్పెను. నేనతని నెప్పుడును చూడలేదు. కాని, పదిసంవత్సరముల క్రితమతఁడు పాఠశాలనుండి విరమించి యన్. సి. ఓ. లో జయిలుకు వెళ్ళినట్లు వింటిని. అతడప్పుడు పదిహేను సంవత్సరముల ప్రాంతము వాఁడై యుండెను. ఏదియోజయిలు నియమము నుల్లంఘించెనని యతనిని

కొరడాలతో జయిలులో బాదిరి. తరువాత నతడు టెర్రరిస్టుగా మారి పోయి యుత్తరహిందూదేశములో వారిలోనొక నాయకుడయ్యెను. ఈచరిత్రను నేను కర్ణాకర్ణిగ వింటిని. కాని నేనీవదంతులలో నెట్టిశ్రద్ధను తీసికొనలేదు. కనుక నేనతనిని చూచి యాశ్చర్యపడితిని. కాంగ్రెసుకును ప్రభుత్వమునకును రాయబారము జరుగునను వదంతులనువిని (మేము విడువబడితిమికనుక) యితడు నన్నుచూడ వచ్చెను. సమాధానము కుదిరేయెడల తన సంఘము వారికేమైనను శాంతిచేకూరునా? యని యడుగుట కతడువచ్చెను. వారింకను న్యాయబాహ్యులుగనే భావింపబడి యట్టియాదరణనే పొందుదురా? తలదాచుకొనుటకు చోటులేకుండ తరుమగొట్టబడుదురా? ఉరికంబము లెప్పుడును వారికొరకెదురు చూడవలసినదేనా? లేక ప్రశాంతమగు వృత్తులనవలంబించుటకు సావకాశములున్నవా? అతడును, తన సహచరులలో చాలమందియు కేవల టెర్రరిస్టు పద్ధతులవలన లాభములేదనియు, నాటివలన నెట్టిమంచియు చేకూరలేదనియు గ్రహించితిమని చెప్పెను. అయినను భారతదేశము కేవలము శాంతిపద్ధతుల చేతనే స్వాతంత్ర్యమును బడయగలదను నమ్మకమతనికిలేదు. భవిష్యత్తులో నెప్పుడోయొకప్పుడు దౌర్జన్యము రావచ్చుననియు, కానియది టెర్రరిజముకాదనియు నతడుచెప్పెను; కనుకనతడు భారత స్వాతంత్ర్యముకు సంబంధించి నంతవరకు ప్రస్తుత టెర్రరిజము పనికిరాదనెను. కాని ప్రశాంతముగా నివసించుటకెట్టి యవకాశమును కలుగజేయకుండ "నన్నెల్లప్పుడును తరుమగొట్టుచున్నప్పుడు నేనేమిచేయవలెను?" అని యతడడిగెను. ఈమధ్య జరిగిన టెర్రరిస్టుచర్యలు చాలవరకు ఆత్మరక్షణకొరకు చేయబడినవే యని యతడు చెప్పెను.

టెర్రరిజములో విశ్వాసము నశించుచున్నదని అజదుద్వారా వినుటకు నేను చాలసంతోషించితిని. ఈ విషయములో నాకు తరువాత మరింత నమ్మకము చిక్కెను. అది యొకసంఘముయొక్క భావ

ముగా ననుభవములో నంతరించెను. అచ్చటచ్చటను, వ్యక్తులకు సంబంధించినవియు, నేదోయొక ప్రత్యేక కారణముచేతనో ప్రతీకారముకొరకు లేకవ్యక్తిగత బుద్ధిజాడ్యము చేతనో జరుగుచుండును. కాని సామాన్య భావజనితముకాదు. అనగా పాతటెర్రరిస్టులుకాని వారి నూతన సహాధ్యాయులుగాని దౌర్జన్యరాహిత్యతత్త్వమును స్వీకరించిరనికాని బ్రిటీషు పరిపాలన నభినందించు వారైరనికాని దీని యర్థముకాదు. వారుటెర్రరిజమును యిదివరకువలె భావించుటలేదు. చాలమందికి ఫ్యాసిజము వాసనలున్నట్లు నాకుకాన్పించెను.

నేను చంద్రశేఖర అజదుకు నారాజకీయ చర్యలలోని తత్త్వమును బోధించి యతనిని నాదృక్పథముకు మార్చుకొనవలెనని చూచితిని. కాని "నేనిప్పుడేమిచేయవలెను?" అని యతడడిగిన ప్రధాన ప్రశ్నకు నేను నిరుత్తరుడనైతిని. అతనికిగాని యతనివంటి వారికిగాని యెట్టిశాంతిని ప్రసాదించు నట్టిదేదియు జరుగు సూచనలులేవు. నేను భవిష్యత్తులో టెర్రరిస్టుచర్యలు జరుగకుండ తన పలుకుబడిని వినియోగించవలసినదనియు, వానివలన పెద్దసమస్యకును, తమ సంఘముకును కూడ నపకారము కలుగుననియుచెప్పితిని. రెండుమూడు వారములైన తరువాత గాంధీ యిర్విను సంభాషణలు జరుగుచుండగా, చంద్రశేఖర అజదును అలహాబాదు పోలీసులు కాల్చి చంపివేసిరని నేను ఢిల్లీలో వింటిని. ఒకమైదానములో పగటివేళ నతడు గుర్తింపబడి పెద్ద పోలీసు దళముచే చుట్టివేయబడెను. ఒక చెట్టుచాటునుండి యతడు తన్ను రక్షించుకొనజూచెను. ఇరుపక్షములను తుపాకికాల్పులు చెలరేగెను. అతడు చంపబడులోపల నొకరిద్దరు పోలీసులను గాయపరచెను.

తాత్కాలిక సమాధానము కుదురుటతోడనే నేను ఢిల్లీవీడి లక్నో వెళ్లితిని. దేశమంతటను శాసనోల్లంఘన మాపివేయుటకు మేము కొన్నియేర్పాటులను వెంటనేచేసితిమి. కాంగ్రెసుసంస్థలన్నియు

నత్యద్భుతముగ మా నూతనసందేశముల నమలుజరిపెను. మా సైన్య ములో చాల యసంతృప్తి చెందినవారు, కాలు దువ్వువారు, చాల మందకలరు. వారు తమ పాతచర్యలను మానివేయునట్లు బలవంత పరచుటకు మాకెట్టిసాధనములును లేవు. కాని చాలమంది విమర్శించి నను నాకు తెలిసినంత వరకొక్క మినహాయింపుకూడ లేకుండ నా గొప్పసంస్థ యాచరణలో నీనూతన విధానము నవలంబించెను. మా రాష్ట్రములో కొన్నిప్రాంతములలో పన్నులనిరాకరణ తీవ్రముగ జరుగుచుండుటచే నచ్చటనేమి జరుగునాయని నేను ప్రత్యేకదృష్టితో చూచుచుంటిని. శాసనోల్లంఘన ఖయిదీలందరును విడుదలయగునట్లు మేము మొట్టమొదట చూడవలెను. ప్రతినిత్యము వీరు వేలకొలది విడువబడిరి. కొన్నిరోజులయినతరువాత పేరీలుగల కొద్దిమందిమాత్రమే జయిలులోనుండిరి. వీరు తమ తమ గ్రామములకును, పట్టణములకును పోయినప్పుడు ప్రజలు వీరిని సహజముగ బ్రహ్మాండముగాబహూకరించిరి. తరుచు అలంకారములు, విందులు, యుత్సవములు, యూరేగింపులు, సభలు, యుపన్యాసములు, వినతిపత్రములు కోలాహలముగ జరుప బడెను. ఇదియంతయు చాలసహజముగ జరుగునని యనుకొనవలసినదే. కాని పోలీసులాఠీ చెలరేగి మీటింగులను, యుత్సవములను బలవంత ముగా చెదరగొట్టిన భీభత్సముండి యిది యొక యాకస్మిక మార్పు. పోలీసువారికిది కొంత కన్నెర్రగా నుండెను. బహుశః జయిలులోనుంచి వచ్చినవారిలో చాలమంది విజయోత్సాహముతో నుండిరి. విజయమునొందితి మనుకొనుట కెట్టికారణమునులేదు. కాని జయిలులోనుండి బయటపడుట యెప్పుడును, (జయిలులోనుత్సాహమంత యు నాశముచేయబడిన తప్ప) యుత్సాహోద్రేకమును పుట్టించును. అందులో సంఘమంతయు నొక్కసారిగా విడుదలయైనప్పుడిక యుత్సా హమునకు మేరయుండదు.

నేనీవిషయము నిచ్చట చెప్పవలసివచ్చెను. ఏలనన తరువాత కొన్ని నెలలకు ప్రభుత్వమువారీ 'విజయోత్సాహ' పాపముకు తప్పొప్పు కొని దీనిని మనపై నేరకఛార్జిగాగూడ బనాయించిరి! అధికారపూరిత మగు వాతావరణములో పెరిగి, యెప్పుడును అందులోనేనివసించుచు, ప్రభుత్వమనిన సైన్యమే యనుభావములోనుండి, ప్రజలలోనెట్టి వ్రేళ్లు గాని, యాధారములుగాని లేనివారికి తమగౌరవమని తాముభావించు నది సన్నగిలుచుండుటకంటె బాధకరమగునది వేరొండు యుండబోదు. నేనెరిగినంతవరకు మేమెవరమును యీవిషయము నావంతయు భావింప లేదు. సిమ్లాపర్వతములలోనున్న ప్రభుత్వ అధికారులు లగాయితు క్రిందమైదానములో నున్నవారి వరకును ప్రజలయొక్క యీతిరస్కార భావమునకు కోపముతోను, గర్వభంగ మైనదను భావముతోను కుత కుతలాడిపోవుచున్నారను సంగతిని మేమధిక యాశ్చర్యముతో వింటిమి. ప్రభుత్వమువారి యభిప్రాయములను వ్యక్తపరచు పత్రికల కిప్పటికిని యాదృష్టిపోలేదు. ఇప్పుడుకూడ మూడున్నర సంవత్సరములు గతించిన తరువాత, నవి యాశ్చర్యముతో నులికిపడుచు కాంగ్రెసువారు (వారిప్ర కారము) గొప్పవిజయమును బడసినట్లు విజయోత్సాహముతో పొంగు చుండిన యాసాహసోపేతమగు దుర్దినములను గురించి వ్రాయు చుందురు. ప్రభుత్వము వారియొక్కయు, పత్రికలలోని వారిస్నేహి తులయొక్కయు నీవిజృంభణము మాకొకవింతవార్తగ నుండెను. కొద్ది యూరేగింపులును, మాలోనిసామాన్య సేవకులయొక్క కొద్దియుపన్యాస ములును వారిని తల్లక్రిందులుచేయుట యసాధారణ విషయము.

నిజమునకప్పుడు కాంగ్రెసువారిలోగాని, నాయకులలోగాని బ్రిటిషుప్రభుత్వమును 'ఓడించితి' మనుభావము లేదు. కాని మాప్రజల యొక్క త్యాగములకును, ధైర్యసాహసములకును మాలోవిజయో త్సాహముండెను. 1930 లో దేశముచేసినదానికి మాకుకొంత గర్వ

ముండెను. అది మా యాత్మగౌరవము నభివృద్ధిచేసెను; మాకు విశ్వాసమును చేకూర్చెను. మాయతిచిన్న వాలంటీరుకూడ నీభావప్రపూర్ణుడై యొడలువిరిచి, శిరముపైకెత్తెను. ప్రపంచ దృష్టినాకర్షించిన యీ మహాప్రయత్నము బ్రిటిషుప్రభుత్వమునకు చాలనొత్తిడిని కలిగించెననియు, మమ్ము మాగమ్యస్థానము దగ్గరకు తీసికొని వెళ్లెననియుకూడ మేముభావించితిమి. దీనికంతకును, ప్రభుత్వమును ఓడించుటకును సంబంధమేమియునులేదు. మాలోచాలమంది ఢిల్లీసంధివలన ప్రభుత్వముదే పయిచేయియైనట్లుపూర్తిగాగ్రహించితిమి. మనలక్ష్యమునకు మనమింకను చాలదూరములో నుంటిమనియు, పెద్దపోరాటములు, కఠినతరమైనపోరాటములు ముందరనే యున్నవనియు సూచించినవారిని ప్రభుత్వమువారి స్నేహితులు యుద్ధమునకు కాలుదువ్వుచున్నారనియు ఢిల్లీసంధియొక్క తాత్పర్యముకు భిన్నముగా వర్తించుచున్నారనియు నిందింపసాగిరి.

యు. పి. లో మేమిపుడు వ్యావసాయక సమస్య నెదుర్కొనవలసి యుండెను. బ్రిటిషుప్రభుత్వముతో సాధ్యమైనంతవరకు తోడ్పడుటయే మనప్రస్తుతనీతి. కనుక మేము వెంటనే యు. పి. రాష్ట్రప్రభుత్వముతో సంపర్కమును పెట్టుకొంటిమి. చాలకాల మయినతరువాత పన్నెండు సంవత్సరములనుండి మనకు వారితోనెట్టి యధికార సంబంధమునులేదు. వ్యావసాయక సమస్యను చర్చించుటకు నేనురాష్ట్రములోని గొప్పయధికారులను చూచితిని. ఈవిషయమును గురించి మేము దీర్ఘములగు యుత్తర ప్రత్యుత్తరములనుకూడ జరిపితిమి. మారాష్ట్రకాంగ్రెసుకమిటీ మాముఖ్యనాయకులలోనొకడైన గోవిందవల్లభపంతులును రాష్ట్రప్రభుత్వముతో నిరంతరాయముగ సంపర్కమును కలిగియుండు ప్రత్యేక యుద్యోగిగ నియమించెను. వ్యావసాయక దుస్థితిలోని సత్యములును, వ్యవసాయదినుసుల ధరలద్భుతముగా పడిపోవు

టయు, సామాన్యరయితు చెల్లింపవలసిన పన్ను చెల్లింపలేని దుస్థితిలో నుండుటయు నంగీకరింపబడెను. ఎంత రెమిషను యివ్వవలె ననునదియే సమస్య. ఈవిషయములో రాష్ట్రప్రభుత్వమే దారిచూపవలెను. సామాన్యముగ ప్రభుత్వమువారు భూఖామందులతోనే వ్యవహరించు చుండిరి. వారికి రైతులతో ప్రభుత్వముకెట్టి ప్రత్యక్ష సంబంధమును లేదు; భూఖామందులే పన్నులను తగ్గించుటగాని, కొట్టివేయుటగాని చేయవలెను. కాని ప్రభుత్వమువారు తమకు రావలసిన రెవిన్యూలో కొంతతగ్గించుకొనినగాని జమీందారులు యేమియు తగ్గించమనిరి. సాధారణముగా వారు తమరయితులకెట్టి రెమిషనులను యిచ్చుటకు శ్రద్ధ వహించరు.

రాష్ట్రకాంగ్రెసుకమిటీవారు రయితులతో పన్నులనిరాకరణము ఆపివేయబడినదనియు, వారుచెల్లింప గలిగినంతవరకు పన్ను చెల్లింపవలెననియు చెప్పిరి. కాని వారి ప్రతినిధులుగా వారి తరఫున కమిటీవారు ఎక్కువరిమిషనులను కోరిరి. చాలకాలమువరకు ప్రభుత్వమువారెట్టి చర్యను తీసికొనలేదు. బహుశః గవర్నరుగారైన సర్ మాల్కాము హైలీగారు సెలవుమీదనో లేక ప్రత్యేకపనిమీదనో యుండుటచే నీయాలస్యము జరిగియుండవచ్చును. చురుకుదనమును, దూరదృష్టియుగలచర్య యత్యవసరమయియుండెను. తాత్కాలిక గవర్నరును, అతనిసహాయులును మాటయిచ్చుటకు సందేహించి వేసవిలో సర్ మాల్కాముహైలీ వచ్చువరకును దీనినాపుచేయ నిశ్చయించిరి.

ఈ యనిశ్చయమును, ఆలస్యమును కష్టస్థితిని మరింత యధ్వాన్న మొనర్చెను. దీనివలన రయితులబాధ మరింత ద్విగుణమయ్యెను.

ఢిల్లీసంధి యగుటతోడనే నాయారోగ్యము కొంచెము చెడెను. జయిలులోకూడ నేనస్వస్థతగనే యుంటిని. తరువాత తండ్రిగారి మరణమువలనకలిగిన విచారమును, వెంటనే ఢిల్లీరాయబారములలో కలిగిన

దీర్ఘకాలపరిశ్రమయు నాశరీరారోగ్యమును క్రుంగదీసెను. కరాచీ కాంగ్రెసునాటికి నేనుకొంచెము తేరుకొంటిని.

కరాచీ హిందూదేశమునకు పశ్చిమోత్తరముగా, పోవుటకంత సుగమముకాకుండ, చాలదూరములోనున్నది. అది తక్కిన దేశముతో కొంతవరకు యెడారి ప్రదేశమునవలన వేరుచేయబడుచున్నది. కాని యది భారతదేశములోని వివిధప్రాంతములనుండి యనేకవేలమంది నాకర్షించి దేశములోనియప్పటియుద్రేకమును యథార్థముగ వెలిబుచ్చెను. భారతదేశములో జాతీయోద్యమము దినదినాభివృద్ధి యగుచున్నదనుప్రశాంతమును, గంభీరమునునగు సంతృప్తియొకటి కలిగెను. ఇంతవరకు తనకెట్టి దుర్భరములగు సంకటములువచ్చినను వాటి నతియోగ్యముగతరించి, తనకర్మమైన త్యాగముచే తనయునికిని ధన్యము గావించుకొనిన కాంగ్రెసు సంస్థయందు గౌరవమును, మన ప్రజలయందు విశ్వాసమును, హద్దులనుమీరని యుత్సాహము ద్యోతకమగుచుండెను. కాని ముందున్న భయంకరములగు సమస్యలపట్లను, యుపద్రవములపట్లను విపరీతమగు బాధ్యత కలదనుభావముకూడ పీడించుచునేయున్నది. మన మాటలును, తీర్మానములును జాతీయ ప్రయాణములో జరుపవలసిన చర్యల కుపోద్ఘాతములు; కనుకవాటిని తేలికగ నుచ్చరించుటకుగాని, తీర్మానించుటకుగాని వీలులేదు. ఢిల్లీసంధిని, యత్యధిక సంఖ్యాకు లొప్పుకొనినను అదియంత యామోదకరముగలేదు. అది మనల ననేకరకములైన రాజీలకుదింపునేమో యనుభయముకూడకలదు. అదియొక విధముగ దేశముముందరగల సమస్యలలోని స్పష్టతను తీసివేసినట్లు కాన్పించెను. కాంగ్రెసు జరుగు సమయముననే మరియొక విషాద కారణము - భగత్సింగుయొక్క యురి - సంభవించెను. ఈభావము ముఖ్యముగా నుత్తరహిందూదేశములో నుండెను. కరాచీ, యుత్తరముననుండుటచే, పంజాబునుండి యనేకమంది ప్రజలనాకర్షించెను.

వెనుకటి కాంగ్రెసు లన్నిటికంటెనుకూడ కరాచీకాంగ్రెసు గాంధీజీకి వ్యక్తిగతముగా బ్రహ్మాండమగు విజయమని చెప్పకతప్పదు. గుజరాతులో విజయభేరి మ్రోగించిన నాయకుడను బిరుదుగాంచి, భారతదేశములో పేరెన్నిక పొందినవారిలో నొకడును, మహాశక్తివంతుడును అగు సర్దారువల్లభాయి పటేలు అధ్యక్షుడైనను మహాత్ముడే యారంగము పాలించెను. అబ్దుల్‌గఫర్‌ఖాను యాధిపత్యమున సరిహద్దుల నుండి కాంగ్రెసుకు 'యర్రచొక్కాల' పటాలమొకటి వచ్చెను. ఈ 'యర్రచొక్కాల' వారికీర్తి దేశమంతటను పాకుటచే వారెచ్చటకు పోయినను అభినందింపబడుచుండిరి. 1930 ఏప్రిల్‌లగాయితు, యెంత ప్రకోపింపబడినను, వారసాధారణమును, శాంతియుతమునునగు ధైర్య, సాహసములనుప్రదర్శించుటచే హిందూదేశమంతయు వారిసాహసమును వేనోళ్లగొనియాడెను. 'యర్రచొక్కాలు' అనుపేరుచే కొంతమంది యన్యాయముగా, వారు కమ్యూనిష్టులనియు, లేక లేబరుపార్టీలో నెడమ పక్షమువారనియు భ్రమించుచుందురు. నిజమునకు వారిపేరు "ఖుదై ఖిద్మతుగర్" ఈసంస్థ కాంగ్రెసులోచేరెను. తరువాత 1931 లో నది కాంగ్రెసులో నొకభాగమయ్యెను. వారుధరించు పూర్వకాలపు యర్రటి దుస్తులచే వారిని యర్రచొక్కాల వారందురు. వారి ప్రణాళికలో నార్థికస్థితి యేమియునులేదు. అది జాతీయమును, సంఘసంస్కారముకు సంబంధించినదియునై యుండెను.

కరాచీలోని ప్రధానతీర్మానము ఢిల్లీసంధిని, రౌండుటేబిలు కాన్ఫరెన్సును గురించిన తీర్మానము. నేను దానిని వర్కింగుకమిటిలో నామోదించితిని; కాని గాంధీజీ నన్నుదానిని బహిరంగ కాంగ్రెసులో ప్రతిపాదింపమనినపుడు నేనుసందేహించితిని. అది నాకసాధ్యమయ్యెను. మొదట నేను తిరస్కరించితిని. కాని యిది దుర్బలమును నసంతృప్తికరమును నైనస్థితి. నేను దానికి వ్యతిరేకమైనను కావలెను, లేదాదానిని

సమర్థించవలెను. ఊగిసలాడుచుండుటయు, ప్రజలను సందేహ మనస్కు చేయుటయు యుక్తముకాదు. చివర నిమిషములో బహిరంగ కాంగ్రెసులో తీర్మానము నిక ప్రవేశపెట్టుటకు సిద్ధముగానున్న సమయములో నేను దానిని ప్రతిపాదించుటకు నిశ్చయించుకొంటిని. నా యుపన్యాసములో నామహాసభలో నేను నాభావములన్నిటిని నిర్మొగమాటముగ విశదీకరింప ప్రయత్నించితిని. నేను దానిని మనఃపూర్వకముగ నంగీకరించుటకు గల కారణములను చెప్పి, వారినికూడ దానికంగీకరింప వలసినదని కోరితిని. ఆక్షణములో నిచ్చిన యా యుపన్యాసము హృదయకుహరమునుండివచ్చి, యెట్టియలంకారములును, లలితశబ్దజాలమును లేక, జాగ్రత్తగ తయారుచేయబడిన నాయితరయుపన్యాసములకంటె, బహుశః యెక్కువవిజయమును బడసెను.

నేనుయితర తీర్మానముల మీదకూడ, ముఖ్యముగ, భగత్సింగు తీర్మానముమీదను, ప్రధానహక్కులను గురించిన తీర్మానముమీదను, ఆర్థికనీతిమీదను మాట్లాడితిని. ముఖ్యముగా చివరతీర్మానమునందు, కొంత దానిలోని హంశముచేతను, అంతకంటెనెక్కువగ, నదికాంగ్రెసులో నొకనూతనదృష్టిని తెలుపుటచేతను, నాకెక్కువ శ్రద్ధ కలిగెను. ఇంతవరకుకాంగ్రెసు, గృహపరిశ్రమలకును, సామాన్యముగ 'స్వదేశీ'కిసంబంధించినంతవరకుతప్ప, కేవలజాతీయపద్ధతులనుసూచించెనుగాని యార్థిక సమస్యలను తలపెట్టలేదు. కరాచీతీర్మానములో నది సామ్యవాదమునై పు నొక యడుగు, చాలచిన్నయడుగు, ముందుకు వేసెను. అది ప్రధానపరిశ్రమలను, సేవలను జాతీయపదముచేయవలెననెను. బీదల మీద భారమునుతగ్గించి ధనవంతులమీద దానిని హెచ్చించు ననేక యితర విధానములను సూచించెను. ఇదియెంత మాత్రమును సామ్య వాదముకాదు. పెట్టుబడిదారుల ప్రభుత్వము యీతీర్మానములోనున్న ప్రతిదానిని సులభముగా నంగీకరింపవచ్చును.

అతిమాంద్యమును, పేలవమునునగు నీతీర్మానమే భారత ప్రభుత్వములోని పెద్దలనుగుడ్లెఱ్ఱజేసి యోచించునట్లు చేసెను. బహుశః వారు, వారిమామూలు సూక్ష్మబుద్ధితో, దొంగతనముగా కరాచీ వచ్చి కాంగ్రెసు నాయకులను పాడుచేసిన బోల్షివిక్కుల యఱ్ఱబంగార మునుగూడ వర్ణించియుందురు. ఒకవిధమగు రాజకీయ యంతఃపురములో జీవించుచు, బాహ్యప్రపంచముతో నెట్టిసంబంధమునులేక, రహస్య వాతావరణముచే చుట్టివేయబడిన వారిగ్రహణబుద్ధి యద్భుతకథలను, కట్టుచరిత్రలను వినుటకు కుతూహలపడును. తరువాతనీకథలు, వార భక్తగణములో చేరినవార్తాపత్రికలలో రహస్యముగురీతిని చిన్నచిన్న వార్తలుగావచ్చుచు తెరతీసివేసినచో నింకనుఅనేకములు విశదము కాగలవను సూచనకూడ వేయబడును. కరాచీతీర్మానములోని ప్రధాన హక్కులు మొదలగువాటికి సంబంధించిన విషయములనుగురించి యాదరింపబడుచు, యథేచ్ఛగా నాచరింపబడుచున్న పైవిధమున కొన్నికథలుసృష్టింపబడెను. ఈతీర్మానమునుగురించి యివి ప్రభుత్వాభిప్రాయమునే వెల్లడించుచున్నవనినేనుసారాంశము తీయవలసియున్నది. ఒకరహస్యవ్యక్తి, కమ్యూనిస్టుసంబంధములుకలవాడు, యీతీర్మానమును వ్రాసెననియు, అథమము దానిలోచాలభాగము నైననువ్రాసెననియు, దానినతడుకరాచీలో నా మీదపార వేసెననియు, దానిమీదయీతీర్మానము నంగీకరించవలెననియు లేదాఢిల్లీసంధిసమస్యమీద నేనతనిని ఢీకొనెదననియు గాంధిజీకొక సంగ్రామసందేశమును నేను బంపితినియు నీకథబ్రువ్వెను. గాంధీగారు నాకొకలంచముగా దీనినంగీకరించి యదివరకే విసిగియున్న విషయనిర్ణయసభవారిచేతను, చివరరోజున బహిరంగకాంగ్రెసుచేతను బలవంతబ్రాహ్మణార్థముగా దీనికొప్పించెనట.

ఆ 'రహస్యవ్యక్తి' యెవరో, యింతవరకు నాకు తెలిసినంతవరకు, నెచ్చటను ప్రత్యక్షముగా నుదహరింపబడలేదు. కాని యావ్యక్తి యెవరో స్పష్టముగా గ్రహించునట్టి సూచన లనేకములు చేయబడెను.

రహస్యపద్ధతులును, ద్రావిడప్రాణాయామపద్ధతిగా మాట్లాడుటయు నాకు చేతగావు. కనుక నీవ్యక్తి యం. యన్. రాయివలె కాన్పించునని నేను నిర్మొగమాటముగ చెప్పవచ్చును, కాని యం. యన్. రాయి గాని 'కమ్యూనిష్టువాసన' గల మరేవ్యక్తిగాని నిరపరాధమైన యీక రాచీ తీర్మానమును గురించి యెట్లు భావించునో తెలిసికొనుట సిమ్లా, ఢిల్లీలలోని యీపెద్దలకొకపాఠముగను, వినసొంపుగను నుండగలదు. అట్టి వారిదృష్టిలో (మధ్యతరగతులలోని సంస్కరణవాదుల సమో నాలో తయారయిన యీతీర్మానము)అతిహేయముగ నుండునని వినుట వీరి కాశ్చర్యముగ నుండవచ్చును.

గాంధీగారితో గత పదిహేను సంవత్సరములనుండి నాకత్యంత పరిచయము కలదు. నేనతనికి సందేశములను పంపుట లేక సతనితో బేరములాడుట యను భావము నాకు క్రూరముగ తోచును. మేము పరస్పరము సమాధానపడవచ్చును. లేదా యొక సమస్యమీద విడిపో వచ్చును. కాని మా పరస్పర సంబంధములలో సంతబేరముల పద్ధతుల కెన్నడును ఆస్కారముండదు.

కాంగ్రెసుచే నిట్టి తీర్మానమును చేయించవలెనను భావము పురాతనమైనది. సంవత్సరముల కొలది యు. పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీ యీవిషయమై యాందోళన చేయుచునే యుండెను. అది అ. భా. కా. కమిటీచేత సామ్యవాద తీర్మానము నంగీకరింపచేయుటకు ప్రయత్నించుచుండెను. 1929 లో అ. భా. కా. కమిటీ యీ సూత్రము నంగీకరించునట్లు యది కొంతవరకు చేయగలిగెను. తరువాత శాసనోల్లంఘనము వచ్చెను. 1931 ఫిబ్రవరి, మార్చి మాసములలో నేను గాంధీజీతో ఢిల్లీలో ప్రతివ్యవహారములకు పోవునప్పుడీవిషయమును కదిపితిని. ఆర్థిక విషయములను గురించిన తీర్మానముండవలెనను భావము నతడాహ్వానముచేసెను. ఈ విషయమును కరాచీలో తీసు

కొనిరావలసినదనియు, దీనికి సంబంధించిన తీర్మానమును వ్రాసి తన కచ్చట చూపవలసినదనియు నతడు చెప్పెను. కరాచీలో నేనట్లు చేసితిని. అతడు అనేకమార్పులను, సూచనలను చేసెను. దానిని వర్కింగు కమిటీలో పెట్టుటకు పూర్వము మేముయుభయులము దాని లోని పదముల కంగీకరింపవలెనని యతడనెను. నే ననేకచిత్తులను వ్రాయవలసి వచ్చుటచే కొద్దిరోజు లాలస్యమయ్యెను. మా కనేక యితర విషయములుకూడ నుండెను. చివరకు మేమిరువురము నొక ముసాయిదా కంగీకరించి, దానిని వర్కింగుకమిటీ ముందరను, తరువాత విషయనిర్ణయ సభలోను తెచ్చితిమి. విషయనిర్ణయ కమిటీ కది క్రొత్తవిషయ మనుసంగతి పూర్తిగా నిజము. కొంతమందిసభ్యుల కది యాశ్చర్యమును కలిగించెను. అయినను అది కమిటీలోను, కాంగ్రెసులోనుకూడ సులభముగనే యామోదింపబడెను. అందులో నుదహరింపబడిన సూత్రముల ప్రకారము దానిని స్పష్టపరచి విపులముచేయుట కది అ. భా. కా. కమిటీవారికీయబడెను.

నేనీతీర్మానమును వ్రాయునపుడు నాడేరాలోనికి నన్ను చూడ వచ్చిన యనేకమందితో దీనినిగురించి చర్చించితిని. కాని యం. యన్. రాయి కీ తీర్మానముతో నెట్టిసంబంధమునులేదు. అతడు దీనిని నిరసించుననియు, పరిహాసము చేయుననియు నాకు బాగుగ తెలియును.

కరాచీ వచ్చుటకు కొద్దిరోజులుపూర్వము అలహాబాదులో నేను యం. యన్. రాయిని కలుసుకొంటిని. అతడొక సాయంకాల మకస్మాత్తుగా మాయింటికి వచ్చెను. అతడు భారతదేశములో నున్నాడనుభావము నాకు లేకపోయినను, 1927 లో నేనతనిని మాస్కోలో చూచుటచే, నేను వెంటనే యానవాలు పట్టితిని. అతడు నన్ను కరాచీలోకూడ చూచెను. కాని మేమయిదు నిమిషములకంటె నెక్కువగ కలిసియుండలేదు. గత కొద్దివత్సరములనుండి రాయి నన్ను రాజకీయ

ముగ నిరసించుచు నెంతయో వాదించెను. అతడనేకసారులు నాకు కొంచెము బాధకలిగించెను. మాకిద్దరకును చాల గొప్ప భేదము కలదు. కాని యతడు నన్నాకర్షించెను. తరువాత నతడు నిర్బంధింపబడి చిక్కులలో పడినపుడు నేనుచేయగలిగిన సహాయమును (అదిచాలతక్కువ) చేసితిని. అతని యద్భుతమగు బుద్ధివిశేషము నన్నాకర్షించెను. అత డందరచేతను విడిచిపెట్టబడి యేకాకియగుటచేకూడ నామనసు ద్రవించెను. బ్రిటిషు ప్రభుత్వమువారు సహజముగ నతనిని వెన్నంటుచుండిరి. జాతీయభారత దేశముకతనియందు మోహములేదు. భారతదేశములో కమ్యూనిస్టులన బడువారతనిని ద్రోహియని నిరసించిరి. అనేకసంవత్సరములు రష్యాలో జీవించికామింటర్నులతో చిరసహకారముసలిపిఅతడువారిని విడిచిపెట్టెను. బహుశః విడిచిపెట్టునట్లు చేయబడెను. ఇది యెందుచేత జరిగెనో నాకు తెలియదు. అతని ప్రస్తుత యభిప్రాయము లెవ్వియో, సనాతన కమ్యూనిస్టులతో నతనికి గల భేదాభిప్రాయము లెవ్వియో (అతియస్పష్టముగ తప్ప) నాకిప్పటికిని తెలియవు. కాని యటువంటి వ్యక్తిని ప్రతివాడును విడిచివేయుట నాకు బాధ కలిగించుటచే, నేను నామామూలు యల వాటుకు వ్యతిరేకముగ డిఫెన్సుకమిటీలో చేరితిని. 1931 లోని వేసవి లగాయతు నేటివరకు మూడేండ్లకు పయిన నతడస్వస్థుడై జయిలులో నొంటికొట్టులో నున్నాడు. కరాచీలో సభ ముగియులోపల క్రొత్త వర్కింగు కమిటీని యెన్నుకొనవలసి యుండెను. దీనిని అ. భా. కా. కమిటీవారు యెన్నుకొనెదరు. కాని యాసంవత్సర అధ్యక్షుడు (గాంధీజీతోను ఒక్కొక్కపుడు యితరులతోను సంప్రతించి) సూచించు పేరులనే అ. భా. కా. కమిటీవారంగీకరించు యాచారమొకటి యేర్పడెను. కరాచీలో జరిగిన వర్కింగు కమిటీ యెన్నికవలన మేమెన్నడును యూహింపని కష్టమొకటి యేర్పడెను. అ-భా-కా-కమిటీలోని కొందరు ముస్లిముసభ్యులు యీయెన్నికకు (ముఖ్యముగానొకముస్లిముపేరుకు) అభ్యంతరపెట్టిరి. బహుశః వారుతమవర్గములోని వారినెవరిని యెన్ను

కొనక పోవుటచే చిన్నబుచ్చుకొని యుండవచ్చును. పదిహేనుగురు సభ్యులుగల అఖిలభారతకమిటీలో నన్నితరహాల ప్రాతినిధ్యమును కుదురుట యసంభవము. అసలుతగాదా (దానినిగురించి మేమేమియు నెరుగము) పంజాబుకు సంబంధించిన వ్యక్తిగతమైన స్థానిక పేచీ. ఫలితమేమనగా నెన్నికను నిరసించిన వర్గమువారు క్రమముగా పంజాబులోని కాంగ్రెస్ పార్టీనుండి చీలి 'అహ్రారుపార్టీ' లోచేరిరి. పంజాబులో చాల పలుకుబడియు నుత్సాహమును కలవారు కొందఱు కాంగ్రెసు ముస్లిములు దీనిలోచేరిరి. ఇదిచాలమంది పంజాబుముస్లిములను ఆకర్షించెను. ఇదిముఖ్యముగా, మధ్యతరగతులలోని క్రిందితరహాకు చెందినవారికి ప్రాతినిధ్యమువహించెను. దీనికిముస్లిము ప్రజలతో ననేక సంబంధములుండెను. పయితరగతులవారికి చెంది కూలిపోవుచున్న ముస్లిముకులతత్వ ప్రధానమైన సంస్థలకంటె నిదిచాల బలవత్తరమైన సంస్థయయ్యెను. విధాయకముగ అహ్రారులు కులతత్వమునైపు మొగ్గ నారంభించిరి. కానిముస్లిము ప్రజలతో వారికి సంబంధముండుటచేనదిసజీవమగుసంఘమయి యస్పష్టమయిన యార్థికదృష్టినికలిగియుండెను. వారు తరువాత భారతసంస్థానములలో, ముఖ్యముగా కాశ్మీరములో, ముస్లిము ఆందోళనలో ప్రధానస్థానమును వహించిరి. ఇచ్చట ఆర్థిక యనర్థములును, కులతత్వములును దురదృష్టముగను, వింతగను కలగాపులగము చేయబడెను. కాంగ్రెసులోనుండి అహ్రారుపార్టీ నాయకులుకొందఱు జారిపోవుట పంజాబులోని కాంగ్రెసుకు తీరనినష్టమయ్యెను. కాని కరాచీలో మాకీసంగతి తెలియదయ్యెను. ఈజ్ఞానము క్రమముగా తరువాత నెలలో నంకురించెను. వర్కింగుకమిటీ యెన్నికవలన కలిగినకోపము చేతనే వారుజారిపోలేదు. అది వాయుప్రసారగతిని తెలుపు నొకతృణము. యథార్థ కారణము లంతర్గర్భితమై యుండెను.

మేమందరిమును కరాచీలో నుండగనే కాన్పూరు హిందూ ముస్లిము కలహవార్తలు మాకుచేరెను. ఉద్రేకపూరితులగు ప్రజలు

తమకు సహాయము చేయుటకు ప్రయత్నించుచుండిన గణేశశంకర విద్యార్థిని చంపివేసిరను వార్తకూడ వెంటనేవచ్చెను. భయంకరమును, పశుప్రాయమునునగు ఆకలహములు దేశారిష్ట ప్రదములు. గణేశజీ యొక్క మృత్యువే, మరేదియు చేయజాలనట్లు, దీనినిరుజువు చేయు చున్నది. ఆకాంగ్రెసు మకాములోనున్న వేలకొలదిప్రజ లతనినెరుగు దురు. యు. పి. నివాసులమగు మాకందరకు నతడు ప్రియతమమైన మిత్ర రత్నము, సహచరుడు. యొక్కవాని ధైర్యసాహసము, దూరదృష్టి జ్ఞానప్రపూర్ణమగు నాలోచన, నిరంతరోత్సాహము, ఉద్యోగమును, కీర్తిని, ప్రకటనను నిరసించుచు ప్రశాంతముగ పనిచేయు కర్మవీరత్వము- ఆహాయెన్నిగుణములు! తానమితముగా ప్రేమించి, సేవించిన యుద్య మముకొరకతడు తనయౌవనగర్వములో తన యసువుల నర్పించెను. పాపిష్టి చేతులతనిని చంపివేసెను. కాన్పూరు పట్టణమును, రాష్ట్రమును అప్రతిమాన శోభతో వెలిగిన యొకరత్నమును పోగొట్టుకొనెను. ఈ వార్తవినపడుటతోడనే కరాచీలోని యు. పి. గుడారము లంధకార బంధురములయ్యెను. ఒక తేజస్సుగతించినట్లుకాన్పించెను. అయినను మృత్యువునతి నిర్భయముగా నెదుర్కొని యశఃకాంతులతో చనిపోతినను గర్వమతనికుండెను.

## ౩౬

## దక్షిణదేశవిహారము.



నాడాక్టర్లు నన్ను విశ్రాంతితీసికొన వలసినదనియు, యాత్ర చేయ వలసినదనియు బలవంతపరచుటచే నేను సింహళములో నొక మాసముగడుప నిశ్చయించితిని. భారతదేశ మెంతవిశాలమైన దైనను నాకునిజమైన మార్పుకుగాని, మానసిక విశ్రాంతికిగాని తగినయవకాశము లిచ్చుటలేవు. ఏలనన నేనెచ్చటకువెళ్ళినను రాజకీయ సహాధ్యాయులు నన్నుకలుసు కొందురు. దానితోమామూలు సమస్యలన్నియు నన్ను వేధించును. సింహళము హిందూదేశము క్రిందుబాటులోనున్న యతిసమీపదేశము. కనుక కమలయు, నిందిరయు, నేనును సింహళము వెళ్ళితిమి. 1927 లో యూరపునుండి తిరిగివచ్చిన తరువాత నేననుభవించిన మొకటి సెలవుదినమిదియే. నాభార్యయు, కుమార్తెయు, నేనును కలసి యెట్టివిచారమును లేకుండ ప్రశాంతముగ గడుపుట కదియే ప్రథమము. ఈయనుభవమును నేను తిరిగి యనుభవించలేదు. ఇట్టిదెన్నడైనను తిరిగి కలుగునా యని నేనొక్కొక్కప్పుడాశ్చర్య పడుచుందును.

అయినను నువరాఎలియా యనుచోట రెండువారములు మాత్రముతప్ప సింహళములో నిజముగా మాకెక్కువ విశ్రాంతి లేకుండెను. అచ్చటనన్ని తరగతులవారును మా కపారమైన యాతిథ్యమునిచ్చిరి. మాయెడల సుహృద్భావమును చూపిరి. ఇంతప్రేమను చూడగలుగుట మాకానందముగనే యుండెను. కాని యదితఱచు బాధకరముగకూడ నుండెడిది. నువరాఎలియాలో కూలీలజట్టులును, తేయాకుతోటలలోని పనివాండ్రును, యితరులును ప్రతిదినమును అనేక

మైళ్ళ దూరమునుండివచ్చుచు తమతోనడవిపువ్వులు, కూరగాయలు, యిండ్లలో తయారుచేయబడిన వెన్న మొదలగు బహుమతులను తెచ్చుచుండెడివారు. మేము సాధారణముగా సంభాషించుటకైనను వీలుండెడిదికాదు. మేమొకరినొకరుచూచి నవ్వుకొనుచుండెడివారము. వారి దారిద్ర్యములోనుండి వారుమాకు తెచ్చి యిచ్చుచుండెడి యీ యమూల్యములగు బహుమతులతో మాగృహము నిండుచుండెను. మేము వాటినిఁ యచ్చటనున్న ఆస్పత్రికిని, యనాథ శరణాలయములకును పంపుచుండెడివారము.

మే మాద్వీపములోని యనేకసుప్రసిద్ధ దృశ్యములను, చరిత్రాత్మకమైన శిధిలములను, బౌద్ధఋషికులములను, సుందరారణ్యసీమలను చూచితిమి. అనురద్ధపురములో కూర్చొనియున్నట్లుండిన బుద్ధవిగ్రహము మనోహరముగనుండెను. ఒకసంవత్సర మయిన తరువాత, నేను డేరహూను జయిలులోనుండగా సింహళములోని యొక స్నేహితుడు నాకీవిగ్రహముయొక్క చిత్రమునొకదానిని పంపెను. నేనుదానిని నాగదిలోని యొకచిన్న బల్లమీద పెట్టితిని. అదినాకొక విలువయైన స్నేహితుడయ్యెను. బుద్ధవిగ్రహముయొక్క శక్తిసంపన్నమును, ప్రశాంతమునునగు యీముఖలక్షణములు నన్నుశాంతపరచి, నాకుశక్తినిచ్చి, నామనోవ్యాకులతను పోగొట్టుచుండెను.

బుద్ధుడు నన్నెప్పుడును ఆకర్షించెను. ఈయాకర్షణమునకు కారణములను నేనుచెప్పజాలను. అది మతసంబంధమైనది మాత్రముకాదు. బౌద్ధమతము చుట్టును పెరిగిన సిద్ధాంతములతో నాకు ప్రసక్తిలేదు. అతనివ్యక్తియే నన్నాకర్షించెను. అట్లే జీససుయొక్క వ్యక్తికూడ నన్నెక్కువగ నాకర్షించెను. బౌద్ధమఠములలోను, రోడ్డులమీద పోవునపుడును పూజింపబడుచుండెడి బౌద్ధభిక్షువులను నేనెందరినో చూచితిని. వారందరియొక్కయు ప్రధాన లక్షణమేమనిన శాంతి, యాత్మశాంతి,

ప్రపంచ సంబంధములగు విచారములందు వారసంగులై యుండిరి. సాధారణముగా వారిముఖములందు బుద్ధివికాసము కాన్పించదు. వారి ముఖములందు భయంకర మానసిక సంగ్రామచిహ్నము లేవియు కాన్పించవు. వారికి జీవితము మహాబ్ధినిజేరుటకు ప్రశాంతముగా మంద గమనముతో ప్రవహించు నొక నదివలె నుండెను. నేనువారిని కొద్ది యీర్ష్యతో చూచితిని; ఒక యాశ్రయమునకు జేరవలెననెడి కనపడని కోరిక కలిగెను. కాని నాజాతక మట్టిదికాదనియు, దానిని తుపానుల మధ్యను, ఝంఝామారుతములమధ్యను గడపవలెననియు నేనుబాగుగ నెరుగుదును. నాకట్టి యాశ్రయమును లేదు. నాకు బయట తుపాను లెంత భీభత్సముగనుండెనో యాంతరంగిక ప్రభంజనుడుకూడ నట్లే యుండెను. భయంకర వీచికలనుండి నన్నుకాపాడు యాశ్రయ మొకవేళ నాకు దొరికినను నేనచ్చటశాంతిని, సుఖమును పొంది యుండగలనా ?

కొంచెము కాల మా యాశ్రయము మనోజ్ఞముగనే యుండెను; సుఖముగపడుకొని, కలలనుగనుచు ప్రాణదాయకములగు నుష్ణదేశ వాయుప్రసారముల ననుభవింపవచ్చును. అప్పటి నాభావములకు సింహళదేశ మెంతయు నాకు తగియుండెను. ఆద్వీపముయొక్క సౌందర్యము నాకానందమును కలిగించుచుండెను. మావిహారదినములు త్వరలోనే పరుగెత్తెను. విచారముతో మేముసెలవు తీసికొంటిమి. ఆదేశమును,ఆప్రజలును నాకనేకసారులు స్మరణకువత్తురు. జయిలులోనిశూన్యదినములలో నాకవి సహవాసముగ నుండెను. జాఫ్నాలోజరిగిన యొకచిన్నకథ నాకు జ్ఞాపకముండెను. ఒకపాఠశాలలోని యుపాధ్యాయులును, విద్యార్థులును మామోటారునాపి మాకుకొన్ని స్వాగతవాక్యములను చెప్పిరి. ఆవిద్యార్థుల యుత్సాహోత్కంఠ పూరితములగు ముఖములు నన్నాకర్షించెను. వారిలో నొకడు నాదగ్గరకువచ్చి కరస్పందన మొనర్చి ప్రశ్నగాని వాదముగాని లేకుండ "నేను వెనుకంజవేయువాడను కాను" అని

చెప్పెను. నిశ్చయపరిపూర్ణమై, ప్రకాశించు నేత్రములు గలిగిన యాయువకుని ముఖము నామనసమున నాటుకొనెను. అతడెవరో నాకు తెలియదు. నాకతని జాడలేవియు దొరకలేదు. కాని యతడు తన ప్రతిజ్ఞను నిలుపుకొనుననియుఁ కష్టతరములగు జీవితసమస్యల నెదుర్కొన వలసి వచ్చినపుడతడు వెనుకంజ వేయడనియు నావిశ్వాసము.

సింహళమునుండి మేముదక్షిణ హిందూదేశము, సరాసరి కన్యాకుమారి యొక్కదక్షిణాగ్రమును చేరితిమి. అచ్చట చాలప్రశాంతముగ నుండెను. తరువాత తిరువాన్కూరు, కొచ్చి, మలబారు, మైసూరు, హైదరాబాదు మొదలగు స్వదేశసంస్థానములను చూచితిమి. ఇందులోకొన్ని యాజాతిలో చాలయభివృద్ధినొందెను. కొన్ని చాలవెనుకబడి యుండెను. తిరువాన్కూరు, కొచ్చి సంస్థానములు విద్యావిషయములోబ్రిటిషుయిండియాకంటె చాలయభివృద్ధిలోనున్నవి. మైసూరు బహుశః పారిశ్రామికముగ నభివృద్ధిలోనుండెను. హైదరాబాదు పూర్తిగా పురాతన ఫ్యూడలురాజ్య చిహ్నము. మాకు ప్రతిచోటను ప్రజలును, అధికారులునుకూడ నాదరాభిమానములను చూపిరి. కాని మారాకవలన ప్రజ లుపద్రవకరములగు నాలోచనలను చేతురేమోయను భయము అధికారులకుండెను. మైసూరు, తిరువాన్కూరులు ఆసమయములో కొంతపౌరస్వాతంత్ర్యమును, రాజకీయ కృషికి కొన్ని సావకాశములను కలిగించినట్లు కాన్పించెను. హైదరాబాదులో నీమాత్రముకూడ పూర్తిగాశూన్యము. మా కెంత యాదరణ చూపబడినను నాకుక్కిరిబిక్కిరియైనట్లే యుండెను. తరువాత మైసూరు, తిరువాన్కూరులు తామిదివరకు కలుగచేసిన కొద్ది సావకాశములను లాగివేసిరి.

మైసూరు సంస్థానములోని బెంగుళూరులో నొకమహాసభ జరిగెను. అప్పుడునేనొక బ్రహ్మాండమైన యినుపస్తంభము మీద

జాతీయజెండాను లేవదీసితిని. నేను వెళ్ళిపోయిన కొద్దికాలముకే యీ స్తంభము ముక్కముక్కలుగ విరుగగొట్టబడెను. మైసూరు ప్రభుత్వ మువారు జెండాను చూపుట నేరమనిప్రకటించిరి. నేను యెత్తిన జెండాను యీ విధముగ నిరాదరించి నిరసించుట నాకు బాధకరముగ నుండెను.

నేడు తిరువాన్కూరులో కాంగ్రెసుకూడ అక్రమసంఘ మయ్యెను. శాసనోల్లంఘన మాపివేయబడిన తరువాత బ్రిటిషు ఇండి యాలో నదిసక్రమ సంఘమేమైనను అచ్చట నెవరును దానికి సామాన్య సభ్యులనుకూడ జేర్పించకూడదు. ఈ విధముగ మైసూరు తిరువాన్కూరులు మామూలు రాజకీయకృషిని నలిపివేయుచు తామిది వరకిచ్చిన కొద్దిసావకాశములను తిరిగితీసికొనిరి. అవివెనుక ముఖము పట్టెను.

హైదరాబాదుకు వెనుకకు వెళ్ళవలసిన యవసరముగాని, యిచ్చినవి తీసికొన వలసినవిగాని యేమియులేవు. అదియెప్పుడును ముందుకుపోలేదు; అట్టియవకాశముల నెన్నడును కలుగచేయలేదు. హైదరాబాదులో రాజకీయ సభలనెన్నడును యెరుగరు. సాంఘిక, మతవిషయిక సభలనుకూడ ననుమానముతో చూచెదరు. వాటికొరకు ప్రత్యేక యనుమతిని పొందవలెను. పేరు ప్రఖ్యాతులుగల వార్తాపత్రి కలేవియు నచ్చటలేవు. బయటనుండి దుర్మార్గకిరియలేవియును దేశము లోనికి రాకుండుటకు భారతదేశములోని యితరచోట్ల ప్రకటింపబడు యనేకపత్రికల నచ్చటకు రానీయరు. ఈబహిష్కార మతికఠిన మైన దగుటచే మితవాదపత్రికలుకూడ బహిష్కరింపబడును.

కొచ్చిలో మేము 'తెల్లయూదులు' అనబడువారుండు ప్రదే శమును చూచితిమి. ఈ చిన్నసంఘమతి పురాతనమైనది; యసామాన్య మైనది. దానిసంఖ్యనానాటికి క్షీణించుచున్నది. కొచ్చిలో వారుండు

స్థానము పురాతన జెరూసలమును బోలియుండునని మాకుచెప్పిరి. నిశ్చయముగ దానికి పురాతన రూపముండెను.

మేము మలబారు తీరము పొడుగునను సిరియను చర్చికి సంబంధించిన క్రైస్తవులుండు పట్టణములను కూడ చూచితిమి. క్రీస్తు తరువాత మొదటిశతాబ్దములోనే క్రైస్తవమతము హిందూదేశమునకు వచ్చెనను సంగతి యెవరును గ్రహించరు. యూరపు దానిని స్వీకరించుటకు చాల పూర్వమే యది దక్షిణ హిందూదేశములో స్థిరవాసరము నేర్పరచుకొనెను. ఈ క్రైస్తవుల మతప్రధాని అంటియాకులోనో, సిరియాలో నెచ్చటనో యున్నను వారి క్రైస్తవమతము పూర్తిగా దేశీయము. దానికి బాహ్యసంబంధము లేవియును లేవు.

దక్షిణమున నెస్టోరియనుల సంఘము నొకదానిని చూచి నేనాశ్చర్యపడితిని. వారు పదివేలమంది కలరని వారి మతగురువు నాకు చెప్పెను. నెస్టోరియనులు చాల కాలము క్రిందటనే యితర జాతులలో కలసిపోయిరను నుద్దేశ్యముతో నేనుంటిని. వారెన్నడైనను హిందూదేశములో నుండిరను సంగతి నాకు తెలియనే తెలియదు. కాని వారి కొకకాలమందు హిందూదేశములో చాలమంది శిష్యులుండిరనియు, వారుత్తరమున కాశీవరకును వ్యాపించిరనియు మాకు చెప్పిరి.

మేము హైదరాబాదు ముఖ్యముగా సరోజినీదేవిని, యామె కుమార్తెలైన పద్మజ, లీలామణులను చూచుటకే వెళ్ళితిమి. మేము చ్చటనుండగా వారి యింటివద్ద ఘోషా స్త్రీల సభ యొకటి జరిగెను. వారు కమలను చూచుటకు వచ్చిరి. ఆమె వారికొక యుపన్యాసము నిచ్చెను. అందులో బహుశః ఆమె పురుషుడు తయారుచేసిన చట్టములు, ఆచారములు మొదలగు వాటినుండి స్త్రీలు స్వేచ్ఛను బడయవలసిన యావస్యకతను గురించి (అది యామె కిష్టమైన విషయము) చెప్పియుండును. ఇది జరిగిన రెండు మూడు వారములైన తరువాత

నొక చిన్నవిషయము జరిగెను. హైదరాబాదునుండి యొక భయవిహ్వలుడైన భర్త కమలకొక జాబు వ్రాయుచు నామె యచ్చటకు వచ్చినది లగాయితు తన భార్య విపరీతముగా ప్రవర్తించుచున్నదనియు, తాను చెప్పినట్లు వినుచు తన యడుగులకు మడుగులొగ్గుటలేదనియు, వాదము చేయుచున్నదనియు నెదిరించుచున్నదనియు వ్రాసెను.

బొంబాయినుండి సింహళముకు వెళ్లిన యేడువారములైన తరువాత నేనుతిరిగి బొంబాయి చేరితిని. వెంటనే నేను కాంగ్రెసు రాజకీయ సుడిగుండములలోని కురికితిని. ప్రధాన విషయములను చర్చించుటకు వర్కింగుకమిటీసభ జరుగుచుండెను. హిందూదేశములో పరిస్థితులతిత్వరితముగ మారిపోవుచుండెను. యు. పి. వ్యావసాయక పరిస్థితులు స్తంభించెను. సరిహద్దు రాష్ట్రములలో ఖాను అబ్దుల్‌గఫర్ఖాను నాయకత్వముక్రింద 'యెఱ్ఱచొక్కా'లవారి యుద్యమ మత్యంత ప్రబలమగుచుండెను. వంగదేశములో నత్యంత యుద్రేకము, అణచివేయబడిన క్రోధము, అశాంతి హెచ్చుచుండెను. నిత్యసంసిద్ధమైన కుల కలహములు, కాంగ్రెసువారికిని ప్రభుత్వమువారికిని యనేక సమస్యలపై స్థానికముగ పేచీలును, దానితో ఢిల్లీసంధిని భంగపరచిరను పరస్పరాపవాదములును బయలుదేరెను. తరువాత చరిత్రచర్వణమైన ప్రశ్న: రెండవ రౌండుటేబిలు సభలో కాంగ్రెసు ప్రాతినిధ్యమును వహింపవలెనా? మహాత్మాగాంధీ యచ్చటకు వెళ్ళవలెనా ?

---

32

## సంధికాలమున సంఘర్షణము.

—•—)O(—•—

గాంధీజీ రౌండు టేబిలు సభకు లండను పోవలెనా యక్కర లేదా? యనుప్రశ్న పదే పదే వచ్చుచుండెను. దీనికిదమిద్ధమగు ప్రత్యుత్తరము రాకుండెను. చివర నిమిషమువరకు వర్కింగు కమిటీకిగాని, చివరకు గాంధీజీకిగాని యేమియు తెలియదు. దీనికి జవాబు యనేక విషయముల మీద నాధారపడి యుండెను. క్రొత్త సంభవములు పరిస్థితులలో నెల్లప్పుడును క్రొత్తమార్పులను తెచ్చుచుండెను. ఆప్రశ్నకును, జవాబుకును వెనుక నిజమైన క్లిష్టసమస్య లుండెను.

రౌండుటేబిలుసభ యిదివరకే చట్టముయొక్క యాకారము నేర్పాటు చేసెననియు, చిత్రముయొక్క ప్రధానరేఖలన్నియు చిత్రింపబడినవనియు, నిక యీచిత్రమును నింపుటయే మిగిలియున్నదనియు బ్రిటిషు ప్రభుత్వము తరపునను, వారి స్నేహితులతరపునను మాకనేక సారులు చెప్పబడు చుండును. కానికాంగ్రెసు అట్లుతలంపలేదు. దానికి సంబంధించి నంతవరకు యీ చిత్రమంతయు మొట్టమొదటనుంచియు క్రొత్తజవనిక మీదనే వ్రాయబడవలెను. లేకచిత్రింపబడవలెను. ఢిల్లీ సంధి ప్రకారము ఫెడరలువిధానమును, రక్షణలుకావలెనను భావమును యామోదింపబడెననుట నిజము. భారతచట్ట నిర్మాణసమస్యకు ఫెడరలు విధానమే చాలమంచి తరుణోపాయమను విషయము మాలోచాలమందికిచాలకాలముక్రితమే తట్టెను. ఈభావమును మేమంగీకరించుటయన మొదటి రౌండుటేబిలు కాన్ఫరెన్సులో తయారుచేయబడిన ప్రత్యేక ఫెడరలు విధానమునే యంగీకరించుట కానేరదు. ఫెడరేషనుకు రాజకీయ స్వాతంత్ర్యముతోను, సాంఘిక పరివర్తనముతోను విరోధమెంత

మాత్రిమునులేదు. రక్షణలు అనుభావము నిందుతో జతపరచుట చాల క్లిష్టమైన విషయము. సాధారణముగ నవి యధికారమును చాలవరకు తగ్గించుట యను నర్థమునే యిచ్చును. కాని "భారత దేశ ప్రియోజన ములకొరకు" అను విశేషణవాక్యము, మాకీకిష్టమును, పూర్తిగ కాక పోయినను, కొంతవరకు పోగొట్టెను. కరాచీకాంగ్రిసు మన కంగీకార మగు చట్టనిర్మాణమునుగురించి స్పష్టపరచెను. అది దేశసంరక్షణమీదను, విదేశ వ్యవహారములమీదను, ద్రవ్య నీతిమీదను, ఆర్థిక నీతిమీదను పరిపూర్ణాధికారమును కోరెను. భారత దేశ ఋణములను కట్టుకొనుటకు పూర్వము విదేశఋణ సమస్యను (ఎక్కువగా బ్రిటిషు సంబంధమైనది) కూలంకషముగ పరీక్షింపవలెను; ప్రధాన హక్కులకు సంబంధించిన తీర్మానములు కొన్ని రాజకీయ, ఆర్థిక మార్పులనుకూడ సూచించెను. ఇదియంతయు రౌండు టేబిలు కాన్ఫరెన్సులో చేయబడిన చాల తీర్మానములకును, ప్రస్తుత భారతప్రిభుత్వ పరిపాలనాచట్టమునకును విరుద్ధము.

కాంగ్రిసు దృక్పథమునకును, బ్రిటిషుప్రిభుత్వ దృక్పథమునకును చాలవ్యత్యాసముకలదు. అది యిప్పటిస్థితిలో తొలగిపోవు ననుకొనుట కల్ల. రౌండు టేబిలు సభలో ప్రభుత్వమునకును, కాంగ్రిసునకును సమాధానము కుదురునని కొద్దిమంది కాంగ్రిసువారు భావించిరి. నిరంతరోత్సాహియైన గాంధీజీకూడ నెట్టివిశేషమును ఆశించలేదు. కాని యాతడెప్పుడును నిరాశచేసికొనక చివరవరకును ప్రయత్నించుటకు నిశ్చయించుకొనెను. మేమందరమునుకూడ జయముచేకూరినను చేకూరకపోయినను ఢిల్లీ అగ్రిమెంటు ననుసరించి ప్రియత్నమును సాగించవలసినదే యని భావించితిమి. కాని మేము రౌండు టేబిలులో పాల్గొనుటకు వీలులేకుండచేయు రెండువిషయములు మమ్మెదుర్కొనుచుండెను. రౌండు టేబిలు కాన్ఫరెన్సులో మేము మాదృక్పథమును నిరాటంక

ముగ వాదించుట కవకాశములుండవలెను. భారతదేశములోని పరిస్థితులు రౌండుటేబిలు కాన్ఫరెన్సుకు పోకుండ మాకాటంకములను కల్పించవచ్చును. ప్రభుత్వముతో సంఘర్షణమును కలిగించుస్థితి యిచ్చట యభివృద్ధికావచ్చును; లేక మేము తీవ్రనిర్బంధములకు గురి కావలసిన పరిస్థితులేర్పడవచ్చును. హిందూదేశములో నిట్టిస్థితి యేర్పడి మాకొంపకే నిప్పంటుకొనినపుడు మాప్రతినిధి యెవడైనను యీయగ్నిహోత్రిజ్వాలలను నిర్లక్ష్యముచేసి లండనులో చట్టనిర్మాణము మొదలగు విషయములనుగురించి శుష్కవాదములను చేయుట కేవలము అప్రస్తుతమగును.

ఈస్థితి వంగదేశములోను, యు. పి. లోను, సరిహద్దురాష్ట్రములలోను ప్రధానముగను దేశమంతట నొకమోస్తరుగను కాన్పించెను. వంగదేశములో ఢిల్లీ అగ్రిమెంటువలన నెట్టిలాభమును చేకూరలేదు. అచ్చట నుద్రేకము మరింత హెచ్చుగుచుండెను. శాసనోల్లంఘన ఖయిదీలు కొందఱు విడుదలబడిరి. కాని శాస్త్రరీత్యా శాసనోల్లంఘన ఖయిదీలుకాని రాజకీయ ఖయిదీలు వేలకొలది జయిళ్ళలోనుండిరి. డిటెన్యూలు కూడ జయిళ్ళలోను, లేక డిటెన్యూ మకాములలోను నుండిరి. 'రాజద్రోహకరములగు' ఉపన్యాసములకును తదితర రాజకీయకృషికిని క్రొత్త నిర్బంధములు జరుగుచునే యుండుటచే ప్రభుత్వదాడి యెంతమాత్రమును సడలకుండసాగుచునే యున్నదను భావము సామాన్యమయ్యెను టెర్రరిజము ఉండుటవలన వంగదేశసమస్య కాంగ్రెసుకు అసామాన్య కష్టమును కలిగించెను.

మామూలు కాంగ్రెసు కార్యక్రమముతోను, శాసనోల్లంఘనముతోను పోల్చి చూచినచో టెర్రరిస్టు కార్యములు వ్యాప్తిలోగాని, ప్రాధాన్యతలోగాని యతి స్వల్పముగ నుండెను. కాని యవి పెద్ద గందరగోళమును కలుగచేయుచు దృష్టి నాకర్షించుచుండెను. కాంగ్రెసు

యితర రాష్ట్రములలో పనిచేసినట్లు యిచ్చట పనిచేయుట కివియాటంక ములుగ నుండెను. ఏలనన టెర్రరిజము శాంతియుతమగు ప్రత్యక్ష కార్యములకు వ్యతిరేకమైన వాతావరణమును సృష్టించుచుండెను. విధాయకముగ నిది ప్రభుత్వ నిర్బంధముల నాహ్వానించుచుండెను. కాని యివి టెర్రరిస్టులమీదను, టెర్రరిస్టులు కాని వారిమీదను కూడ నిష్పక్షపాతముగ పడుచుండెను.

టెర్రరిస్టుల కొరకు ద్దేశింపబడిన ప్రత్యేక చట్టములను ఆర్డినెన్సులను పోలీసులును, స్థానిక కార్యనిర్వాహణాధికారులును, కాంగ్రెసువారిపట్లను, లేబరు, వ్యావసాయిక ప్రచారకులపట్లను, వారమోదింపజాలని పనులనుచేయు నితరులపట్లను వినియోగింప కుండుట దుస్సాధ్యమగుచుండెను. కనుక చార్జీకాని, విచారణకాని, శిక్షకానిలేకుండ ననేకసంవత్సరములనుండి యింతవరకు నుంచబడిన యనేకమంది డిటెన్యూల యధార్థనేరములు టెర్రరిజముకు సంబంధించినవికాక నితరరాజకీయకృషికి సంబంధించినవిగ నుండుట కవకాశ ములుకలవు. దేన్నైనను రుజువుచేయుటకుగాని, రుజువుకాదని నిరూ పించుటకుగాని, వారికెట్టి యవకాశములు నీయబడలేదు. చివరకువారు చేసినపాపములేవియో వారికి తెలుపబడలేదు. బహుశః శిక్షవేయుటకు తగినంతసాక్ష్యము పోలీసువారివద్ద లేకపోవుటచేతనే వారుకోర్టులో విచారణచేయబడలేదు. నేరస్తుడనబడినవానిని తరుచుకోర్టువారు నేరము లేదని విడిచివేయుచుండుటయు, వెంటనేవానిని పోలీసువారు పట్టుకొని డిటెన్యూక్రిందనుంచుటయు జరుగుచునే యుండును.

వంగదేశములోని చిక్కుసమస్య కాంగ్రెసువర్కింగు కమిటీవారి నసహాయులను చేయుచుండెను. అదివారిని నిరంతరము వేధించుచుం డెను. ఏదోయొక రూపమున వంగదేశవిషయ మెప్పుడును వర్కింగు కమిటీముందర వచ్చుచునేయుండెను. వారు దానిని తమ శక్తివంచన

లేకుండ సాధించుటకు ప్రయత్నించుచుండిరి. కాని వారాసమస్యను నిజముగా పరిష్కరించుటలేదను సంగతి వారికి తెలియును. కనుక వారు దుర్బలత్వముచే నచ్చటివిషయములను వాటికర్మమునకు విడిచివేసిరి. అట్టిపరిస్థితులలో వారికనేమిచేయగలరో చెప్పుటయు కష్టముగనే యుండెను. వర్కింగుకమిటీవారి యీ యుదాసీనత వంగదేశములో తీవ్రముగ నిరసింపబడెను. కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గమువారును, యితరరాష్ట్రములవారును తమ్మునిర్లక్ష్యము చేయుచున్నారను భావము వంగదేశములో బయలుదేరెను; కష్టకాలములో వంగదేశము విడిచి వేయబడినట్లు కాన్పించెను. ఈ యభిప్రాయము కేవలము నిరాధారము. వంగదేశప్రజలపై భారతదేశమున కంతకును పరిపూర్ణాభిమానము కలదు. కాని యీ యభిమానమును యథార్థమగు సహాయముగా మార్చుటయెట్లో దానికి తెలియకుండెను. ఇంతేకాక భారతదేశములోని ప్రతిభాగమును తనకున్న కష్టములతోనే బాధపడుచుండెను.

యు. పి. లో వ్యవసాయపరిస్థితులు యధ్వాన్నమగుచుండెను. రాష్ట్రప్రభుత్వమువారీ సమస్యనుగురించి జాప్యముచేయుచు పన్ను, రివిన్యూ రిమిషనులను గురించిన నిశ్చయము నాలస్యముచేసి బలవంతముగా పన్ను వసూలుచేయ నారంభించిరి. వేలకొలది జప్తులు, భూములనుండి రయితులను గెంటివేయుట మొదలగునవి జరుగుచుండెను. మేము సింహాళములోనుండగనే బలవంతముగ పన్నులను వసూలుచేయ ప్రయత్నించినపుడు రెండు మూడు వ్యావసాయిక కలహములుజరిగెను. అవి చిన్నవేయైనను దురదృష్టవశాత్తు భూఖామందో లేక వారిఏజంటో చనిపోవుట తటస్థించెను. యు. పి. గవర్నరయిన సర్. మాల్కాము హెయిలీతో వ్యవసాయపరిస్థితులనుగురించి చర్చించుటకు గాంధీజీ నైనిటాలు వెళ్ళెను. దీనివలన మంచిఫలితమేమియును కలుగలేదు. ప్రభుత్వమువారు రిమిషనులను ప్రకటించిరి. అవియనుకొనిన వాటికంటె చాల

తక్కువగనుండెను. పల్లెటిప్రాంతములలోని వారిగోల నిరంతరాయముగా హెచ్చిపోవుచుండెను. భూఖామందు, ప్రభుత్వమువారు కలసి రయితు నెక్కువగ బాధించిరి. వేలకొలది రయితులు తమవ్యవసాయ భూములనుండి గెంటివేయబడిరి. వారికున్నకొద్దియాస్తులు లాగుకొనబడెను. ఈకారణములచే మరేయితర దేశములోనైనను గొప్పరయితు విప్లవముగా పరిణమించునట్టి పరిస్థితులేర్పడెను. కాంగ్రెస్‌వారి ప్రయత్నములచేతనే ప్రజలు దౌర్జన్యకార్యములకు గడంగకుండిరని నాయభిప్రాయము. కాని ప్రజలమీద మాత్రము కావలసినంత దౌర్జన్యము చూపబడెను.

ఈరయితాంగ తిరుగుబాటులోను, కష్టములలోను నొకసంతోష విషయముకలదు. వ్యవసాయవస్తువుల ధరలమితముగా పడిపోవుటచే బీదతరగతుల వారికందరికిని రయితులతోసహా (వారియాస్తిలాగుకొనబడినతప్ప) తత్పూర్వము చాలకాలమునుండి వారికున్నదానికంటె తినుటకెక్కువ యాహారముండెను.

వంగదేశములోవలెనే సరిహద్దురాష్ట్రములోను ఢిల్లీసంధివలన శాంతిచేకూరలేదు. అచ్చటను దౌష్ట్యము శాశ్వతమైపోయెను. ప్రత్యేక శాసనములు, ఆర్డినెన్సులుగలిగి చిన్నచిన్న నేరములకుగూడ పెద్దపెద్ద శిక్షలను వడ్డించుచు ప్రభుత్వమచ్చట నొకసైనిక వ్యాపారమయ్యెను. ఈ పరస్థితుల నెదుర్కొనుటకు అబ్దుల్ గప్ఫర్‌ఖాను గొప్ప యాందోళనను లేవదీసెను. అతడు ప్రభుత్వము వారికొక బూచివలెనుండెను. ఆరడుగుల మూడంగుళముల యాపఠాను వీరుడు గ్రామగ్రామము కాలినడకను పోవుచు 'యర్రచొక్కాల' కేంద్రములను స్థాపించుచుండెను. అతడును, అతని ప్రధానులును వెళ్ళిన చోటనెల్ల 'యర్రచొక్కాల' చిహ్నములను విడుచుచు రాష్ట్రము సంతను 'ఖుదై ఖిద్మతుగరు'ల శాఖలతో నింపివేసెను. వారు పరమ

శాంతులు. అర్థములేని నిందారోపణలు తప్ప వారిపై నొక్క దౌర్జన్య నేరమైనను స్థాపింపబడలేదు. వారు శాంతమూర్తులైనను కాకపోయినను, వారివెనుక యుద్ధ సాంప్రదాయములును, దౌర్జన్య సాంప్రదాయములును కలవు. వారు కలహమునకు కాలుదువ్వు సరిహద్దుల ప్రాంతమున నివసించుచున్నారు. భారత జాతీయోద్యమముతో సన్నిహిత సంబంధము కలిగి సుశిక్షితమైన యీ యుద్యమాభివృద్ధి ప్రభుత్వమునకు కన్నెర్రగా నుండెను. అది దౌర్జన్యరహితము, శాంతియుతమునగు యుద్యమమని ప్రభుత్వమెప్పుడును విశ్వసింపలేదని నేననుకొనెదను. ఒకవేళ వారట్లుభావించినను వారుదానిని భయముతోను, విసుగుదలతోను చూచి యుండెదరు. అదియత్యంత శక్తిసమన్వితమైనదిగ నుండుటచే వారు దానిని ప్రశాంత చిత్తముతో చూడజాలరు.

అబ్దుల్‌గఫర్ఖాను యీమహోద్యమమునకు నిర్వాహకుడు. అతడు 'పఠానుల మానధనుడు' 'సరిహద్దుగాంధి' యని పిలువబడదొడగెను. ఎట్టికష్టములకును, ప్రభుత్వచర్యలకును వెరువక, ప్రశాంతముగను, భల్లూకపుపట్టుతోను చేయునిరంతర కృషివలననే సరిహద్దు రాష్ట్రములలో నతని కద్భుతమైన పలుకుబడి కలిగెను. రాజకీయ వేత్తలనబడువారివలె నతడువెనుకను, యిప్పుడునుకూడ రాజకీయ వేత్తకాడు. రాజకీయములలోని యుక్తులును, జిత్తులును అతనికి చేతకావు. ఆజానుబాహువు; మానసికముగను, శారీరకముగను, స్థైర్యమైనవ్యక్తి; అతివాగుడును, గడబిడను నిరసించువాడు. భారత స్వాతంత్ర్య చట్టములోనే తన సరిహద్దు రాష్ట్రప్రజల స్వేచ్ఛకొరకు నిరీక్షించువాడు. చట్ట నిర్మాణములు, న్యాయశాస్త్రసంబంధమైన ప్రగల్భములు మొదలగు వానియందు శ్రద్ధలేనివాడు. దేనిని సాధించుటకైనను కార్యశూరత్వముండ వలెను. మహాత్మాగాంధీ శాంతియుతమగు యద్భుత కార్యక్రమము నొకదానిని బోధించెను. అదియతని

నాకర్షించెను. కార్యమును సాగించుటకు సుశిక్షణము, కట్టుదిట్టమైన యేర్పాటులు కావలెను, కనుక నికనెట్టి వాదనయును, తానుచేయ వలసిన యేర్పాటులకు సంబంధించిన చాదస్తపు సూత్రములను వ్రాయుటయు సక్కరలేకుండగనే యాతడద్భుతమగు విజయముతో కార్యక్రమమును ప్రారంభించెను.

గాంధీజీయునిన యతనికత్యంతప్రీతిని. మొట్టమొదట నతని మొగమాటమును వెనుకనుండవలెనను కోరికయు నతనిని గాంధీజీ దగ్గరకు పోనీయకుండచేసెను. తరువాత వారనేక విషయములను చర్చించుటకు కలుసుకొనవలసి వచ్చెను. వారిసంబంధములు వృద్ధి యయ్యెను. ఈపఠాను దౌర్జన్యరాహిత్యమును మాలోచాలమందికంటె నెక్కువగ సిద్ధాంతములో నెట్లొప్పుకొనెనా యనునది యాశ్చర్యముగ నుండును. దానినతడు విశ్వసించెను. కనుకనే యెంతటి యుద్రేకము కలిగింపబడినను శాంతమునువీడకూడదను భావమునతడు తనప్రజలలో నాటునట్లు చేయగలిగెను. సరిహద్దు రాష్ట్రములోని ప్రజలికనెన్నటికిని దౌర్జన్యమును సుతరాము అవలంబింపరని చెప్పుటమూర్ఖత్వము. సామాన్యముగ ప్రతిరాష్ట్రములోని ప్రజలకును నివియేవర్తించును. ప్రజలు ఉద్రేకతరంగములచే రేగుచుందురు. అట్లురేగిననాడు వారెట్లు ప్రవర్తించెదరో యెవరును జోస్యముచెప్పజాలరు. కాని 1930 లోను తరువాతను సరిహద్దు రాష్ట్రప్రజలు చూపినయాత్మ నిగ్రహమత్యద్భుతము.

అబ్దుల్‌గఫ్ఫారుఖాను పేరువినుటకుపూర్వము చాలకాలముక్రితమే నేనతనిసోదరుడగు డాక్టరుఖానుసాహేబును బాగుగ నెరుగుదును. నేను కేంబ్రిడ్జిలోనుండగా నతడు లండనులోని సెంటుథామసు ఆస్పత్రిలో విద్యార్థిగనుండెను. తరువాత నేను బారిస్టరు విద్యను నారంభించుచున్న పుడు మేమిరువురము నత్యంత మిత్రులమైతిమి; నేను లండనులో

నుండగా మేమిరువురమును కలుసుకొనని దినమొక్కటియు నుండెడిది కాదు. నేనతనిని యింగ్లండులో విడిచిపెట్టి హిందూదేశము వచ్చితిని. చాలకాలమతడు యింగ్లండులోనేయుండి యుద్ధసమయములో డాక్టరుగా పనిచేసెను. తరువాత నేనతనిని నైనీజయిలులో చూచితిని.

సరిహద్దు 'యర్రచొక్కాల'వారు కాంగ్రెసుతో సహకారము చేసిరి. కాని వారిసంస్థ ప్రత్యేకసంస్థగనుండెను. అదియొక వింతస్థితి. అబ్దుల్‌గఫర్ఖాను యీరెంటికిని యథార్థమైన సంధానకర్త. 1931 సంవత్సర వేసవిలో నీసమస్యను వర్కింగు కమిటీవారు సరిహద్దురాష్ట్ర నాయకులతో కలిసి కూలంకషముగ చర్చించి 'యర్రచొక్కాల'ను కాంగ్రెసులో మిళితముచేయుటకు నిశ్చయించిరి. ఈవిధముగ 'యర్ర చొక్కాల' యుద్యమము కాంగ్రెసులో నొకభాగమై పోయెను.

కరాచీకాంగ్రెసు యగుటతోడనే గాంధీజీ సరిహద్దు రాష్ట్రముకు పోగోరెను. కాని ప్రభుత్వమువారు దీనినెంతమాత్రమును ప్రోత్సహింపలేదు. తరువాత నెలలలో ప్రభుత్వాధికారులు 'యర్రచొక్కాల' వారిచేష్టలనుగురించి పదేపదే ఫిర్యాదులు చేసినపుడు గాంధీజీతాను స్వయముగవెళ్లి పరిస్థితులను చూడగోరెను. కాని ప్రభుత్వమువారు దీని కొప్పుకొనలేదు. నేను వెళ్లుటకుగూడ వీలులేదనిరి. ఢిల్లీయగ్రిమెంటు నిలిచియుండుటచే ప్రభుత్వమువారి కోరికకు వ్యతిరేకముగా సరిహద్దు రాష్ట్రముకు పోవుట యుక్తముకాదని మేమనుకొంటిమి.

వర్కింగుకమిటీ ముందరనున్న మరియొకసమస్య కులసమస్య. ఇందులో క్రొత్తయేమియునులేదు. అది క్రొత్తక్రొత్త రూపముల తోను, వింతవేషములతోను మాత్రము తలయెత్తుచుండును. ఆసమయమున రౌండుటేబిలు కాన్ఫరెన్సువలన దానికి లేనిపోని యాధిక్యత వచ్చెను. బ్రిటిషుప్రభుత్వము తక్కిన సమస్యలనన్నిటిని వెనుకబెట్టి యీశిఖండిని ముందుకు త్రోయునను సంగతి తేటతెల్లముగనుండెను.

కాన్ఫరెన్సు సభ్యులందరును (ఆ ప్రభుత్వమువారిచే పేర్కొనబడినవారే.) కుల ప్రయోజనములకును, ఆయాతెగల ప్రయోజనములకును, ప్రాముఖ్యతనిచ్చుటకును, ప్రజలందరకును సంబంధించిన సామాన్య విషయములను విడిచిపెట్టి యీ పెడత్రోవలను పట్టుటకును ప్రధానముగా నియోగింపబడిరి. జాతీయ ముస్లిము నాయకులలో నెవనిని పేర్కొనుటకును ప్రభుత్వ మంగీకరింపలేదు. కాన్ఫరెన్సు మొట్టమొదటలోనే, బ్రిటిషుప్రభుత్వమువారి ప్రోత్సాహముతో, కులసమస్యలలో చిక్కుకొనినచో యథార్థమైన రాజకీయ, ఆర్థికసమస్యలను యుక్తముగా యోచించుటకు వీలుండదని గాంధీజీ భావించెను. ఈపరిస్థితులలో నతడు కాన్ఫరెన్సుకు పోవుటయే వ్యర్థము. కనుకనతడు కులసమస్యమీద ముందుగానొక సమాధానము వారిలోవారికి కుదిరిననే లండను పోయెదనని వర్కింగుకమిటీ కెరుకపరచెను. అతని సహజజ్ఞానము చాలన్యాయముగనే యుండెను. కాని వర్కింగు కమిటీవారతనిని త్రోసివేసి మనము కులసమస్యను పరిష్కరింప జాలకపోతిమను కారణముచేతనే యతడు సభకుపోవ నిరాకరింపరాదని తీర్మానించిరి. వివిధ కులముల ప్రతినిధులతో సంప్రదించి యొకపరిష్కారమును చేయుటకు వర్కింగుకమిటీ వారు ప్రయత్నించిరి. ఇదియంత విజయవంతముకాలేదు.

1931 వేసవిలో ననేకమైన చిన్నసమస్యలకుతోడు యీపెద్ద సమస్యలనుకూడ మేము యోచింపవలసి వచ్చెను. స్థానికాధికారులు ఢిల్లీసంధిని భంగపరచుచున్నారను ఫిర్యాదులు దేశమంతటనుండియు మాకు వచ్చుచుండెను. వీటిలో నతిముఖ్యమైన వాటిని మేము ప్రభుత్వమునకు పంపించితిమి. కాంగ్రెసువారు సంధినిభంగపరచు చున్నారని ప్రభుత్వము నేరారోపణలనుచేసెను. ఇట్లు ఛార్జీలు కౌంటరు ఛార్జీలు చేయబడెను. తరువాత నివి పత్రికలలో ప్రకటింపబడెను. దీనివలన కాంగ్రెసుకును ప్రభుత్వమునకుగల సంబంధము చక్కబడలేదని వేరుగ చెప్ప నక్కరలేదు.

అయినను స్వల్ప విషయములమీద బయలుదేరిన యీ సంఘర్షణకు దానంతట దానికే యెక్కువ ప్రాధాన్యతలేదు. అతిప్రధానమైన పోరాటము రానున్నదని తెలుపుటయే దీనిప్రాముఖ్యత. ఈ పోరాటమువ్యక్తులమీద నాధారపడక మనజాతీయ సంగ్రామ ప్రకృతి నుండియు, వ్యవసాయముకు సంబంధించిన ఆర్థికస్థైర్యా భావము నుండియు బయలుదేరెను. అసలుపునాదులలోనే మార్పులేనిదే యదితీరునదికాదు; రాజీపడునదికాదు.

మధ్యతరగతులలోని మైతరహాకు చెందినవారు ఆత్మాభివృద్ధిని, ఆత్మప్రకటనమును కోరుటచేతనే మొట్టమొదట మనజాతీయోద్యమము ప్రారంభమయ్యెను. దానివెనుక రాజకీయ, ఆర్థికపిపాసయుండెను. అదిక్రమముగా మధ్యతరగతులలోని క్రింది తరహావారివరకు ప్రాకి దేశములోనొక గొప్పశక్తిగా పరిణమించెను. తరువాతనది గ్రామప్రజలను ఆందోళనపరచసాగెను. వారు దుఃఖపూరితమును, జీవిత ప్రమాణములో నధమాధమమునునగు జీవితమునైనను గడుపుట యంతకంతకు కష్టతరమగుచుండెను. ప్రాచీనగ్రామ ఆర్థికవిధానము సర్వతోముఖమైన గ్రామసౌభాగ్యమును చేకూర్చెను. అదిచాల కాలముక్రిందట నశించిపోయెను. వ్యవసాయమునకు చేదోడు వాదోడుగా నుండెడి గృహోపపరిశ్రమలు, (వ్యవసాయదారు భారమును కొంత తగ్గించెడివి.) కొంతవరకు ప్రభుత్వనీతిచేతను కానియెక్కువగ, విజృంభించుచున్న యంత్రపరిశ్రమల పోటీకి తాళలేక పోవుటచేతను, నశించెను. భూమిమీదపడుభారము దినదినాభివృద్ధి యగుచుండెను. భారత పరిశ్రమ లతిమందగమనముచేయుచు నీలోటును కూడదీయజాలకుండెను. ఎట్టిపరికరములునులేక, నేమరుపాటుగనుండి, యమితభారముచే కృంగినగ్రామము ప్రపంచ పణ్యరంగములోనికి విసిరివేయబడి యిటునటు గిజగిజ కొట్టుకొనెను. అదియసమాన పరిస్థితులతో పోటీచేయు

వలెను. దాని యుత్పత్తివిధానములు చాల వెనుకబడియుండెను. దాని భూవిభాగపద్ధతి, సేద్యముచేయు భూమియొక్క పరిమితుల నంతకంతకు చీల్చివేయుచు, గొప్పయభివృద్ధి సాధ్యముకాకుండచేసెను. కనుక వ్యవసాయజాతులును, భూఖామందులును, రయితులునుకూడ, ధరలు హెచ్చుగానున్న కొద్దికాలములలోతప్ప క్రిందకు దిగజారుచుండిరి. భూఖామందులు తమభారమును తమరయితులమీద రుద్దవలెనని ప్రయత్నించిరి. రయితాంగము చిన్నచిన్న భూస్వాములు, వ్యవసాయముచేయు సేద్యగాండ్రు. దినదినాభివృద్ధి చెందిన వీరి దారిద్ర్యము వీరని జాతీయోద్యమములోనికి దింపెను. గ్రామములోనున్న భూములులేని వ్యవసాయ కూలీలు వేలకొలది యిందులో ప్రవేశించిరి. ఈగ్రామములలోనున్న జాతులందరికిని 'జాతీయత' లేక 'స్వరాజ్యము' భూవిభాగపద్ధతిలో ప్రధానమార్పుఅను నర్థమునే కలుగచేసెను. అదియే వారి భారములను లేకుండచేయును లేక తగ్గించును. భూమిలేనివారికి భూమిని యిచ్చును. రయితులుకాని జాతీయోద్యమములోని మధ్యతరగతి నాయకులుగాని యీకోరికలను స్పష్టముగ ప్రకటింపజాలరైరి.

1930 లోని శాసనోల్లంఘనోద్యమము, మొట్టమొదట దాని నాయకులకు తెలియకుండగనే, ప్రపంచవ్యవసాయ, పారిశ్రామిక వస్తువులధరలు పడిపోవు మార్పుకు సరిపడునట్లుగ ప్రారంభమయ్యెను. గ్రామప్రజలు యీమార్పువలన తహతహలాడి కాంగ్రెసులోను, శాసనోల్లంఘనములోనుచేరిరి. వారికి లండనులోను, లేకమరియొక చోటను తయారుచేయబడిన చట్టనిర్మాణముకాక భూవిభాగపద్ధతిలో, ముఖ్యముగా జమీందారీ ప్రాంతములలో, ప్రధానమగు మార్పులేకావలెను. నిశ్చయముగా జమీందారీపద్ధతి దానికాలము చెల్లినను జీవించుచున్నది. దానిలో స్థైర్య మెంతమాత్రమునులేదు. బ్రిటిషు ప్రభుత్వమువారు, దాని పరిస్థితులనుబట్టి, యీభూవిభాగ

పద్ధతిలో గొప్పమార్పులను చేయుటకు సాహసింపరు. అది 'రాయలు అగ్రికల్చరలు కమిషను'ను యేర్పాటు చేసినపుడుకూడ కమిషను భూమియొక్క యాజమాన్యమును గురించికాని భూమిపన్ను పద్ధతిని గురించికాని చర్చించకూడదని నిషేధించిరి. ఈవిధముగా సంఘర్షణ యంతయు నిప్పుడు హిందూదేశములో నున్న పరిస్థితుల ప్రకృతిలోనే యుండెను. దానిని రాజీలతోను, పదజాలముతోను మంత్రించి మాయ ముచేయుటకు వలనుపడదు. అదియత్యంత ప్రధానసమస్యయైన భూమి సమస్య (ఇతర ప్రధాన జాతీయసమస్యలను వేరె చెప్పనక్కరలేదు) యొక్క పరిష్కారమువలననే యంతరింపగలదు. బ్రిటిషుప్రభుత్వ సహాయములో నీపరిష్కారముజరుగుట యసంభవము. తాత్కాలిక పద్ధతులవలన నీదుఃఖము కొద్దికాల ముపశమింపవచ్చును. తీవ్రనిర్బంధములు దీనిని బహిరంగముగ వ్యక్తముచేయకుండ భయపెట్టవచ్చును; అణివేయ వచ్చును. కాని యీరెండును యీసమస్యను తీర్చునవికావు.

బ్రిటిషుప్రభుత్వమువారు (కేదితరప్రభుత్వములన్నిటివలెనే) భారతదేశములోని చిక్కులుచాలవరకు 'ఆందోళనపరుల' వలననే కలుగుచున్నవను భావములోనున్నట్లు నేనుభావించెదను. ఇదియొక పిచ్చి యూహ. గతపదిహేను వత్సరములనుండియు భారతదేశమొక మహానాయకుని కలిగియుండెను. లక్షలకొలది ప్రజలకతనియెడల ప్రేమయు, పూజ్యభావమును కూడనుండెను. అతడనేకవిధముల తనభావములనే ప్రజలమీద నొప్పించుచున్నట్లు కాన్పించెను. అతడా భారతదేశ నవీన చరిత్రలో చాలప్రధానపాత్రనుధరించెను. అయినను అతని యాజ్ఞల సంధప్రాయముగ శిరసావహించినట్లు కాన్పించినప్రజలే యతనికంటెను ముఖ్యమైనవారు. ప్రజలుప్రధాననటకులు. వారివెనుక, వారినిముందుకు త్రోయుచు, వారినిసన్నద్ధముచేయుచు, వారినాయకుని శంఖారావముల నాకర్ణించుటకు తయారుచేసిన గొప్పచారిత్రక కార

ణములుండెను. ఈచారిత్రకరంగమును, రాజకీయ, ఆర్థిక కారణములును లేనిదే యెట్టినాయకులుగాని,ఆందోళనపరులుగాని వానిని కార్యరంగము లోనికి దింపజాలరు. నాయకుడైనగాంధీజీ ప్రజానాడిని తనయాత్మ ప్రబోధముచే గ్రహింపగలడు. విజృంభించుటకును, కార్యరంగములోని కురుకుటకును పరిస్థితులెప్పుడు పరిపక్వముగనుండునో గ్రహింపగలడు. ఇవి గాంధీజీకిగల ప్రధానలక్షణములు.

1930 లో భారతదేశములోని జాతీయోద్యమము (కొంత కాలమువరకు) దేశములో విజృంభించుచున్న సాంఘికశక్తులకు సరిపడి యుండెను. ఈకారణముచే దానికొక గొప్పశక్తికలిగెను. అది సోపాన క్రమముగ చరిత్రతో నిశ్చయముగ నభివృద్ధిచెందుచున్నట్లు దానికొక సత్యస్వరూపముకలిగెను. కాంగ్రెసు ఆజాతీయోద్యమమును వ్యక్తము చేసెను. ఈశక్తియు నీబలమును కాంగ్రెసుయొక్క గౌరవాతిశయమును పెంపొందించెను. ఇది కన్పించునదికాదు. దీనిని లెక్కించుటకును, నిర్వచించుటకును వలనుపడదు. అయినను యిదియెక్కువగనుండెను. నిశ్చయముగ రయితాంగము కాంగ్రెసువైపుమ్రొగ్గెను. అదితన నిజ శక్తిని దానికిచ్చెను. మధ్యతరగతులలోని క్రిందితరహావారు యీ పోరాటములోని సైన్యమునకు వెన్నెముకయైరి. ఈవాతావరణముచే క్షుభితులై పైతరగతిబూర్జువాలుకూడ కాంగ్రెసుతో స్నేహము చేసి కొనుటయే తమకుభద్రమనుకొనిరి. భారతదేశములోని బట్టలమిల్లులలో నత్యధికసంఖ్య కాంగ్రెసువిధించినవిధముగ ప్రమాణపత్రములను వ్రాసి యిచ్చిరి. కాంగ్రెసుకు తమపైకోపమును తెప్పించుపనులను చేయుట కవి భయపడుచుండెను. లండనులో మొదటి ఆర్. టి. సి లో కూర్చుని పెద్దలుసునిశితమగు న్యాయవిషయములను తర్కించుచుండగా నిజమైన యధికారమంతయు నెమ్మదిగ, పైకికాన్పించకుండ, ప్రజలప్రతినిధియైన కాంగ్రెసులోనికి ప్రవహించుచున్నట్లుండెను. ఈభ్రాంతి ఢిల్లీసంధియైన

తరువాతకూడ, ప్రగల్భోపన్యాసముల వలనగాక, 1930 లోను తరువాతను జరిగినవిషయములనుబట్టి, పెరిగెను. నిశ్చయముగ ముందున్న కష్టములను, యుపద్రవములను యెక్కువగ గుర్తించినవారు బహుశః కాంగ్రెసునాయకులే. వారువాటి నెంతమాత్రమును తృణీకరింపకుండుట కెంతయోజాగ్రతపడిరి.

దేశములో రెండుప్రభుత్వములు వర్థిల్లుచున్నవను భావము సహజముగ ప్రభుత్వముకు కోపమును కలిగించుచుండెను. యథార్థముకు దీనికెట్టినిజమైన యాస్కారమునులేదు. భౌతికబలము పూర్తిగా ప్రభుత్వము వారిచేతిలోనే యుండెను. కాని రెండు ప్రభుత్వములును యున్నట్లు మానసికముగ భావింపబడెను. అధికారపూరితమును, కదపశక్యము కానట్టియు ప్రభుత్వ మీస్థితిని భరింపజాలదు. వారుతరువాత ఫిర్యాదుచేసినట్లు గ్రామములలోని యేకొద్దియుపన్యాసములో, యుత్సవములోగాక యీసూక్ష్మవాతావరణమే వారిని నిజముగా కలవరపెట్టెను. కనుక సంఘర్షణము తప్పనిసరి యైనట్లుకాన్పించెను. ఏలనన కాంగ్రెసు ఐచ్ఛికముగ నాత్మహత్యను చేసికొననేరదు. ప్రభుత్వమువారు యీద్వంద్వవాతావరణమును భరింపజాలరు. కనుక వారు కాంగ్రెసును నలిపివేయుటకు సమకట్టిరి. రెండవ రౌండుటేబిలు కాన్ఫరెన్సు మూలమున నీ పోరాటము ఆపుచేయుబడెను. ఏకారణముచేతనో బ్రిటిషు ప్రభుత్వము వారు గాంధీజీ లండను కాన్ఫరెన్సులోనుండవలెనని గట్టిగకోరుచుండిరి. కనుక దీనికడ్డంకులువచ్చు పనులను (సాధ్యమైనంతవరకు) చేయకుండిరి.

అయినను సంఘర్షణభావము పెరుగుచుండెను. ప్రభుత్వమువారి కాఠిన్యతను మేముగుర్తింప గలిగితిమి. ఢిల్లీ సంధియైనవెంటనే యిర్వినుప్రభువు భారతదేశమునువీడెను. అతనిస్థానమున విల్లింగ్డను ప్రభువు వైస్రాయిగావచ్చెను. క్రొత్తవైస్రాయి చాలకఠినుడును, దయాదాక్షిణ్యములు లేనివాడనియు వెనుకటి వానివలె రాజీలకంత

సుముఖముగా నుండడనియు నొక కథబయలుదేరెను. మన రాజకీయ వేత్తలుచాలమంది రాజకీయములను సిద్ధాంతముల రీత్యాగాక వ్యక్తుల రీత్యా యోజించుచుండు 'లిబరలు' యాచారమున కలవాటుపడిరి. బ్రిటిషుప్రభుత్వముయొక్క విశాలసామ్రాజ్యనీతి వైస్రాయిలయొక్క వ్యక్తిగతాభిప్రాయములపై నాధారపడియుండదని వీరు గ్రహించరు. కనుక వైస్రాయిలు మారుటవలన నెట్టిభేదమును కలుగలేదు. కలుగ జాలదు. కాని పరిస్థితులు వృద్ధిచెందుచుండుటచే ప్రభుత్వనీతి క్రమ ముగా మారెను. సివిలు సర్వీసుపెత్తనస్థులు సంధులను, కాంగ్రెసుతో వ్యవహరించుటను అంగీకరింపలేరు. వారుపొందిన శిక్షణయు, ప్రభుత్వ మనిన యధికారమును చలాయించుట యని వారికిగల భావములును దీనికివ్యతిరేకముగా నుండెను. తమతో సమానునివలె గాంధీజీతో వ్యవ హరించుటచే వారు కాంగ్రెసుయొక్క పలుకుబడిని, గాంధీజీయొక్క గౌరవమును వృద్ధిపరచిరను భావము వారికుండెను. కనుక నతనిగర్వము నణచివేయవలసిన సమయ మాసన్నమయ్యెనని వారు భావించిరి. ఇదిచాల యవివేకమైన భావము. కాని భారతదేశములోని సివిలుసర్వీసు వారి భావములలో నవీనత యేమియునులేదు. కారణమేదియైనను ప్రభుత్వమువారు వెన్నువిరిచి, పిడికిలిబిగించి యొక ప్రాచీన ప్రవక్త మాటలలో మాకిట్లుచెప్పుచున్నట్లు కాన్పించెను. "నాచిన్నవేలు నాతండ్రినడుముకంటె దళసరియైనది. అతడు మిమ్ముకొరడాలతో మోదుచో నేను మీకు తేళ్ళను పట్టించెదను."

కాని యీసమయ మింకనురాలేదు. వీలున్నచో కాంగ్రెసు రెండవ రౌండుటేబిలుసభలో ప్రాతినిధ్యము వహించవలసియుండెను. వైస్రాయితోను, ఇతర అధికారులతోను దీర్ఘ సంభాషణలను జరుపు టకు గాంధీజీ సిమ్లా రెండుసారులు వెళ్ళెను. వారనేక హంశములను ముఖ్యముగా సరిహద్దులోని 'యర్రచొక్కాల' యుద్యమము, యు. పి.

లోని వ్యావసాయిక యుద్యమమును గురించి చర్చించిరి. వంగదేశ విషయముకాక ప్రభుత్వమునెక్కువగా నీరెండు సమస్యలును బాధించు చున్నట్లు కాన్పించెను.

సిమ్లానుండి గాంధీజీనాకొరకు పంపెను. నేనుభారత పరిభుత్వాధికారులలో కొంతమందినికూడ చూచితిని. నేను యు. పి. ని గురించి మాత్రమే మాట్లాడితిని. మేముచాల నిర్మొగమాటముగ మాట్లాడు కొంటిమి. మాపరస్పరాభిప్రాయభేదముల వెనుకనున్న యథార్థస్థితులను గురించి చర్చించితిమి. 1931 ఫిబ్రవరిలో పరిభుత్వమువారు శాసనోల్లంఘనోద్యమమును మూడుమాసములలోనే క్షుణ్ణముగా నలిపివేయగలిరని చెప్పుదురు. వారుతమ నిర్బంధయంత్రమును పూర్తిచేసిరి. దానినొక త్రోపుత్రోసిన చాలును;ఒకబొత్తామును నొక్కినచాలును. బలవంతముగా నొప్పించుటకంటె, వీలైనచో, అంగీకారముతో గూడిన సమాధానమే మంచిదని వారుతలంచి, పరస్పర సంభాషణలను చేయ సంకల్పించిరి. అదిచివరకు ఢిల్లీసంధిగాపరిణమించెను. సమాధానము కుదరనిచో బొత్తాము యెప్పుడును సిద్ధముగనుండనేయున్నది. ఒక్కక్షణికము నోటీసులో దానిని నొక్కివేసి యుండెడివారు. మేముతిన్నగా నడుచుకొనక పోయినచో నతికాలములోనే యీ బొత్తాము నొక్కివేయబడునను సూచనకూడ చేయబడినట్లు కాన్పించును. ఇదియంతయు సమర్యాదగను, నిర్మొగమాటముగను చెప్పబడెను. మేమేమి చేసినను, యేమిచెప్పినను, మాసంబంధములేకయే, స్పర్థవిధాయకముగ సంభవించునని మాయుభయులకును తెలియును.

మరియొక గొప్పయధికారి కాంగ్రెసునుపొగిడెను. మేమప్పుడు రాజకీయములకు సంబంధించని విశాలసమస్యలను చర్చించుచుంటిమి. రాజకీయముల నటుంచినచో కాంగ్రెసు దేశమునకు గొప్ప సేవచేసెనని యుతడనెను. భారతీయులు మంచిసంఘటకులుకారనిసామాన్యముగా

నొకయపవాదముఁ గలదు. కాని 1930 లో, విపరీతమైన కష్టములును, వ్యతిరేకతయు నున్నను, కాంగ్రెసు అద్భుతమైన సంఘటనశక్తిని ప్రదర్శించెను.

గాంధీజీయొక్క మొదటి సిమ్లాప్రయాణము వలన రౌండు టేబిలుసభకు పోవువిషయమేమియు తేలలేదు. అతడు అగస్టుఆఖరు వారమున తిరిగిసిమ్లావెళ్లెను. అటొయిటో తుదినిర్ణయమును చేయవలసి యుండెను. అయినను భారతదేశము వీడుటకతడు నిశ్చయము చేసి కొనుట కష్టతరముగనుండెను. వంగదేశములోను, సరిహద్దురాష్ట్రము లోను, యు. పి. లోను కష్టములురానున్నట్లతడుగ్రహించెను. భారత దేశములో శాంతియుండునను ధైర్యము చిక్కనకాని యతడు వెళ్లదలచు కొనలేదు. చిట్టచివరకు ప్రభుత్వముతో నొకవిధమగు సమాధానము కుదిరెను. అదియొక వాఙ్మూలములోను, కొన్నియుత్తరములలోను పొందుపరుపబడెను. ఆర్. టి. సి. ప్రతినిధులను తీసికొనిపోవు స్టీమరులో నతడుకూడ వెళ్ళుటకు వీలగునట్లు, చిట్టచివర నిమిషములో, సీపని జరుప బడెను. ఒకవిధముగా చివర నిమిషము దాటిపోయిన తరువాతనే (చివరరైలుకూడ దాటిపోయెను) యిదిజరిగెను. సిమ్లానుండి కాల్కావరకు నొకప్రత్యేక రైలుబండి యేర్పాటుచేయబడెను. ఈ బండి సరాసరిపోవుటకు తక్కినబండ్లన్నియు నాపివేయబడెను. నేనతని తో సిమ్లానుండి బొంబాయివరకును వెళ్ళితిని. అచ్చట అగస్టు మాసాంతమున నతడు రత్నాకరము నకును, పశ్చిమతీరములకును గొంపో బడుచుండ నొక సుప్రభాతమున నేనతనియొద్ద సెలవుతీసికొంటిని. రెండుసంవత్సరములవరకు నాకదియే యతని తుదిసందర్శనము.

# ౩౫

## రౌండు టేబిలు కాన్ఫరెన్సు.

హిందూదేశములోను, లండనులోని రౌండు టేబిలు కాన్ఫరెన్సులోను గాంధీగారిని యెక్కువగ చూచితినని చెప్పుకొను నొక ఆంగ్ల పత్రికారచయిత యిటీవలతాను వ్రాసినపుస్తకములో నిట్లు వ్రాయుచున్నాడు. "మ్యాల్టాను స్టీమరులోనున్న నాయకులందరును కాంగ్రెసు వర్కింగు కమిటీలో గాంధీగారిపై కుట్రలేవతీయ బడు చున్నదను సంగతినిబాగుగ నెరుగుదురు. కాలము పక్వమైనప్పుడు కాంగ్రెసు అతనిని తరిమివేయునని వారెరుగుదురు. కాని కాంగ్రెసు గాంధీగారిని తరిమివేయుటవలన బహుశః దానిలోని సగముమంది సభ్యులను తరిమివేయును. సర్ తేజబహాదరు సప్రూ, జయకరుగార్లు యీసగముమంది నే లిబరలు ఉద్యమమునకు చేర్చుకొన గోరుచున్నారు. గాంధీగారు వారిభాషలో 'పిచ్చియెత్తినవాడు' అనువిషయమును వారెన్నడును దాచిపెట్టలేరు. తనతోపాటు పదిలక్షలమంది 'పిచ్చి వాండ్రను' తీసికొనిరాగల 'పిచ్చివానిని జయించుట లాభదా యకము."

1931 లో లండనువెళ్ళిన సర్ తేజబహాదరు సప్రూ, జయ కరు, యితర ఆర్. టి. సి. సభ్యులు మొదలగువారి యభిప్రాయముల నిదియెంతవరకు తెలుపుచున్నదో నాకు తెలియదు. కాని భారతదేశ రాజకీయములతో నేకొద్దిపరిచయము కలవాడయినను, పత్రికారచ యిత యగుగాక లేక 'నాయకుడు' అగుగాక, అట్టివాఙ్మూలము నిచ్చుట నాకాశ్చర్యకరమైన విషయముగ తోచుచున్నది. నేనుదీనిని చదివి దిగ్భ్రమ చెందితిని. నేనును దానినిగురించి యరఁడేకు పూర్వము, (అప్పటినుండియు నేనుచాలకాలము జయిలులోనే యుండుటచే దాని

నర్థము చేసికొనుట యంతకష్టము కాకపోయినను) సూచనగనైనను విని యుండలేను.

ఈకుట్రదారులెవరు? వారేమిజేయబూనిరి? అధ్యక్షుడైనవల్లభాయిపటేలును, నేనును వర్కింగుకమిటీలో నతివాదులలోని వారమని యెప్పుడప్పుడు చెప్పబడెను. కనుకనీకుట్రచేయు నాయకులలో మమ్ము తప్పకుండ లెక్కవేసి యుందురని నేననుకొనెదను. బహుశః భారతదేశమంతటిలోను వల్లభాయి పటేలుకంటె నెక్కువ భక్తుడైన సహచరుడు గాంధీజీకి వేరొకడులేడు. అతడతిశక్తివంతుడు, తన పనిలో భీష్మప్రతిజ్ఞ కలవాడు. అయినను గాంధీజీకి, స్వయముగను, అతనియాదర్శములయెడలను, నీతియెడలను భక్తికలవాడు. అతనివలె నేనీయాదర్శములను అంగీకరించితినని చెప్పుకొనజాలను. కాని నేను గాంధీజీతో నత్యంత సన్నిహిత సంబంధముగలిగి పనిచేసితిని. ఏవిధముగనైనను అతనిపై కుట్రచేయుట యనుభావము కంపరముగనుండును. ఇదియే వర్కింగుకమిటీకంతకును అన్వయించును. ఆకమిటీ నిజముగ నతనిచేతనే సృష్టింపబడెను. కొద్దిమంది సహకారులతో నాలోచించి యతడుకమిటీని యేర్పర్చెను. ఎన్నిక యొకఆచారవ్యవహారము. ఆకమిటీలో ననేకవత్సరములు పనిచేసినవారే దానికివెన్నెముకవలె నుండిరి. వారు దానియొక్క శాశ్వతసభ్యులుగనే భావింపబడుదురు. స్వభావములోను, దృష్టిలోను, వారిలో రాజకీయ భేదాభిప్రాయములు కలవు. కాని సంవత్సరములకొలది సాంగత్యమును, సమష్టిగ భారములను వహించుటయు, సమాన యుపద్రవముల నెదుర్కొనుటయు వారి నైక్యముచేసెను. వారిమధ్య స్నేహము, సహవాసము, పరస్పరగౌరవభావము వృద్ధిపొందెను. వారికలయిక బాహ్యమైనదికాదు; వారికాంతరంగికమైన యైక్యతకలదు. ఒకరిపైనొకరు కుట్రపన్నుట యను భావమునెవడును యూహింపజాలడు. గాంధీజీ యాకమిటీకధినాయకుడు.

ప్రతివాడును శ్రోపచూషమని యతనికొర కెదురు చూచుచుండును. చాలసంవత్సరములనుండి యిదియట్లేయుండెను. 1930 లో మాకఖండ విజయము చేకూరినతరువాత 1931 లో నిది మరింత స్పష్టమయ్యెను.

వర్కింగుకమిటీలోని 'యతివాదులు' అతనిని 'తరిమివేయుటకు' ప్రయత్నించుట యెందులకు ? బహుశః అతడు చాలరాజీపడు స్వభావముకలవాడనియు, కనుక పనర్థకమైన వాడనియు భావింపబడి యుండవచ్చును. కానియతడులేనిదే పోరాటమెక్కడిది ? శాసనోల్లంఘనము సత్యాగ్రహము యెక్కడివి? సచేతనమగు నాయుద్యమములో సకల శే భాగము. నిశ్చయముగ నతడే యాయుద్యమము. ఆపోరాటమునకు సంబంధించినంతవరకు సర్వము నతనిమీదనే యాధారపడియుండెను. జాతీయపోరాటము నిశ్చయముగ నతని సృష్టికాదు. అది యేవ్యక్తిపైనను ఆధారపడలేదు. దానిమూలము లతిగంభీరములు. శాసనోల్లంఘనము చిహ్నముగగల పోరాటములోని యాంత్రిక స్వరూపము ముఖ్యముగ నతనిమీదనే యాధారపడియుండెను. అతనిని విడుట యనగా నాయుద్యమమును విడిచి క్రొత్తపునాదులమీద నూతనసృష్టిని సృష్టిచేయుట. అట్టి విషయము యెప్పుడైనను చాలకఠినమైనదిగనే యుండెడిది. 1931 లో నెవరును దానినిగురించి యోచించుటకే వీలులేదు.

1931 లో మాలో కొందరతనిని కాంగ్రెసునుండి తరిమివేయుటకు (కొందరి యభిప్రాయప్రకారము) పలుకుట్రచేయు చున్నారను విషయము నాలోచించుట వినోదకరముగనుండును. అతనికొక చిన్న సూచన చేసినచాలియుండగా మేము కుట్రపన్నవలసిన యగత్యమేమి? అతడు తప్పుకొనెదనని యొక చిన్నసూచన చేసినంతమాత్రమున వర్కింగు కమిటీయును, దేశమంతయు నెవ్వరును దిగ్భ్రమించుచుండెను. అతడు మాపోరాటములో నొకభాగమగుటచేత నతడుమమ్ము విడువ

వచ్చు ననుభావమే మాకుదుర్భరముగనుండెను. అతనిని లండనుపంపు టకే మేము సందేహించితిమి. ఏలనన నతని యభావములో భారత దేశములోని భారమంతయు మాపయిబడును. ఈస్థితిని మేమభిలషింప కుంటిమి. భారమునంతను అతనిమీద పడవేయుటకే మేముసలవడితిమి. వర్కింగు కమిటీలోను బయటనుగల మాలోచాలమందికిని గాంధీజీకిని యత్యంతానుబంధ ముండుటచే మేమతనులేని తాత్కాలిక విజయము కంటె నతనితోడి యపజయమునే వాంఛించు చుంటిమి. గాంధీజీ 'పిచ్చివాడో' కాడో మనలిబరలు మిత్రులే నిశ్చయించెదరుగాక ! అతని రాజకీయము లొక్కొక్కప్పుడు చాల యాధ్యాత్మికముగను, గ్రహించు టకు కష్టముగను నుండుననుట కెట్టిసందేహమునులేదు. కాని యతడు తాను కార్యవీరుడని, అద్భుత ధైర్యము కలవాడని, తరుణోపాయ మును చూపగలవాడని రుజువుచేసెను. 'పిచ్చితనము' యిట్టి యనుభవ యోగ్యమగు ఫలితముల నిచ్చుచో బహుశః అది యధ్యయనములోనే ప్రారంభమయి యధ్యయనముతోనే సమాప్తము చెందునట్టియు, నొక ప్రత్యేకకుటములో నంతము చెందునట్టియు 'అనుభవ రాజకీ యముల' కెంతమాత్రమును తీసిపోవునదికాదు. లక్షలకొలదిగనున్న యతని యనుచరులుకూడ 'పిచ్చిమెత్తిన' వారే యనుట నిజము. వారికి రాజకీయములును, చట్టనిర్మాణశాస్త్రమును యేమియు తెలి యవు. ఆహారము, తలదాచుకొనుటకు కొంప కట్టుకొనుటకుబట్ట, దున్నుకొనుటకుభూమి మొదలగు మానవావసరములను గురించి మాత్రమేవారు యోచింపగలరు. మానవప్రకృతిని పరిశోధించుటలో శిక్షనుగజచిన ప్రఖ్యాత విదేశ పత్రికారచయితలు భారతదేశములో విపరీతబుద్ధులగుట నాకెప్పుడును స్పష్టముగ కాన్పించుచుండెను. ప్రాచ్యదేశము కేవలము భిన్నమైనదనియు, దానిని మామూలు ప్రమాణములతో విమర్శించుటకు వీలులేదనియు బాల్యమందేవారి

కవినశ్యముగా పట్టింపబడిన భావముల ఫలితమాయిది? లేక, ఇంగ్లీషు వారి సందర్భములో, వారిదృష్టిని నిరోధించి, వారియభిప్రాయము లను తికమకచేయునది సామ్రాజ్యానుబంధమా? ఎట్టియాశ్చర్యమును పొందకుండ, నదియెంత యసంభవమైనను, వారు దేనినైనను విశ్వసింతురు. పలనన రహస్యభరితమగు ప్రాచ్యదేశములో సమస్తమును జరుగవచ్చునని తలంపబడుచున్నది. సమర్థమగు పరిశీలనాజ్ఞానముగల పుస్తకములను, నిశితమగుదృష్టిని ప్రదర్శించు చిన్నకథలను వారొక్కొక్కప్పుడు ప్రచురించుచు మధ్యమధ్య తమధర్మమును మరచిపోవుచుందురు.

1931 లో గాంధీజీ యూరపు పయనముయిననాడే విఖ్యాత పురుషుడైన ప్యారిసుపట్టణ పత్రికారచయిత యొకడు (అప్పుడులండను పత్రికకు వ్రాయుచుండెను.) వ్రాసిన వ్యాసమును చదివితిని. ఆవ్యాసము హిందూదేశమును గురించివ్రాయబడెను. అందులోనతడు 1921 నాటి అసహాయోద్యమ దినములలో (అతనిప్రకారము) వేల్సు యువరాజు హిందూదేశమును దర్శించినపుడుజరిగిన యొకవిషయము నుదహరించెను. మహాత్మాగాంధీ యొకచోట (బహుశఃఢిల్లీలో) యెట్టి ప్రకటనయులేకుండ యువరాజు మందిరమునకు హఠాత్తుగ నాటకములోని పాత్రధారివలె వచ్చిపడెననియు, నతడు మోకరించి, యువరాజు పాదములు పట్టుకొని, వెక్కివెక్కి యేడ్చుచు నీదౌర్భాగ్యదేశమునకు శాంతిని ప్రసాదింపమని యతనిని ప్రార్థించెననియు నందులో వ్రాయబడెను. ఈయద్భుత కథను మేమెవరమును, గాంధీజీకూడ, వినియుండలేదు. ఈసంగతిని తెలుపుచు నేనాపత్రికారచయితకు వ్రాసితిని. అతడు విచారమును తెలిపెను. కానితనకది నమ్మదగిన చోటునుండి వచ్చెనని వ్రాసెను. కేవలము అసంభవమని దానిముఖముమీదనే వ్రాసిపెట్టబడియున్న యీకథను పరిశోధించుటకెట్టిప్రయత్నమును చేయకయే

యతడువిశ్వసించుట నాకాశ్చర్యముగతోచెను. గాంధీగారిని గురించి కాని, కాంగ్రెసును గురించికాని భారతదేశమును గురించికాని యే మాత్రము తెలిసినవాడును దీనిని విశ్వసింపజాలడు. ఈకథయవిశ్వస నీయము, పరిహాసాస్పదము. ఇదితలక్రిందులుగా నిలిచి యాహ్వానపూర్వ కముగ గాలిలో కాళ్ళనుఝాడించుచున్న ముసోలినీ దగ్గఱకువచ్చి క్యాంటర్బరీఆర్చిబిషప్ (మతగురువు) యేడ్చెనను మూర్ఖకథను బోలి యున్నది.

ఒక వార్తాపత్రికలోని యిటీవలి నివేదిక మరియొకజాతి కథను దెలుపుచున్నది. గాంధీజీయొద్ద లక్షలకొలది పౌనుల ధనరాసులున్న వనియు, నాసిపతడు రహస్యముగా స్నేహితులయొద్ద దాచెననియు, కాంగ్రెసు యీధనముకొరకు పాకులాడుచున్నదనియు నీకథచెప్పు చున్నది. గాంధీజీ కాంగ్రెసుసభ్యుడుగా నుండుట మానివేసినచో నీధనరాసులు పోవునేమోయని భయపడుచున్నదట! ఈకథకూడ నొక యద్భుతకల్పన. గాంధీజీయెప్పుడును స్వయముగగాని, రహస్యముగ గాని తనయొద్ద ధనమునుంచుకొనడు. అతడువసూలు చేసినదంతయు నేప్రజాసంస్థకో యిచ్చివేయును. అతని వైశ్యప్రకృతిచే నతడులెక్కల నతిజాగ్రతగ నుంచును. అతడుచేయు వసూళ్లు అన్నియు బహిరంగ ముగ తణిఖీచేయబడును. ఈవదంతి బహుశః 1921 లో వసూలు చేయబడిన కోటిరూపాయిల కథమీద నాధారపడి యుండెను. ఘన ముగా కాన్పించు యీమొత్తము భారతదేశమంతటను పంచిపెట్టబడి నచో నతిస్వల్పమే యగును. ఇదిజాతీయ విశ్వవిద్యాలయములకును, పాఠశాలలకును, గృహపరిశ్రమలకును, (ముఖ్యముగా ఖద్దరు) అస్పృ శ్యతానివారణకును, అనేకయితర నిర్మాణ కార్యములకును, వినియో గింపబడెను. ఇందులో చాలభాగము ప్రత్యేక కార్యములకేర్పడెను. అవి యిప్పటికినియుండి యాయాపనులకు వినియోగింపబడుచున్నవి.

వసూళ్ళలో మిగతసొమ్ము స్థానిక కమిటీల కీయబడెను. అదికాంగ్రెసు సంస్థల నిర్మాణమునకును, రాజకీయ ప్రచారమునకును, ఖర్చుపెట్ట బడెను. అసహాయోద్యమమును, తరువాత కొద్ది సంవత్సరములవరకు, కాంగ్రెసుప్రచారమును దానివలననే నడుపబడెను. గాంధీజీయును, దేశదారిద్ర్యమునుకూడ మనరాజకీయోద్యమమును అత్యంతస్వల్పము తోనే నిర్వహించుకొనుటను బోధించెను. మాసేవ చాలవరకు పూర్తి గానైచ్ఛికమైనది. జీతముల నిచ్చినచోట నదికేవలము కడుపుచిచ్చు చల్లార్చునదిగ నుండెను. మాలోనుత్తమునైన సేవకులకు, కుటుంబము లుగల విశ్వవిద్యాలయ బి. యె. లకు యిగ్లండులో నిరుద్యో గులకిచ్చు అలవెన్సుకంటె తక్కువ యివ్వబడెను. గత పదిహేను సంవత్సరముల నుండియు కాంగ్రెసుయుద్యమము నడుపబడినంత తక్కువ మొత్తముతో నెచ్చటనైనను రాజకీయోద్యమముగాని, లేబరుయుద్యమముగాని పెద్దయెత్తులమీద నడుపబడెనని నేననుకొనను. ప్రతివత్సరము అన్నికాంగ్రెసు నిధులును, లెక్కలును బహిరంగముగ తణిఖీచేయబడెను. కాంగ్రెసు అక్రమసంఘముగా ప్రకటింపబడిన శాసనో ల్లంఘన దినములలోతప్ప యీసొమ్ములో నేదియు రహస్యముగా నుంచబడలేదు.

గాంధీజీ కాంగ్రెసుయొక్క యేకైక ప్రతినిధిగా రౌండుటేబిలు కాన్ఫరెన్సుకు లండనువెళ్ళెను. చాలకాలము చర్చించిన తరువాత నికనెవరిని ప్రతినిధులనుగ బంపకుండుటకే నిశ్చయించితిమి. భారతదేశ ములో నతివిషమ సమయమున, విషయముల నతిజాగ్రతగ చేపట్ట వలసిన యగత్యము కలిగినపుడు, మాలోని శ్రేష్ఠులందరును యిచ్చట నుండవలెనను కోరికయే దీనికి కొంతకారణము. ఆర్. టి. సి లండనులో జరుగుచుండినను కేంద్రాకర్షకస్థానము భారతదేశమని మేము భావించితిమి. భారతదేశ పరిస్థితులే విధాయకముగ లండనులో ప్రతిబింబించు

చుండును. మేము అనర్థములైన పనులు జరుగకుండ చూచుకొనుచు, మా సంస్థ నుచితస్థితిలో నుంచుకొనగోరితిమి. అయినప్పటికిని, ఒక్క ప్రతినిధినే పంపుటకిది యథార్థమైన కారణముకాదు. అదియవసరమును, చేయవలసినదియు నైనచో మేము యితరులనుకూడ విధాయకముగ పంపించియుండెడివారము. బుద్ధిపూర్వకముగనే మేమట్లుచేయుట మాని వేసితిమి. మేము చట్టనిర్మాణములోని చిన్నచిన్న వివరముల నన్నింటినిగురించి యంతములేకుండ చర్చించుటకే రౌండుటేబిలు సభలో జేరుచుండుటలేదు. ఆస్థితిలో మాకట్టివివరములతో పనిలేదు. బ్రిటిషు ప్రభుత్వముతో ప్రధానవిషయములలో సమాధానము కుదిరినప్పుడే వాటినిగురించి యోచింపవలసియుండును. ప్రజాస్వామికమైన భారత దేశమున కెంతయధికారము నీయవలెను? యనునదియే సరియైనప్రశ్న. తరువాత నేచిన్నక్లీడరయినను, మునాయిదాను, వివరములను తయారు చేయవచ్చును. ఈప్రధాన విషయములనుగురించి కాంగ్రెసుయొక్క యభిప్రాయములు తేటతెల్లముగనేయున్నవి. అందులో తర్కమున కెంతమాత్రమును సావకాశములేదు. మానాయకు డొక్కడే వెళ్ళి యాభావములను విశదముచేయుటయే గౌరవపద్ధతియని మాకుతోచెను. అతడు వాటికిగల ముఖ్యకారణములను, విధాయకితనుచూపి, వీలైనచో, బ్రిటిషుప్రభుత్వము వాటికొప్పుకొనునట్లు చేయ బ్రయత్నించును. అది చాలకష్టమనుసంగతి, దుస్సాధ్యమనుసంగతి, అప్పటి పరిస్థితులను బట్టి, మేమెరుగుదుము. కాని మాకప్పుడిక మరియొక మార్గమేమియు లేకుండెను. మేమాస్థితని, మేమతిగాఢముగా విశ్వసించి, బాసచేసిన మా యాదర్శములను, సిద్ధాంతములను వీడజాలకుంటిమి. ఆప్రధాన సూత్రములమీద నాధారపడిన సమాధాన మేదియైనను యదృష్ట వశమున కనుగొనబడినచో తక్కినదంతయు సులభముగనే దానిననుస రించును. అట్టి సమాధానమే కుదిరినచో గాంధీజీ కొందరినిగాని,

వర్కింగుకమిటీ సభ్యులనందరినిగాని లండను పిలిపించుటకు మాలో మేము యేర్పాటుచేసికొంటిమి. అప్పుడు మేమందరమును సమాధాన వివరములలో పాల్గొనవచ్చును. ఆపిలుపుకు మేముసిద్ధముగ నుండ వలెను. అవసరమైనచో వాయుయానముకూడ చేయవలెను. ఈవిధ ముగ మేము పిలుపువచ్చిన పదిరోజులలో నతనితో నుండగలము. మొదట ప్రధాన విషయములలో సమాధానమే కుదురనిచో తక్కిన సంధివివరముల సమస్యయే యుండనేరదు. ఆర్. టి. సి. కి కాంగ్రెసు ప్రతినిధు లదనముగా వెళ్ళవలసిన యవసరముండదు. కనుక మేము గాంధీజీ నొక్కనిని పంపుటకే నిశ్చయించితిమి. వర్కింగుకమిటీ సభ్యురాలగు సరోజినీదేవికూడ ఆర్. టి. సికివెళ్ళెను. కానియామె దానికి కాంగ్రెసు ప్రతినిధిగా వెళ్ళలేదు. భారతస్త్రీలతరపున ప్రతినిధిగా నామెయాహ్వానింపబడెను. ఆమెయట్లు వెళ్ళుటకు వర్కింగుకమిటీ వారు అనుమతించిరి.

కాని బ్రిటిషుప్రభుత్వమువారికి మాయభీష్టములతో నేకీభవింప వలెనను యుద్దేశ్య మెంతమాత్రమునులేదు. ప్రధానసమస్యల విచారణను కాలయాపన చేయుటయే వారినీతి. వారు స్వల్పవిషయముల తోను, నిరర్థక విషయములతోను కాన్ఫరెన్సును విసిగింపదలచిరి. పెద్దవిషయములు యోచింప బడినపుడుకూడ ప్రభుత్వమువారు ఆగవలసినదని చేయియెత్తిరి. వారేమియు మాటనీయక పూర్ణాలోచన చేసినతరువాత తమయభిప్రాయమును తెలిపెదమని వాగ్దానముచేసిరి. వారొకటే పాటపాడిరి, ఒకేమాట నాడిరి! కులసమస్యయే వారితురుపుముక్క. వారు దానినెంతవరకు నుపయోగింపవలెనో యంతవరకు నుపయోగించిరి. కాన్ఫరెన్సులో నదియే రాజ్యముచేసెను.

కాన్ఫరెన్సులోని భారతసభ్యులలో నధికసంఖ్యాకులు, చాల మంది యిష్టముగను, కొద్దిమంది అయిష్టముగను, యీయధికార

మంత్రాంగములో పడిపోయిరి. అదియొక నానాగోత్ర సంఘము. వారు తమకుతప్ప మరెవరికిని ప్రతినిధులుకారు. కొంతమంది సమర్థులు, పూజ్యులు; చాలమంది యితరుల విషయమై యీమాట చెప్పజాలము. మొత్తముమీద వారు, రాజకీయముగను, సాంఘికముగను, భారత దేశములోని యభివృద్ధి భంగకరులకు ప్రతినిధులు. భారత దేశములో నతిజాగ్రతపరులును, మితవాదులునునైన భారత లిబరలుపక్షీయులు యీబృందము ముందర యభివృద్ధివాదులుగ ప్రకాశించిరి. వారు భారత దేశములోని పెట్టుబడిదారులకు ప్రతినిధులు. వారు బ్రిటిషు సామ్రాజ్యమునకు బంధింపబడి స్వాభివృద్ధి కొరకును లేక రక్షణకొరకును వారివైపు చూచుందురు. కులసమస్యమీద 'మైనారిటీ' 'మెజారిటీ' సంఘములనుండి యతిప్రాముఖ్యమైన ప్రాతినిధ్యము వచ్చెను. వీరు పయితరగతులకు చెందిన మొండిపట్టుకలవారు. వీరిలోవీరికి సమాధాన మెన్నడును కుదరదను సంగతి జగద్విఖ్యాతము. రాజకీయముగ వీరు పూర్తిగ నభివృద్ధి భంగకారకులు. తమ కులాభివృద్ధి యొక్కటే (దానివలన రాజకీయాభివృద్ధినిత్యజింపవలసివచ్చిననుసరే) వారిప్రయోజనముగ కాన్పించును. తమ కులాభీష్టములు నెరవేరువరకును తామెట్టి యధిక రాజకీయ స్వాతంత్ర్యమును అంగీకరింపజాలమని వారు చాటిరి. అదిచాల యాశ్చర్యకరమైన దృశ్యము. పరప్రభుత్వములోనున్న ప్రజ లెంత యధఃపతితులగుదురో యది సవిషాదముగ స్పష్టముచేయుచున్నది. సామ్రాజ్యతంత్రములో వారెట్టిపాచికల క్రింద చేయబడుదురో యది విశదము చేయుచున్నది. మహారాజ రాజశ్రీలు, ప్రభువులు, వీరాధి వీర బిరుదాంకితులు, యితర పెద్దపెద్ద బిరుదులుగల యామూక భారత ప్రజలకు ప్రాతినిధ్యము వహింపజాలదనుట సత్యము. కాంగ్రెసుకు కాన్ఫరెన్సు సభ్యులు బ్రిటిషుప్రభుత్వముచే పేర్కొనబడిరి. ప్రభుత్వముకు సంబంధించినంతవరకు నీయెన్నిక భాగ్యుగనే చేయబడెను. కాని

బ్రిటిషుప్రభుత్వమువారు మనల నట్లుపయోగించుకొని కొల్లగొట్టుకొన గల విషయమొక్కటే మన దుర్బలత్వమును చాటుచున్నది; పెడ మార్గమున పెట్టబడి, యొకరి ప్రయత్నముల నొకరు భంగముచేయుట కెట్టి వింత సౌకర్యములున్నవో యది విదితము చేయుచున్నది. మన పయి తరగతుల వారింకను మన సామ్రాజ్యపాలకుల లక్ష్యములోనే చుట్టుకొని పోయి వారిపాటనే పాడుదురు. దానిలోనుండి కూడలేకపోవుటచే వారట్లు చేయుచున్నారా? లేక దానినిజ భావమును గ్రహించియే భారతదేశములోని స్వేచ్ఛకును, ప్రజాస్వామికమునకును భయపడి, వారుదానిని బుద్ధిపూర్వకముగ స్వీకరించిరా ?

ఈస్వార్థపరుల సంఘముకు - సామ్రాజ్యవాది, ఫ్యూడలిస్టు, ధనికుడు, పారిశ్రామికుడు, మత తత్పరుడు, కులాభిమాని - యగు ఆగాఖాను, బ్రిటిషుయిండియా ప్రతినిధుల తరపున నాయకుడగుట యెంతయు సమంజసముగ నున్నది. స్వాయముగా కొంతవరకతనిలో నీయన్ని ప్రయోజనములును మూర్తీభవించినవి. ఒక పురుషాంతరము నుండి బ్రిటిషుసామ్రాజ్యముతోను, బ్రిటిషు పరిపాలకులతోను సంపర్కముకలిగి, ప్రధానముగ ఇంగ్లండులోనే నివసించుచుండు యీపురుషుడు మననాయకుల ప్రయోజనములను, దృక్పథమును చక్కగా గ్రహించగలడు; వాటికొరకు వాదించగలడు. రౌండుటేబిలు కాన్ఫరెన్సులో నతడు యింగ్లీషుసామ్రాజ్యము తరపున సమర్థుడైన ప్రతినిధిగ నుండెడివాడు.

ఆకాన్ఫరెన్సులో మొగ్గుదల మనకు చాల వ్యతిరేకముగ నుండెను. మేము దానివలన నేమియు నాశించకపోయినను అతంతు సంతను నాశ్చర్యములోను, నసహ్యముతోను పరీక్షించుచుంటిమి. ఆర్థిక జాతీయ సమస్యలను పయిపయిన గోకుటకుచేసిన విచారభరితమును, నిరర్థకమును నగుప్రయత్నములను చూచితిమి. సంఘులు, పన్నాగ

ములు, తంత్రాంగములు, మనదేశస్థులే కొంతమంది బ్రిటిషుకన్సర్వేటివు పార్టీలోని యత్యంత అభివృద్ధిభంగకారులైన వారితో చేతులుకలుపుట, చిన్నసమస్యలమీద ననంతముగా భాషించుట, నిజముగా కావలసిన దానినంతను బుద్ధిపూర్వకముగ త్రోసివేయుట, పెద్దపెద్ద స్వప్రయోజనములు (ముఖ్యముగా బ్రిటిషుసామ్రాజ్యము) గలవారిచేతులలో కీలుబొమ్మలవలె నెప్పుడును ఆడుచుండుట, పరస్పరజగడములు, మధ్యమధ్యవిందులు, పరస్పరస్తోత్రములు మొదలగు నాటకమునంతను-మేము చూచితిమి. అదంతయు యుద్యోగములకొరకు ప్రాకులాట-పెద్దయుద్యోగములు, చిన్నయుద్యోగములు, హిందువులకును, ముస్లిములకును, సిక్కులకును, ఆంగ్లోయిండియనులకును, యూరపియనులకును యుద్యోగములు, స్థానములు - కానియన్నియుద్యోగములును పయితరగతులకే ! ప్రజలను చూచువారెవరునులేరు. కొంగజపములు మెండుగనుండెను. వివిధ బృందములవారు ఆకొన్నతోడేళ్లవలె, క్రొత్తచట్టనిర్మాణములో కొల్లకొట్టబడు యామిషముకొరకు, పొంచితిరుగాడుచుండినట్లు కాన్పించిరి. స్వేచ్ఛనుగురించిన భావమే పెద్దయెత్తుమీద యుద్యోగవేటగా మారెను. అది 'భారతీయుల వశముచేయుట' యనిపిలువబడెను; సైన్యము, సివిలుసర్వీసు మొదలగువాటిలో భారతీయులకు యెక్కువ యుద్యోగములనిచ్చుటను గురించియు స్వాతంత్ర్యమును గురించియు యథార్థమైన స్వేచ్ఛనుగురించియు, ప్రజాస్వామికమైన భారతదేశమునకు అధికారము నిచ్చివేయుటనుగురించియు, భారతప్రజల నెదుర్కొనినయత్యావసరమును, ప్రధానమును నగు నేయార్థిక సమస్యాపరిష్కారమును గురించియు నొక్కడును యోచింపలేదు. భారతదేశమంత వీరసంగ్రామమును జరిపినది దీనికొరకేనా? త్యాగ, తత్త్వములచే పవిత్రమైన వాతావరణమును యీాదుమ్ము, ధూళులతోనిండిన గాలికిబలి వేయవలసినదేనా?

తళ తళ ప్రకాశించుచు, జనాకీర్ణమైయున్న యామందిరములో గాంధీజీ యేకాకియై కూర్చొనెను. అతని వేషము, లేక వేషములేకపోవుట, తక్కినయందరనుండియు నతనిని వేరుచేయుచుండెను. కానియతని భావములకును, దృష్టికిని యతనిచుట్టునున్న వేషధారుల భావములకును, దృష్టికిని యంతకంటె నెక్కువ భేదముండెను. ఆకాన్ఫరెన్సులో నతని స్థితి యసామాన్యమైనది. అతడు దానినెట్లు భరింపగలిగెనాయని మేము దూరమునుండియే యాశ్చర్య పడుచుంటిమి. కానియతడద్భుతమైన యోర్పుతో దానినిసహించి సమాధానమున కేదోయొకమార్గమును కనుగొనుటకు విఘ్నవకుండ ననేకప్రియత్నములను చేసెను. అతడొక సూచనను చేసెను. కులతత్త్వము రాజకీయ పురోభివృద్ధితో తలపడు నను నిజము యెట్లుకప్పబడుచున్నదో యదివెంటనే బహిర్గతముచేసెను. కాన్ఫరెన్సులోని ముస్లిముప్రతినిధులవలన చేయబడిన యనేక కుల సంబంధములగు కోరికలు అతనికిష్టములేదు. ఇందులోకొన్ని కోరికలు స్వాతంత్ర్యమునకును, ప్రిజాస్వామికమునకును యాటంకములని యతడు భావించెను. అతనియొక్క ముస్లిముజాతీయ సహచరులుకూడ నట్లే భావించిరి. అయినను, అచ్చటజేరిన ముస్లిము ప్రితినిధులందరును రాజకీయ సమస్య (అనగా స్వాతంత్ర్య తీర్మానము) మీద తనతోను కాంగ్రెసుతోను కలసివచ్చుచో నతడు వాటినన్నిటిని, యెట్టివాదముగాని, ప్రశ్నగాని లేకుండగనే, యొప్పుకొనెదనని వాగ్దానముచేసెను.

అతడుచేసిన వాగ్దానమును స్వంతజవాబుదారీమీదనే చేసెను. ఏలనన (అతడున్నస్థితిలో) కాంగ్రెసును అతడు బంధింపజాలడు. కాని దానినొప్పుకొనవలెనని తాను కాంగ్రిసును ప్రోత్సహించెదనని యతడు వాగ్దానము చేసెను. కాంగ్రెసులో నతనికిగల పలుకుబడి నెరిగినవారెవరును కాంగ్రెసుచే నతడు దీనికొప్పించజాలడని సందేహింపడు. అయినప్పటికిని యీవాగ్దానము అంగీకరింపబడలేదు. నిశ్చయముగ ఆగా

ఖాను భారతస్వాతంత్ర్యముకొరకు నిలుచునని యూహించుట కొంచెము కష్టమైనవిషయము. నిజమైనకష్టము కులసంబంధమైనది కాదని యిది స్పష్టముచేయుచున్నది. కాని కాన్ఫరెన్సులో కులసమస్యయే పెద్దదిగ చేయబడెను. రాజకీయాభివృద్ధి నాటంకపరచువారు కులసమస్యలచాటున దాగొనిరి. బ్రిటిషుప్రభుత్వము కాన్ఫరెన్సుకు మనుష్యులను జాగ్రత్తగ నెన్నుకొని యీయభివృద్ధిని భంగపరచువారిని ప్రోత్సాహించెను. సభలో జరుగవలసిన విధానమును తమవశము నందుంచుకొని వారు కులసమస్యను ప్రధానసమస్యగ చేసిరి. ఈసమస్యమీద నచ్చటజేరినవారిలో సమాధానము కలుగనేరదని స్పష్టమగుచునేయున్నది.

బ్రిటిషు ప్రభుత్వము తన ప్రయత్నములో విజయమునొంది తనసామ్రాజ్యమును నిలుపుకొనుటకు తగినశరీరబలమునేగాక, సామ్రాజ్యసాంప్రదాయమును మఱికొంతకాలము నిర్వహించుటకు తగిన రాజనీతిని, యుక్తినికూడ నింకను కలిగియున్నదని ప్రకటనముచేసెను. రౌండుటేబిలు కాన్ఫరెన్సు తమకు ప్రాతినిధ్యము వహింపకపోయినను, అది వారిశక్తి కొక ప్రమాణముకాకపోయినను, భారతదేశప్రజలు విఫలులైరనియే చెప్పవలెను. వారు దేనికొఱకు పోరుచున్నారో దానిని గుఱించి వారికొక లక్ష్యశుద్ధి లేకపోవుటచేతచే వారు విఫలులైరి. వారిని తప్పుత్రోవను పెట్టుట, పెడమార్గమును పట్టించుట యతిసులభము. తమ యభివృద్ధి నాటంకపరచు స్వప్రయోజకులను త్రోసివేయుటకు తగినంతశక్తి కలవారమని తాము తలంపకపోవుటచేతనే వారు విఫలులైరి. ఎక్కువ మతపిచ్చి యుండుటచేతను, కులద్వేషములను సులభముగ రగుల్కొల్పుటకు వీలుండుటచేతను వారువిఫలులైరి. మొత్తముమీద విజయమును పొందుటకు తగినంత శక్తిని, యభివృద్ధిని కలిగియుండక పోవుటచేతనే వారువిఫలులైరి.

ఈరౌండుటేబిలు కాన్ఫరెన్సులో జయించితిమా లేదాయను ప్రశ్నలేదు. దానివలన నేమియు నాసింపబడలేదు. అయినను దీనికొక ప్రాముఖ్యత కలదు. దీనికి పూర్వపు కాన్ఫరెన్సు హిందూదేశములో గాని మరెచ్చటగాని యెవరిదృష్టిని యాకర్షింపలేదు. అప్పుడు శాస నోల్లంఘనము ప్రపంచము నాకర్షించెను. ప్రభుత్వముచే పేర్కొనబడి 1930 కాన్ఫరెన్సుకు వెళ్లినసభ్యులు నల్లజెండాలును, అప్రియములగు కేకలును, వెంటాడించుచుండ సభలకు వెళ్లుచుండెడివారు. 1931 లో నిదియంతయు మారిపోయెను. కాంగ్రెసు ప్రతినిధిగ గాంధీజీ వెళ్ళుట చేతనే యీమార్పుజరిగెను. లక్షలకొలది యనుచరులకు నాయకుడుగ నతడు వెళ్లుటచేతనే యీమార్పుజరిగెను. ఇది యీకాన్ఫరెన్సుకు గౌరవమునిచ్చెను. హిందూదేశము దీనిచరిత్రను నెక్కువ శ్రద్ధతో వీక్షించెను. కారణమేమయినను అపజయము భారతదేశమున కపకీర్తిని తెచ్చెను. గాంధీజీదానిలో పాల్గొనవలెనని బ్రిటిషు ప్రభుత్వమంత యాసక్తినేలచూపెనో మేమప్పుడర్థము చేసికొంటిమి.

పన్నాగములు, సమయానుకూల స్వాపహాపరత్వము, వ్యర్థమగు వంకరటింకర తిరుగుళ్ళుగల యీకాన్ఫరెన్సు భారతదేశముయొక్క యపజయము కానేరదు. అదివిఫలము అగునట్లుగనే సిద్ధింపబడెను. దానివిఫలతకు భారతదేశ ప్రజలుబాధ్యులు కాజాలరు. కానియది భారతదేశములోని నిజసమస్యలనుండి ప్రపంచదృష్టిని మరలించు టలో జయముగాంచెను. హిందూదేశములో నది భ్రమనుతొలగించెను; వ్యాకులతను, అవమానమును కలిగించెను. అభివృద్ధినాటంకపరచు వారు తలయెత్తుటకది యాస్కారమును కలిగించెను. భారతదేశములో జరుగుపనులవలననే ప్రజలకు జయాపజయములు కలుగగలవు. ఆరువేల మైళ్ల దూరమున లండనులో జరుగు మంత్రాంగములవలన శక్తివంత మగు జాతీయోద్యమము అంతరింపజాలదు, జాతీయత మధ్యతరగతుల

వారియొక్కయు, రయితులయొక్కయు నిజమైనసన్నిహిత యావశ్య కతను తెలుపుచున్నది. వారు తద్వారా తమసమస్యలను పరిష్కరించు కొన జూచిరి. ఈయుద్యమము జయించి, తనధర్మమును నెరవేర్చి ప్రజల నభివృద్ధి, స్వేచ్ఛామార్గమున నింకను ముందుకు గొంపోగల మరియొక యుద్యమమునకు సావకాశము నీయవచ్చును. లేకనిది కొంతకాలము బలవంతముగ నణచివేయ బడవచ్చును. ఆపోరాటము హిందూదేశ ములో తరువాత వెంటనే రావలసియుండును. అదికొద్దికాలము బల హీనతను తెచ్చిపెట్టవచ్చును. రెండవ రౌండు టేబిలు కాన్ఫరెన్సు యీపోరాటమునంతగా బాధించలేదు. కాని యది దానికి కొంత యనర్థదాయకమగు వాతావరణమును సృష్టించెను.

---

# ౬౮

## సంయుక్త రాష్ట్రములలో వ్యావసాయిక కష్టములు.



వర్కింగు కమిటీ సభ్యుడను కాంగ్రెసు కార్యదర్శులలో నొక డను అగుటచే అఖిలభారత రాజకీయములతో నాకు సంబంధముండెను. నేనుసాధ్యమైనంతవరకు తప్పించుకొనుచుండినను అప్పుడప్పుడు కొంచెము తిరుగుచుండవలసి వచ్చెడిది. మాభారములు, బాధ్యతలు హెచ్చిన కొలది వర్కింగు కమిటీ మీటింగులు దీర్ఘములగుచు చివరకవి రెండు వారములవరకు వరుసగ సాగుచుండెను. కేవల విమర్శన పూర్వకముగు తీర్మానములనుచేయు రోజులు గతించెను. విశాలమై, యనేక సమస్య లతోగూడిన సంస్థయొక్క యనేక వివిధ నిర్మాణకార్యములను పాలించ వలెను; దినదినము కష్టమైన సమస్యలను యోచింపవలసి వచ్చెడిది.

అయినను యు. పి. నా ప్రధాన కార్యరంగమయ్యెను. అచ్చటి వ్యావసాయిక పరిస్థితులు కాంగ్రెసుదృష్టి నాకర్షించెను. యు. పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీసభ్యులు నూటయేబదిమంది పయిగా నుండెడివారు. వారు ప్రతి రెండుమూడు మాసములకును కలుసుకొనెడివారు. దాని కార్యనిర్వాహకవర్గము, (పదిహేనుమంది యుండెడివారు) తఱుచుకలుసు కొనెడివారు. వారువ్యావసాయిక శాఖనుచూచెడివారు.

1931 సంవత్సర రెండవభాగములో కార్యనిర్వాహక వర్గము వారు ప్రత్యేక వ్యావసాయిక కమిటీని యేర్పరచిరి. అనేకమంది జమీందారులు కార్యనిర్వాహకవర్గముతోను, యీకమిటీతోను మొద టనుండి చివరవరకు ప్రధానమైన సంబంధమును కలిగియుండిరి. వారి యామోదముతోనే అన్నిచర్యలు జరుపబడెను. మా రాష్ట్రకమిటీ యధ్యక్షుడు ఆసంవత్సరము సద్దకు అహ్మదుఖాను షెర్వానీ. అతడొక

సుప్రసిద్ధ జమీందారీ కుటుంబమునకు చెందినవాడు. సాధారణకార్య దర్శి శ్రీ కృపాళానిగారును, కార్యనిర్వాహక వర్గములోని ముఖ్య సభ్యులునుకూడ జమీందారులు, లేకజమీందారీ కుటుంబములోని వారు, తక్కిన సభ్యులు వృత్తులలోనున్న మధ్యతరగతివారు. మా రాష్ట్ర కార్యనిర్వాహక వర్గములో సేద్యగాని యొక్కగాని, బీద రయితు యొక్కగాని, ప్రతినిధి యొక్కడునులేడు. జిల్లా కమిటీలలో రయితులుగలరు. కాని రాష్ట్రకార్యనిర్వాహకవర్గములోనికి వచ్చుటకు పూర్వము జరుగవలసిన యెన్నికలనన్నిటిని వారు దాటిపైకి రాజాలక పోవుచుండిరి. కనుక నావర్గమును మధ్యతరగతులలో చదువుకొన్నవా రును బలమైన జమీందారులును పూర్తిగ నాక్రమించిరి. కనుక దానిని యతివాద సంఘమని యేయర్థములోను చెప్పుటకు వీలులేదు. నిశ్చయముగా వ్యావసాయిక సమస్యలో నసలే చెప్పుటకు వీలులేదు.

మారాష్ట్రములో నేను కార్యనిర్వాహకవర్గములోను, దాని వ్యావసాయిక కమిటీలోను సభ్యుడను. నాకంతకంటె నెక్కువస్థానము లేదు. మాసలహా సంప్రదింపులలోను యితర పనులలోను నేను యెక్కువ శ్రద్ధను తీసికొనెడివాడను. కాని నేను యేవిధముగను నాయ కత్వమును వహింపలేదు. మారాష్ట్రములో నెవడును నాయకపాత్రను వహించెనని చెప్పుటకు వీలులేదు. మేము చాలకాలమునుండి సమష్టి గను, సంఘపరముగను పనిచేయుట కలవడితిమి. ఎప్పుడును సంఘము నకే ప్రాధాన్యత యివ్వబడెను, కానివ్యక్తికీయబడలేదు. ఆసంవత్సర మునకు అధ్యక్షుడే మాకు తాత్కాలికముగ ప్రధాని యగుచుండెను. అతడు మాకు ప్రతినిధి. కాని యతనికిగూడ ప్రత్యేకాధికార మేమియునులేదు.

నేను స్థానికముగ అలహాబాదు జిల్లాకాంగ్రెసు సభ్యుడనుగ గూడ పనిచేసితిని. ఈకమిటీ దీనియధ్యక్షుడైన పురుషోత్తమదాసు

టాండనయొక్క నాయకత్వముక్రింద వ్యవసాయిక స్థితి నభివృద్ధి పరచుటలో ముఖ్యమైన భాగమును తీసికొనెను. 1930 లో రాష్ట్రములో పన్నుల నిరాకరణోద్యమమును ప్రారంభించుటలో నిడినాయకత్వమును వహించెను. వ్యవసాయసంబంధమైన ధరలు పడిపోవుటవలన అలహాబాదు జిల్లా కెక్కువ దెబ్బతగులుట దీనికి కారణముకాదు. అయోధ్యలోని తాలూకుదారీ జిల్లాలు మరింత యధ్వాన్నముగ నుండెను. కానియలహాబాదు జిల్లాలో మంచియేర్పాటులును యెక్కువ రాజకీయచైతన్యతయు నుండెను. అలహాబాదు పట్టణము రాజకీయకృషి కంతకును కేంద్రమగుటయు చాలమంది ప్రధాన సేవకులు చుట్టుప్రక్కల గ్రామములకు తరుచు వెళ్లుచుండుటయు దీనికి కారణములు.

1931 మార్చిలో ఢిల్లీసంధి జరిగినవెంటనే మేముప్రచారకులను, నోటీసులను గ్రామసీమలకుపంపి, శాసనోల్లంఘనమును, యీయుద్యమమును ఆగిపోయెనని రయితులకు తెలియజేసితిమి. పన్ను చెల్లించుటకు రాజకీయముగ నాటంకము లేదనిచెప్పి చెల్లింప వలసి నదనియే మేమువారికి సలహాయిచ్చితిమి. కాని ధరలద్భుతముగా పడిపోవుటచే వారికి హెచ్చురిమిషనుల నీయవలెనని మాయభిప్రాయమనియు, వాటి కొరకు యుభయులము కలిసి పనిచేయవచ్చుననియు మేము సూచించితిమి. మామూలు రోజులలోకూడ పన్నుతరుచు దుర్భరముగ నుండెను; ధరలుపడిపోవుటచే పూర్తిపన్నుగాని, కొంచెముతక్కువగ తత్తుల్యమైన దానినిగాని చెల్లించుట యసాధ్యముగ నుండెను. మేము రయితుప్రతినిధులతో సభలనుజరిపి సాధారణముగ నీనాటికి యేజరినంతును, కొన్నిసందర్భములలో నంతకంటె నెక్కువయు, రిమిషనులుండవలెనను తాత్కాలికసూచన నొకదానిని చేసితిమి.

వ్యావసాయిక సమస్యను సాధారణ శాసనోల్లంఘనముతో పూర్తిగ వేరుచేయుటకు మేము ప్రయత్నించితిమి. 1931 లో మేము

దానిని రాజకీయములనుండి వేరుచేసి, ఆర్థికదృష్టితోనే యోచింప గోరితిమి. కాని యీరెంటికిని యెక్కువ సన్నిహితసంబంధముండుటచే నిదిచాల కష్టముగనుండెను. గతములో నీరెండును యెక్కువగ కలిసి పోయెను. మాకు కాంగ్రెసు సంస్థరీత్యా, స్పష్టముగ రాజకీయవాసన కూడకలదు. తాత్కాలికముగ మే మొకవిధమగు రయితుసంఘముగ (అందులో రయితులుకానివారును జమీందారులునుకూడ సభికాయలు!) పనిచేయ ప్రియత్నించితిమి. కానిమేము మారాజకీయ స్వభావమును వీడలేదు; వీడజాలకుంటిమి. మేముచేసిన ప్రితిదానిని ప్రిభుత్వమువారు రాజకీయముగనే చూచిరి. భవిష్యత్ శాసనోల్లంఘనఛాయలుకూడ మామందరనుండెను. ఇదినిజరూపమును దాల్చినచో రాజకీయము లును, ఆర్థికములును చేయిచేయికలిపి, కలిసినడుచుననుట కెట్టిసందేహ మునులేదు.

ఈయన్ని యాటంకములను లక్ష్యముచేయక ఢిల్లీసంధియైనది లగా యితు వ్యావసాయికసమస్యను రాజకీయ పోరాటముతో వేరుచేయుటకే మేము మొదటనుండియు ప్రియత్నించితిమి. ఢిల్లీసంధి దీనిని సమాప్తముచేయక పోవుటయే దీనికి నిజమైనకారణము. మేమీవిషయ మును ప్రిభుత్వమునకును, ప్రిజలకునుకూడ స్పష్టముగ విశదము చేయ గోరితిమి. ఢిల్లీసంభాషణలు జరుగుచుండగా గాంధీజీ తానురౌండు టేబిలుకాన్ఫరెన్సుకు వెళ్లికపోయిననుకూడ కాన్ఫరెన్సు జరుగు కాలములో శాసనోల్లంఘనమును తిరిగిప్రారంభింపనని యిర్విన్‌ప్రభువుకు వాగ్దానమునిచ్చెనని నేను విశ్వసించెదను. అతడుకాన్ఫరెన్సుకు అన్ని యవకాశములను యివ్వవలెననియు, తత్ఫలితములకొరకు వేచియుండ వలెననియు కాంగ్రెసుకుసలహాచెప్పెను. అప్పుడుకూడ గాంధీజీ యీ వాగ్దానము, స్థానికముగ మాపైచొప్పింపబడగల, ఆర్థికపోరాటము నకు వర్తింపదని స్పష్టముగచెప్పెను. యు. పి. వ్యావసాయిక సమస్య

యప్పుడు మాయందరికిని కాన్పించుచునేయుండెను. యథార్థమునకు భారతదేశములోనున్న రయితులందరకును యిట్టికష్టమేకలిగెను. సిమ్లా సంభాషణలలో గాంధీజీ యీయాంశమును పునశ్చరణచేసెను. ఇదితరువాత ప్రకటింపబడిన కాగితములలో నుదహరింపబడెను. *

యూరపుకు పయనమైవెళ్ళుదినముననే రౌండుటేబిలు కాన్ఫరెన్సుకును, రాజకీయసమస్యలకును సంబంధములేకుండ ఆర్థికపోరాటములో ప్రజలయొక్క, ముఖ్యముగా రయితాంగముయొక్క, హక్కులనుకాపాడవలసిన యగత్యము కాంగ్రెసుకు కలుగవచ్చునని యతడు స్పష్టపరచెను. అట్టిపోరాటములో దిగవలెనను కోరిక యతనికిలేదు. అతడుదానిని తప్పించుటకే యభిలషించెను. కాని యదితప్పని సరియైన

* ఈక్రింది యుత్తరములు 1931 ఆగస్టు 27 వ తేదీని జరిగినసిమ్లాయొడంబడికలో ప్రధాన భాగములు.

గాంధీగారినుండి యిండియా ప్రభుత్వ అంతరంగికశాఖను చెందినకార్యదర్శి, ఎమర్సన్, గారికి

సిమ్లా,
ఆగస్టు 27, 1931.

ప్రియమైన ఎమర్సను గారూ,

“మీరీరోజుననే వ్రాసినయుత్తరమును, అందులోనున్న క్రొత్తముసాయిదాను నమస్కారపూర్వకముగ నందుకొంటిని. మీచేసూచింపబడిన సవరణలను సర్ శ్రాస్జీగారుకూడ నాకుపంపించిరి. నేనును, నాతోడివారును మీసవరణగల ముసాయిదాను జాగ్రత్తగ పరిశీలించితిమి. ఈ క్రింది రిమార్కుల కంగీకరించుపక్షమున మేము దానికొప్పుకొనుటకు సంసిద్ధులము.

“నాలుగవపేరాలో ప్రభుత్వమువారు చేసినసూచనను నేనుకాంగ్రెసు తరఫున అంగీకరించుట సాధ్యపడదు. ఒడంబడికను ఆచరణపెట్టుటలో, కాంగ్రెసుయొక్క యభిప్రాయములో, కలుగుచుండు ఫిర్యాదుకారణములు తొలగింపబడక పోయినచో, ఢిల్లీసంధియమలులో నున్నంతకాలము శాసనోల్లంఘనము విరమింపబడునుకనుక, పరిశోధనను చేయుట యవసరమని మేము భావించుచున్నాము. కాని

పుము దానినిబూనకతప్పదు. మేముప్రజలను విడిచిపెట్టజాలకుంటిమి. సామాన్యశాసనోల్లంఘనమునకును, రాజకీయ శాసనోల్లంఘనమునకును అనువర్తించు ఢిల్లీసంధి దీనిని నిషేధింపజాలదని యతడు స్పష్ట పరచెను.

యు. పి. రాష్ట్ర కాంగ్రెసుకమిటీవారును, దానినాయకులును పన్నులనిరాకరణమును తిరిగి ప్రారంభించి ఢిల్లీసంధిని భంగపరచిరను యపవాదము పదేపదే చేయబడుచుండుటచే నేనీవిషయము నుదహ రింప వలసివచ్చెను. ఈయపవాదమును తెచ్చినవారు (వారికిసుకరముగ నుండుగాక) దీనికి సమాధానము చెప్పగలవారందరును జెయిలులో యుండియూ ప్రభుత్వమువారును స్థానిక ప్రభుత్వములవారును పరిశోధనను చేయుట కంగీకరింప సంసిద్ధులుకానిచో, నాఁగరతునట్లుంచుటను నాకును నాతోడివారికిని యెట్టి యభ్యంతరమునులేదు. ఫలితమేమనగా కాంగ్రెసు తనతరపున 'యిదివరలో లేవదీసిన యితరవిషయములను' గురించి పరిశోధన చేయవలెనని యొత్తిడిచేయును. కాని దుర దృష్టవశమున నేఫిర్యాదుకారణమైనను అతితీవ్రమైనదై దానినుపశమింప చేయుటకును, పరిశోధనచేయుటకును నంగీకరింపనినాడు, యేదోయొకపద్ధతి (రక్షణకొరకవలంబించు ప్రత్యక్షపద్ధతి) నవలంబించుట తమవిధాయిక ధర్మమని కాంగ్రెసుభావించుచో, శాస నోల్లంఘన మందులలో లేకపోయినను, కాంగ్రెసుఅట్టిపద్ధతి నవలంబించుటకు స్వేచ్ఛ కలిగియుండవలెను.

"కాంగ్రెసు ప్రత్యక్షకార్యవిధానమును బూనక చర్చలవలనను ఒప్పిం చుటవలనను, అట్టిమార్గముల వలనను ఉపశాంతిని పొందుటకే యెప్పుడును ప్రయ త్నించుననని నేనుప్రభుత్వమునకు వేరుగ వాగ్దానముచేయనక్కరలేదు. భవిష్యత్తులో నెట్టి దురభిప్రాయమును కలుగకుండుటకును, కాంగ్రెసువిశ్వాసభంగమును గావించెనను నపవాదము రాకుండుటకును కాంగ్రెసుయొక్క స్థితినిగురించి యీవాఙ్మూలము అవసరమయ్యెను. ఈప్రస్తుత చర్చలుఫలప్రదమగుచో అధికారపత్రమును. ఈ యుత్త రమును, దీనికి మీప్రత్యుత్తరమును యేకకాలమందు ప్రచురింపబడునని నేనాశించు చున్నాను.

ఇట్లు, మనఃపూర్వకముగ,

యం. కే. గాంధీ.

నున్నపుడును, వార్తాపత్రికలును, ముద్రాలయములును తీవ్రమగు నిర్బంధములకు పాల్పడినప్పుడును దీనిని తెచ్చిరి. 1931 లో యు. పి. కమిటీవారు పన్నులనిరాకరణోద్యమము నెప్పుడునుసాగింపలేదు. శాసనోల్లంఘనముతో సంబంధములేకుండ నార్థికప్రయోజనముల కొరకట్టి దానిని సాగించినను అది ఢిల్లీసంధినిభంగపరచుట కానేరదను విషయమునే నేనుస్పష్టపరుప గోరుచున్నాను. గుణమునుబట్టి యదియుక్తమా అయుక్తమా యనునది వేరొకవిషయము. ఆర్థిక కారణములకు ఫ్యాక్టరీలోని కూలీలకు సమ్మెకట్టుట కెంతహక్కుకలదో రైతులకును

---

ఎమర్సనుగారు గాంధిగారికి.

సిమ్లా,
ఆగష్టు 27, 1931

"ప్రియమైన గాంధిగారూ,

"మీరీరోజున వ్రాసినయుత్తరమునకు నమస్కారములు. అందులో మీరు, మీయుత్తరములో సూచించినరిమార్కులతో, ప్రభుత్వపత్రము నంగీకరించిరి. ఇది వరలో కాంగ్రెసువారు లేవదీసిన విషయములను గురించి యెట్టిపరిశోధనకొరకును పట్టుబట్టుట కాంగ్రెసు యుద్దేశ్యముకాదను సూచనను కౌన్సిలు సభావిష్టులైన గవర్నరు జనరలుగారు గమనించిరి. కాంగ్రెసు ప్రత్యక్షకార్యవిధానము నవలంబింపక చర్చలవలనను ఒప్పించుటవలనను అట్టి పద్ధతులవలనను యుపశమనమును పొందుటకు నిరంతరము ప్రయత్నించుమనని మీరు వాగ్దానముచేయుచు భవిష్యత్తులో కాంగ్రెసు యేదేని కార్యమును చేయనిశ్చయించునో కాంగ్రెసుయొక్క స్థితిని స్పష్టపరుప గోరిరి. వైస్రాయిగారు దీనినిగూడ గమనించిరి. ప్రత్యక్షకార్యమునకు దిగకుండ నుండుటకు మీరాశించునట్లే వైస్రాయిగారును ఆశించుచున్నారు. ప్రభుత్వము యొక్క సాధారణ స్థితినిగురించి వైస్రాయిగారు ఆగష్టు 19 వ తేదీని మీకు వ్రాసిన యుత్తరమును చూడగోరుచున్నాను. ప్రభుత్వపత్రమును, యీ తేదీని మీరు వ్రాసిన యుత్తరమును యీ జవాబును ప్రభుత్వమువారు యేకకాలమందు ప్రకటింతురని తమకు తెలియజేయుచున్నాను.

ఇట్లు, మనఃపూర్వకముగ,
"హెచ్. డబ్ల్యూ ఎమర్సను,"

దీనిని ప్రారంభించుటకంత హక్కు కలదు. ఢిల్లీలగాయితు సిమ్లావరకును మొదటనుండియు మేమిస్థితిలోనే యుంటిమి. ప్రభుత్వమువారికిది యర్థమగుటయేగాక వారు దీనిని గౌరవించిరి.

క్రమముగ నధ్వాన్నమగుచున్నస్థితిని, 1929 లోను, తరువాతను సంభవించిన వ్యావసాయికధరలయొక్క మాంద్యము, మరింత యధోగతికి తీసికొనిపోయెను. గతచాలసంవత్సరములనుండి వ్యావసాయికధరలు పెరుగుచుండెను. ప్రపంచపణ్యారంగముతో సంబంధముగల భారతదేశవ్యవసాయము యీలబ్ధినిపొందెను. ప్రపంచమంతటను పరిశ్రమాభివృద్ధికిని, వ్యవసాయాభివృద్ధికిని యత్యమిత తారతమ్యముండుటచే నిది ప్రతిచోటను వ్యావసాయికధరలనుపెంచెను. భారతదేశములో నీధరలు పెరుగుటతోడనే ప్రభుత్వమువారి రివిన్యూయును, జమీందారులకీయవలసిన పన్నులునుకూడ పెరిగెను. కనుక నిజముగా భూమిని వ్యవసాయముచేయు రయితుదీనివలననెట్టిలబ్ధిని పొందలేదు. మొత్తముమీద రయితులు, అదృష్టమున్న కొన్నిప్రాంతములలోతప్ప, క్షీణించిరి. యు. పి. లో రివిన్యూకంటె జమీందారు కీయవలసినపన్ను వడిగాహెచ్చిపోయెను. ఈశతాబ్దములో మొదటిముప్పది సంవత్సరములలోను మొదటిదానికంటె రెండవది (జ్ఞాపకమునుబట్టి) మైదురెట్లు యెక్కువయయ్యెను. ఈవిధముగ ప్రభుత్వమువారి భూమియాదాయము చాలినంతహెచ్చుగ పెరిగియుండగ భూఖామందు యొక్క రాబడి మరింతహెచ్చెను. రయితుమాత్రము యెప్పటివలె నాకలిబాధతోనే మాడుచుండెను. ధరలు పడిపోయినచోటగాని, స్థానికముగ ప్రకృతిసంబంధమైన దుఃఖములు - అనావృష్టి, వరదలు, మిడతలు, వడగండ్లుమొదలగునవి - తటస్థించినచోటగాని, రివిన్యూ, జమీందారీ పన్నులురెండును యథాప్రకారముగనేయుండెడివి. కొద్ది రిమిషనులు ఆయితువుకుమాత్రమే జంకుచు, జంకుచు యివ్వబడుచుండెడివి. అతి

మంచిరోజులలోనే పన్నులభారముచాల అధికముగ నుండెను. ఇతర సమయములలో వడ్డీవ్యాపారస్తుని వద్దకువెళ్ళకుండ పన్నుచెల్లించుట దుర్భరమయ్యెను. వ్యవసాయదారు ఋణము హెచ్చిపోయెను.

వ్యావసాయిక తరగతులన్నియు-భూఖామందులు, స్వంత పొలమును వ్యవసాయము చేసికొనువారు, కవులుదార్లు - వడ్డీవ్యాపారస్తునికి బానిసలైరి, ఆమిషములైరి. ప్రాచీనగ్రామఆర్థికములలో వడ్డీవ్యాపారస్తుడు యిట్టిపరిస్థితులలో, తనవిధాయిక ధర్మమును నెరవేర్చెడివాడు. ఇతడు తనధర్మమును కేవలము స్వప్రయోజనముకొరకే కొల్లగొనెను. ఇతడు భూమిని, భూమికిసంబంధించినవారిని నులిమివేయుచుండెను. ఇతనిని వారించునదేదియునులేదు. న్యాయచట్టము అతనికిసహాయముచేసెను. అతడు తాను వ్రాయించుకొనిన పత్రముప్రకారము అక్షరాల జరుగవలెనని పట్టుబట్టెను; అల్లేరొక్కించి పుస్తెపూసలను వడికివేసెను. క్రమముగ చిన్నచిన్న భూఖామందులనుండియు, స్వంతవ్యవసాయ దారులనుండియు భూమి యతనిచేతిలోనికి వెల్లిపోయెను. వడ్డీవ్యాపారస్తుడు పెద్దప్రొప్రయిటరు, పెద్ద జమీందారు, భూమిగల పెద్దమనిషిగ పెరిగిపోయెను. ఇంతవరకు తనపొలమును సేద్యముచేసికొనిన స్వంతవ్యవసాయదారు బనియాజమీందారు లేక సాహుకారుకుబానిసయయ్యెను. కవులుదారు స్థితి యింతకంటె నధ్వాన్నమయ్యెను. అతడుకూడ సాహుకారుయొక్క బానిసయయ్యెను. లేదాఅతడు భూమినుండి తరిమివేయబడుటచే వృద్ధిచెందుచున్న భూమిలేని దరిద్రప్రజాసైన్యములో చేరిపోయెను. ఈవిధముగభూఖామందుఅయిన వడ్డీవ్యాపారస్తునికిభూమితోగాని కవులుదారుతోగాని యెట్టిసన్నిహిత సంపర్కమును లేకుండెను. అతడుసాధారణముగ పట్టణవాసి; అతడు తనవడ్డీవ్యాపారము నచ్చటనుండిసాగించుచు, పన్నువసూలుచేయుటకు గ్రామములలోనికి తన యేజెంటులను పంపును. వీరుదయదాక్షిణ్యములులేకుండ నిర్లక్ష్యముగ యంత్రములవలె పనిచేతురు.

భూమిపన్ను పద్ధతియొక్క యస్థిరత్వమును, అయోగ్యతను చాటుటకు అంతకంత కభివృద్ధిచెందుచున్న వ్యవసాయదారుని ఋణమే చాలును. ప్రజలలో నత్యధిక సంఖ్యాకులకు శారీరముగగాని, మైశ్వర్యరీత్యాగాని వెనుకనున్న యాధారమేమియునులేదు. వారు రాకిలి మంటతోనే యుండెడివారు. దుఃఖప్రదములగు నసాధారణ సంభవములకు వారు నిలువజాలకుండిరి. ఏజాడ్యమైనను లక్షలకొలది జనులను తుడిచి వేయుచుండెను. ప్రభుత్వమువారిచే నియమింపబడిన రాష్ట్రీ బ్యాంకింగ్ యిన్క్వైరీ కమిటీవారు 1929-1930 లో హిందూదేశములోని (బర్మాతోసహా) వ్యావసాయిక ఋణము 860 కోట్లరూపాయిలని యంచనావేసిరి. ఈఋణములో జమీందారుల యొక్కయు, స్వంత వ్యవసాయము చేసికొనువారియొక్కయు, కవులుదారులయొక్కయు ఋణములుకలవు. కాని ప్రధానముగా నిది నిజముగా వ్యవసాయము చేసికొనువారిఋణము. ప్రభుత్వమువారి కరెన్సీపద్ధతి పూర్తిగ ఋణదాతల తరగతులకే సహాయపడెను. ఇది ఋణభారమును మరింత హెచ్చించెను. భారతీయులందరును తీవ్రముగ ప్రతిఘటించుచున్నను రూపాయికి 16 పెన్నీలనుగాక, 18 పెన్నీలను స్థిరపరచుటచే వ్యావసాయికఋణము నూటికి 12½ చొప్పున అనగా 107 కోట్లు హెచ్చెను.* యుద్ధమయిన తరువాత పెరిగినధరలు క్రమముగ, కాని

---

* భారతదేశములోని వ్యావసాయిక ఋణము 860 కోట్లు అనుయంచనా అతి తక్కువమదింపు. అదియేదియైనను గతనాలుగైదు సంవత్సరములలో నదిచాల హెచ్చియుండవలెను. పంజాబురాష్ట్రీ బ్యాంకింగు యంక్వైరీకమిటీవారు 1929 లో పంజాబురాష్ట్రములోని ఋణము 35 కోట్లని మదింపువేసిరి. పంజాబులోని ఋణవిమోచనముకు సంబంధించిన బిల్లు యొక్క (1934 అక్టోబరులో తయారయ్యెను) సెలెక్టు కమిటీవారు "వ్యవసాయదారు ఋణభార మపారముగనున్నది. దాని కనీసపు అంచనా 200 కోట్లరూపాయలు" అని వ్రాసిరి. ఈ క్రొత్తయంకె బ్యాంకింగు యింక్వైరీ కమిటీవారి మదింపుకు నూటికి యేబది చొప్పున హెచ్చెను. ఈహెచ్చుదలయే తక్కిన యితరరాష్ట్రములలోను కలిగినచో ప్రస్తుత (1934) భారతదేశ వ్యావసాయికఋణము 1200 కోట్లరూపాయిల (కోటి = 100 లక్షలు) కంటె హెచ్చును.

విడువకుండ, తగ్గనారంభించి వ్యవసాయపరిస్థితులుయధ్వాన్నమయ్యెను. గోరుచుట్టుమీద రోకలిపోటువలె 1929 లోని యార్థిక దురవస్థ సంప్రాప్తమయ్యెను.

యు. పి. లో 1931 లో ధరవరలనుబట్టి పన్నులుండవలెనని మేము వాదించితిమి; అనగా 1931 లోని ధరలవంటి ధరలేయున్న వెనుకటిరోజులలో పన్నులెట్లుండెనో యిప్పుడును అట్లే యుండవలెనని మేమంటిమి. ముప్పదిసంవత్సరములక్రిందట 1901 లో సరిగా ధరలిట్లే యుండెను. ఇదియొక సిస్సులైన పరీక్ష కాదు. కవులుదారులలో—కవులు దారుక్రింద కవులుదారు, ఆక్రమణహక్కుగలవాడు, ఆక్రమణహక్కు లేనివాడు-మొదలగువారుండుటచేదీనినాచరణలో పెట్టుటసులభము కాదు. అందరికంటెను క్రిందనున్న కవులుదారే యెక్కువబాధల ననుభవించు వాడు. ఇక నొక్క పరీక్షమాత్రమే కలదు. నిస్సందేహముగ నిదియే యుత్తమమైన పరీక్ష. కవులుదారుకు, పంటపండించుట కగుఖర్చులను, జీవించుటకు తగినకూలిని తీసినమీదటనే యతనికుండు శక్తినిబట్టియే పన్ను వేయవలెను. కాని యీతుదిపరీక్ష ప్రకారము, జీవించుటకెంత తక్కువఖర్చులను లెక్కవేసినను, హిందూదేశములో సేద్యము చేయ బడు భూపరిమితులలో నధికసంఖ్య పూర్తిగ నిర్ధనవంతములగును. 1931 లో యు. పి. లో మేము చూపిన యుదాహరణములనుబట్టి చాలమంది యాస్తిని అమ్ముకొనకుండగను,(అమ్ముటకేమైన నున్నచో) మెక్కువవడ్డీకి అప్పు తేకుండగను పన్నునేమాత్రమును చెల్లింపజాలరు.

మా యు. పి. కాంగ్రెసు కమిటీ ఆక్రమణహక్కుగల కవులు దారుకు నూటికి యేబదివంతునను, అంతకంటె దుస్థితిలోనున్న వానికి మరింత హెచ్చువంతునను రిమిషను యివ్వవలెనని మొట్టమొదట నొక సూచనచేసెను. 1931 మే నెలలో గాంధీజీ యు. పి గవర్నరైన సర్. మాల్కాంహైలీ గారిని కలిసినపుడు వారిరువురకును భేదాభిప్రాయము

కలుగుటచే వారికి సమాధానము కుదురలేదు. తరువాత వెంటనే గాంధీజీ యు. పి. జమీందారులకును, కవులుదారులకును సందేశము లను బంపెను. చివర సందేశములోనతడు కవులుదారులను వారు చెల్లింపగలిగినంత చెల్లింపవలెనని ప్రోత్సహించుచు తానొక యంకెను సూచించెను. ఇదిమేమదివరకు సూచించిన దానికంటె కొంచెము హెచ్చుగనుండెను. మారాష్ట్ర కమిటీవారు గాంధీజీసూచన కంగీక రించిరి. కాని ప్రభుత్వమువారు దానికంగీకరింపకపోవుటచే విషయ ములు చక్కబడలేదు.

రాష్ట్రప్రభుత్వము వారిస్థితి కష్టముగనుండెను. భూమిపన్ను వారిరాబడిలో ప్రధానమైనది. ఇది లేకపోయినచో లేక బాగుగ తగ్గింప బడినచో వారు దివాలా తీయవలయును. కాని వ్యావసాయిక తిరుగు బాటు కలుగునేమో యనుభీతి వారికి హెచ్చుగ నుండుటచే సాధ్య మైనంతవరకు తగిన రిమిషనులనిచ్చి వ్యవసాయదారుల నోదార్చ వలెనని వారికుండెను. రెండును జరుగుటసులభమైన పనికాదు. ప్రభు త్వమునకును వ్యవసాయదారునకును మధ్య జమీందారుకలడు. ఆర్థిక దృష్టితో చూచినయెడల నీజాతి నిరర్థకము, అనవసరము, అజాగళస్త నము. ఈ జాతికి స్వస్తిచెప్పినచో మిగులుదానితో ప్రభుత్వమును వ్యవ సాయదారునుకూడ రక్షించుకొనుటకును, సాయము చేసికొనుటకును వీలుగానుండెడిది. కాని బ్రిటిషు ప్రభుత్వమువారు, తమ స్థితినిబట్టి తమ్ము అంటిపెట్టికొనియున్న యీ చిన్నసంఘమును, రాజకీయకారణము లచే, విడువజాలకుండిరి.

చిట్టచివరకు రాష్ట్రప్రభుత్వమువారు జమీందారుకును వ్యవ సాయదారుకును కూడ రిమిషనుల నిచ్చిరి. ఈ రిమిషనుల పద్ధతి సుల భగ్రాహ్యముగ లేక చిక్కులతో కూడియుండెను. మొట్టమొదట దాని నర్థముచేసికొనుటే కష్టమయ్యెను. మొత్తముమీద నవియెంత

మాత్రమును చాలకుండెను. పైగా అవి వర్తమాన ఫసలీకి సంబంధించి యుండెను. వ్యవసాయదారుల బకాయిలను గురించికాని ఋణములను గురించికాని యదియేమియు నుదహరించలేదు. వ్యవసాయదారు జరుగుచున్న యర్థసంవత్సరమునకే పన్ను చెల్లించుకొనలేనప్పుడు వెనుకటిసంవత్సరముల బకాయిలను, ఋణములను, చెల్లించుకొనజాలడని స్పష్టముగ నర్థమగుచునే యుండెను. జమీందారు సాధారణముగ తనకిచ్చిన జమలనన్నింటిని పాతబకాయిలక్రింద కట్టుచుండుట యాచారము. వ్యవసాయదారు దృష్టిలోనిది చాలయుపద్రవకరమైన పద్ధతి. ఏలనన అతడీయవలసిన యేకొంతభాగమునకో యతనిమీద నెప్పుడును చర్యతీసికొని యతనిని భూమినుండి వెడలగొట్టవచ్చును.

రాష్ట్రకాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారి కసాధారణమైన కష్టపరిస్థితి యేర్పడెను. వ్యవసాయదారులకు చాల అక్రమము జరుగుచున్నదని మేము దృఢముగ విశ్వసించితిమి. కాని మేమీ విషయములో నసహాయులమైతిమి. వ్యవసాయదారులను పన్ను చెల్లింపవలదను బాధ్యతను మాపై పెట్టుకొనుటకు మేమిష్టపడలేదు. వారెంత చెల్లింపగలరో యంతయు చెల్లించితీరవలెనని మేము నిరంతరము చాటుచుంటిమి. వారికష్టములయెడలను, దౌర్భాగ్యములపట్లను మేము సానుభూతి చూపుచు వారికి ధైర్యము చెప్పుటకు ప్రయత్నించుచుంటిమి. రిమిషనులు తీసివేసినను చెల్లింపవలసిన పన్ను హెచ్చుగనే యుండెనను విషయములో మేము వారితో నేకీభవించితిమి.

న్యాయమును, అన్యాయమును అగు నిర్బంధపరంపర యంత్రము కదలనారంభించెను. వేలకొలది వ్యవసాయదారులపై భూమినుండి వెడలగొట్టుదావాలు తీసికొనిరాబడెను. వాటితో ఆవులను, ఎద్దులను, స్వంత ఆస్తిని యథేచ్ఛగ జప్తులుచేయ నారంభించిరి. జమీందారు యేజెంట్లు వ్యవసాయదారులను కొట్టుచుండిరి. అధికసంఖ్యాకులైన

వ్యవసాయదారులు పన్నుమొత్తములో కొంతభాగమును చెల్లించిరి. వారి ప్రకారమపుడు వారంతవరకే చెల్లింపగలిగిరి. బహుశః కొంత మంది సందర్భములలో మరికొంత చెల్లింపగలిగి యుండవచ్చును. కాని తక్కిన యధికసంఖ్యాకుల కందరికిని యిది చాలభారముగ నుండెను. కొంతభాగమును చెల్లించు యీపద్ధతివలన వారికెట్టి రక్షణయు కలుగ లేదు. న్యాయశాస్త్రమను నొక పెద్ద ఆవిరిబండ దయదాక్షిణ్యములు లేకుండ దానిక్రింద పడినవారి నందరిని చూర్ణముచేసికొనుచు పోవు చుండెను. కొంతభాగము చెల్లింపబడినను భూములనుండి లేవగొట్టు దావాలు డిక్రీచేయబడెను. జప్తులు, పశువులను స్వంతఆస్తిని అమ్మి వేయుట, నిరంతరాయముగ సాగింపబడుచుండెను. వ్యవసాయదారులు అసలు చెల్లింపకపోయినను యింతకంటె నధోగతిలో నుండెడివారు కారు. నిశ్చయముగ వారింతకంటె కొంతబాగుగనే యుండెడివారు. ఏలనన వారికామాత్రపు సొమ్ము అయినను మిగిలెడిది.

వారుతండోపతండములుగ మావద్దకు వచ్చుచు "మీసలహాల ననుసరించి మేము యివ్వగలిగినదంతయు నిచ్చితిమి. ఇదియే దాని ఫలితము" అని మమ్ము తీవ్రముగ నిందించుచుండిరి. ఒక్క అలహాబాదు జిల్లాలోనే అనేక వేలరైతులను భూములనుండి తరిమివేసిరి. అనేకవేలమంది యితరులపయి నేదోయొకచర్య తీసికొనబడెను. జిల్లా కాంగ్రెసు కమిటీ ఆఫీసు పగలంతయు దుఃఖాక్రాంతులగు సమూహములచే ముట్టడివేయుబడుచుండెను. దానితోపాటు నాయింటినికూడ ముట్టడివేసెడివారు. ఈ దుస్థితినుండి తప్పించుకొనుటకు తరచు నే నెచ్చటకైననుపారిపోవలెనని యేమూలనైనను సరే దాగొనవలెనని యనుకొనెడివాడను. మాదగ్గరకు వచ్చిన వ్యవసాయదారుల యొంటి నిండ గాయములు కాన్పించెడివి. జమీందారుల యేజెంటులు వానిని కలిగించిరని వారుచెప్పిరి. మేము ఆస్పత్రిలో వాటికిచికిత్స చేయించెడి

వారము. వారేమిచేయగలరు? మేమేమి చేయగలిగితిమి? మేము యు. పి. ప్రభుత్వమువారికి పెద్దపెద్ద యుత్తరములను వ్రాసితిమి. మా కమిటీ గోవిందవల్లభ పంతును నైనిటాలులేక లక్నోలోని యు. పి. ప్రభుత్వముతో నుత్తరప్రత్యుత్తరములను జరుపు కాంగ్రెసు ఆఫీసరుగ నియమించెను. అతడెప్పుడును ప్రభుత్వముకు వ్రాయుచునేయుండెను. మారాష్ట్రఅధ్యక్షుడు షెర్వానీకూడ అప్పుడప్పుడు వ్రాయుచుండెను. అట్లేనేనును వ్రాసితిని.

జూను, జూలై నెలలలో వర్షకాలముప్రారంభమగుటతోడనే మరియొక కష్టము దాపురించెను. అది దున్నుట, విత్తుటమొదలగు పనులు చేసికొనవలసిన ఋతువు. భూములనుండి వెడలగొట్టబడినవారు సోమరులుగనుండి వారికండ్లయెదుట వారిపొలములు బీడులక్రింద పడియుండ చూచుచు నూరకుండ వలసినదేనా? వ్యవసాయదారు డైనవాడు దీనినిచూడలేడు. అదియతని స్వభావమునకు విరుద్ధము. అనేక సందర్భములలో భూములను లాగుకొనుట న్యాయసాంప్రదాయము ననుసరించిన తంతులతో జరిగెను. అదియూరక వెళ్ళిపోవుటకాదు. కోర్టుడిక్రీయములు జరిగెను. తరువాత నేమియు జరుగలేదు. వారిపుడు ఆభూములనుదున్ని అక్రమప్రవేశ నేరమును (బహుశః యిది చిన్నదొమ్మికి దారితీయవచ్చును.) చేయవలసినదేనా? తానుదున్నిన పొలమును యితరులు దున్నుచుండ రయితు దానిని చూచుచు సహింపజాలడు. వారు సలహాకు మాదగ్గరకు వచ్చిరి. మేమేమి సలహా యివ్వగలము?

నేను వేసవిలో నాసంవత్సరము గాంధీజీతో సిమ్లావెళ్ళినపుడు భారతప్రభుత్వ ఉన్నతోద్యోగికి కష్టమును తెలిపి యతడే మాస్థితిలో నున్నచో తానేమిసలహా యిచ్చెడివాడో చెప్పుమంటిని. అతని ప్రత్యుత్తర మాశ్చర్యకరమగు సత్యమును తెలుపునట్లుండెను. భూమినుండి తరిమివేయబడిన వ్యవసాయదారువచ్చి తననిట్లు అడిగినచో ప్రత్యుత్త

రమునీయ నిరాకరింతునని యతడు సెలవిచ్చెను. న్యాయవిధానము ప్రకారము భూమినుండి వెడలగొట్టబడిన వానినతడైనను భూమినిమన్న కూడదని యొక్కమాటలో చెప్పజాలకుండెను. గణితశాస్త్రములోని నిర్జీవ సమస్యతో చెర లాట మాడునట్లు కాగితములమీద నాజ్ఞలను వేయుట సిమ్లాపర్వతసీమలపై తిష్టవేసి కులుకుచుండు ఆయుద్యోగికి సుళువైన విషయమే యగును. అతనికిగాని, నైనిటాలులోనున్న రాష్ట్రాధిపతులకు గాని మానవసంపర్క మేమియునులేదు; అనుభవింపబడు చున్న మానవదుఃఖమును వారుచూచి యెరుగరు.

వ్యవసాయదారులకు మేమొక్కటే సలహాచెప్పవలెనని మాకు సిమ్లాలో హితబోధచేయబడెను. వారుపూర్తిగా పన్నుయావత్తు చెల్లింపవలెను. లేదా చెల్లింప గలిగినంత చెల్లింపవలెను. అనగా మేము నిజమునకు జమీందారు యేజెంటులవలె పనిచేయవలెను. వారు చెల్లింప గలిగినంత చెల్లించవలసినదని మేము చెప్పినపుడు నిజముకు మేమట్లే చేసితిమి. వారు పశువులను అమ్మివేయరాదనియు క్రొత్తగా ఋణము చేయరాదనియు కూడ మేము చెప్పినమాట సత్యము. దాని ఫలితమును మేము చూచితిమి.

ఆవేసవి మాకందరకును చాల భయంకరముగ నుండెను. అది మాకెక్కువ యలసటను కలిగించెను. భారతరయితుకు దుఃఖముల ననుభవించుట కద్భుతమైన శక్తికలదు. అతనికెప్పుడును కరవులు, వరదలు వ్యాధులు, నలిమివేయునట్టి నిరంతర దారిద్ర్యము, సంభవించుచునే యుండెను. అతడు వీటిని భరించలేనపు డతిశాంతముగ నోరెత్తి చెప్పకొనకుండపడిపోయివేలకొలదిగలక్షలకొలదిగచనిపోవుచుండును. అదియే తప్పించుకొనుటకతనికి గలమార్గము. అప్పుడప్పుడతనిని వేధించుచుండు గొప్ప దుఃఖములవంటి వేవియును అతనికి 1931 లో సంభవించలేదు. కాని, యేకారణముచేతనో, 1931 లో సంభవించిన దుర్దశలతనికి ప్రకృతి

యొక్క దురూహ్యములైన సంఘటనములుగా కాన్పించలేదు. కనుక వాటినతడోర్పుతో సహింపలేకపోయెను. అవి మానవ కృత్యములని యతడు భావించి వానిని ప్రతిఘటించెను. అతనికి గలిగిన నూతనరాజకీయవిద్య ఫలించెను. 1931 లోని యీ క్రొత్త సంఘటనములు మాకు కూడ ప్రత్యేకముగ బాధకరముగ నుండెను. ఏలనన మేము వీటికి కొంత బాధ్యులమైతిమి. వ్యవసాయదారు లీవిషయములో చాలవరకు మాసలహాల ననుసరించలేదా ? మానిరంతర సహాయములేనిచో వ్యవసాయదారులస్థితి మరింత యధ్వాన్నమయ్యెడిదని నాదృఢవిశ్వాసము. మేమువారిలో నైకమత్యమును కలిగించుటచే వారికి శక్తి చేకూరెను. దీనిచేతనే వారికి (యిదిలేనిచో వారికి కలుగువానికంటె) యెక్కువ రిమిషనులువచ్చెను. వారియెడల చూపబడిన నిర్బంధములును, యమానుషచర్యలునుకూడ చెడ్డవేయైనను యీ దురదృష్టవంతులకు అసాధారణములుకావు. తేడాయంతయు కొంత మోతాదులలో (ఇప్పుడని మరింతయధికముగ నున్నది) నుండెను; కొంత ప్రకటనలో కలదు. సాధారణముగ గ్రామములో జమీందారు యేజెంటు వ్యవసాయదారును అవమానపరచుట, బాధించుట సామాన్యవిషయములు; అందరకు తెలిసినవిషయములు. ఇట్లు బాధింపబడు వ్యక్తి చనిపోయినప్పుడుగాని పైవారికివి యేమియు తెలియవు. మేముచేసిన కట్టుబాటుల వలనను, వ్యవసాయదారులలో కలిగిన నూతన జ్ఞానోదయము వలనను యిప్పుడు పరిస్థితులు మారెను. వ్యవసాయదారులందరును యిప్పుడు కట్టకట్టుకొని యురికంబముల నాలింగనమొనర్తురు; తమ దుఃఖముల నన్నింటిని కాంగ్రెసు ఆఫీసుకు తెలియపరచెదరు.

వేసవి ముదిరినకొలది దౌర్జన్యముగ పన్నులను వసూలుచేయు ప్రయత్నములు సన్నగిలెను; నిర్బంధ విధానము తరిగెను. భూమినుండి వెడలగొట్టబడిన యనేకమంది వ్యవసాయదారుల సమస్యయే ముఖ్య

పుడు బాధింపతొడగెను. వారికేమి సదుపాయము చేయవలెను? వారి పొలములను వారికిచ్చివేయవలసినదని మేము ప్రభుత్వమువారిపై యొత్తిడిని కలిగించుచుంటిమి; ఇవి చాలవరకు కాళీగనే యుండెను. భవిష్యత్సమస్యయే మరింత ముఖ్యమయ్యెను. ఇంతవరకు యివ్వబడిన రిమిషనులు గత ఋతువుకు మాత్రమే చెందును. భవిష్యత్తును గురించి యేమియు నిశ్చయింపబడలేదు. అక్టోబరు లగాయతు ముందు వసూళ్లు ప్రారంభమగును. అప్పుడేమిజరుగును? తిరిగి యీ భయంకర చక్రమే మనకు ప్రాప్తమగునా! రాష్ట్రప్రభుత్వమువారు తమ యధికారుల తోను, స్థానిక శాసనసభలోని కొందరు జమీందారు సభ్యులతోను గూడిన యొక కమిటీని నియమించి, యీ విషయము నాలోచింప మనిరి. వ్యవసాయదారు ప్రతినిధి యొక్కడును అందులో లేడు. చివర నిమిషములో, కమిటీవారు పనిని ప్రారంభించిన తరువాత, మాతరఫున కమిటీలో జేరవలసినదని ప్రభుత్వమువారు గోవిందవల్లభపంతును ఆహ్వానము చేసిరి. ముఖ్యమైన తీర్మానములన్నియు నదివరకే చేయ బడిన తరువాత నా పదకొండవ గంటలో కమిటీలో చేరుటవలన ప్రయోజన మేమియు లేదని యతడు తలచెను.

యు. పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీవారు కూడ నొక చిన్న కమిటీని యేర్పాటుచేసి వారిని భూత, వర్తమాన వ్యావసాయిక లెక్కలను తయారుచేసి ప్రస్తుత స్థితిని గురించి యొక నివేదికను తయారుచేయమని నియమించిరి. ఈ కమిటీ యు. పి. లోని వ్యావసా యిక పరిస్థితులను గురించి సమర్థమగు పరిశోధనతో గూడిన యొక దీర్ఘమగు నివేదికను తయారుచేసెను. వ్యావసాయిక ధరలు పడిపోవుట వలన కలిగిన నష్టము బాపతువారీగా విడదీసి చూపబడెను. వారి శిఫారసులు చాల విరివిగ నుండెను. పుస్తకరూపములో ప్రకటింపబడిన యీనివేదికమీద గోవిందవల్లభపంతు, రఫీ అహమ్మదు కిద్వాయి, వెంకటేశ నారాయణతివారీగార్ల సంతకములు కలవు.

ఈ నివేదిక వచ్చుటకు చాల పూర్వమే గాంధీజీ రౌండుటేబిలు కాన్ఫరెన్సుకు లండను వెళ్లెను. అతడు చాల సందేహముతో వెళ్ళెను. యు. పి. లోని వ్యావసాయికస్థితి యీ సందేహమున కొక కారణము. అతడు రౌండుటేబిలు కాన్ఫరెన్సుకు లండను పోక పోయినచో యు. పి. లోనే యుండి యీక్లిష్టసమస్యకొఱకు తన కాలమును వినియోగింప నిశ్చయించెను. తుది సిమ్లా సంభాషణలు యితర విషయములతో పాటు యు. పి. ని గురించి జరిగెను. అతడు లండను వెళ్ళిన తరువాత జరిగిన పరిస్థితు లెప్పటికప్పుడతనికి పూర్తిగ తెలుపబడుచుండెను. మొదటి యొకటి రెండు మాసములు నేనతనికి వారంవారము మామూలు టపాలోను, విమానటపాలోను వ్రాయుచుండెడివాడను. తరువాత రోజులలో నతడెప్పటికప్పుడే వచ్చునను యుద్దేశ్యముతో నేనంత క్రమముగా వ్రాయలేదు. అతడు మూడు మాసముల కంటె నెక్కువ కాలమచ్చట నుండనని మాతో చెప్పెను. ఈలోపల భారత దేశములో నెట్టి విషమస్థితియు నేర్పడకుండునని మేమాశించితిమి. అతడు లేని కాలములో ప్రభుత్వముతో నెట్టి పోరాటమునైనను తప్పించుకొనవలె ననియే మేము వాంఛించితిమి. కాని యతని రాక చాల యాలస్యమయ్యెను. ఇచ్చట వ్యావసాయిక పరిస్థితులు ముంచుకొని వచ్చెను. ఇచ్చటి విషమస్థితిని గురించి మేమతనికొక పెద్ద సముద్రతంతిని పంపి మాచేతులు బంధింపబడుచున్నవని సూచించితిమి. ఈ విషయములో తానాసమయమున నేమిచేయుటకును అసహాయుడననియు మాబుద్ధికి యుచితమని తోచినవిధమున ముందుకు పోవలసినదనియు నతడు మాకు తిరిగి సముద్రతంతి యిచ్చెను.

రాష్ట్ర కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమువారు వర్కింగు కమిటీకి కూడ పరిస్థితుల నెప్పటికప్పుడు పూర్తిగ తెలుపుచుండిరి. నేనెప్పుడును అచ్చటినుండి వారికి యథార్థవిషయముల నెప్పటికప్పుడు

తెలుపుచుంటిని. పరిస్థితులు ముదురుచుండుటచే కమిటీవారు రాష్ట్రాధ్యక్షుడైన షెర్వానీతోను, అలహాబాదు జిల్లా యధ్యక్షుడైన పురుషోత్తమదాసు టాండనుగారితోను ఆలోచనలను సలిపిరి.

ప్రభుత్వ వ్యావసాయిక కమిటీవారొక నివేదికను తయారు చేసి దానిలో కొన్ని శిఫారసులను చేసిరి. అవియస్పష్టముగను, అసంబద్ధముగనుండి చాలవరకు స్థానికాధికారుల యిష్టమునకు విడిచివేయబడెను. మొత్తముమీద గతఋతువులో నిచ్చినవాసికంటె నెక్కువ రిమిషనులే యివ్వబడెను. కానియవి మాకుచాలనట్లు కాన్పించెను. ఆశిఫారసుల వెనుకనున్న సిద్ధాంతములకును, వాటిని వర్తింపచేయు విధముకును మేమభ్యంతరపెట్టితిమి. ఇంతేగాక ఆనివేదిక భవిష్యత్తును గురించి మాత్రమే తెలిపి గతబకాయిలను, ఋణములను, భూముల నుండి వెడలగొట్టబడిన యసంఖ్యాకమగు వ్యవసాయదారులను నిర్లక్ష్యముచేసెను. మేమేమిచేయవలెను? గతవసంత, గ్రీష్మఋతువులలో మేముచెప్పినట్లే వ్యవసాయదారులను తాముచెల్లింపగలిగినంత చెల్లించి వెనకటి బాధలనే యనుభవింపుమని సలహాచెప్పవలెనా? ఆసలహా యతిమూర్ఖమైనదని మేముకండ్లార తెలిసికొనుటచే తిరిగిదానినే యీయజాలము. వ్యవసాయదారులు శతవిధముల తంటాలుపడి యీకొత్త డిమాండునంతను, వారేవిధముగనైనను చెల్లింపగలిగినచో, పూర్తిగ చెల్లించవలెను. లేదా వారు ప్రస్తుతమేమియు చెల్లింపక పరిస్థితుల నవలోకించుచుండవలెను. డిమాండులోని కొంతభాగమును చెల్లించుట రెంటికిని చెడిన రేవడి చందమగును; వ్యవసాయదారుకున్న కొద్దిపాటి మూలధనమును వ్యయమగును; దానితోపాటు భూములుకూడ పోవును.

మారాష్ట్రకాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమువారు యీస్థితిని గురించి దీర్ఘకాల మతిశ్రద్ధగ యోచించిరి. ఈరిమిషనులు వేసవిలో

నిచ్చినవాటికంటె నెక్కువగానున్నను అంగీకరించుటకు యోగ్యముగ లేవని వారు నిశ్చయించిరి. వ్యవసాయదారులకు లాభకరముగ నుండునట్లు వానిని మార్చుటకింకను సావకాశముండెను. మేము ప్రభుత్వము వారి నట్లుచేయవలసినదని పట్టుబట్టితిమి. కాని మాకాశలేనట్లు కాన్పించెను. మేము తప్పించుకొనవలెనని ప్రయత్నించిన పోరాటమువచ్చి మాపయిబడుచుండెను. కాంగ్రెసుపట్ల రాష్ట్ర ప్రభుత్వమువారి యొక్కయు, భారతప్రభుత్వము వారియొక్కయు వైఖరి క్రమముగ మారిపోవుచు నంతకంతకు కఠినమగుచుండెను. మాపెద్దపెద్ద యుత్తరములకు "స్థానికాధికారులను చూడుడు" అనుముభావముగు ప్రత్యుత్తరములువచ్చెడివి. మాకెట్టి ప్రోత్సాహమును కలుగజేయకపోవుటయే ప్రభుత్వనీతియని విశదమయ్యెను. వ్యవసాయదారులకు రిమిషను యివ్వబడినయెడల కాంగ్రెసుయొక్క ప్రతిష్ఠ హెచ్చువచ్చునని ప్రభుత్వము వారికి బాధగనుండెను; వారికున్న ఫిర్యాదు అదియే! చిరకాలాభ్యాసము వలన ప్రభుత్వమునకుప్రతిష్ఠ దృష్టితప్ప వేరొకటిలేదు. ప్రజలు యీరిమిషనులకు కాంగ్రెసును కీర్తింపవచ్చునను భావము ప్రభుత్వమునకు కన్నెఱ్ఱగానుండెను. కనుక ప్రభుత్వమువారు సాధ్యమైనంతవరకు దీనినిలేకుండ చేయగోరిరి. ప్రభుత్వమువారు కాంగ్రెసుయుద్యమము అంతటిపయినను తీవ్రముగ విజృంభింప నున్నారనువార్తలు యీలోపుగ ఢిల్లీ మొదలైన ప్రదేశములనుండి మాకువినవచ్చెను. ఆచిన్నవ్రేలు యిప్పుడు మరింత జోరుగ తనధర్మమును నెరవేర్చునుండెను; వేళ్ళు మమ్ము శిక్షింప వచ్చుచున్నవి. జరుగబోవుపనిని గురించిన యనేకవివరములుగూడ మాకు తెలుపబడెను. మేమదివరలో వినిన వదంతులన్నియు యథార్థములే యను సందేశము నొకదానిని నవంబరునెలలో నాకు (విడిగా కాంగ్రెసు అధ్యక్షుడైన వల్లభాయి పటేలుగారికిని) డాక్టరు అన్సారీగారుపంపిరి. అందులో సరిహద్దు రాష్ట్రములలోను, యు. పి. లోను అమలు జరుపనున్న ఆర్డినెన్సులను గురించిన వివరములుగూడ నుండెను. ఒక

క్రొత్త ఆర్డినెన్సు వంగదేశమున కిప్పుడే ప్రసాదింపబడెను. లేక ప్రసాదింపబడనుండెను. చాలవారములైన తరువాత క్రొత్తపరిస్థితుల నెదుర్కొనుటకో యనునట్లు ప్రారంభింపబడిన క్రొత్తఆర్డినెన్సులు డాక్టరు అన్సారీగారి పూర్వసందేశమును వివరములతోసహా ఖాయముచేసెను. రౌండుటేబిలు కాన్ఫరెన్సు యెక్కువకాలము పొడిగింప బడుటచే ప్రభుత్వమువారు తాముతీసికొనదలచిన చర్యలను కొంతకాల మాపి వేసిరని సాధారణముగ తలంపబడెను. రౌండుటేబిలు కాన్ఫరెన్సు సభ్యులు మధురములగు శూన్యవాక్యముల నొకరిచెవులలో నొకరు ఊదుకొనుకాలమున ప్రభుత్వమువారు హిందూదేశములో పెద్ద నిర్బంధములను ప్రవేశపెట్టుట నాపియుంచిరి.

కనుక తీవ్రత హెచ్చనారంభించెను. అల్పులమగు మాప్రేక్ష్యములేకుండ పరిస్థితులు పరుగెత్తుచున్నవనియు, ముందుగనే నిర్ణయింపబడిన వాటిగతిని యెవరును ఆపజాలరనియు మేముభావించితిమి. మేము చేయగలిగిన దంతయు వాటి నెదుర్కొనుటకు తగిన సంసిద్ధతనుజూపుటయే! ఈజీవిత నాటకములో-బహుశః విషాదాంతక నాటకము-మేము వ్యక్తిగతముగను, సమష్టిగను మామాపాత్రలను ధరింపవలెను. ఈ రెండు సైన్యములును తలపడుటకు పూర్వము గాంధీజీ వచ్చుననియు, యుద్ధమునకుగాని, శాంతికిగాని బాధ్యతనతడే వహించుననియు మేమింకను తలంచుచుంటిమి. అతడు లేనపుడు మేమెవరమును ఆబాధ్యతను వహించుటకు సంసిద్ధులముగలేము.

యు. పి. లో ప్రభుత్వమువారు మరియొక యడుగు ముందుకు వేసిరి. ఇది గ్రామసీమలలో నలజడిని కలిగించెను. వ్యవసాయదారులకు రిమిషను చీటీలను పంచిపెట్టి వారి కెంతరిమిషను యివ్వబడెనో తెలుపుచు, నొకమాసము రోజులలో (కొన్ని సందర్భములలో నింతకంటె తక్కువకాలమే యివ్వబడెను) నప్పటికున్న బకాయిలను చెల్లింప

నిచో నిచ్చిన పరిమితులు రద్దుచేయబడుననియు, పూర్తిమొత్తమంతయు న్యాయవిధానముద్వారా, అనగా భూమినుండి వెడలగొట్టబడుట, ఆస్తిని జప్తుచేయుట మొదలగు వాని ద్వారా, రాబట్టుకొనబడుననియు భయపెట్టిరి. మామూలు సంవత్సరములలో వ్యవసాయదారులు తమ పన్నులను దఫదఫాలుగ రెండుమూడుమాసములలో చెల్లించుచుండిరి. ఇప్పుడు యీమామూలుగనిచ్చు కాలపరిమితిగూడనాస్తియయ్యెను. గ్రామప్రాంతములన్నియు హఠాత్తుగనీవిషమస్థితి నెదుర్కొనవలసి వచ్చెను. చేతులలో చీటీలను పుచ్చుకొని నిరసించుచు, ఫిర్యాదుచేయుచు, సలహాయడుగుచు వ్యవసాయదారులు యిటునటు పరుగిడ నారంభించిరి. స్థానికాధికారులు కాని, ప్రభుత్వమువారుకాని కలుగచేసిన యీభయము మూర్ఖమైనదని చెప్పకతప్పదు. నిజముగా నట్లుచేయ తలంపబడలేదని మాకుతరువాత తెలిసెను. కాని యది శాంతియుతమగు సమాధానముకుగల యవకాశములను చాలవరకు తగ్గించి క్రమముగ పోరాటమునకు దారిచూపెను. వ్యవసాయదారులును, కాంగ్రెసును, యిప్పుడు వెంటనే యొకనిశ్చయమునకు రావలెను. గాంధీజీ తిరిగివచ్చువరకును మేము మానిశ్చయమును నిలిపియుంచుటకు వీలులేదు. మేమేమి చేయవలెను? ఏమి సలహాచెప్పవలెను. చాలమంది తమకీయబడిన కొద్ది గడువులో దానిని చెల్లింపలేరని మేమెరిగియున్నను చెల్లింపవలసినదని వారికి సహేతుకముగ మేమెట్లు చెప్పగలము? వారీయ్యవలసిన బకాయిలసంగతి యేమిచేయవలెను? డిమాండులోని చాలభాగమును యిచ్చివేసినను లేక పూర్తిగనిచ్చివేసినను దానిని పాతబాకీక్రింద జమకట్టినచో భూమినుండి వెడలగొట్టబడుదుర్గతి వారికి తప్పునా?

ఎక్కువమంది వ్యవసాయదారులుగల అలహాబాదు జిల్లా కాంగ్రెసు కమిటీవారు పోరాటము తప్పదనిరి. వ్యవసాయదారులను పన్నుచెల్లింప నలసినదని తాము సలహా చెప్పజాలమనిరి. అయినను

రాష్ట్రకార్యనిర్వాహక వర్గముయొక్కయు, అ. భా. వర్కింగు కమిటీ యొక్కయు నంగీకారములేనిదే యని యెట్టి తీవ్రకార్యమును చేయుటకు వీలులేదని తెలుపబడెను. కనుక నీవిషయము వర్కింగు కమిటీ వారికి విడిచిపెట్టబడెను. షెర్వానీ, టాండనుగార్లు యిరువురును రాష్ట్రముతరఫునను, జిల్లాతరఫునను యీాహంశమును అచ్చట ప్రవేశపెట్టిరి. మాముందరనున్న సమస్య, యొక్క అలహాబాదు జిల్లాకుసంబంధించెను. అది కేవలము ఆర్థికసమస్య. కాని యప్పుడున్న రాజకీయ బింకమును బట్టి దీనికి విపరీత ఫలితములు కలుగగలవని మేము గుర్తించితిమి. జరుగనున్న రాయబారములు ముగియువరకు, మంచిషరతులు చేకూరువరకు వ్యవసాయదారులు పన్నుచెల్లించుట నాపివేయవలసినదని సలహాయిచ్చుటకు అలహాబాదు జిల్లాకమిటీకి అనుజ్ఞనీయవలెనా? ఉన్నసంకుచితసమస్య అదియే! మేముదానికే కట్టుబడదలంచితిమి. కాని మేమట్లు చేయగలిగితిమా? గాంధీజీ రాక పూర్వము ప్రభుత్వముతో నెట్టివిరోధమును పెట్టుకొనకుండుటకు వర్కింగుకమిటీవారు శతవిధముల ప్రయత్నింపగోరిరి. ముఖ్యముగా వారు తరగతికిని తరగతికిని పోరాటముగ పరిణమించగల ఆర్థిక సమస్యమీాద నిది కలుగకుండ చేయగోరిరి. ఈ కమిటీ రాజకీయముగ చాలయభివృద్ధిచెందినను సాంఘికముగ నట్టి యభివృద్ధిని పొందలేదు. అది జమీాందారులకు వ్యతిరేకముగ వ్యవసాయదారుల సమస్యను లేవదీయుట కిష్టపడలేదు.

నేను సామ్యవాది నగుటచే నార్థిక, సాంఘిక విషయములలో సలహాయిచ్చుటకు తగుభద్రత లేని వాడనని భావింపబడెను. తమకెంత యిష్టములేకపోయినను మనలోనున్న యెక్కువ మితవాద తత్త్వముగల సభ్యులును, కుడిపక్షపు సభ్యులును కూడ యు. పి. పరిస్థితులవలన కార్యరంగములోని కీడ్వబడుచుండిరను సంగతిని వర్కింగు కమిటీవారు గుర్తింపవలెనని నేనుభావించితిని. మారాష్ట్రమునుండి షెర్వానీ మొదలగువారు వర్కింగుకమిటీమీాటింగుకు హాజరుకావలెనసియే నేనుకోరి

తిని. ఏలనన షెర్వానీ (మా రాష్ట్రాధ్యక్షుడు) యెంతమాత్రము ఉద్రేకికాడు. స్వభావముచేత నతడు కాంగ్రెసులో రాజకీయముగను, సాంఘికముగనుకూడ కుడిపక్షమువాడు. అతడు సంవత్సర ప్రారంభములో యు. పి. కాంగ్రెసు కమిటీయొక్క వ్యావసాయిక నీతియెడల విముఖుడుగనే యుండెను. కానియతడే ఆకమిటీయొక్క యధ్యక్షుడై యాభారమును వహింపవలసి వచ్చినప్పుడు మనకంతకంటె వేరుగత్యంతరములేదని యతడుగుర్తించెను. తరువాత రాష్ట్రకమిటీ తీసికొనిన ప్రతిచర్యయు నతనిసన్నిహిత సహకారముతోడను, నిశ్చయముగా రోజుచు అతని యధ్యక్షత క్రిందను తీసికొనబడెను.

కనుక వర్కింగుకమిటీలో నేనువాదించుటవలన కలుగుదాని కంటె షెర్వానివాదించుట వలననే యెక్కువ ఫలితముకలిగెను. కమిటీ వారు యెక్కువగ జంకుచు, కానిదానిని తిరస్కరింప వీలులేదని భావించుచు, యేప్రాంతముకైనను రివిన్యూ శిస్తులను చెల్లింపకుండుట కనుజ్ఞనీయవచ్చునని యు. పి.కమిటీవారికధికారమిచ్చిరి. కానివారు యు. పి. ప్రజలను (అదేసమయమున) శక్యమగుచో నీచర్యకుగడంగుటమాని రాష్ట్రప్రభుత్వముతో రాయబారములను జరుపవలెనని బలవంతపెట్టిరి.

ఈరాయబారములు కొద్దికాలము జరిగెను. కాని ఫలితము శూన్యము. అలహాబాదు జిల్లాలోని రిమిషను అంకెలలో కొంతమార్పు జరిగెనని నేనుభావించెదను. మామూలు పరిస్థితులలోనైనచో సమాధానము కుదిరియుండెడిది. అధమము బహిరంగ పోరాటమైనను తప్పియుండెడిది. భేదములు తగ్గిపోవుచుండెను. కాని పరిస్థితులు చాలయసామాన్యములయ్యెను. ప్రభుత్వమువారిలోను కాంగ్రెసువారిలోను కూడ సమీపములోనే పోరాటము తప్పదనుభావము ప్రబలమయ్యెను. ఇరుపక్షములవారును తీసికొను ప్రతిచర్యయు సమయముకొరకు వేయుచున్నయెత్తును సూచించునట్టికవలె కాన్పించెను. ఇందుకు ప్రభుత్వ

సన్నాహమంతయు రహస్యముగ జరుగగలదు. నిజమునకది యట్లేజరిగి పరిపూర్ణతనొందెను. మనబలము కేవలము ప్రజలనీతిమీదనే యాధారపడెను. ఇది రహస్యకార్యములచే సిద్ధము చేయబడునదికాదు; రహస్యకార్యములచే నుద్ధృతమగునదికాదు. మాలోకొంతమంది - అట్టిపాపము చేసినవారిలో నేనొకడను - మాబహిరంగోపన్యాసములలో మన స్వాతంత్ర్య పోరాటమింకను ముగియలేదనియు, నతిత్వరలోనే మన మనేక పరీక్షలను, కష్టములను నెదుర్కొనవలసి యుండుననియు ననేక సార్లు వక్కాణించితిమి. వాటికొఱకు సంసిద్ధులుగ నుండవలసినదని మేము మాప్రజలను హెచ్చరించితిమి. ఈకారణముచేత యుద్ధమునకు కాలుదువ్వుచున్నామని మమ్ము విమర్శించిరి. యథార్థమునకు మామధ్యతరగతి కాంగ్రెసువర్కరులకు నిజస్థితినెదుర్కొనుట కెంతమాత్రమును యిష్టములేకుండెను. ఏదోయొకవిధముగ పోరాటము తప్పిపోవునని వారాశించుచుండిరి. వార్తాపత్రికలు చదువు తరగతివారిదృష్టి లండనులో నున్న గాంధీజీపైనుండెను. విద్యాధికులీవిధముగ స్తబ్ధులుగనున్నను ముఖ్యముగవంగదేశములోను, సరిహద్దురాష్ట్రములోను, యు. పి. లోను పరిస్థితులు విజృంభించుచుండెను. విషమావస్థ సమీపించుచున్నదను వివేకోదయము నవంబరుమాసములో చాలమందికి కలిగెను.

యు. పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీవారు పరిస్థితులెటులుండి యెటువచ్చునోయని పోరాటము వచ్చుచో జరుగవలసిన కొన్ని స్థానిక యేర్పాటులను చేసిరి. అలహాబాదుజిల్లాకాంగ్రెసు కమిటీ పెద్ద రయితు కాన్ఫరెన్సును జరిపెను. మంచిషరతులు ప్రాప్తించనియెడల రయితులను పన్నులు, శిస్తులు చెల్లింపవలదని సలహా యివ్వవలసి యుండునను నమ్రమైన తీర్మానమందులో గావింపబడెను. ఈతీర్మానము రాష్ట్ర ప్రభుత్వము వారికి కోపమును కలిగించెను. దీనినొక సాకుగాదీసికొని వారుమాతోనిక నెట్టిసంబంధము పెట్టుకొనజాలమని నిరాకరించిరి. వారి వైఖరినిచూచి రాష్ట్ర కాంగ్రెసువారు దానినొక సంగ్రాము

చిహ్నముగా నర్థముచేసికొని తాముకూడ తగిన సన్నాహములను చేసికొనిరి. అలహాబాదులో మరియొకరయితు కాన్ఫరెన్సు జరిగెను. ఆయభారములును, మంచిషరతులును కలుగువరకును పన్నులసీయ రాదను స్పష్టమగు తీర్మానమందులో గావింపబడెను. అప్పుడయినను మేము 'సుకరమగుపన్ను'లుండవలెనను దృష్టిలోనుంటిమిగాని 'పన్నుల నీయరాదు' అను యుద్యమము నెప్పుడును తలపెట్టలేదు. రెండుపక్షము వారు మాటి మునుచుకొనినట్లు కాన్పించుచున్నను మేమింకను సమాధానముకొరకు ప్రయత్నించుచునే యుంటిమి. అలహాబాదు తీర్మానము జమీందారులకును, వ్యవసాయదారులకును కూడ సమముగనె వర్తించును. కానియది ఫలితములో రయితులకును, కొద్దిమంది చిన్న జమీందారులకును మాత్రమే వర్తించునని మేమెరుగుదుము.

1931 నవంబరు చివరను డిసెంబరు ప్రారంభమునను యు. పి. లో పరిస్థితులిట్లుండెను. ఈలోపున వంగదేశములోను సరిహద్దురాష్ట్రములోను వ్యవహారములు శ్రుతిమించెను. వంగదేశములో సర్వమును మించునట్టి నూతనఆర్డినెన్సు ప్రయోగింపబడెను. ఇవన్నియు సంగ్రామచిహ్నములుగాని శాంతిమార్గములుగావు. గాంధీజీ యెప్పుడు వచ్చును? అనుప్రశ్న యుదయించెను. ప్రభుత్వమువారు చాలకాలము నుండి సన్నాహముచేయుచున్న తీవ్రమగుచర్య ప్రారంభము కానున్న లోపల గాంధీజీ హిందూదేశముచేరునా? లేకనతని సహకారులు చాల మంది జయిళ్లకు పంపబడి పోరాటము ప్రారంభింపబడినతరువాత నతడువచ్చునా? అతనుపయనమయ్యెననియు, డిసెంబరుచివరవారములో బొంబాయి చేరనున్నాడనియు మేమువింటిమి. మేమందరము—ప్రధాన స్థానములోను రాష్ట్రములలోను నున్న ప్రతి ముఖ్యనాయకుడును— అతడువచ్చువరకు నాపోరాటము రాకుండ నుండవలెననియే కోరితిమి. పోరాటమునకైనను మేమతనిని కలుసుకొని యతనిసలహాను, ఆజ్ఞలను తీసికొనుట యవసరము. ఈపందెములో మేమసహాయులమైతిమి. ఉపక్రమణమంతయు బ్రిటిషుప్రభుత్వముతోనే యుండెను.

---

# ౪౦

## శాంతి యస్తమించెను.



యు. పి. లో నాకిదివరకున్న పనియటులుండ చాలకాలమునుండి నేను రాజకీయతుపానుకు కేంద్రములయిన తదితర రెండు రాష్ట్రములను (వంగ దేశము, సరిహద్దు రాష్ట్రము) చూడవలెనని యూహుర్దాపడుచుంటిని. అచ్చటకు వెళ్లి పరిస్థితులను నేనుకండ్లార చూడగోరితిని. నేను రెండు సంవత్సరములనుండియు చూడని యనేకమంది ప్రాతసహోద్యోగులను కూడ చూడగోరితిని. అన్నిటికంటెముఖ్యముగ ఆరాష్ట్రములలోని ప్రజలయుత్సాహమునకు, ధైర్యసాహసములకు, జాతీయపోరాటము లోని వారియఖండ త్యాగములకు నేను నాకృతజ్ఞతాభివందనముల నర్పింప గోరితిని. సరిహద్దు రాష్ట్రమునకు పోవుటకు వీలులేకుండెను. భారత ప్రభుత్వమువారు ప్రధాన కాంగ్రెసువారెవరును అచ్చటకు పోరాదని నిషేధించుటచే మేమచ్చటకువెళ్ళి తద్వారా యెట్టిప్రతిష్టం భనమును కలుగజేయదలంచలేదు.

వంగదేశములో స్థితిగతులు పాడగుచుండెను. అచ్చటకు వెళ్ళ వలెనని నేనెంతయూవేశపడుచున్నను వెళ్లుటకు ముందు సందేహించి తిని. నేనచ్చట నేమియుచేయజాల ననియు ననహాయుడనగుదుననియు గుర్తించితిని. చిరకాలమునుండి రెండుకాంగ్రెసువర్గములమధ్య నచ్చట జరుగుచున్న విచారనీయమగు వివాదముచే పయిరాష్ట్రములలోనున్న కాంగ్రెసువాదులెవరును అచ్చటకువెళ్లుటకు భయపడుచుండిరి. అచ్చ టకు వెళ్ళినచో నేపక్షములోనైనను చిక్కుకొని పోవచ్చునని వారు భయపడుచుండిరి. ఇదిచాలదుర్బలమై, యుష్ట్రపక్షినీతివలెనున్నది. ఇది వంగదేశమును శాంతిపరచుటకుగాని, దానిసమస్యలనుతీర్చుటకుగాని

తోడ్పడకుండెను. గాంధీజీ లండను వెళ్ళినకొంతకాలమునకు రెండువిష యములు భారతదేశదృష్టినంతను వంగదేశ పరిస్థితులపై కేంద్రీకరింప జేసెను. ఈరెండును హిజలీ, చిటగాంగులలో జరిగెను.

హిజలీ డిటెన్యూలకు ప్రత్యేకజయిలుగ నుండెను. ఈ జయి లులో దొమ్మిజరిగెననియు, డిటెన్యూలు ఉద్యోగస్తులపైబడిరనియు రెండవవారు విధిలేక వారిపై తుపాకులను పేల్చవలసివచ్చెననియు నొక యధికార ప్రకటనము గావింపబడెను. ఈకాల్పులవలన నొకడిటెన్యూ మరణించెను. చాలమందికి గాయములు తగిలెను. వెంటనేయొక స్థానిక యధికార పరిశోధన జరుపబడెను. ఈకాల్పులకును, తత్ఫలితములకును అధికారులెంతమాత్రమును దోషులుకారని యదిసమర్థించెను. కాని యనేక విచిత్రలక్షణములు చూపట్టెను. అధికారుల వ్రాతలతో సరి పడని యనేకయథార్థములు బయల్పడెను. పూర్తియైన పరిశోధన జరుపబడవలెనని యాందోళన బయలుదేరెను. హిందూదేశములోని యాచారమునకు భిన్నముగా వంగప్రభుత్వమువారు గొప్పగొప్ప న్యా యమూర్తులుగల యొకపరిశోధనకమిటీని నియమించిరి. అది కేవలము అధికారులకమిటీ, కానియదిసాక్ష్యములను తీసికొని విషయమునంతను పూర్తిగవిమర్శించెను. దానితీర్పు జయిలుఅధికారులకు వ్యతిరేకముగ నుండెను. తప్పుచాలవరకు జయిలుఅధికారులదే యని యదిసమర్థించెను; కాల్పులు అన్యాయమని స్పష్టపరచెను. ఈవిధముగ ప్రభుత్వము వారిచే నదివరకు ప్రకటింపబడిన యధికారపత్రములు కేవలమసత్యము లని రుజువుచేయబడెను.

హిజలీ సంభవములలో నసామాన్యమైన దేదియునులేదు. దుర దృష్టవశమున భారతభూమిలో నిట్టిసంభవములకును లేక ప్రమాదము లకును కొదువ యెన్నడును లేదు. 'జయిలుదొమ్మిలాటలు' జయిలులలో నసహాయులై నిరాయుధులై యున్నఖయిదీలను సాయుధులగు వార్డ

రులు మొదలగువారలధైర్య సాహసములతో సణచివేయుట మొదలగు వార్తలను మనము తఱచు చదువుచునేయుందుము. హిజలీయొకవిధముగ నసామాన్యమయ్యెను. అది ప్రభుత్వమువారి కేవల పక్షపాతబుద్ధిని, అట్టి సంఘటనలమీద వారుప్రకటించుచుండు ప్రకటనలలోని యసత్యతను అధికారులచేతనే బయటపెట్టించెను. ఇదివరలో నిట్టిప్రకటనలలో నెవడును విశ్వాసముంచెడివాడుకాడు. కాని యిప్పుడువాటిపస పూర్తిగకనుగొనబడెను. హిజలీ వ్యవహారమైన తరువాత నొక్కొక్కప్పుడు కాల్పులును, ఒక్కొక్కప్పుడు యితరదౌర్జన్య పద్ధతులును అవలంబింప బడిన (అధికారులచే) జయిలు 'సంభవములు' భారతదేశమంతటను అనేకచోట్ల జరిగెను. ఈజయిలు పామ్ములలో ఖయిదీలొక్కరు మాత్రమే గాయపడుచుండుట చాలవింతగ నుండును. ప్రతిసారియు తప్పకుండ వివిధములగు దుష్కార్యములను చేసిరని ఖయిదీలను నిందించుచు నుద్యోగస్థులు నిర్దోషులని ప్రకటించుచు నొకయధికారపత్రము వెలువడుచుండును. అతియరుదుగ జయిలు ఉద్యోగస్థులకు డిపార్టుమెంటుద్వారా కొద్దిశిక్షలు ప్రసాదింపబడెను. పూర్తియైన పరిశోధన చేయబడవలెనను కోరికలన్నియు నిరాకరింపబడెను. డిపార్టుమెంటుద్వారా జరుగుపరిశోధనయేచాలునని తలంపబడెను. స్పష్టముగాహిజలీ ప్రభుత్వమునకొక గుణపాఠమును నేర్పెను. ఉచితమగు నిష్పక్షపాత పరిశోధనలలో తమకుభద్రతలేదని వారుకనుగొనిరి. ముద్దాయియే యుత్తమమగు న్యాయమూర్తి. ప్రభుత్వపత్రములు యథార్థముగ జరుగుసంగతులనుగాక ప్రభుత్వమువారు ప్రజలనేమి విశ్వసింపవలెనని కోరుదురో దానినే తెలుపునను హిజలీపాఠమును ప్రజలుకూడ నేర్చుకొనవలెననుటలో నాశ్చర్యమేమున్నది?

చిటగాంగు వ్యవహారము మఱింతయుపద్రవమైనది. ఒకటెర్రరిస్టు ఒకముస్లిముపోలీసు యినస్పెక్టరును కాల్చిచంపివేసెను. దీనివెం

టనే హిందూముస్లిము కలహము (అదియట్లుపిలువబడెను.) జరిగెను. కానియది యంతకంటె నెక్కువయైన దేదియోయని పయికికాన్పించుచునే యుండెను. అదిమామూలు కులకలహముకంటె భిన్నమైనది. టెర్రరిష్టుయొక్క చర్యకు కలకత్తతో సంబంధములేదనుట సర్వవిదితమైన విషయమే! హిందువు, ముస్లిము అనుప్రశ్నలేకుండ నదియొక పోలీసు యుద్యోగిపై తీసికొనబడిన చర్య. కానితరువాత కొంత హిందూముస్లిము కలహము జరిగిన సంగతినిజము. మంచిబాధ్యతగల ప్రజాహితైషులే యెంతతీవ్ర నేరారోపణలను చేసినను యిదియెట్లు ప్రారంభింపబడెనో దీనికి కారణ మేమికలదో స్పష్టపరుపలేదు. ఈ కలహములోని మరియొకలక్షణ మేమనిన ఆంగ్లోయిండియనులు, ముఖ్యముగా రైల్వేనౌకర్లు యితరప్రభుత్వనౌకర్లు యిందులో కలుగచేసికొనిరి. వీరు యథేచ్ఛగ జనబాహుళ్యముమీద పగదీర్చుకొనినట్లు చెప్పబడెను. చిటగాంగులోని సంభవములనుగురించి సేనుగుప్త మొదలగు విఖ్యాత వంగదేశనాయకులు యిదమిత్థమను నేరములనుమోపి, పరిశోధన చేయవలసినదనియు లేదాపరువునష్టముకు దావాచేయవలసినదనియు సవాలు చేసిరి. కాని ప్రభుత్వమువారట్టి దేదియును చేయక యూరకుండిరి.

కొంత యసాధారణములగు యీచిటగాంగు సంభవములు రెండు యుపద్రవములవైపుదృష్టినాకర్షించెను. అనేకకారణములచేత టెర్రరిజము ఖండింపబడెను. ఆధునికవిప్లవశాస్త్రముకూడ దానిని ఖండించెను. దానివలనకలుగు ఫలితములలో నొకటిముఖ్యముగా నాకెక్కువను భయమును కలిగించుచుండెను. దానివలన హిందూదేశములో నచ్చటచ్చట కులకలహములు వ్యాపించు యుపద్రవముకలదు. నేను కేవల దాక్షిణ్యమునకు, నిశ్చయముగా నాకది యిష్టములేకపోయినను, వెఱచునంతటి 'పిరికి హిందువు' ను కాను. కాని హిందూదేశములో విఘాతములను కల్పించుశక్తులింకను బలవత్తరముగ నున్నవని నేనుభావించెదను. అచ్చ

టచ్చట బయలుదేరు దౌర్జన్యములు నిశ్చయముగ వాటికిమరింత బల మును చేకూర్చును; సుశిక్షణమును, జాతీయమైక్యతను నిర్మించు విధా నము నది యిప్పటికంటె మరింతకష్టతరము చేయును. మతము పేరిట లేక స్వర్గములో తమకొకస్థానమును భద్రముచేసికొనుటకు ప్రజలుహత్యల కలవడినచో నట్టివారిని టెర్రరిస్టు దౌర్జన్యముల కలవాటుచేయుట చాల యుపద్రవ కరమైన విషయము. రాచకీయ హత్యయే చెడ్డది. అయి నను రాచకీయ టెర్రరిస్టుతో వాదనలను సలిపి యితరమార్గముల కత నిని త్రిప్పవచ్చును. ఏలనన అతడు ప్రపంచ సంబంధమైన ప్రయోజన ముకొఱకు ప్రయత్నించుచున్నాడు. స్వార్థముకొఱకుగాక జాతికొఱకు పాటుపడుచున్నాడు. మతముపేరిట చేయుహత్య యధమమైనది. ఏలనన అది యితర ప్రపంచమునకు సంబంధించినది. అట్టివిషయములను గురించి సహేతుకముగ చర్చించుట కెవడును ప్రయత్నమునైనను చేయ జాలడు. ఒక్కొక్కప్పుడు యీరెంటిని విడదీయు రేఖ యనుమానాస్పద ముగనుండి కొంచెమించుమించు మాయమగును; రాచకీయహత్య, అప్రత్యక్షవిధానముచే, అర్థమతవిషయము కాగలదు.

చిటగాంగుహత్యయు, తత్ఫలితములును టెర్రరిస్టుచర్యలవలన కలుగుయుపద్రవములను కండ్లకుకట్టినట్లు స్పష్టపరచెను; అదిభారత దేశస్వాతంత్ర్యమునకును, ఐక్యతకును విపరీతనష్టమును కలిగింపగలదని విదితమయ్యెను. దానివెంటనే తీసికొనబడిన ప్రతీకారచర్యలు భారత దేశములో ఫాసిస్టు పద్ధతులు ప్రారంభమైనట్లు తెలుపు చుండెను. అప్పటినుంచి యిట్టి ప్రతీకారోదాహరణములు, ముఖ్యముగ వంగదేశ ములో, ననేకములు కలిగెను. యూరపియనులలోను, ఆంగ్లో యిండి యనులలోను నిస్సందేహముగ ఫాసిస్టుసిద్ధాంతము వ్యాప్తిచెందెను. బ్రిటిషుసామ్రాజ్య తత్త్వము నాశ్రయించుకొని జీవించుకొందరు భార తీయులకు గూడ నదియబ్బెను.

ఒక వింతవిషయ మేమనిన టెర్రరిస్టులకుగూడ (లేక వారిలో చాలమందికి) యీ ఫాసిస్టు దృష్టికలదు. కాని దానిదృష్టివేరు. వారి జాతీయ ఫాసిజము యూరపియనుల యొక్కయు, ఆంగ్లో యిండియనుల యొక్కయు, కొంతమంది పైతరగతులలోని భారతీయుల యొక్కయు సామ్రాజ్యపరమగు ఫాసిజము నెదుర్కొనును.

1931 నవంబరులో కొద్దిరోజులు నేను కలకత్తాలో నుంటిని. నాకు ఊపిరి తిరుగని ప్రోగ్రామునుండెను. వ్యక్తులను, సంఘములను యిష్టాగోష్టిలో కలుసుకొనుటగాక నేననేక బహిరంగసభలలో నుపన్య సించితిని. ఈయన్నిసభలలోను నేను టెర్రరిజమునుగురించి చర్చించి యది తప్పనియు, వ్యర్థమనియు, భారతస్వాతంత్ర్యమునకు హానికర మైనదనియు చూపుటకు ప్రయత్నించితిని. నేను టెర్రరిస్టులను తిట్టలేదు; తమజీవితములో నెన్నడును ధైర్యమునుగాని సాహసమునుగాని చూప వలసిన కార్యములను చేసిన పాపమునకుపోని మనదేశస్థులలోని కొందరు యోధులవలె నేనువారిని 'పిరికివారని,పందలని'నామకరణముచేయలేదు. తనజీవితమును నిరంతరమును యొడ్డుచున్న పురుషునిగాని స్త్రీనిగాని పిరికి వానినిపిలుచుట నాకెప్పుడును మూర్ఖముగ కాన్పించెను. ఇది యట్టి వానిపై నెట్టిఫలితమును కలుగచేయుననగా దూరమునుండియఱచుచు నేదియునుచేయుటకసమర్థులైన తనపిరికివిమర్శకుల నతడుమరింత హేయ ముగ జూచును.

నేనుకలకత్తాలోనున్న తుదిసాయంకాలమున, స్టేషనుకు వెళ్లు టకు కొద్దిపూర్వము యిద్దరుయువకులు నన్నుచూడవచ్చిరి. వారుయిరు వదియేండ్ల తరుణవయస్కులు; ముఖములుపాలియుండి యావేశపడు చున్నట్లుండెను; కండ్లుప్రకాశమానముగ నుండెను. వారెవరో నేనెరు గను. కానివారువచ్చినపని నాకువెంటనే తెలిసిపోయెను. టెర్రరిస్టుల దౌర్జన్యముకు ప్రతికూలముగ నేనుచేసిన ప్రచారముకు వారికి నాపై

కోపము కలిగెను. అది యువకులపై చెడు ఫలితములను కలుగచేయుచున్నదని వారు చెప్పిరి. నేనీవిధముగా నభ్యంతరములను కలిగించుటను వారు సహింపజాలమనిరి. మేము కొద్దివాదనకు దిగితిమి. నేను వెళ్ళవలసిన సమయ మాసన్నమగుటచే నది తొందరగ ముగింపబడెను. మాకంఠములును, మాయావేశములును హెచ్చుచుండెనని నేను భయపడితిని. నేను వారికి కొన్ని కఠినమైన మాటలను చెప్పితిని. నేను వారిని విడిచి వెళ్ళిపోవునప్పుడు భవిష్యత్తులో నేను తిన్నగా నడుచుకొనకపోయినచో నితరులకు చూపబడిన మర్యాదయే నాకును చూపబడునని వారు నన్ను కడసారి మందలించిరి.

నేను కలకత్తా వీడితిని. నేను రైలులో, నా పెట్టెలో నా రాత్రి పడుకొనియుండగా నా యిద్దరు బాలురయొక్కయు నుద్రేకపూరితములగు ముఖములు చాలసేపు నన్ను వెంటాడించెను. చైతన్యము, శక్తి, వీరిలో మూర్తీభవించినట్లుండెను. యుక్తమగు మార్గములోనే పని చేసినచో వారెంతటి యమూల్యమైన రత్నములు! వారినంత తొందరగను, మోటుగను పంపివేసినందులకు నేను చాల చింతించితిని. వారితో దీర్ఘసంభాషణలను జరుపవలెనని నేను కోరితిని. భారతదేశమును, దాని స్వేచ్ఛను సేవించువిధమున తమ కీర్తివంతములగు యౌవన జీవితముల నర్పించునట్లు బహుశః నేను వారినొప్పింపగలిగి యుండెడివాడను. ఇందులో సాహసమునకును, ఆత్మార్పణమునకును కావలసినంత నావకాశము కలదు. ఈ తరువాత సంవత్సరములలో తఱచు నేను వారినిగురించి తలపోసెడివాడను. నాకు వార పేరులు దొరకలేదు; వారినిగురించి నాకెట్టిజాడలును తెలియలేదు. వారు చనిపోయిరా లేక నే యండమాను దీవులలోనైనను మగ్గుచుండిరా యని నేనొక్కొక్కప్పు డాశ్చర్యపడుచుందును.

అది డిసెంబరు మాసము. రెండవర్తైతుసభ అలహాబాదులో జరిగెను. తరువాత హిందూస్థాన సేవాదళాధిపతియైన డాక్టరు యన్. యస్. హార్డికరుకు నేనుచేసిన చిరవాగ్దానమును నెరవేర్చుటకు దక్షిణమున కర్నాటకమునకు పరుగెత్తితిని. జాతీయోద్యమము యొక్క వైచ్ఛికభటశాఖయైన సేవాదళము, ఆసంస్థ ప్రత్యేకము వేరుగనున్నను, మొదటనుండియు కాంగ్రెసుయొక్క సహాయసంస్థగనే యుండెను. అయినను 1931 వేసవిలో వర్కింగుకమిటీవారు దానిని పూర్తిగ కాంగ్రెసుసంస్థలో కలుపుకొనుటకు నిశ్చయించిరి; దానిని కాంగ్రెసుయొక్క వాలంటీరుశాఖగ చేయగోరిరి. వారట్లుచేసి హార్డికరుగారిని నన్ను దాని కధికారులనుచేసిరి. ఈ దళముయొక్క ప్రధానస్థానము కర్నాటకములోని హుబ్లీలోనే యుంచబడెను. ఈదళమునకు సంబంధించిన వివిధ ధర్మముల కొఱకు హార్డికరునన్నా ప్రదేశమును సందర్శింప ప్రోత్సహించెను. తరువాత నతడు నన్ను కర్నాటకములో కొద్దిరోజులు యాత్రచేయించెను. ప్రతిచోటను ప్రజలలోనున్న యద్భుతోత్సాహమునకు నేనాశ్చర్య చకితుడనైతిని. నేను తిరిగివచ్చునప్పుడు త్రోవలో సైనికశాసనకీర్తినార్జించిన షోళాపురమును దర్శించితిని.

కర్నాటకయాత్ర నాకు వీడ్కోలు యాత్రయయ్యెను; నాయుప న్యాసములు తీవ్రముగనున్నను, వాటిలో గానరసము లేకపోయినను, చనిపోవుటకుముందు రాజహంస చేయు గానమువలెనుండెను. యు. పి. నుండి స్పష్టమును, నిశ్చయమునునగు వార్తలేతెంచెను. ప్రభుత్వము వారు గంటవాయించిరి. అతిజోరుగ మోగించిరి. అలహాబాదునుండి కర్నాటకము పోవునప్పుడు నేను కమలను తీసికొని బొంబాయి వెళ్ళితిని. ఆమెకుతిరిగి జబ్బుచేసెను. బొంబాయిలో నేనామెచికిత్సకు యేర్పాట్లు చేసితిని. మేము అలహాబాదు వీడివచ్చినవెంటనే భారతప్రభుత్వము

వారు యు. పి. కి ప్రత్యేక ఆర్డినెన్సును ప్రసాదించిరని బొంబాయిలో వింటిమి. గాంధీజీ యిదివరకే సముద్రప్రయాణము చేయుచు త్వరలో బొంబాయి రానున్నను వారతని రాకకొఱకు వేచియుండదలచుకొనలేదు. ఆయార్డినెన్సు వ్యావసాయిక యాందోళన నెదుర్కొనుటకే యుద్దేశింప బడినట్లు చెప్పబడెను. కానియది దిగంతవిశ్రాంతమై యన్నిటిని యావరించి యెట్టిరాచకీయ లేక ప్రజావిషయిక కార్యములనుకూడ సాధ్యముకాకుండచేసెను. అది బిడ్డలును సంరక్షణలోనుండు పిల్లలును, చేయుపాపములకు తల్లిదండ్రులను, సంరక్షకులనుకూడ శిక్షించుట కేర్పాట్లుచేసెను. ఇదిపురాతన బైబిలులోని యాచారమునకు తల్లక్రిందులు యాచారము.

గాంధీజీ రోముపట్టణములో 'గియర్నలుడియిటాలియా' యొక్క ప్రతినిధికిచ్చిన సందర్శనముయొక్క నివేదికయని చెప్పబడినదానిని యీసమయములోనే మేముచదివితిమి. ఇదిమాకాశ్చర్యముగనుండెను. రోములో నతడిట్టి సందర్శనమును అనాలోచితముగ నిచ్చుస్వభావము కలవాడుకాడు. మేము మరింత పరీక్షచేసిచూడగా మాకందులో నతనివిగాని శబ్దములు పదజాలముయెంతయో కాన్పించెను. ప్రకటింపబడిన విధమున సందర్శన మిచ్చియుండడని గాంధీజీ యది యసత్యమని తెల్పుటకుపూర్వమేమాకువిదితమయ్యెను. అతడుచెప్పినదానిని దేనినో యీవిధముగ వికలమొనర్చిరని మేముభావించితిమి. తరువాత నతడది యసత్యమని ప్రకటించిన ప్రకటనవెలువడెను. అతడురోములోనెవరికిని యెట్టి సందర్శనమును యిచ్చియుండలేదని వాఙ్మూలమిచ్చెను. ఎవడో యతనిని వంచనచేయజూచెను. కాని బ్రిటిషు వార్తాపత్రికలును రాచకీయవేత్తలును అతనిని విశ్వసింప నిరాకరించుట మాకాశ్చర్యమును కలుగచేసెను; వారతనిని తిరస్కార భావముగ నసత్యవాది యనిరి. ఇది మమ్ము బాధించి మాకు కోపమును కలిగించెను.

నేను కర్నాటక యాత్రను కట్టిపెట్టి అలహాబాదు తిరిగి వెళ్లుట కాతురపడుచుంటిని. యు. పి. లో నా సహచరులతో నుండుటయే నాధర్మమని నేను భావించితిని. ఇంటివద్ద నారాష్ట్రములో కొంపలు కూలిపోవుచుండ నెచ్చటనో దూరములో నుండుట యగ్నిపరీక్షవలె నుండెను. అయినను నేను కర్నాటక ప్రోగ్రాముకు బద్ధుడనగుటకే నిశ్చయించితిని. నేను బొంబాయి తిరిగి వచ్చునరికి కొందరు స్నేహితులు గాంధీజీ వచ్చువరకు నన్నచ్చటనే యుండమనిరి. అతడు సరిగా నొక్క వారములో రానై యుండెను. కాని యిది యసంభవమయ్యెను. పురుషోత్తమదాసుటాండను మొదలగు వారు నిర్బంధింపబడిరను వార్తలు అలహాబాదునుండి వచ్చెను. పయిగా మారాష్ట్ర కాన్ఫరెన్సు యిటావాలో నావారములో జరుగనుండెను. కనుక నేను అలహాబాదు వెళ్లుటకు నిశ్చయించి యారురోజులైన తరువాత, నేను స్వేచ్ఛగ నుండుచో, గాంధీజీని కలుసుకొనుటకును, వర్కింగు కమిటీమీటింగుకు హాజరగుటకును బొంబాయి తిరిగిపోవలెననుకొంటిని.

నేను అలహాబాదు చేరకమునుపే, చియోకీ స్టేషనువద్ద క్రొత్త ఆర్డినెన్సుక్రింద నాపయి నొక ఆర్డరు అమలు జరుపబడెను. అలహాబాదు స్టేషనులో ఆఆర్డరుయొక్క డూప్లికేటును నాపయి నమలు జరుపుటకు మరియొక ప్రయత్నము జరిగెను; నాయింటివద్ద మరియొక వ్యక్తి మూడవప్రయత్నమును చేసెను. నేనెట్టి సాహసములకును దిగలేదు. ఆ యార్డరు నన్ను అలహాబాదు మున్సిపలు సరిహద్దులలో నుండవలెనని ప్రవాసము విధించెను. నేను యెట్టి బహిరంగ సభలకును, యుత్సవములకును హాజరు కాగూడదనియు, బహిరంగసభలలో నుపన్యసింప గూడదనియు, వార్తాపత్రికలలోగాని, కరపత్రములలోగాని యేమియు వ్రాయకూడదనియు నాకు చెప్పిరి. ఇంకను అనేక నిర్బంధములుండెను. నాసహోద్యోగు లనేకమందిపయి నిట్టి ఆర్డరే యమలు

జరుపబడెనని నేను కనుగొంటిని; వీరిలో షెర్వానీ కూడ నుండెను. మరునాడు ప్రాతఃకాలమున నేను జిల్లామేజస్ట్రేటుకు (ఆర్డరును అమలు జరిపించిన వానికి) వ్రాయుచు దానినందుకొంటినని తెలుపుచు నేనేమి చేయవలెనో, యేమిచేయరాదో యను సందర్భములో నేనతనినుండి యాజ్ఞలను తీసికొనజాలనని తెలిపితిని. నేను నామామూలు పనిని మామూలు విధముగ చేసికొందును. ఈపని చేసికొను సందర్భములో నేను గాంధీజీని చూచుటకు బొంబాయి త్వరలోనే తిరిగి వెళ్ళవలచు కొంటిని; వర్కింగు కమిటీ (దానికి నేను కార్యదర్శిని) మీటింగులో పాల్గొనదలచితిని.

మమ్మొక క్రొత్తసమస్య యెదుర్కొనెను. మా యు. పి. రాష్ట్రీ కాన్ఫరెన్సు ఆవారములో యిటావాలో జరుగనుండెను. గాంధీజీ రాకయు నిదియునేకకాలమందు జరుగనుండుటచే నేను దీనిని మార్చ వలెనను సూచనచేయు నుద్దేశ్యముతోను, ప్రభుత్వముతో సంఘర్షణ లేకుండచేయు నుద్దేశ్యముతోను బొంబాయినుండి వచ్చితిని. కాని నేను అలహాబాదు చేరకమునుపే మాయధ్యక్షుడైన షెర్వానీగారికి యు. పి. ప్రభుత్వమునుండి ఖండితమైన సందేశమొకటి వచ్చెను. అది మా కాన్ఫరెన్సు వ్యావసాయిక సమస్యను చర్చించునా యని ప్రశ్నించెను. అది యట్లు చేయుచో ప్రభుత్వమువారా కాన్ఫరెన్సునే నిషేధించెదరు. రాష్ట్రము నంతను ఆందోళనపరచుచున్న వ్యావసాయిక సమస్యను చర్చించుటయే కాన్ఫరెన్సుయొక్క ప్రధాన ప్రయోజనమని విదితమగు చున్నది. సభ జరిపి దానిని గురించి చర్చింపకుండుటకంటె మూర్ఖత్వము వేరులేదు; అది మనకు మనమే మూర్ఖులమని చెప్పుకొనుట యగును. ఏది యెట్లున్నను, మనయధ్యక్షునకు గాని లేక మరెవ రికి గాని కాన్ఫరెన్సును బంధించుటకట్టి యధికారమును లేదు. ప్రభుత్వమువారి జడిపింపులతో సంబంధము లేకుండగనే కాన్ఫ

రెన్సును మరియొకతేదీకి మార్చవలెనని మాలోకొందర ముద్దేశించు చుంటిమి. కాని యీజడిపింపు కొంతయుజడికి కారణమయ్యెను. ఇట్టి విషయములలో, (మాలోచాలమంది పెంకితలకాయలము గలము) ప్రభుత్వమువారిచే శాసింపబడుట యనుభావము వెగటుగనుండెను. చాలకాలము చర్చించినతరువాత మేము మాయభిమానమును దిగ మ్రింగుటకు నిశ్చయించుకొని కాన్ఫరెన్సును మరియొకతేదీకి మార్చి తిమి. ఏమి జరిగినను జరుగుగాక ! గాంధీజీవచ్చువరకును పోరాటము వృద్ధికాకుండ (అదియిదివరకే ప్రారంభింపబడెను) చేయుటకే మేమట్లు చేసితిమి. సారథ్యమును వహించుట కశక్యమగు పరిస్థితులలో నతనిని పెట్టుటకు మాకిష్టములేకుండెను. మేము రాష్ట్రకాన్ఫరెన్సును ఆపి వేసినను యిటావాలో పోలీసువారియొక్కయు, మిలిటరీయొక్కయు బ్రహ్మాండమగు ప్రదర్శనమొకటి జరుపబడెను. కొంతమంది తెలియక వచ్చిన ప్రతినిధులు అరెస్టుచేయబడిరి. అచ్చటనున్న స్వదేశీ ప్రదర్శన శాలను మిలిటరీవారు జయప్రదముగ పట్టుకొనిరి.

షెర్వానీయు, నేనును డిసెంబరు 26 వ తేదీ యుదయము అలహాబాదువీడి బొంబాయి వెళ్ళుటకు నిశ్చయించితిమి. యు. పి. పరి స్థితులనుగురించి చర్చించుటకు షెర్వానీ, వర్కింగుకమిటీ మీటింగుకు ప్రత్యేకముగ నాహ్వానింపబడెను. అలహాబాదు పట్టణమును వీడకూడ దని మాయిరువురకును ఆర్డినెన్సుక్రింద ఆర్డర్లు అమలుజరుపబడెను. అలహాబాదుజిల్లాయొక్కగ్రామ ప్రాంతములలోను, మరికొన్ని యు. పి. జిల్లాలలోను పన్నులను చెల్లింపకుండు చర్యల నెదు ర్కొనుటకే ఆర్డినెన్సు యుద్దేశింపబడినదని చెప్పబడెను. ఈగ్రామ ప్రాంతములకు పోకుండ ప్రభుత్వమువారు మమ్ములడ్డుపెట్టుటను అర్థము చేసికొనుట సులభము. కాని యీవ్యవసాయి కాందోళనమును మేము బొంబాయిమహాపట్టణములో నిర్వహింప జాలమనుట సువిదితము.

ఆర్డినెన్సు నిజముగా నొక్క వ్యావసాయిక పరిస్థితులకొఱకే యుద్దేశింపబడినచో, రాష్ట్రీమునుండి వెళ్ళిపోవుచున్నందులకు మమ్మభినందింపవలసియుండెను. ఆర్డినెన్సు ప్రకటింపబడినది లగాయతు స్వరక్షణయే మాసాధారణ నీతిగనుండెను. అచ్చటచ్చట వ్యక్తులు ఆర్డరులను ధిక్కరించినను మేముదానితో తలపడుట కిచ్ఛగింపలేదు.

యు. పి. కాంగ్రెసువారుకూడ ప్రభుత్వముతో పోరాటము లేకుండ నుండవలెనని లేక ప్రస్తుతమయినను ఆపివేయవలెనని కోరుచుండెననుట స్పష్టమయ్యెను. గాంధీజీయును, వర్కింగుకమిటీవారును యీవిషయములనుగురించి చర్చింపనున్న బొంబాయిపట్టణమునకు షెర్వానీయును, నేనును వెళ్ళుచుంటిమి. వారియంత్యనిర్ణయము లెట్లుండునో- నిశ్చయముగా నాకేమియు దృఢముగా తెలియదు- యెవరును యెరుగరు.

ఈయన్నికారణములచేతను మేముబొంబాయి వెళ్ళుట కభ్యంతరముండదని నేనుభావించితిని. ప్రవాసమును విధించిన ఆర్డరును సాంకేతికముగ నుల్లంఘించినందులకు ప్రభుత్వమువారు తాత్కాలికముగనైనను సహించెదరనుకొంటిని. అయినను నాయంతరాత్మ మరియొకవిధముగ చెప్పుచుండెను.

మేము రైలుయెక్కుటతోడనే ప్రాతఃకాలపత్రికలలో సరిహద్దు రాష్ట్రీములోని క్రొత్తఆర్డినెన్సును గురించియు, అబ్దుల్ గఫ్ఫారాను, డాక్టరు ఖానుసాహేబు మొదలగువారి అరెస్టులనుగురించియు చదివితిమి. ఇంతలోనే మాబండి, బొంబాయిమెయిలు, ఇరదత్ గంజియను నొక మారుమూలస్టేషనులో నకస్మాత్తుగా నిలిచిపోయెను. ఇది సాధారణముగ మెయిలులుఆగు ప్రదేశముకాదు. ఇంతలో పోలీసు అధికారులు మమ్ములరెస్టుచేయుటకు వచ్చిరి. రైల్వేలైనుప్రక్క నొక బ్లేక్ మేరియా

మాకొఱకు వేచియుండెను. షెర్వానీయు, నేనును కట్టుదిట్టముగ మూసివేయబడిన యీ ఖయిదీలబండిలో నెక్కగానే యదిమమ్ము నైనీలో దింపివేసెను. క్రిస్టమసు బహుమానములనిచ్చు యారోజు ప్రాతఃకాలమున మమ్ము అరెస్టుచేసిన పోలీసు సూపరింటెండెంటు, ఒక ఆంగ్లేయుడు, గుజ్జుగను విచారముగను కాన్పించెను. పాపము మేమతనికి క్రిస్టమసు పండుగను పాడుచేసితిమనుకొనెదను!

తిరిగి ఖయిదుకు సిద్ధము!

---

## ౪౧

## అరెస్టులు, ఆర్డినెన్సులు, నిషేధములు.

మాఅరెస్టులు జరిగిన రెండురోజులకు గాంధీజీ బొంబాయి చేరెను. చిట్టచివరజరిగిన విపరీతములన్నియు నతని కప్పుడే తెలిసెను. అతడు వంగదేశపు ఆర్డినెన్సునుగురించి లండనులోనే విని తెల్లబోయెను. ఇప్పుడతనికి యు. పి. సరిహద్దురాష్ట్రముల ఆర్డినెన్సులు నూతన క్రిస్టమసు ప్రసాదములుగ నొసంగబడెను. ఈరెండు రాష్ట్రములలోను అతనియత్యంత సన్నిహిత సహోద్యోగులు కొందరు నిర్బంధింపబడిరి. కథ ప్రారంభమయ్యెను. శాంతికుదురునను యాశలన్నియు నడుగంటెను. అయినను యీదుస్థితినుండి బయటపడు మార్గముకొఱకతడొక ప్రయత్నమునుచేసెను. వైస్రాయియైన విల్లింగ్డను ప్రభువును సందర్శనమీయవలసినదని యతడుకోరెను. కొన్నిషరతులమీద దర్శనమీయబడునని క్రొత్తఢిల్లీనుండి యతనికి తెలియజేయబడెను. వంగదేశము యు. పి. సరిహద్దు రాష్ట్రములలో నీమధ్యజరిగిన సంగతులను గురించియు, క్రొత్తఆర్డినెన్సులను, వాటిక్రింద జరిగిన అరెస్టులను గురించియు నతడు చర్చింపకూడదట. (నేను జ్ఞాపకమునుబట్టి వ్రాయుచున్నాను.) నావద్ద వైస్రాయిగారిచ్చిన ప్రత్యుత్తరముయొక్క మూలమేదియునులేదు. దేశము నాందోళనపరచుచున్న యీనిషిద్ధ విషయములనుగురించిగాక గాంధీజీగాని మరేకాంగ్రెసు నాయకుడుగాని వైస్రాయితో నేవిషయములను చర్చింపవలెనని యధికారుల యుద్దేశ్యమో యెవరికిని గ్రాహ్యముకాజాలదు. భారతప్రభుత్వమువారు కాంగ్రెసును పూర్తిగా చూర్ణముచేయ నిశ్చయించినట్లు యిప్పుడద్దము కట్టినట్లు కాన్పించుచుండెను. కాంగ్రెసుతో వారెట్టి సంబంధమును పెట్టుకొనదలంచలేదు. వర్కింగుకమిటీవారికి శాసనోల్లంఘనముతప్ప మరే

మార్గమును కాన్పించలేము. వారేనిమిషమందైనను అరెస్టు కావచ్చునని భావించిరి; కనుక వారెల్లు బలవంతముగా నీడ్చుకొని పోబడుటకు పూర్వము, దేశమునకొక త్రోవచూపగోరి సోదాగా శాసనోల్లంఘన తీర్మానమును ఆమోదించిరి. వైస్రాయిని చూచుటకు గాంధీజీమరి యొక ప్రయత్నమునుచేసెను. ఎట్టిషరతులులేకుండ దర్శనమిప్పించ వలసినదని యతడు వైస్రాయికి రెండవ టెలిగ్రామును పంపెను. దీనికి గాంధీజీని, కాంగ్రెసుఅధ్యక్షుని అరెస్టుచేయుటయే ప్రభుత్వమువా రిచ్చిన ప్రత్యుత్తరము; దేశమునంతను ముంచివేయు భయంకరనిర్బంధ ములను విడిచిపెట్టు బొత్తామును నొక్కుటయే దీనికీయబడిన ప్రత్యుత్త రము. ఇతరులెవరు పోరాటమును కోరినను కోరకపోయినను ప్రభుత్వమువారు దానికాతుర పడుచున్నారనియు, సర్వసిద్ధముగ నున్నా రనియు విదితమగుచున్నది.

మేము జయిలులోనుంటిమి. ఈవార్తలన్నియు మాకు అస్పష్ట ముగను అసంబద్ధముగను వచ్చుచుండెడివి. మావిచారణ నూతన సంవ త్సరమువరకు వాయిదావేయబడెను. విచారణలోనున్న ఖయిదీలము కనుక శిక్షింపబడిన వారికంటె మాకెక్కువ బంధుదర్శన భాగ్యములు లభించుచుండెను. వైస్రాయి దర్శనమీయ నంగీకరింపవలెనా కూడదా (రెండింటిలో నేదిజరిగినను స్వర్గమెలికినట్లు) యని జరుగుచున్న రాద్ధాంతసిద్ధాంతములను మేమువినుచుంటిమి. ఈదర్శనసమస్యయే తదితర విషయముల నన్నింటిని కప్పివేయుచుండెను. ఇర్విను ప్రభువు దీని కంగీకరించెడివాడనియు, నతడును గాంధీజీయును కలుసుకొనినచో నంతయు చక్కబడి యుండెడిదనియు చెప్పబడుచుండెడిది. భారతపత్రి కలు యథార్థములను నిర్లక్ష్యముచేసి, పరిస్థితులను అతి యసాధారణ మైన బాహ్యదృష్టితో చూచుచుండుట నాకాశ్చర్యమును కలిగించెను. భారతజాతీయతకును బ్రిటిషుసామ్రాజ్యతత్త్వమునకునుగల విధా

యిక సంగ్రామము- బాగుగతర్కించి చూచినచో రెండుపరస్పర విరుద్ధ తత్త్వములు - వ్యక్తుల యిష్టాయిష్టములకు జోహారుచేయునా? రెండు చారిత్రక శక్తులపోరాటము మందహాసములచేతను, పరస్పరమర్యాదల చేతను తీరిపోగలదా? గాంధీజీ బలవంతముగా నొక మార్గమును త్రొక్కవలసి వచ్చెను. ఏలనన భారతజాతీయత ఆత్మహత్యచేసికొన జాలదు; లేక ప్రధానవిషయములలో నది బుద్ధిపూర్వకముగ విదేశీయులచే శాశింపబడ నిచ్చగింపదు; ఈజాతీయతయొక్క సవాలు నెదుర్కొని, బ్రిటిషు ప్రయోజనములను కాపాడప్రయత్నించుటకు హిందూదేశపు బ్రిటిషువైస్రాయి మరియొకవిధముగ సంచరింపవలెను. ఆసమయమున వైస్రాయియెవ్వరైనను రవంతభేదమును కలుగజాలదు. ఇర్వినుప్రభువు సరిగా తూ. చా తప్పకుండ విల్లింగ్డను ప్రభువుచేసినట్లే చేసియుండెడివాడు. ఏలనన వారిరువురునుకూడ సామ్రాజ్య నీతికుపకరణములే; ఇర్వినుప్రభువు, నిశ్చయముగ, తరువాత బ్రిటిషుప్రభుత్వముల్లో నొక సభ్యుడయ్యెను. అతడు భారతదేశములో ప్రభుత్వము వారు తీసికొనిన చర్యలతో సంపూర్ణముగ నేకమయ్యెను. భారతదేశములోని బ్రిటిషునీతికి వ్యక్తులైన వైస్రాయిలను నిందించుటకాని భూషించుటకాని నాకుచాల యప్రయోజకమైనపనిగా కాన్పించును. యథార్థసమస్యలు మనకు తెలియక పోవుటచేతను లేక బుద్ధిపూర్వకముగ మనమువాటిని తప్పించుకొనుటచేతను మనమిట్టివినోదముకల వడితిమి.

1932 జనవరి నాల్గవ తేదీ స్మరణీయమైనదినము. అదిచర్చలను వాదమును కట్టిపెట్టించెను. ఆరోజుప్రాతఃకాలమున గాంధీజీయును, కాంగ్రెసుఅధ్యక్షుడైన వల్లభాయిపటేలును అరెస్టుచేయబడి విచారణ లేకుండ ప్రభుత్వఖయిదీలుగ నుంచబడిరి. మేజిస్ట్రేటులకును పోలీసు యుద్యోగులకును చాల యధికారములనిచ్చు నాలుగు క్రొత్తఆర్డి

నెన్సులు సృష్టింపబడెను. పౌరస్వత్వములు నశించెను. అధికారులు మనిషిని ఆస్తినికూడ పట్టుకొనవచ్చును. అది భారతదేశమంతయు నొకవిధముగు ముట్టడిలోనున్నట్లు చేయబడిన ప్రకటనవలెనుండెను. దానినెంత తీవ్రముగ వర్తింపజేయవలెను. దానికెంత వ్యాప్తినీయవలెను యను విషయములను స్థానికాధికారుల వివేకమునకు విడిచివేసిరి.*

జనవరి నాల్గవ తేదినే యు. పి. ఎమర్జెన్సీపవర్సు ఆర్డినెన్సు అని పిలువబడినదానిక్రింద మావిచారణ నైనీజయిలులోనే జరిగెను. షెర్వానీకి ఆరుమాసములు కఠినశిక్షయు, 150 రూపాయిలు జుల్మానాయును విధింపబడెను; నాకు రెండేండ్లు కఠినశిక్షయు, 500 రూపాయిలు జుల్మానాయును (చెల్లించనిచో మరియారుమాసములు) విధింపబడెను. మేమొకేనేరము చేసితిమి. అలహాబాదు పట్టణములో నుండవలెనను నొకేప్రవాస ఆజ్ఞను మాపయి నమలుజరిపిరి.

మేమిరువురముకలిసి బొంబాయి వెళ్ళుటకు ప్రయత్నించుటలో వాటినొకేమాదిరిగ నుల్లంఘించితిమి. మమ్ము ఒకేసెక్షనుక్రింద అరెస్టుచేసి విచారణచేసిరి. అయినను మాకువిధింపబడిన శిక్షలుమాత్రము వివిధములుగనుండెను. అయినను ఒక భేదముమాత్రముండెను. ఆజ్ఞనుల్లంఘించి బొంబాయి వెళ్లు యుద్దేశ్యముతో నున్నానని నేను జిల్లా మేజిస్ట్రేటుకు వ్రాసితిని. షెర్వానీయట్టి లాంఛనమును దేనిని జరుపలేదు. కాని యతనిప్రయాణముకూడ సందరికిని తెలిసిన విషయమే; అది పేపరులలోకూడ తెలుపబడెను. శిక్షవిధించుటతోడనే షెర్వానీ, విచారణచేసిన మేజిస్ట్రేటును తనకట్టితక్కువశిక్ష విధించుట కులగౌర

* ఇండియా శెక్రిటరీయైన సర్. సామ్యూయల్ హోరుగారు 1932 మార్చి 24వ తేదిని కామన్సుసభలో నిట్లుచెప్పెను. "మనమామోదించిన ఆర్డినెన్సులు చాల కఠినమైనవి, తీవ్రమైనవియని నేనొప్పుకొనుచున్నాను. అవి కొంచెమించుమించు భారతజీవితము సంబంధము ప్రతికార్యమును ముంచివేయును."

నముచేతనా యనిప్రశ్నింప మేజస్ట్రేటు కంగారుపడెను; అచ్చటనున్న తదితరులకది వినోదముగనుండెను.

దుర్దినమైన యాజనవరి నాల్గవతేదీని భారతదేశ మంతటను యనేక ఘోరములు జరిగెను. మాకతిసమీపములోనున్న అలహాబాదు పట్టణములోనే ప్రజాసమూహములకు పోలీసులతోను, మిలిటరీతోను సంఘర్షణమేర్పడెను; మరణములతోను, యితర శరీర వైకల్యములతోను గూడిన మామూలు లాఠీచార్జీలుజరిగెను. జయిళ్లు శాసనోల్లంఘన ఖయిదీలతో నిండనారంభించెను. ప్రారంభములో ఈఖయిదీలు జిల్లా జయిళ్లకుపంపిరి. అవిపూర్తిగా నిండిపోయిన తరువాత నైనీమొదలగు పెద్దసెంట్రలుజయిళ్ళు నింపబడుచుండెను. తరువాత, అన్నిజయిళ్లును నిండిపోవుటచే తాత్కాలిక క్యాంపుజయిళ్లు స్థాపింపబడెను.

నైనీలోనున్న మాచిన్న యావరణలోనికి చాలతక్కువమంది వచ్చెడివారు. నాపాతస్నేహితుడు, నర్మదాప్రసాదు, మమ్ముకలుసు కొనెను. రంజితపండితుడును, మాపెత్తండ్రి కుమారుడు మోహన లాలు నెహ్రూయును మాతోనుండిరి. ఆరవనెంబరు కోఠీలోనున్న మాచిన్నసోదరమండలిలోనికి మరియొక క్రొత్తసభ్యుడువచ్చి మాకా శ్చర్యమును కలిగించెను. బెర్నార్డుఆలువిహేర్ సింహళమునుంచివచ్చిన తరుణవయస్కుడు. అతడు బారిష్టరుపరీక్ష పూర్తిచేసి యింగ్లండునుండి యప్పుడేవచ్చెను. మాయుత్సవములలో చేరవలదని నాసోదరి యతని తో చెప్పెను. కాని యుత్సాహమును పట్టజాలక నతడొకకాంగ్రెసు యుత్సవములో పాల్గొనెను; వెంటనే యతడు మావద్దకు తీసికొని రాబడెను.

కాంగ్రెసు అక్రమ సంఘమని ప్రకటింపబడెను; పయినున్న వర్కింగుకమిటీ, రాష్ట్రీకమిటీలు, అసంఖ్యాకములగు స్థానికకమిటీలు- అన్నియు నక్రమసంఘములయ్యెను. కాంగ్రెసుతోపాటు-కిసానుసభలు,

రయితులయూనియనులు, యువజనసంఘములు, విద్యార్థులసంఘములు, అభివృద్ధిలోనున్న రాజకీయసంస్థలు, జాతీయ విశ్వవిద్యాలయములు పాఠశాలలు, ఆస్పత్రులు, స్వదేశీవ్యాపారములు, లైబ్రరీలు — మొదలగుకాంగ్రెసుఅభిమానముకలిగినట్టి, లేకముందంజవేయుచున్నట్టి యనేకసంస్థలు అక్రమసంఘములయ్యెను. నిశ్చయముగ లిస్టులుచాల హెచ్చుగనుండి ప్రతిపెద్దరాష్ట్రములోను వందల కొలది పేర్లను కలిగి యుండెను. భారతదేశ మొత్తపుసంఖ్య కొన్నివేలమీద నుండవలెను. అక్రమసంఘములుగ ప్రకటింపబడిన యీసంస్థలయొక్క సంఖ్యయే కాంగ్రెసుయొక్కయు, జాతీయోద్యమముయొక్కయు ఘనతను చాటు చున్నది.

నాభార్య వ్యాధిగ్రస్తురాలై మంచముపట్టి శాసనోల్లంఘ నోద్యమములో సురుకజాలనందులకు ఖేదపడుచు బొంబాయిలోపడి యుండెను. నాతల్లియు, నిరువురుచెల్లెండ్రును యావచ్ఛక్తితో నుద్యమములోనికురికిరి. తోడనే నా చెల్లెండ్రిరువురును ఒక్కొక్కసంవత్సర శిక్షతో జయిలులో ప్రవేశించిరి. జయిలుకు క్రొత్తగావచ్చువారివలన మాకుచిన్నచిన్నవార్తలు తెలియుచుండెను. మాకొసంగబడిన స్థానిక వారపత్రికవలనకూడ మాకుకొన్నివార్తలు తెలియుచుండెను. వార్తలు కఠినముగ సరికట్టబడు చుండుటచే మేము జరిగినవాటినిగురించి యెక్కువగ నూహింపవలసియుండెను. వార్తాపత్రికలును, ఏజెన్సీలును పెద్ద పెద్ద జుల్మానాలకెప్పుడును భయపడుచుండవలెను; భయపడుచుండెను. కొన్నిరాష్ట్రములలో నిర్బంధింపబడిన వానిపేరుగాని లేక శిక్షింపబడిన వానిపేరుగాని యుదహరించుటకూడ నేరమయ్యెను.

కనుక మేము బాహ్యపోరాటమునకు దూరులమై నైనీజయిలులో కూర్చుంటిమి; అయినను శతవిధముల దానినిగురించి తలపోయుచుంటిమి; నూలువడుకుట, పుస్తకములను చదువుకొనుట, యితరపనులను

చేయుచుండుట; ఒక్కొక్కప్పుడు యితరవిషయములనుగురించి మాట్లాడు కొనుట, కానియెల్లప్పుడును జయిలుగోడల వెలుపల జరుగుచుండు దానినిగురించి యోచించుట — యిట్లుకాలమును పుచ్చుచుంటిమి. మేము యుద్యమమువెలుపల నుంటిమి. అయినను అందులోనే యుంటిమి. ఒక్కొక్కప్పుడు ఫలానిదిజరుగునని యనుకొనుటవలన నెక్కువయలసట కలిగెడిది; లేక యేదోతప్పుగజరుపబడెనని కోపముకలిగెడిది; దుర్బలత్వముపట్ల లేక నైచ్యముపట్ల విసుగుజనించెడిది. ఒక్కొక్కప్పుడు మేమతియుదాసీనులమై యుండి రంగమునుప్రశాంతముగను, ఉద్రేకరహితముగను చూడగలిగెడివారము. బ్రహ్మాండమైన శక్తులుపనిచేయుచున్నపుడు, దైవయంత్రములు మనుష్యులను పిండిచేయుచున్నపుడు చిన్నచిన్నవ్యక్తిగత ప్రమాదములను, దుర్బలత్వములను మనమంతగా లెక్కచేయరాదని మేముభావించెడి వారము. పోరాటమునుగురించి, ధైర్యోపేతమగు యుత్సాహమునుగురించి, క్రూరమగు నిర్బంధములనుగురించి, విషాదకరమగు పిరికితనమునుగురించి రేపేమి వినవచ్చునో యని మేమాశ్చర్యపడెడివారము. ఇదియంతయు నెచ్చటకు గొంపోవనున్నది ? మనమెచ్చటకు పోవనున్నారము ? భవిష్యత్తు తెరమఱుగున నున్నది. అదియట్లుండుట మంచిది; మాకుసంబంధించినంతవరకు వర్తమానముకూడ కొంతవరకు తెరమఱుగుననే యుండెను. కాని నేడును రేపునుకూడ పోరాటము, బాధ, త్యాగము తప్పనను సంగతిమాత్రము మాకు తెలియును.

---

# ౪౨

## అధికారుల హుంకారములు.



1932 లోని యీ ప్రథమమాసములు, యితరవిషయములతో పాటు బ్రిటిషుఅధికారుల హుంకారప్రదర్శనములకు ప్రఖ్యాతివడసెను. పెద్దయధికారులును, చిన్నయధికారులునుకూడ తాము పవిత్రముగను, శాంతముగను నుండిరనియు కాంగ్రెసు పోరాటమునకు దిగెననియు, పాపముచేసెననియు చాటనారంభించిరి. వారుప్రజాస్వామికమును సమర్థించుచుండ కాంగ్రెసు డిక్టేటరులనభిమానించుచుండెను. దానియధ్యక్షుడు డిక్టేటరుఅని పిలువబడుటలేదా? తమపవిత్ర కార్యోత్సాహములో ఆర్డినెన్సులు, అన్నివిధములగు స్వేచ్ఛలను అరికట్టుట, వార్తాపత్రికల యొక్కయు ముద్రణాలయములయొక్కయు మూతులనుకట్టివేయుట, విచారణలేకుండగనే ప్రజలనుఖయిదుచేయుట, ఆస్తులను ధనమును లాగుకొనుట; ప్రతిదినము జరుగుచుండు నిట్టియనేక స్వల్పహింసములను వారు మఱచిపోయిరి. వారుభారతదేశములోని బ్రిటిషు పరిపాలనయొక్క ప్రధాన లక్షణమునుకూడ మరచిపోయిరి. ప్రభుత్వమంత్రులు (మన దేశీయులే) తాము నెల కేకొద్దివేల రూపాయల స్వల్పజీతములతోనే ప్రజాహితము కొఱకు పడజాలనిపాట్లు పడుచుండ కాంగ్రెసువారు 'కత్తులను నూరుచున్నారు'-జయిళ్ళలో-అనిచాటుచుండిరి. క్రిందికారు మేజిస్ట్రేటులు మాకుపెద్దపెద్ద శిక్షలను విధించుటేకాక తామట్లు చేయు సందర్భములో మాకుపన్యాసముల నిచ్చెడివారు; ఒకొక్కొక్కప్పుడు కాంగ్రెసును, దానికి సంబంధించిన వ్యక్తులను దూషించెడివారు. సర్ సామ్యూయల్ హోరుగారుకూడ, తనయత్యున్నత భారతదేశ కార్యదర్శిపదవియొక్క చలింపని యౌన్నత్యమునుండి, కక్కలు

మెుఱగుచున్నను మార్గము సాగుచునేయున్నది యని ప్రకటించెను. అతఁడా నిమిషమున కుక్కలు జయిలులో నున్నవనియు, నవియచ్చట సులభముగా మొఱగజాలవనియు, బయటనున్న వాటి మూతులుగట్టిగా బిగింపబడెననియు మరచిపోయెను.

అన్నిటికంటెను చిత్రమేమన కాన్పూరులో జరిగిన కులకలహములు కాంగ్రెసువలననే జరిగినవనిరి. నిశ్చయముగ భయంకరమైన యీ కలహములలోని భయోత్పాతమంతయు వెల్లడిచేయబడి కాంగ్రెస్ దీని కంతకును బాధ్యులని పదేపదే చెప్పబడెను.జరిగిన యథార్థమునుబట్టి కాంగ్రెసుఒక్కటే యీసందర్భములోయోగ్యముగాప్రవర్తించెను; తన యుత్తమోత్తమ పుత్రులలో నొకని నామె యిందులో బలియొనర్చెను. కాన్పూరులోని ప్రతిసంఘమును కులమును అతనికొఱకు పరితపించెను. ఈ కలహములనుగురించి వినుటతోడనే కరాచీకాంగ్రెసు సభయొకపరిశోధనకమిటీని నియమించెను. ఈకమిటీ కూలంకషమైన పరిశోధననుగావించెను. అనేక నెలలు కష్టించి పనిచేసిన తరువాత నదియొక పెద్దనివేదికను ప్రకటించెను. ప్రభుత్వమువారు దీనిని తోడనే నిషేధించిరి. అచ్చుప్రతులుపట్టుకొనబడి తగులపెట్టబడెను. (అని నేననుకొనెదను.) ఒక పరిశోధనయొక్క ఫలితముల నణచివేయుటకు చేయబడిన యీ ప్రయత్నము అధికారవిమర్శకులును, బ్రిటిషు యాజమాన్యము క్రిందనున్న పత్రికలును కాంగ్రెసువలననే యీ కలహములు కలిగెనని మాటిమాటికిని చేయునిందలను వారింపవయ్యెను. నిశ్చయముగ నీ విషయములోను, యితర విషయములలోను తుదకు నిజమే జయింపగలదు. కాని యొక్కొక్కప్పుడు అసత్యము చిరకాలము జీవించును. "అసత్యముచేయవలసిన పనియంతయు చేసినతరువాత నశించును. సత్యము అమోఘమైనది. గొప్పది. అదిజయించును. దాని జయాపజయముల కొరకెవడును చూడనినాడుఅదిజయించును."

ఈసాంగ్రామికోద్వేగ ప్రదర్శనము చాలసహజమని నేనను కొనెదను. ఆపరిస్థితులలో సత్యముకాని, నిరోధముకాని యుండునని యెవడును అనుకొనడు. కానియిది మనమూహించుదానికంటె చాల దాటిపోయినట్లు కాన్పించెను. దానితీవ్రతయు, హద్దులులేకపోవుటయు నాశ్చర్యకరముగనుండెను. అవిభారతదేశ పరిపాలకజాతివారినరములస్థితి యెట్లున్నదియు సూచించును. ఇంతవరకు వారు తమ్ముతామెట్లు అణచు కొనియుంటిరో యిది తెలియజేయుచున్నది. బహుశః మేము చేసిన దానికిగాని చెప్పినదానికిగాని వారికాక్రోశము కలిగియుండదు; సామ్రా జ్యముపోవునేమో యనివారికిగల వెనుకటిభయము దృష్టికివచ్చుటయే దీనికి కారణము. తమనిజబలమునందు విశ్వాసమున్న పరిపాలకులీవిధముగ నడలిపోవరు. ఈ హాసమునకు, రెండవదానికిని చాలవ్యత్యాసము కలదు. రెండవపక్షమున మౌనముండెను. కానియది యైచ్ఛికముగను, యుదారముగను అవలంబింపబడిన నిరోధముకాదు. అశక్తులవల్లను, భయమువల్లను, అన్నింటిని చుట్టబెట్టినమూతిబిగింపులవలనను కలిగిన మౌనము. ఈబలవంతపు మూతిబిగింపులే లేకపోయినచో రెండవపక్షము కూడను ద్వేషకరములగు కేకలకును నుత్ప్రేక్షలకును, నిందలకును తీసి పోయెడిదికాదు.అయినను మాకొక్క మార్గముమాత్రముండెడిది. వివిధస్థ ణములనుండియప్పుడప్పుడు అనధికారవార్తాపత్రికలువెలువడుచుండెడివి.

హిందూదేశములో బ్రిటిషు సామ్రాజ్యమునకున్న ఆంగ్లో యిండియను వార్తాపత్రికలుకూడ సింహుంకారవేటతో సత్యోత్సాహ ముతోచేరి యవి చాలకాలమునుండి దోహదముచేసికొనుచు, రహస్య ముగ నణచియుంచుకొనిన,యనేకభావములనువెల్లడించెను. మామూలుగ నవియేదేని చెప్పునపుడు కొంచెము జాగ్రత్తగ చెప్పవలెను. ఏలనన వాటి పాఠకులలో చాలమంది భారతీయులు కలరు. కానిహిందూదేశములోని విషమస్థితి యీనిరోధములనన్నింటిని తుడిచిపెట్టి యందరి హృదయము

లను (యింగ్లీషువారియొక్కయు, భారతీయులయొక్కయు) బహిర్గత మొనరించెను. భారతదేశములో ఆంగ్లోయిండియను పత్రికలుచాల తక్కువ; ఒకటితరువాతనొకటిగ నవి పడిపోయెను. మిగిలినవాటిలో చాలపత్రికలు, అవియిచ్చు వార్తలలోనేమి, సాధారణ రూపలావణ్యములలోనేమి, యుత్తమజాతికి చెందినపత్రికలు. ప్రపంచవ్యవహారములను గురించిన వాటిప్రధానవ్యాసములు, యెప్పుడును కన్నర్వేటివు దృష్టిలోనేయున్నను, సమర్థములై, జ్ఞానమును, గ్రహణశక్తిని వెల్లడిచేయును. నిస్సందేహముగ వార్తాపత్రికల దృష్టిలోనవి భారతదేశములో, బహుశః, అత్యుత్తమమైనవి. కాని భారతదేశ రాజకీయ సమస్యలలో నవి యకస్మాత్తుగ పడిపోవును; వాటినవి యాశ్చర్యకరమగు పక్షపాతబుద్ధితో చూచును; ఒకొదుకొకు సమయములలో నీపక్షపాతబుద్ధి తఱచు పిచ్చిక్రిందను, తిట్లక్రిందను మారిపోవును. అవి భారత ప్రభుత్వమున కతివిశ్వాసముతో పాత్రినిధ్యమును వహించును. ప్రభుత్వము కోఱకవిచేయు నిరంతర ప్రచారము పిలుపని పేరంటమువలెనుండును.

ఎన్నికమైన యీ కొద్ది ఆంగ్లోయిండియను వార్తాపత్రికలతో పోల్చిచూచినచో భారతవార్తాపత్రికలు సాధారణముగ దరిద్రభూయిష్టముగనుండును. వాటికి తగినంత ద్రవ్యముండదు. వాటి యజమానులకు వాటిఃభివృద్ధి చేయవలెననెడి బుద్ధిగాని, ప్రయత్నముగాని యుండదు. వాటినిత్యజీవితమే కష్టతరముగ సాగుచుండును. దురదృష్టవంతులగు సంపాదకీయశాఖకు శాంతియుండదు. వాటి యందచందములు గూడ దరిద్రముగనే యుండును. తఱచువాటిలో చేయబడు అడ్వరుటైజుమెంటులు చాల నిషిద్ధముగనుండును; జీవితములపట్లను రాజకీయములపట్లను వాటిసాధారణదృష్టి రసోద్రేకముగను, వెర్రిగనుయుండును. మనము రసోద్రేకముగల జాతియగుటయే దీనికి కొంత కారణమని

నేననుకొనెదను. కొంత మనము వ్రాయుభాష (ఇంగ్లీషు వార్తాపత్రికల సంగతి) విదేశభాషయగుటచే సరళముగను శక్తివంతముగను వ్రాయుట సులభముకాదు. కాని యథార్థమైన కారణమేమన చిరకాలాగతమైన దాస్యముచేతను, నిర్బంధములచేతను మనమందరము నసంఖ్యాకములై యుచ్చనీచభావములచే బాధపడుచున్నారము; కనుక నేమాత్రము సావకాశము చిక్కినను భావోద్రేకము పొర్లుచుండును.

భారతీయుల యాజమాన్యములోనున్న యింగ్లీషు వార్తా పత్రికలలో వార్తలకును, అందచందములకును సంబంధించినంతవరకు మద్రాసులోనున్న హిందూపత్రిక బహుశః యన్నిటికంటెను యుత్తమమైనది. అది నాకెప్పుడును మర్యాదకును వైచిత్యమునకును మూర్తియగు నొకవృద్ధ కన్యకను జ్ఞప్తికి తెచ్చును. ఆమె యెదుట నెవడేని యొక్క కఠినపదము నుపయోగించుచో నదియామెకు వజ్రపాతమువలెనుండును. అది ముఖ్యముగా బూర్జువాజాతికి చెందిన పత్రిక. దానిజీవితము సుస్థిరమయ్యెను. జీవితములోని దుఃఖమయమైన యనుభవము, జీవితపోరాటము, కష్టపరంపరలు దానికేమియునులేవు. మితవాదదృష్టికల యనేక యితర పత్రికలకును 'యీవృద్ధకన్య' ప్రమాణముకలదు. అవి హిందూపత్రికకున్న యాధిక్యతలేకుండ దానినిసాధించును. తత్ఫలితముగ నవి యన్నివిధముల చాలచప్పగనుండును.

ప్రభుత్వమువారు చాలకాలము క్రిందనే తమ పిడికిలిని సిద్ధము చేసికొనియుండిరి; వారు సాధ్యమైనంతవరకు గుక్క త్రిప్పుకొనుటకు వీలులేనట్లు ప్రారంభములోనే వారిముష్టిని యుపయోగింపగోరిరి. 1930 లో నది యెల్లప్పుడును క్రొత్త ఆర్డినెన్సులద్వారా యంతకంత కధ్వాన్నమగుచుండిన స్థితిని యరికట్టుటకు ప్రయత్నించుచుండెను. అప్పుడుకాంగ్రెసే ముందు కురుకుచుండెను. 1932 పద్ధతులన్నియు వేరు. మొట్టమొదటినుంచియు ప్రభుత్వమే కార్యరంగమునకు దిగెను. అఖిల

భారత దేశమునకును, రాష్ట్రములకును చెందిన ఆర్డినెన్సుల క్రింద యూహింపదగిన ప్రతి యధికారమును ప్రసాదింపబడెను; తీసికొనబడెను. సంస్థలు అక్రమములుగ ప్రకటింపబడెను; భవనములు, ఆస్తి, మోటారులు, బ్యాంకి అక్కౌంటులు పట్టుకొనబడెను. బహిరంగసభలు ఉత్సవములు నిషేధింపబడెను. వార్తాపత్రికలు, ముద్రణాలయములు పూర్తిగా అదుపులో నుంచబడెను. 1930 లో వలెగాక గాంధీజీ యిప్పుడు శాసనోల్లంఘనమును తప్పించవలెననియే నిశ్చయముగ వాంఛించుచుండెను; వర్కింగుకమిటీ సభ్యులు చాలమంది యట్లే భావించుచుండిరి. వారిలో కొందరు, నాతోసహా, మాకెంతయిష్టము లేకపోయినను, పోరాటము తప్పదనియు, కనుక దానికి సిద్ధపడవలెననియు భావించితిమి. యు. పి. లోను సరిహద్దు రాష్ట్రములోను యుద్రేకము హెచ్చుచుండుటచే ప్రజాహృదయము రానున్నపోరాటముపైకి మఱలెను. కాని మొత్తముమీద మధ్యతరగతులవారును విద్యాధికులును పోరాటమును (దానిసంభవమును వారుపూర్తిగా నిర్లక్ష్యము చేయజాలకపోయినను) గురించియోచించుటలేదు. గాంధీజీవచ్చుట తోడనే, యేదోవిధముగ, నీపోరాటము తప్పింపబడునని పారాశించిరి. వారి కోరికయే వారికాభావములను కలిగించెను.

ఈవిధముగ 1932 ప్రథమములో ప్రభుత్వమే పోరాటమును ప్రారంభముచేసెను. కాంగ్రెసు యెప్పుడును యాత్మరక్షణచేసికొనుచుండెను. చాలచోట్ల స్థానికకాంగ్రెసు నాయకులు ఆర్డినెన్సులను, శాసనోల్లంఘనమును తెచ్చిపెట్టిన విపరీత శీఘ్రపరిణామములచే ముట్టడింపబడినట్లయ్యెను. అయినప్పటికిని కాంగ్రెసు పిలుపున కద్భుతమగు సమాధానమువచ్చెను. శాసనోల్లంఘనము చేయు వారికి కొఱతయే లేకుండెను. నిశ్చయముగ 1932 లో బ్రిటిషు ప్రభుత్వముతో చేసిన శాసనోల్లంఘనము 1930 లో చేసిన దానికంటె (1930 లో నెక్కువ

ప్రదర్శనమును, ప్రకటనయును (ముఖ్యముగా పెద్దపట్టణములలో యున్నను) గొప్పదియనుట కెట్టి సందేహమును లేదని నేను భావించెదను. 1932 లో ప్రజలెక్కువ సహనమును జూపినను, వారత్యంత శాంతముగనున్నను, ప్రారంభములో కలిగిన ప్రబోధవేగము 1930 లో కంటె చాలతక్కువగనుండెను. మేము అయిష్టముగ యుద్ధములోనికి దిగినట్లుండెను. 1931 లో నొకవిధమగు కీర్తియుండెను. రెండేండ్లయిన తరువాత నది కొంచెము సన్నగిలెను. ప్రభుత్వము తనకున్న సర్వశక్తులతోను కాంగ్రెసుపైబడెను. భారతదేశము కొంచెమించుమించు సైనిక శాసనముక్రింద జీవించెను. కాంగ్రెసుకు నిజముగా నేకార్యముచేయుటకును తిరిగి స్వేచ్ఛగాని,పట్టుగానిదొరకనేలేదు. మొట్టమొదటి దెబ్బలే దానిని, దాని వెనుకదానికి ప్రధానపోషకులుగనున్న దానియొక్క బూర్జువాజాతి యభిమానులను చాలమందిని నిశ్చేష్టులను చేసెను. వారిబొక్కసములకు దెబ్బతగిలెను. శాసనోల్లంఘనములో జేరినవారియొక్కయు, దానికేవిధముగ నైనను సహాయము చేసిన వారియొక్కయు స్వేచ్ఛయేకాక, వారియావదాస్తియుకూడ పోవునను సంగతి విశదమయ్యెను. యు. పి. లో నిదిమాకంత బాధకరముగ కాన్పించలేదు. అచ్చట కాంగ్రెసు బీదవాని కాంగ్రెసు. కాని బొంబాయిమొదలగు మహాపట్టణములలో నిది చాల వ్యత్యాసమును కలిగించెను. వర్తకజాతికిది పూర్తియైన వినాశము; వృత్తులలోనున్న వారికి గొప్పదెబ్బ. కేవలము యీభయమే (ఒక్కొక్కప్పుడిది యాచరింప బడుచుండెను.) పట్టణములలోనున్న యీ ధనికతరగతులవారిని స్తంభింపజేయుచుండెను. రాజకీయములతో నెట్టిసంబంధమునులేని (అప్పుడప్పుడే చందానిచ్చుటయోతప్ప) యొకధనవంతుడైన పిరికి వర్తకుని సంగతి నేను తరువాత వింటిని. దీర్ఘకాలశిక్షనేగాక నయిదు లక్షలరూపాయిల జుల్మానా విధించెదమని పోలీసువారతనిని భయపెట్టిరి. అట్టిజడిపింపులు చాలసామాన్యమయ్యెను. అవి కేవలము శుష్కవాక్య

ములుగావు. ఏలనన పోలీసులప్పుడు సర్వాధికారులు. జడిపింపులు, కార్యహాపమునుదాల్చు యుదాహరణములు, నిత్యమును సంభవించుచునేయుండెను.

ప్రభుత్వమువారవలంబించిన పద్ధతి కభ్యంతరము చెప్పుటకెట్టి కాంగ్రెసువానికిని హక్కుగలదని నేనుభావించను. కాని యత్యంత దాక్షిణ్యరహితమైన యుద్యమముపై ప్రభుత్వమువారు ప్రయోగించిన దాక్షిణ్యమును, జబర్దస్తీ క్రియలును యెట్టినాగరిక ప్రమాణమునుబట్టి చూచినను నిశ్చయముగ దూష్యములేయగును. మనము విప్లవయుతమగు ప్రత్యక్షచర్యకు గడంగినపుడు, అదియెంత దాక్షిణ్యరహితమైనను, ప్రతీకారముండి తీరునని గ్రహించవలెను. మనము భద్రముగా పడకటింటిల్లలోకూర్చొని విప్లవమునుకలుగచేయజాలము. కానిచాలమంది యుభయ లాభములను కావలెనందురు. విప్లవపద్ధతులలో దిగదలచుకొనువారు తమసమస్తమును పోగొట్టుకొనుటకు సిద్ధపడవలెను. కనుక ధనవంతులును, ఐశ్వర్యవంతులును, చాలయరుదుగ విప్లవకారులగుదురు. కాని కొందరువ్యక్తులు, లౌకిక శిఖామణుల దృష్టిలో, నిట్టి మూర్ఖపుపనిచేసి కులఘాతకులను బిరుదును సంపాదింపవచ్చును.

మోటారులుగాని, బ్యాంకింగు అక్కౌంటులుగాని, పట్టుకొనుటకు తగిన యితరఆస్తులుగాని లేనిప్రజల సందర్భములో నితరపద్ధతుల నవలంబింప వలసియుండెను. పోరాటముయొక్క నిజభారమంతయు వీరిమీదనేకలదు. ప్రభుత్వమువారు అన్నివిధములగు క్రూరపద్ధతులను అవలంబించుటవలన కలిగిన ప్రయోజనకరమైన యొకఫలితమేమనిన (ఒకగ్రంథములోని పదము నుపయోగించినచో) 'గవర్నమెంటేరియనులు' అనిపిలువబడు జాతిలోనివారు వీటివలన కార్యమునకు పురికొల్పబడిరి. వారిలోకొంతమంది నూతనముగ కాంగ్రెసుతో స్నేహము చేసికొన నారంభించిరి, పాపము భవిష్యత్తును గూర్చి గుర్తింప జాలక

పోయిరి. కాని ప్రభుత్వము దీనిని సహింప జాలకపోయెను. వారికి తాటస్థ్యమైన రాజభక్తి చాలకుండెను. 1857 నాటి మ్యూటినీని గురించి వ్రాసిన ఫ్రెడరికు కూపరుగారు చెప్పినట్లు ప్రభుత్వమువారు "పరిపూర్ణమైన కార్యసాహసమును దాల్చిన, చురుకైనరాజభక్తికి పీస మంత తక్కువనుకూడ సహింపజాలగు. ప్రభుత్వము తన ప్రజలయొక్క నైతికబలముమీద జీవించునట్టి యమర్యాద కార్యము కొడిగట్ట జాలదు" ఒకసంవత్సరముక్రితము లాయడ్జార్జిగారు జాతీయప్రభుత్వముతో కలిసిన తనప్రాతసహోద్యోగులైన బ్రిటిషులిబరలుపార్టీ నాయకులనుగురించి "తమ వాతావరణమునకు సరిపడురంగులను ధరించుచుమార్పు చెందుచుండునట్టి జంతువుల నమూనా" యని వర్ణించెను. భారతదేశములోని క్రొత్తవాతావరణము తాటస్థ్యమైనరంగులను సహింపజాలదు. కనుక మన దేశస్థులు కొంతమంది యంగీకరింపబడిన, యత్యంతప్రకాశమానమైన రంగులను ధరించి, గీతవాయిద్యముల తోను, విందులతోను మనప్రభువులకు తమరాజభక్తిని విన్నవించుకొని తమ ప్రేమాతిశయములను తెలిపిరి. ఆర్డినెన్సులవలనను, అసంఖ్యాకము లగు నిషేధములవలనను, రాత్రిశాసనములవలనను, సాయంకాల శాసనములవలనను వేటివలనను వారికిభయపడవలసిన యగత్యములేదు. ఏలనన నిదియంతయు రాజద్రోహులకును, అవిధేయులకును వర్తించును గాని రాజభక్తిగలవారి కెట్టి భయమునకును కారణములేదని యధికారులచే ప్రకటింప బడలేదా ? కనుకవారు తమచుట్టు పట్లనున్న సంగ్రామమును, కష్టములును (తమదేశస్థుల ననేకమందిని నులుము చున్న భయమునుఅవసరములేకుండ) నెక్కువప్రశాంత చిత్తముతో వీక్షింపవచ్చును. "ఏలనన నొకభయకారణమునుండి నేను ముక్తి నొందితిని. నేనే యిష్టపడుచున్నప్పుడు బలత్కారమెందులకు?" అని వచించిన (విశ్వాసముగల గొల్లపడుచు కథలోని) క్లోవలె బహుశః వీరంగీకరించియుందురు,

కాంగ్రెసు యీసంగ్రామములో జయిళ్ళను స్త్రీలతోనింపి వారినెక్కువగా తనస్వార్థమునకై వినియోగింప చూచుచున్నదను భావమెట్లో ప్రభుత్వమువారి తలకెక్కెను. స్త్రీలను మర్యాదగా చూతురనియు, వారికి తేలికశిక్షలను విధింతురనియు నదియాశించెనట! అది కేవలము వెర్రియూహ. తమస్త్రీలను వెర్రిగా జయిలులోనికి త్రోయగోరువారెవరుందురు! సామాన్యముగ బాలికలుగాని, స్త్రీలు గాని (యుద్యమములో చురుకుగా పనిచేసినవారు) తమతండ్రులయొక్కయు, అన్నదమ్ములయొక్కయు, భర్తలయొక్కయు ప్రేరణలేకుండగనే తమంతతాముపనిచేసిరి. అధమము వారి హృదయపూర్వకమైన తోడ్పాటు వారికుండియుండదు. కాని ప్రభుత్వమువారు దీర్ఘశిక్షలతోను జయిళ్ళలోనమర్యాదగ చూచుటచేతను స్త్రీలను నిరుత్సాహపరుపనిశ్చయించిరి. నాచెల్లెండ్రు శిక్షింపబడుటతోడనే కొంతమంది బాలికలు (చాలమంది పదిహేను పదునారుయేండ్లవారు) వారుచేయగల కార్యమునుగురించి చర్చించుటకు అలహాబాదులో సమావేశమైరి. వారికెట్టియనుభవమునులేదు. వారత్యుత్సాహముగనుండి, సలహాకొఱకు చూచుచుండిరి. వారొకయింట సమావేశమగుచుండ నిర్బంధింపబడి యొక్కొక్కరు రెండేసిసంవత్సరముల కఠినవరకమును బడసిరి. ఇది యొక చిన్నవిషయము; ఇట్టివి భారతదేశ మంతటను ప్రతిదినము జరుగుచునేయుండెను. శిక్షింపబడిన బాలికలును, స్త్రీలును చాలమంది జయిళ్లలో ననేకబాధలనుభవించిరి. వారు పురుషులకంటె నెక్కువ బాధలనే యనుభవించిరి. నేను బాధకరములగు ననేకవిషయములను గురించివింటిని. కాని బొంబాయిజయిలులో నితరశాసనోల్లంఘన ఖయిదీలతోపాటు తాననుభవించిన యనుభవములనుగురించి మీరాబాయి తెలిపిన కథనమతిదారుణముగ నుండెను.

యు. పి. లో మాపోరాటము గ్రామములలో కేంద్రీకరింపబడెను. కాంగ్రెసువలన కలిగిన నిరంతర యొత్తిడివలన (వారువ్యవ

సాయదారుల తరఫున నేదానినిచేసిరి.) మంచియెక్కువ రిమిషనులను, అవిచాలవని మేముభావించినను, వాగ్దానముచేసిరి. మానిర్బంధములు జరుగుటతోడనే యధికరిమిషనులను ప్రకటించిరి. ఈప్రకటన ముందుగాచేయబడకపోవుట చాలవింతగనుండును. ఏలనన దానివలన పరిస్థితులలో చాల వ్యత్యాసముకలిగెడిది. అనాలోచితముగ మేమువాటిని తిరస్కరించుట చాలకష్టమయ్యెడిది. కానియీరిమిషనులకీర్తి కాంగ్రెసుకు దక్కకూడదని ప్రభుత్వమువారు చాల యాతురపడుచుండిరి. కనుక వారొకవంక కాంగ్రెసును పోడుముచేసి వ్యవసాయదారులను శాంతపరచుటకు సాధ్యమైనంత యెక్కువ రిమిషను యివ్వగోరిరి. కాంగ్రెసువత్తిడి యెచ్చట హెచ్చుగనుండెనో యచ్చట నెక్కువ రిమిషనులు ముట్టెనను విషయము గమనింపదగియున్నది.

చాలఅధికముగనే యివ్వబడిన యీరిమిషనులు వ్యావసాయిక సమస్యలను పరిష్కరించలేదు. కానియవి పరిస్థితుల నెక్కువగ సులభముచేసెను. అవి వ్యవసాయదారుల ప్రతిఘటనములోనున్న తీవ్రతను తగ్గించెను. మాపెద్ద పోరాటముకు సంబంధించినంతవరకవి మహాత్మా సమయమును దుర్బలపరచెను. ఆపోరాటము యు. పి. లో వేలకొలది వ్యవసాయదారులకనేకబాధలను కలిగించెను. చాలమంది దానివలన పూర్తిగ ధ్వంసమైపోయిరి. కానియాపోరాటముయొక్క యొత్తిడివల ననే లక్షలకొలది రైతులకు వర్తమానపద్ధతిలో రాబట్టుటకు సిద్ధమైనంత హెచ్చురిమిషను సంపాదింపబడి (శాసనోల్లంఘనమువలనకలిగిన ఫలితములును, దానివెనుక సంభవించినవిషయములును వేరు) వారిననేక విధములగు బాధలనుండిరక్షించెను. తాత్కాలికముగ సంభవించుయీ కొద్దిలాభములు వ్యవసాయదారులకంతఘనమైనవి కాకపోయినను, ఆ కొద్దియైనను వ్యవసాయదారులపక్షమున యు. పి. కాంగ్రెసుకమిటీవారు చేసిన నిరంతరప్రయత్నములవలననే సమకూరెననుటకు నాకెట్టిసందేహ

మునులేను. వ్యవసాయదారుల సంఘమంతయు తాత్కాలికముగ లబ్ధిని పొందెను; కానివారిలో నత్యంతధైర్యవంతులైనవారు మాసంగ్రామము లోనశించిపోయిరి. 1931 డిసెంబరులో ప్రత్యేక యు.పి. ఆర్డినెన్సు ప్రకటింపబడినపుడు దానియావశ్యకతను బోధపరచునొక స్టేటుమెంటుకూడ వెలువడెను. ఈస్టేటుమెంటులోను యితర ఆర్డినెన్సులతో వెలువడిన తదితర స్టేటుమెంటులలోను ప్రచారము కొఱకుద్దేశింపబడిన అనేక యసత్యములును, అర్ధసత్యములును కలవు. అదియంతయు వారిప్రారంభ ప్రతీకారములలో నొకభాగము. వాటికి సమాధానమిచ్చుటకు గాని వాటిలోనున్న ఘోరములగు ప్రమాదములను ఖండించుటకుగాని మా కవకాశములేదు. షెర్వానీపయి నొకయసత్యము నంటగట్టుటకు చేయ బడిన ఘోరప్రయత్నమునతడు జెయిలుకుపోవుటకు కొద్ది పూర్వము సవరించెను. వివిధములగు యీస్టేటుమెంటులును, ప్రభుత్వ సమాధానములును చదువుటకు వినోదముగనుండును. అవిప్రభుత్వమెంత గడగడలాడెనో, దానిబలమెంత క్షీణించెనో విశదముచేసెను. స్పెయిను దేశపురాజయిన మూడవఛార్లెసు తనరాజ్యమునుండి జెసూటులను వెడలనంపినపుడు ప్రకటించిన డిక్రీని నేనొకనాడు చదువుచుండగా బ్రిటిషుప్రభుత్వమువారు హిందూదేశములో నమలుపరచిన డిక్రీలును, ఆర్డినెన్సులును, వాటియావశ్యకతనుగురించి చెప్పబడిన కారణములును నాకమాంతముగా జ్ఞప్తికివచ్చెను. 1767 ఫిబ్రవరిలోనిచ్చిన యీడిక్రీలో రాజుతనచర్యకు "నాప్రజలలో వినయవిధేయతలను, శాంతిని, న్యాయ మును నిర్వహింపవలసిన నాధర్మముకు సంబంధించిన యత్యంతగంభీర కారణములును, నేనునాసార్వభౌమహృదంతరాళములో నిగూఢముగా దాచిపెట్టుకొనిన ముఖ్యములును, యుక్తములును, అవసరములునునగు నితర కారణములును" గలవని సమర్ధించెను.

కనుకఆర్డినెన్సులకుగల యథార్థ కారణములు వైస్రాయిగారి హృదయకుహరములోనో లేక వారి మంత్రివర్గమువారి సామ్రాజ్య

పరమగు హృదయసీమలలోనో తాళము వేయబడియుండెను. కాని యవి స్పష్టములే. అధికారకర్తృ చెప్పబడిన కారణములు బ్రిటిషు ప్రభుత్వము వారు హిందూదేశములో పరిపూర్ణమొనర్చుచున్న ప్రచారముయొక్క నూతనసాంప్రదాయము నర్థముచేసికొనుటకు తోడ్పడుచున్నవి. అనేక అసత్యములతో నిండిన యర్ధప్రభుత్వ కరపత్రములు గ్రామములలో, విరివిగా పంచిపెట్టబడినట్లు మేముకొన్నిమాసములైనతరువాత వింటిమి. వాటిలో కాంగ్రెసు వ్యవసాయవస్తువుల ధరలుపడగొట్టెననియు కనుక వ్యవసాయదారుల కన్నికష్టములను తెచ్చిపెట్టెననియు నొకసూచన చేయబడెను. ప్రపంచ ఆర్థికమాంద్యమును తేగలిగిన కాంగ్రెసు యొక్క శక్తి కింతకంటె వేరుపొగడ్త యేమియు నవసరములేదు; కాని యీయసత్యము, దీనివలన కాంగ్రెసుగౌరవము నశించుననను నాశతో నిరంతరము విధివిరామములేకుండ వ్యాప్తిచేయబడుచుండెను.

దీనికంతను లక్ష్యముచేయక యు. పి. లో కొన్నిప్రధాన జిల్లాలలోని వ్యవసాయదారులు శాసనోల్లంఘన శంఖారావమును (ఇది విధాయకముగ యుక్తమైన శిస్తు రిమిషనులకు సంబంధించిన తగాదాతో కలసిపోయెను) వినుటతోడనే దానికిచక్కని సమాధానమునిచ్చిరి. అది 1930 లో నున్నదానికంటె చాలగొప్పదిగను, యెక్కువశిక్షణ గలదిగనునుండెను. ప్రథమములోనిందు మంచి హాస్యరసముకూడనుండెను. మేమొకవినోదకరమైన కథనువింటిమి. రై. బెరిల్లీజిల్లాలో బకులియా యనుగ్రామమును పోలీసుపార్టీయొకటి సందర్శించెను. పన్ను చెల్లింపనందులకు వారు సామానులను జప్తుచేయుట కచ్చుటకువెళ్లిరి. ఆ గ్రామము కొంతయైశ్వర్యవంతమైనది. ఆగ్రామవాసులు కొంతయుత్సాహముకలవారు. వారుపోలీసు యుద్యోగులను, రివిన్యూయుద్యోగులను అతిమర్యాదతో సత్కరించిరి. వారు అన్నియిండ్ల తలుపులను తెరచియుంచి యుద్యోగులను వారియిష్టమువచ్చినచోటకు వెళ్లవలసినదని

యాహ్వానించిరి. పశువులు మొదలగునవి కొన్ని జప్తు చేయబడెను. తరువాత గ్రామస్థులు రివిన్యూయుద్యోగులకును, పోలీసు యుద్యోగులకును తపాల పాకులు, వక్కలుయిచ్చి తాంబూలచర్వణము చేయమనిరి. వారు సిగ్గుపడి చిన్నబుచ్చుకొని వెడలిపోయిరి. కానియిదియొకయరుదైన యసాధారణ చర్య. త్వరలోనే హాస్యము, ధర్మము, దయ దాక్షిణ్యములు నశించెను. పాప మాబకులియా గ్రామవాసులహాస్యము వారి యుత్సాహమునకు శిక్షననుభవింపకుండ చేయజాలదయ్యెను.

ఈ ప్రత్యేకజిల్లాలలో చాల నెలలవరకు వ్యవసాయదారులు పన్నులను చెల్లింపలేదు. బహుశః వేసవి ప్రారంభమునుంచి మాత్రమే వసూళ్లు క్వచితుగా వచ్చుచుండెను. నిశ్చయముగా ననేకమంది అరెస్టుకావింపబడిరి. కాని యిది ప్రభుత్వనీతికి భిన్నముగ జరిగెను. సాధారణముగ అరెస్టులను గ్రామములలోని నాయకులకును, ప్రత్యేక వర్కరులకును దాచియుంచిరి. తక్కినవారందరును చావగొట్టబడిరి. ఖయిదుకంటెను, కాల్చుటకంటెనుకూడ తన్నుటయే ఘనమైనదని కనుగొనబడెను. అవసరమైనప్పుడెల్ల దానిని ప్రయోగింప వచ్చును. మారుమూలలలోనున్న గ్రామములలో జరుగుటచేతనవి పయిమానవుల కంటబడవు. అది యంతుపొంతులేకుండ పెరిగుపోవు ఖయిదీల సంఖ్యను పెంచదు. నిశ్చయముగ ననేకములగు జప్తులు, ఆస్తినమ్మటు, పశువుల నమ్మటు, భూమినుండి వెడలగొట్టుట మొదలగునవి కలవు. తమకున్న కొద్దియాస్తి లాగుకొనబడి పరిహాసాస్పదమగు ధరల కమ్మివేయబడుచుండ వ్యవసాయదారులు దారుణమగు బాధతో చూచుచు నిహారకుండెడివారు.

దేశమంతటను పట్టుకొనబడిన యసంఖ్యాకములగు భవనముల వలెనే స్వరాజ్యభవనముకూడ పట్టుకొనబడెను. స్వరాజ్య భవనములో పనిచేయుచున్న కాంగ్రెసు ఆస్పత్రికిచెందు విలువమైన వస్తువులు,

పరికరములుకూడ పట్టుకొనబడెను. కొద్దిరోజులవరకు ఆస్పత్రి పూర్తిగ పనిచేయుటయే మానివేసెను. కాని తరువాత దగ్గరనున్న యొక పార్కులో నారుబయట నొక డిస్పెన్సరీ పెట్టబడెను. తరువాత నీ ఆస్పత్రి లేక డిస్పెన్సరీ స్వరాజ్యభవనముకు చేరియున్న యొకచిన్న యింటిలోనికి మార్చబడి యచ్చట సుమారు రెండున్నర సంవత్సరములు పనిచేసెను.

నేను చాల హెచ్చు మొత్తమయిన రాబడిపన్ను చెల్లింప నిరాకరించుటచే మానివాసమగు ఆనందభవనమునుకూడ ప్రభుత్వమువారు తీసికొనెదరను వదంతులు బయలుదేరెను. ఈపన్ను తండ్రిగారి యాదాయముమీద 1930 లో విధింపబడెను. శాసనోల్లంఘనముండుటచే నతడాసంవత్సరము యీపన్ను చెల్లింపలేదు. 1931 లో, ఢిల్లీసంధి యైన తరువాత దానినిగురించిరాబడిపన్ను విధించు అధికారులతో నేను కొంత వాదముచేసితిని. కాని చివరకు నేను చెల్లించుట కంగీకరించి యొక వాయిదా చెల్లించితిని. అప్పుడే ఆర్డినెన్సులు వచ్చుటచే నేనిక చెల్లింపరాదని నిశ్చయించుకొంటిని. పన్నులను, శిస్తును యీయవలదని వ్యవసాయదారులకుబోధించుచు నేనే రాబడిపన్ను చెల్లించుట కేవలము తప్పుగను, నీతిబాహ్యముగను కూడ నాకుకాన్పించెను. కనుక ప్రభుత్వమువారు మాయింటిని జప్తుచేయుదురనియే నేననుకొంటిని. కాని దీనివలన మాతల్లియింటినుండి వెడలగొట్టబడును కనుక నాకీతలంపు చాలచెగటుగ నుండెను. మావియను కారణముచేతను,వ్యక్తిగతముగను మేమెంతయో ప్రేమించు యమూల్యములగు పుస్తకములు, పత్రములు, వస్తువులు, పశువులు, యింకను అనేకవస్తువులు యితరుల చేతులలోనికి పోయి బహుశః నష్టమైపోవును. మన జాతీయజెండా లాగివేయబడి దానిచోట యూనియనుజాక్ మెత్తబడును. కాని యీసమయముననే ల్లుయి పోవుట యనుభావముకూడ నన్నాకర్షించెను. ఆస్తులన్నియు లాగివేయు

బడుచున్న వ్యవసాయదారులకిది నన్నుచేరికచేసి, వారికుత్సాహమును కలిగించును. మాయుద్యమదృష్టిలో చూచినచో నిది నిశ్చయముగ జరుగవలసిన విషయమే. కాని ప్రభుత్వమువారు అన్యథాతలంచి మా యింటిని ముట్టుకొనలేదు. బహుశః మాతల్లియెడల దయచేతను, బహుశః శాసనోల్లంఘనోద్యమమునకది మరింత ప్రోత్సాహమునిచ్చునను యుక్తమైన యోచనచేతను వారట్లు చేసియుండవచ్చును. చాల నెలలయినతర్వాత నా రైల్వేవాటాలు కొన్ని కనుగొనబడి రాబడి పన్ను చెల్లింపనందులకు జప్తుచేయబడెను. నాయొక్కయు, మాబావ మరదియొక్కయు మోటారుకారులదివరకే జప్తుచేయబడి యమ్మివేయబడెను.

ఈప్రారంభమాసములలోని యొకలక్షణము నన్ను యెక్కువగ బాధించెను. అనేక మునిసిపాలిటీలు పబ్లికుసంస్థలు ముఖ్యముగా కాంగ్రెసుమెజారిటీ యున్నదని చెప్పబడిన కలకత్తా కార్పొరేషను జాతీయజెండాలను లాగివేసెను. జెండాలను లాగివేయనిచో తీవ్రచర్యను తీసికొనెదమని పోలీసువారును ప్రభుత్వమువారును భయపెట్టుటచే నవితీసివేయబడెను. ఈ చర్య మునిసిపాలిటీని రద్దుచేయుటయో లేక దాని సభ్యులను శిక్షించుటయో యైయుండెడిది. స్వప్రయోజనములతో గూడుకొనినసంస్థలు సహజముగ పిరికితనము కలిగియుండును. బహుశః వారు చేసినట్లుచేయుటతప్పనిసరి. అయినను అదినన్ను బాధించెను. జెండా మనమెక్కువగా ప్రేమించుదాని కొక చిహ్నమయ్యెను. దానినీడ క్రింద నిలుచుని దానిగౌరవమును రక్షించెదమని మనమనేక ప్రమాణములను చేసితిమి. దానిని మన చేతులతోనే లాగివేయుట లేదా మన యాజ్ఞలప్రకారము దానిని లాగివేయించుట యా ప్రతిజ్ఞాభంగము మాత్రమేకాక పాతకమువలె గూడకాన్పించెను. అది మనలోనున్న యాత్మను చంపుకొనుట, సత్యమును నాశమొనర్చుట యగును; గొప్ప

దియైన భౌతికశక్తిముందర యసత్యమును ధృవపరచుట. ఈవిధముగ లొంగిపోయినవారు జాతీయనీతిని భంగపరచిరి; దాని యాత్మగౌరవము నకు హానికలిగించిరి.

వారు వీరులవలె ప్రవర్తించి యగ్నిహోత్రములోని కుఱుకవలె నని యెవరును భావించలేదు. ముందుకుదుముకలేదని ఖయిదుకు రాలేదని యితరనష్టములను బాధలను పొందలేదని యెవనినిగాని దూషించుట తప్పు, మూర్ఖము. ప్రతివాడును అనేకధర్మములను బాధ్యతలను నిర్వ హింపవలసి యున్నాడు. అతనిమీద న్యాయవిమర్శ చేయుట కితరుని కెవనికిని హక్కులేదు. వెనుక కూర్చునుట లేక వెనుకనుండి పనిచేయుట వేరు; సత్యమును లేక తాను సత్యమను కొనినదానిని నిరసించుట గర్హ్యా మైన విషయము. జాతీయప్రయోజనములకు వ్యతిరేకముగ దేనినైనను చేయవలసివచ్చుచో మునిసిపలుసభ్యులు తమస్థానములకు రాజీనామా యివ్వవచ్చును. కాని సాధారణముగ వారు ఆస్థానములను వీడుటకిష్ట పడరు. "తేనెటీగలు పుష్పములపై వ్రాలుటతోటనే ఝుంకారము లను కట్టిపెట్టును. పదవుల నాక్రమించుటతోడనే విగ్గులు మూకీభావ మును వహింతురు."

తనను అసహాయునిచేయు విషమపరిస్థితులలోనున్నవాని ప్రవ ర్తనను విమర్శించుట న్యాయముకాదు. ప్రపంచయుద్ధమనేకసార్లు విశద ముచేసినట్లు ఒక్కొక్కప్పుడత్యంత ధైర్యశాలియొక్క ధైర్యము కూడ చెదరిపోవును. అంతకుపూర్వము 1912 లో టిటానికుయోడ మునిగిపోయిన సందర్భములో నతిప్రీతిభావంతులైనవారు, పిరికితన ముతో నెన్నటికిని జతచేయుటకు వీలులేనివారు, నావికులకులంచమిచ్చి తక్కినవారు మునిగిపోవుచుండ నాత్మరక్షణము చేసికొనిరి. ఈమధ్యనే మొరొకోట తగులపడినప్పుడు సిగ్గుకరమగు విషయములు బయల్పడెను. హేతువును, నిరోధకశక్తిని నాశముచేయు జంతుస్వభావములుండు సంక

టావస్థలో తానెట్లు ప్రవర్తించునో యెవడును చెప్పజాలడు. కనుక మనము దూషింపరాదు.

అనగా ఋజుపరివర్తనమునుండి పడిపోవుటను గుర్తింపరాదని యర్థముకాదు. అత్యవసరసమయములలో వణకునట్టియు వ్యర్థముచేయు నట్టియు చేతులలో జాతీయనౌకయొక్క చుక్కాని నికముందుపెట్టరాదని గుర్తింపకూడదని యర్థముకాదు. ఇట్టి ధర్మచ్యుతిని సమర్థించుకొనుటకు చేయుప్రయత్నమును, దీనిని యుక్తపరివర్తనమనిపిలుచుట మరింత యక్రమము: నిశ్చయముగానిది యాధర్మచ్యుతికంటెగూడగొప్ప నేరము.

విరుద్ధశక్తులమధ్య జరుగుపోరాటములన్నియు నెక్కువగనీతి మీదను ధైర్యస్థైర్యములమీదను ఆధారపడియుండును. అత్యంతరక్త సిక్తమగు యుద్ధముకూడ వీనిమీదనే యాధారపడును. "తుది రంగములో యుద్ధములు ధైర్యస్థైర్యములచేతనే గెలుపొందుచుండును." అనిమార్షలుఫోక్ చెప్పెను. దౌర్జన్యరహితపోరాటములో నీతియు ధైర్యస్థైర్యములును మరింతయవసరము. ఎవడు తన పరివర్తనచేనట్టినీతిని భంగపరచి, జాతియొక్కస్థైర్యమును కూలద్రోయునో వాడుయుద్యమ మునకు మహాపరాధమును చేసినవాడగును.

నిత్యముశుభాశుభవార్తలను తెచ్చుచు మాసములుగడచిపోవు చుండెను. మేముమామాజయిళ్ళలో నిర్వీర్యములగు నిత్యకర్మల కలవడిపోతిమి. జాతీయవారము-ఏప్రిల్ 6 లగాయతు 13వరకు-వచ్చెను. ఇది యనేక యసాధారణ యుదంతములను తెచ్చుననిమేమెరుగుదుము. అప్పుడు యనేకములు జరిగెను. కానియొకయుదంతముముందర నాకు తక్కినవన్నియు పేలవముగనుండెను. అలహాబాదులో నాతల్లి యొక

యుత్సవములోనుండెను. పోలీసులు యుత్సవమునాపి లాఠీచార్జి చేసిరి. ఉత్సవము ఆపివేయబడిన తరువాత నెవరో యామెకొక కుర్చీ తెచ్చి వేసిరి. ఆమెయుత్సవముముందర రోడ్డుమీద నాకుర్చీలో కూర్చొనెను. ఆమెకొరకు ప్రత్యేకముగచూచుచున్న కొంతమంది, నాకార్యదర్శితో సహా, అరెస్టుచేయబడి తీసికొనిపోబడిరి. తరువాత పోలీసులాఠీచార్జి ప్రారంభమయ్యెను. నాతల్లికుర్చీలోనుండి క్రిందకుపడగొట్టబడెను. తరువాత విసుగకుండనామెతలమీద బెత్తములతో మోదిరి. తలమీదతగిలినగాయ నుండిరక్తము స్రవించెను; ఆమెస్మృతితప్పి రోడ్డుప్రక్కన పడియుండెను. అప్పటికి రోడ్డుమీదనున్నప్రజలును, యుత్సవములో పాల్గొనినవారును తరిమివేయబడి రోడ్డువిజనముగ నుండెను. కొంత కాలమునకుపిదప నామెనులేవనెత్తి యొకపోలీసుఆఫీసరు తనమోటారుకారులో ఆనంద భవనమునకు చేర్చెను. నాతల్లిచనిపోయెనని యారాత్రిఅలహాబాదులో నొకయసత్యవదంతి వ్యాపించెను. క్రోధపూరితులగు ప్రజలు సమూహములుగ జేరిరి. వారుశాంతిని, దౌర్జన్య రాహిత్యమును మరచిపోయి పోలీసులను ముట్టడించిరి. పోలీసులు తుపాకులనుకాల్చిరి. కొంతమంది జనము హతులయిరి.

ఈయుదంతము జరిగిన కొన్నిరోజులయిన తరువాత (మాకు వారపత్రిక మాత్రమేయిచ్చిరి) నాకీవార్త తెలిసెను. దుర్బలశరీరు రాలగు వృద్ధురాలైన నాతల్లి ధూళిధూసరిత మార్గములో రక్త స్రావముతో పడియుండెనను భావము నాకు హృదయ విదారక ముగ నుండెను. నేనచ్చటనే యుండియున్నయెడల నేనెట్లు ప్రవర్తించెడి వాడనోయని నేనాశ్చర్యపడితిని. నాదౌర్జన్యరాహిత్య మెంతవరకు నిలిచి యుండెడిదో! అదికొంతవరకే నన్నుతీసికొనిపోయెడిదని నేననుకొందును. ఏలనన యాదృశ్యము నేను పన్నెండు వత్సరములనుండియు నేర్చుకొను టకు ప్రయత్నించిన పాఠమును మరచిపోవునట్లు చేసియుండెడిది; దాని

వలన నాకుగాని నాజాతికిగాని కలుగుఫలితములకు నేనంత లెక్కపెట్టి యుండెడివాడను కాను.

ఆమె నెమ్మదిగ కోలుకొనెను. ఆమె మరుసటినెల రైబరెల్లీ జయిలుకు నన్ను చూచుటకు వచ్చినప్పుడింకను తలకు కట్టుకట్టుకొనుచుండెను. కాని మావాలంటీరు బాలురతోను, బాలికలతోను బెత్తపుదెబ్బలను, లాఠీదెబ్బలను పంచుకొనగల భాగ్యమామెకు కలిగినందులకామె యుత్సాహముగను, గర్వముగను నుండెను. అయినను, ఆమె స్వస్థత బాహ్యమయినదికాని యథార్థమైనదికాదు. ఆవయసులో నామెయనుభవించిన యాయావేదన యామె శరీరావస్థను పూర్తిగా తారుమారుచేసి శాశ్వతకష్టములను తెచ్చిపెట్టెను. ఇవియొక సంవత్సరమైన తరువాత యుపద్రవకరములుగ పరిణమించెను.

---

## ౪౩

## బెరిల్లీ, ఢేరాడూను జయిళ్ళలో.

—⊰)O(⊱—

నైనీజయిలులో ఆరువారములున్న తరువాత నన్ను బెరిల్లీజిల్లా జయిలుకుమార్చిరి. తిరిగినాయారోగ్యము కొంతచెడెను. ప్రతిరోజు నాకు జ్వరము తగులుచుండుటచే నెక్కువ విసుగుగ నుండెడిది. బెరిల్లీలో నాలుగు మాసములు గడపినతరువాత, వేసవికాలప్పుటెండ ప్రచండతరము యినప్పుడు, హిమాలయపర్వత పాదముదగ్గరనున్న ఢేరాడూను జయిలుకు, యీసారిచల్లని ప్రదేశముకు నన్నుమార్చిరి. అచ్చటనేను, అవిచ్ఛిన్నముగ, పదునాల్గుమాసముల పదిహేనురోజులు, రమారమి నారెండు సంవత్సరముల శిక్ష పూర్తియగు వరకు నుంటిని. ఉత్తరముల మూలమునను, బంధుమిత్ర దర్శనములవలనను, వడపోయబడిన వార్తా పత్రికలమూలమునను నాకువార్తలు చేరుచుండెను. కాని బయట జరుగుచున్న దానిలో చాలవరకు నాకెంతమాత్రమును తెలియకుండెను. ప్రధానయుదంతములనుగురించి నాకస్పష్టభావములు మాత్రమేకలవు.

నన్ను విడిచిపెట్టినప్పుడు నేనుస్వంతవ్యాపారములతోను, అప్పటి రాజకీయ పరిస్థితులతోను తీరికలేకయుండెడివాడను. అయిదుమాసములకు కొంచెము పయిగా స్వేచ్ఛననుభవించిన తరువాత నన్ను తిరిగి జయిలుకు తీసికొనివచ్చిరి; నేనింకను యిచ్చటనేయున్నాను. ఈవిధముగ గత మూడు సంవత్సరములలో నేను చాలభాగము జయిలులోనేయుండి బయటజరిగిన విషయములతో సంబంధములేకయుంటిని. ఈకాలములో జరిగిన పరిస్థితులనన్నింటిని కొంతవివరముగ తెలిసికొనుటకు నాకుసావకాశములేకపోయెను. గాంధీజీహాజరయిన రెండవ రౌండు టేబిలు సభ తెరచాటున నేమి జరిగెనో నాకింకను అస్పష్టజ్ఞానమేకలదు. ఈవిషయ

మునుగురించి నేనతనితో మాట్లాడుటకు నాకింతవఱకును సమయము దొరకలేదు. అతనితోగాని, యితరులతోగాని తరువాతజరిగిన యనేక విషయములను గురించి చర్చించుటకును వీలుకలుగలేదు.

1932, 1933 సంవత్సరములలో మనజాతీయపోరాటముయొక్క పరిణామమును చిత్రించుటకు నాకంతగానేమియు తెలియదు. కాని నేనారంగమును, దాని వెనుకనున్న చరిత్రను, నటకులనుకూడ బాగుగ నెరుగుదును; అప్పుడు జరిగిన యనేక చిన్నవిషయములను సహజముగ నర్థముచేసికొంటిని. ఈవిధముగ పోరాటముయొక్క సాధారణగతిని గురించి యుక్తమైన భావమును కలిగియుంటిని. మొదటి నాలుగుమాసములు శాసనోల్లంఘనము తీవ్రముగను, శక్తివంతముగను పనిచేసెను. తరువాతనది క్రమముగా, మధ్యమధ్య పొంగుచు, క్షీణించెను. ప్రత్యక్షచర్యతోగూడిన పోరాటమెప్పుడును విప్లవస్థాయిలో కొంచెము కాలము మాత్రమే నిలువగలదు. అది స్థాణువుగనుండజాలదు; అది విజృంభించనైనను విజృంభింపవలెను, లేదా క్రిందకు పడిపోవలెను. మొదటి విజృంభణమైన తరువాత శాసనోల్లంఘనము నెమ్మదిగ దిగజారెను. కాని తక్కువస్థాయిలో నది యెక్కువకాలము నిర్వహింపబడగలదు. అఖిల భారత కాంగ్రెసుసంస్థ అక్రమసంఘముగా ప్రకటింపబడినను జయప్రదముగ పనిని సాగించుచునేయుండెను. అది తనరాష్ట్రవర్గములతో సంపర్కము కలిగియుండి, యాజ్ఞలనుపంపుచు, నివేదికలనందుకొనుచు, మధ్యమధ్య ధనసహాయము చేయుచుండెను.

రాష్ట్రసంస్థలుకూడ నించుమించుగ జయప్రదముగనే పనిచేసెను. నేను జయిలులోనున్న సంవత్సరములలో నాకు యితర రాష్ట్రముల సంగతి యంతగా తెలియదు. కానినేను విడుదలయైన తరువాత యు. పి. రాష్ట్రములో జరిగిన చర్యలనుగురించి కొంత సమాచారమును పోగుచేసితిని. యు. పి. కాంగ్రెసు ఆఫీసు 1932 సంవత్సరమంతయు క్రమ

ముగ పనిచేసెను. అది గాంధీజీ సలహామీద నప్పటి కాంగ్రెసు ప్రెసి డెంటుచే శాసనోల్లంఘన మాపివేయబడువరకు అనగా 1933 మధ్య వరకు పనిచేసెను. ఈకాలములో జిల్లాలకు తఱచుసందేశములు పంప బడుచుండెను. అచ్చు కరపత్రములుగాని, సైక్లోస్టైలు కరపత్రములు గాని సక్రమముగ ప్రకటింపబడుచుండెను; అప్పుడప్పుడు జిల్లాలో జరుగుచుండిన పని తణిఖీచేయబడుచుండెను. మన జాతీయసేవకు సంబంధించిన వర్కరులకు బత్తెము లీయబడుచుండెను. ఈపని చాల వరకు, అవసరమునుబట్టి, రహస్యముగనే జరిగెను; కాని రాష్ట్రకమిటీ కార్యదర్శి ఆఫీసు మొదలగుపనులను చూచుకొనుచు తన ధర్మమును బహిరంగముగనే నెరవేర్చుచుండెను. అతడు నిర్బంధింపబడినపుడు మని యొకడా స్థానము నాక్రమించెడివాడు.

1930, 1932 వత్సరములలోని మాయనుభవము భారతదేశ మంతటను రహస్యవార్తా విధానము నేర్పరచుట సులభమే యనుసంగ తిని విశదముచేసెను. ఎక్కువ ప్రయత్నమక్కర లేకుండ, కొన్ని యవాంతరములు సంభవించినను, మంచిఫలితమే కలిగెను. కాని శాస నోల్లంఘన తత్త్వముతో రహస్యవిధానముకు సరిపడదని మేము చాల మంది భావించితిమి. ప్రజాప్రబోధము దానివలన మందగించెను. పెద్ద బహిరంగమైన ప్రజోద్యమములో నొక చిన్నభాగముగ నదియుప యోగకరముగనుండెను. కాని యొక్కయుపద్రవ మెప్పుడును (ముఖ్య ముగాయుద్యమము క్షీణించుచున్నపుడు) కలదు. నిష్ఫలములగు కొన్ని రహస్య క్రియలే యుద్యమస్థానము నాక్రమింపవచ్చును. 1933 జూలైలో గాంధీజీ రహస్యమెంత మాత్రము పనికిరాదని నిరసించెను.

యు. పి. తో సంబంధములేకుండ గుజరాతు, కర్నాటకము లలో కొంతకాలము వ్యవసాయపన్నుల నిరాకరణోద్యమములు జయ ప్రదముగ సాగింపబడెను. రెండురాష్ట్రములలోను వ్యవసాయప్రాప్తి

యితరులు ప్రభుత్వముకు పన్ను చెల్లింప నిరాకరించిరి. దీనివలనవారు చాలకష్టముల ననుభవించిరి. ఈబాధితులకు సహాయముచేయుటకును, భూమినుండి వెడలగొట్టబడుటవలనను, ఆస్తులను లాగుకొనుట వలనను వారికి కలిగిన దుఃఖముల నుపశమింపజేయుటకును కాంగ్రెసు తరఫున కొన్నిప్రయత్నములు, (అవితప్పనిసరిగ యసంపూర్ణములు)చేయబడెను. యు. పి. లో రాష్ట్ర కాంగ్రెసువారుఆస్తులను పోగొట్టుకొనిన రైతాంగమున కీవిధముగ తోడ్పడుట కెట్టి ప్రయత్నమును చేయలేదు. ఇచ్చట సమస్య(కౌలుదార్లు వ్యవసాయ ప్రొప్రయిటర్లకంటె నత్యధికముగ నున్నారు.) యతిపెద్దసమస్య. భూవైశాల్యమూ చాల హెచ్చు! రాష్ట్రములోనున్న నిధి చాలస్వల్పము. ఈయుద్యమమువలన బాధపడిన వేలమీదనున్నవారికి సహాయముచేయుట మాకసాధ్యమైనపని. వారిని, యెప్పుడును ఆకలిబాధచే మాడుచున్న యసంఖ్యాకులయిన తదితరులను, వేరుచేయుటకూడ మాకసాధ్యముగనేయుండెను. కొద్ది వేలమందికే సహాయముచేయుటయే కష్టమును క్రోధ ద్వేషములను పుట్టించును. కనుక మేము ధనసహాయము చేయజాలమని నిశ్చయించి, మొట్టమొదటనే యీవిషయమును బహిరంగపరచితిమి. వ్యవసాయదారులు మాస్థితినిచక్కగా గ్రహింపగలిగిరి. సణుగకుండ ఫిర్యాదుచేయకుండ వారెంత సహింపగలిగిరో యాశ్చర్యకరముగనుండును. మేము చేయగలిగినచోట కొంతమంది వ్యక్తులకు, ముఖ్యముగా జయిలుకు వెళ్ళిన వారి భార్యాబిడ్డలకు, సహాయముచేయుటకు ప్రయత్నించితిమి. ఈ దురదృష్టదేశముయొక్క దౌర్భాగ్యమెట్టిది! నెలకొక్కరూపాయికూడ దేవతాప్రసాదముగ భావింపబడును.

ఈకాలములో మొదటినుండియు యు. పి. రాష్ట్రకమిటీవారు (ఈసంఘము నిషేధింపబడెను.) తమజీతగాండ్రకు స్వల్పజీతముల నిచ్చుచునేయుండిరి; వారు జయిళ్ళకు వెళ్ళినపుడు (వారందరును వరుసగా

వెళ్ళిరి) వారికుటుంబములనుపోషించిరి. వారిబడ్జెట్టులోనిదిపెద్దమొత్తము. తరువాత కరపత్రములను, నోటీసులను, బులెటినులను అచ్చువేయించు ఖర్చులువచ్చెను; ఇవికూడ చాల హెచ్చుగనే యుండెను. ప్రయాణ ఖర్చులు మరియొక ప్రధానవిషయము. తక్కువభాగ్యవంతమైన జిల్లాలకు కొన్నిగ్రాంటుల నీయవలసియుండెను. అతిశక్తివంత మైనదియు, వేళ్ళుపాతుకొని యున్నదియునగు ప్రభుత్వముతో తీవ్రప్రజాసంగ్రామము జరిగిన యీకాలములో పైఖర్చులును, తదితరఖర్చులును యెన్నియో చేయబడినను యు. పి. రాష్ట్రకమిటీవారు 1932 జనవరి లగాయతు 1933 ఆగష్టువరకు యిరువది మాసములలో మొత్తము 63000 రూపాయిలు అనగా నెలకు 3140 రూపాయిలు ఖర్చుపెట్టిరి. (ఈమొత్తములో అలహాబాదు, ఆగ్రా, కాన్పూరు, లక్నోలవంటి యెక్కువధన, బలములు కలిగిన జిల్లాకమిటీల ప్రత్యేకఖర్చులులేవు.) 1932, 1933 పోరాటములో రాష్ట్రములలో యు. పి. రాష్ట్రము అన్నిటికంటె ముందరగనుండెను. పొందినఫలితములనుబట్టిచూడ నది చాలతక్కువఖర్చు చేసెననియే నేననుకొనెదను. శాసనోల్లంఘనము నణచుటకు రాష్ట్రప్రభుత్వమువారు చేసినప్రత్యేక ఖర్చులను ఈయల్ప సంఖ్యతో పోల్చి చూచుట చాలప్రయోజన కరముగనుండును. తక్కిన పెద్ద రాష్ట్రములుకొన్ని యింతకంటె నెక్కువ (ఇదినాకు తెలియక పోయినను) ఖర్చుచేసెనని నేనూహించెదను. కాని బీహారు, కాంగ్రెసు దృష్టిలో, దాని సరిహద్దు రాష్ట్రమైన యు. పి. కంటె చాలబీదది. అయినను పోరాటములోనది యద్భుతముగ పనిచేసెను.

క్రమముగ శాసనోల్లంఘనోద్యమము క్షీణించెను; కానియది జలగసాగినట్లు సాగుచునేయుండెను. అంతకంతకది బాహుళ్యముమీద జరుగుట తగ్గిపోయెను. ప్రభుత్వమువారి తీవ్రనిర్బంధ విధానమట్లుండ 1932 సెప్టెంబరులో గాంధీజీ హరిజన సమస్యమీద మొదటి యుపవా

సముచేసెనపుడు దానికి మొట్టమొదట గట్టిదెబ్బ తగిలెను. ఆయుప వాసము ప్రజలలో ప్రబోధమును కలిగించెను. కాని యది దానిని మరి యొకవైపు మరలించెను. 1933 మే మాసములో శాసనోల్లంఘన మాపివేయబడుటచే చివరకది యాచరణలో చంపివేయబడెను. దాని తరువాత నది యాచరణలోగాక సిద్ధాంతములోనుండెను. అదియట్లు ఆపుచేయబడక పోయినను క్రమముగ నశించియుండెడిదనుట నిస్సం దేహము. నిర్బంధములలోని కాఠిన్యతచేతను, దౌర్జన్యముచేతను భారత దేశము సొమ్మసిలిపోయెను. జాతియొక్క ధైర్యస్థైర్యములు తాత్కా లికముగ డస్సిపోయెను. అవి తిరిగి ప్రతిష్ఠింపబడలేదు. శాసనోల్లంఘ నమును వ్యక్తిగతముగ సాగింపగలవారింకను అనేకమందికలరు. కాని వారు కొంత కృత్రిమ వాతావరణములో పనిచేసిరి.

ఒకమహోద్యమమీవిధముగ నెమ్మదిగ నశించిపోవుటను వినుట జయిలులోనున్న మాకు సంతోషకరముగలేదు. అయినను బ్రహ్మాండ మగు విజయము కలుగునని మాలోనెవరును భావించియుండలేదు. ప్రజ లలో నణచివేయబడజాలని ప్రబోధము కలిగినచో నద్భుతమైన దేదియో సంభవించుట కొకవెర్రి యవకాశ మెప్పుడును ఉండెను. కానిదానిమీద నాధారపడుటకు వీలులేదు. కనుక మేము నిమ్నో న్నతములతోను, మధమధ్య ననేక 'ఆటకట్టు'లతోను గూడిన దీర్ఘ పోరాటముకొరకే యెదురుచూచితిమి; ప్రజలకు శిక్షణలోను, సమష్టి కార్యాచరణలోను లక్ష్యశుద్ధిలోను అత్యధికమగు బలము చేకూరు నని యాశించితిమి. ఒక్కొక్కప్పుడు 1932 మొదటి దినములలోశీఘ్ర ముగనేదేని యొకబాహ్యవిజయము కలుగునేమోయని భయపడెడి వాడను; ఏలనన నిది విధాయికముగ నొకరాజీకి దారితీసి గవర్నమెంటే రియనులను, సమయానుకూలస్వాహాపరులను మననెత్తిమీదకెక్కించు నట్లు కాన్పించెను. 1931 నాటి యనుభవము కండ్లకు కాన్పించుచునే

యుండెను. విజయము సార్థకముకావలెనన్న ప్రజలు సాధారణముగ దానిలాభమును పొందుటకు తగిన నిర్మలభావములను, పటుతరమైన భావములను కలిగియున్నపుడే యది రావలెను. లేనిచో ప్రజలు పోరాటమును సలిపెదరు; త్యాగములను చేసెదరు; చివర నిముషములలో నితరులు పెండ్లికొమరులవలెవచ్చి లాభములను ప్రోగుచేసికొందురు. ఇట్టియుపద్రవ మెంతయో కలదు. ఏలనన కాంగ్రెసులోనే యెన్నియో యసంబద్ధ యాలోచనలు కలవు; మనకెట్టి ప్రభుత్వపద్ధతి కావలెను? ఎట్టిసాంఘిక పద్ధతి కావలెను? అనువిషయములనుగురించి నిర్మలమైన భావములులేకుండెను. నిశ్చయముగ కొందఱు కాంగ్రెసువారు ప్రస్తుతప్రభుత్వపద్ధతి నంతగా మార్చవలెనని తలంచలేదు. అందులో నున్నబ్రిటిషువారిని లేక విజాతీయులను తీసివేసి ‘స్వదేశీ’ సిబ్బందిని పెట్టినచాలునని వారిమతము.

శుద్ధ ‘గవర్నమెంటోడియనుల’ విషయమువేరు. ఏలనన ప్రభుత్వాధికారమునకు (అదియెట్టిదైనను) దాసులగుటయే వారి విశ్వాసములలో ప్రధమసూత్రము. కాని లిబరలు పక్షమువారును, రెస్పాన్సివిష్టులనుకూడ రమారమి బ్రిటిషుప్రభుత్వమువారిలక్ష్యమునే సంపూర్ణముగ నంగీకరించిరి; వారప్పుడప్పుడుచేయు విమర్శ, నిరర్థకము, నిష్ఫలము. కొండవిరిగిమీదపడినను సరే! వారు చట్టములనే యుపాసించెదరు; కనుక వారు శాసనోల్లంఘనము నాహ్వానము చేయజాలరు. కాని వారింకను ముందుకుపోయి రమారమి ప్రభుత్వపక్షమున నిలిచిరి. అన్నివిధములగు నాగరిక స్వాతంత్ర్యములును పూర్తిగ నణచివేయబడినపుడు వారు మౌనముద్రనువహించి లేకభయభ్రాంతులై చూచుచుండిరి. ప్రభుత్వము వారొక్క శాసనోల్లంఘనమును మాత్రమే యెదుర్కొని దానినే యణచివేయలేదు. రాజకీయ జీవితమంతయు, ప్రజాహితైక కార్యములన్నియు నరికట్టబడెను. దీనికంతకును వ్యతిరేక

ముగ నొక్కకంఠమైనను లేవలేదు. ఈస్వాతంత్ర్యముల కొఱకు సాధారణముగ నిలిచినవారందరును సంగ్రామములోనే చిక్కుకొని యుండిరి. వారు ప్రభుత్వనిర్బంధములకు మోకరింప నిరాకరించినందులకు శిక్షలను స్వీకరించిరి. తక్కినవారు పూర్తిగ నణచివేయబడి నోరెత్తి విమర్శయైనను చేయజాలకుండిరి. ఎప్పుడైనను నిర్వీర్యమైన విమర్శ జరిగినయెడల నదిహీనస్వరముతో, క్షమార్పణధోరణిలోనుండెడిది. దానిని వెంటనేకాంగ్రెసు, పోరాటమును జరుపుచున్నవారు తీవ్రముగ ఖండించెడివారు. 

పాశ్చాత్య దేశములలో నాగరికస్వాతంత్ర్యములను సమర్థించునట్టి బలీయమైన ప్రజాభిప్రాయము నిర్మింపబడెను. వాటికేమాత్రము భంగముకలిగినను వ్యతిరేకము, ఆందోళన బయలుదేరును. (బహుశః యిప్పుడిది గతచరిత్ర) అచ్చట వాక్కు, వ్రాత, సభలు, సంస్థలు, ముద్రణాలయములు, వ్యక్తులు,—ఈయన్నింటి. స్వాతంత్ర్యములయెడలను తగినంతశ్రద్ధ తీసికొనువారనేకులు (తమంతతాము తీవ్రమైన ప్రత్యక్షకార్యాచరణకుదిగకపోయినను) కలరు. వారు నిరంతరము వాటికొఱకాందోళనచేయుచు వాటినాక్రమింపజూచు ప్రభుత్వ స్వభావము నరికట్టుటకు తోడ్పడుచుందురు. భారతలిబరలు పక్షమువారు బ్రిటిషు లిబరలుపక్ష సాంప్రదాయములను (పేరుతప్పవానితో వీరికెట్టి సామ్యమును లేకపోయినను) కొంతవరకు నిర్వహింతుమనిచెప్పెదరు. ఈ నాగరిక స్వాతంత్ర్యముల నణచివేయునప్పుడు వీరుతమ బుద్ధిబలముతో నేకొంతవ్యతిరేకమునో చూపెదరని యనుకొనబడును. ఏలనన దీనివలన తాముకూడ బాధపడిరి. కానివారట్టిపాపమును చేయలేదు! వోల్టేయరు మహాశయునివలె "మీరుచెప్పుదానితో నేనెంతమాత్రమును అంగీకరింపజాలను. కాని నాకంఠములో ప్రాణమున్నంతవరకును అట్లు చెప్పుటకు మీకుగలహక్కును నేను కాపాడెదను" అని వీరనజాలరు.

బహుశః దీనికి వీరిని మూపించుట యుక్తముకాదు. ఏలనన వీరెప్పుడును ప్రజాస్వామికమును, స్వేచ్ఛను, కాపాడుటకు నిలిచినవారు కారు. నోటినుండి యేమాత్రపు తూలుమాట వచ్చినను కష్టములలో పడత్రోయునట్టి స్థితిని వారెదుర్కొనవలసి యుండెను. భారత దేశములోని నిర్బంధముల యెడల స్వేచ్ఛాదేవతయొక్క పురాతన ప్రియులైన బ్రిటిషు లిబరలు పక్షమువారును, బ్రిటిషు లేబరుపార్టీయొక్క నూతన సామ్యవాదులును నెట్టిదృష్టిని కలిగియుండిరో యోచించుటంతకంటె నెక్కువయుక్తము. వారు భారత రంగమును కొంతప్రశాంతచిత్తముతో (అది బాధాకరముగనున్నను) చూడగలిగిరి. మాన్చెస్టరు గార్డియను పత్రికా కరస్పాండెంటు చెప్పినట్లు "నిర్బంధము శాస్త్రయుక్తముగ ప్రయోగింపబడుచున్నది" అను విజయముకు వారుసంతృప్తులగుచుండుట యప్పుడప్పుడు విదితమగు చుండెను. ఈమధ్య బ్రిటిషుజాతీయప్రభుత్వము రాజద్రోహబిల్లు నొకదానిని చేయుటకు ప్రయత్నించిరి. దాని మీద ప్రచండమైన విమర్శ ముఖ్యముగా లిబరలు పక్షమునుండియు లేబరు పక్షమునుండియు బయలుదేరెను. ఆబిల్లు వాక్స్వాతంత్ర్యము నరికట్టుననియు, సర్చివారంటులనిచ్చుటకు మేజిస్ట్రేటులకధికారమునిచ్చుననియు విమర్శింపబడెను. ఈ విమర్శను వినినప్పుడెల్ల నాకు దానియందభిమానము కలిగెడిది. అప్పుడె నాకు భారతదేశముకూడ కాన్పించెడిది. అచ్చట నిత్యాచరణలోనున్న చట్టములు బ్రిటిషు రాజద్రోహబిల్లు ప్రతిపాదింప నుద్దేశించిన దానికంటె నూరురెట్లు అధికముగా నున్నవి. ఇంగ్లండులో నొక్కనలుసునైనను యిముడ్చుకొనలేని బ్రిటిషువారు హిందూదేశములో కక్కుమనకుండ లొట్టలుపెట్టుచుకూడ నెట్లు దిగమ్రింగగలరో నాకాశ్చర్యముగ నుండెడిది. తమ భౌతికప్రయోజనముల కవసరమైనట్లు తమనైతిక ప్రమాణములను మార్చుకొనగల బ్రిటిషుప్రజల యద్భుతయుక్తి నాకెప్పుడును ఆశ్చర్యమును, మెప్పును కలిగించెడిది. వారి సామ్రాజ్యయత్నములకు దోహదమునిచ్చు ప్రతిదాని

యందును వారికి సుగుణము కాన్పించును. స్వేచ్ఛను, ప్రజాస్వామిక మును ముట్టడించుచున్నారను విశ్వాసముతోను, ధార్మికాగ్రహము తోను వారు హిట్లరు, ముస్సోలినీలను ఖండింతురు. అట్టి విశ్వాసము తోనే హిందూదేశములో నట్టిదాపులును, స్వాతంత్ర్యము నూడ బెరుకుటయు నవసరమని వారుభావింతురు. తమ ప్రయోజనరహిత మైన యథార్థపరివర్తనమే వీని యావశ్యకతను కోరుచున్నదని చూపు టకు వారత్యుత్తమ నైతికకారణములను తెలిపెదరు.

హిందూదేశము నంతను దవానల మావరించి యుండ స్త్రీ, పురుషులగ్నిపరీక్షకు గురియగుచుండ వేలకొలది మైళ్ళ దూరములో నున్న లండనులో హిందూదేశమునకు చట్టములను తయారు చేయుటకు కొందఱు దేవతలు సమకూడిరి. 1932 లో మూడవ రౌండుటేబిలు సభయు, ననేక కమిటీసభలును జరిగెను. అసంబ్లీలోని చాలమంది సభ్యులు యీకమిటీ సభలలో సభ్యత్వము కొఱకు గేలమువేసుకొని కూర్చొనిరి. వారీవిధముగ ప్రజాధర్మ నిర్వహణమును, వ్యక్తిగతానంద మును మిశ్రితముచేయజూచిరి. ప్రజలఖర్చుమీద నొకదండా బయలు దేరివెళ్ళెను. తరువాత 1933 లో భారత అస్సెసరులతో గూడిన జాయింటు కమిటీ వచ్చెను. సాక్షులుగా వెళ్ళినవారికి యుదారులైన ప్రభుత్వమువారు తిరిగి యుచితటిక్కెట్టుల నిచ్చిరి. హిందూమాతను సేవించుట కతిశ్రద్ధాళువులై ప్రజలఖర్చులమీద తిరిగి చాలమంది సము ద్రములనుదాటిరి. కొంతమంది యెక్కువ దారిఖర్చులు రావలెనని కూడ బేరములాడిరని చెప్పబడెను.

హిందూదేశములో ప్రజోద్యమము లాచరణలోనికి వచ్చుటను చూచి భయపడిన స్వప్రయోజనములకు ప్రతినిధులైన వీరు బ్రిటీషు సామ్రాజ్యాధిపత్యముక్రింద లండనులో సమావేశమగుటలో నాశ్చ ర్యమేమియునులేదు. కాని దేశమాత దీనతో జీవించుటయూ నశించు

టయూ యనునట్టి సంకుల సంగ్రామములోనుండ నే భారతీయులైన
నిట్లు పరివర్తించుట మాలోనున్న జాతీయతను పొడిచినట్లయ్యెను.
కాని యొకదృష్టిలో మాలో చాలమందికది మంచిదిగనే కాన్పించెను.
అది భారతదేశములోనున్న యభివృద్ధికోరు వర్గమువారిని, యభివృద్ధి
నరికట్టువారిని శాశ్వతముగ వేరుపరచెనని (పొరపాటుగనని యిప్పుడు
తోచుచున్నది) యనుకొంటిమి. ఈవడపోత ప్రజలకు రాజకీయ ప్రబో
ధమును కలిగించుట కెంతయో సహాయపడును. ఒక్క స్వాతంత్ర్యము
మూలముననే మనము సాంఘికసమస్యల నెదుర్కొన గలమనియు,
ప్రజలభారములను తగ్గింపగలమనియు నిది మరింత స్పష్టముచేయగలదు.

కాని వీరు భారతప్రజలనుండి తమ నిత్య జీవితములలోనేగాక
నైతికముగను, మానసికముగను నెంతదూరమయిరో కనుగొనుట చాల
యాశ్చర్యకరముగ నుండును. వీరికి వారితో నెట్టిసంబంధములును లేవు.
వారినిగాని, త్యాగములకును, బాధలకును వారిని ప్రోత్సహించుచున్న
వారి యాంతరంగిక ప్రబోధమునుగాని వీరర్థము చేసికొనలేరు. వే
న్నికగనిన యీరాజకీయ ధురంధరులకు సత్యమంతయు నొక్కచోట
మూర్తీభవించి యుండును. బ్రిటిషు సామ్రాజ్యశక్తి నెవరును జయప్రద
ముగ నెదుర్కొనజాలరు. కనుక దానిని యిష్టమైనను, అయిష్టము
నను అంగీకరింపకతప్పదు. ఇదియే వారి వేదాంతము; సత్యము; భారత
సమస్యను పరిష్కరించుటగాని, సచేతనమగు యథార్థచట్టమును నిర్మిం
చుటగాని ప్రజల యామోదములేనిదే జరుగుట యసంభవ మను
సంగతి వారికి తట్టినట్లు కాన్పించదు. స్పెండరుగారు 'మనకాలపు క్లిష్ట
చరిత్ర' అను పుస్తకములో చట్టసంబంధమైన విషమస్థితి నంతమొం
దించుటకు 1910 లో జరిగిన ఐరిషుజాయింటు కాన్ఫరెన్సుయొక్క విఫ
లతను గురించి యుదహరించెను. సంకటసమయ మధ్యమున చట్టమును
నిర్మించుటకు ప్రయత్నించు రాజకీయ నాయకశిఖామణులు తగులబడు

చున్న కొంపను భీమా చేయించుటకు ప్రయత్నించు యోధులవంటి వారని యతడనెను. 1932, 1933 లలో భారతదేశములో బయలు దేరిన దవానలము 1910 లో ఐర్లండులో రేగిన దానికంటె చాల గొప్పది; జ్వాలలు ఆరిపోయినను ముందుముందు నిప్పులు భారత స్వాతంత్ర్యేచ్ఛారూపమున చల్లార్చుటకు శక్యముగాకుండ నుష్ణముగ చిరకాల ముండియుండును.

భారతదేశమున నధికారులలో దౌర్జన్యతత్త్వ మద్భుతముగ పెరిగెను. ఈ సాంప్రదాయము పురాతనమైనది; బ్రిటిషువారు యీ దేశమును ప్రధానముగ పోలీసు రాజ్యముగనే పాలించు చుండిరి. నాగరిక పరిపాలకునియొక్క అధికార పూరితమగు దృష్టికూడ సైనికదృష్టియే; శత్రుసైన్యము, జయింపబడిన శత్రుభూమిని ఆక్రమించు కొనునట్టివాసన యెప్పుడునుకలదు. ప్రస్తుత ప్రభుత్వవిధానమునుసవాలు చేయుటచే నీమానసికస్థితి వర్ధిల్లెను. వంగదేశములోను, తదితరచోట్లను అప్పుడప్పుడుజరుగు టెర్రరిస్టుచర్యలు యీ యధికార దౌర్జన్యమునకు దోహదము నిచ్చెను. అవి యధికారచర్యలలో కొంత న్యాయము కల దనుకొనుటకు కారణమయ్యెను. వివిధములైన ఆర్డినెన్సులును, ప్రభుత్వ నీతియు కార్యనిర్వాహక వర్గమువారికిని, పోలీసులకును అద్భుతమైన యధికారమును యిచ్చుటచేత భారతదేశము ఆచరణలో పోలీసు రాజ్య మయ్యెను. దీనిని ఖండించు వారెవరునులేరు.

హెచ్చుతగ్గుస్థాయిలలో భారతదేశములోని రాష్ట్రములన్ని యు నీభయంకర నిర్బంధాగ్నిని యనుభవించెను; కాని సరిహద్దురాష్ట్ర మును, వంగదేశమును యెక్కువగా బాధపడెను. సరిహద్దురాష్ట్ర మెప్పుడును ప్రధానముగా సైనికప్రాంతముగనే యుండి యర్ధసైనిక రెగ్యులేషనులక్రింద పాలింప బడుచుండెను. దానియొక్కస్థితి రాజకీయ ముగ ముఖ్యమైనది. 'యర్రచొక్కాల' యుద్యమము ప్రభుత్వమువారిని

పూర్తిగ తారుమారుచేసెను. రాష్ట్రమును ‘శాంతపరచుటకును’ ‘తిరుగబడిన గ్రామముల’ నణచుటకును సైనికదళములు విరివిగ నుపయోగింపబడెను. హిందూదేశ మంతటను గ్రామముల మధ్య అప్పుడప్పుడు (వంగదేశములో) పట్టణముల మీదను మొత్తముగా చెల్లించవలసిన పెద్దజుల్మానాలను విధించుట సామాన్య యాచారముగనుండెను. తఱచుశిక్షకొరకేర్పడినపోలీసులను పెట్టుచుండెడివారు; పెద్దపెద్ద యధికారములీయబడి, పయిమందలింపులు లేనప్పుడు పోలీసులు మితిమీరి ప్రవర్తించుట విధాయకము. లా ఆర్డరుల పేరిట లా ఆర్డరులు భంగపరుపబడిన చక్కని యుదాహరణము లెన్నియో కలవు.

వంగదేశములోని కొన్నిభాగములు అసామాన్యదృశ్యమును ప్రదర్శించెను. ప్రభుత్వమువారు ప్రజలను యావత్తుమందిని (లేక నిక్కచ్చిగా హిందువులనందరను) శత్రువులవలె జూచిరి. ప్రతివాడు స్త్రీ, పురుషుడు, పన్నెండు సంవత్సరములు లగాయతు యిరువదియైదేండ్ల వరకుగల బాల, బాలిక లందరును తమగుర్తులను తెలుపునట్టి కార్డుల నుంచుకొనవలెను. ఒకచోటునుండి బయటకు పోకూడదనియు, బయటనుండి యొకచోటకు రాకూడదనియు ననేకమందిపై ప్రవాసశిక్షలు విధింపబడెను. దుస్తులను ధరించుటలో నియమముల నేర్పరచిరి. పాఠశాలలకు నియమముల నేర్పరచిరి; లేదా మూసివేసిరి. సైకిళ్లు పనికిరావనిరి. పోలీసువారికి రాకపోకలను తెలుపవలె ననిరి. రాత్రిచట్టము, సాయంకాలచట్టము, సైన్యములను నడుపుట, ప్యూనిటివు పోలీసులు, మొత్తముమీద జుల్మానాలను విధించుట-యింకను అనేకనియమములు స్థాపింపబడెను. పెద్దపెద్దప్రాంతములు నిరంతరమైన ముట్టడిలోనున్నట్లు కాన్పించెను. ఈయద్భుతములగు నియమములును, చట్టములును, బ్రిటిషు ప్రభుత్వ దృష్టిలో నవసరములో ననవసరములో నేనుచెప్పజాలను. అవి యవసరము కానియెడల పెద్దపెద్ద ప్రాంతములలోనున్న

పరిజలందరిని బాధపెట్టి, యవమానపరచి, గొప్పనష్టములను కలిగించి నందుల కాప్రభుత్వము విపరీత నేరమును చేసినట్లు భావింపబడవలెను. అవి యవసరమేమైననవో నిశ్చయముగ భారతదేశములోని బ్రిటిషుపరి పాలన మీద నదియే తుదితీర్పు కాగలదు.

దౌర్జన్యతత్వము జయిళ్ళలోకూడ మనప్రజలను వెంటనంటెను. ఖయిదీలను తరగతులుగ విభజించుట యొకబూటకము. అదితఱుచు పైతరగతులలో నుంచబడినవారికి కంటకముగ నుండెడిది. చాలకొద్ది మంది యీపైతరగతులలో నుండెడివారు. అనేకమంది యభిమాన ధనులైన స్త్రీ, పురుషులు నిరంతర బాధ జనకములైన పరిస్థితులకు లొంగవలసియుండెను; మామూలు ఖయిదీలస్థితికంటె రాజకీయ ఖయి దీలస్థితిని యధమాధమమొనరించుటకు ప్రభుత్వము బుద్ధిపూర్వకముగ తలపెట్టినట్లు కాన్పించును. జయిళ్ళ యినస్పెక్టరు జనరలు గారొకరు శాసనోల్లంఘన ఖయిదీలను "క్రూరముగా చూడవలెను" అనునొక రహస్య సర్క్యులరును అన్నిజయిళ్ళకును పంపించెను. కొరడాదెబ్బలు జయిలుశిక్షలలో తఱచుగా జరుగునొకశిక్షయయ్యెను. 1933 ఏప్రిల్ 27 వ తేదీని భారతదేశ ఉపకార్యదర్శిగారు కామన్సుసభలో మాట్లా డుచు "1932 లో శాసనోల్లంఘన నేరములకు భారతదేశములో 500 మందికి పయిగా కొరడాదెబ్బలు విధింపబడెనను సంగతిసర్ సామ్యుయల్ హోరుగారు యెరుగుదురు" అనిచెప్పెను. జయిలు నియమముల నుల్లం ఘించిరను కారణమున జయిలులో విధింపబడిన యనేక కొరడా శిక్షలు యీసంఖ్యలో జేర్చబడినవోలేదో స్పష్టపరుప బడలేదు. 1932 లో జయిలులోనున్నపుడు కొరడాదెబ్బల శిక్షలు తఱచు వినబడుచుండగా 1930 డిసెంబరులో జరిగిన యొకటిరెండు కొరడాశిక్షలను మేము నిర సించుటయు, మూడుదినములుపవసించుటయు నాకు జ్ఞప్తికివచ్చెను. నేనప్పుడు దానిలోనున్న పశుత్వమునకు నిర్విణ్ణుడనైతిని; నేనిప్పుడు

యింకనునిర్విణ్ణుడనై లోపల నొకవిధమగు బాధననుభవించితిని. కాని దానిని నిరసింపవలెననియు, నేను తిరిగి యుపవసింపవలెననియు నాకునట్లు లేదు. ఈవిషయములో నేను మరింత యసహాయుడ ననుకొంటిని. కొంచెముకాలము గడచుటతోడనే మనస్సు మొద్దుబారి పరిస్థితిని సహించును. చెడ్డవస్తువు ప్రపంచములో కొంతకాలము నిలిచిన చాలును; ప్రపంచము దానికలవడిపోవును.

జయిళ్ళలో పురుషులకు అతికఠినమైన పని - యంత్రములు, సూనెగానుగలు మొదలగునవి యివ్వబడెను. ప్రభుత్వమునకు క్షమార్పణ చెప్పుకొని, వారితమూలముగ వారిసియిచ్చి విడుదల యగునట్లు వారిని ప్రోత్సహించుటకు వారిస్థితి యతి దుర్భరముగ చేయబడెను. జయిలుఅధికారుల కదిరొుక గొప్పవిజయముగ భావింపబడెను.

ఈజయిలు శిక్షలు చాలవరకు అవమానములను నిర్బంధములను సహింప తిరస్కరించిన బాలురమీదను, యువకులమీదను పడెను. వారందరును అత్యుత్సాహవంతులైన బాలురు; ఆత్మగౌరవము, సాహసము, పటుత్వము గలవారు. ఇట్టివారు యింగ్లండులోని పబ్లికు పాఠశాలలలోను, విశ్వవిద్యాలయములలోను అత్యంతప్రోత్సాహమును, మెప్పును పొందియుండెడివారు. ఇచ్చట హిందూదేశములో వారి యౌవనాదర్శములును, అభిమానధనమును వారికి సంకెలలను, యేకాంతవాసములను కొరడాదెబ్బలను తెచ్చిపెట్టెను.

జయిళ్లలో మన స్త్రీలస్థితి యతి కఠినముగను, చింతించిన కొలది బాధకరముగను నుండెను. వారు చాలవరకు మధ్యతరగతివారు; ఇంటి పట్టున నుండుట కలవడినవారు. తన లాభముకొరకు పురుషునిచే పరిపాలింపబడుచున్న సంఘముచేత సృష్టింపబడిన యనేక నిర్బంధముల నుండియు, నాచారములనుండియు వారు బాధపడుచుండిరి. స్వాతంత్ర్య యాహ్వానమును వారెప్పుడును రెండు విధముల నర్థము చేసికొందురు.

సంగ్రామములో వారుచూపిన యుత్సాహము, శక్తి యపారము. వీటి వెనుక నస్పష్టముగను, నిద్రాణముగనునున్నను, గృహదాస్యమునుండి విముక్తులుకావలెనను తీవ్రమైన కోరికగలదు. కొద్దిమంది తప్ప వీరందరును మామూలు ఖయిదీల తరగతిలోనేయుండిరి. వీరు అతిసీతిబాహ్యులైన ఖయిదీలమధ్య తఱచు భయంకరమైన పరిస్థితులలో నుంచబడిరి. ఒకసారి నేను స్త్రీలయావరణ ప్రక్కనున్న యొక కొట్టారులోనుంటిని. ఒకగోడ మాకడ్డముగ నుండెను. ఆ యావరణలో నితరఖయిదీలమధ్య కొందరు స్త్రీరాజకీయ ఖయిదీలుకలరు. వారిలో నా కొకసారి యాతిథ్యము నిచ్చిన స్త్రీ యుండెను. ఒకపెద్దగోడ మాకడ్డముగా నున్నను స్త్రీఖయిదీ వార్డరులు మన స్నేహితురాండ్రపయి నుపయోగించుచున్న భాష, తిట్టులు నాకు కర్ణకఠోరముగ వినిపించుచుండెను.

1932–1933 లలో రాజకీయ ఖయిదీల యాదరణ రెండువత్సరముల క్రిందట 1930 లో చూపబడిన దానికంటె నధమముగనుండెను. ఇది కేవలము యధికారుల వ్యక్తిగత యిష్టాయిష్టములచేత సంభవించినదికాదు. ఇది ప్రభుత్వమువారు బుద్ధిపూర్వకముగ నవలంబించిన నీతి. రాజకీయఖయిదీల విషయమట్లుండ ఆరోజులలో యు. పి. రాష్ట్రజయిలుశాఖ దయారస వాసననైనను భరింపజాలదనుకీర్తిని గడించెను. ఈ సందర్భములో ననిర్వాద్యమైన యొక తావునుండి మనకొక చక్కని యుదాహరణము వచ్చెను. జయిళ్ళను సందర్శించు గొప్పహోదాగల పెద్ద యుద్యోగియొకడు 'వీర' బిరుదాంకితుడు (మావలె తిరుగుబాటుదారుడు కాడు. రాజద్రోహమును పురిగొల్పువాడు కాడు.) ప్రభుత్వమువే నతిప్రీతితో గౌరవింపబడినవాడు జయిలులో మమ్మొకసారి చూడ వచ్చెను. కొన్నినెలల క్రిందట నతడు మరియొక జయిలునుగూర్చి తన తనిఖీనివేదికలో దాని జయిలరు "దయగలిగిన క్రమపాలనా దక్షుడు" అని వ్రాసెనని చెప్పెను. ఆ జయిలరు తన దయారసమును గురించి

యేమియు నుదహరింపవలదని యతనిని బ్రతిమాలుకొనెనట. అధికారుల దృష్టిలో దయకు స్థానములేదని యతడుచెప్పెనట. తనవన్నవలన సతని కేట్టి యపకారమును కలుగజాలదని భావించుటచేత నా 'పీడడు' అది యుండవలెనని పట్టుపట్టెను. ఫలితము: వెంటనే యా జయిలరు మెచ్చ టనో మారుమూలనున్న యొక జయిలుకు విసరి వేయబడెను. అది యతని కొకశిక్షక్రింద విధింపబడెను.

భయంకరులును, యేపనిచేయుటకును వెరువనివారును నగు కొందఱు జయిలకులకు బిరుదులను ప్రమోషనులను యిచ్చిరి. అక్రమ ముగా నితరులసొత్తును కొట్టివేయుట జయిలులో సర్వసాధారణమగుటచే దీనిని చేయనివారతి స్వల్పముగనుండురు. కాని నా స్వంత యనుభవ మును, నా స్నేహితుల యనుభవమునుకూడ నియమములను కఠినముగ పాలించువారివలె నటించువారే యీ విషయములో నధమాధములగు దోషులని చూపుచున్నవి.

జయిలులోను బయటనుగూడ నేను అదృష్టవంతుడను. నాతో సంపర్కము కలిగిన ప్రతివాడును నన్ను మర్యాదగను గౌరవముగను (నేను వారికిష్టుడను కానప్పుడుకూడ) చూచెను. జయిలులో నొక్క విషయముమాత్రము నాకును, మాబంధుజనులకును చాలకష్టము కలిగిం చెను. మాతల్లియు, కమలయు, కుమార్తె ఇందిరయు నలహాబాదు జయిలులోనున్న మా బావమరదియైన రంజిత పండితుని చూడవెళ్ళిరి. వారేట్టి తప్పును చేయకపోయినను జయిలరు వారిని యగౌరవపరచి పైకిగెంటివేసెను. నేనీవిషయమును వినినపుడు చాల విచారించితిని. ఈ సందర్భములో రాష్ట్రప్రభుత్వమువారి చర్య నాకాశ్చర్యమును కలి గించెను. జయిలు ఆఫీసరులు మాతల్లి నవమాన పరుపకుండుటకు నేను బంధుదర్శనములను మానివేయుటకు నిశ్చయించితిని. థేరాడూను జయి లులో నేడుమాసముల వరకు నేను నాబంధువుల నెవరిని చూడలేదు.

---

## ౭౭.

## జయిలులో వివిధభావములు.

గోవిందవల్లభపంతును, నన్ను బెరిల్లీ జిల్లాజయిలునుండి డేరా డూను జయిలుకు మార్చిరి. ఉత్సనమేదేని జరుపబడవచ్చుననుభయముచే మమ్ము బెరిల్లీలో రైలునెక్కించుట మానివేసి యచ్చటకు యేబదిమైళ్ళదూరములోనున్న మాయమూలస్టేషనుకు రాత్రి రహస్యముగా నొక మోటారులో తీసికొనివెళ్ళిరి. నెలలకొలది యేకాంతవాసములోనున్న మాకా నిశీథ సీతవాత యానము హాయిగొల్పెను.

మేము బెరిల్లీజయిలు వీడుటకుపూర్వ మొకవిశేషము జరిగెను. అది నన్నపుడు కదల్చుటయేగాక నాకింకను జ్ఞప్తికివచ్చుచుండును. బెరిల్లీలో పోలీసుసూపరింటెండెంటు, ఒకఆంగ్లేయుడు, అచ్చటనుండెను. అతడు నేనుమోటారులోనెక్కుచుండ కొంచెముసిగ్గుతో బొమ్మలుగల పాతజర్మనుమేగజనులకట్ట నొకదానిని నాకిచ్చెను. నేనతనిని యంతకుమునుపెన్నడును కలుసుకొనలేదు; దీనితరువాత తిరిగి యతనిని చూడలేదు. నాకతనిపేరుగూడ తెలియదు. నేను జర్మనుభాష నేర్చుకొనుచున్నాననివిని యతడు నాకొఱకు వీటినిపట్టుకొని వచ్చితినని చెప్పెను. ఐచ్ఛికముగ నతడుచూపిన మర్యాదయు దానిని ప్రోత్సహించిన దయార్ద్రభావమును నన్ను స్పృశించెను. నేనతనియెడల కృతజ్ఞుడనైతిని.

ఆ నిశీథమందలి దీర్ఘప్రయాణములో నేను ఆంగ్లేయులకును భారతీయులకును, పాలకులకును పాలితులకును, అధికారులకును అనధికారులకును, అధికారులకును ఆజ్ఞలను శిరసావహింప వలసినవారికిని గలసంబంధమును గూర్చి యోచింప నారంభించితిని. ఈ రెండుజాతుల

కును మధ్యనెంతయంతరముగలదు. వారియుభయులమధ్య నెంతయవిశ్వాసము, అప్రేమ కలవు. అవిశ్వాసము అప్రేమలకంటె నొండొరులను గురించిన వారి యజ్ఞాన మెక్కుడుగనుండెను; ఈకారణముచే వారొకరిని చూచి యొకరుభయపడుచు నొకరిసమక్షమున నొకరు జాగరూకులుగ మెలగుచుందురు. ఒకరికొకరు కంటకులుగను ప్రేమరహితులుగను కాన్పించుచుందురు. ఈ తెరవాటుగున నౌచిత్యమును దయయు నున్న సంగతి యెరవుగను గుర్తింపరైరి. విశేష పోషకశక్తి కలిగిన దేశపరిపాలకులగుటచే నాంగ్లేయులు యుద్యోగములకొఱకు కతిపిచముగ వేటాడువారిని, సమయానుకూల స్వాహాపరులను చాలమందిని ఆకర్షించిరి!

ఈ యసహ్యకరమైన యుదాహరణములనుబట్టి వారు హిందూదేశమిట్టిదేయని నిర్ణయింతురు. భారతీయుడు యింగ్లీషువానిని (అధికారయంత్రస్వభావజన్యమగు నిర్దయతోను తనను రక్షించుకొనజూచు స్వప్రయోజనపరత్వమునకుండు ఆవేశముతోనుపనిచేయు) యుద్యోగిగ మాత్రమే చూచును. తన నిజభావములచే ప్రేరితుడై వ్యక్తిగతముగ పనిచేయునప్పుడుండు ప్రవర్తనకును నొక యధికారిగనో లేక నొకసైన్యములో నొకయంగముగనో పనిచేయునప్పుడుండు ప్రవర్తనకును నెంత భేదముకలదు!

'సిద్ధముకండు' అను కేక వినవచ్చుటతోడనే బరిబిసి సైనికుడు తనదయారసమును జారవిడిచి యంత్రమువలె పనిచేయుచు నిరపరాధులును నిరపాయులునునైన ప్రజలను కాల్చిచంపివేయును. అట్లే యేవ్యక్తికిని యపకారమునుచేయ సందేహించు పోలీసుయుద్యోగి, మరునాడు, నిరపరాధులగు ప్రజలపై లాఠీఛార్జిచేయ నాజ్ఞాపించును. అప్పుడతడు తననొక వ్యక్తిగ తలంపడు; తాను లాఠీఛార్జిచేయుచున్న లేక కాల్చునట్టి ప్రజాసమూహమును గూడ వ్యక్తులుగ తలంపడు.

మనము రెండవపక్షము నొకసమూహముక్రిందను గుంపుక్రిందను భావింప మొదలిడుటతోడనే మానవసంబంధము తెగిపోవునట్లు కాన్పించును. సమూహములుకూడ ప్రేమ, ద్వేష, బాధలననుభవించు స్త్రీలతోను పురుషులతోను, బిడ్డలతోను కూడుకొనియుండు ననుసంగతిని మనము మఱచిపోవుదుము. సామాన్య ఆంగ్లేయుడు, నిష్కపటియైనచో, తాను కొందఱు చక్కని భారతీయుల నెరుగుదునని యొప్పుకొనును. కానివారు తప్పబుట్టినవారు. మొత్తముమీద భారతీయులందఱును గర్హింపదగిన మూక. సామాన్యభారతీయుడు తానెరిగిన ఆంగ్లేయులు కొందఱు యోగ్యులని యొప్పుకొనును. కాని యీకొద్దిమందిని మినహాయించినచో తక్కినయాంగ్లేయులందరును అధికారధూర్వహులు, క్రూరులు చాలచెడ్డవారు. ప్రతివాడును యితరజాతిని తానెరిగిన వ్యక్తులనుబట్టిగాక తానెంతమాత్రము నెరుగనివారినిబట్టి విమర్శించుట చాల చోద్యముగనుండును.

నామట్టుకునేను చాలయదృష్టవంతుడను. నా దేశజులును యింగ్లీషువారునుగూడ నన్నెపుడును సమర్యాదగనే చూచెడివారు. నన్ను నిర్బంధించినట్టియు ఖయిదీగ నన్నొకచోటునుండి మరియొకచోటుకు గొంపోయినట్టియు పోలీసులు నాయెడల దయగలిగి యుండిరి. ఈ మానవస్పర్శచే జయిలుజీవితములోని కాఠిన్యతయు, సంఘర్షణలోని ద్వేషమును చాలవరకు తగ్గుచుండెను. నా దేశజులు నన్నట్లు గౌరవించుటలో నాశ్చర్యమేమియునులేదు. ఏలనన నాకువారిలో కొంతపలుకుబడియు, పేరుప్రఖ్యాతులును కలిగెను. ఆంగ్లేయులుగూడ సమూహములోనివానినిగ గాక నన్నొకవ్యక్తిగచూచిరి. నావిద్యాభ్యాసమును నేనుయింగ్లండులో పొందుటచేతను, ముఖ్యముగా నొక యింగ్లీషుపాఠశాలలో చదువుటచేతను నేనువారికి మరింతచేరిక యైతినని నేనూహించెదను. నారాజకీయ చర్యలెంతవికటముగ కాన్పించినను యీకారణ

ముచేత వారునన్ను తమపద్ధతులలో తయారయిన నాగరికునిగ భావింపక తప్పినదికాదు. నాస్థితిని చాలమంది సహచరులస్థితితో పోల్చి చూచుకొనినచో నాకుచూపబడు ప్రత్యేకాదరణమునకు తలచు నాకు మనోవ్యథయు చిన్నదనమును కలుగుచుండెడిది.

నాకిన్ని ప్రత్యేక సౌకర్యములున్నను జయిలు జయిలుగనే యుండెను. ఒక్కొక్కప్పుడు భారభూయిష్టమగు నావాతావరణము దుర్భరముగ నుండెడిది. అచ్చటివాయువే దౌర్జన్యము, నైచ్యము, అసత్యము, అక్రమసంపాదనలతో నిండియుండును; తిట్లకు లేక ప్రాథేయములకు కొఱతయుండదు. ఏమాత్రము అభిమానమున్న వాడైనను నిరంతరోద్రేకస్థితిలో నుండకతప్పదు. స్వల్పమగు సంభవములు మనుష్యులను తారుమారుచేయుచుండును. ఒకయుత్తరములోని చెడువార్తగాని వార్తాపత్రికలోని యొకవిషయముగాని కొంతకాలము క్రోధమునకు లేక విచారమునకు కారణమగును. బాహ్యప్రపంచమున కార్యనిమగ్నతలో నెప్పుడును సుఖము కలదు; అనేకవిధములగు కార్యములును, ప్రయోజనములును శారీరక మానసిక స్వాస్థ్యమును, శాంతిని చేకూర్చును. జయిలులో బయటకుపోవు మార్గములేవియు నుండకపోవుటచే సీసాలోబిగింపబడినట్లును నిర్బంధింపబడినట్లును భావింపబడును. ఇట్టిస్థితిలో విధాయకముగ పాక్షికబుద్ధియు, విషయములను వికలముగ సర్ధముచేసికొనుటయు సంభవించును. జయిలులో వ్యాధిగ్రస్తుడగుటకంటె కంటకము వేరొండుయుండబోదు.

అయినను జయిలులోని నిత్యకర్మలకు నేను చక్కగ నలవడితిని. నేను శరీర వ్యాయామముతోడను, యెక్కువ మానసిక కృషిచేతను స్వస్థచిత్తుడనైతిని. వ్యాయామమునకును, పనిపాటులకును బయట నెట్టి విలువయున్నను జయిలులోనవి చాలయవసరము; అవిలేనిచో కొంచెమించుమించు మతిపోవును. నేనొకకఠినమగు కాలపట్టిక ననుసరించెడి

వాడను. దానిని తప్పకుండుటకు నేను నామామూలు సమాచారములను, నిత్యక్షురకర్మ (నన్ను సేఫ్టీ రేజరు నుంచుకొనసనిచ్చిరి.) వంటివాటిని, చాల వరకు జరుపుకొనెడివాడను. నేనీస్వల్ప విషయము నుదహరింప వలసి వచ్చెను. ఏలనన మనవారు దీనిని మానివేసి దీనితో నితరవిషయముల యెడలగూడ మాంద్యులగుచుండిరి. పగలంతయు పాటుపడి పనిచేయు టచే రాత్రి నాకు హాయిగ నిద్రపట్టెడిది.

ఇట్లురోజులును, వారములును, నెలలును గడచిపోవుచుండెను. కానియొక్కొక్కప్పు డొకమాసము పెనుభూతమువలెనుండి చప్పున గడవదు; లేక గడవనట్లు కాన్పించును. ఒక్కొక్కప్పుడు నాకువిసుగు, వేసరిపాటు కలుగును. నాకందరియెడలను, అన్నింటియెడలను, జయిలు లోనున్న నాయెడల, సహచరులయెడల, జయిలు అధికారులయెడల, బయటనున్న ప్రజలోకపనిని చేయలేదనియో, చేసిరనియో వారి యెడల, బ్రిటిషుసామ్రాజ్యముయెడల, (కాని యీభావము శాశ్వత ముగ నుండెడిదికాదు) అందరికంటెను నాయెడలనే కోపముకలుగు చుండెడిది. నేను జయిలుజీవితముచే కలుగుచుండు వివిధ భావోద్రేక ములకు తావిచ్చు యుద్రేకముల పోవు నగుదును. అదృష్ట వశమున. నేనీయుద్రేకములనుండి త్వరితముగ స్వస్థతనొందెడివాడను.

జయిలులో బంధు, మిత్రదర్శనదినములు సుఖావహములైన దినములు. ఆహా! దినములను లెక్కించుకొనుచు వాటికొరకు మేమెట్లు వేచియుండెడివారము! ఆబంధుదర్శనోద్రేకము చల్లారినతోడనే తిరిగి యంతయు చప్పబడెడిది; మామూలుఒంటరితనము, శూన్యత తప్పెడివి కావు. ఒక్కొక్కప్పుడు తటస్థించునట్టిది జయప్రదముగనుండనిచో (నామనస్సును పాడుచేయు చెడువార్తచేతనో, లేక నితర కారణము చేతనో) తరువాత నేను దుఃఖపడెడివాడను. ఈసమయములలో జయిలు అధికారులుండెడివారు. కానిబెరిల్లీలో రెండుమూడుసారులు వీరికితోడు

రహస్యశాఖకు చెందినవాడొకడు కాగితము పెన్సిలుపుచ్చుకొని మేము మాట్లాడు ప్రతియక్షరమును వ్రాసికొనుచుండెను. ఇదినాకు చాలకోపమును కలిగించుటచే నిదిపూర్తిగ చెడిపోయెను.

అలహాబాదుజయిలులో నన్నుచూడవచ్చినపుడును, తరువాత ప్రభుత్వమువారిచేతను నాతల్లియెడలను భార్యయెడలను చూపబడిన యమర్యాదప్రవర్తనచే నేనువీటిని మానివేసితిని. సుమారుయేడునెలల వరకు నేనెవరినిదర్శించలేదు. ఆకాలము నాకు సంతోషరహితముగ కాన్పించెను.

నేను తిరిగి బంధుదర్శనము చేయుటకు నిశ్చయించినతరువాత మాబంధువులు నన్నుచూడవచ్చినపుడు నాకమితానందముకలిగెను. నాచెల్లెలియొక్క చిన్నబిడ్డలుకూడ నన్నుచూడవచ్చిరి. వారిలో కడసారిబిడ్డ నాభుజములమీది కెక్కగోరినపుడు (అదియామెకలవాటు) నేను యుద్రేకమును పట్టజాలకపోతిని. మానవస్పర్శాసంపదము నభిలషించుచుండిన నాకా గృహస్థజీవిత స్పర్శసుఖము విచారమును కలిగించెను.

బంధుదర్శనములను మానివేసినపుడు యింటివద్దనుండియు నితర జయిలునుండియు (మాచెల్లెండ్రిద్దరును జయిలులోనుండిరి) వచ్చునట్టి పాక్షికలేఖ లతి ప్రియము లగుచుండెను. మేము వాటికొర కాతురతతో నెదురుచూచుచుండెడివారము. అనుకొనిన రోజున యుత్తరమురానిచో నేను చాలబాధపడెడివాడను. అయినను అది వచ్చిన యెడల దానిని విప్పుటకు నేను సందేహించెడివాడను. ధృవమగు నానందముతో చెలగాటమాడునట్లు నేను దానితో నాడెడివాడను. ఆయుత్తరములో నాకు విచారమును కలిగించువార్తగాని, విషయముగాని, యుండునేమోయను భయముకూడ నుండెడిది. ఉత్తరములను వ్రాయుట, యుత్తరములను తీసికొనుట జయిలులోని ప్రశాంతజీవితమునకు నిశ్చల

స్థితికి భంగకరముగ నుండెడిది. అవిస్వాస్థ్యమును చెదరగొట్టునట్టి భావోద్రేకస్థితిని కలిగించెడివి. తరువాత నొకటి రెండు రోజులవరకు మనస్సు చెదరిపోవు చుండుటచే నిత్యకృత్యముల మీద ధ్యానముంచుట కష్టమయ్యెడిది.

నైనీజయిలులోను, బెరిల్లీలోను నాకు చాలమంది సహచరులుండెడివారు. ఢేరాడూనులో మొట్టమొదట మేము ముగ్గురమే-గోవింద వల్లభపంతు, కున్వరఆనందసింగు, నేను యుండెడివారము. కాని రెండునెల లయినతరువాత పంతుజీ యతనిశిక్షాకాలము పూర్తి యగుటతోడనే విడిచిపెట్టబడెను. తరువాత మమ్ము మరి యిద్దరు కలుసుకొనిరి.

1933 జనవరి ప్రారంభములో నా స్నేహితులందరును వెడలిపోవుటచే నేనొక్కడనే మిగిలితిని. సుమారు యెనిమిది నెలలవరకు, ఆగష్టు మాసాంతమున నేను విడుదలయగువరకు, ఢేరాడూను జయిలులో నేనొక్కడనే యుంటిని. జయిలు అధికారులు రోజుకే కొలదినిముషములో మాట్లాడుటతప్ప యిక నాతో మాటలాడువారెవరును కూడ నుండెడివారుకారు. ఇది పేరుకు ఏకాంతవాసముకాదు. కాని దానికి చాల చేరికయైనది. ఇదినాకు దుఃఖమయమగుకాలము. అదృష్టవశాత్తు నేను నాబంధుదర్శనములను తిరిగి ప్రారంభించుటచే నాకు కొంత యుపశాంతి కలుగుచుండెను; నేను బయటనుండి పువ్వులను, కొద్దిపటములను తెప్పించుకొనవచ్చుననిరి. అవి నాకెంతయో యానందమును చేకూర్చెడివి. మామూలుగ పటములను, పువ్వులను లోపలకు రానీయరు. అనేకసారులు నాకొఱకు పంపబడిన పువ్వులను నాకిచ్చుటకు నిరాకరించిరి. మాగదుల నలంకరించుకొనుటకు చేయు ప్రయత్నముల నెంతమాత్రమును ప్రోత్సహించెడివారుకారు. నాప్రక్క గదిలోనున్న నా సహచరుడొకడు తన యలంకార సామాగ్రిని యొక క్రమములో

నుంచుకొనగా నొకజయిలు సూపరింటెండెంటు దాని కభ్యంతరము చెప్పెను. తనగది నాకర్షవంతముగను, "భోగయోగ్యము" గను చేయ రాదని యతడు వారింపబడెను. ఆవిలాసవస్తువు లేవియనిన పండ్లుతోము కొను బ్రుషు, పండ్లపొడి, ఫౌంటెనుకలము, దానికి కావలసిన సిరా, తలనూనెసీసా, దువ్వెన, తలను సింగారించుకొను బ్రుషు, మరియొకటి రెండు చిన్నవస్తువులు.

జీవితములోని చిన్నచిన్న వస్తువులయొక్క విలువ జయిలులో బాగుగ గుర్తింపబడును. అచ్చట మనకుండు వస్తువు లతిస్వల్పము. వాటికి మరికొన్నిటిని జేర్చుకొనుటగాని, బదలీగా తెచ్చుకొనుటగాని సులభమైన విషయముగాదు. బయట ప్రపంచములో మనము పార వేయుచుండు చిన్నచిన్న వస్తువులనచ్చట ప్రాణప్రదముగ చూచు కొనెదము. విలువయైనవాటిని కలిగియుండుటకుగాని, యుంచుకొనుటకు గాని వీలులేనిచోటగూడ ఆస్తిని కలిగియుండవలెనను భావము మనలను వీడకుండును.

ఒక్కొక్కప్పుడు జీవితసుకుమార విషయములకొరకు శరీర సుఖము, హాయినిగొల్పు పరిసరములు, మిత్రబృందము, ప్రయోజన కరమగు సంభాషణ, పిల్లలతో నాడుకొనుట.........వీటికొఱకు శరీర మావేదనపడును. ఒకపటము లేక వార్తాపత్రికలోని యొకపేరా యావసమునాటి నిర్విచారదినములను కండ్లకు కట్టినట్లు జ్ఞప్తికి తెచ్చును. తోడనే యింటిమీద దృష్టిపోవును. ఆదినమంతయు చిరాకుగ నెట్లో గడపుట గగనమగును.

నేను ప్రతిదినము కొద్దిగవడికెడివాడను. దీనివలన నాకు సుఖ మగు శరీరకష్టము కొంతప్రాప్తించెడిది. మానసిక పరిశ్రమకు కొంత విరామముగ నుండెడిది. కాని వ్రాసికొనుట, చదువుకొనుట నాకు ప్రధానవృత్తిగనుండెను. నిర్బంధములును, తణిఖీచేయుటయు నుండుటచే

నాకు కావలసిన పుస్తకములన్నియు లభించెడివికావు. తణిఖీచేయుట కెల్లప్పుడును సమర్థులైనవా రుండెడివారుకారు. పైశీర్షిక ఉపద్రవకరముగను, రాజద్రోహకరముగను కాన్పించుచున్నదని స్పెంగ్లరుయొక్క- "పాశ్చాత్యుల పతనము" అను పుస్తకమునుఆపివేసిరి. కాని మొత్తముమీద నాకనేకరకముల పుస్తకములీయబడుటచే నేనెట్టిఫిర్యాదునుచేయరాదు. నాయెడల ప్రత్యేకాభిమానము చూపబడినట్లు కాన్పించును. నా సహచరులు చాలమందికి ("ఎ" తరగతిఖయిదీలు) వర్తమానపరిస్థితులను గురించినపుస్తకములు దొరుకుటతిదుర్ఘటమయ్యెడిది. బ్రిటిషుప్రభుత్వము వారిచట్టసంబంధమైన మార్పులనుసూచించు అధికారశ్వేతపత్రముకూడ (రాజకీయవిషయములందులో గలవను కారణముచేత) కాశీజయిలులో నిరాకరింపబడెనని నాకుచెప్పబడెను. మతపుస్తకములను లేక నవలలను మాత్రమే బ్రిటిషు అధికారులు హృదయపూర్వకముగ శిఫారసుచేసెడివారు. మతవిషయము బ్రిటిషుప్రభుత్వ హృదయమున కెంతప్రియమైనది! అదియెంత నిష్పాక్షికముగ నాముద్రగలసమస్తమును ప్రోత్సహించును!

భారతదేశములో మామూలు నాగరిక స్వాతంత్ర్యములే త్రుంచివేయబడుచుండ ఖయిదీల హక్కులను గురించి మాట్లాడుట యసమంజసమగును. అయినను యీవిషయము యోచింపదగినది. కోర్టువారిచే శిక్షింపబడినంత మాత్రముచేత నొకనిశరీరమేగాక మనస్సుకూడ నిర్బంధింపబడవలెనను న్యాయమెచ్చట కలదు? ఖయిదీల శరీరములు నిర్బంధింపబడినను వారి మనస్సులు స్వేచ్ఛగనుండగూడదా? భారతదేశములోని జయిలు పరిపాలనాధికారు లిట్టి ప్రశ్నను వినినప్పుడు నిర్ఘాంతపోయెదరు. ఏలనన నూతనభావములకును యోగ్యమగు యోచనలను చేయుటకును వారిశక్తి యత్యల్పము. పుస్తకములను తణిఖీచేయుపద్ధతి యేకాలమందును మంచిదికాదు. అది పక్షపాతయుతముగను బుద్ధిహీన

ముగనునుండును. భారతదేశములోనది మనకాధునిక సాహిత్యమును పురోభివృద్ధిలోనున్న పత్రికలను జర్నలులను లేకుండచేయును. నిషేధింపబడిన పుస్తకముల సంఖ్య యతివిస్తారముగ నుండుటయేగాక నది నిత్యాభివృద్ధియగుచుండును. వీటికితోడు ఖయిదీకి రెండవతరగతి (ప్రత్యేకతరగతి) యుండుటచే నతడుబయట న్యాయముగకొని చదువుకొనుటకవకాశముగల యనేక పుస్తకములను వార్తాపత్రికలను చదువుకొనుటకు వీలుండదు.

న్యూయార్కులోని సింగుసింగు జయిలులో కొంతకాలము క్రిందట కొన్ని కమ్యూనిష్టు పత్రికలను నిషేధించుటచే నీసమస్య చర్చకువచ్చెను. అమెరికాలోని పాలకజాతులలో కమ్యూనిష్టులపై వ్యతిరేకభావ మతితీవ్రముగ నుండెను. అయినప్పటికిని జయిలులోనున్నవారు తమకుకావలసిన యే పుస్తకమునైనను కమ్యూనిష్టు వార్తాపత్రికలు మేగజినులుసహా తెప్పించుకొనుటకు జయిలు అధికారులొప్పుకొనిరి. జయిలువార్డెను ఉద్రేకమును కలిగించునని తలంచి కార్టూనులను మాత్రమే పనికిరాదనెను.

అధికసంఖ్యాకులగు ఖయిదీలకెట్టి వార్తాపత్రికలను గాని వ్రాతసౌకర్యములనుగాని కలుగనీయని భారతదేశములో ఖయిదీలకు మానసిక స్వాతంత్ర్యముండవలెనను సమస్యను చర్చించుట కొంచెము పరిహాసాస్పదముగనుండును. ఇదిసంపూర్ణనిరాకరణముగాని తరగతికాదు. ఒక్క 'ఏ' క్లాసు ఖయిదీ (వంగదేశములో I డివిజను) కి వ్రాతసౌకర్యములను కలిగింతురు. వీరందరికైనను దినపత్రికల నీయరు. ఇవ్వబడుపత్రిక ప్రభుత్వమువారికిష్టమైన దినపత్రికయే యివ్వబడును. 'బి' 'సి' తరగతుల ఖయిదీలకు, రాజకీయఖయిదీలకైననుతదితరులకైనను, వ్రాతసౌకర్యములుండవు. ఒకొక్కప్పుడు వీరిలో మొదటివారికివి యతిప్రత్యేక సౌకర్యములుగ ప్రసాదింపబడి తరుచులాగివేయబడుచుండును; వేయింటి

కొక్కడు 'ఏ' తరగతి ఖయిదీ యుండును. భారతదేశఖయిదీల దుస్థితిని గురించి యోచించునప్పుడు వీరిని మినహాయింపవచ్చును. కానియిట్లభిమానింపబడు 'ఏ' తరగతి ఖయిదీకి పుస్తకములు వార్తాపత్రికలు సందర్భములోనీయబడు సౌకర్యములు నాగరిక దేశములలో సామాన్యఖయిదీల కీయబడువాటికంటె చాలతక్కువయని గుర్తింపవలెను.

వేయింటతక్కన 999 మందిని ఒక్కొక్కసారి రెండుమూడు పుస్తకముల నుంచుకొననిచ్చెదరు. కాని వారీసౌకర్యము నెల్లప్పుడును పొందజాలని షరతులుండును. వ్రాసికొనుటలేక చదివిన పుస్తకముల నుండి నోట్సుతీసికొనుట యుపచ్రవకరములగు వినోదములు; వారట్టి భోగములలో మునుగరాదు. మానసికాభివృద్ధి నీవిధముగ బుద్ధిపూర్వకముగ నిరుత్సాహపరచుట చోద్యము; ఇది యథార్థమును విదితము చేయుచునేయున్నది. ఖయిదీని సంస్కరించుటకును అతనిని యోగ్యమగు నాగరికుని చేయుటకును అతనిమనస్సును గ్రహించవలెను; దానిని సరియగు మార్గమునకు త్రిప్పవలెను. అతనికిచదువుచెప్పి యేదోయొక వృత్తిని నేర్పవలెను. కాని భారతదేశములోని జయిలు అధికారుల కీవిషయము, యీ దృష్టి బహుశః గోచరించదు; యు. పి. రాష్ట్రములో నిశ్చయముగ నిట్టిదేదియు కానరాదు. జయిలులోనున్న పిల్లలకును, యువకులకును చదువను, వ్రాయను నేర్పుటకు నవీనముగ కొన్ని ప్రయత్నములు చేయబడెను. కానియవిపూర్తిగ నిరర్థకములు. ఆపనికి నియోగింపబడినవారు సమర్థులుకారు. ఖయిదీలకు చదువుకొనుట యనిన గిట్టదని యొక్కొక్కప్పుడు చెప్పబడును; కాని నాయనుభవము దీనికి కేవలము వ్యతిరేకము. దీనికొఱకు చాలమంది నాదగ్గఱకువచ్చుచుండిరి. చదువుకొనుటకును, వ్రాసికొనుటకును వారిలో సంపూర్ణమగు నుత్సాహము కాన్పించెడిది. మాదగ్గరకువచ్చిన ఖయిదీలకు మేము చదువు చెప్పెడివారము. వారుకష్టపడి పనిచేసెడివారు. ఒక్కొక్క

ప్పుడు నేను నిశీథమందు మేల్కాంచినప్పుడు వారిలో నొకరిద్దరు తమ కొటారులో నొకగుడ్డిలాంతరు దగ్గరకూర్చుని చదువుకొనుచుండుటను చూచి యాశ్చర్యపడెడివాడను. వారు మరునాటి పాఠమును తయారగు చుండెడివారు.

నేను నా పుస్తకములలో మునిగియుండి యొకరకము పుస్తకములనుండి మరియొక రకము పుస్తకములకు పోవుచుండెడివాడను. కాని మామూలుగ 'కఠినమగు' పుస్తకములనే చదువుచుండెడివాడను. నవలలు మానసిక మాంద్యమును కలుగజేయును. నేను వాటిని యెక్కువగ చదువలేదు. ఒక్కొక్కప్పుడెక్కువగ చదువుటచే నేను విసుగుచెంది వ్రాయుట ప్రారంభించెడివాడను. నాక మాత్రకు నేను వ్రాసిన చారిత్రికలేఖలు నా రెండుసంవత్సరముల శిక్షకాలమునకు నాకు సరిపడిన వృత్తినికలిగించి, నా మానసిక స్వాస్థ్యమునకెంతయో తోడ్పడెను. నేను వ్రాయుచుండిన భూతకాలచరిత్రలో కొంతవరకు జీవించుచు నేను నా జయిలు పరిసరములను కొంచెమించుమించు మరచిపోతిని.

పురాణయాత్రికుల గ్రంథములు-హ్యూయెన్‌త్సాంగు, మార్కోపోలో, ఇబిన్‌బటూటా మొదలగువారి గ్రంథములును, ఆధునికులగు స్వెన్‌హెడిన్, (మధ్యయాసియా యెడారులలోని యతనియాత్రలు) రోరిక్కు (టిబెటులోని యతనియద్భుత సాహసములు) మొదలగువారి గ్రంథములును యెప్పుడును సత్కరింపబడుచుండెను. చిత్రములుగల పుస్తకములుకూడ, ముఖ్యముగ పర్వతములు, మంచుదిబ్బలు, యెడారులు గలవి, యాహ్వానింపబడుచుండెను; ఏలనన జయిలులో విశాలసీమల కొఱకు, సముద్రములకొఱకు, పర్వతములకొఱకు పరితపించుచుందుము. నావద్ద ఆల్ప్స్, క్లాంకు, హిమాలయపర్వతముల సుందరమైన చిత్రములుగల పుస్తకములు కొన్నియుండెడివి. నాగదియొక్క యుష్ణత 115 ఫారన్‌హీట్ యున్నపుడు నేను తఱచు యీపటములనుతీసి మంచు

దిబ్బలను తదేకదృష్టితో చూచుచుండెడివాడను. అట్లాసు (దేశములనుచూపు చిత్రములుగల పుస్తకము) మంచిహుషారును పుట్టించెడిది. అవి యన్నివిధములగు భూత కాలచరిత్రలను జ్ఞప్తికితెచ్చుచుండెడిది. మేముచూచిన దేశములనుగురించిన కలలు, చూడదలచుకొనిన ప్రాంతములను గురించిన కలలు వచ్చుచుండెడివి. వెనుకటి రోజులలో తిరిగిన యాత్ర దేశములను చూడవలెననుకోరిక - గొప్పగొప్ప పట్టణములను సూచించు నితర మార్కులను, చుక్కలను, పర్వతములనుసూచించు రంగులుగల ప్రాంతములను, సముద్రములనుసూచించు పచ్చనిసీమలను, ప్రపంచములోని శృంగారవిశేషములను, నిరంతరము మారిపోవుచున్న మానవలోకముయొక్క పోరాటములను, సంఘర్షణలను పరీక్షింపవలెనను - నిట్టి యనేక కోరికలుద్భవించి మమ్మావహించెడివి. ఇంతలో మేము తొందరగ, సవిచారముగ అట్లాసునుముడిచివేసి, మమ్మావరించి యుండిన మా మామూలుగోడలకును, దైనందినము మాపాలబడునట్టి నిర్వీర్య నిత్యకర్మకును బూనుకొనెడివారము.

---

# ౪౮

## జయిలులోని జంతువులు.



నేను డేరాడూను జయిలులోని నాగదిలో పదునాలుగుమాసముల పదిహేనురోజులు నివసించుటచే కొంచెమించుమించు దానిలో నొక భాగమయిపోయినట్లు భావింపనారంభించితిని. అందులోనున్న ప్రతిభాగముతోను నాకుపరిచయము కలిగెను. వెల్లవేయబడిన యా గోడలమీదను, నునుపుగాలేని నేలమీదనుగల ప్రతిచిహ్నమును, మిట్టపల్లములును, చెదతినివేసిన దూలములతోనున్న పయికప్పుభాగమును నాకుబాగుగ తెలియును. బయటనున్న చిన్నదొడ్డిలోగల చిన్నచిన్న పచ్చికసీమలను, అందముకొఱకు అమర్చబడిన రాతిముక్కలనునేను ప్రాతస్నేహితులవలె చూచుకొను చుండెడివాడను. నాగదిలో నేనొక్కడనేకాక నాతో కందిరీగలయొక్కయు, తుమ్మెదలయొక్కయు గుంపులనేకములుండెను; దూలములవెనుక ననేకబల్లులు నివసించుచు సాయంత్రమాహారముకొఱకు బయటకు వచ్చుచుండెడివి. ఆలోచనలును, భావములును భౌతిక పరిసరములలో తమచిహ్నములను విడిచిపెట్టునెడల నాగదిలోని వాయువుకూడ వాటిచేపూరింప బడియుండును; అవి యాచిన్న ప్రదేశములోనున్న ప్రతివస్తువును పట్టుకొని యుండును.

ఇతరజయిళ్ళలో నాకు మంచిగదులే యుండెడివి; కాని డేరాడూనులో నాకొక యమూల్యమగు సౌకర్యముండెడిది. ప్రధానజయిలు భాగము చాలచిన్నది; జయిలుగోడల వెలుపలనున్న యొకపాత కొట్టులో (జయిలు ఆవరణలోనే) మమ్ము పెట్టిరి. మేమందులో తిరుగుట కెంతమాత్రమును చోటులేకపోవుటచే ఉదయసాయంత్రములయందు

గుమ్మముముందర నొక పందగజముల దూరము మమ్ము నడువనిచ్చెదరు. మేము జయిలు కాంపౌండులోనే యున్నను గోడలనుదాటి బయటకు వచ్చుటచే కొంతదూరములోనున్న పర్వతములను, పొలములను, బహిరంగరోడ్డును చూడగలిగెడివారము. ఇది నాకొసంగబడిన ప్రత్యేక సౌకర్యముకాదు; ఢేరాడూను జయిలులో నుంచబడు 'ఎ' 'బి' తరగతి ఖయిదీలందఱకును నిదిసమముగ నుండెను. కాంపౌండులోనే జయిలు గోడలబయట యూరపియనులనుంచు మఱియొకచిన్న భవనముకలదు. దీనిచుట్టు ప్రత్యేకగోడలేమి, కనుక గదిలోనున్న మనిషి సుందరమగు పర్వతదృశ్యములను, బాహ్యజీవితమును అనుభవింపవచ్చును. ఇచ్చట నుంచబడు యూరపియను ఖయిదీలును తదితరులును కూడ జయిలు గుమ్మముముందర ప్రతియుదయ సాయంత్రములయందు నడువవచ్చును.

చిరకాల మెత్తైనగోడల వెనుకబంధింపబడిన ఖయిదీయే యీ విహారముల యొక్కయు, నీబహిరంగ దృశ్యములయొక్కయు నసామాన్య యాధ్యాత్మిక విలువను గ్రహింపగలడు. ఈవిహారములను నేనెంతయో ప్రేమించుటచే వర్షకాలములోకూడ, నిరంతరధారాపాతమున్నను, చీలమండలలోతు నీళ్ళలో నేనునడచి పోవుచుండెడివాడను. ఇట్టి విహారములను నేనెచ్చటనైనను యనుభవించెడివాడను; కానిప్రక్కనున్న మహత్తరమగు హిమాలయపర్వత దృశ్యము నానంతోషమును ద్విగుణముచేసి జయిలుఖేదము నపనయించుటకు చాలవరకు తోడ్పడెను. ఎట్టిబంధు దర్శనములునులేక నొంటరిగనున్న యాదీర్ఘకాలములోనే నెక్కువగా ప్రేమించిన యీపర్వతములను వీక్షించుచుండగలుగుట నాభాగ్యము. నాగదిలోనుండి నేను వాటిని చూడజాలను, కాని నాహృదయము వాటిచేనిండియుండెను; అవి సమీపమున నున్నసంగతి నాకెప్పుడును జ్ఞప్తియందుండి మా మధ్యనొకరహస్య పరిచయమభివృద్ధియగుచున్నట్లుండెను.

"దూరమున గగన మార్గమున ఖేచరపంక్తు లెగిరి పోవుచుండెను; ఒకయేకైకనీల నీరదశ్రేణికూడ యాత్రచేయుచు చలచలజరిగిపోయెను. వెనుకనున్న మహోన్నత చింగుటెంగు శిఖరముతో నేనొంటరిగ కూర్చొనెదను. మేమెన్నడును (ఆపర్వతమును నేనును) పరస్పరము విసుగుచెంది యెరుగము" అని లీప్రైపో యనునొకకవి వ్రాసెను. అతని వలె పర్వతముతోగూడ నెప్పుడును విసుగుచెందలేదని నేనుచెప్పజాలను; కాని యాయనుభవ మసామాన్యమైనది. దాని సాన్నిధ్యము నాకానందమును కలుగచేసెను. దానినిశ్చలత, దానిస్థైర్యము లక్షలకొలది సంవత్సరముల యనుభవజ్ఞానముతో సన్నుతిలకించుచు నాచంచల భావముల నెగతాళిచేయుచు నాక్లేశపూరితమనస్సు నుపశమింప జేయుచుండెను.

ధేరాడూనులో వసంతకాలమతి ముదావహముగ నుండును; క్రిందమైదానములలో నుండుదానికంటె నది యిచ్చట హెచ్చుకాల ముండును. శీతకాలము చెట్లయాకులనన్నింటిని రాల్చివేసి మోడులను చేసెను. జయిలుద్వారముముందరనున్న నాలుగు మహోన్నత యశ్వత్థ వృక్షములుకూడ కొంచెమించుమించు తమయాకుల నన్నింటిని రాల్చి వేయుట నాకెంతయో యాశ్చర్యమును కలిగించెను. అవి బక్కచిక్కి, సంతోషముడక్కి వసంతకాల ప్రాణవాయువులు తిరిగి వాటికుత్సాహముగొల్పి, వాటియంతర్నాడులకు జీవితసందేశమును పంపువరకు నట్లే నిలిచియుండెను. అకస్మాత్తుగ నారావులలోను, తదితర చెట్లలోను చైతన్యముద్భవిల్లెను; తెరమఱుగున జరుగు రహస్యక్రియా విశేషములవలె వానినొకరహస్య వాతావరణ మావరించెను; వాని యన్నిభాగములనుండియు పచ్చందనము తొంగిచూచుచుండుటనుచూచి నేనాశ్చర్యచకితుడనైతిని. అదృశ్యము సంతోషోత్సాహ జనకముగ నుండెను. ఇంతలో నతివేగముగ లక్షలుపదిలక్షలుకొలదిగ లేతయా

కులు సూర్యరశ్మిలో తళతళ ప్రకాశించుచు పిల్లవాయువులతో కేళీసల్పు చుండును. చిగురు, వర్ణములలోపల కలుగు సకస్మాత్పరిణామ మెంత యద్భుతమైనది !

లేపూవిచిగురు, కాశ్మీరపర్వతములమీది శరత్కాల వర్ణముల వలె, చెంగావి వర్ణము కలిగియుండునని నేనంతకుమును పెన్నడును గ్రహించియుండలేదు. కాని వెంటనేరంగుమారి యది పచ్చబడును.

వేసవికాల తాపమును చల్లార్చునుగనుక ప్రావృట్కాల వర్షము లెప్పుడును హాయిగొల్పును. కానియతి యెందును పనికిరాదు; డేరా డూను వరుణదేవునకు ప్రియమైనప్రదేశము. వర్షఋతువు ప్రారంభ మైన మొదటి యైదారువారములలోను యేబదిలేక నరుపది యంగు ళముల వర్షము కురియును. కిటికీలనుండియు, పైకప్పునుండియు పడు వర్షధారలను తప్పించుకొనుటకు కాళ్ళుముడిచిపెట్టుకొని యేమూలనో కూర్చొనియుండుట సంతోషప్రదమైన విషయముకానేరదు.

శరత్కాలముకూడ సుఖముగనుండును; శీతకాలముకూడ, వర్షములేనిచో, నల్లీయుండును. ఉరుములు, వర్షము, గడగడలాడించు చలిగాలులు వెలునడునప్పుడు చక్కనిభవనము,సుఖము, తగినయుష్ణత యుండవలెనను కోరికపుట్టును. అప్పుడప్పుడు గోళిలకంటె పెద్దవియగు వడగండ్లు రేకుకప్పులమీద దబడదిబడ పడుచు ఫిరంగిమోతవలె నట్టహాసముచేయును.

ముఖ్యముగా నాకొక్కదినము జ్ఞప్తియందున్నది; అది 1932 డిసెంబరు యిరువదినాలుగవతేదీ. ఆదినమంతయు వడగండ్లవర్షము. వర్షముకురియుచు చలిమిక్కుటముగనుండెను. నేను జయిలులో గడ పిన దినములలో నది యతిదౌర్భాగ్యదినములలో (శరీరదృష్టిలో) నొకటియని చెప్పవలెను. సాయంకాల మకస్మాత్తుగ నదియంతయు తేలిపోయెను; దగ్గరనున్న పర్వతములును, గుట్టలును దట్టమగు

మంచుతో కప్పబడినదృశ్యమును చూచినప్పుడు నావిచారమంతయు పలాయనమయ్యెను. మరునాడు క్రిస్టమసు పండుగ నిర్మలముగను ఆనందదాయకముగను నుండెను.

మా మామూలువిధులను నెరవేర్చుకొనుటకాటంకపరుపబడుటచే మేము ప్రకృతిరహస్యముల నెక్కువగ పరీక్షించుచుంటిమి. మేము మాకు కాన్పించు వివిధజంతువులను పురుగులనుకూడ పరిశీలించుచుండెడివారము. నేను పరీక్షించుచుండినకొలది నాగదిలోను, బయట నున్న చిన్నదొడ్డిలోను అనేకరకములగు కీటకములను చూచుచుండెడివాడను. ఒంటరితనమునుగురించి నేనుఫిర్యాదుచేయుచుండినను శూన్యముగను యెడారివలెను కాన్పించిన మాదొడ్డి జీవరాసులతో నిండియున్నట్లు నేనుకనుగొంటిని. ప్రాకునట్టియు లేక నెగురునట్టియు నీకీటకములన్నియు నన్నెంతమాత్రమును బాధింపకుండ తమ జీవితమును గడపుకొనుచుండ నేనుకూడ వాటిజోలికిపోవుట యుక్తముకాదనుకొంటిని. కానినల్లులకును, దోమలకును, కొంతవరకు యీగలకును నాకునుమధ్య నిరంతరపోరాటము జరుగుచుండెడిది. నాగదిలో వందలకొలదిగనున్న కందిరీగలను తుమ్మెదలను నేను సహించితిని. ఒకకందిరీగ నన్నుకుట్టినప్పుడు (పొరపాటుచేతనని యనుకొనెదను.) మాకొక చిన్న సంగ్రామముజరిగెను. ఆకోపములో నేనాజాతినంతను నాశము చేయ ప్రయత్నించితిని. కాని యవి తమ తాత్కాలికాశ్రయమును (బహుశః అందులోననేకగుడ్లు యుండియుండవచ్చును.) కాపాడుకొనుటకు చెలరేగి ఘోరసంగ్రామమును సలిపెను. నేను లగ్గిపోయి యవియికనాజోలికి రాకపోయినచో వానిని సుఖముగ జీవింపనీయవచ్చునని నిశ్చయించుకొంటిని. తరువాత నేనచ్చట సుమారొకసంవత్సరము కందిరీగలతోడను, తుమ్మెదలతోడను నివసించితిని. అవి నాజోలికెన్నడును రాలేదు; మేము పరస్పరము గౌరవించుకొనెడివారము.

గబ్బిలములనిన నా కసహ్యము. అయినను నేను వానిని సహింప వలసివచ్చెను. సంజచీకటిలో నవి నిశ్శబ్దముగనెగురుచు విసీలాకాశము లోనికి పోవుచుండుటను చూచెడివాడను. అవి భూమితో సంబంధము లేని జంతువులు. అవియనిన నాకుభయము. అవిసరిగా ముఖమునకొక యంగుళముదూరమునుండి రంయిమని యెగిరిపోవుచుండును. అవి నా ముఖమును గీరునేమోయని నేనెప్పుడును భయపడెడివాడను. పెద్ద గబ్బిలములు చాలయెత్తున వాయువులో పోవుచుండెడివి.

నేనుచీమలను చెదను యితరకీటకములను గంటలకొలది పరీ క్షించుచుండెడివాడను. సాయంకాలము బల్లులు మెల్లగా పాకివచ్చి యాహారముకొఱకు కీటకములను వేటాడుచు తోకలనొక వింతవిధ ముగ నాడించుచు నొండొరులను తరుముకొనుచుండెను. సామాన్య ముగ నవి కందిరీగలజోలికిపోకుండెను. కాని యవి వాటినతిజాగ్రతతో వేటాడి ముందునుంచి పట్టుకొనుటను నేనురెండుసార్లు చూచితిని. పట్టు బడకుండుట కవి యట్లు బుద్ధిపూర్వకముగ చేయునో లేక నవియాగంతుక సంభవములో నేను చెప్పజాలను.

ఉడుతలు; చెట్లుదగ్గరనున్నచో గుంపులు గుంపులుగ నుండెడివి. అవిచాలసాహసమును చూపుచు మాసమీపముకు వచ్చుచుండెడివి. లక్నోజయిలులో నేను కదలకుండకూర్చొని చాలసేపు చదువుకొను చుండ నొకయుడుత చఱచఱ నాకాలుమీదకెక్కి నామోకాలు మీద కూర్చుని సింహావలోకనము చేయును. తరువాతనది నాకండ్ల కేసిచూచి నేను చెట్టును(లేక నదియనుకొనిన మరియొక లేవయో) కా దనిగ్రహించెడిది. అప్పుడు భయమావహించుటచే నది పారిపోవును. ఒక్కొక్కప్పుడు యుడుతపిల్లలు చెట్లమీదనుండి క్రిందపడిపోవుచుం డును. వెంటనేతల్లి పరుగెత్తుకొనివచ్చి వాటినియుండక్రిందచుట్టి తీసికొని పోవును. అప్పుడప్పుడు పిల్లలు తప్పిపోవుచుండును. నా స్నేహితు

డొకడు తప్పిపోయిన పిల్లలను మూటినిపట్టుకొని పోషించెను. అవి చాలచిన్నవిగ నుండుటచే వాటిని పోషించుట మాకొక సమస్య యయ్యెను; చివరకొక చక్కని మార్గము దొరికెను. ఊటకలములో సిరాపోసికొను గాజుగొట్టముతో వాటికాహారము నిచ్చుటకేర్పాటు చేయబడెను.

నేనువెళ్ళిన యన్నిజయిళ్లలోను, ఒక్క ఆల్మోరాలో తప్ప, పిచ్చుక లసంఖ్యాకములుగ నుండెడివి. అవివేలకొలదిగయుండి సాయం కాలమగుసరికి యాకసమును కప్పివేయుచుండెను. ఒక్కొక్కప్పుడు జయిలు అధికారులు వాటిని తుపాకులతో కాల్చి చంపి యాహారముగ చేసికొనెడివారు. గోరువంకలు ప్రతిచోటను యుండెడివి. డేరాడూ నులో నాగదిగుమ్మముపయిన నొక దంపతి గూడుకట్టుకొని నివసించు చుండెను. నేను వాటికాహారము పెట్టెడివాడను. అవిచాల మచ్చిక పడెను. ఉదయ సాయంకాలములయందు వాటియాహారమున కే మాత్రము ప్రొద్దుపోయినను యవినాదగ్గరకూర్చుని బిగ్గరగా కేకలు వేయును. అవిచేయుసంజ్ఞలను పరీక్షించుచుండుటయు తాల్మిలేని వాని యరపులను వినుటయు వినోదకరముగ నుండును.

నైనీలో వేలకొలది రామచిలుకలుండెను; నాకొట్టుగుమ్మొక్క గోడలలోని కన్నములలో నవితెగలక్రింద నివసించుచుండెను. వాని యుపసర్పణ విధానము, ప్రణయచేష్టలు సదా మనోజ్ఞముగనుండును. ఒక్కొక్కప్పు డొక యాడుచిలుకకొఱకు రెండు మగచిలుకలు ఘోర సంగ్రామమును గావించుచుండ నాయాడుచిలుక ప్రక్కనతిశాంతముగ కూర్చుని యుద్ధములోజయించిన దానిపై తనప్రేమరసమును చిమ్ము టకు సన్నాహపడుచుండును.

డేరాడూను జయిలులో వివిధరకముల పక్షులు గలవు; వాని కలకలములు, కిలకిలలు, కూజితములు, కేకలు, కోయిలల గానములు-

వినసొంపుగ నుండును. వర్ష కాలములోను, కొంచెము తత్పూర్వమును, తీతువపిట్ట (బుద్ధిజాడ్యము గల పక్షి) వచ్చుచుండెడిది. దానికట్టిపేరు యెందుకు కలిగెనో నేను వెంటనే గ్రహించితిని. అది రాత్రియు, పగలును వర్షించుచున్నను, తీవ్రముగ నెండ కాయుచున్నను విరామములేకుండ నొక్కపాటనే పాడుచుండును. సాధారణముగ మేమీ పక్షులను చూడజాలకుంటిమి; వాటి ధ్వనులను మాత్రమే మేము విన గలిగెడివారము. కాని గ్రద్దలు, గరుడపక్షులు గగనమార్గమున నతి యొయ్యారముగ నెగిరిపోవుచుండ నేను వీక్షించు చుండెడివాడను. అవి యొక్కొక్కప్పుడు తటాలున క్రిందకు వ్రాలుచు తిరిగి పైకెగిరిపోవు చుండును. తఱచు యడవిపక్షుల గుంపు, మాతలమీదనుండి యెగిరి పోవుచుండును.

బెరెల్లీ జయిలులో నొక పెద్ద కోతులదండు కలదు. ఇక నవి చేయు చేష్టలకు హద్దులేదు. ఒక కథ నామనస్సుకు బాగుగ పట్టెను. ఒక చిన్నకోతిపిల్ల నాకొట్టుగల యావరణలోని కెట్లో వచ్చి తిరిగి యాగోడనెక్కి పోజాలకుండెను. జయిలు వార్డరును, కొంతమంది ఖయిదీ ఓవరుసీర్లును దానిని పట్టుకొని దానిమెడకొక త్రాడును కట్టిరి. దాని తలిదండ్రులు (కావచ్చును) యెత్తైన యాప్రాకారము పయినుండి యీకథనంతను చూచుచుండిరి. వాటికి హద్దులేని కోపము కలిగెను. అకస్మాత్తుగా వానిలో నొక పెద్దకోతి క్రిందకురికి యాపిల్లచుట్టు మూగిన మూక నెదుర్కొనెను. అది చాల యసామాన్యమైన ధైర్యమును చూపెను. ఏలనన వార్డరును, ఖయిదీ ఓవరుసీర్లును కర్రలను, లాఠీలను పుచ్చుకొని గిరగిర త్రిప్పుచుండిరి. పయిగ వారనేక మంది యుండిరి. చివరకు దానివెనుదిరుగని ధైర్యసాహసములే దిగ్విజయము నొందెను. భయభ్రాంతులై కర్రలను వెనుక పారవేసి యామూకవ మూక పిక్కబలమును చూపెను. కోతిపిల్ల తన స్వజనమును చేరు కొనెను.

మేమెంత మాత్రము నాహ్వానించజాలని జంతుపక్షికగణము మమ్ము తఱచు చూడవచ్చుచుండెను. మా గదులలో వృశ్చికములకు కొదువలేదు. ముఖ్యముగ వర్షము పడినతరువాత నవి చెలరేగుచుండెడివి. కాని నన్నెప్పుడును యవి కుట్టజాలకపోవుట యాశ్చర్యముగ నుండును. వానికి వీలులేనిచోట్ల మేము తారసించుట సంభవించెడిది. నాపరుపుమీదనో లేక పుస్తకముమీదనో యవి జేరుచుండెను. నేనొకసారి యొక నల్లటి విషపుతేలును కొంతకాల మొక సీసాలోనుంచి చిన్న చిన్న యీగల నాహారముగ నిడెడివాడను. తరువాత దానికొక త్రాడుకట్టి యొకగోడకు వ్రేలాడగట్టగా నది యెట్లో పారిపోయెను. అది తిరిగి విచ్చలవిడిగా తిరుగునేమో యను భయముచే నేను నాగది నంతను శుభ్రముగా తుడిచి దాని కొఱకెంతో వేటాడినను నాకది దొరకలేదు.

నాగదులలోను వాని సమీపమునను నాకు రెండు మూడు పాములు కూడ కాన్పించెను. ఒక పామును గురించిన వార్త పయికిపొక్కెను; తోడనే యది పత్రికాశీర్షికలలో గాన్పించెను. ఈ వినోదమును నేనానందించితిని. జయిలుజీవితము నిస్సారముగ నుండును. గనుక దీనిని భేదించున దేదియైనను సంతోషదాయకముగ నుండెడిది. పాములను నేను మెచ్చుకొనెదననిగాని, వానిని నేనాహ్వానము చేసెదననిగాని దీని యర్థముకాదు. కొంతమంది భయపడునట్లు నేను వాటిని చూచి భయపడను. వాటికాటుకు నేను భయపడి పామును చూచినచో నన్ను రక్షించుకొనజూచుట నిజము. కాని పామునెడ యేహ్యతగాని, విపరీతభీతికాని నాకులేదు. పురికొసపురుగనిన నాకంతకంటె నెక్కువ భయము. అదియనిన భయముకంటె సహజముగు యేవగింపు మెక్కువ. కలకత్తాలోని అలిపూరుజయిలులో నర్ధరాత్రివేళ లేచినా కాలుమీద నేదియో పాకుచున్నట్లు తెలిసికొంటిని. నాదగ్గరనున్న టార్చిలైటును నొక్కిచూడగా నాపరుపుమీద నొకపురికొస కాన్పించెను.

అప్రయత్నముగనే నద్భుతభయమున యాపరుపుమీదనుండి గదిగోడకు తగులునట్లు రివ్వున వ్రాలితిని.

డేరాడూనులో నేనొక క్రొత్తజంతువును చూచితిని, లేక నాపట్టునకది క్రొత్తజంతువు. నేను జయిలుద్వారమువద్ద నిలచి జయిలరుతో మాట్లాడుచుండ బయటనొక మనిషి యొకక్రొత్త జంతువును తీసికొని వెళ్లుచుండెను. జయిలరు వానిని పిలిపించెను; అప్పుడు నేనతని చేతిలో బల్లికిని మొసలికిని మధ్యరకములోనున్న రెండడుగుల జంతువును చూచితిని. దానియొడలునిండ పొలుసులును, కాళ్ళకు పంజాలును గలవు. బ్రతికియున్న యీవికారపుజంతువు గుండ్రముగ నొకవింత చుట్టవలె చుట్టబడెను. దానియజమాని యాచుట్టగుండనొక కర్రను పోనిచ్చి దానినతిహుషారుగ మోసికొనిపోవుచుండెను. అతడుదానిని "బో" యని పిలిచెను. జయిలరు "దానిని నీవేమిచేతు"వని ప్రశ్నించినపుడతడు పకపక నవ్వుచు "బజ్జి" (యొకవిధమగుకూర) చేసికొనెద"నని బదులుచెప్పెను. అతడొక యాటవికుడు. తరువాత నేను ఛాంపి యను రయొక్క "సూర్యరశ్మిలోను, చీకటిలోనుగాన్పించు యరణ్యము" అనుపుస్తకమును చదివి యిది యుడుము అని తెలిసికొంటిని.

ఖయిదీలు, ముఖ్యముగా దీర్ఘకాలశిక్ష ననుభవించు ఖయిదీలు, యెట్టివినోదములును లేక బాధపడుచుందురు. తఱచు వారేపెంపుడు జంతువునో చేరదీసి దానితో చెలగాటమాడుచు కొంతయుపశాంతిని పొందుచుందురు. మామూలు ఖయిదీలకట్టి సావకాశము లేదుకాని, ఖయిదీఓవరుసీర్లకు కొంత స్వేచ్ఛగలదు. సామాన్యముగ జయిలు అధికారులు వారికభ్యంతరము చెప్పరు. ఉడుతల నతిసామాన్యముగ పెంచుచుందురు; ముంగిస మఱియొక పెంపుడుజంతువు. జయిలులో కుక్కలను రానీయరుకాని పిల్లులను ప్రోత్సహించునట్లు కాన్పించెను. ఒకసారియొక పిల్లిపిల్ల నాతో చెలిమి చేసికొనెను. అదియొక జయిలు అధి

కారణమగుటచే నతడు బదిలీయగుటతోడనే యదికూడ లేకపోయెను. అది లేకపోవుట నాకుకొంతతగినుండెను. కుక్కలకు తావులేకపోయినను ఢేరాడూను జయిలులో నాకుకొన్ని కుక్కలతో తలవనితలంపుగ బంధముకలిగెను. ఒకజయిలు అధికారి యొక్క ఆడకుక్కను తెచ్చెను. అతడు బదిలీయైనప్పుడు దానినివిడిచి వెడలిపోయెను. పాపము దానికొక నివాసములేక, యిల్లువాకిలిలేక తూములక్రింద నివసించుచు వార్డరులు పారవేయు రొట్టెముక్కలను తినుచు తిరుగుచుండెను; అది సామాన్యముగ తిండిలేక మాడుచుండెను. నన్ను ప్రధానజయిలుబయట నున్న కొట్టులోనుంచుటచే నదితిండికొరకు నాదగ్గరకు వచ్చెడిది. నేను దానికి విడువకుండ తిండిపెట్టెడివాడను. అదియొకతూముక్రింద కొన్ని కూనలనుపెట్టెను. వీనిలోకొన్నిటి నెవరో తీసికొనిపోయిరి. మూడు మాత్రముమిగిలెను; నేనువాటికి తిండిపెట్టెడివాడను. అందులోనొక దానికి చాలజబ్బుచేసి వెర్రికోపముతో కొట్టుకొనుచుండెను. నేను దానితో చాలబాధపడితిని. నేనుదానికతి జాగ్రత్తతో సేవచేయుచు నొక్కొక్కప్పుడు రాత్రిపదిపన్నెండుసార్లులేచి దానిని చూచుచుండెడి వాడను. చివరకది బ్రతుకుటచే నాచికిత్సవలన నది తేరుకొనెనని నేను సంతోషించితిని.

బయట నున్నప్పటికంటె జయిలులోనుండగనే నాకుజంతువులతో నెక్కువ సంబంధము కలిగెను. కుక్కలనిన నాకెప్పుడును ప్రీతిగనేయుండుటచే నేనుకొన్నిటిని పెంచెడివాడను; కాని నాకితర పనులుండుటచే వానిని తగుశ్రద్ధతో చూచుటకు వీలులేకపోయెడిది. జయిలులో వాటిసావాసమునకు నేనెంతయు కృతజ్ఞుడనైతిని. సాధారణముగ హిందువులు తమయిండ్లలో జంతువులను పెంచుటకొప్పుకొనరు. భూతదయ కలిగియుండవలెనని వారివేదాంతమెంత బోధించుచుండినను తఱచు వారతి నిర్లక్ష్యముగను, జంతువులయెడల క్రూరముగను

నుందురు. చాలమంది హిందువులచే నతిఘనముగ చూడబడుచు పూజింపబడునట్టి గోవుకూడ (కొట్లాటలకు తఱచుయిదియే కారణ మగుచున్నది) దయతో చూడబడుటలేదు. దయయు పూజచేయు టయు నెల్లప్పుడును కలిసియుండనేరవు.

తమతృష్ణలను, లేక తమప్రవర్తనను తెలుపుచిహ్నములుగ వివిధదేశములు వివిధజంతువులను కలిగియున్నవి-అమెరికా సంయుక్త రాష్ట్రములకును, జర్మనీకిని గరుత్మంతుడు; యింగ్లండుకు సింహము. వేటకుక్క; ఫ్రాన్సుకుకోడిపుంజు; పాతరష్యాదేశముకు యెలుగుగొడ్డు. ఈ యభిమాన మృగములు జాతీయశీలము నెంతవరకు పోతపోయును? ఇవి చాలవరకు ధూర్తస్వభావము కలవి. జగడముకు కాలు దువ్వునవి, మృగములను వేటాడితినునట్టి భూతములు. ఈసాదృశ్యములను ఆదర్శ ముగ నుంచుకొని పెరుగునట్టిమనుష్యులు బుద్ధిపూర్వకముగ నారీతుల నవలంబించి, ధూర్తస్వభావమును చూపుటలోను సింహగర్జనలను చేయుటలోను, యితరులను భక్షించుటలోను ఆశ్చర్యమేమియున్నది? హిందూదేశస్థుడు శాంతముగను ద్వేషరహితముగను నుండుటలోను ఆశ్చర్యములేదు; ఏలనన గోవుఅతనియభిమానమృగమయ్యెను.

---

# ౪౬

## పోరాటము.



బయట పోరాటము సాగుచునేయుండెను; ఇప్పట్లోలేక తగినంత సమీపములో తాముజయమును పొందజాలరని యెఱిగియున్నను ధైర్య సాహసములుగల స్త్రీపురుషులనేకమంది వ్రేళ్ళుపాతుకొని, అతిశక్తి వంతముగనున్న ప్రభుత్వమును శాంతముగ ధిక్కరించుచునేయుండిరి. ఎట్టివిరామమునులేకుండ దినదినాభివృద్ధియగుచున్న నిర్బంధపరంపరలు భారతదేశములోని బ్రిటిషుప్రభుత్వ పునాదులు దేనిమీద నిర్మింప బడెనో విదితముచేయుచుండెను. ఇప్పుడీ విషయములో నట్టివంచన యును లేకపోవుటచే నిదిమాకుకొంత తృప్తినిచ్చెను. తుపాకులు, సన్నీలు విజయవంతములయ్యెను. కానియొక గొప్ప యోధుడొకసారి "నీవుతుపాకులతో, సన్నీలతో నేమిచేసినను చేయవచ్చునుకాని వాని మీదమాత్రము కూర్చొనరాదు" అని చెప్పెను. మహాత్ముల నమ్మి కొని యాధ్యాత్మిక వ్యభిచారమున కొడబడుటకంటె మేమీవిధముగ పాలింపబడుటయే మంచిదనుకొంటిమి. జయిళ్ళలో మేము భౌతికముగ నసహాయులముగ నుంటిమి. కానిమేమచ్చటకూడ మాయుద్యమమునే సేవించినట్లు భావించితిమి; బయటనున్న చాలమందికంటె బాగుగ కూడ దానిని సేవించితిమి. మాదుర్బలత్వముచే మమ్ము రక్షించుకొను నుద్దేశ్యముతో భారతదేశ భవిష్యత్తును నాశముచేయవలసినదేనా? మానవ శక్తిసంపదలు, మానవబలము కొద్దిపరిమితగలవియను సంగతి నిజమే! చాలమంది వికలాంగులైరి; చాలమంది చనిపోయిరి; చాల మంది వెనుకకుతగ్గిరి; అనేకమంది యుద్యమమునకు ద్రోహముకూడ చేసిరి. కానియెన్ని యవాంతరములు కలిగినను యుద్యమము సాగు చునేయుండెను. ఆదర్శములు మలినముకాక స్పష్టముగనుండి, యుత్సా

హము మొక్కవోకుండయున్నచో నపజయము కలుగజాలదు. మన సూత్రమును, సిద్ధాంతమును విడిచిపెట్టుటయు, మనహక్కును జారవిడుచుటయు, నవమానమునకు మర్యాదహీనముగ లొంగిపోవుటయు నిజమైన యపజయమగును. శత్రువుచే కలుగచేయబడు గాయములకంటె స్వయంకృతములగు గాయములు బాగుపడుట కెక్కువకాలము పట్టును.

తఱచు మాదుర్బలత్వములపట్లను, తప్పుమార్గమున పోవుచున్న ప్రపంచముపట్లను కొంతవిసుగుదల కలిగెడిది. అయినను మేముసాధింపగలిగినదానికి కొంతగర్వముకూడ నుండెడిది. ఏలనన మాప్రజలు వీరులవలె ప్రవర్తించిరి; వీరగణములో మనముకూడ సభ్యులమని భావించుకొనుట యుత్తమలక్షణము.

ఆశాసనోల్లంఘన దినములలో బహిరంగి కాంగ్రెసు సభలను జరుపుటకొకసారి ఢిల్లీలోను, మరియొకసారి కలకత్తాలోను రెండు ప్రయత్నములు జరిగెను. ఒకయక్రమసంస్థ నిరాటంకముగను, ప్రశాంతముగను కలుసుకొనజాలదని విదితమగుచునే యున్నది; అట్టి ప్రయత్నము విధాయికముగ పోలీసులతో జగడమును తెచ్చిపెట్టును. పోలీసులు ఆసభలను లాఠీల సహాయముతో బలవంతముగ చెదరగొట్టి, యనేకమంది ప్రజలను నిర్బంధించిరి. ఈయక్రమ సభలకు భారతదేశమంతటనుండియు వేలకొలదిజనులు ప్రతినిధులుగవచ్చుట యొకయసాధారణవిషయము. ఈరెండు సభలలోను యు. పి. రాష్ట్రములోనిప్రజలు ప్రధానభాగమునువహించిరని విని నేను సంతసించితిని. 1933 మార్చి మాసాంతరమున మాతల్లికూడ కలకత్తాసభలకు వెళ్ళెదనని పట్టుబట్టెను. ఆమె కలకత్తాకు పోవుచుండ మార్గమధ్యమున మాలవ్యాజీగారితదితరులతోను నిర్బంధింపబడి అసన్‌సోలుజయిలులో కొద్దిరోజులుంచబడెను. దుర్బలముగనుండి బాధపడుచున్నను యామె

చూపిన యుత్సాహశక్తులకు నేనెంతయు నాశ్చర్యపడితిని. జయిలనిన యామెకొక లెక్కకాదు; ఆమె యంతకంటె నెక్కువ యగ్నిపరీక్ష నిచ్చెను. ఆమె యేకైకపుత్రుఁడును కుమార్తె లిద్దరును ఆమెప్రేమించి యితరులును జయిళ్ళలో దీర్ఘకాలశిక్షల ననుభవించుచుండ నామె నివసించు యాశూన్యభవనమామెకు గుండెనెప్పులు కలిగించు చుండెను.

మాయుద్యమము తగ్గి తక్కువస్థాయిలో నెమ్మదిగా సాగుచు (మధ్యమధ్య నెప్పుడో తప్ప) నెట్టియుద్రేకమును లేకయుండెను. నాభావములు యెక్కువగ నితరదేశముల మీదకు పోవుచుండెను. జయిలులో నాకవకాశమున్నంతవరకు నార్థికమాంద్యగ్రస్తమైన ప్రపంచముయొక్కదుస్థితిని నేనువీక్షించుచు నవగాహనము చేసికొనుచుంటిని. ఆవిషయమును గురించి నాకు దొరికిన పుస్తకములన్నింటిని నేను చదివితిని; చదివినకొలది నాకు దానియందు కుతూహలము హెచ్చుచుండెను. తన సమస్యలు, తన పోరాటములుగల హిందూదేశము జాతీయముగను, అంతర్జాతీయముగను రాజకీయముగను ఆర్థికముగను సర్వత్రజరుగుచున్న పోరాటములో, నద్భుతజగన్నాటకములో నొక చిన్నభాగమయ్యెను. ఆపోరాటములో నాయభిమాన మంతకంతకెక్కువగ కమ్యూనిస్టులవైపు మొగ్గుచుండెను.

చిరకాలము క్రిందటనే సామ్యవాద కమ్యూనిజములు నన్నాకర్షించెను. రషియాయెడల నా కభిమానము కలిగెను. సోవియటు రషియాలో ననేక విషయములు—వ్యతిరేకాభిప్రాయమును నిర్దాక్షిణ్యముగ నలిమివేయుట, దేశమునంతను సైన్యమయముచేయుట, వివిధ పోలసీలను నిర్వహించుటకు చేయబడిన యనవసర దౌర్జన్యము—ఈ యన్నింటిని నే నంగీకరింపజాలను. కానిపెట్టుబడిదారుల ప్రపంచములో దౌర్జన్యమునకును నిర్బంధములకును కొదవలేదు. దౌర్జన్యమే ధనార్జన

చేయు సంఘముయొక్కయు ఆస్తియొక్కయు మూలము, పునాది యని
నేనంతకంతకు గ్రహించితిని. దౌర్జన్యములేనిదే యది యనేకరోజులు
నిలువజాలదు. ఆకలిచిచ్చు ప్రతిచోటను ప్రజాబాహుళ్యమును సదా
కొద్దిమంది (వారి లాభముకొరకును, వైభవాదుల కొరకును) యిచ్ఛకు
లొంగదీయుచున్నపుడు రాజకీయస్వాతంత్ర్యము వలన ప్రయోజన
మేమియునుండదు.

రెండుచోట్లను దౌర్జన్యము సమముగనే యుండెను. కాని పెట్టు
బడిదారుల దౌర్జన్యమావిధానముకుస్వతస్సిద్ధమైనట్లుకాన్పించును. రషి
యాయొక్క దౌర్జన్యము చెడ్డదేయైనను, పరస్పరసహకారముమీదను శాం
తిమీదనుఆధారపడునొక చక్కనిక్రమమును, ప్రజాసామాన్యమునకు
నిజమైనస్వేచ్ఛ నిచ్చుటయుదానిలక్ష్యమైయుండెను. సోవియటురషియా
యెన్నితప్పులు చేసినను, యసంఖ్యాకములగు కష్టములనుతరించి యీ
క్రొత్తక్రమమునవైపు చాలయడుగులనువేసెను. తక్కిన ప్రపంచమం
తయు నార్థికమాంద్యముచే నలిగిపోవుచు ననేకవిధముల వెనుకకు
పోవుచుండ, సోవియటుదేశము మనకండ్లయెదుటనే యొకమహా
ద్భుత నవీనప్రపంచము నిర్మింపబడుచుండెను. లెనినుమహాశయుని
యనుసరించుచు రషియాభావికాలముకొరకు చూచుచు నికముందుండ
వలసిన క్రమమును గురించిమాత్రమే యోచించుచుండెను. ఇతరదేశ
ములు నిర్వీర్యమైన భూతకాల క్రమముక్రింద చేష్టలుదక్కియుండి,
గతయుగమునాటి నిరర్థక, నిష్ప్రయోజక శిథిలసంస్థలను రక్షించు
టకు తమశక్తులనన్నింటిని వ్యయముచేయుచుండెను. ప్రధానముగ,
మధ్యఆసియాలో చాలవెనుకబడియున్న ప్రాంతములు సోవియటు
ప్రభుత్వముక్రింద పొందిన గొప్ప యభివృద్ధినిగురించిన నివేదికలు
నన్నెంతయో మెప్పించెను. కనుకనీతూకములో నేనుపూర్తిగరషియా
దేశము పక్షిమానించితిని. అంధకారబంధురమును, విషాదపూరితమును

నగుప్రపంచములో సోవియటుల యునికియు, సాదృశ్యమును సంతోష కాంతులను ప్రసరింపజేయుచుండెను.

సోవియటురషియా విజయము గాంచినను, విఫలమయినను (కమ్యూనిస్టుప్రభుత్వమును స్థాపించు నొకయాచరణ రూపమయిన సాదృశ్యముగ దానికిమంచి ప్రాముఖ్యతయున్నను) కమ్యూనిస్టుసిద్ధాంతముయొక్క మాహాత్మ్యమునకది కళంకముకాజాలదు. జాతీయకారణములచేతగాని, యంతర్జాతీయ కారణములచేతగాని బోల్షివిక్కులు తప్పిదములను చేయవచ్చును; లేకవిఫలతనొందినను పొందవచ్చును; అయినను కమ్యూనిస్టుసిద్ధాంతము సరియైనదే కావచ్చును. ఆసిద్ధాంతమును బట్టియే రషియాలో జరిగినదానిని గుడ్డిగాననుకరించుట మూర్ఖత్వమగును; ఏలనన దానినివర్తింపజేయు విధము ఆయాదేశములలోని ప్రత్యేక పరిస్థితులమీదను, వానిచారిత్రికాభివృద్ధియొక్క స్థితిమీదను ఆధారపడియుండును. మరియు, హిందూదేశముగాని, మరేదేశముగాని బోల్షివిక్కుల విజయమునుబట్టియు, వారు విధాయికముగా నొనర్చు తప్పులను బట్టియు గుణపాఠమును నేర్చుకొనవచ్చును. నామట్టుకు శత్రుప్రపంచ మావరించుకొనియుండుటచే బయటనుండి కష్టములెత్తి కలుగవచ్చునను భయముచే బోల్షివిక్కులు బహుశః నెక్కువ వేగముగపోవుటకు ప్రయత్నించిరి; వారుతీవ్రతను కొంచెముతగ్గించినయెడల గ్రామప్రాంతములవారికి సంభవించినదుఃఖము చాలవరకు లేకుండ పోయెడిది. కానిపరివర్తన వేగమును తగ్గించినచో నిజమైనగొప్ప ఫలితములు చేకూరగలవా? యనుప్రశ్నయుదయించెను. మూల నిర్మాణమునే మార్పుచేయవలసిన క్లిష్టసమయ మాసన్నమైనపుడు సంస్కారపద్ధతి యేప్రధానసమస్యను పరిష్కరింప జాలదు. తరువాత యభివృద్ధి యెంతనెమ్మదిగ జరిగినను ప్రాతిపదికలోమాత్రము ప్రస్తుత క్రమమును (దాని ప్రయోజనముతీరి యిప్పుడది భవిష్యదభివృద్ధిని భంగపరచును) పూర్తిగఛేదింపవలెను.

భారతదేశములో పరస్పరసంబంధముగల భూసమస్యను, పారిశ్రామికసమస్యను, కొంచె మించుమించు తదితరప్రధాన సమస్యల నన్నింటిని విప్లవమార్గ మొక్కటియే సాధింపగలదు. లాయడ్‌జార్జిగారు తన 'యుద్ధస్మరణములు' అను పుస్తకములో వ్రాసినట్లు "అగాధమును, రెండుదాటులలో దాటెదమనుటకంటె గొప్పతప్పిదము మరియొకటి యుండబోదు."

రషియాసంగతి విడిచిపెట్టి, మార్క్సుగారి సిద్ధాంతమును, వేదాంతమును, నాహృదయములోనున్న యనేకాంధకార కోణములను ప్రకాశమాన మొనర్చెను. చరిత్రలో నాకొకనూతనయర్థము ద్యోతకమగుచుండెను; మార్క్సుగారి వ్యాఖ్యానము దానిపయి నొక యద్భుత కాంతిని ప్రసరింపజేసెను. అది యంతయు దానివెనుక నొక ప్రయోజనమును, క్రమమును (ఎంతయగ్రాహ్యముగ నున్నను) గల తెరవిడిపోయిన నాటకమయ్యెను. భూత, వర్తమానముల నాశము, దుఃఖము, మసలనెంత నిర్ఘాంతరపరచునవి యైనను భవిష్యత్తు (మధ్యననేక యుపద్రవములున్నను) యాశాపూరితముగనుండెను. మార్క్సుగారి సిద్ధాంతములోని శాస్త్రీయదృష్టియు, నిరంకుశాభిప్రాయములకు విశ్వాసములకు కట్టుబడవలెనను నిర్బంధమెంత మాత్రమును లేకపోవుటయు, నన్నాకర్షించెను. రషియాలోను, తదితరచోట్లను అధికారసమ్మతముగు కమ్యూనిజములో నెంతయో యభిప్రాయ నిరంకుశత్వమున్నమాట నిజము; తఱచు దానికి వ్యతిరేకులైనవారు వేటాడబడిరి. సోవియటు దేశములలో నద్భుతమగు మార్పు యతివేగముగ జరుగుచుండ తీవ్రమగు వ్యతిరేకము దీనినంతను నాశముచేయవచ్చునని గ్రహించుట కష్టము కాకపోయినను యది శోచనీయముగ కాన్పించెను.

ప్రపంచమునావరించిన యార్థికమాంద్యము, విషమస్థితి మార్క్సుగారిహేతువాదమును సమర్థించుచున్నట్లు కాన్పించెను; తక్కిన యన్ని

పద్ధతులును, సిద్ధాంతములును యంధకారములో పడి కొట్టుకొనుచుండ మార్క్సుగారి సిద్ధాంత మొక్కటే కొంచెమించుమించు తృప్తికరముగ దీనికర్థము చెప్పి నిజమైన తరుణోపాయమును ప్రసాదించెను.

ఈనావిశ్వాస మభివృద్ధియైనకొలది నాలో నూతనభావము లుద్భవించెను; శాసనోల్లంఘనము విజయము నొందలేదను విచారము తరుగనారంభించెను. ప్రపంచమతి త్వరితముగ నభిలషింపబడిన గమ్యస్థానమునకు చేరుటలేదా! యుద్ధములు, విపరీతనష్టములు సంభవింపవచ్చునను భయోత్పాతముకలదు; అయినను మనము ముందుకు పోవుచున్నారము. ఇచ్చట స్తబ్ధత్వములేదు. ఈమహాప్రస్థానములో మన జాతీయ సంగ్రామమొక యంతరువు, ఒకమజిలీ; నిర్బంధములును, బాధలును మనప్రజలను భవిష్యత్సంగ్రామములకు తయారుచేయుచు, ప్రపంచమునుఱ్ఱూత లూగించుచున్న నూతనభావములను గురించి యోచించునట్లు బలవంతపరచుచున్నవి. దుర్బలులు తప్పుకొనిన కొలది మనమంతకంతకు బలము, శిక్ష, కష్టసహిష్ణుతగలవారమగుదుము. కాలము మనకు ప్రసన్నముగనుండెను.

కనుక నేను రషియా, జర్మనీ, యింగ్లండు, అమెరికా, జపాను, చీనా, ఫ్రాన్సు, స్పెయిను, యిటలీ, మధ్యయూరోపులలో జరుగుచున్న చరిత్రనుగురించి యతిజాగ్రతగ చదివి వర్తమానవ్యవహారముల విషమగ్రంథుల నర్థముచేసికొన ప్రయత్నించితిని. మహాసంక్షోభము నెదుర్కొనుటకు ప్రతిదేశము సల్పిన ప్రయత్నములను విడివిడిగను అన్నింటినికల్పి సమగ్రముగను నేనెక్కువయాసక్తితో వీక్షించితిని. రాజకీయ ఆర్థికదుస్థితులను పరిష్కరించుటకును, ఆయుధములను, యుద్ధపరికరములను తగ్గించుసమస్యను చర్చించుటకును, జరుపబడిన యంతర్జాతీయ సభల యనేకాపజయములునాకు మాకులసమస్యను (చిన్నదియైనను విపరీతకష్టములను కల్పించునది) బలవంతముగ జ్ఞప్తికితెచ్చెను. ప్రపం

చము దీనికెంత సుముఖముగనున్నను మనమీసమస్యనింతవరకు పరిష్కరింప జాలకపోతిమి; ఈసందర్భములో నపజయము ప్రపంచవినాశమును తెచ్చిపెట్టునను నెంతవ్యాప్తినొందిన విశ్వాసమున్నను యూరపు, అమెరికాలయొక్క గొప్పగొప్ప రాజకీయధురంధరులందరును సమన్వయమునకు రాజాలకపోయిరి; రెండుసందర్భములలోను విషయమును చేబట్టువిధమే క్రమముగలేదు; దీనినితీర్చవలసిన పెద్దలు న్యాయమార్గమున పోవసాహసింపరు.

ప్రపంచదుఃఖములను, పోరాటములనుగురించి యోచించుటలో కొంతవరకు నేను నాస్వంతకష్టములను, జాతీయ కష్టములను మరచి పోతిని. ప్రపంచచరిత్రలోని యీమహావిప్లవయుగములో జీవించుచుంటినని నేనొక్కొక్కప్పుడు యుత్సాహ భరితుడనగుచుందును. బహుశః రాబోవు గొప్పమార్పులసందర్భములో ప్రపంచములోని నాచిన్న సీమలో నేనుకూడ కొద్దిభాగమును తీసికొనవలసియుండును. మరియొకప్పుడుపోరాటము, దౌర్జన్యములతోనిండియున్న ప్రపంచవాతావరణము నన్నుక్రుంగదీయును. మానవుడు అధఃపతితుడగుటను, మానసయాతనను చూచుట కలుగుటచే బాధను, దారిద్ర్యమును, క్రూరత్వమును ధిక్కరింపజాలనంతటి మొద్దుబారిన మనస్సులుగల విద్యాధికులైన స్త్రీపురుషుల దృశ్యము మరింతశోచనీయమైనది. సత్పురుషులు మౌనవంతులై యుండ,నీతిబాహ్యమైనయీవాతావరణములో బోకరింపగలనీచులును, ఆరితేరిన మోసగాండ్రును వృద్ధిజెందిరి. హిట్లరుయొక్క విజయమును, దానిననుసరించిన [illegible] వజ్రపాతమువలెనుండెను. అయినను అది తాత్కాలికముగ మాత్రమే యుండునని నన్ను నేనోదార్చుకొంటిని. మానవప్రయత్నము, పౌరుషము, వృధయనెడుభావము కొంచెమించుమించు కలిగెడిది. యంత్రము గుడ్డిగా నడిచిపోవుచుండ దానిలోనున్న యొకచిన్నభాగము, యొకసీల,యేమి చేయగలదు?

అయినప్పటికిని, జీవితమునకు సంబంధించిన కమ్యూనిస్టు వేదాంతము నాకాశను, సుఖమును ప్రసాదించెను. దానిని భారత దేశమున నెట్లు వర్తింపజేయవలెను? రాజకీయ స్వాతంత్ర్య సమస్యను మేమింకను సాధించుకొనలేదు. మామనస్సులు జాతీయదృష్టితో నిండి యుండెను. ఏకకాలమందే మేమార్థిక స్వాతంత్ర్యముకు కూడ దుముక వలెనా? లేక (నీరెంటికిని మధ్య నెంత తక్కువ కాలము పట్టినను) వాని నొకటి తరువాత నొకటిగ తీసికొనవలెనా? ప్రపంచ పరిస్థితులును, భారతదేశములో జరుగుచున్న విషయములును కూడ సాంఘిక సమస్యను బలవంతముగ ముందుకు తెచ్చుచున్నవి; రాజకీయస్వాతంత్ర్యము నునిక నెంత మాత్రమును దానినుండి వేరుజేయుటకు వీలులేనట్లు కాన్పించెను.

భారతదేశములో బ్రిటిషు ప్రభుత్వము వారి నీతి సాంఘికముగ నభివృద్ధిని భంగపరచు తెగలను రాజకీయ స్వాతంత్ర్యము నెదుర్కొనునట్లు చేసెను. ఇది జరుగకతప్పదు; భారతదేశములో వివిధతరగతులును, వర్గములును స్పష్టముగ నిరూపింపబడవలెననియే నేను కోరుచుంటిని. కాని యితరు లీవిషయము నామోదించిరా? చాలమంది యట్లుచేయలేదు. కొన్ని పెద్ద పట్టణములలో కొద్దిమంది సనాతన కమ్యూనిస్టులున్న సంగతి నిజము; వారు జాతీయోద్యమమునకు వ్యతిరేకులయి దానిని తీవ్రముగ విమర్శించుచుండిరి. మంచి కట్టుబాటులతో నేర్పడిన లేబరు యుద్యమములుకూడ (ముఖ్యముగా బొంబాయిలోను, కొంతవరకు కలకత్తాలోను) గట్టితనములేని సామ్యవాదమునే కలిగియుండెను. కాని యవి చిన్నచిన్న ముక్కలయి యార్థికమాంద్యముచే బాధపడుచుండెను. విద్యార్థికులలో, మంచి వివేకము గల ప్రభుత్వాధికారులలో గూడ, కమ్యూనిజమునకును, సామ్యవాదమునకును సంబంధించిన యస్పష్టమైన భావములు వ్యాప్తిచెందెను. ప్రజాస్వామిక

ములను గురించిన బ్రైసు గారి గ్రంథములను, మోర్లే, కీత్, మేజినీ గార్ల గ్రంథములను చదువుచుండిన కాంగ్రెసులోని యువకులును, యువతులును దొరికినపుడెల్ల సామ్యవాదము, కమ్యూనిజము, రష్యా లను గురించి యిప్పుడు చదువుచుండిరి.

మీరటు కుట్రకేసు ప్రజల హృదయముల నీనూతనభావములు వైపు మరలించుటకు చాల తోడ్పడెను; ప్రపంచము నావరించిన విష మావస్థ దృష్టి నరికట్టుచుండెను. ప్రతిచోట నొక నూతన పరిశోధ నోత్సాహము ప్రబలెను. వర్తమాన సంస్థలను ప్రశ్నించుట, సవాలు చేయుట, విమర్శించుట ప్రారంభమయ్యెను. మానసిక వాయుప్రసార మునొక్క సాధారణగతి తెల్లమగుచునే యుండినను అది యాత్మ విశ్వాసముకుదురని యొక మృదువైనగాలి. కొంతమంది ఫాసిస్టు భావములను ప్రేమించిరి. స్పష్టమైన యిదమిత్థమను నిర్వచనము గల లక్ష్యము లేకుండెను. జాతీయతయే యింకను ప్రధాన భావముగ నుండెను.

కొంత రాజకీయ స్వాతంత్ర్యము సాధింపబడువరకు జాతీయతయే ప్రధాన శక్తిగ నుండునని నాకు స్పష్టమయ్యెను. ఇందుచేతనే భారత దేశములో కాంగ్రెసు (కొన్ని లేబరు సంఘములు తప్ప) యన్నిటి కంటెను ముందంజవేసిన సంస్థగ నుండెను; ఇప్పటికిని యది యట్లే యున్నది; అది యతిశక్తివంతమైన సంస్థ. గాంధీజీ నాయకత్వముక్రింద గత పదమూడు సంవత్సరములలో నది ప్రజలలో నద్భుతమైన ప్రబోధ మును కలిగించెను. దాని లక్ష్యమస్పష్టమైన బూర్జువాలక్ష్యమేమైనను అది యొక విప్లవ ప్రయోజనమును సాధించెను. దాని యుపయోగ మింకను తెఱిగిపోలేదు. జాతీయదృష్టి, సాంఘికదృష్టికి తావిచ్చువరకు నది యట్లే యుండును. కనుక భావియభివృద్ధి (లక్ష్యములోను కార్యా చరణలోను) కాంగ్రెసు ద్వారమునసే (ఇతర మార్గములను కూడ

నుపయోగించుకొనవచ్చును) జరుగవలెను. కనుక నేను కాంగ్రెసును వీడుట, జాతిని నడుపు ప్రధానశక్తినుండి సంబంధమును తెంచుకొనుట వలె కాన్పించెను; అది మనచేతిలోనున్న దివ్యాస్త్రమును వ్యర్థముచేసి కొనుట యగును; అది బహుశః నిష్ప్రయోజకమగు సాహస కృత్యములలో శక్తిని వమ్ముచేసికొనుట యగును. అయినను కాంగ్రెసు, దాని ప్రస్తుత నిర్మాణమునుబట్టి, యథార్థ ప్రయోజనము గల సాంఘిక పరిష్కారము నెప్పటికైనను ఆమోదించునా? దానిముందరకట్టి సమస్యను తెచ్చినచో నదికాంగ్రెసును రెండుమూడు చీలికలక్రింద చీల్చివేయుటగ పరిణమించును; అధమము చాలమంది దానినుండి తరిమివేయబడుదురు. సారాంశములు చక్కగస్పష్టపరుపబడి సమ్యగ్ధమైన వర్గమొకటి (కాంగ్రెసులోని మెజారిటీకాని మైనారిటీకాని) సార్థకమగు సాంఘికవిధానముకొరకు నిలుచునెడల పైచీలికను మనమభిలషింపవచ్చును; ఆహ్వానము చేయవచ్చును.

కాని ప్రస్తుతము కాంగ్రెసుఅనగా గాంధీజీ. అతడేమిచేయును? భావములలో నతడొక్కొక్కప్పుడు అద్భుతముగ వెనుకబడియుండును; అయినను ఆచరణలో నతడు నవీన భారతయుగములో ననన్యుడగు విప్లవకారుడు. అతడసాధారణవ్యక్తి; అతనిని మామూలు ప్రమాణములచే విమర్శించుట దుస్సాధ్యము; సాధారణతార్కిక సూత్రములను కూడ నతనియెడల వర్తింపజేయుట యసాధ్యము. కానియతడు హృదంతరాళమున విప్లవకారుడగుటచేతను, భారత రాజకీయస్వాతంత్ర్యమునకు బద్ధకంకణుడగుట చేతను, ఆస్వాతంత్ర్యము సాధింపబడువరకు నతడు వెనుదిరుగనిపాత్రను వహించితీరును. ఆవిధానములోనే యతడద్భుతమగు ప్రజాశక్తుల నుద్రేకింపజేయును; తానుకూడ క్రమక్రమముగ సాంఘికపరమార్థమువైపు సాగిపోవునని నేను మిగుల నాశపడితిని.

భారతదేశములోను, బయటనుగల సనాతనకమ్యూనిస్టులు చాల వత్సరములనుండి గాంధీని కాంగ్రెసును తీవ్రముగనెదుర్కొనుచునే యుండిరి. వారుకాంగ్రెసునాయకుల కనేకవిధములగు నీచోద్దేశ్యముల నాపాదించిరి. కాంగ్రెసుయొక్క లక్ష్యమునుగురించిన సిద్ధాంతసంబంధమైన వారివిమర్శలు చాలవరకు సమర్థములుగను, శక్తివంతములుగను, విషయమునకు సంబంధించినవిగను యుండెను. తరువాత సంభవించినవిషయములు కొంతవరకు వాటిలోనున్న న్యాయమును ఋజువు చేసెను. సామాన్యభారత రాజకీయపరిస్థితులను విడివిడిగా పరీక్షించి విమర్శించినచో మొదటికమ్యూనిస్టు విమర్శలుకొన్ని 'తు' 'చ' తప్పకుండ యథార్థములయ్యెను. కానివారు తమసామాన్య సూత్రములను విడిచిపెట్టి వివరములలోనికి దిగుటతోడనే (ముఖ్యముగవారు కాంగ్రెసు తీసికొనిన పాత్రనువిమర్శించునపుడు) తప్పుమార్గమున పడిపోవుచుందురు. సంఖ్యలోను, పలుకుబడిలోను కమ్యూనిస్టులు భారతదేశములో చాలతక్కువలుగ నుండుటకొక కారణమేమనిన వారులు కమ్యూనిజమును గురించి శాస్త్రీయమైన జ్ఞానమును వెదజల్లి ప్రజల హృదయములను దానివంకకు త్రిప్పుకొనుటకుబదులు యితరులను తిట్టుటయందే తమ శక్తినంతను వినియోగించిరి. ఇదివారికెదురుతిరిగి వారికే యెక్కువ యపకారమునుచేసెను. వారిలోచాలమంది లేబరుప్రాంతములలో పని చేసెడివారు. అచ్చట నే కొద్దికేకలో పనివాండ్రను తమవైపు త్రిప్పుకొనుటకు సరిపోయెడివి. కాని విద్యాధికులకు వట్టికేకలు చాలవు. ఇప్పుడుభారతదేశములో మధ్యతరగతికిచెందిన విద్యాధికుడే విప్లవకారుడను సంగతి వారుగుర్తింపరైరి! సనాతన కమ్యూనిస్టుల సంబంధము లేకుండగనే చాలమంది విద్యాధికులను కమ్యూనిజముఆకర్షించెను. అయినను వారిమధ్యనెంతయో యంతరువుకలదు.

ప్రభుత్వముపయి విశేషయొత్తిడిని కలిగించిభారత పెట్టుబడిదారులకును, జమీందారులకును పారిశ్రామిక, వర్తకహక్కులను సం

పాదించి పెట్టుటయే కాంగ్రెసునాయకుల లక్ష్యమని కమ్యూనిస్టులయభి ప్రాయము. "కాంగ్రెసు వ్యవసాయదారులయొక్కయు మధ్యతరగతికి చెందిన క్రిందితరహా వారియొక్కయు, పారిశ్రామిక పనివాండ్రయొక్కయు రాజకీయ, ఆర్థిక యసంతృప్తిని బొంబాయి, అహమ్మదాబాదు కలకత్తాలలోని యంత్ర యజమానుల యొక్కయు లక్షాధికారుల యొక్కయు రథములకు కట్టివేయుచున్నది." భారతదేశములోని పెట్టుబడిదారులు తెరవెనుక కూర్చొని ప్రజోద్యమమును ప్రారంభింపవలసినదని మొదట కాంగ్రెసు వర్కింగుకమిటీ వారి నాజ్ఞాపింతురు; నేను పాతనది చాలగొప్పదయ్యె, యుపద్రవకరమైనప్పుడు దానినాపివేయుమనియో లేక పెడత్రోవను బట్టించుమనియో ఆజ్ఞాపింతురు. మరియు బ్రిటిషువారు వెళ్ళిపోవలెనని కాంగ్రెసునాయకులు నిజముగా కోరరు. ఏలనన ఆకలితో మాడుచున్న ప్రజలను నిరోధించుటకును, కొల్లగొనుటకును వారియవసర మెంతయో కలదు; భారతదేశములోని మధ్యతరగతుల వారు తమంతతామీపనిని చేయుట కసమర్థులమని భావింతురు కనుక వారు బ్రిటిషువారుండగోరెదరు.

సమర్థులైన కమ్యూనిస్టులే యిట్టిసిద్ధాంతములను విశ్వసించుచుండుట యాశ్చర్యకరముగనుండును. ఇట్టి విశ్వాసములుండుటచేతనే వారు భారతదేశములో నెక్కువ యపజయము నొందిరనుట యాశ్చర్యము కాజాలదు. భారతజాతీయోద్యమమును యూరపులోని లేబరు ప్రమాణములననుసరించి విమర్శించుటయే వారు చేసిన ముఖ్యప్రమాదము. లేబరునాయకులు తరచు లేబరుయుద్యమమునకు ద్రోహముచేయుచుండుట వీరికి చాలయనుభవము. కనుక వీరాసాదృశ్యమునే హిందూదేశమునకును వర్తింపజేయుదురు. భారతజాతీయోద్యమము లేబరుయుద్యమముకాని, రైతులయుద్యమముకాని కాదని విదితమగుచునేయున్నది. అది బూర్జువాయుద్యమమని దానిపేరే విశదము చేయుచున్నది.

దాని లక్ష్యము యింతవరకు రాజకీయ స్వాతంత్ర్యముగాని సాంఘిక క్రమమును మార్చుటకాదు. ఈలక్ష్యము గొప్పదికాదని, చాలదని విమర్శింపబడవచ్చును. వర్తమాన యుగమునకు పనికిరాదని జాతీయ తనే ఖండింపవచ్చును. కానియుద్యమముయొక్క మూలనిర్మాణమున కంగీకరించుచు భూమిపద్ధతిని, పెట్టుబడిదారులపద్ధతిని నూలద్రోయుటకు ప్రయత్నింపక కాంగ్రెసునాయకులు ప్రజలను ద్రోహముచేసిరనిచెప్పుట మూర్ఖత్వము. అట్లుచేసెదమని వారెన్నడును చెప్పియుండలేదు. కాంగ్రెసులోనికొందఱు (ఈసంఖ్య యభివృద్ధియగుచున్నది.) భూమిపద్ధతిని పెట్టుబడిపద్ధతిని మార్చవలెనని కోరుచున్నారు; కాని వారు కాంగ్రెసుపేరిట నట్లుమాట్లాడజాలరు.

జాతీయోద్యమమునవలన బ్రిటిషువస్తువులను తదితర విదేశవస్తువులను బహిష్కరించుటచేతను స్వదేశిని ప్రోత్సహించుటచేతను భారతదేశములో పెట్టుబడిపెట్టు తరగతులవారు (పెద్దజమీందారులును తాలూకుదారులునుకాదు) చాలలబ్ధిని పొందినమాటసత్యము. ఇదివిధాయకము. ప్రతిజాతీయోద్యమమును బహిష్కారమునుబోధించి స్వదేశీపరిశ్రమలను ప్రోత్సహించును. శాసనోల్లంఘనము జరుగుచున్నకాలములోను మేముబ్రిటిషువస్తు బహిష్కారమును బోధించుచున్నప్పుడును కూడ బొంబాయిమిల్లుపరిశ్రమ యజమానులందరునొకసంఘముగాలాంకషైరుతోనొడంబడిక చేసికొనసాహసించిరి. కాంగ్రెసుదృష్టిలోనిది జాతీయోద్యమమునకు పరమద్రోహము. అదిదానినట్లే ప్రకటించెను. అసెంబ్లీలోని బొంబాయిమిల్లుయజమానుల ప్రతినిధికూడ మాలో చాలమంది జయిలులోనుండగా కాంగ్రెసును 'అతివాదులను' పదేపదే దూషించెను.

కాంగ్రెసుదృష్టినుండియు, జాతీయదృష్టినుండియు చూచినను గతకొద్దివత్సరములలో భారతదేశములో చాలమంది పెట్టుబడిదారులు

తీసికొనినపాత్ర నీతిబాహ్యమైనది. ఒటావావలన తాత్కాలికముగ కొన్నిచిన్న వర్గములకు లాభము కలిగియుండవచ్చును. కానియది భారతదేశ పరిశ్రమకంతకును చెడ్డచేసెను; దానివలన నాపరిశ్రమ బ్రిటిషుపెట్టుబడికిని, పరిశ్రమకును మరింతబానిసయయ్యెను. అదిప్రజలకు హానికరముగనుండెను. మాపోరాటమింకను జరుగుచుండగనే వేలకొలదిజయిళ్ళలోమ్రగ్గుచుండ నిరాయబారముజరుపబడెను. ప్రతివలన దేశము యింగ్లండునుండి యతికఠినమైన షరతులను పొందుకొనెను. కానికొంచెమించుమించు దానికొకవరము ప్రసాదింపగల హక్కు హిందూదేశముకుకలిగెను! గతకొద్దివత్సరములలోకూడ పెట్టుబడిదారులైన సాహసికులు భారతదేశముకు నష్టము కలిగించుచు వెండిబంగారముల వర్తకమునుసాగించిరి.

పెద్దజమీందారులును తాలూకుదార్లును రౌండుటేబిలుకాన్ఫరెన్సులో కాంగ్రెసుకుపూర్తిగ వ్యతిరేకముగ నిలిచిరి. శాసనోల్లంఘన కాలములో వారు ప్రభుత్వపక్షముననున్నట్లు బహిరంగముగను ఖండితముగను ప్రకటనచేసిరి. వారిసహాయముతోడనే ప్రభుత్వమువారు వివిధరాష్ట్రములలో ఆర్డినెన్సురూపములో నిర్బంధశాసనములను చేసిరి. యు. పి. రాష్ట్రశాసనసభలో జమీందారుసభ్యులలో నధిక సంఖ్యాకులు శాసనోల్లంఘన ఖయిదీల విడుదలకు వ్యతిరేకముగ వోటుచేసిరి.

1921, 1930లలో ప్రజలయొత్తిడి యెక్కువగ నుండుటచే గాంధీజీ తీవ్రముగకాన్పించిన యుద్యమములను ప్రారంభించుటకు నిర్బంధింపబడెనను భావము శుద్ధపొరపాటు. నిశ్చయముగ ప్రజలలో నద్భుతమగు చలనముకలిగెను. కానిరెండుసార్లును గాంధీజీ యేనడకను త్వరితముచేసెను. 1921 లో కొంచెమించుమించు నతడొక్కడే కాంగ్రెసును నడిపించెను. దానిని అసహాయోద్యమములోనికి దింపెను.

1930లో నతడేవిధముగ నష్టపెట్టినను యెట్టితీవ్ర ప్రత్యక్షకార్యవిధానమును సాధ్యమయ్యెడిదికాదు.

మూర్ఖమైన యథార్థవిషయజ్ఞానములేని వ్యక్తిగత విమర్శలను చేయుట చాలదౌర్భాగ్యమైనపని. ఇట్టివి నిజసమస్యలనుండి దృష్టిని మరల్చును. గాంధీజీయొక్క సత్యసంధతను, నిజాయితీని ధిక్కరించినవాడు తనకును, తనయుద్యమమునకును తీరనినష్టమును కలిగించినవాడగును; భారత దేశములోని కోట్లకొలది ప్రజలకతడు సత్యదేవత. అతని నేమాత్రము తెలిసికొనినవాడైనను న్యాయమునుచేయుట కతడెప్పుడును యెంతయాతురతనుచూపునో గ్రహింపగలడు.

హిందూదేశములోని కమ్యూనిష్టులు పెద్దపట్టణములలోని పారిశ్రామిక పనివాండ్రతో సంబంధముకలిగియుండిరి. పల్లెటిప్రాంతములతో వారికెట్టి సంపర్కమునులేదు. వాటినిగురించి వారికేమియును తెలియదు. పారిశ్రామిక పనివాండ్రు (యెంతముఖ్యమైనవారైనను ముందు మరింతముఖ్యమైనవారు కాగలిగినను) వ్యవసాయదారుల తరువాతనేపరిగణింపబడవలెను. ఏలనన నేడుభారత దేశములోనున్న సమస్య వ్యవసాయదారులసమస్యయే. కాంగ్రెసు సేవకులు (కమ్యూనిస్టులవలెగాక) గ్రామసీమలన్నిటిలో వ్యాపించియున్నారు. మామూలు వ్యవహారములో కాంగ్రెసు గొప్పవ్యావసాయక సంస్థగ పరిణమింపవలెను. తమయత్యవసరమైనమనోరథమీడేరినతోడనే వ్యవసాయదారులు క్వచితుగవిప్లవకారులగుదురు. భవిష్యత్తులోనెప్పుడో యొకప్పుడుపట్టణమునకును, గ్రామమునకును పారిశ్రామికపనివానికిని, వ్యవసాయదారునకును గలమామూలు సమస్య భారత దేశములోకూడ తలయెత్తగలదు.

అనేకమంది కాంగ్రెసునాయకులతోను వర్కరులతోను నాకతిసన్నిహిత పరిచయభాగ్యము కలదు; వారికంటె యోగ్యులైన స్త్రీ పురుషులను నేను వాంఛింపజాలను. అయినను ప్రధానసారాంశములను

గురించి నాకును వారికిని భేదాభిప్రాయములు కలుగుచుండెను; నాకతి స్పష్టముగ కాన్పించు విషయము వారికర్థము కాకపోవుట లేక వారు గుర్తింపకపోవుట తలచు నాకు విసుగుదలగ నుండెడిది. బుద్ధివిశేషము కొఱవడుట దానికి కారణముకాదు. ఎందుచేతనో మేము వివిధ లక్ష్యములలో తిరుగుచుంటిమి. ఈ హద్దుల నకస్మాత్తుగ తెంచుట చాల కష్టమని నేను గుర్తించితిని. అవి జీవితముకు సంబంధించిన వివిధ వేదాంతములు. మనము క్రమముగ, సప్రయత్నముగ నాపరిణామమును పొందుదుము. ఇతరపక్షమును నిందించుట నిరర్థకము. సామ్యవాదమనగా జీవితమును, దాని సమస్యలను నొకవిధమగు మానసిక దృష్టితో చూచుటయని యర్థము. అది వట్టి తర్కముకాదు. దానికంటె నెక్కువది; సాంప్రదాయముల మీదను శిక్షణ పోషణల మీదను, భూతవర్తమాన పరిసరముల యదృశ్య ప్రభావములమీదను ఆధారపడునట్టి యితర దృక్పథములు కూడనట్టివే. కఠినపాఠమును బోధించు జీవితమొక్కటియే మనలను నూతన మార్గములగుండ నడిపించును; చివరకది మనలను మరియొకవిధముగ యోచించునట్లు (ఇదిచాల కష్టమైనపని) చేయును. బహుశః మనమీవిధానములో కొద్దిగ సహాయభూతులము కావచ్చును.

---

# ౪౭

## మతమన నేమి?



1932 సెప్టెంబరు రెండవవారములో ప్రశాంతమును, విసుగు పుట్టించునదియునగు మానిత్యజీవిత మకస్మాత్తుగ నొక బాంబు మ్రోతవలన దద్దరిల్లెను. నిమ్నజాతులకు రామ్సేమాక్డోనాల్డుగారు ప్రసాదించిన 'కమ్యూనల్ అవార్డు' ఫలితమైన ప్రత్యేకనియోజకవర్గ పద్ధతిని నిరసించుటకు గాంధీజీ "చనిపోవువరకు నుపవసింప" నిశ్చయించెనను వార్త యఱుగుచేసెను. ఆహా! ప్రజలనుహడలగొట్టుటకతని కెట్టిశక్తికలదు! అకస్మాత్తుగ నాతలలోనికనేకవిధములగు భావములు చొరుచుకొనివచ్చెను; అనేకరకములగు సంభవములు, ఘటనలు జరుగవచ్చుననుతలంపు నన్నావేశించి నాశాంతిని పూర్తిగభంగము చేసెను. రెండురోజులవరకు నాకెట్టి దోవయు, తెన్నును కానరాక నేనంధకారములో నుంటిని. గాంధీజీయొక్క చర్యవలన జరుగు కొన్ని ఫలితములను తలచుకొనినపుడు నాహృదయము కృంగిపోయెడిది. వ్యక్తిగతమగు భావము భరింప నశక్యముగనుండెను. నేనతనినిక నీలోకములో తిరిగి చూడజాలకపోవచ్చునని దిగులుపడితిని. ఒకవత్సరముక్రితము యింగ్లండు వెళ్లుచుండగ నేనతనిని యోడమీద కడసారి చూచితిని. అదియే నాకతని తుదిసందర్శనము కాబోవుచున్నదా!

తరువాత తన తుదియాత్మార్పణకిట్టి చిన్న సమస్యను (యప్రధానమైన సమస్యను) నియోజకవర్గమునకు సంబంధించిన చిన్నసమస్యను అతడు తీసికొనినందులకు నేను బాధపడితిని. ఇదిమన స్వాతంత్ర్యోద్యమమున కెట్టి ఫలితము నిచ్చును? దీనివలన తాత్కాలికముగనైనను ప్రధానసమస్యలు మరుగుపడిపోవా? అతడు తనయొక్క యత్యావసర లక్ష్యమును (నిమ్నజాతులకు సమష్టి నియోజకవర్గమును) సాధింపగలి

గినచో దానివలన నొక ప్రతిక్రియపుట్టదా ? ఒక దానిని సాధించితిమి; కొంతకాలమువరకు మనమిప్పుడేమియుచేయనక్కరలేదు; అనుభావము జనింపదా ?

అకాలిచర్య కమ్యూనల్ అవార్డును, ప్రభుత్వముచే తయారుచేయ బడిన సామాన్యరాజకీయ స్కీమును గుర్తించి కొంతవరకామోదించి నట్లగుటలేదా? ఇదియసహాయోద్యమముతోను శాసనోల్లంఘనముతోను సమన్వయమగునా ? బ్రహ్మాండమగు త్యాగమును ధైర్యసాహసోపేత ములగు ప్రయత్నములను చేసినతరువాత మనయుద్యమమిట్టి నామ రూపములులేని విషయముతో తోకముడువవలసినదేనా?

ఒక రాజకీయ సమస్య నతడు మతవిషయికముగను, హేతువిరు ద్ధముగను చూచుటయు నీసందర్భములో నతడు తఱచు భగవంతుని యుదహరించుచుండుటయు నాకతని యెడల కోపమును కలిగించెను. ఉపవసింపవలసిన దినమునుకూడ భగవంతుడే నిర్దేశించునట్లతడు సూచించెను. ఇదియెంత భయంకరమైన సాదృశ్యము !

బాపుచనిపోయినచో ! భారతదేశమపుడెట్లుండును ? దానిరాజ కీయము లెట్లుప్రవహించును ? భవిష్యత్తుఅంతయు దుఃఖమయముగను శూన్యముగనుకాన్పించెను. దానినితలంచినపుడు నిరాశ నాహృదయము నావరించెడిది. నేనిట్లుయోచింపగా యోచింపగా నాబుద్ధి వికలమగు చుండెడిది; కోపము, నిరాశ, యీపరిబోధమునకంతకును జనకుడైన వానియెడల ప్రేమయు ముప్పిరిగొని యుండెడివి. ఏమిచేయవలెనో నాకు తోచకుండెను; కనుక నేనుప్రతివానియెడల (ముఖ్యముగనాయెడలనే) చిర్రుబుర్రుగను ముక్కోపిగను నుండెడివాడను.

తరువాత నొకచిత్రవిషయముజరిగెను. నేను ఉద్రేకములరాశి నైతిని; అట్లుకొంతసేపుంటిని. ఆస్థితి గతించినతరువాత నామనస్సు శాంతించెను. భవిష్యత్తు అంత మంధకారముగకాన్పించలేదు ? బాపు

పరిపక్వసమయమును కనిపెట్టి యుక్తమైనకార్యమునుచేయు చిత్రమైన యుక్తిగల వ్యక్తి. అతనిచర్య (నాదృష్టిచే సమర్థించుట కసాధ్యమే యైనను, దానికిసంబంధించిన సంకుచితరంగములోనేగాక మన జాతీయ పోరాటమునకు సంబంధించినవిశాలదృష్టిలోకూడ) గొప్పఫలితముల నీయ వచ్చును. బాపుచనిపోయినను మనస్వాతంత్ర్యపోరాటము సాగుచునే యుండును. కనుక నేమిజరిగినను మనముదానికి సిద్ధముగను, తయారు గను నుండవలెను. గాంధీజీ యొక్క మరణమునుకూడ నిర్విచారముగ నెదుర్కొనుటకు నిశ్చయించుకొని నేనుశాంతినొంది, యుద్రేకమునణచు కొని ప్రపంచమును, అదిప్రసాదించుసమస్తమును నెదుర్కొనుటకు సిద్ధ ముగనున్నట్లు భావించితిని.

తరువాత దేశమంతటను నద్భుతమగు ప్రబోధము కలిగినట్లును, హిందూసంఘములో నొకవింతయుత్సాహతరంగ ముప్పతిల్లినట్లును వార్తలేతెంచెను. అస్పృశ్యత కింతకాలమువచ్చినట్లు కాన్పించెను. ఎరవాడజయిలులో కూర్చొనిన యీబక్కమనిషి, యీచిన్నవ్యక్తి యెంతటి గారడీడు! ప్రజాహృదయములను కదల్చు తంతుల నెట్లు మీటవలెనో బాగుగ్రగహించిన యెంతటిచతురుడు!

అతనివద్దనుండి నాకొకతంతివచ్చెను. నేను శిక్షింపబడినతరు వాత నతనివద్దనుండి నాకువచ్చిన మొదటిసందేశమదియే. అంతదీర్ఘ కాలమయినతరువాత నేనతనినిగురించి వినుట నాకాహ్లాదకరముగ నుండెను. ఈతంతిలో నకడిట్లువ్రాసెను.

"ఈయన్ని మహాసంక్షోభ దినములలోను నీవుమానసికనేత్రము ముందరనుంటివి. నీయభిప్రాయమును తెలిసికొనుటకు నేనత్యాతురపడు చుంటిని. నీయభిప్రాయము నాకెంత యమూల్యమో నీకే తెలియును. ఇందుకుమారిని, సరూపబిడ్డలనుచూచితిని. ఇందు కులాసాగానున్నది;

ఆమె యొడలు పెంచుచున్నది. చాలయారోగ్యముగనున్నాను. తంతి ద్వారా ప్రత్యుత్తరమునిమ్ము. ప్రేమ."

ఉపవాసశ్రమ ననుభవించుచున్నను, అనేక కార్యములలో నిమగ్నుడయినను నాకుమార్తెయు, నాచెల్లెలుబిడ్డలును అతనినిదర్శింప వచ్చిన సంగతిని, యిందిరయొడలు చేయుచున్నదను సంగతినికూడ నుదహరించుట యసాధారణమైనవిషయము. అయిననుసది యతని తెన్ను; స్వభావము. (అప్పుడునాచెల్లెలుకూడ జయిలులోనుండెను. ఈపిల్లలందరును పూనాలో చదువుకొనుచుండిరి.) అతడు జీవితములో నతిస్వల్పముగ కాన్పించు విషయములనుగూడ (నిజముగవాటికి చాల విలువగలదు) నెప్పుడును మరచిపోవజాలడు.

నియోజకవర్గము విషయమై యొకయొడంబడిక జరిగెననికూడ నాకప్పుడేవార్తవచ్చెను. గాంధీజీకి ప్రత్యుత్తరమిచ్చుటకు నాజయిలు సూపరింటెండెంటు అంగీకరించుటచే నతనికిక్రింది తంతినిపంపితిని.

"మీతంతియు, నొక యొడంబడిక కుదిరెనను క్లుప్తమగు వార్తయు నాకానందమును, శాంతినిచేకూర్చెను. మీరుపవసించుటకు నిశ్చయించిరను మొదటివార్త మానసిక సంక్షోభమును, చిత్తవైకల్య మును కలిగించెను; కానితుదకుత్సాహము విజయముగాంచెను; నేను చిత్తశాంతిని పొందితిని. అణగద్రొక్కబడి, పీడింపబడువారికొరకు చేయు యెంతటిత్యాగమైనను చాలదు. అత్యధమస్థితిలోనున్నవారి స్వాతంత్ర్యమునుబట్టియే దేశస్వాతంత్ర్యము పరీక్షింపబడవలెను: కాని మనయేకైకలక్ష్యమును యితరసమస్యలు మఱుగుపరచునని భయపడు చున్నాను. మతదృష్టినుండి విమర్శించుట కశక్తుడను. ఇతరులు మీ పద్ధతులను కొల్లగొట్టవచ్చునను భయముకలదు. కానినేనొక యింద్ర జాలికునకు సలహాచెప్పుట కెట్లుసాహసింపగలను. ప్రేమ."

పూనాలోసమావేశమైన వారందరునొక 'యొడంబడిక' మీద సంతకముచేసిరి. బ్రిటిషుప్రధానమంత్రి యెన్నడును యెఱుగనట్టి వేగ

ముతో నాయొడంబడిక నంగీకరించి తనవెనుకటి 'అవార్డును' దాని ప్రకారము మార్చివేసెను. ఉపవాసము సమాప్తమయ్యెను. అట్టియొడంబడికలును, అగ్రిమెంటులును నాకుచాలఅయిష్టము. కానిపూనాయొడంబడికను, (దానిలోనున్నవిషయములతో సంబంధములేకుండ) నేనామోదించితిని.

ఉద్రేకము చల్లబడెను. మేము మాజయిలు కృత్యములకు మరలితిమి. హరిజనోద్యమమును గురించియు, జయిలునుంచి గాంధీజీ జరుపు చర్యలనుగురించియు మాకువార్తలు వచ్చుచుండెను. అవినాకంత సుఖకరముగలేవు. అస్పృశ్యత నంతమొందింపజేసి, దురదృష్టవంతులైన నిమ్నజాతుల నుద్ధరించుసట్టి యుద్యమమున కద్భుతమైనవ్యాప్తికలిగెననుటకెట్టి సందేహమునులేదు. ఇది యాయొడంబడికవలనగాక దేశమంతటను సృజింపబడిన, చెడుగును తొలగింపవలెననెడి సంగ్రామోత్సాహమువలననే జరిగెను. ఇదియంతయు నవసరమే. కాని శాసనోల్లంఘనముకు నష్టముకలిగెననుటకూడ స్పష్టము. దేశముయొక్క దృష్టి యితరవిషయములమీదకుమరలెను. చాలమంది కాంగ్రెసు పనివారలు హరిజనోద్యమముకు బూనుకొనిరి. బహుశఃవీరిలో చాలమంది (జయిలుకుపోవుట, అంతకంటెను అధమమయిన లాఠీదెబ్బలు, ఆస్థిని పోగొట్టుకొనుట మొదలగు సాహసములులేని) భద్రమగుపనులలో నిరుకుకొనుట కవకాశములను చూచుకొనుచుండిరి. అదిసహజము. మనలక్షలకొలదివర్కరులెల్లప్పుడును తీవ్రబాధలకును, తమగృహములువిచ్ఛిన్నమై శిథిలములగుటకును సిద్ధముగనుండవలెనని కోరుట న్యాయముకాదు. కాని మనమహోద్యమము నెమ్మదిగ నశించుటను వీక్షించుట బాధకరముగనుండెను. అయినను శాసనోల్లంఘనమింకను సాగుచునేయుండెను. అప్పుడప్పుడు 1933 మార్చి ఏప్రిల్‌లోని కలకత్తా కాంగ్రెసువంటి ప్రజాబాహుళ్యముతోగూడిన యుత్సవములు జరుగుచుండెను. గాంధీజీ యెరవాడజయిలులో నుండెను, కాని వ్యక్తులను

కలుసుకొనుటకును, హరిజనోద్యమములకు సందేశములను పంపుటకును అతనికికొన్ని సౌకర్యములు కలిగింపబడెను. ఇందువలన నతడు జయిలులోనుండెనను వ్యథ తీసివేయబడెను. ఇదియంతయు నన్ను నిరుత్సాహపరచెను.

చాలనెలలయిన తరువాత, 1933 మే మొదటివారములో, గాంధీజీ తనయిరువదియొక దినముల యుపవాసమును ప్రారంభించెను. దీనినిగురించిన మొదటివార్త తిరిగి నాకొక గుండుదెబ్బవలె తగిలెను; కాని యిదియొక విధాయక సంభవమని నేను దీనిని స్వీకరించి యీ పాతమున కలవడిపోతిని. అతడు నిశ్చయముచేసికొని ప్రజలకట్లు ప్రకటనచేసిన తరువాత దానిని. మానవలసినదని కొందఱు ప్రోత్సహించుట నాకునిశ్చయముగ కోపమునుకలిగించెడిది. నాయభిప్రాయమున ఉపవాసమగ్రాహ్యమైనది. నిశ్చయముచేసికొనుటకు పూర్వము నన్నడిగియుండినచో తప్పకుండ నేను దానికి గట్టిగ వ్యతిరేకముగ చెప్పియుండెడివాడను. కానినేను గాంధీజీమాటలకు యెక్కువ విలువనిచ్చితిని. అతడు దానినిభంగముచేయునట్లు ప్రయత్నించువారు తప్పుచేయుచున్నట్లు నాకుకాన్పించెను. అదియతనికి సంబంధించిన (అతనికది ప్రధానమైనది) వ్యక్తిగతవిషయము. కనుక, నాకెంత యసుఖముగ నున్నను నేనుదానిని సహించితిని.

తనయుపవాసమును ప్రారంభించుటకు కొద్దిరోజులుపూర్వము అతడునాకొక యుత్తరమువ్రాసెను. అది నన్నెంతయో కదల్చివేసెను. నన్నతడొక ప్రత్యుత్తరమును వ్రాయమనుటచే నేనొకతంతిని పంపితిని. "మీయుత్తరముచేరినది. నాకర్థముకాని విషయములనుగురించి నేనేమిచెప్పగలను? మీరొక్కరే తఱచు మార్గమును చూపు దిక్కుగనున్న యొక వింతదేశముననుంటిని. అంధకారములోనే నేను నామార్గమును తడుముకొనుటకు ప్రయత్నించుచున్నాను. కాని

నేను బోరాడుచున్నాను. ఏమిసంభవించినను నాయోచనలును, ప్రేమయు మీామీాదనే యుండును."

అతనిచర్యయెడల నాకుగల పరిపూర్ణయసమ్మతి మధ్యను, అతనికి కష్టమును కలిగింపరాదను శోకమధ్యను పడినేనునలిగితిని. నేనతనికి యుత్సాహకరమైన వార్తను పంపలేదని భావించితిని. ఇప్పుడతడు భయంకరమైన తనయగ్నిపరీక్షకు (అదియతనికి మృత్యువుగ పరిణమించినను పరిణమింపవచ్చును) నిలువనెంచెను. కనుకనేను నాశక్తికొలది యతనికుత్సాహమును కలిగింపవలెను. చిన్నవిషయములు మానసికముగ పెద్దవియగును. అతడీపరీక్షను దాటిజీవించుటకు శక్తినంతను వినియోగించవలెను. ఏమి సంభవించినను, అతనికిమృత్యువే వచ్చినను, మనముదానిని ధైర్యముగ స్వీకరింపవలెనని నేను భావించితిని. కనుక నేనతనికి మరియొక తంతినిచ్చితిని.

"మీారిప్పుడు మీాయద్భుత సాహసకార్యమును ప్రారంభించిరి. కనుక నేను నాప్రేమను, అభినందనములను మీాకుతిరిగి పంపగోరుచున్నాను. ఏమిసంభవించినను మంచిదే! యేమిసంభవించినను జయము మీాదే! యనినేనిపుడెక్కుడ స్పష్టముగ భావించుచున్నానని నమ్మ గోరుచున్నాను."

అతడు యుపవాసమునుండి బయటపడెను. దానిని ప్రారంభించిన మొదటిదినముననే యతడు జయిలునుండి విడిచి వేయబడెను. అనినిసలహాపయిన శాసనోల్లంఘన మారువారములు విరమింపబడెను.

ఉపవాసకాలమున దేశములో బయలుదేరిన యుద్రేకపూరితమైన ప్రబోధమును నేను తిరిగి పరీక్షించితిని. ఇది రాజకీయములలో సరియగు మార్గమేనా యను నాశ్చర్యము నాకంతకంతకు హెచ్చుచుండెను. ఇది కేవల మతోత్సాహము తిరిగి తలయెత్తుటవలె నాకు కాన్పించెను. దానికి వ్యతిరేకమగు స్పష్టమయిన యోచన కెట్టి యవ

కాశలేశమును గూడ లేకుండెను. భారతదేశమంతయు, 'మహాత్మ' వైపు పూజ్యభావముతో తేరిబారి చూచుచు నత డద్భుతము వెంబడి యద్భుతములనుచేసి, యస్పృశ్యతను రూపుమాపి, స్వరాజ్యము మొదలగు వానిని తెచ్చిపెట్టునని యనుకొనుచు తానేమియు చేయక నూరకుండెను. తమకు తామాలోచన చేసికొనవలెనని గాంధీజీ యితరులను ప్రోత్సాహము చేయలేదు; త్యాగము, పవిత్రతయను నీ రెంటినే యత డుపదేశ దేశకాంక్షించుచుండును. నాకతనియెడల నెంత ప్రేమానుబంధమున్నను మానసికముగ నేనంతకంత కతనికి దూరమగుచున్నట్లు భావించితిని. అనేకసారులతడు తన రాజకీయ క్రియాకలాపములో ప్రమాదరహితమగు నాత్మప్రబోధముచే నడుపబడుచుండెను. కార్యాచరణ యందతని కమోఘమైన శక్తి కలదు. కాని జాతికి తగిన శిక్ష నిచ్చుటకు విశ్వాసమే సరియైన మార్గమా? దానివలన కొద్దికాలము లబ్ధికలుగవచ్చును. కాని తుద కేమగును ?

దౌర్జన్యముమీదను, సంఘర్షణమీదను నిర్మింపబడిన ప్రస్తుత సాంఘిక క్రమము నతడెట్లంగీకరింపగలడో (అత డట్లు చేయునట్లు కాన్పించును.) నేను గ్రహింపజాలకుంటిని. నాలో కూడ సంఘర్షణ రేగెను. రెండు విరుద్ధవిశ్వాసములు నన్ను చీల్చుచుండెను. బలవంతముగా నాకు సమకూడిన జయిలురక్షణ పోవుటతోడనే నన్ను కష్టము లెదుర్కొనునని నేనెరుగుదును. నేను యిల్లు, వాకిలి లేనివానివలె, నేకాకివలె నున్నట్లు భావించితిని. నేను ప్రేమించిన భారతము, నేను సేవించినభారతము నాకొకవింత దేశముగ, నాశ్చర్యకరమగుదేశముగ కాన్పించెను; నా దేశస్థు లేమిభావించుచున్నారో, యెట్లు భావించుచున్నారో గ్రహింపజాలకపోవుటనాదోషమా? నాకత్యంతసన్నిహితులైన వారికిని నాకునుమధ్యనొక కనపడనిగోడ యున్నట్లు నేను భావించితిని; దీనిని తరించుటకశక్తుడనగుటకు విచారపడుచు నాలోనికినేనణగి పోవుచుండెడివాడను. ప్రాచీన ప్రపంచము (గతించిన లక్ష్యములు, ఆశలు, కోరికలు

గల ప్రాచీన ప్రపంచము) వాని నావరించినట్లు నాకు కాన్పించును. నూతనప్రపంచమింకను చాల దూరమున నుండెను.

"రెండు ప్రపంచముల మధ్య (ఒకటి నశించినదియు, రెండవది జన్మించుటకశక్తమై యున్నదియు) అది భ్రమించుచు తన తలదాచుకొనుట కింకను చోటులేకయుండెను".

హిందూదేశము తక్కినయన్నివిషయములకంటె నెక్కువగమత ప్రసక్తి కలదేశమని భావింపబడుచున్నది. హిందువులు, సిక్కులు, ముస్లిములు, తదితరులు తమతమ విశ్వాసములకు గర్వపడుచు తలలను పగులగొట్టుటవలన తమవిశ్వాసములలోని సత్యములను రుజువుచేయుచున్నారు. హిందూదేశములోను తదితరచోట్లనుకూడ మతమని (అధమము నిబంధనరూపములోనున్న మతము) పిలువబడుదాని ప్రదర్శనము నన్నుభయముతో ముంచివేసెను. తఱుచు నేనుదానిని ఖండించితిని. నేనుదానిని పూర్తిగ తుడిచిపెట్టగోరితిని. అదకొంచెమించుమించు యెప్పుడును గుడ్డివిశ్వాసమును, వెనుకముఖమును, పిడివాదమును, మొండిపట్టును, పిచ్చినమ్మకమును, యితరులనుపీడించుటను, స్వార్థ ప్రయోజనములను కాపాడుటను- ఈయన్నింటిని సమర్థించును. అయినను అందులో నింతకంటె భిన్నమైన్నది, మానవుల యాంతరంగికా కాంక్షమునుతీర్చునది, మరియొక సేదియో కలదని నేనెరుగుదును. లేనియెడల నదియట్టి యద్భుతశక్తి యెట్లుకాగలిగెను? అసంఖ్యాకములగు దుఃఖితాత్ముల కదిశాంతిని, సుఖమును యెట్లుచేకూర్చగలిగెను? ఆశాంతి గుడ్డివిశ్వాసమునకును ప్రశ్నింపజాలని చేతకానితనమునకును కేవల మొకయాశ్రయమా? ఆశాంతి బహిరంగ సముద్రతరంగ సంహతుల నుండి రక్షించు సముద్రాశ్రయమున దాగొనుటచే కలిగినశాంతియా? లేకనది యింతకంటెనధికమైనదా? కొందరిసందర్భములలో నిశ్చయముగ నది యింతకంటె నధికమైనదే!

కాని నిబంధనలతో గూడిన మతము (గతకాలములో నదియెట్లుండినను) నేడు చాలవరకు జీవముపోయిన మృతకళేబరమువంటిది. జి. కె. చెస్టర్టనుగారు దానిని (తనకుచెందిన ప్రత్యేకమతముద్రనుకాదు. ఇతరములను!) భూగర్భములో యుగములనుండియుండుజంతువులేక చెట్టుచేమల యొక్క బాహ్యరూపములతో పోల్చెను. దీనిలోనుండు నిజమూలపదార్థము సంపూర్ణముగ మాయమయ్యెను; కాని దానికి కేవలభిన్నమగు నితరపదార్థములతోనది నింపబడుటచే దానియాకారము మిగిలెను. ఒకవేళ విలువగలదేదియైనను కొంచెము మిగిలినచోట నది యితర యుపయోగకర వస్తువులచే నావరింపబడెను.

మన ప్రాచ్యమతములకును, పాశ్చాత్యమతములకును గూడ నిట్టి స్థితియే సంభవించినట్లు కాన్పించును. మతమునకు గల నిజమైన యర్థములో నేకోశమందును మతముకాజాలని యింగ్లండు దేశపు ఛర్చి మతమే యిందులకు ప్రబల నిదర్శనము. కొంతవరకు నిజ నిబంధన రూపములో నున్న ప్రొటెస్టెంటుమతము కంటెను వర్తించును. కాని యింగ్లండు ఛర్చి చాల కాలమునుండి ప్రభుత్వ రాజకీయశాఖ యగుటచే బహుశః మరికొంత ముందుకు వెళ్లెను. *

---

* హిందూదేశములో యింగ్లండు ఛర్చిని కొంచెమైనను ప్రభుత్వమునుండి వేరుచేయజాలము. ప్రభుత్వ జీతములను (భారతదేశపు ఆదాయములనుండి) తిను మతగురువులు, ఛాప్లెనులు పెద్ద యుద్యోగస్థులవలెనే సామ్రాజ్యాధికారము యొక్క చిహ్నములు. మొత్తముమీద ఛర్చి భారతరాజకీయములలో [illegible] [illegible] వ్యతిరేకము; అది యభివృద్ధికిని, దిద్దుబాటు చేసికొనుటకును సాధారణముగ వ్యతిరేకము. సామాన్య మిషనరీకి భారతదేశ భూతకాలచరిత్ర, విజ్ఞానము ఏమియు తెలియదు; వానిని తెలిసికొనుటకతడు లేశమైనను ప్రయత్నింపడు. క్రైస్తవులు కానివారి పాపములను, దోషములను చూపుటలో నతడెక్కువ ఘటికుడు. దీనికనేక చక్కని మినహాయింపులు కలవనుట నిశ్చయము. భారతదేశమునకు దీనబంధు చార్లీ ఆండ్రూసుకంటె శ్రేష్ఠుడగు మిత్రరత్నము వేరొకడు లేడు. వానికతని యపారమగు ప్రేమ, సేవాతత్పరత, పొర్లుచుండు మైత్రి కలుగుట మహదావహము; అది

దానిభక్తులు చాలమంది నిస్సందేహముగ నుత్తమోత్తమమగు శీలముకలవారు. కాని యాచర్చి బ్రిటిషుసామ్రాజ్య ప్రయోజనముల నద్భుతముగ సేవించెను. అది సామ్రాజ్య తత్వమునకును, పెట్టుబడిదారుల తత్వమునకును నైతికమును, క్రైస్తవమత సంబంధమును నగు రక్షణనిచ్చెను. అదియాసియా, ఆఫ్రికాలలోని బ్రిటిషువారి దోపిడీనీతిని యత్యుత్తమమగు నైతికప్రమాణములద్వారా సమర్థింప బ్రయత్నించెను. ఎప్పుడును న్యాయముగ నేయుండిరను నసాధారణమును, నసూయపడదగినదియు నగుభావమును నదివారికి కలిగించెను. సుఖదాయకమగునట్టి యీపవిత్రభావమును కలుగచేయుటకు చర్చి సహాయపడెనో లేకనదియే దానిని పుట్టించెనో నేను చెప్పజాలను.

---

మనయదృష్టము. పూనాలోని క్రైస్తవసేవాసంఘములో కొంతమంది చక్కని యాంగ్లేయులున్నారు: వారిమతమును వారికధికులమను నహంకారమును గాక తెలిసికొనుట, సేవించుట యనువానినిచూపెను. వారుతమ గొప్పశక్తులన్నింటితో భారత ప్రజలకు స్వార్థరహితమగు సేవచేయుటయందు నిమగ్నులయిరి. ఇంకనుఅనేకమంది యింగ్లీషుచర్చికి సంబంధించినవారి నామములు భారతదేశములో స్మరింపబడుచున్నవి.

క్యాంటర్బరీఆర్చిబిషప్ గారు 1934 డిసెంబరు 12 వ తేదీని ప్రభువుల సభలో మాట్లాడుచు 1919 నాటి మాంటేగుచెమ్స్ఫర్డు సంస్కరణలలోని ప్రియాంబులు నుదహరించుచు "అతడొక్కొక్కప్పు డాగొప్ప ప్రకటన కొంచెముతొందరగ చేయబడెనని తలంచెను. యుద్ధముయినతరువాతి చేయబడినవాటిలో నిదియొక తొందరదైన, యుదారసూచనయని యతనుకొనెను. కాని చూపబడిన పరమావధి లాగివేయబడజాలదు" అని చెప్పెను. భారతరాజకీయములను గురించి యింగ్లీషుచర్చి పీఠాధిపతి యట్టి యసాధారణమైన సంకుచితదృష్టిని కలిగియుండుట గమనింపదగిన విషయము. భారతీయులదృష్టిలో సుతరాముచాలదని భావింపబడిన సోపానము, అసహాయోద్యమమునకును తత్ఫలితములకును కారణమైన సోపానము ఆర్చిబిషపుచే "తొందరదైనది, యుదారమైనది" యని తలంపబడెను. ఈసిద్ధాంతము యింగ్లీషు పాలకజాతులవారికి సుఖావహముగనుండి, నిస్సందేహముగ తమ నిజయుదారతకు (సాహసముకుకూడ) సంబంధించిన యీవిశ్వాసము పవిత్రకార్యము నొనరించుటచే కలుగు తృప్తిని కలిగించియుండవలెను.

యూరపు అమెరికా ఖండములలోని యింతకంటె తక్కువ యదృష్టవంతమైన దేశములు తఱచుయింగ్లీషువారిని మోసగాండ్రని నిందింతురు 'ఇంగ్లీషువారిసమ్మిక స్వామిద్రోహము' అనునదియొక దెప్పిపోటుమాట. కాని యీనింద బహుశః యింగ్లీషువారి జయముచే కసూయ చేకలిగినది. నిశ్చయముగ నేయితర సామ్రాజ్యభాగ్యమును యింగ్లండుపై రాళ్ళు విసరజాలదు. ఏలనన దానిచరిత్రకూడ తత్తుల్యమైనదే! బుద్ధిపూర్వకముగ మోసముచేయునేజాతికిని బ్రిటీషువారు నిరంతరమును ప్రదర్శించుచుండిన శక్తిసంపత్తులు లేవు. వారవలంబించిన 'మతముద్ర' వారిస్వప్రయోజనములకు సంబంధించినచోట వారి నైతికజ్ఞానమును మొద్దుపరచి వారికిందులో సహాయముచేసెను. ఇతర ప్రజలును, జాతులును బ్రిటిషువారికంటె నతియధమముగ ప్రవర్తించిరి. కాని తమకు లాభించినదాని నొకపుణ్యకార్యముగ చేయుటలో వారెవరికిని యింతటిజయముచేకూరలేదు. మనకందరకును యెదుటవాని దోషములు నలుసులైనను కాన్పించును; మనదోషములు గుమ్మడికాయలంతవైనను కానరావు. కాని బహుశః బ్రిటిషువారు యీ విద్యలో నందరిని చిత్తుచేసెదరు. *

---

ఇంగ్లండుఖర్చు పరోక్షముగ భారత రాజకీయములలో నెట్లు జోక్యము కల్పించుకొనునో తెలుపు నవీన యుదాహరణమొకటి నాకు తెలియవచ్చెను. యు. పి. భారత క్రైస్తవుల రాష్ట్ర కాన్ఫరెన్సులో (కాన్పూరులో జరుపబడిన దానిలో) 1934 నవంబరు 7 వ తేదీని సన్మాననంఘాధ్యక్షుడైన యి. వి. డేవిడుగారు "క్రైస్తవులమైన మనము మనమతమును రక్షించునట్టి రాజుగారియెడల భక్తిగలిగి యుండవలెనని మనమతముచే శాసింపబడుచున్నాము" అనెను. భారతదేశములోని బ్రిటిషుసామ్రాజ్యతత్వమును విధాయకముగ బలపర్చవలెనని దీనియర్థము. ఇండియను సివిల్ సర్వీసుకుపోలీసుకును మొత్తము చట్టముకంటెకును సంబంధించిన యింగ్లండులోని 'పచ్చికన్సర్వేటివుల కొన్ని యభిప్రాయములయెడల డేవిడ్ గారు తమ సానుభూతిని తెలిపిరి. ఆచట్టము వారియభిప్రాయముప్రకారము హిందూదేశములోని క్రైస్తవమిషనుల కుపద్రవమును కలిగింప వచ్చును.

ప్రొటెస్టెంటు మతము నూతనపరిస్థితులకు సరిపడియుండుటకు ప్రయత్నించెను; అది రెండుప్రపంచముల యుత్తమభోగములను అనుభవింపగోరెను. ఈ ప్రపంచమునకు సంబంధించినంతవరకు నది విజయము నొందెను. కాని మతదృష్టిలో (నిబంధనలతోగూడిన మతమయి) నది రెంటికినిచెడ్డ రేవడివలె చెడిపోయెను. మతము క్రమముగ హేతుశూన్యమగు నుద్రేకమునకును పెద్దవర్తకమునకును తావిచ్చెను. పాతమార్గమునే యంటిపెట్టుకొని యుండుటచే రోమనుక్యాథలికు మతమున కీస్థితితప్పెను. ఆమార్గము సరిగా నున్నంతవరకది వృద్ధిచెందును. పాశ్చాత్యదేశములలో నేడది యొక్కటే సచేతనమైన మతముగ (దానిసంకుచితార్థములో) కాన్పించును. ఒక రోమనుక్యాథలికు స్నేహితుడు నాకు జయిలులోనికి కెథాలిసిజమునుగురించిన యనేక పుస్తకములను, పోపుగారియుత్తరములను పంపించెను. నేను వానిని శ్రద్ధతో చదివితిని. వానిని చదివిన తరువాత నామతమున కనేకమంది ప్రజలపై గల పలుకుబడిని నేను గ్రహింపగలిగితిని. ఇస్లాముమతము జనసామాన్యమునకు చెందు హిందూమతమువలెనే (యదిసందేహాస్పదము) మానసిక సంఘర్షణములేనట్టి యొకభద్రమగు నాశ్రయమును ప్రసాదించెను. ఈ జీవితములోని దోషములను కుడిగట్టగల భవిష్యజ్జీవితము నది భీమాచేసి పెట్టును!

ఈవిధముగ తలదాచుకొనజూచుట నాకసంభవముగ నుండెను. తుపానులతోను అలలతోను నిండియుండు బహిరంగ సముద్రమునే నేను వాంఛింతును. చనిపోయిన తరువాత జరుగు విషయములందు, పరజీవితమునందు నాకంత యభిరుచిలేదు. నాకీ జీవితములోని సమస్యలే నామనస్సునను నింపునంతటి యాకర్షవంతముగ కాన్పించును. ప్రధానముగ నైతికమయినదేయైనను (మతవిరుద్ధము లేక మతమును సందేహించునట్టిదియైన) చీనాదేశస్థుల సాంప్రదాయికదృష్టి (దానిని జీవితమునకు

వర్తింపచేయుటలో నేనంగీకరింపకపోవచ్చును.) సన్నాకర్షించును. మన మనుసరింపవలసిన మార్గము మనము జీవింపవలసిన విధము నాకు ప్రధానములు. జీవితమును తిరస్కరించుట దాని నర్థముచేసికొనుట కాజాలదు. దానిని స్వీకరింపవలెను; దానికి తగిన సన్నాహము చేసికొని దానిని చక్కబరచవలెను. కాని మామూలు మతదృష్టికి యీప్రపంచ ముతో సంబంధములేదు. అది నిర్మలమైన యాలోచనలకు శత్రువువలె కాన్పించును. ఏలనన నదిస్థిరములైన మార్చకూడని సిద్ధాంతములను ధర్మపన్నములను నిరభ్యంతరముగ నంగీకరించుపునాదులమీద నిర్మింప బడుటయేగాక నుదేశికము, భావము, రాగము అను పునాదులనుగూడ నంగీకరించెను. ఆత్మకు సంబంధించినవి, ఆధ్యాత్మికములు అని నేను భావించువాని కది యనేకమైళ్లదూరములోనుండును. అంతకుపూర్వము భావింపబడిన భావములకు సత్యము సరిపడక పోవచ్చుననుభయముచే నది బుద్ధిపూర్వకముగ లేదా యబుద్ధిపూర్వకముగ సత్యముపట్ల కండ్లు మూసికొనును. అద సంకుచితమైనది; ఇతరభావములను యితర యభి ప్రాయములను అదియెంతమాత్రమును సహింపనేరదు; అది తన కేంద్ర మునుదాటక అహంకార పూరితమయి యుండును. స్వార్థపరులచేతను సమయానుకూల స్వాహాపరులచేతను అది తఱచుకొల్లగొట్టబడును.

మతముగలవారిలోతరచునుత్తమోత్తమమైన నైతిక,యాధ్యా త్మిక వ్యక్తులుండి యుండలేదనిగాని, యిప్పుడులేరనిగాని దీనియర్థము కాదు. నీతిని, యాధ్యాత్మికములను పరమునకుచెందు ప్రమాణమును బట్టిగాక నిహప్రమాణమునుబట్టి విమర్శింపవలసినదో మతదృష్టి. యొక జాతియొక్కయు ప్రజయొక్కయు నైతిక,యాధ్యాత్మికాభివృద్ధికి సహాయ పడకపోవుటయేగాక దానికభ్యంతరముగగూడ నుండునని దీనిభావము. సాధారణముగ మతము సంఘమునకతీతమైన భగవంతుని లేక పర బ్రహ్మమునుచూచు ప్రయత్నమగుచున్నది. మతాభిలాషికి సాంఘిక

శ్రేయస్సుగాక తన ముక్తియే కావలెను. యోగి స్వార్థమును నాశము చేయవలెనని ప్రయత్నించుచు ఆవిధానములో సాధారణముగ తానును చిక్కుకొనును. నైతిక ప్రమాణములకు సాంఘికావసరములతో సంబంధములేదు. కానియవి పాపమను నత్యంతమానసిక సిద్ధాంతముపై నిర్మింపబడెను. నిబంధనలతో నున్నమతము విధాయకముగ స్వాపి్రయో జనపర్వాతమగును. కనుకనది తప్పనిసరిగ మార్పును, అభివృద్ధిని యెదు ర్కొను శక్తియే యగును.

మొదటిదినములలో క్రైస్తవచర్చి, తమ సాంఘికస్థితిని చక్క బరచుకొను బానిసలకు సహాయపడలేదను సంగతి సువిదితము. ఆర్థిక పరిస్థితులవలన బానిసలు యూరపుయొక్క మధ్యయుగములో సామం తులకమ్ముడుపోయిన నౌకరులైరి. రెండువందల యేండ్లక్రితమువరకు చర్చికి యెట్టిదృష్టియుండెనో లండనుబిషప్ అమెరికా దక్షిణకాలనీల లోని బానిసల యజమానులకు (1727లో) వ్రాసిన యొకయుత్తరము వలన తెలియుచున్నది.

“క్రైస్తవమతము, జీససుయొక్క బోధలను స్వీకరించుట - ఇది నాగరికసంబంధమైన యేధర్మములోగాని, ఆస్తిలోగాని యెట్టికనీసపు మార్పునుచేయవు; కాని యీయన్ని విషయములలోను అవియేస్థితి లోనున్నమనిషిని యాస్థితిలోనే యుంచును. క్రైస్తవమతము పాప బంధమునుండియు, సైతానునుండియు మానవుల లోభ, మోహ, మాత్సర్యాదులనుండియు మోక్షమునిచ్చును; కాని వారిబాహ్య పరి స్థితివిషయమై-యది యంతకు మునుపెట్టిదైయైనను- బానిసత్వమైనను, స్వాతంత్ర్యమైనను, వారుక్రైస్తవు లగుటవలనను, ‘మంత్రోదకము’ తీసికొనుటవలనను వారిలో నెట్టిమార్పును కలుగజాలదు” అని యా బిషప్ వ్రాసెను.

†

నేను నిబంధనలతోనున్న యేమతమును దాపరికము లేకుండ నిట్లు వ్యక్తపరచెదను; కాని ప్రస్తుత సాంఘికక్షేమమును గురించియు, ఆ స్థితినిగురించియు దానిదృష్టి ముఖ్యముగ నిట్లేయుండును.

శబ్దములు, వాటంతటవియవి, భావమును తెలుపుటకు చాలయసంపూర్తిసాధనములని మనమెరుగుదుము; తరచుచుఅవి యనేకవిధముల నర్థముచేసికొనబడుచున్నవి. 'రెలిజియన్' అనుపదమువలె (లేక నీయర్థమిచ్చు యితరభాషలలోని పదములవలె) బహుశః యేభాషలలోని యేశబ్దమునుకూడ ననేకప్రజలచేత ననేకవిధముల నర్థముచేయుచుందురు. ఈశబ్దమును వినుటవలనగాని, చదువుటవలనగాని బహుశః యేయిద్దరు మనుష్యులకు నొకేభావములుగాని, రూపములుగాని యుత్పన్నము కాజాలవు. ఆభావములలోను, రూపములలోను, పూజలు, పురస్కారములు, కర్మకాండ, వేదములు, పవిత్రగ్రంథములు, నీతులు, సిద్ధాంతములు, భక్తి, ప్రేమ, భయము, ద్వేషము, దయ, త్యాగము, సన్యాసము, ఉపవాసము, విందులు, ప్రార్థన, ప్రాచీనచరిత్ర, వివాహము, మృత్యువు, పరము, కోట్లాటలు, బుర్రలుపగులగొట్టుట యిత్యాదులెన్నియోయుండవచ్చును. ఇన్నివిధములైన రూపములు, అర్థములు నుండుటచేకలుగు గందరగోళము సంగతియటుండ, యుద్రేకములేని యోచనల నసంభవముచేయునట్టి బలమైన యుద్రేకమెప్పుడును యుండితీరును. 'మతము' అనుపదము సరియైనయర్థమును (దానికొక యర్థముండిన యెడల) కోల్పోయి కేవల గందరగోళమును మాత్రమే చేయుచున్నది; తరచుదానికనేక విరుద్ధార్థములుండుటచే నదియంతుపొంతులేని వాదనకు, చర్చకు నావకాశమిచ్చుచున్నది. మనము దానినుపయోగించుట పూర్తిగమానివేసి యంతకంటె స్వల్పమైన యర్థములుగలవేదాంతము, ఆధ్యాత్మికములు, నీతులు, మనఃశాస్త్రము, ధర్మము, పూజాపురస్కారములు, దివ్యశాస్త్రము మొదలగునట్టి వానినుపయో

గించిన చాలభాగుండును. ఈపదములుకూడ నస్పష్టమైనవే కాని 'మతము'కంటె వీనికున్నవ్యాప్తి చాలతక్కువ. ఒకగొప్పలాభమేమనిన 'మతము' అనుపదము నావరించునట్టి భావములు, ఉద్రేకములు యీపదములకింకను అంతగా కల్పింపబడలేదు.

కనుక మతమన (దానికెన్ని యనేకర్థములున్ననుదానినే వాడుకొనునెడల) నేమి? బహుశః అదివ్యక్తియొక్క యాంతరంగికాభివృద్ధి; శ్రేయస్కరమని తలంపబడినమార్గమున నతనిబుద్ధి వికసించుటయు కావచ్చును. ఆమార్గమునుగురించి మరల తర్కము బయలుదేరును. కానిమతమునుగురించినాకు తెలిసినంతవరకు, నది యీయాంతరంగికమార్పు కావలెననియే చెప్పును. బాహ్యపరివర్తనము యీయాంతరంగికాభివృద్ధి యొక్క ఫలితమేయని యదిభావించును. ఈయాంతరంగికాభివృద్ధి బాహ్యపరిసరముల నత్యంతశక్తితో చక్కబరచుననుటలో నెట్టి సందేహమునులేదు. కాని బాహ్యపరిసరము ఆంతరంగికాభివృద్ధికి మిక్కిలి తోడ్పడుననుట కూడ చాలస్పష్టమైన విషయము. అవియొకటికొకటి తోడ్పడును. ఆధునిక పారిశ్రామిక పాశ్చాత్యఖండములలో బాహ్యభివృద్ధి యాంతరంగికాభివృద్ధి నెక్కువగ దిగద్రొక్కివేసెననుట సామాన్యమాటయయ్యెను. కాని (ప్రాచ్యులలో చాలమంది యనుకొనునట్లు) మనము పారిశ్రామికముగ వెనుకబడి యున్నాము కనుక, మన బాహ్యభివృద్ధి నెమ్మదిగనున్నది కనుక మన యాంతరంగిక పరిణామము గొప్పదియని యర్థము కానేరదు. ఇట్టి పిచ్చిభ్రమలతో మనము మనల నోదార్చుకొన ప్రయత్నించుచు మనము తక్కువవారమను భావమును పోగొట్టుకొన బ్రయత్నించుచున్నాము. వ్యక్తులుకొందఱు పరిస్థితులను, పరిసరములను తరించి గొప్ప యాంతరంగికోన్నతిని పొందవచ్చును. కాని పెద్దబృందములకును, జాతులకును ఆంతరంగి పరిణామము కలుగుటకు పూర్వము కొంత బాహ్యభివృద్ధి యవసరము.

ఆర్థికపరిస్థితులకు దాసుడైనవాడు, జీవిత సంరంభముచే నలిగిపోవు వాడు యెట్టియుత్తమమైన యాంతరంగిక జ్ఞానమును సాధింపజాలడు. అట్టి వారతిస్వచితు. అణగద్రొక్కబడి, కొల్లగొట్టబడునట్టి తరగతి యెన్నడును ఆంతరంగికాభివృద్ధిని పొందజాలదు. రాజకీయముగను, ఆర్థికముగను, యితరజాతికి బానిసయై నిర్బంధింపబడి, కొల్లగొట్టబడి, నలిగిపోవునట్టిజాతి యాంతరంగికాభివృద్ధి నెన్నటికిని సాధింపజాలదు. ఈవిధముగ నాంతరంగికాభివృద్ధికిగూడ బాహ్యస్వేచ్ఛయు, తగిన పరిసరములును అవసరమగుచున్నవి. బాహ్యస్వేచ్ఛను సంపాదించుటకును, ఆంతరంగికాభివృద్ధి నాటంకపరచువానిని తీసివేయునట్లు పరిసరములను మార్చుటకును అవలంబింపబడు విధానము మన నిజలక్ష్యమునకే హాని చేయునట్టిదిగ నుండగూడదు. మన లక్ష్యముకంటె మన మవలంబించు సాధనమే యెక్కువముఖ్యమైనదియని గాంధీజీ చెప్పినప్పు డతని దృష్టిలో నిట్టిభావమే యుండెనని నేననుకొనెదను. కాని యాసాధన మన లక్ష్యమునకు తీసికొనిపోవునట్టిదిగ నుండవలెను. లేనిచో నది యంతయు వ్యర్థప్రయత్నమగును; అది మరింత బాహ్యాభ్యంతర యధఃపతనమునకు గారణముకావచ్చును.

"మతములేకుండ నేనును జీవింపజాలను" అని గాంధీజీ యొకచోట వ్రాసెను. "హేతువాదాహంభావముచేత మతముతో తమకెట్టి సంబంధమును లేదని ప్రకటించువారు కొందఱుకలరు. కాని యది "నేను గాలిని పీల్చుచున్నాను కాని నాకుముక్కు లేదు" అనునట్లుండును. మరియొకచోట నతడిట్లనెను."సత్యముపట్ల నాకుగలభక్తియే నన్ను రాజకీయరంగములోనికిదింపెను. మతమునకు రాజకీయములతో నెట్టిసంబంధమును లేదని చెప్పువారికి మతమున కర్థము తెలియదని నేనెట్టిసందేహలేశమును (అయినను అతిసవినయముగ) లేకుండ చెప్పగలను". మతమును రాజకీయములనుండియు, జీవితమునుండియు బహిష్కరింపగోరువారితో

చాలమంది "మతము" అనుపదమున కతడు చెప్పుయర్థమునుగాక వేరొక విపరీతార్థము నిచ్చుచున్నారని యతడు చెప్పినయెడల బహుశః మరింత యొప్పుగనుండెడిది. అతడుదానిని మతమును విమర్శించువారి యర్థముకు భిన్నమైన-బహుశః అన్ని భావములకంటె నెక్కువగ నైతిక భావములో - యర్థములో నుపయోగించుచున్నాడని స్పష్టమగుచునే యున్నది. ఒకేపదమును వివిధార్థములతో నుపయోగించుట పరస్పర సమన్వయమును మరింతకష్టమొనర్చుచున్నది.

మతమునకు జాన్ డ్యూయీ పండితుడు చాల యాధునికమైన నిర్వచనమును (మత తత్పరులుదీనినంగీకరింపరు) యిచ్చెను. అతనిప్రకారము "ముక్కలు ముక్కలుగ నుండునట్టియు, మారుచుండునట్టియు జీవితవిషయములలో యథార్థమైన మానసికదృష్టిని ప్రవేశపెట్టునదేదియైనను" మతమనబడును. లేక "ఒకయాదర్శపూర్వకమైన లక్ష్యముకొఱకు (దానియొక్క సామాన్యమైనట్టియు, శాశ్వతమైనట్టియు విలువ యందుండు నమ్మకముచేత) యెన్నియాటంకములనైనను, యెంతటి వ్యక్తిగతనష్టమునైనను భరించుచు చేయబడునట్టి యేకార్యమైనను వస్తుతఃమతమే." ఇది మతమైనచో నిశ్చయముగ దీనిపట్ల నెవనికిని యెట్టి యభ్యంతరము నుండజాలదు.

రోమారోలా కూడ నిబంధనలతో గూడిన సనాతనమతస్థులకు బహుశః భయము గొల్పునట్లు మతముకు విశేషార్థమును చెప్పెను. అతడు తాను రచించిన 'రామకృష్ణుని జీవితము'లో నిట్లు చెప్పెను.

"ఎట్టి మతవిశ్వాసమునకును కట్టుబడని చాలమంది లేక కట్టుబడుటలేదనివిశ్వసించువారు, (అయిననుయథార్థమునకు బుద్ధీంద్రియాతీతమైన తెలివిలో నిమగ్నులై జీవించువారు) దానిని సామ్యవాదము, కమ్యూనిజము, భూతదయాళుత్వము, జాతీయత, చివరకు హేతువాదము అని యందురు. ఒక భావముయొక్క మూలమును నిశ్చయించునది

దాని గుణము కాని దాని లక్ష్యముకాదు; ఆ భావము మతమునుండి బయలుదేరుచున్నదా లేదా యనునది దాని గుణమునుబట్టి నిర్ణయింప బడవలెనే గాని దాని లక్ష్యమునుబట్టి నిర్ణయింపబడరాదు. అది నిర్భయముగ సత్యాన్వేషణమున కెట్టి కష్టములనైన నెదుర్కొని, యేకైక దీక్షతో నెట్టి త్యాగముకైనను సంసిద్ధతను చూపినచో నేను దానిని మతసంబంధమైనదని యనెదను. ఏలనన నది ప్రస్తుత సాంఘిక జీవితము కంటెను, సమగ్రమైన మానవలోక మంతటికంటెను సుస్థిరమైనదే పురుషార్థలక్ష్యమను విశ్వాసమును తెలుపుచున్నది. నిరీశ్వర వాదము కూడ, సత్యాన్వేషణ తత్పరతగల తీవ్రపరిశ్రమతులనుండి బయలుదేరునపుడు (అది దుర్బలత్వమును గాక, శక్తిని ప్రదర్శించునపుడు) మత సంబంధమైన 'ఆత్మ' యొక్క మహాసైన్య పరిస్థానములోనే జేరుచున్నది."

రోమారోలాయొక్క షరతులను నిర్వహింపగలనని నేను చెప్ప సాహసింపజాలను. కాని యీ షరతులమీద నామహాసైన్యముయొక్క విధేయతగల సైనికునివలె నుండుటకు నేను సంసిద్ధుడనై యుంటిని.

---

# ౪౮

## బ్రిటిషు ప్రభుత్వ "ద్వంద్వ నీతి"

ఎరవాడ జయిలునుండియు, తరువాత బయటనుండియు గాంధీజీ యాదేశానుసారము హరిజనోద్యమము నడిపింపబడుచుండెను; దేవాలయ ప్రవేశమునకు గల యాటంకములను తొలగింపవలెనను గొప్ప యాందోళన బయలుదేరెను. అసెంబ్లీ సభలో నట్టి బిల్లు ఒకటి ప్రవేశపెట్టబడెను. అప్పుడొక విఖ్యాత కాంగ్రెసు నాయకుడు ఢిల్లీలో నిల్లిల్లు తిరుగుచు, అసెంబ్లీ సభ్యుల నందరిని దర్శించుచు, నీదేవాలయ ప్రవేశ బిల్లుకొరకు వోటులను భిక్షించు నద్భుతప్రదర్శనము జరిగెను. గాంధీజీ స్వయముగ నతనిద్వారా అసెంబ్లీ సభ్యులకొక వార్త పంపెను. అప్పటికింకను శాసనోల్లంఘనము జరుగుచునే యున్నది; ప్రజలు జయిళ్ళకు పోవుచునేయున్నారు. కాంగ్రెసు అసెంబ్లీని బహిష్కరించెను; మన అసెంబ్లీ సభ్యులందరును దానిని వీడివచ్చిరి. మిగిలిన మొండిముక్కయు కాళీలను భర్తీచేసినవారును కలిసి యావిషమ సమయములో కాంగ్రెసు నెదిరించుచు, ప్రభుత్వమును బలపరచుచు తమ ఘనతను చాటుకొనిరి. వారిలో నధిక సంఖ్యాకులు ఆర్డినెన్సుల యసాధారణాధికారములకు కొంత స్థిరత్వమును ప్రసాదించు నిర్బంధ చట్టములను చేయుటలో ప్రభుత్వమునకు తోడ్పడిరి. వారు ఒటావా సంధిని దిగమ్రింగిరి. వారు ఢిల్లీ, సిమ్లా, లండనులలోనున్న ఘనులతో భోజనభాజనములను చేసిరి; విందులను గుడిచిరి; భారతదేశములోని బ్రిటిషు ప్రభుత్వముకు జేజేలు పెట్టుటలో జేరిరి; భారతదేశములోని "ద్వంద్వనీతి"యని పిలువబడుదాని విజయముకొరకు ప్రార్థించిరి.

అప్పుడున్న పరిస్థితులలో గాంధీజీ చూపిన ప్రాధేయతకు నేనాశ్చర్యపడితిని, కొద్దివారములక్రితమే తాత్కాలికాధ్యక్షుడుగ పని

చేసిన రాజగోపాలాచారిగారి భగీరథ ప్రయత్నముల కంతకంటె నెక్కువగ నాశ్చర్యపడితిని. ఈచర్యవలన నిశ్చయముగ శాసనోల్లంఘనము నష్టపడెను. కాని దీనిలోనున్న నైతికపతనమే నాకెక్కువబాధ కలిగించెను. గాంధీజీగాని, మరేకాంగ్రెసు నాయకుడుగాని యిట్టిచర్యలను ప్రోత్సహించుట యవినీతిగను, జయిళ్ళలోనున్నయసంఖ్యాకులయెడలను, పోరాటమును సాగించుచున్న వారియెడలను క్రొంచెమించుమించునమ్మక స్వామిద్రోహముగను నాకు కాన్పించెను. కానియతడు దానిని మరి యొక విధముగ చూచునని నేనెరుగుదును.

ఈ దేవాలయప్రవేశబిల్లు సందర్భములో ప్రభుత్వవైఖరి (యప్పుడును, తరువాతను) సత్యమును వెల్లడించెను. దానిని ప్రోత్సహించిన వారి మార్గమునకు అది కల్పింపగలిగినన్ని కష్టములను గల్పించెను; వాయిదావెంబడి వాయిదాలను వేసెను; దానికివ్యతిరేకమును ప్రోత్సహించెను. తరువాత తుదకుతానే వ్యతిరేకముగనున్నట్లు ప్రకటించి దానిని చంపివేసెను. భారతదేశములోని యన్నిసంఘసంస్కారోద్యమములపట్లను (హెచ్చుతగ్గుస్థాయిలో) దాని వైఖరి యట్లేయుండెను. మతముతో జోక్యమును కలిగించుకొనము అను మిషమీద నది సాంఘికాభివృద్ధి నాటంకపరచెను. కాని మనసాంఘికదోషములను విమర్శించుటకు గాని, యితరులనట్లుచేయప్రోత్సహించుటకుగాని యిదివారికెట్టియాటంకమును కలిగింపదని వేరుగచెప్పనక్కరలేదు. అదృష్టవశాత్తు శారదా శిశువివాహనిర్బంధబిల్లు చట్టమయ్యెను. కానిప్రభుత్వము యిట్టిచట్టముల నమలుపరచుటకెంత యయిష్టముగనుండెనో యీదురదృష్ట చట్టము యొక్క తరువాతచరిత్ర (మరేదియుచూపజాలనట్లు) విశదముచేయు చున్నది. వింతయైననేరములను సృష్టించుచు, నొకరికొరకు మరియొకనిని శిక్షించుటకు తగినబందోబస్తులను చేసికొనుచు, నిశీథమందు ఆర్డినెన్సులను సృష్టింపగలప్రభుత్వము, వానినుల్లంఘించినవారలకు లక్షలకొలది

జనమును జయిళ్ళకుపంపగలిగినప్రభుత్వము శారదా చట్టమువంటి క్రమమైనచట్టము నమలు పరచుటకు జంకెనుకాబోలును! ఈఆక్టుయొక్క మొట్టమొదటిఫలితమేమనిన నిది యేదోషమును డీకొనుట కుద్దేశింపబడెనో యది యద్భుతముగ పెరిగిపోయెను; ఈఆక్టు అతితెలివితక్కువగా నిచ్చిన యారుమాసముల సావకాశమును తీసికొనుటకు ప్రజలు త్వరపడిరి. తరువాత నీఆక్టు కొంచెమించుమించుగ నొకపరిహాసమని కనుగొనబడెను; ప్రభుత్వమెట్టి చర్యనుతీసికొనకుండ దీనినిచులకనగ నిర్లక్ష్యముచేయవచ్చునని ప్రజలుగ్రహించిరి. అధికారరీత్యా ప్రచారము చేయుటకు ప్రయత్నలేశమైనను గావింపబడలేదు. గ్రామములలో చాలమందికి ఆక్టుసంగతియే తెలియదు. వారు హిందూ, ముస్లింగ్రామ పురోహితులవలన దీనియొక్క అవకతవక కథను వినిరి. యథార్థవిషయములు ఆపురోహితులకే తెలియవు.

హిందూదేశములో బ్రిటిషు ప్రభుత్వమువారు సాంఘిక దోషములపట్లచూపు అసాధారణసహనము వానియెడలగల పక్షపాతబుద్ధిచే కలిగినదికాదు. వానిని రూపుమాపుటకు వారంతగా లెక్కచేయరనుట సత్యము. ఏలనన యీదోషములు వారుహిందూదేశమును పరిపాలించుటకుగాని, దాని నిధులను కొల్లగొనుటకుగాని యడ్డమురావు. సాంఘిక సంస్కరణములను చేయుటవలన వివిధములైన ప్రజలకు కోపమును కలిగించునట్టి యుపద్రవమెప్పుడును కలదు. రాజకీయరంగములో కావలసినంత కోపమును యెదుర్కొనవలసియుండుటచే బ్రిటిషు ప్రభుత్వము తమకష్టములకు క్రొత్తవానిని చేర్చుకొననిచ్చగింపకుండెను. కాని సంఘసంస్కారమును చేయగోరువానిదృష్టిలో నిప్పటిస్థితిగతులు అధ్వాన్నముగనుండెను. ఏలనన బ్రిటిషువారంత కంత కీసాంఘికదోషములకు పైకికాన్పించని రక్షణనిచ్చుచున్నారు. భారతదేశాభివృద్ధి కత్యంత భంగకారకులైనవారి సన్నిహితసంపర్కముచేతనేవారి ట్లు

తయారైరి. వారిపరిపాలనకు వ్యతిరేకము హెచ్చినకొలది వారుకొ్రొత్త స్నేహితులను చూచుకొనుచుండవలెను. నేడు భారతదేశములో కల తత్త్వవాదులలో నతివాదులును, జ్ఞానము, సంస్కారము వలదనువారును బ్రిటిషుప్రభుత్వము కచంచలమైన మూలస్తంభములు. ముస్లింకుల సంబంధమైన సంస్థలు ప్రతివిషయములోను - రాజకీయ, ఆర్థిక, సాంఘికము లన్నింటిలోను - యభివృద్ధి భంగకరములని ప్రసిద్ధిచెందెను. వానికి హిందూమహాసభ పోటీ. కాని యీ వెనుకకు పరుగెత్తుపందెములో వారితాతలు మఱియొకరున్నారు. వారు సనాతనులు. వారు మతసంబంధముగ నెట్టి యభివృద్ధియు కూడదనుటలో నతివాదులేగాక బ్రిటిషుపరిపాలన యెడల తీవ్రమైన రాజభక్తి (అధమము వారట్లు బిగ్గరగా చెప్పుకొందురు.) కలవారు.

శారదాచట్టమును ప్రజలకు తెలుపుటకును అమలుపరచుటకును బ్రిటిషుప్రభుత్వము మిన్నకయుండి యెట్టిచర్యయు తీసికొనకపోయినను కాంగ్రెసు, తదితర యనధికారసంస్థలు దానితరఫున యేలప్రచారము చేయలేదు? బ్రిటిషువిమర్శకులును, యితర విదేశవిమర్శకులును తఱచు యీ ప్రశ్నవేయుచుండిరి. కాంగ్రెసు గతపదిహేను సంవత్సరముల నుండి (ముఖ్యముగ 1930 లగాయితు) జాతీయస్వాతంత్ర్యము కొరకు బ్రిటిషు ప్రభుత్వముతో ప్రాణములను బలియిచ్చు పోరాటములో మునిగియుండెను. ఇతర సంస్థలకు నిజమైనబలముగాని ప్రజలతో నెట్టి సంబంధముగానిలేదు. ఆదర్శములను, నైతికబలమును, ప్రజాసామాన్యములో పలుకుబడియునుగల స్త్రీ, పురుషులు కాంగ్రెసులోని కీడ్యబడి తమకాలములో చాలభాగము బ్రిటిషు జయిళ్ళలో గడుపుచుండిరి.

తక్కిన సంస్థలు ప్రజాసంపర్కమునకు భయపడు కొద్దిమందిచే చేయబడు తీర్మానములను దాటి పయికి పోజాలకుండెను. అవి చాల 'పెద్దమనిషి తరహా'గా పనిచేసెను; అఖిలభారత స్త్రీసమాజమునకై

(స్త్రీపనిచేయునట్లు) పనిచేసెను. వారికి తీవ్రమైన ప్రచారముచేయు సత్తువలేదు. అదిగాక ఆర్డినెన్సులు, వానివెనుకవచ్చిన చట్టములును అన్ని ప్రజాహితకార్యములను భయంకరముగ నణచివేయుచుండుటచే వారుగూడ నిర్వీర్యులైరి. సైనికశాసనము విప్లవచర్యల నణచివేయ వచ్చును. కాని దానితోపాటు అవి నాగరికతను అత్యంతనాగరిక కార్యములను గూడ నిర్వీర్య మొనర్చును.

కాని కాంగ్రెసు, తదితరయధికారేతర సంస్థలు సంఘసంస్కారము కొరకెక్కువగ పనిచేయజాలక పోవుటకు గలకారణ మింతకంటె గంభీరమైనది. జాతీయత యను వ్యాధి మనలను బాధించుచున్నది. అది మన దృష్టినంతను మ్రింగివేయుచున్నది. మనకు రాజకీయస్వాతంత్ర్యము వచ్చువరకును అదియట్లే చేయును. బెర్నార్డుషా చెప్పినట్లు "జయింపబడినజాతి రాచపుండుగల మనిషివంటిది; వాడు మరిదేనిని గురించియు యోచింపజాలడు...ఒకజాతికి జాతీయోద్యమము కంటె గొప్ప శత్రువువేరొకటిలేదు. అది యణచివేయబడిన యొక సహజ ధర్మముయొక్క బాధను తెలుపు చిహ్నముమాత్రమే యగుచున్నది. జయింపబడిన దేశములు ప్రపంచప్రస్థానములో తమస్థానమును కోల్పోవుచున్నవి. ఎందుచేతనన అవి జాతీయస్వాతంత్ర్యమును సంపాదించి తద్వారా జాతీయోద్యమములను వదలించుకొను ప్రయత్నముకంటె వేరేమియు చేయజాలవు."

ఎన్నుకొనబడిన మంత్రులకు కొన్ని శాఖలు బదిలీచేయబడినను ప్రస్తుతపరిస్థితులలో మనమెట్టి సాంఘికాభివృద్ధిని చేయజాలమని గత యనుభవము తెలుపుచున్నది. ప్రభుత్వమువారి యద్భుతమైన స్తబ్ధత్వము కన్సర్వేటివుల కెప్పుడును సహాయకారిగ నుండెను. అనేక పురుషాంతరములనుండి బ్రిటిషు ప్రభుత్వమువారు స్వతంత్రశక్తిని చంపివేసి నిరంకుశముగ లేక వారేచెప్పినట్లు మన సంరక్షకులుగ పాలించిరి.

అధికారులుచేయు నెట్టిగొప్ప ప్రయత్నమునైనను అది యామోదింపజాలదు. అది దానికి గూఢార్థములను కల్పించును. హరిజనోద్యమముకు (దానిస్థాపకులన్నివిధములైన జాగ్రతలనుతీసికొనినను) అప్పుడప్పుడు ప్రభుత్వాధికారులతో సంఘర్షణవచ్చుచుండెను. సబ్బునుఅధికముగ నుపయోగించవలసినదను నొక ప్రచారమును దేశమునందంతటను కాంగ్రెసువారు ప్రారంభముచేసినచో ననేక విధముల ప్రభుత్వముతో సంఘర్షణసంభవించునని నేను సాక్షిగచెప్పగలను.

ప్రభుత్వము తలచుకొనినచో ప్రజలను సంఘసంస్కార సుముఖులనుచేయుట యెక్కువ కష్టమైనపని యనినేననుకొనెను. కాని విదేశపరిపాలకు లెప్పుడును సందేహించుచు మార్పుచేయువిధానములో దూరముపోజాలరు. విజాతీయ సంపర్కమును తీసివేసి ఆర్థికపరిస్థితులకు ప్రాముఖ్యత నిచ్చినచో పటుత్వముగల పరిపాలన గొప్పసాంఘిక సంస్కారములను చులకనగా ప్రవేశపెట్టవచ్చును.

కాని జయిలులో మా మనస్సులు సంఘసంస్కారము శారదా చట్టము హరిజనోద్యమములతో (శాసనోల్లంఘనమున కడ్డమువచ్చెనని హరిజనోద్యమముపట్ల నాకుకొంచెము కోపముకలుగుట కప్ప) నిండియుండలేదు. 1933 మే మొదటివారములో శాసనోల్లంఘన మారు వారములు ఆపివేయబడెను. తరువాత నేమిజరుగునో యని మేమాతురతతో చూచుచుంటిమి. ఆ విరామమే యుద్యమమునకు తుది సంఘాతమయ్యెను. జాతీయపోరాటమును మనము మన యిష్టమువచ్చినప్పుడు బిగించుచు విడిచిపెట్టుచు చెరలాట మాడజాలము. దానిని విరమించుటకు పూర్వమే యుద్యమమును నడిపించిన నాయకత్వము దుర్బలముగను నిర్వీర్యముగను నుండెను. చిన్నచిన్న కాన్ఫరెన్సులు జరుపబడుచు ననేకవదంతులు చెలరేగుచు చురుకైనపని మొండిపడుచుండెను. కొంతమంది తాత్కాలికాధ్యక్షులు చాల గౌరవనీయులు. కాని

తీవ్రమైన యుద్యమమున కట్టివారిని సేనాధిపతులుగ నియమించుట వారియెడల క్రూరత్వమేయగును. వారలసిపోయిరి. క్లిష్టస్థితినుండి తప్పుకొనవలెనని వారికికోరిక యున్నట్లనేక సూచనలు కాన్పించుచుండెను; పెద్దవారి లయూగిసలాటయు, అనిశ్చయమును నసంతృప్తిని కలిగించెను. కాని కాంగ్రెసు సంఘములన్నియును అక్రమసంఘములగుటచే దీనిని సక్రమముగ వ్యక్తముచేయుట యసంభవమయ్యెను.

అప్పుడు గాంధీజీయొక్క యేకవింశతి దినోపవాసము, జయిలునుండి విడుదలబడుట, ఆరువారములు శాసనోల్లంఘనమును విరమించుటసంభవించెను; ఉపవాసము పూర్తియైనతరువాత నతడు నెమ్మదిగ కోలుకొనెను. జూన్ నెలమధ్యభాగమున శాసనోల్లంఘన విరామము మరియారువారములు హెచ్చింపబడెను. ఈలోపున ప్రభుత్వమువారి తీవ్రవిధానమెంతమాత్రమును సడలలేదు. అండమానుద్వీపములలో రాజకీయ ఖయిదీలను (వంగదేశములో విప్లవదౌర్జన్య చర్యలకు శిక్షింపబడినవారచ్చటకు పంపబడిరి) యుక్తముగ చూడకపోవుటచే నిరశనవ్రతము ప్రారంభమయ్యెను. అందులో నొకరిద్దరు (చనిపోవువరకు నుపవసించి) చనిపోయిరి; ఇతరులు చనిపోవనుండిరి. అండమానులలో జరుగుచున్నదానిని నిరసించుటకు భారతదేశములోజరుపబడు సభలలో నుపన్యసించువారు నిర్బంధింపబడి శిక్షింపబడిరి. బాధపడవలసి యుండుటయేగాక, ఖయిదీలు నిరశనదీక్షయను భయంకరమైన యగ్నిపరీక్షకాహుతియగుచుండ (నిరసనచూపుటకు మరియొకమార్గములేక) నోరెత్తి చెప్పుకొనుటకుగూడ మేము నోచికొనలేదు. కొన్నినెలలైన తరువాత 1933 సెప్టెంబరులో (నేనుజయిలువెలుపలనున్నపుడు) రవీంద్రనాథటాగూరు, సి. యఫ్. ఆండ్రూసు మొదలగు ననేకమంది విఖ్యాతపురుషుల సంతకములతో నొక అప్పీలుచేయబడెను. వీరికి కాంగ్రెసుతో నెట్టిసంబంధమునులేదు. అండమాను దీవులలోనున్న

ఖయిదీల నెక్కువభూతదయతో చూడవలసినదనియు, వారిని భారత దేశజయిళ్ళకు మార్చవలసినదనియు వారు కోరిరి. భారతప్రభుత్వ హోమ్ మెంబరు యీ స్టేటుమెంటుపట్ల తన తీవ్రయసమ్మతిని వెలిబుచ్చుచు ఖయిదీలయెడల సానుభూతినిచూపుచు సంతకములను చేసిన వారిని కఠినముగ విమర్శించెను. తరువాత (నాకుజ్ఞాపకమున్నంతవరకు) నట్టిసానుభూతిని వెలిబుచ్చుట వంగదేశములోనొక శిక్షార్హమైన నేరముగ చేయబడెను.

శాసనోల్లంఘన విరామముయొక్క రెండవఆరువారముల కాల పరిమితి ముగియులోపల గాంధీజీ పూనాలో నొక యిష్టాగోష్ఠిసభను జరుపనుండెననువార్త డేరాడూనుజయిలుకు వచ్చెను. అచ్చట రెండు మూడువందలమందిజేరిరి. గాంధీజీ సలహామీద సమూహముమీద జరుపుశాసనోల్లంఘన మాపివేయబడెను. కాని వ్యక్తిగతముగ శాసనోల్లంఘనము చేయవచ్చుననిరి. రహస్యపద్ధతులన్నియు బహిష్కరింపబడెను. ఈతీర్మానములు యెక్కువ ప్రబోధ జనకముగలేవు. కాని వానికి సంబంధించినంతవరకు నేనట్టి ప్రత్యేక అభ్యంతరమును చెప్ప లేదు. సమూహముమీదజరుగు శాసనోల్లంఘనము నాపుటయనగా వర్తమానస్థితిని గుర్తించి, దానిని స్థిరపరచుటయే! నిజముగనిప్పుడు సమాజముమీద జరుగు యుద్యమములేదు. రహస్యకార్యములు మేము పనిచేయుచున్నామని చెప్పుకొనుటకొకసాకుగ మాత్రమేయుండెను. మాయుద్యమ గౌరవమునుబట్టి చూచినచో నది తేలుచు యిపసిలిని తెచ్చిపెట్టెను. ఆదేశములను పంపుటకును, పరస్పర సంబంధమును కలిగియుండుటకును కొంతవరకిది యవసరము; కాని శాసనోల్లంఘనమే రహస్యముగ నుండరాదు.

వర్తమానస్థితిని గురించియు, మాలక్ష్యములను గురించియు పూనాలో నెట్టి నిజమైన చర్చయు జరుగకపోవుట నాకాశ్చర్య విషాద

ములను కలిగించెను. రెండు సంవత్సరముల భయంకర పోరాటమును, నిర్బంధములును జరిగినతరువాత కాంగ్రెసు సేవకులొకచోట కలుసు కొనిరి. ఈలోపల హిందూదేశములోను, బయటప్రపంచములోను చాలసంగతులు జరిగెను. బ్రిటిషుప్రభుత్వమువారి చట్టసంస్కార సూచ నలుగల శ్వేతపత్రము ప్రకటింపబడెను. ఈకాలములో మేము బలవంత ముగ మౌనము వహింపవలసియుండెను. రెండవపక్షమున విషయము లను మఱుగుపుచ్చు నిరంతర, యసత్యప్రచారము జరుగుచుండెను. ప్రభుత్వమును బలపరచువారేగాక లిబరలు పక్షమువారును, తదితరు లునుగూడ కాంగ్రెసు తన స్వాతంత్ర్యలక్ష్యమును విరమించుకొనెనని తెలుపు చెప్పుచుండిరి. కనుక మారాజకీయ లక్ష్యమును పునశ్చరణ చేసి, తిరిగి స్పష్టపరచి వీలైనచో దానికి సాంఘిక, ఆర్థిక లక్ష్యములను జేర్చియుండవలసినదని నేననుకొంటిని. దీనికిబదులు చర్చయంతయు సమూహ శాసనోల్లంఘనమునకును, వ్యక్తి శాసనోల్లంఘనమునకును సంబంధించిన మంచిచెడుగులకును, రహస్య మవసరమా కాదా యను దానికిని బంధింపబడినట్లు స్పష్టముగకాన్పించును. ప్రభుత్వముతో 'సంధి' యను కొంత వింతసంభాషణకూడ జరిగెను. గాంధీజీ (నాకు జ్ఞాపక మున్నంతవరకు) సందర్శన మీయవలసినదని వైస్రాయికి తంతి యిచ్చెను. వైస్రాయి దానికి 'నాస్తి' యను ప్రత్యుత్తరము నిచ్చెను. గాంధీకి 'గౌరవమైన సంధి'ని గురించి కొంత యుదహరించుచు రెండవతంతి యిచ్చెను. ప్రభుత్వము విజయోత్సాహముతో జాతి నన్ని విధముల నలిపివేయుటకు ప్రయత్నించుచుండ, అండమానులలో ప్రజ లుపవాసములుచేసి చచ్చిపోవుచుండ, వేటాడబడుచున్న మృగతృష్ణ వంటి యీ శాంతి యెక్కడిది? కాని, యేమి జరిగినను, యెప్పుడును సంధికోరుటయే గాంధీజి స్వభావమని నే నెరుగుదును.

నిర్బంధము మంచి జోరుగా సాగుచుండెను. బహిరంగ చర్యల నణచివేయునట్టి ప్రత్యేకశాసనములన్నియు నాచరణలో నుండెను.

1933 ఫిబ్రవరిలో మాతంండిజీ మరణించిన నాటి సాంవత్సరిక దినమున జరుగు స్మారకసభను కూడ పోలీసులు ఆపివేసిరి. అది కాంగ్రెసుకు సంబంధించని సభ. సర్ తేజ బహదరు సప్రూవంటి స్వచ్ఛమైన మితవాది దీని కధ్యక్షత వహింపవలసి యుండినను దీనికీ గతిపట్టెను. ఇక ముందు రానున్న ప్రసాదములకు నమూనాగా మనకు శ్వేతపత్రము ప్రసాదింపబడెను.

ఇది యొక చిత్రమైన పత్రము. దీని నొకసారి చదివిన వానికి నిట్టూర్పు పుట్టును. భారతదేశ మొక దేదీప్యమానమగు భారత ప్రభుత్వముగ మార్పుచెందవలసి యుండెను. ఈ ఫెడరేషనులో వివిధసంస్థానముల ఫ్యూడల్ ప్రతినిధులకు విశేషాధికార ముండును. కాని యీ సంస్థానములలో పయి వారెవరును జోక్యము కల్పించుకొనరాదు. అట్టిది సహింపబడదు. అచ్చట కలితీలేని శుద్ధ నిరంకుశత్వమే రాజ్యము చేయును. యథార్థమైన సామ్రాజ్యపాశములు, ఋణశృంఖలములు, మమ్ము శాశ్వతముగ లండను మహానగరమునకు కట్టివేయును. రిజర్వు బ్యాంకు ద్వారా యింగ్లండుబ్యాంకు కరెన్సీ నీతిని, ద్రవ్య నీతిని వశమునందుంచుకొనును. ఇదివరకెవరి కేహక్కులుగలవో యవన్నియు నభేద్యముగ కాపాడబడును. అదనముగ నూతన హక్కులు కూడ నిర్మింపబడనున్నవి. ఈ స్థాపింపబడిన హక్కుల క్షేమస్థైర్యములకొరకు మాయాదాయములన్నియు తలవరకు హామీ యివ్వబడెను. మేము గాఢముగా ప్రేమించు సామ్రాజ్యపదవులు ముట్టబడకుండ, శాసింపబడకుండ సాగుచుండును. అవి మమ్ము మరికొన్ని స్వపరిపాలనా మోతాదులకు తయారుచేయును. మాకు రాష్ట్ర స్వపరిపాలన ప్రసాదింపబడనున్నది. కాని గవర్నరు మాత్రము సర్వాధికారములను చలాయించు నుదార నిరంకుశుడయి మమ్ము క్రమము తప్పకుండ నంచును. వైస్రాయి, నిరంకుశ శిరోమణి, సర్వ సర్వాధికారి, యందరి

పైనను కూర్చొనును. తన యిష్టము వచ్చినట్లు చేయుటకు, తాను కోరినపుడు శాసించుటకు ఆతనికి సర్వాధికారములు నుండును. నిశ్చయముగ కలోనియల్ ప్రభుత్వ నిర్మాణమందు బ్రిటిషుపాలక జాతుల బుద్ధికుశలత మున్నన్నదును యింత స్పష్టముకాలేదు. హిట్లరులును, ముస్సోలినీలును వారి నెక్కువగ మెచ్చుకొనెదరు గాక! వారు భారత వైస్రాయిని చూచి యసూయపడెదరు గాక!

భారత దేశముయొక్క కాళ్ళను చేతులను బంధించిన యొక చట్టమును తయారుచేయుటయేగాక 'ప్రత్యేక బాధ్యతలు' రక్షణలు అను మరికొన్ని సంకెలలు గూడ వానికి జేర్చబడెను. వీనితో నీ దురదృష్ట దేశము కదలమెదలజాలని ఖయిదీగ చేయబడెను. నెవిల్లి ఛాంబర్లేను గారు చెప్పినట్లు "చేయబడిన సూచనలన్నింటిని మానవుని బుద్ధి సృజింపగల రక్షణ లన్నింటితోను కాపాడుటకు వారు చేయగలిగిన దంతయు చేసిరి."

మరియు నీవరములను ప్రసాదించినందులకు మేము యెక్కువ సుంకమును చెల్లించుకొనవలెననిరి. ప్రప్రథమములో కొద్దికోట్లు మొత్తముగను తరువాత వార్షికముగను చెల్లింపవలెను. చాలినంత సొమ్ము చెల్లింపనిదే, 'రక్షణ' లేనిదే మేము స్వరాజ్యమును పొందజాలము. భారతదేశము దారిద్ర్యముచే పీడింపబడుచున్నదను భ్రమలో మేముంటిమి; అది యదివరకే యెక్కువ ఋణభారముతో కృంగియుండుటచే మేము దానిని తేలికచేయుటకొరకు స్వాతంత్ర్యమును ఆశించితిమి. స్వాతంత్ర్యమును వాంఛించుటకు ప్రజలను ప్రోత్సహించిన దీశక్తియే. కాని యిప్పుడీభారము మరింత యధికమగునట్లు కాన్పించెను.

భారత సమస్యయొక్క యీ యకట వికటపు పరిష్కారము యథార్థమైన బ్రిటీషు దయారసముచే ప్రసాదింపబడెను; మనపాలకులు చాల యుదారులని మనకు చెప్పబడుచుండును. ఇదివరకెన్నడును

యే సామ్రాజ్య ప్రభుత్వమును తనంత తాను ఐచ్ఛికముగ నిట్టి యధికారమును, అవకాశములను తన పాలనలోనున్న ప్రజల కిచ్చియుండ లేదు. ఈ వరములను ప్రసాదించిన దాతలకును యిట్టి యుదారత కాశ్చర్యపడి వీని కభ్యంతరపెట్టిన వారికిని యింగ్లండులో గొప్ప చర్చ బయలుదేరెను. ఇంగ్లండు హిందూదేశముల మధ్య మూడు సంవత్సరముల దీర్ఘకాలములో ననేకమంది రాకపోకల యొక్కయు, మూడు రౌండుటేబిలు కాన్ఫరెన్సుల యొక్కయు, ననంఖ్యాకములగు కమిటీల యొక్కయు, సలహాలయొక్కయు ఫలితమిదియే.

కాని యింగ్లండును సందర్శించుట లింకను పూర్తికాలేదు. శ్వేతపత్రమును విమర్శించుటకు బ్రిటిషు పార్లమెంటుయొక్క జాయింటు సెలెక్టు కమిటీ యొకటి యుండెను. భారతీయులు దీని ముందు సాక్ష్యమిచ్చుటకును, అస్సెసర్లుగను వెళ్ళిరి. లండనులో ననేక యితరకమిటీలు కూడ సమావేశమగుచుండెను. ఏదోయొక కమిటీలో సభ్యత్వమును సంపాదించుటకు తెరచాటున గౌరవహీనమగు పోరాటములు జరిగెను. ఈ సభ్యత్వమువలన సామ్రాజ్యరాజధానికి యుచిత ప్రయాణమును, అచ్చటనుండుటయు సంప్రాప్తించును. శ్వేతపత్రములోని నల్లరాళ్ళవంటి చట్టములకు జంకని స్థైర్యశాలులు సముద్రయాన యుపద్రవములను, వాయుప్రయాణకష్టములను, అంతకంటె నెక్కువగ లండను పట్టణములో నుండుటవలన కలుగు గొప్పకష్టములను నెదుర్కొని తమ వక్తృత్వధాటిచేతను, యెదుటవాని నొప్పింపగల శక్తిచేతను శ్వేతపత్రములోని చట్టములనుమార్పుచేయ ప్రయత్నించుటకు బూనుకొనిరి. తాము బూనిన కార్యము కొంచెమించుమించు శక్యముకానిది యని వారికి తెలియును. వారట్లే చెప్పిరి. కానివారు విడిచిపెట్టువారు కారు. వారు చెప్పునది వినువారు లేకపోయినను వారు చెప్పవలసినది చెప్పుచునే యుందురు. వారిలో నొకడు, రెస్పాన్సివిస్టునాయకుడు, తక్కినవారందరు విడిచివెళ్ళిపోయి

సను బహుశః లండనులోనున్న యధికారులను దర్శనములవెంబడి దర్శనములనుచేయుచు, విందులు గుడుచుచు తానేట్టిరాజకీయమార్పులను గోరుచున్నాడో వారిహృదయములకు గట్టిగా పట్టించుటకు చివరవరకు మఠమువేసికొని కూర్చొనియుండెను. చిట్టచివరకు తన జన్మభూమికి వచ్చినపుడు (మహారాష్ట్రులుపేరుపొందినట్టి పట్టుదలతో) అతడు తన కృషిని విరమించుటకు నిరాకరించెననియు, తానుచెప్పవలసినది చెప్పువరకు లండనులో చివరవరకు నాగిపోయెననియు గంపెడాశతో నున్న ప్రజలకు చెప్పెను.

నాతండ్రి తనరెస్పాన్సివిస్టు మిత్రులలో హాస్యరసము లేదని తలచు ఫిర్యాదుచేయుచుండుట నాకుజ్ఞాపకము. అతడు పరిహాసముగా చేయు రిమార్కులవలన (వారు వాని నెంతమాత్రమును గుర్తింపలేకుండిరి.) వారితోచిక్కులు తటస్థించుచుండెడివి. తరువాతనతడు వారికి నచ్చచెప్పి శాంతింపచేయుచుండెడివాడు. మహారాష్ట్రుల యద్భుత సంగ్రామోత్సాహమును (భూతకాలమందేగాక ప్రస్తుతమాజాతీయ పోరాటములందును) మొక్కవోని ధైర్యముగల తిలకుమహాశయుని (విరిగినను వంగనివాడు) నేనపుడు తలంచితిని.

లిబరలుపక్షమువారు శ్వేతపత్రము నెంతమాత్రము నామోదింపలేదు. భారత దేశములో దినదినము జరుగుచున్న నిర్బంధములకు గూడ వారిష్టపడలేదు. అప్పుడప్పుడతి యరుదుగ వారువానిని నిరసించుచుండిరి, కాని వారుకాంగ్రెసును, అదిచేయుచున్నపనులను ఖండించుచుండిరి. వారప్పుడప్పుడు కొంతమంది ప్రధానకాంగ్రెసువాదులను జయిలునుండి విడిచిపెట్టవలసినదని ప్రభుత్వముకు సూచించుచుందురు. వారుతామెరిగిన కొంతమందివ్యక్తుల పరముగ మాత్రమే యోచింపగలరు. లిబరలుపక్షమువారును, రెస్పాన్సివిస్టులునుగూడ నికప్రజా శాంతి కొట్టియుపద్రవమును కలుగదుగనుక ఫలానవానిని విడిచిపెట్ట

వలెనని చెప్పుచుందురు. తరువాతనతడు యుక్తముగ పరివర్తింపనిచో ప్రభుత్వమువారతని నెప్పుడు పట్టుకొనినను పట్టుకొనవచ్చును. ఈసారి ప్రభుత్వమువారేకపక్షన్యాయముగగూడ నట్లుచేయవచ్చును. ఇంగ్లండులోగూడ కొంతమంది వ్యక్తులు కొంతమంది వర్కింగుకమిటీసభ్యులను, లేక ప్రత్యేకవ్యక్తులను పై వాదములననుసరించియే విడిచిపెట్టవచ్చునని దయతో వాదించెడివారు. మేము జయిలులోనుండగా మమ్ముగురించి శ్రద్ధతీసికొనినవారియెడల మేము కృతజ్ఞులముగ నుండకతప్పదు. కాని మేమెప్పుడుగాని మా శ్రేయస్సునుద్దేశించిన యీ స్నేహితులనుండి రక్షింపబడిన బాగుండెడిదని భావించెడివారము. వారి సదుద్దేశ్యముల పట్ల మాకెట్టిసందేహమునులేదు. కానివారు సంపూర్ణముగ బ్రిటిషు ప్రభుత్వమువారి లక్ష్యమునేకలిగియున్నట్లు స్పష్టమగుచున్నది. మా యుభయులమధ్యను గొప్పయగాధముగలదు.

లిబరలు పక్షమువారు భారతదేశములో సంభవించుచున్న వానిని చాలవరకామోదింపలేదు. దానికివారెంతయు వగచుచుండిరి. అయినను వారేమిచేయవలెను? ప్రభుత్వమువారిపై నెట్టిపటుత్వము గల చర్యనైనను తీసికొనుట దుస్సాహస్యము. వారు కేవలము తమ్మొక ప్రత్యేకసంఘముగ రక్షించుకొనుటకు ప్రజాసామాన్యమునుండియు, ప్రజలలో చైతన్యముగల వ్యక్తులనుండియు నంతకంతకు దూరముగపోవుచు దక్షిణముఖమునుపట్టి ప్రభుత్వలక్ష్యమునుండి వేరుచేయుటకు వీలులేని లక్ష్యముకు బోవుదురు. వారికిసంఖ్యాబలమాలేదు! ప్రజలలో పలుకుబడియాపూజ్యము! కనుక వారివలన ప్రజాసంగ్రామమునకెట్టియుపద్రవమును లేదు. కానివారిలో నాధిక్యతసంపాదించినవారును, పేరుపొందినవారును, వ్యక్తిగతముగ గౌరవింపబడువారును కొందరుగలరు. ఈ నాయకులును, లిబరలు రెస్పాన్సివిస్టు బృందములు మొత్తమునీవాదను బ్రిటిషుప్రభుత్వమతి కష్టకాలములోనున్న సమయములో ప్రభుత్వ

నీతికి తమనైతికబలమునిచ్చి వారికమూల్యమగు సేవచేసిరి. పటుత్వమైన విమర్శ లేకపోవుటచేతను, లిబరలు పక్షమువారప్పుడప్పుడు సమ్మతిని, ఆమోదమును చూపుటచేతను ప్రభుత్వనిర్బంధములకును, న్యాయశూన్యతకునుగూడ లాభముకలిగెను. ఈ విధముగ లిబరలుపక్షము వారును, రెస్పాన్సివిస్టులును దేశములో జరుగుచున్న భయంకరమైన, మున్నెన్నడును కనివిని యెరుగని, నిర్బంధమునకు (ప్రభుత్వమువారు దానిని సమర్థించుకొనలేక బాధపడుచున్నపుడు) నైతికాధికారము నిచ్చిరి.

శ్వేతపత్రము చెడ్డది, చాలచెడ్డది అని లిబరలునాయకులుచెప్పిరి. దానినిగురించి యేమిచేయవలెను? 1933 ఏప్రిల్ మాసములో కలకత్తాలో జరుపబడిన లిబరలుఫెడరేషను సభలో శ్రీనివాసశాస్త్రిగారు, లిబరలు నాయకశిఖామణి, చట్టసంబంధమైనమార్పులు యెంతయసంతృప్తికరము లైనను వారు వానినాచరణలోపెట్టవలెనని వాదించిరి. "ప్రక్కగా నిలిచి విషయములను జారవిడుచుటకిది సమయముకాదు." అనియతడు చెప్పెను. ఇచ్చినదానినితీసికొని దానినాచరణలోపెట్టుటకు ప్రయత్నించుటయొక్కటే యతడూహింపగలిగినకార్యము. ఇదికానినాడు మరి యొకపని యేమియుచేయక నూరకుండుటయే! మరియు "మనకుజ్ఞానము అనుభవము, మితము, ఒప్పింపగలశక్తి, ప్రశాంతమగు పలుకుబడి, యథార్థమైన సామర్థ్యములు - మనకీసుగుణములేయున్నచో వానిని పరిపూర్ణమైనబలముతో బ్రకటించుటకిదియే సమయము" అనియతడు చెప్పెను. ఈపదగుంభనతోనిండిన పిలుపునుగురించి కలకత్తాలోని స్టేట్సుమన్‌పత్రిక "ప్రకాశమానమగుశబ్దజాలము" అనివ్యాఖ్యానము చేసెను.

శాస్త్రిగారెప్పుడును శబ్దజాలమును జోరుగ నుపయోగించు చుందురు. లలితపదములయెడలను, వాని మధురప్రయోగమునందును

వక్తికుండునట్టి పేర్మిని యాయనకుగలదు. కాని యాయన తన యుత్సాహములో కొట్టుకొనిపోవును. అతడు సృష్టించు శబ్దయింద్రజాలమతని భావము నితరులకు మరుగుపరచును; బహుళః యతనికిని యస్పష్టమగును. అతడు 1933 ఏప్రిల్‌లో శాసనోల్లంఘనమింకను జరుగుచుండగా కలకత్తాలో చేసిన యాపిలుపును పరీక్షించుట ప్రయోజనకరముగనుండును. మూలసూత్రములను, లక్ష్యములను నటులుంచినచో మనము రెండువిషయములను, గమనింపవలసియుండును. మొదటిది యేమిజరిగినను, బ్రిటిషుప్రభుత్వముచే మనమెంతగా నగౌరవింపబడినను, నలిపివేయబడినను, అవమానింపబడినను, కొల్లగొట్టబడినను మనము దానికిదాసులముకావలెను. మనమీహద్దును దాటిపోగూడదను పంక్తియెన్నటికిని వ్రాయబడజాలదు. ఒకక్రమము మారవచ్చును. కాని శాస్త్రిగారి సలహా వినినచో భారతప్రజలు మారజాలరు. అనన్యప్రకారము వేరొక మార్గములేదు. అనగా (అతనికిసంబంధించినంతవరకు) బ్రిటిషుప్రభుత్వ నిశ్చయములకు తలయొగ్గుటయు, వానినంగీకరించుటయు నొకమాత్రముతో (నేనాదురదృష్టపదమునుపయోగింపవచ్చునెడల) సమానము. మనకిష్టమున్నను లేకపోయినను మనమందరము నిరంతరము (కిస్మతు) దాసులముకావలెను.

అనేకాకవినిశ్చయమైన,యుద్ధమను స్థితినిగురించి సలహాయిచ్చుట లేదని గమనింపవలసియున్నది. 'చట్టసంబంధమైన మార్పులు' (అవిచాల చెడ్డవిగనుండునను స్పష్టమైనభావము మనకున్నను) యింకను తయారగుచున్నవి. శ్వేతపత్రములోని మార్పులు చెడ్డవిగనున్నను పరిస్థితుల నన్నింటినిగమనించి, యవిశాసనములు గావింపబడినవో, వానినాచరించుటకునేను సుముఖుడనని యతడుచెప్పియుండినచో నతనిసలహా మంచిదైనను చెడ్డదైనను యథార్థములకు సంబంధించియుండెడిది. శాస్త్రిగారింకను చాలదూరముపెళ్లి చట్టసంబంధమైన మార్పులెంత

యసంతృప్తిగనుండినను తనసలహా చెల్లవలెననెను. జాతీయదృష్టిలో నతి ముఖ్యమైనవిషయమున నతడు బ్రిటిషుప్రభుత్వమునకు సంపూర్ణాధికారమునిచ్చుటకు సిద్ధముగనుండెను. ఏవ్యక్తిగాని, బృందముగాని, పార్టీగాని యగోచరమగు భవిష్యత్తుసందర్భములో నిట్టియంగీకారము నెట్లీయగలరో నాకర్థముగాకున్నది. దానికేసిద్ధాంతములుగాని, యెట్టి నైతికరాజకీయ ప్రమాణములుగానిలేక పాలకులయాజ్ఞలకు విధాయకముగ తలయొగ్గుటే దానిసిద్ధాంతము, నీతియైనచో నిట్టియంగీకారము నీయవచ్చును.

నాకుతట్టు రెండవవిషయము కేవలము రాజకీయయెత్తుకు, యుక్తికి సంబంధించినది. క్రొత్తసంస్కరణలను చట్టముగాచేయు దీర్ఘప్రస్థానములో శ్వేతపత్రియొకమజిలీ. ప్రభుత్వదృష్టిలో నదియొకప్రధానమైనమజిలీ. కానియింకను చాలమజిలీలను చేయవలసియున్నది. ఈ తరువాతప్రయాణములో దీనినిమంచికోచెడ్డకో మార్చిననుమార్చుటకవకాశముగలదు. ఈమార్పులన్నియు వివిధప్రయోజనములుగలవారు బ్రిటిషుప్రభుత్వముమీదను, పార్లమెంటుమీదను కలిగించుయొత్తిడిపయి నాధారపడియుండును. ఈగుంజులాడుటలో భారతదేశ లిబరలు పక్షమువారిని తమనైతృప్తిప్పకొనవలెననుకోరిక ప్రభుత్వముపయి పని చేసి, చట్టములను సడలించుటకు ప్రోత్సహింపవచ్చును. లేకనధమము ఆక్రమణలనైనను ఆపివేసెడిది. కానిక్రొత్తసంస్కరణల నంగీకరించుటయా, త్రోసివేయుటయా ఆచరించుటయూ యాచరింపకుండుటయా యనుసమస్యలయలు దేరుటకు చాలముందుగనే శాస్త్రిగారుచేసిన గంభీర ప్రకటన భారతలిబరలు పక్షమువారిని సంపూర్ణముగ నిర్లక్ష్యము చేయవచ్చునని ప్రభుత్వముకు విశదముచేసెను. వారిని త్రిప్పుకొనవలెనను సమస్యయేలేదు. గెంటివేయబడినను వారు ప్రభుత్వమువారిని వీడువారు కారు. ఈలిబరల్సుపక్షమువారి దృష్టినుండి (నేను చూడగలిగినంతవరకు)

యీ విషయమునుచూచినను కలకత్తాలోని శాస్త్రిగారి యుపన్యాసము అసాధారణమగు చెడ్డ యెత్తుగను, లిబరలు పక్షమువారి యుద్యమము కపకాలిగను నాకు కాన్పించెను.

శాస్త్రిగారి పాతయుపన్యాసమునుగురించి నేనుచాలవరకు వ్రాయ సాహసించుటకు కారణము అందులోనున్న సహజ ప్రాముఖ్యతగాని లిబరలు ఫెడరేషనుకున్న ప్రాముఖ్యతగానికాదు. లిబరలునాయకుల మానసిక ప్రవృత్తిని, చిత్తవృత్తిని గ్రహింపవలెనను కోరికయే నన్నిందులకు ప్రోత్సహించెను. వారు సమర్థులు, గౌరవనీయులు. అయినను యెంత సదయహృదయముతో చూచినను వారల్లల ప్రవర్తింతురో నేనెంతమాత్రమును గుర్తింపలేకపోతిని. 1933 జూన్‌లో శాస్త్రిగారి చ్చిన మరియొక యుపన్యాసము (నేనుజయిలులో చదివితిని) నన్ను బాధించెను. తాను 1927 వరకు సధ్యక్షుడుగానుండిన భారతసేవక సంఘములో నతడుపన్యసించుచుండెను. బ్రిటిషుపరిపాలన హఠాత్తుగా తగ్గిపోయినచో భారతదేశమునకు కలుగు యుపద్రవముల నతడు వ్ర్ణాని నట్లు చెప్పబడెను. రాజకీయోద్యమములలో తీవ్రమైన ద్వేషముతో నిండి యొకపార్టీ మరియొకపార్టీని హింసించును, అణచివేయును. మొట్ట మొదటినుండియు సహనమే బ్రిటిషురాజకీయ జీవితముయొక్క లక్షణము. కనుక భారతభవిష్యత్తు బ్రిటనుయొక్క సహకారముతో నెంత యెక్కువగ జరుపబడిన భారతదేశములో నంత యెక్కువ సహనముండుటకవకాశమున్నది. కలకత్తా స్టేట్సుమను పత్రికయిచ్చిన శాస్త్రిగారి యుపన్యాస సంగ్రహము మీద నే నాధారపడవలసియుండెను. "అది సంతోషకరమైన సిద్ధాంతము. డాక్టరు మూంజీకూడ సభాపములోనే మాట్లాడుచున్నట్లు మేము గమనించుచున్నాము" అని కూడ స్టేట్సుమను వ్రాసెను. శాస్త్రిగారు రషియా, ఇటలీ, జర్మనీలలో స్వేచ్ఛ యణచివేయబడుచున్నదనియు, నచ్చట పశుత్వము, యమానుషములు జరుపబడుచున్నవనియు నుదహరించినట్లు చెప్పబడెను.

నేనుదీనిని చదివినప్పుడు బ్రిటనునకును భారతదేశమునకును సంబంధించిన శాస్త్రిగారి దృష్టి 'డైహార్డు' బ్రిటిషుకన్సెర్వేటివు దృష్టి నెంత యసాధారణముగ పోలియున్నదో నాకు తట్టెను. వివరములలో భేదములున్నమాట సత్యము. కాని ప్రధానముగ నొక్కటే లక్ష్యము. విన్స్టను చర్చిల్‌గారు తన విశ్వాసములకెట్టి యపకృతియు చేయనక్కరలేకుండ నిదేధోరణిలో, నిదేభాషలో తనభావమును వెల్లడించియుండెడివాడు. అయినను శాస్త్రిగారు లిబరలుపార్టీయొక్క యెడమపక్షమునకు చెందెను. అతడు దానియొక్క నాయకులలో నత్యంత సమర్థుడు.

చరిత్రను గురించిన శాస్త్రిగారి యభిప్రాయములను, ప్రపంచ వ్యవహారములనుగురించిన యతని భావములను (యెక్కువ ముఖ్యముగ హిందూదేశమునకును బ్రిటనునకును సంబంధించినవానిని) నేనెంత మాత్రము నంగీకరింపజాలను. బహుశః యింగ్లీషువాడు కానట్టి యేవిదేశీయుడుకూడ వీనినంగీకరింపడు. విశాలభావములుగల చాలమంది యింగ్లీషువారే యతనితో నేకీభవింపకపోవచ్చును. ప్రపంచమును, తన నిజదేశమును బ్రిటిషుపాలకజాతుల రంగులకంటిజోడుతో చూడగల వరప్రసాదమతనికి గలదు. అయినప్పటికిని భారతదేశములో గత పదునెనిమిది మాసములనుండియు దినదినము జరిగినట్టియు, నతడుపన్యసించుచున్న కాలమున జరుగుచున్నట్టియు నసాధారణ చర్యల నతడు నిర్లక్ష్యముచేయుట గమనింపదగిన విషయము. అతడు రష్యా, యిటలీ, జర్మనీల నుదహరించెనేగాని తనదేశములో నన్ని స్వాతంత్ర్యములును భయంకరముగ నిర్బంధింపబడుటను, అణచివేయబడుటనునుదహరింపడు. వార్తలతీకరణముగ నరికట్టబడుచుండుటచే సరిహద్దు రాష్ట్రములోను, వంగదేశములోను (రాజేంద్రబాబు తన కాంగ్రెసు అధ్యక్షకోపన్యాసములో దానిని 'వంగదేశమానభంగము' అనిపిలిచెను) భయంకరసంభ

వముల నన్నింటిని యతడెరుగక పోవచ్చును. కాని యతడు భారత దేశము పడుచున్న యపరిమిత బాధలను, తన ప్రజలు స్వేచ్ఛకొరకును, జీవితముకొరకును శక్తివంతమగు ప్రభుత్వముతో చేయుచున్న పోరాటమునుయెరుగడా? విశాలప్రాంతములలో నమలుజరుపబడిన పోలీసు రాజ్యమును, సైనికశాసనమునుపోలిన పరిస్థితుల నతడెరుగడా? ఆర్డినెన్సుల నతడెరుగడా? జయిళ్లలోని నిరశనవ్రతములు మొదలగు నితరబాధల నతడెరుగడా? బ్రిటను దేశము నతడసహానముకొరకు నేస్వాతంత్ర్యము కొరకు పొగడెనో యవి భారతదేశములో బ్రిటను దేశమువలననే నలిపివేయబడెనను సంగతి నతడుగుర్తింపలేదా?

అతడు కాంగ్రెసుతో నంగీకరింపవచ్చును లేక నంగీకరింపక పోవచ్చును. కాంగ్రెసునీతిని విమర్శించుటకును, ఖండించుటకును నతనికి సంపూర్ణస్వేచ్ఛకలదు. కాని తనదేశీయులైన స్త్రీపురుషులు చూపిన యద్భుత ధైర్యసాహసములయెడల, నాత్మార్పణయెడల భారతీయుడు, స్వేచ్ఛాదేవి నారాధించువాడు, గ్రహణశక్తికలవాడునగు తానెట్లు ప్రవర్తించెను? మనపాలకులు భారతహృదయమునైగొడ్డలితో చెరలాటమాడినపు డతడెట్టి బాధను, వ్యధను పొందలేదా? లక్షలకొలది జనులొక మహాసామ్రాజ్యముయొక్క భౌతికశక్తిముందు వినమ్రులగుటకు నిరాకరించుచుండుటయు,నాత్మదాస్యముకంటె తమశరీరములు చూర్ణముగావింపబడుటయు, తమప్రాణతుల్యములగు గృహములు విచ్ఛిన్నముగావింపబడుటయు, తమప్రేమాస్పదులందరును వెతలనొందుటయు శ్రేయస్కరమని ప్రకటించిన యీయాత్మప్రకటనమునంతను నతడు శూన్యమనియే తలంచెనా? జయిలులోను బయటను మేమెప్పుడును ధైర్యమునే ప్రకటించి మందహాసములతో నవ్వుముఖములతో నుంటిమి. కాని తఱచు మామందహాసమానంద బాష్పములగుచుండెడిది; మానవ్వులొక్కొక్కప్పుడు యేడ్పును సమీపించెడివి.

ధైర్యవంతుడును, నుదారుడునగు వెరిర్యర్ ఎల్విను అనునొక యాంగ్లేయుడు తనయనుభవమును మాకుచెప్పెను. 1930 ని గురించి యతడిట్లుచెప్పెను. "ఒకజాతియంతయు తనమానసిక దాస్యసంకెలలను త్రెంపివైచి నిర్భయ నిశ్చయమును తన నిజగౌరవమున కుత్థితమగు చుండుటను వీక్షించుట యొకయద్భుతమైన యనుభవము. సత్యాగ్రహ పోరాటములో చాలమంది కాంగ్రెసువాలంటీర్లు ప్రదర్శించిన యద్భుత శిక్షణము; రాష్ట్రగవర్నరులలో నొకడు యుదారధృన పత్రమునిచ్చిన శిక్షణము....."

శ్రీనివాసశాస్త్రిగారు సమర్థుడు, గ్రహణశక్తికలవాడు; తన దేశీయులచే నెక్కువగ గౌరవింపబడువాడు. అతడుకూడ పయి యను భవమునే కలిగియుండవలెను; అట్టిపోరాటములో తన దేశీయులకొరకు బాధపడియుండవలెను. ప్రభుత్వము పౌరసత్త్వములను, ప్రజాహిత కార్యములను, అణచివేయుచుండుటను అతడు ఖండించునని యనుకొన బడును. అతడును, అతని సహోద్యోగులును దుర్భరబాధల నొందు చున్న రెండురాష్ట్రములను—వంగదేశము, సరిహద్దురాష్ట్రము—స్వయ ముగ సందర్శించి యుండవలెనని (కాంగ్రెసుకును, శాసనోల్లంఘనము నకును సహాయముచేయుటకుగాక నధికారులయొక్కయు, పోలీసుల యొక్కయు నత్యాచారములను బయటపెట్టి, యారీతిగ వారించుటకు) యనుకొనబడును. పౌరసత్త్వములను, స్వేచ్ఛను ప్రేమించువారు యితరదేశములలోనిట్లు సామాన్యముగ చేయుచుందురు. కాని యత డట్లు ప్రవర్తించుటకుబదులు (కార్యనిర్వాహక ప్రభుత్వము భారత స్త్రీపురుషులపయి నిర్దయగ ప్రవర్తించుచుండ, మామూలు స్వాతం త్ర్యములను గూడ లాగివేసియుండ, నథమము యేమి జరుగుచున్న దియు తెలిసికొనుటకుబదులు) అతడు బ్రిటిషువారి సహనమునకును, స్వేచ్ఛకును (సహనమును, స్వేచ్ఛయు భారతదేశములోని బ్రిటిషు

ప్రభుత్వములో నిసుమంతయు లేకున్నను) ధ్రువపత్రమునిచ్చెను. అతడు వారికి తన నైతికసహాయమునిచ్చి తద్వారా నిర్బంధ విధానములో వారి కుత్సాహ ప్రోత్సాహములను కలిగించెను.

అతడిట్లు భావించియుండజాలడనియు, తనచర్యయొక్క ఫలితములను గుర్తించలేడనియు నేను దృఢముగ చెప్పగలను. కానియతని యుపన్యాసమున కిట్టిఫలితము గలదనుట నిస్సందేహము. అయినచో నతడీవిధముగ నేల యోచింపవలెను? ఏల యాచరింపవలెను?

లిబరలునాయకులు తమ స్వదేశీయులనుండియు, నాధునిక భావమంతటినుండియు పూర్తిగ తెగిపోయిరనుటకంటె నాకీప్రశ్నకు వేరొక సమాధానము దొరకలేదు. వారుచదివెడు బూజుపట్టిన పుస్తకములు వారిదృష్టినుండి భారతదేశ ప్రజలను తరిమివేసెను. వారొక విధముగ తమ్ముతామే ప్రేమించుకొను విద్య నభివృద్ధి చేసికొనిరి. మేము జయిళ్ళకుపోతిమి; మాశరీరములు గదులలో బంధింపబడెను. కాని మామనస్సులు స్వేచ్ఛగ ప్రపంచవిహారమును చేయుచుండెను. మా యుత్సాహము యినుమడించెను. కాని,లిబరలువాదులు స్వయంకృత మానసిక కారాగారములను నిర్మించుకొనిరి. వారు వానిచుట్టు గిరగిర తిరుగుదురు. కాని,వారికి బయటకుపోవు మార్గము దొరకదయ్యెను! వారు రూపముతోనున్న 'వస్తుదైవతమును' పూజించిరి; వస్తువులు మారినపుడు (ఈనశ్వరప్రపంచములో నవియెప్పుడును మారుచుండును) వారుచుక్కానిగాని, దిగ్దర్శని యంత్రముగాని లేనివారై, శారీరముగను, మానసికముగను నసహాయులై, యాదర్శములుగాని నైతిక ప్రమాణములుగాని లేనివారైయుందురు. మనమందరమును యెప్పుడును ముందుకుపోవలెను. లేదా ముందుకు త్రోయబడుదుము. ఈనిరంతర సంచలనములోనున్న ప్రపంచములో మనము స్థావరముగ నిలిచి పోజాలము. కదలుటకును, మార్పుచెందుటకును, భయపడి లిబరలు

పక్షమువారు తమ్మావరించిన ఝంఝామారుతమునకు భయభ్రాంతులైరి. దుర్బలగాత్రులగుటచే తడబడుకాళ్ళతో వారుముందుకు పోజాలక తమకుదొరికిన ప్రతితృణమును బట్టుకొనుచు నిటునటు కొట్టబడిరి. వారు భారత రాజకీయములలో షేక్స్పియరుమహాకవి నాటకములోని హేమ్లెటు (సందేహమనస్కుడు) పాత్రధారులైరి. "దీర్ఘాలోచనచే పాలిపోయి వ్యాధినొందిన" యెప్పుడును సందేహించుచు, జంకుచు, నిశ్చయహీనులగుచు వారు భారతరాజకీయములలో షేక్స్పియరు మహాకవి నాటకములోని హామ్లెటులయిరి.

లిబరలు వారపత్రికయైన 'సర్వెంటు ఆఫ్ యిండియా' జయిలుకు వెళ్లువరకు కాంగ్రెసువారు చిందులుత్రొక్కెదరనియు, వెళ్లినతరువాత బయటకురావలెనని తహతహలాడెదరనియు శాసనోల్లంఘనము యొక్క చివరరోజులలో నిందించెను. కాంగ్రెసుయొక్క సమగ్రమైన 'నీతియదియేయని యదికొంతయుద్రేకముతో వ్రాసెను. దానికి లిబరలు పక్షమువారి ప్రత్యామ్నాయనీతి బ్రిటిషుమంత్రులకొఱకు వేచియుండుటకొక రాయబారమును యిగ్లండుకంపుట; లేక వేచియుండి యింగ్లండుప్రభుత్వములో మార్పుకలుగవలెనని ప్రార్థించుట.

అప్పుడు ప్రధానముగ ఆర్డినెన్సుచట్టములను, తక్కిన నిర్బంధచట్టములను ధిక్కరించుటయే కాంగ్రెసునీతియనుట, కొంతవరకు, నిజము. దీనివలన జయిలుప్రాప్తించును. దీర్ఘపోరాటమయినతరువాత కాంగ్రెసును, జాతియు నలసిపోవుటయు ప్రభుత్వమునకు నెట్టిపటుత్వమైన యొత్తిడిని కలిగింపలేకపోవుటయుగూడ నిజము. కాని, యొకకార్యరూపమును, నైతికమును నగుఫలితముకలదు.

భారతదేశ మనుభవించుచుండినట్టి బహిరంగనిర్బంధము, పాలకులకతివ్యయకరమైనది. వారికిగూడనది బాధకరమైనట్టియు, నరముల బిగిని సడలింపచేయునట్టియు నొకకఠినపరీక్ష. తుదకది తమపునాదులను

దుర్బలపరచునని వారికి బాగుగ తెలియును. అది వారి పరిపాలనయొక్క నిజస్వభావమును పీడింపబడు ప్రజలకును, విశాలప్రపంచమునకును గూడ నిరంతరము బహిరంగపరచును. వారు తమ యినుపముష్టిని దాచవలెనని ముఖమల్ తొడుగును ధరించుటకెంతయో యుత్సహించెదరు. ఎట్టి [illegible]తములు సంభవించినను తమయిచ్ఛకు లొంగని ప్రజలతో వ్యవహరించుటకంటె నే ప్రభుత్వమునకును నెక్కువ క్షోభమును కలిగించునదియు (చిట్టచివరకు) నపకారకరమైనదియు వేరొకటియుండ నేరదు. కనుక నచ్చటచ్చట జరుగు నిర్బంధవిధానధిక్కారమునకుగూడ విలువయున్నది. అది ప్రజలకు శక్తినిచ్చును; ప్రభుత్వశక్తిని నాశనముచేయును.

నైతిక ఫలితము మరింత ప్రధానమైనది. ఒక విఖ్యాతమైన భాగములో థోరో కవియిట్లు చెప్పెను. "స్త్రీపురుషులక్రమముగ నిర్బంధింపబడు కాలములో యోగ్యమైన స్త్రీ, పురుషులకు ఉత్తమమైన స్థానము జయిలే." ఈసలహా లిబరలుసోదరులకును, తదితరులకును కటువుగ నుండవచ్చును. కాని శాసనోల్లంఘనముతో సంబంధము లేకపోయినను మనసహచరులు చాలమంది యెప్పుడును జయిలులో నుండుచున్నప్పుడు, ప్రభుత్వముయొక్క నిర్బంధసాధనసామగ్రి మనలను నిరంతరము నలచివేయుచు, నగౌరవపరచుచు, మనప్రజలను కొల్లగొనుటకు సహాయపడుచుండ - నిట్టిపరిస్థితులలో నైతికజీవితమసంభవమని మాలో చాలమంది తరచు భావించెడివారము. మనదేశములోనే మనము అవమానింపబడువారివలె సంచరించెదము. పోలీసులు వెంటనంటి పరీక్షించుచుందురు. మామాటలు, సర్వాంతర్యామియైన రాజద్రోహచట్టమును భంగము చేయునేమో యని వాపికొనబడుదుము. మాయుత్తర ప్రత్యుత్తరములను విప్పిచూచెదరు. ఏదోయొక బహిష్కారము లేక అరెస్టు మాకొరకెప్పుడును యెదురుచూచుచుండును. మాకొక్కటే గతి కలదు; ప్రభుత్వాధికారము కనీసముగ తలయొగ్గవలెను; ఆధ్యాత్మికముగ

అధఃపతనమునొందవలెను. మాలోనున్న సత్యమును నిరాకరింపవలెను; మేమునీచమనితలంచు కార్యములకు నైతికవ్యభిచారమునకు మేమొడబడవలెను. లేదా వ్యతిరేకమునుచూపి తత్ఫలితమునంతను అనుభవింపవలెను. జయిలుకువెళ్ళవలెననియు, కష్టముల నాహ్వానింపవలెననియు కోరునట్టివారెవరునుయుండరు. కానితఱచు రెండవ దౌర్భాగ్యపు ప్రత్యామ్నాయముకంటె జయిలే వాంఛనీయము. బెర్నార్డుషా చెప్పినట్లు 'నీచమని తెలియునట్టి ప్రయోజనములకు స్వార్థపరులచేనుపయోగించుకొనబడుటయొక్కటియే జీవితములో నిజమైనయేకైకవిషాదము" తక్కినదంతయు కేవలదౌర్భాగ్యము, మృత్యువు; ఇదియొక్కటియే దుఃఖము, బానిసత్వము, ప్రపంచనరకము.

## ౪౯

## దీర్ఘశిక్ష యంతరించెను.

నన్నువిడిచిపెట్టుకాలము సమీపించుచుండెను. 'సత్ప్రవర్తనకు' నాకుమామూలు రెమిషను యివ్వబడెను. దీనివలన నా రెండేండ్లశిక్షలో మూడున్నరమాసములు తగ్గిపోయెను. విడువబడుదునను భావముచే జనించు యుద్రేకమువలన నామనశ్శాంతి, లేకజయిలు కలుగ జేయునట్టి సాధారణ మానసికమాంద్యము అంతరించెను. బయట నేనేమిచేయవలెను? ఇదియొక కష్టమైనప్రశ్న. దీనికి సమాధానమిచ్చుటకు కలుగు సందేహము విడుదలయగుటలోగల యానందమును మ్రింగివేయుచుండెను. కాని యీభావముకూడ తాత్కాలికము. చిరకాలమునుండి యణచివేయబడిన నాయుత్సాహశక్తి యుబుకుచుండుటచే నేను బయటకు పోవలెనని యాతురపడుచుంటిని.

1933 జూలైమాసాంతమున నొక విషాదకరమైన వార్త వచ్చెను. జే. యం. సేనుగుప్త హఠాత్తుగ చనిపోయెను. మేము కాంగ్రెసు వర్కింగుకమిటీలో చాలవత్సరములు సన్నిహిత సహోద్యోగులమేగాక నాబాల్యంపు కేంబ్రిడ్జిదినముల నాటినుండియు మాకు సంబంధముండెను. మేము మొట్టమొదట కేంబ్రిడ్జిలో కలుసుకొంటిమి. నేనప్పుడు నూతనముగ ప్రవేశించితిని; అతడప్పుడే పట్టభద్రుడయ్యెను.

సేనుగుప్త డిటెన్షనులో (విచారణలేకుండ నుంచబడుట) చనిపోయెను. 1932 ప్రారంభములో నతడు యూరపునుండి వచ్చుటతోడనే (యతడింకను బొంబాయిలో నోడమీదనుండగనే) ప్రభుత్వఖయిదీగ నరెస్టు చేయబడెను. అప్పటినుండియు నతడు ఖయిదీ లేక డిటెన్యూ; అతని యారోగ్యము ధ్వంసమయ్యెను. ప్రభుత్వమువారతనికి వివిధ

సౌకర్యములను కలిగించిరి. కాని యవేవియు నతని వ్యాధిని వారింప జాలకపోయెను. కలకత్తాలో నతని యంత్యక్రియలనాడు ప్రజలు బ్రహ్మాండమగు నుత్సవమునుజరిపి యతనిని గౌరవించిరి. చిరబంధనముచే నవయుచున్న వంగదేశఆత్మ అధమము కొద్దికాలమయినను బయటకు రాగలిగినట్లు కాన్పించెను.

ఈవిధముగ సేనుగుప్త నిర్గమించెను. వత్సరముల తరబడి ప్రవాసములోను, జయిలులోను నుంచబడుటచే నారోగ్యము చెడిపోయిన, సుభాసుబోసు (మరియుక ప్రభుత్వఖయిదీ) చికిత్సకై యూరపువెళ్లుటకు ప్రభుత్వముచే చిట్టచివర కనుమతింపబడెను. మాఖీష్మదు, విఠల్ భాయిపటేలుకూడ, రోగగ్రస్తుడయి యూరపులోనేయుండెను. జయిలు జీవితముయొక్క శరీరకష్టముకును, బయటనున్న నిరంతర కృషివలన కలుగు శ్రమకును తాళలేక నికనెంతమంది యారోగ్యములు ధ్వంసమయ్యెనో! ఎంతమంది చనిపోయిరి! తాము జీవింప నిర్బంధింపబడిన యసాధారణ జీవితములచే నెంతమంది మానసిక భ్రష్టత్వమును, (బాహ్యమున కంతమార్పు కాన్పించక పోయినను) విపరీత భావములను పొందిరి!

దేశమంతటను జరుగుచున్న యీభయంకర, నిగూఢ బాధ సేనుగుప్త మృత్యువువలన నాకు కండ్లకు కట్టినట్లు ద్యోతకమయ్యెను; నాకు కొంతనిరాశ,విసుగుజనించెను. ఇదియంతయు నేపరమావధికొరకు? దేనికొరకు? నాయారోగ్య విషయమున నేనదృష్టవంతుడను. నాకాంగ్రెసు కృషివలన నెంతయొత్తిడిని, క్రమవిరహితమగు జీవితమునునేననుభవింప వలసివచ్చినను, మొత్తముమీద, నేనారోగ్యముగనుంటిని. బహుశఃకొంత వరకు నాతలిదండ్రులనుండి నాకుకలిగిన పటుత్వగాత్రమును, కొంత వరకు శరీరవిషయమై నేను తీసికొనినశ్రద్ధయు దీనికి కారణములు కావచ్చును. వ్యాధి, దుర్బలత, స్థౌల్యము నాకేవగింపుగనుండును.

వ్యాయామము, కావలసినంత చక్కనిగాలి, సరళాహారము వీనితోడ్పాటుతో నేనవి లేకుండ చేసికొంటిని. భారతదేశములోని మధ్యమతరగతులవారికి కలుగువ్యాధులు చాలవరకు తిండిదోషమువలన కలుగుచున్నవని నాస్వంతయనుభవము చెప్పుచున్నది. (ఇదివ్యయకరములైన యభ్యాసములుగలవారికే వర్తించును.) అవివేకురాలగుతల్లి బిడ్డలకు మితాయిలు, యితరచిరుతిండ్లు మిక్కుటముగపెట్టి యావజ్జీవాజీర్ణ రోగమునకు స్థిరపునాదులను వేయుదురు; బిడ్డను మెక్కువ గుడ్డలతో కప్పి వేయుచుందురు. భారతదేశములోని యింగ్లీషువారుకూడ (వారియాహారము తక్కువసారవంతమైనదైనను) మిక్కుటముగ మెక్కునట్లు కాన్పింతురు. బహుశః నాకు వెనుకటి తరము వారికంటె కొంతనయము. వెనుకటివారు బలమైన తిండి,వేడి వేడి 'పెద్దపెద్దపట్టు' పట్టెడివారు.

నాకు ఆహారముపట్ల నెట్టివెర్రులును లేవు. మితముమీరి తినకపోవుట;జీర్ణముకానియాహారములనుమాని వేయుట: ఈ రెంటినిమాత్రమే నేనుచేసితిని. కొంచెమించుమించు కాశ్మీర బ్రాహ్మణులందరివలెనే మేము మాంసాహారులము. బాల్యమునుండియు నేనెప్పుడును మాంసము తీసికొనుచుంటిని. కాని నాకుదానియందంత యెక్కువ యభిరుచి లేదు. 1920 లో సహాయనిరాకరణము వచ్చుటతోడనే నేను మాంసాహారమును మానివేసి శాకాహారినైతిని. నేను ఆరుసంవత్సరముల తరువాత యూరపువెళ్లువరకు శాకాహారిగనేయుండి యచ్చటతిరిగి మాంసాహారినై హిందూదేశము తిరిగివచ్చుటతోడనే తిరిగి శాకాహారినైతిని. నాడులగాయతు నేనుశాకాహారిగనేయుంటిని. మాంసాహారము నాకు చక్కగ సరిపడునట్లు తోచును; కాని నాకుదానియెడల నొకవిధమగు విముఖత్వముకలిగెను. నాకందులో కొంత మోటుదనము కాన్పించెను.

నేననారోగ్యముగనుండిన కాలములు (ముఖ్యముగ 1932 లో జయిలులో నున్నపుడు) చాలనెలలవరకు నాకప్రతిదినము జ్వరము

తగులుచుండిసపుడు (చాల యారోగ్యవంతుడనను నాగర్వమున కవి యుపకృతి నొనరించుటచే) విసుగుదలను, కోపమును కలిగించెడివి. నేనది వరలో నెప్పుడును చూపెడియుత్సాహము, శక్తి, చైతన్యత కాన్పించక పోవుటకిదియే ప్రథమము. వినాశ, క్షైణ్య, వికార రూప మొకటి నా యెదుట కాన్పించిభయమును సూచించెను. నేను ప్రత్యేకముగ మృత్యువు నకు భయపడితినని యనుకొనను; కాని శారీరముగను, మానసికముగను, క్రమముగ కృశించిపోవుట వేరొకవిషయము.

ఎట్లయిననేమి నాభయములు(త్ప్రేక్షలని రుజువయ్యెను; నేను నావ్యాధిని వదలించుకొని, నాశరీరమును వశములోనికి తెచ్చుకొన గలిగితిని. శీతకాలములో చాలకాలము సూర్యాతపస్నానములు చేయుటచే నాకు స్వాస్థ్యము చేకూరెను. నాతోడివారు జయిళ్లలో కోటులతోను, శాలువలతోను గజగజ వణకుచుండ నేను వస్త్రములు లేకుండ సూర్యరశ్మితో శరీరమును హాయిగ కాచుకొనుచు కూర్చొనెడి వాడను. ఇది శీతకాలములో నొక్క యుత్తర హిందూదేశములోనే సాధ్యమగును; తక్కినచోట్లు సాధారణముగ సూర్యు డతి తీవ్రముగ నుండును.

నా వ్యాయామములలో నొకటి నాకు ప్రత్యేకముగ నానంద మును చేకూర్చెడిది. అది శీర్షాసనము. అరచేతులను నేలమీదనుంచి, వేళ్ళను వేళ్ళతో చక్కగ బంధించి తల వెనుక భాగమును, మోచేతు లను నేలమీద ఆనుకొని శరీరమును కర్రవలె తలక్రిందుగ నిలువబెట్ట వలెను. శరీరరీత్యా యీ యాసనము చాల మంచిదని నాయభి ప్రాయము. దానివలన కలిగిన మానసిక ఫలితమువలన నాకు దాని యందు మరింత యెక్కువ యభిమానము. కొంచెము హాస్యముగ నుండు యీ తలక్రిందులు స్థితి నాలో నున్న హాస్యమును పెంచి జీవిత చాపల్యములనెడల మరికొంత సహనమును కలిగించెను.

నా సాధారణ యారోగ్యస్థితియు, సుఖముగ నుంటినను శరీర జ్ఞానమును జయిలులో తప్పనిసరియగు నిరుత్సాహ సమయములను తరించుటయందు నాకెంతయో సహాయకారులుగ నుండెను; జయిలు లోను, బయటను మారుచుండునట్టి పరిస్థితులకు తగియుండుటకు గూడ నాకవి సహాయపడెను. నన్నా సమయమున పడద్రోయునట్లు కాన్పించిన కష్టములు నాకనేకములు కలిగెను; కాని నాకే యాశ్చర్యమగునట్లు వానినుండి నేననుకొనిన కాలముకంటె త్వరితముగ నేను కోల్కొను చుంటిని. నేను ప్రధానముగ మితము గలవాడను; యుచితజ్ఞుడను. నేనెప్పుడును తలనొప్పి యెట్టిదో యెరుగకవుటయే దీనికొక రుజువు అని నేననుకొనెదను; నేనెప్పుడును నిద్రలేకపోవుటచే బాధపడి యెరు గను. నాగరికతయొక్క యీసామాన్యవ్యాధులనుండియు, చదువులోను వ్రాతలోను నాకండ్లను (ఒక్కొక్కప్పుడు జయిలులో సన్నిద్దివెలుతురు లోను) విపరీతముగ నుపయోగించినను, కంటిజబ్బునుండియు నేను తప్పించుకొంటిని. ఒక ప్రత్యేక కంటివైద్యుడు నామంచి కంటిదృష్టిని గత వత్సరము చూచి యాశ్చర్యపడెను. ఎనిమిదేండ్ల క్రితమతడు నే నొకటి రెండు సంవత్సరములలో కండ్లజోడు నుపయోగింప వలసి యుండునని జోస్యము చెప్పెను. అతడు చాల పొరబడెను. అవి లేకుండ నేనింకను జయప్రదముగనే గడుపుచున్నాను. ఈ విషయములు నేను మితముగలవాడను; యుచితజ్ఞుడను అను నాపేరును స్థాపింపగలిగినను మొట్టవిడుపు, యెట్టి మార్పులేకుండ వెర్రిగ మితమును, యుచితజ్ఞడను పాటించువారనిన నాకు భయము.

జయిలునుండి విడుదలయగుటకు నే నెదురుచూచుచుండ బయట క్రొత్తరకపు వ్యక్తిశాసనోల్లంఘనము ప్రారంభమగుచుండెను. గాంధీజీ మార్గదర్శకుడగుటకు నిశ్చయించి ప్రభుత్వము వారికి పూర్తియగు నోటీసు యిచ్చి గుజరాతు వ్యవసాయదారులకు శాసనోల్లంఘనమును

బోధించుటకు ఆగష్టు మొదటి తేదీని బయలుదేరెను. అతనిని వెంటనే అరెస్టుచేసి, యొక సంవత్సరము శిక్ష విధించి యరవాడ జయిలులో నతని మామూలు గదికి తిరిగి పంపించిరి. అతడు తిరిగి వెళ్ళినందులకు నేను సంతోషించితిని. కాని వెంటనే యొక క్రొత్తచిక్కు తటస్థించెను. అతడు జయిలునుండి హరిజన ప్రచారమును చేసికొనుటకు వెనుక తన కున్న యవకాశములే యిప్పుడును యుండవలెననెను. ప్రభుత్వము వారట్లు చేయుటకు తిరస్కరించిరి. ఈ సమస్యపయిన గాంధీజీ యుప వాసమును ప్రారంభించెనని మేమకస్మాత్తుగ వింటిమి. అట్టి యుపద్రవ కరమైన చర్య తీసికొనుటకు మాకది చాల స్వల్పవిషయముగ కాన్పిం చెను. అతడు ప్రభుత్వముతో సల్పిన వాదము పూర్తిగ యుక్తమైనదే యైనను అతని నిశ్చయమును నేనర్థముచేసికొనుట బొత్తిగ దుస్సాధ్య మయ్యెను. మే మేమియును చేయజాలక తెల్లబోయి చూచుచుంటిమి.

ఉపవాసము వారము రోజులు జరిగిన తరువాత నతని స్థితి వేగ ముగ పాడగుచుండెను. అతని నొక ఆస్పత్రికి మార్చిరి. అయినను అత డింకను ఖయిదీయే యగుటచే ప్రభుత్వము వారతనికి హరిజన సమస్యకు సౌకర్యముల నీయలేదు. జీవింపవలెనను యిచ్ఛ (గత యుప వాసములలో నతని కుండెడిది.) యిపుడు లేకపోవుటచే నతడు కృంగి పోవుచుండెను; మృత్యువాసన్నమగునట్లు కాన్పించెను. అతడు సెలవు తీసికొనెను; తనవద్దనున్న కొద్ది స్వంత సామగ్రిని పంచిపెట్టెను; కొన్నిటిని ఆస్పత్రి నర్సుల కిచ్చివేసెను. కాని ప్రభుత్వము వారి కతడు తమ చేతులలో చనిపోవుట కిష్టములేక నకస్మాత్తుగ నతనిని ఆసాయం కాలమే విడిచివేసిరి. అతనిని రక్షించుట కదియే సరియైన సమయము. ఒక్కరోజు గతించినా బహుశః యతడు దక్కెడివాడు కాడు. బహుశః యతనిని రక్షించిన కీర్తి చాలవరకు సి. యఫ్. అండ్రూసుకు చెందును. గాంధీజీ వలదనినను నతడు హిందూ దేశములో నివ్వున వ్రాసెను.

ఈలోపలనన్ను అగష్టు 23 వ తేదీని ఢేరాడూను జయిలునుండి మార్చిరి. పదునెనిమిదిమాసములు యితరజయిళ్లలో గడిపిన తరువాత నైనీజయిలుకు నేను తిరిగివచ్చితిని. నాతల్లికి జబ్బుచేసినట్లును, ఆమె ఆస్పత్రికి తీసికొనిపోబడినట్లును అప్పుడే వార్తవచ్చెను. మాతల్లిస్థితి చాలయుపద్రవకరముగ నున్నదని భావింపబడుటచే 1933 ఆగష్టు 30 వ తేదీని నేను విడువబడితిని. మామూలుగ (యెక్కువ ఆలస్యమయినను) సెప్టెంబరు 12 వ తేదీని నాశిక్షపూర్తియగుటతోడనే నేను విడువ బడెడివాడను. కనుక రాష్ట్రప్రభుత్వమువారు నాకు పదిహేనురోజులు యెక్కువ రిమిషను యిచ్చిరి.

---

# ౫౦
## గాంధీజీని దర్శించుట.



నేను విడుదలయగుటతోడనే మంచముపట్టిన మాతల్లివద్దకు లక్నోకు వెళ్ళి కొన్నిదినము లచ్చటనేయుంటిని. చాలకాలము జయిలులో గడిపిన తరువాత బయటకువచ్చుటచే నేను సంగములేని వానివలెను, నాపరిస్థితులతో స్పర్శ లేనివానివలెను యుంటిని. నేను జయిలులో నెట్టి మార్పునులేక యుండగా ప్రపంచము త్వరితముగ కదలుచు మార్పు చెందుచు పోవుచున్నట్లు నేనాశ్చర్యముతో (మనమందరమును చేయు నట్లే)గుర్తించితిని. బిడ్డలు, బాలురు, బాలికలు పెద్దవాండ్రగుచుండుట; పెండ్లిండ్లు, పుట్టుకలు, చావులు; ప్రేమ, ద్వేషము, కృషి, క్రీడ, విషాదము, వినోదము; జీవితములో నూతన ప్రయోజనములు; సంభాషణకు నూతన విషయములు; నేను చూచిన దానిలోను, వినుదానిలోను సదా యెదోయొక వింతవిషయము ఉండెడిది. నన్ను వెనుకకు దిగ ద్రొక్కి జీవితము పరుగిడినట్లు కాన్పించెను. అదినాకు పూర్తిగ తృప్తి కరముగలేదు. నేనువెంటనే నాపరిసరములకు సరిపెట్టుకొని యుండెడి వాడను. కాని నాకట్టికోరిక కలుగలేదు. స్వల్పకాలము జయిలు వెలుపల విహారముచేయుటకు వచ్చినట్లును, కొద్దికాలములోనే తిరిగి వెళ్ళి పోవలసియుండునట్లును నేను గుర్తించితిని. కనుక కొలదికాలములోనే వీడనున్న పరిస్థితులకు సరిపెట్టుకొని యుండవలెనని నేనేల బాధపడ వలెను?

రాజకీయముగ హిందూదేశము కొంచెమించుమించు శాంతముగ నుండెను. ప్రభుత్వమువారు బహిరంగ చర్యలనన్నింటిని అణచి వేసిరి; వశపరచుకొనిరి. అప్పుడప్పుడు అరెస్టులు జరుగుచుండెను. కాని యప్పటి భారతదేశ మానమున కెంతయోయర్థము గలదు. అది

భయంకర నిర్బంధమును చాలకాల మనుభవించిన తరువాత నలసటచే కలుగు చెడుసూచనగల మౌనము! తెలుచుగ నది చాల గంభీరమైన మౌనము! కాని నిర్బంధములనే యెరుగు ప్రభుత్వముల కది గోచరము కాదు. భారతదేశము ఆదర్శపూర్వకమైన పోలీసుప్రభుత్వము. పోలీసు చిత్తవృత్తి ప్రభుత్వశాఖలనన్నింటిని చుట్టబెట్టెను. తిరుగుబాటుఅంతయు బాహ్యముగ నణచివేయబడెను. దేశమునంతను వేగులవాండ్రయొక్కయు, గూఢచారులయొక్కయు మహాసైన్యము కప్పివేసెను. ప్రజలలో నైతికదుర్బలత్వము, సర్వత్రవ్యాపించిన భయము కలిగెను. ఎట్టి రాజకీయకృషియైనను, ముఖ్యముగ గ్రామప్రాంతములలో, వెంటనే యణచివేయబడెను. వివిధరాష్ట్ర ప్రభుత్వములవారు కాంగ్రెసువారిని మున్సిపాలిటీలనుండియు స్థానికసంస్థలనుండియు తరిమివేయ బ్రయత్నించుచుండిరి. ప్రభుత్వదృష్టిలో శాసనోల్లంఘనములో జయిలుకువెళ్ళిన ప్రతివాడును మున్సిపలు పాఠశాలలలో బోధించుటకును, మునిసిపాలిటీలో నెట్టి యితరసేవచేయుటకును పనికిరాడు. మునిసిపాలిటీలు మొదలగు వానిమీద నెక్కువవత్తిడి కలిగింపబడెను. దోషులైన కాంగ్రెసువారిని యుద్యోగములనుండి తొలగింపనియెడల ప్రభుత్వగ్రాంటు లీయబడవని భయపెట్టిరి. ఇట్టి నిర్బంధ యుదాహరణములలో కలకత్తా కార్పొరేషను విశేషము పేరువడసెను. చివరకు రాజకీయనేరములకు శిక్షింపబడినవారికి కార్పొరేషనులో నుద్యోగముల నీయరాదని వంగ ప్రభుత్వమువారొక చట్టమును చేసిరని నేను విశ్వసించెదను.

జర్మనీలోని నాజీల యత్యాచార చరిత్రలు బ్రిటిషుప్రభుత్వాధికారులపయినను భారతదేశములోని వారి పత్రికలపయినను నొక చిత్రమైన ఫలితమును కలిగించెను. తాము హిందూదేశములో జరిపిన వన్నియు యుక్తమే యని యవి వారికి మద్దతునిచ్చెను. నాజీలేమాత్రో వ్యవహరింపవలసి వచ్చినయెడల నెంత యధ్వాన్నముగ నుండెడిదో!

యని మాకు (తాము ఘనముగ ప్రవర్తించితిమను భావముతో) బోధింపబడుచుండెడిది! నాజీలు నూతన ప్రమాణములను నూతన చరిత్రను స్థాపించిరి. నిశ్చయముగ వారితో పోటీచేయుట సులభమైన విషయముకాదు; బహుశః మాస్థితి యథమముగనే యుండియుండెడిది; గత యిరువది సంవత్సరములలోను హిందూదేశమంతటను వివిధప్రాంతములలో జరిగిన సంభవములను గురించిన హూంశములన్నియు నా యొద్ద లేకపోవుటచే నేను తీర్పు చెప్పుట కష్టమైన విషయము. హిందూదేశములోనున్న బ్రిటిషుప్రభుత్వము "నీయెడమచేయి చేయు దానము నీకుడిచేతికి తెలియకుండునుగాక" అను గుప్తదానమును విశ్వసించును. కనుకనది నిష్పక్షపాతమైన పరిశోధనను (అట్టిపరిశోధన లెప్పుడును అధికారులనైపుననే మొగ్గునట్లు చేయబడుచుండినను) జరుపవలెననెడి ప్రతిసూచనను నిరాకరించెను. సామాన్యాంగ్లేయుడు పశుత్వమును ద్వేషించుననుసంగతి నిజమేయనినేను భావించెదను. నాజీల వలె యింగ్లీషువారు బహిరంగముగ 'బ్రూటాలిటీ' (లేకనీయర్థము వచ్చు యింగ్లీషుపదము) పశుకృత్యములలో బహిరంగముగ నోలలాడుటయు, నాపదము నతిప్రీతితో నుచ్చరించుటయు చేయగలరని నే నూహింపజాలను. ఒకవేళవారాకృత్యమునాచరించినను దానికికొంచెము సిగ్గుపడుదురు. మనము జర్మనులమైనను, యింగ్లీషువారమైనను, భారతీయులమైనను మననాగరికప్రవర్తనకవచము చాల పలచనగనుండును. రాగద్వేషములుప్రకోపించినపుడది తొలగిపోయి చూడరమణీయముగ నుండనిదానిని బహిర్గత మొనరించును. ప్రపంచయుద్ధము మానవలోకమును భయంకరముగ పశుప్రాయ మొనరించెను. దీనిఫలితమునుమనము సంధియైన తరువాతగూడ జర్మనీకాహారపదార్థములనుపోకుండ నలువైపులను ముట్టడించినభయంకరరూపమున చూచియేయుంటిమి. దీని నొకయింగ్లీషుగ్రంథకర్త "ఏజాతియు నెన్నడును గావింపని యత్యంత బుద్ధితక్కువయైన, పశుప్రాయమైన, భయంకరమైన కార్యము" అని

వర్ణించెను. 1857, 1858 సంవత్సరములను భారత దేశము మరచిపోలేదు. మనప్రయోజనములకే ధాక తగిలినపుడు, 'యెసరు' వచ్చునపుడు మన మునమంచిలక్షణములను, సంఘనీతిని మరచిపోదుము; అసత్యము 'ప్రచారము' అగును; పశుత్వము 'శాస్త్రీయమైన నిర్బంధమును, 'న్యాయ, క్రమముల' నుద్ధరించుటయునగును.

అది వ్యక్తులయొక్కయు, నేప్య త్యేక ప్రజలయొక్కయు దోషము కాజాలదు. కొంచెమించుమించు ప్రతివాదును అట్టిపరిస్థితులలో నట్లే ప్రవర్తించును. హిందూదేశములోను, విదేశపాలనలోనున్న ప్రతి దేశములోను, పాలించుచున్న యధికారముపయి నంతర్గతముగ నొక సవాలుయెప్పుడును ఉండును. అది నానాటికిమరింత స్పష్టమును, భయోత్పాతజనకమునునగును. ఈసవాలుపాలకవర్గముయొక్క సైనిక సుగుణములను, అవగుణములను సదాయభివృద్ధిచేయును. మాసవాలు శక్తివంతమును, వీర్యవంతమునునైనదగుటచే గతకొలది సత్సరములలో భారత దేశమున మేమిూసైనికసుగుణములను, అవగుణములను విశేషముగ చూచితిమి. కానిభారత దేశములో కొంతవరకు మేమెప్పుడును సైనికహృదయమును (లేకదానియభావమును) సహింపవలసియుండెను. ఇది సామ్రాజ్యముయొక్క ఫలితములలో నొకటి. ఇది దీనితో సంబంధమున్న రెండుపక్షములవారినికూడ భ్రష్టులనుచేయును. భారతీయుల భ్రష్టత్వము తగినంత స్పష్టముగనేయున్నది. కానిరెండవవారి భ్రష్టత్వము యింతకంటెనెక్కువ సూక్ష్మమైనది. కాని యది విషమ సమయములలో బహిర్గతమగుచుండును. తరువాత మూడవపక్షమొకటి యుండెను. పాపము దీని కీరెండురకముల భ్రష్టత్వములను పంచుకొను దౌర్భాగ్యముపట్టెను.

ఉన్నతోద్యోగులయొక్క యుపన్యాసములను, అసెంబ్లీలోను, కౌన్సిళ్ళలోను వేయబడుప్రశ్నలకు వారిసమాధానములను, ప్రభుత్వ

వాఙ్మాలములను చదువుటకు జయిలులో నాకు తగినంత సావకాశ ముండెను. గతమూడువత్సరములలోను వానిలోకొంతమార్పు కలిగి నట్లు నేనుకనుగొంటిని. ఈమార్పు యంతకంతకు స్పష్టముగ విశదమగు చుండెను. వారియుపన్యాసములు అధికారపురస్కరముగను, భయజనక ముగనునుండెను. అవిగొప్పసైనికాధికారి తనసైనికులను సంబోధించు నట్టి భాషలోనుండెను. వంగదేశములోని మిడ్నపూరుడివిజను (అను కొనెదను) యొక్క కమిషనరు 1933 వ నవంబరు లేక డిసెంబరులో నిచ్చినయుపన్యాసము దీనికొకచక్కని యుదాహరణముగనుండును. పరాజితులు దుఃఖభాజినులు అని అతనిసూత్రము. అధికారేతర యూరపియనులు (ముఖ్యముగ వంగదేశములో) తమభాషలోను, క్రియలలోను అతినిశ్చయమైన ఫాసిస్టు స్వభావమును చూపిరి.

సింధులోశిక్షింపబడిన కొంతమంది నేరస్థులమధ్య బహిరంగ ముగ నురిదీయుట, పరుత్వముకు తెలుపు మరియొక యుదాహరణము. సింధులోనేరములు హెచ్చిపోవుచున్నవి కనుక నచ్చటియధికారులీ నేరస్థులను బహిరంగముగ నురిదీయనిశ్చయించిరి; ఇది యితరులకొక మందలింపు. ఈఘోరమైన దృశ్యమునుజూచుటకు ప్రజలకనేక సౌకర్య ములు గావింపబడెను; అనేకవేలమంది హాజరయిరనికూడ చెప్ప బడెను.

కనుకనేనుజయిలునుండి విడుదలయగుటతోడనే భారతదేశము లోని రాజకీయ, ఆర్థికపరిస్థితులను పరీక్షించితిని. అవి చాలనిరుత్సాహ కరముగ నుండెను. నాసహచరులు చాలమంది జయిళ్ళలోనుండిరి; క్రొత్తఅరెస్టులు జరుగుచునేయుండెను. ఆర్డినెన్సులన్నియు నమలు లోనే యుండెను. తణిఖీపద్ధతి ముద్రణయంత్రముల మూతులనుబిగిం చెను; మాయుత్తర ప్రత్యుత్తరములను తారుమారుచేసెను. తన యుత్త రముల నర్థములేకుండ తణిఖీచేయుటచే నామిత్రుడు, రఫీఅహ్మదు

డ్వాయికికి చాలకోపముకలిగెను. ఉత్తరములు ఆపివేయబడుచు చాలి యాలస్యముగవచ్చుచుండెడివి. కొన్నిపోవుచుండెడివి. దీనిచే నతని యేర్పాటులు భగ్నమగుచుండెను. తనయుద్యోగమును మరికొంత జాగ్రత్తగ నిర్వహింపవలసినదని యతడు తణిఖీ చేయువానికి వ్రాయ గోరెను. కానియతడెవరికి వ్రాయవలెను? ఈ తనిఖీదారు బహిరంగ యుద్యోగికాడు. బహుశఃయతడు రహస్యముగ పనిచేయుచుండు నొక సి. ఐ. డి. యుద్యోగి. ఇతనికృషియు, నునికియు బహిరంగముగ గుర్తింప బడనైనను గుర్తింపబడవు. రఫీఅహ్మదు దీనినిగురించి తణిఖీచేయు అధి కారికొక యుత్తరమునువ్రాసి పయికవరుమీద తనచిరునామానేవ్రాసి యీకష్టమునుపరిష్కారముచేసెను. సరిగా యీయుత్తరము వెళ్ళవల సినచోటుకు వెళ్లెను. తరువాత నతని యుత్తరప్రత్యుత్తర వ్యవహారము కొంతచక్కబడెను.

నాకు తిరిగిజయిలుకువెళ్ళవలెనన కోరిక లేకుండెను. నేనుదానిని పూర్తిగ చవిచూచితిని. కాని నేను నారాజకీయకృషినంతను మాను కొననిశ్చయించినగాని వర్తమానపరిస్థితులలో దీనిని తప్పించుకొనుట యెట్లో నాకు తెలియలేదు. నాకట్టియుద్దేశ్యములేదు. నాకుప్రభుత్వము తో సంఘర్షణతప్పదని నేనుభావించుచుంటిని. ఒకపనిని చేయవలెనని యో లేక చేయరాదనియో యేనిమిషమందయిన నాపైనొకఫర్మానా జారీచేయబడవచ్చును. 'నీవిట్లునడువవలెను' అనుబలవంతమునకు నాస్వ భావ మశేషము తిరుగబడును. భారతప్రజల నణచివేయుటకును లొంగ దీయుటకును నొకప్రయత్నము జరుపబడుచుండెను. విశాలరంగములో పనిచేయుటకు నేనసహాయుడను: నేనేమియు చేయజాలకుంటిని. కాని యధమము స్వయముగ నామట్టుకునేను లొంగుటకును నణచివేయబడు టకు తిరస్కరింపగలను.

నేను తిరిగిజయిలుకువెళ్లుటకు పూర్వము కొన్నిపనులను నిర్వ హించుకొనవలసియుండెను. ముందునేను మాతల్లిగారివ్యాధివిషయమై

చూచుకొనవలసియుండెను. ఆమెచాలనెమ్మదిగ స్వస్థతచెందుచుండెను. ఆవిధాన మతినెమ్మదిగనుండుటచే నొకసంవత్సరమువరకు నామెమంచముమీదనేయుండెను. తన తుదియుపవాసమునుండి కోలుకొనుచున్న గాంధీజీనిచూచుటకు నే నాతురపడుచుంటిని రెండువత్సరములపయిగ నేనతనిని కలుసుకొనలేదు. నేను రాష్ట్రసహచరులనుగూడ చూడగలిగినంతవరకుచూచి భారతదేశములోనున్న ప్రస్తుతరాజకీయపరిస్థితులనేగాక ప్రపంచపరిస్థితులను, నామనస్సులోనున్న భావములను వారితో చర్చింపగోరితిని. ఈప్రపంచము త్వరలోనే యొకరాజకీయ ఆర్థికయుత్పాతము ననుభవింపనున్నదని నేనప్పుడు భావించితిని. మాజాతీయప్రోగ్రామును తయారుచేయుటలో మేము దీనినిగుర్తింపవలసియుండెను. నాగృహపరిస్థితులనుగూడ నేనుచూచుకొనవలసి యుండెను. నేను వానినింతవరకు నిర్లక్ష్యముచేసితిని. మాతండ్రిచనిపోయినప్పటినుండియు నేనతని కాగితములను, దస్తావేజులను పరీక్షించియుండలేదు. మేము మాఖర్చులను చాలవరకు తగ్గించితిమి. అవి యింకను మేము భరింపజాలనంతగనుండెను. మేమాభవనములోనున్నంతకాలమువానిని తగ్గించుట దుస్సాధ్యముగనుండెను. మాకుశక్తిలేక మేముమోటారుకారునుపెట్టుకొనలేదు. అంతేగాక ప్రభుత్వమువారు దానినే క్షణములోనైనను జప్తుచేయువచ్చును. ఆర్థికచిక్కులలోపడి మేముబాధపడుచుండ ద్రవ్యసహాయముచేయవలసినదని నాకువచ్చుచుండు యుత్తరముల కట్టలనుచూచి నేను వినోదపడెడివాడను. (తనిఖీయుద్యోగియీగుట్టను నిరభ్యంతరముగపంపెడివాడు) నేనుచాలధనవంతుడనని సాధారణముగ నొకదురభిప్రాయము (ముఖ్యముగ దక్షిణహిందూదేశములో) గలదు.

నేనువిడుదలయగుటతోడనే నాకడసారిచెల్లెలు, కృష్ణకుమారికి వివాహముచేయవలసియుండెను. నేనుతిరిగివారినిబలవంతముగ వీడవలసియుండులోపలనే యీవివాహమును జరుపవలెనను నాతురతతోనుంటిని.

కృష్ణకూడ నొకసంవత్సరము శిక్ష ననుభవించి కొద్దిమాసములక్రితమే జయిలునుండి బయటకువచ్చెను.

నాతల్లియారోగ్యమునుచూచుకొని గాంధీజీనిదర్శించుటకు నేను పూనా వెళ్ళితిని. అతనిదర్శనభాగ్యము తిరిగినాకు లభించినందులకు నేను సంతోషించితిని. అతడుకొంచెమునీరసముగనున్నను త్వరితముగకోల్కొనుచుండెను. మేముదీర్ఘసంభాషణలను జరిపితిమి. జీవితమునుగురించియు, రాజకీయములనుగురించియు ఆర్థికములనుగురించియు మాదృష్టులలో చాలవ్యత్యాసముండెను. నాదృష్టినవగతముచేసికొని దానిని సమీపించుటకతడుసల్పిన మనఃపూర్వక ప్రయత్నములకు నేనతనికెంతయు కృతజ్ఞుడను. మాయుత్తరప్రత్యుత్తరములు (అవితరువాత ప్రచురింపబడెను.) నాహృదయమునునింపిన విశాలసారాంశములలో కొన్నింటిని కలిగియుండెను. వానికిసంబంధించిన భాష కొంతయస్పష్టముగనున్నను సాధారణతాత్పర్యము సుస్పష్టముగనే యుండెను. సుస్థాపితమైనస్వప్రయోజనముల నూడబెరుకవలెనని (బలవంతముచేగాక పరివర్తనముచే నిదిజరుగవలెనని యతడు వక్కాణించినను) యతడుచేసినప్రకటనము నాకు సంతసముకలిగించెను. అతనిపరివర్తన విధానములుకొన్ని (నాదృష్టిలో) మృదుత్వముతోను, మర్యాదతోనుగూడినబలవంతపువిధానములకంతదూరముకాకపోవుటచే నాకంతభేదము కాన్పించలేదు. అస్పష్టమైన సిద్ధాంతములను విచారణచేయుట కతడిష్టపడడని (మునుపటివలెనే) యప్పుడును భావించినను సత్యమనుతర్కము, ప్రధానసాంఘిక పరివర్తనములు అవసరములను స్థితికతనిని క్రమక్రమముగ గొంపోవునని నేను భావించితిని. అతడొకయద్భుతమైనవ్యక్తి- వెర్రియరు యెల్వినుగారు చెప్పినట్లతడు మధ్యయుగపు క్యాథలికుఋషి- అయినను భారత కృషీవల హృదయము నాకళింపుచేసికొనిన కార్యదక్షతగల నాయకుడు. విషమపరిస్థితు లెదుర్కొనినప్పుడు అతడేమిచేయునో, యెట్లుతిరుగునో చెప్పజాలము. కాని

యతడెట్లు తిరిగిన నాకైనపే బలమగును. మనయాలోచనల ప్రకార మతడు తప్పుమార్గమునే బట్టినను అది యెప్పుడును సరళమైన మార్గమే యగును. అతనితో పనిచేయుట శుభప్రదము; కాని యవసరమైనచో వేరుమార్గమును త్రొక్కవలసియుండును.

ప్రస్తుతమీసమస్యకు తావులేదని నేను భావించితిని. మేము మాజాతీయ సమరరంగమధ్యమున నుంటిమి. శాసనోల్లంఘన మింకను (అది వ్యక్తులకే నియమింపబడినను) కాంగ్రెసుయొక్క కార్యక్రమముగ (సిద్ధాంతములో) నుండెను. మేము యథాప్రకారము మాకార్యమును నిర్వహించుచు ప్రజలలో (ముఖ్యముగ రాజకీయప్రబోధమును పొందిన కాంగ్రెసు వర్కరులలో) సామ్యవాదభావములను వ్యాప్తిచేయ బ్రయత్నింపవలెను. ఇట్లుచేసి మేము మానీతిని ప్రకటింపవలసిన మరియొక తరుణమాసన్నమయినప్పుడు తగిన యభివృద్ధికి సిద్ధముగ నుందుము. ఈలోపల కాంగ్రెసు అక్రమసంస్థగ నుండెను. ప్రభుత్వమువారు దానిని నలిపివేయుటకు బ్రయత్నించుచుండిరి. మేమూదాడి నెదుర్కొనవలసి యుండెను.

గాంధీజీయొక్క ప్రధాన సమస్య వ్యక్తిగతముగ నుండెను. అతనిమట్టుకతడేమిచేయవలెను? అనునది యొక చిక్కు సమస్య. అతడు తిరిగి జయిలుకు వెళ్ళినచో హరిజనోద్యమ సౌకర్యముల ప్రశ్న తిరిగి యుదయించును. బహుశః ప్రభుత్వమువారు లొంగకపోవచ్చును; అతడు తిరిగి యుపవసించును. ఈ చరిత్రచరణము జరుగవలసినదేనా? అత డిట్టి మార్గాల మూషికసిలిక్రొప్పుకొనక తాను తిరిగి యీ సౌకర్యముల కొరకుపవసింపవలసి వచ్చినచో తాను విడుదలయైనను ఉపవాసము విరమింపబడదని చెప్పెను. అనగా చనిపోవువరకును నుపవసించును.

అతడిక చేయగల రెండవపనియేమన తన సంవత్సర శిక్షాకాలములో (దీనిలో పదినెలల పదిహేనురోజులు మిగిలెను.) జయిలును

సరించక దానిని హరిజనోద్యమమునకు వినియోగింపవలెను. అయినను అతడు కాంగ్రెసు వర్కరులను కలుసుకొని యవసరమైనపుడు వారికి సలహా యిచ్చుచుండును.

అతడు మూడవమార్గము నింకొక దానిని సూచించెను. కొంత కాల మతడు కాంగ్రెసు నుండి పూర్తిగ విరమించి దానిని "యువక పురుషాంతరము" యొక్క హస్తగతము చేసెదననెను.

మొదటి పద్ధతివలన నతడుపవసించి చనిపోవుట తప్పదు కనుక మే మెవరమును దానిని శిఫార్సు చేయలేము. కాంగ్రెసు అక్రమసంఘముగ నున్నపుడు మూడవపద్ధతి నవలంబించుట యెంత మాత్రమును వాంఛనీయము కాదు. ఇది శాసనోల్లంఘనమును, అన్నివిధములగు ప్రత్యక్ష కార్యములను వెంటనే విరమించి తిరిగి న్యాయవిధానములకును, చట్ట సంబంధమైన చర్యలకును దిగుటగ పరిణమించును; లేదా యిప్పుడు గాంధీజీచేత కూడ బహిష్కరింపబడి, వేరుచేయబడి ప్రభుత్వముచే మరింత నలిపివేయబడు కాంగ్రెసుగ పరిణమించును. ఇంతేగాక నొకచోట కలుసుకొనుటకుగాని, యొక నీతిని చర్చించుకొనుటకుగాని వీలులేని యక్రమసంస్థ నేవర్గమువారును చేబట్టుట కవకాశములేదు. కనుక నతడు సూచించిన వానిలో రెండవ పద్ధతికి మేమంగీకరించితిమి. మాలో చాలమందికది యిష్టములేదు; చావగా మిగిలిన శాసనోల్లంఘన కార్యక్రమమున కిది యొక పెద్దగొడ్డలి దెబ్బ యని మే మెరుగుదుము. నాయకుడే సమరరంగమునుండి విరమించిన మొదల ననేకమంది యుత్సాహవంతులగు కాంగ్రెసు వర్కరులు యీ యగ్నిలోనికి దుముకజాలరు. కాని యీ చిక్కులోనుండి బయటపడుటకు మరియొక తెన్ను కానరాదయ్యెను. కనుక గాంధీజీ నయివిధముగనే ప్రకటించెను.

గాంధీజీయు నేనును (బహుశః వేరు వేరు కారణములచే) శాసనోల్లంఘనమును యింకను విరమింపరాదనియు, దానిని సన్నసన్నగా

నైనను నడుపవలెననియు నొప్పుకొంటిమి. ఇక నేను ప్రజాదృష్టిని సామ్యవాద సిద్ధాంతములమీదకును, ప్రపంచ పరిస్థితులమీదకును త్రిప్పగోరితిని.

నేను యింటికి తిరిగి వచ్చునప్పుడు బొంబాయిలో కొద్దిదినము లుంటిని. నేనచ్చట యుదయశంకరుని పట్టుకొని యతని నృత్యకళను గ్రోలితిని. ఇది నాకు తలవని తలంపుగ చేకూరుటచే నేను దీని నాప్యాయముగ ననుభవించితిని. నాటకములు, గానము, సినీమాలు, టాకీలు, రేడియో, దూరశ్రవణము యిత్యాదులు చాల వత్సరములనుండి నాకననుభూతములుగ నుండెను. ఏలనన నాకు స్వేచ్ఛయిచ్చిన మధ్య కాలములలో గూడ నేనితరపనులలో నెక్కువగ మునిగియుండెడి వాడను. నే నింతవరకు నొక్కసారియే టాకీకి పోగలిగితిని. సినీమా ప్రపంచములో ప్రసిద్ధిచెందినవారి నామములు నాకు నామమాత్రము లుగ నుండెను. ముఖ్యముగా నాకు నాటకములతో సంబంధము లేకుండెను. విదేశములలో రచింపబడు నూతన నాటకములను గురించి నే నసూయతో చదువుచుండెడివాడను. ఉత్తర హిందూదేశములో (నేను జయిలు వెలుపల నున్నపుడు గూడ) మంచి నాటకములను చూచుట కవకాశములు లేకుండెను. మా సమీపములో నట్టివేవియును లేకుండెను.

వంగ, మహారాష్ట్ర, గుజరాతీ నాటకములలో గొప్పయభివృద్ధి కలిగెనని నేను విశ్వసించెదను. హిందూస్థానీ నాటకరంగము అట్లుగాక మిక్కిలి సంస్కార శూన్యముగను, కళావిహీనముగను నున్నది; లేక (నవీన యభివృద్ధి సంగతి నాకు తెలియదు) యట్లుండెను. భారత దేశములోని ఫిల్ములు చాలవరకు (టాకీలును మాట్లాడని ఫిల్ములను కూడ) కళోపాసనచేయు దోషమున కొడిగట్టవని నేను వింటిని. అవి సాధారణముగ ప్రాచీన భారతదేశ చరిత్రనుండియో, పురాణగాథల

నుండియో తీసికొనబడు విషయముకు చెందిన సంగీత మిశ్రితమగు కథలు, పుక్కిడిపురాణములు.

అవి నగరవాసులచే నెక్కువగ నాదరింపబడు వాంఛను నష్టయి చేయుననియే ననుకొనెదను. సంస్కార రహితములు, బాధకరములు నగు యీ ప్రదర్శనములకళకును యింకను నిలచియున్న వీధినాటకములు, బొబ్బిలి కథలు, నృత్యము మొదలగు వానిలో నున్న కళకును గల వ్యత్యాస మెంతయో గలదు. వంగదేశము, గుజరాతు, దక్షిణ హిందూదేశములలోని గ్రామప్రజలు స్త్రీధానముగ (అయినను అబుద్ధి పూర్వకముగ) నెంత కళాభిజ్ఞులో మన మొక్కొక్కప్పు డత్యాశ్చర్యముతో కనుగొనగలము. మధ్యతరగతుల వారట్లుగాక తమ మూలములను పోగొట్టుకొనినట్లు కాన్పింతురు. వారుపాసించునట్టి కళాసాంప్రదాయ మేదియునులేదు. వారు జర్మనీ, ఆస్ట్రియాలలో గుట్టలుగ తయారుచేయబడు అందవికారమగు చౌకరకపు ప్రింటులతో మురియుచు నొక్కొక్కప్పుడు రవివర్మ చిత్రములనుగూడ గుర్తించుచుందురు. హార్మోనియము వారియభిమానయంత్రము. (స్వరాజ్యప్రభుత్వ మీవికారయంత్రమును తనప్రప్రథమచట్టములచే నిషేధించుననుగంపెడాశతో నేనుజీవించుచున్నాను) కానిబహుళః లక్నోలోనుతరు పోట్లను గలపెద్ద తాలూకుదార్లభవనములలో నతి విషాదకరమగు సంగీతకేళియు, కళా సిద్ధాంతములనన్నింటిని భంగపరచుటయు గాననగును. ఖర్చుపెట్టుటకు వానికి కుప్పలిప్పలుగ ద్రవ్యముకలదు! ఘనతను ప్రకటించుకొనవలెనను నిచ్ఛగలదు! కనుక వారట్లేలచేయరాదు? వానిని దర్శింపబోవుప్రజలు వారి యీయభీష్టసిద్ధిని కండ్లారజూచు విచారకలుషిత ద్రష్టలగుదురు.

సుప్రసిద్ధమగు టాగూరువంశమొక కళాప్రబోధమును నవీనముగ కలిగించెను. భారతదేశమంతటను దానిప్రతిభ యప్పుడే ప్రసరించెను. కాని, దేశములోనిప్రజలు అడుగడుగునకు నిర్బంధింపబడుచు,

నాశింపబడుచు, నణచివేయబడుచు భయభ్రాంతమగు వాతావరణములో జీవించుచుండ నేకళగాని విరివిగానెట్లభివృద్ధి చెందగలదు ?

బొంబాయిలో నేననేకమంది స్నేహితులను, సహచరులను కలుసుకొంటిని. వారిలో కొందఱు కొద్దికాలముక్రిందటనే జయిలునుండి బయలుపడిరి. అచ్చటసామ్యవాదము బలముగ నుండెను. కాంగ్రెసులోని పయి తరగతులలో నవీనముగసంభవించినమార్పుపట్లతిరస్కారము హెచ్చుగ నుండెను. తనయాధ్యాత్మికదృష్టిని రాజకీయములకు వర్తింపజేసినందులకు గాంధీజీ తీవ్రముగ విమర్శింపబడెను. ఆవిమర్శతో చాలవఱకు నేనేకీభవించితిని. కాని, పరిస్థితులనుబట్టి మనకు వేరుగత్యంతరములేదనియు నుద్యమమునుసాగింపకతప్పదనియు నేనుస్పష్టముగ గ్రహించితిని. శాసనోల్లంఘనమునువిరమించుప్రయత్నమేదియు మనకు శాంతినిప్రసాదింపజాలదు. ఏలనన ప్రభుత్వముయొక్క నిర్బంధవిధానము సాగింపబడుచునే యుండును. పటుత్వముగల మనకృషియంతయు విధాయకముగ జయిలుకే మార్గమగును. మనజాతీయోద్యమము ప్రభుత్వముచే నణచివేయబడవలెను, లేదా ప్రభుత్వముపై తనయిచ్ఛను చలాయించవలెను. దీనికిమఱియొకమార్గములేదు. అనగా జాతీయోద్యమమెప్పుడును ప్రభుత్వముచేసక్రమసంఘముగ ప్రకటింపబడనట్టిస్థితికి వచ్చెను. శాసనోల్లంఘనము విరమింపబడినను యీయుద్యమము వెనుకకు మరలజాలదు. శాసనోల్లంఘనమును సాగించుటవలన నాచరణలో నెక్కువభేదము లేదు. కానియీనైతికతిరస్కారమునకొక ప్రయోజనముకలదు. పోరాటమును కట్టిపెట్టినపుడు యపస్థితిప్రబలును; అప్పుడునూతన భావములను వ్యాపింపజూచుటకంటె సమరకాలములోనే వాటిని వ్యాపింపజేయుట సుకరము. పోరాటమును విరమించినచో మనము చేయగలిగినదొక్కటియేకలదు. మనము బ్రిటిషుప్రభుత్వముతో రాజీపడి శాసనసభలలోని చట్టసంబంధమైన కార్యకలాపమునకుడగవలెను.

అదియొకకఠినమైనస్థితి; దీనికంగీకరించుట యంత సులభమైన విషయముకాదు. నేనునాసహచరులమానసికసంఘర్షణలను గుర్తించితిని. ఏలనన నేనేయట్టివాని నొకప్పుడెమరొక్కన నలసియుండెను. కాని (హిందూదేశములోని యితర చోట్లవలె) నచ్చటనుత్కృష్టమైన సామ్యవాదసిద్ధాంతమును కార్యశూన్యతకొక యాశ్రయముగ చేయగోరిన వారిని కొందరిని కనుగొంటిని. తమంతతాము రవంతకార్యమునైనను చేయనివారు సంగ్రామమతితీవ్రముగనున్నప్పుడు కార్యభారమునంతను వహించినయితరులను నభివృద్ధిభంజకులనివిమర్శించుట కొంచెముక్రోధోద్దీపితముగనుండకమానదు. ఈపడకగదిసామ్యవాదులు ముఖ్యముగ గాంధీజీనతికఠినముగ పచ్చిరియేక్షనరీయని నిందించిరి. వారుతర్కమునకెంతమాత్రమునుకొఱతపడని వాదనలను కల్పించిరి. కానియీ'రియేక్షనరీ' భారతదేశమునెరిగినవాడు, గ్రహించినవాడు; కొంచెమించుమించు యతడే కృషీవలభారతదేశము; విప్లవకారుడనబడువాడెవడును చేయని విధమున నతడు భారతదేశమును కదల్చివేసెను అను చిన్నవిషయమాచందార్కముగ నిలిచిపోగలదు. అతనియొక్కనవీనహరిజనోద్యమము గూడ సనాతనహిందూమతమును నెమ్మదిగ అప్రతిహతముగ త్రవ్వి దానినిపునాదులవరకుకదల్చివేసెను. సనాతనబృందమంతయు నొక్కపెట్టున నతనిపై యెదురుతిరిగిరి; అతడు వారి నెంతయుదారముగను, మర్యాదగను సన్మానించినను వారతనిని తమకుప్రబలశత్రువుగ పరిగణించిరి. అతనికి సహజమగునొకచిత్రమైనవిధమున నతడు ప్రబలమైన శక్తులను విడిచిపెట్టుచుండును, ప్రయోగించుచుండును. అవి నీటిమీది యలలవలె విస్తరించుచు కోట్లకొలదిప్రజలను చేరుచుండును; వారిని నిమిషములో మార్చివేయుచుండును. 'రియేక్షనరీ' యగుగాక విప్లవకారుడగుగాక! అతడు భారతముఖమునంతను మార్చివేసెను. దాసానదాసులై యపనీతిపరులైపడియున్న ప్రజలకతడు యభిమానధనమును, శీలసంపత్తును ప్రసాదించెను. ప్రజలలో నొకశక్తిని, ప్రబోధమును

నిర్మించెను; భారతసమస్యను ప్రపంచసమస్యగచేసెను. దౌర్జన్యరహిత సహాయనిరాకరణము లేక సాత్త్వికనిరోధము (దానిలక్ష్యములను, యాధ్యాత్మికభావములను యటులుంచి) భారతదేశమునకును, ప్రపంచమునకును నతడుప్రసాదించిన యుపన్యాసము. అది భారతదేశపరిస్థితుల కతిచిత్రముగ సరిపడెననుటకు సందేహ మెంతమాత్రమును లేదు.

సరసమైనవిమర్శను ప్రోత్సహించుట యుక్తమనియు, మనసమస్యలనుగురించి సాధ్యమైనంతబహిరంగచర్చకవకాశమీయవలెననియు నేను భావించెదను. గాంధీజీయొక్క యనన్యమైనస్థానమీచర్చకుకొంతయాటంకకముకలిగించుటదురదృష్టము. అతనిపై నాధారపడునట్టియు, నిశ్చయమునతనికే విడిచివేయునట్టియు స్వభావమలవడిపోయెను. ఇదిచాల పొరపాటు. లక్ష్యములను, పద్ధతులనుసహేతుకమైనయంగీకారముతో నవలంబించుట చేతను, (గ్రుడ్డియైనవిధేయత పయిగాక) వానిపై నాధారపడుసహకార, శిక్షణలచేతను మాత్రమే జాతియభివృద్ధి చెందగలదు. ఎంతటి గొప్పవాడైనను విమర్శకతీతుడుగనుండరాదు. కాని విమర్శ కేవలము కార్యరాహిత్యమున కాశ్రయమైనప్పుడు దానిలో నేదోయొకదోషముండును. సామ్యవాదులిట్టి దానికి పాల్పడినప్పుడు ప్రజలచే గ్రహింపబడుటతప్పదు. ప్రజలు కార్యములనుబట్టియే విమర్శించుచుందురు. "భవిష్యత్తునందు సుకుమారకార్యములనుగురించి కలలనుగనుచు నేటికర్తవ్యకార్యములను తోసిపుచ్చువాడు వంచకుడగును" అని లెనినుమహాశయుడు వచించెను. అనగా నది ప్రస్తుత నిజజీవితములో జరుగుచున్న యభివృద్ధిపయి నాధారపడుటకు తిరస్కరించుటయగును; కలలపేరిట అభివృద్ధిమార్గమునుండి విడివడుటయగును.

భారతదేశములోనున్న సామ్యవాదులును, కమ్యూనిస్టులును చాలవరకు పారిశ్రామిక బీదజనులకు సంబంధించిన సాహిత్యముమీదనే పెరిగిరి. బొంబాయి, కలకత్తా మొదలగు కొన్ని ప్రత్యేకప్రాంతము

లలోనే చాలమంది ఫ్యాక్టరీ కూలివాండ్రు, పనివాండ్రు కలరు. తక్కిన భారతదేశమంతయు వ్యవసాయక దేశము. కనుక పారిశ్రామిక పని వాండ్రుసూపముగ భారతసమస్యను యథోచితముగ బరిష్కరించుటకు వీలులేదు; జాతీయత, గ్రామములకు సంబంధించిన ఆర్థికములు యిచ్చట ప్రధానవిషయములు. పాశ్చాత్యసామ్యవాదమునకు వీనితో నెట్టిసంపర్కమునులేదు. యుద్ధమునకుపూర్వము రష్యాదేశపరిస్థితులు హిందూదేశమును పోలియేయుండెను. కాని యచ్చట యసాధారణములును, అసామాన్యములును నగు సంభవములు తటస్థించెను. అట్టివేయిచ్చటనైనను జరుగునని యనుకొనుట మూర్ఖత్వము. ఏదేశములోనినైనను ప్రస్తుతపరిస్థితులను గ్రహించుటకును, అన్వయించుకొనుటకును కమ్యూనిస్టువేదాంతము సహాయపడునని నావిశ్వాసము; మరియునది భవిష్యదభివృద్ధికి మార్గమును సూచించును. కాని యథార్థములను, పరిస్థితులను, యుక్తముగ గుర్తింపకుండ గుడ్డిగ నీవేదాంతమును వర్తింపజేయుట దీనియెడల నపచారమును, దౌర్జన్యమును చేయుటయే యగును.

ఎట్లైనను జీవితమంత సుళువైన విషయము కాదు. జీవితములో నున్న పోరాటములు, పరస్పరసంఘర్షణలు ఒక్కొక్కప్పుడు కొంతనిరాశను కలిగించును. ప్రజలకు భేదాభిప్రాయములుండుటలో నాశ్చర్యమేమియునులేదు. సమస్యలపట్ల సమానాన్వయమును పొందిన సహచరులు వివిధసారాంశములను కలిగియుండుటలోగూడ నాశ్చర్యమేమియును లేదు. కాని తన నిజదుర్బలత్వము నుదాత్తపదజాలముతోను, ఉదార సిద్ధాంతములతోను కప్పిపుచ్చజూచు వ్యక్తి పట్టుబడక మానడు. ప్రభుత్వమునకు వ్రాతమూలముల నిచ్చియు, హామీలనిచ్చియు జయిలు నుండి తప్పించుకొన ప్రయత్నించువ్యక్తి, లేక సందేహాస్పదమగు నితర పవిత్రతగల వ్యక్తి, యితరులను విమర్శించుటకు సాహసించినచో తానుబూనినయుద్యమమునకే ఘాతచేసినవాడగును.

బొంబాయి యుదారమైన పట్టణరాజమగుటచే నన్నిరకముల మనుష్యులను కలిగియుండును. అయినను ఒకవిఖ్యాతనగరవాసి తన రాజకీయ, ఆర్థిక, సాంఘిక, మతవిషయకదృష్టిలో చిత్రమగు, ననన్యసాధ్యమగు, నుదారతను ప్రదర్శించెను. కూలీల నాయకుడయి యతడు సామ్యవాదియయ్యెను; రాజకీయములలో సాధారణముగ నతడు ప్రజాప్రభుత్వవాదియని పిలుచుకొనెడివాడు; అతడు 'హిందూసభ' యొక్క గారాబుపట్టి; ప్రాచీనమత, సాంఘికాచారములను కాపాడుటకును, వాటితో జోక్యముకల్పించుకొనకుండ శాసనసభలను వారించుటకును అతడు వాగ్దానముచేసెను. ఎన్నికసమయములో నతడు సనాతనపక్షము వారి యభ్యర్థియయ్యెను. ఇట్టి వినోదకరమగు చౌచౌ జీవితముతో తృప్తిపొందక నతడు వ్యర్థముగ పోవునట్టి తన శక్తిని కాంగ్రెసును విమర్శించుటయందును, గాంధీజీని 'రియేక్షనరీ' యని నిందించుటయందును సద్వినియోగముచేసెను. మరికొందరితో కలసి యతడు కాంగ్రెసు ప్రజాస్వామికపక్షమను దానిని లేవదీసెను. దీనికి వస్తుతః ప్రజాస్వామికముతో నెట్టిసంబంధమునులేదు;దీనికికాంగ్రెసుతోగలసంబంధము ఆమహాసభపై దాడివెడలుట యొక్కటియే! క్రొత్తసీమలను జయింపవలెనని గేలము వేసి పరిశోధించుచు లేబరు ప్రతినిధిగనతడు జనీవాలేబరు కాన్ఫరెన్సుకు తయారయ్యెను. ఇంగ్లీషువారి మాదిరి 'జాతీయ' ప్రభుత్వ ప్రధానమంత్రిత్వమున కతడు అర్హతను సృష్టించుకొనుచుండెనని మనము యోచించుకొనవచ్చును.

కొద్దిమందికి మాత్రమే యిట్టి చౌచౌదృష్టియు, చేష్టలును లభింపగలవు. అయినను కాంగ్రెసును విమర్శించువారిలో వివిధరంగములను చూచినవారు చాలమంది కలరు; అన్ని వాయిద్యములను వాయించినవారును కలరు. వీరిలో కొద్దిమంది సామ్యవాదులని తమ్ము పిలుచుకొనిరి, వీరు సామ్యవాదమునకు చెడ్డపేరు తెచ్చిరి.

---

# లిబరలు దృష్టి.



గాంధీజీని చూచుటకు పూనా వెళ్ళినపుడు ఒకనాటి సాయం కాలము నేనతనితో కలసి 'భారత సేవకసంఘము' వారి భవనమును చూచుటకు వెళ్ళితిని. ఆసంఘములోని సభ్యులతనిని సుమారొక గంటసేపు రాచకీయవిషయమైన ప్రశ్నలను వేసిరి. అతడు వానికి సమాధానము లను చెప్పెను. ఆసంఘాధ్యక్షుడైన శ్రీనివాసశాస్త్రిగారచ్చటలేరు. తక్కిన సభ్యులందరిలోను అతిసమర్థుడైన పండితహృదయనాధ కుంజ్రూ గారుకూడ నచ్చటలేరు; కాని కొందఱు సీనియరుసభ్యులుండిరి. ఆసమయమున నచ్చటనున్న మేముకొందర మాప్రశ్నల నాశ్చర్యముతో వినుచుంటిమి. అవి యతిస్వల్పసంభవములను గురించి పృచ్ఛించెను. అవి చాలవరకు గాంధీజీ వైస్రాయిగారిని దర్శనమీయవలెననికోరుటయు, వైస్రాయి దానిని తిరస్కరించుటయు మొదలగువానితో గూడియుండెను. వివిధ సమస్యాభరితమయిన ప్రపంచములో వారు భావింపగలిగిన ముఖ్యవిషయమిది యొక్కటియేనా? స్వాతంత్ర్యముకొరకు తమ మాతృభూమి ఘోరసంగ్రామమును సలుపుచున్నపుడు, వందలకొలది సంస్థలు అక్రమసంఘములుగ ప్రకటింపబడినపుడడుగవలసిన ప్రశ్నలివియేనా? వ్యావసాయక దుస్థితి, విపరీత నిరుద్యోగమును దాపరింపజేసిన పారిశ్రామిక మాంద్యము, వంగదేశములోను, సరిహద్దు రాష్ట్రములలోను, తదితరప్రాంతములలోను జరుపబడిన ఘోరకృత్యములు, ఉపన్యాసములు, వార్తలు, సభలు, భావములు మొదలగువాని స్వాతంత్ర్యములనణచివేయుట, అనేక జాతీయ, అంతర్జాతీయ సమస్యలు- ఇన్నియుండగా నెట్టిప్రశ్నలుదొరికెను!

అచ్చటనివసించువారికి బహిఃప్రపంచముతో నెట్టిసంపర్కమును జేసి యొకమఠములో నడుగుపెట్టినట్లు నాకు తోచెను. అయినను వున

మిత్రులు హెచుపారయిన రాచకీయ ధురంధరులు; సమర్థులు త్యాగము, చిరప్రజాసేవక చరిత్రకలవారు. మరికొద్దిమందితోకలసి వారు లిబరలుపక్షముయొక్క యథార్థమైన మేరుదండినలెనుండిరి. ఈపక్షములోని తక్కుంగలవారు యీూరుపేరులేని నిరర్థకమూక; రాచకీయకృషితో సంబంధమున్నట్లు అప్పుడప్పుడు తృప్తిపడ గోరు వారు. వీరిలోకొందఱు (ముఖ్యముగ బొంబాయి, చెన్నపట్టణముల లోనివారు) ప్రభుత్వాధికారులనుండి వేరుచేయుటకు వీలులేనివారు.

ఒక దేశము వేయునట్టిప్రశ్నలే యాదేశముయొక్క రాచకీయాభివృద్ధికి ప్రమాణములు. తనకుతాను యుక్తమైన ప్రశ్ననువేసికొనక పోవుటయే దేశముయొక్క విఫలతకు తఱచుకారణమగుచుండును. మన కాలమును, శక్తిని, బుద్ధులను శాసనసభాస్థానములను కులముల వారీగా పంపకములుచేయుటయందు వ్యర్థముచేయుటయు, లేక కమ్యూనల్ అవాస్తవసమస్యమీాద పక్షములనుసృష్టించి, దానినిసురించి (ప్రధాన సమస్యలన్నింటికిని స్వస్తిచెప్పి) వ్యర్థవాగ్వివాదలతో ప్రొద్దుబుచ్చుటయు మన రాచకీయ దుస్థితికి ప్రమాణములు. అదేవిధమున భారత సేవక సంఘమువారి మందిరమున నాడు వేయబడిన ప్రశ్నలు ఆసంఘముయొక్కయు, లిబరలుపక్షముయొక్కయు వింతమానసిక స్థితిని ప్రతిబింబించుచుండెను. వారికి రాచకీయ లేక ఆర్థిక సిద్ధాంతములున్నట్లు కాన్పించదు; విశాలదృష్టియులేదు. వారిరాచకీయములు ఉన్నతాధికారులేమిచేతురు? లేక నేమిచేయకుందురు ? అను పడకగది లేక కాఫీ హూటలు రాచకీయములుగ కాన్పించెను.

'లిబరలుపక్షము' అనునామకరణము మోసమునకాస్పదము కావచ్చును. ఇతరచోట్ల (ముఖ్యముగ ఇంగ్లండులో) నాపదమొక యార్థికనీతిని—స్వేచ్ఛావాణిజ్యము మొదలగుదానిని—వ్యక్తి స్వాతంత్ర్యము, పౌరస్వాప్రు హక్కులు అనునొక లక్ష్యమును నిరూపించును.

ఆంగ్లదేశపు లిబరలు సాంప్రదాయము ఆర్థిక పునాదులపై నిర్మింపబడెను. వర్తకములో స్వాతంత్ర్యముండవలెనను నభిలాషయు, రాజుగారియొక్క గుత్తపద్ధతినుండియు, నిరంకుశ సుంకముల విధానమునుండియు స్వేచ్ఛనుబడయవలెనను కోర్కె రాజకీయ స్వాతంత్ర్యేచ్ఛకు మార్గముచూపెను. భారతదేశ లిబరలుపక్షమువారికట్టి పునాదియేదియునులేదు. స్వేచ్ఛావర్తకములో వారికి నమ్మికలేదు. కొంచెమించుమించు వారందరును రక్షణకావలెననియే కోరెదరు. పౌరసత్వములకు వారెక్కువ ప్రాముఖ్యత నీయరని యీమధ్య జరిగిన సంభవములవలన విదితమగుచున్నది. నిరంకుశప్రభుత్వములును, అర్థఫ్యూడల్ ప్రభుత్వములును, ప్రజాస్వామిక ప్రాతిపదికలునను, వ్యక్తిస్వాతంత్ర్యమును కూడలేనట్టివియునగు భారతసంస్థానములతో వారికియెక్కువసంపర్క, సహాయములుకలవు. యూరపియనులిబరలులకును వీరికిని యీవిషయములో పోలికయే లేదు. నిశ్చయముగ భారతదేశలిబరలులు (ఆశబ్దమునకుగలయేయర్థమున చూచినను) యెంతమాత్రమును లిబరలులు (అనగా ఉదారులు)కారు. వారెవరో సరిగా చెప్పగలుగుట కష్టసాధ్యమైనవిషయము. వారికి స్థిరమైన యిదమిత్థమను భావనిర్మాణమేదియునులేదు. వారు అల్పసంఖ్యాకులేయైనను ఒకరితోనొకరికి సరిపడదు. ఒక్క 'న' కారములోనే (అనగా వ్యతిరేకించుటలోనే) వారు దిట్టలు. వారికి సర్వత్రప్రమాదమే కాన్పించును. కనుకదానినుండి తప్పుకొన ప్రయత్నింతురు. అట్లుచేయుటలో సత్యము ద్యోతకమగునని వారాశింతురు. నిశ్చయముగవారికి సత్యమెప్పుడును రెండుచివరలమధ్యనుండును. తాము అతి యనుకొనునట్టి ప్రతిదానిని విమర్శించుటచే వారు మితము, పవిత్రత, మంచితనము గలవారమనెడి భావముననుభవింతురు. బాధకరమును, కష్టతరమునునగు విచారసాగరమునుండియు, నిర్మాణభావములనుండియు తప్పించుకొనుటకు వారికీ పద్ధతితోడ్పడును. పెట్టుబడిదారుల విధానము యూరపులో పూర్తిగజయింపలేదనియు, నది

చిక్కులపాలయ్యెననియు వారిలో కొందరస్పష్టముగ భావింతురు. ఇక సామ్యవాదము స్థాపితమైయున్న ప్రయోజనములపై దాడివెడలును గనుక నిశ్చయముగ చెడ్డది. బహుశః భవిష్యత్తులో నేదోయొక యద్భుత పరిష్కారము, యొకమధ్యేమార్గగ్రహము, కనుగొనబడును; ఈలోపల స్థాపితమైయున్న ప్రయోజనములు రక్షింపబడలెను. భూమి గుండ్రముగనున్నదా లేక బల్లపరపుగనున్నదా యనువాదమొకటి బయలుదేరినచో బహుశః వారిరెండు యతివాదభావములను ఖండించి యది చతురముగనో లేక కోడిగ్రుడ్డువలెనో యుండవచ్చునని తాత్కాలికముగ సూచించెదరు.

అప్రధానవిషయములను గురించియు, అల్పవిషయములను గురించియు వారతియుద్రేకపడెదరు; అహ్వాహ్వాలును చప్పట్లును అత్యద్భుతముగ చెలరేగును. వారు బుద్ధిపూర్వకముగను, భావముచేతను గూడ ప్రధాన సమస్యలను చేబట్టనొల్లరు. ఏలనన నట్టిసమస్యలకు మూలచికిత్సలును, భావములోను క్రియలోను ధైర్యసాహసములును యుండవలెను; కనుక లిబరలుల జయాపజయము లర్థరహితములు. వారికేసిద్ధాంతముతోను సంబంధములేదు. ఆపార్టీయొక్క ప్రధాన లక్షణము, ప్రత్యేకచిహ్నము, (అట్లు భావింపతగినయెడల) ప్రతిదాని యందు, మంచికాని చెడుకాని, మితము, మితి. అదియొక జీవితపంథ. బహుశః పాతపేరైన మితవాదపదమే వీరికియెక్కువ తగియుండెడిది.

కాని మితి, యెంతమంచిదియైనను, గొప్పగుణము, ప్రకాశించు గుణముకానేరదు. అది మాంద్యమును కలిగించును. కనుక భారతలిబరలులు దురదృష్టవశమున 'మందగొడిసైన్యము' అయిరి. వారిచూపులు మందముగను, విరసముగను వ్రాతలును, సంభాషణలు నిర్వీర్యముగను, రసవిహీనముగను నుండును; దీనికి మినహాయింపులు లేకపోలేదు. సర్ తేజబహదరు సప్రూ వీరిలో నతివిఖ్యాతపురుషుడు. అతడు (తనవ్యక్తి

గతజీవితములో) నిశ్చయముగ మాంద్యముకాదు; అతనిలో సరసమునకు కొదువలేదు. అతడు తనమీద ప్రయోగింపబడిన వేళాకోళమునైనను సంతోషముతో స్వీకరింపగలడు. కాని మొత్తముమీద లిబరలుసఙ్గము అస్ఖలితమైన బూర్జువాప్రాతినిధ్యమును వహించును. లిబరలుపక్షము వారి ప్రధాన వార్తాపత్రికయైన 'లీడరు' పత్రిక గతసంవత్సరము తమ తత్త్వమును తెలుపునట్టి యొక ప్రధానవ్యాసమును వ్రాసెను. గొప్ప వారును, అసామాన్యపురుషులును ప్రపంచమునకెప్పుడును ముప్పు తెచ్చిపెట్టిరనియు, కనుకనది సామాన్యవ్యక్తికి, నిత్యప్రత్యక్షమగు వ్యక్తికి, యెక్కువప్రాధాన్యతనిచ్చుననియు వచించెను. అది చక్కని సూచనను నిర్మొగమాటముగచేసి తనజెండాను సాధారణస్థితికి కట్టి వేసెను.

మితవ్యాపారము, చలనములేకుండుట, సాహసములను, హఠా న్మార్పులను తప్పించుకొనవలెననుకోరిక మొదలైనవి వృద్ధాప్యము యొక్క విధాయకలక్షణములు. అవియువకులకు తగినలక్షణములుగ కాన్పించవు. కాని మనదేశమతిప్రాచీనమైనది. ఒకొక్కప్పుడు మను ష్యులు శ్రమతోను, పిసుగుడలతోను జనించినట్లు కాన్పించెదరు; కాంతి తరుగుట, వృద్ధలక్షణములు వారియందు కాన్పించును. కాని యిప్పుడీ ప్రాచీనదేశముకూడ పరివర్తనశక్తులచేతనున్నికొనుచున్నది; మిత వాదదృష్టి తెల్లబోవుచున్నది. పాత ప్రపంచము నశించుచున్నది. లిబ రలులయొక్క తియ్యని హేతువాద సంభాషణలవలన లాభమేమి యునులేదు. ఇంతకంటెవారు యేతుఫానుతోనో, వరదతోనో, భూకంపము తోనో వాదించుకొనిన బాగుండెడిది. వారిప్రాతలయూహాలు నిష్ఫలము లగుచున్నవి. నూతనభావములను, కార్యములను, అలవరచుకొనుటకు వారు సాహసింపరు. యూరపియను సాంప్రదాయమునుగురించి మాట్లాడుచు డాక్టరు యే. యన్. వైటుహెడుగారిట్లుచెప్పిరి. "ప్రతి

పురుషాంతరమును తనతండ్రులనాటి కాలములోనుండిన పరిస్థితులలోనే సంపూర్ణముగజీవించుననీ, తనబిడ్డల జీవితముల నట్టిశక్తితోనే పోత పోయుటకు ఆపరిస్థితులనే రచనాచేయుననియెడి యొకపిచ్చియూహతో నీసాంప్రదాయమంతయు నల్లుకొనబడియున్నది. మనము అసత్యయూహతోనున్న మానవచరిత్రయొక్క మొదటియుగములో జీవించుచున్నాము." డాక్టరునైటుహెడ్డు తనవిమర్శలో నీవాదము నవలంబించి ప్రమాదమునకులోనయ్యెను. ఏలననగ బహుశః ఆయూహ యెప్పుడును నిజముకానేరదు. యూరపియను సాంప్రదాయమే చలనహీనమైనదైనయెడల మనసాంప్రదాయమును గురించి వేరుగచెప్పనలెనా? కాని పరివర్తనకు సమయమాసన్నమయినపుడు చారిత్రకనడక యీ సాంప్రదాయములను లెక్కచేయదు. మనమసహాయులవలె వీక్షించిచూచుచు మనప్రయత్నములు భగ్నమగుటకు యితరులను నిందింతుము. గిరల్డుహర్డుగారు సూచించినట్లు "మనప్రయత్నములు భగ్నమగుటకు మనభావములలోనున్న లోపములేవియో కారణములుగాక నితరులెవరో బుద్ధిపూర్వకముగవానిని భగ్నపరచిరని విశ్వసించుభావము అతిప్రమాదకరమైనభ్రాంతి."

మనమందరమును నిట్టిభయంకరభ్రాంతిచే బాధపడుదుము గాంధీజీ దీనినుండి ముక్తినొందలేదని నేనొక్కొక్కప్పుడు భావించుచుందును. కానిమనము అధమపక్షమైననుచేసి జీవితముతో సంపర్కము నుంచుకొనప్రయత్నింతుము; ప్రయత్నించుచు నొక్కొక్కప్పుడు పడుచు నీభ్రాంతియొక్క శక్తిని నిర్వీర్యమొనర్చుచు నెమ్మదిగ ముందుకుపోదుము. కాని, లిబరలులు విశేషబాధపడుదురు. తప్పుపని చేయుదురేమోయనుభయముచే వారుపనినేచేయరు; పడిపోవుదురేమోయను భయముచేవారు నడువనే నడువరు. ప్రజాసామాన్యముతో వారెట్టి యోగ్యమగు సంపర్కమును కలిగించుకొనక తమ

మానసిక కుహారములలో జపించుకొనుచు స్వీయగారడీ విద్యలో కూర్చొనెదరు. శ్రీనివాస శాస్త్రిగారు పదునెనిమిదిమాసముల క్రిందట తనతోడిలిబరలులను "ఊరకనిలచియుండి విషయములను జారవిడువరాదని" మందలించెను. ఆమందలింపులో బహుశః అతడు గుర్తించినదానికంటె నెక్కువసత్యమున్నది. ఎల్లప్పుడును ప్రభుత్వమేమి చేయుచుండునాయని యోచించుచుండుటచే సతతము వివిధప్రభుత్వకమిటీలచే పొదుగబడుచున్నట్టి చట్టసంబంధమైన మార్పులనుగూర్చి యుదహరించుచుండెను. కాని, లిబరలులయొక్క దురదృష్టమేమనిన తమ నిజప్రజలే ముందుకు నడచిపోవుచుండ వారూరకనిలచి విషయములను జారవిడచిరి. వారు తమప్రజలనేచూచి భయపడిరి. మనపాలకులతో పొత్తుచెడగొట్టుకొనుటకంటె వారు యీప్రజలతో సంబంధమును విడగొట్టుకొనుటయే యోగ్యమనుకొనిరి. తమ నిజభూమిలోనే వారు విదేశస్థులయిరనుటలో నాశ్చర్యమేమికలదు? ఊరకనె యున్న వారినిపడి జీవితము పరుగెత్తెననుటలో నాశ్చర్యమేమున్నది? తమ దేశస్థులు ప్రాణములకొరకును, స్వాతంత్ర్యముకొరకును ఘోరసంగ్రామములను జరిపినప్పుడు లిబరలునాయకులు శత్రువులసరికట్టు గోడకేనెప్పున నిలచిరో వేరుగ చెప్పనక్కఱలేదు. వారుగోడకవతలనెప్పున నిలచి మాకుమంచి సలహాయిచ్చిరి. వారనేక ధర్మసన్నములను స్వీకరించిరి. రౌండుటేబిలు కాన్ఫరెన్సులలోను, కమిటీలలోను వారుబ్రిటిషుప్రభుత్వముకుచేసిన సహాకారము ప్రభుత్వముకుమంచి విలువగలనైతికబలము. వారుదానిని నిరాకరించినచో పరిస్థితులలోనెంతయో భేదముండెడిది. ఈకాన్ఫరెన్సులలోనొకదానికి బ్రిటిషులేబరుపార్టీవారుకూడ హాజరుకాకుండుట గమనింపవలసినవిషయము. మనలిబరలులట్టి పాపమునుచేయలేదు. అట్లుపోవలదని కొంతమంది బ్రిటిషువారుప్రార్థించినను వారు వెళ్లుటమానలేదు.

మనమందరమును వివిధ ప్రయోజనములకొరకు హెచ్చుతగ్గు స్థాయిలలో మితవాదులమో లేక నతివాదులమో యగుదుము. మనము దేనికొరకైనను తగినంతశ్రద్ధతీసికొనునెడల దానినిగురించి గట్టిగ భావింతుము; దానినిగురించి యతివాదులమగుదుము. లేనియెడల మన ముదారమగు సహనమును, వేదాంతపరమగు మితిని (అదినిజముగకొంత వరకు మనయుదాసీనతనుకప్పిపుచ్చును.) చూపవచ్చును. దేశములో స్థాపితమైనకొన్ని ప్రయోజనములు తుడిచివేయబడవలెనని సూచింపబడినపుడు అతిసాత్వికుడైనమితవాదిగూడ నెక్కువగ నుద్రేకించుటయు, నతివాదియగుటయు నేనెరుగుదును. మన లిబరలుమిత్రులు కొంతవరకు ధనికులకును, కలవారికిని ప్రతినిధులు. వారు స్వరాజ్యమువచ్చువరకు వేచియుండగలరు; దానినిగురించి వారంతగా నుద్రేకపడ నవసరము లేదు. కాని, గొప్పసాంఘిక మార్పు కేసూచనమైనను చేయబడినచో వారలిక్కిపడుదురు; అప్పుడు వారిమితవాదము పలాయనమగును; తియ్యని హేతువచనములు సెలవుతీసికొనును. ఈవిధముగ వారిమితవాదమంతయు బ్రిటిషుప్రభుత్వముపట్టున నేకానగును. తాము తగినంత గౌరవప్రదముగను, బహుళః రాజీయగుచుండుబుద్ధితోను నుండు నెడల( ఈప్రవర్తనకు బహుమానముగ) తమమాటలు మన్నింపబడునని వారాశింతురు. బ్రిటిషువారియుద్దేశ్యములను వారువిధాయకముగ నొప్పుకొనితీరవలెను బ్లూపుస్తకములు (ఇంగ్లీషుపార్లమెంటుకు సంబంధించినవి) వారికి వేదగ్రంథములగును. ఎర్స్కిన్ మేగారి పార్లమెంటరీ యాచారము అను గ్రంథమును, అట్టిపుస్తకములును వారికి నిరంతరసహవాసులగును. ఒక క్రొత్తప్రభుత్వనివేదిక యుద్రేకమునకును, గాలిమేడలకును, కారణమగును. ఇంగ్లండునుంచి తిరిగివచ్చు లిబరలునాయకులు వైటుహాలులో (పార్లమెంటుభవనములు) నివసించుగొప్పవారి కృత్యములను గురించి యద్భుతమగుస్టేటుమెంటులను చేయుచుందురు. ఏలనన లిబరలులకును, రెస్పాన్సివిస్టులకును, అట్టియితరవర్గములవారికిని వైటుహాలు యింద్రభవ

సము. పూర్వకాలములో పుణ్యాత్ములగు అమెరికనులు చనిపోవునప్పుడు ప్యారిసు వెళ్లుచుండెడివారట! పుణ్యాత్ములగు లిబరలులయొక్క ఆత్మలు ఒకొక్కప్పుడు నైటుహాలు ఆవరణలో తిరుగుచుండవచ్చును.

నేను లిబరలులనుగురించివ్రాసితిని. కాని, నేనువ్రాసినది కాంగ్రెసులోనున్న మనలోచాలమందికిగూడ వర్తించును. మితవాదములో లిబరలులనుజయించిన రెస్పాన్సివిస్టులకిది మరింతయెక్కువగ వర్తించును. సామాన్యలిబరలుకును, సామాన్యకాంగ్రెసువాదికిని యెక్కువవ్యత్యాసముకలదు. అయినను వారినిభేదించు రేఖ స్పష్టముగను, కచ్చితముగను లేదు. అభివృద్ధిచెందినలిబరలుకును మితవాదియైన కాంగ్రెసువానికిని భేదమంతగాలేదు. కాని, గాంధీజీధర్మమాయని ప్రతికాంగ్రెసువానికి దేశముతోను, ప్రజలతోను కొంతసంబంధముకలిగెను. అతడుక్రియచేసి చూపించెను. కనుక నేయతడు శుష్కమైనట్టియు, దోషభూయిష్టమైనట్టియు తర్కమువలనసంభవించు కొన్నిఫలితములను తప్పించుకొనకలిగెను. లిబరలులట్లుకాక పాతవారితోను క్రొత్తవారితోను కూడ సంబంధమును కోల్పోయిరి. ఆవర్గము క్షీణించిపోవుచున్న యొకతెగ యొక్క ప్రతినిధి.

మనలోచాలమంది పురాతనమ్లేచ్ఛభావమును (నేననుకొనెదను) పోగొట్టుకొంటిమి; కానినూతనయాత్మదృష్టినార్జింపలేదు. "సముద్రము నుండిమైనాకుడుప్పుటైను"; "ఇక్ష్వాకుడెవడో దేవమందుభినిర్మోగించెను" అనునవి మనకు తృప్తినీయవు.

"ఇసుకరేణువులో ప్రపంచమునుచూచుట; అడవి పువ్వులో స్వర్గమును చూచుట; అనంతమును కరతలామలకము చేసికొనుట; గంటలోననంతకాలము నిమిడ్చుకొనుట;" ఇట్లు చేయగల యదృష్టవంతులు మనలో కొద్దిమందిగలరు.

దురదృష్టవశాత్తు మనలోనెక్కువమంది ప్రకృతియొక్క జీవిత రహస్యమును పసిగట్టజాలరు; ఆమె మనకర్ణసమీపమున చెప్పురహ

స్యమును వినజాలము. ఆమె స్పర్శవలన పులకాంకిత గాత్రులము కా జాలము. ఆదినములు గతించెను. కాని మనమిదివరలో చూడగలిగి నట్లు ప్రకృతిలో మహత్త్వమును చూడజాలక పోయినను దానిని మానవయశస్సులోను, విషాదములోను, బ్రహ్మాండమగు మానవకలల లోను, ఆంతరంగిక ఝంఝామారుతములలోను, దానిబాధలలోను విఫలతలోను, దానిసంఘర్షణలలోను, దుఃఖములోను, అన్నిటికంటె నెక్కువగ నొకగొప్ప పరమావధిని చేరగలమనియు, నాకలలను అను భవములో చూఱగొనగలమనియు, గల మానవ విశ్వాసములోను దానిని కనుగొనుటకు ప్రయత్నించితిమి. అట్టి పరిశోధనలలోకలుగు హృదయవిచ్ఛేదముల కన్నింటికిని అదిమాకుకొంత యుపకృతియయ్యెను. మరియు తఱచు మేము జీవితములోని యల్పత్వమును దాటగలిగితిమి; కాని చాలమంది యీపరిశోధనకు బూనలేదు. వారు పాతమార్గము లను తెగ్రించుకొని వర్తమానములో నడుచుట కేమార్గమును లేక యున్నారు. వారుకలలనుగనరు! పనిచేయను చేయరు! ఫ్రెంచివిప్లవము, రష్యను విప్లవమువంటి మానవ సంరంభములు వారి కర్థముకావు. చిరకాలమణచివేయబడిన మానవ వాంఛలయొక్క క్రూర, కఠిన, రయోద్ధూత విప్లవములు వారిని భయపెట్టును.

"దేశభక్తి కాంగ్రెసువారియొక్క ముల్లెకాదు" అని తఱచు యుక్తమైన ఆగ్రహముతో నుడువబడుచుండును. ఈ వాక్యమే పదే పదే పాటక్రింద పాడుచుండుట విచారకరమగు విషయము. ఏకాంగ్రెసు వాదియు నిట్టి దురహంకారమును బూనియుండడని నేను తలంచెదను. అది కాంగ్రెసువారి గుత్తయని నిశ్చయముగనేను తలంపను. కోరిన వారికి దానిని బహుమతిచేయుటకు నేనెంతయో సంతసించెదను. తఱచు అది మోసగాండ్రకును జీవితముకొరకు పొంచియుండువారలకును ఆశ్రయమగును. అందఱియభిరుచులకును, అన్ని ప్రయోజనములకును, అన్ని తరగతులకును సరిపడునట్లు దానిలో ననేకరకములున్నవి. నేడు

జూడాసు (గురుద్రోహి) జీవించియున్న యెడల నిస్సందేహముగ దీని పేర పనిచేసెడివాడు. దేశభక్తి ఈరోజులలో చాలదు; మనకంతకంటె నుత్తమమైనది, విశాలమైనది, యుదారమైనది కావలెను.

కేవల మితవాదమును చాలదు. నియమము మంచిదే; అది మన విజ్ఞానముయొక్క పరిమాణము. కాని ఆనియమమువెనుకగూడ దానిని పట్టియుంచునదేదో యొకటియుండవలెను. పంచభూతములను వశపరచుకొనుట; ఇంద్రధ్వజము నారోహించుట; దవానలమును, తరలుకొనివచ్చు జలప్రవాహమును తనప్రయోజనముకొరకు లాంగదీసికొనుట—ఇవి విధినిర్మితములైన మానవహక్కులు. కాని తనను దహించివేయునట్టి రాగద్వేషములను నియమించుట, పట్టియుంచుట యాతనికన్నిటికంటెను కష్టసాధ్యమైనపని. అతడు వానిని వశపరచుకొనసంత వరకు తన మానవసంపదను పూర్తిగననుభవింపజాలడు. కాని మనము కిదలనట్టికాళ్ళను, స్తంభించిపోయిన చేతులను నిరోధింపవలెనా ?

మన లిబరలుమిత్రులు సర్వోత్కృష్టమగు నసిధారావథమును తామనుసరింతుమనియు, కాంగ్రెసుయొక్కయు, ప్రభుత్వముయొక్కయు నతివాదములమధ్య తాము మెళుకువగ సంచరింతుమనియు చెప్పుదురు. వారు వారి యుభయుల దోషములను నిరూపించు స్వాయంనిర్మిత న్యాయాధికారులు. ఆదోషములనుండి తాము విముక్తులైనట్లు వారే యభినందించుకొనెదరు. వారు త్రాసులను సరిచూచుటకు ప్రయత్నింతురు; న్యాయదేవతా విగ్రహమువలె (నేననుకొనెదను) వారు కండ్లను మూసికొనెదరు లేక నేత్రపట్టము కట్టుకొనెదరు. "పండితోత్తములారా! ......గుడ్డినేతలారా! నలుసులను మీరుయేరెదరు. గుమ్మడికాయలను గుభాలున దిగమింగెదరు!" అను ఖ్యాతశాపమును వినిపించుటకు యుగములతరబడి నన్ను వెనకకు తీసికొనిపోవునది కేవలము న్యాయూహయేనా?

## డొమినియను ప్రభుత్వము - స్వాతంత్ర్యము.

——○◈(౦)◈○——

గత పదిహేడు సంవత్సరములనుండియు కాంగ్రెసు నీతిని నిర్ణయించినవారిలో చాలమంది మధ్యతరగతులనుండియేవచ్చిరి. లిబరలు అగుగాక కాంగ్రెసువాదియగుగాక వారొక తరగతినుండియే వచ్చి, యొకవాతావరణములోనే వృద్ధిచెందిరి. వారిసాంఘికజీవితము, సంబంధములు, స్నేహములు ఒకమాదిరిగనే యుండెను. మొట్టమొదట వారియుభయులకునుగల రెండురకముల బూర్జువా తత్త్వములలోను భేదమంతగాలేదు. స్వభావజన్యమైనట్టియు, మానసికమైనట్టియు భేదములు వారిని వేరుచేయనారంభించెను. వారు వేరువేరు దిశలకు చూడనారంభించిరి. ఒకరు ప్రభుత్వమువైపు, ధనికులవైపు, మధ్యతరగతులలో పైతరహాకు చెందినవారివైపు ఎక్కువగిచూడనారంభించిరి. రెండవవారు మధ్యతరగతిలోని క్రింది తరహావారివైపు చూచిరి. వారితత్వమింకను నొకటిగనేయుండెను; లక్ష్యములు మారలేదు. కాని రెండవవర్గనువారివెనుక వర్తకులనుండి, తక్కువవృత్తులనుండి, నిరుద్యోగులైన విద్యాధికులనుండి వచ్చినవారి సంఖ్యాబలముయొక్క యుత్సాహముండెను. వారి స్వరముమారెను. ఇప్పుడందులో పూజ్యభావము, వినయ విధేయతలు లేవు. కాని తీవ్రత, చురుకుపాలు హెచ్చెను. కార్యశూరత్వమును చూపుటకు తగినంతబలము లేకపోవుటచే ఘాటైనభాషద్వారా కొంతయుపశాంతి కలుగుచుండెడిది. ఈనూతన సంచలనమును చూచి భయపడి మితవాదప్రభృతులు జారిపోయి, యేకాంతమున సురక్షితముగ నుండగోరిరి. అయినను కాంగ్రెసులో, చిన్నబూర్జువాలసంఖ్య యత్యధికముగనున్నను, మధ్యతరగతిలోని పైతరహావారికే గట్టిప్రాతినిధ్యముండెను. తమజాతీయపోరాటములో జయముచేకూరవలెనను కోరికచేతనే

గాక నాపోరాటములో నొకయాంతరంగికవృత్తినిగోరి వారందులోనికురికిరి. తద్వారావారు తామునోల్పోయినమానధనమును, ఆత్మగౌరవమును తిరిగి సంపాదించుకొనగోరిరి; శిథిలమైపోయిన తమ యౌన్నత్యమును నిలుపుకొనగోరిరి. అది మామూలు జాతీయావేశము. ఇదియందరకును సామాన్యమేయైనను యిచ్చటనే మితవాదికిని యతివాదికినిగల స్వభావజన్యమైన భేదములు పొడసూపెను. క్రమముగ మధ్యతరగతిలోని క్రిందితరహావారు కాంగ్రెసునాక్రమించిరి. తరువాత కృషీవలులు పలుకుబడిని సంపాదించిరి.

కాంగ్రెసు అంతకంతకు గ్రామప్రజల ప్రతినిధియైనకొలది లిబరలులకును దానికినిమధ్యగల యంతరువు అధికమయ్యెను; కాంగ్రెసు దృక్పథమును గ్రహించుటలేక గుర్తించుట లిబరలులకు కొంచెమించుమించు యసాధ్యమయ్యెను. పైతరగతి ప్రేక్షకాగారము చిన్నయాకుటింటిని, మట్టిగుడిసెను అర్థముచేసికొనుట తేలికగాదు. అయినను, యాభేదములున్నను, ఈరెండు తత్త్వములును జాతీయములు, బూర్జువాతత్త్వములు; ఈతేడా తరహాకుచెందినదికాని జాతికి చెందినదికాదు. లిబరలువర్గములో నతికులాసాగా నుండగలవారు చాలమంది కాంగ్రెసులో చివరవరకునుండిరి.

చాలపురుషాంతరములవరకు బ్రిటిషువారు హిందూదేశమును తమకుచెందిన యొకగొప్ప గ్రామమందిరము (పూర్వకాలపు యింగ్లీషు పద్ధతిప్రకారము) వలె చూచిరి. వారుఆభవనములోనిసుందరమైనభాగములను ఆక్రమించుకొనిన యజమానులు, పెద్దలు. భారతీయులు నౌకరులహాలులోను, ఆహారపదార్థములుంచుశాలలోను, వంటశాలలోను కుములుచుందురు. సరియైన ప్రతిగ్రామభవనములోను ఆక్రిందప్రపంచములో-బట్లరు, యిల్లుచక్కబెట్టునది, వంటలవాడు, డలాయతు, దాసీది, భృత్యుడుయిత్యాది-అధికారవర్గముండును. వారిలో నరుసగ కఠినముగు

న్యూనాధిక్యతలుండును. కాని యీభవనములోని పైప్రపంచములోని వారికని క్రిందిప్రపంచములోని వారికిని సాంఘికముగను రాచకీయముగను అభేద్యమగుగోడ యుండును. బ్రిటిషుప్రభుత్వము వారిట్టియేర్పాటులను మనపైచొప్పించుటలో నాశ్చర్యమేమియునులేదు; కాని మనములేక మనలోచాలమంది మనజీవితములును, విధియు నీవిధముగ నేర్పరింపబడుట సహజమనియు, విధాయకమనియునంగీకరించుటయే యాశ్చర్యకరమైన విషయముగ కాన్పించును. మనము నమ్రమైన గ్రామమందిర నౌకరుబుద్ధి నలవర్చుకొంటిమి. ఒక్కొక్కప్పుడు మనకఖండమర్యాదచూపబడును. మనకు ప్రేక్షకాగారములో నొకచిప్పెడు తేయాకు ప్రసాదింపబడును. గౌరవముగ చూడబడుటయు, వ్యక్తిగతముగ పైప్రపంచములోనికి గొంపోబడుటయు, మనకుండు మహత్తరమైనకోరిక. ఎట్టి సైనికవిజయముకంటెను, రాచనైతికవిజయముకంటెను హిందూదేశములో బ్రిటిషుప్రభుత్వమువారి యీమానసికవిజయము చాలగొప్పది. బానిస బానిసవలెనే యోచింపప్రారంభించెను.

కాలముమారెను. ఇప్పుడు యింగ్లండులోగాని హిందూదేశములోగాని గ్రామమందిర నాగరికతమూందిరి నాగరికత బుద్ధిపూర్వకముగ యొప్పుకొనబడుటలేదు. కాని మనలోనింకను నౌకరులహోలులవంటి పెట్టుకొని యుండవలెనను కోరికగలవారును, నౌకరీ దుస్తులను, డలాయతుబిళ్ళలనుచూచి మురియువారును, గర్వించువారును కలరు. లిబరలులవంటి యితరులు ఆగ్రామమందిరమును మొత్తముగనంగీకరింతురు; దాని పనితనమును, ఆ నిర్మాణమునంతను మెచ్చుకొనెదరు; కాని యజమానుల స్థానములో క్రమక్రమముగ తాము ప్రవేశింపజూతురు. దీనిని వారు భారతపరముచేయుట యనిపిలుతురు. పరిపాలకుల వర్ణమును మార్చుటయే వారిసమస్య; హెచ్చుగవెళ్ళినచో నూతనపాలకవర్గమును వాంఛింతురు. వారెన్నడును నూతన ప్రభుత్వవిధానమును

గురించి యోచింపరు. వారికి స్వరాజ్యమనగా సమస్తమును యథా ప్రకారముగనే సాగుట; కొంచెమునన్న నల్లబడినచాలును. వారు లేక వారివంటి వారు ప్రధానపాత్రను వహించునట్టియు, నున్నత యాంగ్లాధికారుల స్థానముల నాక్రమించునట్టియు భవిష్యత్తునే వారు చూడగలరు; అదేమాదిరి యుద్యోగములు, ప్రభుత్వశాఖలు, శాసన సభలు, వర్తకము, పరిశ్రమలు-తమ పదవులలోనుండు ఐ. సి. యస్‌లు; అప్పుడప్పుడు తళుకుబెళుకు దుస్తులతో కాన్పించుచు, తమ ప్రజల నొప్పించుటకు సమస్తాభరణములతో మెరయుచు సౌధసీమలలోనుండు రాకుమారులు; తమరైతులను బాధించుచు ప్రత్యేకాధికారములను కోరు భూఖామందులు; ధనసంచులను చేతబుచ్చుకొని జమీందారు లను; రైతులనుగూడ బాధించు వడ్డీవ్యాపారస్తుడు; కీజుగుంజుకొనునట్టి లాయరు; స్వర్గములోనుండు భగవంతుడు.

వారిదృష్టి (ప్రధానముగ) ఉన్న స్థితిని సంరక్షించుటమీదనే యాధారపడియున్నది. వారుకోరుమార్పులన్నియు కొంచెమించుమించు వ్యక్తిగతములైనవని చెప్పవచ్చును. ఈమార్పులను వారు బ్రిటిషువారి ప్రసాదమువలన నెమ్మదినెమ్మదిగ చుక్కచుక్కచొప్పున సాధింపచూతురు. వారి రాచకీయములయొక్కయు, నార్థికములయొక్కయు పునాదియావత్తు బ్రిటిషుసామ్రాజ్యస్థిరత్వముమీదను, సాగుదలమీదను నిలిచియున్నది. ఈసామ్రాజ్యము అచంచలమని (అథమముచాలకాలమువరకు) భావించి వారు దానికిసరిపెట్టుకొనెదరు; వారుదాని రాచకీయ, ఆర్థికతత్త్వ మునేగాక (చాలవరకు) దానినైతిక ప్రమాణములనుకూడ నంగీక రింతురు. అవి యన్నియు బ్రిటిషుఅధికారమును భద్రముగసాగించుటకే నిర్మింపబడెను.

కాంగ్రెసువారిదృష్టి యింతకంటెభిన్నమైనది. అది కేవలము మరియొకపరిపాలకులనుగాక నొకనూతనప్రభుత్వమును సృష్టింపజూచు

చున్నది. ఈనూతన ప్రభుత్వస్వరూపమెట్లుండునో, సామాన్యకాంగ్రెసు వాదికి యెక్కువస్పష్టముకాకపోవచ్చును. దానినిగురించి యభిప్రాయములు భేదింపవచ్చును. కాని వర్తమానపరిస్థితులును, పద్ధతులును నికనెంతమాత్రమును సాగకూడదు, సాగరాదు అనునది కాంగ్రెసులో (బహుశః అంచులనున్నవారెవరికో తప్ప) సామాన్యవిషయము. ప్రధానమార్పులు యత్యవసరము. డొమినియనుప్రభుత్వమునకును, స్వాతంత్ర్యమునకును భేదమిచ్చుటనేకలదు. మొదటిది మనలను బ్రిటిషుఆర్థికపద్ధతికనేక ప్రత్యక్ష, అప్రత్యక్షపాశములచేబంధించు వెనుకటి నిర్మాణమునే సూచించును. రెండవది మనపరిస్థితులకుసరిపడునట్టి నూతన నిర్మాణమును నిర్మించుకొనుటకు మనకుస్వేచ్ఛనిచ్చును లేదా యీయవలెను.

అనగా నదియింగ్లండుపట్లగాని, యింగ్లీషుప్రజలపట్లగానితిరుగులేని, రాజీలేని శత్రుత్వమని యర్థముకాదు. ఏమిసంభవించిననుసరే వారితోత్రెంచుకొననలెను అనుకోరికయుకాదు. ఇంత 'గ్రంథము' జరిగిన మీదట భారతదేశమునకును యింగ్లండునకునుమధ్య ద్వేషభావము లుండుటసహజము. "అధికారమత్తతసున్నితమగు తాళముచెవినిచెడగొట్టి గొడ్డలినియుపయోగించును" అనిటాగూరువచించెను. మనహృదయములను తెఱచు తాళముచెవి చాలకాలముక్రిందటనే నాశముచేయబడెను. గొడ్డలిమనపైతనివితీర యుపయోగింపబడినను అది మనము బ్రిటిషువారియెడల పక్షపాతమునువహించునట్లు చేయజాలకపోయెను. మనము భారతదేశముయొక్కయు, మానవ లోకముయొక్కయు విశాలధర్మమును సేవించితిమనియనుకొనుటచే మన తాత్కాలికాహంకారముచే మత్తులముకాజాలము. ఒకవేళమనమట్లుజారిననుపదిహేనుసంవత్సరములనుండియు గాంధీజీప్రసాదించిన కఠినశిక్ష మనలనట్లుచేయనీయదు. నేను బ్రిటిషుజయిలులోకూర్చుని దీనిని వ్రాయుచున్నాను. అనేకనెలలనుండి నామనస్సువిచారగ్రస్తమైయుండెను. జయిలులోనేను మునుపెన్నడును

బాధపడనట్లు యీయేకాంతవాసములో బహుశః నెక్కువబాధపడితిని. అనేకసంభవములకు నామనస్సుకోపముచేతను, రోషముచేతను పూరిత మయ్యెను. అయినను నేనిచ్చటకూర్చొని నాహృదయమును, మనస్సునుగంభీరముగపరీక్షించి చూచుకొనునప్పుడు నాకువాటిలో ఇంగ్లండు యెడలగాని యింగ్లీషువారియెడలగాని యెట్టికోపమును కానరాదు. నేను బ్రిటిషుసామ్రాజ్యతత్త్వమును ప్రేమింపను. దానిని భారతదేశముపై రుద్దుటకొప్పుకొనను; క్యాపిటలిస్టుపద్ధతి నాకంగీకారముకాదు. బ్రిటనుకు చెందుపాలకతరగతులవారు భారతదేశమును కొల్లగొట్టువిధమును నేనెంతమాత్రము ప్రేమింపను; దానినినేను నిరసింతును. కానిదీనికి యింగ్లండుకాని, యింగ్లీషుప్రజలందరునుకాని బాధ్యులని నేనుభావింపను. ఒకవేళనేనట్లుభావించినను అందులో నంతవ్యత్యాసమేమియు నుండదు. ఏలనన ఒకదేశపుప్రజలనందరను గర్హించుటయు, లేక వారిపట్లకోపమును వహించుటయు మూర్ఖత్వమగును. మనవలెనేవారును పరిస్థితులకు దాసులయిరి.

వ్యక్తిగతముగ నామానసికపరిణతికి నేనుయింగ్లండు కెంతయో ఋణపడియుండుటచే దానికెన్నడును పూర్తిగవ్యతిరేకముగ భావింపజాలను. నేనేదిచేసినను యింగ్లండులోపాఠశాలలలోను, కళాశాలలలోను అలవర్చుకొనిన మానసికభావములను, యితరదేశములను, జీవితమును విమర్శించుప్రమాణములను, పద్ధతులను వీడజాలను. రాజకీయరంగము మినహాగా నాయభిమానమంతయు ఇంగ్లండుమీదను, యింగ్లీషుప్రజల మీదనుఉండును. నేనుహిందూదేశములోని బ్రిటిషుపరిపాలనకు రాజీనొల్లనిశత్రువునైనచో దానికి నేనుకారకుడనుకాను.

ఆపరిపాలనకు ఆయధికారమునకు మేమభ్యంతర పెట్టెదము; దానితోబుద్ధిపూర్వకముగ రాజీపడముకాని యింగ్లీషుప్రజలతోకాదు. ఇంగ్లీషువారితోనుతదితరదేశముతోనుమనకత్యంతసన్నిహితసంపర్కము

లుండుగాక! భారతదేశములో మాకకలంకమైనవాయువు, అకలంక ములు, ప్రాణప్రదములునగుభావములు, సౌభాగ్యప్రదమగు సహకారము కావలెను; మేము యుగములతో చాలబూజుపట్టినవారమైతిమి. కాని యింగ్లీషువారు వ్యాఘ్రాకారములో వచ్చునెడల మావలన స్నేహభావ మును, సహకారమును ఆశింపరాదు. సామ్రాజ్యతత్త్వమనువ్యాఘ్ర మునకు భయంకరతమమగు వ్యతిరేకము తప్పదు. నేడు మాదేశము ఆభయానకజంతువు నెదుర్కొనవలసియున్నది. ఆటవిక, క్రూరవ్యాఘ్రము మును మచ్చికచేయుట సాధ్యముకావచ్చును; దాని సహజక్రౌర్యమును మంత్రించి వేయవచ్చును. కాని, క్యాపిటలిజము, సామ్రాజ్యతత్త్వము కలసి యొకదురదృష్టదేశముపై కురుకునపుడు వానిని మచ్చికచేయుట యసాధ్యము.

తానుకాని తనదేశముకాని రాజీపడరనిచెప్పుట (ఒకవిధముగ) మౌర్ఖ్యము. ఏలనన జీవితమెప్పుడును రాజీపరచుటకు మనలను బల వంతపరచుచున్నది. దానిని మరయొకదేశమునకు లేక ప్రజలకు వర్తింప చేయుటలో సత్యముకలదు. అప్పుడు దానినిసాధించుటకు మానవశక్తి చాలదు. భారతస్వేచ్ఛయు, బ్రిటిషు సామ్రాజ్యతత్త్వమును పరస్పర విరుద్ధములు. సైనిక శాసనముగాని, ప్రపంచములోనున్న తీపిమాత్ర లన్నియును గాని-వాని పరస్పర వైరుధ్యమును పోగొట్టజాలవు; వానిని దరిజేర్పజాలవు. భారతదేశమునుండి బ్రిటిషు సామ్రాజ్య తత్త్వమునకు స్వస్తి చెప్పబడినపుడే యథార్థమైన హిందూ బ్రిటిషు సహకారముకు తగిన పరిస్థితులేర్పడును.

ఆధునిక ప్రపంచములో స్వాతంత్ర్యము సంకుచిత సిద్ధాంతమని మనకు నీతులు గఱపబడుచుండును. ప్రపంచ మంతకంతకన్యోన్యాశ్రయ మగుచున్నది. కనుక స్వాతంత్ర్యమును కోరుటలో మనము గడియార మును వెనుకకు త్రిప్పుటకు యత్నించుచున్నాము. బ్రిటనులోనున్న

లిబరలులు, శాంతిని గోరువారు, సామ్యవాదులనబడువారు యీవాదమునే చేయుచు మన సంకుచిత జాతీయతకు మనలను మందలింతురు. పరిపూర్ణమైన జాతీయ జీవితముకు మార్గము "జాతులయొక్క బ్రిటిషు కామన్వెల్తు" ద్వారా కలదని మనకు సూచింతురు. ఇంగ్లండులో నన్ని మార్గములును లిబరలిజము, సోషలిజము, ఫాసిసిజము మొదలైనవి - సామ్రాజ్యమును సంరక్షించుటకే త్రోవచూపుట విచిత్రముగ నున్నది. "తాను కొల్లగొనిన ధనమున కంటిపెట్టుకొనియుండుటకొరకు జయించిన జాతికుండు నట్టి కోరిక శాంతి, శాంతి యను వాక్యములుగా మారునట్లు పరిపాలనచేయు జాతి తనకున్న స్థితిని సంరక్షించుకొనుటకు తఱచు 'జాతీయత' కంటె నుత్తమమైనదిగ సింగారించుకొనుచుండును. ఈ విధముగనే గాంధీ యెదుట మాక్డొనాల్డు అంతర్జాతీయవాదిగ కబుర్లు చెప్పును" అని ట్రాట్‌స్కీ వచించెను.

భారతదేశముకు రాజకీయ స్వాతంత్ర్యము వచ్చిన తరువాత నది యెట్లుండునో, యేమిచేయునో నేను చెప్పజాలను. కాని నేడు జాతీయ స్వాతంత్ర్యమును కోరునట్టి యామె ప్రజలు అతి విశాలమైన అంతర్జాతీయతను కూడ కోరుదురని నేను చెప్పగలను. సామ్యవాదికి జాతీయతలో నర్థములేదు కాని కాంగ్రెసులో ముందు శ్రేణిలోనున్న యనేకమంది సామ్యవాదులు కాని వారు కూడ నారితేరిన అంతర్జాతీయవాదులు. ప్రపంచముతో సంబంధములేకుండ వేరు పడిపోవుటకై మేమిపుడు స్వాతంత్ర్యమును కోరుటలేదు. అట్లుగాక నితర దేశములతో పాటు యథార్థమైన యంతర్జాతీయ క్రమము కొరకు ఆ స్వాతంత్ర్యములో నొక భాగమును యిచ్చివేయుటకు మేము సంపూర్ణముగ నంగీకరించుచున్నాము. ఏ సామ్రాజ్య పద్ధతియైనను, దానికెట్టి ఘనమైన నామకరణ మిడినను, అట్టి క్రమమునకు శత్రువుకాక తప్పదు. అట్టి పద్ధతిచే ప్రపంచ సహకారమ్ములేక ప్రపంచశాంతి చేకూరజాలదు.

వివిధ సామ్రాజ్య పద్ధతులెట్లు నిరంకుశత్వము వలనను, ఆర్థిక సామ్రాజ్యపద్ధతివలనను తమకు తాము వేరగుచున్నవో ప్రపంచమంతటను జరిగిన నవీన సంభవములు తెలుపుచునే యున్నవి. అంతర్జాతీయాభివృద్ధికి బదులు దాని తల్లక్రిందులు మతమునే మనము చూచుచున్నాము. దీని కారణములను తెలిసికొనుట ఘనకార్యము కాదు; అవి ప్రస్తుత ఆర్థిక క్రమముయొక్క దినదినాభివృద్ధియగుచున్న దుర్బలత్వమును సూచించును. ఈ నీతియొక్క యొక ఫలితమేమనిన నిరంకుశత్వము గల ప్రాంతములలో నది యెక్కువ సహకారము నుత్పన్నము చేయుచు తక్కిన ప్రపంచము నుండి దానిని వేరుచేయుచున్నది. భారతదేశములో నది, ఒటావా మొదలగు తీర్మానములద్వారా, మనకితరదేశములతోగల సంబంధములను, స్పర్శలను అధికముగ తగ్గించెను. మనము మునుపటికంటె నెక్కువగ బ్రిటిషు పరిశ్రమలపై నాధారపడువారిసలమైతిమి. వివిధ మార్గములద్వారా యీనీతివలన కలిగిన సత్వర నష్టము నటుంచినను దీని యపకారములు సువిదితములు; ఈవిధముగ డొమినియను ప్రభుత్వము విశాల యంతర్జాతీయ సంబంధములకు బదులు ఒంప్రిత్తు తనముపకే మార్గముగుచున్నట్లు కాన్పించును.

అయినను భారత లిబరలు మిత్రులు ప్రపంచమును, మరింత ప్రత్యేకముగ తమ దేశమును నిజనీలవర్ణితములైన బ్రిటిషు కంటిజోళ్ళద్వారా చూచునట్టి తెలివితేటలను సంపాదించిరి. కాంగ్రెసు యేమి చెప్పుచున్నదో, యెందుల కట్లు చెప్పుచున్నదో గ్రహించుటకు ప్రయత్నింపకుండగనే వారు స్వాతంత్ర్యము డొమినియను ప్రభుత్వముకంటె సంకుచితము, తక్కువ యౌన్నత్యకరము అను పురాతన బ్రిటిషు వాదమునే చిలుకపలుకులవలె వప్పగింతురు. అంతర్జాతీయత యనగా వారికి వైటుహాలు. ఏలనన వారి కితర దేశముల విషయమై బొత్తిగా తెలియదు; భాషలు రాకపోవుట దీనికి కొంత కారణమైనను

వారు వానిని నిర్లక్ష్యము చేయుటతో తృప్తిపొందెదరు. హిందూదేశములో వారెట్టి ప్రత్యక్షచర్యను, యెట్టి తీవ్రమైన రాచకీయములను అంగీకరింపరు. కాని వారి నాయకులలో కొందర కట్టుపద్ధతులు యితర దేశములలో నవలంబింపబడుట కెట్టియభ్యంతరమును కానరాదు. వారు వానిని దూరమునుండి గుర్తింపగలరు, మెచ్చుకొనగలరు. పాశ్చాత్యదేశములలోని యాధునిక డిక్టేటరులును కొందరు వారిచే మానసికముగ నారాధింపబడుదురు.

పేరులు సాధారణముగ పెడమార్గమును త్రొక్కించవచ్చును. కాని మనము నూతన ప్రభుత్వమును వాంఛించుచున్నామా? లేక నూతనపాలకవర్గమును మాత్రమే కోరుచున్నామా? అనునదే హిందూదేశములో మన ముందరనున్న యథార్థసమస్య. లిబరలుల సమాధానము స్పష్టమే! వారికి రెండవది తప్ప మరేమియు, నవసరములేదు. అది కూడ క్రమక్రమముగ సాధింపబడు, దూరముననున్న లక్ష్యము. 'డొమినియను ప్రభుత్వము' అను పదములు పదేపదే వాడబడును. కాని తాత్కాలికమైన వాటి నిజవిషయము "కేంద్రములోబాధ్యత" అను నైంద్రజాలిక పదములచే స్వీకరింపబడు చున్నవి. అధికారము, స్వాతంత్ర్యము, స్వేచ్ఛ, మోక్షము అను కడుపునిండుమాటలను వారు నోటనిండ నుచ్చరింపజాలరు; అవి యుపద్రవకరముగ ధ్వనించును. ప్రజాసమూహమునకు చెప్పగనున్నను లాయరుభాష, దృష్టి వారికి నచ్చును. విశ్వాసముకొఱకు, స్వాతంత్ర్యము కొఱకు యుపద్రవముల నెదుర్కొనినట్టియు పరిణాముల నొడ్డినట్టియు వ్యక్తులయొక్కయు, వర్గములయొక్కయునుదాహరణము లసంఖ్యాకములు గలవు. "కేంద్రములోని బాధ్యతకొరకుగాని మఱియొక లీగలుపదముకుగాని యెవ్వడైనను బుద్ధిపూర్వకముగ నొకపూటతిండిమానుకొనుట లేక సుఖముగ నిద్రింపకుండుట సంశయాస్పదమైన విషయము.

కనుక నిదియే వారిలక్ష్యము; దీనినివారు 'ప్రత్యక్ష కార్యక్రమము' వలనగాక శ్రీనివాసశాస్త్రిగారు సెలవిచ్చినట్లు "పరిజ్ఞానము, అనుభవము, మితము, ఒప్పింపగలనేర్పు, ప్రశాంతమగు పలుకుబడి యథార్థమైన సమర్థత"—ఇన్నింటిని ప్రదర్శించి సాధింపగోరుదురు. ప్రభుత్వమువారు అధికారమును మనకు పంచిపెట్టునట్లు మన సత్ప్రవర్తనచేతను సుకర్మచేతను మనము వారిని బుజ్జగింపవలెను. అనగా మన దుడుకుతనమువలన కలిగినకోపముచేతను లేక మనశక్తిసామర్థ్యములను శంకించుటచేతను లేక నీరెండుకారణములచేతను ప్రభుత్వమువారు మనలనిపుడు తిరస్కరించుచున్నారు. ఇది ప్రస్తుతస్థితియొక్కయు ఇంపీరియలిజము యొక్కయు చిత్రమునుపు విమర్శనలెకాన్పించును. సోపానక్రమముగను పాలకజాతుల సహకారముతోడను అధికారమును సంపాదింపవలెనను భావమునుగురించి ప్రొఫెసరు 'టానీ' యను కుశాగ్రబుద్ధి యగు ఇంగ్లీషురచయిత యత్యుచితమును, ఆకర్షణీయమునునగునట్టి యొక యధ్యాయమును వ్రాసెను. అతడు బ్రిటిషులేబరు పార్టీని గురించి యుదహరించెను; కాని యతనిమాటలు హిందూదేశమునకు మరింతయెక్కువగ వర్తించును. ఏలనన ఇంగ్లండులో నధమము ప్రజాస్వామికసంస్థలైనను కలవు. అచ్చట సిద్ధాంతములో అధికసంఖ్యాకుల యిచ్ఛ మన్నింపబడగలదు. ప్రొఫెసరు టానీ యిట్లు వ్రాసెను.

"ఉల్లిపాయలను పొరపొరగ తినవచ్చును; కాని జీవించియున్న పెద్దపులిని పాదము పాదము చొప్పున చర్మము నొలుచుట సీతరము కాదు. జంతువులను చంపుట దానివృత్తి. అది మొదట చర్మము నొలుచును......"

"హక్కులుగల తరగతులలో నవివేకులున్న దేశమేదైన యున్నచో నదిఇంగ్లీషుదేశముకాదని నిశ్చయముగ చెప్పవచ్చును. ఒక ఆస్తియొక్క క్రియదస్తావేజులను కలిగియున్న బుద్ధిమంతుడైన లాయ

రును ఆయాస్తినుండి తరిమివేయ బోకరించుట యెంతవ్యర్థమో లేబరు పార్టీయొక్క హక్కులను కోరుటలో యుక్తియు, సరసతయు, నవి కూడ తమహక్కులేయని విశ్వసించునట్లు వారిని మోసముచేయగల వని భావించుటయు నంతవ్యర్థము. సరసవర్తనులు, మేధావులు, శక్తి వంతులు, ఆత్మవిశ్వాసముకలవారు, (బలాత్కరింపబడిరేవో) దేనికిని వెరువనివారు-ధనికప్రభుత్వములోనుందురు. వారు తమరొట్టెకే నైపూన నేయివ్రాయబడినదియు బాగుగ నెరుగుదురు; ఆనేయి తఱుగకుండు నట్లు వారు చూచుకొనెదరు...వారియునికికి గట్టిభయము కలిగిన యెడల వారివశములోనున్న ఆర్థిక, రాజకీయపాచికలన్నింటిని-ప్రభు వులసభ, చక్రవర్తి, ముద్రణాలయము, సైన్యములోని సంస్కృతి, దారిద్ర్యకాటకము, అంతర్జాతీయ కష్టములు, (1931 లో పౌండు సమస్య మీద వార్తాపత్రికలదాడులు విశదముచేసినట్లు) ఎమిగ్రేయనువాని వలె స్వంతజేబులను రక్షించుకొనుటకు స్వదేశమునకే హానిజేయు యుక్తినికూడ-వారుప్రయోగింతురు.

బ్రిటిషు లేబరుపార్టీ మంచిశక్తిగలసంస్థ. చందాలను చెల్లించు లక్షలకొలది సభ్యులుగల ట్రేడుయూనియనులును, మంచియభివృద్ధిలో నున్న పరపతిసంఘసంస్థలును, వృత్తులలోనున్న తరగతులలోని సభ్యు లును, అభిమానులును దానికిగొప్పయండలు. వయసువచ్చిన వారికి వోటుహక్కుగల ప్రజాస్వామిక పార్లమెంటరీసంస్థలును పౌరస్వత్వము లకు సంబంధించిన చిరచరిత్రయు బ్రిటనులోకలవు. ఇన్నిసావకాశము లున్నను మందహాసముచేతను బోధనలచేతను (ఈ రెండుమార్గము లును ప్రయోజనకరములు వాంఛనీయములు అయినను) లేబరుపార్టీ వారు యథార్థాధికారమును సంపాదింపజాలరు (నూతన సంభవములు దీనిసత్యమును ఋజువుచేసెను) అని టానీ చెప్పుచున్నాడు. లేబరు పార్టీవారికి కామన్సుసభలో మెజారిటీయున్నను 'అదియెట్టి గొప్ప

మార్పులను చేయజాలదు. రాజకీయ సాంఘిక, ఆర్థిక, ద్రవ్యసంబంధ, సైనికకోటలెన్నియో తమ వశమునందున్న హక్కులుగల తరగతుల వ్యతిరేకముమందర నదినిర్వీర్యమగును. హిందూదేశములోని పరిస్థితులు కేవలము భిన్నములని వేరుగ చెప్పనక్కరలేదు. ఇచ్చట ప్రజాస్వామికసంస్థలుగాని సాంప్రదాయములుగాని లేవు. వానికి బదులు మనకు సుస్థాపితమైన ఆర్డినెన్సులయాచారము, డిక్టేటరు ప్రభుత్వము, వ్యక్తి, వాక్కు, సభ, వ్రాత, ముద్రణాదులస్వాతంత్ర్యముయణచివేయుట--యిత్యాదులు కలవు. లిబరలులవెనుకగూడ నట్టి బలీయమైన కట్టడమును లేదు. వారు తమ మందహాసములమీదనే యాధారపడవలెను

లిబరలులు 'అశాస్త్రీయ' మైనట్టియు లేక 'న్యాయవిరుద్ధ' మైనట్టియు నేచర్యకైనను శుద్ధవ్యతిరేకులు. ప్రజాస్వామికచట్టములుగల దేశములలో 'చట్టసంబంధమైన' యను పదమునకు విశాలమైన యర్థముకలదు. అదిన్యాయములనుచేయుటను నియమించును; స్వేచ్ఛలను సురక్షించును. అది కార్యనిర్వాహకులను అదుపులో నుంచును. అది రాజకీయ, ఆర్థికనిర్మాణములో మార్పులనుచేయుటకు ప్రజాస్వామిక పద్ధతులను కల్పించును. కాని హిందూదేశములో నట్టి చట్టమేదియును లేదు. ఆపదమున కట్టి యర్థము లేదు. *దాని నిచ్చట నుపయోగించుట యిప్పుడుహిందూదేశములో స్థానములేని యొకభావమును ప్రవేశపెట్టుటయగును. 'శాస్త్రీయమైన' యనుపదము యిచ్చట

---

విఖ్యాతలిబరలు నాయకుడును, లీడరు వార్తాపత్రికకు ప్రధానసంపాదకుడును నగు సీ. వై. చింతామణిగారే యు. పి. కౌన్సలులో పార్లమెంటరీ జాయింటు సెలెక్టు కమిటీయొక్క నివేదికను విమర్శించుచు భారతదేశములోనెట్టి చట్టసంబంధమైన ప్రభుత్వమునులేదని నొక్కి వక్కాణించెను. "భవిష్యత్తులోరాబోవు మరింతయభివృద్ధి భంగకరమును, మరింత చట్టశూన్యమును, నగుప్రభుత్వమునకు తలయొగ్గుటకంటె చట్టశూన్యమగు ప్రస్తుతప్రభుత్వమనకే తలయొగ్గుటమంచిది" అని యతడనెను.

కార్య నిర్వాహకులయొక్క కొంచెమించుమించు నిరంకుశ చర్యలను సమర్థించుటకే తఱచు వినియోగింపబడునని చెప్పుట వింతగనుండును. లేక అది 'లీగల్' అనునర్థములో నుపయోగింపబడును. 'లీగల్' లేక 'ఇల్లీగల్' (అవియస్పష్టమును, దినదినమును మారుచుండునవియునైనను) అనుపదములనే మనము వాడుటయుక్తము.

ఒకనూతన ఆర్డినెన్సు లేక నూతన 'లా' నూతన నేరములను సృష్టించును. ఒకబహిరంగసభకుపోవుట నేరము కావచ్చును. అట్లే సైకిలుమీదపోవుట, ఒకరకపుమస్త్రులను ధరించుట, సాయంకాలమగు సరికి యింటనుండకపోవుట, ప్రతిదినము పోలీసుకు తననుగురించి నివేదించుకొనకపోవుట ఇవన్నియును మరియనేక చర్యలును నేను హిందూ దేశములో నేభాగముననో యొకచోట నేరములగుచున్నవి. ఒక చర్య దేశములోనొకభాగములో నేరముకావచ్చును, మరియొక భాగములో నేరము కాకపోవచ్చును. బాధ్యతలేని యొకప్రభుత్వము క్షణములో నిట్టిన్యాయములను సృష్టింపగలుగునప్పుడు 'లీగల్' అనుపదమునకు ఆకార్యనిర్వాహకులయొక్క యిచ్ఛయనియేయర్థము. దానికివేరు యర్థముండజాలదు. సాధారణముగ (ఇష్టమున్ననులేకపోయినను) నా యిచ్ఛకు తలయొగ్గబడుచున్నది. ఏలనన నవిధేయత వలన కలుగు ఫలితములు సుఖదాయకములుకావు. కాని దానినెల్లప్పుడును శిరసా వహింతునని చెప్పుట బాధ్యతలేని ప్రభుత్వమునకు, లేక నిరంకుశత్వమునకు తుచ్ఛమైనదాస్యమగును; అదియాత్మను చంపుకొనుట. తనకార్యములపట్ల నికనెన్నటికిని స్వేచ్ఛను సంపాదింపజాలకపోవుట యగును.

తమవశములోనున్న చట్టమనుయంత్రములద్వారా మామూలు పద్ధతిలో గొప్ప ఆర్థికమార్పులు సాధ్యమగునా ? యనువాదమిప్పుడు ప్రతి ప్రజాస్వామిక ప్రభుత్వములోను జరుగుచున్నది. ఇది యసాధ్యమని చాలమంది తమయభిప్రాయములను వెల్లడించి యేదోయొక

యసామాన్యమైన విప్లవపద్ధతి యవలంబింపబడవలెననిరి. భారతదేశములో మనకీవాదములోనున్న విషయము ప్రధానముకాదు. ఏలనన మనకుకావలసినమార్పులను చేసికొనుటకు మనకెట్టి చట్టసంబంధమైన సాధనములునులేవు. శ్వేతపత్రిముగాని, యట్టిదే మరియొకటిగాని శాసనమైనచో ననేకవిధములగు చట్టసంబంధమైనయభివృద్ధి పూర్తిగా నిలిచిపోవును. విప్లవములేక న్యాయవిరుద్ధమగు కార్యముతప్ప దీనికివేరు మార్గములేదు. కనుక మనమేమిచేయవలెను? మార్పుసంగతి యెంతమాత్రమును తలపెట్టక మనవిధికి సమస్కరింపవలెనా?

నేడు భారతదేశములోనున్నస్థితి మరింత యసాధారణముగనున్నది. కార్యనిర్వాహకులు అన్నిబహిరంగకృషులను ఆపగలరు, నియమింపగలరు; ఆపుచున్నారు, నియమించుచున్నారు. తమయభిప్రాయములో తమకు యుపద్రవకరమైన ప్రతిచర్యను వారు నిషేధింతురు. ఈవిధముగనుపయోగకరమైన ప్రజాహితకృషియంతయు (గత మూడువత్సరములలోవలె) నాపివేయబడగలదు. దీనికిలొంగుటయనగా ప్రజాహితకార్యములనన్నింటెని మానుకొనుటయనియర్థము. ఇది యసాధ్యమైనస్థితి.

తప్పకుండ తానెల్లప్పుడును 'న్యాయ' ప్రకారముగనే నడచెదనని యెవడును చెప్పజాలడు. ప్రజాస్వామిక ప్రభుత్వములోకూడ తద్వ్యతిరేకముగ నడువవలెనని యంతరాత్మచే నిర్బంధింపబడు సమయములు కలుగవచ్చును. నిరంకుశత్వముగ లేక యథేచ్ఛగ పరిపాలింపబడు దేశములలో నిట్టియవకాశము లతితఅచుగ కలుగుట తప్పదు. నిశ్చయముగనట్టిదేశములో 'న్యాయముకు' నైతికబలమేమియు నుండజాలదు.

"ప్రత్యక్షకార్యము నిరంకుశత్వమునకు సంబంధించినదికాని, ప్రజాస్వామికమునకు సంబంధించినదికాదు. ప్రజాస్వామికమునకు విజ

యమును చేకూర్ప నుత్సహించువారు ప్రత్యక్ష కార్యమును వీడవలెను" అని లిబరలులు చెప్పుదురు. ఈ యోచన భ్రమజనితము; ఈరచన సంధిగ్ధ రచన. ఒక్కొక్కప్పుడు ప్రత్యక్షకార్యము - కూలీలసమ్మె - న్యాయబద్ధము కూడ కావచ్చును. కాని, బహుశః రాచకీయ కార్యమని వారి భావము కాబోలును! నేడు జర్మనీలో హిట్లరు హయాము క్రింద నెట్టివిధమగు చర్యసాధ్యమగును? తుచ్ఛమైన విధేయత లేక న్యాయవిరుద్ధమైన విప్లవ చర్య. అచ్చట ప్రజాస్వామికమును సేవించుటెట్లు?

భారతలిబరలులు తఱచు ప్రజాస్వామికమును స్మరించుచుందురు. కాని, వారిలో చాలమందికి దానిదరికి జేరవలెనను కోరిక లేదు. లిబరలు నాయకులలో నతిముఖ్యులలో నొకడైన సర్ పి. యస్. సివస్వామి అయ్యరు 1934 మే నెలలో నిట్లు చెప్పెను. "కాన్‌స్టిట్యుయంటు అసెంబ్లీ యొక్క సమావేశము జరుగవలెనని వాదించుటలో కాంగ్రెసు ప్రజా సమూహము యొక్క పరిజ్ఞానముమీద నెక్కువ విశ్వాసముంచుచున్నది; వివిధ రౌండు టేబిలుసభలలో పాత్రధారణచేసినవారి శక్తిసామర్థ్యముల పట్లను, నిజాయితీపట్లను న్యాయమును చూపలేదు. కాన్‌స్టిట్యుయంటు అసెంబ్లీ యంతకంటె నెక్కువచేయునని నేననుకొనను" కనుక సర్ సివస్వామిగారి ప్రజాస్వామిక భావము 'ప్రజాసమూహముకు' దూరమైన విషయము; అది బ్రిటిషు ప్రభుత్వముచే పేర్కొనబడిన 'నిజాయితీ, సమర్థతలు' గల వ్యక్తులగుంపుకెక్కువగ సరిపడును. మరియు నతడు శ్వేతపత్రము నాశీర్వదించెను. దానితో "పూర్తిగ తృప్తిపడకపోయినను దేశము దానిని సంపూర్ణముగ తిరస్కరించుట తెలివితక్కువపని యని యతడు భావించెను." బ్రిటిషు ప్రభుత్వమునకును సర్ పి. యస్. సివస్వామి అయ్యరుకును మధ్య సంపూర్ణ సహకారమేల యుండకూడదో కారణము కానరాకున్నది.

కాంగ్రెసు శాసనోల్లంఘనమును విరమించెను. లిబరలులు సహజముగ దీనినామోదింతురు. ఈ "యవివేకమును, దుర్బుద్ధి ప్రేరితమును నగు యుద్యమముకు" దూరముగనుండగల తమ బుద్ధివిశేషమునకు హారానందించుకొనుటయు నాశ్చర్యముకాదు. 'మేమట్లు చెప్పియుండ లేదా" అని వారడిగిరి. అదిచిత్రమైనవాదము. మనమునిలిచి తీవ్రపోరాటమును సల్పినపుడు పడగొట్టబడితిమి; కనుక మనకు కఱపబడిన నీతియేమనిన నిలుచుట చెడ్డవిషయము. ప్రాకుట సర్వోత్తమము, భద్రతమమైనది. ఆసాష్టాంగస్థితినుండి పడగొట్టబడుటయు, లేక పడుటయు నసంభవము.

# భారతము - ప్రాచీనము, నవీనము.

భారతజాతీయత పరప్రభుత్వమునోర్లకపోవుట సహజము, విధాయకము. అయినను పందొమ్మిదవ శతాబ్దాంతమువరకు మనవిద్యాధికులలో నధికసంఖ్యాకులు బ్రిటిషుసామ్రాజ్యలక్ష్యమును బుద్ధిపూర్వకముగను లేక అబుద్ధిపూర్వకముగను అంగీకరించుట చోద్యముగనుండును. దీనిమీదవారు తమస్వంతవాదనలను నిర్మించుకొని దానిబాహ్యచిహ్నములనుమాత్రమే విమర్శింపసాహసించెడివారు; పాఠశాలలలోను, కళాశాలలలోను బోధింపబడెడిచరిత్ర, ఆర్థికశాస్త్రము,తదితరవిషయములు-అన్నియునుపూర్తిగ బ్రిటిషుసామ్రాజ్యదృష్టితోనే వ్రాయబడెను. అవి మనయనేకభూత, వర్తమానదోషములను బ్రిటిషువారిసుగుణములను, ఉత్కృష్టవిధిని చాటుచుండెను. కొంతవరకుమనమీయపకేతపక కథనమును స్వీకరించితిమి. మనముసహజముగ దానిని తిరస్కరించినపుడు గూడ మనపైదానికెక్కువ పలుకుబడియుండెడిది. మొట్టమొదటమనము దానినుండిమానసికముగ తప్పించుకొనలేకపోతిమి. ఏలనన మనకితరవిషయములును, వాదనలును తెలియవు. కనుక మనము మత సంబంధమైన జాతీయతయందు శరణుజొచ్చితిమి. అధమము వేదాంతములోను, మనములోను మనమేయితరప్రజలకును తీసిపోవువారముకామను భావమునందు శరణుజొచ్చితిమి.పాశ్చాత్యులయొక్క బాహ్యాడంబరములును, తళుకుబెళుకులును మనకులేకపోయినను అంతకంటె నమూల్యమును, యోగ్యమును నగు నిజయాంతరంగిక పదార్థమును కలిగియున్నారమని మనము మనదౌర్భాగ్యమందును, అధఃపతనమునందును ఓదార్చుకొనుచుండెడివారము. వివేకానందమొదలగువారును, మనప్రాచీనవేదాంతములందు పాశ్చాత్యపండితులకుగలయభిరుచియు మనకుకొంతయాత్మ

గౌరవమును తిరిగిప్రసాదించెను. మనప్రాచీనతనుగురించి నిద్రాణమునొందుచున్న మనయభిమానమును రగుల్కొలిపెను.

మనభూతవర్తమానపరిస్థితులనుగురించి బ్రిటిషువారుచేసినస్టేటుమెంటులను క్రమముగ మనము సందేహింపనారంభించితిమి; కాని, మనమింకను బ్రిటిషుతత్త్వమనుపంజరములోనుండియే భావించుచుపనిచేసితిమి. చెడ్డవస్తువేదియైనయున్నచో దానిని 'బ్రిటిషేతరము' అనెడివారము; హిందూదేశములో బ్రిటిషువ్యక్తి తప్పుచేసిన యెడలనది వానిదికాని యాపద్ధతిదికాదు. కాని, భారతదేశములోని యాంగ్లపరిపాలననుగురించిన విమర్శకగ్రంథములును, అంశములును (గ్రంథకర్తలదృష్టిమితవాదమేయైనను) విప్లవప్రయోజనమునుకలిగించి, మన జాతీయతకు రాజకీయ, ఆర్థికపునాదులనుప్రసాదించెను. దాదాభాయి నౌరోజీయొక్క 'దారిద్ర్యము భారతదేశములో బ్రిటిషేతర పరిపాలన' రొమేషచంద్రదత్తుయొక్క పుస్తకములు, విలియండిగ్బియొక్కయు, తదితరులయొక్కయుపుస్తకములు - మనజాతీయభావాభివృద్ధిలో గొప్ప పరివర్తనమును కలిగించెను. ప్రాచీనభారతచరిత్రయొక్క మరికొన్ని పరిశోధనలు ప్రాచీనకాలమునాటి ప్రకాశమానములును, అతివిజ్ఞానప్రదములునునగు యుగములను బహిర్గతమొనరించెను. వీనినిగురించి మనము విశేషాదరముతో చదివితిమి. హిందూదేశములోనిబ్రిటిషుచరిత్ర వారిహిస్టరీపుస్తకములను మనముచదివివిశ్వసించినదానికంటె భిన్నమైనదను విషయమునుగూడ మనము కనుగొంటిమి.

చరిత్రనుగురించియు, ఆర్థికములనుగురించియు, భారతదేశములోనిపరిపాలననుగురించియు బ్రిటిషువారుచెప్పుకథలకు మనసవాలు హెచ్చుచుండెను; అయినను మనమింకను వారితత్త్వ ఆవరణములోనే పనిసాగించుచుంటిమి. శతాబ్దాంతమగుసరికి భారతజాతీయత యట్టిస్థితిలో నుండెను. లిబరలువర్గముయొక్కయు, నితరచిన్నవర్గములయొక్కయు,

కాంగ్రెసులోనున్నకొంతమంది (వీరప్పుడప్పుడుయుద్రేకముతో ముందుకు వెళ్లుచున్నను, మానసికముగ నింకను పందొమ్మిదవ శతాబ్దములోనే జీవింతురు) మితవాదులయొక్కయు స్థితి యింకను యిదియే. దీనివలననే లిబరలు భారతస్వాతంత్ర్య భావమునుగ్రహింపజాలకున్నాడు; ఏలనన నారెండును వస్తుతఃపరస్పరవిరుద్ధములు. సోపానక్రమముగ తానుపెద్ద యుద్యోగములకుపోయి బరువైనట్టియు, యెక్కువ ముఖ్యమైనట్టియు కట్టలను చేబట్టుసని యతడూహించును. ప్రభుత్వయంత్రముయథాప్రకారముగ శాంతముగనేసాగుచుండును అతడుచక్రముయొక్కచీలదగ్గర పదిలముగనుండును; వెనుకభాగమున నెచ్చటనో (ఇతరులతో నెక్కువ జోక్యము కలుగజేసికొనకుండ) బ్రిటిషు సైన్యముండి యవసరమైనపుడతనికి రక్షణయిచ్చును. సామ్రాజ్యముక్రింద డొమినియను ప్రభుత్వమునకతనిదృష్టిలో నిదియేయర్థము. ఇది యసాధ్యమగు చిత్రమైనభావము. ఏలనన భారతదాస్యము బ్రిటిషువారిచ్చురక్షణయొక్క ఖరీదగుచున్నది. అదియొకగొప్పదేశముయొక్క యాత్మగౌరవమున కవమానకరముకాక పోయిననుకూడ మనకారెండును యసంభవములు. సర్ ఫ్రెడరిక్ వైటు (భారతజాతీయతతో సంబంధము లేనివాడు) ఒకపుస్తకములో నిట్లు వ్రాసెను. "అతడింకను (భారతీయుడు) తనకును యుపద్రవమునకును మధ్యయింగ్లండునిలిచియుండునని భావించును. అతడీభ్రమలోనుండునంత కాలమును తనయాదర్శమగు స్వపరిపాలనకు పునాదులనుకూడ వేసి కొనజాలడు." అతడు లిబరలు, కలతత్త్వవాది, రీయేక్షనరీలనుసూచించిగనే దీనిని వ్రాసెను. భారతలెజిస్లేటివుఅసెంబ్లి యధ్యక్షుడుగానున్నపుడతనికి వారితో నెక్కువసంబంధముకలిగియుండవలెను. కాంగ్రెసుయొక్కవిశ్వాస మిదికాదు. ముందడుగువేయునట్టి యితరవర్గములునుదీనినివిశ్వసింపవు. ఈభ్రమపోవువరకును భారతదేశమునకుస్వేచ్ఛయుండదని వారు సర్ ఫ్రెడరిక్‌తోనేకీభవించెదరు. ఉపద్రవమును (అదియే దానికి విధియైనచో) భారతదేశము తనంతటతానేయెదుర్కొనవలెను. భారతదేశమునుండి

బ్రిటిషు సైనికాధికారమును పూర్తిగ తగ్గించినప్పుడే దాని స్వేచ్ఛ ప్రారంభమగును.

పందొమ్మిదవ శతాబ్దములోని భారతవిద్యాధికులు బ్రిటిషు తత్త్వమునకు విధేయులగుటలో నాశ్చర్యములేదు; ఇరువదియవ శతాబ్దములో జరిగిన కల్లోలమంతయు నయిన తరువాతగూడ కొంతమంది యీభ్రమచే బాధపడుచుండుట యాశ్చర్యముగనుండును. పందొమ్మిదవ శతాబ్దములో బ్రిటిషుపాలక జాతులు యైశ్వర్యము, విజయము, అధికారములతోగూడిన చిరచరిత్రగల ప్రపంచ నిరంకుశులై యుండిరి. ఈచిరచరిత్రయు, శిక్షయు నిరంకశత్వములోనుండు కొన్ని సుగుణములను, అవగుణములను వారికి ప్రసాదించెను. భారత దేశములోనున్న మనము గతనూటడెబ్బదియైదు సంవత్సరములనుండియు పైయున్నత స్థితికి రాగలుగుటకు తగిన సాధనములను, శిక్షను వారికి సంపూర్ణముగ ప్రసాదించితిమని సంతోషించుకొనవచ్చును. వారు-అనేక దేశములును, జాతులును తలంచిన ట్లీ-భగవంతునియొక్క పెద్దకొడుకులమనియు తమసామ్రాజ్యము భూతలస్వర్గమనియు భావింపనారంభించిరి. వారి ప్రత్యేకస్థితి గుర్తింపబడి, వారియాధిక్యత శంకింపబడకుండినయెడల, వారికపకారము జరగనంతవరకు, వారుయుదారులుగను, నమ్రులుగను నుండిరి. కాని వారినెదిరించుటయన వారిదృష్టిలో దివ్యక్రమము నెదిరించుటయే! కనుకనది మహాపాపము! దానిని పాతిపెట్టవలెను!

ఈదితర ప్రపంచమునుగురించికూడ బ్రిటిషువారి సామాన్యదృష్టి యిదియేయైనపుడు హిందూదేశములోనిది మరింత ప్రస్ఫుటించెను. బ్రిటిషువారు హిందూదేశ సమస్యను వీక్షించు దృష్టిలో (అదికోపమును బుట్టించునదియేయైనను) మోహింప చేయునదేదియోకలదు. సదాధర్మపథముననే యుందుమను ప్రశాంతమగు యభయమును, మహాభారమును యథాయోగ్యముగ వహించితిమను మాటలును,

తమజాతియొక్క విధియందును, తమ నిజసామ్రాజ్యముద్రియందే విశ్వాసమును, నిజ విశ్వాసముయొక్క పునాదులను సవాలుచేసిన యవిశ్వాసకుల యెడలను, పాపులయెడలను ద్వేష, క్రోధములును-యిట్టిదృష్టిలో మతసంబంధమైన స్వభావమేదియోయుండెను. పాపులను రక్షించిన వెనుకటి 'ఇంక్విజిటరు'లవలె మాకోరికలేకుండగనే వారు మమ్మురక్షింపబూనుకొనిరి. ఈపాపరక్షణ పుణ్యావర్తకములో వారు అయాచితముగ ("నిజాయితీయుత్తమమైనసీతి" యను సామెతను రుజువు చేయునట్లు) లాభములనుపొందిరి. దేశమును సామ్రాజ్యప్రణాళికకు సరిపడునట్లు నడుపుటయు, బ్రిటిషుముద్ర ప్రకారము కొంతమంది పురుషులను తయారుచేయుటయు భారతాభివృద్ధియని పిలువబడెను. మనము బ్రిటిషులక్ష్యములను, భావములను యెంతయెక్కువగ నంగీకరించిన నంతయెక్కువగ 'స్వీయప్రభుత్వము'నకు తగియుందుము. స్వేచ్ఛను బ్రిటిషువారికోరికల ప్రకారమే యుపయోగించెదమని ప్రదర్శించి, యష్టుభీమాయిచ్చిన వెంటనే స్వేచ్ఛమనదియగును, మనకీయబడును.

భారతదేశములోని బ్రిటిషు పరిపాలనచరిత్రనుగురించి భారతీయులకును ఆంగ్లేయులకును భేదాభిప్రాయములుండును. అదిబహుశః సహజము. కాని యున్నత ప్రభుత్వాధికారులు, భారతదేశ సెక్రటరీలు సహా, విపరీత చిత్రములను చిత్రించి యథార్థములమీద నాధారపడని స్టేటుమెంటులను చేయుచుండుట చోద్యముగనుండును. కొంతమంది నిపుణులును, యితరులునుతప్ప యింగ్లీషుప్రజలు భారతదేశమును యొంతయు నెరుగకపోవుట యసాధారణవిషయము. విషయములేవారికి మరుగైనయెడల భారతాత్మవారికెంతదూరములోనుండునో వేరుగ చెప్పవలెనా? వారు యీామెశరీరమును పట్టుకొని తమ యధీనములో నుంచుకొనిరి. కానియది బలాత్కారవశము. వారామెను తెలిసికొనలేదు, లేక తెలిసికొనుటకు ప్రయత్నించలేదు. వారెన్నడును యీామె

కండ్లకేసి చూడలేదు. ఏలనన వారికండ్లు విముఖముగనుండెను; అవమానముచేతను, సిగ్గుచేతను యామెకండ్లు అవనతమయ్యెను. శతాబ్దముల సంపర్కానంతరము వారు (ఇంకను క్రొత్తవారు) పరస్పర ద్వేషపూరిత దృక్కులతో నొకరినొకరు చూచుకొనెదరు.

భారతదేశము గర్భదారిద్ర్యముచేతను, అవమానముచేతను కుందుచున్నను ఆమెలో నొకవింత యుదారత, యుత్కృష్టత కలవు. ప్రాచీన సాంప్రదాయములును, ప్రస్తుత దుఃఖములును, ఆమె కెంత భారముగనున్నను, కనురెప్పలలసటచే నెంతమూతలు పడుచున్నను ఆమెలో "కాంత్రిభావములచేతను, వింతకళలచేతను, మనోజ్ఞ రాగములచేతను అంతరంగముననుండి శరీరోపరభాగమునకు ప్రస్ఫుటించుచున్న యొక శోభ కలదు". ఛిన్నభిన్నమైన యామె శరీరము వెనుకను, శరీరము లోపలను మనమింకను నొక యాత్మాభిమానమును చూడగలము. ఆమె యనేక యుగముల ప్రస్థానము సాగించి, మంచి పరిజ్ఞానమును సంపాదించెను; విదేశస్థులతో వర్తకముచేసి వారిని తన విశాలకుటుంబములో కలుపుకొనెను; మహదైశ్వర్యమును, దౌర్భాగ్యమును అనుభవించెను; అవమానములను, భయంకర దుఃఖములను భరించెను; అనేక వింత దృశ్యములను చవిచూచెను; కాని యీ మహాప్రస్థానమంతటను తన యనాది విజ్ఞానము నాశ్లేషించి యుండెను; దానినుండిశక్తిని, వీర్యమునులాగుకొని దానినియితర దేశములకు యథేచ్ఛగ పంచిపెట్టెను. తూగుటుయ్యాలవలె నామె నిమ్నోన్నతములలో నూగెను; తన విశేషయోచనాశక్తి, సాహసములచే స్వర్గమును చేరి, వాని రహస్యములను బయటపెట్ట సాహసించెను; నరకకూపముయొక్క యసహ్య యనుభవములను కూడ నామె యనుభవించెను. దుఃఖప్రదములగు పిచ్చినమ్మకములును, కృంగదీయునట్టి దురాచారములును పెరిగి యామెను కూలదోసినను చారిత్రక భాస్కరోదయమగునాడు మహా

మేధావులగు తనముద్దుబిడ్డలు ఉపనిషత్తులలో ప్రసాదించిన ప్రబోధము నామె యెన్నడును పూర్తిగ విస్మరించి యుండలేదు; ఎన్నడును విశ్రాంతి నెఱుగక నెల్లప్పుడును ప్రయత్నించుచు, పరిశోధించుచుండు నిశితములగు వారి మనస్సులు గుడ్డి సిద్ధాంతముల వెనుక శరణుజొచ్చ లేదు; జీవరహితములగు రూపములను, కర్మకాండ యిత్యాదులనునిత్యా నుష్ఠానము చేయుటయందువారు తృప్తులు కాలేదు. వారు వర్తమాన దుఃఖములనుండి వ్యక్తిగత శాంతిని కోరలేదు; రాబోవు స్వర్గములో స్థానమును కోరలేదు. వారు తేజస్సును, జ్ఞానమును కోరిరి. "అసత్తు నుండి నన్ను సత్తునకు గొంపొమ్ము; అంధకారమునుండి నన్ను వెలుతు రుకు గొంపొమ్ము: మృత్యువునుండి నన్ను యమరత్వమునకుగొంపొమ్ము"* నేడు కూడ లక్షలకొలది ప్రజలచే నిత్యమును జపింపబడు 'గాయత్రి మంత్రములో 'జ్ఞానము, వెలుతురు' ఆహ్వానింపబడుచున్నవి.

రాజకీయముగ తఱచు విచ్ఛిన్నమగుచున్నను ఆమెయొక్క యాత్మ యెల్లప్పుడును ఒక సామాన్య పైతృకధనమును సంరక్షించు చుండెను. ఆమెయొక్క భిన్నత్వములో నద్భుతమగు యేకత్వముండె డిది. ప్రాచీన దేశము లన్నింటిలోవలెనే యిచ్చటను మంచి చెడ్డ గుణ ములు రెండును యుండెను; కాని మంచి కప్పివేయబడుటచే దాని కొఱకు వెతుకవలసియుండెను. చెడుగుయొక్క వాసనకు దాపరికము లేదు; నిర్దయాత్ముడగు నామెయొక్క చండభాస్కరుడు దానిని బహి ర్గత మొనర్చుచుండెను.

హిందూదేశమునకును యిటలీకిని కొంత పోలిక గలదు. రెండును వాని వెనుక చిరవిజ్ఞాన సాంప్రదాయములు గల ప్రాచీన దేశములు. హిందూదేశముతో పోల్చినప్పుడు యిటలీ నవీనమైనది. హిందూదేశము దానికంటె నతి విశాలమైనది. రాజకీయముగ రెండును ముక్కలక్రింద

* బృహదారణ్యకోపనిషత్తు 1, 3, 27.

చీల్చబడెను. అయినను హిందూదేశములో వలెనే ఇటాలియా యను భావము యెన్నడును నశించిపోలేదు. ఆ భిన్నత్వములో నేకత్వము ప్రధానముగ నుండెడిది. ఇటలీలోని యేకత్వము చాలవరకు రోమునగరమునకు సంబంధించినది. ఆమహాపట్టణము దేశమునంతను పాలించెను; అది యేకత్వమునకు మూలమును, చిహ్నమునునై యుండెను. కాశీ హిందూదేశమునకే గాక ప్రాచ్య ఆసియాకుకూడ ప్రాచ్య అమర నగరమని పిలువబడినను హిందూదేశములో నట్టి యేకైక కేంద్ర మేదియును లేదు. కాశీ సామ్రాజ్యములో గాని భౌతికాధికార స్థాపనలో గాని యెన్నడును జోక్యము కలిగించుకొనలేదు. భారత విజ్ఞానము భారతదేశమంతటను విరివిగ వెదజల్లబడుటచే దేశములో నేభాగమును ఆవిజ్ఞానకేంద్రమని చెప్పుటకు వీలులేదు. కన్యాకుమారి మొదలు హిమాలయములలోని అమరనాథ్ బదరీనాథ్ లవరకును ద్వారకావతి మొదలు జగన్నాథమువరకును ఒకేభావములు ప్రవహించెను. ఒకచోట భావసంఘర్షణ కలిగినచో దానిధ్వని దేశములోనున్న మూల మూలలకును చేరెడిది.

ఇటలీ పశ్చిమయూరప్పుఖండమునకు మత, విజ్ఞానములను ప్రసాదించినట్లే భారతదేశము (చీనా భారతదేశమంత ప్రాచీనమును గౌరవనీయమునగునదేయైనను) ప్రాచ్యఆసియాకు ప్రసాదించెను. రాజకీయముగ ఇటలీ సాగిలబడియున్నప్పుడుకూడ నామె జీవితము యూరపు యొక్క నాళములగుండ ప్రవహించుచుండెను.

మెటర్నిక్ అను నతడు ఇటలీని "భూగోళములో నొక ప్రత్యేక భాగము" అని వచించెను. మెటర్నికులు కాబోవువారు చాలమంది యీపదమును భారతదేశమునకు గూడ నుపయోగించిరి. చిత్రముగ భూగోళస్థితినిబట్టికూడ రెండుఖండములలోను వాటిస్థితిలో పోలికకలదు. ఇంగ్లండును ఆస్ట్రియాతో పోల్చుట గమనింపదగిన విషయము. ఏలనన

నిరువదియవ శతాబ్దములోనున్న యింగ్లండు పందొమ్మిదవ శతాబ్దము నాటి ఆస్ట్రియాతో పోల్చబడెను. ఆస్ట్రియా యప్పుడు యింకను గర్వము పొగరుబోతుతనము గొప్పతనములతో విర్రవీగుచుండెను; కాని దానికి శక్తినిప్రసాదించిన వేళ్లు శుష్కించుచుండెను; వినాశము ఆ మహావృక్షమును దొలుచుచుండెను.

తన దేశమును మానవరూపములో వర్ణించు స్వభావమును ఆపు కొనజాలకుండుట చిత్రముగనుండును. బాల్యసంబంధములును, ఆచార బలమును చాలగట్టివి. భారతదేశము 'భారతమాత'; అందమైనస్త్రీ; అతివృద్ధురాలైనను, ఆకారములో నెప్పుడును యౌవనవంతురాలు; విచారభరితనేత్రి, అసహాయురాలు; విదేశస్థులచేతను, పరాయివారిచే తను క్రూరముగ చూడబడుచు తనను రక్షింపరమ్మని తన బిడ్డలనాక్రో శించుచున్నది. ఇట్టిచిత్రమొకటి లక్షలకొలది జనులయొక్క యుద్రే కములను రగుల్కొలిపి వారిని కార్యోత్సాహులను, త్యాగులను చేయును. అయినను భారతదేశము ప్రధానముగ బక్కపేగుల జీద రయితు, బిక్కమొగముల కూలిజనము, చూచుట కందచందములు లేని వారు; ఏలనన దారిద్ర్యములో నందములేదు. మనము కలలనుగను యందమైన స్త్రీ, కట్టగుడ్డ లేక తినతిండిలేక నడుములు వంగిపోయి పొల ములలోను, ఫ్యాక్టరీలలోను పనిచేయువారి ప్రతినిధియేనా! లేక యుగములనుండి ప్రజలనునలిపి, వారినికొల్లగొని వారిపై క్రూరమగు నాచారములనురుద్ది వారిలో చాలమందిని అస్పృశ్యులనుగ గూడచేసిన స్వల్పవర్గమువారి ప్రతినిధియా? మనము మన యూహాలచే సృష్టింప బడిన వానితో సత్యమును కప్పవేయయత్నించి దానినుండి యూహా ప్రపంచమునకు తప్పించుకొన జూతుము.

వివిధతరగతులును, వారి పరస్పర పోరాటములును యున్నను భారతదేశములో వీరి నందరిని నైక్యముచేసిన సామాన్య బంధ మొకటి

యుండెను. దాసిజగి, పట్టుదల, దేనికైననునిలువగలశక్తి యాశ్చర్యమును కలిగింపక మానవు. ఈశక్తికికారణమేమి ? ఇదికేవలము జడత్వ సాంప్రదాయముల (ఇవియెల్లప్పుడును గొప్పవేయైనను) యుదాసీనతవలనకలుగు శక్తిసామర్థ్యమా? ఇదియొక క్రియారూపముగల, రక్షణశక్తిగలసూత్రము. ఇది బలీయమైన బాహ్యశక్తులను జయప్రదముగ నెదిర్చెను; దానినెదుర్కొన బయలుదేరిన దేశములోని శక్తులను తనలో నిముడ్చుకొనెను. ఎంతశక్తికలదియైనను యిది రాజకీయ స్వాతంత్ర్యమును కాపాడజాలకపోయెను. రాజకీయ యైక్యమును సాధింప యత్నింపజాలకపోయెను. ఈరెంటిను కష్టింపదగినంత యోగ్యములుగావని తలంపబడెను; వీనిప్రాముఖ్యత యత్యవివేకముగ నిర్లక్ష్యముచేయబడెను. దీనికి మనము బాధపడితిమి. చరిత్రయందంతటను ప్రాచీనభారతలక్ష్యము రాజకీయ, సైనిక విజయమును కీర్తింపలేదు; అదిద్రవ్యమును, ధనమునార్జించు వృత్తులలోనివారిని నీచముగ చూచెను. ఐశ్వర్యమును, గౌరవమును దాంపత్యమును వహింపలేదు? సంఘమునకు ద్రవ్యరూపములో సేవచేసినవారికి (అధమము సిద్ధాంతరీత్యా) గౌరవము కలదనిరి.

ప్రాచీనవిజ్ఞానము అనేక భయంకర ఝంఝామారుతములను, తుపానులను దాటగలిగెను. కాని యది దానిబాహ్యరూపమును సంరక్షించుకొనినను దాని నిజసారమును కోల్పోయెను. నేడది మరియొక సర్వశక్తివంతమైన నూతనశత్రువును పాశ్చాత్య 'బనియా' విజ్ఞానమును మౌనముగను, నిస్పృహతోను పోరుచున్నది. అది యీనూతనదాడికి లొంగిపోవును. ఏలనన పాశ్చాత్యవిజ్ఞానము శాస్త్రమును తెచ్చెను. శాస్త్రము అన్నాతురులైన లక్షలకాహారము నిచ్చును. కానిపశ్చిమదేశములు యీగొంతుకనుపిసుకు విజ్ఞానములోనున్న దోషములకొక చింతామణినిగూడ - సామ్యవాదసూత్రములు, పరపతిసూత్రములు,

అందరిశ్రేయస్సుకొరకు సంఘమునకు సేవచేయుట - ప్రసాదించును. ఇది ప్రాచీన బ్రాహ్మణసేవాలక్ష్యమునకు అంతదూరముకాదు. కాని యిది యన్నితరగతులను, వర్గములను బ్రాహ్మణులనుజేసి (నిశ్చయముగ మతదృష్టిలోకాదు) తరగతులలోని భేదములను రద్దుచేయును. భారతదేశము తననూతనదుస్తులను ధరించునప్పుడు (ప్రాతవి చినిగి తూట్లుపడిపోయెను. కనుక ధరింపకతప్పదు.) యీపూదిరిలో తయారుచేయించుకొనవలసియుండును. ఇది ప్రస్తుతపరిస్థితులకును, ఆమెయొక్క ప్రాచీనభావమునకును సరిపోవును. ఆమె స్వీకరించుభావములు ఆ దేశగంధమును కలిగియుండవలెను.

---

౫౪

# బ్రిటిషు పరిపాలనా చరిత్ర.



భారతదేశములో బ్రిటిషుపరిపాలకుల చరిత్రయెట్టిది? భారతీయుడుగాని, ఆంగ్లేయుడుగాని దీనినిగురించి (విషయములనే దృష్టిలో నుంచుకొని) నిష్పక్షపాత దృష్టికలిగియుండుటసాధ్యమని నేననుకొనను. ఇది సాధ్యమేయైనను ఆధ్యాత్మికయంశమును, విషయములకుచెందనితదితరయంశములను తూచుట, కొలుచుట మరింతకష్టసాధ్యమైనది. బ్రిటిషు పరిపాలన "భారతదేశము శతాబ్దములనుండియునెరుగని దానిని, అఖండములో నేభాగమందును తన యధికారమును ప్రశ్నింపని యొకప్రభుత్వమునుప్రసాదించెను" అనిమనకుచెప్పుదురు.* అది 'న్యాయ' సంబంధమైన పరిపాలనను స్థాపించెను; యుక్తమైన, సమర్థతగల ప్రభుత్వమును ప్రసాదించెను; అదిభారతదేశముకు పాశ్చాత్యములైన పార్లమెంటరీ ప్రభుత్వమును, వ్యక్తిగతస్వేచ్ఛలను తెచ్చిపెట్టెను; "బ్రిటిషు యిండియాను యేకైక ప్రభుత్వముగమార్చివేయుటచే నది భారతీయులలో రాజకీయయైక్యత యనుభావమును కలుగచేసి" యీవిధముగ జాతీయతయొక్క ప్రథమావస్థను దోహదముచేసెను; ఇది బ్రిటిషువారి వాదము. 'న్యాయ' పరిపాలన, వ్యక్తిగతస్వేచ్ఛలు అనునవి చాలవత్సరములనుండి కానరాకున్నను యిందులో చాల సత్యముకలదు.

ఈకాలమునుగురించిన భారతీయులపరిశోధన అనేక యితర యంశములకు ప్రాధాన్యత నిచ్చుచు విదేశ ప్రభుత్వము కలుగచేసిన భౌతిక, యధ్యాత్మికాపకారములను సూచించును. ఉభయుల దృష్టుల

* ఈయుదాహరణవాక్యములు భారతచట్టముల సంస్కరణను (1934) సంబంధించిన జాయింటు పార్లమెంటరీ కమిటీరిపోర్టులోనివి.

లోను భేదమెంతయో కలదు. బ్రిటిషువారిచే పొగడబడునది యొక్కొక్కప్పుడు భారతీయులచే గర్హింపబడును. డాక్టరు ఆనందకుమారస్వామి వ్రాయునట్లు "భారతప్రజలపై గావింపబడిన మహోపచారములకు ఆశీర్వచనములవంటి బాహ్యాకారములుండుట భారతదేశములోని బ్రిటిషుపరిపాలనయొక్క యొక ప్రధానలక్షణము".

యథార్థమునకు భారతదేశములో గతనూరునూటయేబది వత్సరములనుండియు జరుగుచుండినమార్పులు ప్రాచ్యపాశ్చాత్యములలో నన్ని దేశములలోను సమానముగ జరిగిన ప్రపంచమార్పులు. పశ్చిమయూరపులోను, తరువాత ప్రపంచమంతటను, అభివృద్ధియైన 'ఇండస్ట్రియలిజము' యంత్రాభివృద్ధి దానితో జాతీయతను, శక్తిగల యేకప్రభుత్వపద్ధతిని సర్వత్రి తెచ్చిపెట్టెను. బ్రిటిషువారు భారత కవాటముచు పశ్చిమమునకు మొట్టమొదట తెరచి యామెకు పాశ్చాత్య యంత్రములను, శాస్త్రమును ప్రసాదించినందుల కభివందనీయులు. కాని వారట్లుచేసి (పరిస్థితులు బలవంతముచేయువరకును) దేశము యొక్క పారిశ్రామిక పురోభివృద్ధిని నలిమివేసిరి. భారతదేశమిదివరకే పశ్చిమ ఆసియా విజ్ఞానమైన యిస్లాముయొక్కయు, ప్రాచ్యమున కంతేకును వ్యాపించిన తననిజఫలమైన ప్రాచ్యవిజ్ఞానముయొక్కయు సంగమస్థానమయ్యెను. ఇప్పుడు మరింకను పశ్చిమమునుండి మరింతశక్తివంతమైన మూడవదివచ్చెను. భారతదేశము వివిధప్రాచీన నవీనభావములకు సమరరంగము, కేంద్రస్థానము అయ్యెను. ఈమూడవశక్తిజయించి భారతదేశముయొక్క యనేక ప్రాచీనసమస్యలను పరిష్కరించియుండెడిదనుటకు సందేహములేదు. కాని దీనిని తెచ్చుటకు తమంతతామే సహాయపడిన బ్రిటిషువారు దీనిపురోభివృద్ధి నరికట్టుటకు ప్రయత్నించిరి. వారు మన పారిశ్రామికాభివృద్ధి నరికట్టి తద్వారా రాజకీయాభివృద్ధిని యాలస్యముచేసిరి. దేశములో వారు కనుగొనిన అకాలఫ్యూడల్

ప్రభుత్వములను, యితరశిథిల సంస్థలనుకాపాడిరి. మార్పుచెందుచున్న ట్టియు, కొంతవరకభివృద్ధి చెందుచున్నట్టియు మాచట్టములను, ఆచారములను వారువచ్చినపుడున్నస్థితిలో గడ్డకట్టుకొనిపోవునట్లుకూడ చేసి యాసంకెలలనుండి మేముతప్పించుకొనుట కష్టసాధ్యముచేసిరి. భారత దేశములోని బూర్జువాలు వారి యాశీర్వాదముచేతను, సహాయముచేతను పెరిగిరినవారుకారు. రైల్వేలను, యితర పారిశ్రామికోత్పత్తులను ప్రవేశపెట్టినతరువాత పరివర్తనచక్రమును వారాపజాలకపోయిరి; వారు దానినడ్డగించి, దానిగతిని మాంద్యపరచగలిగిరి. దీనిని వారు స్పష్టముగ తమలాభముకొరకే చేసిరి.

"ఈగట్టిపునాదిమీద మహోత్కృష్ట భారతప్రభుత్వ సౌధము నిలిచియున్నది. ఈస్టుయిండియాకంపెనీవారి యధీనములోనున్న రాష్ట్రములన్నింటిని చక్రవర్తియధీనములోనికి తీసికొనిన తరువాత, 1858 లగాయతు, గడిచినకాలములో భారతదేశముపొందిన యైశ్వర్య, విద్యాభివృద్ధులు అది మున్నెన్నడును తన చరిత్రలో నేయుగములోను కనివినియెరిగినదానికంటె గొప్పవియని నిస్సందేహముగ చాటవచ్చును."* ఈస్టేటుమెంటులో పైకికాన్పించునంతటి యథార్థములేదు; బ్రిటిషుప్రభుత్వము వచ్చుటతోడనే విద్య యథార్థముగ తగ్గిపోయెనని తెలుచు చెప్పబడుచుండెను. కాని యీస్టేటుమెంటు సంపూర్ణముగ యథార్థమేయైనను యిది యాధునిక పారిశ్రామికయుగమును పాతయుగములతో పోల్చినట్లగును. ప్రపంచములోని ప్రతిదేశములోను గతశతాబ్దములో, శాస్త్రముచేతను, యంత్రాభివృద్ధిచేతను, యైశ్వర్య, విద్యాభివృద్ధులద్భుతముగనుండెను. ఇట్లు యేదేశమునుగురించియైనను యిట్టియభివృద్ధి "మున్నెన్నడును తనచరిత్రలో నేయుగములోను కని విని యెరిగిన దానికంటెగొప్పది యని నిస్సందేహముగ చాటవచ్చును."

*జాయింటు పార్లమెంటరీ కమిటీ రిపోర్టు (1934)

బహుశః ఆదేశచరిత్ర హిందూదేశచరిత్ర యంతటి పురాతనమైనది కాకపోవచ్చును. ఇట్టి సాంకేతికాభివృద్ధి యీపారిశ్రామిక యుగములో మన కేవిధముగనైనను, బ్రిటిషుప్రభుత్వము లేకపోయినను, అబ్బియుండెడిదని సూచించుటలో ననవసర మూర్ఖత్వమేమియు నుండబోదు. నిశ్చయముగ మనము మనస్థితిని యనేక యితరదేశములతో పోల్చి చూచినచో మనకింతకంటె నెక్కువ యభివృద్ధియే చేకూరి యుండెడిదని యూహించుట దోషముకానేరదు. ఏలనన బ్రిటిషువారి చేతనే యీయభివృద్ధి నులిమివేయబడుటను మనము పొరవలసివచ్చెను. రైల్వేలు, టెలిగ్రాపులు, టెలిఫోనులు, వైర్లెసు యిత్యాదులు బ్రిటిషు ప్రభుత్వముయొక్క మంచితనమునకును, యుదారతకును పరీక్షలు కాజాలవు. అవి యవసరములు, ఆహ్వానింపదగినవి. వానిని మొట్ట మొదట మనకు తీసికొనివచ్చిన యేజెంటులు బ్రిటిషువారు కనుక మనము వారికి కృతజ్ఞులముగ నుండవలెను. కాని యీపారిశ్రామిక నాందీప్రవేశముకూడ ముఖ్యముగ బ్రిటిషు ప్రభుత్వమును బలపరచుటకే జరిగెను. పైవి జాతియొక్క రక్తనాళములు. వానిగుండ జాతియొక్క రక్తము ప్రవహించి, దానివర్తకము నభివృద్ధిపరచి, యుత్పత్తులను తీసికొనిపోవుచు, దాని లక్షలకొలది ప్రజల కైశ్వర్యమును, నూతనోత్తేజమును ప్రసాదింపవలసియుండెను. చివరకట్టి ఫలితము చేకూరు ననుట సత్యము; కాని యవి మరియొక ప్రయోజనముకొరకు-బ్రిటిషు వస్తువులకొరకు పణ్యస్థలములను పట్టుకొనుటకును, సామ్రాజ్యాధికారమును బలపరచుకొనుటకును ఉద్దేశింపబడి యందుకే నడచెను. నా యుద్దేశ్యము కొనసాగింపబడెను. పరిశ్రమయము చేయుటకును, నివసన ప్రయాణ సౌకర్యములకును నేనెంతయో సుముఖుడను. కాని నేను భారత మైదానములగుండపోయినపుడు, ఒక్కొక్కప్పుడు, రైల్వే - ప్రయాణము నిచ్చునది-హిందూదేశమును బంధించి, ఖయిదుచేయు యినుప బంధనములుగ నాకు తోచుచుండెను.

ప్రభుత్వము పోలీసుపనినిచేయవలెననుభావమే భారతపరిపాలనపట్ల బ్రిటిషువారికుండెను. ప్రభుత్వమును రక్షించుటయే పాలకులపని. తక్కినదానిని యితరులుచేసికొనవలెను. వారి 'పబ్లికుఫైనాన్సు' పైని క్రయము, పోలీసు, సివిలుపరిపాలన, ఋణములమీద వడ్డీ-యీవిషయములకే సంబంధించును. పౌరులయొక్క ఆర్థికావసరములు చూడబడవు; అవి బ్రిటిషు ప్రయోజనములకు బలివేయబడెను. ప్రజలయొక్క విజ్ఞానాదియవసరములు (యేకొద్దిమందివోతప్ప) బొత్తిగ నిర్లక్ష్యము చేయబడెను. 'పబ్లిక్ ఫైనాన్సు'ను గురించి మార్పుచెందుచున్న భావములు యితరదేశములలో సందరకు నుచితవిద్య, ప్రజలయారోగ్యాభివృద్ధి, బీదలయొక్కయు, దుర్బల మనస్కులయొక్కయు జాగ్రత, వ్యాధి, వృద్ధాప్యము, నిరుద్యోగము మొదలగువానినుండి పనిచేయువారలనురక్షించు భీమా-ఈయన్నింటిని ప్రసాదించెను. ఇవియిచ్చటి ప్రభుత్వబుద్ధికి కేవలమగ్రాహ్యములు. ఇదిధనవ్యయమగు యీకార్యములలో జోక్యము కల్పించుకొనజాలకపోయెను. ఏలనన దానిపన్నుల పద్ధతిలోనభివృద్ధిలేదు. అదిపెద్దరాబడులమీదకంటె తక్కువరాబడుల మీద నెక్కువ మొత్తములను వసూలుచేయును; దానిసంరక్షణ ఖర్చులును, పరిపాలనఖర్చులును విపరీతహెచ్చుగనుండి యాదాయము నంతను చాలవరకు మ్రింగివేసెను.

బ్రిటిషు పరిపాలన యొక్క ప్రధానలక్షణ మేమనిన వారు దేశముమీద తమరాజకీయ, ఆర్థికాధికారమును బలపరచునట్టి ప్రతి దానిమీదను కేంద్రీకరించిరి. తక్కినదంతయు నసంగతము. వారు శక్తివంతమగు కేంద్రప్రభుత్వమును, సమర్థతగల పోలీసుదళమును సృష్టించినందులకు తమ విజయమునకు తామే మెచ్చుకొనవలెను. కాని భారతప్రజలు దానికి తమ్ము తామభినందించుకొనజాలరు. ఐక్యము శుభప్రదమైనది, కాని దాస్యములోనియైక్యము గర్వింపదగినదికాదు. ఒక

నిరంకుశ ప్రభుత్వముయొక్క బలమే ప్రజలకెక్కువభారము కావచ్చును. అనేకవిధముల నుపయోగకారియగు పోలీసుదళము తాను రక్షించుట కుద్దేశింపబడినప్రజలకు వ్యతిరేకముగ నుపయోగింపబడవచ్చును; తఱచుఅట్లేచేయబడెను. ఆధునిక నాగరికతను ప్రాచీనగ్రీసు దేశపు నాగరికతతోపోల్చుచు బెర్ట్రండురస్సెలుగారు "మనదానితో పోల్చినగ్రీసు దేశపు నాగరికతలోగల యొక్కగట్టియాధిక్యత యేదియన పోలీసుల యసమర్థత. ఇదిచాలమంది సత్పురుషులు తప్పించుకొనుట కవకాశమిచ్చెను." అనివ్రాసెను.

భారతదేశములోబ్రిటిషువారియాధిక్యత మనకు శాంతినిచ్చెను. మొగలసామ్రాజ్యమువిచ్ఛిన్నమైనతరువాత సంభవించినకష్టములు,దురదృష్టములుగతించినవెనుక భారతదేశము నిశ్చయముగ శాంతినిగోరుచుండెను. శాంతియెట్టియభివృద్ధికైనను అవసరమైన యమూల్యమగు వస్తువు. అదిసంభవించినపుడు దానిసాహాయ్యముచేతుము. కాని శాంతినికూడ మనముభరింపరానివెలకు కొనగలము. మనము శ్మశాననితాంతశాంతిని పొందవచ్చును; పంజరములేకఖయిదు ఇచ్చుసంపూర్ణభద్రతననుభవింపవచ్చును. లేక శాంతి తమబాగునుతాముచేసికొనన సమర్థులైనవారి వెర్రినిస్పృహ కావచ్చును. విదేశవిజేతలచే బలత్కారముగనొసంగబడుశాంతికి ఆనిజపదార్థములోనుండవలసిన సుఖమును, విశ్రాంతిని కలుగజేయు సుగుణములుండవు. యుద్ధముభయంకరమైనది, మానతగినది. కాని, యదికొన్నిసుగుణములను ప్రోత్సహించును. అవి మనతత్త్వవేదియగు విలియంజేమ్సుప్రకారము;- విశ్వాసము, పట్టుదల, కలయిక, శౌర్యము, తెలివి, విద్య, క్రొత్తవస్తువులను కనిపెట్టుతెలివి, పొదుపు, శరీరబలము,చురుకుదనము. ఈకారణములచే జేమ్సు యుద్ధము వలనకలుగుభీభత్సములేకుండ జాతికిగుణములనుప్రసాదింపగల దాని నైతికసామ్యముకొఱకు ప్రయత్నించెను. అసహాయోద్యమమునుగూర్చి

చియు, శాసనోల్లంఘనమునుగురించియు నతడువినియుండినచో బహుశః యతనియభీష్టమును కనుగొనియుండెడివాడు.

చరిత్రలోని 'అయితేలను' 'ఏమిజరిగెడిదో' యనుకొనుటలను గురించి చర్చించుట వ్యర్థప్రసంగము. శాస్త్ర, పారిశ్రామికపశ్చిమ ప్రపంచసంబంధము భారతదేశమునకు కళ్యాణకరమనియే నేనుభావించెదను. శాస్త్రముపాశ్చాత్యులుమనకిచ్చినగొప్పవరము. భారతదేశమునకిది కొఱతయయ్యెను. ఇది లేనిచో నది నశింపకతప్పదు. మనసంబంధముల పద్ధతిమరదృష్టమైనది. అయినను, బహుశః, యీసంఘాత పరంపరలు మాత్రమే మనలనుకుంభకర్ణనిద్రనుండి మేల్కొల్పగలిగెను. ఈదృష్టితో చూచిన ప్రొటెస్టెంటులును, 'యెవరికివారే' యనువారును, ఆంగ్లో సాక్జనులునునగుయింగ్లీషువారు దీనికర్హులు. ఇతరపాశ్చాత్యులందరి కంటెను వీరికిని మనకును నెక్కువభేదములుకలవు. కనుకమనకెక్కువ గొప్పదెబ్బలసువర్ధింపగలరు.

వారు మనకు రాజకీయయైక్యమునిచ్చిరి; అదియవసరమైనవస్తువు. కాని, మనకీయైక్యమున్ననులేకపోయిననుభారతజాతీయతయభివృద్ధిచెంది దానినికోరియుండెడిది. నేడుఅరబ్బులోకము అనేకప్రత్యేకప్రభుత్వముల క్రింద - స్వతంత్రములు, రక్షింపబడునవి, మాండేటరీలు మొదలగునవి — చీలబడినది. కాని యరబ్బీలయైక్యము కావలెనని యవన్నియును కోరుచున్నవి. పాశ్చాత్య సామ్రాజ్యాధికారములు అడ్డము రానియెడల అరబుజాతీయత యీ యైక్యమును చాలవరకుసాధించి యుండెడిదనుట కెట్టిసందేహమునులేదు. కాని హిందూదేశములో వలెనే భేదభావములను ప్రోత్సహించి మైనారిటీసమస్యలను సృష్టించుట యీ యధికారములపనియైయున్నది. ఈ సమస్యలు జాతీయ ప్రేరేపణను దుర్బలపరచి కొంతవరకు దానిశక్తిని ప్రతిఘటించును. సామ్రాజ్యాధికారము నిలిచి యుండుటకును, నిష్పక్షపాతమైన మాధ్యస్తునివలె నటించుటకును నిదియొకసాకుగ నుండును.

భారత రాజకీయ మైక్యము సామ్రాజ్యాభివృద్ధియొక్క రెండవ సామగ్రిగ నుత్పన్నమయ్యెను. తరువాత సంవత్సరములలో (ఐక్యము జాతీయతతో కలిసిపోయి విదేశ ప్రభుత్వమును సవాలుచేసినప్పుడు) భేదములను, కులసమస్యలను బుద్ధిపూర్వకముగ హెచ్చరించుటను మనము కండ్లార చూచియుంటిమి. అవి మన భవిష్యదభివృద్ధికి ప్రబల శత్రువులు.

బ్రిటిషువారు యిచ్చటకు వచ్చి యెంత చిరకాలమైనది! వారధికారమునకు వచ్చిన తరువాత నూటడెబ్బది సంవత్సరములు గతించెను. నిరంకుశ ప్రభుత్వములన్నింటికి వలెనే వారికి సర్వ స్వేచ్ఛ యుండెను. వారి కోరికల ననుసరించి భారతదేశమును తయారుచేయుట కసమానమైన యవకాశము చిక్కెను. ఈ సంవత్సరములలో ప్రపంచమంతయు, ఇంగ్లండు, అమెరికా, యూరపు, జపాను - గుర్తించుటకు వీలులేనట్లు మారిపోయెను. 18 వ శతాబ్దములో ఆంగ్లాంశకు సంకెట్టుకొని యుండిన నామరూపములులేని అమెరికను కాలనీలు నేడు ప్రపంచములో నసమాన వైభవము, సత్యంశక్తివంతము, శాస్త్రములో విశేషాభివృద్ధిగల జాతియయ్యెను; జపాను త్రుటికాలములో నద్భుతమగు మార్పులను పొందెను; నిన్న మొన్నటివరకును నిస్తేజమైన జారు ప్రభుత్వ హస్తముచే నభివృద్ధియంతయు నణచివేయబడి, నలిపివేయబడిన విశాలమగు యు. యస్. యస్. ఆర్. రాష్ట్రములు నేడు నూతనజీవితముతో నుద్దీపితమగుచు మన కండ్లయెదుట నొక నూతన ప్రపంచమును నిర్మించెను. భారతదేశములో కూడ గొప్ప మార్పులు కలిగెను. అది 18 వ శతాబ్దముకంటె నిపుడు చాల భిన్నముగ నున్నది. రైల్వేలు, నీటిపారుదల పనులు, ఫ్యాక్టరీలు, పాఠశాలలు, కళాశాలలు, పెద్ద పెద్ద ప్రభుత్వభవనములు యిత్యాదులు, వచ్చెను.

అయినను, యన్నిమార్పులు కలిగినప్పటికిని నేడు భారతదేశ మెట్లున్నది? వేలకొలది మైళ్ళదూరమునన్న విదేశీయులచే పాలింప

బహుచు, దాని దివ్యమైన శక్తియంతయు పంజరబద్ధమై, స్వేచ్ఛగ నూపిరి పీల్చుకొనుటకైనను సాహసింపలేక, పడియున్న బానిసదేశము; ఆమె ప్రజలు మెవరితోను పోల్చుటకు వీలులేని గర్భదరిద్రులు. అచిర జీవులు, ఆధివ్యాధులను, జాడ్యములను నెదుర్కొన నసమర్థులు; అజ్ఞానము ప్రబలము; విశాల ప్రాంతములలో నెట్టి పారిశుధ్యమును, వైద్య సహాయమును కానరావు; మధ్యతరగతులలోను, ప్రజాసామాన్యము లోను నిరుద్యోగము విపరీత ప్రమాణములో నున్నది. స్వేచ్ఛ, ప్రజా స్వామికము, సామ్యవాదము, కమ్యూనిజములు అనుభవశూన్యులగు లక్ష్యవాదులయొక్కయు, సిద్ధాంతములయొక్కయు లేక దొంగల యొక్కయు వెఱ్ఱికేకలని చెప్పబడుచుండును; ప్రజలందరును మొత్తము మీద సుఖపడుటయే నిజపరీక్ష. నిశ్చయముగ నిది ప్రధానమైన పరీక్ష. ఈ పరీక్షనుబట్టియే నేడు హిందూదేశము భయంకర దరిద్రప్రదర్శ నమును చేయుచున్నది. ఇతరదేశములలో నిరుద్యోగ సమస్యలను, దుఃఖనివారణకును సంబంధించిన గొప్ప స్కీములను గురించి విందుము; మన లక్షలకొలది నిరుద్యోగులైనవారియొక్కయు, విశాల వ్యాప్తి చెంది, శాశ్వతమైపోయినట్టియు దుఃఖము సంగతి యేమికావలెను? ఇతర చోట్ల జరుగుచున్న యిండ్లస్కీములను గురించి కూడ మనము చదువు చుందుము; మట్టిగుడిసెలలో నివసించునట్టియు లేక నే యిండ్లును లేక నల్లాడునట్టియు మన లక్షలకొలది ప్రజలయొక్క గృహము లెచ్చట నున్నవి? మేము యున్నచోటనే యుండి లేక తాబేలు నడక నతి కష్టనుమీద నడచుచుండ నితరదేశములలో విద్య, పారిశుధ్యము, వైద్యసహాయము, విజ్ఞాన సౌకర్యములు, ఉత్పత్తి దినదినాభివృద్ధియగు చుండుటను చూచి యసూయపడకూడదా? పన్నెండు సంవత్సరముల స్వల్పకాల యుత్కృష్ట ప్రయత్నముచే రషియాదేశము తన విశాల రాష్ట్రములలో నజ్ఞానమును రమారమి నశింపచేసి, ప్రజాజీవితముతో సంబంధము గల యొక చక్కని యాధునిక విద్యావిధానమును వృద్ధి

చేసెను. వెనుకపడియున్న టర్కీకూడ ముస్తఫా కెమల్ పాషాయొక్క నాయకత్వము క్రింద విద్యలో విశేషాభివృద్ధిని గాంచెను. ఫ్యాసిస్టు యిటలీ, తన యధికారమును ప్రారంభించుటతోడనే, విద్యావిహీనతపై దాడి వెడలెను. విద్యామంత్రియైన జెంటైలు "యజ్ఞానమును ముందర నుండి యెదుర్కొనవలెను. మన రాజకీయ శరీరమును తినివేయుచున్న యీరాచపుండును యెఱ్ఱని యినుపకడ్డీతో కాల్చివేయవలెను" అని యాజ్ఞాపించెను. ఇవి పిరికికాగారమునకు తగని పరుషవాక్యములు; కాని యివి యీభావము వెనుకనున్న విశ్వాసమును, శక్తిని విశదము చేయును. మన మిచ్చట నెక్కువ పెద్దమనిషి తరహా చూపుచు విశేష లలితపదజాలము నుపయోగింతుము. మన మతిజాగ్రతగ సంచరించుచు మన శక్తులను కమిషనులలోను, కమిటీలలోను వ్యయపరచెదము.

భారతీయులు మాటల పోగులనియు, కార్యశూన్యులనియు నొకయపవాదము కలదు. ఇది యుక్తమైన నేరము. కాని కమిటీలకును, కమిషనులకును బ్రిటిషువారికిగల యనంతశక్తికి మన మాశ్చర్యమును వెలిబుచ్చకూడదా? ప్రతికమిషను చాలకాలము కష్టించిన తరువాత నొక ప్రతిభావంతమగు నివేదకను "ఒక గొప్పప్రభుత్వ పత్రమును" తయారుచేయును. ఇది సక్రమముగ స్తుతింపబడి భద్రముగ నేగూటిలోనో దాచబడును. కనుక మనము ముందుకుపోవుచున్నట్లు అభివృద్ధిచెందుచున్నట్లు భావింతుము; అయినను మనమున్న చోటనే యుండిపోవుచున్నారము. 'గొప్పతనము' తృప్తినొందుచున్నది, ఉన్నప్రయోజనములు భద్రముగ చలనములేకుండ నిలిచిపోవుచున్నవి. మనము చాల వేగముగ పోవుదుమను భయముతో వారణములు, బ్రేకులు, రక్షణలు మొదలగువానినిగురించి చర్చింతుము.

"మొగల పరిపాలననాటి సామ్రాజ్యవైభవమే ప్రజలదారిద్ర్యమునకు ప్రమాణము" అని 1934 జాయింటు పార్లమెంటరీ కమిటీ

చెప్పుచున్నది. అది యుక్తమయిన విమర్శ, పరీక్ష. కాని మా ప్రమాణమునే మనము నేడును వర్తింపచేయగూడదా ? వైస్రాయిగారి వైభవప్రదర్శనములతోఁగూడిన నేటి నూతన ఢిల్లీ సంగతియేమిటి ? విశేషాండంబరముతోఁగూడిన రాష్ట్రగవర్నరుల సంగతియేమిటి ? ఆశ్చర్యకరమగు గర్భదారిద్ర్యమొకప్రక్క వేధించుచుండ నీయాడంబరమా ! ఈవ్యత్యాసము బాధకరముగ నుండును. హృదయముగల వ్యక్తులు దీనిని నెట్లు సహింపగలరో యోచించుట దురూహ్యముగ నున్నది. పైకి కాన్పించు సామ్రాజ్యవైభవముల వెనుకనున్న భారతదేశము దరిద్రభూయిష్టము, దుఃఖపూరితము. ఇది యంతయు నతుకులపని; మెరుగుపూతలు. వీనివెనుక నాధునికపరిస్థితులచే నంతకంతకు కృంగిపోవుచున్న చిన్నబూర్జువాలు కలరు. ఇంకను వెనుక పచ్చిదరిద్రముతో దుఃఖమయజీవితములను గడుపు పనివాండ్రు కలరు. తరువాత "అనంతయంధకారము కొనకు ఫుట్టిన" బీదవ్యవసాయదారు (భారతదేశచిహ్నము) కలడు.

“శతాబ్దానేకముల భారముచేకృంగి యతడు తన తొళ్ళకపై నాధారపడి భూమివైపు తేరిపారిచూచును. అతని ముఖమున యుగములనాటి శూన్యత తాండవించును; వీపున ప్రపంచభారము గోచరమగును.

“... .. ఈ భయంకరాకారముగుండ బాధపడిన యుగములు వీక్షించును. వంగినమానవుము కాలవిషాదచరిత్రను తెలుపును. దోచుకొనబడిన, ద్రోహముచేయబడిన, యాస్తి లాగుకొనబడిన మానవలోకమీభయంకరరూపముద్వారా ప్రపంచమును సృష్టించినశక్తులకు తమ నిరసనను నెలిబుచ్చును. ఈనిరసనమే జ్యోతిషముకూడనగును.”

భారతదేశములోనున్న దోషములన్నింటిని బ్రిటిషువారి పయి రుద్దుట మూర్ఖత్వము. ఆ బాధ్యతను మనము వహింపవలెను. మనము

దానినుండి తప్పించుకొనుటకు వీలులేదు. మన నిర్బలత్వముచే విధాయకముగ సంభవించిన ఫలితములకు నితరులను నిందించుట యుక్తముకాదు. అధికారమునే వాంఛించు ప్రభుత్వపద్ధతి, ముఖ్యముగ విదేశప్రభుత్వము, విధేయతనే దోహదముచేయు చిత్తవృత్తినే ప్రోత్సహింపవలెను; ప్రజలయొక్క మానసికదృష్టిని, యావరణను తగ్గించుటకు ప్రయత్నము చేయవలెను. అది యువకులలోనున్న శుభావహలక్షణముల నన్నింటిని - యుత్సాహము, ధైర్యసాహసములు క్రియాశక్తి 'వీర్యము' - నలిపివేయవలెను. నైచ్యమును, బల్లివలె నంటిపెట్టుకొని యుండుటను, యజమానులను ఆశ్రయించుట, సంతోషపెట్టుట మొదలగు భావములనే ప్రోత్సహింపవలెను. అటువంటి పద్ధతి నిజమైన సేవ చేయవలెననెడి చిత్తవృత్తిని ప్రజాసేవయెడల లేక లక్ష్యముల యెడల భక్తిని పురిగొల్పజాలదు; అది ప్రజాసేవయందెంతమాత్రము నుత్సాహములేక నేదోవిధముగ పొట్టపోసికొనుటయే యాశయముగ పెట్టుకొనినవారినే తీసికొనును. భారతదేశములో బ్రిటిషువారెట్టి తరగతి మనుష్యులను జేరదీసెదరో మనము చూచుచునే యున్నాము. వారిలో కొందరు బుద్ధిబలముకలిగి మంచిపనిచేయగల సమర్థులుకలరు. వారికితరత్రనెట్టి యవకాశమును లేకపోవుటచే ప్రభుత్వసేవకో లేక అర్థప్రభుత్వసేవకో యొడంబడుదురు. క్రమముగ వారిచురుకుపాలు తగ్గిపోయి వారి మనస్సులు సారములేని నిత్యకర్మచే బంధింపబడి యాపెద్దయంత్రములో నాను యుక్తభాగములుగ నిమిడిపోయెదరు. వారు నిరంకుశత్వముకు కావలసిన గుణములను "గుమాస్తాపదవికి తగిన జ్ఞానమును ఆఫీసును నడపగల రాజకీయకళను-వృద్ధిచేయుదురు. విశేషముగనున్నచో ప్రజాసేవయందు వారికి మానసికముగ భక్తియుండవచ్చును; ప్రజ్వలించునట్టి యుత్సాహముండదు, ఉండజాలదు. విదేశప్రభుత్వము క్రింద నిది సాధ్యముకాదు.

పీరుమినహా, చిన్నయధికారులలో చాలమంది యెన్నదగిన వారుకారు. వారు తమ పైయధికారుల నాశ్రయించుటయు, క్రింద వారిని బాధించుటయు మాత్రమే యెరుగుదురు. ఈదోషము వారిది కాదు. అది యీపద్ధతివలన కలుగు శిక్షలోనున్నది. మన దేశములో తఱచుకాన్పించునట్టి యాశ్రయింపు జీవితములోను, బంధువులకుద్యోగ ములనిచ్చు పక్షపాత యాచారములోను నాశ్చర్యమేమియున్నది? సేవ చేయుటకు వారికెట్టి యాదర్శములునులేవు; నిరుద్యోగ పిశాచమును, తత్ఫలితమగు నాకలిబాధయు వారిని వీడకుండును. కనుక వారి యుద్యో గముల కంటిపెట్టుకొని యుండుటయు, వారిబంధువులకును, స్నేహితు లకును పదవులనిప్పించుటయు వారిప్రధాన తాపత్రయము. వేగుల వారును, జీవకోటిలో నధముదునగు వార్తలనందించువారును వెనుక నెల్లపుడును తిరుగుచుండుచోట్ల ప్రజలలో నత్యంతవాంఛనీయములగు సుగుణములను వృద్ధిచేయుట సులభమైనపనికాదు.

ఈ మధ్య జరిగిన మార్పులవలన ప్రజాసేవయందభిరతికల వారును, హృదయముకలవారును ప్రభుత్వసేవలో జేరుట మరింతకఠిన మయ్యెను. ప్రభుత్వమువారికట్టివారు అవసరములేదు. ఆర్థికముగ తప్పనిసరియైనగాని వారును ప్రభుత్వసంపర్కము నంగీకరింపరు.

కాని సామ్రాజ్యభారమును నల్లవారుకాక తెల్లవారు భరించు చున్నట్లు ప్రపంచమంతయు నెరుగును. సామ్రాజ్య సాంప్రదాయ మును నిర్వహించుటకు మనకు వివిధసామ్రాజ్యశాఖలు గలవు. వాటి ప్రత్యేకహక్కులను (అన్నియు భారతదేశ ప్రయోజనములకొరకే యని మనకుచెప్పుదురు) కాపాడుటకు అనేక సంరక్షణలుకలవు. ఈ శాఖలయొక్క ప్రయోజనములతోను, అభివృద్ధితోను భారతకళ్యా ణము ముడిపెట్టబడుట గమనింపదగిన విషయము. ఐ. సి. యస్. యొక్క ప్రత్యేకహక్కుకాని, పెద్దపదవికాని తీసివేయబడినచో నసమర్థతయు,

నవీనరీతియు ప్రజలుసని చెప్పుదురు. ఐ. యం. యస్.కొఱకు ప్రత్యేకింప బడిన పదవులను తగ్గించినచో "భారతదేశముయొక్క యారోగ్యమునకు భంగముకలుగును". సైన్యములోని బ్రిటిషు యుద్యోగులను ముట్టిరిపూ మనల నన్నివిధములగు భయంకర యుపద్రవములును ముట్టడించును.

ఇందులో కొంతసత్యమున్నదని నేననుకొనెదను. పైపెద్దయధి కారులు హఠాత్తుగా వెళ్ళిపోయి తమశాఖలను క్రిందివారికి విడిచివేసిన యెడల సమర్థత తగ్గిపోవును. కాని యాపద్ధతియట్లు నిర్ణయింపబడుటయే దీనికికారణము. క్రింది యధికారులెంత మాత్రమును శ్రేష్ఠులుకారు. బాధ్యతను వహించుటకు వారికెట్టి యవకాశములును యీయబడలేదు. భారతదేశములో శ్రేష్ఠమైన బుద్ధిబలసంపన్నులు కావలసినంతమంది యున్నారని నేను విశ్వసించెదను. తగినచర్యను తీసికొనినచో వారనతి కాలములోనే యుపయోగింతురు, తయారుకాగలరు. కానిదానికి మన ప్రభుత్వ, సాంఘికదృష్టులలో సంపూర్ణ పరివర్తనము కలుగవలెను. అనగానొక నూతన ప్రభుత్వ మేర్పడవలెను.

ప్రస్తుతము చట్టములలో నెట్టిమార్పులువచ్చినను మనలను రక్షించునట్టియు, మనకు నీడనిచ్చునట్టియు పెద్దయుద్యోగముల నెడి 'యుక్కుచట్టము' మామూలుగనే సాగుచుండునట! పవిత్రప్రభుత్వ రహస్యసంరక్షక మతాధిపతులగువీరు ఆ గర్భగుడిని కాపాడుచు నీచుల నాపవిత్రయావరణములోనికి రాకుండ వారించెదరు. మనకీయబడిన హక్కులకు అర్హులమని మనమురుజువుచేసినచో క్రమముగ వారొక్కొక్క తెరనుతీసివేయుచుచివరకెప్పుడోభవిష్యద్యుగములోనాశ్చర్య చకితములును, భక్తిపురస్సరములునగు మననయనముల కాయత్యంత పవిత్ర పదార్థముకూడ బహిర్గతమగునట!

ఈసామ్రాజ్యశాఖలన్నింటిలోను ఐ. సి. యస్. కు అగ్రస్థాన మీయబడెను. ప్రభుత్వము భారతదేశములో నడుచుటకుగల కీలక

యపకీర్తి చాలవరకు వీరికేముట్టవలెను. ఈశాఖయొక్క గుణగణము లనుగురించి మనకనేకసార్లు చెప్పబడెను. సామ్రాజ్యస్కీములో దాని యుత్కృష్టత యొకసామెతయయ్యెను. భారతదేశములో దానికన్న యప్రతిహతమగు నధికారపదవియు, నీపదవి ప్రసాదించు (రమారమి) నిరంకుశాధికారమును, దీనినిగురించి చేయబడు విశేషప్రొగడ్తలును నెట్టివ్యక్తియొక్కయు, వర్గముయొక్కయు మానసికస్వాస్థ్యమునకును కేవలము శ్రేయస్కరములుకాజాలవు. ఈశాఖయెడల నాకెంత యభిమానమున్నను యిదివ్యక్తిగతముగను, మొత్తముమీదను ఆత్మస్తుతి యనువ్యాధికి (పురాతనమైన దేమైనను కొంతయాధునికమైనదే) లొంగిపోయెనని చెప్పకతప్పదు. ఐ. సి. యస్. యొక్క సుగుణములను నిరాకరించుట వృథాయాసము; ఏలనన వానిని మరచిపోనీయరు. కాని యాశాఖనుగురించి శుష్కోపన్యాసములు గావింపబడెను, యింకను గావింపబడుచున్నవి. కనుక నీజోరును తగ్గించునట్లుచేయుట యవసరమని నేనొక్కొక్కప్పుడు భావించుచుందును. వెబ్లెనుఅను నమెరికా దేశపు యార్థికశాస్త్రవేత్త హక్కులుగల తరగతులను "ఉంపుడుతరగతులు" అనిపిలిచెను. ఐ. సి. యస్. ను, యితరసామ్రాజ్యశాఖలను "ఉంపుడు శాఖలు" అనిపిలుచుటలోగూడ సంతసత్యముగలదని నేనుభావించెదను. అవిచాల వ్యయకరమైన విభవములు, భోగములు.

మేజరు డి. గ్రహాంపోలు (ఒకప్పుడు బ్రిటిషుపార్లమెంటులో లేబరుసభ్యుడు) భారతదేశ వ్యవహారములలో నెక్కువశ్రద్ధతీసికొనుచుండెడివాడు. అతడు కొంతకాలముక్రిందట మోడరన్‌రివ్య్యూ పత్రికకు వ్రాయుచు నిట్లుచెప్పెను. "ఐ సి. యస్. శాఖ చాల సమర్థమైనది, పటుత్వమైనది అనుసంశయము నెవరును కాదనుటకెన్నడును ప్రయత్నించియుండలేదు." ఇట్టిసెటిల్‌మెంటులే యింగ్లండులో తఱచు చేయబడుచు విశ్వసింప బడుచుండుటచే దీనిపరీక్షించుట ప్రయోజనకరము. ఇట్టి

యుద్ధమిషమును, నిశ్చితములైన స్టేటుమెంటులనుచేయుట యెప్పుడును భద్రముకాదు. ఈవిషయము నిరాకరింపబడలేదని మేజరు గ్రహాంపోలు భావించుట చాలపొరపాటు. దీనిని తఱచు సవాలుచేయుచు నిరాకరించుచునే యుండెను. చాలకాలముక్రిందటనే గోఖేలుగారుకూడ ఐ. సి. యస్. నుగురించి చాలకఠినవిషయములనుచెప్పెను. సామాన్య భారతీయుడు- కాంగ్రెసువాదియైనను కాకపోయినను - మేజరుగ్రహాం పోలుతో డీకొనగలడు, డీకొనును. అయినను వారుభయులును కొంత వరకు యుక్తముగనేయుండి వివిధవ్యవస్థలనుగురించి యోచించుకొనుచుండవచ్చును. శక్తిసమర్థతలు దేనికొరకు? బ్రిటిషుసామ్రాజ్యమును హిందూదేశములో బలపర్చుటకును, దేశముకొల్లగొట్టుటకు దానికిసహాయము చేయుటకును నైనయెడలనిశ్చయముగ ఐ. సి. యస్. బాగుగనేపనిచేసెను. కానిభారతప్రజల సౌభాగ్యమే నిక్కమైనపరీక్షయైన యెడల వారుపూర్తిగవిఫలులైరి. ఏప్రజలనుండి తమకు వివిధజీతములు వచ్చుచున్నవో యట్టిప్రజలకును వీరికిని రాబడిచేతను, జీవితప్రమాణము చేతను గలదూరమును చూచినచో నీవిఫలత మఱింత స్పష్టము కాగలదు.

ఈశాఖమొత్తముమీద నొకవిధమగు ప్రమాణమును (అది విధాయకముగ మధ్యరకప్రమాణమే యైనను) నిలిపెననుట పూర్తిగ యథార్థము. అప్పుడప్పుడది యసాధారణ ప్రజ్ఞగలవారినిచ్చుచుండెను. ఇట్టి యేశాఖనుండియైనను నింతకంటెనెక్కువనుపూహింపరాదు. బ్రిటిషు పబ్లిక్‌స్కూళ్లుయొక్క తత్త్వమునిది ప్రధానముగ (దానిలోనున్న మంచిచెడ్డ విషయములతోసహా) యలవర్చుకొనెను. ఇదియొకమంచి ప్రమాణమును నిలిపినను యీమాదిరిని దాటివెళ్లుట కంగీకరింపదు. ప్రత్యేకవ్యక్తులయొక్క ప్రత్యేకశక్తిసామర్థ్యములు దినచర్యయొక్క నిర్జీవ 'తంతులో' నాశనమగుచుండెను; లెక్కసరాసరికంటెవేరుగకన్పించు

ననుభయముచే కొంతవరకుపోయెను. నిజాయితీ శ్రద్ధకలసభ్యులు, సేవను గ్రహించినవారు, చాలమందికలరు. కానియీసేవ సామ్రాజ్యముయొక్క సేవ; భారతదేశము దానితరువాత విధిలేకవచ్చును. వారికీయబడిన శిక్షనుబట్టియు, వారుండు పరిస్థితులనుబట్టియు వారట్లేప్రవర్తింపగలరు. వారు స్వల్పసంఖ్యాకులగుటచేతను, విజాతీయులును, తఱచు అమిత్రములునునగు ప్రజల మధ్యనుండుటచేతను నేకీభావముకలిగియేకవిధమగు ప్రమాణమును నిలిపిరి. తమజాతియొక్కయు, పదవియొక్కయు గౌరవమును నిలుపుకొనుటకిది యవసరము. వారికి నిరంకుశాధికారములు చాలవరకుకలవు; కనుక నెట్టివిమర్శనైనను వారునిరాకరించి దానినిమహాపాపముగ భావించి, యంతకంతకుసహనమును కోల్పోయి, బెత్తమును ఝుళిపించు బడిపంతుళ్ళును, బాధ్యతలేని పరిపాలకులకుండు దోషములకలవడి పోయిరి. పరివర్తనము చెందుచున్న ప్రపంచములో వారాత్మసంతృప్తిగల సంకుచిత, స్థిరచిత్తులై యభివృద్ధిచెందుచున్న వాతావరణమునకెంతమాత్రమును తగనివారైరి. తమకంటెసమర్థులును, అవసరములనుగుర్తించినడవగలవారును భారత సమస్యలను చేబట్టినప్పుడు వీరు కోపించిరి. వారిని నిందించి, వారిననచివేసి, వారికనేక యడ్డంకులను కల్పించిరి. యుద్ధానంతర పరివర్తనములు అపూర్వపరిస్థితులను తెచ్చిపెట్టినప్పుడు వారు వాటితో తూగలేక కర్తవ్యవిమూఢులైరి. అల్పావధిగలది, అతినిబద్ధమైనదియగు వారివిద్య నూతనపరిస్థితులకును, అత్యవసరములకును తగినట్లు వారిని తయారుచేయలేదు. చిరకాలాబాధ్యతవలన వారు చెడిపోయిరి. మొత్తముమీద వారికి సంపూర్ణాధికారము (సిద్ధాంతములో మాత్రము బ్రిటిషు పార్లమెంటు వశములో నుండురు) కలదు. "అధికారము అవినీతిని కలిగించును" అని ఆక్టను ప్రభువుచెప్పెను. "సంపూర్ణాధికారము మరింత సంపూర్ణయవినీతిని కలిగించును."

వారి సంకుచితమార్గములో వారు, మొత్తముమీద, విశ్వసింప దగిన యుద్యోగులు; వారు నిత్యకృత్యములను తగినంత సమర్థతతో (విశేష ప్రజ్ఞ లేకుండ) చేసికొనెదరు. కాని వారి శిక్షయే యట్టిదగు టచే నెంతమాత్రము నూహింపబడని పరిస్థితులు వచ్చినపుడు వారు (యాత్మవిశ్వాసము, క్రమము ననుసరించు ప్రకృతి, తమ జాతియందు గల యభిమానము సన్నిహిత కష్టములను తరించుటకు సహాయపడినన) డిల్లపోవుదురు. విఖ్యాతిగాంచిన మెసపటోమియా దౌర్భాగ్య సంభవము బ్రిటిషు యిండియను ప్రభుత్వముయొక్క యసమర్థతను 'బరిబిగి యుటను' వెల్లడిచేసెను. కాని యిట్టి యనేక సంభవములు సూర్య కాంతి నెరుగక నెన్నిమరుగుపడియుండెనో! శాసనోల్లంఘనము పట్ల వారి ప్రతీకారము కూడ మోటుగి నుండెను. ప్రతిపక్షులను కాల్చి వేయుట, బాదుటవలన కొంతకాలము వారిని ఘాటింపవచ్చును. కాని దానివలన నే సమస్యయు పరిష్కరింపబడజాలదు. అది యేయాధిక్య తను రక్షించుట కుద్దేశింపబడెనో దానినే నాశముచేయును. వృద్ధియగు చున్న తీవ్రజాతీయోద్యమము నెదుర్కొనుటకు వారు దౌర్జన్యము నవల బించుటలో నాశ్చర్యములేదు. అది విధాయకము. సామ్రాజ్య ములు దానిమీదనే నిలుచుచున్నవి. ప్రతిపక్షము నెదుర్కొనుటకు వారి కింకొక మార్గము చూంపబడలేదు. కాని యనవసరమును, అత్యధి కమును నగు దౌర్జన్యము నుపయోగించుట పరిస్థితులు వారి చేతిలో నుండి జారిపోయినట్లు విశదము చేసెను. మామూలు పరిస్థితులలో వారికుండునట్లుకాన్పించిన నిగ్రహమును, ఆత్మసంయమమును వారిపుడు కోల్పోయిరి. తఱచు వారి నాడులు సడలిపోయెను: వారి బహిరంగ యుపన్యాసములలో గూడ హిస్టీరియా (మూర్ఛ) చిహ్నము కాన్పించెడిది. గత కాలము నాటి ప్రశాంత విశ్వాసము గతించెను. సంధిగ్ధసమయము నిర్దాక్షిణ్యముగ మనలసందరను బహిర్గత మొనర్చి మన యత్యంతాంతరంగిక దుర్బలత్వములను ప్రదర్శించును. శాసనో

గ్లాంఘున మట్టి సమయము, అట్టి పరీక్ష. చాల కొద్దిమంది (యిరుపక్షము లలోను-కాంగ్రెసు, ప్రభుత్వము) మాత్రమే యీ పరీక్షకు పూర్తిగ నిలువగలిగిరి. యథార్థమైన ప్రతిభావిశేషములు కలవారు (స్త్రీలును, పురుషులును) కొద్దిమందియే యుందురని సంధిగ్ధసమయములో కనుగొన బడునని లాయిడ్ జార్జిగారు చెప్పుచున్నారు. "తక్కినవారు సంధిగ్ధ సమయములలో లెక్కకు రారు. ప్రశాంతసమయములో గుట్టలవలె కాన్పించు యిసుకతిన్నెలు, గొప్ప వరద వచ్చునపుడు మునిగిపోయి నీటిపయినుండు యున్నతశిఖరములు మాత్రమే కాన్పించును."

ఐ. సి. యస్. వారు విద్యచేతను, భావములచేతను దేశములో సంభవించినదానికి తయారుగ నుండలేదు. వారికీయబడిన యసలు శిక్ష సాహిత్యవిద్య. అది వారికొకవిధమగు విజ్ఞానమును, శోభను యిచ్చును. అది విక్టోరియారాణికాలమునకు తగిన పాతప్రపంచసాంప్రదాయము. అది యాధునికపరిస్థితుల కెంతమాత్రమును పనికిరాదు. వారుసంకుచిత మైన తమ స్వంతప్రపంచములో-ఆంగ్లో ఇండియను-యిది హిందూదేశ మునుకాదు, యింగ్లండునుకాదు-జీవింతురు. తమసమకాలీకసంఘములో పనిచేయుచున్న శక్తులను వారు గుర్తింపజాలరు. భారతప్రజలయొక్క ధర్మకర్తలము, సంరక్షకులము అను వినోదకరమగు సధికారమును చలాయించుచున్నను వారు వారినిగురించి యేమియు నెరుగరు; కాలు దువ్వునట్టి నూతన బూర్జువాలనంతకంటె యెరుగరు. వారు తమ చుట్టునుద్యోగ్యములకొరకును, యిచ్చకముల కొరకును మూగుచుండు వారినిబట్టి భారతీయులను విమర్శింతురు; తక్కినవారిని యాందోళన కారులని దొంగలని త్రోసివేతురు. యుద్ధానంతరము ప్రపంచమంత టను జరిగిన పరివర్తనములనుగురించి. ముఖ్యముగ నార్థికప్రపంచమును గురించి వారికున్నజ్ఞానమతిస్వల్పము. వారు తాము పోవునట్టి రథచక్ర మార్గములలో నిరుకుకొనిపోయి మార్పుచెందుచున్న పరిస్థితులకు తగి

నట్లు లేవజాలకున్నారు. తాము ప్రాతినిధ్యమును వహించు పీఠము ఆధునికపరిస్థితులకు తగియుండలేదనియు వారంతకంతకు మొత్తము మీద టి యస్. ఇలియటు 'శూన్యమైన మానవులు' అను పుస్తకములో వర్ణించిన మాదిరిని జేరుచున్నారనియు గుర్తింపరైరి.

అయినను బ్రిటిషు సామ్రాజ్యము సాగునంతకాలము యీ పీఠము సాగుచునేయుండును. ఇది యింకను శక్తివంతముగ నున్నది, సమర్థులును ప్రతిభకలవారును నగు నాయకులను కలిగియున్నది. భారతదేశములోనున్న బ్రిటిషుప్రభుత్వము గుల్లబారిపోవుచున్న దంతమువలె నున్నది; కాని యింకను దంతవరుసలో పాతుకొని యున్నది. దాని బాధ హెచ్చుగనున్నది కాని దానిని సులభముగ పీకుటకువీలులేదు. దానిని పీకివేయువరకు లేక దానంతటది పడిపోవువరకు నాబాధ తగ్గక మరింత యధ్వాన్నముకావచ్చును.

ఇంగ్లండులోకూడ పబ్లికుస్కూలు పద్ధతి రోజులు గతించెను. దానికన్న పూర్వప్రస్థానము నేడులేదు. హిందూదేశములోనిది మరింత యప్రస్తుతము. ఇది తీవ్రజాతీయతతోగాని సాంఘికమార్పుల కొరకు పనిచేయువారితోగాని సరిపెట్టుకొనజాలదు; వానితో సహకారము చేయజాలదు.

ఐ. సి. యస్ వారిలో, యింగ్లీషువారిలోను భారతీయులలోను చాలమంది యుత్తములుకలరు. కాని ప్రస్తుతపద్ధతి నడచునంతకాలము వారియోగ్యత భారతప్రజల కుపయోగింపని విషయములకే వినియోగింపబడును. ఈ శాఖలోని కొందఱు భారతసభ్యులు యీ పబ్లిక్ స్కూలు తత్త్వముతో తన్మయత్వమునొంది రాజభక్తిలో నసమానులగుదురు. తననుగురించి యున్నతాభిప్రాయముకల (ఇందులో నేనతనితో నేకీభవింపజాలకపోతిని) యొక యుత్సాహవంతుడగు భారత ఐ. సి. యస్. సభ్యుని నేనొకసారి కలుసుకొంటిని. అతడు తన శాఖకు

సంబంధించిన యనేక సుగుణములను వర్ణించి వర్ణించి బ్రిటిషుసామ్రా జ్యమును సమర్థించుచు అదిరోమను సామ్రాజ్యము కంటెను, చెంగీ జుఖాను, తైమూరుల సామ్రాజ్యములకంటెను శ్రేష్ఠమైనది కాదా? యను ప్రత్యుత్తర మక్కరలేని వాదముతో ముగించెను.

తమధర్మముల నతిసమర్థతతో నిర్వహించుచున్నారనియు కనుక తమ హక్కులను (అవి వివిధములును, అనేకములునునై యున్నవి) నొక్కివక్కాణించుట యోగ్యమేయనియు ఐ. సి. యస్. శాఖవారి తలంపు. హిందూదేశము బీదదేశమైనచో అది దానియొక్క సాంఘి కాచారములయొక్కయు, దాని బనియాలయొక్కయు, వడ్డీవ్యాపార స్థులయొక్కయు, అన్నిటికంటెను అసంఖ్యాకులగు ఆప్రజలయొక్కయు దోషము. అందరికంటెను గొప్ప బనియాయగు భారతదేశములోని బ్రిటిషు ప్రభుత్వముసంగతి చల్లగ జారవిడువబడును. వారి ప్రజలను గురించి యేమిచేయగోరుచురో నేనెరుగను. ఏలనన కఱవులు, జాడ్య ములు, సాధారణముగ నెక్కువ మరణములు మొదలగునవి విశేష సహాయము చేసిననుగూడ జనాభా విస్తరించుచున్నది. జనన నిరోధము సూచింపబడెను. ఈపద్ధతులును, దానిని గురించిన జ్ఞానమును వృద్ధి పొందవలెననెడి వారలలో నేనొకడను. కాని యీపద్ధతుల నుపయో గించుటకే ప్రజల జీవితప్రమాణము చాల హెచ్చుగ నుండవలెను; కొంత సామాన్య విద్యయుండవలెను. దేశమంతటను నసంఖ్యాకులగు వైద్యులుండవలెను. ప్రస్తుత పరిస్థితులలో జననిరోధపద్ధతులు ప్రజల కెంతమాత్రము నందుబాటులో లేవు. మధ్యతరగతులవారు యీలాభ మును పొందవచ్చును. వారట్లు చేయుచున్నారని నేను విశ్వసించెదను.

జనాభా విస్తారముగ పెరిగిపోవుచున్నదను వాదమును మరి కొంచెము తర్కించవలసియున్నది. నేను ప్రపంచమంతటనుగల సమస్య యాహారముగాని, తదితర ముఖ్యపదార్థములుగాని లేకపోవుటకాదు.

తినువారు లేరు అనగా ఆహారము మొదలగువానిని కొనుక్కొనగలశక్తి యున్నాతురులకులేదు. ప్రత్యేకముగ హిందూదేశమునుగురించి యోచించినను అన్నలోపములేదు. ప్రజాభివృద్ధియైనను, యాహారసరఫరాకూడ పెరగెను; జనాభా పెరిగినకొలది యదియంతకంటె నెక్కువగ పెరగగలదు. భారతదేశములో జనము మితముగా పెరిగిపోవుచున్నారని పెద్దగోలచేయబడును. చాల పాశ్చాత్య దేశములతో పోల్చిచూచినయెడల (గత శతాబ్దములోతప్ప) నిది చాలతక్కువ. భవిష్యత్తులో నెక్కువభేదముండుననుసంగతి యథార్థము. జనాభివృద్ధినరికట్టుటకు లేక నాపివేయుటకుకూడ పాశ్చాత్య దేశములలో ననేక వివిధశక్తులు పనిచేయుచున్నవి. హిందూదేశములోకూడ దానిని తగ్గించుశక్తులు వృద్ధియగు సూచనలుగలవు.

హిందూదేశము స్వాతంత్ర్యమును సంపాదించినతోడనే, తన నూతన జీవితమును తనయిష్టప్రకారము నిర్మించుకొనగలశక్తి కలుగుటతోడనే, యది, విధాయకముగ తనపుత్ర శ్రేష్ఠులను, పుత్రికారత్నములను యీపనికి వినియోగించును. శ్రేష్ఠమైనమానవసృష్టి యెల్లప్పుడును స్వల్పముగనేయున్నది. బ్రిటిషుప్రభుత్వముక్రింద హిందూదేశములో (మనకవకాశములులేకపోవుటచే) నదిమరింతస్వల్పమయ్యెను. మనపబ్లిక్ కార్యములకుచెందిన యనేకశాఖలకు మనకు చాలమంది విదేశ నిపుణుల సహాయమెంతయో యవసరము; ప్రత్యేకముగ సాంకేతికమైనట్టియు, శాస్త్రీయమైనట్టియు జ్ఞానమవసరమైన వానికత్యవసరము. ఐ. సి. యస్. లోను యితరసామ్రాజ్యశాఖలలోను పనిచేసినవారిలో చాలమంది (భారతీయులును, విదేశీయులును) యీనూతనక్రమమునకవసరము; వారాసహాయముచేయబడుదురు. కాని ఐ. సి. యస్. తత్త్వము మనపాలకవర్గములోను, మనపబ్లిక్ శాఖలలోను జీర్ణించియుండునంతకాలము భారతదేశములో నేనూతనక్రమమును నిర్మింపబడ

జాలదని నేనుదృఢముగ చెప్పగలను. అధికారపూరితమగు నాతత్త్వము సామ్రాజ్యతత్త్వమునకు తోడునీడ; స్వాతంత్ర్యముండుచోట నదియుండ జాలదు. అది స్వాతంత్ర్యమునైనను నలిపివేయును, లేదా యదియే తుడిచి వేయబడును. అది ఫాసిస్టు ప్రభుత్వమునకే సరిపడగలదు. కనుక మనము నూతన క్రమముక్రింద యథార్థమైన పనిని ప్రారంభించుటకు పూర్వము ఐ. సి. యస్. అట్టి శాఖలు (ప్రస్తుతమున్న రూపములో) పూర్తిగ మాయమగుట యత్యవసరమని నాకుతోచును. ఈశాఖలకు చెందిన వ్యక్తులు వారికిష్టముండి, వారు సమర్థులైనయెడల, నూతనషరతులకొప్పుకొను పద్ధతిమీదనే యాహ్వానింపబడుదురు. నేడు వారికీయ బడుచున్న విపరీత జీతములును, అలవెన్సులును యివ్వబడునని కల లోనైనను తలంపరాదు. తాము సేవించు ధర్మముపట్ల పరిపూర్ణ విశ్వాసమును, దానిని సాధింపవలెననెడి పూనికయుగలిగి, గొప్ప జీతములయందలి మోహముచేతగాక దానిలోనున్న యానందము కొరకును, దాని ప్రఖ్యాతి కొరకును శ్రద్ధయు సమర్థతయు గలిగి పనిచేయు సేవకులే నూతనభారతమును సేవింపసమర్థులు. ద్రవ్యాపేక్ష చాలతక్కువకు దిగవలెను. విదేశస్థులైన సహకారుల యవసరము యోచింపబడును. కాని సాంకేతికజ్ఞానములేని సివిలుపరిపాలకులు అందరి కంటె తక్కువ వాంఛనీయులని నేనూహించెదను. భారతదేశములో నట్టివారికి కొఱతలేదు.

భారతలిబరలులును, అట్టియితరవర్గములును భారతపరిపాలనను గురించి బ్రిటిషుతత్త్వము నామోదించినసంగతి నేనిదివరలో చెప్పి యుంటిని. ఈసర్వీసుల సందర్భములో నిదిముఖ్యముగ కాన్పించును. ఏల నన వారు వీనిని 'భారతీయులపరము' చేయవలెననియే గోలచేసెదరు. కాని యీశాఖలయొక్కయు, ప్రభుత్వనిర్మాణముయొక్కయు మూల ప్రకృతియు, తత్త్వమును పూర్తిగ మార్పుచెందవలెనని కోరరు; చాల

ప్రధానమగు నీవిషయములో నెంతమాత్రమును సడలుటకు వీలులేదు. బ్రిటిషుసైన్యములును, శాఖలును తగ్గినంతమాత్రముచే భారతస్వాతంత్ర్యము చేకూరనేరదు. వాని వెనుకనున్న యధికారపూరిత తత్త్వము పోవలెను. వారిజీతములును, హక్కులునుచాలతగ్గిపోవలెను. చట్టనిర్మాణము జరుగు నీదినములలో సంరక్షణలనుగురించి పెద్దకబుర్లు వినబడు చున్నవి. ఈసంరక్షణలు భారత ప్రయోజనములకొరకే యైనయెడల (ఇతర విషయములతోపాటు) ఐ. సి. యస్., ఇతరశాఖలు (వాటి ప్రస్తుతరూపములోను, వాటికున్న యధికార హక్కులతోను) అంతరింపవలెనని శాసింపబడవలెను. నూతన చట్టముతో వీనికెట్టి సంబంధమును యుండరాదు.

రక్షణశాఖలుఅనబడునవి మరింతశక్తివంతములు రహస్యములునైనవిషయములు. వానినిగురించి మనము విమర్శింపరాదు, నోరెత్తి మాట్లాడరాదు. ఏలనన నట్టియద్భుత విషయములనుగురించి మనకేమి తెలియును? సణుగుట, గొణుగుటకట్టిపెట్టి చాల హెచ్చు మొత్తములను చెల్లించుట యొక్కటే మనముచేయవలసినపని! 1934 సెప్టెంబరులో భారతదేశ ఛీఫ్‌కమాండరైన సర్ ఫిలిప్ ఛెట్వోడుగారు సిమ్లాలో స్టేటుకౌన్సిలు సభలోమాట్లాడుచు తమపనియేదియో చూచుకొనవలసినదనియు, నితరులపనితో జోక్యము కల్పించుకొనరాదనియు ఘాటైన మిలిటరీభాషలో భారతరాజకీయవేత్తలను మందలించెను. ఒకప్రాపొజిషనుకు సవరణ నుపపాదించినవాని నుదహరించుచు నతడిట్లుచెప్పెను. “కత్తితో సామ్రాజ్యమునుసంపాదించి తదారభ్యదానిని కత్తితోనే నిలుపుకొని యుద్ధములో మునిగితేలుచు, యుద్ధప్రావీణ్యతను సంపాదించిన బ్రిటిషుజాతియొక్క (స్వయనుభవముచే నొకజాతికిచేకూరు) సాంగ్రామికపరిజ్ఞానము పడకకుర్చీ విమర్శకులమాటలచే తరిమివేయబడునని యతడును, యతనిస్నేహితులును భావింతురా...!” అతడింకను

విశదాంశమైన యనేక రిమార్కులనుచేసెను. అతడు (అతడావేడిలో మాట్లాడెనేమో యని మనమనుకొనకుండ) తన యుపన్యాసమునంతను వ్రాసికొనివచ్చి వ్రాతప్రతినుండియే మాట్లాడెనని మనకు చెప్పబడెను.

సైనిక విషయములనుగురించి తెలియని సామాన్యమానవుడు ఛీఫ్ కమాండరుతో వాదించుట నిజముగ నసంగతము. అయినను పడక కుర్చీవిమర్శకుడుకూడ కొన్నియభిప్రాయములను వెలిబుచ్చవచ్చును. సామ్రాజ్యమును కత్తితో పరిపాలించువారి ప్రయోజనములును, తమశిరములపై తళతళ మెరయు నీయాయుధమెప్పుడును వ్రేలాడుచుండు వారి ప్రయోజనములును భేదింపవచ్చును. భారతసైన్యమును భారత ప్రయోజనములనుగాని, సామ్రాజ్య ప్రయోజనములనుగాని సేవించు నట్లు చేయవచ్చును; ఈరెంటికిని భేదముండవచ్చును. లేదా సంఘర్షణమే యుండవచ్చును. తమపనితో జోక్యము కలిగించుకొనరాదను గొప్ప సేనాధిపతుల కోరికలు యుక్తములో కావో ప్రపంచ యుద్ధానుభవ ములనుబట్టి రాజకీయవేత్త, పడకకుర్చీవిమర్శకుడు యోచింపవచ్చును. వారికప్పుడు చాలవరకు స్వేచ్ఛయేయుండెను. అన్ని చరిత్రలనుబట్టి చూచినయెడల ప్రతిసైన్యములోను-బ్రిటిషు, ఫ్రెంచి, జర్మను, ఆస్ట్రి యను, ఇటాలియను, రషియను-వారు ప్రతివిషయములోను విపరీత గందరగోళముచేసిరి. విఖ్యాతిగాంచిన బ్రిటిషుసైనిక చరిత్రకారుడును, తంత్రవేత్తయునగు కెప్టెనులిడెలుహార్టు యుద్ధము జరుగుచున్న యొక స్థితిలో బ్రిటిషుసోల్జరులు శత్రువుతో పోరుచుండ బ్రిటిషుసేనాధిపతులు తమలోతామే పోరుచుండిరని తన 'ప్రపంచయుద్ధచరిత్ర' యను పుస్త కములోవ్రాసెను. జాతీయోపద్రవము వారిభావములలోగాని, ప్రయ త్నములలోగాని నైక్యమునుకలిగింపలేదు. మరియు నతడు 'యుద్ధము విగ్రహములలోనున్న మనవిశ్వాసమును నాశముచేసెను; గొప్పవారు సామాన్యమానవులకంటె భిన్నమైనపదార్థముతో చేయబడిరను మన

వీరారాధన విశ్వాసమును ముక్కలుచేసెను. నాయకులయవసరమింకను కలదు; బహుశః యెక్కువయవసరము. కానివారు సామాన్యమానవజాతి వారేయని మనకిప్పుడు కలిగినప్రబోధము వారినుండి విపరీతమైనదా నినాశింపరాదనియు, లేక వారిని విపరీతముగనమ్మరాదనియు మనలను గుర్తింపజేయుచున్నది." అనివ్రాసెను.

రాజకీయధురంధరుడగు డి. లాయిడ్‌జార్జిగారు 'యుద్ధస్మరణములు' అనుతనపుస్తకములో ప్రపంచయుద్ధములోని సేనాధిపతుల యొక్కయు, సేనానులయొక్కయు తప్పులను, దోషములను గురించి భయంకర చిత్రములను చిత్రించెను. ఈదోషములు లక్షలకొలది జనులయొక్క ప్రాణములనుతీసివేసెను. ఇంగ్లండు, ఆమెమిత్రులు యుద్ధములోజయించిరి. కాని యది "రక్తముతో నుక్కిరిబిక్కిరైన విజయము." ఉన్నతోద్యోగులు మనుష్యులను, అవకాశములను నిర్లక్ష్యముగను, తెలివితక్కువగను చేబట్టుటచేత ఇంగ్లండును కొంచెమించు మించు మృత్యుసదనమునకు గొంపోయిరి. ఆమెయు, ఆమెమిత్రులును వారిశత్రువులయొక్క యవిశ్వసనీయమగు ప్రమాదమువలననే రక్షింపబడిరి. ఇంగ్లండుయొక్కగొప్పయుద్ధమంత్రి యీవిధముగ వ్రాయుచు జెన్రికోప్రభువుగారి తలలోనికి భావముల నెక్కించుటకు (ముఖ్యముగ సహాయసైన్యపద్ధతినేర్పరచు సూచనకు) శస్త్రచికిత్స చేయవలసివచ్చెనని విశదపరచెను. శక్తినుద్భోధించునట్టి నిశ్చలముఖలక్షణములను కలిగియుండుటయే ఫ్రెంచి సేనాధిపతియైన జోఫ్రీయొక్క ముఖ్యసుగుణమని యతడుభావించినట్లుగాన్పించును. "కష్టములలోనున్న ప్రజలు సహజముగదానికొఱకేచూచెదరు. గడ్డము వివేకస్థానమను దురభిప్రాయమువారికుండును."

కాని లాయిడ్‌జార్జిగారు కమాండరిన్‌ఛీఫ్‌గారైన ఫీల్డుమార్షలు హేగుగారిమీదనే ప్రధానదోషము నారోపించిరి. హేగుగారుఅసాధా

రణాహంకారమునుగలిగి రాజకీయవేత్తలును, యితరులునుచెప్పినదానిని వినకపోవుటయేగాక ముఖ్యవిషయములను బ్రిటిషు మంత్రివర్గమువారికి కూడ తెలియబర్చక ఫ్రాన్సులోనున్న బ్రిటిషు సైన్యమును మహోపద్ర ములోనికిదింపెను. అపజయమతని నెదుర్కొనినను (చివరవరకు వెంకి తనముపీడక) అతడుపశాండెలీ, కేంబ్రైయను భయంకరమైన గొంపి స్థలములో ననేకమాసములవరకు తన తెలివితక్కువ పోరాటమును సాగించెను. అచ్చటఆఫీసరులొక్కరే 17,000 మంది చనిపోయిరి, చని పోవుస్థితికివచ్చిరి. నాలుగులక్షలమంది ధైర్యవంతులైన బ్రిటిషుసోల్జర్లు 'చావుసంఖ్యకు' వచ్చిరి. నేడు, చనిపోయినతరువాత, ఆ 'తెలియరాని సోల్జరు' గౌరవింపబడుట మంచిపని; అతనిజీవిత మతిచౌకగనుండెను; జీవించియుండగా నతనిలెక్క యేమియు లేకపోయెను.

ఇతరులందరివలెనే రాజకీయవేత్తలును తఱచుప్రమాదములకు లోనగుచుందురు; కానిప్రజాస్వామికముకు చెందిన రాజకీయవేత్తలు ప్రజలను, విషయములను గుర్తించి, బాధ్యతతో మెలంగవలెను. సాధారణముగవారు తమతప్పులను గుర్తించి సవరించుకొనప్రయత్నింతురు. అధికారమురాజ్యముచేయుచు విమర్శకుస్థానములేనిచోట సైనికుడు వేరువిధమగు వాతావరణములో తయారగును. అతడు యితరుల యొక్క సలహాను పాటింపడు. అతడు తప్పుచేసినప్పుడు పూర్తిగతప్పు చేయుచు తప్పుదిద్దుకొనమనినను దిద్దుకొనడు. అతనికిమనస్సుకంటెను బుద్ధికంటెను గడ్డమేచాలముఖ్యమైనది. హిందూదేశములోమన మొక మిశ్రమ మాదిరిని తయారుచేసితిమి. ఏలనన సివిలుపరిపాలకులే యధికారముతోను, ఆత్మసామర్థ్యముతోను నిండిన యుద్ధసైనికవాతావరణములోపెరిగి, యందులోనేజీవించుచు, సోల్జరుయొక్క గడ్డము మొదలగు నితరసుగుణములను కలిగియున్నారు.

సైన్యములో 'భారతీయులను ప్రవేశపెట్టు' విధానము జరుగుచున్నదనియు మరియొకముప్పది సంవత్సరములలో లేక మరికొంత యెక్కువ కాలములో నొకభారత సేనాధిపతికూడ భారతరంగములో కాన్పించవచ్చు ననియు చెప్పబడుచున్నది; నూరుసంవత్సరములకు యెక్కువ కాలముమించకుండ భారతీయుల వశముచేయుపద్ధతి చాలవారకు యభివృద్ధికావచ్చును. మంచితరుణములోయింగ్లండు ఒకటిరెండు సంవత్సరములలోనే లక్షలకొలదిగలమహాసైన్యమునెట్లునిర్మింపగలిగెనో యాశ్చర్యముగనుండును. మనకుసలహాచెప్పు సలహాదారులే దానికున్నయెడల నదియెక్కువ జాగ్రతగను, భద్రముగను నడిచియుండెడిది. కట్టుదిట్టమైనశిక్షగల యీసైన్యముతయారగుటకు చాలపూర్వమే నిశ్చయముగ యుద్ధము ముగిసియుండెడిది. రషియను సోవియటు సైన్యములుకూడ రమారమి శూన్యమునుండియే ప్రారంభమయి యనేకమంది శత్రువుల నెదుర్కొని విజయముగాంచుటనుగూడ మనము చూచుచున్నారము. నేడు ప్రపంచములోనవి యత్యంతసమర్థమైనసైన్యములలో నొకటివిగనున్నవి; 'యుద్ధములోమునిగి తేలుచు యుద్ధపావీణ్యతను' సంపాదించిన సేనాధిపతులెవరును వారికిసలహాయిచ్చినవారున్నట్లు తోచదు.

డేరాడూనులో నుద్యోగస్థులబిడ్డలను ఆఫీసరులనుగ తయారు చేయుటకొరకు సైనికశిబిరముకలదు. వారు కవాతుచేయుటలో నతిచురుకుగనుందురని చెప్పబడును. వారునిస్సందేహముగ గొప్పఆఫీసరులు కావచ్చును. సాంకేతికశిక్షలేనిదే యిట్టిశిక్షవలన ప్రయోజనమేమియని నేనొక్కొక్కప్పు డాశ్చర్యపడుచుందును. పూర్వకాలపు రోమనుపటాలమువలన నేడెంతప్రయోజనముండునో కాల్బలము, గుర్రపుదళము వలనను నంతయేప్రయోజనముండును. వాయుయుద్ధము, వాయుబాంబులు, ట్యాంకులు, శక్తివంతమైన మరఫిరంగులుగల యీరోజులలో బాణము, విల్లుకంటె తుపాకికొంచెము శ్రేష్ఠమైనది. వారిశిక్షకులును, సలహాదారులును యీసంగతిని గుర్తింపకపోలేదు.

భారతదేశములో బ్రిటిషు పరిపాలనయొక్క చరిత్రయెట్టిది? దానిదోషములు మనతప్పులయొక్క ఫలితములే యైనపుడు ఫిర్యాదు చేయుటకుమన మెవరము? పరివర్తనమనుప్రవాహముతో సంపర్కమును వీడి మురుగుగుంటలోప్రవేశించి మనతోమనము తృప్తిచెందుచు, నుష్ట్రపక్షివలె బయట జరుగుచున్నదానిని నిర్లక్ష్యముచేయుచో మననాశము మనమే తెచ్చిపెట్టుకొనెదము. ప్రపంచములో బయలుదేరిన యొకనూతన భావతరంగశిఖరముమీద బ్రిటిషువారు మన దేశము వచ్చి శక్తివంతమైన చారిత్రకశక్తులకు ప్రాతినిధ్యము వహించిరి. మనము మనలనెగురగొట్టుచు నిటునటు పడవేయునట్టి గాలివానను గురించి ఫిర్యాదుచేతుమా లేక మనలను గజగజవణకించు చలిగాలిని గురించిచేతుమా? గతమును గతకలహములను చాలించి మనము భవిష్యత్తునెదుర్కొనవలెను. శాస్త్రమును వీర్యవంతమయిన తత్సంతతిని మనకు ప్రసాదించిన బ్రిటిషువారికి మనము కృతజ్ఞులముగ నుండవలెను. అయినను బ్రిటిషుప్రభుత్వమువారు భారతదేశములో చీలిక, మత సంబంధమైనపిచ్చి, అభివృద్ధిభంగము, కులకక్షలు, మోసము మొదలగు స్వభావములను ప్రోత్సహించుటకు చేసిన యత్నములను మరచిపోవుట లేక ప్రశాంతచిత్తముతో వీక్షించుట కష్టసాధ్యము. బహుశఃయదికూడ మనకవసరమైన యొకపరీక్ష, యొకసవాలు. నవ్యభారతముత్పన్నమగులోపల దుర్బలత్వమును అపవిత్రతను అవినీతిని శుభ్రపరచి సాధుచేసి దహించివేయునట్టి యగ్నిగుండ నది తిరిగితిరిగి పోవలసియుండును.

౧

౫౫

## సివిల్ వివాహము - లిపిసమస్య.



1933 సెప్టెంబరు మధ్య భాగమున నొకవారము పూనా బొంబాయిలలో గడపిన తరువాత నేను లక్నో తిరిగివచ్చితిని. నాతల్లి యచ్చటనింకను ఆస్పత్రిలోనేయుండి చాల నెమ్మదిగ కోలుకొనుచుండెను. కమలకూడ (ఆమెయారోగ్యమే యంత బాగుండకపోయినను) లక్నోలోనుండి యామె కుపచారముచేయుటకు యత్నించుచుండెను. వారంవారమునా చెల్లెండ్రు అలహాబాదునుండి వచ్చుచుండిరి. నేనచ్చట రెండుమూడువారములుంటిని. అలహాబాదులోకంటె నాకిచ్చటనేయెక్కువతీరిక దొరికెను. నిత్యము ఆస్పత్రికి రెండుసారులు పోవుచుండుటయే నాప్రధానకార్యము. తీరికగలగంటలలో నేను పత్రికలకు కొన్నివ్యాసములను వ్రాసెడివాడను. ఇవి దేశమంతటను ప్రచురింపబడుచుండెను. "భారతమాతా! యెచ్చటకు?" అనునొక వ్యాసపరంపర (ఇందులో ప్రపంచవ్యవహారములు హిందూదేశపరిస్థితుల సంబంధముతో వీక్షింపబడెను.) ప్రజాదృష్టి నాకర్షించెను. ఈవ్యాసములు టెహరాను, కాబూలులలో పరిషియనుభాషలోనికి తర్జుమాచేయబడెనని నేనుతరువాత తెలిసికొంటిని. సమీనాభివృద్ధితోను, ఆధునిక పాశ్చాత్య భావముతోను సంపర్కముకలవారికీవ్యాసములలో గొప్పక్రొత్తదనమును, స్వకపోలకల్పితమును యేమియు నుండవు. కాని, హిందూదేశములో మనప్రజలు గృహచ్ఛిద్రములలో మునిగియుండుటచే నితరవోట్లజరుగుచున్నవిషయముల నవలోకించుటకంత వీలులేకుండెను. నావ్యాసముల పట్లచూపబడిన యాదరణయు, ననేకయితరసూచనలును ప్రజలువిశాల భావముల నభివృద్ధి చేయుచున్నారని విశదము చేసెను.

ఆస్పత్రిలోనుండుట మాతల్లికతి విసుగుగనుండుటచే మేమా మెను అలహాబాదు తీసికొనిపోవుటకు నిశ్చయించితిమి. నాసోదరి, కృష్ణ కుమారియొక్క వివాహముకూడ దీనికొక కారణము. హఠాత్తుగనన్ను తిరిగి జయిలుకు తీసికొనిపోవులోపల నీవివాహమును జరిపించుటకు మేము వేగిరపడుచుంటిమి. శాసనోల్లంఘన మింకను కాంగ్రెసుయొక్క కార్యక్రమములోనుండ కాంగ్రెసు సంస్థయు, ననేకయితర సంస్థలును అక్రమసంఘములుగనుండ నన్నుబయట నెంతకాలముండనిచ్చెదరో నాకు తెలియకుండెను.

మేము అక్టోబరుమూడవవారములో వివాహమును అలహాబాదులో జరుపనెంచితిమి. దానినొక లౌకికక్రియగ జరుపదలచితిమి. యదార్థముకు మాకుమరియొకమార్గములేకపోయినను, నేను దీనికి సంత సించితిని. ఈవివాహము రెండువర్ణములమధ్య (బ్రాహ్మణ బ్రాహ్మణే తరములమధ్య) జరుగనుండెను. ప్రస్తుత బ్రిటిషుయిండియను చట్టము ప్రకారము యేమతమును యిట్టివివాహమునకంగీకరింపదు. అదృష్ట వశమున నూతనముగ నామోదింపబడిన యొకసివిల్ వివాహచట్టము మాకుశరణ్యమయ్యెను. ఇట్టివిరెండుచట్టములుండెను. నాచెల్లెలు వివా హము జరిగినరెండవచట్టముక్రింద హిందువులును, ఆమతమునకు సన్నిహితములైన బౌద్ధ, జైన, సిక్కుమతస్థులును మాత్రమేవివా హము చేసికొనవచ్చును. పుట్టుకచేతగాని, మారుటచేతగాని వధూవరులు యీామతములలో నొకదానికి చెందకపోయినచో యీరెండవచట్టము వారికి వర్తింపదు. వారికి మొదటిచట్టము వర్తించును. దీనిప్రకారము వారుభయులును ప్రధానమతములను నిరసింపవలెను. లేదావారు వాటికి చెందనట్లు ఒకవాఙ్మూలమునైనను యివ్వవలెను. కేవలమనవ సరమగు యీానిరసన యొకపెద్దయల్లరి వ్యవహారము. ఎట్టిమతేచ్ఛలేని వారైనను చాలమంది యీావాఙ్మూలమున కంగీకరింపనిచో యీాచట్టము

వలన లబ్ధినిపొందజాలరు. వివిధమతములకుచెందు శిష్టాచారసంపన్నులు అంతర్వివాహములకు సౌకర్యమిచ్చు సన్నిమార్పులను తిరస్కరింతురు. ఫలితమేమన ప్రజలట్టి నిరసనవాఙ్మూలములనిచ్చునట్లు బలాత్కరింప బడుదురు లేదా చట్టముక్రిందకువచ్చుటకు నామమాత్ర మార్పును స్వీకరింతురు. వ్యక్తిగతముగ నేనుఅంతర్వివాహములను ప్రోత్సహింప గోరెదను. మనము ప్రోత్సాహమిచ్చినను యివ్వకపోయినను, అట్లు చేసికొనుట కంగీకరించు సామాన్య సివిల్వివాహచట్టమొకటి యత్యావసరము. మతమును మార్చుకొనుటయు లేక నిరసించుటయు నవసరము లేకుండగనే యది యన్యమతస్థులవారును వివాహము చేసికొనుట కనుమతింపవలెను.

నాచెల్లెలు వివాహమునుగురించి మేమెట్టియుల్లాసమును చేయ లేదు. అదిచాల నిరాడంబరముగ జరిగెను. సాధారణముగ భారత వివాహములలో జరుపబడుచుండు గందరగోళము నాకుగిట్టదు. నా తల్లి వ్యాధిగ్రస్తురాలై యుండుటచేతను అంతకంటె నెక్కువగ శాస నోల్లంఘనమింకను జరుగుచు మనసహచరులు చాలమంది జయిళ్ళలో నుండుటచేతను యెట్టియాడంబరమునకును తావులేకుండెను. కొద్దిమంది బంధువులును స్థానికస్నేహితులును ఆహ్వానింపబడిరి. ఇది నాతండ్రిగారి పాతస్నేహితులకు చాలమందికి కష్టమును కలిగించెను. నేను వారిని బుద్ధి పూర్వకముగ నిర్లక్ష్యముచేసితినని (ఇది కేవలమక్రమము) యనుకొనిరి.

వివాహాహ్వానపత్రిక ల్యాటినులిపిలో హిందూస్తాని భాషను వ్రాయబడెను. ఇదియొక నూతనవిషయము. ఇట్టియాహ్వానము లెప్పు డును నాగరిలిపిలోగాని పర్షియనులిపిలోగాని యుండును. హిందూస్తానీ భాషను ల్యాటిను లిపిలో వ్రాయుట సైనిక మిషనరీసంఘములలో తప్ప మరెవరికిని తెలియదు. వివిధప్రజలు దీనినెట్లు భావింతురో నేనుచూడ గోరితిని. ఇది యంతబాగుగ నాదరింపబడలేదు. ఇవి తక్కువమందికే

పంపబడెను; విరివిగ పంపియుండినచో మరింతయెక్కువ యనాదరణ ఘటిల్లెడిది. గాంధీజీ నేను చేసిన దానికంగీకరింపలేదు.

నేను ల్యాటిను భాషనువరించుటచే (చిరకాలమునుండి యదిననాక్షించినను) నాలిపినియుపయోగింపలేదు. టర్కీలోను, మధ్యయాసియాలోను దానికి గలిగిన విజయము నన్ను మెప్పించెను దాని నభిమానించుటకు బలవత్తరమైన కారణములే యుండెను. అయినను నేను విశ్వసింపలేదు. విశ్వసించినను ప్రస్తుతపరిస్థితులలో భారతదేశమున నది యుపయోగింపబడుటకు నెంతమాత్రమును లేదని నేనెరుగుదును. దానికన్నిప్రక్కలనుండియు, జాతీయవాదులు-మతము, హిందువులు, ముస్లిములు, నవీనులు, ప్రాచీనులు-తీవ్రమైన వ్యతిరేకముకలుగును. ఈవ్యతిరేకము కేవలము యుద్రేకముమీద నాధారపడదని నేను భావించెదను. గొప్ప సంస్కారము, చరిత్రగల యే భాషయైనను తన లిపినిమార్చుకొనుట సామాన్యవిషయము కాదు. ఏలనన లిపి యాసాహిత్యములలో నొకయత్యంత సన్నిహిత భాగము. లిపిని మార్చినచో భిన్నశబ్దచిత్రములు, భిన్నధ్వనులు, భిన్న భావములు నుత్పన్నమగును. క్రొత్తసాహిత్యమునకును, పాత సాహిత్యమునకును మధ్య దాటశక్యముకానిగోడయొకటి నిర్మింపబడును; రెండవది నశించి కొంచెమించుమించు విదేశభాషయగును. సంరక్షించుకొనుటకు దగిన సాహిత్యములేనిచోట నిట్టిసాహసమును చేయవలెను. భారతదేశములో నేనిట్టిమార్పునుభావింపజాలను. ఏలననమనసాహిత్యము సారవంతమైనద, యమూల్యమైనదియేగాక మనచరిత్రతోను, భావములతో ను బద్ధమైయున్నది; అది మన ప్రజలయొక్క జీవితములతో సన్నిహిత సంబంధముకలిగియున్నది. అట్టిమార్పునుబలవంతముగదెచ్చుట క్రౌర్యమగు హత్యయగును. ఇది మన ప్రజాసామాన్యముయొక్క విద్యాభివృద్ధిని యరికట్టును.

కాని యీసమస్య భారతదేశములో నేను తర్కింపవలసినది కూడకాదు. సంస్కృతభాషనుండిపుట్టిన - హిందీ, బెంగాలీ, మరాటీ, గుజరాటీలకొక సామాన్యలిపిని సృష్టించుటే మనమిప్పుడుచేయవలసిన లిపిసంస్కారమని నాకు తోచుచున్నది. ఉన్నస్థితిలో వాటిలిప్పులాకే మూలమునుండిబయలుదేరి యెక్కువభేదములులేక యుండుటచే నొక సామాన్యమధ్యలిపిని కనుగొనుట కష్టముకాదు. దీనివలన నీనాలుగు యేకగర్భజనితభాషలును మరింతసామీప్యమును పొందగలవు.

మనయింగ్లీషుప్రభుత్వమువారు భారతదేశములో వందలకొలది భాషలు (సరియైనసంఖ్యజ్ఞాపకములేదు) గలవనునొకకథను ప్రపంచము నకంతకును సంతతము చాటుచుండిరి. రుజువుకు జనాభాలెక్కలు కలవు! ఈదేశములో యావజ్జీవము నివసించుచున్నను యీయనేక వందలభాషలలోను కొద్దిమంది యింగ్లీషువారు మాత్ర మొక్క-భాషలో కొంత పాండిత్యమునే సంపాదింప గలుగుట యసాధారణ విషయము. వారు వీటినన్నింటిని యొకతరగతికి జేర్చి 'వర్నాక్యులర్సు' అనగా బానిసలభాషలు అని పిలుతురు. (ల్యాటినులో 'వర్నా' అనగా యింటపుట్టిన బానిసయని యర్థము) మనవారు చాలమంది, యీయర్థము నెరుగక, ఈనామకరణమును స్వీకరించిరి. ఇంగ్లీషు వారు భారతదేశములో నొకజీవితకాలము నంతను గడుపుచు భాషను బాగుగ నేర్చుకొనుట కెంతమాత్రమును కష్టపడకపోవుట యాశ్చర్యకరమైనవిషయము. వారియొద్దనుండు 'ఖాన్‌సామా', 'అయ్యా'ల (వంటలవాండ్రు, సేవకులు) సహాయముతో వారొకవిధమగు నసాధారణ పిచ్చిభాషను, పచ్చిపులుసు హిందూస్థానీని తయారుచేసి యదియే నిజమైన వస్తువని యూహింతురు. భారతజీవితమునుగురించిన విషయములను తమక్రిందివారినుండియు, యిచ్చకము లాడు వారినుండియు గ్రహించునట్టివారు హిందూస్థానీనిగురించిన భావములను తమయింటి

నౌకరులనుండి తీసికొనెదరు. నౌకరులు తమ 'సాహిబ్ లోగ్' (యజమానులు) కు మరేమియు నర్థముకాదనుభయముచే వచ్చీపచ్చిఫులుసు హిందూస్తానీలోనే మాట్లాడవలెనను నియమము పెట్టుకొనెదరు. హిందూస్థానీభాషకును, యితరభారతభాషలకును యుత్తమ సాహిత్యమున్న సంగతివారికెంతమాత్రమును తెలియనట్లు కాన్పించును.

భారతదేశములో రెండుమూడువందలభాషలున్నట్లు జనాభా లెక్కలుచెప్పునట్లే జర్మనీలోయేబది లేకఅరువది భాషలున్నట్లు అవి చెప్పుచున్నవి. జర్మనీలోని చీలికలకును, వ్యత్యాసములకును యివి కారణములని యెవడునుచెప్పినట్లు నాకుజ్ఞాపకములేదు. యథార్థముకు జనాభాలెక్కలు అన్నివిధములగు చిన్నచిన్నభాషలను (ఒక్కొక్కప్పుడే కొద్దివేలమందియో మాట్లాడుభాషనుకూడ) ఉదహరించును. తెలుచు భాషాభేదములుకూడ (శాస్త్రపరిశోధనకొఱకు) వేరువేరు భాషలక్రిందజేర్చబడును. వైశాల్యమునుబట్టి చూచినచో భారత దేశములో నాశ్చర్యజనకముగ నతితక్కువభాషలున్నట్లు నాకుకాన్పించును. యూరపులోని సమానవైశాల్యముగల ప్రాంతములతోపోల్చినచో భాషసందర్భములో నిచ్చటనెక్కువ సన్నిహిత బాంధవ్యమున్నది. కాని, చదువు బొత్తిగాలేకపోవుటచే సామాన్యప్రమాణములులేక భాషాభేదములేర్పడెను. భారతదేశములోనున్న ప్రధాన భాషలు (బర్మాకాక) హిందూస్థానీ, (హిందీ, ఉరుదు రెండురకములును) బెంగాలీ, గుజరాతీ, మరాతీ, తమిళము, తెనుగు, మళయాళము, కన్నడము. వీనికిఅస్సాముభాష, ఉరియా, సింధి, పుష్టు, పంజాబీలను కలిపినచో (కొద్దిమంది యాటవికులు, కొండజాతులుతప్ప) దేశమంతయు పూర్తియగును. వీనిలోనుత్తరదేశమునంతను, మధ్య, పశ్చిమభారతమును వ్యాపించు యిండోఆర్యనుభాషలకు రెక్కువసంబంధముకలదు; దక్షిణముననున్నద్రావిడభాషలు, భిన్నములైనను, సంస్కృతభాషా ప్రభావముకలొంగి, సంస్కృతపదములతో నిండియున్నవి.

పయినయుదహరింపబడిన యెనిమిదిప్రధానభాషలకును, ప్రాచీన మైన, యమూల్య సాహిత్యములుకలవు. వానిలోప్రతిభాషయు నేడు విశాలప్రాంతములలో మాట్లాడబడును. ఆప్రాంతములు స్పష్టముగ, నిస్సందేహముగ వేరుచేయబడియేయున్నవి. ఈభాషలను మాట్లాడు వారిసంఖ్యలనుబట్టి చూచినచో నివి ప్రపంచములోనున్న పెద్దభాష లలోచేరును. ఆయిదుకోట్లమంది బెంగాలీభాష మాట్లాడుదురు. హిందూస్తానీని (దానిలోనున్న భేదములతో) భారతదేశములో పదు నాల్గుకోట్లమంది మాట్లాడుదురని (నాయొద్దనిచ్చట యంకెలులేవు) నేనూహించెదను. అది భారతదేశమంతటను చాలమందిచే కొంతవర కర్థముచేసికొనబడుచున్నది. *అట్టిభాషకు విశేషావకాశములుకలవు. అది బలీయమైన సంస్కృతభాషాపునాది పైనిర్మింపబడి పరిష్యనుతో సన్నిహితసంబంధము కలిగియున్నది. ఈవిధముగనది రెండుసారవంతము

* ఈక్రిందియంకెలు హిందూస్తానీభాషాభిమానులచేత నీయబడెను. అవిగత 1931 నాటి జనాభాలెక్కలమీద నాధారపడెనో లేక 1921 నాటిలెక్కలమీద నాధారపడెనో నేనెరుగను. అవిరెండవవాటికే చెందునని నేనుభావించెదను. నేటి వరకుండు లెక్కలు ప్రకృతిరీక్షకు క్రిందను చాలపెరుగుదలను చూపగలవు.

| | |
|---|---|
| హిందూస్తానీ (పశ్చిమహిందీ, పంజాబీరాజస్థానీకలిపి) | 1,393 లక్షలు |
| బెంగాలీ | 493 ,, |
| తెలుగు | 236 ,, |
| మరాఠీ | 188 ,, |
| తమిళము | 188 ,, |
| కన్నడము | 103 ,, |
| ఉరియా | 101 ,, |
| గుజరాతీ | 96 ,, |
| మొత్తము | 2,798 ,, |

పష్టు, అస్సామీలను (భాషచేతను రాష్ట్రముచేతను కిస్తువైన బర్మాభాష వంటి కొన్నిభాషలను) యీలెక్కలలో చూపబడలేదు.

లైన నిధులనుండి శక్తినిగ్రహింపగలదు; నిశ్చయముగ నీమధ్య సంవత్సరములలోనది యింగ్లీషుభాషనుండికూడ బలమును సంపాదించెను. దక్షిణముననున్న ద్రావిడదేశ మొక్కచోటనే హిందూస్తానీ రమారమి విదేశభాషవలెనుండును; కాని, యచ్చట ప్రజలుదానిని నేర్చుకొనుటకు విశేషప్రయత్నములను చేయుచున్నారు. రెండు సంవత్సరములకిందట (1932 లో) దక్షిణమున హిందీప్రచారము చేయుచున్న యొకిచ్ఛిక ప్రయివేటు సంఘముయొక్క లెక్కలను నేను చూచితిని. గత పదునాల్గువత్సరములలోను (అది ప్రారంభమయిన తరువాత) దానిప్రయత్నములవలన నొక్కమద్రాసు రాష్ట్రములోనే 550,000 మంది హిందీ చదివినట్లు చెప్పబడెను. ప్రభుత్వముచే నేవిధముగను బలపరుపబడని యైచ్ఛికయుద్యమమునకిది సామాన్య విషయముకాదు. హిందీ చదువుకొనిన వారిలో చాలమంది తమంత తామే యీ యుద్యమ ప్రచారకు లగుచున్నారు.

హిందూస్తానీ భారతదేశములో సామాన్యభాష కాగలదనుటకు నా కెట్టిసందేహమును లేదు. మామూలు పనులకు నేడది యట్లే యున్నది. లిపి నాగరలిపియుండవలెనా పరిష్యను లిపియుండవలెనా యను మూర్ఖవాదములవలన దాని యభివృద్ధియరికట్టబడెను. ఎక్కువసంస్కృత పదముల నుపయోగింపవలెనని యొకకక్ష, పరిష్యను పదముల నుపయోగింపవలెనని యొకకక్ష దానిని దిగలాగెను. రెండు లిపులను కూడ నధికారరీత్యా యంగీకరించుట తప్ప దానికి వేరొక మార్గము లేదు. ప్రజలను వారి యిష్టము వచ్చినలిపి నుపయోగింప నీయవలెను. కాని రెండు చివరలకును తీసికొనిపోవు స్వభావములను నిరుత్సాహపరచి సామాన్య యుపయోగములోనున్న వాడుక భాషమీద నాధారపడు మధ్యరకపు సాహిత్యభాష నభివృద్ధిచేయుటకు ప్రయత్నము జరుగవలెను. జనసామాన్యములో విద్య యభివృద్ధియైనకొలది యిది విధాయకముగ

జరుగ గలను. ప్రస్తుతము సాహిత్యాభిరుచికిని, శైలికిని మధ్యవర్తులను కొనబడు చిన్న మధ్యతరగతి వర్గముల వారు అతిసంకుచితమనస్కులు, ఛాందసులు. తమ ప్రజలతో గాని, ప్రపంచ సాహిత్యముతో గాని సంపర్కములు లేక, చైతన్యమనునదియే లేక నుంచు ప్రాచీన భాష ములకు వారంటిపెట్టుకొని యుందురు.

హిందూస్తానీ భాషాభివృద్ధియు, వ్యాప్తియు భారత దేశములోని యితర గొప్ప భాషలైన-బెంగాలీ, గుజరాతీ, మరాఠీ, ఉడియా, దక్షిణ దేశములోనున్న ద్రావిడభాషలు-వీటి యథాప్రకారోపయోగ ముతోను, సంపదభివృద్ధులతోను తలపడరాదు; తలపడవు. వీనిలో కొన్ని హిందూస్తానీకంటె నిదివరకే యెక్కువ మెలకువను, బుద్ధిపాటవ మును కలిగి యున్నవి. ఆ యాప్రాంతములలో విద్య గజపుటకును, యితర వ్యవహారములకును నవియే యధికార సమ్మతములైన భాష లుగ నుండవలెను. వాని ద్వారమున మాత్రమే ప్రజాసామాన్యములో విద్యయు, విజ్ఞానమును నెక్కువ త్వరితముగ వ్యాప్తినొందగలవు.

ఇంగ్లీషు భారత దేశములో సామాన్యభాష కాగలదని కొందరు భావింతురు. ఏ కొద్దిమంది పైతరగతుల విద్యాధికుల విషయములోనో తప్ప నాకిది పిచ్చియూహవలె కాన్పించును. ప్రజాసామాన్యము యొక్క విద్యా విజ్ఞాన సమస్యకును దీనికిని సంబంధమేమియు లేదు. ఇంగ్లీషు (కొంతవరకు నేడు యున్నట్లు) అంతకంత కెక్కువగ సాంకే తిక, శాస్త్ర, వ్యవహార విషయములలో నుత్తర ప్రత్యుత్తరములను జరుపుకొను భాషగ (ముఖ్యముగ నంతర్జాతీయ సంపర్కములకు) నుండవచ్చును. మనలో చాలమంది విదేశభాషలను (ప్రపంచ భానము లను, చర్యలను తెలిసికొనుచుండుటకు) తెలిసికొనుట యత్యావసరము. మన విశ్వవిద్యాలయములు యింగ్లీషుతో పాటు, ఫ్రెంచి, జర్మను, రషియా, స్పానిషు, ఇటాలియను భాషలను కూడ ప్రోత్సహింప నోగ

డను. ఇంగ్లీషును నిర్లక్ష్యము చేయవలెనని దీని యర్థము కాదు. కాని ప్రపంచమును గురించి సమదృష్టిని కలిగి యుండవలెననిన మన మొక్క యింగ్లీషు సులోచనములనే ధరింపరాదు. ఒక్కభావము ఒక్క లక్ష్యముమీదనే కేంద్రీకరించుటచేత మన మిదివరకే మన మానసిక దృష్టిలో కావలసినంత యంగవైకల్యమును పొందతిమి. మన జాతీయ వాదులలోనతిపిచ్చియెత్తినవారు కూడ భారతదేశమునకుసంబంధించిన బ్రిటిషు దృష్టిచే తామెంత నిర్బంధింపబడిరో గుర్తింపజాలకున్నారు.

ఇతర విదేశభాషలను మన మెంత ప్రోత్సహించినను, యింగ్లీషు భాషయే మనలను బయట ప్రపంచముతో కలుపు ప్రధానసంధాన కరణిగ నుండక తప్పదు. అది తప్పని సరి. గత కొన్ని పురుషాంత ములనుండి మన మాంగ్లము నభ్యసించుటకు ప్రయత్నించుచుంటిమి. ఈ ప్రయత్నములో మనము కొంత మంచి విజయమును గాంచితిమి. ఈచిరశిక్షవలన కలిగిన లబ్ధిని పొందక మన మిప్పుడు దీని నంతను తుడిచివేయుట మూర్ఖత్వమగును. నేడు యింగ్లీషు కూడ చాల విశాల వ్యాప్తిని పొందిన ప్రపంచభాష యనుటకు సందేహములేదు. అది యితర భాషలను వేగముగ దిగద్రొక్కుచున్నది. 'అమెరికను' భాష దాని స్థానము నాక్రమించిన తప్ప యదియే యంతర్జాతీయ వ్యవహార ములకును, రేడియో ద్వారా వార్తాప్రసారమునకును తగు భాష కాగల సూచనలు గలవు. కనుక మనము ఆంగ్లభాషాజ్ఞానమును సాగించుచునే యుండవలెను. దానిని సాధ్యమైనంతవరకు నేర్చుకొను టయే యుక్తము; కాని యిపుడు మనలో కొంతమంది చేయునట్లు యాభాషలోనున్న యందచందములను గ్రహించుట కెక్కువ శక్తిని, కాలమును వినియోగించుట ప్రయోజనహీనమని నాయభిప్రాయము. వ్యక్తులు అట్లు చేయవచ్చును. కాని యనేక సంఖ్యాకులకు దానిని లక్ష్యముగా నుంచుట వారిపై ననవసర భారమును వేయుట యగును; వారి యితర యభివృద్ధి కది యాటంకమగును.

ఈ మధ్య 'సామాన్య ఆంగ్లము' నన్నెక్కువగ నాకర్షించెను. ఇంగ్లీషును యింత యత్యధికముగ సరళముచేయుట గొప్ప పురోభివృద్ధి సూచకము. 'ప్రమాణ యింగ్లీషు' భాషకంటె మనము సామాన్య భాషను విరివిగ నేర్పించుట యుక్తముగ నుండును. మొదటి దానిని పండితులకును, ప్రత్యేక విద్యార్థులకును విడిచివేయవచ్చును.

హిందూస్తానీ యింగ్లీషునుండియు నితరవిదేశ భాషలనుండియు ననేకపదములనుతీసికొని తనలో లీనముచేసికొనుటను నేను వ్యక్తిగతముగ ప్రోత్సహింపఁగోరెదను. మనకు నవీనపదములు లేవు. కనుక నిదియవసరము. సంస్కృతమునుండియు, అరబ్బీనుండియు నూతనముగ కష్టమైన పదజాలమును సృష్టించుటకంటె బాగుగ తెలిసిన పదములను వాడుటయే శ్రేష్ఠము. విదేశపదములనుపయోగించిన భాష మైలపడిపోవునని కొందరందురు. ఇదిచాల పొరపాటు. మనభాషను సాగునట్లుచేసి, ఇతర భాషలలోనిపదములను, భావములను తనలోనిముడ్చుకొను శక్తిగలిగి పెరుగునట్టి స్వభావమును కలిగినపుడే భాషవృద్ధిపొందును.

నాచెల్లెలు వివాహమగుటతోడనే నాసహచరుడును, పాతస్నేహితుడును, సంవత్సరముపయిగ వ్యాధిగ్రస్తుడును నైయున్న శివప్రసాద గుప్తనుచూచుటకు నేనుకాశీవెళ్ళితిని. లక్నోజయిలులోనుండగా నతనికిహఠాత్తుగ పక్షవాతమువచ్చెను. అప్పటినుండి యతడు నెమ్మదిగ కోలుకొనుచుండెను. నేనుకాశీలోనుండగ నొకచిన్న హిందీసాహిత్య సంఘము నాకుస్వాగతపత్రమునిచ్చెను. దానిసభ్యులతో నేను చక్కని యిష్టాగోష్టిసలిపితిని. నాకతిస్వల్పముగా తెలియువిషయములనుగురించి పండితులముందరమాట్లాడుటకు సందేహించుచుంటినని నేనుచెప్పితిని. అయినను నేనుకొన్నిసూచనలుచేసితిని. సమాసములతోను, అలంకారములతోను, కృత్రిమసంస్కృతపదములతోను, ప్రాచీనరూపములతోను వ్రాయబడుహిందీని నేను విమర్శించితిని; కొద్దిమందిసభ్యులకే యుద్దేశిం

పబడు, యీరాజభాషను విడిచిపెట్టవలెనని సూచించితిని. హిందీరచయితలు బుద్ధిపూర్వకముగ ప్రజలకొరకు, ప్రజలకర్థమగు భాషలో నేవ్రాయవలెనని చెప్పితిని. ప్రజాసంబంధమువలన భాషకునూతనవికాసమును, సరళతయుచేకూరును; వ్రాయువారుగూడ ప్రజయొక్క భావావేగము కొంతయబ్బుటచేత, నెక్కువశ్రేష్ఠమగు పనిని చేయగలుగుదురు. హిందీ గ్రంథకర్తలు పాశ్చాత్యభావములపట్లను, సాహిత్యముపట్లను నెక్కువ శ్రద్ధనువహించినచో దానివలన నెక్కువలబ్ధిని పొందగలరని నేను సూచించితిని. యూరపియనుభాషల యుత్తమకావ్యములనుండియు, నాధునికభావములనుగురించి వ్రాయుపుస్తకములనుండియు తర్జుమాలను చేయుట చాలయవసరము. బహుశః ఆధునిక బెంగాలీ, గుజరాతీ, మరాతీలు యీసందర్భములలో నాధునిక హిందీకంటె నెక్కువయభివృద్ధిలో నున్నవనికూడ నేనుచెప్పితిని. నిశ్చయముగ హిందీకంటె బెంగాలీలో నీమధ్యసంవత్సరములలో నెక్కువకల్పనశక్తి ప్రదర్శింపబడెను.

ఈవిషయములగురించి మిత్రసంభాషణలను జరపినతరువాత నేను వచ్చివేసితిని. నావిమర్శలుపత్రికలకు పంపబడునని నేనుభావింపలేదు. అచ్చటనున్నవారెవరో హిందీపత్రికలకొక రిపోర్టుపంపిరి.

అప్పుడుహిందీపత్రికలు నన్నుగురించిగగ్గోలుపెట్టి నేను హిందీని విమర్శించుచు నదిబెంగాలీ, గుజరాతీ, మరాతీలకు తీసిపోవుచున్నదని చెప్పసాహసించితినని యల్లరిచేసెను. నేనుయేమియు తెలియనివాడ ననిరి; (నిశ్చయముగ నావిషయములోనంతే) నన్నుఅణచివేయుటకును మందలించుటకును అనేక పరుషపదములుప యోగింపబడెను. ఆచర్చను గమనించుటకు నాకుతీరిక లేకపోయెను. అది (నెలలకొలది) నేను తిరిగి జయిలుకు పోవువరకు సాగుచునేయుండెనట!

ఈ విషయము నాకండ్లను తెరచెను. అది హిందీపండితుల యొక్కయు, పత్రికారచయితలయొక్కయు నసాధారణ సహనశూన్య

తను, తమ బాగుకోరినవానిచే చేయబడిన యొకచిన్ననిష్కపటవిమర్శ నను భరించుపట్ల వారి నిరాకరణమును తెలుపుచుండెను. తక్కువవార మనిపించుకొనుటయా ? యనుభావము పనిచేసెను. ఆత్మవిమర్శయనునది యెంతమాత్రమును లేదు. విమర్శక ప్రమాణములు హీనముగనుండెను. గ్రంథకర్తయు నతనివిమర్శకుడును పోరుపెట్టుకొని వ్యక్తిగత యుద్దే శ్యములుగలవని యొకరినొకరునిందించుకొనుట యసామాన్యవిషయము గాదు. వారిదృష్టియంతయు సంకుచితము, బూర్జువావాసనకలది, ప్రాంతీ యాభిమానముకలది. గ్రంథకర్తలును, పత్రికారచయితలును విస్తారమైన ప్రజాసామాన్యమును, వారిప్రయోజనములను నిర్లక్ష్యముచేసి యొకరి కొరకొకరును, ఒకచిన్నకూటము కొరకును వ్రాసికొనుచుండునట్లు కాన్పించును. అతివిశాలమైనట్టియు, నాకర్షణీయమైనట్టియు రంగస్థల ముండగ నిదియసాధారణ విచారజనకమును, దురదృష్టముగ శక్తిని నాశము చేయుటయు అని నాకుతోచెను.

హిందీసాహిత్య భూతచరిత్రగొప్పది; కానియదియెల్లకాలమును దానిమీదనే జీవింపజాలదు. దానికిగొప్ప భావికలదనియు, నీదేశ ములో హిందీపత్రిక లద్భుత శక్తివంతములగుననియు నేనెరుగుదును. కాని, యీరెండును సంకుచితయాచారములను త్రోసివేసి ధైర్యముగ ప్రజలనుద్దేశించివ్రాయువరకు నెక్కువయభివృద్ధి నొందజాలవు.

## ౫౬

## కులతత్త్వము - ప్రతీకారము.

—◆)O(◆—

నాచెల్లెలివివాహములో విఠాల్భాయి పటేలు యూరపులో మరణించెనను వార్తవచ్చెను. అతడు చాలకాలమునుండి బాధపడుచుండెను. అనారోగ్యముగనుండిన కారణముచేతనే యతడు భారతదేశములో జయిలునుండి విడుదలబడెను. అతనిమరణము మాకు పిడుగుపడినట్లుండెను. సంగ్రామమధ్యమున మానాయకశ్రేష్ఠు లిట్లొకరితరువాత నొకరు మమ్ము విడుచుంటిరనుభావము అసాధారణ మనఃఖేదమును కలిగించుచుండెను. విఠాల్భాయియనేకమెప్పులను బడసెను. ఇవియన్నియు నతని అసెంబ్లీయధ్యక్ష విజయమునుగురించియు, పార్లమెంటరీశక్తినిగురించియు నుతించెను. ఇదిపూర్తిగసత్యము. కాని దీనిని పదేపదే పునశ్చరణచేయుట నాకు కోపమును కలిగించెడిది. హిందూదేశములో మంచిపార్లమెంటేరియనులకును లేక సభానాయకస్థానము నలంకరింపగలవారికిని యెప్పుడైనను కొఱతయున్నదా? మనన్యాయవాదశిక్ష మనలనాపనికే యర్హులమగునట్లు చేసెను. విఠాల్భాయి యంతకంటె చాలనధికమైన వాడు. అతడు భారతస్వాతంత్ర్యముకొరకు పోరిన యప్రతిహత వీరశిఖామణి.

నవంబరులో నేను కాశీని సందర్శించుటకు వెళ్లినపుడు నన్ను హిందూవిశ్వవిద్యాలయ విద్యార్థుల కుపన్యసింపవలసినదని యాహ్వానించిరి. నేనుదీనికంగీకరించి వైసుచాన్సెలరుఅయిన మదనమోహన మాలవ్యగారియధ్యక్షతక్రింద నొకపెద్దసభలో నుపన్యసించితిని. నాయుపన్యాసములో నేను కులతత్త్వమును గురించి యెక్కువగ చెప్పవలసివచ్చెను. నేను దానిని తీవ్రమైనభాషలో, ముఖ్యముగ హిందూమహాసభాచర్య

లను, గర్హించితిని. నేను ముందుగ భావించుకొని యీపని చేయలేదు. కాని, యన్నిబృందముల కులతత్త్వవాదులును చేయుచున్న పురోభివృద్ధినరికట్టు ప్రయత్నముపయి నాకు చాలకాలమునుండి యపరిమిత కోపముగనుండెను. నేననావిషయమునందుకొనుసరికి యీకోపముకొంత పైకి యుబికెను. హిందూకులతత్త్వవాదుల ప్రతీకారస్వభావమును గురించి నేను బుద్ధిపూర్వకముగనే నొక్కిచెప్పితిని. ఏలనన హిందూ సభ్యులున్నచోట ముస్లిములను విమర్శించుటలో నర్థములేదు. హిందూ మహాసభకు చాలకాలమొక స్తంభముగా నుండిన మాలవ్యాజీయధ్యక్షతవహించిన సభలో హిందూమహాసభను విమర్శించుట యంతసభ్యమైనపనికాదని నాకాసమయమున తోచలేదు. ఇటీవల నతనికిదానితో నంతసంబంధము లేకపోవుటచేత నాకిది తోచలేదు. మహాసభయొక్క నూతననాయకులతనిని రమారమి గెంటివేసినట్లు కాన్పించెను. అతడు నాయకులలోనొకడుగా నున్నంతకాలము హిందూమహాసభ (కులతత్త్వమున్నను) రాజకీయముగ ప్రతీకారభావమును వహింపలేదు. కాని, యిటీవల నీవిషయము మరింత స్పష్టమగుటచే మాలవ్యాజీకి దానితో నెట్టిసంబంధమును యుండదనియు నతడు దానినియంగీకరించి యుండడనియు నేననుకొంటిని. అయినను నతనియాహ్వానమును పురస్కరించుకొనివెళ్ళి యతనినిపరిహాసపాత్రముగు స్థితిలోనుంచునట్టి విమర్శలనుచేయుట నాకుతగదని నేను తరువాత గ్రహించితిని. నేను దీనికి చాలచింతించితిని.

నేను తెలివితక్కువగ పడిన మరియొకప్రమాదముకుకూడ విచారించితిని. అజమీరులో నొకహిందూయువజనసంఘముచే నూతనముగ నామోదింపబడిన తీర్మానముయొక్కనకలు (అని చెప్పబడెను.) మాకు టపాద్వారా పంపబడెను. ఈ తీర్మానముచాల యభ్యంతరమైనతీర్మానము. నేను దీనిని నాకాశీయుపన్యాసములో నుదహరించితిని. నిజమున

క్కిట్రితీర్మానమేదియు నేట్రిసంఘముచేతను గావింపబడలేదు. మేమొక మోసములో పడిపోతిమి.

నా కాశీ యుపన్యాసము (సంక్షిప్తపరుపబడెను) గగ్గోలుపుట్టించెను. అట్టికేకలకు నేవలవడినను హిందూమహాసభానాయకుల దాడి లోనున్న తీవ్రతకు నేనెంతయో యాశ్చర్యపడితిని. ఈదాడులు చాల వరకు వ్యక్తిగతముగనుండి సారాంశముకు కావలసినవిషయమును ముట్టకుండెను. వారువెళ్ళవలసినంతవరకు వెళ్ళిరి. చివరకు నాకవకాశము చిక్కెను. నేనునెలలకొలది (జయిలులోనున్నపుడుకూడ) వారికిసమాధానమిచ్చుటకాతురపడుచుంటిని. కాని దానినెట్లు చేపట్టవలెనో తెలియకుండెను. అదియంతయు నొక కందిరీగల గూడువలెనుండెను. నేను కందిరీగలకలవడిన వాడనైయైనను బూతులక్రిందపరిణమించిన చర్చిల లోనికిదిగుట ముదావహముకాదు. కాని, యదినాకుతప్పనిసరియయ్యెను. నేనుహిందూ, ముస్లిముకులతత్వములను గురించి నాకుసహేతుకముగ కన్పించిన యొకవ్యాసమునువ్రాసితిని; ఈరెండునుకూడ నమ్మదగిన కులతత్వములు కూడకావనియు, వానివెనుక దాగియున్నసాంఘిక, రాజకీయ ప్రతీకారములనియు నేను రుజువుచేసితిని. కులనాయకుల యుపన్యాసముల యొక్కయు, వాజ్మూలములయొక్కయు వార్తాపత్రికలలోనుండి తీసినముక్కలు (నేనువీనిని జయిలులోపోగు చేసితిని) నాయొద్దనుండెను. నాయొద్దకావలసినంత విషయముండుటచే దాని సంతను నొకవార్తాపత్రిక వ్యాసములో నిరికించుట చాలదుర్ఘటముగ నుండెను.

ఈ నావ్యాసము భారతపత్రికలన్నింటిలోను ప్రకటింపబడెను. దానిలో నేను యుభయులనుగురించియు నెంతయోవ్రాసినను వారు మిన్నకుండుట వింతగనుండెను. నన్ను తీవ్రముగవిమర్శించిన హిందూ మహాసభనాయకు లసలేనోరెత్తలేదు. ముస్లిములతరఫున సర్ మహ

మ్మదు ఇక్బలుగారు రెండవరౌండు టేబిలు కాన్ఫరెన్సుకు సంబంధించిన కొన్నియంశములను సవరించుటకు ప్రయత్నించెను; అదిమినహా నా వాదమునుగురించి యతడేమియు మాట్లాడలేదు. నేనతనికిచ్చిన సమాధానములో రాజకీయ, కులసమస్యలను రెంటినికూడ కాన్‌స్టిట్యూయంటు అసెంబ్లీ నిర్ధారణచేయవలెనని సూచించితిని. తరువాత కులతత్త్వమును గురించి నేను మరియొకటి, రెండువ్యాసములను వ్రాసితిని. ఈవ్యాసములాదరింపబడుటయేగాక యోచనచేయుటకు ప్రయత్నించిన వారపయి మంచిఫలితమును కలుగచేసినందులకు నేనపరిమితోత్సాహమునుపొందితిని. కులతత్వము వెనుకనున్న రాగద్వేషములను మంత్రించి వేయగలనని నేనూహింపలేను. కులనాయకులు భారతదేశములోను, యింగ్లండులోనుగల యత్యంత ప్రతీకారవాదులకు జ్యేష్ఠభ్రాతలని చూపుటయే నాయుద్దేశ్యము. నిజమునకు వారు రాజకీయాభివృద్ధికిని యంతకంటెనెక్కువగ, సాంఘికాభివృద్ధికిని శత్రువులు. వారికోరికలకన్నింటికిని ప్రజలతో నెట్టిసంబంధమునులేదు. పైనున్న చిన్నబృందములవారికి కొంత యభివృద్ధిని కలుగజేయుటకే యవియుద్దేశింపబడెను. ‘హిందూముస్లిములైక్యము’ అని తరుచువేయబడు కేక (నిస్సందేహముగ నుపయోగకరమేయైనను) యైకమత్యము లేక పోవుటకు గలకారణములను తెలిసికొనుటకు కొంతప్రయత్నమును చేసినగాని నిష్ఫలమగునని నాకు కాన్పించెను. అయినను యీగారడీ మంత్రమును తరుచు జపించినచో నైకమత్యముచివర కూడిపడునని కొందరుభావించుచున్నట్లుకాన్పించును.

1857 నాటి విప్లవములగాయతు కులసమస్యపట్ల బ్రిటిషునీతియెట్లుండెను? ఈచరిత్రవినదగినది. ప్రధానముగను, విధాయకముగను హిందువులును, ముస్లిములును యేకమై పనిచేయుట కభ్యంతరములను కల్పించుటయు నొకరిపయి నొకరి నాడించుటయు వారినీతియైయుండెను. 1857 తరువాత ప్రభుత్వము హిందువులకంటె మహమ్మదీయులనే

కన్నెర్రగచూచెను. ముస్లిములు యెక్కువ కాలుదువ్వుదురనియు, భారతదేశములో మొన్నటివరకు పరిపాలకులముగనుంటిమను స్మృతి వారికుండుననియు, కనుక వారుపద్రవకరులనియు ప్రభుత్వము భావించెను. ముస్లిములు నూతన విద్యకుదూరులై ప్రభుత్వము క్రింద కొద్దియుద్యోగములను మాత్రమే కలిగియుండిరి. ఇదియంతయు సందేహమునకు కారణమయ్యెను. హిందువులు యింగ్లీషుభాష నతిసుకరముగ నవలంబించి గుమాస్తాపదవులను గుత్తగొనిరి; వారు చాలసాధువులుగ కాన్పించిరి.

అప్పుడు నూతనజాతీయత-పైనుండిఇంగ్లీషు చదువుకొనిన పై తరగతి విద్యాధికులనుండి-యభివృద్ధియయ్యెను. ఇదిసహజముగ హిందువులలోనేయుండెను. ముస్లిములు విద్యలో వెనుకబడియుండిరి. ఈజాతీయత యతిసాధుభాషలోను, హీనస్వరముతోను మాట్లాడెను. అయినను బ్రిటిషుప్రభుత్వమున కిది రుచింపలేదు. కనుక వారు ముస్లిములను ప్రోత్సహించుచు, వారిని జాతీయ వేదికనుండి వేరుచేయగోరిరి. ఇంగ్లీషువిద్య లేకపోవుటయొక్కటే ముస్లిముల కాటంకముగనుండెను; కాని యిది క్రమముగ తొలగిపోకతప్పదు. దూరదృష్టితో బ్రిటిషువారు భవిష్యత్తుకు పునాదులనువేసికొనిరి. ఈకృషిలోవారికి గొప్ప వ్యక్తియగు సర్ సయ్యదు అహ్మదుఖాను సాయపడెను.

సర్ సయ్యదు తన జాతియొక్క దుస్థితికి (ముఖ్యముగ విద్యలో) విచారపడెను; బ్రిటిషుప్రభుత్వ దృష్టిలో తనజాతిపట్ల వాదరాభిమానములు లేవని ఖేదపడెను. తన సమకాలీకులు చాలమందివలెనే యతడు బ్రిటిషువారి నెక్కువగ మెచ్చుకొనెడివాడు. అతని యూరపు సందర్శనమతనిపై గొప్పఫలితమును కలుగచేసెను. 19 వ శతాబ్దమధ్యమున నున్న యూరపు; లేక పశ్చిమయూరపు తన విజ్ఞానశిఖరము నధిరోహించి, ప్రపంచమున కప్రతిహతరాణియై, తనయాధిక్యతకు కారణ

ములగు గుణసంపత్తుతో మెరయుచుండెను. పైతరగతుల యాస్తులతి భద్రముగనుండి గొప్పమార్పులు కలుగునను భీతిలేక దినదినాభివృద్ధి చెందుచుండెను. అవి స్వేచ్ఛాయభివృద్ధి యగుచున్న దినములు; జగత్కళ్యాణముజరుగునను నమ్మకముగల దినములు. అచ్చటకు వెళ్ళినభారతీయులు యీగంభీరదృశ్యముచే నాకర్షింపబడుటలో నాశ్చర్యమేమియునులేదు. మొట్టమొదట హిందువులు రెక్కువమందివెళ్ళిరి. వారు లయూరపును, యింగ్లండును మెచ్చుకొనుచు తిరిగివచ్చిరి. క్రమముగ వారాకాంతికిని, భ్రాంతికిని యలవడుటచే మొదటినాశ్చర్యము తొలగిపోయెను. కాని సర్ సయ్యదుగారి విషయములో మొదటి యాశ్చర్యమును, మోహమును చాల ప్రస్ఫుటముగనుండెను. 1869 లో యింగ్లండును దర్శించి యతడు తనయభిప్రాయముల నింటికి వ్రాసెను. ఒక యుత్తరములో నతడిట్లువ్రాసెను. భారతదేశములోనున్న యింగ్లీషు వారు ఆదేశప్రజలను పశువులవలెను, హేయముగను, అమర్యాదగను చూతురను నేరమునుండి వారిని నేను విడువజాలకపోయినను వారు మనలనర్థము చేసికొనజాలక పోవుటచేతనే యట్లు చేయుచున్నారని భావించెదను; మనలనుగురించిన తమ యభిప్రాయములలో వారంత దోషులుకారని కూడ నేను యొప్పుకొనకతప్పదు. ఇంగ్లీషువారిని పొగడకుండగనే భారతదేశములోనున్న ప్రజలు, యెక్కువవారును, తక్కువవారును, పెద్ద వర్తకులును, చిన్నదుకాణదారులును, విద్యాధికులును, విద్యలేనివారును యింగ్లీషువారితో పోల్చి చూచినచో విద్యలోను, నడకలోను, నిజాయితీలోను, సమర్థుడగు, స్ఫురద్రూపియైన వాని ముందర నందవికారమగు జంతువెట్లుండునో యట్లుండెదరు. హిందూదేశములోనున్న మనలను నిర్వీర్యమైన పశువులని విశ్వసించుటకు ఆంగ్లేయులకు కారణము గలదు.... నేను చూచినది, నిత్యమును చూచుచుండునది భారతీయుని యూహాకెంతమాత్రమును అందని విషయములు.... ఆధ్యాత్మికముగను, లౌకికముగను మానవున కుండ

వలసిన సద్విషయములన్నియు భగవంతునిచే యూరపునకు, ముఖ్యముగ యింగ్లండునకు, ప్రసాదింపబడెను.

బ్రిటిషువారిని, యూరపును నింతకంటె నెక్కువగ నెవడును పొగడజాలడు. సర్ సయ్యదుకు అత్యద్భుతమైన యభిప్రాయము కలిగినట్లు విశదమగుచున్నది. బహుశః యతడు తన నిజప్రజను నిద్రనుండి మేల్కొలుపుటకును, ముందంజవేయునట్లు వారిని ప్రోత్సహించుటకును ఘాటైన భాష నుపయోగించి, వ్యత్యాసముల నుత్ప్రేక్షించెను. పాశ్చాత్యవిద్య నభ్యసించుటయే యీ ముందంజ యని యతడు విశ్వసించెను. ఆ విద్యలేనిదే యతని సంఘ మంతకంతకు వెనుకకు పోవును; నిర్వీర్యమగును. ఇంగ్లీషు విద్య యనగా ప్రభుత్వోద్యోగములు, భద్రత, పలుకుబడి, గౌరవము కనుక నీ విద్యపట్ల నతడు తన శక్తినంతను వినియోగించి తన ప్రజలను తనవలెనే యోచించినట్లు చేయ ప్రయత్నించెను. అతడు వారి బుద్ధి యితర విషయముల మీదకు బోకుండ చూడగోరెను. ముస్లిములయొక్క స్తబ్ధత్వమును, సందేహములను భేదించుట కష్టసాధ్యము. హిందూబూర్జువాలచేత ప్రతిపాదింపబడు నూతన జాతీయారంభము వారి బుద్ధిని చెడిగొట్టు దానివలె యతనికి గాన్పించెను. కనుక నతడు దాని నెదిర్చెను. పాశ్చాత్యవిద్యలో నర్థశతాబ్దము ముందంజవేసిన హిందువులు ప్రభుత్వమును విమర్శించు వినోదములో క్రీడింపవచ్చును. తన విద్యావిషయక ప్రయత్నములలో నతడా ప్రభుత్వసహాయమును పూర్తిగ నపేక్షించెను. కనుక ననాలోచిత కార్యములచే నతడు దీనిని పోగొట్టుకొన నిష్టపడక శైశవ జాతీయ కాంగ్రెసు పట్ల విముఖుడయ్యెను. బ్రిటిషు ప్రభుత్వ మిట్టి దృక్పథమును ప్రోత్సహించుట కువ్విళ్ళూరుచుండెను.

ముస్లిములకొరకు పాశ్చాత్యవిద్యమీద కేంద్రీకరింపవలెననెడి సర్ సయ్యదుగారి నిశ్చయము యుక్తమైనదే. అది లేకుండ వారు

యీ కొత్తరకపు జాతీయ నిర్మాణములో నుచితమైన పాత్రను వహింపజాలరు; వారు తమకంటె నెక్కువ విద్యను, మంచి యార్థిక పరిస్థితులను గలిగియున్న హిందువుల వెనుక నుండవలసిన గతి పట్టి యుండెడిది. చరిత్రచేతను లక్ష్యముచేతను ముస్లిము లప్పుడు బూర్జువా జాతీయోద్యమమునకు సిద్ధముగ లేరు. వారిలో హిందువులలోవలె బూర్జువాలు లేరు. కనుక సర్ సయ్యదుగారి కృషి పైకి చాల మితవాదపరముగనే కాన్పించినను నిజమైన విప్లవదిశలో నుండెను; ముస్లిములు యింకను ప్రజాస్వామికమునకు వ్యతిరేకమైన ఫ్యూడల్ లక్ష్యములోనే మునిగియుండిరి. కాని హిందువులలోని మధ్యతరగతి వారు యూరపియను లిబరలుల స్థాయిలో నాలోచింప నారంభించిరి; ఉభయులును పూర్తిగ మితవాదులు; బ్రిటిషు ప్రభుత్వముపై నాధారపడినవారు. సర్ సయ్యదుగారి మితవాదము, కొద్దిమంది ధనవంతులగు ముస్లిములు చెందునట్టి భూస్వాముల తరగతివారి మితవాదము. హిందూ మితవాదము వృత్తిలోను, వర్తకములోను అతిజాగ్రతగ సంచరించుచు పరిశ్రమలకును, పెట్టుబడికిని మార్గమును వెతుకుచుండు వాని మితవాదము; ఈ హిందూరాజకీయవేత్తలు యింగ్లీషు లిబరలిజముయొక్క ప్రకాశమానమగు కాంతులైన గ్లాడ్‌స్టను, బ్రైటు యిత్యాదులవైపు చూచుచుందురు. ముస్లిము లట్లుచేసిరని నేననుకొనను. బహుశః వారు టోరీలను, యింగ్లండులోని భూములున్న తరగతులను మెచ్చుకొనిరి. ఆర్మీనియాలో జరిగిన హత్యలను, టర్కీని గ్లాడ్‌స్టను పదే పదే గర్హించుటచే వారికి బూచివలె నుండెను. డిస్రేలీ టర్కీ యెడల నెక్కువగ స్నేహముగ నున్నట్లు కాన్పించెను; కనుక వారు (అట్టి విషయములలో శ్రద్ధ తీసికొనిన కొద్దిమంది) అతని యెడల కొంచెము పక్షపాతము వహించిరి.

సర్ సయ్యదుగారి యుపన్యాసములు కొన్ని నేడు వింతగనుండును. 1887 డిసెంబరులో లక్నోలో నతడిచ్చిన యుపన్యాసములో నాసమ

యములోననే జరుగుచున్న జాతీయకాంగ్రెసుయొక్క యతిమితవాదకోరికలను విమర్శించి గర్హించెను. సర్ సయ్యదు "...ప్రభుత్వము వారు ఆఫ్ఘనిస్థానముతో పోరినను లేక బర్మాను జయించినను వారినీతిని విమర్శించుట మనపనికాదు...చట్టములను చేయుటకు ప్రభుత్వమొక కౌన్సిలును నిర్మించెను...ఈకౌన్సిలుకు అదియన్ని రాష్ట్రములనుండియు ప్రజలయొక్క పరిస్థితులతోను, పరిపాలనతోను గొప్పపరిచయము కల వారిని యెన్నుకొనును. మరియు సంఘములో నుత్తమస్థానము నాక్రమించుటచే ఆయసెంబ్లీలో స్థానమున కర్హులగువారిని కొందరినెన్నుకొనును. సమర్థతకుబదులు సంఘములోనున్నస్థితినిబట్టి వారినేల యెన్నుకొనవలెను? అనికొందరడుగవచ్చును...తక్కువజాతివాడు లేక పేరుప్రఖ్యాతులులేని వంశమువాడు బి. యె. లేక యం. యె. యై కావలసిన సమర్థతకలిగియున్నచో నతడు తమపై యధికారమును వహించి, తమజీవితములను, ఆస్తిని మార్చునట్టి చట్టములను చేయు పదవిలోనుండుటకు మనలోని యుత్తమజాతులొప్పుకొనునా? యని నేనుమిమ్ముల నడుగుచున్నాను. ఎన్నటికిని యొప్పుకొనరు...వైస్రాయి సద్వంశసంజాతునితప్ప మరెవరిని తనసహోద్యోగిక్రింద తీసికొని, తన సోదరునివలెభావించి, ప్రభువులు, డ్యూకులు మొదలగువారితో మెక్కవలసిన విందుల కాహ్వానింప జాలడు...ప్రభుత్వము శాసనములను చేయుటకవలంబించిన పద్ధతులలో ప్రజాభిప్రాయములను మన్నించుట లేదని మనముచెప్పగలమా? చట్టములను చేయుటలో మనకు భాగము లేదని మనముచెప్పగలమా? నిశ్చయముగ నట్లు చెప్పజాలము."

భారతదేశములోని 'ఇస్లాముప్రజాస్వామికము' యొక్క ప్రతినిధియును, నాయకుడును యీవిధముగ మాట్లాడెను! అయోధ్యతాలూకుదార్లుగాని, ఆగ్రా, బీహారు, బెంగాలురాష్ట్రములలోని భూఖామందులుగాని నేడు యీసభలో మాట్లాడుటకు సాహసింతురని నేననుకొనను.

అయినను సర్ సయ్యదు యీవిషయములో ననన్యుడుకాడు. అనేక కాంగ్రెసుయుపన్యాసములుకూడ నేడు యింత వింతగనే కాన్పించును. కాని యప్పటి హిందూ ముస్లిము సమస్యయొక్క రాజకీయ, ఆర్థికస్థితి యిట్లుండెను: పైకిలేచుచున్నట్టియు, నార్థికముగ మంచిస్థితిలో నున్నట్టియు మధ్యతరగతి (హిందువులు) ప్యూడలు భూస్వాములతరగతిచే (ముస్లిములు) కొంతవరకు నెదుర్కొనబడి, యడ్డగింపబడెను. హిందూ భూఖామందులు తరుచు తమబూర్జువాలతో సన్నిహిత సంబంధము కలిగియుండి మధ్యతరగతులవారి కోర్కెలపట్ల తటస్థముగను, లేక సానుభూతితోనుకూడ నుండెడివారు. బ్రిటిషువారెప్పుడును ఫ్యూడలు సంఘమును బలపర్చెడివారు. ప్రజాసామాన్యమును, మధ్యతరగతులలోని క్రిందితరహావారును (ఇరువంకలవారును) యీచిత్రములో బొత్తిగ కాన్పించరు.

సర్ సయ్యదుయొక్క శక్తివంతమును, అధికార సమన్వితమును నగు నాకారము భారతముస్లిముల నాకర్షించెను. అలీఘరు కళాశాల యతనికోర్కెలయొక్కయు, నాశలయొక్కయు స్థూలాకారము. మార్పులు జరుగుచుండు కాలములో నొకయభివృద్ధి దాయకమగు భావము త్వరలోనే తనపనిని నిర్వర్తించినపై, యకాలమైనదై యాటంకకారిగ నుండవచ్చును. భారత లిబరలులే దీనికి చక్కని సాక్ష్యము. వారు ప్రాచీనకాంగ్రెసు సాంప్రదాయకముయొక్క నిజ సంతతివారనియు తరువాతవచ్చిన మనము మధ్యగావచ్చిన వారమనియు తరుచు జ్ఞాపకము చేయుచుందురు. నిశ్చయము. కాని ప్రపంచము మారుచుండుననియు, పాతకాంగ్రెసు సాంప్రదాయము గతవత్సర హిమముతో మాయమయ్యెననియు, నదియొక జ్ఞప్తిగమాత్రమే మిగిలె ననియు వారు మరచిపోయిరి. అట్లే సర్ సయ్యదుగారి సందేశము ఆకాలమునకు తగియుండెను, అవసరమయ్యెను. కాని యది యభి

వృద్ధిచెందుచున్న సంఘముయొక్క తుదిలక్ష్యము కాజాలదు. అత డింకొక పురుషాంతరము జీవించియున్నచో నతడే తనసందేశమునకు మరియొకరూపకల్పన చేసియుండెడివాడు; లేక నితరనాయకులు అతని పాతసందేశమునకు నూతన యర్థమునుచెప్పి దానిని మారుచున్న పరిస్థితుల కన్వయింపగలిగెడివారు. కాని, సర్ సయ్యదుకు కలిగిన విజయమును, అతనిస్మరణమెడలగల పూజ్యభావమును పాతవిశ్వాసమును వీడుటకితరులకు కష్టసాధ్యముచేసెను. దురదృష్టవశమున భారతదేశములోని ముస్లిములకు నూతనమార్గమును చూపించు విశేష ప్రతిభగల సమర్థులు కొఱతగనున్నారు. అలీఘురు కళాశాల చక్కనిపని చేసెను; అనేకమంది సమర్థులను తయారుచేసెను; ముస్లిము విద్యార్థులయొక్క దృష్టిసంతను మార్చివేసెను. అయినను అది తాను నిర్మింపబడిన రూపమునుదాటి పూర్తిగబయటకు పోజాలకుండెను. భూస్వాములు తత్త్వము దానిపై రాజ్యముచేసెను. సామాన్యవిద్యార్థియొక్క లక్ష్యమెప్పుడును ప్రభుత్వనౌకరిమీదనుండెను. నక్షత్ర పరిశోధనకాని, ఆత్మకుచెందు సాహసకృత్యములుగాని యతనిలో మచ్చునకైనను గానరావు. ఒక డిప్యూటీ కలెక్టరు పదవి వచ్చుచో నతడపరిమితానంద భరితుడగును. ఇస్లాము మహాప్రజాస్వామికములో తానొకసభ్యుడని జ్ఞాపకము చేయబడుటతో నతని గర్వముపశమించును. ఈసౌభ్రాతృత్వమునకు దాఖలాగా టర్కిషు ఫెజ్ అనబడు నొకయెఱ్ఱటోపీ నతడు గోటుగ తలపయి ధరించును. దీనిని తురుష్కులే (తరువాత) త్వరలో విడిచివేచిరి. ఈ విధముగ ప్రజాస్వామికమునకు తన శాశ్వతాధికారమును (ఇది తోడి ముస్లిము సోదరులతో తినుటకును, ప్రార్థించుటకును అతని కవకాశమిచ్చును) స్థిరపరచుకొనిన తరువాత భారతదేశములో రాజకీయ ప్రజాస్వామికమున్నదా లేదా యను విచారము నతడు పెట్టుకొనడు.

ఈసంకుచితదృష్టియు, ప్రభుత్వ నౌకరీలకొఱకు దేవులాడుటయు అలీఘురు లేక నితరచోట్లను గల ముస్లిము విద్యార్థులకొక్కరికే నియ

మింపబడలేదు. సహజముగ నెట్టి సాహసమును లేని హిందూ విద్యా ర్థులలోని ది తత్తుల్యముగనే ప్రదర్శింపబడుచున్నది. కాని పరిస్థితులు చాలమంది నీ బాటనుండి తరిమెను. వీరు అసంఖ్యాకముగ నుండిరి; వీరందరికిని చాలినన్ని నౌకరీలు లేవు. కనుక వీరు జాతీయ విప్లవోద్య మమునకు వెన్నెముకలైన విద్యాధికకుల బాహ్యులైరి.

సర్ సయ్యదుగారి రాజకీయసందేశముయొక్క సంకుచితఫలిత మునుండి భారత ముస్లిము లింకను పూర్తిగ కోలుకొనకమునుపే యిరు వది యవ శతాబ్దారంభమున జరిగిన విషయములు వారికిని జాతీయోద్య మమునకును (ఇది యిప్పు డధికారమును కోరుచు, కాలుమువ్వుచున్నది) గల భేదమును పెంపుచేయుటకు బ్రిటిషు ప్రభుత్వమునకు సహాయ పడెను. సర్ వలెన్‌టిన్ చిరాల్‌గారు 1910 లో తన 'భారతదేశ యసంతృప్తి' యను పుస్తకములో నిట్లు వ్రాసిరి. "భారతదేశ మహ మ్మదీయు లొక్కుమ్మడిగా తమ ప్రయోజనములను, యాశయములను బ్రిటిషు పరిపాలనాస్థాపనతోను, స్థిరత్వముతోను నేడు వైక్యము చేసి కొనినట్లు మున్నెన్నడును చేసియుండలేదని ధైర్యముగ నొక్కి వక్కా ణింపవచ్చును." రాజకీయ జోస్యములు చాల యుపద్రవకరములు సర్ వలెన్‌టిన్‌గారు వ్రాసిన ఐదేండ్లలోనే ముస్లిము విద్యాధికులు తమ్ము బంధించిన బంధనములను తెంచుకొని కాంగ్రెసుతో చేయి కల్పుటకు గట్టి ప్రయత్నము చేయుచుండిరి. పదేండ్లలో భారత ముస్లి ములు కాంగ్రెసును మించినట్లు కాన్పించిరి; వారు కాంగ్రెసునకే దారి చూపుచుండిరి. కాని యీ పదేండ్లును చాల ముఖ్యమైనవి. మహా సంగ్రామము వచ్చిపోయి ముక్కముక్కలు గావింపబడిన ప్రపంచ మును మరణకాల ఆస్తిగా మన కర్పించెను.

అయినను సర్ వలెన్‌టిన్‌గా రట్టి పర్యవసానమునకు వచ్చుటకు బాహ్యముగ ననేక కారణములు గలవు. ఆగాఖానుగారు ముస్లిములకు

నాయకు డయ్యెను. వారింకను ఫ్యూడల్ సాంప్రదాయముల కంటిపెట్టు కొని యుండిరనుటకు ఆయొక్క విషయమేచాలును. ఆగాఖానుబూర్జువా నాయకుడు కాడు, అతడు చాల డబ్బుగల రాకుమారుడు; ఒక మత శాఖకు నాయకుడు, బ్రిటిషు వారి దృష్టిలో, బ్రిటిషుపాలక జాతులతో నతనికి సన్నిహిత సంబంధముండుటచే, నతడు గొప్ప పురుషుడు. అతనికి విశేషవిజ్ఞానము కలదు; గొప్ప యిఙ్గ్లీషుభూస్వామి యొక్క జీవితమువంటి జీవితమును, వేటాడు జీవితమును, యెక్కువగ యూరపులోనే జీవించెను. ఈవిధముగ వ్యక్తిగతముగ నతనికి సంకుచిత మైన కులవిషయములును, సంఘవిషయములును లేవు. అతడు భూస్వాములైన ముస్లిములను, వృద్ధిచెందుచున్న బూర్జువాలను బ్రిటిషు ప్రభుత్వముతో జోడించుటకే ముస్లిము నాయకత్వమును వహించెను. కుల సమస్య నిజముగ రెండవది; ప్రధానలక్ష్యముకొరకే దానికి ప్రాముఖ్యత యివ్వబడును. ఆగాఖానుగారు వైస్రాయియైన మింటో ప్రభువుకు "బంగాళా విభజనవలన కలిగిన రాజకీయ స్థితిని గురించి మహమ్మదీయుల యభిప్రాయములను తెలిపెను. లేనిచో తొందరపడి హిందువులకు యెక్కువ రాజకీయ హక్కులు యివ్వబడవచ్చును. దీనివలన నధిక సంఖ్యాకులైన హిందువుల ప్రభ యెక్కువయగుటచే నది బ్రిటిషు పరిపాలనా స్థైర్యమునకును, నిర్వివాదమైన రాజభక్తి గల యల్ప సంఖ్యాక మహమ్మదీయుల ప్రయోజనములకును యుపద్రవకరముగ నుండును" అని నచ్చచెప్పెనని పిరాల్‌గారు మనకు చెప్పుచున్నారు.

కాని బాహ్యముగ బ్రిటిషు ప్రభుత్వముతోనున్నను దీనివెనుక నితరశక్తులు పనిచేయుచుండెను; విధాయకముగ నూతన ముస్లిము బూర్జువాలు తమ పరిస్థితులతో నంతకంతకసంతృప్తులగుచు జాతీయోద్యమమున కాకర్షింపబడుచుండిరి. ఆగాఖానుగారే యీ విషయమును గుర్తించి బ్రిటిషు వారిని తగిన భాషలో మందలించిరి. 1914

జనవరిలో (యుద్ధముకు చాల పూర్వము) ఎడింబరో రివ్యూలో వ్రాయుచు ప్రభుత్వము వారు హిందువులను ముస్లిములను విడదీయు పద్ధతిని మానుకొనవలసినదనియు, రెండు మతములలోని మితవాదులను నొక మకాములోనికి పోగుచేసి రెండు సంఘములకును చెందిన యువక భారతముయొక్క తీవ్రజాతీయభావముల నెదుర్కొనవలెననియు నతడు ప్రభుత్వము వారికి సలహా చెప్పెను. కనుక నతనికి ముస్లిము కులప్రయోజనము లందుకంటె భారతదేశములోని రాజకీయ మార్పును అడ్డగించుటయందే యెక్కువ శ్రద్ధయున్నట్లు విశదమగుచున్నది.

కాని, ఆగాఖానుగారుగాని, బ్రిటిషుప్రభుత్వముగాని ముస్లిము బూర్జువాలను జాతీయతవైపు పోకుండ చేయజాలకపోయిరి. ప్రపంచ యుద్ధము దీనినిమరింత త్వరితపరచెను. క్రొత్తనాయకులు రంగము నాక్రమించుటతోడనే ఆగాఖానుగారికి స్వస్తిచెప్పబడెను. అలీఘురు కాలేజీయొక్క స్వరముకూడ మారిపోయెను. క్రొత్తనాయకులలో ఆలీ సోదరులిరువురును అతిశక్తిసామర్థ్యములు కలవారు; వారిరువురును అలీఘురుకళాశాలలోనివారే! డాక్టరు యం. యె. అన్సారి, మౌలానా అబుల్ కలం అజదు, యింకను అనేకమంది బూర్జువానాయకులు ముస్లిముల రాజకీయవ్యవహారములలో నెక్కువప్రధానపాత్రను వహింప నారంభించిరి. అట్లే, కొంచెముతక్కువ మోతాదులో, యం. యె. జిన్నాగారునుచేసిరి. గాంధీజీ యీనాయకులలో చాలమందిని (జిన్నాగారిని కాదు) సాధారణముగ ముస్లిములను తన అసహాయోద్యమములోనికి లాగివేసెను; 1919-23 లో వారు నాయకపాత్రలను వహించిరి.

తరువాత ప్రతీకారమువచ్చెను. హిందువులలోను ముస్లిములలోను బలవంతముగ వెనుకకు నెట్టివేయబడిన కులప్రముఖులు ముందుకు వచ్చిరి. ఇదికొంచెము నెమ్మదిగజరిగినను, పిమ్మట వేగముగ సాగింపబడెను.

కులద్వేషములుండుటచే హిందూమహాసభకు మొదట కొంతప్రాముఖ్యత కలిగెను. కాని, రాజకీయముగ నదికాంగ్రెసు నెక్కువగ మెప్పించలేకపోయెను. ముస్లిముకులసంఘములు తమప్రజలలో కొంత పలుకుబడిని తిరిగి సంపాదించుకొనగలిగెను. అయినప్పటికిని ముస్లిమునాయకులలో బలీయమైనబృందమువారు మొదటినుండిచివరవరకును కాంగ్రెసుతోనే యుండిరి. బ్రిటిషుప్రభుత్వమువారు యీలోపల రాజకీయముగ కేవలము ప్రతీకారులైన ముస్లిముకులనాయకులకు కావలసినంతప్రోత్సాహము నిచ్చిరి. వీరివిజయములనుగమనించి హిందూమహాసభవారు ప్రతీకారములో వీరితో పోటీచేయప్రారంభించిరి. ఈవిధముగ ప్రభుత్వాదయను సంపాదింపవచ్చుననివీరనుకొనిరి. మహాసభలో ముందంజవేయువారు తరిమివేయబడిరి; లేక వారంతటవారే విడిచివెళ్ళిపోయిరి. అదియంతకంతకు మధ్యతరగతిలోని పైతరహావైపు, ముఖ్యముగ ఋణదాత, బ్యాంకరులవైపు మొగ్గెను.

శాసనసభలలోని స్థానముల పంపకమునుగురించి నిరంతరాయముగ చర్చించుకొనుచున్న యిరువంకల కులరాజకీయవేత్తలును ప్రభుత్వములోగల పలుకుబడివలనగలుగు ప్రాపకముకొరకే చూచుచుండిరి. అది, యుద్యోగములకొరకు మధ్యతరగతి విద్యాధికుల గుంజులాట. ఉద్యోగములు తక్కువ; కనుక వాటికొరకు హిందూముస్లిముకులనాయకులు పోట్లాడుకొనిరి. మొదటివారు (వారికున్నయుద్యోగములుయెక్కువ) స్వరక్షణకొరకును రెండవవారెల్లప్పుడును సంతకంతకెక్కువ కావలెననియు పోరిరి. ఈపోరాటములవెనుక మరియొక చాలప్రాముఖ్యమైన పోరాటముండెను. అది కేవలము కులసమస్య కాదు; కాని, దానికిదోహమునిచ్చెను. మొత్తముమీద హిందువులు పంజాబు, సింధు, బెంగాలులలో నెక్కువధనికులు, ఋణదాతలు, పట్టణవాసులు; ముస్లిములు యీరాష్ట్రములలో నెక్కువబీదలు, ఋణగ్రస్తులు,

గ్రామవాసులు; కనుక తరచు వీరిపోరాటము ఆర్థికమైనది. కాని దాని కెప్పుడును, కులస్వభావము కల్పింపబడెడిది. గ్రామఋణములను తగ్గించుటకు తీసికొనిరాబడిన వివిధరాష్ట్రచట్టములలోని చర్చలలో నిది యీమధ్యగతించిన మాసములలో, ముఖ్యముగ పంజాబులో, పైకి పొక్కెను. హిందూమహాసభాప్రతినిధులు మొదటినుండియు వీనినెదు ర్చుచు బ్యాంకరులతరగతి పక్షము వహించిరి.

హిందూమహాసభ ముస్లిముకులతత్త్వమును విమర్శించుచు తమజాతీయతలో నెట్టికళంకమునులేదని యెల్లప్పుడును చాటుచుండును. ముస్లిముసంస్థలు అసాధారణ కులతత్త్వప్రచోదితములని యందరకును తెలిసినవిషయము. మహాసభయొక్క కులతత్త్వము, అది జాతీయ బుర ఖాలో నుండుటచే నంతసులభగ్రాహ్యముకాదు. జాతీయమును, ప్రజా స్వామికమునునగు పరిష్కారము పయితరగతి హిందూప్రయోజనము లకు నష్టమును కలిగించినపుడు పరీక్షవచ్చును. ఈపరీక్షలోహిందూ మహాసభయనేకసార్లు ఓడిపోయెను. కొద్దిసంఘమువారి ఆర్థికప్రయో జనములకొరకు అధికసంఖ్యాకులు ప్రకటించిన కోరికలకు భిన్నముగ వారు సింధుదేశ విభజనమును మొదటనుండియు నెదిరించిరి.

కాని, రౌండుటేబిలు కాన్ఫరెన్సులలో హిందూముస్లిము కుల తత్త్వవాదులిరువురును అసాధారణప్రతీకారమును జాతీయవైరుధ్య మును ప్రదర్శించిరి. బ్రిటిషుప్రభుత్వమువారు నిక్కచ్చియైన కులత్వ ముగల ముస్లిములను మాత్రమే చేర్చుకొనెదమని పట్టుబట్టిరి. వీరు, ఆగాఖానుగారి నాయకత్వముక్రింద నత్యంతప్రతీకారులును, (భారత దేశదృష్టిలోనేగాక, అభివృద్ధిని వాంఛించు నన్నిబృందముల దృష్టి లోను) బ్రిటిషుపబ్లిక్ జీవితములో నత్యంతయుపద్రవకరులును నైన వారితోనేకమయిరి. ఆగాఖానుగారును, అతని బృందమును లాయిడ్ ప్రభువుతోను, అతనిపార్టీతోను సన్నిహిత సంబంధమును కలిగియుం

మట యసాధారణవిషయము. వారు మరియొకయడుగు ముందుకు వేసి, యూరపియను సంఘప్రతినిధులతోను, యితరులతోను, ఆర్. టి. సి. లో సంఘులను చేసికొనిరి. ఇది చాలవిచారకరమైనవిషయము. ఏలనన యీసంఘము హిందూదేశములో భారతస్వాతంత్ర్యమునకు ప్రబలమైన విరోధియైయుండెను; యింకనునున్నది.

హిందూమహాసభా ప్రతినిధులు దీనికి జవాబుగ స్వాతంత్ర్యమున కన్నివిధములగు నాటంకములను (ముఖ్యముగ పంజాబులో)-బ్రిటిషువారి ప్రయోజనములకొరకు సంరక్షణలనుకోరిరి. బ్రిటిషుప్రభుత్వముతో సహకారముచేయు ప్రయత్నములలో వారు ముస్లిములను చిత్తుచేయ ప్రయత్నించి, దేనిని సాధింపకపోగా, తమ నిజవిషయమును పాడుచేసికొని స్వాతంత్ర్యధర్మమునకు ద్రోహ మొనర్చిరి. ముస్లిములు అధమము ఆత్మగౌరవముతో మాట్లాడిరి. హిందూకుల తత్త్వవాదులు దీనికైనను నోచుకొనలేదు.

ముఖ్యవిషయమేమనిన యిరుపక్షముల కులనాయకులును కొద్దిమంది పయితరగతి ప్రతీకారబృందమునకు ప్రాతినిధ్యమును వహించి తమస్వార్థములకొరకు ప్రజలయొక్క మతద్వేషములను కొల్లగొని, లబ్ధిని పొందుచున్నారు. ఉభయులును ఆర్థికసమస్యల విచారణ నణచివేయుటకును, తప్పించుటకును సర్వప్రయత్నములను చేయుదురు. ఈ సమస్యల నణచివేయుటకు వీలులేని సమయము త్వరలోనే రానున్నది. అప్పుడు, నిస్సందేహముగ, యిరువదియేండ్లక్రిందట ఆగాఖానుగారు తీవ్రవాదుల నెదుర్చుటకొరకు సామాన్యకూటముక్రింద జేరవలెనని మితవాదులకిచ్చిన సలహానే యుభయ పక్షముల కులనాయకులును ప్రతిధ్వనిచేసెదరు. కొంతవరకది యిదివరకే కాన్పించుచున్నది.ఉభయ పక్షములవారును బహిరంగముగ నెంతపోరాడుకొనినను అసెంబ్లీలోను, యితరచోట్లను ప్రతీకార తీర్మానములను చేయుటకు ప్రభుత్వముకు

సహాయము చేయుటలో సహకారము చేసికొనుచున్నారు. ఈత్రితయము ఒటావాతీర్మానములో మిళావుకాలేదా!

ఈలోపుగ ఆగాఖానుగారికిని కన్సర్వేటివుపార్టీయొక్క కుడి పక్షములో నతివాదులకును సన్నిహిత సంబంధము సాగుచునే యుండెను. 1934 అక్టోబరులో నతడు బ్రిటిషు నౌకాదళమువారి విందుకు గౌరవార్థమైన యతిథిగవెళ్ళెను. లాయిడ్ ప్రభువు దీని కధ్యక్షుడు. లాయిడ్ ప్రభువుగారు బ్రిస్టల్ లోజరిగిన కన్సర్వేటివు కాన్ఫరెన్సులో బ్రిటిషునౌకాదళమును మరింత బలపర్చవలెనని చేసిన సూచనలను యీాయన మనఃపూర్వకముగ నామోదించెను. ఈభారతనాయకశిఖామణి సామ్రాజ్యమును, యింగ్లండును కాపాడుటయందు బాల్డ్విను గారికంటె లేక 'జాతీయ' ప్రభుత్వముకంటె నెక్కువ యాతురమును చూపుచు బ్రిటిషు నౌకాదళమభివృద్ధి కావలెననుటలో వారికంటె ముందంజవేసెను. అవును. ఇదియంతయు శాంతికొరకు!

మరుసటినెలలో 1934 నవంబరులో, లండను నగరములో నొక ఫిలుము ప్రయివేటుగ చూపబడెనని రిపోర్టుచేయబడెను. "ముస్లిము ప్రపంచమును బ్రిటిషు సామ్రాజ్యముతో నవిచ్ఛిన్న స్నేహముతో కలుపుట" యేదాని యుద్దేశ్యము. ఈసందర్భములో ఆగాఖానుగారును లాయడ్ ప్రభువుగారును అతిథులుగ పిలువబడిరట. ఈయుభయులును అవినాభావముగ (సామ్రాజ్యవిషయములలో) నైక్యమైపోయినట్లు కాన్పించును. రెండుగుండె కాయలు—తేజబహదురు సప్రూ, యం.ఆర్. జయకర్లు మనజాతీయ రాజకీయములలోవలె-ఒకటివలె స్పందించును. భారతదేశమున కత్యధికముగ సంతర్పణ చేయుచున్నారని లాయిడ్ ప్రభువు అధికారములోనున్న కన్సర్వేటివు నాయకులమీాదను, జాతీయ ప్రభుత్వముమీాదను (పైయుభయులును నింత తరుచుకలిసితిరుగుచున్న మాసములలోనే) దయాదాక్షిణ్య రహితముగ ధ్వజమునెత్తెనను సంగతిని గమనింపవలసి యున్నది.

ఇటీవల కొంతమంది ముస్లిముకులనాయకుల యుపన్యాసముల లోను, వాఙ్మూలములలోను నొకచిత్రమైన మార్పుకాన్పించును. దీనికి నిజమైన ప్రాముఖ్యతలేదు. కాని చాలమంది యిట్లు భావింతు రని నేననుకొనను. అయినను యిది కులతత్త్వముయొక్క చిత్తప్రవృత్తిని తెలుపును. దీనికి పెద్దప్రాముఖ్యత యివ్వబడెను. భారతదేశములోని 'ముస్లిముజాతి', 'ముస్లిమువిజ్ఞానము', హిందూముస్లిము 'విజ్ఞానముల' పరస్పరబద్ధవైరుధ్యము-వీనికెక్కువ ప్రాధాన్యతయివ్వబడెను. దీనివిధా యక సారాంశమేమన (అట్లుబహిరంగముగ చెప్పకపోయినను) యీ రెండు 'విజ్ఞానములకును' మధ్యవర్తిగనుండుటకు, వీనిని సమదృష్టితో నడుపుటకు బ్రిటిషు ప్రభుత్వమాచంద్రార్కము భారతదేశములోనుండ వలెను.

కొద్దిమంది హిందూకులనాయకులు సరిగా యీపద్ధతిగనే భావింతురు; ఒక్కవ్యత్యాసము మాత్రముండును. తాము అధికసంఖ్యా కులుగనుండుటచే తమ ముద్దరగల 'విజ్ఞానమే' చివరకు జయించునని నారాశింతురు.

హిందూ, ముస్లిము 'విజ్ఞానములు', 'ముస్లింజాతి'-ఈపదములు ఆకర్షవంతములగు భూతకాలచారిత్రక వీధులను, భవిష్యద్వర్తమాన వాయు సౌధములను యెంతచిత్రముగ తెరచును భారతదేశములో ముస్లిముజాతి-జాతిలోజాతి; యిది యిమిడికయైనదికూడ కాదు. అస్ప ష్టము, విస్తరించినది నిర్ధారణచేయుటకు వీలులేనిది. రాజకీయముగ నీభావము అసంగతమైనది; ఆర్థికముగ నిదిపిచ్చిమాట, విచారణీయమైన విషయముకాదు. ఇది దీనివెనుకనున్న చిత్తవృత్తిని తెలుపుటలో మనకు తోడ్పడుచున్నది. మధ్యయుగములలోను, తరువాతను యిట్టి అమిశ్రమ యోగ్యములైన వేరువేరు 'జాతులు' ఉండెడివి. ఆటమను సుల్తానుల ప్రథమ దినములలో కాన్‌స్టాంటునోపిలులో నిట్టి 'జాతి'

వేరువేరుగ జీవించి కొంతస్వాతంత్ర్యమును కలిగియుండెడివి. ల్యాటిను క్రైస్తవులు, సనాతనక్రైస్తవులు, జ్యూమతస్థులు మొదలగువారుండెడివారు. ఇది యస్యరాష్ట్రముల నాక్రమించుకొనుట కారంభము. ఇటీవల నిది యనేక ప్రాచ్యదేశముల కుపద్రవముగ పరిణమించెను. కనుక 'ముస్లిముజాతి' యనగా జాతియనునది యెంత మాత్రముకాదనియు మతబంధముకలదనియు నర్థము; అనగా ఆధునిక యర్థములోనున్న నేజాతిని వృద్ధిచెందనీయ రాదని యర్థము; అనగా నాధునిక నాగరికతను విడిచిపెట్టి మనము తిరిగిమధ్యయుగ పద్ధతులకు పోవలెననియర్థము; అనగానిరంకుశ ప్రభుత్వములేక విదేశప్రభుత్వము; అనగా చివరపర్యవసానము, మనస్సుయొక్క యుద్రేకస్థితితప్ప వేరేమియులేదనియు, యథార్థములను, ముఖ్యముగ నార్థిక యథార్థములను నెదుర్కొనుటకు బుద్ధిపూర్వకముగ లేక నబుద్ధిపూర్వకముగ కోరిక లేకయుండుట యనియు నర్థము. రాగాదుల తర్కమునుతలక్రిందులు చేయుటకొక మార్గము కలదు. అవియహేతుకముగ కాన్పించుచున్నంత మాత్రమున మనము వానిని నిర్లక్ష్యముచేయజనదు. కానిముస్లిముజాతి యనుయీభావము కొద్దిమంది యూహలయొక్క కట్టుకథమాత్రమేయగును. పత్రికలలో దానికీయబడిన ప్రచురణయే లేనియెడల దానినెవరును విని యేయుండకపోవుదురు. చాలమంది యొకవేళ దానినివిశ్వసించినను యథార్థముయొక్క స్పర్శతగులుటతోడనే యదిపలాయనమగును.

హిందూ, ముస్లిము 'విజ్ఞానము' అనుభావములుకూడ నిట్టివే. జాతీయవిజ్ఞానములు అనుభావముకూడ శీఘ్రముగ నశించుచున్నవి. ప్రపంచమంతయునొకే విజ్ఞానకేంద్రమగుచున్నది. జాతులన్నియు చాల కాలమువరకు తమప్రత్యేకచిహ్నములను - భాష, ఆచారములు, భావించువిధములు మొదలగువానిని, ఉంచుకొనవచ్చును. కానియంత్రయుగము, శాస్త్రము, శీఘ్రయానము, ప్రపంచ వార్తలనవిచ్ఛిన్నముగ సరఫరాచేయుట, దూరశ్రవణము, సినిమా -మొదలగునవి

వానినంతకంతకు చదునుచేయును. ఈవిధాయకస్వభావము నెవడును యెదిరింపజాలడు. ఆధునికనాగరికతను ధ్వంసముచేయు ప్రపంచయుద్ధమొక్కటియే దీనిని నిజముగ వారింపగలదు. సాంప్రదాయజన్యమైనహిందూముస్లిముజీవిత వేదాంతములలో నిశ్చయముగ ననేక భేదములుకలవు. కాని యీరెంటిని యాధునికశాస్త్రీయ, పారిశ్రామికజీవిత దృశ్యముతో పోల్చిచూచినచో నీభేదములుకాన్పించవు. ఏలనన యీ రెండవదానికిని మొదటిరెంటికిని విశేషయంతరువుకలదు. నేడుభారతదేశములోనున్న యధార్థమైనపోరాటము హిందూ, ముస్లిమువిజ్ఞానములమధ్యలేదు. అది యారెంటికిని, వీనిని, జయించుచున్న యాధునిక నాగరికతయొక్క శాస్త్రీయ విజ్ఞానమునకునుమధ్య కలదు. 'ముస్లిము విజ్ఞానమును' (అదియేదైనను) రక్షించుకొనగోరువారు హిందూవిజ్ఞానమునుగురించి బాధపడనక్కరలేదు. వారుపశ్చిమదిశనుండివచ్చు రాక్షసినికాచుకొనవలెను. ఆధునికశాస్త్రీయ, పారిశ్రామిక విజ్ఞానము నెదుర్కొను ప్రయత్నములన్నియు హిందువులవికానిండు ముస్లిములవికానిండు, విఫలములగునని చెప్పుటకు, వ్యక్తిగతముగ, నాకెట్టిసంశయమునులేదు. నేనీవిఫలతను నిర్విచారముగ వీక్షించుచుందును. రైల్వేలు మొదలగునవి యిచ్చటకువచ్చినపుడే యనైచ్ఛికముగను, అబుద్ధిపూర్వకముగను మనము కోరితిమి. అలీఘురుకళాశాలను ప్రారంభించినపుడు సర్. సయ్యదు భారతముస్లిముల తరఫున కోరుకొనెను. కాని నిజముగా మన కెవరికిని యీవిషయములో నెట్టిస్వేచ్ఛయునులేదు. మునిగిపోవువాడు గడ్డిపరకనైనను పట్టుకొని రక్షింపదలచుకొనునట్టి స్వేచ్ఛయే మనకును కలదు.

కాని, యీ 'ముస్లిమువిజ్ఞానము' యేది? ఇది అరబ్బులు, పర్షియనులు, తురుష్కులు మొదలగువారు చేసినఘనకార్యములకు సంబంధించిన యొకవిధమగు కలస్మృతియా? లేక భాష, కళ, గానము, ఆచారములు మొదలగువానిస్మృతియా? వర్తమాన ముస్లిము కళ,

ముస్లిముగాయకులను ఉదహరించినవాడొక్కడును నాకు కాన్పించదు. భారతదేశములో ముస్లిముభావముల నుత్పన్నముచేసినవి అరబ్బీ, పరిష్యనుభాషలు, ముఖ్యముగ రెండవది. కాని, పరిష్యనుభాషయొక్క పలుకుబడిలో మనవాసనయేమియునులేదు. పరిష్యనుభాషయు, ననేకపరిష్యను సంప్రదాయములును, ఆచారములును వేలకొలది సంవత్సరముల క్రిందట భారతదేశమువచ్చి యుత్తర హిందూదేశమంతటను తమ ప్రభావమును వ్యాపింపజేసెను. పరిష్యాదేశము ప్రాచ్యులకు ఫ్రాన్సువంటిది. అది తన భాషను, విజ్ఞానమును తన యిరుగు పొరుగు వారికి పంపును. అది భారత దేశములోనున్న మనయందరికిని సామాన్యమైన, యమూల్యపిత్రార్జితము.

ఇస్లామికజాతులును, దేశములును గతములోసాధించిన ఘనకార్యములందలి యభిమానమే బలవత్తరమైన యిస్లామికానుబంధములలో నొకటిగ కాన్పించును. వివిధజాతుల యీయుదారచరిత్రకు ముస్లిములపట్లయసూయపడువారుందురా? వారు దానిని శ్లాఘించుచుకాని ద్వేషించునంతకాలము వారినుండిదానినెవరును తీసికొనిపోజాలరు. యథార్థమునకు నీ గతచరిత్ర చాలవరకు మనకందరకును సామాన్యపిత్రార్జితము. వలనన యూరప్పుయొక్క యత్యాచారముల మీదకు ఆసియాదేశస్థులమైనమనల నొకసామాన్యబంధమైక్యముచేయుచున్నట్లు భావింతుము. స్పెయినుదేశములోనున్న అరబ్బులపోరాటములనుగురించియు, క్రైస్తవులుచేసిన మతయుద్ధములను గురించియు నేనెప్పుడుచదివినను నాసానుభూతియంతయు వారిప్రక్కనేయుండెడిది. నేనునిష్పక్షపాతముగనుండుటకును, విషయమునకు సంబంధించియుండుటకును ప్రయత్నించితిని. నేనెంత ప్రయత్నించినను యాసియాదేశపు ప్రజల సంబంధమువచ్చినప్పుడు నాలోనున్నయాసియాతత్త్వము నావిమర్శను మార్పుచేసెడిది.

ఈ 'ముస్లిమువిజ్ఞానము' యేదియో తెలిసికొనుటకు నేనెంతయో ప్రయత్నించితిని. కాని నేను సఫలుడను కాలేదని యొప్పుకొనకతప్పదు. ఉత్తరహిందూదేశములో నత్యల్పసంఖ్యాకులగు మధ్యతరగతిముస్లిములమీదను హిందువులమీదను పరిష్యనుభాషకును, సాంప్రదాయములకును పలుకుబడియున్నట్లు నేను చూచితిని. ప్రజాసామాన్యమును చూచినచో 'ముస్లిమువిజ్ఞానము' యొక్క యతిస్పష్టమైన చిహ్నములేవియన యంతపొడుగు, పొట్టిగానియొకతరహాపాయిజామాలును, మీసములను యొకప్రత్యేకవిధముగ గొరిగించుట లేక కత్తిరించుట, కాని, గడ్డమునుమాత్రము స్వేచ్ఛగపెరుగనిచ్చుట, ప్రత్యేకమైనమూతిగలయొక చెంబు; ఇట్లే హిందువుల యాచారములు, ఒకధోతినిధరించుట, పిలకజుట్టు, మరియొకవిధమగు చెంబు. నిజమునకు యీభేదములుకూడ పట్టణములకు సంబంధించినవి; అవి మాయమగుచున్నవి. ముస్లిమువ్యవసాయదారును, పారిశ్రామిక వర్కరును హిందూవ్యవసాయదారునుండియు, వర్కరునుండియు వేరుచేయుట కష్టము. ముస్లిము విద్యార్థులు అరుదుగ గడ్డమును పెంచుదురు; అలీఘరు యువకను జూలుతోనున్న యెర్రటితురుష్కటోపీని (తుర్కీదేశము దానిని విడిచిపెట్టినను అదితురుష్కమనబడును) వరించును. ముస్లిము స్త్రీలు చీరలను కట్టుకొని మెల్లమెల్లగా ఘోషావీడి వయికివచ్చుచున్నారు. నారుచులు యీయాచారములలోని కొన్నింటితో నైక్యము కాజాలవు. నాకుగడ్డములు, మీసములు, పిలకలుగిట్టవు. కాని, నారుచులను నేనితరులపై బలవంతపరుప నిచ్చగింపను. కాని యమానుల్లా కాబూలులో గడ్డములనమాంతముగ తీయించివేసినపుడు నేనుసంతోషించితినని యొప్పుకొనకతప్పదు.

ఎల్లప్పుడును వెనుకకే తిరిగి చూచుచుండు హిందువులును, ముస్లిములును, తమచేతులనుండి జారిపోవుచున్నదానిని యెల్లప్పుడును పట్టుకొనుచుండువారును విచారకరమగు దృష్టిని ప్రదర్శింతురు. నేను

భూతకాలమును గ్రహింపగోరుటలేదు, తిరస్కరింపగోరుటలేదు. మన భూతకాలములో ప్రత్యేకముగ సౌందర్యమైనదెంతయో కలదు. అది శాశ్వతముగ నుండుననుటకు నాకెట్టి సందేహమునులేదు. కాని వీరు ఆసౌందర్యమును వరింపరు, వీరు అతినిష్ప్రయోజనమైనదానిని, తరుచు హానిచేయుదానిని, గ్రహింతురు.

ఇటీవల సంవత్సరములో భారత ముస్లిములకు నిరంతరాయమైన దెబ్బలు తగిలెను; వారత్యంత ప్రేమతో దోహదముచేసికొనిన యనేకభావములు ముక్కలైపోయెను. ఇస్లాముకు గురుపీఠమైన టర్కీ-1920 లో భారతదేశము దేనికొరకతి ధైర్యముగ పోరెనో యట్టిఖిలాఫతుకు స్వస్తిచెప్పుటయేగాక క్రమక్రమముగ మతమునే విడిచిపెట్టెను. టర్కీయొక్క నూతనచట్టములో నది ముస్లిముప్రభుత్వము అని చెప్ప బడెను; కాని యెట్టిదురభిప్రాయమును కలుగకుండుటకు కెమల్‌పాషా 1927 లో నిట్లుచెప్పెను. "టర్కీ ముస్లిముప్రభుత్వము అని చట్టములో చేయబడిన సూత్రము ఒకరాజీసూత్రము; మొట్టమొదటి యవకాశము దొరుకుటతోడనే యది తుడిచివేయుబడును." తరువాత సతడీ సూచన ప్రకారము ఆచరించెనని నేను విశ్వసించెదను. ఈజిప్టుకూడ, మరింత యెక్కువ జాగ్రతతోనైనను, టర్కీననుసరించుచు తనరాజకీయములను మతముతో సంబంధము లేకుండ నుంచెను. అట్లే, చాల వెనుకబడియున్న అరబుతప్ప, తక్కిన యరబుదేశములు చేసెను. పరిష్యా తనవైజ్ఞానిక ప్రబోధముకొరకు వెనుకకుతిరిగి యిస్లాముయొక్క పూర్వపుగోజులను కాంక్షించుచున్నది. ప్రతిచోటను మతమువెనకకు పోవుచున్నది. జాతీయత ముందుకు వచ్చుచున్నది. జాతీయతవెనుక సాంఘిక, ఆర్థికవిషయములను గురించి చెప్పుచుయితర 'ఇజములు' తత్త్వములు వచ్చుచున్నవి. 'ముస్లిముజాతి' 'ముస్లిము విజ్ఞానము' సంగతి యేమయ్యెను! ఇకముందవి దయాసముద్రులగు బ్రిటిషుపరిపాలకులక్రింద యొక్కయుత్తర హిందూదేశములోనే కాన్పించునా ?

---

## ౫౭

## ప్రతిష్టంభన.



నేను తిరిగి నిర్బంధింపబడవచ్చును, శిక్షింపబడవచ్చును అను భావమెప్పుడును నాకుండెను. దేశమంతయు ఆర్డినెన్సులచే పాలింపబడుచుండ, కాంగ్రెసే యక్రమ సంఘముగనుండ నిది సందేహాస్పదమెట్లు కాగలదు! బ్రిటిషు ప్రభుత్వ తత్త్వమును బట్టియు, నాప్రకృతిని బట్టియు నన్ను అణచివేయుట విధాయకమని కాన్పించెను. ఈనిత్యాయవకాశముండుటచే నాపనికొంత చెడుచుండెను; నేనేమి చేయుటకును స్థిరపరచుకొనజాలకుంటిని. చేయగలిగినంత చేయుటకు నేను త్వరపడుచుంటిని.

అయినను నిర్బంధము ననవసరముగ తెచ్చిపెట్టుకొనుటకు నాకిష్టములేకుండుటచే దాని కవకాశము నిచ్చుకార్యములను చాలవరకు తగ్గించితిని. రాష్ట్రములోను, బయటను సంచారము చేయవలసినదను యాహ్వానములు వచ్చుచుండెడివి. నేనందుల కంగీకరింపలేదు. ఉపన్యాసముల నిచ్చుచు చేయునట్టి యేసంచారమైనను యుద్రేకకరమైన దండయాత్రయగును. ఇది హఠాత్తుగ నాపివేయబడును. అప్పుడు నాకింకొక మధ్యమార్గములేదు. నే నేప్రదేశమునకైనను మరియొక యుద్దేశ్యముతో వెళ్ళినపుడు-గాంధీజీతోను వర్కింగుకమిటీతోను సంప్రదించుటకు-నేను బహిరంగోపన్యాసముల నిచ్చుచు స్వేచ్ఛగా మాట్లాడెడివాడను. జబ్బలపురములో గొప్పసభయు, బ్రహ్మాండమగు యుత్సవమును జరిగెను. ఢిల్లీలోనే నిదివరకు చూచిన దానికంటె పెద్దసమావేశము జరిగెను. ఈ సభలయొక్క విజయమే ప్రభుత్వమిక నిట్టివాటిని సహింపజాలదని తెలుపుచుండెను. ఢిల్లీసభముగియుటతోడనే నానిర్బం

ధవదంతులు చెలరేగెను. కాని నేను అలీఘురులో ముస్లిము విద్యార్థుల కుపన్యసించి యలహాబాదు చేరుకొంటిని.

ప్రభుత్వము రాజకీయకృషినంతను నలిపివేయుటకు ప్రయత్నించుచుండ రాజకీయేతరములైన పబ్లికుపనులలో పాల్గొనుట నాకిష్టములేకుండెను. మనసంగ్రామముతో సంబంధములేని వట్టి నిత్యకర్మలలో జోక్యము కల్పించుకొని (ఇవివాటంతటవి యవసరమేయైనను) దానినుండి తప్పించుకొనవలెననెడి స్వభావము కాంగ్రెసువారిలో కాన్పించెను. ఇది సహజము; కాని, దీనినప్పుడు ప్రోత్సహింపగూడదని నేను భావించితిని.

పరిస్థితుల నవలోకించి భవిష్యత్కార్యములను నిర్ణయించుటకు 1933 అక్టోబరు మధ్యకాలమున యు. పి. కాంగ్రెసువర్కరులసభ అలహాబాదులో జరిగెను. రాష్ట్రకాంగ్రెసుకమిటీ యక్రమసంఘము. చట్టమును ధిక్కరించుటకుగాక మేము కలుసుకొనుటకే జేరితిమి. కనుక మేమీకమిటీని పిలువలేదు. కాని జయిలువెలుపలనున్న కమిటీసభ్యులను యితరవర్కరులను కొంతమందిని యిష్టాగోష్టిసభకు పిలిచితిమి. మా సభలు ప్రయివేటుసభలైనను వాటికి రహస్యములులేవు. ప్రభుత్వము జోక్యముకల్పించుకొనునో లేదో మాకు చివరవరకును తెలియదు. ఈ సభలలో ఆర్థికమాంద్యము, నాజీసిద్ధాంతము కమ్యూనిజము మొదలగు ప్రపంచపరిస్థితినిగురించి మేము యెక్కువశ్రద్ధతీసికొంటిమి. భారత పోరాటమును ఇతరచోట్లజరుగు సంభవములతో సమన్వయించిచూడవలెనని మేము మావర్కరులనుకోరితిమి. చివరకాసభ మాలక్ష్యమును నిర్వచించుచు నొక సామ్యవాదతీర్మానము నామోదించెను. శాసనోల్లంఘనమును విరమించుట నదియాక్షేపించెను. విశాలవ్యాప్తిగల శాసనోల్లంఘనమున కవకాశములేదనియు, వ్యక్తిగత శాసనోల్లంఘనము కూడ త్వరలోనే క్షీణించుననియు, లేక నతితక్కువ వ్యాప్తి గలిగియుండుననియు నందరకును తెలియును; కాని ప్రభుత్వమువారి అర్డినెన్సు చట్ట

ముఖమును, దాడియు సాగుచుండుటచే విరమించుటవలన మనకు కలుగు వ్యత్యాసమేమియును లేదు. కనుక (మరెందుకును గాక నొక చిహ్నముగ నుండుటకు) మేము మామూలు శాసనోల్లంఘనమును సాగించుటకే తీర్మానించితిమి. కాని మేము అరెస్టులను కోరుటకేమియు చేయవలదనియే మావర్కరులకు చెప్పితిమి. వారు తమ సామాన్య ధర్మమును నెరవేర్చుచుందురు. అందులో వారికి నిర్బంధములు ప్రాప్తించుచో సంతోషముతో స్వీకరింతురు. ముఖ్యముగ గ్రామములతో తిరిగి సంబంధమును కలిగించుకొని వ్యవసాయదారుల స్థితిని కనుగొనవలసినదని మేము వారికి చెప్పితిమి. పన్ను చెల్లింపరాదను యుద్యమ మప్పుడు లేనేలేదు. పూనా సభ జరిగిన తరువాత నిది తుదిసారి విరమింపబడెను. అప్పటి పరిస్థితులలో నది పునరుద్ధరింప బడజాలదని స్పష్టమగుచుండెను.

ఈప్రోగ్రాము సాధువైనది, తీవ్రతలేనిది; ఇందులో న్యాయవిరుద్ధమైనదేదియునులేదు. అయినను యిది యరెస్టులకు కారణమగునని మేము గ్రహించితిమి. మావర్కరులు గ్రామములలోనికి వెళ్ళుటతోడనే అరెస్టుచేయబడి పన్నుల నిరాకరణమును బోధించిరని (ఇది కేవలము అబద్ధము) కేసుపెట్టబడి శిక్షింపబడిరి. నాసహచరులు చాలమంది నిర్బంధింపబడినతోడనే నేనీగ్రామప్రాంతములకు వెళ్ళవలెనను కొంటిని. కాని, నాకితరపనులుండుటచే పోజాలకపోతిని.

అఖిలభారతపరిస్థితిని విచారించుటకు, ఆనెలలో రెండుసారులు వర్కింగుకమిటీ సమావేశమయ్యెను. గాంధీజీప్రోత్సాహముచేత పూనా కాన్ఫరెన్సుజరిగినతరువాత సన్నికాంగ్రెసుకమిటీలును, ఆఫీసులును విరమింపబడుటచే పైకమిటీ పనిచేయుటయేలేదు. నాస్థితి చిత్రముగ నుండెను. నేను జయిలునుంచివచ్చుటతోడనే యీయాత్మహత్యవంటి ఆజ్ఞనెన్నడు అంగీకరింపనొల్లక కాంగ్రెసుయొక్క సామాన్యకార్య

దర్శినని చెప్పుకొనగోరితిని. కాని, నేను గాలిలో పనిచేసితిని. సరియైన ఆఫీసుగాని, యుద్యోగులుగాని, తాత్కాలికార్యాధ్యక్షుడుగాని లేరు. గాంధీజీ, యాలోచనల కందుబాటులోనున్నను, అఖిలభారతసంచార కార్యక్రమములో (యీసారి హరిజనోద్యమముకొరకు) నిమగ్నుడై యుండెను. సంచారములో మేమతనిని జబ్బలపురములోను, ఢిల్లీలోను పట్టుకొంటిమి. వర్కింగుకమిటీ సభ్యులతో మేమచ్చట యాలోచనలను చేసితిమి. వివిధసభ్యులమధ్యగల భేదాభిప్రాయములవి చక్కగ విశదముచేయగలిగెను. ఒకప్రతిష్టంభనయేర్పడెను. అందరకును రుచించునట్టి తరుణోపాయమేదియును దొరకలేదు. శాసనోల్లంఘనమును విరమింపవలె ననువారికిని కూడదనువారికినిమధ్య గాంధీజీ నిశ్చయింపవలసియుండెను; అప్పుడతడు విరమించుటకే సుముఖుడుగ నుండుటచే వ్యవహారములు యథాప్రకారముగనే సాగింపబడెను.

కాంగ్రెసుతరఫున శాసనసభలకు పోవలెనను విషయము అప్పుడప్పుడు కాంగ్రెసుసభ్యులచే చర్చింపబడుచుండెను. కాని యప్పట్లో వర్కింగుకమిటీ సభ్యులిందువిషయమై యంతశ్రద్ధతీసికొనలేదు. ఆసమస్య యింకనుయుదయించలేదు. స్పష్టముగ నది యకాలవిషయము. 'సంస్కరణలు' అధమము మరిరెండు మూడు సంవత్సరములకుగాని రూపమును దాల్చవు. అప్పుడు అసెంబ్లీకి నూతన యెన్నికల సంగతి యుదహరింపబడలేదు. ఎన్నికలలో పోటీచేయుటకు సిద్ధాంతరీత్యా వ్యక్తిగతముగ నాకెట్టి యభ్యంతరమునులేదు. ఆసమయము వచ్చినపుడు కాంగ్రెసు పోటీ చేయవలసియుండుననియే నేను నిశ్చయించుకొంటిని. కాని యప్పుడీ సమస్యను లేవదీయుట దృష్టిని పెడత్రోవకు త్రిప్పుటయేయగును. మన పోరాటము సాగింపబడినచో మనలనెదుర్కొనిన సారాంశములు పరిష్కరింపబడుననియు, రాజీపద్ధతుల ప్రభావము తగ్గుననియు నేనాశించితిని.

ఈలోపలనేను పత్రికలకు వ్యాసములను, స్టేటుమెంటులను పంపించుచుంటిని. కొంతవరకు నావ్రాతలలోని తీవ్రతను (అవిప్రచురణా

కొరకు వ్రాయబడుటచే) నేను తగ్గింపవలసియుండెను; లేనిచో తనిఖీదారుయొక్కయు వివిధ చట్టములయొక్కయు నెనిమిదికాళ్ళ జంతువుల ముట్టె లెంతదూరమైనను సాగగలవు. నేను యెట్టిసాహసములకు సిద్ధపడినను ముద్రణాధికారులు, ప్రకాశకులు, సంపాదకులు దీనికి సంసిద్ధులుకారు. మొత్తముమీద వార్తాపత్రికలు నాయెడల సుముఖముగనేయుండెను. కాని యవి యెల్లపుడును యిట్లుచేయలేదు. ఒక్కొక్కప్పుడు స్టేటుమెంటులును, ప్రకరణములును అణచివేయబడుచుండెడివి. ఒకసారి నేను కష్టపడివ్రాసిన పెద్దవ్యాసమొకటి బుట్టదాఖలు చేయబడెను. నేను 1934 జనవరిలో కలకత్తాలో నున్నపుడు ఒక ప్రధానదైనిక పత్రికాధిపతి నన్ను దర్శింపవచ్చెను. అతడు కలకత్తాలో నున్న పత్రికలన్నింటికిని ప్రధానసంపాదకుడైన వాని యభిప్రాయము కొరకు నాస్టేటుమెంటులలో నొకదానిని పింపితిననియు నతడు దాని నంగీకరింపకపోవుటచే నది ప్రచురింపబడలేదనియు చెప్పెను. ఈ 'ప్రధానపత్రికాధిపతి' కలకత్తాలోని ప్రభుత్వ ముద్రణాలయ తనిఖీదారు.

పత్రికాధిపతుల కిచ్చిన సందర్శనములలోను, స్టేటుమెంటుల లోను కొన్నింటిలో నేను కొందరు వ్యక్తులను, కొన్నిబృందములను విమర్శించితిని. ఈపద్ధతి తిరస్కరింపబడెను. తిరిగి దెబ్బకొట్టబడునను భయములేకుండ కాంగ్రెసు పైదాడి వెడలవచ్చునను నభిప్రాయము (ఇది వ్యాపించుటకు గాంధీజీ తోడ్పడెను.) దీనికి కొంతకారణము. గాంధీజీయే దీనికొక నిదర్శనమును స్థాపించెను. హెచ్చుతగ్గు స్థాయిలలో నితర కాంగ్రెసు నాయకులతనిని యనుసరించిరి. సాధారణముగ మనము అస్పష్టమును, మర్యాదపూర్వకమును నగు పదజాలముల కంటి పెట్టుకొని యుందుము. మన విమర్శకులు తప్పుడు తర్కములతోను, సమయానుకూలమగు యుక్తులతోను, దాటిపోవుట కిది సావకాశమిచ్చెను: ఉభయపక్షములవారును యథార్థమైన సారాంశములను విడిచి

వేతురు; ఫాసిజము యున్నచోట్ల తప్ప పాశ్చాత్యదేశములలో జరుగు నట్లు సరళమైనచర్చ (అప్పుడప్పుడు ఛలోక్తుల నుపయోగించుకొనుచు, తప్పించుకొనుచు జరుగు) యెప్పుడును జరిగెడిదికాదు.

నేను పత్రికలకుపంపిన కొన్నిస్టేటుమెంటులలోని ఘాటుతనము నకు కొంచెమాశ్చర్యపడితినని నా స్నేహితురాలు (ఆమెయభిప్రాయము యెడల నాకు గౌరవము కలదు) వ్రాసెను. నేను కొంచెమించుమించు 'గర్విష్టి' నగుచుంటిని. ఇది నాయాశలన్నియు వ్యర్థమగుట వలన కలిగిన ఫలితమా? ఇది కొంతవరకు సత్యము. జాతీయముగ మనమందరము విఫలతచే బాధపడుచున్నాము. వ్యక్తిగతముగకూడ నిది కొంత వరకు నిజమయియుండవలెను. అయినను నేనిట్టిభావముచే నెక్కువగ బాధపడుటలేదు. ఏలనన నామట్టుకు నాకు విఫలుడనైతిని లేక అణచి వేయబడితిని యనుభావమెన్నడును కలుగదాయెను. గాంధీజీ రాజకీయముగ నాదృష్టికివచ్చినది లగాయతు నేనతనియొద్ద అధమము ఒక్క పాఠమును—ఫలితములకు భయపడి నాహృదయములోనున్న భావములను అణచివేసికొనకుండుట—యనుదానిని నేర్చుకొంటిని. ఆయాచారమును రాజకీయరంగములో (ఇతరరంగములలో దాని ననుసరించుట మరింతకష్టము, ఉపద్రవకరము) ననుసరించుటవలన నాకెన్నియో కష్టములు సంభవించెను. కాని వాటితోపాటు నాకది యెక్కువ సంతుష్టిని కూడ ప్రసాదించెను. దీనివలననే మనలో చాలమంది యథార్థమైన మనఃఖేదమును, అధమాధమమగు విఫలతను తప్పించుకొంటిమి. మనలను అసంఖ్యాకమగు ప్రజలు ప్రేమతో చూచుచున్నారను జ్ఞానముకూడ నధిక మనశ్శాంతినిచ్చును; అది యోటమికిని, విఫలతలకును చింతామణివంటిది. ఇతరులచే విస్మరింపబడి యేకాకిగ నుండుట యతి భయంకరమైన భావములలో నొకటియని నేనూహించెదను.

అయినప్పటికిని యీనురదృష్ట విచిత్రప్రపంచములో విఫలత యనుభావమును మనమెట్లు తప్పించుకొనగలము? సమస్తమును తొను

మారగుచున్నట్లు మన మెంత తరుచుగ చూచుచుందుము! మనము ప్రయత్నమును విడువకపోయినను, మన చుట్టుపట్లనున్న మానవుల గుణగణములను చూచునపుడు సందేహములు మనలను ముట్టడించును. వివిధసంభవములపట్ల తరుచు నాకు కోపమును, తిరస్కారమును కలుగు చుండును; అట్లేవ్యక్తులపట్లను, బృందములపట్లను కలుగుచుండును. ఇటీవల జీవితమును పరిదర్శనశాల క్రిందచూచునట్టి దృష్టిపయి నాకంత కంతకు తిరస్కారము యెక్కువగుచుండెను. ఇది ప్రధానసమస్యలను నిర్లక్ష్యముచేసి వానినుదహరించుట యనుచితమని భావించును. ఏలనన నవి వారి జేబులకు నష్టముతెచ్చును లేక వారి దురభిమానములను స్పృశించును. ఈ తిరస్కారము, విఫలత, 'గర్వోష్టితనము' లెంతయున్నను నేను నాతప్పిదములను, యితరుల తప్పిదములను కూడ చూచి పరిహసించుచుండునట్టి శక్తిని యింకను పోగొట్టుకొనలేదని యాశించుచున్నాను.

దయామయుడగు విధియందు ప్రజలకుగల విశ్వాసమునకు నేనొక్కొక్కప్పు డాశ్చర్యపడుచుందును; ఆవిశ్వాసము దెబ్బలుతగిలిన కొలది తలయెత్తుచునేయుండును; దుఃఖములును, దయామయుడు కాడను రుజువులునుకూడ ఆవిశ్వాసముయొక్క గంభీరతకు పరీక్షలని భావింపబడును.

అభివృద్ధియందును, ఒక ధర్మమునందును, లక్ష్యములయందును, మానవ శ్రేష్ఠత్వమునందును, మానవ విధియందును-విశ్వాసముండుట! ఇవియన్నియు నొకవిధియందలి నమ్మకమునకు సంబంధించినవి కావా? మనము వీనిని హేతువుతోను, తర్కముతోను, సమర్థింప బ్రయత్నించుచో వెంటనే మనకు కష్టములు సంభవించును. కాని మనలోనున్నదేదియో యీయాశను, విశ్వాసమును ఆశ్లేషించియుండును. ఇవి లేనిచో జీవితము పచ్చికబయళ్లులేని గొడ్డారియగును.

నాసామ్యవాదపరమగు ప్రచారఫలితము వర్కింగుకమిటీలోని కొంతమంది నాసహోద్యోగులను తారుమారుచేసెను. నేను అనేక సంవత్సరములనుండి యీప్రచారమును చేయుచుండినప్పుడు వారూరు కొని నన్నే యిప్పుడును సహించి యుండెడివారు. కాని నేనిప్పుడు దేశములో చలామణియగు చున్న ప్రయోజనములను కొంతవరకు భయపెట్టుచున్నాను. నాప్రయత్నమిక నిరుపద్రవకరమని పిలువబడజాలదు. నాతోడివారు కొందరు సామ్యవాదులుకారని నేనెరుగుదును. కాని కాంగ్రెసు కార్యనిర్వాహక సభ్యుడుగనుండి సామ్యవాద ప్రచారమును చేసికొనుటకు (కాంగ్రెసుయొక్క వప్పన్న మేమియులేకుండ) నాకు సంపూర్ణ స్వేచ్ఛకలదని నేనెప్పుడును భావించుచుంటిని. నాకట్టి స్వేచ్ఛలేదని వర్కింగుకమిటీ సభ్యులుకొందరు భావించు చున్నారను సంగతి నాకాశ్చర్యమును కలుగజేసెను. నేనువారిని యసత్యస్థితిలో నుంచుచుంటిని కనుక వారు తిరస్కరించిరి. కాని నేనేమిచేయవలెను? నాధర్మములలో నతిప్రధానమైనదని భావించుదానిని నేను విడిచిపెట్టజాలను. ఈరెంటికిని సంఘర్షణముండుచో నేను వర్కింగుకమిటీనుండి రాజీనామా యివ్వగోరెదను. కాని యీకమిటీ యక్రమసంఘముగ నుండినప్పుడు, సరిగా పనికూడ చేయుచుండనప్పుడు నేనెట్లు రాజీనామా యివ్వగలను ?

తరువాత గాంధీజీ మద్రాసునుండి నాకువ్రాసినపుడుకూడ నాకీ కష్టముతిరిగి తటస్థించెను. 'మద్రాసుమెయిలు' పత్రికకు అతడిచ్చిన సందర్శనమునుగురించిన విషయము నాకు పంపబడెను. సందర్శనమును కోరినవాడు నన్నుగురించి ప్రశ్నించెను. నాప్రయత్నములనుగురించి గాంధీజీ కొంచెమించుమించు క్షమార్పణగ చెప్పుచు నాయధార్థతయందతనికి నమ్మకముగలదనిచెప్పెను. నేను కాంగ్రెసును యీనూతన పద్ధతులకు బంధించువాడనుగాను. ఇట్లు నాకు తెలుపబడునని నే

నూహింపలేము. కాని గాంధీజీ తనసందర్శనములో పెద్దజమీందారీ పద్ధతిని సమర్థించుట నన్నెక్కువగ కలతపెట్టెను. ఇది గ్రామము యొక్కయు, జాతియొక్కయు ఆర్థికశ్రేయస్సుకత్యవసరమైనభాగమని యతడుభావించునట్లు కాన్పించును. ఇదినాకు చాల యాశ్చర్యమును కలిగించెను. ఈరోజులలో నీపెద్దజమీందారులను, తాలూకుదారులను సమర్థించువారతి యరుదు. ప్రపంచమంతటను నవి ముక్కలుచేయ బడెను భారతదేశములోకూడ నవి చిరకాల ముండజాలవని చాల మంది గుర్తించిరి. తాలూకుదార్లును, జమీందార్లును కూడ (వారికితగి నంత లబ్ధి ముట్టచెప్పబడినయెడల) యీపద్ధతి పోవుటకంగీకరింతురు. * ఈపద్ధతి తననిజభారముచేతనే కృంగిపోవుచున్నది. అయినను గాంధీజీకి దీనియందు సానుభూతికలదు; అతడు ధర్మకర్తృత్వమును గురించి మాట్లాడును. అతనిదృష్టికినినాదృష్టికినియెంతభేదముకలదు? నేనికముందు యితనితో నెంతవరకు సహకారముచేయగలను ? అనియాశ్చర్యపడితిని. నేనువర్కింగుకమిటీలో నికముందుకూడనుండవలెనా ? అప్పుడు మార్గ మేమియునులేకుండెను. కొద్దివారములైనతరువాత నేను తిరిగి జయిలుకు వెళ్లుటచే నీసమస్య యసంగతమయ్యెను.

నాస్వవిషయములు చాలకాలమును మ్రింగివేసెను. మాతల్లి గారియారోగ్యము బాగుపడుచుండెను, కాని నెమ్మదిగ జరుగుచుండెను. ఆమెయింకను మంచముపట్టియుండినను అపాయముతప్పిపోయెను. చాల

---

* అఖిలవంగదేశ భూఖామందుల కాన్ఫరెన్సును ఆహ్వానసంఘాధ్యక్షుడైన పి. యన్. టాగూరుగారు 1934 డిసెంబరు 23 వ తేదీని తనయుపన్యాసములోనిట్లు చెప్పెను. "జమీందారులయొక్క భూములను, ఐర్లండులో చేసినట్లు, జమీందారు లకు తగినంత లబ్ధియిచ్చి, జాతీయవశము చేసికొనుటకు వ్యక్తిగతము గ నేనువిచారింపను" వంగదేశములోనున్న భూఖామందులు, శాశ్వత సెటిల్ మెంటులో నుండుటచే, 'శాశ్వతసెటిల్ మెంటులేని ప్రాంతములలోనివారికంటె నెక్కువ యైశ్వర్యవంతులను సంగతి జ్ఞప్తియందుంచుకొనవలెను. జాతీయావశము చేసికొనుట యనుదానినిగురించిన పి. యన్. టాగూరుగారిభావములు అస్పష్టముగనున్నట్లు కాన్పించును.

కాలమునుండి నిర్లక్ష్యముచేయబడుచుండిన నాదరిద్ర్య సంబంధమగు వ్యాపారములను (అవిచాలయధ్వాన్నముగనుండెను) చక్కబెట్టుకొన గోరితిని. మేముచేయగలిగినఖర్చుకంటె నెక్కువఖర్చు చేయుచుంటిమి. మాఖర్చులను తగ్గించుమార్గమేమియును కాన్పించదాయెను. శరీర యాత్రనుసాగించుటకు నేనంత బాధపడుటలేదు. నావద్దధనమేమియును మిగలని దినమాసన్నమగుటకు నేను చూచుచుంటిని. ఆధునికప్రపంచ ములో ధనమును, ఆస్తులును చాలయవసరములు. కాని, దీర్ఘయాత్రలను చేయగోరువారికవి తరుచు ప్రతిబంధకములుగనుండును. సాహసముతో గూడిన కార్యములనుచేయుటకు ద్రవ్యవంతులకు ప్రాణకంటకముగనుం డును; తమవస్తువులను, పశ్వాదులను పోగొట్టుకొనుటకు వారెల్లపుడును భయపడుచురు. ప్రభుత్వమువారు తమయిష్టమువచ్చినపుడు ద్రవ్య మును, ఆస్తిని వశపరచుకొనగలిగినపుడు లేకసర్కారులో కలిపివేసికొన గలిగినపుడు దానియుపయోగమేమి? కనుక నాకున్నస్వల్పమునుకూడ నించుమించు వదలించుకొనగోరితిని. మాయవసరములు చాలతక్కువ. మాకుచాలినంత సంపాదింపగలనను ధైర్యము నాకుండెను. మా తల్లి తనయవసానకాలములో ససుఖములననుభవింపరాదనియు జీవిత ప్రమాణములో నెక్కువన్యూనతను పొందరాదనియు నేనాతురపడు చుంటిని. నాకుమార్గోయొక్కవిద్యకు ఆటంకముండకూడదనికూడ నేనాతుర పడుచుంటిని. దీనికి, నాయుద్దేశ్యముప్రకారము, ఆమెయూ రపులో నుండవలెననుకొంటిని. ఇంతకుమినహా నాకుగాని నాభార్యకు గాని ద్రవ్యముకొరకు ప్రత్యేకావసరములులేవు. లేదా యథార్థమైన దరిద్ర్యాభావమున కలవాటుపడక పోవుటచేత మేమట్లు భావించితిమి. ద్రవ్యముకొఱతవడు దినము వచ్చినపుడు మాకదిసంతోషదాయకముగ నుండజాలదని నేను పూర్తిగనెరుగుదును. నేను చివరవరకు మిగుల్చు కొనిన యొకదూబరఖర్చును కట్టిపెట్టుట నాకుకష్టముగనుండును. నేను పుస్తకములనెక్కువగ కొనుచుందును.

మా ఆర్థికస్థితిని వెంటనేచక్కబెట్టుకొనుటకు నాభార్యనగలను అమ్మివేయుటకు మేము నిశ్చయించితిమి; వానితోపాటువెండిసామగ్రిని, మాయొద్దనున్న విలువగల యితరవస్తువులను, బండ్లకొలదిగనున్నచిల్లర సామగ్రిని విక్రయింపదలచితిమి. కమల తననగలను పన్నెండుసంవత్సరములనుండిధరింపక బ్యాంకిలోపడవేసినను అమ్మివేయుటకంగీకరింపకుండెను. ఆమెవానిని మాకుమార్తెకు యిచ్చివేయవలెనను కుతూహలముతోనుండెను.

అది 1934 జనవరిమాసము. అలహాబాదుజిల్లాలోని గ్రామములలోనున్న మావర్కరులు నిరపరాధముగ పనిచేయుచున్నను నిరంతరాయముగ నిర్బంధింపబడుచుండుటచేత మేము వానినుసరించి గ్రామములలోనికి వెళ్ళవలసియున్నట్లు కాన్పించెను. మా యు. పి. రాష్ట్రకాం. కమిటీకార్యదర్శియైన రఫీఅహ్మదుకిద్వాయికూడ నిర్బంధింపబడెను. జనవరి 26వ తేదీ స్వాతంత్ర్యదినము - వచ్చుచుండెను. దానినిమేమెట్లు నిర్లక్ష్యముచేయగలము ? ఆజ్ఞలెన్నులు, నిషేధములు యెన్నియున్నను 1930 లగాయతు యది విడువకుండ దేశమందంతటను సక్రమముగజరుపబడుచుండెను. కాని, యిపుడుమార్గమును చూపువారెవరు? చూపవలసిన మార్గమేది? సిద్ధాంతములోనైనను అఖిలభారత కాంగ్రెసు అధికారిగ పనిచేయువారు నేను తప్ప మరెవరును లేరు. నేను కొంతమంది స్నేహితులతో యోచించితిని. ఏదియో కొంత జరుగవలెనని యందరును అంగీకరించిరి; కాని జరుగవలసిన దానిని గురించి యంగీకారమేమియును కుదురలేదు. ఏకమొత్తముగ నిర్బంధములకు దారితీయు కార్యములను తప్పించుకొనవలెననెడి సామాన్య స్వభావము నాకు కాన్పించెను. చివరకు స్వాతంత్ర్యదినమును ఉచితరీతిని జరుపవలెననెడి యొక చిన్న సందేశమును పంపితిని. దానిని జరుపవలసిన విధము నాయా ప్రాంతముల వారికే విడిచివేసితిమి. అలహాబాదులో జిల్లాయందంతటను జరుపవలసిన కార్యక్రమము నేర్పరచితిమి.

ఈ స్వాతంత్ర్యోత్సవముల నేర్పాటు చేసినవారు ఆదినముననే నిర్బంధింపబడుదురని మేము భావించితిమి. నేను తిరిగి జయిలుకు వెళ్లు లోపల వంగదేశమును దర్శింప గోరితిని. అచ్చటనున్న పాత స్నేహితులను చూచుటకును, గత కొద్ది సంవత్సరముల నుండియు ఆ దేశ ప్రజలు చేసిన యపార త్యాగములకు వారి నభినందించుటకును నేనీయాత్ర నుద్దేశించితిని. వారికి సహాయము చేయుటకు నేనేమియు చేయజాలనని బాగుగ నెరుగుదును. సానుభూతియు, సహచర భావమును యుండిన సార్థకమేమి? అయినను వంగదేశము తన యవసర సమయమున యావద్భారత దేశముచేతను విడువబడినట్లు భావించుచుండుటచే నివి యాహ్వానీయములయ్యెను. ఈ భావముండుట న్యాయము కాకపోయినను యిది యుండెను.

కమల యారోగ్యమును గురించి మా వైద్యులతో నాలోచించుటకు కూడ నేనామెను తీసికొని కలకత్తా వెళ్ళవలసి యుండెను. ఆమె కెంతమాత్రమును యారోగ్యముగలేదు. కాని కొంతవరకు మేముభయులము దీనిని నిర్లక్ష్యముచేసి చికిత్సకొరకు కలకత్తాలోనో మరొక చోటనో దీర్ఘకాలముండకుండుటకు ప్రయత్నించితిమి. నేను బయట నుండు కొద్దికాలము మే ముభయులము సాధ్యమైనంతవర కొక్కచోటనే యుండగోరితిమి. నేను తిరిగి జయిలుకు వెళ్లిన తరువాత చికిత్స చేయించుకొనుటకును, డాక్టరులను సంప్రదించుటకును ఆమెకు కావలసినంత సావకాశముండును. ఇప్పుడు నిర్బంధ మాసన్నమగుటచే కలకత్తాలో నా సమక్షమున నీపరీక్ష చేయించుటకు నిశ్చయించితిని; తరువాత తక్కిన పనులు చూచుకొనవచ్చును.

కనుక కమలయు నేనును జనవరి 15 వ తేదీని కలకత్తా వెళ్లుటకు నిశ్చయించితిమి. మేము స్వాతంత్ర్యదినోత్సవములకు తగినంత ముందుగనే తిరిగి రావలెననుకొంటిమి.

## ౫౭

## భూకంపము.



అది 1934 జనవరి 15 వ తేదీ మధ్యాహ్నకాలము. అలహాబాదులో నేను మాయింటివరాండాలో నిలిచి కొంతమంది వ్యవసాయదారుల కుపన్యసించుచుంటిని. సాంవత్సరిక మాఘమేల ప్రారంభమయ్యెను. దినమంతయు వందలకొలది ప్రేక్షకులు మమ్ము చూడ వచ్చుచుండిరి. హఠాత్తుగ నేను నాకాళ్ళమీద నిలువజాలక ముందుకు జోగ నారంభించితిని. నేను సమీపముననున్న యొక స్తంభమును కౌగలించుకొంటిని. తలుపులు డబడబ కొట్టుకొన నారంభించెను. సమీపముననున్న స్వరాజ్యభవనమునుండి హోరుమను శబ్దము విన వచ్చెను. ఇంటికప్పునుండి పెంకులు జలజల రాలుచుండెను. ఇదివరకు భూకంపము నెరుగకపోవుటచే నేమి జరుగుచున్నదియు నాకు మొదట తెలియకుండెను. కాని వెంటనే నేను గ్రహించితిని. ఈ నూతన యనుభవము నాకు వినోదమును, శ్రద్ధను కలుగచేసెను. తిరిగి నేను వ్యవసాయదారులతో సంభాషింప నారంభించి వారికి భూకంపమును గురించి చెప్పితిని. వృద్ధురాలగు మాపెత్తల్లి నన్ను యింటినుండి పారిపోవలసినదని దూరమునుండి కేకలువేసెను. ఆభావము నాకు విపరీతముగ కాన్పించెను. భూకంపమును నేనంత యెక్కువగ పాటింపలేదు. ఎట్లయినను మేడమీద మంచము పట్టియున్న మాతల్లిని, ప్రమాణస్నానము చేయుచున్న నాభార్యను విడిచి నేను నాయొంటిప్రాణమును దక్కించుకొనజాలను. ఆతాకుడులు చాలసేపు నిలిచి ఆగిపోయెను. అవి కొద్ది నిమిషముల సంభాషణకు కారణమయి వెంటనే విస్మరింపబడెను. ఆ రెండు మూడు నిమిషములును బీహారులోను, యితర చోట్లను లక్షల

కొలది ప్రజలకెట్లు పరిణమించెనో మాకిప్పుడు తెలియలేదు; దానిని మేమూహింపజాలకపోతిమి.

ఆసాయంకాలమే కమలయు నేనును కలకత్తా పయనమైతిమి. మాకు తెలియకుండ మా రైలు ఆరాత్రి మమ్ము భూకంప ప్రాంతము యొక్క దక్షిణభాగము నుండి తీసికొని పోయెను. మరునాడు యీ విపత్తును గురించి కలకత్తాలో వార్తలేమియు లేకుండెను. ఆమరునాడు వార్తాలేశములు రానారంభించెను. మూడవరోజున యీవిపత్తుయొక్క స్వభావము కొంత ద్యోతకమయ్యెను.

మేము మా కలకత్తా ప్రోగ్రాములో మునిగియుంటిమి. చాలమంది వైద్యులను అనేకదఫాలు సందర్శించితిమి. చివరకు ఒకటిరెండు మాసములయిన తరువాత చికిత్సకొరకు కమల తిరిగి రావలెనని నిశ్చయింపబడెను. తరువాత చాలకాలమునుండియు కలుసుకొనని స్నేహితులను కాంగ్రెసు సహోద్యోగులను మేము కలుసుకొనవలసి యుండెను. ఆ కాలమంతయు నేను మనోభారముచే బాధపడితిని. కష్టములు కలుగునను భయముచే నేమిచేయుటకును ప్రజలు భయపడుచున్నట్లు కాన్పించెను. వారిదివరకు నెన్నియోయనుభవించిరి. ఇతరచోట్లకంటె నిచ్చట వార్తాపత్రికలతిజాగ్రతగ నుండెను. ఇతరచోట్లవలెనే యిచ్చటను భవిష్యత్కార్యక్రమమును గురించి సందేహము, విభ్రమము కలదు. నిశ్చయముగ భయముకంటె నీసందేహమే సమర్థమగు రాజకీయకృషికభ్యంతరముగనుండెను. ఫాసిజము, సామ్యవాదము, కమ్యూనిజము- ఈభావములు వాతావరణములో నుండెను. కాని యివన్నియు నస్పష్టముగను, నొకదానితో నొకటి మిశ్రితములై పోయియు నుండెను. వీనిమధ్య కచితమగు రేఖనుగీయుట లేక నిర్వచించుట కష్టముగ నుండెను. ప్రభుత్వదృష్టి నాకర్షించి వారిచే నెక్కువగ ప్రకటనచేయబడుచున్న టెర్రరిస్టు యుద్యమమును గురించి యెక్కువగ తెలిసికొనుటకు నాకవకాశముగాని, కాలము

గాని లేకపోయెను. నాకు తెలిసినంతవరకు దానికెట్టి రాజకీయ ప్రాధాన్యత యునులేదు. టెర్రరిస్టువర్గమువారి పాతసభ్యులకు దానియందునమ్మకము పోయెను. వారు వేరువిధముగ భావింపనారంభించిరి. బెంగాలులోని ప్రభుత్వచర్యలవలనకలిగిన తిరస్కారభావముచేత నచ్చటచ్చటవ్యక్తులు చెలరేగి యొకవిధమగు జగడమునకు దిగిరి. ఇరుపక్షములను యీ కలహ భావము ప్రధానముగనే యుండెను. వ్యక్తులగు టెర్రరిస్టులసందర్భములో నిదిస్పష్టముగనే యుండెను. ప్రభుత్వమువారుకూడ సంఘవిరుద్ధమగు నొక సంభవమును శాంతముగచేబట్టి యణచుటకుబదులు దీనినొక కలహదృష్టిలోచూచిరి. టెర్రరిస్టుచర్యలచే నెదుర్కొనబడిన యే ప్రభుత్వ మైనను వానినిడీకొని యణచివేయుటకు ప్రయత్నింపక తప్పదు. కాని యపరాధులయెడలను నిరపరాధులయెడలను (ముఖ్యముగ రెండవవారి యెడల, ఏలనన వారిసంఖ్యయే యెక్కువగనుండితీరును) విచక్షణలేని విశేషచర్యలను జరుపుటకంటె ప్రభుత్వము ప్రశాంత నిరోధమును బూనుట యెక్కువ యుక్తమయినకార్యము. బహుశః అట్టి ఝడిపింపు పెట్టినపుడు ప్రశాంతముగనుండుట సులభముకాదు. టెర్రరిస్టుచర్య లంతకంతకు తగ్గిపోవుచున్నవి; కాని, యవిజరుగుటకెప్పుడును సావకాశ ముండెను. వీనినెదుర్కొనవలసినవారి శాంతిని చెడగొట్టుటకివిచాలును. ఇట్టికార్యములు జాడ్యముకాక జాడ్యముకుకారణములను సంగతి స్పష్ట మగుచునేయున్నది. రోగముకుగాక దానిచిహ్నములకు చికిత్సచేయుట వ్యర్థము.

టెర్రరిస్టులతో సంబంధమున్నదనుకొనబడు చాలమంది యువ కులును, యువతులును రహస్యకార్యములలోనున్న మోహముచేతనే నిజముగ నాకర్షింపబడుచున్నారని నేను విశ్వసించెదను. రహస్యమును సాహసమును సంతతోత్సాహులగుయువకుల నెప్పుడును ఆకర్షించు చుండును; ఈ కేకలన్నియు దేనినిగురించి? ఈ తెరచాటున నున్న

మనుష్యులెవరు? వీనిని తెలిసికొనవలెననెడి కోరిక జనించును. ఇది పరిశోధక కథలోని పిలుపువంటిది. వీరికేమియుచేయవలెనను యుద్దేశ్యముండదు. టెర్రరిస్టుకార్యముచేయవలెనని యనసలేయుండదు. వీరు సందేహింపబడువారితో కలిసియున్నంతమాత్రమున పోలీసుదృష్టిలో వీరును సందేహింపబడువారేయగుదురు. త్వరలోనే వీరును డిటెన్యూలసంఖ్యలోనో లేక ప్రవాసితుల డేరాలలోనో (ఇంతకంటె నధమస్థితి సంభవింపనిచో) జేర్చబడుదురు. న్యాయ,క్రమములు హిందూదేశములో బ్రిటిషు పాలనయొక్క గర్వింపదగిన విజయములని చెప్పబడును. నాసహజ స్వభావముచేత నేను వానికి కేవలము సుముఖుడను. జీవితములో శిక్షయుండవలెను; అరాజకము, అక్రమము, అసమర్థత యనిన నేనిష్టపడను. కాని ప్రభుత్వములును, రాజ్యములును ప్రజలపై బలవంతముగ నంటగట్టు న్యాయ, క్రమములప్రయోజనము సందేహాస్పదమని నావిషాదపూరిత యనుభవము చాటుచున్నది. ఒక్కొక్కప్పుడు వాని మూల్యము అత్యధికముగనుండును; ఆ న్యాయము అధికారము చేయువారి యిచ్ఛయు, ఆ క్రమము సర్వత్రవ్యాపించియుండు భయముయొక్క ప్రతిబింబమునై యుండును. విశేషవ్యాప్తిగల భయముమీద నాధారపడు కార్యమేదియు నభిలషితము కాజాలదు. ప్రభుత్వము యొక్క నిర్బంధపరికరములే పునాదిగ గలిగి యవిలేనిచో నిలువజాలని 'క్రమము' నాగరికపరిపాలనకంటె నెక్కువగ సైనిక యాక్రమణమే యగును. కల్హణకవియొక్క వేయియేండ్లనాటి కాశ్మీరచారిత్రిక పురాణమగు రాజతరంగిణిలో న్యాయ, క్రమముల యర్థములో ధర్మము, అభయము (పాలకుడును, ప్రభుత్వమును రక్షింపవలసినవి) అను పదములు పదేపదేయుపయోగింపబడినట్లు నేను కనుగొంటిని. పవిత్రత, భయము లేకుండుట! న్యాయము కేవలచట్టముకంటె గొప్పది; ప్రజలయొక్క నిర్భయత్వమే క్రమము భయపడిపోయినప్రజలపై 'క్రమమును' బల

వంతముచేయుటకంటె నిర్భయత్వమును యీభావమును దోహదము చేయుట యెంతయెక్కువ వాంఛనీయము !

మేము కలకత్తాలో మూడున్నరరోజులుంటిమి. ఈకాలములో నేనుమూడు బహిరంగోపన్యాసములనిచ్చితిని. నేనిదివరకు కలకత్తాలో చేసినట్లే టెర్రరిస్టుచర్యలనుగ్గూర్చి యవి నిరర్థకములని వాదించితిని. తరువాత ప్రభుత్వమువారు బెంగాలులోననుసరించిన పద్ధతులను తీసికొంటిని; రాష్ట్రములో జరిగిన యుదంతముల చరిత్ర నన్నుకదల్చి వేయుటచేత నేనావేశముతో మాట్లాడితిని. మొత్తముగా ప్రజలనందరను విచక్షణలేకుండ నణచివేసి మానవ గౌరవమునే భంగపరచిన రీతి నన్నెక్కువగ కలతబెట్టెను. ఈమానవసమస్యముందర రాజకీయసమస్య (యెంతయత్యవసరమైనదియైనను) రెండవదియయ్యెను. తరువాత కలకత్తాలో నాపయిజరుపబడిన విచారణలో నీమూడు యుపన్యాసములును మూడు నేరములయ్యెను. వానిఫలితమే నాప్రస్తుతశిక్ష యయ్యెను.

కవిశేఖరుడగు రవీంద్రనాథటాగూరును దర్శించుటకు కలకత్తా నుండి మేము శాంతినికేతనము వెళ్ళితిమి. అతనిని దర్శించుట యెప్పుడును ముదావహముగనుండును. అంతదగ్గరకుపోయినతరువాత మేమా యవకాశమును జారవిడువ నొల్లకుంటిమి. నేనదివరలో శాంతినికేతనము రెండుసార్లువెళ్ళితిని. కమలకు అదియే ప్రథమ పర్యాయము. మేము మాకుమార్తెను అచ్చటకు బంపనూహించుచుంటిమి కనుక నామె దానినిచూచుటకు ప్రత్యేకముగవచ్చెను. త్వరలోనే యిందిర మెట్రిక్యులేషను పరీక్షకు వెళ్ళనైయుండెను. ఇకముందామె నెచ్చట చదివించవలెననుసమస్య మమ్ముబాధించుచుండెను. ఆమెను ప్రభుత్వ లేక అర్ధప్రభుత్వ విశ్వవిద్యాలయములలో చేర్పించుటకు నాకెంతమాత్రమును యిష్టములేదు. అవియనిన నాకుగిట్టవు వానినావరించియుండు వాతావరణమంతయు నధికారపూరితము, ప్రభుత్వశాసనాయుతము, స్వేచ్ఛా

విరహితము. అవి కొంతమంది చక్కని స్త్రీపురుషులను తయారుచేసిననుటకు సందేహములేదు; ఇకముందును చేయవచ్చును. కాని యీకొద్దిమినహాయింపులు విశ్వవిద్యాలయములు యువకులయొక్క సహజశక్తులను అణచివేయుచున్నవి, నాశము చేయుచున్నవి అను నేరమును తీసివేయజాలవు. శాంతినికేతనము (ఒక విధముగ నితర విశ్వవిద్యాలయముల యంత యాధునికమును, విశేష పరికర సమన్వితమును కాకపోయినను) యీమృతహస్తమునుండి విముక్తినొందుటచే మేము దానిని స్థిరపరచితిమి.

మేము తిరిగి యింటికి పోవు మార్గములో రాజేంద్రబాబుతో భూకంపబాధితుల నివారణసమస్యనుగురించిమాట్లాడుటకు పాట్నాలో దిగితిమి. అత డప్పుడే జయిలునుండి విడువబడి యనధికార నివారణ కార్యమునకు తప్పని సరిగ నాయకత్వము వహించెను. మాకెలిగ్రాములేవియు నందజేయబడకపోవుటచే మారాక సంగతి యెవరికిని తెలియకుండెను. కమల సోదరునితో మేముండగోరిన భవనము నాశనమయ్యెను; అది యొక పెద్ద రెండంతస్థుల మేడ. కనుక చాలమంది యితరులవలె మేము ఆరుబయటనే నివసించితిమి.

మరునాడు నేను ముజఫరుపురమును చూచితిని. అప్పటికి భూకంపము కలిగి సరిగా యేడురోజులయ్యెను; అయినను కొన్ని ప్రధానవీధులలో తప్ప చెత్తను తీసివేయుటకుయత్నము చేయబడలేదు. ఈ వీధులను బాగుచేసినప్పుడు శవములు బయటపడుచుండెను. అవి కొన్ని పడిపోవుచున్న గోడనో లేక యింటికప్పునో ఆపుకొనుటకు ప్రయత్నించు వానివలె నుండెను. ఆశిథిలములు మరపునకు రాక భయ జనకములుగ నుండెను. ఈ గండమునుండి బయటపడిన వారు పూర్తిగ భయవిహ్వలులై నోటమాట రాకయుండిరి.

అలహాబాదు జేరుటతోడనే కాంగ్రెసులోనున్న మేమును, తదితరులును గూడ డబ్బు వసూలుచేయుట, వస్తుసామగ్రిని పోగుచేయుట మొదలగు పనులలో నిమగ్నుల మయితిమి. నాసహచరులు కొందరు భూకంపము కలుగుటచే స్వాతంత్ర్య దినోత్సవము నాపివేయ వలెననిరి. కాని యితరులు కొందరును, నేనును భూకంపము కూడ మన ప్రోగ్రాముకేల భంగము కలిగింపవలెనో చూడజాలకుంటిమి. కనుక జనవరి 26 వ తేదీని అలహాబాదు జిల్లాలోని వివిధ గ్రామములలోను, పట్టణములలోను సభలు జరుపబడెను. మేమనుకొనిన దానికంటె మాకెక్కువ విజయమే చేకూరెను. పోలీసువారి యాటంకములును, నిర్బంధములును జరుగునని మాలో చాలమంది భావించిరి. అక్లే కొద్ది యాటంకములు కల్పింపబడెను. కాని మేము యీసభనుండి (మాకే యాశ్చర్యమగునట్లు) బయటపడగలిగితిమి. మా గ్రామములలో కొన్ని చోట్లను, యితర పట్టణములలోను అరెస్టులు జరిగెను.

బీహారునుంచి తిరిగి వచ్చుటతోడనే భూకంపమును గురించి నేనొక స్టేటుమెంటును యిచ్చి ద్రవ్యసహాయము కావలెనను సందేశముతో ముగించితిని. బీహారు ప్రభుత్వము భూకంపము కలిగిన మొదటి కొద్దిరోజులలో చురుకుగ పనిచేయలేదని నేనందులో విమర్శించితిని. భూకంపము కలిగిన ప్రాంతములలోని యుద్యోగులను విమర్శించుట నా యుద్దేశ్యము కాదు; ఎంతటి ధైర్యస్థైర్యములు కలవారినైనను పరీక్షించునట్టి యతి కఠిన పరిస్థితిని వారెదుర్కొనవలసి యుండెను. నామాటలలో కొన్ని యిట్టియర్థమునకు నావకాశమిచ్చుటచే నేను విచారపడితిని. కాని మొట్టమొదట బీహారు ప్రభుత్వ ప్రధాన కార్యాలయమువారు యెక్కువ సమర్థతను చూపలేదని నేను యాథిగా భావించితిని; ముఖ్యముగ చెత్తనంతను తీయించి వేసినచో ననేకమంది ప్రాణములు దక్కియుండెడివి. ఒక్కమోంఘీరు పట్టణములోనే వేలకొలది

చంపబడిరి. మూడు వారములయిన తరువాత నేనచ్చట అసలు ముట్టు కొనబడని చెత్తనెంతనో చూచితిని. అచ్చటకు కొద్దిమైళ్ళదూరములో నున్న జమల్పూరులో వేలకొలది రైల్వేవర్కరులుగలరు. ఈవిషాదము జరిగిన కొద్ది గంటలలోనే వీరినందరిని యుపయోగించుకొనవచ్చును. భూకంపము జరిగిన పన్నెండు రోజులయిన తరువాత కూడ ప్రాణము లతోనున్న మనుష్యులు పైకి తీయబడిరి. ఆస్తిని రక్షించుటకు ప్రభు త్వమువారు వెంటనే చర్య తీసికొనిరి; కాని భూమిలో పాతుకొని పోయిన వారిని రక్షించుటకు వారంత వేగిరపడలేదు. ఆ ప్రాంతము లలో మున్సిపాలిటీలు పనిచేయుటలేదు.

నావిమర్శ యుక్తమనియే నేను భావించెదను. భూకంపము కలి గిన ప్రాంతములలో నధిక సంఖ్యాకులు నాతో నేకీభవించిరని నేను తరువాత తెలిసికొంటిని. కాని యుక్తమయినను, అయుక్తమయినను అది ప్రభుత్వమును త్వరపెట్టుటకే చేయబడెను కాని, నిందింప వలెనను యుద్దేశ్యముతో చేయబడలేదు. ఈ సందర్భములో బుద్ధిపూర్వకముగ పాపమును చేసిరని వారి నెవరును నిందింపలేరు. అది యొక వింతమైన యసామాన్యపరిస్థితి యగుటచే ప్రమాదములను మన్నింపవచ్చును. భూకంపమువలన కలిగిన నష్టమును కూడదీయుటకు బీహారు ప్రభుత్వ మువారు తరువాత నెక్కువ శక్తి సామర్థ్యములతో పనిచేసిరని (జయి లులో నుండగా) నేను వింటిని.

కాని నావిమర్శ తిరస్కరింపబడెను. వెంటనే బీహారులో కొద్ది మంది ప్రభుత్వమువారికొక ధృవపత్రమును ప్రసాదించిరి. భూకంపము, తన్నివారణోపాయములు రెండవ విషయము లయ్యెను. ప్రభుత్వము విమర్శింపబడెను, కనుక రాజభక్తి పరాయణులైన ప్రజలు దానిని సమర్థింపవలెనను నది యెక్కువ ప్రధానసమస్య యయ్యెను. ప్రభుత్వ మును విమర్శింపరాదు. భారతదేశములో ప్రభుత్వమును విమర్శింప కూడ

దను నొక వింతసిద్ధాంతమున కిదియొక యుదాహరణము. పాశ్చాత్య దేశములలో నిది నిత్యకృత్యము. సైనికతత్త్వము విమర్శను సహింప జాలదు. రాజుగారివలె హిందూదేశములోని బ్రిటిషు ప్రభుత్వమును, దాని పెద్ద యధికారులును తప్పుచేయజాలరు. అటువంటి దానిని సూచించుట కూడ రాజద్రోహము.

మరియొకవింతయేమనిన నిరంకుశప్రభుత్వము, కఠినప్రభుత్వము అనువిమర్శకంటె నసమర్థప్రభుత్వముఅనువిమర్శను వారెక్కువ తిరస్కరింతురు. మొదటివిమర్శకు జయిలుప్రసాదము రావచ్చును. కానిప్రభుత్వముదీనికలవాటు పడిపోవుటచే నిజముగదీనినంతగ లక్ష్యముచేయదు. ఇంతకును అధికారతత్త్వముగలజాతికిది యొకవిధమగు పొగడ్తయే కావచ్చును. కాని,యసమర్థులు, ధైర్యసాహసములు లేనివారు అనుట వారికి శూలములవలెనుండును. ఇది వారిస్వాభిమానమూలమునేకొట్టినట్లగును; ఇది భారతదేశములో దేవదూతలమని భావించు యింగ్లీషు అధికారుల భ్రమలను తొలగద్రోయును. వారు క్రైస్తవప్రవర్తనకు విరుద్ధముగ ప్రవర్తించుచున్నాడనునేరమును నోరెత్తకుండసహించుటకు సంసిద్ధతనుచూపినను అసమర్థుడని, యవివేకియని యెవడేని పిలుచునో సహింపజాలని ఆంగ్లికనుబిషపు వంటివారు.

అలహాబాదులోని భూకంపసహాయకకమిటీవారు భూకంపము సంభవించిన ప్రాంతములనుచూచి యచ్చటజరుగుచున్న యుపశమన పద్ధతులనుగురించి యొకనివేదికను తయారుచేయవలసినదని నన్నుపంపిరి. నేనొక్కడనువెంటనే బయలుదేరి నాశనదేవతచే సల్లకల్లోలము గావింపబడిన యాప్రాంతములలో పదిరోజులు తిరిగితిని. కంటికినిద్ర యనునదిలేక యుదయము అయిదుగంటలలగాయతు నిశీథము వరకును నేను బీటలతీసి వంకరటింకరలుతిరిగి పోయియున్న యా రోడ్లమీద మోటారులోను, వంతెనలునాశనమయి రోడ్లు నీటిలోమునిగిపోయిన

కొన్నిచోట్ల చిన్నచిన్న పడవలమీదను ప్రయాణముచేసితిని. ఎచ్చట జూచినను కూలిపోయినకొంపలును, చీల్చి వేయబడి యొక పెద్దరాక్షసిచే మెలిపెట్టబడినట్లు కాన్పించినరోడ్లను కలిగియున్నపట్టణములు భయంకరముగ కాన్పించెను. ఈరోడ్డులలో కలిగినపెద్దపెద్దపగుళ్ళనుండి యిసుకయు నీరును ప్రవాహమువలె పైకితన్నుకొనివచ్చి ప్రజలను, పసువులను తుడిచివేసెను. ఈపట్టణములకంటె నెక్కువగ నుత్తరబీహారు మైదానములు (బీహారుయొక్క ఆరామములని పిలువబడెడివి) నాశనదేవత కాలవాలమయ్యెను. మైళ్ళకొలదియిసుక, పెద్దపెద్దపగుళ్లు; చాలదూరము జలమయము, యిసుక, నీరు పైకితన్నుకొనివచ్చిన చిన్నచిన్న బీటలు - బీహారుఆరామమిట్లుండెను. ఈప్రాంతములమీదనుండియెగిరి వెళ్ళిన కొందరుబ్రిటిషుయుద్యోగులు యివి యుద్ధకాలమునాటియుత్తర ఫ్రాన్సుయొక్క సమరరంగములవలె కాన్పించెనని చెప్పిరి.

ఆయనుభవమతి భయంకరమైనది. భూకంపము మొట్టమొదట ప్రక్కలయూపుతో ప్రారంభమయి నిలుచున్నవారిని పడద్రోసెను. తరువాత పైకిక్రిందకు యూపివేసెను. తరువాత మరఫిరంగులు పేల్చినట్లు లేకనూరు వాయువిమానములు చేయునట్టి పెద్దరణగొణధ్వని, బయలువెడలెను. అనేకచోట్ల బొరియలనుండి కలుగులనుండి పదిపన్నెండడుగులయెత్తువరకు నీరుచిమ్ముచుండెను. ఇదియంతయుమూడు మూడున్నరనిమిషములు మాత్రమేజరిగి తరువాతయుపశమించెను. కాసియామూడునిమిషములే ప్రళయకాలమయ్యెను. దీనినంతను కండ్లారచూచుచుండిన చాలమంది ప్రపంచమంతరించుచున్నదని యూహించుకొనుటలో నాశ్చర్యమేమియునులేదు. పట్టణములలో భవనములు కూలిపోవు పెళపెళధ్వనులు, నీరు భూమిలోనుండి పైకిచిమ్ముట, వాతావరణమంతయుదుమ్ముతోనిండిపోవుట, కొద్దిగజముల దూరములో నున్నదానిని చూడజాలకపోవుట - మొదలగువిపరీతములు జరిగెను. పల్లెలలో దుమ్ములేకపోవుటచే నెక్కువదూరముచూడవచ్చును. కాని స్తిమితముగ

చూచువారెవరునులేరు. ఒక్కొక్క రాత్రి రాత్రికియున్న వారు నేలమీదపడిపోయిరి లేక భయ విహ్వలతచే నేలమీద దొర్లుచుండిరి.

భూకంపముజరిగిన పదిరోజులకు (బహుశః ముజఫర్పూరులో) పన్నెండేండ్లబాలుడు భూమినుండి తవ్వి ప్రాణములతో పైకితీయబడెను. అతడాశ్చర్యచకితుడై పోయెను. పడగొట్టబడి మరియొక వస్తువుచే కప్పి వేయబడినపుడతడు ప్రపంచమంతరించెననియు తానొక్కడే జీవించి యున్నాడనియు ననుకొనెనట.

ముజఫర్పూరులోనే కొంపలు కూలిపోవుచు, చుట్టుప్రక్కలవం దలకొలదిజనులు చనిపోవుచుండ నొకయాడపిల్లపుట్టెను. అనుభవము లేనియామాతాపితల కేమిచేయవలెనోతోచక దుఃఖాక్రాంతులైయుం డిరి. చివరకుమాతాశిశువులుజీవించి సుఖముగవర్ధిల్లుచున్నారని నేనుతరు వాతవింటిని. భూకంపముపేరిట నాపిల్లకు 'కంపాదేవి' యనిపేరిడిరట.

మాసంచారములో మేము మాంఘీరును చిట్టచివరచూచితిమి. మేముచాలదూరము తిరిగితిరిగి నేపాలుసరిహద్దువరకునువెళ్ళి యనేక హృదయవిదారకములగు దృశ్యములనుచూచితిమి. పాడుపడిన స్థలము లను, నాశముగావింపబడిన పట్టణములను చూచుటకెంత యలవడినను, మంచిధనవంతమైన మాంఘీరుపట్టణ విధ్వంసమును చూచుటతోడనే మాకడుపులు తరుగుకొనిపోయెను. ఆభయంకర దృశ్యమును నేనెన్న డును మరువజాలను.

భూకంపముకలిగిన ప్రాంతములలో పట్టణములలోను పల్లెల లోనుగూడ నివసించువారిలో స్వయం సహాయములేక పోవుట చాల విచారకరము. బహుశః యీసందర్భములో పట్టణములలోనున్న మధ్య తరగతులవారు చాలనేరస్థులు; వారందరును పయినుండి యెవరోవచ్చి తమకు సహాయముచేతురని వేచియుండిరి. సేవచేయుటకువచ్చిన మరి కొందరు పనిచేయుటయనగా ప్రజల నాజ్ఞాపించుట యనుకొనిరి. ఈయ

సహాయతకు కొంతవరకు భూకంప భయముచేకలిగిన నిర్వీర్యతయే కారణ మనుటకు సంశయము లేదు. అదినెమ్మదిగ తగ్గిపోయెను.

కాని, బీహారులోని యితరప్రాంతములనుండియు నితర రాష్ట్రముల నుండియు కొల్లలుగా వచ్చిన యుపశమన సేవకుల శక్తి, సామర్థ్యముల త్యద్భుతములు. ఈయువకుల యొక్కయు, యువతుల యొక్కయు పటుత్వసేవాతత్త్వము చూచుటకత్యద్భుతముగ నుండెను. ఇందులో ప్రత్యేకమైన వివిధసంస్థలు పనిచేసినను వారిలో మంచి సహకార ముండెను.

గుట్టలుగపడి యున్న చెత్తను, చెదారమును త్రవ్వి శుభ్ర పరచు స్వయంసహాయోద్యమమునకు కొంత ప్రోత్సాహము నీయవలె నని నేనొకయత్నమునుచేసితిని. నేను కొంత సందేహించుచు చేసినను అదిచాల జయప్రదమయ్యెను. ఉపశమన సంస్థలయొక్క నాయకు లందరును పారలను, తట్టలను చేతబూని రోజంతయు కష్టపడి త్రవ్విరి. మేమొకచిన్నపిల్లయొక్క శవమును పైకితీసితిమి. నేనాదినముననే మాంఘీరువీడితిని; కాని, ప్రజలు త్రవ్వుటను సాగించుచు మంచిఫలితము లను సాధించిరి.

అనధికార యుపశమన సంస్థలన్నింటిలోను కేంద్ర రిలీఫ్ కమిటీ యతిప్రధానమైనది. దీనికిరాజేంద్రబాబు నాయకుడుగనుండెను. ఇది కేవలము కాంగ్రెసుసంస్థ కాదు. ఇది వివిధ బృందములకును, దాత లకును ప్రాతినిధ్యమువహించిన యఖిలభారత సంస్థగ పరిణమించెను. అయినను గ్రామములలోని కాంగ్రెసుసంస్థల సహాయము దీనికిగలదు. గుజరాతులోను, యు. పి. లోని కొన్నిజిల్లాలలోను తప్ప భారతదేశ ములో మరేరాష్ట్రములోను కాంగ్రెసువర్కరులకు వ్యవసాయదారు లతో నింతసంబంధములేదు. యథార్థముకు వర్కరు లందరును చాల వరకు వారినుండియే వచ్చిరి; బీహారు భారతదేశమంతటిలోను ప్రధాన

ముగ వ్యవసాయదారుల రాష్ట్రము. ఇచ్చట కాంగ్రెసు అతినిరాడంబర మైనది. కాని వ్యవసాయదారులందరును దానికి గొప్ప యండగనుండిరి. అ. భా. కా. కమిటీలోకూడ బీహారుసభ్యులు యేవిషయములోను తొందరపడు స్వభావముకలవారుకారు. అచ్చటనుండుట వారికి కొంచెము యాశ్చర్యముగ నుండునట్లు కాన్పించెడిది. కాని, రెండు శాసనోల్లంఘనోద్యమములలోనుగూడ బీహారు అసమానముగ పనిచేసెను. తరువాత జరిగిన వ్యక్తిశాసనోల్లంఘనములో గూడ నది యఖండముగ పనిచేసెను.

రిలీఫ్‌కమిటీవారు వ్యవసాయదారులను జేరుకొనగలుగుటకీ చక్కనిసంస్థ నుపయోగించుకొనిరి. గ్రామములలో మరేసంస్థయు (ప్రభుత్వమువారుకూడ) నింతసహాయమును చేయజాలరు. బీహారుకు నిర్వివాద నాయకమణియైన రాజేంద్రబాబు రిలీఫ్‌కమిటీకిని కాంగ్రెసు సంస్థకునుగూడ నధిపతియయ్యెను. బీహారుదేశ పుత్రరత్నమైన యితడు వ్యవసాయదారునివలె కాన్పించును. సరళమైనదృష్టి, వాడియైననిష్కపట నేత్రములు గోచరించనంతవరకు మొదట చూపులకతడంత దర్పముగ కాన్పించడు. అతనిచూపులను, యానేత్రములను యెవడును మరువ జాలడు; వానిద్వారా సత్యదేవత మనలను వీక్షించును; వానినిశంకింప జాలము. రయితువలె బహుశః యతనిదృష్టి కొంచెము పరిమితమైనది; ఆధునికప్రపంచదృష్టికి కొంచెము సాధువైనది; కాని, యతని యసామాన్యశక్తిసామర్థ్యములు, పరిపూర్ణ నిష్కపట స్వభావము, భారత స్వాతంత్ర్యముపట్ల భక్తివిశ్వాసములు మొదలగు గుణగణములచే నతడు తనరాష్ట్రములోనేగాక భారతదేశమంతటను నారాధింపబడు చున్నాడు. రాజేంద్రబాబుకు బీహారులోగల సర్వాంగీకృత నాయక స్థానమువంటిది భారతదేశములో మరేరాష్ట్రములోను మరెవరికినిలేదు. గాంధీజీయొక్క నిజసందేశము నితనికంటె నెక్కువగ గ్రహించినవారు (ఎవ్వరైననున్నచో) కొద్దిమందిమాత్రమే కలరని చెప్పవచ్చును.

బీహారు రిలీఫ్ వర్కునకు నాయకత్వము వహించుటకిట్టి పురుషుడు లభించుట యదృష్టమని చెప్పవలెను. అతనియందలి విశ్వాసమే భారత దేశమంతటనుండియు విశేషధనము నాకర్షింపగలిగెను. అనారోగ్యముచే నెంతదుర్బలుడుగనున్నను అతడీపనిలోని కురికెను; అతడే యన్నికార్యములకును కేంద్రమయ్యెను. అందరునతని సలహానే యడుగుచుండుటచే నతడు విశ్రాంతియనునదిలేకుండ పనిచేసెను.

నేనీభూకంపప్రాంతములలో తిరుగుచున్న కాలములోనే అస్పృశ్యతా దోషమునకు శిక్షగ భూకంపము విధింపబడెనని గాంధీజీయిచ్చిన వాఙ్మూలము నత్యాశ్చర్యముతో చదివితిని. ఈ విమర్శ యెవనినైనను నిర్ఘాంతపరచును. దీనికి రవీంద్రనాథటాగూరు యిచ్చిన సమాధానముతో నేను పూర్తిగ నేకీభవించితిని. శాస్త్రదృష్టికింతకంటె విరుద్ధమైనది వేరొండు యూహింపబడజాలదు. పదార్థము మీద మానసిక సంభవములకును, భావప్రవృత్తులకునుగల సంబంధమునుగురించి బహుశఃనేడు శాస్త్రముకూడ పరిపూర్ణ నిరంకుశత్వమును చూపదు. మనఃఖేదమువలన బాధపడువాని కజీర్ణముపట్టుకొనవచ్చును; లేక నంతకంటెను చెడ్డయే సంభవింపవచ్చును. కాని మానవుని యొక్క దోషమునకు లేక నాచారమునకు భూచలనమును మార్చునట్టి శక్తియుండుననుట వెర్రిమాట. పాపము, యీశ్వరాగ్రహము, ప్రపంచవ్యవహారములలోమానవుని యల్పత్వము- అను భావములు మనలను కొద్దివందల సంవత్సరములు వెనుకకు (యూరపులోని యింక్విజిషను రోజులకు) తీసికొని పోవును.

భూకంపము పాపమునకు దైవముచే విధింపబడిన శిక్షయే యైనచో మనమే పాపమునకు శిక్షింపబడుచున్నారమో తెలిసికొనుట యెట్లు? మన మనేక పాపముల కుత్తరవాదులమై యున్నాము. ఎవనికి వాడు తనకు ప్రీతికరమైన యర్థమునే చెప్పవచ్చును. మనము విదేశ ప్రభుత్వమునకు దాసులమైనందులకు లేక నన్యాయమైన సాంఘికపద్ధ

తిని సహించినందులకు శిక్షింపబడి యుండవచ్చును. అసంఖ్యాకములగు ఎస్టేటులుగల దర్భాంగమహారాజు ఆర్థికముగ భూకంపములవ విపరీత నష్టమునుపొందెను. కనుక నిదిజమీందారీపద్ధతిమీద నొకతీర్పు అని కూడ మనము చెప్పవచ్చును. బీహారులోని నిరపరాధులైన ప్రజలు దక్షిణహిందూదేశ ప్రజలలోనున్న యస్పృశ్యతాదోషమునకు శిక్షింపబడిరని సూచించుటకంటె నిది యెక్కువ యుక్తముగ నుండును. భూకంపము అస్పృశ్యతకాలవాలమైన దేశమునేయేల వీక్షింపలేదు? భూకంపము శాసనోల్లంఘనమునకు తగిన యీశ్వరాగ్రహమని బ్రిటిషు ప్రభుత్వము వారు చెప్పవచ్చును. భూకంపమువలన నెక్కువగ నష్టపోయిన యుత్తరబీహారు స్వాతంత్ర్యోద్యమములో ప్రధాన పాత్రనువహించెను.

ఈవిధముగ మనమంతములేకుండ నూహలను పెంచుకొన వచ్చును. విధికృతములతో మనమేల జోక్యమును కల్పించుకొనవలెను? అను ప్రశ్న తరువాత నిశ్చయముగ బయలువెడలును. దివ్యనిర్ణయములయొక్క ఫలితములను తగ్గించుటకు మనమేల దయారసకార్యముల నొనర్పవలెను? మనల నింతదోషభూయిష్టముగ పుట్టింపనేల? మనచుట్టు నిట్టి యుచ్చులను, వాగురులను కల్పింపనేల? దుఃఖమయము, క్రూరము నగు ప్రపంచమును సృజింపనేల? పెద్దపులిని మేకపిల్లను కల్పింపనేల? ఇంతచేసి తరువాత మనలను శిక్షించుటెందులకు? విధి మనపైనిట్టి నిర్దయాత్మకమగు పరిహాసమునేల ప్రయోగింపవలెను? అని యాశ్చర్యపడ నారంభింతుము.

రిలీఫువర్కుకొరకు వివిధరాష్ట్రములనుండి వచ్చిన స్నేహితులతో చర్చించుచు నేను పాట్నాలోచివర రోజు రాత్రి చాలకాలము మేల్కొంటిని. యు. పి. నుండి చాలమంది ప్రతినిధులువచ్చిరి. మాలో ముఖ్యులందరును అచ్చటనుండిరి. భూకంపయుపశమన కార్యములలో మే మెంతవరకు నిమగ్నులము కావలెనను సమస్య మమ్ము బాధించు చుండెను. దీనినిగురించి మేము చర్చించితిమి. ఇది తేలికమైనదికాదు.

దీనికి చాలకాలముపట్టును. అంతకాలము రాజకీయములనుండి విరమింపవలెను. దానివలన రాజకీయముగ మారాష్ట్రములో నెక్కువ చెడుఫలితములు కలుగును. కాంగ్రెసులో ననేకవేలమందియున్నను ముఖ్యులెప్పుడును కొద్దిమందియేకలరు. వారిని విడిచిపెట్టుట కష్టసాధ్యము. అయినను భూకంపముయొక్క పిలుపు అనుల్లంఘనీయము; నామట్టుకు నాకు కేవలము రిలీఫుపనుక్కే బంధింపబడవలెనను నుద్దేశ్యములేదు. ఈపనిచేయువారికి కొఱతయుండదని నేననుకొంటిని. ఇంతకంటె నెక్కువ సాహసకార్యములను చేయగలవారు కొద్దిమందియుండిరి.

నేను నాసంచారమును ముగించి యలసిసొలసి ఫిబ్రవరి 11 వ తేదీని అలహాబాదు చేరుకొంటిని. పదిరోజుల నిరంతర శ్రమవలన కలిగిన నాభయంకరాకారమునుచూచి నాబంధుజనులాశ్చర్యపడిరి. అలహాబాదు రిలీఫుకమిటీవారికి నాసంచారముయొక్క రిపోర్టును వ్రాయ నారంభించితిని. కాని నేను నిద్రాసక్తుడనై యిరువదినాల్గు గంటలలోను అర్ధమము పన్నెండుగంటల పయిన నిద్రలోగడిపితిని.

మరునాడు మధ్యాహ్నము కమలయు నేనును ఆలస్యముగ తేనీరు త్రాగితిమి. పురుషోత్తమదాసు టాండను మమ్మప్పుడే కలుసుకొనెను. మేమువరండాలో నిలుచునియుండగ నొక మోటారు రంయిమనివచ్చెను. దానిలోనుండి యొకపోలీసుఆఫీసరు తటాలున నేలమీద కురికెను. నాకు పిలుపువచ్చెనని నేనువెంటనే గ్రహించితిని. నేనతని యొద్దకువెళ్లి "నేను మీకొరకు చాలకాలమునుండి వేచియుంటిని" అని చెప్పితిని. అతడు కొంచెము సమాధానపురస్సరముగ మాట్లాడుచు పదియతని దోషముకాదనెను. వారంటు కలకత్తానుండి వచ్చెను.

అయిదునెలల పదమూడురోజులు బయటనుండి నేనిప్పుడు తిరిగి యేకాంతవాసమునకు జేరుకొంటిని. కాని యథార్థమైన భారము నాది కాదు; ఆభారమంతయు, నెప్పటివలెనే, వ్యాధిగ్రస్తురాలైన నాతల్లి, నాభార్య, నాసోదరి మొదలగు స్త్రీజనముమీద నేపడెను.

---

౫౯

## ఆ లి పూ రు జ యి లు .

ఆరాత్రియే నన్ను కలకత్తా తీసికొనిపోయి లాల్‌బజారు పోలీసుస్టేషనులోనుంచిరి. ఇచ్చట నుత్తరహిందూదేశములో నేపోలీసు హెడ్‌క్వార్టరులలోను లేనంతమంది యూరపియను సార్జెంటులును, ఇన్‌స్పెక్టరులును కలరు. కాన్‌స్టబులులందరును బీహారువారు; లేక యు. పి. వారువలె కాన్పించిరి. ఖయిదీలలారీలో నేను కోర్టునుండి జయిలుకును, ఒకజయిలునుండి మరియొక జయిలుకును చేసిన యనేక ప్రయాణములలో నీకాన్‌స్టబులులు నాకూడ ననేకమంది యుండెడివారు. వారుచేయుపనియందు వారికి ప్రీతిలేక నతివిచారముగ కాన్పించెడివారు. నాయందు యెక్కువసానుభూతిగనుండుటచే నేనొక్కొక్కప్పుడు వారికండ్లనుండి కన్నీటిధారలు జలజలరాలుచుండెడివి.

మొదటనన్ను ప్రెసిడెన్సీజయిలులోనుంచిరి. అచ్చటనుండి విచారణకొరకు ప్రధానప్రెసిడెన్సీ మేజస్ట్రేటుకోర్టుకు తీసికొనిపోవుచుండెడివారు. ఇది నాకొక నూతనయనుభవము. కోర్టుపెట్టినగది, యాభవనము బహిరంగకోర్టువలెగాక ముట్టడింపబడిన కోటవలె కాన్పించెను. కొద్దిమందివార్తాపత్రికాప్రతినిధులను, మామూలులాయర్లనుతప్ప నాచుట్టు ప్రక్కలకెవరిని రానీయలేదు. పోలీసులు బందోబస్తుతోనుండిరి. ఈయేర్పాటులు ప్రత్యేకము నాకొరకే చేయబడలేదు. అవి నిత్యకృత్యములు; నన్నుకోర్టుగదిలోనికి తీసికొనివెళ్ళునపుడు (ఆగదిలోనే) నేనొకమార్గముగుండ చాలదూరము నడువవలసియుండెను. ఆమార్గముకిరుప్రక్కలను, నెత్తిమీదను చిక్కనియినుపతీగెలుతో అల్లివేయబడెను. అదియొక పంజరములో నడుచుచున్నట్లుండెను. నేరస్తులను నిలుపుస్థలము మేజ

స్ట్రీటుగారిస్థానముకు దూరములోనుండెను. కోర్టుగది పోలీసువారిచేతను కాలాంబర కవచధారులగు లాయరులచేతను మూగియుండెను.

కోర్టువిచారణలు నాకు క్రొత్తలుకావు. నావెనుకటి విచారణ లనేకములు జయిలు ఆవరణలోనే జరిగెను. కాని యచ్చటనెప్పుడును కొందరుస్నేహితులు, బంధువులు, పరిచయులునుండెడివారు. ఆవాతావరణమంతయు కొంతసుఖప్రదముగనుండెడిది. పోలీసులుసామాన్యముగ వెనుకనుండెడివారు. ఈపంజరములవంటి నిర్మాణములేవియు నుండెడివి కావు. ఇచ్చటనంతయు తారుమారయ్యెను. నేను క్రొత్తవారిని, అపరచిత, ముఖములను, మామధ్యనెట్టిసామ్యమును లేనివారిని చూచితిని. ఆమూక ఆకర్షణీయముగ కాన్పించలేదు. కాలాంబరకవచధారులైన లాయర్ల సమూహముమీద చూచుటకంత యందముగనుండదు. ఇక పోలీసుకోర్టు లాయరులొకవిధమగు ప్రేమరహితమైనచూపును కలిగి యున్నట్లుకాన్పింతురు. చిట్టచివరకానల్లదుస్తులు కలవారిలో నేనొక పరిచయస్తుడగు లాయరును చూచితిని. కాని, యతడా గుంపులో మాయమయ్యెను.

విచారణజరుగుటకు పూర్వము బయటవసారాలో కూర్చున్నను నేనొంటరిగనున్నట్లు, యేకాకినైనట్లుభావించితిని. నానాడి వేగిరపడుచుండెను. వెనుకటి విచారణకాలములలో నాకుండిన యాంతరంగిక శాంతి యిప్పుడులేకుండెను. విచారణలకును, శిక్షలకును అలవడిన నేనే యిట్లున్నచో నెట్టియనుభవమునులేని యువకులకెంత తొట్రుపాటుగ నుండునో నేనప్పుడుగ్రహించితిని. డాకులో నేను స్వస్థచిత్తుడనైతిని. నేను (మామూలుప్రకారముగనే) వాదింపలేదు. మరునాడు, ఫిబ్రవరి 16 వ తేదీని, నాకు రెండుసంవత్సరములు శిక్షవిధించిరి; నాకు యేడవ సారి ఖయిదుజీవితము ప్రారంభమయ్యెను.

నేను బయటనున్న అయిదున్నరమాసములను యుక్తముగ గడిపితినని తృప్తిపొందితిని. నేను కొన్ని యుపయుక్తములైన పనులను నెరవేర్చుకొంటిని నాతల్లికి యారోగ్యము కలిగి యుపద్రవము తప్పిపోయెను. నాచిన్న చెల్లెలు కృష్ణ, పరిణయమాడెను. నాకుమార్తె యొక్క భవిష్యద్విద్యస్థిరపరుపబడెను. నేను మాగృహచ్ఛిద్రములను, ఆర్థికచిక్కులను కొన్నింటిని చక్కబరచుకొంటిని. చిరకాలమునుండి నేను నిర్లక్ష్యముచేయుచువచ్చిన యనేక స్వంతవ్యవహారములను సంచూచు కొంటిని. ఇక ప్రజాహితకార్యములను ఆరోజులలో నెవడును యెక్కువగచేయజాలడని నేనెరుగుదును. కాంగ్రెసుయొక్క దృక్పథమును గట్టిపరచుటకు నేను కొంచెము సాయపడితిని; దానిని సాంఘిక, ఆర్థిక పంథవైపు కొంతవరకు త్రిప్పుటకు సాయపడితిని. గాంధీజీతో నేను సలిపిన పూనాకరస్పాండెన్సువలనను, తరువాత పత్రికలలోని వ్యాసములవలనను కొంత పని జరిగెను. కులసమస్యమీద నేను వ్రాసిన వ్యాసములు కూడ కొంత లాభమును చేకూర్చెను; మరియు రెండు సంవత్సరములు దాటిన పిదప నేను గాంధీజీని, అనేకమంది యితర మిత్రులను తిరిగి సందర్శించి మరికొంతకాలమునకు చాలిన ధాటియైన చిత్తశక్తిని సంపాదించితిని.

కాని నాకు హృత్పరితాపమును కలిగించునది యొకటి- కమల యనారోగ్యము-మిగిలిపోయెను. ఆమె యెంత యస్వస్థతగ నుండెనో నాకప్పుడు తెలియకుండెను. ఏలనన నామె మంచము పట్టువరకును గట్టిగ పనిచేయుచుండుట కలవడెను. కాని నేను ఖేదపడితిని. అయినను నేనిప్పుడు జయిలులో నుండుటచే నామె స్వేచ్ఛగ చికిత్సచేయించుకొనవచ్చునని యాశపడితిని. నేను బయటనున్న కాలములో నామె నన్ను చిరకాలము విడిచియుండుట కిష్టపడక పోవుటచే నిది యెక్కువ కష్టసాధ్యముగ నుండెను.

నాకు మరియొక విచారముండెను. నేను అలహాబాదు జిల్లాలోని గ్రామసీమలను ఒక్కసారియైనను చూడనందులకు విచారపడితిని. మాసందేశములను నెరవేర్చునందుల కచ్చట ననేకమంది యువకులు నిర్బంధింపబడిరి. జిల్లాలో మేము వారి ననుసరింపకపోవుట వారియెడల నవిధేయతగ కాన్పించెను.

నన్ను ప్రెసిడెన్సీ జయిలునుంచి ఆలిపూరు జయిలుకు మార్చిరి. నా కచ్చట పదియడుగుల పొడవు తొమ్మిది యడుగుల వెడల్పుగల యొక చిన్నగది యివ్వబడెను. దానిముందర నొక వసారాయును, చిన్న బహిరంగ ప్రదేశమును కలవు. ఆ దొడ్డిగోడ యేడడుగుల యెత్తున నుండెను. దానిపైనుండి యొకవింత దృశ్యము కాన్పించుచుండెను. ఏక అంతస్తు యిండ్లు, రెండంతస్తుల మేడలు, గుమ్మాయిండ్లు, చతురపుటిండ్లు, చిత్రమగు కప్పులు ఇట్లనేకవిధములగు వికారపుటిండ్లు కన్పట్టెను. ఉన్న కొద్ది స్థలమును వినియోగింపవలెనను యూహతో నవి యొకటి తరువాత నొకటి కట్టబడినట్లు కాన్పించును.

ఈ వికారపు కట్టడముల దృశ్యమునుండి తేరుకొనుట తోడనే నేనొక భయంకర దృశ్యము నెదుర్కొనవలసి యుండెను. సరిగా నాగదికిని, దొడ్డికిని యెదుట రెండు పొగ గొట్టములు కారుమేఘములవంటి దట్టమగు కాటుకరంగు పొగను గుప్పుగుప్పున విడువ నారంభించెను. ఒకొక్కప్పుడు దానిని గాలి నామీదకు పంపి నన్నుక్కిరి బిక్కిరి చేయుచుండెను. అవి జయిలు పాకశాలలోని పొగగొట్టములు!

ఇట్టి ప్రారంభము నాకింపుగ లేకుండెను. ఎత్తైని యిటుక గోడల కట్టడములతో గూడిన ఆలిపూరు జయిలుయొక్క పరివర్తనశూన్యమగు దృశ్యమును, దాని పాకశాల గొట్టములనుండి వచ్చు ధూమము ననుభవింపవలసిన భవిష్యత్తు, నాకు ప్రీతికరముగ లేకుండెను. నాదొడ్డిలో చెట్లుగాని, పచ్చదనముగాని లేకుండెను. అది యంతయు చపటా చేయ

బడి, శుభ్రముగ, 'పక్కాగ' నుంచబడెను. కాని, నిత్యము మసి కుప్ప క్రింద పడుచుండెను. ఆబోడితనము నిరుత్సాహ జనకముగ నుండెను.

దూరమున నొకటి రెండు చెట్లు మాత్రము కాన్పించెను. ఒక చెట్టుమీద నొక గ్రద్ద గూడుపెట్టెను. నేను దానిని శ్రద్ధతో పరికించెడివాడను. దాని పిల్లలు పెరిగి పెద్దవగుచు తమ వృత్తి రహస్యములను నేర్చుకొనుచుండెను. అవి యొకొక్కప్పుడు తటాలున నేలకు వ్రాలుచు నేఖయిదీ చేతినుండియో కొంచెమించుమించు నోటినుండియో రొట్టెముక్కలను తన్నుకొని పోయెడివి.

సూర్యాస్తమయము మొదలు సూర్యోదయమువరకు మమ్ము మాగదులలో తాళము వేసెడివారు. శీతకాల దీర్ఘ వాసరనిశలు చప్పున జరిగెడివికావు. నేను గంటలకొలది చదువుటతోను, వ్రాయుటతోను విసిగి ఆచిన్న గదిలోనే నాలుగైదడుగులు ముందుకు వెనుకకు వేయుచు పచారుచేసెడివాడను. జంతు ప్రదర్శనశాలలో భల్లూకములు తమ పంజరములలో తిరుగాడుట నాకు జ్ఞప్తికి వచ్చెడిది. ఒకొక్కప్పుడు యెక్కువ విసుగు జనించునపుడు నాకు ప్రీతికరమైన శీర్షాసన చికిత్సను చేసెడివాడను.

రాత్రి తొలిజామున నంతయు ప్రశాంతముగనుండి ట్రాము బండ్లధ్వనులు, గ్రామఫోనుగానము, దూరముననుండి వినవచ్చు గాత్ర పాట, మొదలగు పట్టణధ్వనులు మాత్రము వినిపించెడివి. దూరము నుండి వచ్చు యీ సన్ననిపాట శ్రవణానందముగ నుండెడిది. కాని రాత్రులందు యెక్కువ విశ్రాంతి యుండెడిదికాదు. డ్యూటీమీద నుండు జయిలు సంరక్షకులు పెద్దధ్వనిచేయుచు నడుచు చుండెడివారు. గంటగంటకు నేదోయొక పరీక్ష చేయబడుచుండును. కొంతమంది ఆఫీసరులు మేమెవరమును పారిపోలేదని ధృవపరచుకొనుటకు చేతిలాంతరులను పుచ్చుకొని వచ్చెడివారు. ప్రతిరాత్రి మూడు గంటలకు పెద్దపెద్ద

అరపులు, బొబ్బలు, గరుగ్రిబురుగ్రిలు, రాచుట, తోముట మొదలగునవి వినిపించును. అది పాకశాలపని ప్రారంభమగు సూచన.

ఆలిపూరు, ప్రెసిడెన్సీ జయిళ్లలో ననేకమందివార్డర్లు, గార్డులు, గుమాస్తాలు, ఆఫీసరులు కలరు. ఈరెండు జయిళ్లలోను నైనీజయిలులో నున్నంతమంది ఖయిదీలు 2200 మొదలు 2300 వరకుగలరు. కాని యీరెండు జయిళ్లలోను ఒక్కొక్కదానిలో నైనీజయిలులోనున్న యుద్యోగులకంటె రెట్టింపుకంటె పయిగనున్నారు. ఇచ్చట చాల మంది యూరపియను వార్డరులును, పింఛనుతీసికొను భారతసైనికో ద్యోగులును కలరు. యు. పి. లో కంటె కలకత్తాలో బ్రిటిషు సామ్రాజ్యము యెక్కువ భయకరముగను, నిశ్చయముతోను పనిచేసె ననుట ధృవము. పెద్దయుద్యోగస్తులు ఖయిదీలదగ్గరకు వచ్చునపుడు సామ్రాజ్యశక్తి నెల్లప్పుడును జ్ఞప్తికి తెచ్చుచు దానిచిహ్నముగ నుండు టకు ఖయిదీలందరును "సర్కారుసలాం" అను కేక వేయవలెను. ఈ కేకతో నొకవిధమగు నవయవ సంచలనముకూడ జరుగవలెను. ఖయి దీలువేయు యీకేక రోజుకనేకసారులు, ముఖ్యముగ ప్రతిదినము సూప రింటెండెంటు దగ్గరనుండి వెళ్ళునపుడు, నాయావరణ గోడలనుదాటి నాకు వినవచ్చెడిది. సూపరింటెండెంటు పోవునపుడు అతనినెత్తిమీద పట్టెడి రాజ్యఛత్రము నాయేడడుగుల గోడపైనుండి కాన్పించెడిది.

'సర్కార్ సలాం' అను నీయసాధారణ కేకయు, దానితో నుండ వలసిన శరీరచేష్టలును ప్రాచీనయుగచిహ్నములా? యనినేనాశ్చర్య పడెడివాడను. లేకనవి యావేశపరుడగు నేయాంగ్లాధికారిచేతనో కని పెట్టబడెనా? ఇది యింగ్లీషువాని కల్పనయనియే నేను భావించెదను. ఇందులో నొకచిత్రమైన యర్థాంగ్లజాతి ధ్వనికలదు. అదృష్టవశమున నీకేక యు. పి. జయిళ్ళలోలేదు. బెంగాలు అస్సాములలో తప్ప, బహుశః మరేరాష్ట్రములలోను ఉండదు.

ఆలిపూరులో చేయబడిన యొకమార్పు నాకు తృప్తికరముగ నుండెను. మామూలుఖయిదీల యాహారము యు. పి. ఖయిదీల యాహారముకంటె చాలయోగ్యముగ నుండెను. జయిలుభోజనములో యు. పి. చాలరాష్ట్రములకు వెనుకబడి యుండును.

శీతకాలముత్వరలో గతించెను. వసంతకాలము పరుగెత్తెను. వేసవిప్రారంభించెను. రోజురోజు యెండ తీవ్రమగుచుండెను. కలకత్తా శీతోష్ణస్థితి నాకెప్పుడును ప్రీతికరముకాదు. కొద్దిరోజుల యునికియైనను నాకిచ్చట నిస్సారముగనుండును. ఖయిదులోని పరిస్థితులు సహజముగ మరింత యధ్వాన్నముగనుండును. వ్యాయామము చేసికొనుటకు తగినంతస్థలము లేకపోవుటచేతను, ఆశీతోష్ణస్థితిలో నెక్కువకాలము గదిలో తాళమువేయబడియుండుటచేతను నాయారోగ్యము కొంత చెడెను. నాబరువు త్వరితముగతగ్గనారంభించెను. నేనుతాళములను, గోళ్లెములను, గడియలను, గోడలను ద్వేషింప నారంభించితిని.

ఒకనెలగడచినతరువాత నాదొడ్డివెలుపల నన్ను వ్యాయామము చేసికొననిచ్చిరి. ఈమార్పు నాకు సుఖముగ నుండెను. ఉదయ సాయంకాలములయందు నేను పెద్దగోడక్రింద విహరించెడివాడను. క్రమముగ నేను ఆలిపూరు జయిలుకును, కలకత్తా శీతోష్ణములకును అలవడిపోతిని. చివరకు పొగతోను, కీచుధ్వనులతోను గూడిన పాకశాలకూడ సహ్యమయ్యెను. ఇతరవిషయములు నామనసును నింపుచుండెను, నేనితర బాధలతో నింపబడితిని. బయటనుండి వచ్చువార్త లేవియును సుముఖముగ లేకుండెను.

# ౬౦

## తూర్పుపశ్చిమములలో ప్రజాప్రభుత్వము.



నేను శిక్షింపబడినతరువాత ఆలిపూరులో నా కేదినపత్రికను రానివ్వలేదు. విచారణజరుగు కాలములో కలకత్తాలోని డైలీస్టేట్సుమన్ పత్రికవచ్చెడిది. నేనుశిక్షింపబడిన మరునాడే దీనినాపివేసిరి. యు.పి. లో 1932 లగాయతు ఎక్లాసు ఖయిదీల కొకదినపత్రికను (ప్రభుత్వమువారి కిష్టమైనదానిని) రానిచ్చెడివారు. దినపత్రికకు బదులు నాకు స్టేట్సుమన్ వారపత్రిక నిచ్చెడివారు. ఈపత్రిక పింఛనుపుచ్చుకొన్న ఆంగ్లోద్యోగుల కొరకు, వర్తకులకొరకు నుద్దేశింపబడి వారికి కావలసిన భారతదేశ సంక్షిప్తవార్తలను కలిగియుండును. ఇందులో విదేశవార్త లేమియు నుండకపోవుటచే నేను చాలబాధపడెడివాడను. విదేశవ్యవహారములను నేనతిశ్రద్ధగ వీక్షించుచుండెడివాడను. అదృష్టవశమున నన్ను మ్యాన్ ఛెష్టరుగార్డియను వారపత్రికను తెప్పించుకొననిచ్చుటచే నంతర్జాతీయ వ్యవహారములు నాకు తెలియుచుండెడివి.

నావిచారణకాలములోనే యూరపులో తిరిగి తీవ్రసంఘర్షణ బయలుదేరెను. ఫ్రాన్సులో నీపోరాటముబయలుదేరి ఫ్యాసిస్టుదొమ్మీల క్రిందపరిణమించి 'జాతీయ' ప్రభుత్వమనునది యేర్పడెను. ఆస్ట్రియాలో ఛాన్సెలరుడాల్ఫసు పనివాండ్రను కాల్చివేయుచు నచ్చటనున్న సాంఘిక ప్రజాప్రభుత్వమును నాశముచేయుచుండెను. ఆస్ట్రియాలోని రక్తపాతము నన్ను కృంగదీసెను. ఈప్రపంచమెంత భయంకరమైనది! ఎంత రక్తపిపాసకలది! తనస్వప్రయోజనములను కాపాడుకొనునపుడు మానవు డెంత క్రూరుడుగనుండును! యూరపు అంతటను, అమెరికాలోను ఫ్యాసిజము వృద్ధియగుచున్నట్లు కాన్పించెను. జర్మనీలో హిట్లరు అధికారము

నకు వచ్చినపుడు అచ్చటనున్న ఆర్థికకష్టముల కతడెట్టి తరుణోపాయ మును చూపించుటలేదు కనుక నతని పరిపాలన త్వరలోనే యంతరించు నని నేననుకొంటిని. అట్లే ఫ్యాసిజము తక్కినచోట్లను ప్రాకినపుడు దానిగోతినదియే త్రవ్వుకొనుచున్నదని నేనూరటచెందితిని; దాని తరు వాత సంకెలలన్నియు తెగకతప్పదు. కాని నాకోరికయే నాకట్టియాశను పుట్టించుటలేదా? యని నేనాశ్చర్యపడ నారంభించితిని. ఈఫ్యాసిస్టుతరం గమతిసులభముగ నంతత్వరగ నంతరించునా? ఫ్యాసిస్టుడిక్టేటరులు భరిం పరాని పరిస్థితులేర్పడినను లొంగక తమదేశములను ఘోరసంగ్రామ రంగముగ మార్చివేయరా? అట్టిపోరాటముయొక్క ఫలితమేమగును?

ఇంతలో వివిధములు, అనేకరూపములు గల ఫ్యాసిజము విస్త రించెను. 'నిజాయితీగల పెద్దమనుష్యుల రిపబ్లిక్' అయిన నవీన స్పెయిను దేశములో గొప్ప ప్రతీకారము వచ్చెను. మంచినిజాయితీగల యాదే శములోని లిబరలునాయకుల లలితపదజాలమంతయు దేశపతనము నాప జాలకుండెను. లిబరలిజము ప్రతిచోటను ఆధునిక పరిస్థితుల నెదుర్కొ నుట కసమర్థమైయుండెను. అది శబ్దములకును, వాక్యములకును అంటి పెట్టుకొనియుండి యవియే కార్యములగునని భావించెను.

ఆస్ట్రియావిషాదమునుగురించి మాన్‌ఛెస్టరుగార్డియను పత్రిక వ్రాసిన ప్రధానవ్యాసములను నేనతిశ్రద్ధగ చదివితిని. "ఈరక్తసిక్తమగు పోరాటమునుండి యెట్టిఆస్ట్రియా బయల్పడును? యూరపులో అతి రీయే క్షనరీలైన యొక కూటము తుపాకులతోను, మరఫిరంగులతోను పరి పాలించునట్టి యాస్ట్రియాతయారగును" "కాని,యింగ్లండుస్వాతంత్ర్యము కొరకే నిలబడుచో దాని ప్రధానమంత్రి మౌనముద్రను వహించు నేలకో! డిక్టేటరుపదవులను గురించిన యతని స్తోత్రముల ననేకములను వింటిమి. అవి 'జాతీయఆత్మను జీవింపచేయును'; 'ఒక నూతనదృష్టిని, నూతన శక్తిని ప్రసాదించును' అని యతడు చెప్పగా మేము వింటిమి.

కాని తరచు శరీరమును చంపివేయునట్టియు నంతకంటె తరచు, ఆత్మను మరింత యధ్వాన్నముగ కూనీచేయునట్టియు క్రౌర్యములనుగురించి యింగ్లండు ప్రధానమంత్రి యేదో కొంత చెప్పియుండవలసినది."

మ్యాన్‌ఛెస్టరు గార్డియనుపత్రిక స్వేచ్ఛకొరకే నిలబడునెడల భారతదేశములో స్వాతంత్ర్యము నలిపివేయబడుచున్నపు డిది యేల నోరెత్తిమాట్లాడదు? మేముకూడ శరీరబాధలనేగాక నంతకంటె నధ్వాన్నమగు నాత్మపరీక్షలనుగూడ ననుభవించితిమి.

"ఆస్ట్రియాయొక్క ప్రజాప్రభుత్వము నాశము గావింపబడినను అది చివరవరకుపోరుచు శాశ్వతకీర్తిని సంపాదించి యొకపౌరాణిక గాధనుసృజించుకొనెను. ఇది ముందెప్పుడోయొకప్పుడు యూరపులో కలుగు స్వాతంత్ర్యోత్సాహమును తిరిగి రగుల్కొలుపవచ్చును." "స్వాతంత్ర్యములేని యూరపు విగతప్రాణియయ్యెను; ఆరోగ్యప్రదము లగు ప్రాణచిహ్నము లేవియు నచ్చట స్ఫురింపవయ్యెను; క్రమముగ నూపిరితిరుగని యుక్కిరిబిక్కిరిస్థితి దానికి దాపురించెను. గిజగిజ తన్నుకొనుటయు, లేకనాంతరంగికోద్రేకమును, కుడియెడమలకు కొట్టుకొనుటయు మాత్రమే యిప్పుడు పైబడనున్న మానసిక విస్మృతిని తప్పింప గలవు....రైనులగాయతు యూరలుపర్వతములవరకును యూరపు పెద్దజయిలుక్రింద తయారయ్యెను."

రాళ్ళను కఱిగించు యీవాక్యములు నాహృదయమున ప్రతిధ్వనించెను. కాని, హిందూదేశముగతి? మ్యాన్‌ఛెస్టరుగార్డియను పత్రికయును, యింగ్లండులో నిస్సందేహముగ గల యనేకమంది స్వాతంత్ర్యప్రియులును మాదౌర్భాగ్యస్థితి నేల విస్మరింపవలెను?ఇతర చోట్లవారంత తీవ్రముగ గర్హించుదానిని యిచ్చటచూడకుండ నెట్లుండగలరు? ఇరువదియేండ్లక్రిందట, నైరోపామహాసంగ్రామసమయమున, పందొమ్మిద వశతాబ్దసాంప్రదాయములక్రింద శిక్షనొందిన స్వభావముతో జాగరూకు

డును, మితభాషియునైన గొప్పయింగ్లీషు లిబరలునాయక శిఖామణి యిట్లుచెప్పెను. "దౌర్జన్యము ధర్మముపై విషాదపూరిత విజయమును బడయుచుండ సాక్షీభూతుడనై యూరకచూచుటకుముందు నేను మన దేశము చారిత్రికపుటనుండి తుడిచివేయబడుటను చూచెదను." అతి ధైర్యమైన యీభావము వాగ్ఝరితో మేళవింపబడెను. దీనినిరుజువుపరచుటకు లక్షలకొలదిసాహసికులైనయాంగ్లయువకులు ముందుకురికిరి. కాని ఆస్క్విత్తుగారి స్టేటుమెంటువంటిదానినే భారతీయుడుచేసినచో వానికెట్టిగతిపట్టును?

జాతీయచిత్తవృత్తి చిత్రమైనది. మనలోచాలమంది చాల యోగ్యులమని నిష్పక్షపాతబుద్ధిగలవారమని యూహింతుము. ఇతరుడే, యితరదేశమే యెల్లప్పుడును అన్యాయముగ ప్రవర్తించును. మనము యితరులవంటివారము కామని మనహృదంతరాళములో నెచ్చటనో యొకనమ్మకముండును. ఇతరదేశముల యదృష్టములను నియమించునట్టి ప్రభుత్వజాతికిచెందు యదృష్టమేమనకు పట్టునా! యిక చెప్పవలసినదేమున్నది? అత్యుత్తమమైన యీప్రపంచములో సమస్తమును కళ్యాణముకొరకే యని విశ్వసింపకుండ మనమెట్లుండగలము? పరివర్తనముకావలెనని యాందోళనచేయువారందరును స్వార్థపరులులేక మనవలన పొందినలాభములను మరచిన కృతఘ్నులు, వంచింపబడిన యవివేకులు.

బ్రిటిషుజాతి లంకకు చెందినజాతి; చిరవిజయముచేతను, విభవాతిశయముచేతను కొంచెమించుమించు యితరులందరను వారు హీనముగచూచెదరు. పయితరహాకుచెందు బ్రిటిషువారిదృష్టిలో ప్రపంచ మీావిధముగ విభజింపబడును. (1) బ్రిటను-పెద్దకాళీ. తరువాత (2) బ్రిటిషువలసలు (తెల్లజనాభామాత్రమే) మరియుఅమెరికా (ఆంగ్లోసాక్జనులుమాత్రమే, డాగోలు, వాప్‌జాతులు మొదలైనవారుకారు) (3)

పశ్చిమయూరపు (4) తక్కినయూరపు (5) దక్షిణఅమెరికా (ల్యాటిన్ జాతులు)-పెద్దకాళీ తరువాత (6) ఆసియా ఆఫ్రికాలకుచెందిన మెరుపు పసుపు, నలుపురంగులుగలజాతులు-కొంచెమించుమించు యేకగుది.

ఈతరగతులలో చిట్టచివరనున్న మనము మనపాలకులు నివసించు పీఠమునకెంతదూరములోనుంటిమి? వారు మనవైపుచూచునపుడు వారిదృష్టి మాంద్యముచెందుటలో నాశ్చర్యమేమున్నది? మనముప్రజాప్రభుత్వమును గురించియు, స్వేచ్ఛనుగురించియు మాట్లాడునపుడు వారికికోపమును కలిగించెదమనుటలో నాశ్చర్యమేమున్నది? ఈపదములు మన యుపయోగము కొరకు సృజింపబడలేదు. భారతదేశములో ప్రజాస్వామిక సంస్థలను భవిష్యత్తులోకూడ చాలకాలము వరకు నూహింపజాలనని చాటినది గొప్పలిబరలు రాజకీయ ధురంధరుడైన జాన్ మోర్లీ కాడా? కనడాదేశమునకు బొచ్చుకోటు పనికిరానట్లు భారతదేశమునకు ప్రజాప్రభుత్వము భర్జింపదు. తరువాత సామ్యవాద ధ్వజవాహకులును, దీనరక్షణ కంకణులును అగు బ్రిటను దేశపు లేబరుపార్టీవారు వెల్లివిరియువిజయోత్సాహముతో 1924 లోని బెంగాలు ఆర్డినెన్సును తిరిగిప్రసాదించిరి. వారిరెండవ పరిపాలనకాలములో మాస్థితి మరింతచెడిపోయెను. భాషచేతను, సంస్కారముచేతను భేదములుండుటచే నొకయాంగ్లేయుడును, ఫ్రెంచిదేశస్థుడును నొకే విధముగ భావింపజాలరు; ఇకనాంగ్లేయునకును ఆసియావాసికిని మధ్య నెంతవిపరీత భేదముండును?

భారతసంస్కరణ సమస్యనుగురించి యీమధ్య ప్రభువులసభలో చర్చజరిగెను. ఉదారులగు ప్రభువులనేక వన్నెచిన్నెల యుపన్యాసముల నిచ్చిరి. భారతదేశములో నొకరాష్ట్రమునకు గవర్నరుగనుండి కొంత కాలము వైస్రాయిగపనిచేసిన లిట్టనుప్రభువుగారు వీరిలోనొకరు; ఇతడు ఉదారతయు, సానుభూతియు కలగవర్నరని పదేపదే చెప్పబడుచుండును;

ఇతడిట్లు చెప్పెనట "హిందూదేశమునకంతకును కాంగ్రెసు వారికంటె భారతప్రభుత్వమునకె యెక్కువప్రాతినిధ్యముగలదు. అధికారులు, సైన్యము, పోలీసు, సంస్థానాధిపతులు, పోరాడుపటాలములు, హిందువులు, ముస్లిములు—వీరువారననేల యందరిపేరను ప్రభుత్వమువారు మాట్లాడగలరు. కాంగ్రెసువారు చివరకు దేశములోనున్న యొకపెద్ద సంఘముతరఫునగూడ మాట్లాడజాలరు." అతడు తనయర్థమును స్పష్టముచేయుటకు "భారతదేశాభిప్రాయమని నేనుచెప్పునపుడు నేనెవరిసహాకారముమీద నాధారపడగలనో, ముందురాబోవు గవర్నరులును, వైస్రాయిలునుకూడ నెవరిమీద నాధారపడవలయునో వారిని గురించియే తలచుచున్నాను."

ఇతని యుపన్యాసమునుండి రెండుప్రధాన విషయములు బయలుపడుచున్నవి. భారత ప్రభుత్వమునకు సహాయముచేయువారే లెక్కింపదగిన భారతదేశము. ఇండియాలోని బ్రిటిషు ప్రభుత్వమే యెక్కువ ప్రాతినిధ్యము కలది కనుక ప్రజాప్రభుత్వము. ఈవాదము పెద్దమనిషి తప్పుగ చేయబడుటను బట్టిచూడగా సూయజుకాలువను దాటుటతోడనే యాంగ్లశబ్దములు తమయర్థమును మార్చివేయునట్లు కాన్పించును. చక్రవర్తి ప్రతినిధికిని ప్రాతినిధ్యము వహించును. కనుకనిరంకుశ ప్రభుత్వమే యెక్కువప్రాతినిధ్యముకల ప్రజాప్రభుత్వము అనువాదము సహజముగ దీనితరువాత మెట్టువలె కాన్పించును; పృథ్వీపతులు యీశ్వరాధికారముకలవారను పూర్వపు తత్త్వమునకు మనముచేరుకొనెదము.

యథార్థమునకు కలితీలేని నిరంకుశాధికారమునుకూడ సమర్థించు మోహము నవీనముగ పూపట్టెను. ఐ. సి. యస్. శాఖాభూషణమైన సర్. మాల్కాంహైలీగారు 1934 నవంబరు 5 వ తేదీని యు. పి. గవర్నరుగ కాశీలో మాట్లాడుచు భారతసంస్థానములలో

నిరంకుశత్వముండవలెనని సమర్థించెను. ఈ సలహాయననవసరము. భారత దేశములో నేసంస్థానమును తనంతటతాను స్వైచ్ఛికముగ నిరంకుశత్వ మును విడిచిపెట్టదు. యూరపులో ప్రజాప్రభుత్వములు విఫలమగుచున్న వను సాకుతో నీనిరంకుశత్వమును కాపాడవలెనని చేయుప్రయత్నము గమనింపదగియున్నది. మైసూరుదివాను సర్ మిర్జా ఇస్మాయిల్ గారు "ప్రతిచోటను పార్లమెంటరీ ప్రజాప్రభుత్వము లంతరించుచుండ గొప్పసంస్కరణములు కావలెనను సమర్థనమున కాశ్చర్యమును వెలి బుచ్చెను." "మనప్రస్తుతచట్టమన్నివిధముల తగినంత ప్రజాస్వామికముగ నున్నదని సంస్థానముయొక్క ఆత్మభావించుచున్నట్లు నేను దృఢముగ చెప్పగలను"అని ఆయనచెప్పెను. మైసూరుయొక్క 'ఆత్మ' అనునది యీరాజుగారియొక్కయు, దివానుగారియొక్కయు, నాధ్యాత్మిక స్వరూపముకాబోలును ! ప్రస్తుతము మైసూరులోనున్న ప్రజాప్రభుత్వ మును నిరంకుశత్వమునుండి వేరుచేయజాలము.

హిందూదేశములోని కులకక్షలవలన మనప్రజాప్రభుత్వ మభి వృద్ధికాజాలదని చెప్పెదరు. కాని యీకులకక్షలకు శాశ్వతమైన ద్రోహదము నిచ్చెదరు. మనలో సంఘీభావములేదనికూడ చెప్పెదరు. ఈజిప్టులో కులకక్షలులేవు. అచ్చటపరిపూర్ణమైన రాజకీయ మైక్యము కలదు. అయినను యీమైక్యమే యచ్చట స్వాతంత్ర్యమునకును, ప్రజా ప్రభుత్వమునకును అడ్డమువచ్చుచున్నది. నిజముగ ప్రజాప్రభుత్వ మార్గము సూచీముఖమార్గము. తూర్పుదేశములకు ప్రజాప్రభుత్వ మనగా వారిని పరిపాలించు అధికారుల యాజ్ఞలను శిరసావహించుట; వారిప్రయోజనములను వేటిని ముట్టకుండుట. ఈమతముకు అంగీక రించుచో ప్రజాప్రభుత్వస్వేచ్ఛ యనర్గళముగా సాగగలదు.

---

## ౬౧

# సంహారము.



ఏప్రిల్ మాసమువచ్చెను. బయట ప్రపంచములో జరుగుచున్న సంగతులనుగురించి యసంతృప్తికరములగు వార్తలు వచ్చుచుండెను. మాజయిలు సూపరింటెండెంటు గాంధీజీ శాసనోల్లంఘనము నాపివేసెనని ప్రసంగవశమున చెప్పెను. నాకంతకంటె మరేమియును తెలియలేదు. అనేక సంవత్సరములనుండి యెంతయో ఘనముగ భావింపబడిన దానిని యిట్లువిరమించుటకు నేను చాల విచారించితిని. ఎప్పుడో యొకప్పుడిది విరమింపబడవలెనని (తాత్కాలికముగ నైనను) నేనెరుగుదును. గాంధీజీ దేశముయొక్కయు, కాంగ్రెసులో సత్యధికసంఖ్యాకుల యొక్కయు అభిప్రాయములను సరిగ గ్రహించెననుటకు సందేహము లేదు. అసంతృప్తిగనున్నను నేనీనూతన పరిస్థితికి సమాధానపడ ప్రయత్నించితిని.

శాసనసభలలో ప్రవేశించుటకు వెనుకటి స్వరాజ్యపార్టీ తిరిగి తలయెత్తనున్నదనికూడ నేను వింటిని. అదికూడ తప్పనిసరిగాతోచెను. కాంగ్రెసు ముందుయెన్నికలలో పాల్గొనకుండనుండజాలదని నేను భావించుచుంటిని. నేను వెలుపలనున్న అయిదుమాసములకాలములో నీదృష్టిని నిరుత్సాహపరచుటకు ప్రయత్నించితిని. నేను దీనికింకను సమయమురాలేదనియు, నిది, ప్రత్యక్షకార్యమునుండియు కాంగ్రెసువారిలో పొంగుచున్న నూతనసాంఘిక పరివర్తనభావములనుండియు దృష్టిని మరల్చునని భావించితిని. ముమ్మరమెక్కువ కాలమున్నకొలది ప్రజలలోను, విద్యాధికులలోను యీభావములు వ్యాప్తిచెందుననియు మనరాజకీయ, ఆర్థికపరిస్థితి వెనుకనున్న యథార్థము బయటపడుననియు

నేను భావించితిని; ఈవిధానమువలన కాంగ్రెసు నిర్మలమైనయాలోచనలను, నిశ్చయమైన పరమావధియు గల యభేద్యమగు సంస్థయగునని నేను భావించితిని. బహుశః అందులోనున్న కొంతమంది దుర్బలులు జారిపోవచ్చును. అదియొకనష్టమెట్లగును ? ప్రత్యక్షవిధానముయొక్క నటననుకూడ విరమించి చట్టసమ్మతము న్యాయబద్ధము అనిపిలువబడు పద్ధతులను తిరిగి యుపక్రమింపవలసివచ్చినపుడు మన పరమలక్ష్యమును మనస్సులోనుంచుకొని కాంగ్రెసులో ముందంజవేసి యెక్కువగపని చేసిన పక్షము యీపద్ధతుల నుపయోగించును.

ఆకాలమువచ్చెను. కాని, శాసనోల్లంఘనమునకు వెన్నెముకవంటివారును, కాంగ్రెసులో సమర్థముగ పనిచేసినవారును వెనుకకు పోవుచుండుటయు, నట్టిపాత్రలను వహింపని యితరులు తగుదుమమ్మా యని సిద్ధమయి పెద్దపీటలమీద కూర్చొనుచుండుటయు నాకు విచారమును కలిగించెను.

శాసనోల్లంఘనమును విరమించునపుడు గాంధీజీయిచ్చిన స్టేటుమెంటును నేను కొద్దిరోజులయినతరువాత చదివి యాశ్చర్యపడితిని; నాహృదయము క్రుంగెను. నేనుదానిని మరలమరలచదివితిని. గాంధీజీ యిట్లువ్రాసెను. "ఈస్టేటుమెంటు సత్యాగ్రహాశ్రమవాసులతోను, తత్సంబంధులతోను చేసిన సంభాషణలఫలితము... నేనెక్కువగ గౌరవించునట్టి చిరకాలసహచరుడు, పూర్తిజయిలుపనిని చేయుట కిష్టపడక తన ప్రత్యేకాధ్యయనమును చేయుచుండెననుట ప్రసంగవశమున తెలిసికొనుట దీనికి మరింతముఖ్యకారణము. నిస్సందేహముగ నిది సత్యాగ్రహసూత్రములకు విరుద్ధము. నేను ప్రేమించుస్నేహితుని దోషముకంటె నిది మరింతయెక్కువగ నాదోషమునే విశదముచేసెను. తనదుర్బలత్వము నాకుతెలియునని భావించితినని యాస్నేహితుడు చెప్పెను. నేను గుడ్డిగనుంటిని. నాయకుని యంధత్వము క్షమార్హము

కాదు. ఆచరణలో శాసనోల్లంఘనమునకు తాత్కాలికముగ, నే నొక్కడనే ప్రతినిధిగ నుండవలెనని వెంటనే కనుగొంటిని."

ఆ 'స్నేహితుని' యొక్క తప్పులేక లోపము (అదియట్టిదేయైన యెడల) అతిస్వల్పవిషయము. తఱచు నేనట్టి దోషమునుచేసితిని. కాని నేనందులకెంతమాత్రమును పశ్చాత్తాపపడను. ఒకవేళ అది ముఖ్యమైనవిషయమేయైనను ప్రత్యక్షముగ వేలకొలదిప్రజలకును, అప్రత్యక్షముగ లక్షలకును సంబంధించునట్టి గొప్పజాతీయోద్యమమును ఒకవ్యక్తి యొక్కదోషముకొరకు బలివేయవలసినదేనా? ఇది నాకు విపరీతమును, నీతిబాహ్యమును నగు తీర్మానముగ కాన్పించెను. ఏదిసత్యాగ్రహమో యేదికాదో నేను చెప్పసాహసింపజాలను. కాని, నాస్వంతవిధమున నేనుకొన్ని ప్రమాణములననుసరించి ప్రవర్తించుటకు ప్రయత్నించితిని. గాంధీజీయొక్క యీస్టేటుమెంటువలన నాప్రమాణము లన్నియు తారుమారయ్యెను, కూలిపోయెను. గాంధీజీ సాధారణముగ తనసహజగుణమునుబట్టి ప్రవర్తించును. తఱచు అది యుక్తముగనే యుండును; ప్రజాహృదయమును గుర్తించుటయందును, మంచిపరిపక్వస్థితియందు కార్యరంగమున కురుకుటయందును గల యద్భుతశక్తిని అతడనేకసార్లు ప్రదర్శించెను. తనచర్యను సమర్థించుకొనుటకతడు తరువాతచూపు కారణములు కార్యానంతరముపుట్టు తలంపులు; అవి యెక్కువరసవంతములుగనుండవు. నాయకుడు లేక కర్మవీరుడు మంచిపట్టు సమయములో నెప్పుడును అప్రయత్నముగ నాచరించి తరువాతదానికారణములను గురించి యోచించును శాసనోల్లంఘనమును ఆపివేయుటలో గాంధీజీ యుక్తముగనే ప్రవర్తించెననికూడ నేనుతలంచితిని. కాని యతడుచూపిన కారణము బుద్ధిబలమున కవమానమువలె నాకుకాన్పించెను. తనయాశ్రమవాసులనతడు తనయిష్టమువచ్చినట్లు మందలించుట కధికారము కలదు;వారు అన్నివిధములప్రమాణములనుచేసి యొకకట్టుబాటు కంగీక

రించిరి. కాని కాంగ్రెసు అట్టిదేదియును చేయలేదు; నేనట్లుచేసియుండ లేదు. నాకెట్టి ప్రయోజనమునులేని మానసిక, రహస్యకారణముకొరకు మమ్మేల యిటునటు గుంజవలెను? ఇట్టిపునాదిమీద నెట్టి రాజకీయో ద్యమమునైనను భావింపయోగ్యమగునా; సత్యాగ్రహముయొక్క నైతిక భావమును నేను గ్రహించినంతవరకు (కొన్నిహద్దులమధ్య యనినేనొప్పు కొనెదను) బుద్ధిపూర్వకముగనే నంగీకరించితిని. ఆప్రధానభావము నాకు నచ్చెను. అదిరాజకీయములను మరింతయున్నతమును, ఉదారమునునగు స్థాయికి గొంపోవునట్లు కాన్పించెను. లక్ష్యము అన్నివిధములగు సాధన లను సమర్థింపజాలదని నేనొప్పుకొనెదను.

ఆస్టేటుమెంటు యావత్తు నాకెక్కువ భయమును, దిగులును కలిగించెను. చివరనతడు కాంగ్రెసువారికీ సలహాచెప్పెను. "వారు ఐచ్ఛికదారిద్ర్యము, స్వార్థత్యాగములను కళను నేర్చుకొనవలెను. వారు జాతిని నిర్మించుపనులలో నిమగ్నులుకావలెను; స్వయముగ వడుకుచు, నేయుచు ఖద్దరును వ్యాప్తిచేయవలెను. వారినిత్యజీవిత సంబంధములలో నన్నివిధములను అనింద్యమగు పరస్పర ప్రవర్తనలవలన హృదయ పూర్వకమగు కులసంఘీభావమును పెంపొందింపవలెను. తమలో నేరూపములోనున్నను అస్పృశ్యతను తరిమి వేయవలెను. మద్యపానము మొదలగు మత్తుపదార్థములను సేవించువారితో సంపర్కము కలిగించు కొని, స్వయముగ పవిత్రతనార్జించి త్రాగుడును పూర్తిగమాన్పించ వలెను. ఈసేవలవలన బీదవాని తరహాకు సరిపడు భృతియేర్పడగలదు. ఈబీదవాని ప్రమాణము చాలనివారు యెక్కువలబ్ధినిచ్చు జాతీయ ప్రాముఖ్యతగల చిన్నచిన్న పరిశ్రమలలో స్థానము నేర్పర్చుకొన వలెను."

ఇది మేమనుసరింపవలసిన రాజకీయప్రోగ్రాము అయియుండెను. మాకిద్దరకునుమధ్య చాలదూరమున్నట్లు నాకు కాన్పించెను. అనేక

సంవత్సరములనుండి నన్నతనితో బంధించిన వినయవిధేయ తంతువు లొక్కసారి తెగిపోయినట్లు నేను భావించితిని. చాలకాలమునుండి నాలోనొక మానసిక పోరాటము సాగుచుండెను. గాంధీజీచేసినది చాల వరకు నాకర్థముకాలేదు; నచ్చలేదు. అతని యుపవాసములు, శాసనోల్లంఘనము జరుగుచుండగ నతడు యితరసారాంశములపయి దృష్టిని కేంద్రీకరించుట, వ్యక్తిగతమగు నతని స్వయంకృతపాశములు, వెనుకటి ప్రమాణమును, భక్తిని, కృషిని మూలకు త్రోసిన యతని నూతనప్రమాణము, భక్తి-యివన్నియు నన్ను బాధించెను. నేను జయిలు బయటనున్న స్వల్పకాలములో నీభేదములును మరికొన్నియు వెనుకటికంటె నాకెక్కువ భారమయ్యెను. మామధ్య ప్రకృతిసిద్ధములగు భేదములుకలవని గాంధీజీ చెప్పెను. బహుశః అవి యంతకంటె నెక్కువవేయగును. అనేకవిషయములనుగురించి యతనికి వ్యతిరేకములగు స్పష్టమైన, నిశ్చయ భావములను కలిగియున్నానని నేను గుర్తించితిని; అయినను కాంగ్రెసు జాతీయ స్వాతంత్ర్యముకొరకు పోరాడుచున్నట్లు నాకు కాన్పించెను. కనుక పెద్దయుద్యమముకొరకు (నేను చేయగలిగినంతవరకు) గతములో నేను వీనిని అణచివేసితిని. నానాయకునిపట్లను, నాసహచరులపట్లను విధేయతగను, విశ్వాసముగను నుండవలెననియే నేను ప్రయత్నించితిని. నాయాధ్యాత్మికనిర్మాణము ధర్మముపట్లను, సహచరులపట్లను విధేయతగ నుండుటకు ఉన్నతస్థానము నిచ్చెను. నాయాధ్యాత్మిక విశ్వాసమనెడి లంగరునుండి నేను లాగివేయబడుచున్నానని భావించినపుడు నాలో నేననేక సంరంభములను జరిపితిని. ఏదోయొకవిధముగ నేను రాజీపడితిని. బహుశః నేను తప్పుచేసితిని. ఈలంగరును విడిచివేయుట యెవనికిని యెప్పటికిని యుక్తముకానేరదు. కాని, భావములలో సంఘర్షణకలిగినపుడు నాసహచరులపట్ల నాకుండవలసిన విధేయతనే నేనారాధించితిని.ముంచుకొనివచ్చు పరిస్థితులును,మనసంగ్రామాభివృద్ధియు నన్ను

బోధించుకష్టములను కరగించి నాస్నేహితులను నాదృష్టికి దరిచేర్చునని నేననుకొంటిని.

ఇప్పుడు? ఆలిపూరుజయిలు గదిలో నే నే కాకినై పోతినని హఠాత్తుగ భావించితిని. జీవితము నిరుత్సాహజనకముగ కాన్పించెను; నిర్మానుష్యమైన యెడారివలె కాన్పించెను. నేను నేర్చుకొనిన కఠినపాఠములలో నతికఠినమైనది, యతి బాధకరమైనది, నన్నిప్పు డెదుర్కొనెను. ఎట్టి ముఖ్యమైనవిషయములోను మన మెవని మీదను ఆధారపడుట సాధ్యముకాదు. జీవితములో మన మొంటరిగనే ప్రయాణముచేయవలెను; ఇతరులమీద నాధారపడుట హృదయవిదారతను తెచ్చిపెట్టుకొనుటయే యగును.

పేరుకొనియున్న నాకోపములో కొంత మతము మీదకును, మతదృష్టిమీదకును తిరిగెను. ఇది స్థిరప్రయత్నమునకును, నిర్మలభావములకును నెంతటి శత్రువు! ఇది యుద్రేకముమీదను, రాగము మీదను ఆధారపడుటలేదా? ఆధ్యాత్మికముగనుండునట్లు అహంకరించుచు నిది నిజమైన యాధ్యాత్మికతకును, ఆత్మవస్తువులకును నెంతదూరమున నున్నది? వేరొక ప్రపంచమునుగురించి యోచించుచు నిది మానవుడు, సంఘము, సాంఘికన్యాయము-అనువిషయములను గురించి యేమియు భావింపదు. ఇది ముందుగనే కొన్ని భావములను కలిగియుండి సత్యము వానికి విరుద్ధముగనుండునను భయముతో బుద్ధిపూర్వకముగ సత్యము పట్ల కండ్లుమూసికొనును. అది సత్యముమీద నాధారపడెను. అయినను అది దానిని గ్రహించినట్లు, కూలంకషముగ గ్రహించినట్లు, దానికొరకు పరిశోధనచేయదు. దానినిగురించి యితరులకు చెప్పుటయే దాని జబాబుదారీ. విశ్వసించుటకుండు కోరిక వేరు, సత్యముపట్లనుండు కోరిక వేరు. అది శాంతినిగురించి మాట్లాడెను; కాని, దౌర్జన్యములేని దే జీవింపజాలని సంస్థలను, పద్ధతులను బలపరచెను. అది కత్తియొక్క

దౌర్జన్యమును గర్హించెను. కాని నెమ్మదిగను, తరచు శాంతియుత కవచములోను వచ్చి మాడ్చి చంపివేయునట్టి దౌర్జన్యముసంగతి యేమి? ఎట్టి బాహ్యశరీరగాయములను కలిగింపక మనస్సును భంగపరచి, యుత్సాహమును నలిమి, హృదయమును ముక్కలుచేయు దాని సంగతి యేమి?

తరువాత నాలో, నింత గందరగోళమును కలిగించిన వానిని గురించి నేను యోచించితిని. ఇంతకు ప్రజలపైన యద్భుతమును, అప్రతిహతమును నగు మంత్రశక్తిని, అమోఘమగు నధికారమును కలిగిన గాంధీజీ యెంతటి వింతమనిషి? అతని వ్రాతలును, అతని మాటలును వానివెనుకనున్న వ్యక్తినిగురించి కొద్దిభావమును కలిగించును; అవి సూచించు దానికంటె నతనిశక్తి చాల గొప్పది. అతడు హిందూదేశమునకు చేసిన సేవ యెంత దిగంతవిశ్రాంతమైనది! అతడు యీమె ప్రజలకు ధైర్యమును, పౌరుషమును, శిక్షను, సహనమును, ధర్మముకొరకత్యుత్సాహముతో త్యాగము చేయుశక్తిని (అతడెంత వినమ్రుడైనను) స్వాభిమానమును కలిగించెను. శీలమునకు ధైర్యమొక్కటే నిశ్చయమైన పునాది యని యతడు చెప్పెను; అది లేనిదే నీతి, మతము, ప్రేమ యుండనేరవు. "భయమునకు దాసులమైనంతకాలము మనము సత్యమును లేక ప్రేమను అనుసరింపజాలము" దౌర్జన్యము నతడెంత యేవగించుకొనినను "దౌర్జన్యముకంటెకూడ పిరికితనము మరింత యేహ్యమైనది" అని యతడు చెప్పెను. "మానవుడు వ్యవహారదక్షుడగుటకు శిక్షయే ప్రమాణము, పూచీ. త్యాగము, శిక్ష, ఆత్మసంయమము లేని దేమునకు ఆశ, మోక్షములేవు. శిక్షలేని త్యాగము బూడిదలో పోసిన పన్నీరువలె నుండును." ఇవి కేవలము మాటలు, బహుశః విశ్వాసముగల మాటలు, నీతివాక్యములు కావచ్చును; కాని యీమాటల వెనుక శక్తికలదు. ఈ చిన్నవ్యక్తి, చెప్పినట్లుచేయువాడని భారతదేశమెరుగును.

ఆశ్చర్యకరమగునట్లు భారతమునకు ప్రాతినిధ్యము వహించుటకును, హింసింపబడిన యాప్రాచీన దేశముయొక్క నిజాత్మను వ్యక్తీకరించుటకును అతడువచ్చెను. రమారమి యతడే భారతము; అతని దోషములు భారతదేశ దోషములే; అతని నగౌరవ పరచుట యతని స్వవిషయము కానేరదు; అది జాతిని పరాభవవించుట; ఇట్టి నిర్లక్ష్యచేష్టలను చేసిన నైసర్గియి యిత్యాదులు వారెట్టి యుపద్రవకరమైన సస్యమును చల్లుచుండిరో గుర్తింపజాలకపోయిరి. 1931 డిసెంబరులో రౌండు టేబిలు కాన్ఫరెన్సునుండి తిరిగివచ్చునపుడు (పోప్) మతగురువు అతనికి సందర్శనము నీయ నిరాకరించెనని నేను మొదట వినినపుడెంత బాధపడితినో నాకు జ్ఞప్తియున్నది. అది హిందూదేశము నగౌరవ పరచుటవలె నాకు కాన్పించెను. ఆ నిరాకరణము (అగౌరవము భావింపబడక పోయినను) బుద్ధిపూర్వకముగనే చేయబడెననుట కెట్టి సందేహమును లేదు. క్యాథలిక్ చర్చి తన మతముకు చెందని ఋషులను మహాత్ములను మెచ్చుకొనజాలదు. ఒక ప్రొటెస్టెంటుచర్చి గాంధీజీని గొప్ప మత తత్పరుడు, నిజమైన క్రైస్తవుడు అని పిలిచెను. కనుక నీపిచ్చి మతముతో తన కెంతమాత్రమును సంబంధము లేకుండ చేసికొనుట రోముపట్టణమునకు మరింత యవసరమయ్యెను.

ఆసమయమందే ఆలిపూరుజయిలులో 1934 ఏప్రిల్‌లో నేను బెర్నార్డుషా వ్రాసిన క్రొత్తనాటకములను చదివితిని. 'పర్వతములమీద' అనుదానికివ్రాయబడిన పీఠికయు జీససుకును పైలేటుకును జరిగినచర్చయు నన్నాకర్షించెను. మరియొకసామ్రాజ్యము మరియొక మతపురుషుని యెదుర్కొనవలసిన యీకాలమునకు అది తగియున్నట్లు కాన్పించెను. ఈపీఠికలో జీససుపైలేటుతో నిట్లుచెప్పును. "భయమును పారద్రోలుము. రోముయొక్క గొప్పతనమునుగురించి నాకిక నెట్టిబడాయి మాటలను చెప్పకుము. రోముయొక్క గొప్పతనమని నీవుచెప్పునది

భయముతప్ప మరొకటికాదు. సర్వత్రిభయము! భూతకాలమునుగురించి భయము, భవిష్యత్తునుగురించిభయము, బీదవారిభయము, ధనవంతుల భయము. పెద్దమతబోధకులభయము, చదువుకున్న గ్రీకులయొక్కయు, యూదులయొక్కయు భయము; మోటువారైన, 'గాలులు', గాతులు, హూణులు మొదలగువారిభయము; దానిభయమునుండి మిమ్ము రక్షించుకొనుటకు మీరునాశనముచేసిన కార్థేజివలనభయము. ఇప్పుడు వెనుకటికంటె నధ్వాన్నమైన భయము (మీయంతటమీరు సృష్టించుకొనిన విగ్రహము) సార్వభౌమికసేజరు; వలన భయము, పరిహసింపబడుచు, తన్నబడుచు, నిర్ధనుడనై, దేశద్రిమ్మరినగు నావలన భయము. భగవంతుని పాలనపట్లతప్ప ప్రతిదానియెడలను భయము. రక్తపాతము, కత్తి, బంగారములందుతప్ప దేనియందును విశ్వాసము లేకపోవుట; రోము కొరకు నిలుచునట్టినీవు సర్వత్రపందవు: ఈశ్వరరాజ్యముకొరకు నిలుచు నేను ప్రతిదానినిధిక్కరించితిని, సమస్తమును పోగొట్టుకొంటిని, శాశ్వతసామ్రాజ్యపట్టభద్రుడనైతిని". కాని, గాంధీజీయొక్క గొప్పతనము, అతడు హిందూదేశమునకు చేసినసేవ, నేను స్వాయముగ నతనికి తీర్చుకొనవలసిన యద్భుతఋణము- ఇవి శంకింపబడుటలేదు. ఇవన్నియు నున్నను అనేకవిషయములలో నతడు శుద్ధతప్పులు చేసియుండవచ్చును. ఇంతకును అతనిలక్ష్యమేది? అనేకసంవత్సరముల సన్నిహిత సంపర్కమును కలిగియున్నను నాకతని లక్ష్యమునుగురించి నిర్మలభావము కలుగలేదు. అతనిమట్టుకతనికి నిర్మలభావములున్నవని నేననుకొనను. ఒకయడుగు ముందుకుపోయిన నాకుచాలునని యతడనును. అతడు భవిష్యత్తును చూడప్రయత్నింపడు; తనయెదుట నిర్మాలిన్యముగ భావింపబడిన పరమావధి నుంచుకొనడు. పరికరములను చూచుకొనుడు; ఫలితము దానంతటదియే జాగ్రతపడును, అనియతడు విసుగులేకుండ చెప్పుచుండును. మీస్వవిషయములలో, మీవ్యక్తిజీవితములలో, మంచితనముగ నుండుడు, తక్కినదంతయు దానిననుసరించును. ఇదియొక రాజ

కీయమైన లేక శాస్త్రీయమైనదృష్టికాదు. బహుశః యిది నీతిశాస్త్ర సంబంధమైన దృష్టికూడకాదు. ఇది సంకుచితమైన ధర్మబోధ. మంచి తనమనగానేమి? యనుప్రశ్నకదియేమియు నుత్తరమియ్యజాలదు. అది కేవలము వ్యక్తికి సంబంధించినదా లేకసాంఘికమా? గాంధీజీ మానసిక శిక్షకును, అభివృద్ధికిని యేమియు ప్రాముఖ్యతనీయక శీలమునకే ప్రాశస్త్యమునంతనుచూపును; శీలములేని చదువు యుపద్రవ కరము కావచ్చును. కాని విద్యలేని శీలమనగానేమి? నిశ్చయముగ శీలమెట్లు యభివృద్ధిచెందును? గాంధీజీని మధ్యయుగపు క్రైస్తవ ఋషులతో పోల్చుచుందురు, అతడుచెప్పునది చాలవరకు దీనికిసరిపడునట్లు కాన్పించును. అది యాధునిక మానసికానుభవమునకును, పద్ధతికిని నెంత మాత్రమును సరిపడదు.

లక్ష్యమునుగురించి యతడొక్కొక్కప్పుడు కన్పించునంతటి యస్పష్టముగ నుండడని నేనూహించెదను. అతడొక నిశ్చయమైన మార్గమున నడుచుట కుద్రేకముతో వాంఛించును. కాని, యిదియాధునిక భావములకును, పరిస్థితులకును పూర్తిగ విరుద్ధము. ఇంతవరకు నతడీ రెంటిని సమన్వయపరుప జాలకపోయెను; లేక తనలక్ష్యమునకుగొంపోవు మధ్యసోపానములను నిరూపింప లేకపోయెను. కనుక నస్పష్టత కాన్పించును. కాని యతడు దక్షిణాఫ్రికాలో పాతికసంవత్సరములక్రిందట తన సిద్ధాంతమును ప్రారంభించిన నాటినుండి యతని సామాన్యాభిరుచి సుబోధకముగనేయుండెను. అతని యప్పటి వ్రాతలు యిప్పటికిని యతనిభావములను తెలుపునోలేదో నేనెరుగను. అవిపూర్తిగ నట్లు చేయునని యనుకొనను. కాని, యతనిభావము వెనుకనున్న పునాదిని యర్థము చేసికొనుటకవి తోడ్పడును.

అతడు 1909 లో నిట్లు వ్రాసెను. "గతయేబది వత్సరముల నుండియు తానుచదివిన చదువునంతను మరచిపోవుటలోనే భారత

దేశముయొక్క మోక్షముకలదు. రైల్వేలు, టెలిగ్రాఫులు, ఆస్ప త్రిలు, లాయర్లు, డాక్టర్లు మొదలగునవన్నియు పోవలెను. పయితర గతులవారు అనబడువారు మనఃపూర్వకముగను, భక్తితోను, యెరుక తోను నిరాడంబరమగు వ్యవసాయదారుని జీవితమును (అదియథార్థ మైన యానందము నిచ్చునది యని తెలిసికొని) నేర్చుకొనవలెను." మరియు "రైల్వేబండిలోను, మోటారు బసులోను యెక్కుసపుడెల్ల నేను యుక్తమని భావించుదాని కపచారమును చేయుచున్నానని యెరు గుదును;" "అత్యంత కృత్రిమములును, శీఘ్రములునునగు గమన శక్తిద్వారా ప్రపంచమును సంస్కరింపబూనుట యసాధ్యమును సాధింప బూనుటవంటిది."

ఇదియంతయునాకు కేవలము తప్పు, ఉపద్రవకరము, సాధింపనలవి కానిది-అగు సిద్ధాంతమువలె కాన్పించును. గాంధీజీ దారిద్ర్యమును, బాధను, సన్యాసిజీవితమును ప్రేమించును, స్తోత్రముచేయును. అది దీని వెనుక కాన్పించును. అతనిదృష్టిలో కోరికలను పెంచుకొనుటయు, జీవిత ప్రమాణములనున్నతిచేయుటయు నభివృద్ధియు,నాగరికతయుకాజాలవు. "కోరికలను బుద్ధిపూర్వకముగను, ఐచ్ఛికముగను తగ్గించుకొనవలెను. అది యథార్థమైన ఆనందమును, తృప్తినిపెంపొందించి, సేవచేయుశక్తి నధికముచేయును. ఇదియే నాగరికత, యభివృద్ధి" ఈప్రాతిపదిక సూత్రములొకసారి యంగీకరింపబడినచో గాంధీజీయొక్క తక్కిన భావము నర్థముచేసికొనుట సులభమగును; అతనికార్యములు సుబోధక ములుకాగలవు. మనలో చాలమంది వీనినంగీకరింపము. కాని, తరు వాత నతనికార్యములు మనకు నచ్చనపుడు గోలచేయుదుము.

దారిద్ర్యమును, బాధను స్తోత్రముచేయుట నామట్టుకు నాకు గిట్టదు. అవి యెంతమాత్రమును అవసరములని నేననుకొనను. అవి తరిమివేయబడవలెను సన్యాస జీవితము వ్యక్తులకు సరిపడినను దానిని

సాంఘికాదర్శముగ నేనంగీకరింపజాలను. నిరాడంబరతను, సమత్వమును, ఆత్మసంయమమును నేనుగ్రహింపగలను, మెచ్చుకొనగలను. కాని శరీరమును మాడ్చివేయుటను నేనొప్పుకొనను. వస్త్రాదులకు శరీరశిక్షయవసరమైనట్లే మనస్సునకును, ఆచారములను శిక్షలోనుంచి వశపరచుకొనుట యవసరమని నేను విశ్వసించెదను. విశేషభోగలోలుడగువాడు సమయము వచ్చినపుడు యెక్కువబాధను సహించుననియు, నసామాన్యమగునాత్మనిగ్రహమును చూపుననియు, వీరునివలె ప్రవర్తించుననియు భావించుట వెర్రితనము. మంచి శరీరారోగ్యమున కెంత శిక్షయవసరమో మంచి నైతికస్థితికిని యథమమంత శిక్షయునుండవలెను. కాని, యది నిశ్చయముగ సన్యాసమును, శరీరమును శుష్కింపజేయుటయు కాజాలదు.

'నిరాడంబరమైన వ్యవసాయదారు జీవితమును' ఆదర్శముగ జేయుటకు నేనెంతమాత్రమును అంగీకరింపజాలను. అదియనిన నాకు కంపరమెత్తును. నేనుదానికి లొంగుటకుబదులు వ్యవసాయదారులను గూడ దానినుండి బయటకు లాగగోరెదను. అనగా వారిని పట్టణవాసులను జేయుటగాక నచ్చటనుండు విజ్ఞానసౌకర్యములను గ్రామసీమలకు వ్యాపింపజేయవలెననియే నాకోరిక. ఈజీవితముయథార్థమైన మానందము నీయకపోవుటయేగాక నాకు రమారమి జయిలువలె నుండును. "చేతపారను బూను మనిషి." లో నాదర్శపాత్రముముగ జేయవలసినదేమిగలదు? అసంఖ్యాకములగు పురుషాంతరములనుండి నలిపివేయబడి, కొల్లగొట్టబడిన యతడు తనతోడి పశువులకంటె నొక్కవాసిమెరుగు. "అతనికి సంతోషమును, నిరాశనులేకుండ చేసినదెవరు? విచారమును వెలిబుచ్చక నెప్పుడును ఆశింపక మొద్దుబారిన యెద్దుసోదరునివలె చేసినదెవరు?"

మానవ సంస్కారమునుండి మనస్సునకు స్థానములేని యజ్ఞానపరిస్థితులకు పోవలెనను యీకోరిక నాకు కేవలము అర్థశూన్యముగ

కాన్పించును. మానవునకు కీర్తిని, విజయమును చేకూర్చినవస్తువే దూషింపబడుచున్నది, నిరుత్సాహ పరుప బడుచున్నది. మనస్సును అణచివేసి దాసయభివృద్ధి నరికట్టునట్టి భౌతికవాతావరణము వాంఛ నీయమని భావింపబడుచున్నది. ప్రస్తుత నాగరికత దోషములతో నిండియున్నది; కాని, దానినిండ మంచిగుణముకూడ కలదు. దానిలో నున్న యాదోషమును పోగొట్టుకొనగలశక్తి దానికిగలదు. దానిని సమూలమునాశముచేయుటయనగా దానిలోనున్న యాశక్తిని తీసివేసి నిర్వీర్యము, నిరుత్సాహ జనకము, దుఃఖప్రదము నగుస్థితికి పోవుట యగును. కాని, యిదివాంఛనీయమే యనియనుకొనినను యసంభవము. పరివర్తనప్రవాహమును మనమాపజాలము; దానితో మనకట్టిసంబంధ మును లేకుండచేసికొన జాలము. ఈడెను వనఫలము ననుభవించిన మనము ఆరుచిని మరచిపోయి వెనుకకు యిక్ష్వాకుల కాలముకు పోజాలము.

ఈవాదమతి కష్టమైనది. ఏలనన యీరెంటిదృష్టులును కేవల విరుద్ధములు. గాంధీజీ యెప్పుడును వ్యక్తిమోక్షము, పాపము అను దృష్టిలో యోచించుచుండును; మాయందరి మనస్సులలోను సాంఘిక శ్రేయస్సు ప్రధానముగ నుండును. పాపమనుభావమును నేనర్థముచేసి కొనజాలను. కనుకనే గాంధీజీయొక్క సామాన్యదృష్టి నాకు నచ్చదు. సంఘమును లేకసాంఘికనిర్మాణమును మార్చుటకతడు యిష్టపడడు; అతడు వ్యక్తులయొక్క పాపములను పారద్రోలుటకు ప్రయత్నించును; "'స్వదేశిసి' అనుసరించువాడు ప్రపంచమును సంస్కరింపవలెనను నిరర్థక ప్రయత్నమున కెన్నడును బూనుకొనడు. అది భగవంతునిచే నియ మింపబడు సూత్రముల ననుసరించి కదలుననియు, కదల గలదనియు నతడు విశ్వసించును" అని యతడువ్రాసెను. అయినను ప్రపంచమును సంస్కరించు ప్రయత్నములో నతడు తగినంత ముందంజవేయును;

కాని, యతడు చేయగోరుసంస్కారము వ్యక్తులకు సంబంధించినది; ఇంద్రియములను, యింద్రియభోగములను జయింపవలెను. అవి పాప భూయిష్టములు. స్వేచ్ఛనుగురించి యొకసమర్థుడైనరోమను క్యాథలికు రచయిత చేసిననిర్వచనము నతడంగీకరించునని నేననుకొనెదను; "పాప బంధమునుండి తప్పించుకొనుటయే స్వేచ్ఛ." రెండువందల యేండ్ల క్రిందట లండనుపట్టణ బిషప్ చెప్పినమాటలవిని యెంతపోలియుండెను! "క్రైస్తవ మతము పాపబంధమునుండియు, సైతానునుండియు మానవ మద, మాత్సర్యాదుల నుండియు, విపరీతకోరికల నుండియు రక్షించును."

ఈదృష్టిని గుర్తించితిమేని స్త్రీపురుషసంబంధముపట్ల గాంధీజీ కిగల భావమును కొంచెమర్థము చేసికొనగలము. ఇది నేటి సామాన్య మానవున కసాధారణవిషయము. "ఆతనిదృష్టిలో సంతానకోరికలేనివారి కలయిక నేరము" మరియు "కృత్రిమపద్ధతులు నపుంసకత్వమును, నర ముల నిస్సారతను కలిగింపక తప్పదు" "మనకర్మలయొక్క ఫలితముల నుండి తప్పించుకొనజూచుట తప్పు; అవినీతికరము...తన జిహ్వను తృప్తిపరచుకొనుచు మందులను, బలవర్ధనలేహ్యములను సేవించుచు తత్ఫలితములనుండి తప్పించుకొనజూచుట చాలచెడ్డది. తన పశువాంఛ లను తీర్చుకొనుచు తత్ఫలితములనుండి తప్పించుకొనజూచుట మరింత యధమమైనపని."

నామట్టుకునాకు యీదృష్టి యసహజముగను, ఆశ్చర్యకరము గను కాన్పించును. ఆతనిదృష్టి సరియైనదే యైనచో నేను నపుంస కత్వమునకును, నరములసబద్ధత్వమునకును దరిజేరిననేరస్థుడనగుచున్నాను. రోమనుక్యాథలికు మతస్థులుకూడ జననవిరోధమును తీవ్రముగ నెది ర్చిరి. కాని, వారు గాంధీజీవలె యీవాదమును చివరవరకు తీసికొని పోలేదు. వారు మానవస్వభావము అని భావించినదానితో రాజీపడిరి. గాంధీజీయట్లుగాక సంతానముకొరకుతప్ప స్త్రీపురుషసంబంధముయుక్త

మనియు ననవసరమనియు గుర్తింపజాలడు; స్త్రీపురుషులకు సహజమగు విషయమోహమున్నట్లు యతడు గుర్తింపజాలడు. "స్త్రీపురుషులకుండు సహజమోహమును నేను పరిగణింపకపోవుట యసంభవమైన యాదర్శమనినాకు చెప్పుచుండును. ఇచ్చట నుదహరింపబడినవిషయ సంబంధము సహజమని నే నెంతమాత్రము నంగీకరింపజాలను; అదియే నిజమగుచో మన వినాశము నిశ్చయము. సోదరునకును సోదరికిని, తల్లికిని, బిడ్డకును, తండ్రికిని కూతురుకును గల ప్రేమయే స్త్రీ పురుషులకు గల సహజ సంబంధము. ఈ సహజప్రేమయే ప్రపంచమున కాధారభూతముగ నున్నది" అని యతడు చెప్పును. "భార్యా భర్తలకుండు విషయ మోహము కూడ అసహజమని నాశక్తికొలది నేను చాటెదను" అని యతడు మరింత గట్టిగ చెప్పును. దాని నొక విశ్వాసముగ మనమంగీకరింపవలెను. లేదా తిరస్కరింపవలెను. దీనికి వేరొక మధ్యమార్గము లేదు. ఇది విశ్వాసమునకు సంబంధించినది కాని హేతువుకు సంబంధించినదికాదు. ఈ విషయములో గాంధీజీ కేవలము పొరబడెననియే నేను భావించెదను. అతని సలహా కొంతమందికి భజింపనచ్చును. కాని, యది జనసమూహముమీద నిరర్థకమగును; శరీరముయొక్కయు, నరములయొక్కయు ననేకవిధములగు వ్యాధులకు కారణమగును. ఇంద్రియ నియమము నిశ్చయముగ వాంఛనీయమే. కాని గాంధీజీ యొక్క సిద్ధాంతము దీని నెక్కువగ చేకూర్చగలదని నేను భావింపను. ఇది చాల యతివాదము; చాలమంది యిది తమ శక్తికి మించినదని తలంచి తమ మామూలు మార్గముల ననుసరింతురు; లేదా భార్యాభర్తలకు తగవు సంభవించును. జనన నిరోధపద్ధతులు విధాయకముగ నసాధారణవిషయలోలతయగునని గాంధీజీ స్పష్టముగ భావించును; స్త్రీ పురుషులకుండు విషయ సంబంధము నొప్పుకొనినచో ప్రతి స్త్రీయు ప్రతి పురుషుని వెంటను లేక ప్రతి పురుషుడు ప్రతి స్త్రీ వెంటను పరుగిడునని యతడు భావించును. ఈ రెండు సారాంశములలో నేదియును

సమర్థింపబడనేరదు. ఈ స్త్రీ పురుష సమస్యను గురించి (ఇది ముఖ్యమైనదే యైనను) గాంధీజీకింత వైముఖ్యమేల యుండవలెనో నాకర్థము కాకున్నది. అది యతనికి 'మసిబొగ్గు లేక శుద్ధ తెలుపు' సమస్య; ఈ రెండు వర్ణముల మధ్యను ఛాయలేవియు నుండవు. ఈ రెండు చివరలందును అతడసామాన్యమును, అసహజమును నగు యతివాదస్థితిని తీసికొనుచున్నాడు. ఇది బహుశః యీరోజులలో స్త్రీ పురుష సంబంధమును గురించి దిగుచున్న పుస్తక ప్రవాహముమీద కలిగిన ప్రతీకారమని యనుకొనెదను. నేను సామాన్య వ్యక్తినని భావించెదను. నా జీవితములో నింద్రియవాంఛ తన పాత్రను నిర్వహించెను. కాని, యది నన్ను నాయితరకార్యములనుండి మరల్చలేదు. అది తక్కువ స్థానమునే వహించెను.

అతని దృష్టి ముఖ్యముగ ప్రపంచమును, ప్రపంచ పద్ధతులను ధిక్కరించిన సన్యాసదృష్టి; జీవితమును తిరస్కరించి యది చెట్టయని భావించు వాని దృష్టి. సన్యాసికది సహజము. కాని, యీ జీవితము నంగీకరించి దాని లబ్ధిని పొందుటకు ప్రయత్నించుచున్న యీప్రపంచ స్త్రీ పురుషులమీద దీనిని వర్తింపచేయుట దురవగాహము.

నేనితరవిషయముల వెంబడిపడి కొట్టుకొనిపోతిని. కాని, ఆలిపూరుజయిలులోని యాదుర్దినములలో నీ భావములన్నియు నొక సహేతుకమైన క్రమము ననుసరింపక తక్కిడి బిక్కిడిగ నా మనస్సును నింపుచు నన్ను కలవరపరచి బాధించుచుండెను. అన్నిటికిని పైన యొంటరితనమును, సంహారమును గురించిన భావము యుండెను; ప్రాణమును తృంచివేయునట్టి నా జయిలువాతావరణమును బిక్కుబిక్కుమను నా చిన్నగదియు దీనిని మరింత దోహదముచేసెను. నేను జయిలు వెలుపలనున్నచో నీబాధ తాత్కాలికముగ నుండెడిది; నేను త్వరితముగ నూతన

పరిస్థితులకు సరిపెట్టుకొని, మనః ప్రకటనముచేతను క్రియచేతను యుపశాంతిని పొందెడివాడను. జయిలులో నాకట్టి శాంతి లేకపోవుటచే కొన్ని దుర్దినములను గడపితిని. అదృష్టవశాత్తు నేనిట్టి నిరాశనుండి వెంటనే కోల్కొనుచుండును. నేను నామనఃఖేదము నపనయించుకొనుచున్న సమయమున కమల నన్ను దర్శింపవచ్చెను. ఇది నాకపరిమితోత్సాహమును కలిగించెను; నాయొంటరితనము పలాయనమయ్యెను. ఏమి జరిగినను, యేమి సంభవించినను మే మిద్దర మున్నారము. అని నేను భావించితిని.

---

Very important

# విరుద్ధభావములు.



గాంధీజీని స్వయముగ నెరుగక నతనివ్రాతలను మాత్రమే చదివినవారు అతడు పురోహితజాతిపక్షమనిషియనియు ఛాందసుడనియు, 'ములక్కాయమూతి' కలవాడనియు, సంతోష సంహారకుడనియు "ఆపాదమస్తకము కాలాంబరములనుధరించి తమనిత్యవిధులను జరుపు మతబోధకుల"వంటివాడనియు భావింపవచ్చును. కాని, యతనివ్రాతలు అతనికన్యాయమునుచేయుచున్నవి; వానికంటెనతడు చాలగొప్పవాడు. అతడు వ్రాసినదానిని యుదహరించి విమర్శించుటయు యుక్తము కానేరదు. అతడుఛాందసజాతికి కేవలమువ్యతిరేకి. అతనిచిరునవ్వు సంతోషదాయకముగనుండును; అతనినవ్వు అందరను నవ్వింపజేయును. అతడుత్సాహమును వెదజల్లును. శిశువువలె నతనిలో మనలను మోహింపజేయు నదేదియో కలదు.

అతడసాధారణమగు విపరీతపురుషుడు. మహాపురుషులందరును కొంతవరకట్లేయుందురని నేననుకొందును; దీనులయెడల నతనికెంతటి యపారమగు విచార, ప్రేమలున్నను వారిని విధాయకముగ సృష్టించుచు, నలిపివేయునట్టి పద్ధతి నతడేల సమర్థించునాయను సమస్య నన్ననేకసంవత్సరములనుండి బాధించుచుండెను; దారిద్ర్యరాహిత్యము పట్ల నతనికెంతరాగమున్నను కేవలము దారిద్ర్యముమీదను, నిర్బంధములమీదను ఆధారపడునట్టి రాజకీయ, సాంఘికనిర్మాణము నతడేల యభిమానింపవలెను? అతడట్టిపద్ధతి నభిమానించుననుట బహుశః యుక్తముకాకపోవచ్చును. అతడు శాస్త్రసమ్మతమైన యరాజకమును సమర్థించును. కాని, యాదర్శపూర్వకమగు అరాజక ప్రభుత్వమింకను

చాలదూరమున నుండుటచేతను, దానినూహించుట సుకరము కాక పోవుటచేతను, అతడు ప్రస్తుతక్రమమునే యంగీకరించును.

ఒక్కొక్కప్పుడతడు తానుసామ్యవాదినని చెప్పుకొనుచుండును. కాని, యతడాశబ్దమును తనస్వంతభావములో నుపయోగించును; సాధారణముగ సామ్యవాదమని పిలువబడు సాంఘిక నిర్మాణముతో దాని కెట్టిసంబంధమునులేదు. అతనిననుసరించి విఖ్యాతకాంగ్రెసు నాయకులు కొందఱు ఆపదమునొకవిధమగు పిచ్చిభూతదయాళుత్వము అనుభావములో నుపయోగింతురు; గాంధీజీ కీవిషయము తెలియదని నేనెరుగుదును. అతడు ఆర్థికవిషయములను గురించి, సామ్యవాదము, మార్క్సిజములనుగురించికూడ చాలపుస్తకములనుచదివి, యితరులతో చర్చించెను. కాని, ప్రధానవిషయములలో నొక్కమనస్సేదానంతటది మనలను ముందుకుతీసికొనిపోజాలదను నావిశ్వాసమంతకంత కభివృద్ధి యగుచున్నది. "నీహృదయము విశ్వసించుట కిష్టపడనిచో నీబుద్ధి నిశ్చయముగ నిన్నెపుడును విశ్వసింపనీయదు" అని విలియంజేమ్సు చెప్పెను. భావములు సాధారణదృష్టిని పాలించుచు మనస్సును వశపరచుకొనును. మనసంభాషణలు—ఆర్థిక, రాజకీయ, మతవిషయములను గురించినవి—యేవియైనను నిజముగ నుద్రేకము లేక స్వభావముమీద నాధారపడును. "మానవుడు తాను సంకల్పించుదానిని చేయగలడు; కాని, యతడు తానుయిచ్ఛించువిధమున సంకల్పింపజాలడు! అని స్కాఫెన్ హార్ చెప్పెను.

దక్షిణఆఫ్రికాలో గాంధీజీకొక యకాలపరివర్తనము కలిగెను. ఇది యతనిని పూర్తిగకదల్చివేసి, యతని జీవితదృక్పథమును మార్చివేసెను. అప్పటినుంచి తనభావములకన్నింటికిని యతడు స్థిరమగు పునాదులను వేసికొనెను. అతనిమనఃకవాటము బంధింపబడెను. నూతన సూచనలను చేయువారినతడు యత్యంతశ్రద్ధతోను, ఓర్పుతోనువినును;

కాని, మర్యాదపూర్వకమగు నీశ్రద్ధవెనుక కవాటము బంధింపబడిన దనుభావము ద్యోతక మగుచుండును. కొన్ని భావములతనిలో స్థిరపడిపోవుటచే నతనికి తక్కినవన్నియు నప్రధానములుగ కాన్పించును. ఇతరములును, ద్వితీయములును నగువిషయములనుగురించి పట్టుబట్టుట ప్రధానస్కీమునుండి దృష్టిని చెదరగొట్టుటయగును; దానిని భంగపరచుటయగును. ఆప్రధానయాధారము నంటిపెట్టుకొనియుండుచో నీయితర విషయములును చక్కబడగలవు. పరికరములు సరియైనవైనచో ఫలితము యుక్తముకాకతప్పదు.

ఇదియే యతని భావమువెనుకనున్న ప్రధానయాధారమని నేననుకొనెదను. సామ్యవాదమును, ముఖ్యముగ, మార్క్సిజమును (దానికి ద్వేషముతో సంబంధముండుటచే) అతడు శంకించును. "తరగతులమధ్య పోరాటము" అనుపదములే సంఘర్షణను, ద్వేషమును స్ఫురింపజేయును. కనుక నతని చెవిని పడరాదు. ప్రజాసామాన్యము యొక్క జీవిత ప్రమాణమును (ఒక యతిసామాన్య పరిమితిని మించి) హెచ్చింపవలెనను కోరిక యతనికి లేదు. ఏలనన విశ్రాంతియు, నున్నతజీవితపరిమాణమును భోగలాలసను, పాపమును దోహదము చేయ వచ్చును. ఇప్పుడున్న కొద్దిమంది ధనికులే భోగలాలసులుగ నుండుట మంచిదికాదు; ఈ సంఖ్య నభివృద్ధిచేయుట మరింత యనర్థము. అతడు 1926 లో వ్రాసిన యొక యుత్తరమునుండి యిట్టి సారాంశమును తీయవచ్చును. ఈ దృష్టి సామ్యవాదమునకును, క్యాపిటలిజమునకును కూడ చాల దూరము. నేడు శాస్త్రము, పారిశ్రామికవిద్య, స్వప్రయోజనపరుల యడ్డమే లేనిచో, ప్రతివానికిని అన్నవస్త్రములను, యిండ్లను ప్రసాదించి జీవితపరిమాణము నెక్కువగ పెంచగలదని చెప్పుచో దానియందతనికి శ్రద్ధలేదు. కొంతమితి దాటినతరువాత నతడా ఫలితములను కోరడు. కనుక సామ్యవాద మతని నాకర్షింపదు.

అనువాద లో కొంత వదరి కష్టపడి ది.

చెడుగును కొంత తగ్గించును. కనుక క్యాపిటలిజము కొంతవరకు మాత్రమే సహ్యము. అతడు రెండింటిని పేర్కొనడు; కాని, రెండవది యంత చెడ్డదికాదు. కనుక, నమలులోనున్న దానిని గుర్తింపవలెను. కనుక ప్రస్తుతము దానిని సహించును.

ఈ భావముల నతని కాపాడించుటలో నేను పొరబడి యుండ వచ్చును. కాని, యతని తలంపు లీవిధముగ నుండవచ్చునని నేను భావించుచున్నాను. మనలను బాధించునట్టి యతని వాక్యములలోని విరుద్ధములకును, గందరగోళమునకును కేవల భిన్నములగు నతని సిద్ధాంతములే నిజమగు కారణము. ప్రజలు అధికసుఖములను, విశ్రాంతిని యాదర్శముగ జేసికొనవలెనని యతడు కోరడు; వారు నైతిక జీవితమును జీవింపవలెను; దురభ్యాసములను మానివేయవలెను. ఇంద్రియముల నంతకంతకరికట్టుచు వ్యక్తిగతముగను, ఆధ్యాత్మికముగను వృద్ధిచెందవలెను. ప్రజలను సేవింపదలచిన వారు వారి యైశ్వర్యము నెక్కువగ పెంపొందించుటకంటె తామే వారి స్థితికి దిగి వారితో సమానస్థాయిగ కలసిపోవలెను. అట్లు చేయుటచే వారు విధాయకముగ వారి నుద్ధరించుటకు కొంత సాయపడగలరు. అతని ప్రకారమదియే ప్రజాప్రభుత్వము. 1934 సెప్టెంబరులో నత డొక స్టేటుమెంటులో నిట్లు చెప్పెను. "నాతో నెదురాడుటకు చాలమంది నిస్పృహచెందిరి. జన్మచేతనే ప్రజాప్రభుత్వవాదినైన నాకిది యవమానకరమగు వార్త వలె నున్నది; మానవలోకములోని గర్భదరిద్రులతో పూర్తిగ నైక్యభావము నొందుటయు, వారికంటె నధికముగ జీవింపవలెనను కోరిక లేకపోవుటయు, ఆస్థితిని పొందుటకు బుద్ధిపూర్వకముగ యథాశక్తి ప్రయత్నము చేయుటయు దాని కర్హమగునెడల నేనాయధికారమును కలిగియున్నాను."

ఆధునిక ప్రజాప్రభుత్వవాది, సామ్యవాది, లేక క్యాపిటలిస్టు, యీ వాదమును, యీదృష్టిని అంగీకరింపడు. కాని, ప్రాచీన మత



ఇందిరా నెహ్రూ.

దృష్టికలవాడు దీనిని కొంత యంగీకరింపవచ్చును. ఉభయులును భావముచే గతముకు బంధింపబడి యెప్పుడును గతకాల షక్కీలోనే భావించుచుందురు. వర్తమాన మెట్లున్నది? ముందేమి రానున్నది? అని యోచించుట కంటె వారెక్కువగ జరిగిన దానిని గురించియే యోచించెదరు. ఈ రెండు మానసిక ప్రేరణల మధ్యను ప్రపంచములో నపారమగు భేదము కలదు. పాతప్రపంచములో ప్రజాసామాన్యముయొక్క-యైశ్వర్యము నభివృద్ధిచేయుట కష్టసాధ్యముగ నుండెను. బీద లెప్పుడును మనతో నుండిరి. అప్పటి కొద్దిమంది ధనికులు సాంఘిక వ్యవస్థలో ప్రధానభాగమయిరి; ఉత్పత్తి పద్ధతికి వారవసరమైరి. కనుక ధర్మబోధకులును, సంస్కారప్రియులును సూక్ష్మబుద్ధియు వీరి నంగీకరించిరి; కాని బీదలయెడల వీరు చేయవలసిన ధర్మములను గుర్తింపచేయుటకు ప్రయత్నించిరి. వీరు బీదలకు ధర్మకర్తలుగ నుండవలెను; దయ కలిగియుండవలెను. మతము దయ నొక మహాపుణ్యకార్యముగ విధించెను. పెద్ద భూఖామందు, క్యాపిటలిస్టు, ఫ్యూడల్ ప్రభువు-వీరందరును ధర్మకర్తలు అను భావమును గాంధీజీ యెప్పుడును పోషించుచుండును. అతడు మత ప్రవక్తల చిరపరంపర ననుసరించును. "ధనికులు సర్వేశ్వరుని సేవకులు; అతని యైశ్వర్యమునకు సంరక్షకులు; దానిని పంచిపెట్టుటకు నియమింపబడినవారు. జీసను స్వయముగ బీదలవిధిని వారికి వప్పగించెను" అని పోప్ చాటెను. ప్రజాబాహుళ్యమెరిగిన హిందూమతమును, ఇస్లామునుకూడ ధనికులను దానధర్మములు చేయవలెనని యెప్పుడును బోధించుచున్నవి; వారు దేవాలయములను, మసీదులను, ధర్మశాలలను నిర్మించుచు తమ విభవమునుండి కొన్ని కానులను, పాకలను బీదల కిచ్చుచు పుణ్యాత్ములైనట్లు భావించుచుందురు.

ఈమతదృష్టి వెనుకటి పాతప్రపంచమునకు సంబంధించినది. అప్పటి దుఃఖమునుండితప్పించుకొనుటకు పరలోకమురానున్నదను నాశ

యొక్క వేగత్యంతరము. కాని, పరిస్థితులుమారి మానవమైశ్వర్యము పూర్వమెన్నడును యూహింపబడనివిధమున నేడు పెరిగినను యీప్రాత కాలపుగొంతుకుపట్టు విడువదయ్యెను; ఇప్పుడుఅనిశ్చితములును గణింప శక్యముకానివియునగు కొన్నియాధ్యాత్మికప్రయోజనము లెక్కువగ పేర్కొనబడుచుండును. క్యాథలిక్ మతస్థులు పన్నెండు, పదమూడు శతాబ్దములు (ఇతరులు దీనిని అంధకార యుగమందురు.) క్రైస్తవమత ముకు కృతయుగమని భావింతురు; అప్పుడు ఋషులువర్ధిల్లిరి. క్రైస్తవ రాజులు ముస్లిములమీద మతయుద్ధములనుసల్పిరి, గాథిక్ దేవాలయ ములువిస్తరిల్లెను. వారిప్రకారముఅది "మధ్యయుగపు గ్రామసంఘ ములయాజమాన్యమున యనుభవింపబడిన యథార్థమైన క్రైస్తవప్రజా పాలనము. అంతకుమునుపుగాని తరువాతగాని యట్టిది యనుభవింప బడలేదు." ముస్లిములు మొదటి ఖలీఫులనాటి "ఇస్లాంప్రజాపరిపాల నము" వైపు, విజయవంతములగు వారి యద్భుతజీవితములవైపు ఆతుర తతోతిరిగిచూచుచుందురు. అట్లే హిందువులును వైదిక, పురాణయుగ ములవైపుచూచుచు 'రామరాజ్యము'నుగురించి కలలనుగనుచుందురు. అయినను ఆరోజులలో ప్రజాసామాన్యమంతయు తిండిలేక, జీవితముకు కావలసిన కనీసపు అవసరములైననులేక నల్లాడిరని చరిత్రయంతయు మనకుతెలుపుచున్నది. పైనున్న యేకొద్దిమందియో తగిన విశ్రాంతియు, నుపపత్తియుకలవారు, ఆధ్యాత్మిక జీవితమును గడిపియుండ వచ్చును. తక్కినవారందరును కేవల యుదరపోషణకొరకే బాధపడిరి. ఆకలిచిచ్చుతో బాధపడువానికి విజ్ఞానాభివృద్ధి, ఆధ్యాత్మికాభివృద్ధి యసంభవములు; అతనిభావములన్నియు నాహారముమీదను దానిని సంపాదించు విధానముమీదను కేంద్రీకరింపబడియుండును.

పారిశ్రామిక యుగము మనకండ్ల కధికముగ కాన్పించు ననేక సౌముగులను తెచ్చిపెట్టెను. కాని, ప్రపంచమునంతను సమగ్రముగను,

ముఖ్యముగ నెక్కువపరిశ్రమయము గావింపబడిన దేశములను, తీసి కొనినచో నది యాధ్యాత్మిక, విజ్ఞానాభివృద్ధుల నెక్కువ సంఖ్యాకులకు సుకరముచేయునట్టి యైశ్వర్య పునాదులను నిర్మించెననుసంగతిని మనము మరచిపోవుచుము. ఇది హిందూదేశములోను, యితరవలస దేశముల లోను యెక్కువగ కాన్పించదు. ఏలనన మనము పరిశ్రమలవలన నెక్కువ లబ్ధినిపొందలేదు. వానివలన మనము కొల్లగొట్టబడితిమి; అనేకవిధముల-యైశ్వర్యముచేతను అంతకంటెనెక్కువగ విజ్ఞానముచేతను, ఆధ్యాత్మిక ముగను-మరింత యధోగతికిపోతిమి. ఈదోషము పరిశ్రమలదికాదు; పరప్రభుత్వమే దీనికికారణము; హిందూదేశములో పాశ్చాత్య విజ్ఞాన మని పిలువబడునది, తాత్కాలికముగ, బానిసత్వమును బలపర చెను; అది మనసమస్యలను పరిష్కరించుటకుబదులు వానిని మరింత పెద్దచేసెను.

అది మనదురదృష్టము. ఇది ప్రస్తుతప్రపంచమును గురించిన మనదృష్టిని మలినము చేయగూడదు. ప్రస్తుతపరిస్థితులలో నుత్పత్తిపద్ధతికినిలేక సంఘమునకంతకును ధనవంతుడికయవసరమైనవాడు, లేక వాంఛనీయుడుకాడు. అతనికాలము చెల్లెను; అతడెప్పుడును అడ్డమువచ్చుచున్నాడు. ధనికులను దయగలిగి యుండవలసినదనియు, బీదలను తమ దుస్థితికి కృతజ్ఞతనుచూపుచు పొదుపుగలిగి, సత్ప్రవర్తనగలిగి యుండవలెననియు బోధించు పాతపురోహిత ధర్మమున కికనర్థములేదు. మానవునిసంపద యద్భుతముగ పెరిగెను; అది ప్రపంచసమస్యల నెదుర్కొని పరిష్కరించుకొనగలదు. ధనవంతులలో చాలమంది యితరులను పీడించువారైరి. ఇట్టిజాతియొక్క యునికి కేవలము అడ్డమేకాక మానవ సంపద నమితముగ వ్యర్థముచేయుటయగును. ఈ జాతియు వీరిని ప్రత్యక్షముగ దోహదముచేయుపద్ధతియు కృషిని, యుత్పత్తిని వారించి యిరు వంకలను - యితరులకృషి మీాద జీవించువారిని పనిలేక మాడిపోవు

వారిని - కృషిలేనివారిని ప్రోత్సహించును. కొంతకాలము క్రిందట గాంధీజీయే యిట్లువ్రాసెను.. "పనిలేనట్టియు, మాడుచున్నట్టియు ప్రజలకు భగవంతుడు కృషిరూపమునను చేసినపనికాహార రూపమునను యిచ్చురూపమొక్కటియే యంగీకృతమగును; మానవుని తనయాహారముకొరకు కృషిచేయుటకే భగవంతుడు సృజించి కృషిచేయకుండ మెక్కెడువారు దొంగలని చెప్పెను."

వెనుకటి సమస్యలులేని యిప్పుడు పురాణపద్ధతులను, సూత్రములను ప్రయోగించి, యప్రస్తుతములైన పదజాలము నుపయోగించి యాధునికప్రపంచములోని క్లిష్టసమస్యల సర్ధము చేసికొన బ్రయత్నించుట విఫలతకును, గందరగోళమునకును కారణమగును. స్వంతఆస్తి ప్రపంచమునుగురించిన ప్రధానభావములలో నొకటియని కొంతమంది తలంచునట్లు కాన్పించును. కాని, స్వంతఆస్తి యనుభావమే యెప్పుడును మారుచుండెను. ఒకప్పుడు బానిసలు ఆస్తియైరి. ఆడ్రుస్త్రీలును పిల్లలును; వధువు ప్రథమరాత్రిమీాద ప్రభువునకుగలహక్కు, రోడ్లు, దేవాలయములు, వంతెనలు, బల్లకట్టులు, గాలి, భూమి—స్వంతయాస్తి యయ్యెను. పశువులు యింకను ఆస్తియగుచున్నవి. కాని, యనేక దేశములలో యజమానులహక్కులు చట్టములచే నియమింపబడెను. యుద్ధకాలములో ఆస్తిపైగలహక్కులు నిరంతరాయముగ తుడిచి వేయబడును. నేడు ఆస్తియంతకంతకు వస్తురూపమును వీడుచున్నది. వాటాలను కలిగియుండుట, కొంతపరపతియుండుట మొదలగునవి ఆస్తి యగుచున్నవి. ఆస్తినిగురించిన భావము మారినకొలది ప్రభుత్వము యొక్కువ జోక్యమును కల్పించుకొనును. ప్రజాభిప్రాయము కోరుటచే చట్టము ఆస్తికల యజమానులయొక్క యరాజకమైన హక్కులను నిరోధించును. సర్కారులో ఆస్తిని కలుపుకొనుటవంటి స్వభావముగల యనేకవిధములగు హెచ్చుపన్నులు ప్రజాశ్రేయస్సుకొరకు వ్యక్తిగత

ములగు స్వంతయాస్తియొక్క హక్కులను త్రుంగివేయును. ప్రజాశ్రేయస్సు నప్లకు నీతి కాధారమగును. తనస్వంతయాస్తిహక్కులను రక్షించుకొనుటకైనను మనమీ ప్రజాశ్రేయస్సునకు వ్యతిరేకముగ నాచరింపరాదు. ఇంతకును వెనుకటికాలములో ప్రజలలో నధిక సంఖ్యాకులకు ఆస్తినుంచుకొనుటకు హక్కులే లేవు. వారే యితరులచే పొందబడిన యాస్తియైరి. నేడుకూడకొద్దిమందికే యట్టిహక్కులుకలవు. స్థాపితప్రయోజనములను గురించి మనమెక్కువగ విందుము. నేడొక నూతనస్థాపిత ప్రయోజనము గుర్తింపబడుచున్నది. ప్రతిపురుషుడును, ప్రతిస్త్రీయును జీవించుచు, కృషిచేసికొనుచు తమకృషియొక్క ఫలితముల ననుభవింపవలెను. మార్పుచెందునట్టి యీభావములచేత ఆస్తియు, పెట్టుబడియు నశించిపోవు. అవి విస్తరింపచేయబడును; కేంద్రీకరింపబడుటచే నవి కొద్దిమందికి ప్రసాదించిన నధికారమిప్పుడు సంఘమంతటిచేతను తిరిగి తీసికొనబడెను.

గాంధీజీ వ్యక్తిని ఆంతరంగికముగను, నైతికముగను, ఆధ్యాత్మికముగను నభివృద్ధి పరచి తద్వారా బాహ్యవాతావరణమును మార్పు చేయగోరును. ప్రజలు దురభ్యాసములను, విషయలోలతను మాని పవిత్రులుకావలెనని యతడుకోరును. అతడు బ్రహ్మచర్యము కావలెనను; చుట్టలు, మత్తుపదార్థములు, మద్యపానము మొదలగువానిని మానవలెనను. ఈదురభ్యాసములలో నేదియెక్కువ యుపద్రవకరమను విషయమున భేదాభిప్రాయములుండవచ్చును. కాని, వ్యక్తిగతముగ చూచినను, అంతకంటెనెక్కువగ సాంఘికముగను, లోభము, స్వార్థము, ఆర్జించవలెనను కోరిక, స్వలాభముకొరకు వ్యక్తులు భయంకర పోరాటములను సలుపుట తరగతులు వర్గములు క్రూరముగ కొట్లాడుకొనుట, ఒకవర్గము మరియొకవర్గమును నిర్దయాత్మకముగ నణచివేసి కొల్లగొనుట, జాతులు ఘోరసంగ్రామములను చేయుచుండుట [illegible]

నీవ్యక్తిగత దోషములు తక్కువ యుపద్రవకరములనుటకు సందేహము కలదా! బలవంతులు దుర్బలులను కొట్టుకొని తినవలెనను చట్టమును వెనుకటివలెనే "శక్తికలవారు తీసికొనెదరు, సమర్థతగలవారు ఉంచుకొనెదరు" అనునాశయమునుగల ప్రస్తుతదురాశాగ్రస్తసంఘములో నివిసహజముగలేవా? నేటిస్వలాభాపేక్ష విధాయకముగ పోరాటమును కలిగించును. ఈపద్ధతియంతయు మానవునిలోనున్న దోచుకొను స్వభావమున కన్ని యవకాశములను, రక్షణను యిచ్చును; ఇది కొన్ని చక్కని స్వభావములను ప్రోత్సహించుననుటకు సందేహములేదు; కాని, యంతకంటె నెక్కువగ మానవుని నీచ స్వభావముల కాస్పదమయ్యెను. విజయమనగా నితరులను కూల్చివేసి, యాకూలిన వారిపై స్వారిచేయుట. సంఘము యీాయుద్దేశ్యములను, కోరికలను ప్రోత్సహించుచు మనలోనున్న యుత్తములను పీనికాకర్షించుచో నిట్టివాతావరణములో గాంధీజీ తన మాదర్శమును - నైతికమానవుని - సాధింపగలడని యోచించునా? అతడు సేవాతత్త్వము నభివృద్ధిచేయగోరును; అతడు కొందఱు వ్యక్తుల సందర్భములో సఫలము నొందవచ్చును; కాని, సంఘము ఆర్జనచేయు సంఘములోనున్న విజేతల నాదర్శముగ చూపునంతకాలము, స్వలాభమును, ప్రధాన యుద్దేశ్యముగ నుంచునంతకాలము అధికసంఖ్యాకులగు ప్రజలు యీాపద్ధతినే యనుసరింతురు.

కాని, యిప్పటిసమస్య కేవలనైతిక బోధకును, ధర్మబోధకును చెందినదికాదు. అది యాచరణకు తేవలసిన నేటియత్యవసర సమస్య. ప్రపంచమంతయు నాశాశూన్యమగు గందరగోళములో మునిగియుండుటచే నేదోయొక తరుణోపాయమును కనిపెట్టవలెను. అజగరమువలె మనమేదియో జరుగునని కనిపెట్టుకొని యుండజాలము. మనము క్యాపిటలిజము, కమ్యూనిజము, సామ్యవాదము మొదలగు వానిలోనున్న చెడ్డలను విమర్శించుచు ప్రాచీనములును, నవీనములునునగు నన్ని

పద్ధతులలోని యుత్తమలక్షణములను సమన్వయపరచు కళ్యాణప్రదమగు మధ్యమార్గముకొరకు వ్యర్థముగ నాశపడుచు కేవల 'నాస్తి' భావముతో జీవింపజాలము. వ్యాధిని తెలిసికొని చికిత్సను సూచించి దానిని ప్రయోగింపవలెను. జాతీయముగను, అంతర్జాతీయముగనుకూడ మనమున్నచోటనే నిలిచిపోజాలమనుసంగతి ధృవము; అతిధృవము. మనము వెనుకకుపోవుటకు ప్రయత్నింపవచ్చును లేక ముందుకు బోవుచుకొని పోవచ్చును. వెనుకకుపోవుట యసూహ్యముగ కాన్పించును కనుక ముందుకు పోకతప్పదు.

అయినను గాంధీజీయొక్క యనేక కార్యములు అతడతి సంకుచితమైన యధికారమునకు మరల గోరుచున్నాడని భావించుట కవకాశమిచ్చును; అతడు స్వయంకృషి మీదనే యాధారపడు జాతినేకాక గ్రామమునుకూడ సృష్టింపగోరును. ప్రాచీనసంఘములలో గ్రామము కొంచెమించుమించు తనపైననే యాధారపడి యన్న, వస్త్రముల నిచ్చెను; ఇతరవిధముల దానియవసరములను చేకూర్చెను; అనగా విధాయకముగ నది చాలతక్కువ జీవితప్రమాణము. గాంధీజీ దీనిని శాశ్వతలక్ష్యముగ భావించుచున్నాడని నేననుకొనను; ఇదియసాధ్యలక్ష్యము. నేటి విశేషజనసంఖ్య కొన్నిదేశములలో జీవించుట కూడ దుర్ఘటమగును; వారు యీదుర్భిక్షమునకును, కాటకమునకును మరలుట కంగీకరింపరు. గ్రామపరిశ్రమల నభివృద్ధిచేయుటవలన హిందూదేశమువంటి వ్యవసాయకదేశములో (మనప్రస్తుత ప్రమాణమతి తక్కువగనున్నది) ప్రజాసామాన్యములో కొద్ది యభివృద్ధి కలుగవచ్చును. కాని ప్రతియితర దేశమువలెనే మనమును తదితర ప్రపంచముతో బంధింపబడితిమి. మనము దీనిని త్రెంచుకొనుట యసాధ్యమని నాకు తోచుచున్నది. కనుక మనము ప్రపంచదృష్టితోనే భావింపవలెను. ఈదృష్టిలో సంకుచితమైన యార్థిక నిరంకుశత్వమునకు తావు

లేదు. వ్యక్తిగతముగ నాకిది యన్నివిధములను వాంఛనీయముగ కాన్పించదు.

మనకు సాధ్యమగు నేకైక పరిష్కారమునే మనము విధాయక ముగ స్వీకరింపవలెను. సామ్యవాదక్రమమును స్థాపింపవలెను. దీనిని మొదటమన దేశ సరిహద్దులలోను తరువాత ప్రపంచమంతటను స్థాపింప వలెను; ప్రజాశ్రేయస్సుకొరకు ఐశ్వర్యోత్పత్తిని, పంపకమును నియ మింపవలెను. దీనినెట్లు సాధింపవలెననునది వేరువిషయము. కాని, ప్రస్తుత క్రమమువలన లబ్ధిపొందుచున్న కొందరి యభ్యంతరములవలన జాతియొక్కయు, లేక మానవలోకము యొక్కయు కళ్యాణమునాపు చేయరాదని స్పష్టమగుచున్నది. అట్టి పరివర్తనమునకు రాజకీయ, సాంఘికసంస్థలడ్డము తగులుచో వానినితొలగింపవలెను; వాంఛనీయము, ఆచరణీయము నగు పైయాదర్శమును బలివేసి వానితో రాజీపడుట నమ్మికస్వామిద్రోహమగును. అట్టి పరివర్తనము కొంతవరకు ప్రపంచ పరిస్థితులచే త్వరితముచేయబడనచ్చును. బలవంతము చేయబడవచ్చును. కాని, యధికసంఖ్యాకులగు ప్రజాసామాన్యముయొక్క మనఃపూర్వ కాంగీకారములేనిచో నది స్థాపింపబడజాలదు. కనుక వారిని దీనివైపు త్రిప్పుకొనవలెను; మార్చవలెను. కొద్దిమందియొక్క దౌర్జన్యయుతమగు కుట్రలవలన లాభములేదు. ప్రస్తుతపద్ధతివలన లాభములను పొందిన వారిని మార్చుటకుకూడ సహజముగ ప్రయత్నములను సలుపవలెను.

గాంధీజీ ప్రత్యేకముగనభిమానించు ఖాదీయుద్యమము యుత్పత్తి విధానములో వ్యక్తికి యతిశయము నిచ్చుచున్నది, కనుక నిది పారి శ్రామికయుగ పూర్వముకు తీసికొనిపోవును. ప్రస్తుత మేప్రధాన సమ స్యను పరిష్కరించుటకును యిదిపనికిరాదు. ఇది యుచితమైన మార్గమున నభివృద్ధిచెందుట కడ్డమువచ్చు బుద్ధిని కలిగించును. అయినను తాత్కా లిక సోపానముగ నిదియొక ప్రయోజనమును నెరవేర్చెనని నేను విశ్వ

సించెదను. ప్రభుత్వము దేశమునకంతకును చెందినట్టి వ్యవసాయ, పారిశ్రామిక సమస్యలకు, యుక్తమైన పరిష్కారమును చేయువరకును ఇది సహాయకారిగనే యుండవచ్చును. హిందూదేశములో లెక్కకు రానట్టి భయంకరమైన నిరుద్యోగసమస్యకలదు; అంతకంటె నెక్కువగ గ్రామములలో కొంతకాలము పనిలేకపోవుటకలదు. ఈస్థితిని పోగొట్టుటకు ప్రభుత్వమెట్టి ప్రయత్నమునుచేయలేదు. పూర్తిగ పనిలేనివారికిని, కొంతవరకు పనిలేనివారికిని, ఖాదీ ఆర్థికముగ కొద్దిసహాయమును చేసెను. ఈయభివృద్ధి తమ స్వప్రయత్నములచే కలుగుటవలన నది వారి యాత్మగౌరవమునుపెంచి, కొంతవిశ్వాసమును కలిగించెను. దీని వలన కలిగిన మానసికఫలిత మత్యద్భుతమైనది. ఖాదీ, గ్రామములకును పట్టణమునకును మధ్యగల యంతరువును కొంత విజయముతో పూర్తిచేయ ప్రయత్నించెను. అది రయతాంగమును మధ్యతరగతి విద్యాధికుని దగ్గరకు తెచ్చెను. చూచువానిమీదను, ధరించువాని మీదను వస్త్రములకొక విశేష మానసికఫలితముకలదు. మధ్యతరగతులవారు నిరాడంబరమైన తెల్లని ఖద్దరువస్త్రలను ధరించుటవలన వారిలో సరళతకలిగెను; డాంబికము, పామరత్వముతగ్గి ప్రజాసామాన్యముతో నైక్యభావము కలిగెను. మధ్యతరగతులలోని క్రిందితరహా వారు ధనవంతుల ననుకరించుట (బట్టలవిషయమై) మానివేసిరి; తమ చౌకదుస్తులకు అవమానపడుట మానివేసిరి. నిశ్చయముగ వారు గౌరవమును పొందుటయేగాక నింకను చీని, చీనాంబరములను ధరించువారి కంటె నధికులమని భావించిరి. అతిదరిద్రుడుకూడ నీయాత్మగౌరవమును కొంతయనుభవించెను. ఖాదీని ధరించిన గొప్పసమూహములో దరిద్రుని ధనవంతుని కనిపెట్టుట కష్టసాధ్యము; ఒకవిధమగు సౌభ్రాతృత్వముకూడ వృద్ధిపొందెను. నిస్సందేహముగ ఖాదీ ప్రజాసామాన్యమును చేరుటకు కాంగ్రెసుకు సహాయముచేసెను. అదిజాతీయస్వాతంత్ర్య చిహ్నమయ్యెను.

యంత్రియజమానులు తమవస్త్రముల ధరలనుపెంచకుండ ఖాదీ వారింపగలిగెను. విదేశపోటీ, ముఖ్యముగ లాంకషైరుపోటీ, లోగడ యీపనిచేసెడిది. ఈపోటీ తగ్గుటతోడనే (ప్రపంచయుద్ధసమయమున జరిగినట్లు) భారతదేశములో బట్టలధరలు విపరీతముగ పెరిగి మిల్లులు విశేషలాభములను పొందెడివి. స్వదేశీ యుద్యమము, విదేశవస్త్ర బహిష్కారము యీమిల్లులకెక్కువగ తోడ్పడెను; కాని ఖద్దరుయొక్క యునికివలన యదిలేనిచో ధరలు పెరుగునట్లు పెరుగుటకు వీలులేక పోయెను. మిల్లులు నిశ్చయముగ ముతకగుడ్డలను తయారుచేసి ప్రజల యొక్క ఖాదీయభిమానమును (జపానుకూడ యిట్లుచేసెను) కొల్ల గొనెను. మరియొక యుద్ధమువంటి యత్యవసరస్థితి కలిగినచో భారత మిల్లు యజమానులు 1914 లగాయతు ప్రజలను కొల్లగొనినట్లు యిపుడు చేయుటకు వీలులేదు. ఖాదీయుద్యమము దీనిని వారించును; కొద్దికాలపు నోటీసులో విస్తరింపగలశక్తి ఖాదీకిగలదు.

హిందూదేశములో ఖాదీకి ప్రస్తుత మిన్నియవకాశములున్నను అది తాత్కాలిక వ్యవహారమువలె నాకుతోచును. తరువాతకూడ నిది విశేష ఆర్థికమార్పును సుకరముచేయు సహాయకోద్యమముగ నుండ వచ్చును. కాని, భవిష్యత్తులో ప్రస్తుత వ్యవసాయ పద్ధతియంతయు పూర్తిగ తారుమారు కావలెను; పరిశ్రమలు అభివృద్ధికావలెను. భూమి సమస్యనుగురించి కళ్ళనీళ్లను తుడుచు అతుకు పనివలనను, లక్షలకొలది రూపాయలను వెచ్చించి చిన్నచిన్న పైపై మార్పులను సూచించు కమిషనులవలనను లాభములేదు. ప్రస్తుతమున్న భూమిపద్ధతి మన కండ్లయెదుటనే కూలిపోవుచున్నది. అది యుత్పత్తికిని, పంపకము నకును పెద్దయెత్తున జరగవలసిన యేసహేతుక కార్యములకైనను ఆటంక ముగ నున్నది. చిన్నచిన్న ఖండములను సేద్యముచేయుట యంత రింపవలెను. సాముదాయిక సహకార వ్యవసాయపద్ధతిని ప్రవేశపెట్ట

వలెను. ఈవిధముగ తక్కువ ప్రయత్నముతో విశేషోత్పత్తిని చేయు గొప్పమార్పుమాత్రమే యాధునికపరిస్థితులకు పనికివచ్చును. భూమియే మన ప్రజలకందరకును వృత్తినీయదు, యివ్వజాలదు. పెద్దయెత్తు మీదజరుగు వ్యవసాయమువలన (గాంధీజీభయపడునట్లు) వ్యవసాయ పనిచాంద్ర యవసరము చాలవరకు తగ్గిపోవును. తక్కినవారు, కొంత వరకు, చిన్నయెత్తుమీదజరుగు పరిశ్రమలను ప్రధానముగ పెద్దయెత్తు మీద జరుగునట్టి సంఘమునకు చెందచేయబడు పరిశ్రమలను, సాంఘిక సేవలను చేబట్టవలెను.

ఖాదీ యనేకప్రాంతములలో నిశ్చయముగ కొంతయుపశాంతిని కలుగచేసెను. కాని, దానియీవిజయములోనేయుపద్రవ బీజములున్నవి. అదినశించిపోవుచున్న యొకభూమిపద్ధతికిసహాయపడుచు నంతవరకు శ్రేష్ఠమైన పద్ధతికి కావలసినమార్పును ఆలస్యము చేయుచున్నది. ఈఫలిత మంతగొప్పది కాకపోయినను దీనిస్వభావము పోలేదు. కవులు దారుకు లేక తన కొద్దిస్వంతభూమి చేసికొనువానికి మిగులునది యతిస్వల్పము. అతని హీనజీవితమును గడుపుటకుకూడ నది చాలదు. ఆకొద్దిరాబడికి తోడుగ నతడు మరిదేనినో యితరత్ర చూచుకొనవలెను. లేదా పన్ను, శిస్తులను చెల్లించుటకతడు (మామూలుగచేయునట్లు) మరింత ఋణ మును చేయవలెను. కనుకపైగావచ్చు యీయాదాయము ప్రభుత్వము నకో, భూఖామందుకో చెల్లిపోవును. ఇదిలేనిచో వారిట్లు చేయజాలరు. పైగావచ్చు యీయాదాయము కన్నెట్టిగా నుండునంతగయున్నచో పన్ను హెచ్చింపబడి దానినికూడ మింగివేయవచ్చును. ప్రస్తుత పద్ధతిలో కవులుదారుయొక్క తదితర పాటు, పొదుపరితనము చివరకు భూఖామందుకే లాభము చేయును.

గాంధీజీ గ్రామపరిశ్రమల నుద్ధరించుటకుచేయు ప్రయత్నము ఖాదీప్రోగ్రాము మరింత విస్తరింపజేయుటయే యగును. అదివెంటనే

సత్ఫలితము నిచ్చును. ఇందులో కొంత శాశ్వతమైనది, కొంత తాత్కాలికము కావచ్చును. తన ప్రస్తుత దుర్భరస్థితిలో నవి గ్రామస్తునకు సహాయముచేయును; చచ్చిపోవుటకు సిద్ధముగనున్న కొన్నివిజ్ఞాన, కళాభికృతలను పునరుద్ధరింపవచ్చును. కాని, యది యంత్రములమీదను, యంత్రపరిశ్రమలమీదను తిరుగబాటుగ నున్నంతవరకు జయింపజాలదు. గ్రామపరిశ్రమలనుగురించి హరిజన పత్రికలో నతడొక వ్యాసమున నిట్లు వ్రాసెను. "సాధింపవలసిన పనిని చేయుటకు తగినంతమంది జనము లేనపుడు యంత్రములు మంచివి. హిందూదేశములోవలె పనిచేయువారు అవసరముకుమించి యున్నచోట నది చెడుపుగ పరిణమించును. మన గ్రామములలోనున్న కోట్లకొలది జనముకు తీరికను కలిగించుటెట్లు యనునది మనసమస్యకాదు. సంవత్సరములో నారుమాసములు పనిలేక యుండు వారికాలము నుపయోగించుటెట్లు? అనునదియే సమస్య. నిరుద్యోగమువలన బాధపడుచుట్టి యన్నిదేశములకును యీయభ్యంతరముండును; దోషము పనిలేకపోవుటలోలేదు. ప్రస్తుత లాభసాటి పద్ధతిలో పనిచేయించుటవలన యజమానులకు లాభములేదు. చేయవలసిన పని కావలసినంత యున్నది. రోడ్లు, పంటకాలువలను త్రవ్వుట, యిండ్లు కట్టుట పారిశుధ్యమును వైద్యసహాయమును, పరిశ్రమలను, విద్యుత్తును, సాంఘిక, వైజ్ఞానికసేవలను, విద్యను- వ్యాప్తిచేయవలెను. ప్రజలకిప్పుడు లేనట్టి ముఖ్యావసరములగు యనేక వస్తువులను సరఫరా చేయవలెను. లక్షలకొలదిగనున్న మనప్రజలు రానున్న యేబది సంవత్సరములవరకు కష్టపడి పనిచేయవచ్చును. కాని, సంఘము దానిని అందరి శ్రేయస్సుకొరకును సంఘటింపజేసి వ్యక్తిలాభము కాక సాంఘికాభివృద్ధిని లక్ష్యముగచేసినపుడు మాత్రమే యిదిపనిచేయును. రష్యాలోని సోవియట్ యూనియనులో (ఇతర లోపము లేవి యున్నను) నిరుద్యోగము నశించెను. పనిలేకపోవుటచే మన ప్రజలు సోమరులుగ లేరు. పనిచేయుటకును, విజ్ఞానాభివృద్ధికిని తగిన సౌకర్యములను కలిగించకపోవుటచే

వారట్లున్నారు. పిల్లలు పనిచేయ కూడదని నిషేధించి వారికియుక్త మగువయసు వచ్చువరకు బలవంతముగ విద్యను కరపుటవలన బాల బాలికలను పనిచేయువారిసంఖ్యయుండియు, సోమరుల సంఖ్యనుండియు తగ్గించును.

గాంధీజీ రాటమును, కదురును అభివృద్ధిచేయుటకును, వాటి యుత్పత్తిశక్తిని పెంపుచేయుటకును ప్రయత్నించి కొంతవిజయమును బడసెను. అవి యంత్రమును, పరికరమును అభివృద్ధిచేయుటకొఱక ప్రయత్నము. ఈయభివృద్ధి సాగుచో (గృహపరిశ్రమలను విద్యుత్తుతో పని చేయవచ్చును.) స్వలాభసమస్య తిరిగి తలయెత్తును; అది యనవసర యుత్పత్తిని, నిరుద్యోగమును కలిగింపవచ్చును. ఏదోయొక యాధునిక పారిశ్రామిక శాస్త్రమునకు సంబంధించనివో గ్రామపరిశ్రమలు నేఁడు మనకు ముఖ్యావసరములైన భౌతిక, వైజ్ఞానిక వస్తువులనుకూడ ప్రసాదింపజాలవు. అవి యంత్రముతో పోటీచేయజాలవు. మనదేశములో పెద్దమొత్తుయంత్రములమీద పనిచేయుట నాపివేయుట వాంఛనీయమా? అదిసాధ్యమగునా? కేవలయంత్రములకు తాను వ్యతిరేకి కాడని గాంధీజీ యనేకసార్లుచెప్పెను; అవి హిందూదేశములో నేఁడు యప్రస్తుతములని యతఁడు భావించునట్లు కాన్పించును. కాని, యినుము, ఉక్కు మొదలగు మూలపరిశ్రమలను, లేకనిదివఱకే దేశములోనున్న తేలికపరిశ్రమలను మనము కట్టిపెట్టగలమా?

మనమట్లు చేయజాలమనుట స్పష్టము. రైల్వేలు, వంతెనలు, సామానుల రాకపోకలసౌకర్యములు మొదలగునవి మనకున్నఫుడు మనమైననువానినుత్పత్తి చేయవలెను; లేదాయితరులపై నాధారపడవలెను. మనరక్షణకు పరికరములు కావలసినచో మనకు మూలపరిశ్రమలేకాక చాలయభివృద్ధిచెందిన యంత్రపారిశ్రామిక పద్ధతి కూడ కావలెను. నేఁడు యే దేశమును పారిశ్రామికాభివృద్ధిలేనిచో

యథార్థస్వాతంత్ర్యము ననుభవింపజాలదు; ఇతరులదాడులనుండి రక్షించుకొనజాలదు. ఒకమూలపరిశ్రమను బలపరచుటకును, పూర్తిచేయుటకును మరియొకటియుండవలెను; చివరకు యంత్రములను తయారుచేయు పరిశ్రమయే యుండవలెను. ఈమూలపరిశ్రమలన్నియు పనిచేయుచున్నపుడు తేలికపరిశ్రమలు విధాయకముగ వ్యాప్తిచెందవలెను. ఈవిధానమాగుటకు వీలులేదు. మనభౌతిక, వైజ్ఞానికాభివృద్ధియేగాక మనస్వేచ్ఛకూడ దీనితోబంధింపబడియున్నది. పెద్దపరిశ్రమలు వ్యాపించినకొలది చిన్నయెత్తుగ్రామపరిశ్రమలు వానిపోటీకి తాళజాలవు. సామ్యవాద పద్ధతిలో వాటికికొంత యవకాశముండవచ్చును; కాని పెట్టుబడిదారులపద్ధతిలో నసలేయుండదు. సామ్యవాదపద్ధతిలోకూడ నవి పెద్దయెత్తున యుత్పత్తి చేయబడని ప్రత్యేకవస్తువులను తయారుచేయు గృహపరిశ్రమలక్రిందమాత్రమే యుండగలవు.

యంత్రపరిశ్రమలనుజూచి కొంతమంది కాంగ్రెసు నాయకులు భయపడుదురు; వారు పారిశ్రామిక దేశములలోనున్న ప్రస్తుత కష్టములన్నియు బాహుళ్యముమీద జరుగు యుత్పత్తివల్లనేకలుగుచున్నవని యూహింతురు. అది పరిస్థితిని విపరీతముగ నర్థముచేసికొనుటయగును.* ప్రజలకేదికావలెనో దానిని చాలినంతవిరివిగ తయారుచేయుట దోషమా? విశేషోత్పత్తిచేయకుండ వారిని లేమిలో నుంచుటయే యుక్తమా? ఉత్పత్తిచేయుటలో దోషమేమియునులేదు; దానిని పంచిపెట్టు విధానములో దోషముకలదు; అది సమర్థమైనదికాదు.

మన వ్యవసాయము ప్రపంచ పణ్యరంగముపై నాధారపడి యుండును. గ్రామపరిశ్రమల నభివృద్ధిచేయగోరువారు యీకష్టము

---

* సర్దారు వల్లభాయిపటేలు అలహాబాదులో 1935 జనవరిలోనిట్లుచెప్పెను. "గ్రామపరిశ్రమల నభివృద్ధిచేయుటలోనే యథార్థమైన సామ్యవాదముకలదు. విశేషోత్పత్తివలన పాశ్చాత్యదేశములలో కలిగిన యరాజకస్థితిని మనదేశములో పునః సృష్టి చేయగోరము."

నెదుర్కొనవలెను. వ్యవసాయదారు వర్తకమునకు కావలసిన పంటలను పండించి, ప్రపంచధరలపై నాధారపడవలెను. ఈధరలు మారుచుండ నతడు శిస్తు, లేక పన్ను, రొక్కరూపములో చెల్లింపవలెను. అతడీ సొమ్మునెట్లో యార్జించవలెను. కనుక మంచిధర వచ్చునని యాతనికి తోచునట్టి పంటనే యతడు పండించును. ఆహారవిషయములోకూడ నతనికిని, యతనికుటుంబమునకును సరిపడుదానినతడు పండింపజాలడు.

అపరదినుసులయొక్కయు, నితరవ్యవసాయ వస్తువులయొక్కయు ధరలు పడిపోవుటచే లక్షలకొలది వ్యవసాయదారులు, ముఖ్యముగ, బీహారులోను, యు. పి. లోను హఠాత్తుగ చెఱకుపంటను ప్రారంభించిరి. పంచదారమీద పన్ను వేయుటచే పంచదారఫ్యాక్టరీలు కుక్కగొడుగులవలె తలయెత్తెను. చెఱకు విశేషముగ కావలసివచ్చెను. కాని, త్వరలోనే యవసరముకంటె సప్లయి యెక్కువయయ్యెను. ఫ్యాక్టరీయజమానులు వ్యవసాయదారులను నిర్దాక్షిణ్యముగ కొల్లగొనిరి. ధర పడిపోయెను.

ఈకొద్దిభావములును, మరియనేకములును మనవ్యవసాయ, పారిశ్రామిక సమస్యలకెట్టి సంకుచిత పరిష్కారము సాధ్యమును, వాంఛనీయమును కాదనినాకుతోచెను. నిశ్చయముగనవి మనజాతీయ జీవితముయొక్క ప్రతిభావమును మార్పుచేయును. మనము అర్థరహితమును ఉద్రేకజనకమునునగు పదముల నాశ్రయింపక నీయథార్థముల నెదుర్కొని వానికి సరిపెట్టుకొనవలెను. మనము అసహాయములైన చరిత్ర విషయములముగాక చరిత్రకారులము కావలెను.

విరుద్ధగాంధీజీ తిరిగి నాతలపునకువచ్చును. విశేషబుద్ధిబలమును, పీడింపబడువారిని, అణగద్రొక్కబడువారిని యుద్ధరింపవలెనను రాగమును గలయతడు నశించిపోవుచున్న యొకపద్ధతిని, యీదుఃఖమునకును దుర్వ్యయమునకును కారణమైనదానిని, యేల బలపరచును? అతడొక

మార్గమును వెతుకుచున్నాడనుట సత్యము. కాని యాభూతకాల మార్గము మూసివేయబడలేదా? బిగింపబడలేదా? ఈలోపల నతడు ఫ్యూడల్ సంస్థానములు, పెద్ద జమీందారీలు, తాలూకుదారీలు, ప్రస్తుతక్యాపిటలిస్టుపద్ధతి-అభివృద్ధికి భంగకరములగు నీపాతక్రమముకు చెందుచిహ్నములను ఆశీర్వదించును. ధర్మకర్తృత్వముఅనుసిద్ధాంతమును విశ్వసించుట సహేతుకమేనా? అధికారమును, నైశ్వర్యమును, అప్రతిహతమైన యధికారమును, నైశ్వర్యమును ఒకవ్యక్తిచేతికిచ్చి యతడు వానిని కేవలము ప్రజల శ్రేయస్సుకే వినియోగించుచుననుకొనుట సహేతుకమేనా? ఈవిధముగ విశ్వసింపబడుటకు మనలోను త్తమోత్తములు తగినంత పరిపూర్ణులుగ నున్నారా? ప్లాటోమహాశయునియొక్క వేదాంతులైనరాజులుకూడ నిట్టిభారమును యధార్థముగ వహింపజాలరు. ఈదయామయులగు మానవాతీతులనుకూడ తమపైనుంచుకొనుట యితరులకు శ్రేయమేనా? కాని, మానవాతీతులునులేరు, వేదాంతులైన రాజులునులేరు; తమ నిజలాభమును లేక తమ నిజయుద్దేశ్యములను అభివృద్ధిచేయుటయే ప్రజాశ్రేయస్సు అనిభావించు దుర్బలమానవులు మాత్రమేకలరు. పుట్టుక, పదవి, ఆర్థికాధికారము- అనుగొప్పమోతుతనముశాశ్వతమయి యనేకవిధములగు యుపద్రవకరములైన ఫలితముల నిచ్చును.

ఈమార్పును తెచ్చుటెట్లు? శ్రేవలోనున్న యడ్డంకులను తీసివేయుటెట్లు? బలవంతముచేతనా, మార్పుచేతనా? దౌర్జన్యమా, దౌర్జన్యరాహిత్యమా? అనుసమస్యను నేను ప్రస్తుతము యోచించుట లేదని తిరిగి చెప్పగోరుచున్నాను. దీనినిగురించి నేను తరువాత చర్చించెదను. కాని, మార్పువలసిన యవసరము గ్రహింపబడవలెను; స్పష్టముగ నుదహరింపబడవలెను. నాయకులును, యోచనపరులును దీనినిస్పష్టముగ యోచించి చెప్పకపోయినచో తమవలెనే యోచించునట్లువరి

నైనను మార్పుచేయగలరా? అవసరమైనలక్ష్యమును ప్రజలలోనభి వృద్ధి చేయగలరా? సంభవించుకార్యములే నిస్సందేహముగ జ్ఞానమును బోధింపగలశక్తులు. కాని, వానిప్రాముఖ్యతను గుర్తించుటకును, వాని నుండియోగ్యమగు ఫలితములనుపొందుటకును వానిని సరిగ నర్థముచేసి కొనవలెను.

నా వాక్యముల కప్పుడప్పుడాగ్రహపడుస్నేహితులు మంచి వారును, ఉదారులును నగురాజులును, దానధర్మములనుచేయు భూస్వాములును, ఉపకారమును, సరసతయుగల పెట్టుబడిదారులును నీకు కాన్పించలేదా? యని తరుచు నన్నడుగుచుందురు. నిశ్చయముగకన్పించిరి. నామట్టుకు నేను యీభూస్వాములతోను, యైశ్వర్యముకలవారి తోను కలసితిరుగునట్టి తరగతివాడను; నేనొకమాదిరి బూర్జువాను; బూర్జువావాతావరణములో పెరిగినవాడను. ఈశిక్షవలనకలుగు నన్ని మొదటి దురభిమానములను కలవాడను. కమ్యూనిస్టులు నన్ను చిన్న బూర్జువాయనిరి. ఇదియెంతయు సత్యము. బహుశఃనన్ను వారిభాష పశ్చాత్తప్తుడగు బూర్జువా" యని పిలువవచ్చును. కాని, నేనెవడను అనునదివిషయముకాదు. జాతీయ, అంతర్జాతీయ, ఆర్థిక, సాంఘికసమస్యలను విడి వ్యక్తులపరముగ నాలోచించుట మూర్ఖత్వమగును. నన్ను ప్రశ్నించు ఆస్నేహితులే మనపోరాటము పాపముతో కాని పాపులతో కాదని చెప్పుటకెప్పుడును విసుగుచెందరు. నేనంతదూరముకూడపోను. నాపోరాటము పద్ధతితో కాని వ్యక్తులతో కాదు. ఒకపద్ధతి నిశ్చయముగ చాలవరకు వ్యక్తులలోను, వర్గములలోను మూర్తీభవించును. ఈవ్యక్తులను వర్గములను మార్చవలెను, లేదాపోరవలెను. కాని, యొకపద్ధతి, నిష్ప్రయోజనమై, గుదిబండయైనచో నదిపోవలెను. దానినంటిపెట్టుకొనియుండు తరగతులును, వర్గములునుకూడ మార్పుచెందవలెను. ఈ మార్పు సాధ్యమైనంత తక్కువ బాధను మాత్రమే కలిగింపవలెను. కాని,

దురదృష్టవశాత్తు బాధయు, స్థానభ్రష్టత్వమునుతప్పవు. అతిచిన్న చెడు గుకు భయపడి మనము గొప్పచెడుగును సహింపజాలము.

మానవసంబంధముయొక్క ప్రతిమార్పునకును-రాజకీయ, సాంఘిక, ఆర్థికములకు-వెనుక నేదోయొక శాస్త్రముకలదు. ఈ సంబంధములు మారినప్పుడు యీశాస్త్రసంబంధమైన పునాదికూడ (దాని కనుగుణ్యాముగనుండి దానినుండి యెక్కువలబ్ధిని పొందుటకు) మారవలెను. మామూలుగ యీశాస్త్రము పరిస్థితులకు వెనుకబడియుండును; ఈ వెనుకటి యన్నికష్టములకును కారణమగును. 19 వ శతాబ్దములో ప్రజాప్రభుత్వపద్ధతియు క్యాపిటలిజమును కలిసియే యభివృద్ధియయ్యెను. కాని యవి పరస్పరవిరుద్ధములయ్యెను. వాటికి సహజముగ వైరుధ్యముకలదు. ప్రజాస్వామికము సార్వజనికాధికారము కావలెననును. క్యాపిటలిజము యథార్థమైన యధికారమును కొద్దిమందిచేతులలోనుంచును. ఈదురదృష్టదాంపత్యమెట్లో కాలమునువెళ్ళబుచ్చెను. ఏలనన రాజకీయమైన పార్లమెంటరీ ప్రజాస్వామికము స్వతః తక్కువపరిమితిగల ప్రజాస్వామికము; అది గుత్తతీసికొను పద్ధతితోను, అధికార కేంద్రీకరణముతోను జోక్యముతీసికొనలేదు.

అయినప్పటికిని ప్రజాస్వామిక తత్త్వము వృద్ధిచెందినకొలది ఘటశాద్ధము చేసికొనుట విధాయకమయ్యెను. ఇప్పుడు దానికి సమయము వచ్చెను. నేడు పార్లమెంటరీ ప్రజాస్వామికము అపఖ్యాతిపాలయ్యెను; దానికి ప్రతీకారముగ ననేకవిధములగు కేకలు ఆకసమును నింపుచున్నవి. దీనివలన హిందూదేశములోనున్న బ్రిటిషు ప్రభుత్వము మరింత ప్రతీకారమును బూనుచు రాజకీయస్వాతంత్ర్యము యొక్క బాహ్యరూపములను కూడ లాగివేయుటకు దీని నొక సాకుగ చేయుచున్నది. భారత సంస్థానాధిపతులు తమ నిరాటంక నిరంకుశ పరిపాలనను దీనిచే సమర్థించుకొనజూచుట వింతగ నుండును. వారు

†

తమ రాష్ట్రములలో ప్రపంచములో మరెచ్చటను లేని మధ్యయుగ పరిస్థితులను నిలుపుదుమని ఘీంకరించుచున్నారు. కాని, పార్లమెంటరీ ప్రజాస్వామిక విఫలత యతివ్యాప్తిగాక నవ్యాప్తియే యని గుర్తింప వలెను. అది యార్థిక ప్రజాస్వామికమును యేర్పరుపకపోవుటచే తగినంత సార్వజనికము కాజాలదు. దాని పద్ధతులు మందమై, జంఝాటముతో కూడుకొనియుండి శీఘ్రపరివర్తన యుగమునకు తగియుండలేదు.

భారత సంస్థానములు బహుశః నేడు ప్రపంచములో నున్న యత్యంత నిరంకుశపాలనలని చెప్పవచ్చును. అవి నిశ్చయముగ, బ్రిటిషు ఆధిపత్యమునకు లొంగియుండును. కాని, బ్రిటిషు ప్రభుత్వము తన ప్రయోజనములను అభివృద్ధి చేసికొనుటకును, రక్షించుకొనుటకును మాత్రమే జోక్యము కల్పించుకొనును. ఈ పాతప్రపంచపు ఫ్యూడల్ సంస్థానములు మార్పులేకుండ యిరువదియవ శతాబ్ద మధ్యభాగము వరకు నిలువగలుగుట యాశ్చర్యకరముగ నుండును; అచ్చటి గాలి భారముగను, చలనరహితముగను నుండును; నీరు మందముగ పారును; మార్పుకును, కదలికకును అలవాటుపడి బహుశః వానితో కూడ విసుగుచెందిన క్రొత్తవానికి నిద్రమత్తు వచ్చును; క్రొద్దిరామణీయకత దొంగతనముగ నతని నావేశించును. కాలదేవత కదలక నిలుచునట్లును, మారని దృశ్యము కంటికి కాన్పించునట్లును నంపు చిత్రమువలె నదియంతయు నసత్యముగ కాన్పించును. రమారమి యప్రయత్నముగ నతనికి భూతకాలచరిత్రయు తన బాల్యమునాటికలలును జ్ఞప్తికివచ్చును. పటకాలను, కవచములను ధరించిన యోధులయొక్కయు ధైర్యము గల సుందర కన్యకలయొక్కయు రూపములు నేత్రగోచరము లగును. బురుజులుగల కోటలు, శౌర్యము; గౌరవ, స్వాభిమానములను గురించిన పిచ్చియూహలు, అసమానమగు ధైర్య, స్థైర్యములు, మృత్యుధిక్కారము తలపునకు వచ్చును; ముఖ్యముగ నతడు కల్పనాకథలకును,

డాంబికములును, దుస్సాధ్యములును నగు కార్యములకును నాకరమగు రాజపుత్రస్థానములో నున్నచో నివి వచ్చును.

కాని, త్వరలోనే యీ రూపములంతరించి బాధ, హింస పొడసూపును; గాలి పీల్చుకొనుట కష్టమగును; యుక్కిరి బిక్కిరి యగును. చలనరహితమగు లేక మందగామియగు నీటిక్రింద దుర్గంధము, కుళ్లు కలవు. మానసికముగను, శారీరముగను కూడ కట్టివేయబడినట్లు, బిగింపబడినట్లు, నొక్కివేయబడినట్లు భావింపబడును. సంస్థానాధీశ్వరుని యొక్క భవ్యహర్మ్యములు దిక్కులేక నల్లాడు ప్రజలయొక్క పరిపూర్ణ అజ్ఞాన, దుఃఖములు ద్యోతకమగును. సంస్థానాధీశ్వరుని స్వంత యవసరములకును, భోగములకును, రాష్ట్రములోని ధనమెంత యపారముగ నా సౌధములలోనికి పోవును! ఏ సేవ రూపములోనైనను ఆప్రజలకెంత స్వల్పము వెనుకకు తిరిగి వచ్చును! మన సంస్థానాధిపతుల యట్టహాసములకు విపరీతముగ ధనవ్యయము చేయబడును. తమకొరకు చేయు నిట్టి దూబరాఖర్చుకు తిరిగి వారేమి యిచ్చుచున్నారు?

ఈ సంస్థానముల నొక రహస్యతెర యావరించి యుండును. ఇచ్చట వార్తాపత్రికలు ప్రోత్సహింపబడవు. అతిమెహర్బానీగా నొక సాహిత్య సంబంధమైన లేక సర్ధ ప్రభుత్వ సంబంధమైన వారపత్రిక యుండవచ్చును. తరుచు పైనుండి వచ్చు పత్రికలు నిషేధింపబడును. విద్యయతి తక్కువగ నుండును. ఆడంబరముతోను, పటాటోపముతోను వచ్చు వైస్రాయి గారి రాకయు, పరస్పర పొగడ్తలును లేక నతి యట్టహాసముతో చేయబడిన వివాహము, రాజుగారి జన్మదినోత్సవము లేక రైతుల తిరుగుబాటు—ఇవియే సంస్థానములనుండి వచ్చు ప్రధాన వార్తలు. వాని విమర్శలనుండి (బ్రిటిషు యిండియాలో కూడ) ప్రత్యేక చట్టములు కాపాడును. వారి రాష్ట్రములలో నతి నిరపాయమగు విమర్శ కూడ తీవ్రముగ నణచివేయబడును. బహిరంగ సభలు

రమారమి యనూహ్యములు. సాంఘిక ప్రయోజనము కొరకు జరుగు సభలు కూడ తరుచు నిషేధింపబడును. పై నుండి వచ్చు ప్రధాన నాయకులు సంస్థానములలోనికి రాకుండ తరుచు నిరోధింపబడుదురు. చిత్తరంజనదాసు చాల వ్యాధిగ్రస్తుడై యారోగ్యముకొరకు కాశ్మీరము వెళ్ళ నిశ్చయించుకొనెను. అతడు రాజకీయ ప్రచారముకొరకు బయలు దేరలేదు. అతడు సరాసరి కాశ్మీర సరిహద్దు వరకును వెళ్ళిన తరువాత నచ్చట యాపివేయబడెను. జిన్నాగారిని కూడ హైదరాబాదు సంస్థానములోనికి రానీయలేదు. హైదరాబాదు పట్టణములోనే స్వగృహమున్న సరోజినీదేవిని చాలకాలమచ్చటకు రానీయలేదు.

సంస్థానములలో నిట్టి పరిస్థితులున్నపుడు కాంగ్రెసు ఆ ప్రజల ప్రాథమిక హక్కులకొరకు నిలిచి వారిని మొత్తముమీద నణచి వేయుట యుక్తము కాదని విమర్శించుట సహజమై యుండెడిది. కాని, గాంధీజీ సంస్థానముల సందర్భమున కాంగ్రెసులో నొక నూతన నీతిని “సంస్థానముల యాంతరంగిక పరిపాలనలో జోక్యమును కల్పించు కొనరాదు,” సృష్టించెను. సంస్థానములలో నసామాన్యములును, బాధకరములును నగు సంభవములు జరిగినను సంస్థానాధికారులు కాంగ్రెసుపై సకారణ వైరమునుబూనినను నతడీ జోక్యనీతిని విడువ డాయెను. కాంగ్రెసుయొక్క విమర్శ వారికి కష్టమును కలిగింపవచ్చు ననియు నందుచేవారిని ‘మార్చుట’ కష్టమగుననియు భీతియున్నట్లు కాన్పించును. సంస్థాన ప్రజల కాన్ఫరెన్సుకు అధ్యక్షుడైన యన్. సి. కేల్కారుగారికి 1934 జూలైలో వ్రాయుచు గాంధీజీ జోక్యమును కలిగించుకొనకూడదను తన విశ్వాసమును పునశ్చరణచేసెను. “సంస్థానములు బ్రిటిషు చట్టముక్రింద స్వతంత్రసంస్థలు. బ్రిటిషు భారతము అని నిర్వచింపబడు భాగము ఆఫ్ఘనిస్థానము లేక సింహళముయొక్క నీతి నెట్లు నిరూపింపజాలదో యట్లే సంస్థానములనీతిని నిరూపింపజాలదు”

అని యతడు వ్రాసెను. మితమును, సాధుత్వమునుకల భారత సంస్థాన ప్రజాసభయు, లిబరలు పక్షమువారునుకూడ నతనియభిప్రాయములను సలహాలను ఆక్షేపించుటలో నాశ్చర్యములేదు.

కాని, యీయభిప్రాయములు సంస్థానాధిపతుల కింపుగనుండెను. వారు వానివలన లాభమునుపొందిరి. ఒక మాసములోపల తిరువాన్కూరు సంస్థానము తమరాష్ట్రములో జాతీయకాంగ్రెసును నిషేధించి, దానిసభల నన్నిటిని ఆపివేసి, సభ్యులనుజేర్పించుటకూడ పనికిరాదనెను. అట్లుచేయుటలోనది 'బాధ్యతగలనాయకులే' యీసలహా చెప్పిరి-గాంధీజీ స్టేటుమెంటును సూచించుచు-యని చెప్పెను. బ్రిటిషు యిండియాలో శాసనోల్లంఘనము (సంస్థానములలోనిది యెన్నడును ప్రవేశపెట్టబడలేదు) విరమింపబడిన తరువాతను, భారతప్రభుత్వము తిరిగి కాంగ్రెసును సక్రమసంఘమని ప్రకటించిన తరువాతను యీ నిషేధము జరిగెనని గమనింపవలసియున్నది.

కాంగ్రెసుసేతిని, గాంధీజీ సలహాను అనుసరించి తిరువాన్కూరు ప్రభుత్వము ప్రశాంతమగుదినములలో కాంగ్రెసుపై సలిపిన యకారణ దాడినిగురించి బహిరంగములో నొక్కమాటయైనను చెప్పబడలేదు. కొంతమంది లిబరలులుకూడ దీనిని తీవ్రముగ నిరసించిరి. నిశ్చయముగ సంస్థానములకు సంబంధించినంతవరకు గాంధీజీ లిబరలులకంటె చాల మితవాది; యెక్కువ నిరోధముకలవాడు. బహుశః నాయకులలో వివిధ సంస్థానాధిపతులతో సన్నిహితసంబంధముకల పండితమదన మోహన మాలవ్యాయొక్కడే తత్తుల్యమైన నిరోధమును చూపును; వారికి కష్టము కలిగించుట కిష్టపడడు.

గాంధీజీ భారతసంస్థానాధిపతుల సందర్భములో నెల్లప్పుడును యిట్టి జాగరూకతతోనుండడు. 1916 ఫిబ్రవరిలో హిందూవిశ్వవిద్యాలయ ప్రారంభోత్సవ సందర్భమున యనేకమంది సంస్థానాధిపతులున్న

సభలో నతడు కాశీలో మాట్లాడెను. ఆనాడొక సంస్థానాధిపతి యధ్య క్షతవహించెను. అతడు దక్షిణాఫ్రికానుండి క్రొత్తగావచ్చెను; అఖిల భారత రాజకీయ భారమింకను నతనిమీాద పడలేదు. అతడు ప్రార్థేయ పూర్వకముగను భవిష్యత్తు చెప్పువానివలెను, యుపన్యసించివారిని తమ తమపద్ధతులను మార్చుకొనవలసినదనియు, వ్యర్థమగు నాడంబరమును, భోగములను మానవలసినదనియు చెప్పెను. "సంస్థానాధిపతులారా! వెళ్లి మీాయలంకారములను అమ్మివేయుడు" అని యతడనెను. వారు తమ నగలను అమ్మివేయక పోయినను నిశ్చయముగ వెళ్ళిపోయిరి. వారు తల్లడపడిపోయి యొకరొకరుగ సభను వీడివెల్లిరి; చివరకు అధ్య క్షుడుకూడ మెల్లగజారెను. గాంధీజీ మాట్లాడుచునేయుండెను. అచ్చట నున్న అనిబిసెంటుసతికిగూడ, గాంధీజీ విమర్శవలన కష్టముకలిగి సభ నుండి వెడలిపోయెను.

కేల్కారుకు వ్రాసినయుత్తరములో మరియు నతడిట్లుచెప్పెను. "సంస్థానములు తమ ప్రజలకు స్వపరిపాలన నీయవలెనని నేను కోరె దను. తాము పరిపాలించు ప్రజలకు వారు ధర్మకర్తలని భావించవలె ననియు, యధార్థముగనట్లుండవలెననియు నేను కోరెదను..." ఈధర్మ కర్తృత్వమను భావములో నేదేనియున్నచో భారతపరిపాలనకు తాము ధర్మకర్తలమని బ్రిటిషుప్రభుత్వము చేయువాదనకు మనమేల యభ్యం తరపెట్టవలెను? వారు విదేశీయులనువిషయముతప్ప నాకు భేదమేమియు కాన్పించదు. హిందూదేశములోని వివిధప్రజల శరీరఛాయలోను, జాతులపుట్టుకలోను, విజ్ఞానములోను రమారమి తత్తుల్యమైన భేదములే యున్నవి.

గతకొద్దివత్సరములనుండి బ్రిటిషుఅధికారులు భారతసంస్థాన ములలోనికి వేగముగప్రవేశించుచున్నారు; ఇష్టములేకపోయినను అస హాయులుగనుండురాజులపై వారు తరచుత్రోయబడుచుదురు. భారతప్రభు

త్వమువారు పైనుండి సంస్థానములమీద నెల్లప్పుడును విశేషాధికార మును చలాయించుచుందురు. ఇప్పుడుదీనికితోడు కొన్నిప్రధానసంస్థా నములలో నాంతరంగికాధికారము కలదు. కనుక నీసంస్థానములు మాట్లాడునపుడు తరచు భారతప్రభుత్వమే మరియొక కంఠముతో (ఫ్యూడల్ పునాదియొక్క యావత్తులబ్ధిని పొందుచు) మాట్లాడును.

మత సంబంధమైనట్టియు, తదితరములునునైన తక్కువసంఖ్యాకు లకు ప్రత్యేకనియోజకవర్గములుండరాదని చాలవిమర్శ చేయబడెను. అవిప్రజాపరిపాలనకు కేవలము అసంబద్ధములని సూచింపబడెను. నియో జకవర్గమును యేమాత్రమును బెసగనట్టువంటి మతముల అరలపెట్టెక్రింద విభజించినచో ప్రజాస్వామికముకాని బాధ్యతాయుతమని పిలువ బడునట్టి ప్రభుత్వముకాని సంభవముకాజాలదు. కాని, యీవిమర్శ కులలో నతిశ్రద్ధావంతులును, పట్టుదలకలవారునునగు మాలవ్యాయు హిందూమహాసభానాయకులును, సంస్థానములలోని పరిస్థితులనుగురించి యెంతమాత్రమును మాట్లాడకుండిరి. వారు సంస్థానములనిరంకుశపాలన లకును తక్కినభారతదేశ ప్రజాపరిపాలనకును (అదియట్లుపిలువబడెను.) మధ్యనొక ఫెడరలుయూనియను యుండుట కంగీకరించిరి. ఇంతకంటె నసంబద్ధమును,విపరీతమును నగు యూనియనును మనమూహింపజాలము. కాని, జాతీయతకును, ప్రజాస్వామికమునకును కంకణము కట్టుకొనిన హిందూమహాసభానాయకులెట్టికష్టమును లేకుండగనే దీనిని దిగమ్రింగిరి. మనముతర్కమునుగురించియు నిలుకడనుగురించియుమాట్లాడుచుందుము. కాని, మనప్రధానప్రేరేపణలు దేశీకముమించనే యాధారపడును.

కనుకనేను సంస్థానములు కాంగ్రెసు అనువిరుద్ధమునకు తిరిగి వచ్చెదను. థామస్ పైను నూటయేబదియేండ్ల క్రిందట బర్కునుగురించి చెప్పినపదము "అతడు శృంగారముగనున్న తురాయినిచూచి విచార పడును. కాని చనిపోవుచున్న పక్షిని మరచిపోవును". నాకుజ్ఞప్తికివచ్చు

చున్నది. నిశ్చయముగ గాంధీజీ చనిపోవుచున్నపక్షి నెన్నడును మరచి పోడు. కాని తురాయినిగురించి యంతపట్టుబట్టనేల?

రమారమి యీభావములే తాలూకుదారీ, పెద్దజమీందారీ పద్ధతులకును వర్తించును. ఈయర్ధపరిభుత్వపద్ధతియొక్క కాలము చెల్లె ననియు, నిది యుత్పత్తికిని సాధారణాభివృద్ధికిని పెద్దయాటంకమనియు వాదింపనవసరములేదు; ఇది వృద్ధిచెందుచున్న క్యాపిటలిజముకుకూడ ననర్థకము. రమారమి ప్రపంచమంతటను పెద్దపెద్దయెస్టేటులు క్రమముగ నశించి వ్యవసాయ ప్రొప్రయిటరీలకు స్థానమిచ్చెను. హిందూదేశములో ప్రతిఫలము విషయమొక్కటియే రావచ్చునని నేనెల్లప్పుడును యూహించితిని. కాని, గాంధీజీ తాలూకుదారీపద్ధతిని యున్నవిధముగ నామోదించి సాగింపగోరునని గతవత్సరమున కనుగొని నేనాశ్చర్యపడితిని. 1934 జూలైలో కాన్పూరులో నతడిట్లు చెప్పెను. "ఇరుపక్షము లను హృదయ పరివర్తనమువలన భూఖామందులకును రయితులకును మధ్య మంచి సంబంధములేర్పడగలవు. అది జరిగినచో నుభయులును సామరస్యముగను, ప్రశాంతముగను జీవింపవచ్చును. అతడెప్పుడును తాలూకుదారీ లేక జమీందారీ పద్ధతిని రద్దుచేయుట నామోదించి యుండలేదు. దానిని రద్దుచేయవలెనని భావించువారు తమ మనస్సులను తామే యెరుగరు." (ఈచివరనేరము కూర్రమైనది.)

మరియు నతడిట్లు చెప్పెను. "ఆస్తులుగలతరగతులవారి యాస్తులను యోగ్యమైన కారణము లేకుండ లాగివేయుటకు నేనొప్పుకొనను. మీహృదయములను కరగించి మిమ్ము మార్చుటయే నాలక్ష్యము. (అతడు పెద్దజమీందారుల సభలో మాట్లాడుచుండెను.) మీరు మీస్వంత యాస్తినంతను మీకవులుదారుల తరఫున ధర్మకర్తలుగనుంచుకొని దానిని ప్రధానముగ వారి యుపయోగముకొరకే వినియోగింపవలెను. ...మీయాస్తినుండి మిమ్ము అక్రమముగ తరిమివేయవలెనను

ప్రియత్నముచేయబడునేని నేను మీాతరఘున పోరెదను...పాశ్చాత్య దేశములోని సామ్యవాదము, కమ్యూనిజము మనభావములతో ప్రధానముగ భేదించునట్టి కొన్నిభావములపై నాధారపడెను. మానవ స్వభావము ముఖ్యముగ స్వార్థపూరితమను వారివిశ్వాసము వానిలో నొకటి ...కనుక మనసామ్యవాదము, కమ్యూనిజము దౌర్జన్యరాహిత్యము మీాదను కూలివాడు, పెట్టుబడిదారు, భూఖామందు, రయితు- వీరి యొక్క సామరస్యమైన సహకారము మీాదను నిర్మింపబడవలెను."

ప్రాచ్య, పాశ్చాత్యముల మూలభావములలో నట్టిభేదములున్న సంగతి నాకు తెలియదు; బహుశః యున్నవి. కాని, గతకొన్నివత్సరములనుండి కలిగినభేదమేమనిన భారతభూస్వామియు, పెట్టుబడిదారుడును తమరైతులయొక్కయు, పనివాండ్రియొక్కయు ప్రయోజనములను పాశ్చాత్యపెట్టుబడిదారు, భూస్వామికంటె నెక్కువగ నిర్లక్ష్యము చేసిరి. భారతభూస్వామి రయితుల క్షేమము కొరకెట్టి సాంఘికసేవను చేయుటకును ప్రియత్నము చేయలేదు. పాశ్చాత్య పరీక్షకుడైన బ్రైల్సుఫర్డు యిట్లువిమర్శించెను "భారత వడ్డీవ్యాపారస్థులును,భూస్వాములును యేసమకాలిక సాంఘికపద్ధతిలోను లేనట్టి సర్వభక్షకులు." బహుశః తప్పు, భారత భూస్వామిదికాదు. అతనికిమించిన పరిస్థితులేర్పడెను. క్రిమముగనతడు పతితుడయ్యెను.ఇప్పుడతడు తననురక్షించుకొనజాలని కఠినస్థితిలో నున్నాడు. వడ్డీవ్యాపారస్థులు చాలమంది భూస్వాముల భూములను లాగుకొనిరి; చిన్నచిన్న భూస్వాములు తమభూములకే కవులుదారులైరి. పట్టణములలోనుండు యీవడ్డీవ్యాపారస్థులు తనఖాలమీాద బాకీలనిచ్చి తనఖాకాలము మీారిపోవుటతోడనే జమీాందారులైరి. గాంధీజీ సిద్ధాంతముప్రకారము వీరిపుడు తమచేతనే భూములనుండి వెడలగొట్టబడిన దురదృష్టప్రజలకు ధర్మకర్తలు; ప్రధానముగ రయితులక్షేమముకొరకే తమరాబడిని వినియోగింపవలసినవారు.

తాలూకుదారీపద్ధతి మంచిదేయైనచో దానిని హిందూదేశమంతటను నేల ప్రవేశపెట్టరాదు ? హిందూదేశములో విశాలమైన ప్రాంతములలో వ్యవసాయ ప్రొప్రయిటరులు కలరు. గుజరాతులో పెద్దజమీందారీలను, తాలూకుదారీలను సృష్టించుటకు గాంధీజీయంగీకరించునా ? అట్లుచేయునని నేనూహింపను. అయితే యు. పి. కిని, బీహారు, బెంగాలులకును యొకవిధమగు భూమిపద్ధతియు, గుజరాతు, పంజాబులకు మరియొక విధమగు భూమిపద్ధతియు నుండనేల ? భారతదేశముయొక్క పూర్వ, పశ్చిమ, యుత్తర, దక్షిణ భాగములోని ప్రజలలో బహుశః యెట్టి ప్రధానభేదములును లేవనుకొనెదను; వారిమూలభావములన్నియు నొకటియే ! అర్థమేమన యున్నదిసాగవలెను. ఉన్నస్థితిని రక్షింపవలెను. ప్రజలకేది లాభదాయకమో, యేది వాంఛనీయమో యనునార్థికపరిశోధన యుండకూడదు. ప్రస్తుతపరిస్థితులను మార్చుటకు ప్రయత్నింపరాదు. ప్రజలయొక్క హృదయములను మార్చుటయొక్కటియే చేయవలసినపని. అది జీవితమును, దానిసమస్యలను శుద్ధమతదృష్టితో చూచుటయగును. దానికి రాజకీయములతోను, ఆర్థిక, సాంఘికశాస్త్రములతోను సంబంధ మేమియునులేదు. అయినను గాంధీజీ దీనినిదాటి రాజకీయ జాతీయరంగములలో విహరించును.

నేడు భారతదేశమునిట్టి కొన్ని విరుద్ధము లెదుర్కొనుచున్నవి. మనము మనలను కొన్నిముడులక్రింద బంధించుకొంటిమి. వానినివిప్పివేసినగాని ముందడుగువేయుట కష్టము. ఈ విముదల యుద్రేకమువలన కలుగజాలదు. చాలకాలముక్రిందట స్పినోజా " జ్ఞానమువలనను, అవగాహనవలనను కలిగినస్వేచ్ఛయా లేక నుద్రేకమువలనకలుగు బంధనమా? " అందులో నేదిశ్రేష్ఠము అని ప్రశ్నించెను. అతడు మొదటిదానినే వరించెను.



## మార్పు లేక బలవంతము.



పదునారేండ్లక్రితము గాంధీజీ తనదౌర్జన్యరాహిత్య సిద్ధాంతముతో భారతదేశమును మోహింపజేసెను. నాటినుండి యది భారతాకాశము నాక్రమించెను. లక్షలకొలది ప్రజలు దానిని (అనాలోచితముగ) జపించిరి; కాని, యామోదించిరి. కొంతమంది దానితో పెనుగులాడి తరువాత, షరతులతోను షరతులు లేకుండగను, స్వీకరించిరి. కొంతమంది దానిని బహిరంగముగ వెక్కిరించిరి. అది మన రాజకీయ, సాంఘిక జీవితములో నెక్కువపాత్రనువహించెను; అది బాహ్యప్రపంచదృష్టిని కూడ చాలవరకాకర్షించెను. ఈసిద్ధాంతము నిశ్చయముగ రమారమి మానవభావముతో సమకాలికముగనేయుండెను. కాని, బహుశః, గాంధీజీ దానిని జనబాహుళ్యముమీద రాజకీయ సాంఘికోద్యమములకు మొట్టమొదట వర్తింపచేసెను. వెనుక నది వ్యక్తికి సంబంధించియుండుటచే ముఖ్యముగ మతసంబంధమయ్యెను. వ్యక్తి యాత్మనిరోధమునుచూపి పరిపూర్ణమైన యుదాసీనతను సాధింప ప్రయత్నముచేసి తద్వారా ప్రపంచపోరాటముల కతీతుడయి, యొకవిధమగు వ్యక్తిస్వాతంత్ర్యమును, మోక్షమును సాధింపబూనును. దానివెనుక విశాలమైన సాంఘికసమస్యలను చేబట్టి సాంఘికపరిస్థితులను మార్చవలెనను భావములేదు; హెచ్చుతగ్గులతోను, అన్యాయములతోను కూడుకొనిన వర్తమాన సాంఘికనిర్మాణమును రమారమి స్వీకరించును. ఈవ్యక్తిగతలక్ష్యమును గాంధీజీ సాంఘికలక్ష్యముగ మార్చప్రయత్నించెను; అతడు సాంఘిక, రాజకీయ పరిస్థితులను రెండింటిని మార్చగోరెను; బుద్ధిపూర్వకముగ నీలక్ష్యమును మనస్సులోనుంచుకొని యతడు

దౌర్జన్యరాహిత్యపద్ధతికి కేవలము భిన్నమగు నీవిశాల రంగముమీద ప్రయోగించెను.

"మానవపరిస్థితులలోను, పరిసరములలోను గొప్పమార్పులను కలుగచేయగోరువారు సంక్షోభమునో కల్లోలమునో కలుగజేసినగాని యట్లుచేయజాలరు. ఇట్లు చేయుటకు రెండేమార్గములు—దౌర్జన్యము, దౌర్జన్యరాహిత్యము- కలవు. దౌర్జన్యయుతమగుయొత్తిడి స్థూలశరీరమును నొప్పించును. అది బాధనొందువానిని ఖేదపెట్టునట్లే బాధించువానినికూడ పతితునిచేయును. కాని, యాత్మబాధద్వారా (ఉపవాసాదికములు) చేయు దౌర్జన్యరహితయొత్తిడి కేవలము భిన్నమగువిధముగ పనిచేయును. అది యెవరిమీద ప్రయోగింపబడునో వారిస్థూల శరీరమునుగాక నైతికదాడిని స్పృశించి, దానిని బలపరచును." అని యతడు వ్రాసెను.

ఈభావము కొంతవరకు భారతభావమునకు సరిపడెను. కనుక బాహ్యముగనైనను దేశముచే నుత్సాహముతో నంగీకరింపబడెను. దానివెనుకనున్న విశేషాంతరార్థములను బహుకొద్దిమంది మాత్రమే గుర్తించిరి. ఆకొద్దిమందికూడ విశ్వాసములోను, క్రియలోను శరణుజొచ్చిరి. కాని, క్రియలోనున్నవేడి చల్లారుటతోడనే కొంతమంది మనస్సులలో ననేకప్రశ్న లుదయించెను. వానికిప్రత్యుత్తరములు దొరకుట దుర్ఘటమయ్యెను. ఈప్రశ్నలు సన్నిహితరాజకీయగతిని మార్చలేదు. అవి యీదౌర్జన్యరహిత పోరాటమువెనకనున్న శాస్త్రమును చర్చించెను. రాజకీయదృష్టిలో దౌర్జన్యరహితయుద్యమమింకను జయింపలేదు. ఏలనన భారతదేశమింకను సామ్రాజ్య పిడికిలిలో పట్టుబడియున్నది. సాంఘికదృష్టిలోనది పెద్దమార్పును దేనిని తలంపనైనను తలపలేదు. అయినను యేమాత్రము బుద్ధితీక్ష్ణత కలవారైనను అది లక్షలకొలది ప్రజలలో గొప్పమార్పును కలిగించినసంగతి చూడగలరు.

అది వాఙ్నిశీలమును, శక్తిని, యాత్మవిశ్వాసమును ప్రసాదించెను. ఈయమూల్యవరములులేనిదే రాజకీయ, సాంఘికాభివృద్ధిని దేనిని సాధింపజాలము లేదా నిలుపుకొనజాలము. గాంధీజీ యుదహరించిన 'సాంఘికల్లోలము'ను లేవదీయుటకిది తోడ్పడి యమూల్యమయ్యెనని చెప్పుటకెట్టిసందేహమునులేదు. విప్లవకరమగు మార్పుకుముందు ప్రజలలోకలుగు చైతన్యవిధానమునిది తెచ్చిపెట్టెను.

స్పష్టముగనది దానికనుకూలమగు విషయము. కాని యది మాకు తృప్తినీయజాలదు. యథార్థమైన ప్రశ్నలకు సమాధానములు లేవు. దురదృష్టవశాత్తు గాంధీజీ యీసమస్యను పరిష్కరించుటలో మనతగా తోడ్పడడు. ఈవిషయమునుగురించి యతడనేకసార్లు మాట్లాడెను; అనేకసార్లువ్రాసెను, కాని, నాకుతెలిసినంతవరకు నతడెప్పుడును దాని యంతరార్థములను (శాస్త్రరీత్యాలేక జ్ఞానరీత్యా) బహిరంగముగ చర్చించియుండలేదు. లక్ష్యముకంటె సాధనములు ముఖ్యమనియు నిర్బంధముకంటె మార్పుమంచిదనియు నతడుపదేశదే చెప్పుచుండును; దౌర్జన్యరాహిత్యమును సత్యముతోను, విశేష మంచితనముతోను కలుపుచుండును. అతడీపదములను నిశ్చయముగ తరచు నామాంతరములైనట్లు వాడుచుండును. దీనితో నేకీభవింపని వారందరిని పంక్తిబాహ్యులుగను, నైతికచట్టమున కపచారము చేసినవారివలెను చూచు స్వభావమొకటి బయలుదేరెను. అతని కొంతమందిశిష్యులలో నిది విధాయకముగ సహంకార భావమును దాల్చెను.

ఈవిశ్వాసముకుమరు నదృష్టముపట్టని మాబోట్లను అనేకసందేహములు బాధించెను. ఈసందేహములంతగా ప్రస్తుతావసరములకుగాక వ్యక్తిగతముగ నైతికమును, సాంఘికముగ శక్తివంతమును నగు నిరంతరాయ కర్మవేదాంతము కావలెననెడు మనోభీష్టమునకు చెందుచున్నవి. ఈసందేహములు నన్నుపీడలేదని నేనొప్పుకొనెదను. ఈసమ

స్యకు తృప్తికరమగు పరిష్కారము నాకు దొరకలేదు. దౌర్జన్యమును నేనతితీవ్రముగ ద్వేషింతును. అయినను నేను దౌర్జన్యపూరితుడనై యున్నాను. బుద్ధిపూర్వకముగనో యబుద్ధిపూర్వకముగనో యితరులను నిర్బంధించుటకు నేను తరచు ప్రయత్నించుచుందును. తన సన్నిహిత శిష్యకోటిలో చాలమందిని, తనసహోద్యోగులను మానసికముగ్ధనలె మార్చునట్టి గాంధీజీయొక్క యాధ్యాత్మిక నిర్బంధముకంటె గొప్ప నిర్బంధ మేదికలదు?

కాని, వ్యక్తిగతమైన యీ దౌర్జన్యరాహిత్య సిద్ధాంతమును (ప్రజాసామాన్య మత్యున్నతముగు ప్రేమ, సుహృద్భావన స్థాయిలకు లేవగోరు యీ సిద్ధాంతమును) సాంఘికవర్గములును, జాతీయవర్గములును కావలసినంతవర కలవర్చుకొనగలవా? యనునదియే యథార్థమైన ప్రశ్న. ద్వేషమును, క్రౌర్యమును, స్వార్థమును తరిమివేసి మానవలోకమును యీస్థాయికి తెచ్చుటయొక్కటియే వాంఛనీయమైన పరమావధియనుట సత్యము. అదిసాధ్యమా యసాధ్యమా(ఎప్పటికైనను) యనునదిచర్చనీయాంశము కావచ్చును; కాని, యదిలేకుండ జీవితమునాశించుట "యేయుద్ధమును లేకుండ రణగొణధ్వనితోను, యావేశముతోను చెప్పు వివేకహీనుని కథవలెనుండును." ఈలక్ష్యమును సాధించుట కష్టముగ నుండుటయేగాక తద్వ్యతిరేక స్వభావములను కల్పించునాటంకములను లెక్కపెట్టక మనమీగుణములను బోధించుచు దానికొరకు సరాసరి ప్రయత్నింపవలెనా? లేక మొదట మనమీయడ్డంకులను తీసివేసి ప్రేమ, సౌందర్యము, సుహృద్భావము వృద్ధిచెందుట కెక్కువ యర్హమగు వాతావరణమును సృష్టింపవలదా? లేక మనమీరెండు విధానములను జోడింపవలెనా?

మరియు దౌర్జన్యమునకును, దౌర్జన్యరాహిత్యమునకును, బలవంతమునకును మార్పునకును మధ్యగలరేఖ యెంత స్పష్టముగనున్నదా ?

తరచు నైతిక నిర్బంధము శరీర నిర్బంధముకంటె నెక్కువ, భయంకర నిర్బంధమగుచుండును. దౌర్జన్యరాహిత్యము సత్యముకు నామాంతరమా? సత్యమననేమి యనునది పురాణసమస్య. దానికి వేలకొలది ప్రత్యుత్తరము లీయబడెను. అయినను యీప్రశ్న మిగిలియేయున్నది. కాని యదియేదియైనను, దౌర్జన్యరాహిత్యముతో పూర్తిగ నేకముకాజాలదు. దౌర్జన్యము స్వతః చెడ్డదేయైనను, వస్తుతః యవినీతికరమని భావించుటకు వీలులేదు. ఇందులోననేక తరహాలు, అనేకఛాయలు కలవు; తరచు అంతకంటె చెడ్డయైన దానికంటె నిది మంచియే కావచ్చును. గాంధీజీయే పిరికితనముకంటె నిది మంచిదనిచెప్పెను; భయము, దాస్యము, మొదలగుననేక చెడుగులను దీనికిజేర్చనచ్చును. సామాన్యముగ దౌర్జన్యము ద్వేషముతో కూడియుండుననుట నిజము; కాని, సిద్ధాంతములోనైనను యిది యెల్లప్పుడు నీవిధముగ నుండనక్కరలేదు. దౌర్జన్యము ప్రేమమీద నాధారపడవచ్చునని యూహింపవచ్చును. (శస్త్రవైద్యుని యుదాహరణములేదా?) ఇట్టియాధారముకలదేదియు నెప్పుడును ప్రధానముగ నీతిబాహ్యముకాజాలదు. ఇంతకును ధర్మమునకును, నీతికిని ప్రేమ, ద్వేషములే యంత్యపరీక్షలు. కనుక దౌర్జన్యము అతితరచు నైతికముగ నన్యాయమేయై యాదృష్టిలో నుపద్రవకరమని భావింపబడినను అవియెల్లప్పుడును పట్లుండ నవసరములేదు.

జీవితమంతయు సంఘర్షణతోను, దౌర్జన్యముతోను నిండియున్నది; దౌర్జన్యము దౌర్జన్యమునే వృద్ధిచేయునట్లు కాన్పించును కనుకనది దానిని జయించు మార్గముకానేరదు. అయినను దానిని కేవలముకూడదనుటవలన జీవితముతో నెంతమాత్రమును సంబంధములేని శుద్ధశూన్యదృష్టి యేర్పడును. దౌర్జన్యము ఆధునిక రాజ్యాంగము యొక్కయు, సాంఘికపద్ధతియొక్కయు జీవగఱ్ఱయగుచున్నది. రాజ్యాంగముయొక్క నిర్బంధసామగ్రిలేనిదే పన్నులు వసూలుకాబడనేరవు,

భూస్వాములకు శిస్తులురావు, స్వంతఆస్తి మాయమగును. చట్టము, దానిసాయుధశక్తులతో స్వంతఆస్తిని యితరులనుండి కాపాడును. జాతీయప్రభుత్వము తన్ను సంరక్షించుకొనునట్టియు, విజృంభించునట్టియు దౌర్జన్యమువలన నిలిచియుండును.

గాంధీజీయొక్క దౌర్జన్యరాహిత్యము నిశ్చయముగ కేవలము శూన్యవ్యాపారము కాదనుట సత్యము. అది యెదురాడకుండుట కాదు. అది దౌర్జన్యరహితమైన తిరుగబాటు; చాల భిన్నమైన విషయము. అది యాచరణరూపమైన, సచేతనమగు కార్యవిధానము. అది వర్తమాన స్థితికి పిల్లివలె లొంగిపోవు వారికొరకుద్దేశింపబడలేదు. అది 'సంఘములో కల్లోలమును' కలిగించుటకే సృష్టింపబడి తద్వారా వర్తమాన పరిస్థితులను మార్చును. దాని వెనుకనున్న మార్పుచేయు యుద్దేశ్యము లేవియైనను ఆచరణలోనది బలీయమైన బలాత్కారసాధనము (అది యత్యంత నాగరికముగను, అతితక్కువ యభ్యంతరముండు విధమునను ప్రయోగింపబడినను) అయ్యెను. గాంధీజీ తన మొదటి వ్రాతలలో 'బలవంతపరచుట' యనుపదమును సాక్షాత్తు యుపయోగించెను. 1920 లో వైస్రాయి (షెల్మ్సుఫర్డు) పంజాబు సైనికశాసన దురంతములను గురించిచేసిన యుపన్యాసమును విమర్శించుచు నతడిట్లు వ్రాసెను. కౌన్సిలును ప్రారంభించునపుడు వైస్రాయిగారిచ్చిన యుపన్యాసము అతనితోను, యతని ప్రభుత్వముతోను ఆత్మగౌరవము కలవారు సంబంధము కలిగియుండుట కసాధ్యమగు మానసిక దృక్పథమును చూపుచున్నది.

"పంజాబుమీద చేసినవిమర్శలు పరిహారమును నిర్మొగమాటముగ నిరాకరించినట్లు విశదముచేయుచున్నవి. సన్నిహిత'భవిష్యత్తు'కు సంబంధించు సమస్యలమీద కేంద్రీకరింపుడు! అని యాయన మనకు హితవొసగును. పంజాబు దురంతములవిషయమై పశ్చాత్తాపపడునట్లు ప్రభుత్వమును బలవంతపరచుటయే సన్నిహితభవిష్యత్తు..."

జాతితో జాతియు, తరగతితో తరగతియు పోరాడు ప్రస్తుతపరిస్థితులలో దౌర్జన్యమును, అసత్యమును విధాయకములుగ కాన్పించుచున్నవి. తమయధికారమునకును, హక్కులకును అంటిపెట్టుకొని యుండగోరుచు తాము అణచివేయునట్టి ప్రజలకభివృద్ధిచెందు యవకాశములను నిరాకరించు హక్కులుగల జాతులును, తరగతులును దౌర్జన్యము, బలవంతము, అసత్యముమీద నాధారపడవలెను. ప్రజాభిప్రాయ మభివృద్ధియగుచు నీసంఘర్షణలయొక్కయు, నవిచేయునట్టి యణచివేయుటలలోనున్న యధార్థములును, అంతకంతకు బహిర్గతమైనకొలది దౌర్జన్యము తగ్గుట సాధ్యముకావచ్చును. యథార్థమునకు నవీన యనుభవమంతయు తద్వ్యతిరేకమునే తెలుపుచున్నది. వర్తమానసంస్థలపై నవాలు హెచ్చినకొలది దౌర్జన్యము పెరుగుచున్నది. బాహ్యమగు దౌర్జన్యము తగ్గినచోట కూడ నది మరింత యుపద్రవకరములైన సూక్ష్మరూపములను దాల్చుచున్నది. జ్ఞానాభివృద్ధిగాని, మతదృష్టిగాని, నీతిగాని యేవిధముగను యీ దౌర్జన్యస్వభావము నణంపజాలకపోయెను. వ్యక్తులు అభివృద్ధిచెంది మానవప్రమాణములో నుత్థితులైరి. బహుశః నేను చరిత్రలో మున్నెన్నడును లేనంతమంది యుత్తమజాతిపురుషులు (పురుషోత్తము మాదిరి తప్ప) కలరు; సంఘము మొత్తముమీద నభివృద్ధిచెంది పురాణ మాటవిక స్వభావమును నియమించుటకు బహుస్వల్పముగ ప్రయత్నింప నారంభించెను. కాని, వర్గములును, కులములును మొత్తముమీద నెక్కువగ నభివృద్ధి చెందలేదు. వ్యక్తితో నెక్కువ నాగరికుడగుచు తన యనేక యాదిమరాగాదులను, చెడుగులను సంఘమునకు బదిలీచేసెను. దౌర్జన్య మెప్పుడును నైతికముగ రెండవరకము వ్యక్తులనే యాకర్షించును. కనుక నీ సంఘములయొక్క నాయకులు అరుదుగ యుత్తమ స్త్రీ పురుషులగుదురు.

ప్రభుత్వమునుండి యధమాధమరూపములలోనున్న దౌర్జన్యము క్రమముగ తగ్గింపబడునని యనుకొన్నను పరిపాలనకును, సాంఘిక

జీవితముకును కొంత నిర్బంధ మవసరము అను సంగతిని నిర్లక్ష్యము చేయుట యసంభవము. సాంఘిక జీవితమున కేదో యొకవిధమగు ప్రభుత్వ ముండవలెను. ఈవిధముగ నధికారములో నుంచబడువారు సంఘమున కపకారము చేయునట్టియు, స్వతః స్వార్థపూరితమైనట్టియు వ్యక్తులయొక్కయు లేక వర్గములయొక్కయు స్వభావముల నన్నింటిని వారింపవలెను. సాధారణముగ వారు అవసరమును మీరి వర్తించెదరు. ఏలనన యధికారము మనలను పతితులను, అవినీతిపరులను చేయును. కనుక ఆపరిపాలకులు స్వేచ్ఛ నెంత ప్రేమించి, నిర్బంధము నెంత ద్వేషించినను ఆ ప్రభుత్వములో ప్రతి మానవుడును కేవలము స్వార్థరహితుడై, ప్రజాసామాన్య శ్రేయస్సు నభిలషించు పరిపూర్ణుడగువరకు తిరుగుబాటుచేయు వ్యక్తులపై నిర్బంధము నుపయోగింపవలసియుండును; దండయాత్రలను చేయుచుండు బాహ్యజాతులపైన కూడ వారు నిర్బంధమును ప్రయోగింపవలెను; అనగా దౌర్జన్యమును దౌర్జన్యముతో నెదుర్కొని యాత్మరక్షణను చేసికొనవలెను. ఏకైక ప్రపంచ ప్రభుత్వమున్నప్పుడు మాత్రమే దీని యవసరముండదు.

కనుక నీవిధముగ నాంతరంగిక మైక్యములకును, బాహ్యసంరక్షణకును నిర్బంధ, దౌర్జన్యము లవసరమగునపుడు మన మెచ్చట గీత గీయవలెను ? రాజకీయములకు మన మీ విధికృతమగు నైతికామోదము నొకసారి యిచ్చితిమా దౌర్జన్యరహిత నిర్బంధమును, దౌర్జన్య సహిత నిర్బంధమును లేక ప్రభుత్వనిర్బంధమును, విప్లవకారుల నిర్బంధమును (సాంఘిక మైక్యమునకు నిర్బంధమవసరమగు పరికరముగ నంగీకరింపబడెను.) సంపూర్ణముగ వేరుచేయుట సాధ్యముకాదని హైను హార్ల్డునీబరు సూచించుచున్నాడు.

లోపభూయిష్టమగు నీ ప్రపంచములో నేజాతీయప్రభుత్వమైనను స్వీయరక్షణకొరకు (పైవారిదాడులనుండి) దౌర్జన్యము నుపయోగింప

వలసి యుండునని గాంధీజీ యొప్పుకొనునని (ఇది నాకు నిశ్చయముగ తెలియదు) నేననుకొనెదను. ప్రభుత్వము నిశ్చయముగ తన యిరుగు పొరుగు ప్రభుత్వములపట్ల పరిపూర్ణమైన శాంతియుత మిత్రనీతి నవలంబింపవలెను; అయినప్పటికిని, దాడి సంభవింపనే సంభవింపదనుట మూర్ఖత్వము. అది నిర్బంధ స్వభావము గల కొన్ని చట్టములను కూడ చేయవలెను; అనగా వివిధ తరగతులనుండియు, వర్గములనుండియు కొన్ని హక్కులను, అధికారములను తీసికొని వాని స్వేచ్ఛాక్రియలను నిరోధించవలెను. చట్టములన్నియు కొంతవరకు నిర్బంధయుతములు. కాంగ్రెసు యొక్క కరాచీ తీర్మానము "ప్రజాదోపిడిని సమాప్తము చేయుటకు మాడుచున్న లక్షలకొలది ప్రజలయొక్క యథార్థమైన యార్థికస్వేచ్ఛ కూడ రాజకీయ స్వేచ్ఛలో నిమిడి యుండవలెను" అని శాసించెను. వాంఛనీయమైన యీ భావమును సఫలము చేయుటకు యెక్కువ హక్కులున్నవారు వానిని తక్కువ హక్కులున్నవారి కిచ్చి వేయవలసి యుండును. మరియు పనివాండ్రకు జీవించుట కవసరమైన కూలియు ననేక యితర సౌకర్యములును యుండవలెను: ఆస్తిమీద ప్రత్యేకపన్నులు విధింపబడును. "ప్రభుత్వము ప్రధానపరిశ్రమలను, సేవలను, ఖనిజసంపత్తును, రైల్వేలను, నీటివనరులను, నావికాది రవాణా సౌకర్యములను కలిగి యుండవలెను. లేదా నియమింపవలెను." మరియు "మత్తుపదార్థములు, పానీయములు సంపూర్ణముగ నిషేధింపబడవలెను." అని శాసించెను. అనేకమంది ప్రజలు దీనినంతను ఆక్షేపింపవచ్చును; వారు అధికసంఖ్యాకుల యిచ్ఛకు లొంగవచ్చును; కాని, యుల్లంఘనమువలన కలుగు ఫలితములకు భయపడియే వారట్లు చేయుదురు. నిశ్చయముగ ప్రజాస్వామికమనగా నల్పసంఖ్యాకు లధికసంఖ్యాకులచే నిర్బంధింపబడుటయేయగును.

ఆస్తియొక్క హక్కులను మార్చునట్టి లేక చాలవరకు లాగి వేయునట్టి చట్టమును అధికసంఖ్యాకు లామోదింతురు. అది నిర్బంధ

మను కారణముచే నాక్షేపించబడవలసినదేనా? ఎన్నిటికిని కాదు. అన్నిప్రజాస్వామిక చట్టములలోను యీపద్ధతి యవలంబింపబడును; కనుక నిర్బంధమను కారణముచే నాక్షేపించుటకు వీలులేదు. అధిక సంఖ్యాకులు అవినీతిగను, అన్యాయముగను వర్తించుచున్నారని చెప్ప వచ్చును. అధికసంఖ్యాకు లామోదించిన చట్టము నైతిక సూత్రమును దేనినైనను అతిక్రమించెనా? యనునదే విచారణీయాంశము. దీనిని నిశ్చయింపవలసినవారెవరు? వ్యక్తులును, వర్గములును తమనిజప్రయోజనముల ననుసరించి ధర్మసూక్ష్మములను నిర్ణయించునెడల ప్రజాస్వామిక పద్ధతియంతరించును. (స్వంతఆస్తి యుండుటవలన (అతినియమితభావములోతప్ప) వ్యక్తులకు సంఘమంతటిమీదను ఉపద్రవకరమైన యధికారము కలుగునని నేనుభావింతును. కనుకనవి సంఘమున కత్యంతాపకారియగును. అది త్రాగుడుకంటెకూడ (ఇది సంఘముకంటె నెక్కువగ వ్యక్తినిపాడుచేయును) నెక్కువ యవినీతికరమని నేను భావింతును.)

దౌర్జన్యరాహిత్యమునందు విశ్వాసముకలదనిచెప్పుకొనుకొందరు యజమానుల సమ్మతిలేనిదే స్వంతయాస్తిని ప్రభుత్వవశముచేసికొను ప్రయత్నము నిర్బంధమగుననియు కనుక దౌర్జన్య రాహిత్యమునకు వ్యతిరేకమనియు నాతోచెప్పిరి. తమశిస్తులను బలవంతముగ వసూలు చేసికొనుటలో ప్రభుత్వసహాయమును పొందుట కెంతమాత్రమును జంకని పెద్దజమీందారులును, తమభూములలోస్వతంత్రలేబరుసంఘము లుండుటకు గూడ ననుజ్ఞనీయని యనేకఫ్యాక్టరీ ఖామందులైన పెట్టుబడి దారులును యీభావమును నాకు శ్రుతపరచిరి. ఫలితము ననుభవించు వారిలో నధికసంఖ్యాకులు మార్పును కోరుచున్నారను విషయము చాలదట! దానివలన నష్టము పొందువ్యక్తులనే మార్పుచేయవలెను. ఈవిధముగ స్వార్థములుగల కొద్దిమంది స్పష్టముగ కావలసినమార్పును అరికట్టవచ్చును.

చరిత్రి తెలుపునది యేదైనను యున్నచో నది యార్థికప్రయోజనములే తరగతులయొక్కయు, వర్గములయొక్కయు రాజకీయభావములను నిరూపించునని తెలుపును. హేతువుకాని, నైతికోద్దేశ్యములుగాని ప్రయోజనములను అణచివేయజాలవు. వ్యక్తులు మారవచ్చును; వారు తమప్రత్యేకహక్కులను విడిచిపెట్టవచ్చును; (ఇదియరుదు.) కాని, తరగతులును, వర్గములును అట్లుచేయవు. పరిపాలించునట్టియు, హక్కులు కలిగినట్టియు తరగతిని (వానిని విడిచిపెట్టునట్లు) మార్చు ప్రయత్నమింతవరకెల్లప్పుడును విఫలమయ్యెను కనుకనది యికముందు జయింపగలదనుట కెట్టికారణములును కాన్పింపవు.

ఒకతరగతినిలేక జాతిని కేవలముమార్పుచేతుమనుటయు, సంఘర్షణను సహేతుకవాదముచేతను, న్యాయముచేయమనిప్రార్థించుటచేతను నిర్మూలింప వచ్చుననుటయు నాత్మవంచనయగును. బలవంతమువంటి తగినంతవత్తిడి లేనిదే పరిపాలనచేయునట్టి యధికారపూరిత ప్రభుత్వము దేశముమీదతనపరిపాలనను వదలుననుకొనుటయు, నొకతరగతి తన యున్నతస్థితిని, హక్కులను విడిచిపెట్టు ననుకొనుటయు వట్టిభ్రమలు.

గాంధీజీ స్పష్టముగ నావత్తిడినే (అదిబలవంతమని యతడు పిలువకపోయినను) ప్రయోగింపగోరును. అతనిపరికారము, ఆత్మబాధయే యతనిపద్ధతి. దీనిలో మానసిక స్వభావముండుటచేతను, కొలుచుటకును, తూచుటకును, మరేస్థూలపరిమాణముచేతను గ్రహించుటకును వీలులేకపోవుటచేతను దీనిని భావించుట కొంతకఠినమైన విషయము. శత్రువునిది కంగారుపరచుననుట కెట్టిసందేహమునులేదు. ఇది వాని నైతిక మర్మములను బహిర్గతమొనరించును; వానిస్థైర్యమును చెదరగొట్టును; వానిలోనున్నసర్వోత్తమమైనదానిని స్పృశించును. సమాధానమునకు ద్వారమును తెరచియుంచును. ఆత్మబాధయు, ప్రేమమార్గమును శత్రువులోను, చూపరులలోనుకూడ శక్తివంతమైన మానసిక, యాధ్యా

త్మిక భావముల నుత్పన్నము చేయుననుట కెట్టిసందేహమునులేదు. అడవిజంతువును సమీపించువిధములో చాలభేదముండునను విషయము వేటకాండ్రికందరకును తెలియును. అది దూరమునుండియే వేటకాని బింకమునుగ్రహించి తదనుగుణ్యముగ వర్తించును. అతనిలో చీమ కాలంత భయమున కాస్పదముండుచో (దానినతడే గుర్తింపకపో వచ్చును) అది యెట్లో యామృగమునకు చేరి యతనిలో భయమును పుట్టించును; ఈసమయములో నదివానిపై కురుకును. సింహమును మచ్చిక చేయువాని స్థైర్యమొక్కనిమిషము చెదరెనా యతడువెంటనే యెదుర్కొనబడును. ఏమాత్రమును భయములేనిమనిషికి యడవిమృగముల వలన నపాయము కలుగజాలదు. కనుక మానవులు యీమానసిక ప్రేరేపణలకులోబడుట సహజము. కాని, వ్యక్తులట్లులోబడినను, వర్గమును, తరగతియు నట్లుచేయుట సందేహాస్పదము. ఆతరగతికి (మొత్తము మీద) రెండవపక్షముతో సన్నిహితసంపర్కము, ప్రత్యక్షసంబంధము నుండజాలదు; అది వినునట్టి నివేదికలుకూడ నసంపూర్తిగను, వికారముగను నుండును. ఏదిజరిగినను దానియధికారమును ధిక్కరించు యేవర్గముమీదనైనను అప్రయత్నముగ కలుగు కోప మత్యధికమగుటచే నది చిల్లరభావముల నన్నింటిని మ్రింగివేయును. తనయుత్తమాధికారమును, హక్కులును సాంఘికశ్రేయస్సు కవసరమను భావమును చిరకాలమునుండి యలవడిపోవుటచే వ్యతిరేకమగు నేయభిప్రాయమైనను మతభ్రష్టతవలెనుండును. న్యాయము, క్రమము, వర్తమానస్థితిని సంరక్షించుట ప్రధానగుణములగును; వానిని సవాలుచేయు ప్రయత్నములు గొప్పపాపములగును.

కనుకవ్యతిరేకవర్గముకు సంబంధించినంతవరకు పరివర్తన విధానము మందముగనుండును. నిశ్చయముగ నొక్కొక్కప్పుడు వారిశత్రువుయొక్క సాధుత్వమును; పాపసత్వము (వారిని తప్పుమార్గములోనికి

దింపునట్లు కాన్పించును కనుక) వారికి మరింత కోపమును కలుగ చేయును; తాను తప్పుచేసియుండవచ్చునని యొకవ్యక్తి సందేహింప నారంభించునో నతనిధార్మికాగ్రహ మభివృద్ధియగును. అయినప్పటికిని దౌర్జన్యరాహిత్యశాస్త్రము యెదిరిపక్షములోని చెదురు వ్యక్తులను మార్చి, తద్వారా ప్రతిపక్షబారుధ్యమును తగ్గించును. ఇంతకంటె నెక్కువగనది తటస్థుల సానుభూతి నాకర్షించును; అది ప్రపంచాభిప్రాయమును మార్చు బలీయమైన యుపకరణము. కాని, పరిపాలన చేయువర్గము వార్తలను పైకిపోకుండచేయవచ్చును; లేదా వికారపరచవచ్చును. అది ప్రచురణచేయు యేజెన్సీలను నియమించును కనుక యథార్థములను తెలియకుండ చేయగలదు. దౌర్జన్యరాహిత్యపద్ధతి యవలంబింపబడు దేశములోనున్న యుదాసీనులగు నధికసంఖ్యాకులైన ప్రజలమీదనే యీశాస్త్ర మద్భుతముగ పనిచేయును. వారు నిశ్చయముగ మారుదురు; దానియెడల నత్యుత్సాహమును చూపుదురు. కాని, వారదివరకే యీలక్ష్యమును సాధారణముగ నామోదించిరి కనుక వారిలో విశేషమార్పు అనవసరమేలేదు. మార్పుకు భయపడువారిలో నంతస్పష్టమగు ఫలితము కాన్పించదు. భారతదేశములో నసహాయోద్యమమును, శాసనోల్లంఘనమును శీఘ్రముగ వ్యాపించుటవలన దౌర్జన్యరహిత యుద్యమ మధికసంఖ్యాకులపై నెంతశక్తివంతముగ పనిచేయునో, సందేహాస్పదుల నెట్లు మార్చివేయునో విశదముచేసెను. అది దానికి మొదటనుండి వ్యతిరేకులైనవారి నెక్కువ మార్పుచేయలేదు. ఉద్యమముయొక్క విజయము నిశ్చయముగ వారిభయములను వృద్ధిచేసి వారిని మరింత వైరులను చేసెను.

ప్రభుత్వము తనస్వేచ్ఛనురక్షించుకొనుటకు దౌర్జన్యము నుపయోగించుట న్యాయమని యొప్పుకొనబడినచో ఆస్వేచ్ఛను సాధింప యుత్నించుటలోకూడ నదేవిధమున నదియేల న్యాయముకాదో యుద్ధ

ముకాకున్నది. దౌర్జన్యపద్ధతి వాంఛనీయము కాకపోవచ్చును, పొసగక పోవచ్చును. కాని, యది సుతరాము యక్రమమును, నిషిద్ధమును కాజాలదు. సాయుధసైన్యములన్నియు ప్రభుత్వవశములోనున్నవను విషయ మొక్కటియే దానినుపయోగించుటకు వారికెక్కువ హక్కును స్థిరపరుపజాలదు. దౌర్జన్యరహిత విప్లవము జయించి ప్రభుత్వమును వశపరచుకొనినచో దౌర్జన్యమును ప్రయోగించుటకు దానికిదివరకు లేనిహక్కు వెంటనేకలుగునా? దానియధికారముమీద తిరుగుబాటు కలుగుచో నది దానినెట్లు యెదుర్కొనును? దౌర్జన్యపద్ధతుల నుపయోగించుటకది సహజముగ యిష్టపడదు; అది యన్ని శాంతియుత పద్ధతులచేతను పరిస్థితిని సాధింపయత్నించును; కాని, యది దౌర్జన్యము నుపయోగించు హక్కును వీడజాలదు. మార్పుకు యిష్టపడని ప్రతికూలురు ప్రజలలో నిశ్చయముగనుందురు. వారు పూర్వస్థితికి పోవలెనని ప్రయత్నింతురు. తమ దౌర్జన్యము నూతన ప్రభుత్వ సాయుధబలముచే నణచివేయబడదని భావింపబడుచో వారు దానిని మరింతజోరుగ నుపయోగింతురు. కనుక దౌర్జన్యమునకును, దౌర్జన్యరాహిత్యమునకును మార్పుకును, బలవంతమునకును మధ్య నొక కచితమైన గీతగీయుట యసాధ్యమని తోచుచున్నది. రాజకీయమార్పుల సందర్భములోనే యథార్థమైన కష్టము కలదు. హక్కులుకల తరగతికిని కొల్లగొట్టబడు తరగతికిని మధ్య నది మరింత కష్టతరమగును.

ఒకలక్ష్యముకొరకు బాధపడుట యెల్లప్పుడును మెప్పునడసెను; లొంగిపోకుండను యెదుటబాధింపకుండను నొకధర్మముకొరకు బాధపడుటలో నుదారతయు, గొప్పతనమును కలవు. అయినను, దీనిని బాధకొరకే బాధపడు సిద్ధాంతమునుండి వేరుచేయు రేఖ యతిసున్నితమైనది. ఈ రెండవరకపు యాత్మబాధ యొక్క వెర్రిక్రిందను, కొంతపరువుతక్కువ వ్యాపారముక్రిందను పరిగణింపవచ్చును. దౌర్జన్యము తరచు పాపిష్టి

దగుచో ద్వాజన్యరాహిత్యము, (అథమము దాని వ్యతిరేక భావము లలోనైనను) మరియొక తప్పిదమును చేయవచ్చును. పిరికితనమునకును, నిర్వ్యాపారత్వమునకును, వర్తమానస్థితిని నిల్పుకొనుటకును ద్వాజన్య రాహిత్యము నొకమిషగాచేసికొను నవకాశముకూడ యెల్లప్పుడును కలదు.

గొప్పసాంఘిక మార్పులు కలుగవలెనను భావముకు భారత దేశములో ప్రాధాన్యత వచ్చిననాటినుండియు నట్టిమార్పులకు విధాయకముగ ద్వాజన్యమవసరమనియు కనుక నవి పనికిరావనియు నొక వాదము బయలుదేరెను. తరగతులమధ్య పోరాటములను (అవియెంత యెక్కువగనున్నను) తలపెట్టరాదు; సంపూర్ణసహకారమను దృశ్యమును, ముందరనున్న యెట్టిలక్ష్యమునకైననువలసిన ద్వాజన్యరహిత యభివృద్ధిని యవి మలినపరచును. ఎదోయొకస్థితిలో ద్వాజన్యములేని దే సాంఘిక సమస్యాపరిష్కారము జరుగనేరదనుట సంభవమే కావచ్చును; హక్కులుగల తరగతులు తమ యుత్కృష్టస్థితిని రక్షించుకొనుటకు ద్వాజన్యము నుపయోగించుటకు సందేహింపరనుట నిశ్చయము. ద్వాజన్యరాహిత్య శాస్త్రముద్వారా, సిద్ధాంతములో, గొప్పరాజకీయమార్పును సాధింపగలుగుచో దానితోనే సాంఘికమార్పునుకూడ నేలసాధింపజాలము? రాజకీయస్వేచ్ఛను, బ్రిటిషుసామ్రాజ్యమును తొలగించుటయు మనము ద్వాజన్యరహితముగ సాధింపగలిగినపుడు ఫ్యూడల్ సంస్థానములు, భూస్వాములు, తక్కిన సాంఘికసమస్యలు-మొదలగు వానినికూడ నావిధముగనే యేలపరిష్కరింపజాలము? ఇదియంతయు ద్వాజన్యరాహిత్యముగ సాధ్యమగునాకాదా యనునది యెక్కువ సమస్యకాదు. ఈ రెండును దానిచేసాధింపబడవచ్చును. లేనిచో రెండునుసాధింపబడనేరవు. ద్వాజన్యరాహిత్యపద్ధతి విదేశపాలకునిమీదనే వినియోగించుననిచెప్ప బడజాలదు. దానిని దేశములోని స్వజాతీయ స్వార్థప్రయోజనములు

మీదను, ప్రతీకారులమీదను వినియోగించుట యెక్కువసుకరము; ఏలనన వారిమీద కలుగు మానసికఫలితము యితరులమీద కలుగు దానికంటె నధికముగనుండును.

దౌర్జన్యరాహిత్యమునకు విరుద్ధములని యనుకొనబడి లక్ష్యములను, నీతులను భారతదేశములో గర్హించు నవీనస్వభావము అట్టిసమస్యల నుచితముగ యోచింపవలసినపద్ధతి తలక్రిందులు పద్ధతిగ నాకు కాన్పించును. అతియోగ్యమును, పటుతరమునునగు విధమున మమ్ము మాలక్ష్యమునకు తీసికొనిపోవునని దౌర్జన్యరాహిత్యపద్ధతి వాగ్దానము చేయుటచేత మేముపదిహేనేండ్లక్రితము దానినంగీకరించితిమి. అప్పుడు లక్ష్యము, దౌర్జన్యరాహిత్యము వేరువేరుగనుండెను. లక్ష్యము కేవలము దానితోకవలె లేకదానిఫలితమువలె నుండలేదు. స్వేచ్ఛలేక స్వాతంత్ర్యము దౌర్జన్యరాహిత్యముచే సాధ్యమైనయెడలనే ప్రయత్నింపబడవలెనని యప్పుడెవరును చెప్పియుండలేదు. కాని, యిప్పుడు మనలక్ష్యమే దౌర్జన్యరాహిత్యముచే పరీక్షింపబడుచున్నది. దానికి సరిపడనట్లు కాన్పించినయెడల త్రోసివేయ బడుచున్నది. కనుక దౌర్జన్యరాహిత్యభావము బిర్రబిగిసిన ధర్మపన్నముగు చున్నది. దానినిసవాలు చేయరాదు. ఈకారణముచే బుద్ధినొప్పింపగల దాని యాధ్యాత్మిక శక్తి తగ్గిపోవుచు నది మతము, విశ్వాసము అను గూళ్ళలో చేరిపోవుచున్నది. స్థాపించుకొనియున్న స్వార్థములకది జీవగఱ్ఱకూడనగుచు వర్తమానస్థితిని సంరక్షించుకొనుటకు దానిని కొల్లగొనుచున్నది.

ఇదిచాల విచారకరము. దౌర్జన్యరహిత విరోధభావములును, అట్టిసంగ్రామ శాస్త్రమును భారతదేశమునకును, తక్కిన ప్రపంచమునకును యమూల్యములని నేను భావించెదను. వీనినిగురించి యోచించునట్లు ఆధునికభావమును బలవంతపరచి గాంధీజీ గొప్ప సేవచేసెను. వానికి గొప్ప భవిష్యత్తుకలదని నేను విశ్వసించెదను. మానవలోకము

వానినిపూర్తిగ నవలంబించుటకు తగినంత యభివృద్ధి చెందకపోవచ్చును. "గ్రుడ్డివానికి నీదృష్టియను క్రొవ్వొత్తి నిచ్చెదవు." "కాని, దానినతడొక కర్రక్రింద నుపయోగించుటతప్ప మరెట్లు వినియోగింపగలడు?" ప్రస్తుతము యీదృష్టి తగినంతయుండక పోవచ్చును. కాని, యన్ని యుత్కృష్టభావములవలెనే దానిపలుకుబడి యభివృద్ధిచెంది యంతకంతకు మనకార్యములను మార్చివేయవచ్చును. అసహాయోద్యమము, దుష్టమని భావింపబడిన ప్రభుత్వమునుండి లేక సంఘమునుండి సహకారమును లాగివేయునట్టి యతిశక్తివంతమైనట్టియు సృజనశక్తి కలట్టియు భావము. నైతికసంపదకలవారు కొద్దిమంది దానినాచరించినను దానిఫలితము విస్తరించి దినదినాభివృద్ధి యగుచుండును. అధికసంఖ్యాకులలో బాహ్యఫలితముయెక్కువ విశదమగును. కాని, యితరకారణములు నైతికసారాంశమును మరుగుపరచవచ్చును. దానియొక్క విస్తృతి దానిగంభీరతను మార్చునట్లు కాన్పించును. సాముదాయికమానవుడు వ్యక్తినివెనుకకు త్రోసివేయును.

అయినప్పటికిని, శుద్ధదౌర్జన్య రాహిత్యమును వత్తుటచేత నది జీవితమునకు దూరమును, బాహ్యమును నగుచున్నది. ప్రజలలో దానిని గ్రుడ్డిగను, ఒకమతమువలెను నంగీకరించు లేక పూర్తిగ నిరాకరించు స్వభావము కలదు. వివేచనస్వభావము మూలకు త్రోయబడెను. 1920 లో భారతదేశ టెర్రరిస్టులపై నదిమంచిఫలితమును కలుగచేసెను. అనేకమంది యాసంఘమునుండి విరమించిరి; మిగిలినవారుకూడసందేహమనస్కులయి దౌర్జన్యకృత్యములను మానివేసిరి. దానికిప్పుడు వారిమీద నట్టిపలుకుబడిలేదు. అసహాయోద్యమములోను, శాసనోల్లంఘనములలోను ప్రధానపాత్రలను ధరించి, దౌర్జన్యరహిత పద్ధతియొక్క యంతరార్థముల కనువగునట్లు జీవించుటకు మనఃపూర్వకముగ ప్రయత్నించిన యనేకమందికాంగ్రెసువారుకూడ కాంగ్రెసులో

నుండ నష్టులుకారని కాంగ్రెసుభ్రష్టులవలె నేడు భావింపబడుచున్నారు. దౌర్జన్య రాహిత్యమునొక మతముగను, సిద్ధాంతముగను అంగీకరింప జాలకపోవుటయు, పోరాడుటకు తగిన యేకైకలక్ష్యమని వారు భావించిన సామ్యవాద ప్రభుత్వ లక్ష్యమును - అందుకును సమానమైన న్యాయము, సమానమైన యవకాశములు; ప్రస్తుతమున్న స్వంతఆస్తి హక్కులను, ప్రత్యేకాధికారములను చాలవరకు రద్దుచేసినప్పుడే యాచరణకురాగల యేర్పరింపబడిన సంఘమును-వీడకపోవుటయు వారుచేసిన పాపములు. గాంధీజీ యింకను మహాశక్తిసంపన్నుడు. అతని దౌర్జన్య రాహిత్యము చురుకుపాలుకలది, చైతన్యముతోనుట్టిపడు స్వభావము కలది. అతడు దేశమును తిరిగి యెప్పుడుద్దీపితము చేయునో యెవరికిని తెలియదు. అతని గొప్పతనము, అతని విరుద్ధములు, ప్రజలను కదల్చు యతని శక్తిఅపారములు-అతడు మామూలు ప్రమాణముల కతీతుడు. మన మితరులను కొలవేయునట్లు పరీక్షించునట్లు అతనిని కొలవేయజాలము, పరీక్షింపజాలము. కాని, యతనిశిష్యులమని చెప్పుకొనువారు చాలమంది పసలేని స్వస్తివాచకులు; లేక టాల్‌స్టాయిమాదిరి సాత్వికులు, లేక జీవితముతోను, సత్యముతోను సంబంధములేనియొకసంకుచిత సంఘముయొక్క కేవలసభ్యులు. వారు ప్రస్తుతక్రమమును నిలుపుకొన జూచువారి ననేకమందిని (దీనికొరకు దౌర్జన్యరాహిత్యముక్రింద శరణు జొచ్చువారిని) తమచుట్టును జేరతీయుదురు. ఈవిధముగ స్వార్థముజొరబడి, శత్రువును మార్చువిధానము, దౌర్జన్యరాహిత్యముపేరిట, నిజపరివర్తనముగ పరిణమించి శత్రువుతో నేకీభవించునట్లు చేయును. ఉత్సాహముతగ్గి,మనము దుర్బలులమైనప్పుడు కొంచెము వెనుకకు పోవలెనను స్వభావము, రాజీస్వభావము, యెల్లప్పుడునుండును. దీనిని శత్రువును త్రిప్పునట్టి కళయని పిలుచుట సుఖావహముగ నుండును ఒక్కొక్కప్పుడు మన పాతస్నేహితులను బలివేసి యాలస్థిని సంపాదింతుము. మన క్రొత్తస్నేహితులకు కోపమును కలిగించునట్టి వారి యధిక ప్రసంగము

లను, వాక్యములను గ్రహించి వారు మన బలగములోని యైక్యమును భంగము చేయుచున్నారని దూషింతుము. సాంఘిక క్రమములో యథార్థమైన మార్పును తెచ్చుటకు బదులు వర్తమాన పద్ధతిలోని యుదారతకును, దయకును ప్రశస్త్యమిత్తుము. ఉన్న స్వార్థములు యథాప్రకారముగనే యుండును.

పరికరముయొక్క ప్రాముఖ్యతను గురించి యెక్కువగ వత్తుట వలన గాంధీజీ మనకు గొప్పసేవచేసెనని నేను విశ్వసించెదను. అయి నప్పటికిని తుది మాటవిధాయకముగ మన దృష్టిలోనున్న లక్ష్యమును గురించియే యుండవలెను. మనము దానిని భావింపజాలనిచో స్పష్ట మైన లక్ష్యములేని దిమ్మరులమగుదుము. కాని, పరికరములను నిర్ల క్ష్యము చేయుటకు వీలులేదు. ఏలనన నైతికవిషయమటులుండ వానికి కార్యసాధకశక్తి కూడ కలదు. చెడ్డవియు, నవినీతికరములునునగు పరి కరములు తరచు దృష్టిలోనున్న లక్ష్యమునే విఫలము చేయును; లేదా యనేక క్రొత్తసమస్యల నుత్పన్నముచేయును. ఇంతకును మనము చాటునట్టి లక్ష్యముచేత గాక మన మవలంబించు పద్ధతులచేతనే యథార్థముగ పరీక్షింపబడుదుము. అనవసర పోరాటములకును, ద్వేష ములకును కారణమగు పరికరములవలన మన లక్ష్యమును సాధించుట మరింత కష్టమును, దూరమును నగును. సాధనమును, సాధ్యమును నిశ్చ యముగ నతివిశేష సంబంధమును కలిగియుండుటచే మనము వానిని వేరుచేయజాలము. గాంధీజీ నైతికశిక్షణమును కఠినముగ శాసించుట కూడ చాల యవసరము. కాని, వ్యక్తులకు సంబంధించిన యతని శిక్షా ప్రమాణములు చర్చనీయములు. అతడు సాంఘిక దోషములకంటె వ్యక్తిదోషములకును, లోపములకును విశేష ప్రాముఖ్యత నిచ్చును. దీని యవసరము స్పష్టముగనే యున్నది. ఏలనన యెడారిని వీడి ప్రత్యేక హక్కులు గల వర్గములతో నధికారస్థానములలో దూరవలెననేడు

మోహాసు అనేకమంది కాంగ్రెసు వారిని లాగివేసెను. ముఖ్యమైన కాంగ్రెసువాని కాద్వారమెప్పుడును తెరువబడియే యుండును.

నేడు ప్రపంచమంతయు వివిధములగు మున్మారముల పిడికిలిలో నున్నది. కాని యీ యన్నింటిలోను యాత్మవ్యాధి యతివిశేషముగ నున్నది. ఇది ముఖ్యముగ తూర్పు దేశములలో నున్నది. నవీనముగ నితరచోట్లకంటె ఆసియాలో నెక్కువ మార్పులు కలిగెను. వానికి సరిపెట్టుకొనవలసిన విధానము చాల బాధకరముగ నున్నది. పరిస్థితులను పరిపాలించుచున్న రాజకీయ సమస్య బహుశః యన్నిటికంటెను తక్కువ ప్రాముఖ్యతకలదిగ నున్నది. మనకిది ప్రధానసమస్య. యథార్థమైన సమస్యలను చేబట్టుటకు పూర్వము యిది తృప్తికరముగ పరిష్కరింపబడవలెను. మనము యుగములనుండి మార్పుచెందుచుండ నట్టి యొక మూలసాంఘికక్రమమున కలవడిపోతిమి. మనలో చాల మంది యదియొక్కటియే సాధ్యమును, యుక్తమును నగు సాంఘిక పునాది యని యింకను విశ్వసించుచు మన నైతిక భావములను దానితో మేళవింపజేయుచున్నాము. కాని, గతకాలమును వర్తమానముతో గుది గుచ్చవలెనను మనప్రయత్నములు (అదియట్లు కాకతప్పదు) విఫల మగును. "చివరకుగతిలేక ఆర్థికనీతులు ఆర్థికావసరములను కనిపెట్టుకొని యుండును" అనివెల్సురుచెప్పెను. నేటియవసరములు వానిపరికార మొక నూతననీతిని సృష్టించుకొనునట్లు మనలను బలవంతపరచును. మనమీ యాత్మవ్యాధినుండి బయటపడి నేటియథార్థమైన యాధ్యాత్మిక విలువ లను తెలిసికొనవలెననిన నేమతముయొక్క సిద్ధాంతముల వెనకను శరణుపొందక సారాంశములను నిర్మోగమాటముగను, ధైర్యముగను నెదుర్కొనవలెను. మతము చెప్పునది మంచిదికావచ్చును, చెడ్డది కావచ్చును; కాని, యది, దానిని చెప్పువిధమును, దానినిమనము విశ్వ సింపవలెననుటయు నిశ్చయముగ నేసమస్యను వివేచనతో యోచింప

వలెనను దానిని దోహదముచేయదు. ఫ్రాంక్ చెప్పినట్లు మతసిద్ధాంతములు "మూడు కారణములచే విశ్వసనీయార్హములగుచున్నవి. మొదటిది మనపితామహులిదివరకే వానిని విశ్వసించిరి; రెండవది యాప్రాచీన కాలమునుండియే మనకందచేయబడిన రుజువులు కలవు; వానియాథార్థ్యములను మనమెంతమాత్రమును శంకింపరాదని నిషేధింపబడినారము."

దౌర్జన్యరాహిత్యమును, తత్సంబంధములను మనము మతదృష్టితోను సిద్ధాంతదృష్టితోను విచారింపవలసినయెడల వాదమునకు స్థానముండదు. అదియొక తెగకు సంబంధించు సంకుచిత సిద్ధాంతముగ తయారగును. దానిని ప్రజలంగీకరింపవచ్చును, అంగీకరింపకపోవచ్చును. దానిశక్తియు, వర్తమాన సమస్యల కన్వయమును తగ్గిపోవును. కాని, ప్రస్తుత పరిస్థితులకు సంబంధించునట్లు మనము దానిని చర్చింప సంసిద్ధులమగుదుమేని యీప్రపంచమును పునఃసృష్టిచేయు మనయత్నములకది యెంతయో తోడ్పడగలదు. ఈచర్చలో సాముదాయికమానవునియొక్క స్వభావమును, దుర్బలత్వమును మనము పరిగణింపవలెను. బాహుళ్యముమీద జరుగు నేకార్యమైనను, ముఖ్యముగ గొప్పమార్పులను, విప్లవకరములగు మార్పులను కోరునేకార్యమైనను, నాయకులు దానినిగురించి యోచించువిధముననేగాక వర్తమాన పరిస్థితులనుబట్టియు నంతకంటె నెక్కువగ వారెవరితో పనిచేయుదురో యట్టి మానవలోకము దానిని భావించు విధమునుబట్టియు ఫలితమును బొందుచుండును.

ప్రపంచ చరిత్రలో దౌర్జన్యము విశేషపాత్రను వహించెను. నేడది తత్తుల్యమైన ప్రాముఖ్యతనే వహించుచున్నది; బహుశః చాల కాలమువరకు నది యట్లే చేయును. గతములో చేయబడిన మార్పులు చాలవరకు దౌర్జన్యముచేతను, బలవంతముచేతను చేయబడెను. డబ్ల్యూ. యి. గ్లాడ్‌స్టను ఒకసారి యిట్లు చెప్పెను. "రాజకీయవిషమ పరిస్థితు

లలో నీదేశప్రజలకు దౌర్జన్యమును ద్వేషించుట మరచిపోకుము; క్రమమును ప్రేమింపుము ఓర్పు వహింపుము అను సందేశములు తప్ప మరేవియు నీయబడనిచో నీదేశ స్వాతంత్ర్యము లెన్నటికిని సాధింపబడి యుండెడివి కావు ".

అప్పుడును, యిప్పుడును దౌర్జన్యముయొక్క ప్రాముఖ్యతను నిర్లక్ష్యముచేయుట సాధ్యముకాదు. అట్లుచేయుట జీవితమును నిర్లక్ష్యము చేయుటయే యగును. అయినను దౌర్జన్యము నిస్సందేహముగ చెడ్డది. అదిదానివెనుక నంతములేని చెడుఫలితములను విడిచిపెట్టును. తరచు దౌర్జన్యముతో నుండునట్టి ద్వేషము, కార్యము, పగ, శిక్షించుట- యనుభావములు దౌర్జన్యముకంటెను చెడ్డవి. నిశ్చయముగ దౌర్జన్యము వస్తుతః చెడ్డది కాదు; దానితోనుండు యీభావములచేతనే యది చెడ్డదియగుచున్నది. ఈభావములులేని దౌర్జన్య ముండవచ్చును; మంచిపనికిని, చెడ్డపనికినికూడ దౌర్జన్య ముండవచ్చును. కాని, యీ భావములనుండి దౌర్జన్యమును వేరుచేయుట దుర్ఘటము. కనుక సాధ్యమైనంతవరకు దౌర్జన్యమును తప్పించుట వాంఛనీయము. అయినప్పటికిని, దానిని తప్పించుటకుగాను అంతకంటె నెక్కువ చెడుగులకు లొంగిపోవునట్టి శూన్యస్వభావమును మనమంగీకరింపజాలము. దౌర్జన్యమునకు లొంగుట, లేక దౌర్జన్యముమీద నాధారపడిన యన్యాయ పరిపాలన నంగీకరించుట దౌర్జన్యరాహిత్యతత్త్వమునే వ్యతిరేకించుట యగును. దౌర్జన్యరాహిత్య పద్ధతి (తననుతాను సమర్థించుకొనుటకు) శక్తివంతముగనుండి యట్టి ప్రభుత్వమును, సాంఘికక్రమమును మార్చునట్టి శక్తినికలిగి యుండవలెను.

అది యట్లుచేయగలదో లేదో నాకు తెలియదు. అది మనలను చాల దూరము తీసికొనిపోగలదని నేను భావించెదను- కాని, యదిమనలను తుదిలక్ష్యమునకు తీసికొని పోగలదాయని నేను శంకింతును. అది

యెట్లుజరిగినను యేదోయొకవిధమగు నిర్బంధము విధాయకమనితోచును. సంఘములోనున్న ప్రస్తుతపోరాటములు, జాతీయములును, తరగతుల మధ్యవియును, నిర్బంధమువలనగాని యెన్నడును నిర్మూలింపబడనేరవు. నిశ్చయముగ పెద్దయెత్తున మార్పు యుండి తీరవలెను; ఏలనన విశేష జనము మారినగాని సాంఘిక పరివర్తనోద్యమమునకు నిజమైనయాధార ముండనేరదు. కాని, కొంతమందిమీద నిర్బంధముండును. ఈమూల విరోధములను దాచిపెట్టి యవిలేవని చూప యత్నించుట యుక్తము కాదు. అది సత్యమునణచి వేయుటయేగాక యథార్థములను గురించి ప్రజలను తప్పుమార్గమునపెట్టి వర్తమానక్రమమును ప్రత్యక్షముగ సమర్థించుటయగును; తమప్రత్యేకహక్కులను సమర్థించుకొన జూచు చున్న పాలకతరగతులకు నైతికాధారమునిచ్చుట యగును.ఒకయక్రమ పద్ధతి నెదుర్కొనుట కది యేయసత్య సిద్ధాంతములపై నాధార పడెనో వానిని బయటపెట్టి సత్యమును విశదముచేయవలెను. అసహా యోద్యమములోని యొకసుగుణమేమనిన నది యీయసత్య సిద్ధాం తములను బయల్పరచును.

తరగతులులేని సంఘమును స్థాపించుట మన పరమలక్ష్యము- అందరకును సమానమైన యార్థికన్యాయము, సమానమైన యవకాశ ములు, మానవలోకమును యున్నతమైన యార్థిక, వైజ్ఞానికస్థాయికి తెచ్చుటకేర్పాటు చేయబడిన పునాది మీద స్థాపింపబడు సంఘము, ఆధ్యాత్మికప్రయోజనములను, సహకారమును, స్వార్థరాహిత్యమును, సేవాతత్త్వమును, న్యాయమును చేయవలెనను కోరికను, సుహృద్భావ మును, ప్రేమను - ఈయన్నింటిని దోహదముచేసి చివరకు ప్రపంచ క్షేమమును, కళ్యాణమును సాధించు సంఘము. దీనికడ్డమువచ్చిన ప్రతిదానిని మెల్లగా తీసివేయవలెను; అవసరమైనచో బలవంతము నుపయోగింపవలెను. తరచు నిర్బంధమవసరమగుననుట కెట్టి సందేహ

మునులేదు. కాని, బలవంతమును ద్వేషముతోను, క్రౌర్యముతోను గాక నభ్యంతరమును తొలగింపవలెనను యుదాసీనకోరికతో నుపయోగింపవలెను. అదికష్టమేయగును. అది సులభమైన పనికాదు. సుకరమైన మార్గమేదియును లేదు; అసంఖ్యాకములగు గోతులు కలవు. కాని, కష్టములును, గోతులును మనమువానిని నిర్లక్ష్యముచేసినచో మాయమ కాజాలవు. వాని నిజస్వభావమును గ్రహించి మనమువానిని ధైర్యముగ నెదుర్కొనవలెను. ఇదియంతయు గగన కుసుమమువలెను, వాయు సౌధమువలెను కాన్పించవచ్చును. ఈ యుదార భావములచే ననేక మంది ప్రేరేపింపబడకపోవచ్చును. కాని, మనము దానిని దృష్టిలో నుంచుకొని వర్తించుండవచ్చును; క్రమముగ నవి మనలను నింపునట్టి ద్వేషములను, రాగములను తగ్గింపవచ్చును.

మనపద్ధతులు యీలక్ష్యమునకు తీసికొని పోవలెను, యీభావములమీద నాధారపడవలెను. కాని, మానవస్వభావము(సమూహముమీద) దానితత్త్వమునుబట్టి మన వినతులను, బోధలను యెల్లపుడును మన్నింపదనియు లేక నున్నత నైతిక సూత్రములనుబట్టి యాచరింపదనియు గుర్తింపవలెను. మార్పుకుతోడు తరచు నిర్బంధముకూడ నుండవలెను. ఈనిర్బంధమును నియమించి దానిచెడుగు తగ్గిపోవు విధమున నుపయోగించుటయే మనముచేయగల యుత్తమకార్యము.

---

## ౭౮

## తిరిగి ఢేరాజయిలు.



ఆలీపూరుజయిలులో నాస్వాస్థ్యముచెడి నాబరువు అధికముగ తగ్గుటచే నేను ఢేరాడూను జయిలుకు బదిలీచేయబడితిని. నాబదిలీకి నేను సంతోషించితిని. కాని, యీసారి నన్నొక బాగుచేసి యమర్చబడిన పాతగోడ్లశాలలోనుంచిరి. దానికొకవరాండా, చిన్నదొడ్డియుండెను. నాగది వెనుకటిదానికంటె బాగుగనున్నను యితరమార్పులు బాగుండ లేదు. నేనచ్చట మూడుమాసములున్నను నాకీషత్పర్వతదర్శనముకూడ లభింపలేదు. నాచుట్టునున్నగోడ వెనుకటికంటె బాగుగ యెత్తుచేయ బడెను. నన్ను వెనుకటివలె జయిలుద్వారముముందర తిరుగనీయలేదు. నాచిన్నదొడ్డియే నావ్యాయామమునకు చాలినంత పెద్దదియని భావింప బడెను.

ఇవియును, మరికొన్ని నూతననిర్బంధములును నాకాశాభంగ ముగ నుండెను; నాకు కోపముకలిగెను. నేను నిస్పృహుడనై నాకవ కాశమున్న యాకొద్దివ్యాయామమునుకూడ తీసికొన నిచ్ఛగింపకుంటిని. నేనుమున్నెన్నడును ప్రపంచముతో సంబంధమంతయు తెగిపోయి యుంత యేకాకిగనుండలేదు. దీనివలన నానరములు కృంగనారంభించి శరీర, మానసిక ధైర్యము నొందితిని. నాగోడకవతల కొన్నియడుగుల దూరములో రామణీయకత, పరిమళము, పచ్చికయొక్క సువాసన, కండ్లకింపునుగూర్చు భూమి, దూరములోని వృక్షవాటికలు కలవని నేనెరుగుదును; కానియవియన్నియు నాకందనిమాత్రికలు. ఎల్లప్పుడును ఆగోడలనే చూచుచుండుటచే నాకండ్లు అలసిపోయెను, జబువెక్కెను; నన్ను ప్రత్యేకముగనుంచుటచే జయిలులోనుండు మామూలు కదలిక కూడ నాకులేకుండెను.

ఆరువారములైన తరువాత వర్షములారంభించెను; ఉష్ణము తగ్గెను. వాతావరణము మారెను; నూతనజీవితము పొడసూపెను. నాశరీరము చల్లబడి విశ్రాంతినొందెను. కాని, నాకండ్లకును, మనస్సుకును విశ్రాంతిలేదు. ఒక్కొక్కప్పుడు నాదొడ్డి యినుపతలుపు తెరవబడుచుండెడిది. హఠాత్తుగ నాకు బహిఃప్రపంచము - వర్షములతో ప్రకాశించుచు ముత్యములవంటి వర్షబిందువులతో మెరయు పచ్చనిపొలములును చెట్లును-కాన్పించెడిది. ఒక్కక్షణికకాలము! ఇంతలో తలుపు దభాలున మూయబడెడిది. నేనుదగ్గిరనున్నచో మరింతజాగ్రత తీసికొనవలసినదని వార్డరుల కాజ్ఞలుండెడివి. ఆక్రొత్తదనము ఆపచ్చదనముయొక్క యీయాపద్దర్శనము నాకుస్వదేశభ్రాంతినికొల్పెడిది; హృదయవేదన కలిగెడిది. తలుపుతెరువబడిననుకూడ నేనవతలకు చూచుట మానివేయగోరితిని.

కాని, యీవిచారమంతయు, (నడకొంత దోహదముచేసినను) జయిలుదోషముకాదు. బయట విషయములేవియును బాగుండలేదు. కమల యనారోగ్యముగనుండెను; రాజకీయములు నాకు బాధకరముగ నుండెను. కమలయొక్క పురాణవ్యాధి ముదురుచుండెను. నేనామెకేమియును సేవ చేయజాలని యసహాయుడనైతినని విచారించితిని. నేనామెప్రక్కనున్నచో పరిస్థితులు వేరుగ నుండెడివని నేనెరుగుదును.

ఇచ్చట నాకు దినపత్రికవచ్చెడిది. మూడుసంవత్సరములైన తరువాత పాట్నాలో అ. భా. కా. కమిటీ సమావేశమయ్యెనని తెలిసికొంటిని. పరిస్థితులనుగురించి పూర్తియైన చర్చలు జరుగకపోవుట నాకాశ్చర్యముగనుండెను. గాంధీజీ యెప్పటివలెనే (దూరమునుండి) డిక్టేటరువలెకాన్పించెను. "మీరు నానాయకత్వము ననుసరింపగోరుచో నాషరతుల నంగీకరింపవలెను" అనియతడుచెప్పెను. అతనికోరిక చాల [illegible]

దృఢవిశ్వాసములకు వ్యతిరేకముగ నడువమని చెప్పజాలము. పరస్పర చర్చలుజరిపి యొకనీతినంగీకరించుటకంటె పైబలవంత మెక్కువగ నున్నట్లు కాన్పించెను. గాంధీజీ భావమును రాజ్యముచేయుచు ప్రజల యసహాయతనుగురించి ఫిర్యాదుచేయుట చిత్రముగనుండును. బాహుళ్య ముమీద నతనిపట్ల చూపబడిన భక్తి, వినయ విధేయతలు మరెవరి పట్లనుచూపబడలేదని నేననుకొనెదను. ప్రజలు తమకొరకతనిచే నియ మింపబడిన యున్నతప్రమాణమును, చేరజాలకపోయిరని నిందించుట యుక్తముగ కాన్పించదు. హరిజనోద్యమప్రచారములో నుండుటచే నతడుపాట్నాలో సభపూర్తియగువరకుకూడ నుండలేదు. అ. భా. కా. కమిటీ వ్యవహారదక్షతను చూపవలెననియు వెంటనే వర్కింగుకమిటీ వారి తీర్మానముల నమలుపరుప వలెననియుచెప్పి యతడు వెళ్లి పోయెను.

దీర్ఘచర్చలవలన విషయములు చక్కబడనేరవనుట బహుశః నిజము. సభ్యులలో నిశ్చయభావములు లేకుండెను. విమర్శించువారే కాని నిర్మాణసూచనలను చేయువారులేరు. శాసనోల్లంఘన మాపి వేయబడుటకే నిశ్చయింపబడెను. తరువాత నేమిజరుగవలెను? రెండు కక్షలు బయలుదేరెను. ఒకరు చట్టసమ్మతమైన కార్యములను చేయ వలెననిరి. రెండవవారు అస్పష్టసాంఘికవాదపద్ధతిని భావించుచుండిరి. సభ్యులలోని యధికసంఖ్య యిరుకక్షలకును చెందరు. వారు చట్టసమ్మత కార్యములకు మరలుట కిచ్చగింపరు; సామ్యవాదమనిన భయము; సృజన భావములులేవు. వారికి గాంధీజీయే జీవగఱ్ఱ. వెనుకటివలెనే వారతని ననుసరించిరి. గాంధీజీబలమువలన మితవాదచట్టసమ్మత కార్యవాదులకు కమిటీలోను కాంగ్రెసులోను బలముకలిగెను.

ప్రభుత్వము కాంగ్రెసుపై నిషేధమును తొలగించుటచే నది క్రమ సంఘమయ్యెను. కాని; దానిక్రిందిసంఘములును, తత్సంబంధ

సంఘములును-వాలంటీరుశాఖ, సేవాదళము, కిసానుసభలు, (ఇవి యుక్తస్వతంత్రరయితుసంఘములు) అనేక విద్యాసంస్థలు, యువజనసంఘములు, (ఇందులో నొకపిల్లల సంఘముకూడకలదు) యినన్నియునింకను బహిష్కారములోనేయుండెను. ప్రత్యేకము 'ఖుదైఖిద్మత్ గర్సు' లేక 'సరిహద్దు యెర్రచొక్కాలు' నిషేధములోనుండెను. ఇది 1931 లో కాంగ్రెసులోజేరి యారాష్ట్రప్రాతినిధ్యమును వహించెను. ఈవిధముగ కాంగ్రెసు ప్రత్యక్ష కార్యవిధానమును మానుకొనినను ప్రభుత్వము శాసనోల్లంఘనము కొరకేర్పరచిన ప్రత్యేకశాసనముల నమ్లేయుంచెను. లేబరు యూనియనులమీదను, రయితుసంఘములమీదను, ప్రత్యేకనిఘాయుంచి యున్నతమప్రభుత్వాధికారులు జమీందారులను, భూస్వాములను యేకముకావలెనని ప్రోత్సహించుచుండిరి.

హిందూ, ముస్లిము కులతత్వముల యెడల నేనెన్నడును పక్షపాతమును వహింపలేను. హిందూమహాసభ కార్యదర్శియొకడు "యెర్రచొక్కాల" నిషేధము నామోదించుచు ప్రభుత్వభుజమును తట్టుటచే నాకాసభపై మంటపుట్టెను. ఒడుదుడుకు యుద్యమమేదియునులేనపుడు యీప్రాతిపదిక నాగరిక హక్కులనులాగివేయుటను ఆమోదించుట నాకాశ్చర్యమును కలిగించెను. ఈసిద్ధాంతము సంగతి యట్లుండ యీ సంగ్రామ సంవత్సరములలో సరిహద్దు ప్రజలత్యద్భుతముగ ప్రవర్తించిరనుట జగద్విదితము. వారినాయకుడు ఖాన్ అబ్దుల్ గఫర్ఖాన్ యింకను విచారణలేకుండ ప్రభుత్వఖయిదీగ జయిలులోనుండెను. కుల ద్వేషము లింతకంటె ముందుకుపోజాలనట్లు నాకుకాన్పించెను. హిందూమహాసభా ప్రధాననాయకులు యీభావమునంగీకరింపనట్లు వెంటనే ప్రకటింతురని నేనాశించితిని. కాని, నాకుతెలిసినంతవరకు దీనినిగురించి వారెవరును పల్లెత్తుమాట రానీయలేదు. ఈకార్యదర్శియొక్క స్టేటుమెంటు నన్ను బాగుమూడుచేసెను. ఆవసంతపు వేసవి యుష్ణతచే నేనొకయుపన్యాసము

వేళ కునికిపాట్లుపడితిని. నాకొకచిత్రమైనకలవచ్చెను. అబ్దుల్‌గఫర్ఖాను అన్నివైపులనుండియు ముట్టడింపబడుచుండెను. అతనిని రక్షించుటకు నేను పోరుచుంటిని. అలసియున్నస్థితిలో దుఃఖాక్రాంతుడనగుచు నేను మేల్కొంచితిని. నాతలగడ కన్నీటిచే తడిసియుండెను. ఇది నాకాశ్చ ర్యముగనుండెను. నాజాగ్రదవస్థలో నేనెన్నడును యట్టి భావప్రకోపము నెరుగను.

ఈసమయముననే చేయబడిన కాంగ్రెసువర్కింగుకమిటీ తీర్మా నము "స్వంతయాస్తిని వశపరచుకొనుటను గురించియు, తరగతులమధ్య యవసరమగు పోరాటమునుగురించియు చేయబడు యథేచ్ఛా సంభా షణమునుబట్టి" చేయబడెను. కరాచీతీర్మానము "యుక్తమగుకారణ ముకాని, తగినపరిహారముకానిలేనిదే స్వంతయాస్తిని వశపరచుకొను టను, తరగతులమధ్య పోరాటమును ప్రోత్సహింపదు. మరియు వర్కింగు కమిటీవారు తరగతులమధ్య పోరాటమును, ఆస్తిని వశపరచుకొనుటయు కాంగ్రెసుసిద్ధాంతమైన దౌర్జన్యరాహిత్యమునకు వ్యతిరేకమని యభి ప్రాయపడుచున్నారు" అనిచేసిన తీర్మానము నన్ను బాధించెను. ఇందు లోని పదములు సరియైనయర్థములో నుపయోగింపబడలేదు. నిశ్చ యముగనిది క్రొత్తగానేర్పడిన సామ్యవాదపక్షముపై గురిపెట్టబడెను. తరగతులమధ్యపోరాటమననేమియో తీర్మానమును తయారుచేసినవారికి తెలియదని యిది స్పష్టముచేయుచున్నది. బాధ్యతగల సామ్యవాదు లెవరును ఆస్తిని వశపరచుకొనుటను గురించి మాట్లాడియుండలేదు. ప్రస్తుతపరిస్థితులలో తరగతులమధ్య పోరాటమున్నదని తరచుచెప్ప బడెను. ఇట్టి విశ్వాసముకలవారెవరును కాంగ్రెసులో మామూలు సభ్యులుగకూడ నుండరాదని వర్కింగుకమిటీ తీర్మానము సూచించు నట్లు కాన్పించును. సామ్యవాదమునామోదించెనని కాని, స్వంత యాస్తికి వ్యతిరేకముగ నున్నాడనికాని యెవరును కాంగ్రెసు నెన్న,

డును దూపించియుండలేము. కొంతమంది సభ్యు లట్టిభావములను కలిగి యుండిరి. కాని, సమస్తము నాలింగనముచేయు నీజాతీయ సంస్థలో సాధారణ సభ్యులుగ నుండుటకు కూడ వారి కిప్పుడాస్కారములే నట్లు కాన్పించును.

రాజు లగాయతు గర్భదరిద్రునివరకు కూడ కాంగ్రెసు అందరి పట్లను ప్రాతినిధ్యము వహించునని తరచు చెప్పబడెను. తరచు జాతీయోద్యమము లిట్టియధికారమును చాటుచుండును. అనగా నవి జాతిలో నున్న యధికసంఖ్యాకులకు ప్రాతినిధ్యము వహించుననియు, వాని నీతి యందరి ప్రయోజనముల శ్రేయస్సును కోరుననియు భావము. కాని యీ యధికారము నిలుచునదికాదని దాని ముఖముమీదనే వ్రాయబడి యున్నది. ఏ రాజకీయ సంస్థయు భిన్నలక్షణములను తెలియజేయజాలని, బింకములేని నిరర్థక ముద్దకాకుండ పరస్పర విరుద్ధప్రయోజనములకు ప్రాతినిధ్యమును వహింపజాలదు. కాంగ్రెసు రాజకీయాధికారమును సాధించు నిశ్చయమైన (లేక నస్పష్టమైన) లక్ష్యమును, వేదాంతమును గలిగి దానిని జాతీయకళ్యాణమునకు వినియోగించు రాజకీయ కక్షయైనను కావలెను. లేదా యది స్వాంతయభిప్రాయములు లేక నందరను యాశీర్వదించునట్టి కేవల భూతదయాళుత్వము గల సంస్థయైనను కావలెను. ఆ లక్ష్యమును, ఆ వేదాంతమును, సాధారణముగ నంగీకరించువారికే యది ప్రాతినిధ్యమును వహింపగలదు. దీనికి వ్యతిరేకులైనవారు జాతికిని, సంఘమునకును విరోధులనియు, నభివృద్ధి భంజకులనియు దానిచే భావింపబడుదురు; తన నిజవేదాంతము నమలు పరచుటకు వీరి ప్రభను నిరోధింపవలెను, లేదా తొలగింపవలెను. జాతీయమైన సామ్రాజ్యవ్యతిరేకోద్యమము సాంఘికపోరాటములజోలికి పోదుకనుక, సక్రియాంగీకారమున కెక్కువ యాధారముగ నుండగల దనుట సత్యము. కనుక కాంగ్రెసు హిందూదేశ ప్రజలయొక్క యనేక

సంఖ్యాకులకు భిన్నవరుసలలో ప్రాతినిధ్యమును వహించెను. అది సామ్రాజ్యవ్యతిరేకసమస్యమీదనే యంగీకరించిన పరస్పర విరుద్ధవర్గములను తనలో నిముడ్చుకొనెను. ఈ ప్రధాన సారాంశమునకు భిన్నమైన యభిప్రాయములు కలవారు కాంగ్రెసులో జేరక ప్రభుత్వ యండజేరిరి. ఈవిధముగ కాంగ్రెసు ఒక విశ్వాసముచేతను, అధికార శక్తిగల గాంధీజీయొక్క మూర్తిచేతను బంధింపబడిన యనేకవర్గములు గల శాశ్వతమైన యఖిలపక్ష కాంగ్రెసు అయ్యెను.

తరువాత వర్కింగు కమిటీ తరగతుల పోరాటమును గురించిన తన తీర్మానమును విశదముచేయ బ్రయత్నించెను. ఈతీర్మానములోని భాషగాని, యది చేసిన నిశ్చయముగాని ప్రధానములు కావు. అది కాంగ్రెసుయొక్క పోకడలకు మరియొక సూచన. రాబోవు అసెంబ్లీ యెన్నికలలో ధనవంతుల సహాయమును పొందుటకు కాంగ్రెసులోని క్రొత్తపార్లమెంటరీపక్షము వారి ప్రోత్సాహముచే నీతీర్మానము పొసగ బడెను. వారి ప్రోత్సాహముచే దేశములోనున్న మితవాదులను, కన్స ర్వేటివులను కలుపుకొనుటకు కాంగ్రెసు అంతకంతకు దక్షిణ దిశకు చూచుచుండెను. గతములో కాంగ్రెసుతో విరోధముగనుండి శాస నోల్లంఘన కాలమున ప్రభుత్వముతో జేరినవారియెడల బుజ్జగింపు వాక్యములు ప్రయోగింపబడుచుండెను. రవ్వపెట్టుచు, విమర్శించుచుండు యెడమపక్షము యీ 'మార్పు'కు, రాజీవిధానమునకు భంగకరమని తలంపబడెను. ఎడమపక్షమువారి యాదోషారోపణలవలన కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారు తమనూతనపద్ధతిని వీడజాలరని వర్కింగు కమిటీ తీర్మానమును, వ్యక్తుల యితర యుపన్యాసములును విశదము చేసెను. ఎడమపక్షమువారు యుక్తముగ ప్రవర్తింపనిచో కాంగ్రెసు నుండి వెలివేయబడుదురు. కాంగ్రెసు పార్లమెంటరీబోర్డువారు జారీ చేసిన ప్రకటన కాంగ్రెసు గత పదిహేను సంవత్సరములలో చేసిన యేప్రకటనకంటెను జాగ్రతగను, మితముగను నుండెను.

ఢేరాడూను జయిలులో కొంతవరకు నాభావము లీవిధముగ నుండెను. బయట ప్రపంచముతో నాకు సంబంధము లేకపోవుటచే పరిస్థితులను గురించి నేను నిశ్చయమైన యభిప్రాయముల నేర్పరచుకొనజాలకపోతిని. బయటనున్న సహచరులతో సంపర్కమున్నచో బహుశః నాభావములు కొంత మారియుండవచ్చును.

ప్రస్తుతముతో విసుగుచెంది నేను గతమును గురించి యోచింప నారంభించితిని. నేను ప్రజావ్యవహారములలో పాల్గొన నారంభించిన తరువాత భారతదేశములో రాజకీయముగ నేమి జరిగెను? మేముచేసిన దానిలో నెంతవరకుయుక్తముగ చేసితిమి? ఎంతవరకు తప్పుచేసితిమి? నాభావములను కాగితముమీద వ్రాసికొనినచో నవియొక్కవక్రమ యుక్తముగను, సహాయకారిగనుయుండునని నాకప్పుడు తట్టెను. ఇదినా విచారములనుండియు నిరుత్సాహమునుండియు నామనస్సునుతప్పించును. కనుక 1934 జూన్ నెలలో నేనీ 'ఆత్మకథను' ఢేరాడూనుజయిలులో ప్రారంభించితిని. నాకువ్రాయవలెనను బుద్ధిపుట్టినపుడెల్లవ్రాయుచు నెనిమిదిమాసములుదీనినివ్రాసితిని. తరచు మధ్యమధ్య కాళీలువచ్చుచుండెను. మూడుసార్లు మూడునెలలు (మొత్తము) అట్టికాళీలు వచ్చెను. కాని, నేను దీనిని సాగించుచు నిప్పుడీవ్యక్తిగతప్రస్తానము చివరకు వచ్చితిని; ఇందులోచాలవరకు నేను నిరుత్సాహముచేతను, భావప్రక్షోపముచేతను బాధపడుపరిస్థితులలో వ్రాయబడెను. బహుశః యిదికొంత నేనువ్రాసినదానిలో ప్రతిబింబించియుండవచ్చును. కాని, యీవ్రాతయే నాప్రస్తుతవిచారములనుండి నన్నుతప్పించుటకు చాల వరకుతోడ్పడెను. నేనువ్రాయునపుడు బాహ్యపాఠకులను గురించి భావించుచుండుటలేదు. నన్ను నేనే సంబోధించుకొనుచుంటిని. నేనే ప్రశ్నలను వేసికొనుచు నాయుపయోగముకొరకు నేనే సమాధానముల నిచ్చుకొనుచుంటిని. ఒక్కొక్కప్పుడు దీనితో కొంత వినోదించెడి

వాడను. నేను సాధ్యమైనంతవరకు సరళముగ భావింపగోరితిని; గత చరిత్రకు సంబంధించిన యీ విమర్శ నాకందులకుతోడ్పడునని యూహించితిని.

జూలై మాసాంతమునకు కమలయారోగ్యము శీఘ్రముగచెడి పోవుచు కొద్దిరోజులలో విషమపరిస్థితి యేర్పడెను. అగష్టు 11 వ తేదీని నన్ను ఢేరాజయిలునుండి పోలీసులు అలహాబాదు తీసుకొనివచ్చిరి. అచ్చట జిల్లామేజిస్ట్రేటు బాధపడుచున్న నాభార్యనుచూచుటకు నన్ను తాత్కాలికముగ విడచిపెట్టుచున్నామని చెప్పెను. నేను నిర్బంధింపబడి సరిగా నారోజుకారుమాసములు నిండెను.

---

## ౬౫

## పదకొండురోజులు.



"కత్తి నిలుచును, యొర క్షీణించును; శరీరము నశించును, ఆత్మ నశింపదు" బైరన్.

నావిడుదల తాత్కాలికము. కమల శల్యమయి, కేవలము దుర్బలముగనుండి తనవ్యాధితో నీరసముగ పోరాడుచు నిజఛాయవలె నుండెను. ఆమె నన్నువీడవచ్చుననుభావము నాకుదుర్భరముగనుండెను. మావివాహమయి పదునెనిమిదిసంవత్సరముల యారుమాసములయ్యెను; నామనస్సు ఆదినమును స్మరించెను; ఈ సంవత్సరములన్నియు మాకొసంగినదానినంతను సంస్మరించెను. నాకపుడు యిరువదియారేండ్లు. ఆమెకు పదిహేడు సుమారుగనుండెను. ప్రపంచపోకడలనెరుగని కేవల యమాయకపడుచు. మావయోభేదము హెచ్చుగనుండెను. కాని, మా మానసిక దృష్టిభేదము మరింతహెచ్చుగ నుండెను. ఆమెకంటెనేను చాలవృద్ధిచెందితిని; అయినప్పటికిని నాలోనెంతప్రపంచజ్ఞానముకాన్పించినను నేను చాలకుర్రతనముగ నుండెడివాడను. అభిమానముగల యీ సుకుమారకన్యకయొక్క మనస్సు పుష్పమువలె నెమ్మదిగ వికసించుచున్నదనియు, దానికి జాగ్రత్తయైన సౌమ్యదోహద మవసరమనియు నేను గుర్తింపలేదు. మేమన్యోన్యానురాగముగలిగి సుఖముగనే జీవించెడివారము. కాని, మాదృష్టులు వేరుగనుండుటచే కొంతసరిపెట్టుకొనలేకపోయెడివారము. దీనివలన నప్పుడప్పుడు చిన్నచిన్నతగవులు- బాలబాలికల వ్యాపారములవంటివి- స్వల్పవిషయములమీద కలుగుచు చిరకాలముండక వెంటనే సమాధానము కలుగుచుండెడిది. ఉభయులము తొందరస్వభావముకలవారము; అభిమానవంతులము, మాగౌరవము

లను నిలువబెట్టుకొనవలెననెడి కుర్రితనపుభావముకలవారము. అయి నప్పటికిని, నెమ్మదినెమ్మదిగ సరిపెట్టుకొనుచున్నను, మాయనురాగము పెరిగెను. మావివాహము జరిగిన యిరువదియొక మాసములకు మా యేకైకపుత్రిక యిందిర, జనించెను.

మా వివాహము రాజకీయ రంగములోని మార్పులతో సమకాలీనమయ్యెను. నేను వానిలో మునుగుచుంటిని. అవి 'హోము రూలు' దినములు. వానివెంటనే పంజాబులోని సైనికశాసనము, అసహాయోద్యమమువచ్చెను. నేనంతకంతకు రాజకీయఝంఝామారుతములోనెక్కువగ తగుల్కొంటిని. వీనిపై నేనెక్కువగ కేంద్రీకరించుటచే బుద్ధిపూర్వకముగ నేనామెను నిర్లక్ష్యముచేసి యామెగతికి విడిచివేసితిని. నిజముగ నప్పుడామెకు నాసంపూర్ణసహాయ మవసరముగ నుండెను. ఆమెయెడల నాప్రేమయభివృద్ధి చెందుచుండెను. తన సాంత్వన వచనములతో నన్నోదార్చుటకామె యచ్చటనున్నదని తెలిసికొనుట నాకు సుఖావహముగనుండెను. ఆమె నాకు పుష్టినిచ్చెను; కాని, తాను నిర్లక్ష్యముచేయబడినట్లు భావించి యామె బాధపడియుండవలెను.

తరువాత నామెయవిచ్ఛిన్నవ్యాధియు, నేను చిరకాలము జయిళ్ళలోనుండుటయు తటస్థించెను; అప్పుడు, మేము జయిలు దర్శనములందు మాత్రమే కలుసుకొనుచుండెడివారము. శాసనోల్లంఘన మామెను మాసంగ్రామ ప్రథమశ్రేణిలోనికి తీసికొనివచ్చెను; తానుకూడ జయిలుకు పోయినపుడామె యానందించెను. మేమంతకంతకు సన్నిహితులమగుచుంటిమి.మాయపురూపమైన సమ్మేళనము లమూల్యములుగనుండెడివి. మేము వానికొరకెదురుచూచుచు రోజులను లెక్కించుకొనుచుండెడివారము. మేమొకరితో నొకరము విసుగుచెందెడి వారముకాము; మాకలయికలలోను, స్వల్పకాలముకలసి జీవించుటలోను యెప్పుడును క్రొత్తదనము, నూతనరుచి, నవ్యశోభయుండెడివి. ఒకరిలో నొకరము

నిరంతరము క్రొత్తవిషయములను కనుగొనుచుంటిమి. ఒక్కొకప్పుడీ నూతన యావిష్కరణములు మాకు రుచించెడివికావు. మావయసుమీరిన యనంగీకారములలోగూడ కొంత బాలబాలికా విచేష్టితముండెడిది.

పదునెనిమిదియేండ్ల వైవాహికజీవితమును గడపిన తరువాత గూడ నామె కన్యవలె, పడుచువలెనుండెను; ఆమె యెంతమాత్రమును కుటుంబినివలె కాన్పించదు. ఆమె చాలకాలముక్రిందట మాయింటికి వచ్చిన వధువువలెనే యుండియుండవచ్చును. కాని, నేను చాలవరకు మారిపోతిని; నాలోనావయసుకుతగిన యర్హత, చురుకుదనము, లాఘవములున్నను-నాలోకొన్ని చిన్నతనపు లక్షణములుకూడ కలవని చెప్పుదురు. నాముఖవిలాసము నన్ను బయటపెట్టును, నేను కొంత బట్టతలగలవాడను; నాతలనెరిసెను. నాముఖమున ముడుతలుండెను. నాకండ్లచుట్టు శ్యామలఛాయలుండెను; కష్టములతోను, విచారములతోను కూడుకొనియున్న గతనాలుగేండ్లు నాపయిననేక చిహ్నములను కలుగజేసెను. ఈచివరసంవత్సరములలో కమలయునేనును క్రొత్తప్రదేశములకు పోయినపుడు ఆమెను నాకూతురని యనుకొనెడివారు. ఆమెయు, నిందిరయు నక్కచెల్లెండ్రవలె కాన్పించెడివారు.

పదునెనిమిదియేండ్ల వివాహజీవితము! కాని, వానిలో నెన్ని దీర్ఘసంవత్సరములను నేను జయిళ్లలోను, కమల ఆస్పత్రులలోను, గడపితిమి? ఇప్పుడుతిరిగి నేనుజయిలులోనేయుండి కొద్దిదినములు బయటకు వచ్చితిని; ఆమె వ్యాధిగ్రస్తురాలై, జీవితముకొరకు పోరాడుచుండెను. ఆరోగ్యమునుసరిగ కాపాడుకొనలేదని నాకామెపైకొంచెము కోపము కలిగెడిది. అయినను నేనామెనెట్లు నిందింపగలను? జాతీయపోరాటములో తన సంపూర్ణభాగమును వహింపజాలని యశక్తతకును, నిర్వ్యాపారిత్వమునకును ఆమెయుత్సాహమోర్పువహింప జాలకుండెను. అట్లు చేయుటకు శరీరదుర్బలతచే నామె తగినపనియు చేయజాలకపోయెను;

చికిత్సయు చేయించుకొన జాలకపోయెను; ఆమెలోపలనున్న యగ్ని శరీరమును దహించివేసెను.

నిశ్చయముగ నేనెక్కువగ నభిలషించుచున్న యీసమయములో నామె నన్ను విడిపోదు. మేమిప్పుడే యథార్థముగ నొకరినొకరము తెలిసికొని యర్థముచేసికొనుటకు ప్రారంభించితిమి; మాసంయుక్తజీవిత మిప్పుడే యుత్తమముగ ప్రారంభమయ్యెను. మేమొకరిపై నొకరమంత యాధారపడితిమి. మేమిరువురముకలసి చేయవలసినదెంతయో యుండెను.

ఆమెను గంటగంటకు, దినదినము పరీక్షించుచు నేనిట్లు తల పోయు చుండెడివాడను.

సహచరులును, స్నేహితులును నాదగ్గరకువచ్చిరి. నేనెవరితోను చర్చించుట కిష్టపడలేదు. నాకు పరిస్థితులు తిన్నగా తెలియవు. స్వయముగ వ్యక్తులతోసంపర్కమున్నగాని యేమిచెప్పుటకును, యేమిచేయుటకును వీలులేదని నాచిరయనుభవము బోధించెను. ప్రభుత్వము నా భార్యను చూచుటకు నాయెడలచూపిన సరసతను నేనురాజకీయప్రయోజనముల కుపయోగింపదలచుకొనలేదు. నేనెట్టి పబ్లికుస్టేటుమెంటులను చేయలేదు. ప్రయివేటులోకూడ నేనెట్టి నీతిని నిశ్చయించుకొన లేదు.

కమలస్థితినిగురించి నేనుగాంధీజీకి తెలిపితిని; నామానసికస్థితిని గురించికూడ నీషద్భావమును వెల్లడించితిని. ఇటీవల విషయములుకొన్ని నాకుబాధకరములుగను, విచారకరముగను నుండెను. నాయుత్తరములో నిదికొంత ప్రతిబింబించెను. ఏమిచేయవలెను, ఏమిచేయకూడదు యను విషయమై నేనేమియును సూచింపలేదు. జరిగినదానినిగురించి నాభావములను వెల్లడించితిని. ఆయుత్తరము భావోద్రేకపూరితముగనుండెను.

అది గాంధీజీకి చాల బాధను కలిగించెనని నేను తరువాత తెలిసికొంటిని.

నేను ప్రభుత్వమునుండి పిలుపు లేక మరియొక వార్త వచ్చునని దినదినము చూచుచుంటిని. అనేక వదంతులు బయలుదేరెను. బొంబాయి కాంగ్రెసు, నవంబరులోని అసెంబ్లీ యెన్నికలు లేనిచో నన్ను విడిచిపెట్టి యుండెడివారట ! ఇప్పుడే నన్ను విడిచివేసినను విడువ వచ్చుననిరి.

నా విడుదలయైన పదకొండవదినము, అగస్టు 23 వ తేదీ, వచ్చెను. పోలీసు మోటారు వచ్చెను. నేను నైనీజయిలుకు పోవలెనని ఆఫీసరు చెప్పెను. నేను నా స్వజనమువద్ద సెలవుతీసికొంటిని. నేను మోటారు ఎక్కుచుండ వ్యాధిగ్రస్తురాలైన నా తల్లి చేతులుచాచుకొని నాయొద్దకుతిరిగి పరుగెత్తుకొనివచ్చెను. అప్పటి యామె ముఖము నన్ను చాలకాలము వీడకుండెను.

---

# ౬౯

## తిరిగి జయిలుకు.



నేను తిరిగి నైనీజయిలులో నుంటిని. నాకు క్రొత్త జయిలు అవధి ప్రారంభమైనట్లుండెను; బయటనుండి లోపలకు, లోపలనుండి బయటకు; నేనెట్టి రెక్కల చెండునైతిని! ఇటునటు యీతిరుగుడు వ్యాపారము నా శరీరస్థితిని భావోద్రేకముచే కదల్చివేయుచుండెను. నిరంతరమార్పులకు సరిపెట్టుకొనుటసులభముకాదు. నన్ను నా వెనుకటి 6 నెం. కొట్టులోగాక మరియొకచోటుకు మార్చిరి. అందులోనిపుడొక విచారణ, శిక్షలేని ఖయిదీ యుంచబడెను. అనితో నన్నుకలుపుట భద్రముకాదని తలపబడెను.

నారాత్రిందివములను నేనచ్చట గడుపుచుండినను నామనసు, అన్యత్రయుండెను. నాపునర్నిర్బంధమువలన కమలలోకలిగిన యభివృద్ధిచెడునని నేను భయపడితిని. అదియట్లేజరిగెను. కొన్నిరోజులు డాక్టరులయభిప్రాయములను నాకు తెలియబరచిరి. రెండువారములైన తరువాత నామెస్థితి క్రమముగ చెడుచున్నను వీని నాపివేసిరి.

చెడువార్తలు, వానికొరకు వేచియుండుట - దీనివలనరోజులు దీర్ఘములయ్యెను. రాత్రులొక్కొక్కప్పుడు మరింతయధ్వాన్నమయ్యెను. కాలముకదలనట్లుండెను. కదలినను కదలనంత మందముగ జరిగెను. ప్రతి గంట గండముగను, భయంకరముగను నుండెను.

నన్ను తిరిగినిర్బంధించిన సరిగనొక్కమాసము గడచినతరువాత నొకపోలీసుఆఫీసరు కమలనుచూచుటకు నన్నుతీసికొనివెళ్ళెను. నన్ను వారముకు రెండుసార్లు యిట్లుతీసికొనివచ్చుచుందుమని యతడుచెప్పియా కాలములనుకూడ స్థిరపరచెను. నేను నాల్గవరోజున వేచియుంటిని. నా

కొరకెవరును రాలేదు. ఆయిదు, ఆరు, యేడవరోజు-యిట్లు గతించెను. కనిపెట్టుకొనియుండుటకు నాకు విసుగుపుట్టెను. ఆమెస్థితి తిరిగి యుపద్రవకరమయ్యెను. ఆమెనుచూచుటకు నన్నువారమునకు రెండుసార్లుతీసికొనివెళ్ళెదమనిచెప్పుట యెంతటిపరిహాసమో! అని నేను భావించితిని. చిట్టచివరకు సెప్టెంబరుగతించెను. ఆముప్పది దినములును నేనెన్నడును యనుభవించని దీర్ఘతమ దుర్దినములు.

నేను రాజకీయములలో దిగనని వాగ్దానముచేసినచో, యిష్టాగోష్టిగనైననుసరే, నేనువిడచివేయబడుదునని మధ్యవర్తులుసూచించిరి. అప్పుడు రాజకీయములు నాతలంపులలోనే లేవు; నేను బయటనున్న పదికొండుదినములలోను చూచిన రాజకీయములు నాకసహ్యముగనుండెను. కాని, వాగ్దానమునిచ్చుటయా! నాప్రమాణములకును, యుద్యమమునకును, నాసహచరులకును, నాకును ద్రోహముచేయుటయా! ఏమిజరిగినను అదియసంభవము. అట్లుచేయుట నామూలములకును, నేను పవిత్రమనితలంచు సమస్తమునకును మృత్యుఘాతము. కమల నాకొఱకెదురుచూచుచున్నదనియు నేనామెప్రక్కనున్నచో సేదతేరుననియు చెప్పుచుండెడివారు. ఆమెకీయవకాశమునిచ్చు నాకోరికకంటె నాస్వాభిమానము, గర్వముఅధికమైనదా? ఇది నాకొకగొప్పదురవస్థయయ్యెడిది. కాని, యదృష్టవశమున నాకీసంధిగ్ధదశపట్టలేదు. నేనట్టివాగ్దానము నిచ్చుటను కమలయే నిరాకరించునని నేనెరుగుదును.

అక్టోబరు మొదటిరోజులలో ఆమెనుచూచుటకు నన్ను తీసికొనివెళ్ళిరి. ఆమె జ్వరతీవ్రతతో నిశ్చేష్టయైయుండెను. నేనామెప్రక్కనుండగోరెను. కాని, నేను తిరిగి జయిలుకుపోవుచుండుటచే నామెనన్నుచూచి ధైర్యముముగనవ్వునవ్వి నన్నుకొంచెము వంగవలసినదని సంజ్ఞచేసెను. నేనువంగితిని. "ప్రభుత్వముకుమీరు వాగ్దానమునియ్యవలెనను యీవదంతియేమిటి? అట్లుయివ్వవలదు!" అనియామెమెల్లగచెప్పెను.

చివరకు కమలను భోవాలీ తీసికొనివెళ్ళుటకు నిశ్చయింపబడెను. ఆమెయచ్చటకు వెళ్లుటకు పూర్వదినమున నేనామెను వీడ్కొలుపుటకు తీసికొనిపోబడితిని. నేనామెను తిరిగి యెప్పుడు చూతును? ఆమె నాకిక కాన్పించునా? కాని, యామె యానాడు సంతోషముగను, సుఖముగను కాన్పించెను. నాకిది చాలకాలమునుండిలేని సంతోషమును కలిగించెను.

తరువాతమూడువారములకు నన్నుఆల్మోరాజిల్లా జయిలుకు మార్చిరి. భోవాలీ మార్గములోనేయుండెను. నేను నాపోలీసుతోసహా కొద్దిగంటలు అచ్చటగడిపితిని. కమలకు సుగుణముగనున్నందులకు నేను సంతసించి యుత్సాహముతో ఆల్మోరాంవెళ్ళితిని.

ఆల్మోరాలోనున్న చిన్నజయిలు ఒకశిఖరముమీద నిర్మింపబడెను. నాకు మంచిదర్జాయైనకొట్టు యివ్వబడెను. పెద్దహాలు 51 అడుగులపొడవు, 17 అడుగులవెడల్పుగలది; నేల గతుకులుగను 'కచ్చా'గను నుండెను. చెదతినివేసినపైకప్పునుంచి ముక్కలు, తుక్కు నిరంతరము జలజలరాలుచుండెను. దానికి పదిహేను కిటికీలు, ఒక గుమ్మము కలవు. వీటికితలుపులులేవు. నాకు శుభ్రమైనగాలికికొదువలేకయుండెను. చలియెక్కువయైనప్పుడు చాపలతోకొన్నికిటికీలు మూసివేయబడెవి. ఈవిశాలప్రదేశములో నేనేకాంతమైన గొప్పతనముతో జీవించితిని. కాని నేను కేవలమొంటరిగలేను. అధమము మూడున్నరడజనుల పిచుకలు కూలుచున్నకప్పులో తమనివాసము నేర్పరచుకొనెను. ఒక్కొక్కప్పుడు సంచారముచేయు మేఘమొకటి నన్నుదర్శింపవచ్చి కిటికీలగుండ తనసహస్రచేతులనుచాచి యాప్రదేశమును చల్లపరచి పోవును.

ఇచ్చటనున్నప్రతిదినము సాయంకాలమయిదుగంటలకు తాళము వేసెడివారు. ఉదయము యేడుగంటలకు నాతలుపు తాళములు తీయును. పగలు నాగదిలోనో బయటవరాండాలోనో కూర్చొనెడను. నా

గోడలపైనుండి నాకొకపర్వతశిఖరము కాన్పించెడిది. నాపైనవిశాల వినీలాకాశము మేఘరాజితో నిండియుండెడిది. ఈమేఘము లద్భుతములగు రూపములను దాల్చెడివి. వానిని పరీక్షించుటకు నాకెప్పుడును విసుగుపుట్టెడిదికాదు. అవి యన్నిమృగములరూపములను దాల్చుటను చూచుచున్నట్లు నేను భావించితిని. ఒక్కొక్కప్పుడవి యన్నియును కలసి మహాసముద్రమువలె కాన్పించెడివి; లేకనవి సముద్రతీరమువలె నుండును. దేవదారువులనుండివీచు వాయువుయొక్క మర్మరధ్వని దూరముననున్న సముద్రతీరముకు వచ్చు తరంగఘోషవలెనుండును.

కమలస్థితియొక్క బాగోగులవలన నేను ఖేదపడుచుంటిని. చెడువార్త నన్ను తారుమారుచేసెడిది. కాని, పర్వతవాయువు నన్ను శాంతింపజేసి యోదార్చుటచే నేను గాఢముగ నిద్రపోయెడివాడను. నేను నిద్రపోవుటకుముందు-నిద్రయెంతటి యద్భుతమైన విషయము! యెంతరహస్యమైన విషయము! దానినుండి మనమేల మేల్కొనవలెను? నేనసలు మేల్కొనలేనను కొందును? యని భావించెడివాడను.

అయినను బయటకు పోవలెననెడి కోరిక మునుపటికంటె గాఢముగ నుండెను. బొంబాయికాంగ్రెసు జరిగిపోయెను. నవంబరు గతించెను. అసెంబ్లీయెన్నికల యుద్యోగము చల్లారెను; నన్ను విడిచిపెట్టెదరనుకొను చుంటిని. కాని, యింతలో అబ్దుల్‌గఫర్ఖాను నిర్బంధము శిక్ష వినవచ్చెను. సుభాసుచంద్రబోసు భారతదేశముకు వచ్చినప్పుడు చేసినఅరెష్టు ఆశ్చర్యకరముగనుండెను. తన దేశస్థులలో నధికసంఖ్యాకులచే ప్రేమింపబడువానిమీదనవి ప్రయోగింపబడెను. అతడు వ్యాధిగ్రస్తుడై యున్నను మృత్యుశయ్యమీద నున్న తండ్రిని చూచుటకు (ఈలోపలనతడు చనిపోయెను) త్వరపడివచ్చెను. ప్రభుత్వస్వభావ మావిధముగ నున్నపుడు నాయకులవిడుదల యసంభవము. తరువాత ప్రభుత్వ ప్రకటనమట్లే వెలువడెను.

ఒకనెల యాల్మోరాలో నున్నతరువాత నన్ను కమలనుచూచుటకు తీసికొని వెళ్లిరి. తరువాత నేనామెను మూడువారములకొకసారి చూచెడివాడను. సర్ సామ్యుయల్ హోర్ (భారతశెక్రెటరీ) నన్నువారమున కొకటిరెండుసార్లు నాభార్యను చూడనిచ్చుచున్నట్లు పదేపదే చెప్పెను. ఆల్మోరాలోనున్న మూడున్నరమాసములలో నేనామెను అయిదుపర్యాయములే చూచితిని. నేనుదీనినొక ఫిర్యాదుకొరకు చెప్పుటలేదు. ఈవిషయములో ప్రభుత్వమువారు నాపట్లచాలయుక్తముగ నుండి కమలనుచూచుట కసాధారణ సౌకర్యములను కలిగించిరి. దీనికి నేను వారికి కృతజ్ఞుడను. నాస్వల్పకాలసందర్శనములు ఆమెకును నాకును కూడ నమూల్యములయ్యెను. నేనామెతో చాలకాలము సంభాషించెడివాడను. మేమొకరికొకర మతిప్రేమాస్పదులమైతిమి. ఆమెనువీడుట బాధకరముగనుండెడిది. మేము కలుసుకొని వీడిపోయెడివారము.

నాతల్లి చికిత్సకొరకు బొంబాయివెళ్ళెను. ఆమెకు గుణముగనున్నట్లే కాన్పించెను. జనవరిమధ్యభాగమున నొకనాడు నాకొకతంతి వచ్చెను. ఆమెకు పక్షవాతమువచ్చెనని యది తెలిపెను. నన్ను బొంబాయి ఖయిదుకు ఆమెకుసమీపములో నుండుటకు మార్చెదరనుకొనబడెను. ఆమెస్థితిచక్కబడుటచే నన్నుమార్చలేదు.

జనవరి తరలిపోయి ఫిబ్రవరివచ్చెను. వసంతకాలధ్వనులు ఆకసమును నింపుచుండెను. పిగిలిపిట్ట, కోయిల యిత్యాదిపక్షులు మరల కాన్పించి గానముచేయ నారంభించెను. లేతమొలకలు భూమినుండి యద్భుతముగ పైకిలేచుచు నీవింతప్రపంచమును తిలకించుచుండెను. యర్రగన్నేరు పర్వతసీమలను రక్తకాంతితో నింపుచుండెను. బతానీలు, రేగులు పుష్పించుచుండెను. రోజులు గడుచుచుండ భావాలీసందర్శనమును గురించి యోచించుచు నేను వానినిలెక్కించుచుంటిని. జీవితములోని యమూల్యమైన ప్రసాదములు విఫలత, క్రౌర్యము, మొద

బాటు-వీనిననుసరించునను లోకోక్తిలో నెంత సత్యమున్నది! యని నే నాశ్చర్యపడుదును. అట్లుకానియెడల బహుశః అవి గుర్తింపబడవు. నిర్మలభావమునకు బహుశః బాధయవసరము. అది యధికమైన వో బుద్ధిని కప్పివేయవచ్చును. జయిలు ఆత్మపరీక్షను ప్రోత్సహించును. జయిలులోనున్న నాదీర్ఘసంవత్సరములు నన్నంతకంతకంతర్విచారము చేసికొనుటకు బలవంతపరచెను. స్వతః నేను అంతర్ముఖుడనుకాను. కాని జయిలుజీవితము ఆత్మపరీక్షకు మార్గమునుచూపును.

---

# ౬౨

## ఇటీవల విషయములు.



నాకువచ్చు వార్తాపత్రికలవలన బొంబాయి కాంగ్రెసుసభా తీర్మానములను తెలిసికొంటిని. ఇరువదిసంవత్సరముల సన్నిహితసంపర్కముచేత నావ్యక్తిత్వము కాంగ్రెసుసంస్థలో మిళితమైపోయెను. నా పదవి, బాధ్యతవలన నాకుగలహక్కుకంటె నాసంస్థతోను, వేలకొలది నాపాతస్నేహితులతోను నన్నుబంధించిన యగోచరమైన పాశములు బలవత్తరముగనుండెను. అయినను నేనాతీర్మానములతో తృప్తినొందలేదు. కొన్నిముఖ్యవిషయములు జరిగినను ఆకాంగ్రెసుసభయంతయు నిస్సారముగనుండెను. నేను శ్రద్ధతీసుకొనునట్టి విషయములేవియును చర్చింపబడలేదు. నేనచ్చటనుండుచో నేమిచేసెడివాడనోయనియాశ్చర్యపడితిని. నిశ్చయముగనది నాకే తెలియదు, నేనప్పుడు చింతించవలసిన యవసరము కూడలేదు.

ఆసభలో రెండు ప్రధానలక్షణములు కాన్పించెను. గాంధీజీ యొక్క యసాధారణవ్యక్తిత్వము. మాలవ్యా, ఆనేలనాయకత్వము క్రింద ప్రదర్శింపబడిన యత్యంత నిస్సారపు కులతత్త్వ వ్యతిరేకము. భారతప్రజాహృదయముయొక్కయు, మధ్యతరగతులవారియొక్కయు నాంతరంగిక ప్రవృత్తులను గుర్తెరింగిన వారందరును గాంధీజీ భారతదేశములో నసాధారణపురుషుడనిన యాశ్చర్యపడరు. ప్రభుత్వాధికారులును, కొందరుఘోషారాజకీయ వేత్తలును యతడు రాజకీయరంగములో దిగత్రొక్కివేయబడెనని (వారికోరికయే వారినట్లుభావింపచేయును) తరచుయూహించుచుందురు. అతడు తనవెనుకటి శక్తితోను, పలుకుబడితోను, తిరిగి విజృంభించినపుడు వారునాలుకలుకఱచుకొనుచు

నీ పూర్వుకుగల నూతనకారణములను వెతుకుచుందురు. అతనియభిప్రాయములవలనగాని, యవిసాధారణముగ నంగీకరింపబడుటవలనగాని యతడు కాంగ్రెసును, దేశమును పాలించుటలేదు. అతనియసాధారణ వ్యక్తిత్వమే దీనికికారణము. ప్రతిచోటను వ్యక్తిత్వమే పరిగణింపబడును. ఇతరచోట్లకంటెనది భారతదేశములో మరింత ప్రాధాన్యత వహించును.

అతడు కాంగ్రెసునుండి విశ్రాంతి తీసికొనెను. బాహ్యముగనిది కాంగ్రెసు చరిత్రలోను, భారతచరిత్రలోను నొక మహాధ్యాయమును సమాప్తము చేసెను. కాని, ప్రధానముగ దీనికట్టి గొప్ప ప్రాముఖ్యత యును లేదు. తనప్రభుత్వాధికారమునుండి (యతడు కోరిననుకూడ) యతడు తప్పించుకొనజాలడు. అతని పదవి యుద్యోగమువలనగాని, యితర స్థూలసంబంధమువలనగాని యతనికి సంక్రమించలేదు. కాంగ్రెసు మునుపుచేసినట్లే యిప్పుడును అతనిదృక్పథమునే ప్రతిబింబింపజేయును. అది యతనిమార్గమునుండి తప్పిపోయినను గాంధీజీ (అప్రయత్నముగ కూడ) దానిని, దేశమును చాలవరకు ప్రేరేపించుచునే యుండును. ఆబాధ్యతనుండియు, భారమునుండియు నతడు తప్పుకొనజాలడు.

తాత్కాలికముగ నతడు కాంగ్రెసునుండి విరమించెను. బహుశః యతడొకవిధమగు వ్యక్తిగత ప్రత్యక్ష విధానమును యోచించుచుండ వచ్చును. దానిని కాంగ్రెసుసమస్యగ చేయుటకతడు యిష్టపడడు.

కాంగ్రెసు నియోజకవర్గ నియమిత సభ యనుభావమునుఅవలంబించినందులకు నేను సంతోషించితిని. సమస్యను పరిష్కరించుటకు వేరు గత్యంతరములేదు. ప్రభుత్వమువారు దీనిని జరుగనీయరు; కాని యెప్పుడోయొకప్పుడు యిది జరుగకతప్పదు. ఈలోపుగ తగిన బలమును చేకూర్చుకొనవలెను. కొంతమంది దీనినొకవిధమగు అఖిలపక్ష సభగ చేయగోరిరి. ఇది కేవలము వ్యర్థము. నియోజకవర్గనియమితసభయనగా

ప్రజలనుండి బలమును, ప్రేరేపణమును పొందిన విశాల ప్రజాసంఘముచే నెన్నుకొనబడినసభ యని యర్థము. అట్టిసభ వెంటనేయథార్థసమస్యల నెదుర్కొనును. అది కులతత్త్వ యిత్యాది రొంపులలో దిగబడదు.

బొంబాయికాంగ్రెసు జరిగిన వెంటనే అసెంబ్లీయెన్నికలుజరిగెను. ఎన్నికలలో నాకు ప్రీతిలేకపోయినను కాంగ్రెసుఅభ్యర్థులుగెలువవలెనని నేనుకోరితిని. ప్రతిపక్షములవారు - ఇందులో నుద్యోగముల కొరకు వేటాడువారు, కులతత్త్వవాదులు, సమ్మికస్వామిద్రోహులు నానాగోత్రములవారు - ఓడిపోవలెనని కోరితిని. చివరకు కాంగ్రెసుకు అఖండవిజయము కలిగినందులకును, అవాంఛనీయులు చాలమంది యోడినందులకును తృప్తినొందితిని.

కాంగ్రెసునేషనలిస్టులు అనబడువారిదృష్టి నాకు విచారకరముగ కాన్పించెను. వారు కమ్యూనల్ అవార్డును తీవ్రముగనెదిరింపవచ్చును. కాని, వారు తమస్థితిని బలపరచుకొనుటకు అత్యంత కులతత్త్వవాదులతోను, సనాతనవాదులతోనుకూడ (హిందూదేశములో సాంఘికముగను, రాజకీయముగను నింతకంటె తిరోగమనశీలులులేరు.) మేళమయిరి. బెంగాలులో తప్ప (ప్రత్యేకకారణములచే నొక కాంగ్రెసువర్గము వీరినిసమర్థించెను.) వారుచాలమంది యన్నివిధములను కాంగ్రెసుకు వ్యతిరేకులు. వీరేకాంగ్రెసుకు ప్రబల ప్రతిపక్షులు- భూఖామందులు, లిబరలులు, నిశ్చయముగ నధికారులు - వీరింతమంది యున్నను కాంగ్రెసు అభ్యర్థులునెగ్గిరి.

కమ్యూనల్ అవార్డునుగురించిన కాంగ్రెసుదృష్టి యసాధారణమైనది. అయినను ప్రస్తుతపరిస్థితులలో నదియంతకంటె వేరేమియు చేయజాలదు. ఇంతవరకును తటస్థభావమును, నీరసమైననీతిని యవలంబించుటచేతనే యీస్థితిసంభవించెను. ఫలితములకు వెరువక నితఃపూర్వము బింకమైనమార్గము నవలంబించి దానిననుసరించుట యుక్తమును;

గౌరవప్రదమును నైయుండెడిది. కాని, కాంగ్రెసు దానికప్పుడంగీకరింపక పోవుటచే నిప్పటి పద్ధతికంటె వేరొకమార్గములేదు. కమ్యూనల్ అవార్డు స్పష్టముగ నవ్యక్తమైనది. అదియున్నంతకాలము నెట్టిస్వాతంత్ర్యమును సాధించుటకును వీలులేదు. కనుక దానినంగీకరించుట యెన్నడును పొసగదు. అవి ముస్లిములకెక్కువయిచ్చెనను కారణమెంతమాత్రమునుకాదు. వారు కోరినదంతను, మరియొకవిధమున, నిచ్చుట బహుశః సాధ్యమేయగును. నిజమేమన బ్రిటిషు ప్రభుత్వము హిందూదేశమును అనేక పరస్పర విరుద్ధములగు శాఖలక్రింద వేరుచేసి యొకదానితోనొకటి తలపడునట్లు చేయుటచేత ననర్గళముగ పరిపాలనచేయుచున్నది. అది బ్రిటిషు ప్రభుత్వముపై నాధారపడుటను విధాయకము చేయుచున్నది.

అతి రీయేక్షనరీ కులసంఘములైన హిందూమహాసభ, ముస్లిము కాన్ఫరెన్సులకు వెనుకనున్న వారియొక్క నిజస్వరూపములను అసెంబ్లీ యెన్నికలు విశదపరచెను. వారియభ్యర్థులును, యభిమానులును పెద్ద భూఖామందులనుండియు, వడ్డీవ్యాపారస్థుల నుండియు తీసికొనబడిరి. నవీన ఋణవిమోచన బిల్లులను తీవ్రముగనెదిరించి హిందూమహాసభ కూడ బ్యాంకరులయెడల తమయాతురతను వెలిబుచ్చెను. హిందూ సాంఘిక తరగతులపైనున్న యీకొద్దిమందియే 'హిందూమహాసభ' యగుచున్నది. అందులో నొకభాగమును, వృత్తులలోనున్న కొంత మందియు కలసి లిబరలులగు చున్నారు. వారికి హిందువులలో నెట్టి పలుకుబడియునులేదు. ఏలనన మధ్యతరగతిలోని క్రిందితరహావారు రాజకీయముగ మేల్కాంచిరి. పారిశ్రామిక నాయకులు కూడ వీరికి దూరముగనేయుందురు. వృద్ధిచెందుచున్న పరిశ్రమలకును అర్ధఫ్యూడల్ ప్రయోజనములకును కొంతస్పర్థకలదు. ప్రత్యక్ష కార్యక్రమములకు లేక సాహసకార్యములకు భయపడు పారిశ్రామికులు ప్రభుత్వము

తోను, జాతీయతతోనుకూడ సఖ్యముగనుండగోరెదరు. వారు లిబరలు, కమ్యూనలు వర్గములను లెక్కచేయరు. పారిశ్రామికాభివృద్ధియు, లాభములును వారి ప్రధానాశయములు.

ముస్లిములలో నీమధ్యతరగతులలోని క్రిందితరహావారి ప్రబోధమును, పారిశ్రామికాభివృద్ధియు కొఱవడియుండెను. కనుకవారి కుల సంస్థలను పచ్చిరియేక్షనరీలును, ఫ్యూడల్ ప్రభువులును, పింఛను తీసికొను ఆఫీసరులును వశపరచుకొనుటయేగాక సంఘమువిూదకూడ మంచి పలుకుబడి కలిగియున్నారు. ముస్లిము కాన్ఫరెన్సు 'బిరుదాంకితులును,పెద్దజమీాందారులును, పాతమంత్రిలునుగల యొకగొప్ప ప్రదర్శనము. అయినను ముస్లిము ప్రజాసామాన్యములో నెక్కువ శక్తియున్నట్లు నాకు కాన్పించును. బహుశః వారిసాంఘిక సంబంధములలోని స్వేచ్ఛయే దీనికి కారణము. ఒకసారి కదలిక కలిగినచో వారెక్కువ చురుకుగ సామ్యవాదముఖులు కానచ్చును. సరిగవర్తమానమున ముస్లిము విద్యార్థికులు శరీర, బుద్ధులచేత స్తబ్ధులుగనున్నట్లు కాన్పింతురు. వారిలో నుత్సాహములేదు. వారు తమ పాత సంరక్షకులను త్రోసివేయ సాహసింపరు.

రాజకీయముగ నతియభివృద్ధి నొందిన కాంగ్రెసు నాయకులు కూడ ప్రజాపరిస్థితులు కోరనంతటి జాగ్రతను వహించిరి. వారు ప్రజల సహాయమును కోరుదురు. కాని వారియభిప్రాయములను కనుగొనరు, వారిబాధలనుగురించి పరిశోధనలనుచేయరు. ఎన్నికలకు ముందు వివిధ కాంగ్రెసేతరమితవాదులను త్రిప్పుటకు వారు తమ ప్రోగ్రాము యొక్క జోరును తగ్గించిరి. దేవాలయ ప్రవేశబిల్లు వంటి దానియెడల గూడ తమ దృష్టిని మార్చుకొనిరి. చెన్నపట్టణములోని శ్రోత్రియులను శాంతపరచుటకు వాగ్దానములీయబడెను. సరియైన తీవ్రయెన్నిక ప్రచారమును సాగించినచో నెక్కువ యుత్సాహము కలిగెడిది; ఎక్కువ

ప్రజాప్రబోధమునకును తోడ్పడెడిది. ఇప్పుడు కాంగ్రెసు పార్లమెంటరీ పద్ధతి నవలంబించెను కనుక కొన్ని చిల్లరవోటులను సంపాదించు నుద్దేశ్యముతో సాంఘిక, రాజకీయాభివృద్ధి భంజకులతో మరికొన్ని యెక్కువ రాజీలు జరుగును; ప్రజలకును కాంగ్రెసు నాయకులకును మధ్య మరింత యెక్కువ యంతరమేర్పడును. బ్రహ్మాండమైన యుపన్యాసము లీయబడును; ఉత్తమమైన పార్లమెంటరీ మర్యాద లవలంబింపబడును; అప్పుడప్పుడు ప్రభుత్వము పరాజయమునొందును. ప్రభుత్వము యిదివరకు చేయునట్లే వీనిని నెమ్మదిగ నిర్లక్ష్యముచేయును.

కాంగ్రెసు శాసనసభలను బహిష్కరించిన గతకొద్ది సంవత్సరములలోను అసెంబ్లీ సభయు, రాష్ట్రసభలును, ప్రజలయథార్థమైన ప్రతినిధిసభలనియు, నవిప్రజాభిప్రాయమునే వెల్లడిచేయుచున్నవనియు ప్రభుత్వముఖులు చెప్పుచుండెడివారు. ఇప్పుడు (మరింత విశాలహృదయులు అసెంబ్లీని వశపరచుకొనినప్పుడు) ప్రభుత్వదృష్టి మారిపోవుట చోద్యముగనుండును. ఎన్నికలలో కాంగ్రెసువిజయముల యుదాహరణమువచ్చినప్పుడెల్లను నియోజకవర్గము చాల చిన్నదనియు, ముప్పదియారుకోట్లలోను మూడుకోట్లు మాత్రమే యనియు చెప్పుచుందురు. ప్రభుత్వాభిప్రాయము ప్రకారము వోట్లులేని వారందరును బ్రిటిషుప్రభుత్వమువెనుక కోటవలెనున్నారని తెలుచున్నది. దీనిచికిత్స స్పష్టముగనే యున్నది. వయసువచ్చిన వారికందరకును వోటుహక్కు యిచ్చినచో యథార్థము తెలియగలదు.

అసెంబ్లీయెన్నికలు ముగిసినతోడనే భారతచట్టసంస్కరణలను గురించిన సంయుక్తపార్లమెంటరీ కమిటీ నివేదికవచ్చెను. ఇదియందరిచేతను విమర్శింపబడెను. గర్హింపబడెను. ఈవరప్రసాదమువలన మనకు కలుగు స్వేచ్ఛయెట్టిదో యీదేశములోనున్న యతిమిదవాదులును రాజకీయముగ వెనుకబడినవారును అగువర్గములవారు యభివృద్ధిభంగకర

మని దీనిని గ్రహించుటవలననే తెలియుచున్నది. కొందరులేబరుపార్టీ వలనను లేబరుప్రభుత్వమువలనను యేదోజరుగగలదని యాశించిరి. సామ్రాజ్యనీతిసందర్భమున యింగ్లండులో లేబరు, టోరీపక్షములమధ్య మనమేమియు నాశింపనవసరములేదు.

భారతరాజకీయరంగములోని బాహ్యమైనమార్పులను గ్రహించుటకు నేనుప్రయత్నించితిని. కాని, యివన్నియును నాకసత్యములుగ కాన్పించెను. హిందూదేశములోని నిజపరిస్థితులు నన్ను బాధించుచుండెను. అన్నివిధములగు స్వేచ్ఛలు అణచివేయబడెను. అమితమగు బాధ, విఫలత, సుహృద్భావమునుపాడుచేయుట, చెడుగును ప్రోత్సహించుట- ఈలక్షణములుకన్పట్టెను. అనేకమందియువకులు జయిళ్ళలో మ్రగ్గుచుండిరి. మామూలురోజులలోకూడ ననేక సంస్థలు బహిష్కరింపబడెను. ఎమర్జెన్సీఅధికారములు 'శాంతిచట్టములు' ప్రభుత్వ ఆయుధశాలలో స్థావరమునేర్పరచుకొనెను. అనేకవందలపుస్తకములు, మేగజనులు నిషేధింపబడెను. లేదా 'సముద్రసుంకముల చట్టముక్రింద' దేశములోనికి రాకుండ నాపివేయబడెను. 'ఉపద్రవకరమగుసాహిత్యము' నుంచుకొనుటవలన దీర్ఘశిక్షప్రాప్తించెడిది. రబీంద్రనాథఠాగూరు రష్యానుగురించి యొకవ్యాసమును 'మోడరన్‌రివ్యూ'లోవ్రాసినందుల కాపత్రికాధిపతి దండింపబడెను. రబీంద్రనాథఠాగూరు 'డబ్లినులోని మిత్రసంఘమునకు' పంపిన యొకచిన్నసందేశమునుకూడ ప్రచురింపరాదనిరి. ఠాకూరువంటి ఋషిసత్తముడు, విజ్ఞానపిపాసకలిగినవాడు, రాజకీయములను బుద్ధిపూర్వకముగవీడినవాడు, భారతదేశములో పూజింపబడువాడు, ప్రపంచఖ్యాతినిగాంచినవాడు - యీవిధముగ నణచివేయబడుచో నిక మామూలు మానవుంగతి చెప్పవలెనా? ఇట్టిపరిస్థితులలో సరళమగుపత్రికారచన సాధ్యముకాదు. చరిత్రను, రాజకీయములను, ఆర్థికములను వర్తమానవ్యవహారములను యాథార్థ్యముగ

...కును, బోధించుటకును వీలులేదు. సంస్కరణలను బాధ్య
...రిపాలనను ప్రవేశపెట్టుటకిదియొక వింత పూర్వాధ్యాయము.

...నేడు ప్రపంచమంతయు నొకవిధమగు మానసిక సంక్షోభములో
...యున్నదనియు, ప్రస్తుతపరిస్థితులతో నసంతృప్తి చెందియున్న
...ప్రతి బుద్ధివంతునకును తెలియును. మనకండ్లయెదుటనే విపరీత
...ములు జరుగుచున్నవి. భవిష్యత్తు సమీపముననేయున్నది. అది ప్రతి
...మంచికో చెడుగుకో తీసికొనిపోవును. కనుక ప్రతినాగరికుడును
...తనుకనున్న వివిధశక్తులను తెలిసికొని తనకార్యవిధానము నేర్పరచు
...ధర్మమైయున్నది. ఒకప్రపంచము నశించి మరియొక నూతన
...చము రానైయున్నది. ఒకసమస్యకు సమాధానమును కనుగొను
...పూర్వము ఆసమస్యయేదియో తెలిసికొనవలెను. నిశ్చయముగ
...డును సమానావసరములే.

ప్రపంచసంభవములనుగురించిన మన రాజకీయవేత్తల యుదా
...ము, నజ్ఞానమును ఆశ్చర్యకరములుగ నుండును. బ్రిటీషుఅధికారు
...పైనున్నవారికితప్ప క్రిందివారందరకును యివి యవసరములేదు.
...మత్వము ప్రపంచసంభవములను దృష్టిలోనుంచుకొనియే తమనీతిని
...నేర్పరచుకొనుచుండును. భారతదేశమును కలిగియుండుటయు దానిని
...సంరక్షించుకొనుటయు బ్రిటిషు విదేశనీతిని పాలించుచుండుటను విష
...యము అందరకును తెలియును. జపానుయొక్క యధికారము, సావి
...యటులయూనియనుయొక్క దినదినాభివృద్ధియగు శక్తి, సింకియాంగులో
...ఇంగ్లో రష్యా జపానులయొక్క కుట్రలు, మధ్యఆసియా ఆఫ్గనిస్థానము
...పర్షియాలలోని సంభవములు, భారత రాజకీయములతో సన్నిహిత
సంబంధములను కలిగియున్నవని యెంతమంది భారతరాజకీయవేత్తలు
భావింతురు? మధ్యఆసియా పరిస్థితి కాశ్మీరముయొక్క స్థితిని మార్చి
దానిని బ్రిటిషు రాజనీతికిని, రక్షణకును కీలకము చేయును.

ప్రపంచమంతటను అతిశీఘ్రముగ జరుగుచున్న మార్పులు మరింత ప్రాముఖ్యములు. పందొమ్మిదవ శతాబ్ది తులు గతించెననియు నవి ప్రస్తుతమునకు వర్తింపవనియు గుర్తెరుగవలెను. మన మొక యెద్దుబండిని యినుపపట్టాలమీా యదియే రైలుబండి యనజాలము. అది తప్పుకొనవలసిన దే సరుకుక్రింద దానిని తీసివేయవలెను. రష్యాలోనే కాక నమెరికా యింగ్లండులోను 'క్రొత్తపంపకములు', గొప్ప మార్పులు అను లను వినుచుందుము. భారతదేశములో కూడ మనకనేక 'క్రొత్త ములు' కావలెను. "గ్రహింప యోగ్యమైనదంతయు నిక్ర గ్రహింపబడెను. చేయ నర్హమైనదంతయు, నిదివరకే చేయబడె అను పాతకూతలన్నియు నిరర్థకమైన యుపద్రవకర ప్రలాపములు

మన మనేక సమస్యల నెదుర్కొనవలెను. మనము ధై ర్యముతో నెదుర్కొనవలెను. ప్రజల పరిస్థితుల నెక్కువగ వృద్ధిచేయజాలనపుడు ప్రస్తుత సాంఘిక, ఆర్థిక పద్ధతి నిలిచియు కధికారమున్నదా? ఈవిశాలాభివృద్ధిని మరియొక పద్ధతియేదైన కలుగచేయగలదా? కేవల రాజకీయమార్పు యెంతగొప్ప యభివృద్ధి తీసికొనిరాగలదు? అతివాంఛనీయమైన పరివర్తనమునకు స్థాపి ప్రయోజనము లడ్డము తగులుచో ప్రజాదుఃఖమును, దారిద్ర్యమును శాశ్వతమొనర్చుచో వానిని రక్షింప బ్రయత్నించుట యుక్తమా? అ నీతియా? నిశ్చయముగ స్థాపితప్రయోజనముల కపకారముచేయుట లక్ష్యముకాదు; అవి యితరుల కపకారము చేయకుండచేయుటయే లక్ష్యము. వీనితో రాజీపడుటకు సాధ్యమగుచో నట్లుచేయుట యత్యంతము వాంఛనీయము. దీని యుక్తాయుక్తములను గురించి ప్రజలలో భేదాభిప్రాయము లుండవచ్చును; కాని, యొకసమాధాన మవసరమను విషయము నెవడును శంకింపడు. ఒక స్థాపితప్రయోజనమును తీసివేసి

మరియొక దానిని సృష్టించుటవలన లాభములేదు. సాధ్యమైనపుడు, వాంఛనీయమైనపుడు యుచితమైన ప్రతిఫలము నీయవచ్చును. కాని, స్థాపిత ప్రయోజనములు అట్టి రాజీని యంగీకరింపనని చరిత్రయంతయు చాటుచున్నది. సంఘమునకు ప్రాణాధారమగు పాత్రను వహించుట మానివేసిన తరగతులు చిత్రముగ బుద్ధిహీనముగ నుండును. అవి సమస్తమును మ్రింగవలెనని యనుకొని చివరకుసమస్తమును పోగొట్టుకొనును.

ఆస్తిని వశపరచుకొనుట మొదలగు "యదృచ్ఛా సంభాషణ" (వర్కింగు కమిటీ చెప్పునట్లు) యెంతయో కలదు. నిరంతరాయముగ నాస్తిని వశపరచుకొను ఘనాదిమీదనే ప్రస్తుత పద్ధతి యేర్పడెను. దీనిని నిర్మూలించుటకే సాంఘిక మార్పు లుద్దేశింపబడినవి. పనివానియొక్క పాటువలన వచ్చు ఫలితమునుండి నిత్యము కొంత లాగివేయబడు చున్నది. శిస్తు, పన్నులును చెల్లించుకొనజాలనంత హెచ్చింపబడినవరకు వ్యవసాయదారుని కొద్దిభూమి లాగివేయబడుచున్నది. వెనుక వ్యక్తులు సామాన్యభూములను లాగుకొని పెద్ద జమీల నేర్పాటు చేసికొనిరి; ఈవిధముగనే వ్యవసాయప్రాపర్టీయొటర్లు తుడిచివేయబడెను.

దీనిని కొంతవరకు తగ్గించుటకే సంఘము ఆస్తిని తీసికొనుట వంటి స్వభావముగల భారమైన పన్నులు, మరణకాలపు పన్నులు, ఋణవిమోచన చట్టములు, నాణెములను పెంచుట మొదలగు వివిధ యుపాయముల ద్వారా ప్రయత్నించును. సోవియటు యూనియను వారేకాక ప్రధాన క్యాపిటలిస్టు దేశములు కూడ నవీనముగ చాల పెద్ద యెత్తున జాతీయఋణములను నిరాకరించిరి. బ్రిటిషువారు అమెరికా కీయవలసిన ఋణమును నిరాకరించుట యొక గొప్ప యుదాహరణము; ఇది భారతదేశము ముందర నుంచుటకెట్టి యుపదేశకరమైన సాదృశ్యము! కాని యివన్నియును కొంతవరకు మాత్రమే సహాయపడ

గలవు. ఇవి మూలకారణమును తీసివేయజాలవు. నూతనసృష్టిని చేయుటకు ఆమూలకారణమును తీసివేయవలెను.

ప్రస్తుత క్రమమును మార్చుపద్ధతి నాలోచించునప్పుడు మనము దానికొరకై వెచ్చింపవలసిన యార్థిక, యాధ్యాత్మిక మూల్యమును పరిగణింపవలసి యుండును. మనము దూరదృష్టిలేకుండ నుండజాలము. అది భౌతికముగను, ఆధ్యాత్మికముగను మానవాభివృద్ధికిని, మానవానందమునకును తుదకెంతవరకు సహాయపడగలదో చూడవలెను. కాని, ప్రస్తుతక్రమమును మార్చకపోవుటవలన కలుగు విపరీతనష్టములను విఫలములైనజీవితములు, వికలములైన జీవితములు, దుఃఖము, కష్టము బాధ, నైతిక యాధ్యాత్మికపతనము- వీనినెల్లప్పుడును దృష్టిలోనుంచుకొనవలెను. నిరంతరము వెల్లివిరియు ప్రవాహమువలె నీప్రస్తుత యార్థిక పద్ధతి యసంఖ్యాకములగు ప్రజాసందోహములను ముంచుచు వినాశమునకు తీసికొనిపోవుచున్నది. మనలో కొంతమంది చేదలతో నీళ్ళను తోడినంతమాత్రముచేత నీప్రవాహమునరికట్టజాలము. ఈప్రజలను రక్షింపజాలము. పెద్దయేటిగట్టుల నిర్మించి కాలువలను త్రవ్వి ప్రవాహముయొక్క విధ్వంసకశక్తిని మార్చి మానవశ్రేయస్సు కొరకుపయోగింపవలెను.

సామ్యవాదము భావించునట్టి విశాలమైన మార్పులు కొద్దిశాసనములను హఠాత్తుగ చేసినంతమాత్రమున కలుగనేరవు. కాని, యభివృద్ధిమార్గమును చూపుటకును, కట్టడముయొక్క పునాదులనువేయుటకును మూలశాసనములును, అధికారమును అవసరములు. సామ్యవాదసంఘముయొక్క గొప్పనిర్మాణమును అదృష్టమునకు విడిచిపెట్టరాదు. కట్టినదానిని పడగొట్టుచు పడుచులేచుచు చేయుపనియును పనికిరాదు. ప్రధాన యభ్యంతరములను తీసివేయవలెను; లక్ష్యము కల్పించుటకాని నశింపచేయుటకాదు; ప్రస్తుతలేమిని భవిష్యత్సమృద్ధికి మార్చుట.

మనము తీసికొనవలసిన మార్గము కేవలమనయిష్టాయిష్టములసమస్యయు శుద్ధన్యాయ సమస్యయుకాదు. అది యార్థికముగ, దృఢముగను, అభివృద్ధిపరమగను మార్పుచెందు పరిస్థితులకనుగుణ్యముగను మానవలోకములో నెక్కువమందికి కళ్యాణదాయకముగను నుండవలెను.

ప్రయోజనములలో పోరాటము తప్పదు; తృతీయ పంథలేదు. మనలో ప్రతివాడును తనపక్షమును నిర్ణయించుకొనవలెను. నిర్ణయించుకొనుటకు పూర్వము మనము తెలిసికొనవలెను, గ్రహించవలెను. సామ్యవాదముయొక్క భావప్రేరేపణచాలదు. దీనితోపాటు బుద్ధి (హేతువులయొక్క యథార్థములమీదను, వాదములమీదను, విశదమైన విమర్శలమీదను ఆధారపడుబుద్ధి) హేతువులచే పూరింపబడవలెను. పశ్చిమదేశములలో నిట్టివిధమగు సాహిత్యమెంతయోకలదు. భారతదేశములోనిది చాలకొరవడియున్నది; అనేకమంచిమంచి పుస్తకముల నిచ్చుటకురాసియుడు. కాని, యితరదేశములనుండివచ్చు పుస్తకములను చదివినంతమాత్రమునచాలదు. సామ్యవాదమును హిందూదేశములో నిర్మింపవలెనన్న నది హిందూదేశ పరిస్థితులనుండియే యుత్పన్నముగావలెను. ఈపరిస్థితుల నత్యంతశ్రద్ధతో పరీక్షించుట యవసరము.

సామ్యవాదము తెచ్చుటకు మానసిక పునాది యున్నంతమాత్రమునచాలదు. ఇతరశక్తులుకావలెను. కాని, యీపునాదిలేనిదే మనము విషయమును సరిగా చేపట్టజాలము; శక్తివంతమైన యుద్యమమును లేవదీయజాలము. భారతదేశములో ప్రస్తుతము వ్యవసాయకోద్యమము చాలప్రధానమైనది. అదియెప్పుడును అట్లేయుండవచ్చును. కాని, పరిశ్రమలుకూడ తక్కువప్రధానములుగావు. అవి యభివృద్ధియగును. మనలక్ష్యమేది? వ్యవసాయ ప్రభుత్వమా లేక పారిశ్రామికమా? మనము యెక్కువగ కృషీవలులముగ నుండకతప్పదు. కాని, మనము పరిశ్రమలను వృద్ధిచేయవలెను, వృద్ధిచేయగలము.

మనపరిశ్రమల యజమానులు తమభావములలో చాలవెనుక బడియున్నారు. వారు నేటికితగిన క్యాపిటలిస్టులుకూడ కారు. ప్రజలు చాల బీదవారగుటచే కొనుగోలు శక్తిలేనివారని వారు భావింతురు. కూలిని హెచ్చించుటకుగాని, పనిచేయుకాలమును తగ్గించుటకుగాని వారొప్పుకొనరు. పనిచేయుకాలపరిమితిని నవీనముగ పదిగంటలనుండి తొమ్మిదిగంటలకు తగ్గించిరి. దీనివలన అహమదాబాదు మిల్లుయజమానులు జీతమును తగ్గించిరి. దీనివలన పనివారి యాదాయము తగ్గిపోయెను; పనివాని జీవితప్రమాణము క్షీణించెను. అవకాశమున్నపుడువారు పెద్దలాభములను పొందుదురు; కూలివాడు మామూలుగనే యుండును. వారివి మేడలు, దివ్యభవనములు. వీరివి మట్టిగుడిసెలు. వారివి భోగములు, వీరివి రోగములు. వారివి క్షేమవిలాసములు, వీరివి కడుపుమంటలు. వారికి ప్రభుత్వరక్షణ. వీరిదిదిక్కుమాలిన దీనస్థితి. కాని, మనమీవ్యత్యాసములను తప్పనిసరియని యనుకొని చలింపకుండ, బాధపడకుండ త్రోసివేయుదుము.

పారిశ్రామిక కూలిస్థితికంటెను (ఆర్థికముగ) వ్యవసాయ కూలీస్థితి మరింత చెడుగు. వ్యవసాయదారు కొక సదుపాయము కలదు. అతడు శుభ్రమైన గాలిలో జీవించును, కనుక కూలివాండ్ల కుళ్లుకంపు అతనికి లేదు. కాని, యతడు చాల యజ్ఞానములో మునిగియుండుటచే తరచు బహిరంగ వాయుప్రసారముగల తన గ్రామమును కూడ గాంధీజీ చెప్పినట్లు 'పేడకుప్పగ' చేయును. సంఘముయొక్క క్షేమము కొరకు సహకారము లేక సంయుక్తప్రయత్నము చేయుట యనుభావ మతనిలో లేదు. దీనికతనిని గర్హించుట సుకరమే! కాని, ప్రతివాడును అతనిమీద చేయి యెత్తువాడే యగుటచే జీవిత మతనికొక నిరంతర వ్యక్తిగత సంగ్రామము. అసలతడు యెట్లు జీవించుచున్నాడా? యనునది యవిశ్వసనీయమైన యాశ్చర్యముగ నుండును. 1928-29 లో పంజాబు

లోని వ్యవసాయదారుని సగటు నిత్యాదాయము తలకు తొమ్మిదణా
లని కనుగొనబడెను. ఇది 1930-31 లో తలకు తొమ్మిదిపైసలకు పడి
పోయెను! యు. పి. బీహారు, బెంగాలు దేశములలోని వ్యవసాయదారుల
కంటె పంజాబురయితు చాల యదృష్టవంతుడని చెప్పబడును. యు. పి.
లోని కొన్ని తూర్పు జిల్లాలలో (గోరఖ్పూరు మొదలైనవి) మంచి
రోజులలో, నార్థికమాంద్యమునకు పూర్వము, పొలములో పనిచేయు
నిత్యకూలి తలకు రెండణాలు. భూతదయాళుత్వముచేతను, గ్రామో
ద్ధరణములోని స్థానికప్రయత్నములచేతను యీ భయంకర పరిస్థితుల
నభివృద్ధిచేయవలెనని చెప్పుట వ్యవసాయదారుని, యతని దారిద్ర్య
మును వెక్కిరించుటగాక మరేమి యగును?

ఈపంకిలమునుండి మనము బయటపడుట యెట్లు? నిస్సందేహ
ముగ నుపాయములను పన్నవచ్చును; కాని, యంతయధోగతిలోనున్న
పరిజనులను లేవదీయుట కష్టసాధ్యము. కాని, మార్పును వలదను స్వపరి
పోషకవర్గములనుండియే యథార్థమైన కష్టము కలుగును. సామ్రాజ్య
పరిపాలన క్రింద యీ మార్పు కార్యాకరముతేరట్లు కాన్పించును.
రానున్న సంవత్సరములలో హిందూదేశమేమైపోవును? కమ్యూ
నిజము, ఫాసిజములు యీయుగ ప్రధానలక్ష్యములుగ కాన్పించును.
వీనిమధ్యనున్న స్వభావములును, యూగిసలాడువారును శీఘ్రముగ
మృగ్యమైపోవుచున్నారు. సర్ మాల్కం హెయిలీగారు భారతదేశము
జాతీయ సామ్యవాదమును స్వీకరించునని జోస్యము చెప్పిరి; అనగా
నొకవిధమగు ఫాసిజము. బహుశః సన్నిహిత భవిష్యత్తును సంబంధించి
నంతవరకు నతడు చెప్పినది యుక్తమే కావచ్చును. హిందూదేశము
లోని యువకులలోను, యువతులలోను ఫాసిస్టుభావము లిదివరకే
(ముఖ్యముగ బెంగాలులోను, కొంతవరకు ప్రతి రాష్ట్రములోను)
కాన్పించుచున్నవి. కాంగ్రెసు వీనిని ప్రతిబింబింప ప్రారంభమును చేయు

చున్నది. ఫాసిజము కత్యంత దౌర్జన్యపద్ధతులతో సన్నిహిత సంపర్కముండుటచే దౌర్జన్యరాహిత్యము నాశ్లేషించిన కాంగ్రెసు పెద్దలకు దీనియెడల సహజభయము కలదు. కాని స్వంతయాస్తులను రక్షించుచు స్థాపితప్రయోజనములను (నిర్మూలింపక) వారించు సామాజిక ప్రభుత్వము-ఫాసిజముయొక్క వేదాంతసంబంధమైన పునాది యనబడునది-వారికి నచ్చవచ్చును. ప్రథమసందర్శనమునకిది పాతిదానిని నిలుపుకొనుచు క్రొత్తదాని నవలంబించు నుత్తమపద్ధతిగ కాన్పించును. ఒక మూల రొట్టెను తినుచు దాని నుంచుకొనుట కూడ సాధ్యమా యనునది వేరు విషయము.

కాని, మధ్యతరగతులలోని యువకులనుండి ఫాసిజమువైపు యథార్థమైన స్ఫూర్తి సహజముగ బయలుదేరును. ప్రస్తుతము భారతదేశములో సాక్షాత్తు మధ్యతరగతులలో నొకభాగము విప్లవకరముగ నున్నది; కూలీలును, వ్యవసాయదారులును (పారిశ్రామిక కూలీలు మరింత శక్తివంతముగనున్నను) అంతముందుకు రాలేదు. ఫాసిస్టుభావములు విస్తరించుటకు యీ జాతీయ మధ్యతరగతి యనువైనరంగముగ నున్నది. కాని విదేశప్రభుత్వ మున్నంతకాలము యూరపియను ఫాసిజము యిచ్చట విస్తరింపజాలదు. భారత ఫాసిజము విధాయకముగ భారతస్వాతంత్ర్యముకొరకు నిలువవలెను; కనుక నది బ్రిటిషు సామ్రాజ్యతత్త్వముతో నేకముకాజాలదు. అది ప్రజలనుండి సహాయమును పొందవలెను. బ్రిటిషు అధికారము పూర్తిగ తీసివేయబడినచో బహుశః ఫాసిజము (మధ్యతరగతులలోని పైతరహావారును స్థాపితప్రయోజనములును నిశ్చయముగ దానికి సహాయముచేయును కనుక) యెక్కువ వేగముగ నభివృద్ధిచెందును.

కాని, బ్రిటిషు అధికారము త్వరగ పోవు సూచనలు లేవు. ఈలోపల ప్రభుత్వ మెంత కఠిన నిర్బంధము నుపయోగించుచున్నను

కమ్యూనిజముయొక్కయు, సామ్యవాదముయొక్కయు భావములు కూడ విస్తరించుచున్నవి. భారతదేశములో కమ్యూనిస్టుపార్టీ యక్రమసంఘము. ఆ పదమునకు యథేచ్ఛావ్యాఖ్యానము చేయబడుచుండుటచే నభిమానులును, ముందడుగువేయు లేబరుసంఘనాయకులును అందులో జేర్చబడుచున్నవి.

ఫాసిజము కమ్యూనిజములమధ్య నాయభిమానము పూర్తిగ కమ్యూనిజముపైపుననే యుండును. ఈవ్రాతలు తెలియజేయునట్లు నేనెంతమాత్రమును కమ్యూనిస్టును కాను. నామూలపుటెలికెను బహుశః కొంతవరకు 19 వ శతాబ్దములోనే యున్నవి. భూతదయాత్మకత్వ యుదారసాంప్రదాయమునుండి నేను పూర్తిగ తప్పించుకొనజాలక పోతిని. ఈ బూర్జువాస్వభావము నన్ననుసరించుచుండుటచే చాల మంది కమ్యూనిస్టుల సహాక్రోశమునకిది కారణమగుచున్నది. ధర్మపన్నములు నాకుగిట్టవు. కారల్‌మార్క్సు వ్రాతలనుగాని, మరేయితర పుస్తకములనుగాని శంకింపకూడదని వేదశాస్త్రములవలె భావించుటయు, నాధునిక కమ్యూనిజముయొక్క యొకలక్షణముగ కాన్పించు తరగతి విభాగమును, వ్యతిరేకాభిప్రాయములను వేటాడుటయు నాకు గిట్టవు. రష్యాలో జరిగిన దానిని, ముఖ్యముగ శాంతముగ నున్నదినములలో నుపయోగించిన మితిమీరిన దౌర్జన్యమును, నేనంగీకరింపజాలను. అయినను నేనంతకంతకు కమ్యూనిస్టు శాస్త్రముపైపు మొగ్గుచుందును.

మార్క్సుయొక్క స్టేటుమెంటులుకొన్ని తప్పులు కావచ్చును. అతని క్రియసిద్ధాంతము తప్పుకావచ్చును; దీనిని విమర్శించుటకు నేనశక్తుడను. కాని, సాంఘికోత్పాతములనుగురించి యతని కసాధారణదృష్టి యున్నట్లు నాకు కాన్పించెను. అతడవలంబించిన శాస్త్రపద్ధతినా [illegible]. ఈపద్ధతిని గతచరిత్రకును ప్రస్తుత [illegible]

కూడ వర్తింపచేసినపుడు మనకవి మరియేపద్ధతివలనను అర్థముకానట్లు స్పష్టపడగలవు. కనుకనే నేడుప్రపంచములో జరుగుచున్న మార్పుల లోని రహస్యమును బయటపెట్టు పరిశీలన మార్క్సుగారి శిష్యవర్గము వారి వ్రాతలనుండియే వచ్చుచున్నది. మార్క్సు తరువాతబయలు దేరిన కొన్ని స్వభావములను (మధ్యతరగతిలోని విప్లవ స్వభావము వంటివి) నిర్లక్ష్యముచేసెనని చెప్పుట సులభము. కాని, మార్క్సిజములో నున్న విలువయంతయు దానిలో పిడివాదము లేకపోవుటలోను అదియొక దృష్టిని, విషయమును చేపట్టు విధమును యొత్తుటలోను, కార్యముపట్ల గల దృష్టిలోను గలదు. ఆదృష్టి మనకాలమునాటి సాంఘిక మార్పుల నర్థముచేసికొనుటకు తోడ్పడి కార్యవిధానమును, తప్పుకొను విధాన మును కూడ సూచించును.

ఆకార్యవిధానముకూడ స్థిరమై, మార్పుచెందకుండునట్టి పంథ కాదు; అది పరిస్థితుల కనుగుణ్యముగ నుండును. అదియే లెనినుయొక్క దృష్టి; అతడు తనకార్యమును మార్పుచెందుచుండిన పరిస్థితులకు తగి నట్లువలంబించెను. "సంగ్రామముయొక్క యొకనిర్ణీతస్థితిలోను, నిర్ణీత కాలములోనుగల సంయుక్త పరిస్థితుల వివరములను పరీక్షింపకుండ పోరాటముయొక్క నిశ్చితసాధనను గురించిన ప్రశ్నకు 'అవును' లేక 'కాదు' అనిచెప్ప ప్రయత్నించుట మార్క్సుయొక్క రంగమునుపూర్తిగ విడిచిపెట్టుట" యని యతడు చెప్పెను.

ఈవిశాలమైనదృష్టిచేత యథార్థమైన జ్ఞానముగల కమ్యూనిస్టు కొంతవరకు సాంఘికజీవితముయొక్క చైతన్యస్వభావమును గుర్తించును. అతనికి రాజకీయములు చీకటిలో తడవుకొనుటవలెను కేవలము సమ యముకొరకు కాచుకొనియుండు చరిత్రవలెను కాన్పించవు. అతడు మనఃపూర్వకముగ నెదుర్కొను పోరాటమును, చేయు త్యాగమును అతని లక్ష్యములను, ఆశయములను సార్థకము చేయును. మానవ

విధిని సాధించుటకు ముందుపోవుచున్న మహాసైన్యములో తానొక భాగమని యతడు గ్రహించును. 'చరిత్రతో క్రమక్రమముగ నడుచు చున్న' భావమతనికి ద్యోతకమగును.

బహుశః యనేకమంది కమ్యూనిస్టులిట్లు భావింపరు. బహుశః యొక్కలెనినుమాత్రమే యతనికార్యవిధానమునంతే పటుత్వముగ నొనరించిన సమగ్రజీవిత మంతయు నొక్కటియను భావమును కలిగి యుండును. కాని యతనియుద్యమవేదాంతము నర్థముచేసికొనిన ప్రతికమ్యూనిస్టు కొంతవరకుదీనిని కలిగియుండును.

అనేకమందికమ్యూనిస్టులతో నోర్పునహించుటకష్టముగనుండును; వారు యితరులకు కోపమునుతెప్పించునట్టి చిత్రమైనపద్ధతిని కనిపెట్టిరి. కాని, వారనేక కఠినపరీక్షలపాలైరి. సోవియటుయూనియనువెలుపల వారసంఖ్యాకములగు కష్టములనెదుర్కొనవలెను. నేనెల్లప్పుడును వారి యమితధైర్యమును, త్యాగశక్తిని మెచ్చుకొంటిని. అనేకవిధముల అసం ఖ్యాకములగు లక్షలకొలది ప్రజలనేకవిధముల బాధపడునట్లు వారును బాధపడుదురు. కాని, సర్వశక్తివంతమును కఠోరమునునగు విధిముందర వారట్లు గుడ్డిగననుభవింపరు. వారుమానవులవలె బాధపడుదురు; అట్టిబాధలో నొకవిషాదకరమగు నుదారతకలదు.

రష్యాలోని సాంఘికప్రయత్నములయొక్క జయాపజయములు మార్క్సుయనుసిద్ధాంతదార్ఢ్యమును ప్రత్యక్షముగ బాధింపజాలవు; అనేక విషమపరిస్థితులేకమయి లేకననేకప్రభుత్వములేకమయి (ఇదిచాలయసా ధ్యము) యాప్రయత్నములను తారుమారుచేయవచ్చును. కాని, శక్తి వంతములగు నా సాంఘికప్రబోధములవిలువ చిరస్థాయిగ నుండును. అచ్చటజరిగిన యనేకవిషయములను నేను సహజముగ ప్రేమింపజాలక పోయినను అవియేప్రపంచమునకు తారకమంత్రమని నేనుభావింతును. వానికార్యములు నాకుపూర్తిగ తెలియవు; నేనువానిని విమర్శించుటకు

తగినస్థితిలో లేను. నాప్రిధానభయమేమనిన నమితమగు దౌర్జన్యము, నిర్బంధములును వానివెనుక విశేషచెడుగును విడిచిపెట్టవచ్చును. దీనిని తీసివేయుట కష్టముకావచ్చును. కాని, రష్యాయొక్క విధినినడుపు ప్రిస్తుత నాయకుల సుగుణమేమన వారు తమ తప్పిదములనుండి పాఠములను నేర్చుకొనుటకు భయపడరు. వారు తమయడుగులను వెనుకకువేసి పునః సృష్టిచేసికొనగలరు. వారెల్లప్పుడును తమలక్ష్యమును తమయెదుట నుంచుకొనెదరు. కమ్యూనిష్టు యింటర్నేషనల్ ద్వారా వారితరదేశములలోచేసినప్రియత్నములు విచిత్రిముగవిఫలమయ్యెను. ఇప్పుడవిచాల తగ్గింపబడినట్లు కాన్పించును.

హిందూదేశమునకు తిరిగివత్తము. బాహ్యపరిస్థితులిచ్చటిగమనమును త్వరితముచేసిననే తప్ప సామ్యవాద, కమ్యూనిజములు దూరవిషయములుగ కాన్పించును. మేము కమ్యూనిజముతో వ్యవహరించుటకాక (కమ్యూనలిజముతో) కులతత్వములతో వ్యవహరింపవలెను. కులముల రీత్యా హిందూదేశము అంధకారయుగములోనున్నది. కర్మరంగములోనున్నవ్యక్తులు స్వల్పవిషయములతోను, కుట్రిలతోను, పన్నాగములతోను తమశక్తులనువ్యర్థముచేయుచున్నారు. వీరింకొనొకరినొకరుమించవలెనని చూచుచున్నారు. ప్రిపంచమును మరింతకళ్యాణప్రిదముగను ఆనందదాయకముగను చేయుటకు వారెవరునుప్రియత్నింపరు. బహుశః యిదియొకతాత్కాలికస్థితి; త్వరలోనే యిదిపోవచ్చును.

కాంగ్రిసుచాలవరకు యీకుల యజ్ఞానమునుండి దూరముగనుండెను. కానిదానిదృష్టి చిన్నబూర్జువాదృష్టి; ఈవిషయములోను, తదితర విషయములలోను చిన్నబూర్జువాదృష్టిలోనే చికిత్సచేయగోరును. ఈపద్ధతివలన నది జయమునుపొందజాలదు. నేడదిమధ్యతరగతిలోని క్రిందితరహావారికి (ప్రిస్తుతము వారే విఘ్నకరముగను, నోరుగలవారుగను నున్నారు.) ప్రీతినివ్వమునహించుచును. కాని, ఎంతవరకు

న్పించునంతటిశక్తి స్వంతముగలేదు. దానిని రెండుప్రక్కలనుండి రెండు శక్తులు నొక్కుచున్నవి. ఒకటి యన్నిబందోబస్తులను కలిగియున్నది. రెండవది యింకనుదుర్బలముగ నున్నను త్వరితముగవృద్ధిచెందుచున్నది. ప్రస్తుతమది తనజీవితములో నొకముమ్మరములోనున్నది. భవిష్యత్తును చెప్పుట కష్టసాధ్యము. అదిదానిచారిత్రికధర్మమైన జాతీయస్వాతంత్ర్యమును పొందుటకు పూర్వము బందోబస్తులతోనున్న రెండవపక్షము వైపు పోజాలదు. కాని, దానికావిజయముచేకూరులోపల నిజశక్తులు బలవత్తరములై, దానినితమవైపుత్రిప్పుకొనవచ్చును. లేదా క్రమముగ నుద్వాసముచెప్పవచ్చును. జాతీయస్వాతంత్ర్యము చాలవరకు సాధింపబడువరకు కాంగ్రెసు హిందూదేశములో ప్రధానపాత్రను వహించును.

ఎట్టి దౌర్జన్యకార్యమును అసంభవము, హానికరము, వ్యర్థప్రయత్నమువలె కాన్పించును. అచ్చటచ్చట వ్యర్థములగు దౌర్జన్యములు జరుగుచున్నను, పైవిషయము హిందూదేశములో సాధారణముగ గుర్తింపబడెను. అది మనలను దౌర్జన్య ప్రతిదౌర్జన్యములతో ముంచి దానినుండి బయటపడజాలని స్థితినితప్ప మరిదేనిని చేకూర్చజాలదు.

మనమందరమును కలసి 'యేకముఖముగ' పోవలెనని తరచు చెప్పుచుందురు. సరోజినీదేవి తనసహజకవిత్వధోరణిలో దానిని సమర్థించును. ఆమె కవయిత్రికనుక సామరస్యములోనున్న సౌందర్యమును సమర్థించుట కర్హతకలదు. స్పష్టముగ 'యేకముఖము' యెల్లప్పుడును అవసరమేకాని, యదియొక ముఖముకావలెను. ఈపదమును విమర్శించి చూచినచో పయినున్న వివిధవ్యక్తులతో సంధిచేసికొనుట, రాజీపడుట యనునదియే భావింపబడినట్లు తోచును. అతిమితవాదులును, జాగ్రతవంతులును లక్ష్యమును నిర్ణయింతురనియు, వేయవలసిన యడుగును శాసింతురనియు, నీదాంపత్యమున కర్థముచెప్పుకొనవలెను. వారిలో కొంతమందికెట్టి కదలికయు నిష్టములేదు కనుక ఫలితము అందరును

కలసి నిలిచిపోవడమేయగును. ఏకముఖముకు బదులు అందరునుకలసి వీపులను ప్రదర్శించుటయగును.

మనమితరులతో సహకారముచేయమని యనుట కాని, రాజీ పడమని యనుటకాని మూర్ఖత్వమగును. జీవితమును, రాజకీయములును అతిక్లిష్టవిషయములగుటచే వానినెల్లప్పుడును వంకరలులేకుండ భావింప జాలము. "రాజీలేకుండ ముందుకు నడచుటయు మార్గమును తప్పించ కుండ నడచుటయు బుద్ధియొక్క మూఢవ్యాపారము కాని విప్లవతరగతి యొక్క యుక్తి కానేరదు" అని యనివార్యుడైన లెనినుకూడ చెప్పెను. రాజీలు కలుగకతప్పవు. మనము వానికొరకు బాధపడనవసరములేదు. మనము రాజీపడినను, మానినను ప్రధానవిషయములకు ప్రధానస్థాన మును రెండవవిషయమునకు రెండవస్థానమును యివ్వవలెను. రెండవ విషయముల కెప్పుడును ప్రధానస్థానము నీయరాదు. మన సిద్ధాంతము లను, లక్ష్యమును మనము స్పష్టముగ నుంచుకొనినచో తాత్కాలిక రాజీలవలన నపాయముండదు. మన దుర్బలసోదరులకు కష్టముకలుగ నచ్చునని యీసిద్ధాంతములను త్రోసివేయుటలోనే యపాయముకలదు.

---

## ౬౧

# ఉపసంహారము.

—⟡)O(⟡—

కర్మచేయుట మనవిధి, ధర్మము; కాని మనకర్మను పూర్తి చేయుట మనచేతులలోలేదు.

—టాల్మడ్.

నేనీకథచివరకు వచ్చితిని. నాజీవిత వృత్తాంతమును (ఉన్న విధమున) నేటివరకు (1935 ఫిబ్రవరి 14, ఆల్మోరాజిల్లాజయిలు) తెచ్చితిని. నేటికి మూడునెలల క్రితమీజయిలులోనే నానలుబదియైదవ జన్మదినమును జరిపితిని. నేనింకను చాల సంవత్సరములు జీవింపవలసియున్నదని నేననుకొనెదను. ఒక్కొక్కప్పుడు వయోభారము, అలసట నన్నటమటబెట్టును. ఇతరకాలములలో నపరిమితోత్సాహ శక్తులతో తులతూగుచుందును. నాశరీరము ఆటుపోటుల కాగగలదు. నామనస్సు ప్రహారణములనుండి సుకరముగ కోల్కొన కలదు. కనుక హఠాత్తుగ నన్నొక విధిమ్రింగనిచో నేనింకను చాలకాలము జీవింపగలనని భావించెదను.

బహుశః యీసాహసములు చాలయుద్రేక జనకములుగ నుండకపోవచ్చును; చిరకాలము జయిలులోనుండుటను సాహసమని యనజాలము; ఇందులో నసామాన్యమునులేదు. నేనీసంవత్సరములను లక్షలకొలది నా దేశ స్త్రీపురుషులతోకూడ ననుభవించితిని; మారుచుండునట్టి భావములు, ఉత్సాహానుత్సాహములు, తీవ్రకార్యకలాపము, బలాత్కారయేకాంతము-యివి మాసామాన్యచరిత్ర. నేను ప్రజలోనొకడను; నేనుదానితో కదలుచు నొక్కొక్కప్పుడు దానిని నడుపుచు దానిచే పాలింపబడుచునుంటిని. అయినను (యితరులవలెనే) నేనొక వ్యక్తిగనుండి ప్రజాసమూహములలో ప్రత్యేక జీవితమును జీవించెడివాడను.

ఈసంవత్సరములు యితరవిషయములతోపాటు నాకొకయమూల్యవరమును ప్రసాదించెను. జీవితము నాకంతకంతకు తన్మయత్వము నొందించు సాహసకార్యమువలె కాన్పించెను. అచ్చటమనము నేర్చుకొనవలసినదెంతయోకలదు, చేయవలసిన దెంతయోకలదు. నేను వృద్ధి చెందుచున్నట్లొక నిరంతరాయభావముండెడిది; నాకింకను ఆభావమే కలదు. అది నాయత్నములకును, గ్రంథపఠమునకును నూతనోత్సాహము నిచ్చును. సాధారణముగ జీవితమును సార్థకము చేయును.

ఈ కథను వ్రాయుటలో నేను ప్రతిసంభవము జరిగినపుడును నాకున్న భావములను, మనఃప్రవృత్తులను, తెలుప బ్రయత్నించితిని; ఆ సంభవమును గురించి నాభావములను చిత్రింపగోరితిని. గతించిన భావమును తిరిగి గ్రహించుట సులభముకాదు. తరువాత జరుగు సంభవములను మరచిపోవుటయు సులభముకాదు. కనుక తరువాత కలిగిన భావములు నా మొదటిరోజులలోని చరిత్రకు విధాయకముగ కొంత పూత పూసి యుండవచ్చును. కాని, నామానసికాభివృద్ధిని, ప్రధానముగ నాలాభముకొరకు, చిత్రించుటయే నాయుద్దేశ్యము. నేను వ్రాసినదంతయు నాయుండిన విధమును గాక నేనొకప్పు డెట్లుండగోరితినో లేక యుంటినని భావించితినో దానిని తెలుపు చరిత్ర.

కొన్ని నెలల క్రిందట సర్. సి. పి. రామస్వామయ్యరు నేను ప్రజాసామాన్యముయొక్క భావములకు ప్రతినిధిని కాననియు కాని, నాత్యాగములచేతను, ఆదర్శములచేతను, నావిశ్వాసములలోనున్న యావేశముచేతను నేను మరింత యుపద్రవకరుడననియు చెప్పెను. ఈ స్వవిషయములో నేనతనితో జగడము పెట్టుకొన నిచ్చగింపను. మేము అనేక సంవత్సరములనుండి కలుసుకొనలేదు. కాని, చిరకాలము క్రిందట మేమిరువురమును హోముహూలు సంఘమునకు సంయుక్త కార్యదర్శులముగ నుంటిమి. నాడు లగాయతు అనేక సంభవములు

చరిగెను. సర్. సి. పి. గారు పైకి తీసికొనిపోవు మెట్లద్వారా నేల తిరుగునట్టి యున్నస్థితికి వెళ్ళిరి. నేను భూమిమీదనే భూమికి సంబంధించి, యుంటిని. ఇప్పుడు మాకిరువురకును సామాన్యమైన వేదియును (సామాన్యజాతి తప్ప) లేదు. నేడతడు హిందూదేశములోని బ్రిటిషు ప్రభుత్వమును సమర్థించు జగజెట్టి; హిందూదేశములోను, యితర చోట్లను నిరంకుశత్వమును శ్లాఘించువాడు. స్వయముగ నతడొక భారతసంస్థానములో వెలుగొందు నిరంకుశ తత్త్వభూషణము. మేము చాల విషయములలో భేదింతుము. కాని, యొక విషయములో, నేను ప్రజాభావమునకు ప్రతినిధిని కానను విషయములో, నేకీభవింతుము.

నేనెవరికైనను ప్రతినిధినియగుదునా? యని యాశ్చర్యపడుచుందును. చాలమందికి నాయెడల మిత్రభావమును, దయయునున్నను నేనెవరికిని ప్రతినిధిని కాననియే భావింతును. నేనొకవింతయైన ప్రాచ్య, పాశ్చాత్యమిశ్రమమునైతిని; ప్రతిచోటను చోటులేనివాడను; ఎచ్చటను ఆశ్రయములేనివాడను. బహుశః నాభావములును, జీవితమును గ్రహించు విధమును ప్రాచ్యమునకుగాక పాశ్చాత్యమునకు జెందుదానికే యెక్కువగ సంబంధించియుండును. కాని, హిందూదేశము, యితరులందరనువలెనే, యనేకవిధముల నన్నంటిపెట్టుకొనియుండును. నావెనుక, నెక్కడనో మినుకుమినుకుమను స్మృతిలో, ననేకవందల పురుషాంతరముల బ్రాహ్మణజాతిస్మృతికలదు. నేనా భూతకాల వంశపారంపర్యమునుగాని నా నవీనస్వార్జితమునుగాని పోగొట్టుకొనజాలను. అవిరెండును నాభాగములు; అవినాకు తూర్పు, పశ్చిమములు. రెంటిలోను సహాయముచేయుచున్నను ప్రజాహితకార్యములలోను, జీవితములోనుకూడ నాలో నాధ్యాత్మిక యేకాంతమును సృజించును. నేను పడమరదేశములలో క్రొత్తవాడను, విదేశీయుడను. నేనువానికి చెందను- కాని, నానిజదేశములోకూడ నొక్కొక్కప్పుడు, పరదేశీయునివలె భావింతును.

దూరపుకొండలు నునుపుగను, యెక్కుటకు సుకరముగను కాన్పించును. శిఖరము ఆహ్వానించుచుండును. కాని, యెక్కినకొలది కష్టములు కాన్పించును. పైకివెళ్లినకొలదీ ప్రస్థానము మరింత శ్రమ జనకముగనుండును; శిఖరము మేఘమండలములోనికి పోవుచుండును. అయినను, ఆయారోహణము ప్రియత్నార్హము; అదియొక ప్రత్యేకానందమును, తృప్తిని యిచ్చును. బహుశః సంగ్రామమే జీవితమునకు విలువనిచ్చునుకాని, తుదిపర్యవసానముకాదు. ఏది యుక్తమార్గమో తెలిసికొనుట తరుచు కష్టముగనుండును; ఒక్కొక్కప్పుడు 'యుక్తము కానిదానిని తెలిసికొనుట సుకరమగును. దానిని మానివేయుట కొంతమెరుగు. సోక్రిటీసు యిట్లు చెప్పెను. "మృత్యువనగానేదియో నాకు తెలియదు - అది మంచిదేకావచ్చును. నేనుదానికి వెరువను. కాని, మన భూతకాలమును వీడుట చెడ్డ విషయమని నేనెరుగుదును; చెడ్డది యనినాకు తెలిసినదానికంటె మంచిదియే యగుట కవకాశమున్న దానిని నేను వరింతును."

నేనుజయిలులో గడిపిన సంవత్సరములు! నా భావములలోమునిగి యేకాకినై కూర్చొనుట! ఒకదానివెనుక నొకటి విస్మృతిలోనికిపోయిన యెన్ని ఋతువులను నేనుచూచితిని ! శుక్ల, కృష్ణపక్షచంద్రుల నెందరను చూచితిని ! నిర్లక్ష్యముగ, సగర్వముగ నడచిపోవుచుండు నక్షత్రరాశి నెన్నిసార్లు చూచితిని! నాయౌవనముయొక్క యెన్ని 'నిన్నటి దినములు' యిచ్చట మణగిపోయినవి! ఒక్కొక్కప్పుడు మృతిచెందిన యీనిన్నటిదినముల భూతములు లేచుచు "ఇది ప్రయోజనకారియా?" యని ప్రశ్నించును. సమాధానమునుగురించి యెట్టి సందేహమునులేదు. నాప్రస్తుత జ్ఞానమును, యనుభవమును కలిపి నా జీవితమును తిరిగి జీవించుటకు నాకవకాశమునిచ్చుచో నేను నాస్వంత జీవితములో ననేక మార్పులను చేయుటకు ప్రియత్నించెదను. నేను వెనుక నాచరించిన

దాని ననేకవిధముల నభివృద్ధిచేయుటకు ప్రయత్నించెదను. కాని, ప్రజాకార్యములలోని నాప్రధాననిశ్చయము లట్లే యుండును. నిశ్చయముగ నేనుదానిని మార్పుచేయలేను; అవి నాకంటె బలవత్తరములు, నావశములోలేని యొకశక్తినన్ను వాని వైపు తరిమెను.

నానిర్బంధముజరిగి సరిగ సంవత్సరమయ్యెను. నారెండేండ్ల శిక్షలోను ఒకసంవత్సరము గతించెను. మరియొక నిండుసంవత్సరము కలదు. ఈసారి విడిచిపుచ్చుకనుక రిమిషనులు లేవు. నేను ఆగష్టులో బయటనున్న పదకొండురోజులను నాశిక్షాకాలములోచేర్చిరి. ఈసంవత్సరముకూడ గడిచిపోవును; నేను బయటకు వెళ్లుదును. తరువాత ? నాకు తెలియదు; కాని నాజీవితములో నొకయధ్యాయముగిసెననియు, మరియొకటి ప్రారంభమగుననియు నేను భావించితిని. అదయేదియో నేను స్పష్టముగ నూహింపజాలను. జీవితమను గ్రంథములోని పుటలు మూయబడి యుండును.

సమాప్తము.

---

వ్రాసినతదుపరి. బేడెన్‌వీలరుష్వార్జువాల్డు
అక్టోబరు 25, 1935.

గత మేమాసములో నా భార్య భోవాలీవిడి మరికొంత చికిత్సకొరకు యూరపువెళ్ళెను. ఆమె వెళ్ళినతరువాత నేను భోవాలీ వెళ్ళలేదు. క్వెట్టా భూకంపమునుగురించి వార్తలువచ్చెను. కొంతకాలము తక్కినదంతయు మరువబడెను. కాని యెంతకాలమో కాదు! భారతప్రభుత్వము తనను, తనవిధములను మనలను మరచిపోనీయదు. కాంగ్రెసుప్రెసిడెంటును, భారతదేశములో భూకంపమునుగురించి మరేవ్యక్తి కంటెను యెక్కువ తెలిసినవాడును అయిన రాజేంద్రబాబును క్వెట్టాకుపోనీయలేదు. గాంధీజీని మరేప్రజానాయకునికూడ వెళ్ళనీయలేదు. క్వెట్టానుగూర్చి వ్రాసినందులకనేక భారతపత్రికలు ధరావతులను కోల్పోయెను.

ప్రతిచోటను సైనిక భావమే! పోలీసుదృష్టియే:—అసెంబ్లీలోను, నాగరికప్రభుత్వములోను, సరిహద్దులలోని బాంబుమోత్రలలోను—అదే దృష్టి. ఇండియాలోని బ్రిటిషుప్రభుత్వము వారు ప్రజలలోని యనేక శాఖలతో శాశ్వతముగ పోరాడుచున్నట్లు కాన్పించును.

పోలీసులు యుపయోగకరమును, అవసరమునునగు శాఖ. కాని పోలీసుమయమయిపోయి పోలీసులాఠీలతో నిండినప్రపంచము వాసయోగ్యముకానేరదు. దౌర్జన్యమును నిరోధములేకుండ నుపయోగించుటచే దానికిగురియైనవాడు అవమానమును, మానహానిని పొందునట్లే దానినుపయోగించువాడును అవమానమునొందునని తరచు చెప్పబడును. ఉన్నతసేవలలోని, ముఖ్యముగ ఐ. సి. యస్. శాఖలోని, క్రమాభివృద్ధిచెందుచున్న మానసిక, నైతికపతనముకంటె నాశ్చర్యకరమైనది నేడుభారతదేశములో మరియొకటి కాన్పించదు ఇది పెద్దయధికారములలో చాలస్పష్టముగ కాన్పించును. కాని, యిది సూత్రమువలె నన్ని



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA109B179 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 26-10-'14 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 931 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | B, iii, vi, viii, 4, 6, 8, 9, ... |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | ASWINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |

BLANKS - 200B,408B,608B,800B,